శ్రీ

# ఆంధ్ర విజ్ఞానము

## (Telugu Encyclopædia)

మొదటి సంపుటము.

## ప్రసాద భూపాలుఁడు

(జమీందార్ ఆఫ్ దేవిడి.)



జ్ఞానోదయము.

మొదటికూర్పు 2000 ప్రతులు.

S. R. P. WORKS, COCANADA.

1938.



వెల సాదా ప్రతి రు. ౯-౦-౦.
మంచికాగితము ౧౧-౦-౦.

# ANDHRA UNIVERSITY

## PREFACE

*TO*

## THE ANDHRA VIJNANAM OR THE TELUGU ENCYCLOPAEDIA

BY

**Sri Ijjitasar Kandukuri Balasuryaprasada Rao Bahadur**
**OF DEVIDI.**

Sri Ijjitasar Kandukuri Balasuryaprasada Rao Bahadur, the author of this Telugu Encyclopaedia, which I have the proud privilege to introduce to the public, is one of the most remarkable personalities in the Telugu country. He is a member of one of our old and aristocratic families. His fore-fathers in days gone by occupied no less a position than the Ministership of the then Nizams of Hyderabad. The documentary history of the family goes back to 1803 and beyond. But ancientry is not always the most convincing title for consideration. Personal worth is and ought to be the determining factor. And indeed one may remember in this connection the proud boast of Disraeli that he would rather be an ancestor than a descendant!

Sri Balasuryaprasada Rao Bahadur is not merely a Zamindar, which quite a number are, but a scholar of encyclopaediac range and extraordinary thoroughness and a writer of high standing in Telugu. It would be noted that I have already described him as the *author* of this Encyclopaedia. Usually Encyclopaedias are compiled. In this particular instance, it is almost wholly written by our talented Zamindar - an almost superhuman achievement.

To the scholarship obtained by study of books, he has added the grander equipment of wide travel and varied intercourse with people. And even in his travels the scholar predominated over the tourist and he concentrated his attention on the great countries of ancient civilisations, Egypt, Italy, Greece, Arabia and Palestine, the historic watersheds from which cultures have taken their origin and flowed quenching the spiritual and material thirst of humanity in such gracious measure.

Before I say a word or two about this Encyclopaedia in Telugu or *the Andhra Vijnanam*, as he has styled it, I shall refer to his earlier Works, of which the following are noteworthy:—

(1) **Seemanthani Parinayamu**, a Prabhanda in which the Somavara Vrata Mahatyam is expounded.

(2) **Veedhi Natakamu**, a poetical work after the manner of the great poet, Sreenatha.

(3) **Mathula Suthodvaham**, a love poem.

(4) **Prabodha**, a satire on superstition and the conflict between superstition and true knowledge.

This Telugu Encyclopaedia is remarkable for five qualities:—

(1) As already mentioned, it is far more the work of a single author than a compilation of articles by a number of authors. It has thus the unity and charm of personality.

(2) Secondly, the wide range of subjects covered. It is astonishing how one man, even a capacious genius like Sri Balasuryaprasada Rao Bahadur with his enormous library, could have mastered so many topics

(3) Thirdly, the handling of ancient themes according to modern methods of historical and higher criticism, of which in illustration I will just refer to the article on Angiras. Our Vedic and Puranic legends and all Shastras and theories are treated scientifically and critically. And as one would expect from the satirist of superstition, he will not allow his reverence for religion and for the past, which he possesses in ample abundance, to cloud his judgment as historian and philosopher. A devoted worshipper of Siva, he is no less devoted a worshipper of historical and scientific Truth – a fearless thinker and bold rationalist.

(4) Another element of superb excellence is the direct touch with which ancient Hindu historical geography is described. By way of sample, the article on Anga Desa may be studied. The author has visited the place, studied the topography comparing it with the accounts in our books, and with the legitimate exercise of imagination, not wild but trained, has reconstructed the picture of the region immortalised as the scene of Karna's endowed kingship.

(5) Fifthly, the remarkable beauty and power of the author's Prose. This Encyclopaedia is literature. And it will live, if for nothing else, for the imperishable beauty of its Prose.

The first Encyclopaedia attempted in Telugu is the one organised by the late Mr. Komarrazu Venkata Lakshmana Rao and his associates, amongst whom I too figured in a humble advisory capacity, and entitled *The Andhra Vijnana Sarvasvamu.* This great enterprise received the patrnonage, at my request, of the Maharajah of Mysore, whose Government sanctioned a payment of Rs. 300 for each volume published. But unfortunately only three volumes had been compiled and published when poor Mr. Lakshmana Rao passed away from us to the incalculable loss of Telugu History and Telugu Literature. After a lapse of many years, the illustrious philanthropist and patron of letters, Mr. Kasinadhuni Nageswara Rao, took up the broken task, but before he was able to achieve anything distinctive, he too breathed his last; and it is not known what the future of the *Andhra Vijnana Sarvasvamu* is going to be or whether it will have a future.

This Encyclopaedia was to have been a cooperative compilation, a compilation of articles written by specialists in the various subjects, cooperating closely under the Editorship of Mr. Lakshmana Rao. It is sad to reflect that such cooperative enterprises have not proved the success that was anticipated. At any rate, they cost a great deal in time and in money, as witness the great Telugu Dictionary, *The Surya Râya Andhra Nighantu*, on which the Majarajah Saheb of Pithapur has spent a very large sum of money. Of this Dictionary too, only one volume has been published so far; and here again it is not possible to foretell how soon it will be completed and published, though the patronage of the Maharajah of Pithapur is ample insurance against mishaps and failure. Such Telugu Dictionaries as have been completed with commendable regard to economies of time and expense have been those compiled by individuals, of which the classic example in modern times is *The Andhra Sabda Ratnakaramu* of Bahujanapalli Seetharama Acharyulu, a scholar of unsurpassed erudition and perseverence, whose example is in our own day being successfully followed by Sri Kotra Syamala Kama Sastry, whose Dictionary, *The Andhra Vachaspatyamu* is nearing completion.

It is to be fervently hoped that this Encyclopaedia of Mr. Balasuryaprasada Rao Bahadur will not share the tragic fate of its precursor, but will soon be published in full. I know there are trunk loads of Mss. ready for the Press. The work is almost completed; what remains is rapid publication and the avoidance of delays with their attendant risks.

In many respects, the greatest Encylopaedia is the one that heralded the dawn of the French Revolution, and in the production of which the immortal names of Voltaire, Diderot and D' Alembert are connected–an Encyclopaedia of ideas even more than information. This French Encyclopaedia was charged with the dynamite of the personality of the three greatest rationalists of the Eighteenth Century, and no wonder it shook France and, through France, Europe. I do not mean to say that the present Encyclopaedia is at all of the standing and stature of the historic French classic. But it too is charged with the power of personality. It too is characterised by a spirit of rationalistic enquiry and humanitarian outlook. And it too possesses the grace of style in a peculiarly high measure.

For these reasons, I am confident that Balasuryaprasada Encyclopaedia in Telugu or, as I would prefer to call it, the Balasuryaprasada Andhra Vijnana Samhita, will live as long as Telugu lives as an effective factor in the composite structure of Hindu civilization.

ANDHRA UNIVERSITY,
WALTIAR,
*25th. April, 1939.*

C. R. REDDY.

శ్రీ ఇజ్జత్ అసార్ కందుకూరి బాలసూర్యప్రసాదరావు బహద్దర్, జేవిఫీ జమీన్‌దార్ వారిచే రచింపబడిన

# ఆంధ్ర విజ్ఞానము

లేక తెనుగు ఎన్‌సైక్లోపేడియా అను గ్రంథమునకు

## పీఠిక

(ప్రస్తుతము ఆంధ్ర విశ్వకళాపరిషత్తుకు వైస్ ఛాన్సలర్ గానున్న శ్రీయుతులు డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డి గారిచే ఆంగ్లమున వ్రాయబడిన పీఠికకు శ్రీయుతులు డాక్టరు పోచిరాజు రాజేశ్వరరావు యం. ఏ., ఓ. యస్. గారిచే [illegible]

శ్రీ ఇజ్జత్ అసార్ కందుకూరి బాలసూర్య ప్రసాదరావు బహద్దర్, జమీన్‌దారువారు ఆంధ్రదేశములో మిక్కిలి పేరు ప్రఖ్యాతులుగాంచి గణింపదగిన పురుషవరేణ్యులలో ముఖ్యులు. వారే యీ ఆంధ్రవిజ్ఞాన గ్రంథరచనా ధురంధరులైన కవిబ్రహ్మలు. అట్టి గ్రంథమును ప్రజా సముదాయమునకు పరిచయము జేయగలుగు అవకాశముపొందిన నా భాగ్యమే భాగ్యము.

వీరుమన దేశములో చిరకాలమునుండి పరిపాలించుచు పేరుపడ్డ పెద్ద జమీన్‌దారుల కుటుంబములలో నొకరు. వీరి తాతలును, వారి తండ్రులును, జరిగిపోయిన ఒక కాలమందు హైదరాబాదు నైజాముల దగ్గర అమాత్యశేఖరులుగానుండి, బిరుదములు పొందిరి. వారి కుటుంబచరిత్రయొక్క లిఖిత నిదర్శనములు, ౧౫౦౩ సం॥ము వరకును, అంతకుముందుగనుకూడ, కానవచ్చుచున్నవి. కాని పురాతనమే సదా విచారణీయమైన బిరుదుగా తలంపరాదు. వ్యక్తిగత గుణశీలములే ముఖ్యముగా గమనింపవలసిన విషయములు. ఈ సమయమున మహామతియగు డిస్‌రేలీగారు "నేను విఖ్యాతిగన్న వంశముయొక్క సంతతి పరంపరలో నొకనిగా నుండుటకన్న, అట్టి వంశమునకు నే నాది పురుషుని గానుండుటకే ఇచ్ఛగింతును", అను గర్వింపదగిన వాక్యములు స్మరింపదగినవి.

శ్రీ బాలసూర్య ప్రసాదరావు బహద్దర్, అనేకులగు ఇతర జమీన్‌దారులవలె ఒక్క జమీన్‌దార్ మాత్రమే కారు: సర్వతోముఖమగు వారి విజ్ఞానము, ఆ విజ్ఞానమందు వారికి గల అసాధారణమగు సంపూర్ణత్వము, వారి తెనుగు రచనా కౌశలమునకు, తెనుగు కవిత్వమునందు మంచి ఉన్నతస్థానము నొసంగినవి.

ఈ ఆంధ్ర విజ్ఞానమునకు కర్తలు ఈ జమీన్‌దారువారని యిదివరకే నేను వ్రాసి యున్న సంగతిని గమనింపవలెను. ఇట్టి విజ్ఞానసర్వస్వములు ఇంతవఱకును పలువురు మేధావులచే రచింపబడి, ఒక వ్యక్తిచే క్రోడీకరింపబడుచున్నవి. ఇపుడీగ్రంథ మట్లుగాక, మేధానిధియా శ్రీజమీన్‌దారువారిచే స్వయముగా ఆదినుండి అంతమువరకును వ్రాయబడి, సంపుటీకరింపబడినది. ఈ శక్తి మానవాతీతము.

సంతతగ్రంథావలోకనమువలన గలిగిన తమ పాండిత్యమునకు శ్రీవారు తమవివిధ దేశపర్యటనమువలనను, ఆయా దేశవాసులతో కలసి మెలసి తిరుగుట వలనను, కలిగిన విజ్ఞానకౌశలమును సమన్వయము చేసికొనియున్నారు. వీరి పర్యటనములలోగూడ, శ్రీవారి పాండిత్యదృష్టియే వీరి దేశదర్శన కుతూహలతకంటె అధికముగా కానవచ్చుచున్నది. పురాతన నాగరితకలకు పుట్టినిళ్ళగు ఈజిప్టు, ఇటలీ, గ్రీసు, అరేబియా, పాలస్టైయిన్, మొదలుగాగల గొప్పదేశములపై శ్రీవారిదృష్టి ప్రసరించెను. చారిత్రక నిదర్శనములతో, ఈ దేశములనుండి, వివిధ నాగరికతా నదీ లలామములు పుట్టి మానవజాతియొక్క ఆధ్యాత్మిక, ఆధి భౌతికపిపాసను తనివిదీరతీర్చి, జగదేక సుందరముగ నీ ప్రపంచములో ప్రవహించినవి.

తెలుగులో వ్రాయబడిన ఈ విజ్ఞానసర్వస్వము, లేక శ్రీ వారిచే నామకరణము చేయబడిన "ఆంధ్రవిజ్ఞానము" అను ఈ గ్రంథరాజమును గూర్చి, ఒకటి రెండుమాటలు నేను వ్రాయకపూర్వమే, శ్రీవారు రచించిన పూర్వగ్రంథములందు దిగువ క్రింద నుదాహరింపబడిన ముఖ్యమైనవాటిని గూర్చి కొంచెము ప్రసంగింతును.

## (౧) సీమంతినీపరిణయము

ఇదియొక మహాప్రబంధము-ఇందు సోమవార వ్రతమాహాత్మ్యము వర్ణింపబడినది.

## (౨) వీధినాటకము

మహాకవి శ్రీనాథుని వీథినాటకము ననుసరించియుండును.

## (3) మాతులసుతోద్వాహము

ఇదియొక ప్రేమగాథ.

## (౪) ప్రబోధ

జ్ఞానమునకును, మూర్ఖత్వమునకును జరిగిన సమరము. సాంఘికాచారములపై వ్రాయబడిన ప్రహసనము—

ఆంధ్రవిజ్ఞానము—ఇది ఈ క్రింద వివరించిన గుణరత్నపంచకములచే విరాజిల్లుచున్నది.

(౧) ఇదివరకే వివరింపబడిన విధముగా, ఈ గ్రంథము పలువురు మేధావులచే వ్రాయబడి సంపుటీకరింపబడినదికాదు. ఒక్క కవిశేఖరునిచే ఆదినుండి అంతమువరకును వ్రాయబడినది. అందువలననే, గ్రంథకర్తయొక్క వ్యక్తిసౌందర్యమును, ఏకత్వమును, అందెల్లెడల వ్యాపించి యున్నది.

(౨) రెండవ విషయము—ఇందు వివరింపబడిన అనంతములైన విషయములు. ఇంతకును ఒక్కవ్యక్తి, ఎంత మేధానిధియైన బాలసూర్యప్రసాదరావు బహద్దరువారైనను, తమకడనున్నదన్న ఎంతగొప్ప గ్రంథభాండాగార సహాయముతోనైనను, ఇంతటి విశ్వతోముఖమైన విజ్ఞానమయమగు గ్రంథరాజమును రచియింపగలుగుట, ఎంతేని ఆశ్చర్య జనకము.

(3) మూడవ విషయము—

పురాతన విషయములను, చారిత్రికమై-ఉత్కృష్టమై-అభినవమైన విమర్శక మార్గములలో చర్చించుట—ఇందుకు నిదర్శనము, ఆంగిరసునిగూర్చి వ్రాసిన సరస రచనయే. మన వేదములు, పురాణములు, అందలి గాథలు, మన శాస్త్రములు, నవనాగరికతా విధానములతో, సైంటిఫిక్ అని పిలువబడే తీక్ష్ణ విమర్శనలతో వ్రాయుట ఎంతేని మోదావహము.

పూర్వాచారములనుగూర్చి ప్రహసనము రచియించిన మన కవిగారు మన మనుకున్నట్లే మతముపైని పూర్వాచారములపైని పూర్తిగా తమకెంత తక్కువకాని గౌరవమున్నను, నిజమైన వేదాంత శాస్త్ర పరిజ్ఞాతయగు చరిత్రపరిశీలనాదక్షునివలె విమర్శన కాలమందు తన మనోదృక్తేజమును అట్టి అజ్ఞాన మేఘములచే నావరింప బడనొల్లడు. మనకవిగారెంతటి శివభక్తులో, అంతకన్న యెక్కువగా చరిత్రాత్మకమైనదియు, నవీనపదార్థవిజ్ఞాన, రాసాయనికాది శాస్త్రజన్యమగు సత్యమునే ఉపాసించుచుందురు—ఆలోచనలలో వీరు భయవిదూరులు, సన్మార్గావలంబకులు.

(४) మరియొక గొప్ప విషయము—

హిందూదేశముయొక్క ప్రాచీన చరిత్రాత్మకములైన స్థలములను ఈ కృతికర్త స్వయముగ పర్యటనముగావించి, వర్ణించుట; ఇందుకు దృష్టాంతము అంగదేశముగూర్చి వ్రాయబడిన వ్యాసమే. వీరీస్థలమునకు వెళ్ళి చూచిరి. గ్రంథములలో వర్ణింపబడిన దాని కనుగుణముగా నెంత వరకున్నదో కనుగొనిరి. సుశిక్షితమైన తమబుద్ధినివికసింపజేసికొని, తమమనోవీథిని తామెంతదూరము సృష్టింపగలిగిరో, అంతవరకును సృష్టించిరి; దానిని మన ఊహాప్రపంచమునం దెన్నటికిని మరపురాని, వినశ్వరమైన కర్ణుని దానరాజ్యముగా తన వర్ణనములో కవిగారు పునర్నిర్మాణ మొనర్చిరి.

(౫) అయిదవది:—అగణితసౌందర్యముగల తెనుగు గద్యరచనా నైపుణి. ఈ ఆంధ్ర విజ్ఞానముకూడ ఒక సారస్వతమే. మరేయితర గుణాతిశయమునకు కాకున్నను, ఎన్నంటికిని నాశనములేని ఆగద్యరచనా సౌందర్యమే చాలు — ఆ గ్రంథరాజముయొక్క అజరామరత్వమునకు!

తెనుగు వాఙ్మయములో మొట్టమొదటి ఆంధ్రవిజ్ఞానసర్వస్వము మ. శ్రీ. కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారును, వీరిమిత్రులును, కలిసి రచింపప్రయత్నించిరి. ఆప్రయత్నములో నేనుకూడ నాకు తెలిసినంత కించిద్‌జ్ఞానముతో ఒక సలహాదారుడనుగానుంటిని. మైసూరు మహారాజావారు నా ప్రార్థనపై ఆగ్రంథమునకు రాజపోషకులుగానుండి,ప్రకటితమైన ప్రతిసంపుటమునకును రూ.౩౦౦-లు చొప్పున విరాళమిచ్చుటకు వాగ్దాన మొనర్చిరి; కాని మన దురదృష్టమువలన ఆ గ్రంథముయొక్క మూడు సంపుటములు ప్రచురింపబడిన పిదప శ్రీ. కొ॥ వేం॥ లక్ష్మణరావుగారు కీర్తిశేషులైరి. ఇయ్యది తెనుగుచర్త్రకును, తెనుగు వాఙ్మయమునకును అపారమైన నష్టము కలుగజేసినది. అనేక వత్సరములు గడచినతరువాత, దానకర్ణుడను ప్రఖ్యాతిగాంచి, వాఙ్మయములకు రాజపోషకుడుగా నుండిన శ్రీ. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు మిగిలియుండిన కార్యము పూర్తి చేయుటకు ప్రయత్నించిరేకాని, వారేమాత్రమును ఇందులో జయము గాంచకపూర్వమే, వీరును మృతులైరి. ఇట్లగుట, ఆ యాంధ్రవిజ్ఞానసర్వస్వము యొక్క భవిష్యత్తు ఏమికానున్నదో తెలియకున్నది. ఇంతకును ఆ గ్రంథమునకు 'భవిష్యత్తు' అని ఒకటి, కలదో లేదో అనుమానమే. ఆ విజ్ఞానసర్వస్వము వివిధవిషయములలో పండితులైన మేధావులచే వ్రాయబడి శ్రీ. లక్ష్మణరావుగారి సంపాదకీయత క్రింద తయారుకాబడుటకు నిశ్చయింపబడి యుండెను. అట్టిపరస్పర సహాయావలంబనములచే ప్రయత్నింపబడిన యుద్యోగములు అనుకొన్నంతటి విజయములు పొందజాలకుండుట కడు విచారకరము! అట్టి ప్రయత్నములలో, అమిత ధనవ్యయమును కాలహరణమును ప్రాప్తించుచున్నవి. శ్రీ పిఠాపురము రాజాగారు చాల ధనమువ్యయ మొనర్చి ప్రయత్నించిన తెనుగు నిఘంటువు-'సూర్యరాయాంధ్రనిఘంటువు'-కూడ ఈ స్థితిలోనేయున్నది. ఇప్పటికిని ఆ నిఘంటువు యొక్క ఒక్క భాగమే ప్రచురింపబడినది. కాని మిగిలినభాగము పూర్తియయి ఎంతత్వరలో ప్రచురింపబడునో తెలియనవకాశముకానరాకున్నది. శ్రీపిఠాపురమురాజావారి ప్రాపుననుండుటన్ను,ఇయ్యది జయప్రదముగా రావచ్చును. అటుగాక, ఒక్కొక్క వ్యక్తిచే సాధారణమగుఖర్చువెచ్చములకు లోబడి సరియైన కాలములో కూర్పబడి, ప్రచురింపబడిన తెనుగు నిఘంటువులకు దృష్టాంతము ఆంధ్రశబ్దరత్నాకరమే. అయ్యది సమకూర్చిన కీ॥ శే॥ బహుజనపల్లి సీతారామాచార్యులుగారు గొప్ప పండితులు. పాండిత్యములో వారికిగల నేర్పరితనమునకును, ఓపికకును మించినవారు మరియొకరు లేరు. ఆతని నన్నివిధముల ననుసరించువారు "ఆంధ్రవాచస్పత్యము" రచించుచున్న శ్రీ కొట్ట శ్యామల కామశాస్త్రిగారు. వీరిగ్రంథము అత్యల్పకాలములోనే పూర్తికాగలదని వినుచున్నాము.

శ్రీ బాలసూర్యప్రసాదరావు బహద్దరువారి ఆంధ్రవిజ్ఞానము ఇంతవరకును ప్రయత్నింపబడిన యితర విజ్ఞానములవలెగాక, జయప్రదముగా ప్రచురింపబడునని అందఱ ఆశయమును. ముద్రణకుపెట్టెలతో సిద్ధపరుపబడిన వ్రాతప్రతులు తయారుగానున్నవని నాకు తెలియును. గ్రంథము దాదాపుగా పూర్తియైనది. ఇక 'ఆలస్య మమృతం విషం' అనునట్లు కాలహరణము కాకుండ త్వరగా ముద్రణ మొనర్చుటే మిగిలియున్నది.

ఫ్రెంచి రాజకీయవిప్లవముయొక్క శుభోదయకాలమున జననమొందిన ఫ్రెంచి విజ్ఞాన సర్వస్వమే విజ్ఞానసర్వస్వములకెల్ల తలమానికము. వాల్టెయిర్, డిడిరో, డిఅలంబర్ అను మహాకవులు, ఆ గ్రంథరచనాకారణముననే ఆచంద్రార్కమైనకీర్తి వడసిరి. అందు విషయప్రసంగముల కన్న ఉన్నతభావములే అధికముగా కానవచ్చుచున్నవి. ఈ గ్రంథము పైని పేర్కొనబడిన ముప్వురు మహాకవులయొక్క వ్యక్తిత్వము అను "డైనామేట్" (ఒక మందుగుండ విశేషము) తో నింపబడియుండెను. అందువలన దానితో ఫ్రెంచిదేశము, ఫ్రెంచిదేశముద్వారా ఐరోపా మహాఖండమంతయును. గజగజవణకిపోయినదన్న వింతగాకనుపించదు. ఫ్రెంచివిజ్ఞానసర్వస్వమువలె అంత గొప్పదిగా మన "ఆంధ్రవిజ్ఞాన" మున్నదని నే నన జాలను గాని, ఇదికూడ వ్యక్తిత్వమను ఒకశక్తిచే పూరితమయియే యున్నది. మానవజాతి కళ్యాణమునకు తగిన సన్మార్గాదేశములనే ఈగ్రంథము ఉపలక్షించుచున్నది. ఇందలి గద్యరచనాశైలి వర్ణనాతీతమై యున్నది.

ఈ పైకారణములచే శ్రీ బాలసూర్యప్రసాద విరచితమైన ఆంధ్రవిజ్ఞానసర్వస్వము (లేక బాలసూర్యప్రసాద ఆంధ్రవిజ్ఞాన సంహిత — అనిన బాగుండునేమో!) అను ఈ గ్రంథము తెనుగు వాఙ్మయము ఉన్నంతకాలమును హైందవనాగరికతాగృహనిర్మాణములో ముఖ్యమైన భాగముగా చిరంజీవియై యుండును.

వాల్తేరు.
తేదీ 25-4-1939.

కట్టమంచి రామలింగా రెడ్డి
వైస్ ఛాన్సలర్,
ఆంధ్ర విశ్వకళాపరిషత్తు.

Vegu-Jukka Printing Works, Berhampur (Ganjam) Aug. 1939.



శ్రీ కంచుకూరి బాలసూర్యప్రసాదభూపాలుఁడు,
(జమీాందార్ ఆఫ్ దేవిడి.)

# వి ష య సూ చి క

# ఆర్వీటి సంస్థానపు ప్రభువుల వంశావళి

వీరు చంద్రవంశపు క్షత్రి — శ్రీకృష్ణరాయ సార్వభౌమునివంశపు నృపులకు సామం:

పిన్నమరాజు.

బుక్కరాజు. శ్రీకృష్ణ ని కాలమున సామంత పతి.
క్రీ. శ. ౧౪౭౩-౧౪౮౧.

ఒకటవ రామరాజు.

తిమ్మరాజు. భార్య గోపయ్య. — కొండరాజు. — శ్రీరంగరాజు.

మరియు నీశ్రీరంగరాజునకు ముగ్గురు కుమార్తెలుండిరి. ౧. లక్కయ్య లేక లక్కమాంబ. ఈమె సుతుండు నరసరాజు. నరసభూపాలీయమనంబడు కావ్యాలంకార చూడామణిని భట్టుమూర్తి వలన కృతినందెను. ౨. ఓబయ్య లేక ఓబమాంబ కుమారుఁడు తిమ్మరాజు పరమయోగివిలాసము రచించెను. (వీరు పన్నిద్దాళ్వారను రామానుజీయమతభక్తాగ్రేసరులు. ) వీరులు, ౩. కోనయ్య క స ౦బ.

సింగ — జ్యేష్ఠ ప
నరసింహ రాజు.
రంపరా:
నరసింగ
కృష్ణరాజు.
క్రీ. శ. ౧౫౬౯ ప్రాంతము
పింగళిసూరన్న చేత
కళాపూర్ణోదయము
కృతినందినవాఁడు.
సదాశివరాయలు
పాలనకాలము ౧౫౪౨
ప్రాంతకాలమున కృతి
నందుట.

తిరుమలరాజు.
క్రీ. శ. ౧౫౭౦-౧౫౮౧
{ బాలభారతమును దోనూరి కోనేరుకవి వలన కృతి నందెను. }

విఠల — చినతిమ్మరాజు. — పాపతిమ్మ

తిమ్మరాజు కుమారుఁడు.
చినకొండ

కోనేటి తిమ్మరాజు.
ఈయనకడ రామరాజు రంగప్పరాజను కవి (క్షత్రియుఁడు) యాశ్రితుఁడైయుండి సాంబోపాఖ్యానమను ప్రబంధము రచించి శ్రీరంగనాథస్వామి కంకితమొనర్చెను.

రామరాజు. ఇతఁడే కో రామరాజని చెప్పఁబడినవా.
ఈయనకడ పుష్పగిరి జాల సోమరాజు అను పేరుగల నియోగి మంత్రిగనుండి తెనాలి అ ...వ్యనకవి వలన సుదక్షిణాపరిణయమను ప్రబంధమును కృతినందెను.

కోనరాజు. — తిమ్మరాజు.

{ తాళీకోట యుద్ధమున ౧౫౬౫ మరణించెను. }
రామరాజు.
క్రీ. శ. ౧౫౪౨-౬౫
భార్య తిరుమలాంబ
శ్రీకృష్ణరాయ సార్వభౌముని యల్లుఁడు.

{ వసుచరిత్రను రామరాజ భూషణుని వలన కృతి నందినవాఁడు }
తిరుమల రాజు.
క్రీ. శ. ౧౫౬౫-౧౫౭౨
పెనుగొండ రాజధాని.

వేంకటపతి రాజు.

పెదతిమ్మరాజు. — కృష్ణరాజు.
వీరు బాల్యులగుట బలవంతుండగు శ్రీరంగరాయలు వీరిపినతండ్రి కుమారుఁడు రాజ్యమపహరించెననియు, తర్వాత నాతనితమ్ముఁడు వెంకటరాయలు రాజ్యాధిపతి యయ్యెననియు వాడుకగలదు.

వేంకటరాయలు.
క్రీ. శ. ౧౫౮౫-౧౬౧౪
చంద్రగిరి రాజధాని వీరి పాలనముననే చెన్నపట్టణపుజాగా ఈస్టిండియా కంపెనీ వారికి క్రీ. శ. ౧౬౩౯ పట్టాయీయఁబడినది. తరిగొప్పుల మల్లనకవిచే చంద్రభాను చరిత్రముం జేయించిన విద్యాభిమ

శ్రీరంగరాయలు.
క్రీ. శ. ౧౫౭౨-౧౫౮౫.
పరిపాలన ఈతఁడు రామసం వెంకటపతి చేత లక్ష్మీ విలాసము రచింపఁ జేసిన విద్యాభిమాని.

ఈ రాజకుటుంబమందు కడపటివాఁడగు గిరిధరరాయలు, విష్ణుభక్తియు వీరవైష్ణవ మతాభిమానము మితిమీ రి తిరుమలయందు శ్రీవేంకటేశ్వర దేవస్థానమునజేరి మహంతు హంతరాము బావాజీకి శిష్యుఁడై రెండవ మహం యెను. ఆయన వివాహము జేసికొనలేదు. రాజ్యము స్తంభించి మహమ్మదీయులహస్తగతమాయెను.

**అత్రిసంతతి చంద్రవంశము నహుషమహారాజు వంశావళి** — కర్ణుని వంశావళి (అంగభూపతి) గాంధారభూపతి వంశావళి- పాండ్యభూపతి, చోళభూపతి, కేరళభూపతి, ఉశీనరభూపతి, పుండ్రభూపతి, కళింగభూపతి, వంగభూపతి, మద్రభూపతి, కేకయభూపతి, సువీరభూపతుల పూర్వవంశావళి. నహుషమహారాజు సంతతి, చంద్రవంశము, అత్రిసంతతి.



# ఆంధ్ర విజ్ఞానము

**అంకల్గి - పీఠము** — ఇది లింగాయతుల యాచార్య పీఠము. అంకల్గి గ్రామము మార్కండేయ పర్వత పరిసరముల నున్నది. గోకాక్ జలపాతమునకు నైఋతి దిశగా నున్నది. బెలగాం మండలము, బొంబై రాజధాని, లోనిది.

**అంకుడు చెట్టు** — (వనౌషధి) దీనికి చిట్టి యంకుడు, కొండచెముడు అనియు నునుట కలదు. దీనిపాలు వెగటుగ, కారముగ నుండి వేడిచేయును. ఆకులు - దద్దురు, తామర, మొలగజ్జి మొదలగు చర్మరోగములను నివారించును. కుష్ఠురోగముపై గూడ బనిచేయునని కొందరందురు. వాతమును, శ్వాసకాసలను తగ్గించును. దీనికి Nerium Antidysentericum అని పాశ్చాత్య నామమును, అంకోలమని సంస్కృతనామమును గలవు. దీని విత్తనములు ఈచెట్టున కంటుకొనిపోవునని చెప్పంబడినది.

**అంకురార్పణము** — నవధాన్యములు నీటం దడిపి పాలిక (కుండమూకుడు) లందుంచిన నవి యంకురించును (అనగా మొలకలు లేచును). వానిని సమర్పించుటయని యర్థము. ఇది వివాహములోని యొక కార్యము. మరియు ఉపనయన కార్యమున గూడ నిది యాచరించుటయుం గలదు.

**అంకుశరేఖ** — పురుష సాముద్రికము చూడుడు. స్త్రీ సాముద్రికము చూడుడు.

**అంకెలు** ఆంధ్రమున అంకెలు భాషాక్షర సంప్రదాయమునకు లోబడి రూపముల నందినట్లు దలంపఁబడుచున్నవి. ఇంక నీదేశమున బ్రచారమునందు వాడుకలోనున్న ఆంగ్లభాష యందలి యంకెలంగూర్చి విచారింతముగాక! అవి 'రోమన్ ఫిగర్సు' అనియు, 'ఇంగ్లీషు ఫిగర్సు' అనియు ద్వివిధములుగ నున్నవి. రోమన్ న్యూమరికల్ అంకెలు, తరుచుగ గడియారములందు గంటలందెల్పు తావులను, అధ్యాయములం దెల్పు తావుల నరుదుగ వాడుచుందురు. కాని సర్వసాధారణముగ వాడబడుటలేదు. (అవి I, II, III, IV, V మొదలగునవి. రోమను న్యూమరికల్సు చూడుడు). ఇంక మిగిలిన ఇంగ్లీషు ఫిగర్సు 1, 2, 3, 4, 5, 6, 7, 8, 9, 0 అనంబడునవి. వీనికి 'అరబిక్ఫిగర్సు' అనియుం బేరుకలదు. అరబ్బుజాతివారు మూరు లనిపించుకొనుచు స్పానియాదేశాధికారులై యుండుతరి వారి నుండి గ్రహింపఁబడినవని వాడుక కలదు. ఇంక నీయింగ్లీషు ఫిగర్సుంగూర్చి యాంగ్ల పండితుల యభిప్రాయములు ద్వివిధములుగ నున్నవి. కొందరు ఆ యంకె ఎన్ని సంఖ్యలందెల్పునో అన్ని గీతలు అందుండునటుల కల్పింపఁబడినవనియును, మరికొందరాయంకె ఎన్ని సంఖ్యలం దెల్పునో అన్ని మూలల (Angles) లందుండునటుల గల్పింపఁబడిన వనియును అభిప్రాయపడుచున్నారు. కాని వారి యూహల కాధారములు లేవు. వారే ఇంకను నవి ఇంచుక మార్పులకు లోనై యుండుననియు, ఆంగ్లభాషాక్షర సాంప్రదాయముమేర కొకవైపునకు వంచి వ్రాయఁబడుచున్నవనియు నభిప్రాయపడి యున్నారు.

**అంకోలముచెట్టు** — అంకుడు చెట్టు చూడుడు.

**అంగలౌకికదేశము** — వితస్తా (జీలమ్) నది చంద్రభాగ (అశక్నీ) నదితో సంగమించు తావునకు దిగువ నుండునని తలంపఁబడుచున్న దేశము. బ్రహ్మాండ పురాణము ౧౮౯ అధ్యాయమున ప్రశంసింపఁబడిన దేశము. మహాలగ్జాండరుయొక్క గ్రీకు చరిత్రకారులు ఈ దేశపు ప్రజలను 'అంగలెసియను' లని వ్రాసిరి. దీనింగూర్చి సరిగా తెలియదు.

**అంగటిలోని బెల్లము గుడిలోని దేవునకు నైవేద్యము** — ఆంధ్ర లోకోక్తి.

**అంగట్లో అన్నివున్నవి కాని అల్లుని నోటిలో శనియున్నది** — అల్లునిపై కోపమువలన అత్తగారు సరిగా వండిపెట్టదని భావము. ఆంధ్రలోకోక్తి.

**అంగదదేశికుడు** — ఈతఁడు శిక్కుమత గురువులలో రెండవవాఁడు. నానకు దేశికుని తర్వాత గురుపీఠ మధిష్ఠించినవాఁడు. తండ్రి పీర్మలఖత్రి, తల్లి సుభరాయీజీదేవి. ౧౫౧౯ లో వివాహమాడినవాఁడు. ౧౫౩౧ లో నానకు జగద్దేశికుని శిష్యుండాయెనట. జననము ౧౫౦౮ అనియు, మృతి ౧౫౫౨ యనియు చెప్పంబడినది. సమాధి ఖండౌర యను గ్రామమునందున్నది. దాతయనియు, సత్యసంధుఁడనియు పేరందినవాఁడు. నానకు దేశికునకు పుత్రులున్నను యీతని యర్హత నెంచి యీతని కంగదనామము నిచ్చి, గురుపీఠ మధిష్ఠింపంజేసెనట. ఈ మహాత్ముని తొల్లింటి నామము లహానుడట.

**అంగదుడు** — వాలి కుమారున కంగదుడని పేరు. వాలి కిష్కింధపురాధీశుడు. మరియు శ్రీరామసోదరుండగు లక్ష్మణుని జ్యేష్ఠపుత్రుం డంగదు డొకడు కలడు.

**అంగదేశము** — ఇప్పటి భాగల్పూరు, మాంఘీరులప్రాన్తదేశము తొల్లింటి యంగదేశమని పోల్పఁబడినది. దీనియెల్లలు సరిగా తెలియరావు. ఒకప్పుడు **సరయూనది** గంగానదితో సంగమించు తావుదనుక వ్యాపించియుండెనని బలమగు ప్రతీతి కలదు. వీరభూమి (Birbhum) మూర్షడాబాదు జిల్లాలుగ నిక్కాలమునఁ జెప్పఁబడు ప్రాన్తములు కూడ నంగదేశమునందు జేరియుండెనని Sir George Birdwood అను చరిత్రకారుడు దెల్పియున్నాడు. బంగాళములోని సంతాల్పరగణా లిందులోనివని కొందరు చరిత్రకారులనిరి, కాని బలమగు నిదర్శనములు గానవచ్చుటలేదు.

అంగదేశ మను పేరుంగూర్చి రెండు కథనములుకలవు. వేనుని కుమారుఁడగు అంగుని వలన నీపేరు కల్గెనని బలమగు యొక ప్రతీతియు, మన్మథునియంగము శివనేత్రాగ్నిచే దహింపఁబడినదాదిగ నీపేరు కల్గెనని యొక ప్రతీతియుఁ గలదు. రామాయణము బాలకాండ మీా రెండవకథనమునె సూచించెడిని. ఎటులనైనను అథర్వసంహిత పంచమకాండము, చతుర్థశానువాకమున అంగదేశము ప్రశంసింపఁబడియుంట, నిది పురాతనమని చెప్పక తప్పదు. ఈదేశమును రోమపాదుడుపాలించెనని రామాయణమునను, కర్ణుడు పాలించెనని భారతమునను చెప్పఁబడినది. రోమపాదునికాలమున రాజధానికి మాలినీపురమని పేరుండెననియు, ఆతని ముమ్మనుమడు చంపాన్నృపతిపాలనమున చంపాపురము

లేక చంపానగరమని మార్చఁబడెననియు నొక ప్రతీతిగ కొందరు వాడుకసాగించిరి. కాని మహాభారతము వనపర్వమున రోమపాదుని రాజధాని చంపాపురమని యుంట, ఇది నిరాధారమని తేలుచున్నది. కర్ణభూపతికాలమున చంపకవృక్షము లీపురిపరిసరముల నిండియుంట మహాభారతమున ప్రశంసింపఁబడినది. మరియు కర్ణునకు గంధలతాభవనమని యొక ప్రాసాదమును, క్రీడాస్థలి యనంబడు వేరొక ప్రాసాదము నుండెనట. గంధలతాభవనపు పాడుగ భాగల్పూరునకు ప్రాగ్దిశగ నేడుమైళ్లలో కార్నాతను గ్రామము కడ నొక దిబ్బను, క్రీడాస్థలి పాడుగ భాగల్పూరు సమీపమునను గంగాకోశీనదుల సంగమముకడ పాతరఘట్టాయనంబడు తావుకడ నొక తావును జూపెదరు. అంగదేశమునకు రాజధాని చంపాపురము లేక చంపానగరమునని చెప్పఁబడినది. ఇది బంగాళములోని భాగల్పూరునకు నాల్గు మైళ్ల దూరమున నుండెను. ఇందు కర్ణుఁడు నివసించిన కోట, పాడు దిబ్బయై కర్ణఘుడ్ యను పేరంబరగుచున్నది. ఈపాడుపడిన నగరమున మానక్షమానన్ద శివలింగము కలదిది కర్ణప్రతిష్ఠితమని చెప్పఁబడినది. ఈదేవస్థానము పరిసరములు బౌద్ధవిగ్రహములచే నిండియుంట, బౌద్ధమతాధికారకాలమున నిది బౌద్ధాక్రాన్తమై యుండియుండనోపు ననియు తలంపఁబడుచున్నది. ఇటంగల బౌద్ధక్షేత్రమునకు చంపానగర్, లేక చంపానాగోర్ అని పేరు. ఇది జైనమతస్వామియు తీర్థకరులలో పండ్రెండవవాడునగు వసుపూజ్యనాథుఁడిట జన్మిన్చుట, మృతినందుటం జేసి ఇది జైనుల యాత్రాస్థలమును గూడనైనది.

వసుపూజ్యనాథుని సమాధిపై నాత్న (నాత్ నగరము) గరనంబడు తావున దిగంబరజైనుల దేవళముకలదు. అది యుధిష్ఠిరశకము ౨౫౫౯ సంవత్సరమున జయపురసంస్థానాధిపతియగు నొక భూపాలుఁడు నిర్మింపజేసెనని యొక పాటలీపుత్ర శాసనమున కలదు. ఇంకను మల్లినాథ, పరశునాథ, వర్ధమానస్వామి విగ్రహములు క్రీ. వె. ౧౨౩౯-౧౨౪౭ సంవత్సరములనడుమ ప్రతిష్ఠింపబడినవిగ ఒక అజమీరు శాసనమునకలదు. జైనతీర్థకరులలో కడపటివాడగు మహావీరస్వామి ఇట మూఁడు పర్యూషణములు (పర్యూషణమన వర్షాకాలనివాసము) గడపెనని చెప్పఁబడినది. ఆ మహావీరాస్వామి శిష్యుడై యాయనకుం బిదప మతాధిపతియైన సుధర్మస్వామి యాలయమిట నుండెననియు ఆ మహనీయుండిటకు యజాతశత్రునృపతి పాలనకాలమున నేతెంచి కొంతకాల మిటవసించెననియు, వారికిం బిదప మతాధిపతులగు జంబూనాథస్వామియు, ప్రభవనాథస్వామియు, స్వయంభువనాథస్వామియు ఈక్షేత్రముం దర్శించిరనియు, స్వయంభువనాథస్వామి ఇచట వసించుతరినే దశవైకాలికసూత్రమను గ్రంథము రచించెననియు, అది జైనమతసిద్ధాన్తసారమనంబడు దశప్రథానోపన్యాసములగుచు దనరెడి ననియు స్థవీరావళి పరిశిష్టపర్వమునందు చెప్పఁబడినది. చంపానగరపు పాడుదిబ్బలమధ్యముననే స్వేతాంబర జైనులదేవస్థానమును ఒకటికలదు.

చంపానగరముకడ , గంగానదిలో సంగమించునదికి చంద్రావతియని పేరు. దీనినిప్పుడు చందన్ నదియనియు, అంధేలాయనియు అనుచున్నారు. అంగదేశాధీశుడగు పృథులాశ్వనిసుతుఁడగు చంపమహారాజు, చంపా

నగరనిర్మాతయని ప్రతీతికలదు. ఇది నిజమే యగుచో పూర్వపురాజధాని ఎద్దియో, లేక అతని పేరంబరగుటయె యగునేని, పూర్వ నామ మెద్దియో, ఇద మిద్ధమని తెలియ రాకున్నది. బ్రహ్మదత్తుడను అంగనృపతి, మగధరాజుపై దండెత్తి యోడించెననియు ఇది బుద్ధభగవానుడు జన్మించుటకు పూర్వ మే జరిగెననియు, అప్పు డతిబాల్యుడుగనుం డిన బింబసారుడు పగ మనసునం దిడికొని పెద్దయైనతరి అంగదేశముపై దాడివెడలి, బ్రహ్మదత్తుని చంపి తాను తన తండ్రియగు శత్రుంజయనృపాలుని రాజప్రతినిధిగ చంపా పురముననె వసించుచు అంగరాజ్యపాలనము నడపుచుండెననియు, మరికొంత కాలమునకుం దండ్రి యనన్తరము తాను ప్రభువగుట, మగధసింహాసన మధిష్ఠించుచో నప్పటి మగ ధరాజధాని యగు రాజగృహమున కేగెనని యు, ఇటుల అంగదేశము మగధరాజ్యమున కుంజేరిపోయెననియు Spence Hardy's Manual of Buddhism P. ౧౬౬ యందు చెప్పంబడినది. ఈసందర్భమున బింబసారుడు బుద్ధభగవానుని సమకాలికుడై శిష్యుండాయెననియు, అక్కాలమున మగధ కుం జేరిపోయియుండెననియు ఎరుంగవల యును. బింబసారునకుం బిదప అజాత శత్రుండు ప్రభుత్వకార్యాలయములను చంపా పురికిమార్చి రాజధానిగ జేసికొనెనట, గాని యాతనికిం బిదప పుత్రుండగు ఉదయనుడు రాజై రాజధానిని పాటలీపుత్రముకు మార్చు కొనెను. ఇంకను క్రీ. వె. ఎన్మిదవ శతా బ్దమున (బహుశః పాలవంశపు నృపతులలో మొదటివాడగు) గోపాలనృపతి యంగదేశ మును స్వాధీనపర్చుకొనెనని, బలమగు ప్రతీతి కలదు. రామపాలుండను నృపతి ఈరాజ్య పాలన మొనర్చుతరి, కనూజపట్టణమున ౧౧౧౪-౧౧౫౪ మధ్య రాజైయుండిన గోవిందచంద్రుని రాణియగు · కుమారీదేవి యొక్క మాతామహుండగు మహీనునిట రాజప్రతినిధిగ నిలపెనని Journal of Asiatic Society of Bengal ౧౯౦౮ లో చెప్పంబడినది. చంపాశ్రేష్ఠకథ యను జైనుగ్రన్థమున సామన్తపాలుని ఏలికగను, వృద్ధదత్తునిమంత్రిగను పేర్కొని యున్నారు. దశకుమారచరిత్రమున చంపాపురము చోర నిలయముగ వర్ణింపంబడుట విచిత్రము.

ఇంక భూమికొలతలు, సరిహద్దురాళ్లు, కొలతలపటములు, లేని తొల్లింటికాలములం దుప్రభువుల బలాబలములమేరకు సరిహద్దులు మారుట సర్వసామాన్యముగ నడచుచుండెడి ఆ దినములందు సరియైన చరిత్రలు వ్రాయ బడక నేడు ప్రయత్నించుటయన ఆయాదేశ ములం దుండినటుల చెప్పంబడిన పర్వతములు, నదులు, పట్టణములు, క్షేత్రములు, తీర్థ ములు, ఋష్యాశ్రమములుపై నాధారపడుట సమంజసము. 'హ్యూయనత్స్యాంగ' ను చీనా యాత్రస్థుడు చంపాపురమునకు యాత్రార్థియై అంగదేశ సంచారమొనర్చి సంగతులను తన ప్రయాణచరిత్రయాదు వ్రాసెను. అందు తా దర్శించినటుల వ్రాసుకొనిన వాటిలో ముఖ్యమగునది శిలాసంగమము లేక విక్రమ శిలాసంఘారామము; ఇవి కొండరాతియందు తొలువబడిన గుహాలు. ఈ పర్వతమునకు పాతర్ఘట్టాయనియు, కాస్తిపర్వతమనియు ననుచున్నారు. ఇందలి గుహాలనే విక్రమ శిలాసంఘారామమని చెప్పుదురు. ఇట పాతర్ఘట్టాయను గ్రామమును కలదు. ఈ

గుహాలందే బుద్ధభగవానుడు కొంతకాలము వసించెనట. సంభాషణ వాద మిటనె జరిగెనట. బౌద్ధగ్రంథములందు దీనింగూర్చి వివరింపఁబడినది. ఇత్తావు ఈస్టు ఇండియ రైయిల్వే కర్రా స్టేషనుకు దక్షిణముగ మూడుమైళ్ల దూరమున గలదు. కహల్గగాన్ సబుడివిజన్లో చేరియున్నది.

విక్రమశైల సంఘారామమున చిత్రింపఁబడినచిత్రములు వింతగొల్పెడిని. అందు బుద్ధభగవానునియొక్కయు, మైత్రేయునియొక్కయు, అవలోకితేశ్వరుని యొక్కయు విగ్రహములు గొప్ప పనితనముం బ్రదర్శించెడిని. అందులవి కొన్నివిగ్రహములు కోలోంగులోని హిల్టాన్ నలంకరింప గొంపోవంబడి అటనుంచబడినవి. విక్రమశైల సంఘారామమందలి పనితనము నాలంద పనితనమువంటిదని పెక్కండ్రుపోల్చియున్నారు. ఇవి ధర్మపాలుని కాలమున శ్రీ బుద్ధజ్ఞానపాదుడు ఈ సంఘారామాధిపత్యము వహించియుండెననియు, దీని యారు ద్వారములం దారుగ్వురు మహావిద్వాంసులు అధిపతులుగ నుండిరనియు, వారి నోడించి కాని, వారి శలవు గైకొని గాని దీనిం దర్శించవలసి యుండెననియు చెప్పఁబడినది. ఇవి క్రీ. వె. ఎన్మిదవ శతాబ్దమని తేలుచున్నది. గాన ఏడవ శతాబ్దమున సంచరించిన హ్యూయనత్స్యాంగు తన యాత్రాచరిత్రయం దీపనితనముంగూర్చి వివరించలేదు. గుహాలు బుద్ధభగవానునినాడే యుండినవి. ఈ గుహాలందలి పనిచిత్రములు క్రీ. వె. ౧౨౦౩ సంవత్సరమున భక్తియార్కిల్జీ యను తురకభగ్నమొనర్చి పాడుచేసెనని Manual of Indian Buddhism P. ౧౩౩ యందు కెరన్ పండితుడు వ్రాసియున్నాడు. ఆతోడనె మిథిల విశ్వవిద్యాలయమును నవద్వీప విశ్వవిద్యాలయమును ఏర్పర్చబడినవని యందురు. విక్రమశైల సంఘారామమున గల గుహాలేడు. అందొక గుహాకు ప్రక్కగనే వటేశ్వరనాథ దేవస్థాన మున్నది. ఇదియు నాకొండపై నున్నదియే.

భాగల్పూరుజిల్లా భాగల్పూరునుండి యిరువదియైదుమైళ్ల దూరమునను పాతర్ఘట్టా గ్రామముకు దక్షిణముగ రెండుమైళ్ల దూరమునను ఖాలీపహాడ్ అను కొండపై నెత్తగు తావున దూర్వాసమహర్షి ఆశ్రమముండిన తావు గలదు. ఆ కహల్గగాన్ అనుపేరు తొల్లింట కలహగ్రామమనియు ఇది ఆ ఋషియొక్క ముక్కోపపు లక్షణమునుండియె కల్గెనందురు. ఇట నా మహర్షి నివసించుచుండువాడట. ఈయన కింకను గయమండలమున రాజౌలీ యను గ్రామమున కీశాన్యదిశగా నేడుమైళ్ల దూరమున కొండలలో దుబౌర్ అను గ్రామముకడ వేరొక యాశ్రమ ముండెనట.

ఈస్టిండియన్రైయిల్వే బరియార్పూరు స్టేషనుకు నైఋతిదిశగా నాల్గుమైళ దూరమున ఋషికుండమను గ్రామముకడ ఋషికుండమనుసరస్సుకలదు; అత్తావు తొల్లింటి ఋష్యశృంగుని యాశ్రమస్థలమందురు. మరియు నిప్పటి సుల్తాన్గంజి పట్టణముకడ జహ్నుమహర్షి ఆశ్రమముండిన తావుంజూపుదురు. ఇంకను మాంఘీరను పురముకడ నొక పర్వతమును మోదగిరియనియు, మోదగిరి నానాటికి మాంఘీరుగ మారెననియు నందురు. భాగల్పూరుకు దక్షిణముగ ముప్పదిరెండు మైళ్లదూరమున బన్సీ లేక బౌన్సీయను గ్రామముకడ మంథరపర్వతమును దానిం జుట్టి కలాపహారనగర ముండిన యానవాళ్లును

కలవు. బాస్టేషను ఈస్టు బెంగాల్ స్టేటు రెయిల్వే మైమన్సింగు జగన్నాథఘడ్ బ్రాంచిలైనుపై నున్నది. భాగల్పూరునకు దక్షిణముగా నేడుమైళ్ల దూరమున భదారియా యను గ్రామముకల దది తొల్లింటి భద్రికాపురము భాదీయనగరమనియు వాడుచుండిరి. ఇది బుద్ధభగవానుని శిష్యురాలై పెక్కండ్ర నీ మతమునకుం గల్పిన విశాఖాదేవి జన్మస్థలమట. ఇట జైనతీర్థకరులలో కడపటివాడగు మహావీరస్వామి రెండుపర్యూషణములు (వర్షాకాలనివాసము) గడపెనట. ఇంక నీయంగదేశముంగూర్చి ముగించుటకుం బూర్వము "లంకావతారసూత్రము" అను ప్రసిద్ధగ్రంథము రచించిన విరాజజైనస్వామియు హస్త్యాయుర్వేదము (ఏనుఁగులవైద్యము) ను రచించిన పాలకాప్యమునియు ఇచ్చట జన్మమంది ఇటనే గ్రంథములను వ్రాసిన పండితులని చెప్పి ముగింతుముగాక! వారు చంపానాగోర్ నివాసులట.

**అంగములు** — అంగములనిన అవయవములని యర్థము. ఒక విద్య, లేక వస్తువుయొక్క వేర్వేరు భాగములకును నంగములని పేరు. అంగమనిన శరీరమునకును అర్థము కలదు.

గానాభినయ, నాట్యకలాంగములు — ౧ శిరస్సు, ౨ హస్తములు, 3 వక్షము, ౪ పార్శ్వములు, ౫ కటిస్థలులు, ౬ పాదములు, ౭ స్కన్ధములు (మూపురములు) ఈశరీరావయవములు గానకల, అభినయకల, నృత్యకలలం దుపయోగాంగములుగ చెప్పఁబడినవి.

గజాంగములు — ౧ శుండ (తుండము), ౨ ముఖము, 3 నేత్రములు, ౪ శిరము, ౫ కర్ణములు, ౬ కంఠము, ౭ గాత్రము (శరీరము), ౮ అపరము.

రాజ్యమంత్రాంగములు — ౧ సహాయకులు (సహాయమొనర్చు మిత్రులగు భూపతులు), ౨ సాధనోపాయములు (ఫిరంగులు, తుపాకులు, మోటారుబండ్లు మొదలగు యుద్ధపరికరములు), 3 దేశకాలవిభాగములు (యుద్ధానుకూలకాలములు, స్థలము మొ॥) ౪ విపత్ప్రతిక్రియలు (ఆపదందప్పించుకొను, ప్రతిక్రియలు), ౫ రక్షణ (బలమగు దుర్గములు, శతృవులు రాజాలని తావులు మొదలగునవి), ఇవి రాజ్యమంత్రాంగములనఁబడునవి యుద్ధతంత్రమున కంగములని చెప్పఁబడినది.

రాజ్యపరిపాలనాంగములు—౧ ప్రభువు, ౨ మంత్రులు, 3 ధనాగారములు, ౪ దుర్గములు, ౫ సైన్యములు, ౬ రాష్ట్రములు, (ప్రజలు), ౭ మిత్రులగు భూపతులు.

రాజసభాంగములు లేక సభాసప్తాంగములు— ౧ ప్రభువు, ౨ కవులు, 3 విద్వాంసులు, ౪ పౌరాణికులు, ౫ స్తుతిపాఠకులు, ౬ హాస్యకరులు, ౭ గాయకులు.

చికిత్సాంగములు (వైద్య చికిత్సాంగములు)— వీనిని అష్టాంగములనియు, వైద్యాష్టాంగములనియుం గూడ ననుట కలదు. ౧ కాయచికిత్స, ౨ బాలచికిత్స, 3 గ్రహచికిత్స, ౪ ఊర్ధ్వాంగచికిత్స, ౫ శల్యచికిత్స, ౬ విషచికిత్స, ౭ రసాయన చికిత్స, ౮ వాజీకరణచికిత్స.

సంగీతతాళాంగములు — వీనిని నవతాళాంగములనియు, లయాంగములనియు ననుట కలదు. ౧ అనుద్రుతము, ౨ ద్రుతము, 3 లఘువు, ౪ గురువు, ౫ కాకపాదము, ౬ ప్లుతము, ౭ విరామము, ౮ శేఖరము, ౯ లఘుశేఖరము, అనంబడునవి. వీని గుర్తులు వేర్వేరు తావులందు జూడుడు.

అధికరణాంగములు — వీనిని అధికరణ పంచక మనియు వాడుచున్నారు. మీమాంసాపంచాంగములనియు గొందరందురు. ౧ విషయము (దేనింగూర్చి విచారణసేయుదురో అది), ౨ విశయము (దానింగూర్చి గల్గెడి సంశయము), ౩ పూర్వపక్షము (కాదనిఖండించుట), ౪ సిద్ధాన్తము (అదియె యగునని స్థిరపర్చుట), ౫ సంగతము లేక సంగతి (పరస్పరానుకూల్యముం జూపించుట)

సేనాంగములు— ౧ రథములు, ౨ గజములు, ౩ గుఱ్ఱములు, ౪ కాల్బలములు.

యంత్రప్రతిష్ఠాంగములు — ౧ దృష్టి, ౨ శ్రోతము, ౩ ప్రాణప్రతిష్ఠ, ౪ యన్త్రలేఖనము, ౫ మన్త్రజపము, ౬ తంత్రవిధానమాచరించుట, ౭ మూలగాయత్రిజపము, ౮ దిక్పాలకబీజములు, ౯ పంచభూతబీజములు, ౧౦ సాధకునినామము, ఇవియంత్రప్రతిష్ఠయందుండవలసిన యంత్రదశాంగములని చెప్పఁబడినది.

యోగాంగములు- ౧ యమము, ౨ నియమము, ౩ యోగాసనము, ౪ ప్రాణాయామము, ౫ ప్రత్యాహారము, ౬ ధ్యానము, ౭ ధారణము, ౮ సమాధి, వీనిని అష్టాంగయోగములనియు; ౯ త్యాగము, ౧౦ మౌనవ్రతము, ౧౧ దేశాచారపాటనము, ౧౨ కాలానుగుణ్యావర్తనము, ౧౩ మూలబంధము, ౧౪ దేహసామ్యయోగము, ౧౫ యోగసిద్ధి, వీనిని మనోయోగములనియు, అన్నిటింగల్పి పదునేనింటిని, పంచదశయోగాంగములనియు నందురు.

పూర్వమీమాంసయందు సిద్ధరూపాంగమనియు, సాధ్య (లేక క్రియా) రూపాంగమనియు అంగములు రెండు చెప్పఁబడినవి.

**అంగర నృసింహకవి** — ఆంధ్ర కవులలో నాధునికులందు పేర్కొనఁబడినవాఁడు. కాని మధ్యకవులలో పరిగణింపబడ దగినవాఁడు. ఈతనింగూర్చిన విషయములు సరిగా తెలియరాకున్నవి. తండ్రిపేరు రామకృష్ణభట్టారకుఁడట. రచించినది 'రాజరాజాభిషేకము'ను ప్రబంధము. దీనిని కొంతాపురాధీశుఁడగు కొప్పులవల్లభ భూవరున కంకితమొనర్చెను.

**అంగలేష పర్వతము** — ఆల్మోడానుండి కైలాసశిఖరముకడకేగు మార్గమున ఆల్మోడానుండి ౧౦౭ మైళ్లదూరమునగల అస్కోటసంస్థానపు రాజధానియగు అస్కోటకడనున్న పర్వతము. దీనిని రాజబార్ సంస్థానమనియు, ప్రజలను బన్మనూస్ అనియు నందురు. ఈ పర్వతముపై మల్లికార్జున శివలింగముకలదు. ఇది రాజబారు మహారాజుగారి కుటుంబ దేవస్థానము. వీరాదిని కర్నూలు మండలము వారని ప్రతీతి కలదు. కార్తీక పౌర్ణమి కిట గొప్ప తీర్థము జరుగును. కాళీనదీతీరము కుమాన్డివిషను హద్దులలో ఆగ్రా అయోధ్య సంయుక్తరాష్ట్రములం దున్నది.

**అంగారకుఁడు** — ఈతనికిఁ గుజుఁడనియుం బేరు. నవగ్రహములలో నొకఁడు, ఏకాదశ రుద్రులలో నొకఁడు.

**అంగారన్యాయము** — అంగారమన బొగ్గని యర్థము. బొగ్గు చల్లారినది ముట్టుకొనిన చేతికి మసియగును. కాలినపిదప ముట్టుకొన వీలులేదు. ఐనను దాని ఉపయోగము లేకపోలేదు.

**అంగారపర్ణుఁడు** — గంధర్వుఁడు. సోమశ్రవ తీరమున అర్జునునితో గలహించి అతనిచే నాగ్నేయాస్త్రమున దహింపఁబడి, పిదప

గంధర్వ రూపము దాల్చి చిత్రరథుడను నామాంతరమునఁ బరగినవాడు. భార్యపేరు కుంభీనస. ఈ చిత్రరథుని యుపదేశము మేరకు పాండవులు ధౌమ్యుని బురోహితుని గావించుకొనిరి.

**అంగారవల్లి** — (వనౌషధి) సం. అంగారవల్లరీ. లా. Galadupa Arborea. అగ్ని వంటి ఎర్రని రంగు పూవులం బూచును. కానుగచెట్ల జాతిలోనిది. పెద్ద గానుగ, భారంగి, గురువింద యనియు నందురు. దీని చెక్క రసము వెగటుగను, చేదుగను ఉండి తేలిక నిచ్చును. జఠరవ్యాధిని పోగొట్టును. వెర్రి నక్క, వెర్రి కుక్క విషములను హరించును.

**అంగారోస్ జాతి** — స్పానియా దేశమందు గిప్సీ (హంగేరి దేశపు గిప్సీ) లకు పేరు.

**అంగిట బెల్లము, ఆత్మలో విషము**— ఆంధ్రలోకోక్తి. పైకింపుగ వచించుట, మనస్సునందు కల్మషులైయుంట కీన్యాయము వచించుచుందురు.

**అంగిమాగోత్రము** — ఆత్రేయగణము చూడుడు.

**అంగిరస్సు** — (ఘోర అంగిరస్సు) శ్రీకృష్ణుడీ ఘోర అంగిరస్సు అను మునీశ్వరుకడ శిష్యుడై జ్ఞానోపదేశము బొందినటుల ఛాందోగ్యమున వివరింపఁబడినది. అట్లాతడు యంగిరస్సుకడ పొందిన జ్ఞానమునకును, గీతలలో దానుపదేశించిన జ్ఞానమునకును సంబంధము కానంబడనందున గీతోపదేశ కృష్ణుం డాకృష్ణుఁడు కాడేమోయని తిలక మహాశయుడు తన గీతారహస్యమున వ్రాసియున్నాడు. ఇట్లే రామకృష్ణభాండార్కారు కూడ భారతకృష్ణుడు వేఱు, భాగవతకృష్ణుడు వేఱు అని స్పష్టీకరించియున్నాడు. మరియు బ్రహ్మసూత్రయమున కాంగ్లమున వ్యాఖ్యలను వ్రాసిన శ్రీపండిత సీతానాథతత్వభూషణ రాయిగారు కలకత్తా విశ్వవిద్యాలయ పక్షమున ౧౯౨౯ సం॥డిశంబరు మాసమున బ్రచురింపఁబడిన పత్రికలో నిట్లు వ్రాసిరి.

మహాభారతకృష్ణు డితిహాస పురుషుడు కాడు. ఋగ్వేదములోని యాంగీరస కృష్ణుడును, అసురకృష్ణుడును, ఛాందోగ్యములోని దేవకీనందను కృష్ణుడును, ఇట్టీ ముప్వురును మిశ్రణమై భారతకృష్ణుడయ్యెను. ఇట్లు మిశ్రణమూర్తి యగుటవలననే యీ కృష్ణునియందు కాలక్రమమున నెన్నెన్ని యోగాధలు కల్పింపబడి, చేర్పబడియున్నవి.

అంగిరస్సను మునీశ్వరుకడనే శ్రీకృష్ణుడు జ్ఞానోపదేశము వడసెనని ఛాందోగ్యము నుడువుచుండ, శ్రీకృష్ణుడు కంసవధానంతరము నరువదినాలుగుదినములలో, నవంతిలో సాందీపునొద్ద, కుచేలునితోపాటు సహపాఠియై, అరువదినాల్గు విద్యలును అభ్యసించెనని పురాణములు నుడువుచున్నవి.

ఘోర అంగిరస్సుకడ శ్రీకృష్ణు డుపదేశమొందిన జ్ఞానమునకును, శ్రీకృష్ణు డర్జునున కుపదేశించిన జ్ఞానమునకును, లేశమును సంబంధము లేదని, ఛాందోగ్యోపనిషత్తువలనను, గీతలవలనను, విస్పష్టమగుచున్నది. అట్లగుటనెకదా ఏది నిశ్చయించుటకును వీలు చిక్కకున్నది!

**అంగీకరించుట** — వాణిజ్యసంబంధ పరిభాషాపదము. ఏక్సెప్టెన్సు చూడుడు.

**అంగీకార యనంగీకారసంజ్ఞలు** — ముఖము నిలువున నూపుట యంగీకారసూచకముగను, అడ్డముగ నూపుట అనంగీకార సూచకముగను, అందరెరిగి యాచరించుచున్నదే. ఇది యీయా దేశములందని కాదు. ఎల్లదేశములందునను, ఎల్లఖండములందునను, ఎల్లభాషలు మాటలాడువారి యందునను, ఎల్లజాతులవారియందునను, ప్రపంచమునందంతట నొకేరీతిని అర్థమిచ్చు గురుతులుగాఁ దోచెడిని. కాన దీని మానవస్వభావసంబంధ లోకైకభాషయని దలంపనగును. బాలురకు మనమేదేని వారికక్కఱలేని పదార్థమును దినిపింపఁబోదుమేని మొగము ద్రిప్పుకొని మూతిని వీలగునంత దూరముగ జేయుదురు. దీనినుండియె యీ మొగ మడ్డముగ ద్రిప్పి అక్కఱలేదను అనంగీకారసంజ్ఞ జనించియుండనోపు. ఇంక నంగీకారసంజ్ఞ దీనికి వ్యతిరేకము. ఇంకను నేత్రములు, ముక్కు, పెదవులు, నోటిలోని పండ్లు మొదలగునవియు అంగీకార అనంగీరకారసంజ్ఞలయందుఁ దరచుగ బాల్గొనుచుండును. అనిష్టమున మొగ మునుడుచుకొనుటయు, కనుబొమ్మలం దగ్గర జేయుటయు, శ్రద్ధగ వినుటయందొకప్పుడు కండ్లు కొంత మూసికొనుటయు, పూర్వపు మనుష్యులు వాడుకొనిన సంజ్ఞాభాషకు సంతతియె. కాన లోకమం దెల్లదేశములవారును వీనిం గ్రహింపగలరు.

**అంగుడు** —అత్రిసంతతి, చంద్రవంశక్షత్రియుడు, అంగదేశాధిపతి. బలికి పౌత్రుడు. తితిక్షువునకుఁ గుమారుడు. సుతుడు దధివాహనుడు. ఈతనినుండి ఈతడేలిన దేశమునకు అంగదేశమని పేరుగల్గెనని యొకతావునఁ జెప్పఁబడినది. మరియు ఉల్ముకుని జ్యేష్ఠపుత్త్రున కంగుడనిపేరు. ఈతని భార్యపేరు సునీథి. కుమారుడు వేనుఁడు. చంద్రవంశము తుర్వసుసంతతిలోని యంగుడు ముప్పదినాలుగవతరము వాడని జెప్పంబడినది. యయాతి నాల్గవసుతుండగు అణువుయొక్క సంతతి యందలి బలియొక్క జ్యేష్ఠపుత్త్రుడు అంగుడొకడు కలడు.

**అంగుష్ఠాసనము** — యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన ఆసనములలో నొకటి. ఇది త్రివిధము. ౧ ద్విపాదాంగుష్ఠాసనము - కాలివ్రేళ్లను నేలమోపి రెండు మడమలం బైకెత్తి గుదస్థానమున కిరుప్రక్కలనానించి మోకాళ్లను నేల కానింపక కొంచెము పైకెత్తి కూరుచుండి హస్తములను హృదయమున జోడించుట ద్విపాదాంగుష్ఠాసనము. ౨ ఏకపాదాంగుష్ఠాసనము. ఇది తిరుగ ద్వివిధము. ౧ వామపాదాంగుష్ఠాసనము - ఒక్క యెడమకాలి వ్రేళ్లను నేల నానించి పైవిధానముననె కూరుచుండి కుడికాలిని యెడమ కాలి తొడపై నుంచి చేతులు హృదయమున జోడించుట, వామపాదాంగుష్ఠాసనము. ౨ దక్షిణపాదాంగుష్ఠాసనము — ఒక్క కుడి కాలివ్రేళ్లను నేలనానించి దానిపై శరీరభారమానించి పైవలెనే కూరుచుండి యెడమ కాలిని కుడికాలి తొడపై నుంచి చేతులను హృదయమున జోడించుట, దక్షిణపాదాంగుష్ఠాసనము. దీని యభ్యాసమున అపాన వాయువు నశించుననియుఁ జెప్పఁబడినది.

**అంగుళీదీపిక యాధ్వాన్తధ్వంస న్యాయము** — దీనిని అంగుళీదీపియాధ్వాన్తధ్వంసవిధి న్యాయమనియు వాడుచున్నారు. చేతిదీపముచే చీకటినడంప బ్రయత్నించుట

యని యర్థము. అనగా చిన్నసాధనముచే పెద్దపనిం జేయుటకై ప్రయత్నించుట యని భావము.

**అంగుళ్యగ్రనశ్నైనెవాంగుల్య గ్రేనస్పృశ్య తేతిన్యాయము** — వ్రేలికొన దనకు దాను తాకజాలదని భావము (అసాధ్యము). "నహిసుశిక్షితోపినటవటుః స్వస్కన్ధమధిరోధుంపటురితి" న్యాయమునకును దీనికిని భేదము కలదు.

**అంగుళ్యగ్రేహస్తియూధ శతమాస్తే-** నూరు ఏనుఁగుల గుంపులు నా వ్రేలికడ నున్నవని యర్థము. అనృతమగు డాబులు చెప్పుటయం దీన్యాయమును హేళనగా వాడుదురు.

**అంగోరాపట్టణము** — కాలీఫాత్ తొలగింపఁబడినపిదప తుర్కీ ప్రజాప్రభుత్వ కార్యస్థానము లిట స్థాపింపంబడి ప్రధాన స్థానముగ నొనర్పఁబడినది. నవీనపద్ధతులతో నున్న నగరము. ఈప్రాంతముల పెంపఁబడెడు అంగోరా మేకల వెండ్రుకలు పొడవుగా నుండును. వాని బొచ్చుతో మొహాయిర్ అనంబడు బట్టలు నేసెదరు.

**అంగోలా దేశము** — ఇది యాఫ్రికా ఖండమున పశ్చిమభాగమున లోవర్గినియా దేశమున గలదు. పోర్చుగీసు కొలనీ ఆఫ్ అంగోలా చూడుడు.

**అంజన** — తొలుత నొక యప్సరస శాప వశమున, గామరూపిణియగు వానరమై, కుంజరుడను వానరునకుఁ బుట్టి కేసరుడను వానరునకు భార్యయయ్యెను. ఒకనాడు మనుష్యరూపము ధరించి విహరించుచుండ వాయువు చూచి మోహించి యీమెయందు యాంజనేయునిం గనెనట. అత్తావు పంపా సరోవరముకడ కిష్కిన్ధ కవ్వల ఋష్యమూక పర్వత పరిసరముల నైజాము. రాజ్యమున నిప్పటి యానెగుందిపురముకడ నంజనాద్రి యనుపేరం బరగుచున్నది. విజయనగర రాజ్యము చూడుడు. ఇది హిమవన్నగ ముపైనున్న తావు కాని, ఇది కాదనియు, మధ్యకాలమున గల్పింపంబడినదనియు నొక వాడుక కలదు. అంజనగిరి (సులైమాన్ పర్వతము) చూడుడు.

**అంజనగిరి** — సులైమాన్పర్వతము (పాంచాలదేశము చూడుడు. అంజనచూడుడు.)

**అంజనత్రయము** — మూడు అంజనములు అని భావము. త్ర్యంజనము చూడుడు.

**అంజనపర్వతము** — దీనిపైన శతర్షి యాశ్రమముండెడిదని చెప్పంబడినది.

**అంజనపర్వుడు** — తండ్రి ఘటోత్కచుడు. పితామహుడు భీమసేనుడు. తండ్రి తల్లి హిడింబయను రాక్షస స్త్రీ. ఇతడు భారత యుద్ధమున అశ్వత్థామచే నిహతుడయ్యెను.

**అంజన సిద్ధి** — అంజనాద్యష్ట సిద్ధులు చూడుడు.

**అంజనాద్యష్టసిద్ధులు** - సిద్ధియన సిద్ధించుట, ప్రాప్తించుట, లభించుట, చేసిన ప్రయత్నము సఫలమగుటయని యర్థము. అంజనాదిసిద్ధులు ఎన్మిది సుప్రసిద్ధములు.

౧ అంజనసిద్ధి: పైపూత (లేపనము) వలన గుణము లేక ఫలముగల్గుట.

౨ ఘుటికాసిద్ధి: (ఔషధము మొదలగు వాని) కుప్పెలమూలమున గుణము లేక ఫలముగల్గుట.

౩ పాదుకాసిద్ధి: దీనిని గమనసిద్ధియనియు నందురు. తాగోరిన తావునకు గోరినంతనే వెడలగలసిద్ధి. పాదలేపాదులవలన గల్గునది.

౪ పరకాయప్రవేశ సిద్ధి: ఇతరశరీరము లందు తనప్రాణిం బ్రవేశింపంజేసి చరింప గల్గుట.

౫ దూరశ్రవణసిద్ధి: దూరపుశబ్దములను వినగలుగు శక్తి.

౬ దూరదృష్టిసిద్ధి: దీనిని దివ్యదృష్టియని యు నందురు. దూరపుసంగతుల నెరుంగు శక్తి.

౭ కాలజ్ఞానసిద్ధి: దీనిని త్రికాలజ్ఞానమని యు నందురు. భూత, భవిష్య, ద్వర్తమాన కాలములందు నడచి, నడువనున్న, నడచు చున్న వానిఁ దెలిసికొనుశక్తి.

౮ ఆకాశగమనసిద్ధి: నారదాదులకుం గలదు. దీనికి పాదలేపాదు లక్కరలేదు. (సిద్ధి, సిద్ధులు చూడుడు)

**అంజయగోత్రము** — లౌగాక్షి గణము చూడుడు.

**ప్రమాణము** ఆయుర్వేద మానము చూడుడు.

**అంజలి హస్తము** — హస్తాభినయము చూడుడు. భరతశాస్త్రము చూడుడు.

**అంజీరు (పండు) చెట్టు** — (వనౌషధి) లాటిన్ పదము Ficus Caricat. ఆంగ్ల Figs. సం. మంజల, అంజీర. ఇంకను దీనిని అత్తిపండనియు, సీమమేడిపండనియు నందురు. బొడ్డ లేక మేడిజాతులలో నొక తెగ వృక్షము. దీనిపండ్లు బాగాపండినతరిని లేక వాట్ల నెండలో నెండించి నిల్వయుంచియు భుజింతురు. మంచి యాహారపదార్థము.

పచ్చిస్థితియందు వేడిచేయును. బలమిచ్చును. ముఖ్యముగ గుండెలు, ధాతువులు, కార్జము (Liver), గురదాలు (Kidneys) వీట్లకు బలమిచ్చును. అజీర్తి, కఫము, దగ్గు, వికారములను హరించును. రక్తము గల్గించి బలమిచ్చును. పంచదారతో పుచ్చుకొనిన వగరుపు, దగ్గు, శమించును. పండ్లరసము కురుపులం జీము పట్టించి పగులఁజేయును. ఆకుల పసరు శ్వేతకుష్ఠు (బొల్లి) ను నివారించును.

ఎండబెట్టిన పండ్లు సమధాతువుం గల్గించును. బలము, ధాతుపుష్టి, జీర్ణశక్తి, రక్త పరిశుద్ధత అభివృద్ధిపరచును. గుండెలనార్చెడి రోగమును, మూర్ఛ, పక్షవాతము, విదాహము, శ్లేష్మము, మలబద్ధకరోగము, వగరుపు, దగ్గు, గుండెలలో నొప్పి, మూలవ్యాధి, నల్లదొబ్బ (Spleen) యొక్క ఉబ్బు, నిస్సత్తువ, మూత్రబద్ధము వీట్లను శమింపజేయును. బాదంపిస్తాలతో కల్పితినిన బలకరము. అక్రోటుతో తినిన విషములను హరించి ధాతువృద్ధికరమై యుండును. అధికముగ దినిన పండ్లకు జబ్బుచేయును. దీనికి విరుగుడు పెద్దజీలకర్ర, అక్రోటు.

**అంటాముట్టారాని యగ్రహారము** — నిరుపయోగమైన యాస్తియని భావము. (తెలుగు సామెత)

**అంటార్టికసర్కిల్** (Antartic Circle)- దక్షిణధృవమునకు ఉత్తరపుఎల్లగా భావించబడిన రేఖ. ఇది భూమధ్యరేఖనుండి దక్షిణముగా నరువదియారున్నర డిగ్రీల దూరమున నుండునది. దక్షిణధృవమునుండి ఇది ఉత్తరముగా నిరువదిమూడున్నర డిగ్రీల దూరము.

**అంటార్కిటిక్** (Antarctic) — ఉత్తర ధృవ ప్రదేశమునకు ఆర్కిటిక్కోవలని పేరున్నటులనే దక్షిణ ధృవమునకు అంటార్కిటిక్కోవలని పేరు. ఇదియు కడు శీతల ప్రదేశమై, జనుల దుస్సాధ్యమై యుండును. శీతకాలమున దీర్ఘనిశులంగల్గి అంధకార బంధురమై యుండెడిని. ఇట్టి దక్షిణధృవ ప్రదేశములందు క్రీ. శె. ౧౮౪౧ సంవత్సరమున Sir James Ross గారు ఎక్కువ కష్టముల కోర్చి యాత్రసల్పి కొన్ని ప్రదేశములంగనుగొనిరి. అందు ముఖ్యమైనది సౌత్ విక్టోరియా యను ప్రదేశము.

అంటార్కిటికా భూప్రదేశముల మనుష్యులు లేరని చెప్పఁబడినది. Albatross, Penguins, Seals, Walrus, Whales అనంబడిన జన్తుసముదాయములు తీరములందు సముద్రమునందుండునట.

ఇందు (Graham's Land) గ్రహాంసు లాండు అనియు, (South Shetland) సౌతు షెట్లాండు అనియు, (South Georgian Islands) సౌతు జార్జియన్ ద్వీపములనియు మూడు ద్వీపసమూహములు కలవని పోల్చియున్నారు.

**అంటార్టిక్కు ప్రదేశము** — దక్షిణ ధృవప్రదేశము చూడుడు.

**అంటుమామిడి** — మామిడి చూడుడు.

**అంటురోగములు** — కొన్ని వ్యాధులు అంటువ్యాధులని పేర్కొనంబడినవి. రోగి సాంగత్యమున నన్యులకు వ్యాపించును. అతడు పీల్చివదలిన గాలియు, ముట్టిన యుదకములు అతని సంబంధముగల్గిన బట్టలు మొదలగునవన్నియు వ్యాధిని వ్యాపింపజేయునవిమోననియు అందు గాలి ముఖ్యమనియు చెప్పఁబడినది. కొందరు ఆంగ్లవైద్యులు నోరు మూసికొని ముక్కుతో నూపిరిం బీల్చుచుండిన అంటువ్యాధుల వ్యాపకమంతగనుండదని యనుచున్నారు. కాని అట్టి రోగులతో సంబంధముం గలుగక తప్పనితరి ఎక్కువ జాగ్రతగొనుచుండవలయును.

ఎండయు అగ్నియందలి వేడిమియు అంటురోగపు జరమ్ము, బైసిలైలను మాడ్చివేసి నివారించునని చెప్పఁబడినది. కొంతవరకు పరిశుభ్రమగు యుదకమును, గాలియు నివారణకరములే నందురు. అందు సముద్రోదకము బలముగ పనిచేసి నివారించునట. ఇంకను సున్నపుఘాటు గంధకము కాల్చిన ఘాటు చక్కగ నివారించునట. Carbolic Acid, Chlorate of Lime, Sulphate of Lime, Potassium Permanganate, Ozone, Sulphuric Acid ఇంకను ఇటీవలి పరిశోధనలు, అప్పుడు వేయించిన కాఫీగింజల కాఫీ ఎక్కువబలముగ పనిచేయఁగల Deodorant అనియు తేల్చినవి. వేడినీళ్లు చక్కగ శుభ్రపర్చునందురు. కిటికీల ద్వారములు తెరచియుంచుట మంచిది.

**అంటువ్యాధుల జెరమ్ము, మైక్రోబ్సు, బేక్టీరియా, బేసిలై** — ఒకడొక వ్యాధిచే బాధపడుచుండు తరి, యాతనినుండి యావ్యాధి ఇతరులకు వ్యాపించి యంటి వారింగూడ వ్యాధిగ్రస్తులుగ నొనర్చెనేని దానిని అంటువ్యాధియందురు. ఇక్కాలమున, ఆంగ్లవైద్యశాస్త్రజ్ఞానము మేరకు సమస్తవ్యాధులు, జరమ్ము (Germs) వలన గల్గుచున్నవని తలంపఁబడుచున్నవి.

ఈ అంటువ్యాధులు రెండువిధము దురు. అవి కంటేజియస్ అనియు ఇన్ఫెక్టస్ అనియు, రోగిని తాకుట లేక రోగియొక్క వాడుకపదార్థములను, ఆరోగపు జరమ్ము అంటియుండుతరి వాట్లం వాకుటవలన, ఆ రోగియొక్క రోగపు జరమ్ము తాకినవారికి యంటి లోనికింజేరి ఆరోగము తాకినవారికిం గూడవ్యాపించి వ్యాధిగ్రస్తులుగ నొనర్చె నేని, దానిని కంటేజియస్ Contagious Disease అనెదరు. ఇందు జ్వరములు మొదలగునవి చేరియుండును.

తాకుట మొదలగు సంపర్కములమూల మునమాత్రమేగాక, రోగియొక్క రోగపు జరమ్ము, గాలియందు నీరు మొదలగు వాట్ల యందు జేరి, ఊపిరి పీల్చుటవలనను, దాహము త్రాగుటవలనను అన్యులలోనికిం బ్రవేశించి, వారికింగూడ రోగముంగల్గించుటవలన వ్యాపకముంగాంచువ్యాధులకు Infectious Diseases అనెదరు. ఇందు ఉబ్బసపుదగ్గు (Consumption) మొదలగునవియు విషూచి మొదలగువ్యాధులు చేరియుండును. సర్వరోగములకుం గారణముగ జెప్పంబడిన యీజరమ్ము పరమాణురూపములై, అన్నియు నొకటిగ పెక్కండ్రచే తలంపఁబడుచున్నను, పరిశీలనలో వీట్లయందు భేదము గన్పడెడినట. జెరమ్ (Germ) యనునది ప్రారంభదశ యందుండునది. ఇది వెజిటెబుల్ (Vegetable) గనో Animal గనో ప్రారంభమై ముందు పెరుగనై యుండుతరి యీపేరం బరగెడిని.

మైక్రోబు (Microbe). ఇది జరము యొక్క •తర్వాతిదశ. ఇదియును శరీర ధర్మమున వెజిటెబుల్ గనో ఏనిమల్ గనో యుండుంగాని సూక్ష్మాతిసూక్ష్మరూపముగ నుండియు జీవితము ప్రారంభమై దన రెడిని. దీని కవయవములుండుటయు ఉండకపోవుటయు కూడ కలదు.

బేక్టేరియా (Ba[illegible]ria). ఇది ప్రత్యేకముగ కల్గినను క[illegible]గును, లేక మైక్రోబు యొక్క వెజిటెబుల్ శరీరావస్థ ముదిరినైనను కావచ్చును. దీనికి వెజిటెబుల్ శరీరము ప్రధానము. క్రోటన్ చెట్లు మొదలగు మొక్కలకుబట్టు ఫంగస్ Fungus వంటిది. దానికన్న చాలా తక్కువపరిమాణముం గలది ఆజాతియో, లేక వేరొక జాతియో పరిశీలనవలన స్పష్టముగాదు. గుండ్రని బంతులుగనో చుట్టుకొనియుండు Spiral గనో యుండెడిని.

బేసిలై (Bacille) యనునది [illegible]క్టేరియాకు తర్వాతియవస్థగ నెన్నబడు చున్నది. ఇది చిన్న చిన్న కర్రలవలె పెరుగుటంజేసి యీ పేరందినదట. బేసిలైయన్నయు, బేక్టేరియా లోనిదని చెప్పనగుంగాని, బేక్టేరియాయన్నయు (ముదిరినపైని) బేసిలైమాత్రము గాదు. ఇంకను వేరురూపముల నంది వేరుపనుల నొనర్పగలది యగునని తలంపఁబడుచున్నది. రోగకారణమగు జరమ్ము, ఇటుల [illegible]ర్విధములుగ నాంగ్లవైద్యులు తలన్తు[illegible] ఆయు ర్వేదవైద్యుల పద్ధతివేరు. ఇ[illegible]లి పరిశీలనలు ఒకేవిధమగు లక్షణము[illegible] గల వ్యాధి ఒకేవిధమగు Germ వల్ల కల్గుచున్నవని బయల్పరచినవి. [illegible]గము క్రొత్త తావున అంటుటకు వ్యా[illegible]ంగలుగజేయఁదగిన తీవ్రత, సంఖ్య [illegible]గ్గియుండవలయుననియు తగినన్ని సూక్ష్మ[illegible]వు లుంటకుందొడు అనుకూల పరిస్థితులుగల శరీరక్షేత్రమమరియుండ వలెననియు పరిశీలనలవలన తేలినది.

ఈసూక్ష్మజీవులు రెండు తెగలుగ నుండును. కొన్నివాయుప్రసారము గలతావులందే జీవించును. మరికొన్ని గాలిలేని తావులందే జీవించును. కొన్ని ప్రాణములుగల శరీరభాగములనే తిని బ్రతుకును. కొన్ని కుళ్లిన నిర్జీవ పదార్థములనే తిని బ్రతుకును. కాని వీటి యాహారము కేవలము జంతు సంబంధమే నని చెప్పంబడినది. ఇవియె సూక్ష్మజీవులని చెప్పంబడవలయును. ఇవి శరీరమంతయు నొకేకణముగ నుండు జంతువులు. ఈ ఏకకణ శరీరమునందే ప్రొటోప్లాసమ్ అనంబడు స్వచ్ఛమగు మూల పదార్థముండెడిని (ప్రొటోప్లాసమ్ — బోటనీ చూడుడు). మరియు నీ కణమధ్యముననే ప్రాణము (Nucleus) ఉండవలయును. దానిలోనొక భాగమును చాచి పొడుగించి శరీరమునొకటి రెండుగ రెండు నాలుగుగ నొనర్చుటయు, నాల్గు ఎన్మిదిగ నొనర్చుటం జేయుచు, వీటి జాతి సంఖ్య వృద్ధియగుచుండును. దీనివలన ప్రాణమునూ విభజింపబడుచుండునని తేలుచున్నది. కొన్ని జాతుల సూక్ష్మజీవులకు తోకలుండును. తోకలద్వారా యివి ఆహారమును దీసనందురు.

చలిజ్వరముంగల్గించు కొన్ని సూక్ష్మజీవులు స్త్రీ పురుష భేదములంగల్గి సంతానముంగనునని యిటీవల పరిశోధనలవల్ల బయల్పడినది. తామర శోభి మొదలగు చర్మవ్యాధులం గల్గించు జరమ్సునూ, చెట్లపై అగుపడు ఫంగీరోగమునూ ఈజాతివేనని చెప్పంబడినది.

బేక్టేరియా — ఇది శరీరము ముక్కలు ముక్కలుగా విరుగుటవలన వృద్ధిచెందును. ఒక్కొకదాని శరీరపరిమాణము ౧/౫౦౦౦ – ౫౦౦ అంగుళముగ లెక్కించియున్నారు. ఇందు ఈజాతులుంగలవు. కొన్ని కుళ్లును హరించి శుభ్రతం గల్గించునవి. కొన్ని విషమును కల్గించి వ్యాపింపజేసి బాధించునవి. కొన్ని పులియంజేయునవి. ఇందు చీమును గల్గించు బేక్టేరియా గోళాకారముగ నుండును. క్షయ దగ్గును గల్గించు సూక్ష్మజీవులు కణికల వలెను, ఆంత్రాకు సూక్ష్మజీవులు గొలుసుల వలె నుండును. కలరాగల్గించు సూక్ష్మజీవులు ఇంగ్లీషు కామా (,) గను, ధనుర్వాతము గల్గించు సూక్ష్మజీవులు బాజాకర్రలగను, సవాయిని గల్గించు సూక్ష్మజీవులు మరమేకులుగను ఉండునని చెప్పంబడినది.

**అంటూసంటూ ఆసాదివానిదీ, రట్టారవ్వా గంగానమ్మది** — ఒకరి పేరు పెట్టి తెచ్చి ఇంకొకరు తినివేయుట కీసామెత వాడుచున్నారు.

**అండకుక్కుటీ న్యాయము** — గ్రుడ్డు ముందా కోడిముందా యను వితర్కమని భావము. గ్రుడ్డులేనిదే కోడి పుట్టదు (కోడి గ్రుడ్డు). ఆ కోడి లేకున్న గ్రుడ్డుపెట్టుటయె సంభవించదు. కాన గ్రుడ్డు ముందా కోడి ముందా యను వితర్కము తేలునదికాదు. విత్తు ముందా చెట్టుముందా యను ఆంధ్ర లోకోక్తి కల దదియు నీయర్థమే ఇచ్చునది.

**అండమానుదీవులు** — ఈ ద్వీపములును నికోబార్ ద్వీపములవలెనే భరతదేశమునకుం జెందియున్నవి. బర్మాకు నైఋతి దిశగా ౧౨౦ మైళ్లదూరమున బంగాళా ఖాతములోనివి. ఇందు దారు పెద్దవియు ౨౦౦ చిన్న ద్వీపములును కలవు. అడవులుంటచే మంచి కలప వీటియందు కలదు. ౨గీ౦౮

చతురపుమైళ్ల వైశాల్యమనియు, ౧౭ జనాభా యనియుం దెలియుచున్నది. పోర్టు బ్లైరు రేవుస్థలమును ప్రధాన స్థలమునై యున్నది.

**అండర్ ప్రూఫ్** — Under proof ఎబవ్ ప్రూఫ్ అనుట కర్థము.

నిషాగలిగించు పానీయములు అనేకములు కలవు. అందు కొన్నకొన్న పాలుగ నాల్కాహాలు (Alcohol) చేరకపోదు. సారా, విస్కీ, బ్రాందీ, షాంపెయన్, గోగనక్, రమ్, బీరు మొదలగు నిషాపానములకు (Spirits) అని వాడుక గలదు. ఇవి యన్నియు మండును. మరియు నివి నీటితో గల్పిన గలియునవి. విక్రయించువారు నీటి యందు నీటింగల్పి విక్రయింతురు. వారు స్వలాభముకొరకు నీటినధికముగ చేర్చి బలముం గోల్పోవజేయకుండ ప్రభుత్వశాఖలలో నొకశాఖోద్యోగులు (Excise Officials) ఈసారాయములం బరీక్షించుచుందురు. దాని విధాన మిది.

కొంచము తుపాకిమందు తీసి, దానిపై నీ సారయముంబోసి దీపముచే ముట్టింతురు. నీటిపా లధికముగాకుండిన నాసారాయముతోపాటు మందును అంటుకొని కాలిపోవును. దీనిని ప్రూఫ్ అనెదరు. నీటిపాలు తక్కువమైయుండిన, మంట అతిత్వరితముగ నడచుటను Above proof అని యందురు. నీ రెక్కువ యగుచో ఊదారంగు మంట మండి, నీటిచెమ్మచే మందుతడిసి కాలక దిమ్మకట్టి యుండును. దీనికి Under proof అని యందురు. ఇది సారాయముల ఋజువు (Proof)చేయుట. ఇదియెగాక ఇంకను సారాయము, ఏబదియేడు డిగ్రీల Fahrenheit వేడి ప్రదేశమున, ఒక ఔన్సు సారాయమును, ఒక ఔన్సు పరిశుభ్రోదకము (Distilled water) ను ఒక త్రాసునందుంచి తూచి నచో నీటిబరువు పదమూడు వంతులలో సారా బరువు పండ్రెండువంతు లుండవలసి యుండును. అది ప్రూఫ్ గనెంతురు. బరు వెక్కువ యగునేని బరువగు నీరెక్కువగ గల్పిరని ఎరింగి అండర్ ప్రూఫ్ (Under proof) అని యును, బరువింకను తగ్గియున్న నీటి పాలు తక్కువయనియెరింగి ఎబవ్ ప్రూఫ్ (Above proof) అనియును గ్రహింతురు. ఆల్కహాలు (Alcohol) కడు తేలికయగుట Fahrenheit ౧౭౭ డిగ్రీల వేడియు సాయమున కొద్ది భాగముగ గల్పునీరును Distilled water జేసరములని మనసునందుంచుకొనవలయును.

ఇక్కాలమున హైడ్రోమీటరు (Hydrometer) అను ఒక యంత్ర సహాయ్యమున సారాయములం బరీక్షించి అండర్ ప్రూఫ్ నందుగాని ఎబవ్ ప్రూఫ్నందుగాని డిగ్రీలం గూడ నెరుంగుటయెగాక వేర్వేరు టెంపరే చరు (Temperature) శీతోష్ణ ప్రదేశములకు వేర్వేరు విధముల పథకములం గల్గి యున్నారు.

**అండర్ ప్రొటెస్టు** — వాణిజ్యసంబంధ పరిభాషాపదము. Under Protest. సమ్మతిలేక బలాత్కరింపబడి, నిరోధపూర్వకముగ చేసినపని.

**అండర్ రైటర్** — వాణిజ్యసంబంధ పరిభాషాపదము. Under writer ఓడలను (నష్టమునకు) భీమా (Insure) చేయువాడు.

**అండవాతము** — ఆంగ్ల Hernia. అండము (వృషణము) లలో నొకటిగాని వాపు సలుపు పోటులం గల్గియుండు జబ్బు.

**అండొ్ౕరా దేశపు ప్రభుత్వము** — ఐరో పాఖండమునందలి తూర్పు పైరనీస్‌లోని ప్రజా ప్రభుత్వదేశము. నూటతొంబదియొక చతురపుమైళ్లు వైశాల్యమనియు, ఆరువేలు ప్రజలనియు చెప్పఁబడినది. ఫ్రెంచి ప్రభుత్వమువారి రక్షణయం దున్నదనియు, అండొ్ౕరా ప్రధాన నగరమనియుఁ జెప్పంబడినది.

**అంతఃకరణములు** — మనస్సు, బుద్ధి, అహంకారము. మరి కొంద రీమూటికి చిత్తముం జేర్చి యన్తఃకరణచతుష్టయ మందురు. వీట్లకే అన్తరిన్ద్రియము లనియుం బేరు.

**అంతకసన్నిపాతము** — సన్నిపాతదోషము చూడుడు.

**అంతరగిరి** — బంగాళములోని సన్తాల్పరగణాలోనున్న రాజమహాల్ కొండలు. మత్స్యపురాణము ౧౧౩ అధ్యాయమున దీనిం గూర్చిన ప్రశంస కలదు. వంగదేశముఁ జూడుడు.

**అంతరతామర** — లా. Pistia Stratiotes & Cassytha Fileformis; సం. ఆకాశవల్లి (కొందరు దుష్పర్శయనియు ననిరి). చెరువులలో నీటిపై తేలుచుండు లత. దీనివేరు అడుగున భూమియందు బురదలో నాటినను నాటును. లేకున్నను లేకపోవును. దీని యాకురసమును కషాయమును తీపి, కారము గల్గి దగ్గు, కాక, ఉబ్బసము, వాతపైత్యము, కేవలపైత్యము, అతిసారము, గ్రహణి, మూత్రకృచ్ఛ్రము, మేహదోషముల నడఁచును. కొంచెము చలవజేసి, బలము గల్గించును. వీర్యవృద్ధి నిచ్చును. ఆకులను నేతితో వెచ్చజేసి, పైన కట్టుచుండిన మూలశంకవ్యాధి తగ్గును.

**అంతరంగ బహిరంగయో రన్తరంగం బలీయః ఇతిన్యాయము** — బహిరంగ స్థితికన్న నన్తరంగస్థితి బలమైనదని యర్థము. దూరమందున్నవాటికన్న సమీపస్థమగునవి బలీయములని భావము.

**అంతరింద్రియములు** — ఇంద్రియములు చూడుడు.

**అంతరిక్షుడు** — ఋగ్వేద దశమండలమున నభప్రభేదన, వైరూప శబ్దములు, అంతరిక్ష శబ్దార్థములుగా ధ్వనించుచున్నవి. కూర్మపురాణములో నంతరిక్షుని స్థానమునఁ 'ధర్ముఁడు' అనియుఁ గలదు. ఈతఁడు ఋగ్వేదమునఁ గొన్ని సూక్తములకుఁ బ్రోక్తయై యున్నాఁడు. మురాసురుని కుమారుడు, శ్రీకృష్ణునిచే నిహతుడైనవాడు.

**అంతర్ధానుడు** — ఈతనికి విజయాశ్వుడని యుం బేరుకలదు. పృథుచక్రవర్తి కుమారుడు. ఈతనికి ౧ శిఖణ్డి యనియు ౨ నభస్వతియనియు నిరువురు భార్యలు. శిఖండి వశిష్ఠు శాపమువలన భూమియందు పుట్టినది. ఈమెవలన ౧ పావకుడు, ౨ పవమానుడు 3 శుచియను పుత్రులు గల్గిరి. వీరు త్రేతాగ్నులయిరి. రెండవ భార్యయగు నభస్వతి వలన హవిర్ధానుడను కొమరుండు గల్గెను. అగ్నులు చూడుడు.

**అంతర్దాహము** — ఆంగ్ల. Burning sensation inside and restless feeling in the body. పురుషులకుగాని స్త్రీలకుగాని గల్గెడి తాపము లేక వేదన.

**అంతర్వృద్ధి** ఆంగ Hydrocele. బృహత్తనియు నందురు. శరీరమున గల దోష కారణముగ దుష్టద్రవము దుష్ట పదార్థములు కూడి గ్రంథికోశము ఏర్పడి పొత్తికడుపులో నుండి వృషణములలోనికి దిగిన (బుడ్డదిగుట) జబ్బు. దీనికి ఆంగ్ల వైద్యము మేరకు శస్త్రము చేయుదురు.

**అంతర్వాహినీనది** — ఒక పర్వతమునందు గాని, ఒక జలనిలయమునందుగాని జనించి ప్రవహించు మంచినీళ్ళ ప్రవాహమునకు నది యని పేరు. నదులు భూమిపైనుండి ప్రవహించు మార్గము పల్లముగనై అం దిసుక జేరి యుండును. అట్టి ఇసుక లేని తావులందు బంకమట్టి నేలగాని, బురదనేలగాని యుండెడిని. వీట్లపైఁ బ్రవహించు నదులు బహిర్వాహినులనఁబడును. వీటిని సర్వసాధారణముగ నదులని వాడుచుందురు.

ఇంక భూమిలోనుండియే ప్రవహించు నదులు కొన్ని కలవు. వాటి కంతర్వాహినులని పేరు. భరతదేశమునం దుత్తరభాగమున సుప్రసిద్ధమగు సరస్వతీనది మైనాక పర్వతములు లేక శివాలిక్ పర్వతమునందు జన్మించియు కొంతవరకు ప్రవహించి భూమి లోనికిం దిగిపోయి ప్రవహించుచు మరికొంత దవ్వేగి తిరుగఁ బయల్పడి భూమిపై ప్రవహించును. అనగా కొంతవర కంతర్వాహిని యై నడచియు తిరుగ బహిర్వాహిని యగునని భావము. (సరస్వతీనది చూడుడు)

గయకు ప్రక్కఁబడి ప్రవహించు ఫల్గునీ నది వేసవికాలమున నిసుకగుండా ప్రవహించుంగాని నిసుకపై బహిర్వాహినియై ప్రవహింపదు. దీనింగూడ నిట నంతర్వాహిని యనియే నందురు. ఇట నిత్తరి నిసుకయందు నిలచియుండు నీరని తలంపరాదు. ప్రవహించుచునే యుండెడిది. దక్షిణ మథురా పురముకడ వైఘవనదియు నిట్లే వేసవియం దిసుకక్రింద నంతర్వాహినిగనే యుండును. ఇకను వర్షకాలమున బహిర్వాహినులుగనే ప్రవహించుచుండును.

**అంతర్దీపికాన్యాయము** — ఎక్కువతావులకుఁ గనుపునట్లు మధ్యగా దీపముంచుట యని భావము. ఒకపని చేయుటతో పెక్కు కార్యముల కుపచరించుటయందీ న్యాయమును వాడుచుందురు.

**అంతర్వేది** — గంగా, యమునానదుల మధ్య భూభాగమునకు ఈ పేరుండెనని భవిష్య పురాణము 3 వ భాగము రెండవ అధ్యాయమున వివరింపఁబడినది. దీని నాప్రాంతముల దోఆబ్ అనెదరు. (దో యన రెండనియు ఆబ్ అనిన ఉదకములనియు నర్థము). రెండు జలముల నడుమ నుండునది యనిభావము.

ఇంకను ఆంధ్రదేశమున నిప్పటి పశ్చిమ గోదావరీ మండలమున నరసాపుర ప్రాంతమున అంతర్వేది యని ఒక గ్రామముకలదు. అది నృసింహ దేవస్థానమువలె పేరందినది, సముద్రతీరము. గంగానదియందు రెండు శాఖల నడుమ అంతర్వేది కాన్పూరుకడ బ్రహ్మావర్తముకడ (తూర్) కలదు - వేది యనిన యజ్ఞార్హవేదిక లేక తావు.

**అంతశ్శిలానది** విన్ధ్యపర్వతమున జనించునది.

**అంతస్తాపో - బహిశ్శీతమ్** — ఇది సంస్కృత లోకోక్తి. లోపల వేడి, బైటికి శీతలమూనని యర్థము. లోపల పగయుం

డియు బయటికి తీయని మాటలాడువారిం గూర్చి యీ న్యాయము వాడుదురు. కపటి యని భావము.

**అంత్యనిష్ఠురముకన్న నాదినిష్ఠురము** — ఒక కార్యముపయోగించునని చేసి అది వారికుపయోగింపక నొప్పిం గల్గించుటకన్న ఆదియందే తాఁబూనక నిరాకరించుట శ్రేయమని భావము.

**అంతిసారుఁడు లేక మతిసారుఁడు**— అత్రి చంద్రపూరువంశ క్షత్రియుఁడు. తండ్రి ప్రాచిన్వానుఁడు లేక బుచేయువు.కుమారులు సుమతి, ధృవుఁడు, అప్రతిరథుఁడు.

**అందని పూలన్నియు దేవున కర్పిత మన్నట్లు** — తేరకబుర్లు చెప్పేవారిం గూర్చిన సామెత.

**అందరానిపండ్ల కాశించినట్లు** — దురాశ యని భావము.

**అందరికీ నేనులోకువ ఐయితే నాకు నంబికొండయ్య లోకువ**—లోకోక్తి.

**అందరికీ శకునములు వల్కిన బల్లి తాను కుడితిగోలెంలో పడినట్లు-**

**అందరూ అందలమెక్కేవారైయితే మోసేవారెవ్వరు?** — ఇది దురాశను నిరసించుచు నసంభవమని దెల్పు సామెత. అందలమనఁబ్రక్కలుమూసియుండని సవారీ. దీనిని కొందరు టంజాన్ అనెదరు.

**అందితే శిగ, అందకపోతే కాళ్లు** — వీలుకల్గిన నపకారము చేయుట, వీలు కాకున్న కాళ్లుపట్టుకుని ప్రాథేయపడుట యని భావము. ఇది దుష్టుని లక్షణముగ నిరసనగా బల్కు సామెత.

**అందిరకులగోత్రము** — ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. ఆన్దేరకుల చూడుడు.

**అందుగచెట్టు** — లా. Boswellia Serrata. ఆంగ్ల. Indian Olibanum. సం. కందరుక్, గజభక్షా, సల్లకీ, గజప్రియా. ఇది జిగురుగల చెట్టు. దీని జిగురు లేక బంకను అందుగపిసును, కుందురుష్కము, ఫిరంగిసామ్రాణి అని యందురు. దీనిచెక్క వగరుగనుండి చలవజేసి కఫము, ఉన్మాదము, జ్వరము, పైత్యప్రకోపము, తాపములను హరించును. వీర్యవృద్ధికరము. దీని కాయ లేతప్పుడు వెగటుగ, చేదుగ నుండి చలవ, శ్లేష్మశాంతి చేయును.

అందుగ బంక (లేక ఫిరంగి సామ్రాణి) గూర్చి ఇటుల చెప్పఁబడినది. దీనికి సంస్కృతమున కుందు, తీక్ష్ణగంధ, బలీ యని పేర్లుకలవు. ఇంకను కుందురుష్కమనియు నందురు. దీనిని సువాసనకై ధూపద్రవ్యముగ వాడుదురు. ఫిరంగిసామ్రాణిని నీళ్లలోవేసి కాచి వడకట్టిన శుద్ధియగును. పిదప పలాస్త్రిచేసిన వ్రణములు మానును. గాయములు మానును. ఇది చలవఁజేయును. త్రిదోషములు, వ్రణములు, గాయములు మానును. జ్వరతీవ్రము తగ్గును. పైత్యప్రకోపము, రక్తపైత్యము, హృద్రోగములు, గ్రహణి, మలబద్ధము, ఉన్మాదము, తాపము, రక్తగ్రహణి, నివారించును. వీర్యవృద్ధిం గల్గించును. నేతితో సేవించిన సెగరోగము తగ్గును. బలము గల్గించును.

**అందుగుల వేంకయ్యకవి** — ఆంధ్ర కవులలో మధ్యకవులందు పరిగణింపఁబడిన వాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు, తండ్రిపేరు సూరన్న.

రచించినది రామరాజీయ మను నామాంతరముగల నరపతివిజయము. విజయనగర ప్రభువులకు నరపతులని వాడుకయుండెను. అనగా కాల్బలములు వీరి కధికముగ నుండెనని భావము. రామరాజీయముచరిత్రాత్మక కావ్యము. ఇందు రామరాజు పూర్వుల యొక్కయు రామరాజుయొక్కయు చరిత్రలు చెప్పఁబడినవి. ఈయన శ్రీకృష్ణరాయని యల్లుఁడు. ఈకావ్యమును రామరాజు తమ్ముఁడగు తిరుమలదేవరాయని మనుమని మనుమఁడగు కోదండరామరాజునకుం గృతినిచ్చెను. కవి యీనాటివాఁడగుట క్రీ. శ. ౧౬౦౦ ప్రాంతముననుండి యుండునని తలంపఁబడు చున్నది.

**అందేరకులగోత్రము** — ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. వైశ్యగోత్రములు చూడుడు.

అన్దేరకులగోత్రము ఏకాక్షేయగోత్రము (౬౮) దీనిని అన్దేరకుల, చిన్తకుల, చిన్త్యకుల, చిన్తాలకుల, చిన్తమశిష్ఠ అనియు నందురు. సత్యగణము, సత్యస లేక సత్యవ్రాతస అని సంస్కృతగోత్రము, ఆపస్తంబ సూత్రము, యజుశ్శాఖ, ప్రమాణగ్రంథము మత్స్యసూత్రము, వృషభేశుఁడుదేవత, భార్య కుసుమాంబ, కావేరీతీరము తపస్థానము, పుష్పసరస్సుతటాకము, జపముదశలక్ష, దీపసంఖ్య ౭౦, క్షేత్రసంఖ్య ౭౦, ధాన్యము దానము, నేరడిపండు వర్జనీయము.

**అంధ అంధిలానది, చందనానది లేక చంద్రావతీనది**—దీనిఁగూర్చి దేవీభాగవతము అష్టమస్కంధము ౧౧ వ అధ్యాయమున ప్రశంస కలదు.

**అంధకవర్తకీయ న్యాయము** — గ్రుడ్డివాఁడు, కొడవలి యని యర్థము. దానంతటనది సంభవించుటవలన జరిగిన పని యని భావము. అజాకంపాణీ న్యాయమును ఇట్టిదియె (చూడుడు).

**అంధకుఁడు** · యదువంశస్థుఁడగు సాత్వతుని కుమారుఁడు. పుత్త్రులు భజమానుఁడు, కుక్కురుఁడు, శుచి, కంబళబర్హిషుఁడు అనువారలు. మరియు నంధకుఁడను దనుజుఁడు శివునిచే నిహతుఁడైనవాఁడొకఁడుండెను.

**అంధగజన్యాయము** — గ్రుడ్డివాండ్లు ఏనుగయని యర్థము. కొందరు గ్రుడ్డివాండ్రొక యేనుగ యెట్లుండునో యెఱుంగదలఁచి యెటులెటులో నొక యేనుగును సమీపించి దాని మావటీఁడు సహాయమునంగాబోలు ఒకఁడు తొండమును, ఒకఁడు చెవిని, ఒకఁడు తోకను, ఒకఁడు కాలిందడివిచూచి, తొండముం దడివినవాఁడు పామువలె నుండుననియు, చెవిని తడవినవాడు ఏనుగు చేటవలె నుండుననియు, తోకందడవినవాఁడు చీపురుకట్టవలె నుండుననియు, కాలిందడవినవాఁడు దూలమువలె నుండుననియుం గ్రహించిరట. అజ్ఞానులకుం దెలసినది ఇటులనేయుండునని భావము.

**అంధగోలాంగూల న్యాయము** — గ్రుడ్డివాఁడు, గోవుతోక యని యర్థము. ఒక గ్రుడ్డివాఁడు దారితెలియక ఒక యూరిబయట నల్లాడుచుండ నొక దురాత్ముఁడు చూచి ఒక ఆవుదగ్గరకుదెచ్చి దానితోక నాయంధుని చేతనుంచి దానిఁబట్టుకుని వెంటజనిన, గ్రామములోని కేగఁగలవని సలహా యిచ్చెనట. దుర్మార్గులు సాధువుల నపాయస్థితిలోనికిం దించి తాము వినోదించుట లేక లాభించుటకీన్యాయమును వాడుదురు.

**అంధదర్పణ న్యాయము** — గ్రుడ్డివాని కద్దముఁ జూపుటయని యర్థము. నిరర్థక కార్యమని భావము.

**అంధ నదము** — బ్రహ్మపుత్రానది.

**అంధపరంపరాన్యాయము** గ్రుడ్డివారి సమూహము తమలోతామన్యోన్యము దారి చూపుకొనుచు నడచుట కర్థము. అందరూ అజ్ఞానులేగాని ఒక్కఁడైనను తెల్విగలవాఁడా వ్యవహారమందు లేడని చెప్పుటకీ న్యాయము నుపయోగించుచున్నారు.

**అంధస్యైవాన్ధలగ్నస్యవినిపాతః పదేపదేతి న్యాయము** గ్రుడ్డివానిం బట్టుకొనిన మరియొక గ్రుడ్డివానికి, మొదటి గ్రుడ్డివానికింబోలి అడుగడుగున కంతరాయము లేనని భావము. తనకన్న మంచిస్థితియందున్నవాని సహాయము తన్నుద్ధరించునుగాని తనవలె దుస్థితియందున్న వానింబట్టుకొనిన తనకు ప్రయోజనముండదనుట కీన్యాయము ను వాడుదురు.

**అంత్రాసైటు రాక్షస బొగ్గు** — (Anthracite Coal) ఇది యొక జాతి రాక్షసబొగ్గు. దీనిని Highly Fosilised Coal అని యందురు. ఇందు Vegetable origin traces చాల తక్కువగా నుండును. చాలా గట్టిగానుండి పగులుటయందు పెళుసుగా నుండును. Bitumen ఉండమి 90 Percent కార్బనుంగల్గి సన్నముగ నిలచి కాలుచు, ఉదారంగు మంటలతో గొప్ప వేడినిచ్చును. దీని కాలిన వాయువులు ప్రాణాపాయకరములని పోల్చఁబడినవి. అవి గాలింగూడ పొడిగా జేయునని కనిపెట్టఁబడినది. దీనిధర ఐరోపా దేశములందు మామూలు రాక్షస బొగ్గుకన్న రెట్టింపుధర గల్గియున్నను అమ్ముడుపోవుచున్నదనియు, దీనిని రస్తాలు బాగుచేయుటయం దుపయోగించుచున్నారనియుం దెలియుచున్నది.

**అంధుఁడు** — అత్రిసంతతి, చంద్రవంశపు క్షత్రియుఁడు, తండ్రిపేరు సేతువు, కుమారుఁడు గాన్ధారుఁడు. దృహ్యునిపౌత్రుఁడును, ధానవుఁడగు విప్రచిత్తిసుతుఁడును, అంధుఁడను నామధేయములు కలవారు. బృహస్పతికి జ్యేష్ఠ సోదరుండగు ఉతథ్యునకు మమతయందు కల్గిన సుతుఁడు. ఈతనికి దీర్ఘతముఁడను నామాంతరమును గలదు. అంధుఁడు అనగా కన్నుండియు, కనుపాప పనిచేయుచున్నట్టు మనకుఁ దోచియు, అంధునకుమాత్రము కానరాకుండును.

**అంధున కద్దముచూపినట్లు** — నిరర్థకమని భావము.

**అంధేరినగరము**— ఇప్పటి యలహాబాదున కెదురుగ గంగ కవ్వలి తూర్పు తీరమున తొల్లింటి ప్రతిష్ఠానపురముండెను. అట ఆదిని చంద్రవంశపు నృపాలురు రాజధానిగ రాజ్యపాలన మొనర్చిరి. ఆదికాలము ముగిసి కాలి బూడిద యాయెను. పిదప దానికి ఝూస్సీయని పేరుగల్గెను. హిందీ భాషయందలి ఝూస్నా (తగులబడుట) ధాతువునుండి యాపేరు వాడుకయయ్యెనట. అంతటితోనాగక తిరుగ నట పట్టణముకట్టఁబడినను ఝూస్సీనామమే నిలచెనట.

ఇప్పటి రీవాసంస్థానపువారగు బేనాబన్సీ (వేనవంశపు) క్షత్రియు లాఝూస్సీనుండి వచ్చినవారేననియు నందురు. ఇంకను ఆలోప్పీడా పురియందలి జోషీ బ్రాహ్మణ

కుటుంబములవారు తామిప్పటికి ఝాన్సీనుండి వచ్చినవారేయని చెప్పుబడి [illegible]గాం బేనాబన్సి క్షత్రియులు పిదప బాఘేల్ క్షత్రియులచే జయింపబడి [illegible]లనకు లోనై యున్నారు.

ఝాన్సీ తిరుగ కట్టబడిన పిదప నట పాలించు రాజులలో కడకొక పరిపాలనా శక్తి లేనిహీనుడొకడు భూపాలుడాయెనట. ఆతని పరిపాలనయందు ఆపురి కంధేరినగర మనియు, ఆతనికి హర్బాంగురాజాయనియు పేరయ్యెనట. మహాప్రతిష్ఠనందిన ప్రతిష్ఠాన పురమిట్లుండుటకు వగచుచుండిన ప్రజలు హేళనగ "అంధేరినగరీ చౌపట్రాజా టకా శేర్భాజా" అని వాడిరట. నేటికినీ ఆసామెత వాడుచునే యున్నారు. అవ్యక్తతను అస మర్థతను దెల్పుట కిట్లనెదరు.

**అంధేలానది**— చంద్రావతీనది. అంగదేశము చూడుడు.

**అంబటి మాటి కూర** — (వనౌషధి) దీనిని అటికమామిడికూర యనియు ననుట కలదు. లా. Boerhavia Diffusa. ఆంగ్ల Spreading Hog-weed. సం. శ్వనాడికః, కుండలచ్ఛద, రక్తపుష్ప యని యందురు. ఇది ఎరుపు, తెలుపు రెండుభేదములు కలదిగ నుండును. ఇది గలిజేరుజాతులలోనిది. తెలుపురంగుకూర, వైద్యదృష్ట్యా, శ్రేష్ఠ మందురు. ఇది వైద్యోపయోగకరమగునది. ఇది కషాయము, రసము, చూర్ణములుగా జేసి చెట్టుసమూలముగగాని, వేరునుగాని ఆకునుగాని వైద్యులుపయోగింతురు. మల మూత్రముల వెడలించును. చలవజేసి క్రిమి హరణ మొనర్చును. శ్లేష్మము, దగ్గులు, వగరుపులు, ఉబ్బసము, ఉబ్బుజాడ్యము, సెగలు హరించును మోతాదు ఎక్కువ యిచ్చిన వాంతులగును. దెబ్బగలచోట, [illegible] రసమో [illegible] యమో పూయు చుండిన తీయును. కురుపులు గడ్డలు హరించును. వేరుచూర్ణము బలమిచ్చు గుణముకలది.

**అంబరీషగోత్రము** — హారిత ఉపగణము చూడుడు.

**అంబరీషపురము** (అంబర్) — అంబరీష పురరాజ్యము చూడుడు.

**అంబరీషపురరాజ్యము, దుందుమార దేశము, మరుధన్వదేశము, అంబరు దేశము** — ఆదిని మరుధన్వదేశ మొకటి యుండెను. దానిప్రశంస మహాభారతము, వనపర్వము ౨౦౧-౨౦౩ యందు గాన్పించె డిని. మరుధన్వమనుపేరు రాను రాను ఇప్పటి మార్వార్‌గా మారినదనియు, రాజ పుత్రస్థానమున కిది తొల్లింటిపేరనియు బల మగు ప్రతీతిగ నచటి వారనెదరు. తొల్లింటి కాలమున హస్తినాపురమునుండిద్వారకకేగు పెద్దరాజమార్గ మీదేశముగుండా నుండెనట. మరుధన్వదేశముంగూర్చిన ప్రశంస ఇంకనూ భవిష్యపురాణము, ప్రతి 3 యందుకూడ కలదు. ఈదేశమేలిన భూపతులంగూర్చి స్పష్టముగ దెలియకున్నను, కువలయాశ్వ మహారాజు, సుధన్వదేశమున వసించుచుండిన దుందుడను రాక్షసుని వధించెననియు, ఆకువ లయాశ్వుడు శ్రీరాముని పూర్వులలో నొకడగు నికుంభనృపతికి ముత్తాతయనియు దెలియుచున్నది. దుందుని వధించినతావు నకు దుందుమారమని (ఇప్పటిదుంద్రా) పేరు వాడుకయయ్యెనట. నానాటి కదియు రాజ

ధానియై పురమునకు ముందుమూరపురమని యు, దేశమునకు ముందుమూరదేశమనియు ప్రసిద్ధియయ్యెనట.

సుప్రసిద్ధుఁడగు **మాంధాత** మహారాజు **కుమారుఁ**డగు నంబరీషమహారా జాపరిసర ముల నొక పెద్ద రాజధానిని నిర్మించుకుని యీరాజ్య మేలుకతన నియ్యది అంబరీషపుర మనియు, రాజ్య మంబరీషపురరాజ్యమనియు పేరందెనట. అంబరీషపుర మిప్పటి జయ పూర్ (రాజపుత్రస్థానమున) సంస్థానపు ప్రాతరాజధానిగ అంబర్ అనుపేరం బరగు చున్నది. కొందరు దీనిని అమర్ అనియు ననుచున్నారు. ఇందువలన అంబరీషపుర రాజ్యము ఇప్పటి రాజపుత్రస్థానపు జయపుర రాజ్యముగ గాని, ఇంకనూ కొన్ని పరిసర ములం గల్పికొనిగాని యుండెనని తేలు చున్నది. దీని కంబరీషనగరమనియు వాడుక నామముండెనట.

ఈ రాజ్యమేలిన ప్రభువులలో మాన్సింగ్ అను మహారాజు వంగదేశములోని జస్సూర్ పురాధినాథుండగు ప్రతాపాదిత్యునితో కల హించి, యోడించి, అచట శక్తిపీఠమగు జసరేశ్వరి కాళీదేవతా విగ్రహముం గైకొని పోయి తన పురముకడ కొండపై, తొల్లింట ధుందుని వధించిన తావున ప్రతిష్ఠించెనట. ఆ విగ్రహ మప్లై నేటికిని జసరేశ్వరియను పేరం బరఁగుచు నటనెయుండి సంస్థానముచేఁ బూజింపఁబడుచున్నది.

ఈదేశమునందుఁ జర్మన్వతి యనంబడు నది కలదు. దీనికి చంబల్ అనివాడుక నామము కలదు. ఈనది రాజపుత్రస్థానమున వింధ్య పర్వతోపరిభాగమున శిఖరములమధ్య చంబేల, గంభీరయను నదులతో సహాజన్మమంది దిగువవరకుఁ బ్రవహించెడిని. మహాభారతము, ద్రోణపర్వము ౬౭ నందు రంతిదేవుని యజ్ఞ పశుచర్మమునుండి జనించుట చర్మన్వతియను పేరంబరగునదిగ చెప్పఁబడినది. మేఘసందే శము పూర్వభాగము ౪౬ శ్లోకమున మహా కవి కాళిదాసు ఈనదింగూర్చి ప్రశంసించి యున్నాఁడు. ఈదేశభాగము లోకప్పుడు సాళ్వదేశాంతర్గతముగ నుండియుండెను. సాళ్వదేశముఁ జూడుడు.

**అంబరీషమహారాజు**— షోడశమహారాజు లలో నొకఁడు మహారాజులు చూడుడు. ఈయన ఇక్ష్వాకునుండి నలుబదియవతరము వాఁడనియు, శ్రీరామునకు పూర్వము రెండు వందల సంవత్సరములనా డుండెననియు Lf Col. James Todd పరిశీలకుఁడు అభి ప్రాయపడియున్నాఁడు. మరియు, అంబరీషుని నాడొక విశ్వామిత్రుఁడుండెనని ఆయనయే తలంచెను.

**అంబరీషుఁడు**— ఈపేరుఁగలవారు సూర్య వంశస్థు లిద్దరు ప్రసిద్ధులు గలరు. మరీచి ఇక్ష్వాకు సంతతివారు. తండ్రి భగుఁడు. పితామహుఁడు నభగుఁడు. కుమాళ్లు విరూ పుఁడు,శంభుఁడు కేతుమంతుఁడుయనుముప్వురు ఈతడు విష్ణుభక్తుడు. ఏకాదశి, ద్వాదశి దినముల వ్రతనియమము కలవాఁడు. ఈ వ్రత సందర్భముననె,ఒకతరి దూర్వాసున కీతనిపైఁ గోపముకల్గి ఈతఁడు భస్మమగునటుల శపింప నుద్యుక్తుడై తన జట నొకటిం దెంపి నేల వైచెను. అంబరీషుండును శ్రీహరింబ్రార్థింప విష్ణుదేవుండు తనచక్రముంబంపె. అది జటను చూర్ణముగ నరకి దూర్వాసునివెంట దరుమ

మొదలిడెను. దూర్వాసుండును విసికి వేసరి మొట్టకేల కంబరీషునికడకుం జని మొర వెట్ట నాతండు కరుణించి చక్రమును స్తుతించి దూర్వాసునికి రక్షణ కల్గించెను. మరియొక అంబరీషుండు ఇక్ష్వాకు సుతుండగు కుక్షి సంతతిలోనివాడు. తండ్రి మాన్ధాత. పితామహుండు యువనాశ్వుడు. సోదరులు సుసంధి, ధృవసంధి, ప్రసేనచిత్తుడు. కుమారుడు యూవనాశ్వుడు. అంబరీషపుర రాజ్యము చూడుడు.

**అంబరు** — (కారుబా). ఆంగ్ల Amber దీనిని కారుబా యనియునందురు. అంబరు పెక్కు సముద్రతీరములందు దొరకెడిని. ముఖ్యముగ బాల్టిక్కు సముద్రతీరమునను, ఇంగ్లాండుదేశపు తూర్పుతీరమునను, సిసిలీ ద్వీపసీమలందుననూ దొరకుచున్నది. ఇది సర్వసాధారణముగ స్వచ్ఛమై పసుపుపచ్చ రంగుననుండును. సిసిలీ అంబరు ఆకుపచ్చ, ఊదాధాతువుల వెలుంగుచు ఎఱ్ఱరంగు గల్గియుండెడిని.

ఐరోపాదేశములందుండు ఫిర్ చెట్టు మొదలగు కొన్నిచెట్లనుండి వెలువడిన బంక లేక సారమనియు, ఆచెట్లు కొన్నిలక్షలసంఖ్య సంవత్సరముల క్రితము జీవించియుండనోపునని పరిశీలకులు తలంచుచున్నారు. అంబరు గట్టిబడియు స్వచ్ఛతం గల్గియుంట, స్పష్టముగ గాకున్న దానిగుండా అవ్వలి పదార్థము చూడదగియెయుండును. దొరకిన అంబరు నందు ఏదో జంతువుయొక్క ఒక చిన్న శరీరపు ముక్కయో, ఒకచెట్టుకుంజెందిన ఒక చిన్నముక్కయో లోననిరుకొని యుండుట అప్పటప్పట గాననగుచుండుంగాన తొల్లి యొకప్పు డీఅంబరు మెత్తనిపదార్థముగనుండి యుండవలెనని గ్రహింపగల్గుచున్నాము.

ప్రాంగూర్చి కుపండితులు తొల్లింట చక్కని పరిశీలనల నొనర్చిరి. అందు Aristotle పండితుని శిష్యుండగు Theophrastus అను విద్వాంసుడు. ఆతడు అంబరును దగ్గరి యందాకర్షణశక్తి కలదని గ్రహించి తెల్పియున్నాడు. దానినే Pliny పండితుండునూ పోల్చి తెలిపెను. ఆశక్తియె పిదప Electricity అని తేలినది. విద్యుచ్ఛక్తిని తనయందు శక్తిగల పదార్థముగ మొదట నెరుంగబడినది అంబరనియె చెప్పంబడెను. గ్రీకుభాషయందు అంబరునకు Clektron అనిపేరు. దానినుండియె ఎలెక్ట్రిసిటీ అని పేరేర్పడియెను.

అంబరుపూసలు కంఠహారములుగ నొనర్తురు. ఇతర ఆభరణములుగను రచింతురు. గాన అంబరునకు విలువకలదు. ఆయుర్వేద వైద్యు లుపయోగింతురని తెలిసెడిని. దీని వలన అపస్మారరోగము నివృత్తియగునందురు. లాటిన్భాషయందు Ambar అనియు, ఫ్రెంచిభాషయందు Ambre అనియు, అరబ్బీ భాషయందు అంబార్ అనియు దీనికిపేరు.

**అంబరుగ్రిస్** - ఇది ప్రసిద్ధ పరిమళ పదార్థము. తిమింగలము గర్భమునందొక తిత్తియందుండు పదార్థము. ఇది దాని పైత్య పదార్థమని కొందరు తలంచుచున్నారు. ఫ్రెంచిభాషయందు Amber gris అనగా ఆంగ్లమున Grey ambér అని యర్థము. సంస్కృతమున జలమార్జారకవీర్యమ్ అనిపేరు. నలుపు తెలుపురంగులు కలిసి సీసమునుబోలిన రంగుగ నుండును. దీనిగుండా ఎఱ్ఱమార్బిల్ రాతిరంగుగల మార్గములుండును. ఇది సముద్రముపై దేలుచుగాని, దరికిజేరిగాని కొన్ని తీరముల దొరకును. వేడిదేశముల సముద్ర

తీరముల లభించుచుండును. ఇది ఒకకొన్నిన కెన్నోపౌనుల ధరకమ్ముచుండినదట. బహామా ద్వీపమునందెక్కువ లభించుచుండును. ఒకప్పుడొక తిమింగిలమునుండి ఐదువందల పౌనుల అంబరెగ్రిస్ దొరకినదట. అంబరుగ్రిస్ ముఖ్యముగ పరిమళద్రవ్యముగ గొప్ప విలువంగల్గియున్నది. ఆయుర్వేదవైద్యులు దీనియందు గొప్ప వీర్యవృద్ధింగల్గించి, బలము తేజములనొసంగి ఆరోగ్యమును మొలకలెత్తునట్లు శరీరమున వ్యాపింపజేయు గుణము గలదందురు.

**అంబరుదేశము** అంబరీషపురరాజ్యము చూడుడు.

**అంబలత్తికావనప్రదేశము** — మగధరాజ్యము చూడుడు. ఇచట ఇప్పటి గ్రామమునకు ఖాన్మత యనిపేరు. ఇందే వసించుచుండువాఁడగు గోశాల మఖాలీపుత్త్రస్వామి అజీవక బౌద్ధమత శాఖానిర్మాత.

**అంబలత్తికావనము** — మగధదేశములోని ఒక వనము (చూడుడు).

**అంబలిగ్రామము** — ఇప్పుడు అరెయిల్ అను పేరంబరగుచు యమునానది కవ్వలితీరమున ఇప్పటి అలహాబాదున కెదురుగ (ఆగ్రా అయోధ్య సంయుక్తరాష్ట్రములందు) ఉన్న పల్లెటూరు. దీనింగూర్చిన ప్రశంసలు చైత్యచరితామృతము రెండవభాగమునను Journal of Buddhist Text Society ౫ వ సంపుటము ౬౫ పుటయందునను కలవు.

**అంబలిద్రావువాని మీసము లెత్తిపట్టుకొనువారొకరా?** — దరిద్రునకతిశయముండిన హేళనగా తెల్పు సామెత.

**అంబల్లాజిల్లా** — అంబల్లా నగరము ప్రధానస్థానము. (పంజాబుదేశము చూడుడు).

**అంబష్టదేశము** - మెక్‌క్రిండిల్ అను గ్రంథకర్త ఈదేశము సింధునది కుత్తరముగ నుండెననియు, అలెగ్జాండరుకాలమున నీరాజ్యముండెననియు McCrindle's Invasion of India by Alexander the Great (P. 155)అనుగ్రంథమున వివరించియున్నాఁడు.

**అంబసండ** — ఇది ఇప్పటి గిరియాక్ గ్రామముండిన తావున నుండినదిగ తలంపఁబడుచున్నది. ఇటనే ఇంద్రబిలమను గుహాకలదని చెప్పఁబడినది. గిరివ్రజపురము (ఇప్పటి గిరియాక్) చూడుడు.

**అంబాత్రయము** — ౧ జ్ఞానప్రసూనాంబ- చిత్తూరు మండలములోని శ్రీకాళహస్తియందు, ౨ భ్రమరాంబ - కర్నూలు మండలములోని శ్రీశైలమున, 3 మూకాంబ - బొంబై రాజధాని ముండేశ్వర శివక్షేత్రమునఁగల మూకాంబాభగవతీదేవి. ఈమెనే మళయాళభగవతి యనెదరు.

**అంబాలిక** - అంబిక, అంబాలికలు చూడుఁడు.

**అంబాళపుచెట్టు** — (వనౌషధి) లా. Spondias Mangifera. ఆంగ్ల. Hog Plum లేక Wild Mango. సం. ఆమ్రాతక, కపిప్రియ, తనుక్షీర. కొందరు నలమామిడికాయయనియు నందురు. శేపి. పులుపు, వగరు రుచులంగల్గి చలవ, జఠరదీప్తి, వీర్యవృద్ధి, కఫము, గురుత్వములంగల్గించును. రుచికరము, వాతపైత్యముం జేయును. కండ్లఎరుపుల నివారించును.

దీనికి విరుగుడు శొంఠిపొడుముగల్పిన పాచి నీళ్లు. అంబాళపుచిగురు పులుపుగ రుచి కరము. ధాతుపుష్టికరము.

**అంబ్రానీడ** ఆష్టిక్కు కుఁడు. నీడ చూడుఁడు.

**అంబిక–అంబాలికలు** — కాశీరాజుగారి కుమార్తెలు. అంబ చెల్లెండ్రు, విచిత్రవీర్యుని భార్యలు. విచిత్రవీర్యుని మరణానంతరము తల్లియగు సత్యవతియాజ్ఞ మేరకు వ్యాస మహర్షి వలన ధృతరాష్ట్ర పాండురాజులను జ్యేష్ఠురాలగు నంబిక గనియెను.

**అంబుధారాదేవి** — తొమ్మిదవ దక్షసావర్ణి మన్వంతరమున నీమెగర్భమున విష్ణుదేవుండు ఋషభనామకుండైజన్మించి యవతరించునని చెప్పంబడినది.

**అంబుని మజ్జన్త్యలాబూని గ్రావాణః ప్లవన్తీతిన్యాయము** — నీటియందానపకాయతుంబ మున్గుననియు, శిలలు తేలుననియు ననుటయందు, నమ్మదగని యనృతము వల్కుటయని భావము.

**అంశుపంచకము** — శ్లో॥ అస్తి భాతి ప్రియం యాన్తి। నామచేత్యంశుపఞ్చకమ్ ఆద్యత్రయం బ్రహ్మరూపం। మాయారూపం

**అంశుమంతుఁడు** — ఇక్ష్వాకువంశస్థుఁడగు భూపతి. అసమంజసునిపుత్త్రుఁడు. దిలీప మహారాజుతండ్రి. రఘుమహారాజు పితామహుఁడు. అంశుమంతునకు పితామహుఁడు సగరుఁడనియు, కుమారుఁడు భగీరథుండనియు వేరొకతావున చెప్పఁబడినది.

**అకంపనుఁడు** — సుమాలియను రాక్షసుని పుత్త్రుఁడు. జనస్థానమున ఖరుఁడు, దూషణుఁడు, త్రిశిరస్కుఁడు (రక్కసులు) శ్రీరామునిచే నిహతులగుకతన నావృత్తాంతమును రావణభూపతికిం జెప్పినవాఁడు. సింహళద్వీపమందలి లంకాపట్టణమర్గము పశ్చిమద్వారమున నాంజనేయునిచే నిహతుఁడైనవాఁడు.

**అకంపన్య గోత్రము** — పరాశరగణము చూడుఁడు.

**అకటవికటపురాజున కనివేకిప్రధాని, చాదస్తపుఁబరివారము** — ఇది ఆంధ్రలోకోక్తి. ఎట్టివారి కట్టిసజ్జు కుదురుటను హేళనగా తెలుపు సామెత.

**అకడమచక్రము** రుద్రయామిళమునందుఁ జెప్పంబడినరీతిని గోపాలమంత్రముయొక్క శుభాశుభవిచారోపయోగమునకుఁగాఁ బ్రస్తరింపంబడిన చక్రము. ఇందు రెండు రేఖలు పూర్వాపరమధ్యలకుగా లిఖించి, చతుష్కోణములందు నాల్గురేఖలు గీచిన, నది 'అకడమమండల' మనియు, చక్రమనియుఁ బరగునని చెప్పఁబడినది. దీనిఁజుట్టి వృత్తము గీచి యందు అకారాది క్షకారాంతము, వర్ణములను లిఖించి, వామావర్తముచే మేషాది వృషాంతముగను, దక్షిణమార్గముగను బరిశీలింతురు.

**అకథహాచక్రము** — (వా) 'అకథహాచక్రము' లేక 'అకథహామండలము'. ఇంకను దీనిని సిద్ధాదిచక్రమని రుద్రయామిళమున వివరింపంబడినది. ఇది సర్వమంత్రముల శుభాశుభ ఫలవిచారోపయోగమునకుఁ బరిశీలింపఁబడునది. (అకడమచక్రముచూడుఁడు.)

**అకరదేశము** — అవంతిదేశముం జూడుఁడు.

**అకరవేనావంతిదేశము** — అవంతిదేశము జూడుఁడు.

**అకర్దమము** — తమసానదీతీరమందలి యొక తీర్థము. ఇచట నొక వాల్మీకాశ్రమ ముండెడిది.

**అకాలీలు** — (అకాలీ తెగ, శీక్కు-ఖాల్సా శాఖ) శీక్కుమతగురువులలో కడపటివాఁడగు గోవిందశింగుగురుఁడు వీరినేర్పర్చెను. వీరు ఖాల్సా తెగలలో నొక తెగవారు. దేవుఁడు కాలములేని అకాలియగుట వారిభక్తులగు వీరి కీపేరుకల్గెనట. అతిసాహసులగుట నిహంగులని పేరుందిరట. మద్యమాంసములం దినని వారు. స్వతంత్రస్వేచ్ఛలంగోరు నైజము కలవారు. బ్రిటీషుసైన్యములందు వీరి పటాలములు కలవట. "సత్ శ్రీ అకాల్" అనుచు వందనమాచరించుకొనువారు.

**అకాలే కృతమకృతం స్యాదితి న్యాయము**—ఏపనినైనను అర్హకాలమునందే చేయవలసియుండును. అట్లర్హ కాలమునఁ జేయఁబడనిపని, చేయఁ బడనిపనివలె నొకతరి నిరర్థకమైనం గావచ్చునని భావము. అకాలములోఁ జేసినపని, అసలేచేయని పని వంటిదని ఆంధ్ర లోకో క్తికలదు.

**అక్కన్న బయ్యన్నలు** — వీరిం గూర్చిన ఇతర సంగతులు సరిగా తెలియకున్నవి. క్రీస్తువెనుక పదమూఁడవ శతాబ్దకాలమునందలివారని పరిశీలకులనెదరు. వీరు మనుమసిద్ధిభూపాలునకు దాయాదులనియు, గొప్ప బలముంగూర్చుకొని మనుమసిద్ధినోడించి పదభ్రష్టునిం జేయగల్గిరనియు, నాతని మంత్రియగు తిక్కన (తర్వాత సోమయాజి) ఓరుగంటిప్రభుండగు గణపతిదేవుని సైన్యసాహాయ్యమున, తిరుగ అక్కన్నబయ్యన్నల నోడించి రాజ్యము స్వాధీనముచేసెననియుం జెప్పుదురు.

**అక్కన్న మాదన్నలు** — వీరిద్వరకుంగల బంధుత్వమేమో సరిగా తెలియరాకున్నది. అక్కన్న యన్నగను, మాదన్న తమ్ముఁడుగను వాడుకొనుచుండిరట. ఇంటిపేరు పింగళి వారు. భారద్వాజసగోత్రులు. కాన గౌతమసగోత్రజుఁడు పింగళిసూరనార్యుని పింగళి, ఇది కానేరదు. ఋగ్వేదులును గోల్కొండ వ్యాపారులు నగు పింగళివారి గోత్రజులే నైజాముౡరాజ్యమునఁగలరు. వారికీవీరికీ గల సంబంధమేమో పరిశీలనమందఁ దగినది. వీరి మేనల్లుఁడు గోపరాజు గోపన్న (రామదాసు) యనునాతఁడు. భద్రాచల శ్రీరామదేవాలయ కట్టడముల నిర్మించినగాథలఁ జెప్పుదురుగాని నిదర్శనములు లేవు. అది నిజమే యగుచో నార్వేలనియోగులుగ నుండి యుండవలెను. ఇదినిర్ధారణ చేయఁబడవలెను. గోలకొండలో రాజ్యముచేసిన అబూహాసన్కుతుబ్షాహా (తానీషాయని ప్రతీతి) నామముగలసుల్తానుకడ, (క్రీ. వె. ౧౬౭౪-౧౬౮౭) మాదన్న ముఖ్యమంత్రిగను, అక్కన్న సేనాధిపతియగు ద్వితీయమంత్రిగను, ఉండిరని చెప్పంబడినది. Letters to Fort St. George Vol. II, Pages 105-109 లందు, తానీషా తన సేనానియగు మహమ్మదిబ్రహామును తొలఁగించి, సైన్యముల నీతనికి వశపర్చెనని కలదు. పిదప నీతఁడెట్లు ప్రధానమంత్రియయ్యెనో, సైన్యాధిపతిగ నెట్లక్కన్న యయ్యెనో సరిగా తెలియదు.

మహారాష్ట్ర చక్రవర్తియగు శివాజీ కుటుంబమునకు తానీషాకుటుంబమునకు స్నేహమును, మొంగలు చక్రవర్తియగు ఔరంగజేబుతో నిర్వురకు వైరమును గల్గి

యుంటయు, అప్పటి ఈస్టిండియా కంపెనీవా కౌరంగజేబుతో వైరమును గల్గియుంట, బ్రిటిషువారితోను శివాజీ మహారాజుతోను తానీషాగారికి మైత్రిని అక్కన్నమాదన్నలు నడుపుచుండిరి. కాన వీరిర్వురు వీరందరి గౌరవమునకుఁ బాత్రులైయుండిరి. మాదన్న గారి కుమారుఁడగు మల్లప్పగారి వివాహ సందర్భమున నీస్టిండియా కంపెనీవారు వీరికిఁ బంగారు గొలుసులను బహుమానకట్నముగ నంపిరట. మాదన్నగారు కడుధర్మాత్ము లనియు, నిరతాన్నదానవ్రతులనియు పేరం దినవారు. అనేక యన్నసత్రములను గట్టి నవారు.

**అక్కమహాదేవి** — ఈమె గొప్ప శివభక్తు రాలు. వీరశైవ లింగాయత మతస్థాపకుం డగు బసవేశ్వరమంత్రి కనేకవిధముల తోడ్ప డిన మతోద్ధరణ శీల. కర్ణాటదేశస్థులగు లింగ బలిజపుత్రిక, బాల్యమునుండి శివభక్తిగల్గిన పుణ్యశీల, వివాహమాడక, భక్తురాలుగఁ దనకాలముం గడపిన యోగిని, అల్లమప్రభుం డీమె గురుఁడందురు. పార్వతీదేవి యంశంబున జన్మించిన నీమహాదేవి శివభక్తురాలని జను లనుచుండిరట. అనేకు లీమెపేరిప్పటికిని తమ బాలికల కిడుచుందురు.

**అక్కలకర్ర** (చెట్టు) — (వనౌషధి) లా. Anthemis Pyrethrum. సం. అకల్లః- సర్వసాధారణముగ నీచెట్టు వేరు నుపయోగిం చుచు వైద్యులా వేరునే అక్కలకర్ర యని వాడుచున్నారు. ఇది పలువిధములగు నౌష ధముల కుపయోగించునది. వేడిచేయును. నోటనిడిన చిమచిమ (లేక జిలజిల) లాడును.

ఇది హరించురోగములు—అరుచి, త్రిదో షములు, శీతపైత్యము, ఉబ్బు, దగ్గు, పాండు రోగము, వగరుపుతోఁగూడిన దగ్గు, విదా హము, పక్షవాతము, తలనొప్పి, ఏకపార్శ్వ పునొప్పి, మూర్ఛజబ్బు, కలరా, మేహవాత పునొప్పులు, అజీర్తి, గర్భవాతము, పంటి నొప్పి, శిరోవాతము, నేత్రవాతరోగములు.

ఇది చేయుగుణములు—నరములకు బలము గల్గించును. దీపనము గల్గించును (Stimu- lent). మలమూత్రముల వెడలఁజేయును. ఋతురక్తమును స్త్రీలకుఁ జక్కగ వెడలిం చును. దీనిగంధము కురుపులను మాన జేయును. ఏకపార్శ్వపు నొప్పిమాన్పును. పండ్లనొప్పిని హరించును. దీనికషాయము జ్వరములపై బాగుగఁ బనిచేయును.

**అక్కల్ప్టేషను** (Occultation) — దీనికి గుప్తగ్రహణమనియు, నక్షత్రగ్రహణమని యుం బేర్లుకలవు. నక్షత్రములకును భూమికిని నడుమ చంద్రుఁడు వచ్చినకతన, ఆనక్షత్రము భూమిపైవారి కగపడక చంద్రునిఛాయలో మరుగుపడవలసివచ్చును. దీని నెరుంగుటకు గ్రహణములంగూర్చి గుణింపవలెను. ఎస్ట్రో నొమీ చూడుఁడు. గుప్తగ్రహణములు, గ్రహణములు చూడుఁడు.

**అక్కెనపల్లి నృసింహకవి** — ఆంధ్రకవు లలో నాధునికులందుఁ బరిగణింపఁబడినవాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. తండ్రిపేరు భోగయ్య. గుంటూరుమండల నివాసియట. కాపురము యెల్లమందగ్రామ మని చెప్పఁబడినది.

ఈతఁడు ౧. ఓఘవతీపరిణయ మను ప్రబంధమును శ్రీ గోడే సూర్యప్రకాశ రాయణింగారికిం గృతియిచ్చెను. ఇది మహా రాజ గోడే నారాయణగజపతిరాయణింగారి వల్ల ప్రకటింపఁబడినది. ౨. ఆదిలక్ష్మీవిలాస

మను ప్రబంధమును అంతర్వేది నృసింహ స్వామికిం గృతిసమర్పించెను. 3 వల్లభాంబా పరిణయము. ఇది ప్రబంధము. విఘ్నేశ్వరుని పెండ్లికథ. దీనిం బులిపాక రామమంత్రికిం గృతియిచ్చెను.

**అక్రూరుఁడు** — అత్రి, చంద్ర, యాదవ క్షత్రియుఁడు. తండ్రి శ్వఫల్కుఁడు. తల్లికాందిని. పదునొకండుగురు సోదరులు కలరని చెప్పఁబడినది; కాని వారిపేర్లు తెలియవు. కుమార్తె సుభారువు. అక్రూరుఁడు శ్వఫల్కుని పెద్ద కొడుకనియు, సాత్యకియు నీతండును తాతా సహోదరులనియుం దెలియుచున్నది. ఈతఁడు ద్వారకకు రాజు. సత్రాజిత్తు తన కుమార్తె యగు సత్యభామను శతధన్వాక్రూరకృతవర్మ లలో నొకనికిచ్చి వివాహమొనర్తునని చెప్పి నందున, సత్యభామయందలి భ్రాంతిచే నీ మువ్వురును సత్రాజిత్తునకులొంగి మెలంగు చుండిరి. కాని వీరిలో వీరికంతఃకలహములు లేకపోలేదు. మఱికొంతకాలమునకు శమంతక మణిగాథ జరుగుటవలన నాసత్యభామ శతధన్వాక్రూరకృతవర్మలలో నేరికింగాక, యప్పటివరకు నూహింపఁబడని, శ్రీకృష్ణున కొసంగబడినది. (శమంతకమణి చూడుఁడు.) తా మాసించిన సత్యభామ శ్రీకృష్ణునకుఁ దక్కెగదాయని, ఈశతధన్వాక్రూరకృతవర్మలు శ్రీకృష్ణునిపైఁ బగఁబూనియె యుండిరి.

అక్రూరకృతవర్మల దుర్బోధనమున శతధన్వుఁడు సత్యభామతండ్రియగు సత్రాజిత్తుం బరిమార్చి, ఆతనికడనున్న శమంతకమణి సంగ్రహించి, దేశాంతరము పోఁబోవుచుఁ గొంతజంకి, అక్రూరుకడ నామణిదాపనుంచి, మిథిలంగూర్చి పోవుచుండెను. సత్యభామ వలన నీయుదంతంబంతయు నెరింగిన శ్రీకృష్ణుఁడు సత్యభామకు దుఃఖోపశమనము సేయ నెంచెను. మిథిలాపురాభిముఖుండై పోవుచుండిన శతధన్వునిజంపి, వానియొద్ద వెదకియు శమంతకమణిగానక నిర్విణ్ణతయుఁ గ్రోధోద్రేకమును జెంది, మరలి ద్వారకకరుదెంచుచుండ, అప్పటి శ్రీకృష్ణునిభీకరాకారమును జూచి, భయచకితుఁడై యక్రూరుఁడు తనకడ నున్న శమంతకమణిని సవిధేయుఁడై శ్రీకృష్ణునకుసమర్పించి, యాతనిపాదమూలములం బడియెను. తుదకు శ్రీకృష్ణభక్తుఁడై, సాత్విక శిఖామణియై, యలరారెను.

ఇట్లీ శత్రుత్రయమున నొకఁడు (శతధన్వుఁడు) శ్రీకృష్ణునిచే హతుండగుటయు, నింకొకఁడు (అక్రూరుఁడు) శ్రీకృష్ణుని భక్తుం డగుటయు జరిగెను; కాని, ఇంకను మిగిలిన గృతవర్మమాత్రము కడవరకును శ్రీకృష్ణునెడ పగఁబూనియుండి, కురుపాండవ సంగరమున శ్రీకృష్ణుఁడు పాండవపక్షమూనెగదా యని, తాను దుర్యోధనుదెసం జేరి, పాండవులతోఁబోరి తుదకు హతుండయ్యెను. భక్తునిగామారిన అక్రూరుఁడు తరచుగ శ్రీకృష్ణుని జేరి భగవద్విషయాదిక ప్రసంగములు నెరపుచుండిన కాలమున, నొకనాడక్రూరుని శ్రీకృష్ణుఁడు, రాయబారిగ నుపయోగించుకొనెను. కౌరవులచే పాండవులిడుములంబడుచుండినకాలాన, తనకన్న కొడుకులను జూచుచున్నట్లే, తన తమ్ముండగు పాండునందనులంగూడ గూర్మి మెయింజూడుమని ధృతరాష్ట్రునికడ నివేదింపుమని యాయక్రూరుని రాయబారిగ శ్రీకృష్ణుఁడంపెను. అట్లగుట నీయక్రూరుఁడే భారతయుద్ధకారణములేర్పడునాటి మొదటి రాయబారి.

**అక్రోటు** (చెట్టు) — (వనౌషధి). లా Aleurites Moluccana & Juglana Regia. ఆంగ్ల. Walnut. సం. అక్షోట. మరియు అక్షోడః, అక్షోడకః అనియు నందురు. ఈ చెట్టుకాయలోని పప్పునకు అక్రోటుపప్పని వాడుదురు. వేడిచేయును. శరీరమందలి నీరార్చును, బలముకల్గించును, కొంచము పైత్యముచేయును, నులిపురుగులంజంపి, విరేచనమొనర్చును, వీర్యవృద్ధిఁగల్గించును, గర్భవాతముల హరించును, జీర్ణశక్తిని బలపరచును, వాతములను హరించును, ఆయుర్వృద్ధిఁగల్గించును, రుచియైనయాహారపదార్థము. ఇదిచేయు దుర్గుణము పైత్యము. దానికి విరుగుడు పంచదార, జీలకర్ర, పుల్లదాడిమ పండు, నిమ్మకాయాదుల రసము.

**అక్రోధనుఁడు** — కురువంశస్థుఁడు. అయుతాయువునకుఁ గుమారుఁడు.

**అక్రోలిథోలజీ** (Acrolithology) — పైకింగనపడు ముఖము, చేతులు మొదలగు భాగములు చలువరాతితోగాని, దంతము మొదలగు విలువగల పదార్థములతోజేసి, తక్కిన పైకింగనిపింపని శరీరభాగములన్నియు కర్రతోరచించుచు విగ్రహాకారములనొనర్చు శాస్త్రము. తొలింటికాలమున గ్రీసుదేశమున నీ విద్య వ్యాపించియుండెను.

**అక్విడక్టు** (Acquiduct) — Irrigation (పంటకాల్వల) Engineering నందుఁ జెప్పఁబడిన యొక నిర్మాణమునకు పేరు. (ఇర్రిగేషన్ చూడుఁడు).

నైసర్గికప్రవాహములగు నదుల(Drainage) కు మీద నడ్డముగా నొక (కృత్రక ప్రవాహమగు) కాలువ దాటింపవలసినప్పుడు నదీనీటిమట్టము పల్లమునను, కాలువనీటిమట్టమెత్తుగనుండెనేని నదీప్రవాహమునకడ్డముగా నొకవంతెనను కాలువనీటిమట్టమున కనుకూలించునటులనిర్మించి, యావంతెనపై బాటను నడపునటుల కాలువనునిర్మించి యవ్వలికి దాటింతురు. అట్టికట్టడమునకు అక్విడక్టు అనిపేరు. ఇట్టిది గోదావరీమండలమున గన్నవరముకడ నున్నది సుప్రసిద్ధోదాహరణము. (స్యూపర్ పాసేజి సైఫన్ చూడుఁడు.)

ఈసందర్భమున Drainage యన నైసర్గికముగ (తమంతటతామెయై) మెరకయందలి నీటిని పల్లమునకుఁగాని సముద్రమునకుఁగాని వేరొకనదికిఁగాని ఒకసరస్సునకుఁగాని చేర్చునట్టి నదులు, కొండజక్కెరలు, వాగులు మొదలగు జలప్రవాహములని యెరుంగునది. ఇంకఁ గాల్వలు, కృతకములు. వానియందలి జలములు ఒక ఉపయోగమునకుంగాను గొంపోవంబడునవి యనియు నెరుంగునది.

ఇట్టికొండజక్కెరలు వాగులు మొదలగు చిన్నచిన్న Drainage ప్రవాహములపై కాల్వను దాటింపవలసిన తావులందు చిన్న అక్విడెక్టును నిర్మించి దాటింతురు. ఇట్టితరి అడుగుననున్న Drainage ప్రవాహము చిన్న కల్వర్టుమూలమునఁ గ్రిందినుండి ప్రవహించును. ఇట్టితావులందు పై అక్విడక్టు ఇనుపదోనె (Trough) గా నుండిన నుండనగును.

**అక్సానోమీటర్** (Auxanometer) — చెట్లు చేమలు పెరుగుట మొదలగువానిం దెల్పు (సయన్టిఫిక్) యంత్రము.

**అఖండద్వాదశి** — మార్గశిర శుద్ధద్వాదశి. దీనిని మత్స్యద్వాదశి యనియు నందురు. (పండుగలు చూడుఁడు).

**అఖండపురము** — దీనినిప్పుడు దిల్దార్ నగర్ అనుచున్నారు. బీహారురాష్ట్రమున నున్నది.

**అఖ్విన్నపిటక న్యాయము** — ఎలుక త్రోయఁగలదుగాని తిరుగ యెత్తగల్గునా ? (ఎత్తలేదని భావము). పాడుపనులు చేయువారు బాగుచేయఁజాలరనియు భావము.

**అఖాతము** — బే (Bay). వియుక్తాగ్రగుడము లేక అఖాతము సీ పోర్షన్సు (Sea Portions) చూడుఁడు.

**అగడ్తలోఁబుట్టిన పిల్లికదియ్యె వైకుంఠము** — అజ్ఞానమును సూచించుసామెత. జన్మభూమి రుచికరమని సూచించునది.

**అగతికగతిన్యాయము** — తనకు గతిలేక, అనర్హుల నాశ్రయించుట యని భావము. 'గతిలేనివాఁడు గాడిదకాళ్లు పట్టుకొన్నట్టు' అని తెలుగున సామెతకలదు.

**అగముడియన్** — అరవదేశస్థులు. తంజావూరు, తిరుచునాపల్లి, మధుర, తిరునల్వేలి జిల్లాలందెక్కువగా గాన్పింతురు. రామనాథపురంజిల్లా యందునను కలరు. వీరు అగముడియనులు, మరవరులు, కళ్లరులు అని మూఁడు భేదములుగ నున్నను, అందరు ఒకటిగనే యున్నారు.

వీరి పూర్వోత్తరములందెలుపు గ్రంథములు దొరకలేదు. ఐనను వీరియందు వాడుకగా ననుశ్రుతపరంపరలచే చెప్పుకొనుచున్న కథనము నిటపొందుపరచితిమి. అహల్యను మోహించి గౌతముఁడునింద్రుఁడునుతగవులాడి వేయివత్సరములు నీటమున్గియుండ పందెములువైచుకొని గౌతముఁడు గెలువ, ఇంద్రుఁడామెనుమోసగించి యామెయందు ముగ్గురుసుతులంగాంచెనట. అందు జ్యేష్ఠుం డగముడియ నను వాఁడు. రెండవయాతఁడు మరువర్ పరాక్రమశాలియగు శూరుఁడు. మూఁడవ వాఁడగు కళ్లన్ బలాఢ్యుఁడు శాంతుఁడు. అగం (అహమ్) పెద్దవాని పేరులోనిది. వీరు ముగ్గురు మూఁడుకులములకు మూలపురుషులగుటయేగాక రానురాను వీరియందు కొన్ని అంతశ్శాఖలేర్పడినవని విందుము. వీరు తరుచుగ శివభక్తులు, శాక్తేయులై యుందురు

**అగరు చెట్టు** — లాటిన్ Aquilaria Agallocha. ఆంగ్ల. Eaglewood Tree సం. రాజార్హా, క్రిమిజ, అగరు. అగరు సుగంధముగ నుండునది. చెమ్మట దుర్గంధములఁ బాపును. ఆరోగ్యకరము. గుణములు:— వేడిచేయును. నరములకు బలమిచ్చును దోషములుహరించును. వాతశ్లేష్మములు, కర్ణరోగములు, నేత్రరోగములు, వ్రణములు, సర్పి, కుష్ఠు సంబంధవ్యాధులు, ఆమవాతము (Gout), మేహవాతములు, అతివిరేచనములు, వాంతులు, తలదిమ్ము, పక్షవాతము, తినినది జీర్ణముకాక విరేచనముతో జెడిపోయెడు జబ్బులను హరించును. అగరుతైలము రక్తపైత్యము, శ్లేష్మము, శిరోవాతము, క్రిమిరోగములు, పొడలు వీటినడంచును. శరీరమున దుర్గంధముగల్గెడి వ్యాధినిమాన్పును. అగరు శొంఠి, ఈఅగరున కేసంబంధముగలదికాదు. (పాటచెట్టు చూడుఁడు).

**అగర్తరాదేవి క్షేత్రము** — దేవీపురాణ ప్రసిద్ధమగు నీమహాదేవిక్షేత్రము తిరుహూత్ జిల్లా బాంగాన్ గ్రామమునందున్నది. ఇది మాంఘీరునుండి స్టీమరుపై నేగినచో, గోగ్రీ స్టీమరు స్టేషనునుండి నాటున ౧౫ మైళ్లదూరముననున్నది.

**అగవగోత్రము** — అగస్త్య ఉపగణము చూడుఁడు.

**అగస్త్యగోత్రము** — అగస్త్య ఉపగణము చూడుఁడు.

**అగస్త్య ఉత్తరగణము** — ఇది అగస్త్య సంతతిలోని యొకగణము. ఇందు సంకృతి, శౌంగశైశిరి, లౌగాక్షి అను మూఁడు ఉపగణములు కలవు. ఇందలి గోత్రములు ద్విగోత్రములనఁబడును.

**అగస్త్య ఉపగణము** — (అగస్త్యసంతతి) దీనిని కేవలాగస్త్యోపగణమనియు నందురు. ఇది అగస్త్యప్రాగ్గణమునందలి ఉపగణము. ఇందు ౬౮ గోత్రములు చెప్పఁబడినవి.

బోధాయనసూత్రోక్త గోత్రములు(౧౮)- ౧ అగస్త్య, ౨ ఔపదహాని, ౩ కుల్మాష, ౪ ఖలాయని, ౫ దండి, ౬ పాథోద్గత, ౭ బుధోదరి, ౮ మాంజికి, ౯ మాసలి, ౧౦ రౌహి, ౧౧ లావణి, ౧౨ లావ్య, ౧౩ వరండి, ౧౪ వైరండి, ౧౫ విశాలాద్య, ౧౬ శాల్యాతప, ౧౭ శైవపథి, ౧౮ హారిగ్రీవి.

కాత్యాయనసూత్రోక్తగోత్రములు(౧౫)- ౧ అగవ, ౨ అర్బుద, ౩ అవతాన, ౪ ఉపకుల, ౫ దేవత, ౬ గోవ్యాధి, ౭ నిర్వేరిణి, ౮ మేదినీపంచక, ౯ వారిణి, ౧౦ విత్తప, ౧౧ శైరిష, ౧౨ సుకలాపకారి, ౧౩ సౌరభాగ, ౧౪ హైమవాహ, ౧౫ క్షౌమితి.

ఇతర గ్రంథోక్త గోత్రములు (౩౫):- ౧ ఇధ్మవాహ, ౨ కుడ్యాక్షి, ౩ గార్గ్యాయణ, ౪ తండి, ౫ తన్నర, ౬ దామోదక, ౭ దామోష్టిష, ౮ దార్ఢ్యచ్యుత, ౯ పటల, ౧౦ పండోద్భవత, ౧౧ పాండ, ౧౨ పాదురాక్షి, ౧౩ పుత్రి, ౧౪ ప్రాచార్య, ౧౫ బ్రహ్మణ్య, ౧౬ మాంజి, ౧౭ రమ్యాక్షి, ౧౮ రోవాయుధ, ౧౯ లాధ్యామతి, ౨౦ వచస, ౨౧ వాసిష్ఠాయన, ౨౨ వాహ్యాక్షి, ౨౩ వాహ్యాయన, ౨౪ వ్యాహాయన, ౨౫ వైకర్ణాయన, ౨౬ శారజ్గర, ౨౭ శాలంకాయని, ౨౮ సాకాక్షి, ౨౯ సైవక, ౩౦ సౌభరాయణ, ౩౧ సౌమ్యాయని, ౩౨ హ్యాద్రోగ, ౩౩ హేమరత్న, ౩౪ వైరండి, ౩౫ వైహార్యరథి.

ఈ కేవలాగస్త్య ఉపగణమునందలి (౬౮) గోత్రములకు ప్రవరరూపములు రెండు — ౧ అగస్త్య. ౨ అగస్త్య, దార్ఢచ్యుత, ఇధ్మవాహ.

**అగస్త్య నక్షత్రగోళము** — నక్షత్రములు భారతీయులు గుర్తించినవి చూడుఁడు.

**అగస్త్యప్రాగ్గణము** — ఇది అగస్త్య సంతతిలోని యొకగణము. ఇందు కేవలాగస్త్య, అగస్తి, సోమవాహ, సాంభవాహ, యజ్ఞవాహ, పౌర్ణమాస, హిమోదక, పాణిక యను నెనిమిది ఉపగణములు చెప్పఁబడినవి. ఆయాగోత్రములు చూడుఁడు.

**అగస్త్యభ్రాత** - ఈతఁడు తల్లిగర్భమునందుండగనె జ్ఞానముగలుగుటంజేసి వ్యవహారధర్మము నెరుంగక వ్యవహారనామము లేనివాఁడయ్యెను. మరియు నగస్త్య మహర్షి సోదరుఁడుగాన నగస్త్యభ్రాతయని వాడుకగల్గెను. తనకుఁ బేరుప్రతిష్ఠలు లేక మరియొకరినుండి యెగబడుచున్నవాని నగస్త్యభ్రాత యని యందురు. ఇది హేళనగఁ బల్కుట యని యెరుంగునది.

**అగస్త్య మహర్షి** మిత్రావరుణులు ఊర్వశియందు మోహితులైయుండుతరి వారి తేజంబునుండి యొక కుండయందీతఁడును

వసిష్ఠుఁడును జన్మించుటం జేసి కుంభసంభవుఁలను పేళ్ళఁబరగిరి.

మరియు పులస్త్యునకు హావిర్భుక్కను భార్యయందు జనించిన పుత్రుఁడని వేరుతావులందుఁ జెప్పఁబడినది. అగస్త్యునకు గొప్ప కమండలము కలదు. అగస్త్యుఁడొక యెత్తు; కమండలమొక యెత్తు, నని లోకోక్తి కలదు. ఈతఁడు కాలకేయులకొఱకు సముద్రోదకముల నాపోశనముంబట్టి త్రావివైచెననియు, నిల్వలవాతాపుల నంతమొందించిన వాఁడనియు, నహుషుఁ డింద్రత్వము వహించుతఱి యాతనిం దేవతలహితవుకొఱకు సర్పమగునట్లు శాపంబొసంగెననియు, తొల్లి యొకప్పుడు మేరువువింధ్యనగంబుల గలహములందు లోకహితార్థము వింధ్యనగము వంగునట్లొనర్చి, తా దక్షిణసీమలకరగి, ఇప్పటి తంజావూరు మండలములోని వేదారణ్యమనంబడు తావున నాశ్రమము నిర్మించుకొని యటవసించుచు నరవ (ద్రావిడ) భాషకు వ్యాకరణము రచించి, సంస్కరించి, భద్రపరచినవాఁడనియు పెక్కుచరిత్రలఁ జెప్పఁబడినది.

అగస్త్యాశ్రమములు కాశియం దొకటి యున్నటుల స్కాందపురాణము, కాశీఖండమునఁ జెప్పఁబడినది. వింధ్యపర్వతప్రాంతముల యందొకటియు, దక్షిణదేశమున తామ్రపర్ణి నదీతీరమున రెండాశ్రమములును, తంజావూరు మండలమున కావేరీనదీతీరమున వేదారణ్యమున నొక యాశ్రమమును ఉండినటుల తెలిసెడిని. (అగస్త్యభ్రాత చూడుఁడు).

**అగస్త్యసాముద్రికము** — శివకుమారుఁడగస్త్యమహర్షికి దీనినుపదేశింప దానినాయన లోకమునకు వెల్లడించుటచే నిది అగస్త్య సాముద్రికమనఁబరగెను. దీనిమేరకు ముప్పది రెండు సాముద్రికలక్షణములు వివరింపబడినవి.

నిడుఁదగ నుండదగినవి ౫:— ౧ కండ్లు, ౨ చేతులు, ౩ మోకాళ్లు, ౪ ముక్కు, ౫ పురుషులకు దవడలు, స్త్రీలకు కర్ణములు.

మృదువుగ నుండఁదగినవి ౫:— ౧ శిరోజములు, ౨ వ్రేళ్లు, ౩ గోళ్లు, ౪ చర్మము, ౫ దంతములు.

పురుషులకు ఉన్నతములై యుండఁదగినవి:— ౧ ముఖము, ౨ భుజములు, ౩ ఉదరము, ౪ కటిప్రదేశము, ౫ వక్షము, ౬ మీఁజేతులు.

ఎర్రనై యుండఁదగినవి ౮:— ౧ కంటికొనలు, ౨ అరచేతులు, ౩ చేతిగోళ్లు, ౪ కాలిగోళ్లు, ౫ నోరు, ౬ మర్మావయవములు, ౭ అరికాళ్లు, ౮ ఓష్ఠములు.

కురుచగ నుండఁదగినవి ౩:— ౧ మెడ, ౨ మోకాలి క్రిందిభాగము, ౩ మర్మావయవము.

తక్కువగ నుండఁదగినవి ౪:— ౧ నడుము, ౨ ప్రక్కలు, ౩ ముఖముయొక్క క్రింది భాగము, ౪ నాభి.

ఇట్టి లక్షణములు సంపూర్ణముగ నుండిన ప్రభువగునని చెప్పంబడినది.

**అగస్త్యసాంప్రదాయ్యవైద్యము** — దీని నగస్త్యవైద్యమనియు నందురు. అగస్త్యమహర్షి ఉత్తరదేశమందలి వారణాశీ క్షేత్రమును వీడి దక్షిణసీమల కరిగి యట నివాస మేర్పర్చుకొనుట స్కాందపురాణ కాశీఖండమునను శ్రీరాముఁడు లంకపై దాడివెడలుతఱి దక్షిణదేశమున నగస్త్యుని యాశ్రమమున కేగుట శ్రీమద్రామాయణమునను వివరింపఁ

బడినది. ఇందువలన నగస్త్యమహర్షి శ్రీ రాముని కాలమునాఁటివాఁడని తేలుచున్నది. ఇంకను శ్రీమద్రామాయణమున యుద్ధము నందు మూర్ఛనొందిన లక్ష్మణునకు సుషేణుఁ డను వైద్యశిఖామణి నస్యరూపకముగ సంజీవకరణిని, విశల్యకరణిని, సావర్ణ్యకరణిని, సంధానకరణిని నుపయోగించినట్లు యుద్ధ కాండము ౧౦౨ సర్గయందుఁ జెప్పఁబడియుంట నీసుషేణుఁడును, ఆనాఁటివాఁడేయనియుఁ దేలుచున్నది. కాని, ఇంతమాత్రమున నాదేశమున నాయుర్వేదవైద్యము వ్యాపకమునందుండిన దనిగాని లేదనిగాని చెప్పుటకు వలను పడదు. కాని, యీవైద్యవిధానమున కగస్త్య సాంప్రదాయవైద్య మని పేరుండుటవలన నగస్త్యర్షి దక్షిణసీమల కేగినపిదప నీవైద్య విధాన మంకురించియుండునేమో యనితోఁచెడిని. ఉత్తరదేశములం దీవైద్యప్రశంస గానరాకున్నను, ఈవైద్యముంబోలియె టిబెట్టు దేశపు వైద్యము గాననగుటచే ననుమాన పడుటకుఁదక్క స్పష్టముగాకున్నది. పరిశీలనలింక నీవిషయమున జరుగఁదగును.

మరియు, నీవైద్యవిధానము ఆయుర్వేదముంబోలి వాత, పిత్త, శ్లేష్మ, దోషఁపుఁ బద్ధతియే మైయుంటయు మనసునందుంచుకొనఁదగినది. ఇది రెండువిధానములందుఁ బ్రధానప్రమేయములే.

అగస్త్యవైద్యమున ఊహాముని విరచిత వైద్యగ్రంథములందు నాదిని పరమేశ్వరుఁడు పార్వతీదేవికిని, పార్వతి నందికేశ్వరునకును, ఆతఁడశ్వనీదేవతలకును, వారు ధన్వంతరికిని వైద్యవిద్య నుపదేశించిరనియు, నాయగస్త్య మహర్షి పులస్త్యులకును, ఆతఁడు తేరయ్యర్నకును, ఈతనిచే నూహామునికిని పిదప నీవిద్య యుపదేశింపఁబడి వ్యాప్తినొందినదని చెప్పఁబడినది. ఊహాముని కొన్ని వైద్యగ్రంథములు రచించినవాఁడు.

ఈవిధాన వైద్యవిద్యాప్రవర్తకులు పదునెనమండ్రు కలరు. వారందరు సిద్ధులైనవారే గాన నీవైద్యవిధానమునకు సిద్ధవైద్యమనియు వారినుండియే పేరుకల్గెనట. నేఁటికిని, ఆపేరు వాడఁబడుచునేయున్నది. వారు ౧. నందీశ్వరర్, ౨. అగస్త్యర్, ౩. మత్స్యముని, ౪. పిడినాక్కీశర్, ౫. పులస్త్యర్, ౬. పుణుండర్, ౭. కరువూరార్, ౮. తిరుమూలర్, ౯. చట్టముని, ౧౦. రోమర్షి, ౧౧. భోగర్, ౧౨. బ్రహ్మముని, ౧౩. సుందరర్, ౧౪. వామదేవర్, ౧౫. తేరయ్యర్, ౧౬. కపిలర్, ౧౭. కమలముని, ౧౮. కొంగణర్ అనఁబడు సిద్ధులు. ఇంకను కొన్ని గ్రంథములందు ప్రవర్తకులు ఇరువదిమంది యనియు, మరి కొన్ని గ్రంథములందు నలువదెనమండుగురనియు చెప్పఁబడియుంటయెగాని వారి పేర్లు గానవచ్చుటలేదు.

ఇదియిటుండ నీపరంపరర్షులు ప్రవర్తకసిద్ధులందు (అనగా వారురచించిన గ్రంథములఁ జెప్పఁబడినవైద్యవిధానాదులందు) వడసాంప్రదాయ (ఉత్తరసాంప్రదాయ) మనియు, తేన్ (దక్షిణ) సాంప్రదాయమనియు, ద్వివిధ సాంప్రదాయము లేర్పడియున్నవి. ఈ రెండు సాంప్రదాయముల విధానములు పరిభాషా పదములు, ఆయుర్వేదీయవిధాన పరిభాషాదులనుండి భేదములంగల్గియె యున్నవి. ఈ సాంప్రదాయమున రచింపఁబడిన గుణపాఠ మనుగ్రంథము ఉత్తరదేశపు ఆయుర్వేదీయ సాంప్రదాయమందలి గుణపాఠమునంబోలక కేవల దక్షిణదేశపు వనౌషధులను విస్తార

ముగ వివరించుచు వానిగుణములం దెల్పెడిని. అగస్త్యసాంప్రదాయమున కేవల చికిత్సా గ్రంథములు ఎక్కువగ రచింపఁబడినటుల తెలిసెడిని.

ఈసాంప్రదాయ గ్రంథములందు ఖనిజ వస్తుసామాన్యముంగూర్చి ఎక్కువగ పరిశీలింపఁబడినది. క్షారములు, లవణములు, క్షారజ ద్రవ (ద్రావక) ములు, పాషాణములు, విష సంయోగములు, రసకర్పూరములు, రసముల యొక్క వికారములగు సౌవీరజాతిభేదములు, రసవాదప్రక్రియాభాగములు, పాషాణసంయోగములు, వానియందలి విభాగములు, భేదములు, చక్కఁగఁ బరిశీలింపఁబడి వివరింపఁబడినవి. ఇట్టి గ్రంథములు కొన్ని, ఈ వైద్యవిధానగ్రంథములందు కానవచ్చెడిని.

ఈయగస్త్యవైద్యవిధానమున చెప్పఁబడిన కొన్ని యౌషధములును వింతగొల్పెడిని. క్షారలవణములను, శాస్త్రమున జెప్పఁబడిన యోగములమేరకు భాగములంగల్పి, పాతాళయంత్రమునందుంచి, నియమితకాలము భూమిలోనుంచి పిదపఁ దీసిన, నవి ద్రవములై పోవును. ఈ ద్రవములకు "జయనీరు" అని పేరు. జయనీరులు చేయువిధానములు రెండు గలవట.

లవణములు మొదలగువానిం జేర్చి, యోగములయందుఁ జెప్పఁబడిన రీతిని ఓషధీరసములతో భావనలొనర్చి, అగ్నిచే పచనము చేయుదురు. ఇట్లు చేయఁబడిన యౌషధమునకు "ముప్పు" అని పేరు. వీటిని రోగములందు వాడుదురు. ఇంకను గంధకము మొదలగువానిని భస్మమొనర్చుటయందుఁగూడ వాడెదరట. ఇంకను జయనీరుచేత, పాషాణవర్గములోచేరిన పాషాణములను, రసవర్గములోచేరిన రసములను, ఇంకను సౌవీరము, ఇంగిలీకము మొదలగు వాటిని "చురుకు" అనంబడు సంస్కారమొనర్చి, నిప్పునందుంచినను ధూమమైపోక నిలచియుండునట్లు శుద్ధి నొనర్చెదరు. ఇవి రోగములపైఁ జక్కఁగ బనిఁజేయుననియు స్వల్పభాగమె ఎక్కువగను, త్వరితముగను గుణమిచ్చుననియు నందురు.

ఇంక నీవిధానమున భస్మసింధూరము లొనర్చుటయు వింతగొలుపకఁబోదు. అన్యవిధానముచే నూరుపుటములు వేసినంగాని, నిశ్చంద్రికగా (తళుకులు లేకపోవుట) నవని వజ్రాభ్రకభస్మము, ఈవిధానమున నాయిపోహిలై (కుక్కపొగాకు) అనంబడు మూలికారసముచేనూరి పది లేక పంద్రెండు పుటముల తోనే నిశ్చంద్రికగా నొనర్తురు. ఇది నాగార్జున తంత్రోక్తప్రక్రియలచేఁ జేయఁబడిన యభ్రకసింధూరముకన్న నెక్కువ గుణము నిచ్చునని ఘనవైద్యులు చెప్పుచున్నారు.

మైలతుత్థమునుగాని, సౌవీరమునుగాని, కొన్ని వనమూలికల సంయోగంబున, డమరుకయంత్రమందునిచి, నియమితకాలము పాకమొనర్చి భస్మమొనర్తురు. వీనికిఁ గురుభస్మములని పేరు. వీని చిన్నమోతాదులచే సర్వాంగవాతము, సర్వాంగశీతము, పక్షవాతము, మహోదరవ్యాధు లతిస్వల్పకాలముననే నివారణయగునట. ఇటులనే ఇనుము, ఉప్పులు, కాంతలోహము, తగరము, తాళకము, బంగారము, వెండి, శంఖపాషాణము, సీసము, క్షారములు, వీనిని పైవిధానముననే భస్మములుగను, సింధూరములుగను, బద్ధములు (కట్లు) గను, ద్రావకములుగను,

గూడ నొనర్చువిధానము లగస్త్యసాంప్రదాయమున చెప్పఁబడియున్నవి.

ఈ యగస్త్యవిధానము చెన్నపట్టణమునకు దక్షిణమునంగల అరవదేశమందునను, మళయాళసీమలు, సింహళ (యాళ్ప్పాణము) దేశమునందు, జాఫ్నాద్వీపమునను ప్రచారమునందియుండుటయెకాక, దక్షిణదేశస్థులతోఁగూడ నేగి వారు వ్యాపించిన బర్మా, సింగపూర్, మొదలగు సీమలందు వ్యాపించియున్నది. ఇంక నీసాంప్రదాయపు వైద్యగ్రంథములం గూర్చి వివరించి ముగింతుము. ఈ వైద్య గ్రంథములు రచించిన అగస్త్యర్, ధన్వంతరి, నిత్యానందసనాదర్ మొదలగు కొందరు ఆత్రేయ వైద్యవిధానమును దక్షిణద్రవిడ సాంప్రదాయమును (అనగా వడసాంప్రదాయమును, తేన్‌సాంప్రదాయము నని భావము) కూడ నెరింగినవారు. తక్కిన చట్టముని, తేరయ్యర్, కరుపూరార్ మొదలగు మరి కొందరు కేవల తేన్‌సాంప్రదాయ విద్యాప్రపూర్ణులేనని చెప్పఁబడినవారు. అగస్త్యుఁడు, తేరయ్యర్, చట్టముని, భోగర్, పులిపాణి, కరుపూరార్, తిరుమూలరర్, వీరు సంస్కృతమునను, ద్రావిడభాషను కూడ గ్రంథములు రచించియున్నారు.

అగస్త్యర్ ఆయుర్వేద మనంబడు గ్రంథమునను, ఆయరత్తేరనూరను గ్రంథమునను, వస్తుగుణములు కేవల ప్రభావరూపమునను వివరింపఁబడినవి. అగస్త్యర్ ఆరునూరు, అగస్త్యర్ పరిపూర్ణం నానూరు, అగస్త్యర్ వైద్యకావ్యం, అగస్త్యర్ చెందూరమ్ పులిప్పాణి ఐనూరు, భోగర్ ఏళునూర్, ఊహాముని ఆరయమ్, ఉరోమర్షి అయినూర్, తిరుమూలర్ నాడిశాస్త్రమ్ మొదలగు గ్రంథము లీవైద్యవిధానమున గలవు. పరిశీలకులు అగస్త్యమహర్షి దక్షిణదేశమున అగస్త్య విధానవైద్య మభివృద్ధినందించినపిదప, చాలా కాలమునకు ఉత్తరదేశమున నాగార్జునాదులు రసతంత్రము నభివృద్ధిపరచి వ్రాసిరని తలంచుచున్నారు.

**అగస్త్యాశ్రమములు** — ౧. అగస్త్యపురి- బొంబాయిరాజధానిలోని నాశికపట్టణమునకు ఆగ్నేయదిక్కుగ ౨గి మైళ్ల దూరమునగల యగస్త్యాశ్రమము. ౨. అకోలా- బొంబాయిరాజధానిలోని నాశికపట్టణమునకుఁ దూర్పుదిక్కుగ నిప్పటి బీరార్సు పరగణాలో తపతీనదిలో సంగమించు పూర్ణానది దక్షిణతీరమున (నదినుండి కొంచమున గల) అకోలాపురముకడనున్న యగస్త్యాశ్రమము. ౩. కొల్లాపురము-బొంబాయిరాజధానిలోని కొల్లాపురము సంస్థానపు పురమగు కొల్లాపురముకడగల యగస్త్యాశ్రమము. ౪. సరై అఘాట్- సంయుక్తరాష్ట్రములలోని ఎటా జిల్లాయందలి ఫతేఘర్‌పురముకు పడమరగా ౨౩ మైళ్ల దూరముననున్న సంకిసా (తొల్లింటి సంకాస్య) పురికి వాయవ్యదిశ నొకమైలు దూరమునంగల సరైఆఘాట్ అను తావున గల యగస్త్యాశ్రమము. ౫. అగస్త్యముని హిమాలయములపై ఇప్పటి గఢ్వాల సంస్థానమురాజ్యమున రుద్రప్రయాగ నుండి పంద్రెండుమైళ్ల దూరమునగల అగస్త్యముని యనంబడు తావునగల యగస్త్యాశ్రమము. మందాకినీ నదీతీరము. ౬. వింధ్యపర్వతశాఖయగు సాత్పురపర్వతములపై గల యరణ్యముననుండిన యగస్త్యాశ్రమము వైడూర్య పర్వతముపై నున్నది. ౭. దక్షిణదేశమున తంజావూరుజిల్లాలోని వేదారణ్య మనంబడు

తావున ద్వాల్లింటి నొక యగస్త్యాశ్రమ ముండెననియు, ఇదియే యామహర్షి (స్కాంద పురాణ కాశీఖండమునఁ జెప్పఁబడినటుల కాశీపట్టణమును వదలి దక్షిణ దేశముల కేతెంచి యట) స్థిరనివాస మేర్పరచుకొని ఆర్యవిజ్ఞానబోధ యొనర్చుచుండినతావనియు, మహాభారతము వనపర్వము నవమాధ్యాయ మునఁగలదు. మరియు నిచటనే యాతఁ డరవభాషకు వ్యాకరణసూత్రరచన గావించె నట. 'అగస్త్యసంహిత, అగస్త్యగీత, సకలాధి కారము' అను గ్రంథము లీప్రదేశముననే రచించెను. ౮. అగస్త్యకూటము- తిరునల్వేలి జిల్లా (దక్షిణదేశము) లోని కల్లడకురిచి యనంబడు పురమునకుఁ గతిపయదూరమున మలయగిరి పర్వతశాఖపై తామ్రపర్ణినదీ జన్మస్థానముకడనున్న అగస్త్యకూటమనంబడు తావునగల యగస్త్యాశ్రమము. ఇట యగస్త్య మహర్షి యింకను జీవించియున్నాడని యచటి వారందురు.

**అగస్తి ఉపగణము** — ఇది అగస్త్యసంతతి యందలి అగస్త్యప్రాగ్గణములోని ఉపగణము. ఇందు ౧3 గోత్రములు కలవు. అవి మాత్స్యోక్తములు, కాత్యాయనసూత్రోక్తములును. ౧. అగస్తి, ౨. క్రతు, 3. కరంభి, ౪. కురుణాభ్య, ౫. కౌసల్య, ౬. ఖగేవస, ౭. గాంధారాయణ, ౮. దైర్ఘచ్యుత, ౯. పులస్తి, ౧౦. పులహ, ౧౧. మయోభువ, ౧౨. మహేంద్ర, ౧3. వంస్తవ. ఈ అగస్త్యుపగణమునందలి ౧3 గోత్రములకుఁ బ్రవర రూపము ౧. ప్రవర - అగస్త్య, మహేంద్ర, మయోభువ.

**అగస్తిగోత్రము** — అగస్తి ఉపగణము చూడుడు.

**అగస్త్యోత్తరగణము** — ఇది అగస్త్య సంతతిలోని యొకగణము. ఇందు సంకృతి, శౌంగశైశిరి, తౌగాక్షి యను మూడు ఉపగణములు చెప్పఁబడినవి. మరియు నీమూడు ఉపగణములందలి గోత్రములును ద్విగోత్రము లని చెప్పఁబడినవి.

**అగ్గిపుల్ల వెలుఁగుట** — అగ్గిపుల్ల తల యందు పొటాశియమ్‌క్లోరేట్ (Potassium Chlorate) పొటాశియమ్ నైట్రేట్ (Potassium Nitrate) అనునవి యుండును. వానికి గాలి తగులకుండునట్లును, కదల కుండునట్లును, ఒకవిధమగు వార్నీషు బంక పొరచేమూయఁబడి బంధింపఁబడును. ఈ కెమికల్సు ఒకటిపైనొకటి డీకొనుతరి కొంత ప్రాణవాయువు (Oxygen) ను, భాస్వరము (Phosphorus) ను కల్గించి ప్రేలి మండునవిగాన మనమగ్గిపుల్ల గీయుతరి ఆవార్నీషుపొరచెడి అతిచిన్నధ్వనితో ప్రేలి వేడికల్గి రసాయనవికారము (Chemical Reaction) సంభవించి, చిన్నమంట జనించి అట పులమబడిన గంధకము నంటించి పుల్లను (కర్రను) మండజేయును. ఇది జరగునట్టిపని. అగ్గిపుల్ల వెలిఁగినదనుకొనుచుందుము. ఏ కారణమువల్లనైనను ఈఅగ్గిపుల్ల నానినచో ఈవేడికలుగక నిలచిపోవును.

ఇంక రెండవవిధానమగు సేఫ్టీ మాచ్ (Safety Match) అగ్గిపుల్లల పెట్టెకు రెండు కెమికల్సును ఒకేపుల్లయందుంచబడక ఒకటి పుల్లతలయందునను, వేరొకటి అగ్గిపెట్టెకు ప్రక్కలందునను ఉంచబడియుండును గాన సేఫ్టీమాచిపుల్లను ఆఅగ్గిపెట్టె ప్రక్కను గీచినప్పుడే అగ్నిప్రజ్వరిల్లెడిని. కాన, అగ్గిపుల్ల వెలుఁగుటయన రెండు కెమికల్సు

ఒకటితోనొకటి ఢీకొనుటవలన సంభవించెడి రియక్షను (Reaction) వలన సంభవించు అగ్నిప్రమాదము (Explosion) గ నెరుంగ వలయును.

**అగ్గిపుల్లల పరిశ్రమ** (Fire Match Industry) — అగ్గిపుల్లల నెరుంగని యాదికాలమున భరతదేశపు ఋషులు పవిత్రాగ్నులను రెండుకర్రలను రాపాడించి కలిగించుకొనుచుండువారు. పిదప చెకుముకి రాతింగొట్టి నిప్పుకణములొక నూలుదారముల గుత్తలముపైఁ బడఁజేసి యంటించి, దానినుండి పెంపుఁజేసి యుపయోగించుకొనుచుండువారు. పిదప దీపము వెలిగించుటకుఁ గరగించిన గంధకమునఁ బుల్లలనుముంచి, యెండించి, వానినగ్నిపైముట్టించి మండఁజేయుచుండువారు. మైనపుఁబుల్లలును కొంతకాలము వాడుకయందుండెనని ప్రతీతికలదు. ఇప్పటి అగ్గిపెట్టెలు, పుల్లలు, ఐరోపా మొదలగు విదేశములనుండి దిగుమతి యైనవియె. తొలుత స్వీడను నార్వే, ఆస్ట్రియా, ఇంగ్లాండు, పిదప జపానునుండి యివి దిగుమతియగుచుండెను. అందు జపాను వారివి చౌకయె విసారము వాడఁబడుచుంట కాననగును. ఈ యగ్గిపెట్టెల దిగుమతి క్రీ. వె. ౧౯౦౦ మొదలు ౧౯౧౦ దనుక నేఁటేట నలుబదిలక్షల రూప్యములు మొదలెనుబదియొకలక్షల రూప్యముల వరకుం బెరిగెను. ౧౯౧౩-౧౪లలో తొంబది లక్షలరూప్యముల విలువగల యగ్గిపుల్లలు దిగుమతియయ్యెను. పిదప నిండియాయందీపరిశ్రమ నెలకొల్పఁ బ్రయత్నము లారంభమయ్యెను.

క్రీ. వె. ౧౯౨౧-౨౨ నాఁటికి నూటికి రు ౫-౦-౦ వీనిపై దిగుమతి సుంకము విధింపఁబడియుండెను. క్రీ. వె. ౧౯౨౧ మార్చి నెలలో సుంకము నూటికి రు ౭-౮-౦ చేయఁబడి ౧౯౨౨ మార్చి నెలలో గ్రోసు ౧ కి దిగుమతిపన్ను రూపాయన్నర విధింపఁబడెను. ఈకాలమున విస్తారముగ నగ్గిపుల్లల కర్మాగారములు పెరిగినవి; కాని, అందనేకములు వేర్వేరు కారణములచే భగ్నమైపోయెను.

అగ్గిపుల్లలు Safety Matches అనియు Sulphur Matches అనియుద్వివిధములుగ నున్నవి. Safety Matches తమకొరకాయత్తపరుపఁబడిన అగ్గిపెట్టె ప్రక్కలపై గీచిననే వెలుఁగును. Sulphur Matches ఎక్కడగీచినను వెలుఁగును. స్వీడనుదేశమున నీయగ్గిపెట్టెలు పుల్లలు నన్నిటిని యంత్రముల చేతనే చేయించుచున్నారు. జర్మనీ, నార్వే మొదలగు నితరదేశములందు మనుష్యులచేఁ గూడ కర్మాగారములందుఁ బనిఁజేయింతురు. రానురాను భరతదేశమునందుఁ గూడ నగ్గిపుల్లలంజేయు పెద్ద యంత్రశాలలు బయలుదేరి పనిఁజేయుచున్నవి. విదేశపు దిగుమతి కొంతవరకుఁ దగ్గినది.

**అగ్గిపై నీటింజల్లుతరి ధ్వని** — ప్రజ్వలించుచున్న యగ్నిపై నీరుజల్లినచో నానీటి యొక్క పైభాగము తొలుత నగ్నిం ద్రాకును. ఆయగ్ని తక్షణమే యాతగిలిననీటి నావిరిగ మార్చును. ఈలోపున మండుచున్న యగ్ని యందుఁ బ్రధానపదార్థమగు గ్యాసు (Gas) అందుఁగలిసికొని పైకివెడలఁబ్రయత్నించును.

వరుసవరుసగ వెంటవెంటనే నీరగ్నిం దాకుచుండుటయు, అగ్నియందలి గ్యాసు, తయారైన యావిరియు నానీటిగుండఁ దప్పించుకొనవలసియుండును. తప్పించుకొను

తరి నతిసూక్ష్మములగు బుడగలు నీటినుండి పైకివచ్చి, లోనున్నగాలి వేడిమెక్కి పైకిం బోవుచో, నీటియొక్క సన్నపుబొర యగు బుడగనుపగిల్చి, యందుండి తప్పించుకొని బయటంబడును. ఈనీటిపొరయగు బుడగను పగుల్చుతరిఁ చిన్నధ్వనికలుగును. వేలు లక్షలుగ బయలువెడలు నీటిబుడగలు పగులుధ్వనులు కలసి, ఒకేవిధమున నెడతెరపి లేని "హిస్" అని ధ్వనివినఁబడును. ఇదియె మనకగ్నిపై నీటిఁజల్లిన వినబడుధ్వని.

ఇంక నదివరకే వేడిగాలి యచటనుండి వెడలుచుండుగానఁ బైకేగు నీగ్యాసునకు కార్బానిక్ ఆసిడ్ గ్యాసుతో సంబంధము కలుగునేగాని స్వేచ్ఛాప్రసారము గలిగి మహావాయుమండలమునుండి లభింపఁగల ప్రాణవాయువు (ఆక్సిజను) తో సంబంధము గలుగనేరదు. కాన తిరుగ మండనేరదు.

ఇంక నగ్నిపయింబడిన నీరధికమై, అగ్ని యందలి వేడింజల్లార్చి, యగ్నినిజయించనైన జయించును; లేక నీరల్పమైన, యగ్ని బలకరమై నిలువగల్గి సకాలమున నీటిం జయించి తాఁబ్రజ్వరిల్లమొదలిడును. ఎట్లు జరిగినను, కల్గినపనియాగి, ధ్వనిమానును.

**అగ్గిలోమిడత పడినట్లు** — ఆంధ్ర లోకోక్తి.

**అగ్గివేంద్రపుఁజెట్టు** — (వనౌషధి). లా. Ammania Vesicatoria. సం. దావాగ్ని, బ్రహ్మసోమా, అల్పదహనా. దీనియాకును, అజ్ఞానపుటాకు, అగ్నిజ్వాల, యనియు నందురు. ఆకు పొక్కును గలిగించును. వాతమును శ్లేష్మమును హరించును. ఆకునూరి వెన్నునఁబట్టువేసినచోఁ బురాణజ్వరములు గూడ హరించును. నొప్పులుగలచోటఁ బట్టువేసినచో నానొప్పులు మానును. ఆకును మిరియములతోఁ గలిపి నూరి సేవించినచోఁ జలిజ్వరములు మానును. వేరుయొక్క చూర్ణము మహా శాంతికరము.

**అగ్నువ్వయితే అందరు కొనుట** ఆంధ్రలోకోక్తి.

**అగ్ని** — నిప్పు ఆరిపోవుటకుఁ గారణము ప్రధానమైన ప్రాణవాయువు (ఆక్సిజెను) లేకపోవుటయె. ఆక్సిజెనుగాలి అగ్నికడనుంట తగ్గినపుడే అగ్నియు క్షీణించుచుఁ దన తేజమును గోల్పోవు చుండును. అత్తరి, అగ్నియందలి వేడియుఁ దగ్గెడిని. ఇట్టి సందర్భములందు నొకవైపునుండి నిప్పారి పోవుచుండును. పైనుండి గాలి చొరరాని మూత నగ్నిపైమూసిన నిట్టిపరిస్థితి సంభవించును. ఆక్సిజెను లేక నిప్పారినప్పుడింకను కాలఁదగిన పదార్థములు కర్రలందుఁ గాని, రాక్షసబొగ్గునందుఁగాని, దీపపువత్తి యందుగాని, యుండిన నుండుంగాని, ఒక ఆక్సిజెను లేక ఆరిపోవుటంజూడ అగ్నికిఁ గర్రలు మొదలగునవి ఎంత ప్రధానమగు నాస్థరణయో ఆక్సిజెనుగాలియు నంతప్రధానమగు నాధారమనియె తేలుచున్నది.

కాలఁదగిన పదార్థములన్నియుం గాలి పోయినతరి, కొయ్యబూడిదతప్ప బొగ్గుండదని మనమెరుంగుదుము. గాలియే లేనిచోట ప్రాణులెట్లుచచ్చునో అట్లె ఆక్సిజను లేనిచోట, అగ్ని యంతమొందును. అగ్నిమండుచుండు తరివేడియు, వెలుతురునుగూడ గల్గించును. వేడిప్రధానమును వెలుతురు వేడినుండిగల్గు ననియు కనిపెట్టబడినది. సూర్యునియందలి మంటలవేడికి, వెలుతురు జనించుచుండగ

పరిశీలకులు కనిపెట్టిరి. విద్యుద్దీపము ందలి తీగకు వేడిగల్గి, వెలుతురు నిచ్చునని చెప్పఁబడినది. కాని సూర్యునినుండి మనకు వచ్చు పదికోట్ల మైళ్దూరమునుండి వచ్చుచున్నదనియు, నిందులకు కారణము ఆక్సిజెనుకాదనియు, వేరుభూతముల పను లిందులకుఁ గారణమనియు కొందరు పరిశీలకు లనుచున్నారు.

అగ్ని సేవకుఁడై యుండుతరి చాల నుపయోగకారి గాని యజమానుఁడైనచో బాధించువాఁడని, పాశ్చాత్యుల నెదరు. అనగా, అగ్నిభూతమును మనస్వాధీనమున నిర్బంధించి యనేకయంత్రములనునడపి, పెక్కుపయోగ కార్యములు నెరపవచ్చుననియు, ఆయగ్నియె మితిమీరి మన స్వాధీనమునందుండనితరి, విజృంభించి అనేకవిధముల నాశనమొనర్చు ననియు వారియభిప్రాయము.

తొల్లింటికాలమున గ్రీకుఫైర్ (గ్రీకుల యగ్ని) యనంబడిన ఒక బాణసంచారి యుండెను. ఒకప్పుడి స్తంబూల్నగరము గ్రీకులస్వాధీనమందుండుతరి, క్రీ. వె. ౬౭౩ మొదలు ౬౭౭ వరకు సరాసెన్సు అనువారు దానిముట్టడించుచు దండయాత్రలు సలుపు చుండిరి. అత్తరి గ్రీకులు ఆగ్రీకుఫైరు బాణసంచారితో వారినెదిరించి దరిఁజేర నీయరైరి. అది ఎట్లుచేయుటయో, దాని పాళ్లింతవరకు కన్యులకు తెలియదు; కాని, కొందరు అందు పెట్లుప్పు, గంధకము, మొదలగునవి చేరియుండునని తలఁచు చున్నారు. ఇక్కాలమున ప్రమాదకరమగు నగ్ని నార్పుటకు యంత్రములుకలవు. కార్బను, హైడ్రోజెను, గాలులు కలసిన కూటమికి ఫైరుడాంపు (Fire Damp) అందురు. అది ప్రమాదకరమగు గ్నిమంటలం గల్గించును.

పారసీకులు, అగ్నిం బూజించుమతము వారు. వారిదేవాలయములం దగ్ని యారి పోకుండనుంచి పోషించుచు నర్చించెదరు. హిందువులు అగ్నియందు హోమములు వ్రేల్చియు, ఆజ్యాహుతులిచ్చుచు దేవతలం దృప్తిపరచెదరు. బైరాగులు (సాధువులు) అగ్నినర్చింతురు. వారి యగ్నికి దుణియని పేరు. అట్టిదేవస్థానము తిరుపతికొండపై నొకటికలదు.

అగ్ని బ్రహ్మామానసపుత్త్రులలో జ్యేష్ఠుఁ డనియు, అభిమానాగ్ని యనియుం జెప్పఁ బడినది. భార్యపేరు స్వాహాదేవి (నీలధ్వజుని కుమార్తె). అగ్నికి దుర్యోధనమను వంశనృపతిపుత్రిక సుదర్శన వేరొకభార్య. ఈమెవలని పుత్త్రుఁడు సుదర్శనుఁడు.

అభిమానాగ్నికిఁ బావకుఁడు, పవమా నుఁడు, శుచి యనువారలు ముగ్వురు కుమాళ్లు. వీరును అగ్నులే. వీరిలో నొక్కొ క్కనికిఁ బదునేనుగురు పుత్త్రులచొప్పున నలు వది యేవురు పుత్త్రులు గల్గిరి. వారందరు నగ్నులే. కాన, అందరును గలసి అగ్నులు నలువది తొమ్మండుగురని చెప్పఁబడినది.

అభిమానాగ్ని యొకతరి, దేవతలపైనలిగి తనపదవిని వదలిపోయెనట. అట్టితరి దేవత లంగీరసమహర్షిని అగ్నిత్వమునకు నియో గించిరట. ఆతఁడును వల్లెయని యగ్నిత్వము నిర్వహించుచుండెనట. ఆ యాంగీరసాగ్ని భార్యపేరు శివయట. ఆమెయందాతనికి ౧. బృహజ్జ్యోతి, ౨. బృహత్కీర్తి, ౩. బృహన్ము ఖుఁడు, ౪. బృహన్మతి, ౫. బృహద్భానుఁడు, ౬. బృహస్పతి, ౭. బృహద్బ్రహ్మ, అను నేడుగురు పుత్త్రులును, ౧. అనుమతి, ౨. రాక,

3. సినీవాలీ, ౪. కుహువు, ౫. అర్చిష్మతి, ౬. హవిష్మతి, ౭. మహామతి యనువారేడు గురు పుత్రికలును గల్గిరట. వీరందరు నగ్నిస్వరూపులేయట.

౧. గృహపతి-ఇంద్రాదులకు హవిర్భాగములంగొనిపోయి యందిచ్చునగ్ని. ౨. గోపతి-ఆంగిరససంతతివాఁడగు నగ్ని. 3. జాతవేదాగ్ని-ఆహవనీయాదిరూపుఁడు. పురూరవునివలనఁ గల్గినవాఁడు. ౪. తపుఁడు-పాంచజన్యాగ్ని. ఈతఁ డాంగిరస సంతతిలోని కాశ్యపుఁడు. వసిష్ఠసంతతిలోని ప్రాణుఁడు. ఆంగిరస చ్యవనులవలన నుద్భవించినవాఁడు. ఈతనికిఁ బదునేనుగురుపుత్రులని చెప్పఁబడినది. ఈ తపుఁడను వహ్నియొక్క పుత్రులు పదునేనుగురు. యాగమొనర్చువారి ఫలముల నపహరించు నిపుణులనియు, వారినివారించుటకు 'అగ్నిచయనము'ను నొక క్రతువును బ్రత్యేకముగఁ జేయవలయుననియుం జెప్పఁబడినది. ౫. ధనంజయాగ్ని. ౬. పురందరుఁడు-ఆంగిరససంతతివాఁడగు నగ్ని. ౭. ప్రాజాపత్యాగ్ని- ఆంగిరససంతతివాఁడగు నగ్ని. తండ్రిపేరు పురందరుఁడు. ౮. శయుఁడు-ఈతఁడు పుష్టిమతియనంబడిన భరతునితండ్రి. ౯. విశ్వపతి- ఆంగిరససంతతి యగ్ని. ౧౦. విశ్వభుక్కు- ఆంగిరససంతతి యగ్ని. ౧౧. వైశ్వానరుఁడు- తండ్రిపేరు విశ్వానరుఁడు. ఈతం డాంగిరససంతతివాఁడనియు, శాండిల్యసంతతివాఁడనియుంగూడ గాన్పించుచున్న యగ్ని. ౧౨. శంయుఁడు-బృహస్పతి భార్య సత్యల సుతుఁడగు వగ్ని, మొదటి హవిస్సులం గొనువాఁడు. ౧౩. హుతాశనుఁడు. ౧౪. పావకుఁడు-త్రేతాగ్నులలో నొకఁడు. ౧౫. పవమానుఁడు-త్రేతాగ్నులలో నొకఁడు. ౧౬. శుచి-త్రేతాగ్నులలోనొకఁడు తక్కిన యగ్నుల పేర్లు పురాణములందుఁ గానరాకున్నవి.

అగ్ని పంచభూతములలోనొకటి. తేజము నకధిదైవతమనంబడును. వేరొకతావున అగ్నిని బ్రహ్మమానస పుత్రుఁడని చెప్పియున్నారు. ఇంకను వేరొకతావున వారణాశిపురంబున విశ్వానరునకు బుత్త్రుఁడై యగ్ని జనించుటంజేసి వైశ్వానరుఁడని పేరయ్యెనని చెప్పఁబడినది.

అగ్నికివాహనము మేషము (అష్టదిక్పాలురుచూడుఁడు). నీలధ్వజుని కుమార్తెయగు స్వాహాదేవియు మనువంశపు భూపతియగు దుర్యోధనుని సుతయగు సుదర్శనాదేవియు నగ్నికిభార్యలని చెప్పఁబడిరి. స్వాహాదేవి యందు పావకుఁడు, పవమానుఁడు, శుచి యనంబడిన ముప్వురును సుదర్శనాదేవియందు సుదర్శనుఁడును అనుపుత్రులుకల్గిరి.

పావకుఁడు, పవమానుఁడు, శుచియు నగ్నిత్వమందినవారు. వారొక్కొక్కరికిఁ బదునేనుగురుచొప్పున నలువదియైదుగురు పుత్రులు గల్గిరి. వారును, అగ్నిత్వమందినవారేగాని, పావక, పవమాన, శుచులును, అగ్నియుంగలసి నలువదితొమ్మండుగురు అగ్నులుగఁ జెప్పఁబడిరి. (అగ్నుల భేదములు చూడుఁడు).

అగ్ని ఆగ్నేయదిక్పాలకుఁడై తేజోవతీ పురము రాజధానిగ నేలుచుండునని చెప్పఁబడినది. వసువై, వసువులకధినాథుఁడై, యుండుననియుం గొన్నితావులందుఁగలదు.

అగ్నిజిహ్వాలు లేక నాల్కలు ఏడు, ౧. కాళీ, ౨. కరాళీ, 3. ధూమ్రా, ౪. రోహితా, ౫. మనోజవా, ౬. స్ఫులింగినీ, ౭. విశ్వరుచి.

అగ్ని అష్టమూర్తులు. ౧. శర్వేసుఁడు, ౨. సప్తజిహ్వుఁడు, ౩. హవ్యవాహనుఁడు, ౪. అశ్వోదరజుఁడు, ౫. వైశ్వానరుఁడు, ౬. కౌమారతేజుఁడు, ౭. విశ్వముఖుఁడు, ౮. దేవముఖుఁడు.

అగ్నిపీఠశక్తులు తొమ్మిది. ౧. పీతాశక్తి, ౨. శ్వేతాశక్తి, ౩. అరుణాశక్తి, ౪. కృష్ణాశక్తి, ౫. ధూమ్రాశక్తి, ౬. తీవ్రాశక్తి, ౭. స్ఫులింగినీశక్తి, ౮. రుచిరాశక్తి, ౯. జ్వాలినీశక్తి.

అగ్నికిహోమమున షట్సంస్కారములు. ౧. తాపనము, ౨. పవిత్రీకరణము, ౩. అభిద్యాపనము, ౪. ఉత్పవనము, ౫. సంప్లవము, ౬. ఇధ్మ లేక సమిధలు.

**అగ్నికళలు** — కళలు చూడుఁడు.

**అగ్నికి వాయువు సాహాయ్యమైనట్లు** ఇండ్లుకాలుతరి గాలికూడవీచి మరింతరగుల్కొని మండఁజేయునని భావము. ఆంధ్రలోకోక్తి.

**అగ్నికుండములు** — హోమకుండములు చూడుఁడు.

**అగ్నికులక్షత్రియులు (పల్లీలు)** — వీరికిఁ బల్లీలనియు, వహ్నియాయులనియు, మరకాలనియుఁ బేరులు వాడుకయందున్నవి. అగ్నికులక్షత్రియు లనుపేరు కొంతకాలము నుండియు వీరు వహించి, ప్రకటించుకొని, ప్రభుత్వమువారి 'జనాభా' లెక్కలందుఁ జేర్పించియున్నారు. వీరింగూర్చిన పూర్వపు గ్రంథములు కానరాకున్నవి. ఆధునిక గ్రంథములైనను, పినపోతు పెదవీరాస్వామి గారు రచించిన 'అగ్నికులప్రదీపిక' యను పుస్తకమును, కాటాడ శ్రీరామకృత 'పల్లవశబ్దోత్పత్తి' యను గ్రంథమును, మచిలీపట్టణ నివాసియగు శ్రీరామ్ వీరబ్రహ్మముగారు రచించిన 'పల్లవరాజచరిత్ర' యను పుస్తకము తప్ప వేరు గ్రంథములు మాకు లభింపలేదు.

అగ్నికులప్రదీపికయందు, వీరి యుత్పత్తింగూర్చి యిటులఁ జెప్పఁబడినది. ప్రజలందుఁ గలహము లుద్భవింప వానినడంచి, వారిం బాలింప జంబూమహర్షి పరిముఖమున నొక క్రతువొనర్ప నందు మనువీరుం డుద్భవించె ననియు, ఆతనికే పల్లవుఁడు, మకారుఁడు అను నామములుండెననియు, మకారుఁడన (మకారమగ్నిబీజముగాన) అగ్ని లోఁగలవాఁడని యర్థమనియు, మరియు నీమకారుని సంతతివారగు మకారులు సప్తగోదావరీతీర నివాసులైయున్నతరి 'మరకాఁడు' అని పూర్వర్షులు నిర్ణయించినారనియు, మరకాఁడనిన నంతరాగ్నిసంబంధమున కేవల మీశ్వరార్థమిచ్చుననియు, చెప్పఁబడినది.

ఈకథన మిట్లసంపూర్తిగ నీగ్రంథమున వ్రాసినను క్షత్రియకులము క్షత్రియకులోత్పత్తియను తావుల కొంతదనుక వివరింపఁబడెను; కాన, దానింజూచుట సమంజసము. 'పల్లవరాజు' లను పదముంగూర్చి ఆంధ్రుల చరిత్రయందు, చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు చర్చించుచుఁ దొలుత పహ్లావులని వారికిఁ బేరుండెననియు, వారాదిని బారశీకదేశమునుండి వచ్చిన (పార్థియను లనంబడువారు) వారనియు, పిదప భరతదేశాచారము లవలంబించినారనియు, వ్రాసియుండిరి. దీనింగూర్చి విమర్శించుట యాంధ్ర విజ్ఞానమునకుఁ బనికాదు.

ఇందేదినిజమైననుఁ గావచ్చును. పల్లవుల సంతతివారమని చెప్పుకొనుచున్న వీరికిఁ

బల్లీలను పేరెట్లుకలిగెనో వివరింపవలయును. పల్లవులసంతతియగుట, పల్లీలైరని యెట్టివానికిని స్ఫురింపకపోదు. ఐనను, అగ్నికుల ప్రదీపికాది గ్రంథములందు, పల్లవరాజులను బుద్ధభగవానుఁడు వశపరచుకొని శిష్యులుగా నొనర్చుకొని, పల్లవశబ్దము పల్లీలుగ మార్చెననియు, దానికిని బరిపాలించుటయె యర్థమనియు, వివరింపంబడియుంట నిట వివరించుచు దీనిని వదలుటయె సమంజసము. దీనింగూర్చి 'కన్నడచ్ఛందము'ను గ్రంథమున నాగవర్మయు, 'నాలాయిరము'ను ద్రవిడవేదమున నమ్మాళ్వారును ఈయర్థమునే వీరికి ప్రతిపాదించినట్లు గనఁబడుచున్నది.

వన్నియారను పదము వహ్ని (లేక అగ్ని) పదమునుండియే కల్గినదనియు నందురు. తిరువన్నామలై రాజ్యముం బాలించిన వన్నిరాయర్ భూపాలుఁడు వీరికులమువాఁడేననియు వీరు చోళవంశజులనియు, వీరికిఁ బులిబావుటా బిరుదము కలదనియు, జంబూమహర్షి శిష్యసంతతియనియుఁ జెప్పుచున్నారు. వీరికి ముప్పదిరెండు బిరుదములు పన్రెండు హారతులు గలవందురు.

వీరియందు—౧. జంబూమహర్షి గోత్రము ౨. భాస్కరగోత్రము, 3. పశుపతిగోత్రము ౪. కళింగగోత్రము, ౫. చోళంగిగోత్రము, ౬. సాంఖ్యాయనసగోత్రము, ౭. కశ్యపసగోత్రము, ౮. ప్రఫుల్లాయనగోత్రము నను నెన్మిది గోత్రములు చోళపాండ్యవంశజులకుఁ గలవనియు. తెలుఁగువారియందు మరికొన్ని వంశములు గోత్రములు కూడ కలవనియు నందురు; కాని, యవి వివరింపఁబడలేదు.

వీరిలో — ౧. పట్టరు, ౨. వన్నియరు, 3. పల్లివరు, ౪. విళ్ళవదరు, ౫. సామందరు, ౬. పడయాక్షరు, ౭. నాయకరు, ౮. పల్లిగండ్రు, అను కులబిరుదములు కలవనియు, వీరందరు సూర్యచంద్రాగ్నివంశసంభూతులనియు, అందు చేరదేశస్థులు సూర్యవంశజులనియు, చోళదేశస్థులు చంద్రవంశజులనియు, పాండ్యదేశస్థు లగ్నివంశజులనియు, మఱియు నీయగ్నికులక్షత్రియులు ఎగుపతిదేశస్థులకు కులగురువులనియు, వీరిగ్రంథములఁ గానవచ్చుచున్నది; కాని, ఎగుపతిదేశమెచ్చటనున్నదో, యెద్దియో వివరింపఁబడియుండలేదు.

పల్లీకులజులలో నొకతెగవారు మేకలను, ఆవులను, ఎద్దులనుఁ బెంచుచుంట వారికిం గొల్లపల్లీలని పేరయ్యెననియు, పల్లవులందింకను గాంగపల్లవులు, నలంబవాడీపల్లవులు, ద్రావిడపల్లవులు, ఆంధ్రపల్లవులు నను నాల్గు తెగలవారు కలరనియుఁ దెలియుచున్నదని పల్లవరాజ చరిత్రయందుఁ జెప్పఁబడినది.

**అగ్నిగోత్రము**— నిధ్రువగణము చూడుఁడు.

**అగ్నిచయనము** ఇది యజ్ఞమునందలి యొకకర్మ. కృపణవృత్తినిపుణు లగు తపుని పుత్రులు యాగమొనర్చువారి మహాఫలముల నపహరించుచుండువారనియు, వారిని శాంతిపరచి, తృప్తులంజేసి యాగఫల మపహరింపకుండ నొనర్చు యజ్ఞకర్మయనియుఁ జెప్పఁబడినది. తపుఁడగ్నులలో నొకఁడని యెరుంగునది.

**అగ్నిజిహ్వా గోత్రము** — శాట్యాయన ఉపగణము చూడుఁడు.

**అగ్నిత్రయము**—దీనిని అగ్నిత్రితయమనియు నందురు. తండ్రివలనగల్గిన గార్హపత్యాగ్నియు, తల్లినుండికల్గిన దక్షిణాగ్నియు,

ఆచార్యునివలనఁగల్గిన ఆహవనీయాగ్నియు, అగ్నిత్రయమనఁబడును.

**అగ్నిత్రితయము** — అగ్నిత్రయము చూడుఁడు.

**అగ్నిదేవుఁడు** — ఆగ్నేయదిశాధిపతి. అష్టవసువులలో నొకఁడనియు, వసువులకు నాయకుఁడనియుం జెప్పఁబడినది. ఈతఁడు బ్రహ్మమానసపుత్రుఁడని కొన్ని తావులను, కాశియందు విశ్వానరునకుఁ గుమారుఁడగుట వలన వైశ్వానరుఁడనఁబరఁగువాఁడని కొన్ని తావులను జెప్పఁబడినది. భార్య స్వాహాదేవి. (అష్టదిక్పాలురు చూడుఁడు).

౧. ఆహవనీయాగ్ని-(వేదికిఁబూర్వదిక్కున నుండునది), ౨. దక్షిణాగ్ని-(వేదికి దక్షిణ దిక్కుననుండునది), 3. గార్హపత్యాగ్ని-(వేదికిఁ బశ్చిమదిక్కున నుండునది). ఈ మూఁడును సభ్యములగు త్రేతాగ్నులు. ఈమూఁడును వరుసగ 'పావకాగ్ని, పవమానాగ్ని, శుచి' యనువారల సంబంధాగ్నులు. వీరు అంతర్ధానునకు శిఖండివలనఁ గల్గిన పుత్రులు. మరియు దక్షిణ గార్హపత్యాగ్నులు రెండును వేదికి ఈశాన్యదిశగా నుండుతరి అపసవ్యత్రేతాగ్నులను పేరంబరఁగును.

**అగ్నిదేహగోత్రము** — శాండిలగణము చూడుఁడు.

**అగ్నిద్యోతనుఁడు** — వివాహమునకుఁ బూర్వము రుక్మిణీదేవికడనుండి శ్రీకృష్ణునికడ కంపఁబడిన వార్తాహారుఁడగు విప్రుఁడు.

**అగ్నినక్షత్రగోళము** — నక్షత్రములు భారతీయులు గుర్తించినవి చూడుఁడు.

**అగ్నిపర్వతములు** (Volcanoes) — సాధారణముగ వీనినగ్నిపర్వతములని వాడుట కలవాటుపడియున్నను, అది సరియగుపదము కాదని పరిశీలకులనుచున్నారు. అంతకన్న వేరుపదము వాడుకయందు లేమికాన, వానింగూర్చి వివరించుతరి నుత్పత్తియు, కారణమును చరిత్రగా వివరించుట సమంజసము.

అగ్నిపర్వత శిఖరములు ధూమమును, అగ్నిజ్వాలలను, ఉదకమును, ఆవిరిని పైకెగరఁగొట్టుచు కాలిన రాతిబూడిదను, కరగిన శిలాద్రావకమును, రాళ్లు, మన్ను మొదలగువానిని ప్రక్కలకుం దెచ్చి పోయుచుండును. అట్లే క్రీ. వె. ౭౦ సంవత్సరమున నిటలీదేశము నందలి పోంపీనగరము వెసూవియస్ అను పేరుగల యగ్నిపర్వతముచేఁ గప్పఁబడి రూపుమాసెను.

కొన్ని యగ్నిశిఖరములు సదా ప్రజ్వరిల్లుచుండునవి కలవు. మఱికొన్ని ఆరిపోయి నుగఁ గొంతకాలమున కుద్రేకించుచుండు నవియుం గలవు. ఈ యుద్రేకమునకు (Eruption) అనిపేరు.

భూమి యాదిని అగ్నిపిండమై యుండుటయు, రానురాను పైపొర చల్లారుటయు, లోపలిపొరలందగ్ని చల్లారక నిలచియుంటయు మొదలగు (Geological) భూచరిత్ర విషయములంగూర్చి (సముద్ర విజ్ఞానము చూడుఁడు) యెరింగినవారు పైపొరయందు బలహీనములగు తావులను, రాళ్లుగల తావులను, అడుగునుండి వేడి యుద్భృతమగు తరి ఆయాప్రదేశము లుడికినట్లగుచుఁ బైకుబుకుటయు సంభవింపగా నవి పర్వతములాయెననియు నందురు. ఇంకను జియాలోజీ విజ్ఞానులు భూమి తనచుట్టునే గిరగిరఁ దిరుగుచు సూర్యునిం జుట్టి చరించుచుంట

యును, ఆకాశమునందలి యితరగోళముల యాకర్షణ భూమిపైపొరపైఁబడి లాగుచుంటయు, భూమి పైపొరయందలి పగుళ్లు, బలహీనస్థలములు (Faults & Weak Places) ఎక్కువపనియొనర్చి పెద్ద పర్వత పఙ్తులు మొదలు చిన్న కొండలవరకును జనించుటకుం దోడ్పడెనందురు. ఇది వారి యోచనయేగాని నిదర్శనములు గానరావు.

ఇట్టి చర్యలవలననే భూమిపైపొర పైకుబుకుటకు మారుగ, క్రిందికిం గ్రుంగుట సంభవించును. అట్టితరి నట్టితావులందుఁ బల్లములేర్పడి నీరుచేరి సరస్సులాయెనందురు.

ఒక్కొకతావున నచ్చటి పరిస్థితులవలన భూమిలోపలనుండి యుద్భృతములగు నగ్ని జ్వాలలు పైపొరగుండ పర్వతశిఖరములకడ దనుక, నచ్చటచ్చట రంధ్రములు లేక మార్గములఁ జేసికొని వానిమూలమునఁ బైకి వచ్చుచుండును. అట్టివాని నగ్నిపర్వతములనియు, నాశిఖరముల నగ్నిశిఖరములనియు వాడుచుందురు. ఆరంధ్రముల కాంగ్లమున క్రేటరు (Crater) అనిపేరు. లోనియగ్నియొక్క ఉద్భృతప్రశాంతావస్థల ననుసరించి క్రేటరు గుండా పైకి Eruption వచ్చుట మానుట తోఁచుచుండును. ఇట్లుఅగ్నిశిఖరము చల్లారుట ఇరప్షన్ సంభవించుచుండుట తెలిసికొనుచున్నారు. ఒక్కొకతరి యుద్భృతమునకుఁ బైపొర కదల్చుటంజేసి భూకంపములుకూడఁ గల్గుచుండును. మాంటెన్ను చూడుఁడు.

**అగ్నిపాలిశాఖక్షత్రియులు** — క్షత్రియుల కులము చూడుఁడు.

**అగ్నిపురము** — మాహిష్మతి (హైహాయ లేక అనూపదేశము) చూడుఁడు. అనూప (చేది) దేశము చూడుఁడు.

**అగ్నిపురాణము** (ఆగ్నేయము) — ఇది లింగపురాణమునఁ దొమ్మిదవదిగను శివపురాణమున నేడవదిగను, దేవీభాగవతమునఁ బండ్రెండవదిగను, కూర్మపురాణమునం దప్పఁ దక్కినవానియం దెన్మిదవదిగను చెప్పఁబడినది. కూర్మపురాణమున దీనిపేరే చెప్పఁబడలేదు. భృగుమహర్షి చెప్పిన పురాణము యజ్ఞాది అగ్నివిషయము లిందు చెప్పఁబడినవి. గ్రంథసంఖ్య శివపురాణ దేవీభాగవత మత్స్య పురాణములందు ౧౬౦౦౦ గను, భాగవతమునను, బ్రహ్మవైవర్త్యమునను ౧౫౪౦౦ గను, నారదీయమున ౧౫౦౦౦ గను చెప్పఁబడియున్నది.

**అగ్నిబాణవిద్య** — బాణసంచావిద్య చూడుఁడు.

**అగ్నిభువుఁడు** — కుమారస్వామి. షణ్ముఖుఁడు.

**అగ్నిమాంద్యము** — ఆంగ్ల. Dyspepsia. జఠరాగ్ని మందగించిపోయి, ఆకలిలేకుండెడి రోగము. ఇది యించు కజీర్ణదోషముపై నాధారపడియుండు జబ్బు.

**అగ్నిమిత్రుఁడు** — శృంగులలోనొకఁడు. మగధదేశాధీశుఁడగు పుష్పమిత్రుని కుమారుఁడు.

**అగ్నివంశక్షత్రియులు** — అగ్నివంశ్యులను పేరువలననే అగ్నిసంభవులని యర్థమిచ్చుచున్నది. క్షత్రియులనఁగా క్షతమునుండి రక్షించువారు. అగ్నివంశక్షత్రియులనఁగా, అగ్నినుండి సంభవించి, క్షాత్రము నవలంబించినవారు. అగ్ని దేవుఁడు తమయాది పురుషుఁడుగాఁ జెప్పికొనువారి తెగలుహిందూ దేశమునందు నాలుగు గలవు. ౧. ప్రమర

వంశము, ౨. పురహారవంశము, ౩. చాళుక్య లేక శోలంకవంశము, ౪. చోహానవంశము.

పరశురామునిచే క్షత్రియవంశము నిర్మూలింపఁబడిన యనంతర మర్బుద పర్వత శిఖరమునందు మహర్షులు యాగముచేయగా హోమగుండమునుండి పై నాలుగువంశములు నావిర్భవించినట్లా ప్రాంతముల స్థలపురాణములు జెప్పుచున్నవి. వీరిలో ప్రమర వంశమువారు ముప్పదియైదు శాఖలుగా వ్యాపించి ప్రతిశాఖవారు నొక్కొక్క విశాలమగు రాజ్యమును స్థాపించియుండిరి. "ప్రపంచమంతయు ప్రమరులదే" అని యా ప్రాంతమునందొక లోకోక్తి కలదు. శతద్రూనది మొదలు సముద్రమువరకు వ్యాపించి యున్న దేశము తొమ్మిదిభాగములుగా ప్రమరవంశీయుల పాలనలోనుండెను.

మహేశ్వర్, ధార్, మండూ, ఉజ్జయిని, చంద్రభాగ, చిత్తూరు, ఆబూ, చంద్రావతి, మహామైదాన, పర్మావతి, అమరకోట, బిఖార్, లోదుర్వ, పట్టణ మొదలగునవి రాజధానులుగాఁ జేసికొని స్వతంత్రరాజ్యముల నేర్పాటుచేసికొని, వారు పాలించుచుండెడివారు. ప్రమరవంశీయుల పురాతన శాసనములు పాళీభాషలో వ్రాయఁబడినవి. క్రీస్తుకుఁ బూర్వమునుండియుఁ గనఁబడుచున్నవి. స్థలపురాణములయందు వీరి జన్మమునుగురించి యొకచిత్రమైనగాథఁ జెప్పుదురు.

ఆబూపర్వతశిఖరమునందు హోమగుండమునుండి యావిర్భవించినవారిలో మొదటి పూరుషుఁడు "మార్, మార్" అని యాక్రోశించుచు వేత్రహస్తుఁడై యుద్భవించుటచే వానికి ప్రమారుఁడను పేరిడఁబడెనట. ఆబూ, ధార్, ఉజ్జయినీ రాజ్యములు వానికీయఁబడెనఁట. బ్రహ్మదేవుని యంశమున మరియొక పురుషుఁడొక హస్తమునందు వేదములును, రెండవహస్తమునందొక ఖడ్గమును ధరించి పుట్టెను. అతఁడు యజ్ఞోపవీతము ధరించియుండెను. ఆపురుషునకు చాలూర్ లేక సోలంకియను పేరిడి, అన్హిలపురము నొసంగిరి. (అన్హిల్లానగరము చూడుఁడు). మూడవపూరుషుండు రుద్రాంశమున నావిర్భవించెను. అతఁడు ధనుర్బాణహస్తుఁడై కిరాతరూపమున నుండెను. వానికి 'పురహారుఁ' డను పేరిడి 'నానంగల్ మరుస్థలి' అనఁగా తొమ్మిది యెడారిరాజ్యములు వానికి వశపరచిరి. నాల్గవపూరుషుఁడు విష్ణునంశమున శంఖచక్రగదాఖడ్గాలంకృతములగు చతుర్భుజములతో హోమగుండమునుండి యావిర్భవించెను. చతుర్భుజములతోఁ బుట్టిన పురుషుఁడు వంశకర్తయగుటచే నీ వంశము చౌహాను (చతుర్భుజ) వంశమాయెను. అంత దేవతలు తమ ధన్యవాదములతో మాశావతీనగరమతనికి పట్టముగట్టిరి. దీనికి ద్వాపరయుగమున ఘుర్హా మండలి యను పేరుండెడిదఁట. వీరు హోమగుండమునుండి వెలువడిన వెంటనే శత్రుసంహారమునకుఁ దొడంగిరి.

**అగ్నివర్చస్సు** — వ్యాసమహర్షి శిష్యుఁడును ప్రసిద్ధపౌరాణికుఁడునగు సూతునకుశిష్యుఁడు. ఈతండును పౌరాణికుఁడే.

**అగ్నివర్ణుఁడు (అవీక్షిత్తు)**—ఇక్ష్వాకుసంతతి. సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి శంఖణుఁడు. సోదరులు సుదర్శనుఁడు, శీఘ్రగుఁడు. పుత్రుఁడు మరుత్తు.

**అగ్నివేశుఁడు** — మరీచి ఇక్ష్వాకుసంతతి; సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి చిత్రసేనుఁడు.

పితామహుఁడు సరిష్యంతుఁడు. ఈతఁడు బ్రాహ్మణుఁడై తపంబొనర్చి జాతకర్ణర్షి యనంబడెను. ఈతని సంతతివారందరును అగ్నివేశ్యాయనశాఖీయులగు బ్రాహ్మణులైరి.

ఇక్ష్వాకుసోదరుఁడగు అరిష్యుని సంతతి వాఁడగు దేవదత్తుని సుతుండనియు, ఈతఁడు కానీనుఁడామెననియు, జాతుకర్ణ్యుఁడను పేరితనిదేయనియు, కొన్నితావులగలదు. ద్రోణాచార్యునిగురుండు వేరొక అగ్నివేశుఁడును గలఁడు.

**అగ్నివేశ్యగోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**అగ్నిశర్మాయణగోత్రము** — నిధృవ గణము చూడుఁడు.

**అగ్నిశిఖాన్యాయము** — అగ్నిశిఖ యన నిప్పుమంట యనియర్థము. ఇది యెల్లప్పుడును మీఁదకేపోవును, గాని తక్కిన దిక్కులకుఁ బోవదు. ఎట్టి అవస్థలయందును ఒకేరీతి నుండువాఁడని భావము.

**అగ్నిష్టోమము** — వసంతఋతునందైదు దినములాచరించి ముగించెడి యొకయాగము.

**అగ్నిష్టోముఁడు** — చక్షుర్మనువు కుమారుఁడు.

**అగ్నిష్వాత్తులు** — పితృదేవతలలోని యొకతెగ. పితృదేవతలు చూడుఁడు.

**అగ్నిస్తంభగోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**అగ్నిహోత్రుని సప్తజిహ్వలు** — ౧. కాళి, ౨. కరాళి, 3. మనోజవ, ౪. లోహిత, ౫. ధూమ్రవర్ణ, ౬. విస్ఫులింగినీ, ౭. విశ్వరూపీ (విశ్వరేచి). ఇంకను శ్వేతా, సువర్ణా, పద్మరాగా, యని పాఠాంతరము గలదు. జ్వాలయొక్క సప్తావస్థలుగ వీనిని కొందరు తలంచియున్నారు.

**అగ్నిహోత్రన్యాయము** — అగ్నిహోత్రము యావజ్జన్మవిధిగాఁ జెప్పఁబడినది కాన, జన్మమున్నంతకాలమును జరుపవలసిన విధిందెల్పుటయం దగ్నిహోత్రన్యాయము వాడుచుందురు.

**అగ్నిహోత్రములో నాజ్యము పడినట్లు** హోమముకాదు కాన నిరర్థక నష్టము. ఇదియొకభావము. అపాయకరమగు పరిస్థితికి బలముకల్గినట్లని రెండవభావము.

**అగ్నీధ్రమహారాజు** — తండ్రి స్వాయంభువమనువు. అగ్నీధ్రుఁడు తండ్రి పరిపాలించి తనకొసంగిన రాజ్యమును దనపుత్రులందరకు బంచియిచ్చెననియు, అది జంబూద్వీపమంతయుననియు, అందిప్పుడు భరతవర్షమని పేరందిన భాగము నాభిమహారాజునకును (తనపుత్రులలోనొకనికి) ఇచ్చినభాగమనియుం జెప్పఁబడినది.

**అగ్నుల భేదములు (నామములు)**- భరతదేశపు ఆర్యశాస్త్రగ్రంథములం దగ్నులంగూర్చి యిటులవివరింపఁబడినది. హోమోపయోగాగ్నులు మూడు -

౧. వైవాహికాగ్ని - దీనికి ఔపాసనాగ్ని యనియు, గృహ్యాగ్ని యనియుం బేరులు వాడఁబడినవి. ౨. త్రేతాగ్ని - దీనికి వైతానికాగ్ని (వితానికయజ్ఞము) యనియు పేరు వాడఁబడినది. వేదికకుఁ దూర్పుననుండునది ఆహవనీయాగ్ని, వేదికకుదక్షిణముననుండునది దక్షిణాగ్ని, వేదికకుఁ బశ్చిమమున గార్హ్యాపత్యాగ్ని యునుండును. ఈమూఁడగ్నులును త్రేతాగ్నులని చెప్పఁబడినవి. 3. లౌకికాగ్ని - ఇది యేఁడుభేదములుగ నున్నది.

౧. ప్రదాహ్యగ్ని- వనముఁదహించునగ్ని, ౨. అభ్యాదాహ్యగ్ని- ఇండ్లఁదహించునగ్ని, ౩. శవాగ్ని- పీనుగులఁగాల్చు నగ్ని, ౪. సూతకాగ్ని- జాతకర్మయందలి యగ్ని, ౫. విద్యుదగ్ని (లేక వైద్యుతాగ్ని)-మెరుములయందును ఉరుములందును పిడుగులయందును నగ్ని, ౬. ఉత్తపనాగ్ని- ప్రేతకార్యమందలి యగ్ని, ౭. కపాలాగ్ని- ప్రేతకార్యమందలి యగ్ని, ఉత్తపనాగ్ని, కపాలాగ్నియుఁగూడ ప్రేతకార్యమునందుపయోగించు నగ్నులే.

శ్రౌతాగ్నులు-ఐదుచెప్పఁబడినవి. (పంచ శ్రౌతాగ్నులు) ౧. గార్హపత్యాగ్ని- ఇది గృహస్థు నిత్యమును హోమము వేల్చుచుండు నగ్ని, ౨. ఆహవనీయాగ్ని— ఇది నైమిత్తికములందు గృహస్థు హోమము వేల్చుచుండు నగ్ని, ౩. దక్షిణాగ్ని-యాగాదులయందలి యగ్ని, ౪. సభ్యాగ్ని- ప్రత్యేకము శాంతింగూర్చి దేశరక్షణకై హోమము వేల్చుటకైన యగ్ని, ౫. ఆవసథ్యానాగ్ని- (ఆవసదమనిన గృహమున కర్థము) గృహస్థు గృహశాంతికై హోమమొనర్చు ప్రత్యేకాగ్ని. ఈయైదుశ్రౌతాగ్నులును గృహస్థునకు సంబంధించినవియే.

వైశేషికతర్కశాస్త్రమున- అగ్ని నాల్గు విధములుగఁ జెప్పఁబడినది. ౧. భౌమాగ్ని- భూమియందుండు వేడి యగ్ని, ౨. అబింధనాగ్ని— నీటిబుగ్గలందుండు వేడియగ్ని. అప్ = ఉదకము, ఇంధనము = అగ్నింభరించు నాధారమని యర్థము. వేడినీటి బుగ్గలు లేక ఉష్ణగుండములందుండు వేడి యని భావము. మరియుఁ బాడబాగ్ని సముద్రమందుండు నగ్ని యని చెప్పఁబడినది.

౩. ఔదర్యాగ్ని- ఉదరము (శరీరము) నందుండు జఠరాగ్ని వేడి, ౪. ఆకరజాగ్ని- ఆకరమనిన గనియని యర్థము (ఖని) రత్నములు, లోహములు మొదలగునవి ఆకరజాగ్ని సంబంధములుగ జెప్పఁబడినవి.

ఆయుర్వేదీయ ఔషధముల వంటయందుపయోగించు అగ్నులు మూడు (అగ్నిత్రయము). ౧. దీపాగ్ని-దీపమువలె ఎడతెగక మండు సన్ననిమంట. ౨. కమలాగ్ని- తామరపూవువలె అన్నిదెసలకు మధ్యరకముగా వేడినిచ్చుమంట. ౩. గాఢాగ్ని- అధికముగమండు గాఢాగ్ని. దీపాగ్నికంటె కమలాగ్నియు,కమలాగ్నికంటెగాఢాగ్నియు హెచ్చుగనుండు బలమగుమంటలని యెరుంగునది. ఇంకను ఈసందర్భమున ౪. దావాగ్ని- వనములంగాల్చుచు కాలినచెట్లనుండు నగ్ని. ౫. కుకూలాగ్ని లేక తుషాగ్ని- కాలుచున్న యుబుక (ఊక) నంటియుండునిప్పు. ౬. భగనాగ్ని- ఏరుబిడకల నంటియుండు నిప్పు. ౭. వానిజాగ్ని, ౮. వత్సలాగ్ని, యనంబడు అగ్నులుకూడ చెప్పఁబడినవి. ఇంకను గొన్ని గ్రంథములం దగ్నులిటులఁ జెప్పఁబడినవి.

వైద్యుతాగ్ని-మేఘములందలిమెరుపునందలియగ్ని. దీనికధిష్ఠాతపావకుఁడు లేక పావకాగ్ని. నిర్మంథాగ్ని-ఒకదానినొకటిరాసుకొనుటవలనగల్గినయగ్ని. దీనికధిష్ఠాతపవమానుఁడు. శుచ్యగ్ని-సూర్యమండలమునందుండు వేడి అగ్ని యధిష్ఠాత శుచి. పావకుఁడు, పవమానుఁడు, శుచి యనువారలగ్నికి స్వాహాదేవియందు కల్గిన సుతులుగ జెప్పఁబడెను. పావకాగ్ని-లౌకికకర్మలందలి యగ్నికిఁబేరు. మారుతాగ్ని-గర్భాదానమునందలి యగ్నికిఁ బేరు. ఇందేగ్ని-(చంద్ర) పుంసవనకర్మయం

దగ్నికిఁబేరు. శోభనాగ్ని-శుంగాకర్మయం దగ్నికిఁబేరు. మంగళాగ్ని-సీమంతకర్మయం దగ్నికిఁబేరు. ప్రగల్భాగ్ని-జాతకర్మయం దగ్నికిఁబేరు. పార్థివాగ్ని-నామకరణకర్మ యందగ్నికిఁబేరు. శుచ్యగ్ని-అన్నప్రాశనకర్మ యందగ్నికిఁబేరు. సభ్యాగ్ని-చౌళకర్మయం దగ్నికిఁబేరు. సముద్భవాగ్ని-ఉపనయనకర్మ యందగ్నికిఁబేరు. సూర్యాగ్ని-గోదానకర్మ యందగ్నికిఁబేరు. అగ్ని-కేశఖండనకర్మయం దగ్నికిఁబేరు. వైశ్వానరాగ్ని-విసర్గకర్మయం దగ్నికిఁబేరు. యోజకాగ్ని-వివాహమునం దగ్నికిఁబేరు. శిఖిఅగ్ని లేక ధృత్యగ్ని-చతుర్థీహోమమునందగ్నికిఁబేరు. విధుఅగ్ని-ప్రాయశ్చిత్తకర్మయం దగ్నికిఁబేరు. పాచకాగ్ని-పాకాంగకమగు హోమములందగ్నికిఁ బేరు. వహ్నిఅగ్ని- లక్షహోమమున యగ్నికిబేరు. హుతాశనాగ్ని- కోటిహోమమునసగ్నికిఁబేరు.మృడాగ్ని-పూర్ణాహుతియం దగ్నికిఁబేరు. వరదాగ్ని-శాంతిహోమమున నగ్నికిఁబేరు. బలదాగ్ని-హశాష్టిక (కర్మ) హోమమున నగ్నికిఁబేరు. క్రోధాగ్ని-అభిచార (మారణ) హోమమున నగ్నికిఁ బేరు. శమనాగ్ని-వశ్యకర్మయందగ్నికిఁబేరు. అభిరూపకాగ్ని-వరదానకర్మయం దగ్నికిం బేరు. జఠరాగ్ని-కోష్టమునం దగ్నికిఁబేరు. క్రవ్యాదగ్ని- అమృతభక్షణమునం దగ్నికిం బేరు.

**అగ్నులు** — బ్రహ్మమానస పుత్రుండగు నభిమానాగ్నికి సుదర్శనాదేవి, స్వాహాదేవి యను నిరువురు భార్యలుండిరి. అందు సుదర్శనా దేవి వలన సుదర్శనుండను పుత్రుఁడుగల్గెను. ఇతఁడు నగ్నిగెను.

స్వాహాదేవివలన పావకుడు, పవమానుడు శుచి, యని మువ్వురుపుత్రులు కలిగిరి. వారికొక్కొక్కరికిపను నేనుగురుచొప్పున నలువది యైనుగురుపుత్రులుకలిగిరి.వీరలందరునగ్నులైరి.

ఇంకను నభిమానాగ్నికి దత్తపుత్రుండగు నాంగీరసమహర్షి యు కొంతకాలమగ్నిత్వము (పదవి) నందినవాఁడె. ఈయనభార్య స్వాహాదేవి. వీరికి బృహజ్జ్యోతి, బృహత్కీర్తి, బృహన్ముఖుడు, బృహన్మతి, బృహద్భానుఁడు, బృహస్పతి, బృహద్బ్రహ్మ, యను నేడ్వురు పుత్రులును అనుమతీదేవి, రాకాదేవి, శినీవాలీ దేవి, కుహూదేవి, అర్చిష్మతీదేవి, హవిష్మతీ దేవి, మహామతీదేవి అను నేడ్వురు పుత్రికలునుగల్గిరి. ఇంకను యోగసిద్ధి యనంబడు వేరొక పుత్రికకూడ కలదని చెప్పఁబడినది. ఇటుల నాంగీరసాగ్నికి బహునేనుగురు సంతానము. వీరికుటుంబ మిటుల చెప్పఁబడినను ఇందగ్నిత్వమున కర్హతనందినవారు నలువది తొమ్మండుగురు అని చెప్పఁబడినది. వారి పేరులిట వివరించుచున్నాము.

అభిమానాగ్ని ౧, (త్రేతాగ్నులు) పావక పవమానశుచులు ౩, త్రేతాగ్నుల పుత్రులు నలువదియైదుగురు ౪౫ (వీరిపేర్లు పదమూడుమాత్రము గనబడుచున్నవి.)

ఇటుల నలువదితొమ్మండుగురే అగ్నిత్వమునకర్హులని చెప్పఁబడినది. త్రేతాగ్నుల పుత్రులపేరులలో లభించినవి ౧౩ మాత్రమే. ౧. గృహపతి, ౨. గోపతి, ౩. జాతవేదాగ్ని, ౪. తపుఁడు (ఈతని పాదకుఁడని వేరొకచో జెప్పఁబడినది),౫. ధనంజయాగ్ని, ౬. పురందరాగ్ని, ౭. ప్రాజాపత్యాగ్ని, ౮. శయుఁడు, ౯. విశ్వపతి, ౧౦. విశ్వభుక్కు, ౧౧. వైశ్వానరాగ్ని, ౧౨. శంయుడు, ౧౩. హుతాశనుఁడు, తక్కినపేరులు తెలియకున్నవి.

అష్టాగ్నులు — ౧. అగ్ని, ౨. జాతవేదుఁడు, ౩. సహోజుఁడు, ౪. అజరాప్రభుఁడు,

౫. వైశ్వానరుఁడు, ౬. సర్వాపసుఁడు. ౭. పజ్క్తిరథుఁడు, ౮. విసర్పుఁడు వీరు అష్టాగ్నులనం బడుదురు.

పంచాగ్నులు — ౧. దక్షిణాగ్ని, ౨. గార్హపత్యాగ్ని, ౩. ఆవహనీయాగ్ని, ౪ సభ్యాగ్ని, ౫. అసభ్యాగ్ని, ఇవి పంచాగ్ను లనంబడును.

త్రేతాగ్నులు — ౧. ఆహవనీయాగ్ని, ౨. గార్హపత్యాగ్ని, ౩. దక్షిణాగ్ని, ఇవి త్రేతాగ్నులనంబడును.

**అగ్రజన్ముఁడు (విధాత)** — ప్రథమమున సృష్టింపఁబడువాడగుటచే నిట్టినామముకల్గెను.

**అగ్రదానీ బ్రాహ్మణశాఖ** — అగ్రమున (ముందు) దానార్హులగువారని యర్థము. అపరకర్మ-ప్రేతకార్యములందు దానములం బట్టువారు. వీరి నన్యశాఖలవారు తక్కువ వారుగ నెంతురట. కాని నిదర్శనములు లేవు. బ్రహ్మవైవర్త్యపురాణమున వీరి ప్రశంస కలదు.

**అగ్రద్వీపము**—అగ్రవనము వ్రజమండలము లోనిది. ఇప్పటి ఆగ్రాపరిసరములు. అగ్ర ద్వీపము, ఇప్పటి నవద్వీపప్రాంతమున కీపేరు కలదందురు. గోపీనాథస్వామి దేవళము కట్టఁబడినది. అగ్రవనము చూడుఁడు.

**అగ్రఫా** (Agrapha) — క్రైస్తవులు వాడుపదము. ప్రభువగు క్రీస్తుచెప్పినదియు, గ్రంథములందు వివరింపఁబడనిదియు నగు యుక్తి కీపేరు వాడుచుందురు. మరియు కొన్ని సుప్రసిద్ధోక్తులకుగూడ నీపేరు వాడుట కలదట.

**అగ్రము** — Head:—Rass Promontory High Land ఎత్తగు ప్రదేశము. అగ్రము సముద్రములోనికిఁ జొచ్చుకొనిపోవు సన్నని భూభాగము. Cape అనియునందురు. ఇది భూమికొన యనంబడుచున్నది. లేండు పోర్లన్సు చూడుఁడు.

**అగ్రమూలకులగోత్రము** · ఆర్య వైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. 'అమలకుల' చూడుఁడు.

**అగ్రవనము** — దీనినిప్పుడు ఆగ్రా యను చున్నారు. ఇది వ్రజమండల వనములలో నొకటి. ఇందు పెక్కు మహమ్మదీయ కట్టడములు కలవు. అందు తాజమహాలును కోటలోని సమన్బురుజు (Jasmin Tower) అనునవియు కడుపేరొందినవి. ఆగ్రానగరము చూడుఁడు.

**అగ్రాయణ గోత్రము** — సంకృతి ఉపగణము చూడుఁడు.

**అగ్రావగోత్రము** –నిధ్రువగణముచూడుఁడు

**అగ్రహారము** — బ్రాహ్మణులకు (వృత్తి) జీవనముగా నేర్పాటు చేయఁబడిన భూములు గలగ్రామములు ఆంధ్రదేశమునందు అగ్రహారములనియు, దక్షిణదేశమునందు మంగళములనియు, ఓఢ్రదేశమున శాసనము లనియుఁ బిలువఁబడుచున్నవి. అగ్రహార మనఁగా నేవిధమయిన పన్నులులేనిదని కొందఱును, బ్రాహ్మణగ్రామమని కొందఱును నిర్వచనము చెప్పుచున్నారు. అగరములేక అకరము అనునది అగ్రహారశబ్దమునుండి వచ్చిన తద్భవరూపముగా నాంధ్రవిజ్ఞాన సర్వస్వము మొదటిసంపుటమునందు వ్రాయఁ బడియున్నది. అకరశబ్దమునకు కరము అనగా పన్ను లేనిదని వారియూహ. కరశబ్దము పన్ను అనునర్థమున వాడుక చేయఁబడినపుడు సంస్కృతసమ మగును కాని ఆచ్ఛికము

కానేరదు. కాగా కరశబ్దముమీఁద నఞ్
తత్పురుష సమాసరూపముగావచ్చిన అకర
శబ్దము అగ్రహారశబ్దమునకు తద్భవరూప
మెట్లగునో మే మూహింపఁజాలకున్నాము.

పూర్వపుసంస్థానాధీశ్వరులు వివిధములగు
విద్యలయందును వేదశాస్త్రములందును
విశేషప్రావీణ్యముగల బ్రాహ్మణపండితులకు
నదీతీరములందును, తృణకాష్ఠ జలసమృద్ధము
లగు నితర ప్రదేశములందును భూములనిచ్చి
వృత్తులుగా విభజించి విద్యార్థులకుచితముగా
విద్యాదానము చేయునట్లేర్పాటు చేయఁబడి
యుండిన భూవసతులు అగ్రహారములగుటచేఁ
బ్రతి యగ్రహారమును నొకవిధమగు గురు
కులాశ్రయము, లేక సూక్ష్మమయిన విశ్వవి
ద్యాలయము (Miniature University)
గానుండెడిది. ఉత్తర హిందూదేశమునందు
గూడ నీపద్ధతినే యొసంగఁబడిన యనేకగ్రామ
ములు నేఁటికిని గానంబడుచున్నవి.

అగ్రహారములకు అచ్చ తెనుఁగు పేరు
నల్లిండ్లు. నల్లిండ్లనఁగా నౌపాసనధూమాది
కములచే నల్లబడిన యిండ్లుగ (గలవని) శబ్ద
రత్నాకరమందు నిర్వచింపఁబడి యున్నది.
రానురాను అగ్రహారపుభూములు కుటుం
బాస్తు లయిపోయి, కుటుంబాభివృద్ధిఁజెందిన
కొలఁదిని దాయవిభాగపుఁ బంపకమునకుఁ
బాల్పడినవి. వీనిలోఁ గొన్ని యగ్రహార
ములభూము లింకను చరపంపకములుగానే
యున్నవి. ధ్రువపంపకములయిన యగ్ర
హారములును గొన్ని గలవు. అగ్రహారపు
భూములు తరుచుగా వృత్తిసంజ్ఞ గలిగి
యుండును. ఆ వృత్తిసంజ్ఞ యన్నియగ్ర
హారములయందును సమానమగు పరిమితి
గలిగియుండదు. అగ్రహారపు యజమాను
లకు భుక్తలనిపేరు. ప్రతి యగ్రహారము
నందును చాకలి, మంగలి, కుమ్మరి, వడ్రంగి,
ఉప్పరి మొదలగు జాతులవారికి "నౌకరీ
మాన్యము" లొసంగఁబడియుండును. ఆ
మాన్యములు సమిష్టిభూములలోనే ఈయఁ
బడుట, ఆయా నౌఖరులు అగ్రహారీకు లంద
రికిని బనివడినపుడు వెట్టిచేయుచుండవల
యును. అగ్రహారపు భూములనుండి ప్రభు
త్వమువారికి చెల్లింపఁబడు పన్నునకు శ్రోత్రి
యము అనిపేరు. కొన్ని యగ్రహారముల
యందలి భూములకు, ఏవిధమయిన పన్ను
నుండదు. అట్టివానికి 'సర్వదుంబాలాభూము'
లని పేరు.

బ్రాహ్మణులకు విద్యాదానము చేయు
టకు భూము లిచ్చినట్లే, శిల్పులు, కులాలురు,
స్వర్ణకారులు, కంచరులు మొదలగువారికి
వారిపరిశ్రమల నితరులకు నేర్పుటకుఁ గొన్ని
చోట్ల పూర్వకాలమునుండియు భూము
లొసంగఁబడియున్నవి. ఆంధ్రదేశమునందు
గంజాము విశాఖపట్టణమండలములయం
దగ్రహారములుమెండు. ఇవి యన్నియును
ప్రస్తుత సంస్థానాధీశ్వరుల పూర్వికులచే
నొసంగఁబడి నేఁటికిని వంశపారంపర్యముగా
దానవిక్రయ సత్వాధికారములతో ననుభ
వింపఁ బడుచున్నవి.

**అగ్రిప్పా** — ఎగ్రిప్పా చూడుఁడు.

**అగేట్‌రాయి** (Agate) — సిలికాయొక్క
రూపాంతరమనియు, లేక పరిణామమనియు,
నీటినుండి కలిగినదనియు జెప్పఁబడినది. చాల
గట్టిదియు, జిగిగలదియు, బేరింగ్సుగను
(Scientific Instruments) కొన్ని
ఉపకరణముల భాగములుగను, కల్వములు
మొదలగునవిగను చేయఁబడుచున్నది. వేగ

మరుగక నిలచియుండునది. రత్నమువలె నుండు గట్టిరాయి.

**అగేటి** (Agate) — ఇది Precious Stones' నాఁ జెప్పఁబడిన రత్నము. Chalcedony జాతికిఁజెందినది. Silica యొక్క రూపాంతరము సౌందర్యవంతము. అనేకరంగులిందు పొరలుపొరలుగ నమరియుంట వింతసౌందర్యముం జూపు నీటింగల్గిన దిగ నుండును. మధ్యనుండి ఈరంగులు కడవరకును వ్యాపించినట్లుండును. ఇందు కొన్ని Crystals ఉండును.

ఈజాతిసంబంధమైనదేయగు Onyx అనఁబడు రత్నశిలయందొకటి తప్పించి యొకటిగ Alternate Parallel Bands కన్పించుచుండునవి నలుపు, తెలుపు, రంగులవిగ గన్పట్టును. రత్నములు, రత్నము చూడుఁడు.

**అఘమర్షణగణము** — ఇది విశ్వామిత్ర సంతతియందలి యొకగణము. ఇందు ౧. అఘమర్షణ, ౨. కుశిక, యను రెండు గోత్రములు కలవు. ప్రవర- విశ్వామిత్ర, అఘమర్షణ, కౌశిక.

**అఘమర్షణగోత్రము** — అఘమర్షణ గణము చూడుఁడు.

**అఘాసురుఁడు** — శ్రీకృష్ణునిచే అజగరాకారముననుండగా వధింపఁబడినవాఁడు. వీని యన్న బకాసురుఁడు. బకుని శ్రీకృష్ణుఁడే బృందావనమున వధించెనని చెప్పఁబడినది. భీమునిచే ఏకచక్రపురము (చకర్ నగరు) న వధింపఁబడిన వేరొక బకాసురుఁడు గలఁడు.

**అచలుఁడు** — ఇతఁడొక జైనమతస్థవీరుఁడనియు, అచింత (ఇప్పటి అజంతా) గుహాలు నిర్మించినవాఁడనియుం జెప్పఁబడినది. అచింత కందరము చూడుఁడు.

**అచింతకందరము (గుహా) లు** — దీనినిప్పుడు అజంతగుహాలు (Ajanta Caves) అనెదరు. ఈ గుహాలు క్రీస్తు వెనుక అయిదారు శతాబ్దముల పనిగాఁ బోల్చుచున్నారు. అందున్న యొక శిలాశాసనమున ఆగుహాలు అచలుఁడను నొక స్థవీరునిచే నిర్మింపఁబడినట్లు కలదు. బౌద్ధమత యోగాచార్య సిద్ధాంతధర్మమునకు నాదిపురుషుఁడనఁబడిన యార్యసంగుఁడు లేక అసంగుఁడనంబడిన పండితాగ్రేసరున కిది నివాసమనియుఁ జెప్పఁబడినది. ఎల్లూరా గుహాలనుండి యేబదియైదుమైళ్ల దూరము.

**అచితము** — ఇరువదియైదు మణుగుల బరువునకు అచితప్రమాణమని పేరు.

**అచిరవల గోత్రము** — కుండినగణము చూడుఁడు.

**అచిరావతి నది** — దీనినిప్పుడు రప్తీనది యని వాడుచున్నారు. ఈనదిపై శ్రవస్తీ పురముండెనని వరాహపురాణము ౨౧౮ అధ్యాయమున నుండెను. ఈనదికి అజిరావతి యనియు, ఐరావతియనియుం గూడ బేరు లుండెనట. ఇది సరయూనదియందు జేరు నది.

**అచ్ఛావత సరస్సు** — అచ్ఛోదము చూడుఁడు.

**అచ్చివచ్చిన భూమి అడుగఁడే చాలును** — అచ్చివచ్చుట యన ఋణమున్న అనియర్థము. తనకు క్షేమకరమైనదని భావము. ఆంధ్రలోకోక్తి.

**అచ్యుతకృష్ణానిధి** — ఒక పండితుఁడు. సిద్ధాంతకల్పతరువను మహాగ్రంథమునకుఁ గృష్ణాలంకారమనువ్యాఖ్య నీతఁడురచించెను.

**అచ్యుతవ్యూహము** — రామానుజీయ వైష్ణవ, చైతనవైష్ణవ మత ధర్మములందు తదేకాత్మరూప మహావిష్ణువు. అందు ద్వితీయచతుర్వ్యూహములలో నొకటి యనియు, సంకర్షణ వ్యూహము లైదింటిలో నొక ఉపవ్యూహమనియు, విలాస మూర్తి యనియు, వరుసగ గద, పద్మ, చక్ర, శంఖము లాయుధములనియుఁ జెప్పఁబడినది. (విష్ణుదేవాలయ విగ్రహములు చూడుఁడు).



**అచ్చుపుస్తకముల పుటలు కోత** — తొల్లింట కోతయంత్రము (Guillotine)లు లేనితరి పుస్తకమచ్చొత్తిన పిదప చేతితో కోసియో కత్తిరించియో పుటలను సరిజేయుచుండెడివారు. పిదప కోతయంత్రముతో సరిగా కోయుచున్నారు. ఈపుటలు నాలుగు, ఆరు, ఎనిమిది, పండ్రెండు, పదునారుగ నొకతరి ముద్రించి మడచికుట్టి పిదప కోత యంత్రమునఁ గోయుటచే మధ్యనొకానొక కాగితముగాని, మడతగాని కోతయంత్రము కందక తప్పించుకొనినచో నదియట్లేయుంట అప్పుటప్పుట కాననగును. కాని యీమధ్య చులకన కాగితముల (Feather Weight) పై ముద్రింపఁబడిన కొన్నిపుస్తకములు పుటలంగోయకయే వదలుట ఒకవిధానమైనది. ఇంకను ఎక్కువ విలువకుగాను ధనికులకు విక్రయించు కొన్ని షోకుపుస్తకము లింగ్లాండు దేశమున పుటలంగోయకయె సమముగనుండునట్లుమాత్ర మొనర్చెదరు. తొల్లింట చేత గాకను విధిలేకననుపద్ధతి నేఁటికి షోకుపద్ధతి యయ్యెనని తేలుచున్నది.

**అచ్చువేసి విడిచిన యాఁబోఁతు** — ఒకరి చెప్పుసేతలను పాటింపక స్వేచ్ఛగఁ దిరుగువారింగూర్చిన సామెత.

**అచ్ఛోద సరస్సు, అచ్ఛోద** — మరీచి సంతతి యగు పితృదేవతాగణముయొక్క మానసపుత్రిక ఈమెయే. తన పితరులచే నిర్మింపఁబడిన సర తీరమున గొప్ప తపం బొనర్చుట నాసరస్సున "కచ్ఛోదసరస్సు" అను పేరుకలిగెను. మరియుం దీని నచ్ఛావతమనియు, ననుచుండిరి. బాణభట్టుని కాదంబరియందునను, బిల్హణుని విక్రమాంకదేవచరిత్రమునను, వివరింపఁబడిన యచ్ఛోద మిదియె. బృహన్నారదీయ పురాణమున ౧వ అధ్యాయమునఅచ్ఛోదసరోవరతీరమున సుప్రసిద్ధమగు మహాశ్వేతాశ్రమమనంబడిన సిద్ధాశ్రమ ముండినటులఁ జెప్పఁబడినది. కాశ్మీరదేశము చూడుఁడు. అటుల 'అచ్ఛోద' యొనరించిన తపంబున కచ్చెరువంది యామె పితరులు దివ్యాలంకారభూషితులుగ నామెం జూడవచ్చిరి. అంత నామె వారిలో నొకఁడగు మావసునియందు మోహావేశతత్పరయై యనురక్తయై, మనోవ్యభిచారనిమగ్నయయ్యెను. దానంజేసి యచ్ఛోద తపఃఫలముసెడి యోగభ్రష్టయై క్రిందికిఁబడి దుఃఖించుచు బితరులంగూర్చి, తనదోషమును సైచిరక్షింపుఁడని పలువిధముల విలపించెను. వారెట్టకేలకుఁ గరుణించి ద్వాపరయుగమున ఝష కడుపునఁబుట్టుమని నియమించిరి. ఆమెయె అటుల సత్యవతియను పేరంబరగుచు పరాశర మహామునివలన వ్యాసమహర్షింగని పిదప శంతనుని భార్యయైదనరుచు విచిత్ర

వీర్యుఁడుచి త్రాంగదుఁడులను నిర్వీరసుతులం బడసెను. పిదప అచ్ఛోదమను పుణ్యానదిగ మారి అచ్ఛోదసరస్సనం జేరుకొనెనని చెప్పఁబడినది.

ఇంకనచ్ఛోదకన్యక తపంబొనర్చుతరి మోహించిన పితరుండగు మావసుండు నిశ్చల చిత్తుండై యత్తరి నిలువంబడియుండ పితరులు మెచ్చుకొని నాటిదినమున కాతనిపేర అమ వసయనిరి. నేటికిని జాంద్రమాన మాస మందలి కడపటిదిన మమవసయను పేరం బరగుచున్నది. అచ్ఛోద సరోవరతీరమునసే కుబేరుని చైత్రవనము లేక చైత్రరథవనమనం బడుపూఁదోటయు నుండెను. అచ్ఛోదానది నేటికి నందుజేరుచు దిరుగనందుండి వెలువఘు చుండు చిన్ననదిగ నున్నది. కాశ్మీరదేశము నందు మార్తాండక్షేత్రమున కారుమైళ్ల దూరమునందున్నది. దీనినిప్పటివారు అభీహా వత్తనియు వాడుచుందురు.

**అజంఘుర్జిల్లా** — అంజఘురు నగరములు ప్రధానస్థానము. ఆగ్రా ప్రానిన్ను చూడుఁడు.

**అజంతగుహలు** — అచింతకందరములు చూడుఁడు.

**అజకుఁడు** — పురూరవుని సంతతియం దొకఁడగు జహ్నుని పౌత్రుఁడు. చంద్రవంశ క్షత్రియుఁడు. సుమంతుని పుత్రుఁడు. వాని కుమారుని పేరు బలాకాశ్వుఁడు.

**అజగంధి గోత్రము** — ఔతథ్యఉపగణము చూడుఁడు.

**అజగంధి–గోత్రము** — కారేణుపాలి ఉపగణము చూడుఁడు.

**అజగరము (కొండచిలువ)** — దీని నాంగ్లమున Python అనియు Boa-constrictor అనియునందురు. గొప్పజాతి పాము. అన్నిపాములవలె కఱచి విషమునిడి చంపుటకుమారుగ, జంతువులు మొదలగు వాటి నేకముగా మ్రింగివైచెడిని. భరతదేశము నుండి మరలిపోవు గజనీమహమ్మదున కఱు వదియడుగుల పొడవుగల కొండచిలువదొరకె నట. దానింజంపి చర్మముం దీయించి బాగుచేయించి గజనీపురపు సింహద్వార మునం గట్టించి నటుల అబుల్ బైహాకి యను పేరుగల ఆయనచరిత్రకారుఁడు వ్రాసి యున్నాఁడు.

కొన్నిమోటజంతువులు కొండచిలువకు దొరకగనే దానింజుట్టికొని బిగించి ఎముకలను విరగజేసి మ్రింగుటయుంగలదు. ఎరమ్రింగి మొద్దువలె కదలక పడియుండుటయుంగలదు. మహాభారతమున నహుషుఁ డగస్త్యుని శాప హతి నజగరమై రామవన్నగర ప్రాంతముల నుండుచు భీముఁడు వేటకై యేగ పట్టుకొనె ననియు, యుధిష్ఠిరమహారాజు దాని ప్రశ్నల కుత్తరము లొసంగి విడిపించెననియు, నా చిలువయు శాపవిముక్తిం గాంచెననియు చెప్పంబడినది.

**అజగరవృత్తిన్యాయము** — కొండచిలువ (పాము) కదలలేనిది. కాని దగ్గరకు వచ్చినదానిని వదలక మ్రింగివేయును.

తానితరులకడకు బోలేక తనదగ్గరకు వచ్చినవారిని మాత్రమె బాధించు దురాత్ముల కీన్యాయము వర్తించును.

**అజగరుఁడు** — ప్రహ్లాదునకు పరమహంస రహస్య ధర్మముల నెరింగించిన యొక ఋషి. పిదపఁ గొంతకాలము కావేరీతీరమున నెక్కడనో లేక సహ్యాపర్వత (పడమటి కనుమలు) (Western Ghats) ప్రాంత

మునినో యాశ్రమమేర్పరచుకొని వసించుచుండువాఁడని తెలియుచున్నది.

**అజగరోపవాసము** — త్రికరణశుద్ధి చూడుఁడు.

**అజగవము** — శివునివిల్లు. ధనుర్విద్య చూడుఁడు.

**అజప (లేక అజపగాయత్రి)** — ఊపిరి తీయునపు డుచ్ఛ్వాస నిశ్వాసములుగ యోగాభ్యాసప్రయత్న మక్కఱలేకయే పూరక, కుంభక, రేచకములు నడచుచుండు నటుల బరమేశ్వరుఁ డేర్పరచియేయున్నాఁడు. (ప్రాణాయామము, పూరకము, కుంభకము, రేచకము చూడుఁడు.) అట్టియెడ గాలిలోనఁ బ్రవేశించుచో 'సో' అను శబ్దమును, పైకివెడలుచో 'హమ్' అను శబ్దమును గల్గునని అద్వైతులగు యోగవేత్తలు ధ్వనిని పోల్చిరి. ఇట్లూపిరి లోనికిందీయుటయు (పూరకము), పైకివదలుటయు (రేచకము) వలన "సోహమ్" అను శబ్దమేర్పడినదనిరి. ఇదియే అజప మంత్రము. అనగా చేయబడని జపమని భావము. దీని నింకను అజపగాయత్రి యనియు కొందరందురు కాని గాయత్రితో దీని కేసంబంధమును గానరాదు. ఇట్టి యజప "సోహమ్"లు దినమునందు సూర్యోదయాది సూర్యోదయ పర్యంతము ౨౧౬౦౦ లు నడచుచుండునని యోగశాస్త్ర వేత్తలు లెక్కించియున్నారు. ఇంకను కొందఱు పరిశీలనవలన మూలాధారచక్రమున ఆరు వందలును, స్వాధిష్ఠానచక్రమున నారు వేలును, మణిపూరకమున ఆరువేలును, అనాహతచక్రమున ఆరువేలును, విశుద్ధచక్రమున రెండువేలును, ఆజ్ఞేయచక్రమున వేయియు, ఇటుల మొత్తము ఇరువదియొక వెయ్యి ఆరువందలని గూడ వివరించిరి.

యోగాభ్యాస మెఱుఁగనివారు దీనిని పాటింపఁజాలరనియు యోగులు తమయభ్యాసమున పీలగునంతవేగము తగ్గించి, ఊపిరి నడుపుచు తుదకు కేవల కుంభకమునకుం దెత్తురనియుఁ జెప్పఁబడినది. సర్వసాధారణముగ దేహము శ్రమచెందునట్లు పనిచేసినవారూపిరివదలిన గాలి ఇరువదియేడంగుళములుగను, నిద్రించుతరి ఇరువదిరెండంగుళములుగను,నడచునపుడు పదునెన్మిదంగుళములును, భుజించుతరి పదునేనంగుళములుగను, గానమొనర్చుతరి పండ్రెండంగుళములుగను, ఏపనియు లేక విశ్రాంతిగఁ గూర్చుండుతరి తొమ్మిదంగుళములుగను పైకి వెడలుచుండునని లెక్కించి యున్నారు. విశ్రాంతికాలమునందలి తొమ్మిదంగుళముల ఊపిరిగాలిని, యోగాభ్యాసమున నింకను తగ్గించిన నాయుర్వృద్ధికరమని కనిపెట్టఁబడినది. కేవలము శ్వాస నిలిచిపోయినచోఁ గుంభకఁ కాలమున అజప నిముషమునందు పదునేను సారులచొప్పున నడచుచుండుననియు నింకను యోగాభ్యాసవిశారదులైనవారు నిముసమునకు ముప్పదిసారులు జరుపనగుననియు అట్టితరి మనోన్మనిస్థితిగల్గి అమనస్కయోగి యనంబడుననియుఁ జెప్పఁబడినది. అజపయందలి సకారము శక్తిచిహ్నమును హకారము ఈశ్వరచిహ్నమునని చెప్పఁబడినది.

**అజమతి లేక అజయనది** - గాలవతంత్రమనుగ్రంథమున దీని నజయఅనివాడిరి. మహాకవి జయదేవుఁడు యీ నదీతీరముననే కెందూలియనబడు ఇప్పటి పట్టణమునకుఁ బరిసరములనె జన్మించిన తావుకలదు. ఇది ఇప్పుడు Birbhum (వీరభూమి) జిల్లా యందున్నది. మరియు నీనది బంగాళ

రాజ్యములోని కట్వాపరిసరముల గంగానది యందు జేరిపోవును. జయదేవకవి "గీత గోవిందము" రచించినకవి, చైతన్యవైష్ణవుఁడు.

**అజమహారాజు** — దిలీపమహారాజునకుఁ బౌత్రుఁడు, రఘుమహారాజునకుఁ గుమారుఁడు అనియు కొన్నితావులను, రఘుమహారాజు కుమారుఁడు నాభాగుఁడు లేక పృథుశ్రవుఁడను వాఁడొకఁడు కొంచెముకాలముజీవించి తండ్రి జీవితకాలముననే మరణించెననియు ఆతని కుమారుఁ డీ యజమహారాజని కొన్నిచోట్లను జెప్పఁబడినది. అజమహారాజు భార్య విదర్భరాజ పుత్రికయగు నిందుమతి. యామెగర్భముననే శ్రీరాముని తండ్రియగు దశరథమహారాజు జనించెను. అజమహారాజు గొప్ప జయశీలుఁడని చెప్పఁబడినది. ఇంకను మిథిలాధీశుండగు ధృతునిసుతుండొక యజుండు కలఁడు. మఱియు విధాతకును మన్మథునకును అజుండని పేరువర్తించెడిని.

**అజమీఢుఁడు** — ఈతని తండ్రి పేరు హస్తిమహారాజు,కుమాళ్లు ౧. బృహద్విషుఁడు, ౨. నీలుఁడు, 3. ఋక్షుఁడు, అనువారలు. బార్హ్వాదిమపాంచాలకౌరవసంతతులకు మూలపురుషుఁడుగఁ జెప్పఁబడినవాఁడు.

**అజ్మమెద గోత్రము** — కణ్వఉపగణము చూడుఁడు.

**అజయానది** — వంగదేశము చూడుఁడు అజమతీనది చూడుఁడు.

**అజహల్లక్షణ** — కావ్యమునందలి త్రివిధలక్షణములలోనొకటి. అజహత్తనిన,అంటియు వీడక యర్థమిచ్చునది యని భావము. లక్షణ త్రివిధము చూడుఁడు.

**అజపాతిథిగోత్రము** — జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.

**అజదీమతము** యెజిడీ మతస్థులు చూడుఁడు.

**అజాక్స** (Ajax) గ్రీకుపేరు. గీ సుదేశమునఁ బెక్కుప్రశూరులు సైనికుల కీపేరుఁ జెను. ధైర్యవంతుఁడని యర్థము. గ్రద్ద (Eagle) కను యర్థము కలదు. పురుషనామము, కెౌసవ నామములు చూడుఁడు.

**అజాకృపాణీన్యాయము** — మేకమెడపె కత్తి తనయంతదానేపడినను మేకప్రాణము పోవుటకుఁజాలునని భావము. తనయంతనది సంభవించుటవలన జరుగు పనులకీన్యాయము వర్తించును. అంధకవర్తకీయన్యాయము, కాకతాళీయన్యాయము, ఖల్వాటబిల్వీయ న్యాయము ఈయర్థభావములనే ఇచ్చు న్యాయములు.

**అజాగళస్తనన్యాయము** — మేకమెడ వద్ద సిరములుండునుగాని అందుపాలుండవు. నిష్ప్రయోజకులంగూర్చి యీన్యాయము వాడుదురు.

**అజాతపుత్ర నామోత్కీర్తన న్యాయము** — పుట్టనిబిడ్డకుఁ బేరు ప్రకటించుట యని భావము. కలుగకముందే దానింగూర్చి ఉవ్విళ్లూరుటయం దీన్యాయము వర్తించును.

**అజాతశత్రుమహారాజు** మగధ భూపతి. బింబిసారుఁడు. మగధరాజ్యము చూడుఁడు.

**అజాతశత్రువు** - పాండవాగ్రేసరుండగు యుధిష్ఠిరమహా (ధర్మ) రాజున కజాతశత్రువనిపేరు ప్రసిద్ధమే. మరియు శిశునాగవంశపురాజులలో నారవభూపతికిఁగూడ నజాతశత్రువనిపేరు. ఈతండు విధిసారునికుమారుఁడు.

ఈతనినే (ఇక్ష్వాకు వంశస్థుఁడగు) బృహద్బలుని సంతతివారిలో శాక్యముని యందురు.

**అజామిళుఁడు** — ఇప్పుడు 'కనూజ్' యనంబడుచున్న కన్యాకుబ్జపురవాసియగు వాఁడు. మహాపాతకము లొనర్చినవాఁడును, దుశ్చరిత్రుండు నయి యెట్టకేలకు రక్షింపఁబడి ముక్తుఁడైనవాఁడు. ఈతనిచరిత్రము అజామిళోపాఖ్యానమున గాంచనయ్యెడిని.

**అజామోద వృక్షము** — లా. Carum Rox Burghianum. సం. అజగంధా, విగంధికా. దీనిఆకురసము లేక చెక్కరసము అరుచి, ఉబ్బు, ఊపిరిగొట్టునొప్పి, కడుపు ఉబ్బరము, క్రిమిరోగము, గుల్మము, మూత్రకృచ్ఛ్రము, వాతరోగములు, శూలలు మొదలగునవి హరించును. ఆకలి, ధాతువృద్ధులనిచ్చును. దీనివిత్తులకు సంస్కృతమున మోద, అజమోద, మాయూరి యని పేర్లుకలవు. వీనిరసము లేక చూర్ణము ఆమజ్వరములు, ఎన్మిదిగుల్మములు, కఫము, మలమూత్రనిరోధములు, శూలలు, శోష, వీనిని హరించును. ఆకలిని, ధాతువృద్ధినిచ్చి హృదయమునకు బలమిచ్చును.

**అజ్జగోత్రము** — ఇది విశ్వామిత్ర సంతతిలోని అజ్జగణముగ చెప్పఁబడిన గోత్రము. ౧. విశ్వామిత్ర మాధుశ్ఛందస అజ్జ, ౨. విశ్వామిత్ర దేవరాత అజ్జ, 3. విశ్వామిత్ర లోహిత అజ్జ యనియుఁ బ్రవరలు.

**అజ్ఞాతపాండవులు** — మాయజూదమున పాండవు లోడి పన్నెండువత్సరము లరణ్యవాస మొనర్చి, పదమూడవవత్సరమున విరటుపురంబున దమ యజ్ఞాతవాస దీక్ష జరుపఁబోవుచు పాండవులు మారుపేర్లిడికొని విరటుఁగొల్వఁ జేరిరి. అందు ధర్మరాజు "కంకుండ" ను నామధేయంబున ద్యూతక్రీడకు నేర్తునని విరాటాధిపుకడ నిలచెను. భీముండును "వలలుం" డను నామధేయంబున వంటలవాఁడై మెలంగ జొచ్చెను. అర్జునుఁడు పేడిరూపంబున, "బృహన్నల" యను నామంబున విరటుని కూతురగు నుత్తరకు నాట్యాభినయంబులం గురుం డను నిమిత్తంబునఁజేరె. నకులుండును "దామగ్రంథి" యనుపేరున నశ్వశిక్షకుండనని మత్స్యవిభుకడ నిలచె. సహదేవుండును గోపవేషంబున "తంత్రీపాలుం" డను పేర విరటుఁగొల్వంజేరెను. ద్రౌపదియు సైరంధ్రీవేషంబున మత్స్యమహీకాంతునంతఃపురంబున సుదేష్ణం గొలువఁజేరెను. ఇతరులకుఁ దెలియరాకుండ కాలము పుచ్చినవారగుటచేతనే వీరిని అజ్ఞాతపాండవులనఁజెల్లును.

**అజ్ఞానచతుష్టయము** — వైభాషిక బౌద్ధమతము చూడుఁడు.

**అజ్ఞానభూమికలు (ఏడు)** — ౧. బీజాగ్రము- బ్రహ్మానందమునం దుండక మనస్సుయొక్క వృత్తి బహిర్గతమైయుండుట. ౨. జాగ్రము- కండ్లకు జగత్తునామరూపదృఢమై కానఁగుచుండుట. 3. మహాజాగ్రము- సృష్టియొక్క పంచభూతములు వాని పనులు సర్వదా స్ఫురించుచుండునట్టి మెళుకువ. ౪. జాగ్రస్వప్నము- ప్రపంచ వస్తువల నామరూపభ్రాంతి స్థిరముగ దోచుచు పరమేశ్వరస్వరూపలక్షణములె స్వప్నము వలె దోచుట. ౫. స్వప్నము- పరమేశ్వర చింత స్మారకముగ మాత్రముండి, లోకసంసారవాసనల నెల్లకాలము మనస్సున దగిలియుండుట. ౬. స్వప్నజాగరము- పరమేశ్వరునిపట్ల స్మారకము గూడ మరుగు

పడి సంసారవ్యామోహనిమగ్నత, లోక కార్యములం దగిలియుండుట. ౨. సుషుప్తి- పరమేశ్వరచింతనముగాని, లోకనియత ధర్మములంగాని దలంపక వానిం బాటింపవలయు నను బాధ్యతయె మరచి, స్మారకముం గోల్పోయి, కాలముగడపుచు నజ్ఞానమయత నుండుట.

**అజితనాథుండు** — జైనతీర్థకరులలో నొకండు, (తీర్థకరులుచూడుడు). వీరు రెండవ తీర్థకరులు. వీరిచిహ్నము ఏనుంగు. వీరు ఇక్ష్వాకువంశ క్షత్రియులు. తండ్రిపేరు జితశత్రువు. తల్లి విజయాదేవి. జన్మస్థానమయోధ్యానగరము. పొడవు ౪౫౦ ధనస్సులు (ధనస్సుమూడున్నరమూర), సువర్ణచ్ఛాయశరీరులు. డెబ్బదిరెండులక్షలుఆయువు, గణధర్ సంఖ్య ౯౦, నిర్వాణముం జెందిన తావు సుమేరుశిఖరము, (శిఖరీజీ లేక ఆబు పర్వతశిఖరము). ముప్పదిలక్షలకోట్ల సాగర్ అని వీరింగూర్చి చెప్పంబడినది.

**అజితవతి** — నది. దీనిని చిన్నగండకి యనెదరు. హిరణ్యవతియనియుం బేరుకలదు. బుద్ధనిర్వాణస్థలమగు కుశనగర (కుశనార) ఇప్పటి కాశియా యనుక్షేత్రమునకు నుత్తరమున సమీపముననే ప్రవహించెడిని. అయోధ్యసంయుక్తరాష్ట్రములోని (U. P.) గోరక్పూర్ (గోరక్షకపురము)న తూర్పుగా ముప్పదేడుమైళ్ల దూరమునను బెట్టియాకు వాయువ్యదిక్కునను ఉండును.

**అజీజ్నగరు సెటిల్మెంటు (ఆదిద్రావిడ క్షేత్రము)** — దక్షిణార్కాటు మండలములోని వెప్పూరుగ్రామనివాసులగు నాదిద్రావిడ కులమువారు బందిపోట్లు దొంగతనములకు నొక శతాబ్దమునకు పైగా పేరందిన



క్రిమినల్ ట్రైబ్సుగా వాడంబడుచుండిరి. వీరిబాధ దక్షిణమున కారైక్కాలు మొదలు ఉత్తరమున గుత్తిదనుక గల్గుచుండెనని ప్రతీతికలదు. వెప్పూరునందు వీరైదువందల కుటుంబముల వారుండిరనియు వీరుపోలీసు ఉద్యోగుల నిఘాయందుండిరనియుం జెప్పంబడినది. క్రీ. వె. ౧౯౧౩ సంవత్సరమున ప్రభుత్వమువారు ౧౫౦౦ యకరములు ప్రదేశమును ప్రత్యేకించి, మనుష్యునకొక యకరముచొప్పున వీరి కిప్పింప, కాలక్రమమున వ్యవసాయవృత్తికిం గడంగి మర్యాదస్థులుగ జీవనముం జేయుచున్నారని తెలియుచున్నది. ఈ యాదిద్రావిడక్షేత్రము ఈయావికి మూలకారకుండగు జిల్లాకలక్టరుగారిపేరిటం బరగుచున్నదట.

**అజీమాబాదు** — పాటలీపుత్రము చూడుండు.

**అజీవక బౌద్ధమతశాఖ** — గోబాల మఖాలీపుత్త్రస్వామి చూడుండు. మగధ దేశము చూడుండు.

**అజీహోయునగోత్రము** — నిధ్రువగణము చూడుండు.

**అజ్మీరుపట్టణము** — ఇది అజ్మీరు మేవాడలకు ముఖ్యపట్టణము. రాజపుత్రస్థానమునకుం జేరినది. ఈ రెండు పరగణాలును బ్రిటీషుఇండియా ప్రభుత్వమువారి కమీషనరు క్రింద నుంపం బడినవి. ఇచటి పర్వతమున కజయపర్వతమని పేరనియు నది యొకప్పుడు మేరుత్వము వహించియుంట అజయమేరువని పేరయ్యెననియు, అది నానాంటికి మారి అజ్మీరుగ నయ్యెననియుఁ నందురు. ఇప్పటి పట్టణము క్రీ. వె. ౧౧౪౫ లో నజయపాలుండను నృపతి నిర్మించెనట. ఆరావళీ

పర్వతశాఖయగుచు, నిపుడు తారాపఁ ముపై అక్బరునిర్మించిన దుర్గము తారాఘడ మను పేరఁబరగెడిని. ఉత్తరదిశయందు అనా సాగరమను నొకగొప్ప చెరువును, లోయలోఁ గతిపయదూరమున ఘోయసాగరమను వేరొక గొప్పచెరువును కలవు. వానినుండియె పురము నీటిగొట్టములగుండా జలములం ద్రాగుచున్నది. శంబరసరస్సునుండి తేబడిన ఉప్పువ్యాపారమును, ప్రత్తివ్యాపారమును, నూనెవ్యాపారము నిచట విశేషముగగలవు. నూలుబట్టల నేతయు, రంగుల అద్దకమును ఇచటివి పేరందియున్నవి. ఇచటి రాజ పుత్రుల విద్యాభ్యాసమునకై నిర్మింపంబడిన మేయోకళాశాలయు, పురమందలిప్రభుత్వపు కళాశాలయు, తారాఘడపు కొండపై మశీదుగ మార్పంబడిన ఒకజైనుదేవళపు నలుబది స్థంభముల పనితనమును (ఇవి యన్నియు వేర్వేరువిధములగు పనితనమును ప్రదర్శించు నవి) ముయినుద్దనుఛిస్తియను మహమ్మదీయఫకీరుదర్గాయును (మహమ్మదీయుల యాత్రాక్షేత్రము) చౌహానువంశజుఁడగు విశాలదేవునృపతిచే గట్టఁబడిన గొప్ప కళా శాలంజెరపి, మశీదుగ నొనర్పంబడిన అర్హాయ్ దీన్‌కాజోంప్రాయు నిట దర్శనీయభవనములు. ఆర్యసమాజ మతస్థాపనాచార్యుఁడనందగిన దయానందసరస్వతీస్వామి సమాధియు వారేర్పరచిన యంత్రాలయము, అనాధాలయమును ఆర్యసమాజికులకు యాత్రాస్థలములుగ నున్నవి. ఇచటికి పదునేనుమైళ్ళ దూరమునందున్న పుష్కరతీర్థమును బ్రహ్మదేవుని ఆలయమును, హిందూతీర్థయాత్రలుగనున్నవి. (పుష్కరక్షేత్రము చూడుఁడు)

**అజైకజిహ్వా గోత్రము** — జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.

**అజ్జరపుఁ బేరయలింగకవి** – ఆంధ్ర కవులలో నాధునికునిగఁ బరిగణింపఁబడినవాఁడు. ఆర్వేల నియోగి బ్రాహ్మణుఁడు. శైవుఁడు. క్రీ. వె. పదునెన్మిదవ శతాబ్ది మధ్యకాలమున నుండినవాఁడట. రచించినది ఒడయనంబివిలాసమనుపేరుగల ప్రబంధము. ఇది వైష్ణవ పురాణగాధ.

**అటతాళము** — ఇందైదు జాతులు కలివు. జాతి (లయ) ప్రాణము చూడుఁడు.

**అటార్నీ** (Attorney) — అటర్నీ ప్రతినిధి యని భావము. తొల్లింట సాక్సనుల కాలమున నింగ్లాండులో ప్రతిషైరునుండి ప్రముఖులు సంవత్సరమునకు రెండుసార్లొకచోట కూడి, షరీఫ్ అను అధికారి యుత్తరువుమేరకు కార్యాలోచనలు సల్పుచుండువారట. ఆ సభలకు షరీఫ్ టోర్న్ అనిపేరట. రాను రాను రాలేనివారు తమ ప్రతినిధుల నంపుట వాడుకయయ్యెనట. ఆ ప్రతినిధి కొసంగిన యధికారపత్రమునకు అటర్నీ లేక టోర్న్ అని వాడుకయుండెడిది. రాను రాను తనకుగాను కార్యనిర్వహణమొనర్చు ఉద్యోగికిచ్చు అధికార పత్రముకు Power of Attorney అనియు, అతనికి అటర్నీ లేక ఏజంటు అనియు వాడుక నిలచెను. అటర్నీ పదము (టోర్న్) పదమునుండియె కల్గినది. ఎటర్నీ చూడుఁడు.

**అటుకుల వెంకమ్మ** - యోగ్యత విలువ లేక కష్టజీవిగనుండి తిరుగుచుండు స్త్రీని ఆడువాండ్రీపేరున చులకనగా ననుచుండు ఉక్తి. ఇదిస్త్రీలయందుమాత్రము ప్రచారము నందినపదము. బహుశః అటుకుల నమలుచుండునది యనియో, అటుకులం దంపు,

కొనుటకో యీ అటుకులశబ్ద మర్థమిచ్చును గాబోలు.

**అటోల్ద్వీపములు** — హిందూమహా సముద్రమున సింహళద్వీపముకడ సింహళ ప్రభుత్వమునకుంజెందిన ద్వీపములు. గవ్వలు సముద్రమున దొరకును. కొబ్బరితోటలు కలవు.

**అటోల్వేలీ** (Atoll Valley) — భూమధ్య రేఖకుత్తరమున నైదుడిగ్రీల ప్రదేశమునుండి దానిదక్షిణమున నిరువదియైదు డిగ్రీల దూరమువరకును, తూర్పున ౧౩౦ డిగ్రీలు మొదలు పశ్చిమ ౧౮౫ డిగ్రీల వరకును అటోల్ ద్వీపములు పశ్చిమముగా శాంత మహాసముద్రము (Pacific Ocean) నందు అధికసంఖ్యాకములుగనుంట నాప్రదేశమును సముద్రపుటోడలనావికులు 'అటోల్వేలీ' యని వాడుచుందురు. అటోలనిన పవడపు చట్టుచేఁ జుట్టంబడిన ద్వీపములు అనిభావము. (అటోలుద్వీపములు చూడుఁడు).

ఒక్కొకతరి అటోలునందు చట్టు అంచు గనున్న పగడపుచట్టు గట్టువలెనుండి లోన భూమికింబడుచు నీరునిలచి సరస్సువలె నగును. దానికి 'లెగూన్' అనిపేరు. అంచులపై తరుచు కొబ్బరి, ఈత, తాడిచెట్లు చక్కగ పుట్టిపెరిగియుంట కన్పించుచునే యుండును.

**అట్టుడికినట్లు** - ఏదేని విడ్డూరముగాని, ఒకనివల్ల కలిగిన లేక కల్గనున్న తాపము, వేదనలకుగాని, ప్రజాసంక్షోభమునకు అట్టు ఉడికినట్లు ఉడుకుచున్నది అనియెదరు. ఉడుకుట యన నిట మనశ్శాంతిలేని వేదనం జెందియుంట యనిభావము.

**అట్లతద్దె (తృతీయతిథి)** — ఆశ్వీజ బహుళ తృతీయ. బాలికలు తెల్లవారు జామున మేల్కాంచి, భుజించి,యాటలాడుకొని పిదప గౌరీదేవింబూజించి, అట్లను నివేదన మొసగుదురు. వ్రతదినము. (పండుగలు, పర్వదినములు, వ్రతతిథులు చూడుఁడు.)

**అట్లాంటిక్కు మహాసముద్రము** — ఈ మహాసముద్రము ఉత్తరమున నుత్తర ధృవసాగరము మొదలు దక్షిణమున దక్షిణ ధృవసాగరమువరకు వ్యాపించియున్నదనియు, దీని పొడవు తొమ్మిదివేల మైళ్లకన్న నధికమే యుండుననియు నందురు. దీని సర్వసామా న్యపు వెడలుపు (మొరాకోదేశము ఫ్లోరిడాల నడుమ) మూడువేల ఆరువందల మైళ్లుండు ననియు, గ్రీనులాండు నార్వేదేశముల నడుమ దీని వెడలుపు ఎన్మిదివందల మైళ్లుండుననియు అంచనా వేయఁబడినది. ఇంక బ్రెజిల్ దేశపు తీరమునుండి ఆఫ్రికాతీరమునకు దీనివెడలుపు పదునేనువందల మైళ్లందురు. ఇది యిక్కా లమున వాయువిమానములు దాటు మార్గ ముగ నున్నది. ఈ మహాసాగరము లోతు సర్వసాధారణముగ పదునేనువేల అడుగుల లోతని అంచనా వేయంబడియున్నది.

ఈమహాజలరాశియందు ఐర్లాండుద్వీపము నుండి న్యూఫౌండ్లాండున కరుగు మార్గమున నీటమున్గిన యొక పర్వతపజ్తి కలదనియు దానియెత్తు సముద్రపుటడుగు భూమట్టము నుండి ఆరువేలు మొదలు పదివేల అడుగుల ఎత్తుండి నీట మున్గియున్నదనియు నందురు.

**అట్లు వండే అమ్మకు ఆర్గురు అమర్చ వలెనా?** — చేతగానితనమును సూచించు సామెత. కొలదిపాటికార్యమొనర్ప అధిక

సాహాయ్య మాశించుటయని భావము. ఆంధ్రలోకోక్తి.

**అడకొత్తులోనిపోక** — అడకొత్త లేక అడకత్తెర యన పోకలం గత్తిరించు కత్తెర. అపాయకరమగు నిరుకునందుండుట యని భావము.

**అడగనిదీ చెప్పరాదు, అడిగినఁ జెప్ప వలసినది దాచరాదు** — ఆంధ్ర లోకోక్తులు.

**అడవి అనటి (లేక అరటి)** — చెట్టు. వనౌషధి. లా. Musa Sapientum. ఆంగ్ల. Wild Plantain. సం. కాష్టకదళీ, ఫలాఢ్యా, సుకాష్ఠా. దీని కాయకూర-గురుత్వము, నీరసము, శైత్యము, శ్వాసలం గల్గించును. వీర్యవృద్ధిగల్గించును. పైత్యము, తాపము, శోష, విదాహముల నడంచును. దీనిపండు-గురుత్వము, చలవ, అగ్నిమాంద్య ములం గల్గించును. రక్తపైత్యము జేయును. దీనియాకునందు భోజనము- చలవ, అగ్ని మాంద్యములం గల్గించును. దీనిదుంపరసము-రక్తపైత్యము నడంచును. దీనికి విరుగుడు-పండుపైతొక్క, పంచదార, ఏలకులు, మిరియాలు, తేనె, పొగడపండ్లు, ఉప్పు, అల్లము, నెయ్యి.

**అడవి ఆముదపుచెట్టు** — (వనౌషధి) లా. Jatrpoha Curcas. ఆంగ్ల. Angular Leaved Physic Nut లేక Country Croton Shrub. దీనిని పెద్దనేపాళమనియు నందురు. సం. ఏరండ, కానన లేక కానన ఏరండ. పెద్దనేపాళపు పాలు మర్దనచేసిన వాతములు, మేహవాత ములు హరించును. పుండ్లను మాన్పును, చర్మరోగముల నడంచును. మాను చక్కగ దంచి ఆముదముతో వెచ్చజేసికట్టిన వాపులు, పోట్లు, మేహవాతపు నొప్పులు మానును. ఆకులు నూరి ఆముదములో వెచ్చజేసి కట్టిన, కురుపులు మానును లేక చితుకును. చర్మ రోగములు, తామర, గజ్జి మానును. మేహ వాతపునొప్పులు శాంతించును.

వేరు చూర్ణము ఉదరరోగముల గుదు ర్చును. గింజలు విరేచనము గల్గించును. దీనికి విరుగుడులు నెయ్యి, పసపు, తంగేటి చిగుళ్లు, తుమ్మ, చంద్ర, మునగ చెక్కల రసములు, నీరుల్లిపాయల రసము, వసకాల్చిన మసి, ధనియాలు, కలకండనూరి కల్పినపెరుగు.

**అడవికందచెట్టు (దురదకందచెట్టు)**-లా. Dracontium Polyphyllum. ఇది దురదగల్గి యుండును. దుంపనూరి పైనవేసికట్టిన వాతనొప్పులు, మేహవాత నొప్పులు శాంతించును. వాపుతగ్గును. వేడిచేయుపదార్థము. దీపనముగల్గించును. దుంపఉడికించి తినిన రక్తముపడుమూలవ్యాధి శమించును. శరీరము స్థూలముగుట తగ్గును. దగ్గులును తగ్గునని చెప్పుదురు. దుంప నుడికించికట్టిన విషపురుగులుఁగల కురుపులు, నేత్రవ్యాధులు మానును. దీనికి విరుగు డులు :— ౧. నెయ్యి, ౨. పులుసువస్తువులు, 3. బెల్లము, ౪. తమలపాకులు. కంద చూడుఁడు.

**అడవికాకరకాయ** — లా. Momordica Charantia. సం. వనకటిల్ల. కాకజేయుపదార్థము. త్రిదోషములు, సమస్త విషములు, శ్వాసకాసలు, మూలవ్యాధి, సమస్తక్రిములు, వ్రణములు, హరించును. కుష్ఠురోగమును నిలపునని కొందరనెదరు.

**అడవిగగ్గిరచెట్టు** గగ్గెరచెట్టు అడవి గగ్గెర, నల్లగగ్గెర సాదా లేక తెల్లగగ్గెరని త్రివిధములు. అన్నిటికి గుణమొక్కటియె. లా.Ocimum Ballatum, సం. కపిద్ధార్జున సుముఖ, గరఘ్నక. ఈచెట్టుయొక్క వేరు, ఆకులరసము, వేడిచేసి తాపము గల్గించును. దుర్గంధమునడచి నిద్రగల్గించును. కఫము, వాతము, రక్తపైత్యము, శ్వాసకాసలు, విష ములు, పార్శ్వశూలలు, ఉబ్బులు, వాపులు, హరించును. బుద్ధికి వికాసము, బలము లొసంగునది.

**అడవింగాసినవెన్నెల** — నిరర్థకమని భావము. ఎవ్వరికినుపయోగింపనిదని భావము ఆంధ్రలోకోక్తి.

**అడవిగోధుమలు**—లా. Coix Barbata ఆంగ్ల Wild Wheat. సం.గవేధురా-గంఢ్ర. వెగటుగనుండి కఫ, వాత, మూత్రకృచ్ఛ్ర, హృద్రోగముల శమింపజేయును.

**అడ్డదిడ్డము** — సరియగు మార్గమున నడచుచుండమిం దెల్పుపదము.

**అడ్డసరపుచెట్టు** — లా. Adhatoda Vasika & Justicia Adhatoda, ఆంగ్ల Malabar Nut. సం. వాసికా,వైద్యమాతా అటరూష. దీనివేరు ఆకు చేదువెగటులుం గల్గియుండును. చూర్ణముగను కషాయము గను దీనిని వైద్యులు వాడుదురు. దీనికషా యము, ఆకు, వేరు, పువ్వులు - దగ్గు, ఎగు పులు, ఉబ్బసపుదగ్గు, వగరుపుదగ్గు, క్షయ, అన్నినొప్పులు, వరసజ్వరములు, క్షయలు, పశువులరోగములునివర్తింపజేయును. మూత్ర నిరోధముసడలించును. నీళ్లవిరేచనములు, రక్తవిరేచనములు, జిగటవిరేచనములు, నివర్తించును. పువ్వులుకండ్లపైవైచి కట్టిననేత్ర రోగములు శాంతించును. చెక్కయొక్కపొగ ఉబ్బసపుదగ్గుల నివర్తించును.

**అడ్వాన్సులు** (Advance) — (వాణిజ్య పరిభాషాపదము) ముందుగానే ఒసర్చ బడిన ప్రతిపనికీ అడ్వాన్సు అనిపేరు. స్టీమరులో గొంపోవలసిన సామానులమోత సొమ్మును ముందుగా చెల్లించిన సొమ్ముకు Advance Freight అనిపేరు. కొనవలసిన సరకులకీయదగు విలువయందలి కొంతభాగ మును ముందుగనే చెల్లించుటకు Advance Payment అనిపేరు. చేయవలసిన వ్యయ ములకుగాను, ఏజంటుకు జీతముల క్రింద నౌకర్లకు ముందుగా నీయబడిన సొమ్ముకు Advance లేక Advance Payment అనిపేరు.

**అడిగేవారికి చెప్పువాఁడులోకువ**— అడుగుటయన, పరీక్షచేయుచు అడుగుట యని భావము. ఆంధ్రలోకోక్తి.

**అడిదము బాలభాస్కరుఁడు** — ఆంధ్రకవులలో నాధునికుడుగఁ బరిగణింపఁ బడినవాఁడు. ఈతఁడు అడిదము సూరకవి తండ్రి. ఈతడు రచించినది శుద్ధాంధ్ర రామాయణము. ఈగ్రంథము గానరాకు న్నది. అడిదము సూరకవిగారి కుమారుఁడు, భాస్కరుఁడు.

**అడిదము సూరకవి** — (పేరు సూరప రాజు) ఆంధ్రకవులలో నాధునికుఁడుగఁ బరిగ ణింపఁబడినవాఁడు. విజయనగర సంస్థానా ధీశుండగు పూసపాటి విజయరామగజపతి మహారాజాస్థాన విద్వాంసుఁడు. నియోగి బ్రాహ్మణుఁడు. తండ్రిపేరు బాలభాస్కరుఁడు.

ఈతఁడనేక చాటుధారలు రచించినవాఁడు. తిట్టుకవియని పేరందినవాఁడు. "సూరకవి. తిట్టు కంసాలిసుత్తిపెట్టు" అని చెప్పుకొనిన వాఁడు. ఈతడు రచించిన గ్రంథములు ౧. చంద్రమతీపరిణయము (దీనిని కవిజనరంజనమని వాడుచున్నారు. కొందరు దీనిని పిల్లవసుచరిత్రమని పేరందిన గ్రంథమందురు) ౨. కవిసంశయ విచ్ఛేదము (లక్షణగ్రంథము). 3. ఆంధ్రచంద్రాలోకము(అలంకారగ్రంథము) ౪. ఆంధ్ర నామశేషము (పద్యరూపక నిఘంటు), ౫. రామలింగేశ్వరశతకము.

ఇందు ఆంధ్రనామశేషము పైడిపాటి లక్ష్మణమంత్రి విరచిత ఆంధ్రనామసంగ్రహములోలేని ఆంధ్రపదములంగల్గి యున్నది. అడిదము సూరకవిగారి సంతతివారమని చెప్పుకొనువారివి కొన్ని కుటుంబములు కలవు. వారి తొల్లింట యింటిపేరు మద్దూరి లేక మోదుకూరివారని యుండెననియు, ఒక ఖడ్గము (అడిదము) తమ పూర్వులకు బహుమాన మీయఁబడినకతన యంతటినుండి వారి కడిదముువారని యింటిపేరుగ వాడుకయయ్యెననియు చెప్పుదురు. అడిదమువారి కాపురము విజయనగరముకడ నున్న పూసపాటిరేగగ్రామము. వీరిది వశిష్ఠగోత్రము.

**అడిదానవుఁడు** — అంధకుని కుమారుఁడు. కామరూపి. తనయిచ్ఛవచ్చినపరూపమున దామరణించుశక్తి తనకుంగలుగునటులను, యుద్ధమున మరణింపకుండునటులను, వరములందిన వాడు.ఒకతరి పార్వతిరూపమునశివునిమోసము చేయరా నాతఁడెరింగి, వధించెనని చెప్పఁబడినది.

**అడియాశ పొడిదుఃఖము**—అడియాశ యనిన కల్లునసెడి యాశయనియు, ప్రత్యాశయనియు నర్థములు. దురాశ లేక పేరాశయని భావము. తగని యాశయని యెరుంగునది. ఇంకఁ బొడిదుఃఖమనిన తనదికాక, అన్యులనుభవించఁదగినది తా మోహావశమున ననుభవించు దుఃఖమునకుఁ బొడిదుఃఖమనియెదరు.

**అడుగులోనే హంసపాదు** — ప్రారంభముననే తప్పుపడుట యని భావము. ఆంధ్రలోకోక్తి.

**అడుసులో స్థంభము** — ఎటుత్రిప్పిన నటు తిరుగునది. ఎటు జరపిన నటు జరుగునది యని భావము. లోకోక్తి.

**అడ్వొకేటు** (Advocate)— లాయరనియు, న్యాయవాదియనియు భావము. స్కాట్లండు దేశపు ఎడ్వొకేటు ఇంగ్లాండుదేశపు బారిస్టరుతో సమానుఁడని చెప్పఁబడినది. భరతదేశమందలి అడ్వొకేటులు న్యాయవాద వృత్తిగై కొనిన B. A., B. L. లేక B.A., LL. B. పరీక్షయం దుత్తీర్ణులైనవారుగ నున్నారు.

**అణిమాద్యష్టసిద్ధులు** అష్టసిద్ధులు. సిద్ధులు చూడుఁడు.

**అణిమాసిద్ధి** సిద్ధిసిద్ధులు చూడుఁడు.

**అణురపివిశేషో౽ ధ్యవసాయకరః ఇతిన్యాయః** — వాదమున రెండు లేక మూడు సంగతులలోఁగల అణుమాత్రపు భేదమైనను వానికి భేదముగల్గింపజాలెడినని భావము.

**అణువు** — అత్రిసంతతి. చంద్రవంశ క్షత్రియుఁడు. యయాతిమహారాజు పుత్రుఁడు. కుమారునిపేరు సభానలుఁడు.

**అణుహుఁడు (నపుఁడు)** — చంద్రవంశ క్షత్రియుఁడు. సహుషుని సంతతివాఁడు. యయాతి సుతుఁడగు పూరునిసంతతి. తండ్రి ...ఁడు. భార్యపేరు కృతి. ఈమెను కీర్తిమతి యనియు నందురు. ఈమె శుకుని కూఁతురని చెప్పంబడినది. బృహాశేషుని సంతతి వాఁడనియుఁ జెప్పఁబడినది.

**అతలము** — తెల్లనికాంతిఁగల్గిన యొక అధోలోకము. ఇందు పన్నగములు నివసించునని చెప్పఁబడినది.

**అత్తచచ్చినదని కోడలేడ్చినట్లు** — ఆంధ్రలోకోక్తి.

**అత్తచచ్చిన ఆరునెలలకు కోడలికి దుఃఖమువచ్చినట్లు** ఆంధ్రలోకోక్తి.

**అత్తచేజారినది అడు గోటికుండ, కోడలుచేజారినది క్రొత్తకుండ** — అధికారముండినవారు చేసినది తప్పుగా పరిణమించదనియు, అధికారము లేనివారు చేసినది తప్పుగా లెక్కింపఁ బడుననియు భావము. ఆంధ్రలోకోక్తి.

**అత్తచేసినపనుల కారడులులేవు** — ఆరడి యనరవ్వ లేక రట్టు. ఆంధ్రలోకోక్తి.

**అత్తనెత్తినిచేతు లంగటివికళ్లు** — అనగా కోడలు, అత్తకుం దలంటుట యని భావము. ఆంధ్రలోకోక్తి.

**అత్తపత్తిచెట్టు** — నిద్రభంగి చూడుడు.

**అత్తమంచీ, వేము తీపూ ఉండదు** — వేము = వేపచెట్టు. ఆంధ్రలోకోక్తి.

**అత్తలేని కోడలుత్తమురాలు; కోడలు లేని అత్త గుణవంతురాలు** — ఆంధ్రలోకోక్తి.

**అత్తలూరి పాపరాజుకవి** — ఆంధ్రకవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడిన వాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. శైవుఁడు. కౌశికసగోత్రము. తండ్రిపేరు శ్రీగిరిరాజు. తాతపేరు అక్కరాజు. రచించినది చెన్న బసవపురాణము. దీనిని కందుకూరి అమృత లింగామాత్యునకుం గృతియిచ్చెను.

**అత్యంతపరాజయాద్వరం సంశయోపీతిన్యాయము** — పూర్తిగ నోడుట బయల్పడుకన్న సంశయగ్రస్తముగ వదలి వేసినట్లు ఉంచుట శ్రేయమని భావము. ఇట్టి అర్థమిచ్చునదియె. "సర్వనాశేసముత్పన్నే అర్థంత్యజతి పండిత రితి" న్యాయము ఒకటి కలదు. (అంతానాశనమగుటకు బదులు బుద్ధిమంతుఁడు సగమైనను వదలి తప్పించుకొనునని యర్థము). దీనినే "సముత్పన్నే అర్థమ్" ఇతిన్యాయము అనియు వాడుచుందురు.

**అత్యంతబలవంతోపి (పౌరజానపదాజనాః) దుర్బలైరపి బాధ్యన్తే పురుషైః పార్థివాశ్రితై రితిన్యాయము** — బలహీనులైనను ప్రభువు నాశ్రయించిన బలముచే బలవంతులం బాధింపగల్గుదురు. అది ప్రభుబలముగాని వారి స్వబలముకాదని భావము.

**అత్యంతాభావము** — అభావములు చూడుఁడు.

**అత్సరి, ఆత్సరి గోత్రము** — కపి ఉపగణము చూడుఁడు.

**అత్తా ఒకరింటికోడలే** — ఆంధ్రలోకోక్తి.

**అతికాయుఁడు**— రావణుని సుతుఁడగు. రక్కసుఁడు. బ్రహ్మవలన అవధ్యమను కవచము నందినవాఁడు. సంగరమున శ్రీరామ సోదరుండగు లక్ష్మణునిచే నిహతుఁడైన వాఁడు. తల్లి ధాన్యమాలిని. బ్రహ్మనుండి దివ్యాస్త్రము, కవచము, రథము, (వరుణుని జయించి) వారుణపాశములం బడసినవాఁడు.

**అతిరేక అత్యగోత్రము** — జాతుకర్ణ్య గణము చూడుడు.

**అతితృష్ణా నకర్తవ్యా తృష్ణాం నైవ పరిత్యజేత్** — ఇది సంస్కృతలోకోక్తి అత్యాశకూడదనియుఁ బూర్తిగా నాశవదలుట (అనగా నిరాశ) తగనిదనియుభావము.

**అతిదేశన్యాయము** — ఏదేశమునందుఁ దానుండునో, ఆదేశాచారపు మర్యాదను బాహ్యమునకు జాగ్రత్తగా నవలంబించి నడపఁదగునుగాని, దానికి తాను దాసునివలె అతి తగదని భావము. "అతి సర్వత్ర వర్జయేత్"ను సంస్కృత లోకోక్తికి నిదియే యర్థము.

— తర్కశాస్త్రమునం దతి దేశ మైదువిధములు. ౧. శాస్త్రాతిదేశము- "నిత్యముతో సమముగ శేష" మనుతరి సమశబ్దముచేత నతిదేశమనియు, ౨. కార్యాతిదేశము- "అప్రయజాస్తాః" అనుతరి కార్యనిషేధమువలన దర్శపూర్ణిమాసధర్మమునం దతిదేశమనియు, 3. నిమిత్తాతిదేశము- వికృతిమేధ్గచరుయాగమున, వ్రీహి (కార్యముం) చేయు ముద్గములందు (వ్రీహి) కార్యనిమిత్తత్వమువలన ప్రోక్షణాదిధర్మములు కల్పనముచేయఁబడుట నిమిత్తాతిదేశమనియు, ౪. వ్యపదేశాతిదేశము-"మాసమగ్నిహోత్రం జుహోతి" యనుతరి నెలదనుక జేయందగిన అయనయాగము. "అగ్నిహోత్రపదవ్యపదేశతః" అగ్నిహోత్రపదమునకు ధర్మాతిదేశమనియు, ౫. రూపాతిదేశము-"యజమానాద్భిన్నోయూపః" అనుతరి . యూపమున యజమానత్వభిన్నజ్ఞానము కలుగుం గాన యజమానధర్మమునకు దానియొక్క పరిమాణమునం దతిదేశమనియు చెప్పఁబడినది.

**అతిధన్వుఁడు** — శునకర్షి వంశస్థుఁడు. శిష్యుండగు ఉదరశాండిల్యునకు, ఉద్గీదవిద్య నెంతవఱకు మఱువకుందురో అంతదనుక నైశ్వర్యవంతులుగ నుందురని బోధించిన వాఁడు.

**అతిథి** -— అధ్వయోగేన ఆగంతుకే (గృహాగతే) అతిథిః అని నిర్వచింపఁబడినది. అన్యగ్రామమునుండి మార్గాత్తువచ్చినవాఁ డతిథి. ఈతండు ప్రియుఁడైనను, వైరియైనను, మూర్ఖుఁడైనను, పండితుఁడైనను పూజ్యుఁడనిభావము. వైశ్వదేవానంతరము ఎవ్వరేని అతిథులే తెంతురేమోయని ద్వారమున ముహూర్తకాలము నందెన్మిదవభాగకాలము (అనగా పంద్రెండు మినిట్ల కాలమని భావము). నిరీక్షించి మఱియు భుజింపవలయునని చెప్పఁబడినది. (ముహూర్తము — అభ్యాగతి చూడుడు).

**అతిథిమహారాజు** — తండ్రిపేరు కుశుఁడు పితామహుఁడు శ్రీరాముఁడు.

**అతినాముఁడు** — చాక్షుషమన్వంతరమున సప్తమహర్షులలో నొకఁడు.

**అతిబల మహాబల విద్యలు** — విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులను యాగసంరక్షణార్థియై తనవెంటం గొంపోవుచో శ్రీరామునకు అతిబల మహాబలయను రహస్య విద్యలను నేర్పినట్లుఁ జెప్పబడినది. అతిబల మహా

బల అనువారు విధాత పుత్రికలని తెలుచున్నది.

**అతిబాహువు** — కశ్యపప్రజాపతికిని ప్రాధకును బుట్టిన గంధర్వులలో నొకడు.

**అతిభానుడు** — శ్రీకృష్ణునకు సత్యభామ యందు గల్గిన సుతులలో నొకడు.

**అతిమధురము** — యష్టిమధుకము చూడుడు.

**అతిమూత్రము** — ఆంగ్ల. Diabetes. దీనిని బహుమూత్రమనియు నందురు. శరీరము మేహాగతమై మూత్రము విస్తారము వెడలు జబ్బు. ఇందు మధుమేహమని వేరుజాతి జబ్బుకలదు. బహుమూత్రరోగులకు రాచపుండ్లగును.

**అతిరథుడు** — అంగదేశమేలిన భూపతి. తండ్రి సత్యకర్ముడు. చంద్రవంశక్షత్రియ కులము. రోమపాదుని సంతతివాడు. అతిరథుని భార్యపేరు రాధాదేవి గాన కర్ణునకు రాధేయుడని పేరు కల్గెను. గంగా తీరమున కుంతీసుతుండగు బాలునిగాంచి, కొంపోయి పెంచుకొని అతిరథుడు కర్ణుడని పేరిడియెను.

**అత్తిరహస్యము బట్టబయలు** — ఆంధ్ర లోకోక్తి.

**అతివసచెట్టు** — లా. Aconitum Heterophyllum. ఆంగ్ల. Indian Atees (Root). సం. అరుణా, అతివిషా, ఉపవిషా. దీని వేరును వైద్యులు చూర్ణము కషాయము మొదలగు పలువిధముల నుప యోగింతురు. కారము, చేదు రుచులం గల్గి అరుచి, దాహము, దగ్గు, శ్లేష్మపైత్య ములు, ఆమాతిసారము, అన్నిజ్వరములు, వ్రణములు, దద్దురులు, కామిలరోగము, గ్రహణి హరించును. జీర్ణముజేయును. పైని గంధముతీసి లేపనముచేయుటవలన వాపులు తీయును.

**అతివ్యాప్తిదోషము** — లక్షణత్రివిధము చూడుడు.

**అతిసారము** — విరేచనములు మితిలేక నానారకములుగాను, వికృతిగా నగు జబ్బు.

**అత్రి గోత్రము** — ఆత్రేయ గణము చూడుడు.

**అత్రి నక్షత్రము లేక గోళము** — నక్షత్రములు భారతీయులు గుర్తించినవి చూడుడు.

**అత్రిపుత్రికా పుత్రుల (దౌహిత్రుల గణము** — (౬) అత్రిమహర్షి పుత్రికా పుత్రులు ౧౧ గోత్రర్షులీసంతతిలో జేర్పం బడిరి. కాత్యాయన మాత్స్యసూత్రోక్త గోత్రములు ౧౧—౧. కాలేయ, ౨. కైరేయ, 3. కాథేయ, ౪. పుత్రిక, ౫. బాల్య, ౬. వామరథ్య, ౭. వాలేయ, ౮. శైత్రేయ, ౯. సాంభేయ, ౧౦. సౌబేయ, ౧౧. హాలేయ. ఈ (అత్రిపుత్రికాపుత్రుల) గోత్రములు ౧౧ కుం బ్ర వరరూపములు ౪-౧. ఆత్రేయ, వామరథ్య పౌత్రిక. ౨. ఆత్రేయ, వామరథ్య, వాలేయ. 3. ఆత్రేయ, వామరథ్య, కౌబేయ. ౪. ఆత్రేయ, వామరథ్య, సాంభేయ.

**అత్రిమహర్షి** — బ్రహ్మమానసపుత్రుడు. భార్య అనసూయాదేవి. తపోమహిమచే బ్రహ్మాంశమున చంద్రుని, విష్ణ్వంశమున దత్తాత్రేయుని, రుద్రాంశమున దూర్వాస మహర్షిని సుతులుగ గనినవాడు. అరణ్య వాసమున సీతాదేవితో శ్రీరాముడు

దండకారణ్యమున అత్రియాశ్రమమున కరుగుతరి అనసూయాదేవి సీతాదేవికి స్త్రీధర్మములుపదేశించి,దీవించి, సౌమంగల్యరక్షణకుఁగాను అంగరాగమాల్యవస్త్రాభరణములొసంగినటులఁ జెప్పఁబడినది.

**అతీత జాతిప్రజలు** — వీరు గుజరాతు ప్రాంతములందు కచ్చిదేశమునఁ గన్పించుచున్నారు. అజోపాల్, కళ్యాణేశ్వరము, కోటీశ్వరము, అనుతావులు వీరికి ప్రధాన స్థానములు. వీరిశాఖంగూర్చి సరిగా తెలియరాకున్నది. వీరిలో బ్రహ్మచారు లనంబడు వారు మఠదారులను పేరున వాడంబడుచుందురు. గృహస్థులు ఘర్బారీలనంబడుదురు. వీరుశివభక్తులు, పునర్వివాహములున్నవారు.

**అతీత మహిషీ స్నేహ న్యాయము** — ఒకఁడు గృహస్థుగా నున్నప్పు డొకగేదెను పెంచుచుండెనట. దానిపై నతనికి చాల యాపేక్ష. పిదప నాతఁడు సన్న్యాసాశ్రమము స్వీకరించియుఁ గేదెపై ప్రేమ వదలకుండెనట. విరాగము చాలక ఆశ్రమము చెడినదని భావము.

**అతీతము (గ్రహలయ)** — గీతము నడచిన పిదప తాళము నడచుటకు పేరు. ఇది సంగీతశాస్త్రమున దశప్రాణములలో నొకటియగు గ్రహము (లయ) నందుగల నాల్గు భేదములలో నొకటి. గ్రహలయ, దశప్రాణములు చూడుఁడు.

**అతీశ (బిక్షువు) దీపంకరుఁడు** — వంగీయుఁడగు బౌద్ధభిక్షువు, తంత్రశాస్త్రముం జక్కఁగఁ జదివినవాఁడు. ౧౦౩౮వ సంవత్సరము ప్రాంతముల టిబెట్టుదేశమున కరిగి లామాధర్మముల నభ్యసించి, యచటి పిశాచధర్మముల నిరసించి, మతబోధ గావించుచుండినవాఁడు. ఈయన యనుచరవర్గశాఖకు గెలుగ్ అని పేరుకల్గెనట. పలుగ్రంథములీతని విధానబౌద్ధమున కీతఁడు రచించినవాఁడు. పెక్కుగ్రంథములను భాషాంతరీకరించెను. ఈమహాత్ముని గ్రంథములందు బోధిపంథప్రదీపమనునది ముఖ్యగ్రంథము. క్రీ. వె. ౧౦౫౨ లో నేటాంగునందు నిర్వాణపథమందెను. ఈమహనీయుని సమాధిపై స్థూపము నిర్మింపఁబడినది.

**అతీశుఁడు** — టిబెట్టుదేశమున సన్న్యాస (భిక్షు) ధర్మములను సంస్కరించిన బౌద్ధ సన్న్యాసి. వంగదేశము చూడుఁడు.

**అతుకులకాపురము, చితుకులమంట** ఆంధ్రలోకోక్తి.

**అథనాసియుస్** (Athanasius) — గ్రీకు నామము, అమృతుడు అని యర్థము. పురుష నామము, క్రైస్తవనామములు చూడుఁడు.

**అథెన్సుపట్టణము** — గ్రీసుదేశపు రాజధాని (గ్రీసుదేశము చూడుఁడు). ఇది అథీనా దేవిక్షేత్రమగుట నామెనుండియే యీపేరు ఏర్పడినది.

**అథెలిటిసిజమ్** (Athleticism) — శరీర వ్యాయామకళ. ఇది పలుదెరంగులు.

**అథెల్స్టన్** (Athelstan)—ట్యూటానిక్కు పేరు. Noblestone అని యర్థము. శాక్సనురాజులలో నొకని పేరు. ఇతఁడు Alfred the Great మనుమఁడు (ప్రసిద్ధుఁడు). పురుషనామము, క్రైస్తవ నామములు చూడుడు.

**అథెల్వోల్డు** (Athelwold)—ట్యూటానిక్కు పేరు, Noblepower అని యర్థము.

పురుషనామము, ... వ నామములు చూడుడు.

**అదగ్ధదహన న్యాయము** — ... కాలనిదానినే గాల్చునాని. కాలినయిన దానిం గాల్చదని యర్థము. అనగా బాగున్న వానికే బాధలుగాని, చెడిపోయిన హీనున కేబాధలు నుండవని భావము.

**అదర్యావళి పర్వతపంక్తి** — దీనినిప్పుడు ఆరావళి (Aravali Mountains) యను చున్నారు. ఇవి ఆర్యావర్త దేశమునకు పశ్చిమపు టెల్లగా పరిగణింపబడినవి. (వశిష్ఠ సంహిత ౧-౮). మరియు నిందే యీ పర్వత పంక్తికి వినాశనపర్వతమని వాడుకగలదని చెప్పబడినది.

**అద్దంకిసీమ** — ఆంధ్రదేశమున గుంటూరు మండలము, నెల్లూరు మండలముల భాగముల నేలిన రెడ్డిరాజులకు రాజధానియై యుండెను. అద్దంకి సుప్రసిద్ధగ్రామము. ఈప్రాంతదేశమున కద్దంకిసీమయని పేరు. దీని కొకప్పుడు విదర్భ దేశమని పేరుండెనట. కాని ఇది దమయంతి జన్మదేశమగు విదర్భదేశము గానేరదు (విదర్భదేశముచూడుడు) (బిదర్ చూడుడు). అద్దంకిగ్రామము గుండ్లకమ్మనదీతీరము. ఇట (ఓరుగంటి) ప్రతాపరుద్రసుతుడగు హరి పాలుడు బాగుచేయించిన (పాడుపడిన) దుర్గమున్నదందురు. మందపాటివారు వసించుచు సీసీమ నేలిరట. అద్దంకి ధాన్యపు వర్తకస్థలముగ నున్నది.

**అద్దంకి గంగాధరకవి** — ఆంధ్రకవులలో మధ్యకవులందు చేర్కొనబడినవాడు. నియోగిబ్రాహ్మణుడు. తండ్రి పేరు వీరరాజు. గంగాధరకవి గోల్కొండ నవాబగు మల్కిభరామ్ (మాలికిబ్రహీమ్ ఉల్ముల్కు) యాస్థానమున కవియైయుండినవాడు. ఇతడు తపతీ సంవరణమను శృంగారప్రబంధము రచించి తన ప్రభుండగు మల్కిభరాము నవాబునకుం గృతినిచ్చెను. క్రీ. వె. ౧౫౫౦ మొదలు ౧౫౮౦ కాలము, కృతిభర్త పరిపాలన కాలముగాన ఆనాటివాడని చెప్పవలయును. మల్కిభరాము బాల్యమునందు విజయనగరమున రామరాజు రక్షణయందుండెనట. అత్తరి సంస్కృతాంధ్ర భాషాపరిజ్ఞానము సంపాదించెనట.

**అద్దము** — భరతదేశము యాదికాలము నుండి అద్దము నెరుంగనిదికాదు. గాజులు స్త్రీలు చేతులకుం ధరించుట యాదికాలము నుండియు సౌమంగల్యలక్షణముగ నెన్నబడుచున్నది. అద్దములు దైవారాధనమునందు హిందువులకు ముఖ్యము. ఈజిప్టుదేశమున తొలుత నద్దము చేయబడెనని పాశ్చాత్యులనుచున్నారు. ఇది క్రీ. పూ. ౧౫౫౦ సంవత్సరప్రాంత మనియెదరు. అద్దముం గరగించుటకు సెంటిగ్రేడు థెర్మామీటరు ౧౨౦౦ మొదలు ౧౫౦౦ వరకు ... కావలసియుండును. ఇక్కాలమున పాశ్చాత్యుల కీవిద్య హస్తగతమైనది. అద్దములం దనేకజాతులు, ననేకరంగులు కలవు.

**అద్దములోని మూట** — అద్దములోం బ్రతిఫలించు మూటయొక్క నీడయనిభావము. ఆంధ్రలోకోక్తి.

**అదావన్నేచయన్నాస్తి వర్తమానేఽపి తత్తథా ఇతిన్యాయము** — పుట్టని వాడు గిట్టనివాడు జీవించనివాడే యని భావము. అనగా నాద్యంతముల నున్కి లేకుండె నేని, ఆద్యంతములకు మధ్యకాలమునందును

ఉన్కి లేకుండునని భావము. ఆదియందు ఉన్కి జన్మమనంబడును. అంత్యమందు ఉన్కి నాశనమనంబడును. వీనియం దున్కి లేకుండిన మధ్యకాలమున నున్కెట్లు పొసఁగును? ఉన్కియె యుండదనుట కీన్యాయము వర్తించును.

**అద్రాపిగోత్రము** — సంకృతి ఉపగణము చూడుఁడు.

**అదితి** — దక్షప్రజాపతి కుమార్తెలలో నొకతె. కశ్యపునిభార్య. ఈమె సంతతివారాదిత్యులనంబడిరి. (కశ్యపుమహర్షి భార్యలు చూడుఁడు).

**అదితివనము** కురుక్షేత్రవనములలో నొకటి.

**అదిరాదు ఇదిపోదు** ఆంధ్రలోకో

**అదుగోపులంటె ఇదుగోతోకన్నట్లు** నిజస్థితిని బరిశీలనఁజేయని వాగ్వ్యయమని యర్థము. ఆంధ్రలోకో క్తి

**అదురుటంగూర్చిన శాస్త్రము** — చలనశాస్త్రము చూడుఁడు.

**అదృశ్యన్తి (అరుంధతి)** — వశిష్ఠు భార్యయగు నరుంధతి కీపేరుగలదు. మరియు శక్తి భార్యకును అదృశ్యన్తియనిపేరు. ఈమె కుమారుఁడు పరాశరుఁడు, పారాశర స్మృతి యను ప్రసిద్ధధర్మశాస్త్ర గ్రంథము రచించినవాఁడు. విజయనగర సామ్రాజ్య నిర్మాతయగు మాధవాచార్యుండు పరాశరస్మృతికి వ్యాఖ్య రచించెను. అదియిప్పుడు పరాశరమాధవీయమను పేరఁబరగుచున్నది. ఈసందర్భమున వేదవ్యాసుని మనుమఁడు పరాశరుఁడని తెలియఁదగినది.

**అదృష్టపాదపేదేశేపరండోఽపిద్రుమాయతే|త్రిన్యాయము** — చెట్లులేని దేశములో నాముదపుచెట్టే మహావృక్షము. గోవులులేని యూరిలో గొడ్డుగేదెయె గోమాతయనిపించుకొనును. ఆంధ్రలోకోక్తి.

**అద్దెకువచ్చినగుఱ్ఱములు అగడ్తలు దాటునా?** — ఆంధ్రలోకోక్తి.

**అద్వైతసిద్ధాంతము** — ఇది భరతదేశమునందెక్కువగా వ్యాపకమునంది యున్న మతము. సృష్ట్యాదిగ భక్తికింబిదప నేర్పడిన మతమిదియని పెక్కండ్రు పరిశీలకులు తలంచుచున్నారు. ఇది షడ్వైదికమతములలో నొకటి. దీనినింకను వేదాంతవాదిమతమనియు ననుట కలదు. ఈమతసిద్ధాంతము ననేకమంది మహర్షులు తామాచరించియు, నన్యులకుంబోధించియు, తామురచించిన ఇతరగ్రంథములందు ప్రసంగవశమున సూచించియునుండిరి. వారియద్వైతవిధానమును సిద్ధాంతమొనర్చుచు నేమతగ్రంథములనైన రచించియుండిరేమోగాని, యిక్కాలమునం గన్పించు గ్రంథములలో నీమతమును సిద్ధాంతమొనర్చు గ్రంథము వ్యాసరచిత బ్రహ్మసూత్రములకు నీలకంఠాచార్య విరచిత బ్రహ్మమీమాంసాభాష్యమైయున్నది. వ్యాసమహర్షి రచించిన సూత్రములు బ్రహ్మమీమాంసయని ప్రతిపాదించియుండుటచేత నదివరకే జైమిని రచించియుండిన కర్మమీమాంస నంగీకరింపక పరమేశ్వరుని ప్రతినామంబగు బ్రహ్మ పారమ్యమున బ్రహ్మప్రతిపాదక సూత్రములను వ్యాసుండు రచించియుండుటచేతను నీయద్వైతమున నిర్గుణపరబ్రహ్మపారమ్యము అందేమైక్యమగుట ముక్తిగను చెప్పఁబడియుంటను, వ్యాసమహర్షి మత మద్వైత

మేమోయః సు ంపకః

...ద్వైతమత సిద్ధాంతమును, ద్వైతమత సిద్ధాంతమును, వ్యాసకృత బ్రహ్మసూత్రము లకే భాష్యములుగ వ్రాయఁబడియుంట ఇం కనూ పరిశీలన జరుగుటయె సమంజసమని తోఁచెడిని.

ఈవ్యాససూత్రములకే దూర్వాసభాష్య మని వేరొకభాష్యము గాన్పించుచున్నది. కాని, ఇది విపులముగ వ్రాయఁబడక చర్చ లతిక్లుప్తముగనుంట ఇదినిజముగ ముక్కోపి యగు దూర్వాసర్షి యీభాష్యమునకుంగర్త యనుటకుం బరిశీలన లొనర్పందగునని పించె డిని. ఈభాష్యమును అద్వైత ప్రతిపాదకమును పరబ్రహ్మపారమ్యమును దెల్పునదిగాన నిది నిజమున దూర్వాసమహర్షి విరచితమే యగుచో నీలకంఠభాష్యమునకన్న పూర్వపు గ్రంథమె యుండును.

శంకరభగవత్పాదు లొకయద్వైతసిద్ధాంత ప్రతిపాదక భాష్యము నొకటి రచించిరని యెల్లరెరింగినదే. ఇదిశక్తివిశిష్టమగు పరబ్రహ్మ పారమ్యముగ వ్రాయఁబడినది. మరియు నిందు పరమేశ్వరునిశక్తికి నెక్కువప్రాముఖ్యత సూచింపఁబడినది. ఇటశక్తియన పరమేశ్వ రుని సామర్థ్యమే వారినిజాభిప్రాయమైయుండ నోపు. ఐనను ప్రత్యేక విగ్రహము లిది వరకే పరమేశ్వరుని శక్తికి రచింపఁబడి పూజలందుచుంట శంకరభగవత్పాదులు ప్రజాభిప్రాయముగఁ దలంచి దానినట్లె వదలి యుండిరని తోచెడిని. అదివరకు నధిక వ్యాపకముంగాంచియుండిన బౌద్ధమతమును శంకరభగవత్పాదు లెదుర్కొని నిరసించిరను టకన్న, దానియందలి నిజధర్మమును తా

మంగీకరించిరనుటయె కొంతదనుక సమంజస ముండెడిని

ఉపరిశీలన నింతటితోనాపి యద్వైతమత ముంగూర్చి విచారింతము. అద్వైతమన రెండు కానిదని యర్థము. అనగా జగత్తునందు పరమేశ్వరపదార్థముతప్ప యన్యపదార్థమే లేదనిభావము. 'సర్వవ్యాపకోనారాయణో' త్యుక్తులచే జగమంతయు, పరమేశ్వరపదా ర్థమే గాన అందన్యపదార్థమే లేకుండుట నీమతమున కద్వైతసిద్ధాంతమనిపేరిడియుండిరి. సృష్ట్యాదియందు పృథివ్యప్తేజోవాయురాకా శము లెదుకను సృజింపఁబడియెను. అనగా గల్గెనని భావము. దీనింగూర్చి ఆర్యుల వేదమున, శ్రు॥ ఆకాశాద్వాయుః వాయో రగ్నిః అగ్నేరాపః అద్భ్యఃపృథ్వీ పృథివ్యా ఓషధయః ఓషధీభ్యోఽన్నమ్ అన్నాత్పురు షః॥ అని చెప్పఁబడినది. ఆదినాకాశము గల్గె ననియు, ఆకసమునుండి (పిదపనని భావము) వాయువు కల్గెననియు, వాయువుమూలముగ నగ్ని యేర్పడియెననియు, అగ్నినుండి యుద కము జనించెననియు, ఉదకసంజాతమై భూమిగల్గెననియు, భూసంజాతమై యోషధు లును, ఓషధులనుండి యాహారమును, దాని కిం బురుషుఁడును, నేర్పడిరనిభావము. ఇట పురుషశబ్దము, కర్మానుభవమున కాయత్త పరుపఁబడిన ప్రాణియని ఎరుంగునది. ఇది సృష్టివిధానమనియు క్రమక్రమముగ నేర్పడి, వాటివాటిరూపముల నందినవనియుభావము. ఇట్టిసృష్టి పరమేశ్వరునిచే ఉపాదానకారణ ముగ నెరపఁబడెనని బ్రహ్మమీమాంసా భాష్యమున వివరింపంబడినది. ఇంక నందే ఈ మతమున పతిపశుపాశములను త్రిపదార్థ ములు చెప్పఁబడినవి. పతియనిన పరమేశ్వరుం

డనియు, పశువనిన ప్రాణియనియు, పాశమనిన బంధమనియు (అనగా,విశిష్టాద్వైతమతమునఁ జెప్పఁబడిన సంసారకళంకమని భావము). ఈసందర్భమునం గ్రహించునది పతిశబ్దమునకు పరమేశ్వరశబ్దమే యర్థము. పశుశబ్దము జీవించియుండియు, కర్మానుభవమున కాయత్తమైయున్న దేహియని యెరుంగవలయును. (ఇట్టిపశువుల కధినాథుండగుటం బరమేశ్వరునకుఁ బశుపతియని పేరయ్యెను). ఇంకఁ బాశమనిన, ప్రాణి పరమేశ్వరపదార్థమే యయ్యును, ఆణవ మాయీయ కార్మిక మలములచే పరివృతమై కర్మబద్ధమై పూర్వకర్మలబ్ధఫలానుభవమున కాయత్తమైయుంట పరమేశ్వరుంజేర వీలుగాక నుండు నవస్థా ప్రతిబంధమని భావము.

అద్వైతసిద్ధాంతమున తత్వములు ముప్పదియారు. మానవశరీరస్థములుగను, మానవశరీరాశ్రయములుగను వివరింపంబడినవి. ఈ తత్వములు "తత్వమసి" యను మహావాక్యమునందలి మూడుపదములకు సంభవించినవిగ నుండెడిని. తత్-త్వమ్-అసి అను మహావాక్యమునకు "అది (ఆనిర్గుణపరబ్రహ్మము) నీవు (శరీరస్థప్రాణి) వైయున్నావ"ని యర్థము. కాన నిందలి తత్పదము శివతత్వాత్మకపదమనియు; త్వమ్పదము జ్ఞానేంద్రియ తత్వము లైదు, కర్మేంద్రియ తత్వము లైదు, పంచభూతతత్వము లైదు, పంచగుణతత్వములైదు, పురుషతత్వము, ప్రకృతి తత్వము, మనస్తత్వము, బుద్ధితత్వము, అహంకారతత్వము నను నిరువదియైదు తత్వముల కాత్మకపదమనియు; అసిపదము,రాగతత్వము, కాలతత్వము, కలాతత్వము, శక్తితత్వము, విద్యాతత్వము, నియతితత్వము, మహేశ్వరము, మాయాతత్వము, శుద్ధవిద్యాతత్వము, సదాశివతత్వమునను దశతత్వాత్మకపదమనియు నీలకంఠభాష్యములో, జెప్పఁబడినది. ఈ మతమున వేదము పరమేశ్వరశాదాగత మాట పరతఃప్రమాణమని చెప్పఁబడినది. మరియు జగద్వస్తువితతి పరమేశ్వరపదార్థమయ్యు అనగా వస్తుతః సత్యమయ్యు లౌకికవ్యవహారసంబంధమగు నామరూపతః మిథ్యయని చెప్పంబడినది.

పరమేశ్వరుండగు పతికి సత్ చిత్ ఆనందములు లక్షణములని చెప్పఁబడినది. సత్తనిన త్రికాలములు స్వాధీనమైయుండుటయు, చిత్తనిన స్వప్రకాశతయనియు, ఆనందమనిన దుఃఖరహితమగు స్థితియనియుఁజెప్పఁబడినది. ఇట్టి సచ్చిదానంద లక్షణుండగు పరమేశ్వరుండు పంచకృత్య పరాయణుఁడని చెప్పఁబడినది. పంచకృత్యములన సృష్టి (బ్రహ్మత్వము), స్థితి (విష్ణుత్వము), లయము (రుద్రత్వము), అనుగ్రహము, తిరోభావములనియు, ఇవి పరమేశ్వరశాసనమున ప్రపంచమున నడచుచుండ పరమేశ్వరుఁడు ప్రశాంతావస్థయందు నిర్గుణుండై యుండు స్థితికి నిర్గుణపరబ్రహ్మావస్థయని సాంకేతిక నామము మొసంగఁబడినది. ఇది పతియొక్క పరిణామ స్థితిగఁ జెప్పఁబడినది.

ఇంక పశువనంబడిన ప్రాణము-ఆణవమల (శుద్ధఅజ్ఞానము), మాయామలము (అహంకార మమకారపురస్సరాజ్ఞానము), కార్మికమలము నను త్రివిధాజ్ఞానములు చుట్టుకొని యుంట కర్మసంచితమేర్పడుచు, పూర్వకర్మఫలముల ననుభవింప జన్మములెత్తుచుండునని చెప్పఁబడినది. కాన నిట్టి జన్మపరంపరలు ప్రాణికి విధాయకములనియే చెప్పవలసి

యుండును. వీనినుండి విముక్తిఁగాంచుట కడ్డముగనుండు యాటంకమునకే పాశమని సాంకేతికనామము. ఈపాశమునకే కర్మ బంధమనియు, ప్రతిజన్మమునం దీకర్మబంధమే సంసారబంధముగ నేర్పడి, ధన దార పుత్రేషణల గల్పించుచు, పునఃపునర్జన్మములకుం గారణమై, కలుగంజేయు చుండుననియుఁ జెప్పఁబడినది. దీనికంతకు నజ్ఞానము మూలకారణమని చెప్పఁబడినది.

అజ్ఞానమునుండి తప్పించుకొనిసంసారబంధ విముక్తుఁడై జ్ఞానియగునేని, ప్రాణము కర్మ రహితమగు పరిశుద్ధావస్థంజెంది నిర్గుణ పరబ్రహ్మమున కర్తృతకల్గుననియు, ఏలనన, ప్రాణము పరమేశ్వరపదార్థమే యగుట యందే జేరిపో నర్హతకుం బాత్రతగల్గుననియు, నదియే ముక్తియనియు వివరింపఁబడినది. ఈముక్తిగల్గుటకు ప్రతిబంధకమగు పాశము- ఆవణమల, మాయామల, కార్మికమలము లనంబడిన మలత్రయసంబంధమనియు, దీని పరిణామావస్థ జగద్గర్భితరహస్యాత్మికమగు మాయయందుచేరియుండునదియనియుఁ జెప్పఁబడినది. ఈమాయంగూర్చి తెలియఁదగిన దీమతమున విస్తరించిచెప్పఁబడినది. ఈమాయ జగత్తునకంతకు మూలమనియు, జగత్తునందెల్లెడలను వ్యాపించియుండునది యనియుకూడ వివరింపఁబడినది.

నేను నాది యనంబడు యహంకారమమకారభ్రమ మాయాసంధమేననియు, తాను పరమేశ్వరపదార్థమే యను భావనకు చిహ్నమగు "సోహమ్" అను భావనయందు నమ్మకమునువాపి, తనయందొక ప్రత్యేకతం గల్పించి, బుద్ధిచే నమ్మింపంజేయుటయు, మాయాకార్యముగనే వివరింపఁబడినది. ఇట్టి మాయామహావ్యామోహమును భేదించి, సోహంబ యను భావన గల్గుటకుఁ జ్ఞానమని పేరిడియున్నారు. ఈ జ్ఞానోదయమునుగుటకు మార్గములును అద్వైత మతమున చెప్పఁబడినవి. శంకరభగవత్పాదబోధలందు 'జ్ఞానాదేవమోక్షః' అని వివరించిన దేశికుఁడు అనగా జ్ఞానము గలుగనిదే మోక్షము సిద్ధింపదని భావము.

మరియు పరమేశ్వరునకు సృష్టి స్థితి లయావస్థల కతీతావస్థ యొకటికలదు. దానికిం బ్రశాంతావస్థ యనిపేరు. ఆయవస్థ యందున్న పరమేశ్వరునకు నిర్గుణపరబ్రహ్మంబని సాంకేతికనామము కల్పింపఁబడినది. సృష్టి స్థితి లయకార్యములు పరమేశ్వర శాసనముమేరకు వానివాని పనులనవి క్రమముతప్పక నెరవుకొనుచుండ తాప్రశాంత స్థితియందుండు పరబ్రహ్మము సత్వరజస్తమోగుణములను దూరముగ నునిచి యుండు యవస్థ. ఈ అవస్థయందుండు పరబ్రహ్మము సచ్చిదానందలక్షణ యుతము. ఇట్టి పరమేశ్వరునకు నామరూపలక్షణము లారోపించుట నిరర్థకము. ఇట్టి పరమేశ్వరునియందు కర్మబంధము (అనగా సంసార బంధము) నుండి విముక్తిగాంచి పురుషత్వమును వీడియున్న ప్రాణి చేరిపోవునని శంకర భగవత్పాదులు బోధించిరి. వారి బోధ ప్రజల నెక్కువగా నాకర్షించుచుంటయు అదివరకుఁ బౌద్ధులైయుండినవా రనేకులు వీరికి శిష్యులగుచుంటయుఁ గాంచి యోర్వజాలని యసూయాగ్రస్త చిత్తులగువా రామహాత్ముని ప్రచ్ఛన్నబౌద్ధుఁడని చెప్పుచుండిరి. ఇందలి నిజతత్వమేమో ఇట వివరించి ముగింతుము.

చక్కఁగా పరిశీలించినచో శంకరభగవత్పాదులు బోధించిన యద్వైతవిధానము నందలి మతతత్త్వమును ధర్మవిధులును బౌద్ధమతమునందలి మతతత్త్వమును, ధర్మవిధులునొకటిగనే యుంటయు, బుద్ధభగవానుఁడు నిరసించిన జంతుహింసాకర కార్యములగు కొన్ని క్రతువులను శంకరభగవత్పాదులును నిరసించి జ్ఞానమార్గమునే ఉపదేశించుచుంటయు బుద్ధభగవానుఁడు మోక్షైకమార్గముగ తన స్వప్రవర్తనపూర్వకముగ దెల్పియుండిన సన్న్యాసము శంకరభగవత్పాదులును తా స్వీకరించి బోధించుచు నాచరించుచుండిన తురీయాశ్రమముతోఁ దులదూగుచుంటయు, రెండుమతములందలి సమానధర్మములు ప్రజలమనంబుల నాకర్షించుచుండెను. ఇదింకొక రహస్యమును కలదు. బౌద్ధమతమున పరమేశ్వరుంగూర్చి ఏమియుఁ జెప్పఁబడలేదు. ఇందునకుంగొందరు బౌద్ధమతమును నాస్తికమనుచుండిరి గాని, దేవుఁడు లేఁడని బుద్ధభగవానుఁ డనినటుల నేతావునను గానరాదు. అదివరకే యుండిన టులఁ జెప్పఁబడిన ఇప్పటి టిబెట్టుదేశపు బౌద్ధమునను, నేపాళదేశపు బౌద్ధమునను, స్వయంభూనాథుడు మొదలగు బౌద్ధపరమేశ్వర స్థానములు నేటికి నల్లేయుంటయు, బౌద్ధమతము నిరీశ్వరమతమని చెప్పుట సాహసమని తోపకపోదు.

మరియు, బౌద్ధమతమున వివరింపఁబడిన ప్రకృతియందు అద్వైతవిధానమున వివరింపం బడిన నిర్గుణపరబ్రహ్మమునందలిస్థితి గానన గుచుంటయు, దానినే (ప్రకృతి) ఆరాధించుట యన స్వప్రవర్తనవలన బుద్ధినారాధించుట (అనగా సత్త్వప్రవర్తన) యగుటయు, శంకర భగవత్పాదులనాటి బౌద్ధము నశించినదనుట కన్న అద్వైతమతమున లీనమైనదని చెప్పుట సమంజసముగనుండును. రెండుమతములందలి ముక్తియు సరిపోవుచునేయున్నది. శంకరులను ప్రచ్ఛన్నబౌద్ధులని నిరసించినవారి యోగ్యతేమివంటి యసూయత నేఁటికిని లోకమున నచ్చటచ్చట గాననగుచునే యున్నది. అట్టివారి మనోబలహీనతం గాంచుచు, ప్రాజ్ఞులు కనికరపడఁ దగును. శంకరభగవత్పాదులు కర్మమార్గమును నిరసించియో, వదలియో, జ్ఞానమార్గముం బోధించుట మతసంస్కారమైనను గావచ్చుంగాని, శంకరభగవత్పాదులు అదివరకే యుండిన యద్వైత సిద్ధాంతము నిర్మించినవారు గారనియు, మతోద్ధారకులనియు, చెప్పకతప్పదు.

**అద్వైతానందుఁడు** — వేదాంతసారమను గ్రంథమునకు వ్యాఖ్యానము రచించినవాఁడు. ఈతని శిష్యుఁడు సదానందుఁడు.

**అద్వైతానందము** — ఆనందములు చూడుఁడు.

**అదోషస్త్వేవ సగుణో విగుణే** — దుష్టుఁడు ఒకరికి కీడుచేయకుండుటయే సుగుణము.

**అద్యోహగోత్రము** — రాద్ధకగణము చూడుఁడు.

**అధమునియాలగుటకన్న బలవంతుని బానిస్సయైన మేలు** — ఆంధ్రలోకోక్తి.

**అధర్మము** — వరుణునకు జ్యేష్ఠాదేవియందు అధర్మము సంతానమై జనించెను. ఈతనికి నిఋతి కూతురగు హింసయు, మృష యను వేరొకతెయు సహచారిణులు. భాగవతమున నధర్మునకు మృషయందు దంభ

ఆదంభమునకు సహచారిణియగు మాయ యందు లోభమును, ఆలోభమునకు సహచారిణియగు నికృతియందు క్రోధమును, క్రోధమునకు హింసయందు కలియు, కలికి సహచారిణియగు దురుక్తియందు మృత్యువును, ఆమృత్యువునకు భీతియందు నిరయుఁడును గల్గిరనియు, నిరయునకు యాతన సహచారిణియనియుం జెప్పఁబడినది.

ఇంక విష్ణుపురాణమున — అధర్మునకు హింసయందు అనృతమును, ఆయనృతమునకు సహచారిణియగు నికృతియందు భయనరకము లిర్వురుజనించిరనియు, అందు భయమునకు సహచారిణియగు మాయయందు మృత్యువు జనించెననియు, ఆమృత్యువునకు తృష్ణ, క్రోధము, శోకము, వ్యాధి, జరయుం గల్గిరనియు, నరకునకు సహచారిణియగు వేదనయందు దుఃఖము జనించెననియుం జెప్పఁబడినది. మరికొన్ని యితరగ్రంథములందు, అధర్మునకు హింసయందు భయ, మహాభయ, మృత్యువులను సుతులును, సురనింద యను పుత్రికయుం గల్గినటుల మాత్రము చెప్పఁబడినది. ఇదియంత నిరూపితసంతి యని మేము వేరుగ వ్రాయనక్కరలేదు.

**అథర్వణకారికలు** — అథర్వణుండను యొక పండితుఁడు, నన్నయభట్టు కాలమునాఁటివాఁడని కొందరును, అంతకించుక తరువాతివాఁడని కొందరును పరిశీలకులు తలంచుచున్నారు. ఈతఁడురచించినవిగ చెప్పఁబడినవి నాలుగుగ్రంథములు కలవని తెలిసెడిని. అవి, ౧. భారతవిరాటోద్యోగపర్వములు, ౨. ఛందస్సు, 3. త్రిలింగశబ్దానుశాసనము, ౪. కారికలు అనియెదరు. ఇందు మొదటి రెండును మనకనవసరములు. తక్కిన రెండును వ్యాకరణగ్రంథములు. మరియుఁ గడపటిది కారికలై యథర్వణకారికలనంబడు మన ప్రస్తుతాంశము. ఆ అథర్వణకారికలన్నియు నొక పుస్తకముగ లభింపకున్నవి. ఆంధ్ర శబ్దచింతామణికి వ్యాఖ్యయందు (గాలి నరసయ్యగారు రచించినది) ఇంచుమించు మున్నూరు కారికలు ఉదహరింపఁబడినవి. ఇంకను పదెన్మిది ఇతరగ్రంథముల నుదహరింపఁబడినవి కలవందురు. రావుబహదూర్ కందుకూరి వీరేశలింగంపంతులుగారు వివేకవర్ధని యనంబడు పత్రికలో 3౭౮ కారికలు ప్రకటించియుండిరి. ఇంకను విజయూరి లచ్చారావుగారను పరిశీలకులును 3౭౮ కారికలు సంపాదించి యొకగ్రంథముగఁ జేర్చిరని ప్రతీతికలదు. ఇది పరిచ్ఛేదములుగ వ్రాయఁబడియుండలేదనియు, పూర్వోత్తర సందర్భములుకూడ సరిగా గాన్పింపకున్నవనియు, పిదప నన్నయభట్టీయమునుండి పరిచ్ఛేదములుగ విడదీసిరనియు వినుము.

అథర్వణ కారికలందు హరికారికల కర్తయగు హరికవిని, శ్రీకవిని, విష్ణుశర్మను,ధూర్వహుని, శృంగారభూమణుండను వైయాకరణుని పేర్కొనియుంట, వీరింగూర్చి పరిశీలింపవలసియున్నది గాని వీరి వ్యాకరణగ్రంథములలో నొక్క హరికారికలనంబడునవిదక్క తక్కినవి గానవచ్చుటలేదు. హరికారికలు శిథిలములై నామమాత్రావశిష్టముగ నుండ, కాకినాడ వాస్తవ్యులు శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారను విద్వాంసుఁడు, క్రీ. వె. ౧౮౪౦ సంవత్సరప్రాంతకాలమున వానిం బయలుదీసి వృత్తులను ఉదాహరణములను జేర్చి కూర్చిరని తెలియుచున్నవి. వీరి గ్రంథమునకు హరికారికలనియే పేరట. హరికారికలం

బట్టియే మహనీయుండగు పరవస్తు చిన్నయ సూరిగారు బాలవ్యాకరణము రచించిరని యొక వాడుకగలదు. కొందరు పరిశీలకులు అందలి వృత్తులను ఉదాహరణములను, ఇందు పొందుపరచిరని యనుచున్నారు. ఇందెంత వరకు నిజమున్నను, లేకున్నను, బాల వ్యాకరణము ౧౮౫౮ సంవత్సరమున తొలుత ప్రకటింపఁబడియుండుట ఎరుంగదగినది. ఇంక నీసందర్భమున అథర్వణకారికలంగూర్చి ఒక అహోబలపతితప్ప వివరించినవా రింకొకరు లేరని తేలుచున్నది. అథర్వణకారికలం గూర్చి ఇంకను పరిశీలకులు చక్కని పరిశీలన లంజరపుట శ్రేయము.

**అథర్వణ వేదము** — వేదవ్యాసుండథర్వణ వేదమును తన శిష్యుండగు సుమంతున కొసంగె. ఆ మహనీయుండును తావ్యాఖ్య లొనర్చుటయెగాక తన శిష్యుండగు కబంధు నకు విధించెను. ఆతఁడు తానును తన శిష్యులగు పథ్యర్షి, దేవదర్శర్షులును దీని నుద్ధరించి వ్యాఖ్యాతలయిరి.

పథ్యర్షి తనకుంబిదపఁ దన శిష్యులగు శౌనక, కుముదాది, జాబాలర్షులను నియమించెను. శౌనకునకు శిష్యులగు సైంధవ, ముంజకేశులును, దేవదర్శర్షి శిష్యులగు పిప్పలాద, శౌష్ఠాయని, బ్రహ్మబలి, మేధర్షులును, వ్యాఖ్యలువ్రాసి పూర్తియొనర్చిరి. ఇటుల వ్యాససంకల్ప మాయన శిష్యప్రశిష్య సంతతి కొనసాగించి పూర్తియొనరించినది వినోదముఁ గల్పింపకమానదు.

అథర్వణవేదమన్ని వేదములవలెనే మంత్రములు, బ్రాహ్మణములు, ఉపనిషత్తులునని మూడుగనే యున్నది. మంత్రభాగమున ౧౧౯౬ కారికలు కలవు. పిదప నింకను తొమ్మిది యథర్వణశాఖలును కలవు. అవి ౧. పిప్పలులు, ౨. శౌనకులు, ౩. దామోదులు, ౪. తొత్తాయనులు, ౫. జాబాలులు, ౬. బ్రహ్మపలాశులు, ౭. కునఖలు, ౮. దేవదర్శులు, ౯. చారణవిద్యులనునవి. వీనికిం బిదప పంచకల్పములు కలవు.

ప్రథమకల్పమున నక్షత్రకల్పము, విధానకల్పము, సంహితావిధి, అభిచారకల్పము, శాంతికల్పము ననునైదు పరిశిష్టలును గలవు. ద్వితీయ కల్పమునను, తృతీయ కల్పమునను, చతుర్థ కల్పమునను, పంచమ కల్పమునను ఇటులనే నక్షత్ర, విధాన, సంహితావిధి, అభిచార, శాంతికల్పములు కలవు. కాన నీ యైదుకల్పములును ఇరువదియైదు పరిశిష్ట లని తెలియగలదు. ఈ కారికలు, శాఖలు, కల్పములు, అథర్వణవేద మంత్రభాగము లోనివే. బ్రాహ్మణము విధి అర్థవాదములుగ ద్వివిధము. మరియు దీనికి గోపథబ్రాహ్మణ మని పేరుగలదు. అథర్వణవేదమునందు తొంబది ఉపనిషత్తులు కల్గినవి.

అథర్వణవేదమున ౨౦ కాండలు, ౪౦ ప్రపాఠకములు, ౧౦౦ అనువాకములు, ౭౬౦ సూక్తములు, ౧౦౧౫ వాక్యములు, ౧౨౦౦౦ కారికలును కలవు. ఈ వేదము వైతాయన గోత్రమనియు, బ్రహ్మ దైవతమనియు, అనుష్టుప్ఛందమనియు, తీక్ష్ణప్రకాశము కలదనియు, విశ్వాత్మక విశ్వకర్మతగల్గి, నీలవర్ణ పద్మచ్ఛాయల శరీరము కలదనియుఁ జెప్పఁబడినది. కౌశికకల్పసూత్ర మథర్వణ వేదసంబంధము.

**అథర్వణ వేదమునందలి ఉపనిషత్తులు** — ఇవి ముప్పదియొకటి కానం

బడుచున్నవి. (ఉపనిషత్తులు, వేదములు, అధర్వణవేదము చూడుఁడు. ప్రశ్నోప నిషత్తు, ౨. ముండకోపనిషత్తు, 3. మాం డూక్యోపనిషత్తు, ౪. అథర్వశిరోపనిషత్తు, ౫. అథర్వశిఖోపనిషత్తు, ౬. బృహజ్జాబా లోపనిషత్తు, ౭. నృసింహతాపిన్యోపనిష త్తు, ౮. నారదపరివ్రాజకోపనిషత్తు, ౯. సీతో పనిషత్తు, ౧౦. శరభోపనిషత్తు, ౧౧. నారా యణోపనిషత్తు, ౧౨. రామరహస్యోపనిషత్తు, ౧3. రామతాపిన్యోపనిషత్తు, ౧౪. శాండి ల్యోపనిషత్తు, ౧౫. పరమహంసపరివ్రాజి కోపనిషత్తు, ౧౬ అన్నపూర్ణోపనిషత్తు, ౧౭. సూర్యాత్మోపనిషత్తు, ౧౮. పాశు పతోపనిషత్తు, ౧౯. పరబ్రహ్మోపనిషత్తు, ౨౦. త్రిపురతాపిన్యోపనిషత్తు, ౨౧. దేవీ ఉపనిషత్తు, ౨౨. భావనోపనిషత్తు, ౨3. భస్మో పనిషత్తు, ౨౪. జాబాల్యోపనిషత్తు, ౨౫.గణ పత్యోపనిషత్తు, ౨౬. మహావాక్యోపనిషత్తు, ౨౭. గోపతాపిన్యుపనిషత్తు, ౨౮. కృష్ణ తాపిన్యుపనిషత్తు, ౨౯.హయగ్రీవోపనిషత్తు, 3౦. దత్తాత్రేయోపనిషత్తు, 3౧. గరుడోప నిషతు.

**అథర్వణశాఖ విశ్వబ్రాహ్మణులు** — వీరు విశ్వకర్మ సంతతిలోని ప్రత్నసర్షిసంతతి వారని చెప్పఁబడినది. అధర్వణశాఖవారి మతగ్రంథమునకు ప్రత్నససూత్రమని పేరు. వీరియందు శూద్రవర్ణమనియు, శిల్పి లేక పాషాణవర్ణమనియు, రెండువర్ణములు చెప్పఁ బడినవి. (విశ్వబ్రాహ్మణులు చూడుఁడు.)

శూద్రవర్ణపు విశ్వబ్రాహ్మణులు-పర్యాయ వృత్తివారనియు, వీరిది ఇంద్రసంతతి, శచీదేవి (శక్తి) పీఠముననియు చెప్పఁబడినది. వీరి యందొక్క వాస్తుకగణమును, అందైదు గోత్రములును కలవు. శిల్పి లేక పాషాణ వర్ణపు విశ్వబ్రాహ్మణు లాదివృత్తివారనియు, శిల్పిసంతతి క్రియాశక్తిపీఠమనియు, ఈ శిల్పియె శిల్పమును రచించెననియు, ఈతఁడే యోగమున కధిపతియనియు, వీర నెదరు. వీరియందు ప్రహర్షణగణము, ప్రత్నసగణము, విశ్వభద్రగణము, శక్వరగణము నను నాల్గు గణములును, అందిరువది గోత్రములును కలవని చెప్పఁబడినది.

**అథర్వణాచార్యుఁడు** — ఆంధ్రకవుల యందుఁ బూర్వకవులలో పరిగణింపఁబడిన వాఁడు. అధర్వణకారిక లీతనిచే రచియింపఁ బడలేదనియు, ఆధునిక (కవి) కృతములయ్యు, నాతని పేరిడంబడినవనియు, నొక వాదము కలదు. (అథర్వణకారికలు చూడుఁడు).

ఈ యధర్వణనామమే వింతగొల్పుచున్న దనియు, నిది బిరుదముంబోలిన నామమనియు, గాలి నరసయ్య యను నామమునకు బదులుగ వచ్చిన "వాతూలాన్వయ అహోబలసతి" యను నామమువంటిదే యనియు, కవిరాక్షస నామముం గూడ నిట్టిదే యనియు, నొక వాదముకలదు.

కాలము:—ఈతని కాలనిర్ణయముచేయుట కెన్నెన్నో పరస్పరవిరోధములగు గాథలు కలవు. అట్లగుట నొక్క యాధారముచేత మాత్రము క్రీ. శ. ౧౧౭౨ కు తరువాతి వాఁడని మాత్రమే చెప్పనొప్పును. (ఉ.) అథర్వణుఁడు, త్రిలింగశబ్దానుశాసనమునందు ప్రథమకాండము, అయిదవ శ్లోకమునందును, తృతీయకాండము పదుమూడవ శ్లోకము నందును, విఖ్యాతప్రాకృతభాషాలాక్షణికుఁ డగు హేమచంద్రుని నామ ముదాహరించి నాఁడు. హేమచంద్రుఁడు క్రీ. శ. ౧౧౭౨ వ

వత్సరమున మృతినొందెను. కావున నీయథర్వణుఁడు క్రీ. శ. ౧౧౭౨ కు తరువాతివాఁడనుటకు మాత్రము వీలున్నది.

తత్కృతగ్రంథములు:— అథర్వణుని పేర పరంపరగ వచ్చుచున్నవి, రెండు వ్యాకరణములు, ఒక ఛందస్సు, ఒక కావ్యము. ఈ గ్రంథములన్నియు నొకేకవి వ్రాసెనా, ఏక కాలమున రచియింపబడెనా, అను నీవాదోపవాదములు కలవు. అధర్వణుఁడు రచియించె నన్న భారతకావ్యముంగూర్చియు, నెనోక్క గాథలు కలవు. తన కృతమగు భారతము రాజనరేంద్రునకుఁ గృతినొసంగ రాణ్మహేంద్రము వచ్చి, నన్నయభట్టునకు దన గ్రంథము జూపి తనకు రాజదర్శనము చేయింపుమని కోరుటయు, నన్నయభట్టు స్వగ్రంథ ప్రాశస్త్యము చెడునను వెఱపున, నీఅధర్వణుడింట లేని సమయాన, నాతని గ్రంథమును తగుల బెట్టించెననియు, అట్లుభస్మముకాక మిగిలినది విరాటపర్వము మాత్రమనియు, నొకపలుకు కలదు. ఏదియెట్లున్నను అధర్వణ భారతములోనిదని వాడుకలోనున్న ఒకపద్యమిచ్చుటమచ్చుకుజూపియింతతోవిరమింతుము

తృష్ణాతంతు నిబద్ధ బద్ధులగు రాధేయాదులంగూడి శ్రీ। కృష్ణుం గేవలమర్త్యుగాదలచి మర్దింపంగ నుత్సాహావ। ద్ధిష్ణుండయ్యెసుయోధనుండకట ధాత్రీనాథ యోజింపుమా। యుష్ణీషంబున గట్టవచ్చునె మదవ్యాధోగ్ర శుండాలమున్॥

**అథసన్నిహితాదపి వ్యవహితం సాకాంక్షంబలీయఃసి ఇతిన్యాయము** — సన్నిహితశబ్దమైనను అర్థోపయోగము లేని శబ్దముకన్న, దూరస్థితశబ్దమైనను అర్థోపయోగము కలశబ్దము బలీయమగునది. ఇట్లె సన్నిహితుఁడైనను అనుకూలింపనివాని కన్న దూరస్థుఁడైనను అనుకూలించినవాఁడాప్తుఁడగునని భావము.

**అధ్వలు** — ౬ విధములు. అధ్వయనగా మార్గము. చిన్మయదీక్షయొనర్చుతరి శిష్యునింగూర్చి గురుఁడు షడధ్వశోధన మొనర్చెడిని. దీనింగూర్చి సిద్ధాంతశేఖరమున విపులముగ దెల్పఁబడినది. ౧. వర్ణాధ్వ- అక్షరములంగూర్చినయధ్వ ౫౦ విధములు. ౨. పదాధ్వ- పదములంగూర్చినయధ్వ (౮౧ పదములు). ౩. మంత్రాధ్వ- మంత్రములంగూర్చినయధ్వ ౭౦౦౦౦౦౦౦ (ఏడుకోట్లు). ౪. తత్వాధ్వ- తత్వములంగూర్చినయధ్వ ౩౬ విధములు. ౫. భువనాధ్వ- ౨౨౪ భువనములంగూర్చిన యధ్వ. ౬. కలాధ్వ- ౬ కలలంగూర్చిన యధ్వ.

**అధ్యాత్మలు** — (వాయువులు) ఇవి త్రయోదశవాయువులు. పిండాండ బ్రహ్మాండములందుండునవిగఁ జెప్పఁబడినవి.

**అధ్యాత్మికశాస్త్రములు మూడు** — ౧. నిరీశ్వరసాంఖ్యము, కాపిలము, ౨. సేశ్వర సాంఖ్యము, పాతంజల (యోగశాస్త్ర) ము, ౩. వేదాంతము, (షడ్విధవేదాంతవాద శాస్త్రములు).

**అధ్యారోపాపవాద న్యాయము** — అధ్యారోపమన భ్రాంతింగల్గించినయనృతము. దాని యపవాదము నిజమెరింగి యాభ్రాంతిని వదలుట. త్రాడును చూచి (రాత్రియందు) పామనుకొని భ్రమించుట అధ్యారోపము. అది త్రాడేయని నిజమెరింగి యాసర్పభ్రాంతిని వీడుట అధ్యారోపాపవాదము. ఇట్టి నిజమెరింగి భ్రాంతినివీడు సందర్భముల నీన్యాయము వర్తించెడిని.

**అధ్వాసుగోత్రము** కపిఉపగణము చూడుడు.

**అధికమాసము** - మూడుచాంద్రమాన సంవత్సరముల కొక్కసారి అధికమాస మొకటి తటస్థించునని యెల్లరెఱింగినదే. దీని నిజతత్వమెట్టిదన, చాంద్రమానసంవత్సరము సౌరమానసంవత్సరమునకన్న దిన ౧౦ గంట ౨౧ నిమి ౨౩ సెకండ్లు ౫౩ దనుకతక్కువ పరిమాణముకలది. కాన సంవత్సరము గడచినకొలఁది చాంద్రమానవత్సరము వెనుకంబడుటయు సౌరమానవత్సరము ముందునకుంజరగి పోవుటయు సంభవించెడిని. అటులగాకుండ నీయధికమాసము లడ్డుపడుచుండును.

వీటిలెక్కమేరకు ౧౯ సౌరమాన సంవత్సరములలో నేడధిక (చాంద్రమాన) మాసములు గల్గుచుండునని తేలుచున్నది. అధికమాసమువచ్చిన చాంద్రమాన వత్సరమున పదమూడు నెలలుండుటవలన పదమూడు పౌర్ణములును పదమూడమావాశ్యలును కల్గుననియర్థము. దైవికముగగూడ సంభవించిన యీపద్ధతితో నన్నియుం జక్కఁబడుచుంట నైసర్గిక విచిత్రమనిపించెడిని. ఇటుల ౧౯ సంవత్సరముల కాలమున సౌరచాంద్రమాన మాసముల తేడా కలసి పోవుచుంట జరుగుచుండును. ఇంక నీయధికమాసముల పేరులంగూర్చి విచారింతముగాక.

మేషసంక్రాంతి చైత్రమాసమునను, వృషభసంక్రాంతి వైశాఖమాసమునను, మిథునసంక్రాంతి జ్యేష్ఠమాసమునను, కర్కాటకసంక్రాంతి ఆషాఢమాసమునను, సింహాసంక్రాంతి శ్రావణమాసమునను, కన్యాసంక్రాంతి భాద్రపదమాసమునను, తులాసంక్రాంతి ఆశ్వయుజమాసమునను, వృశ్చికసంక్రాంతి కార్తీకమాసమునను, ధనుస్సంక్రాంతి మార్గశిరమాసమునను మకరసంక్రాంతి పుష్యమాసమునను, కుంభసంక్రాంతి మాఘమాసమునను, మీనసంక్రాంతి ఫాల్గుణమాసమునను, సర్వసాధారణముగ సంభవించుచుండెడిని. కాని ఒక్కొకతరి ఒక చాంద్రమానమాసమున (సౌరమాన)నే సంక్రాంతియు లేకపోవుట సంభవించుచుండును. అట్టిచాంద్రమానమాస మధికమాస మనంబడును. అనగా నీనెల రెండుసూర్యసంక్రమణముల నడుమంబడినదని భావము. చాంద్రమానమాసముగాన నిందొక పౌర్ణమియు నొకయమావాస్యయు సంభవింపకతప్పదు. ఆనెలయందు పౌర్ణమినాఁడేనక్షత్రమో ఆయధికమాసమాపేరం బరగెడిని. ఏచాంద్రమానవత్సరము నందైన నధికమాసమిట్లు సంభవించుతరి దానిని ముందుగనడపి పిదప నిజమాసమును పాటింతురు. ఈరెంటికీ మాసనామ మొక్కటిగనేయుండి నిజమాసమున సూర్యసంక్రమణ ముండితీరును.

ఈసందర్భమున నింకొకతరి యీసంగతినే నుడివెదమనిన ఏనెలయం దేసంక్రమణము సంభవింపఁదగునో ఆనెలకడదినమగు అమావాస్యనాఁడు ఆసంక్రమణ మమావాస్యగడియలుండగనే సంభవించిన నది మామూలుగనే యుండుననియు, అమావాశ్యగడియలైపోయినపిదప (నాదినమందే) సంక్రమణము సంభవించిన నది తర్వాతిమాసముననే సంభవించినట్లై యధికమాసమగుటయు జాగ్రతగ నెరుంగదగినది. ఈసందర్భమున భాస్కరాచార్యుండు, సిద్ధాంతశిరోమణియందు వివరించిన శ్లోకమిట వివరించుట సమంజసము.

శ్లో॥ స్పష్టోఽధిమాసః పతితోఽప్యలబ్ధో
యదాయదావాఽ పతితోఽ పిలబ్ధః।

నై కేర్ని రైకైః క్రమశోఽ ధిమాసైః
స్తదాదినా ఘుస్సుధియా ప్రసాద్యః ॥

స్పష్టమాసపు లెక్క మేర కధికమాసము వచ్చుచున్నను నిజమున నొకప్పుడు కాదనియు వేరొకప్పుడు లెక్క మేరకు అధికము రాక పోయినను, నిజమున నొకప్పుడు వచ్చుటయె జరుగుననియు, కావున దైవజ్ఞుండగు సిద్ధాంతి అధికమాససంఖ్యనుండి వీలుకొలది ఒకటి తగ్గించిగాని, ఒకటి యెక్కించిగాని, అహర్గణ ముం గనుగొనదగును అని యర్థము. అధిక మాసము లెప్పుడైనను, చైత్రవైశాఖజ్యేష్ఠ ఆషాఢశ్రావణభాద్రపదములుగనే గల్గుచుం డునుగాని, అన్యమాసములందు గలుగనేరవు. (మాసములు చూడుఁడు, చాంద్రమాన మాసము చూడుఁడు, సౌరమానమాసము చూడుఁడు, నష్టమాసము చూడుఁడు).

**అధికరణాంగములు** — అంగములు చూడుఁడు.

**అధికారన్యాయము** — అధికారమున అర్హత యని యర్థము. ఏయే కార్యము లొనర్ప నెవ్వరర్హులో వారే యాకార్యము లొనర్పవలెనని భావము. ఉపనయనసంస్కార మందినవాఁడు వివాహమున కర్హుఁడు. స్వర్గ కాముఁడు కానివాఁడు దర్శపూర్ణమాస క్రతువునొనర్ప ననర్హుఁడు. కొన్ని క్రతువు లొనర్పనిదే పైక్రతువులొనర్ప నర్హత యుండదు. వైరాగ్యము కుదరనిదే సన్యాస మున కర్హతలేదు. ఇటులనే అధికారానధి కారములు (అనగా అర్హత అనర్హతలు) ఎరుం గఁదగినవి. ఈసందర్భముల నీన్యాయము వాడుదురు.

**అధికారి అనుబంధము** — అనుబంధ చతుష్టయము చూడుఁడు. అందులో నొకటి.

**అధికోట** — ఉత్తరపాంచాల దేశములోని తొల్లింట రాజధానిగనుండిన అహిచ్ఛత్ర పురపు తావు. (ఉత్తర పాంచాలదేశము చూడుఁడు). వేణుచక్రవర్తి ఇట పాలించెనని చెప్పఁబడినది.

**అధికస్యాధికం ఫలం**—అధికమునకు అధిక ఫలము అనిభావము.

**అధిరాజ దేశము** — కరూశదేశము చూడుఁడు.

**అధిశూరుఁడు లేక అధిశూరజయుం తుఁడు** — వంగదేశపురాజు.

**అధుగోత్రము** — ఆధుచూడుఁడు. కథక గణము చూడుఁడు.

**అధూర్తరజుఁడు** — అత్రిసంతతి. చంద్ర వంశ క్షత్రియుఁడు. తండ్రి కుశికుఁడు (కుశుడు). సోదరులు కుశాంబుఁడు, కుశనా భుఁడు, వసువు అనువారలు. కుమారుఁడు రాజర్షి యగు గయుఁడు. అధూర్తరజుఁడు ధర్మారణ్యనిర్మాతగ చెప్పఁబడినవాఁడు.

**అధోముఖనక్షత్రములు** — ౧. భరణి, ౨. కృత్తిక, 3. ఆశ్లేష, ౪. మఖ, ౫. పుబ్బ, ౬. విశాఖ, ౭. మూల, ౮. పూర్వాషాఢ, ౯. పూర్వాభాద్ర నక్షత్రములు అధో ముఖములనియు, వీటియందు నూయిద్రవ్వుట, చెరువుత్రవ్వుట, కంచెవేయుట, గణితము ప్రారంభమునం దర్హనక్షత్రములని జ్యోతిష శాస్త్రమునఁ జెప్పంబడినది. (ఊర్ధ్వముఖ నక్షత్రములు, తిర్యఙ్ముఖ నక్షత్రములు చూడుఁడు).

**అధోక్షజవ్యూహము** — రామానుజీయ వైష్ణవ, చైతన్య వైష్ణవ. మతధర్మములందు తదేకాత్మరూప మహావిష్ణువు. అందు ద్వితీయ చతుర్వ్యూహములలో నొకటిగ చెప్పఁబడినది. దీనిని వాసుదేవ వ్యూహము లైదింటిలో నొక ఉపవ్యూహమనియు, విలాసమూర్తి యనియు, వరుసగ పద్మ, గద, శంఖ, చక్రము లాయుధములనియుఁ జెప్పఁబడినది. (విష్ణుదేవాలయములందలి విగ్రహములు చూడుఁడు.)



**అనంగత్రయోదశి** — చైత్రశుద్ధ త్రయోదశి, మార్గశిర శుద్ధ త్రయోదశుల కనంగ త్రయోదశి యను పేరుకలదు. వీటియందు శివపూజావ్రత మాచరింతురు. (పండుగలు చూడుఁడు).

**అనంగదేవతలు** — అనంగదేవీఅష్టకము లేక అనంగదేవతలు. శ్రీవిద్యోపాసకులు. (మంత్ర శాస్త్రమునందు) శ్రీచక్రమున మూఁడవయావరణమునఁ గల యష్టదళ పద్మమందలి ఎనిమిది దళములందునను, దళమున కొక యధిదేవతను నిల్పి పూజింతురు. ౧. అనంగకుసుమదేవి, ౨. అనంగమేఖలాదేవి, ౩. అనంగమదనాదేవి, ౪. అనంగమదనాతురాదేవి, ౫. అనంగరేఖాదేవి, ౬. అనగాంకుశాదేవి, ౭. అనంగవేగినీదేవి, ౮. అనంగమాలినీదేవి.

**అనంగపాలుఁడు** — తువరవంశపు కడపటిరాజు. రాజధాని ఢిల్లీనగరమని బయల్పడి కొందరు పరిశీలకులీతని నాఁడే, ఇంద్రప్రస్థపురమునకు ఢిల్లీయని పేరుకల్గినదని చెప్పుచున్నారు. ఈయనకు కమలాదేవి, విమలాదేవి యను నిద్దరు కుమార్తెలుండిరి. కమలాదేవిని అజమీరుభూపతియగు సోమేశ్వరున కిచ్చెను. ఆమెసుతుఁ పృథ్వీరాజు. అనంగపాలుఁడు తన కడదినముల బదరీకాశ్రమమున కరగుతరి తనఇంద్రప్రస్థరాజ్యమును దౌహిత్రున కొసంగెను. రెండవసుత విమలాదేవిని కన్యాకుబ్జరాకుటుంబమున కొసంగెనట. ఆయనపేరు విజయపాలుండట. కొందరీమెయే జయచంద్రుని తల్లియందురు కాని సందర్భముసరిగా లేదు, నిదర్శనములును లేవు.

**అనంగమహారాజు** — షోడశమహారాజులలో నొకఁడు. (మహారాజులు చూడుఁడు.)

**అనంతకులగోత్రము** — వైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు.) అనంతకులగోత్రము- ఏకాక్షేయగోత్రము (౨౧). సంస్కృతగోత్రము ఋష్యశృంగస. ఋష్యశృంగగణము, ఆపస్తంబసూత్రము, యజుశ్శాఖ, ప్రమాణగ్ర. ఆద్యప్రవరఖండ, దేవత అనంతేశుడు, భార్య మారాంబ, తపస్థానము మేరుశిఖరము, తటాకము అనంతశామకము, జపము కోటి, దీపసంఖ్య ౬౧, క్షేత్రసంఖ్య ౯౭, అనంత దానములు, అలచందలు వర్జనీయము.

**అనంతనాగపురము** — కాశ్మీరదేశము చూడుఁడు.

**అనంతనాథుఁడు** — జైనతీర్థకరులలో నొకఁడు (తీర్థకరులు చూడుఁడు). వీరి చిహ్నము, ఏదుపంది. ఇక్ష్వాకువంశము క్షత్రియుఁడు, తండ్రి పేరు సింహాసేనరాజు. తల్లి పేరు

సురజాదేవి, జన్మస్థానము అయోధ్య, పొడవు ౫౦ ధనస్సులు, వర్ణము సువర్ణచ్ఛాయ, ఆయువు ముప్పదిలక్షలు, గణధరసంఖ్య ౫౦, నిర్వాణస్థలము, సుమేరుశిఖరము, అంతరా శము రసాగర్.

**అనంతనార్యకవి** — ఆంధ్రకవులలో నాథునికులందుఁ బరిగణింపఁబడినవాఁడు. తండ్రి పేరు తాళవలింగము. ఈతఁడు గాధేయోపాఖ్యానము రచించి కృష్ణభూపాలునకుఁ జెయిచ్చెను. ఈ కృష్ణభూపాలుఁడు చిన్న ప్రభునకును, కామాంబకును సుతుఁడట.

**అనంతపండితుఁడు** — తండ్రి పేరు త్ర్యంబక పండితుఁడు. తాతపేరు బాలోపండితుఁడు. ముత్తాతపేరు నీలకంఠపండితుఁడు. నివాసము ఇప్పటి (అప్పటి అహమ్మదునగరు జిల్లాలోని) గోదావరీనదీతీరమందున్న పుణ్యస్తంభము. మహారాష్ట్రబ్రాహ్మణుఁడు.

భానుదత్తుని రసమంజరి కీతఁడు వ్యాఖ్య వ్రాసి పేరందినవాఁడు. శకవర్షములు ౧౬౭౨. కాశీభూపతిగ నుండిన చంద్రభాను మహారాజు యాజ్ఞంగొని రచించెననియు అది కాశియందేయనియుఁ జెప్పుకొనెను.

**అనంతపంథీవైష్ణవమతసంఘము** — ముండ్వాపట్టణవాసియగు సాధుమున్నాదాస్ గురుం డీమతకర్త. వీరు సువర్ణకారులట. వైష్ణవులలోపు నస్సంస్కారమందిన వైష్ణవులు, దేవుం డొక్కఁడనియు, అనంతుఁడనియు జెప్పెదరు. కరవుకాలమున సాధుమున్నాదాసుగారెందరినో పోషించిరట. సంయుక్త రాష్ట్రములందలి రాయ్‌బరేలీజిల్లా,సీతాపూర్ జిల్లా, బహారెయిచ్ జిల్లా, ఖేరీలందు వీరు గానవచ్చెదరు. విస్తారబాహుళ్యము గల మతముకాదు.

**అనంతపద్మనాభచతుర్దశి** — భాద్రపద శుద్ధ చతుర్దశి. వ్రతదినము. మళయాళదేశమునను, అందు తిరువనంతశయనపురంబు (తిరువాన్కూరు) నను ఈవ్రత మాచరించి, అనంత శయనుండగు పద్మనాభస్వామిని పూజింతురు. ఈదినముననే ఘూర్జరదేశమున కదళీవ్రతమొనర్తురు. (పండుగలు చూడుఁడు)

**అనంతపాలుఁడు (రాజప్రతినిధి)** — కల్యాణము రాజధానిగ రాజ్య మేలినపశ్చిమ చాళుక్యుఁడగు త్రిభువనమల్ల ఆరవవిక్రమార్క నిరాజప్రతినిధి. తొలుత దండనాయకుఁడుగనుండినవాఁడు. తండ్రి మహేశ దండనాయకుఁడు. ఈతఁడు బెజవాడయందు కొండపల్లి దుర్గమున నివసించుచు శైవుండగు శ్రీపతి పండితుని శిష్యుఁడాయెను.

**అనంతరాజు జన్నయకవి** — ఆంధ్రకవులలో నాథునికుఁడుగ పరిగణింపఁబడినవాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. తండ్రిపేరు అమ్మయామాత్యుఁడు. తాతపేరు జన్నపరాజు. రచించినది రామకథాభిరామమను ప్రబంధము.

**అనంతవిజయము** — పాండవాగ్రేసరుఁడగు యుధిష్ఠిర మహారాజు శంఖమున కనంతవిజయమని పేరు. ధనుర్విద్య చూడుఁడు.

**అనంతామాత్యకవి** — పురాతనకవులలో పరిగణింపఁబడినవాఁడు. తండ్రి తిక్కన. తల్లి మల్లమ్మ. ముత్తాత బయ్యన్న. తిక్కనసోమయాజితో సమకాలికుఁడు. మరియు నాతని కవిత్వమున్మెచ్చి తిక్కన 'భవ్యభారతి' యని బిరుదమిచ్చెనట. గురువు గోవిందచక్రవర్తి. కౌండిన్యసగోత్రము. కవి తండ్రినాడు, కృష్ణానదియందు భీమరథి, మలాపహా నదులు కలియుతావున నేర్పడిన యంతర్వేది (మధ్య

ప్రదేశమని భావము). శ్రీకాకుళాంధ్ర (విష్ణు) దేవునకు పేరిరి కులదైవము. క్రీ. వె. ౧౮౩౯ జనవరి నాఁటివాఁడు. రచించినవి- అనంతునిఛందస్సు, భోజరాజీయము (ప్రబంధము), రసార్ణవము, ఇంక నేవో గలవందురు.

**అనగందిపురము (కొంకణపురము)**– ఇది కొంకణదేశపు రాజధానియైయుండెను. ఇది తుంగభద్రానదీ తీరమందున్న ఆనెగొంది (ఏనుఁగులతావు) కాదు. (జీర్ణవిజయనగరము చూడుఁడు.)

**అనఁటిచెట్టు**— అరటిచెట్టు చూడుఁడు.

**అనటోలియా** — ఏష్యామైనరులోని భాగము. ఏష్యామైనరు చూడుఁడు.

**అనధీతే మహాభాష్యే వ్యర్థాస్యాత్పద మంజరీ అధీతేఽపి మహాభాష్యే వ్యర్థాసాపదమంజరేతిన్యాయము**- పదమంజరియను వ్యాకరణగ్రంథము, వ్యాకరణ మహాభాష్యము చదవనిది చదివిన ప్రయోజనముండదు. అనగా అన్వయించదని భావము. ఇంక మహాభాష్యముఁ జదివినపిదప నీపదమంజరి చదువ నగత్యమే యుండదు. కాన నా గ్రంథము నిరుపయోగమనిభావము. గొప్పవేషముండియు నిరుపయోగమగు వానింగూర్చి యీన్యాయము వాడుదురు.

**అనన్యలబ్ధశ్శబ్దార్థ రితిన్యాయము** — శబ్దముయొక్క అర్థము, దానివలననే లభించ తగినది, కాని అన్యత్రా లభింపనిదని భావము. ఏశబ్దముయొక్క అర్థ మాశబ్దము వలననే గ్రహింపఁదగినది. దేనిస్థితి దానికే యనుట కీన్యాయము వాడుచుందురు.

**అన్నన్యక్షుధితంపాత్రమ్ం** — ఇది సంస్కృతలోకోక్తి. అన్నముందినుటకు (భుజించుటకు) ఆకలియె యర్హమగుకంచము. అనగా ఆకలి ముఖ్యమని భావము.

**అనపచిక్కుడుచెట్టు** —కాయలు రుచిగా నుండి విషహరమొనర్చును. శ్లేష్మమును పైత్యమును వృద్ధిజేయును. చిక్కుడుకాయను వలెనే అన్నిగుణములం గల్గియుండును. దాని కన్న పైత్య మెక్కువజేయును. దీనికి విరుగుడులు - ౧. వాముము, ౨. తెల్లయుత్తరేణికాల్చినబూడిద, 3. శొంఠి; గింజల పై పొరతీసివేసిన దోషముచేయదు; నీళ్లతో నుడికించి వార్చుట, పుదీనా, లవంగములు, కరక్కాయపిందెలు, ఉప్పుకల్పి యుడికించుట. ఇది చిక్కుడుజాతిలోనిదివలెనే యున్నది.

**అనభ్యాసేవిషంశాస్త్రమజీర్ణే భోజనం విషం** — అభ్యాసము చేయకుండుటవలన శాస్త్రము ఎట్లు విషతుల్యమగునో (అనగా బాధకరమగునో) అట్లె అజీర్ణస్థితియందు భోజనమును విషతుల్యమగునని భావము.

**అనమకుర్తి రంగయ్యకవి** — ఆంధ్ర కవులలో నాధునికులందు పరిగణింపఁబడిన వాఁడు. నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు. తండ్రిపేరు తిమ్మరాజు. రచించినది యాదవ గిరిమాహాత్మ్యము.

**అనమిత్రుఁడు** — అత్రి, చంద్ర, యాదవ క్షత్రియుఁడు. తండ్రి యధాజిత్తు. కుమాళ్లు నిమ్నుఁడు, శిని, వృష్ణి.

**అనరణ్యుఁడు (అనేనస్సు లేక సుయోధనుఁడు)**—ఇక్ష్వాకుసంతతి. సూర్యవంశ క్షత్రియుఁడు. తండ్రి పురంజయుఁడను నామాంతరముగల కకుత్థ్సుఁడు. సుతుఁడు

పృధుచక్రవర్తి. ఈతనికి అనేనస్సు అనియు, సుయోధనుఁడనియు నామాంతరములు కలవు. వేరొక అనరణ్యుఁడు ఇక్ష్వాకుసంతతి యందు వసుదుఁడను నామాంతరము గల త్రసదస్యుఁడనువాని సుతుఁడొకఁడు కలఁడు. ఇతని కుమారునిపేరు హర్యశ్వుఁడు.

(ఆంజనేయజన్మతిథి)

కార్తీకశుద్ధ చతుర్దశి ఆంజనేయుని జన్మ దినము. ఆంజనేయుని భక్తులు పూజ లొనర్తురు.

**అనర్త దేశము లేక సౌరాష్ట్ర దేశము**- ఘూర్జర (గుజరాతు) దేశమును మాళవ దేశమందలి యొకభాగమును కలసి యొకప్పు డనర్తదేశమనంబరగెనని తెలిసెడిని. దీని ప్రశంస భాగవత దశమస్కంధమునగలదు. మరియు దీనికొకప్పుడు సౌరాష్ట్రదేశమనియు పేరుండెనట. వైవస్వతమనువు కుమారుండగు శర్యాతికి తనయుండగు ననర్తమహారాజు నిర్మించుటంజేసి యనర్తపురమనియు, ఆతని పాలనమునుండి అనర్తదేశమనియు పేరులందినటుల చెప్పఁబడినది. మరియు నీ యనర్తమహారా జిక్ష్వాకునకు సోదరపుత్రుండట. అనర్తుని కుమారునిపేరు రైవతుఁడు. ఈ దేశమున రాజధానిగ నుండిన యనర్త పుర పరిసరముల కుశ (దర్భ) విస్తారముగ నుంట, దీనికిఁ గుశస్థలియని వాడుకగల్గె ననియు, ఆ పుర మొకప్పుడు పాడగుచుండు గతి సంభవింప నా తావున శ్రీకృష్ణుండు ద్వారకాపురమును నిర్మించినటుల హేమ కోశము ౧౧౨ యందు చెప్పఁబడినది. ద్వారక కింకను ఆనందపురము, చమత్కారపురము, హాటకక్షేత్రము, పవిత్రభూమియని వాడుక నామములు కూడ నుండెను. ఇచట నచలేశ్వర శివలింగము కలదు. అనర్తపుర మునందుండిన అచలేశ్వర శివలింగప్రశంస స్కాందపురాణ నాగరఖండమున గలదు. అందే దీనికి హాటకక్షేత్రము, చమత్కార పురము, పవిత్రస్థలి యనుపేరులు చెప్పఁబడి నవి. ఇక్కాలమున అహమ్మదాబాద్ మండలమున సిద్ధపూర్ అనఁబడు తావున కాగ్నేయదిశగా ౭౦ మైళ్లదూరమునగలదు. తొల్లింటికాలపు ద్వారక శ్రీకృష్ణ నిర్యాణమునాటిరాత్రి సముద్రాక్రాంతమై మునింగి పోవ, యా సమీపతీరమున నిప్పటి ద్వారకాపురమును నిర్మించుకొనిరని ప్రతీతి కలదు.

ఘూర్జరదేశ మొకప్పుడు ఉత్తరఘూర్జరము దక్షిణ ఘూర్జరములుగా వేరయ్యెననియు, దక్షిణఘూర్జరమునకే అనర్త లేక సౌరాష్ట్ర దేశమని పేరై, అనర్తపురము, కుశస్థలి, ద్వారక మొదలగుపేర్లం బరగిన పురము రాజధానియయ్యెననియు, ఉత్తరఘూర్జరకు ఘూర్జగపురమే రాజధానిగ నుండెననియు బలమగు ప్రతీతి కలదు. ద్వారక ఇప్పటి వాడ్నగర్‌పుర పరిసరముల నున్నది.

**అనర్తుఁడు** — మరీచిసంతతి సూర్యవంశ క్షత్రియుఁడు, తండ్రి శర్యాతి, పితామహుఁడు వైవస్వతమనువు, సోదరులు ఉత్తానబర్హి, భూరిసేనుఁడు, సుకన్యక యనువారు. ఈతని నుండియె ఈతఁడేలినదేశమున కనర్త దేశమని పేరయ్యెననియు, నీతఁడు నిమిచక్రవర్తికి సామంతుఁడుగనుండెననియు తెలియుచున్నది.

**అనర్ఘక్యప్రతిహతానాం విపరీతం బలాబలం** — ఇది సంస్కృతభాషయం దలి లోకోక్తి. అనర్థకకార్యము లొనర్చు దుష్టులకు విపరీతబలము గల్గుచుండునని భావము.

**అనలుఁడు**— అగ్నికి అనలుఁడని పేరుకలదు. అనలురు ౪౯ గురు కలరట. అందు అభిమానుఁడు మొదటిఅనలుఁడు. అతని కుమాళ్లు ౧. పావకుఁడు, ౨. పవమానుఁడు, ౩. శుచియనువార్లు ముగ్గురును, వారి కుమాళ్లు ౪౫ గురును అనలురనంబడుదురు. ఇంకను రావణభూపతి సోదరుఁడగు విభీషణుని కనుచరుండును మాలి కొమరుండునగు అనలుఁడొకఁడు కలఁడు. మరియుం గుశునివంశజుఁడగు నిషధుని కుమారున కనలుఁడని పేరు కలదు. (అగ్ని చూడుఁడు).

**అనవతప్త సరస్సు** — దీనికి అనోతత్త యనియు వాడుకగలదు. రావణాహ్రదము. దీనినిప్పుడు రఖస్థల్ యనుచున్నారు. టిబెట్టు దేశమున కైలాసశిఖరమునకేగు మార్గమున, మానసరోవరముకడనున్న సరస్సు. దీనియం దొక ద్వీపము కలదు. అందు తొల్లింట లంకారాజ్యమేలిన రావణభూపతి యాశ్రమమేర్పర్చుకొని తపంబొనర్చి, మహాబలలింగమనంబడు గోకర్ణేశ్వరలింగముం బడసెనని చెప్పఁబడినది.

**అనవసరోక్తిపదములు** — ఆంధ్రభాషయందుఁ గొన్నిపదములు అనవసరములుగ అనవసరోక్తులై వాడుకనందియున్నవి. అవి దీపపుసెమ్మె, తలపాగ, కాలిచెప్పులు, ముక్కునత్తి, జుత్తుపిలక, మగనాలి, కోటకంతకము, కోటబురుజు.

**అనష్టిగోత్రము** — లౌగాక్షిగణము చూడుఁడు.

**అనసూయాదేవి** — అత్రి మహర్షి భార్య. (అత్రిమహర్షి చూడుఁడు)

**అనహిలా పట్టణము (అనహిల్లాపురము)** — దీనికి ఏరావళి యనియు పేరుండెను. (ఘూర్జరదేశము చూడుఁడు).

**అన్నపుచొరవయెగాని అక్షరపుచొరవ లేదు** — విద్య నభ్యసింపఁడని భావము. ఆంధ్రలోకోక్తి.

**అన్నంభట్టు** — ఈతఁడు తర్కసంగ్రహమను గ్రంథము రచించినవాఁడు. దానికి నీలకంఠ దీక్షిత కృతవ్యాఖ్యానము కలదు.

**అన్నభేది** — అన్నభేదికి ఆంగ్లమున Sulphate of Iron అనియు, సంస్కృతమున కాసీసమనియుం బేర్లు. కాసీసము మూడు భేదములు కలది. శుద్ధకాసీసమనియు, ధాతుకాసీసమనియు, పుష్పకాసీసమనియు. అందు శుద్ధకాసీసముకు శుభ్రమనియుం బేరుకలదు. ఇది స్వచ్ఛముగ నల్లఊదారంగున నుండునది. ధాతుకాసీసమునకు ధాతుశేఖరమనియుం బేరు. ఇది నల్లఊదా రంగున ఇంచుక ఎర్రధాతువులం గల్గియుండును. తక్కిన పుష్పకాసీసమునకు మలీమసంబనియుఁ బేరుకలదు. ఇది ఇంచుక తెలుపుధాతువు, పచ్చధాతువులం గల్గియుండును. అన్నభేది ఇనుమునకుఁ జెందినది. అన్నభేదిని నిమ్మపండ్లరసములో కొంతకాలము నాననిచ్చి వేడినీళ్లతో కడిగిన శుద్ధియగునని ఆయుర్వేద వైద్యులందురు. దీనిని చూర్ణముగను, సింధూరముగను గూడ చేసి వైద్యులు వాడుదురు. అన్నభేదియందు తనకుందాకిన వస్తువుం గొరకి లోనికిజొచ్చుకొనిపోవు గుణముకలదు, కాన కొంచెము సిరాయందు కల్పుదురు. ఇందు వలన కాగితముపై వ్రాసిన వ్రాత చక్కగ కాగితముపైననేగాక ఇంచుక లోనికింగూడ

నానుకొని చక్కగ స్థిరపడును. అధికముగ నన్నభేదికల్పిన కాగితమును దినివైచి వ్రాత ముక్కలుగ రాలిపోవును. చక్కగ శుద్ధిచేసిన అన్నభేది దోషములులేక చక్కగపనిచేయును.

మురికివ్రణములు, సెలలువేసే పుట్టువ్రణములు, మాంసము కుల్లిపోయే వ్రణములు, మాంసముందినివేసే వ్రణములు, గండమాలలు, గోరుచుట్లు, పంగలిజ్యేష్ఠలు, మాదలు వీనిని శుద్ధిచేసిన అన్నభేది నీళ్లతోఁగడిగిన శుభ్రపడి మాన్పట్టును. అన్నభేదికన్న అన్నభేదభస్మమును, అంతకన్న అన్నభేది చూర్ణమును బలముగ పనిఁజేయునని చెప్పఁబడినది. అగ్నిదీప్తి, వెంట్రుకలకు బలమునొసంగి, శరీరమునందు మంచిరక్తము పుట్టఁజేసి, స్త్రీల ఋతురక్తమును చక్కగ వెడలజేసి, క్షయ, పాండువు, బహుమూత్రరోగములు నడంచు గుణ మన్నభేదియందు గలదని చెప్పఁబడినది. చక్కగశుద్ధిగాని అన్నభేది గల్గించు వికారదోషములకు గాడిదలద్దె రసము విరుగుడందురు.

**అన్నము పెట్టినవారింటికిం గన్నము వేయువాఁడు** — అనగా విశ్వాసము లేనివాఁడని భావము. ఆంధ్రలోకోక్తి.

**అన్నముకన్న ఆదరణహెచ్చు**—లోకోక్తి.

**అన్నీఉన్నవికాని ఐదవతనముసున్న** — ఐదవతనము = సౌమంగల్యము.

**అన్యథాసిద్ధము** — నైయాయిక శాస్త్రమునందు కారణముకానిదానికిని, దానికి నిజమైన కారణముతోఁగల సంబంధముంబట్టి కారణమైనదిగనే ఎంచినచో, దానికన్యథాసిద్ధమని పేరిడంబడినది. కార్యమునకు నియతపూర్వ మయ్యును, కారణముగాని దానిని ఇట్లనెదరని భావము. ఒక కుమ్మరి బండితో మన్నుందెచ్చి తన ఆమకడ కుండలం జేయుచుండునను-చో, కుండలకుఁ గుమ్మరి కారణమును, బండి అన్యథాసిద్ధమును అగును. ఇట్టివి నియతిపూర్వక లఘుత్వమనంబరగును. ఇట్టి లఘుత్వములు శరీరకృతము, ఉపస్థితికృతము, సంబాధకృతమునని త్రివిధము. నియతిపూర్వవర్తిత్వము అనగా లఘునియతి పూర్వవర్తిత్వము (తక్కువలో తక్కువ యెంతయుండిన కార్యసిద్ధి కల్గునో అంతయే కారణమగును.) అన్యథాసిద్ధములైదు చెప్పంబడినవి.

౧. కారణవృత్తి- దీనికిం గారణతావచ్ఛేదకరూప ధర్మమనియుం బేరుకలదు. కుమ్మరివాని చక్రముఁ ద్రిప్పు కఱ్ఱ (దండము) కుండయగుటకుఁ గారణమైనను, తద్ధర్మమైన దండత్వము కారణము కాదనియు, అన్యథాసిద్ధమనియు భావము. ౨. కారణగుణము- దండము కుండకుం గారణమైనను, దండముయొక్క ఆకారము, రంగు మొదలగునవి కారణముకాదనియు అన్యథాసిద్ధమనియు భావము. ౩. వేరుకార్యమునకు కారణము (పూర్వవర్తి) యనుతరి అట్లు తెలిసినదానిని ప్రస్తుతకార్యమునకుకారణము కాదనియు, అన్యథాసిద్ధమనియుఁ భావము. ౪. కారణ కారణత్వము, కుమ్మరి కుండకు కారణము, వానితండ్రి కుమ్మరికిగారణము, కాన వానితండ్రి కుండకు కారణముగాక అన్యథాసిద్ధము అనగా కారణముకుం గారణమగును. ౫. ఘటమునకుఁ గుమ్మరి కారణము గాని వానిపరికరము (ఈఘటనిర్మాణమునకైనవియైనను) లు కారణములుగావు. అన్యథాసిద్ధములగును.

**అన్యవేశ్మస్థితాద్ధూమాన్న వేశ్మాంతర మగ్నిమతీతిన్యాయము** — ఒక ఇంటి నుండివచ్చు పొగంబట్టి మఱియొక యింటియం దగ్నికలదని తలంపరాదని భావము. 'అనుమానవ్యవస్థానాత్తత్సంయుక్తం ప్రమాణం స్యాత్'. కల్గియుండక కేవలానుమానమాత్రమున ప్రమాణము కానేరదని చెప్పఁబడినది.

**అన్ఫండెడ్ డెట్స్** (Unfunded Debts)— వాణిజ్యసంబంధ పరిభాషాపదము. ప్రభుత్వపు Short Loans మొదలగు త్వరితముగ తీర్చివేయబడు అప్పు. ఇకను ఫ్లోటింగ్ డెట్ (Floating Debt) న కీపేరు వర్తించెడిని.

**అన్వయవ్యతిరేకన్యాయము** — ఎక్కడ ఒక వస్తువయుంటే మరియొకటికూడా నచ్చుటనేయుండునో, ఎచ్చట నదిలేకపోతే యారెండవదికూడా లేకపోవునో, ఆమొదటి వస్తువు రెండవదానికి కారణమైయుండును. అగ్ని ఉన్నచోట పొగయు నుండును. అగ్ని లేకున్న పొగయునుండదు. ఇట్టితరి, అగ్ని పొగకు కారణమని భావము.

**అన్వష్టక తిథులు** — ఎన్మిదవ తిథియగు సప్తమి తరువాతదియగుతిథి (నవమి) అన్వష్టక తిథి. శౌణచాంద్రమాసవిధానపు ఆశ్వీజ, పుష్య, మాఘ, పాల్గుణ మాసములందలి (బహుళ) నవమితిథుల కీపేరు వాడుదురు. ఇవి పితృతిథులు.

**అనాగతము (గ్రహలయ)** — తాళము నడచినపిదప గీతము నడచుటకుపేరు. ఇది సంగీతశాస్త్రమున దశప్రాణములలో నొకటియగు గ్రహము (లయ) నందుగల నాల్గుభేదములలో నొకటి. గ్రహాలయ దశప్రాణములు చూడుఁడు.

**అనాత్మవాదసిద్ధాంతము** (Materialism)— దీనిని పదార్థవాద సిద్ధాంతమనియు నందురు. పదార్థమే సర్వకారణమనియు, ఆత్మవేరేయుండదను సి ంతము. జ్ఞాన విజ్ఞానములు చైతన్య జన్యములనియు తలంపు వలననే గల్గుచుండునవియు, ఆత్మయనంబడు నది వేరే ఒకటి ఉండదనియు, పదార్థములగు నింద్రియములకూటమి అటులభ్రమింపఁజేయు ననియు, మేధస్సుయొక్క వింతదృశ్యమునే ప్రాణియనుచుందురనియు, ఇంద్రియనాశనమే మృతియనియు, విధానము మేరకు సర్వము నడచుచుండుననియు వీరి సిద్ధాంతము. వీరికి దేవుఁడు లేఁడు. (పదార్థము Matter చూడుఁడు.)

**అనాదిశైవము** — ఇదిచతుర్దశ శైవ,భేద, మతములలో నొకటి (చూడుఁడు). ఈమతము నందు త్రిపదార్థములు మలత్రయము శివసమవాది శైవమునందు వలెనేయుండును. పతి యగు శివుఁడు గుణవికల్పము లేనివాఁడు. దీనిని దీక్షాపూర్వక గురుబోధచే నెఱింగి ఆత్మలు, భూతి, రుద్రాక్ష, జటా, యజ్ఞోపవీతములం ధరించి, గురునిశివలింగమును పూజించుచుండుటవలన పాశముల నుండి విముక్తుఁడగును. దానితో శివైక్యము సిద్ధించుననియు, ఇదియె ముక్తియనియు నందురు.

**అనాధ్యయములు** — వేదాధ్యయనాదులు చేయరాని కాలము లనాధ్యాయములనంబడెను. అశగా అధ్యయ నానర్హములని భావము. ధృతి వైధృతి అనంబడు యోగములు వ్యతీపాత మహాపాతలు కలసిన దినముల నధ్యానాధ్యాయంబులు లేక నైమిత్తికానాధ్యాయంబులనిది. ఇందు నగముదిన మనాధ్యాయమని చెప్పఁబడినది. శుక్ల కృష్ణపక్షము

లందలి అష్టమీతిథులు, చతుర్దశలు, అమావాస్యపౌర్ణములు, అనాధ్యాయ తిథులని చెప్పఁబడినది. ఇవి నిత్యానాధ్యాయ తిథులనంబరుగుచున్నవి.

ఇంకను ప్రాతస్సంధ్యాకాలము సాయం సంధ్యాకాలములం దురిమిన దిన మనధ్యాయ తుల్య మైనదే నని మతాంతరము లందని యున్నారు. సదాఉరుముచుండు దినమును అనాధ్యాయముగ వదలివేయవలసిన దని కొందరు ఋషులనిరి. పాడ్యమితిథులుకూడ ననాధ్యాయములేనని పెక్కండ్ర మతమై యున్నది. ఇంకను రాజమార్తాండమను గ్రంథమున పిడుగుపడినదినము, భూకంపము కల్గినదినము, చాతుర్మాశ్యలకడ దినము, అనాధ్యాయములుగఁ జెప్పఁబడినవి. నిర్ణయామృతమునందు మన్వాదులు, యుగాదులు అనాధ్యాయములుగఁ జెప్పఁబడినవి. రాత్రులందు మొదటి రెండు యామములకుం బిదపను, సప్తమి త్రయోదశి ప్రదోషములు అనర్హములని నిర్ణయసింధు మతము.

**అపానస్మృతి** — ఉఛ్వాస నిశ్వాసములంగూర్చినస్మృతి. దశబౌద్ధాను స్మృతులు చూడుఁడు.

**అనాఫిలీస్ జాతిదోమలు** — ఇవి సమశీతోష్ణ ప్రదేశములందును, ఉష్ణప్రదేశములందును మలేరియాజ్వరమును వ్యాపింపఁ జేయును. ఈజాతిలో నూటయిరువదివరకు నుపజాతులుకలవని కనిపెట్టిరి. ఒక్కొక తెగ ఒక్కొకవిధమగు మలేరియా పురుగునకే యాశ్రయమిచ్చును. ఈజాతి దోమలు నదులు, చెరువులు, మొదలగు సకల జల సముదాయములందును గ్రుడ్లు విడఁచును. ముఖ్యముగ మలేరియా పురుగులను వ్యాపింపఁజేయు దోమలు గృహావరణములయందెచ్చట కొంచము నీరునిలచినను గ్రుడ్లు పెట్టును. అనాఫిలీస్ దోమ ఎండను, వెలుతురును ఇష్టపడదు; కాన, పగటివేళలందు గదులలోని చీకటిమూలలందును, పశువుల సాలలందును, చెట్లనీడయందును దాగియుండి రాత్రి బయటికివచ్చును. గూడుపగుల్చుకొని వెడలిన రెండుమూడు దినములకే ఆడుదోమ మనుష్యులను, జంతువులను, కుట్టి రక్తమును పీల్చుట కారంభించును. తరుచుగా సూర్యాస్తమయ సమయమునను, తెల్లవారు ఝామునను నివి కుట్టుచుండును. మబ్బువేసి చల్లగానున్నయెడల పగటియందుఁ గూడ నివి కుట్టుచుండును. రక్తమును పీల్చినపిదప నివి చీకటిమూలలకేగి, ఆహారము జీర్ణమగువరకు నచ్చట విశ్రమించును. అనాఫిలీసు ఆడుదోమ పెక్కుమంది నొకసారి కుట్టి పెక్కుమంది కొకసారి మలేరియాను వ్యాపింపఁజేయఁగలదు. క్యూలెక్సు దోమ లంత ధ్వనిచేయవు. ఇవి కుట్టినపుడు నొప్పియంతకలుగదు. అనాఫిలీస్ దోమకు లావుగా పొడవైన కొండికలవు. దీని అవయవములు మోటుగానుండును. రెక్కలు లేతవర్ణముగలిగి మచ్చలతో నుండును. దోమ ఏజాతిదో తెలిసికొనుటకు సూక్ష్మదర్శిని సహాయముచే వానిరెక్కలు, తల, కొండియ, మొండెమును చూచి కనిపెట్టుచుందురు. ఇంకను సీటియందు వ్రేలాడుట, గోడలయందు వ్రాలుట, రెక్కలపై మచ్చలునుచూచి సాధారణముగ పోల్చుచుందురు. (మలేరియా చూడుఁడు, అంటువ్యాధులు చూడుఁడు, సూక్ష్మజంతువులు చూడుఁడు).

**అనామలానది** — ఇప్పుడు అనోమా యనంబరగుచు గోరక్షకపురపు (ఇప్పటి గోరక్పూర్) మండలమున నున్నది. దీనిని జౌమి యనుచున్నారు (Cunningham's Ancient Geography of India Page 423). బుద్ధభగవానుఁడు తపంబున కేగుతరి, తొలుత నీ నదిని దాటి అశ్వమును గృహస్థాశ్రమమును వీడెనని చెప్పంబడినది.

**అనాయు లేక అనుగ** — తండ్రి దక్ష ప్రజాపతి, భర్త కశ్యపుఁడు. ఈమె సంతతి వారు సిద్ధులనంబడిరి. (కశ్యపమహర్షి భార్యలు చూడుఁడు.)

**అనార్యసంగమాద్వరం విరోధోఽపి సతంమహాత్మభిః** — చెడ్డవారితో స్నేహముకంటె, యోగ్యులతో విరోధమైనను శ్రేయస్సే అనిభావము. ఇట్లే "అరసికజన సంభాషణాత్ రసికజనేన వాక్కలహః శ్రేయః" (అనగా అరసికులతో స్నేహ ప్రసంగముకన్న రసికులతో వాక్కలహము శ్రేయమని భావము) అను సంస్కృత లోకోక్తి కలదు.

**అనావతప్తసరస్సు** — దీనిని అనోతత్త యని వాడుచున్నారు. తొలుత నిది సింహళ ద్వీపమున, రావణహ్రదమను పేరంబరగుచుండెడిదని కొందరు పోల్చిరి. Spence Hardy పరిశీలకుఁడు ఇది ఎప్పుడు నుండనే లేదనియు, కేవలభావితమని యనుమానించెను. బౌద్ధమత వాఙ్మయమున నిది కాన్పించెడిని.

**అనాశ్వాసితదుఃఖితే మనసి సర్వమసహ్యమ్** — ఓదార్పులేక దుఃఖించుచున్నమనసునకు సర్వము దుర్భరమే; సహింపఁజాలనిదే నని భావము.

**అనాస (పండు) చెట్టు** — లా. Ananas Sativus. ఇంగ్ల. Pineapple. దీనిని అనాసపనస యనియు నందురు. పుల్లగా తియ్యగానుండి దీనిపండు చలవజేయును. నీరుపెంచును. మేహశాంతిని జేయును. దాహము, పైత్యము, వికారముల నడఁచును. మురదలను, మదమును వృద్ధిపరచును. పొట్టకు బలమిచ్చును. అజీర్ణము, వాతముల నభివృద్ధిపరచును. స్త్రీలకు గర్భముం జెరుపును. దీనిపువ్వు సువాసనగల్గి పొట్టకు బలముగల్గించును. గర్భవాతముల హరించును. జీర్ణశక్తిం బలపరచును. దీనికి విరుగుడులు- ౧. ఉప్పు, ౨. జీలకర్ర, 3. శొంఠి, ౪. సజ్జాక్షారము.

**అనాసరోగము** — ఇది పసిపిల్లలకు వచ్చుచుండు రోగవిశేషము. జననీజనకుల రక్తదోషమే యీరోగమునకుఁ గారణమని వైద్యశాస్త్రజ్ఞుల యభిప్రాయము. కాని యిట్టి ప్రత్యేకరోగమునుగూర్చి ఆయుర్వేద, యూనానీ, అలోపతీ విధానములయందెచ్చటను చెప్పఁబడియున్నట్టు కన్పించదు. ఈ రోగము తరుచుగా నెలల పిల్లలకే వచ్చుచుండును. ఇందనేకవిధములు కలవు. ఎండు అనాస, ఉబ్బు అనాస, నొక్కు అనాస, పుండ్లయనాస యనునవి ప్రస్తుతము వ్యవహరింపఁబడుచున్న రోగవిశేషములు. ఇవి వైద్యశాస్త్రములలోఁ జెప్పఁబడిన రోగములు కాకపోవుటచేఁ గాఁబోలు, వీనికి ప్రత్యేకముగా చికిత్సచేయుటకు ప్రత్యేక వైద్యులుందురు. ఆ వైద్యులకు తక్కిన రోగములకు చికిత్సచేయు శాస్త్రజ్ఞానముండదు. ఈ రోగములకు బైరాగిచిట్కెల వంటి కొన్ని యౌషధులును, మాత్రలును

గలవు. వేరువేరు రకముల యనాసజబ్బులకు వేరువేరువిధములగు మాత్ర లుపయోగింపఁబడుచుండును. విద్యాగంధము లేని పాటకజాతులలోని పసిపిల్లలు సరియైన చికిత్స జరుగకపోవుటచే, తరుచుగా నీ రోగమునకు గురియగుచుందురు. కొంతమంది వైద్యులీరోగమునకు అనాసమంపతో మందు తయారుచేసి యిచ్చుటయుఁ గలదు.

**అనాహతచక్రము** — యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన శరీరమందలి షట్చక్రములలో నొకటి. అనాహతచక్రము హృదయస్థానమునందుండునది యనియు, ధూమ్రవర్ణము, ఊర్ధ్వముఖము ననియు, ఇట 'మ్' అనునది బీజమును, రుద్రుఁ డధిదేవతయనియు, ఇందు పండ్రెండు దళములు కలవనియు, వానిపై ఒక్కొక్కటిగ, క-ఖ-గ-ఘ-ఙ-చ-ఛ-జ-ఝ-ఞ-ట-ఠ అను పండ్రెండక్షరము లుండుననియు, ఈచక్రమునందు అజప దినమునందు ఆరువేలు నడచుచుండుననియుఁ జెప్పఁబడినది.

**అనాహము** — ఆంగ్ల. Anaha. మల మూత్రములు బంధించి వెడలకనిలచి కడుపు పొంగి ఉబ్బరముగనుండి బాధించెడిజబ్బు.

**అన్యాపదేశ ప్రయోగము** — ఒక సంగతింగూర్చి తాఁజెప్పుధోరణిచే వేరొక ప్రధానాంశముం దెల్పుట. దీని కాంగ్లమున ఎల్లిగరీ (Allegory) అని యందురు. ఇవి ప్రసంగములందు గల చాల ఆరిందాతనముం దెల్పును. తొల్లింటికాలపు టాంగ్లమున నిట్టి ప్రయోగములు మెండుగగలవు.

**అన్యార్థమపి ప్రకృతమన్యార్థంభవతీతి న్యాయము** — ఒకవిషయమై కల్పింపఁబడిన పరిస్థితిని వేరొకవిషయమై ఉపయోగింపఁబడినను దోషములేదని భావము.

**అన్వారీసుహైలీ** — హితోపదేశము చూడుఁడు.

**అనియాదిగణపతిదేవుఁడు** — ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడినవాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. తండ్రిపేరు మాలన్న. రచించినది శివయోగసారము. ఇది పూర్వభాగము, ఉత్తరభాగమూనని రెండు భాగములుగను, భాగమున నాలుగధ్యాయముల చొప్పున నెన్మిది అధ్యాయములుగ నున్నది.

**అనిరుద్ధవ్యూహము** — రామానుజీయ వైష్ణవ, వైష్ణవ మతధర్మములందు తదేకాత్మ రూప మహావిష్ణువునందు, ఆది చతుర్వ్యూహము లలో నొకటిగను చెప్పఁబడినది. దీనిని అనిరుద్ధ వ్యూహముల లోని ఉపవ్యూహమనియు, విలాస మూర్తి యనియు, వరుసగ చక్ర, గద,



శంఖ, పద్మము లాయుధములనియు చెప్పఁబడినది. (విష్ణుదేవాలయములందలి విగ్రహములు చూడుఁడు).

**అనిరుద్ధుఁడు** — కల్పాదియందు బ్రహ్మను పుట్టించుటకు విష్ణుదేవుండెత్తిన యవతారము. ఇంకను శ్రీకృష్ణుని దౌహిత్రుఁడు (రుక్మిణీదేవి కుమారైయందు ప్రద్యుమ్నునకు పుట్టిన కొడుకునకును) అనిరుద్ధుఁడని పేరు. ఈతని భార్య బాణాసురుని కొమారైయగు ఉమ.

విష్ణుదేవుని యవతారమున కనిరుద్ధవ్యూహ మనియెదరు (అనిరుద్ధవ్యూహము చూడుఁడు).

**అనిర్వేద ప్రాప్త్యాని శ్రేయాంసి** — సాహసముచేయనిదే ప్రశ్రేయస్సు కలుగదు.

**అనిలగణము** — వీరు నలువదితొమ్మండుగురు కలరని యగ్నిపురాణమునందు చెప్పఁబడినది. అభిమానాగ్నికి పావకుఁడు, పవమానుఁడు, శుచి యనువారు ముగ్గురు సుతులును అగ్నిత్వమునకు వచ్చినవారు. వారిలో నొక్కొకరికి పదునేనుగురు-నొప్పున పుత్రులు కల్గిరి. వీరందరు అనిలురే, కాన నలుబదితొమ్మండుగు రనిలురైరి. (అగ్ని చూడుఁడు.) అనిలురు నవదేవతాగణముల లోనివారు.

**అనిలుఁడు** — అష్టవసువులలో నొక యనిలుఁడు కలఁడు. ఒక వాయువునకును అనిల నామము కలదు. ఈతని భార్యపేరు శైవ. కుమాళ్లు పురోజవుఁడు, విజానగతి. (అనలుఁడు చూడుఁడు.)

**అనిషిద్ధ మనుమత మితిన్యాయము** ఆక్షేపింపబడనిది, అంగీకరింపబడినదియె నని భావము. ఇందువలన మౌన మంగీకార మని భావము. కాని మౌన మర్ధాంగీకార మని లోకోక్తియుం గలదు.

**అనీకుఁడు** — యదువంశక్షత్రియుఁ డగు వసుదేవుని తమ్ముఁడు.

**అనుకరణము** — ఒకరింజూచి తానట్లు చేయనేర్చుకొనుట, యనుకరణమనంబడును. ఇది ద్వివిధము. ఒకరు పల్కినటుల ఆకంఠస్వరముననే అట్లై ధ్వనిగపల్కుట శబ్దానుకరణము. ఒకరొనర్చినట్లు తానును చేయుట వ్యాపారానుకరణము. ఇంకను అనుకరణము స్వాభావిక బుద్ధిపూర్వకములని ద్వివిధముగ జెప్పుదురు. చిలుక గోరింక పలుకులు, బాలుఁడు తలిదండ్రులుచెప్పిన పల్కులం బలుకుట స్వాభావికమనియు, గానవిద్య గురువు నుండి యభ్యసించుట బుద్ధిపూర్వకానుకరణ మనియు నందురు. 'డార్విన్' పండితుఁడు పిల్లలకు నాల్గవనెలనుండియు, అనుకరణ వృత్తిగల్గునని చెప్పియున్నాఁడు. కోతులు మనుష్యులొనర్చిన కార్యముం జేయుట ఈ యనుకరణ వృత్తియె.

**అనుగ** — అనాయువు చూడుఁడు.

**అనుగీత** — వేదాంతగ్రంథము, భారతము అశ్వమేధపర్వమున గాననగును. భగవద్గీతకు అనుగీత యని భావము. శ్రీకృష్ణుం డర్జునున కుపదేశించిన కర్మయోగము. దీనినే సంజయుఁడు ధృతరాష్ట్ర మహారాజునకుం దెల్పినటుల జెప్పఁబడినది.

**అనుతాపకుఁడు** — తండ్రిపేరు దనువు.

**అనుపకుల గోత్రము** — ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు). అనుపకుల గోత్రము, దార్వ్యస్థేయ గోత్రము (3), సంస్కృత గోత్రము, అగస్త్యస, అగస్త్యగణము, ఆపస్తంబసూత్రము, యజుశ్శాఖ, ప్రమాణ గ్రంథములు నిర్ణయసింధు, ధర్మసింధు; అశ్వలాయనసూత్రము, నకలేశుఁడు దేవత, భార్య సర్వాంబ, కనకాద్రి తపస్థానము, సర్వతీర్థము తటాకము, జపము లక్ష, దీపములు ౫౦, క్షేత్రసంఖ్య ౧౭, ఎనుములు దానము. అనుములు వర్జనీయము.

**అనుపగోత్రము** — భృగుసంతతి. ఆర్ష్టిషేణగణము చూడుఁడు.

**అనుపదేవు(డు** — యదువంశక్షత్రియుఁడు. తండ్రి దేవకుఁడు.

**అనుబంధ చతుష్టయము** — తర్కశాస్త్రమునందు (సంజ్ఞలు) ౧. సంబంధము- దేనినైనను ప్రతిపాదించునట్టిదానికి ప్రతిపాదకమనియు, దేనిని ప్రతిపాదించునో అట్టిదానికి ప్రతిపాద్యమనియు, అట్టి ప్రతిపాదక ప్రతిపాద్య రూపకసంబంధమునకు సంబంధమనియు సంజ్ఞలు. ౨. విషయము- అట్టి ప్రతిపాదనయందు ప్రతిపాద్యము నెరుంగుటకుగాను వివరింపఁబడిన సాధనసంపత్తి (విధానము) కి విషయమను సంజ్ఞ. 3. ప్రయోజనము- దాని నెరుంగుటవలన గల్గెడి ఫలమునకు ప్రయోజనమని సంజ్ఞ. ౪. అధికారి- అట్టిదాని నెరింగినవాని కధికారియని సంజ్ఞ.

**అనుభూతస్వప్నము** — స్వప్నశాస్త్రము చూఁడుఁడు.

**అనుమకుందపురము** — (పట్టణము). దీనికి అనుమకుందపట్టణ మనియుఁ బేరు కలదు. ఇప్పుడు నైజాము రాజ్యములోని వరంగల్లు (ఓరుగల్లు లేక ఏకశిలానగరము) పురమునం జేరియున్నది. తొల్లింటి తెలింగాన దేశములోనిది. (చూఁడుఁడు.)

**అనుమతి** — ధాత భార్యలలో నొకతె.

**అనుమర్షణకుల గోత్రము** — ఆర్య వైశ్యుల ౧౦౨ గోత్రములలోనొకటి. (వైశ్య గోత్రములు చూఁడుఁడు). అనుమర్షణకుల గోత్రము, ఏకార్షేయ గోత్రము (౪౨), సంస్కృతగోత్రము, వటుకస- వటుకగణము, స్థూలశిరస్కర్షి, ఆపస్తంబసూత్రము, యజుశ్శాఖ, ప్రమాణగ్రంథము ఆద్యప్రవరఖండ, సమానగోత్రము స్థూలశిరస్కస, హాలాస్య నాయకుఁడు దేవత, భార్య ముక్తికాంత, మధుర తపస్థానము, జీవన్ముక్తిప దము (సరస్సు) తటాకము, జపము కోటి, దీప సంఖ్య ౧౦, క్షేత్రసంఖ్య ౭౯, ప్రవడము దానము, స్ఫటికములు వర్జనీయము.

**అనుమానపంచకము** — ౧. నామము, ౨. జాతి, 3. గుణము, ౪. ద్రవ్యము. ౫. క్రియ లని అనుమానములైదు.

**అనుమానుష గణము** — ఇందైదు గోత్రములు చెప్పఁబడినవి. (యజుశ్శాఖ విశ్వబ్రాహ్మణులు చూఁడుఁడు). ఇది విశ్వ బ్రాహ్మణులయందొక గణము. ౧. అనుమానుషర్షి గోత్రము- అనుమానుష, మార్గణిక, సనత్కుమార, ధార్మిణి, దేశిక (పంచార్షేయప్రవర). ౨. సనత్కుమారర్షి గోత్రము- సనత్కుమార, ధార్మిణి, దేశిక, (త్రయార్షేయ ప్రవర.) 3. ధార్మిణిఋషిగోత్రము- ధార్మిణి, దేశిక, వైధాత్య, (త్రయార్షేయప్రవర). ౪. విధాత్యమనుర్షి గోత్రము- విధాత్య, ద్విజధర్మ, దేవసేన, నిజధర్మ, బోధన (పంచార్షేయప్రవర). ౫. ద్విజధర్మర్షి గోత్రము- ద్విజధర్మ, నిజధర్మ, దేవసేన (త్రయార్షేయ ప్రవర.)

**అనుముల చెట్టు** లా. Dolichos Lablab. ఆంగ్ల. Senensis Seeds. సం. నిష్పావీ, శింబి. అనుములు దేహపుష్టి, పైత్యము, కడుపుబ్బరము, గురుత్వము, హృదయమునశూల, శుక్లనష్టము, జ్వరము, రక్తపైత్యము, విదాహము, కఫము, వాతము గల్గించును. మలమూత్రముల వెడలించును. స్త్రీలకు పాలనుగల్గించును. ప్రేగులందుజనించు

పుండ్లను మాన్పును. వాంతులు, నేత్రరోగములు, శోషల నడంచును. విషమును హరించును. దీనికి విరుగుడు ౧. పంచదార, ౨. మంచిగంధము, ౩. కలిసీళ్లు; దీనిని ఉడికించుట, నానబెట్టుట మూలమున పొరం దీసివైచిన దీని దోష మడంగును. కాక జేయు పదార్థములు దీనిదోష మడంచును. ఎర్ర అనుములను అగిశెలని యందురు. చమురుగల్గి యిదేగుణములం గల్గియుండును. వేడిచేయును. దీనికి విరుగుళ్లు పిప్పళ్లు, ఓమము, కలిసీళ్లు.

**అనురాగోఽనురాగేణప్రత్యేష్టవ్యః** — అనురాగముంజూపియే అనురాగముం గొనవలసియుండును. సంస్కృత లోకోక్తి.

**అనురాయణగోత్రము** — నిధృవగణము చూడుఁడు.

**అనులోమవిలోమములు** — గణితశాస్త్రమునం దంకెలవరుసల నెడమప్రక్కనుండి కుడిప్రక్కకుఁ గుణించుట కనులోమ విధానమనియు, కుడిప్రక్కనుండి ఎడమ వైపుకుఁ గుణించుట విలోమవిధానమనియుం బేరులు. (గణితము చూడుఁడు).

**అనులోమిగోత్రము** — జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.

**అనువు** — యదువంశక్షత్రియుఁడు. కురువశుని కుమారుఁడొకఁడును, కపోతలోముని కుమారుఁడొకఁడును, అనువు అను పేరు గలవారలే. కపోతలోముఁడు విలోమ తనయుని కుమారుఁడు. (యయాతిమహారాజు చూడుఁడు.)

**అనువృత్తిన్యాయము** — అనువృత్తి యన ననుసరించుట అభ్యాసమని భావము. అభ్యాసమువలన సర్వము ... భావము.

**అనుసాతకిగోత్రము** — జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.

**అనుస్వారము** — (పూర్ణార్థములు) అనుస్వారమునకుఁ బిందువనియుఁ బేరుకలదు. తెలుఁగున దీనిని సున్నయనెదరు. ఆదికాలమున సంస్కృతలిపి ప్రచారమునందున్న నాఁడు సంస్కృతాక్షరముపై నొకచుక్క నిడిన, అనుస్వారముగ నగుచుండెడిది. దేవనాగరలిపి వాడఁబడుతరి నేటికిని నిట్లే జరగుచున్నది. ఇది వ్రాతయందలి పద్ధతిగా నెరుంగునది. ఇంక శిలాశాసనాములందీచుక్క పలుచిక్కులకుం గారణమయ్యెనట. ఏదేని ప్రమాదవశమున నక్షరముపై చిన్నదెబ్బ తగిలి, చిన్నరాతిముక్క యూడినచో నది సున్నయేమోనని భ్రమకల్గుటయు, కొన్ని తావుల నపార్థములు, సంశయములు కల్గుటయు సంభవించెనట. కావుననే శిలాశాసనములందు బిందువు వృత్తాకారముఁ దాల్చినదని సుప్రసిద్ధపరిశీలకులగు శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారనియున్నారు. ఈ మార్పు ప్రారంభదశయం దీయనుస్వారముఁ బేర శాసనములందు సంస్కృతాక్షరములపై గీయంబడు నడ్డుగీతకుంబైని ఇంచుకదూరమున చెక్కఁబడుచుండెంగాని, క్రీ. వె. ౧౩ శతాబ్దమునకుం బిదప ఆగీత నంటియే పైన చెక్కఁబడుట కాననగుచున్నది. ఇది సంస్కృతలిపియందలి యాచారము. కాన పరిశీలకులీయనుస్వార విన్యాస విధానమునుండియే కొన్ని శాసనకాలములను నిర్ణయించియున్నారు.

ఇంక ద్రావిడభాషయగు తెలుఁగునందు క్రీ. వె. ౧౧వ శతాబ్దమునకుఁ బూర్వ

మనుస్వారము నుపయోగించుటయే లేదని చెప్పుటకు ధైర్యము చాలకున్నను, కానరా కున్నదని చెప్పనగును. ఏలనన, ఆనాడు దండము అని వ్రాయుటకు 'దణ్డ' మనియు, అండము అనివ్రాయుటకు 'అణ్డ' మనియు, అంబరమనుటకు'అమ్బర'మనియు వ్రాయుచుంటఁ గాననయ్యెడిని. అనగా వర్గాక్షరములకుఁ బూర్వము బిందువు వాడఁబడుటలేదని భావము. క్రీ. వె. ౧౫ వ శతాబ్దము నుండియు, బిందువు వాడఁబడుచుంట గాననయ్యెడిని. ఇప్పటికి నట్లె జరుగుచుంట నీ సున్న నకారమునకును, మకారమునకును, ణకారమునకును ప్రతినిధిగ నున్నది. ఈ పద్ధతియే మహారాష్ట్ర, కర్ణాట, ద్రావిడ దేశములందుగూడ కలదని వినుచున్నాము.

తెలుఁగులిపియం దాదికాలమున అరసున్న (అర్ధానుస్వారము) వాడంబడుచుండినటుల గానరాదు. వాఁడు, కోఁతి, తోఁట, మొదలగు తావులందును, దృతాంతమున వచ్చు క, చ, ట, త, ప, లకు మారుగ విధింపఁబడిన గ, జ, డ, ద, బ, లకుఁ బూర్వమునను నిండుసున్నలనే వ్రాయుచుండిరి. శిలాశాసనములును, ఇట్లే యుండినవి. దీనింబట్టి ఏదేని యొక ప్రత్యేకమగు నుచ్చారణయొకటి ఉండి యుండవలయుననియు తోఁచకపోదు. సుప్రసిద్ధాంధ్రపరిశీలకులగు శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు 'అది' అనునాశిక (ముక్కుతో పల్కెడి) స్వరమనియు, విదేశములకు వలసపోయి, అట నాంధ్రమును వీడకున్నవారు అట్టిపదములందున్న అనుస్వారమును అనునాశిక యుక్తముగనే పల్కుచున్నారనియు తెల్పి, ఇప్పటి యర్ధానుస్వారములు (అరసున్న), అట్టి అనునాశికస్వరమునకే, చిహ్నమని యున్నారు. అట్టి యుచ్చారణ ఇటీవల లోపించి, వాడు, కోతి, తోట యని పల్కుచున్నను, అందుండవలసియున్న అరసున్నలుగూడ కొందరు వ్రాయుటమానినను, వానింగూర్చి విమర్శించుట యాంధ్ర పరిశీలకులకు విధిగాకపోదు.

**అనుహ్లాదుఁడు** — హిరణ్యకశిపుని కుమారుఁడు, ప్రహ్లాదుని సోదరుఁడు.

**అనుక్షరిగోత్రము** — ఉపమన్యుగణము చూడుఁడు.

**అనూతకిగోత్రము** — కుశికగణము చూడుఁడు.

**అనూపదేశము** (చేదిదేశము, హైహయ దేశము, దాహాలమండలము లేక దాహాల దేశము, మహిష లేక మహిషకదేశము, దక్షిణమాళవ, ఛత్తీస్‌ఘడ్ రాజ్యము) — ఈదేశమున కనేకపేర్లు వేర్వేరుకాలములందుఁ గుదిరియుండెనని తెలిసెడిని. కార్తవీర్యార్జున మహారాజు తాతయగు హేహయ పాలితమై హేహయలేక హైహయ దేశమని పేరందెను. మరియొకప్పుడు చేదిభూపతి పాలించుటంజేసి, ఛేదిదేశ మనఁబరగెను. ఒకతరి మాళవ దేశమునకుం జేర్పఁబడి దక్షిణమాళవ యనఁబడెను. మహిష లేక మహిషకుం డను భూపతిచే నిర్మింపఁబడిన రాజధానిపురము మహిష్మతి నుండి మహిష దేశమనియు, మహిషక దేశమనియు, మాహిష్మతిదేశ మనియు పిలువఁబడియెను. దాహాలమండలం బని పేరుగల (ఇప్పటి బుందెల్ఖండ్) బుందేల ఖండము ఇందొకప్పుడు రాజనివాససీమయై ప్రాముఖ్యతనందియుంట దానినుండి దాహాల దేశమనఁబరగెను. ఈదేశాధిపతికి సామంత రాజులుగ నుండిన ముప్పదియార్గురు భూపా

లురు ముప్పదియారుకోటల (దుర్గము) నుండి ఛత్తీస్‌ఘడ్ (ముప్పదియారు కోటల) రాజ్యమని ప్రసిద్ధమయ్యెను. ఇప్పటికిని, ఆపేరు వాడుకయందున్నది. పశ్చిమమున కాళీసింధునదులును, తూర్పున తోన్సి యనియు, ఛత్తీసాఘడియ యను ఛత్తీస్‌ఘడ్ భాష లోని యొకపుస్తకమున ఎల్లలుగ చెప్పఁబడిన ఈదేశము ఇప్పటి మధ్యరాష్ట్ర (Central Provinces) ములోని చాలాభాగమును, బందేలఖండము (Bundle Khand) దేశము లోని భాగమును, మాళవ దక్షిణభాగమును, ఔరంగాబాదులోని కొంచము భాగమును కలసి, అనూప లేక చేదిదేశమై యుండునని పోల్చఁదగియుండును. ఈదేశ ప్రశంసలు ఉత్తరరామాయణము ౩౬ యందునను, మహాభారత వనపర్వము ౧౧౮ యందునను, స్కాందపురాణ నాగరఖండము ౬౬ యందునను గానవచ్చెడిని. బౌద్ధగ్రంథములందు దీని నవంతి దక్షిణాపథ మని వాడిరి. రాజధాని మహిస్సతి యనిరి.

ఈ దేశముయొక్క తక్కిన సంగతులు వివరించుటకుఁబూర్వము మిక్కిలి పూర్వకాలమునాఁటి సంగతి వివరింపఁదగును. ఈ దేశములో జాబాలిపురము (ఇప్పటి జబ్బల్పూర్) తొల్లియొకప్పుడు జాబాలిఋషి నివాసమై, ఆశ్రమస్థలియై యుండెను. ఇటకుఁ బశ్చిమముగా నేడుమైళ్ల దూరమున, తెయోరను గ్రామముకలదు. అది తొల్లింటి తారకాసురునితావు. ఇది నర్మదానదీతీరము ననే యున్నది. ఆకాలపు దీని పేరేదియో తెలియకున్నది. తారకాసురుని పుత్రులు - కమలాక్షుఁడు, విద్యున్మాలి, తారకాక్షుఁడు, ననువారలు ముగ్గురును త్రిపురాసురు లనం బరగువారు. వారినుండి త్రిపురాసుర పురమనియు, త్రిపురమనియు నాతావునకు వాడుక కలిగెను. నానాటికాపేరు తెయో రనంబడు చున్నది. అట నాముగ్గురురక్కసులచేఁ బ్రతిష్ఠింపఁబడిన శివలింగము నేటికిం గలదు. ఈ త్రిపురాసురులుముగ్గురు లోకులను బాధించుచుండిరకతన, పరమేశ్వరుండే వధించెనని పద్మపురాణము సర్గ. ౭ వ అధ్యాయమున చెప్పఁబడియున్నది. త్రిపురాసురపురము నుండి కొంతకాల మాప్రాంతదేశమునకుఁ ద్రిపురదేశమని పేరు వాడుకయయ్యెనట. కాని, యచిరకాలముననే మాసిపోయెను. ఈపురమునకు చేదిపురమని పిదపఁ బేర య్యెను. మత్స్యపురాణము ౧౧౬ యందు చేదిపురమును బాణాసురుఁ డేలెనని చెప్పఁ బడియున్నది.

పిదప మహిష్మఁడు లేక మహిషకుఁడను భూపతిమాహిష్మతిపురమును నిర్మించి రాజధానిగ నొనర్చుకొనియెను. ఈసంగతి హరివంశము ౧ అధ్యాయమున మహిష్మంతుఁడనురాజు మాహిష్మతీపురము నిర్మించె నని చెప్పఁబడినది. పద్మపురాణోత్తర భాగమున మహిశుఁడనురాజు నిర్మించెనని చెప్పఁబడినది. దీనికి మహేశపురమనియు, మహేశ్వరపురమనియుకూడ వాడుకనామము లుండెనట. నర్మదానదికిం గుడివైపున నుండెనట. ఇది హైహయ (అనూప) దేశ భూపతులకు రాజధానిగ నుండెనట. కార్తవీర్యార్జున చక్రవర్తికి నిదియే రాజధాని. ఇది అగ్నిదేవునిచే రక్షింపఁబడినదనియు, కావుననే అగ్నిపురమని ప్రసిద్ధమైనదనియు మహాభారతము అనుశాసనపర్వము ౨౫ వ అధ్యాయమునను, జైమిని భారతము ౧౫ వ

అధ్యాయమునను చెప్పఁబడినది. కార్త వీర్యార్జునచక్రవర్తిని, జమదగ్ని రేణుకల పుత్రుఁడై సుబ్రహ్మణ్య శిష్యుఁడగు పరశురాముఁడు వధించెనని భాగవతము నవమ స్కంధము ౧౯ వ అధ్యాయమునఁ జెప్పఁబడినది. మాహిష్మతీపురము నర్మదాతీర ప్రాంతమనియు, అమరేశ్వరమునకును ఓంకారమాంధాతక్షేత్రమునకును సమీపమని చెప్పఁబడినది. ఇక్కాలమున మాహిష్మతీపురముండిన తావుగాని, ఆ జాడలుగాని లేశమును గానరాకున్నవి.

శిశుపాలుఁడు చేదిదేశమేలుతరి, చంద్రావతీపురము రాజధానియై యుండెను. ఇది ఇప్పుడు మధ్యపరగణాలు, లలితపూర్ జిల్లాలో, చాందేరి యనుపేరంబరగుచున్నది. గుప్తవంశపు నృపతు లీదేశము నేలుతరి కాలాంజపురమును, మహాభారతకాలమున శుక్తిమతీపురమును రాజధానులుగ నుండిన ట్లగుపడుచున్నది. తిరిగి ఇప్పటి తియోర్ (త్రొల్లింటి త్రిపుర) రాజధానియయ్యెననియు తెలిసెడిని. అప్పుడు దాహలదేశమని వాడుక యుండినటుల Alberuni's India Vol. I, P. 202 నందు చెప్పఁబడినది. కలాచూరిస్ పాలించు కాలమున చేదిదేశమని పేరుండి నటుల అనర్ఘరాఘవమున వివరింపఁబడినది. మాల్వ అవంతిదేశ రాజధాని మాహిస్సతి యని, దీర్ఘనికాయమనంబడు మహాగోవిందు సూక్తము (బౌద్ధగ్రంథము) న చెప్పఁబడినది.

పయస్వినీనది (ఇప్పటిపైశుని) తీరమున గల చిత్రకూటపర్వతముపై శ్రీరాముఁడు సీతాసహితుఁడై కొంతకాల మరణ్యవాసవిధి నెరపుటం జేసి రామగిర్యాశ్రమమని పేరందెను. కాననే, మహాకవి కాళిదాసు తన మేఘసందేశమున మొదటిశ్లోకమునందు 'రామగిర్యాశ్రమేషు' అని వ్రాసియున్నాడు. పయస్వినీనదిం గూర్చి మనపురాణము ౧౩–౨౩ యందు ప్రశంసకలదు. ఇంక నొక్కసంగతితో ముగింతుము. రాజగిరియందు జన్మించి మండనమిశ్రుఁడను పేరంబరగి, మాహిష్మతియందు కాపురముండి, శంకరభగవత్పాదులచే వాదమున నోడింపబడి, వారికి శిష్యుఁడై విశ్వరూపస్వామి లేక విశ్వరూపాచార్యుండను పేరందిన విద్వచ్ఛిఖామణి ఇచట నివసించువాఁడనియు, ఇటనె వారివలన నోడింపఁబడెననియు, అది యీమాహిష్మతియెననియు, మాధవాచార్యకృత శంకరదిగ్విజయమునఁ జెప్పఁబడినది.

**అనూరథుఁడు** — అత్రి, చంద్ర, యాదవ క్షత్రియుఁడు. ఇతని కుమారులు అంశుఁడు, పురుహోత్రుఁడు, మధువు, అనువారలు.

**అనూరాధనక్షత్రము** — ఇది ఛత్రమువలె నగుపడు మూడునక్షత్రముల సముదాయము. అనూరాధకింకను ఆరాధః, మిత్రం, మైత్రమని పర్యాయపదములు కలవు. దీనికి మిత్రుఁడధిదేవత. దేవగణము, తిర్యఙ్ముఖము, పుంస్వభావనక్షత్రము, ఆడజింక, చిలుక, పనసచెట్టు ఈ నక్షత్ర సంబంధములనియు, ప్రవేశించిన పదిఘటికలపై త్యాజ్యము (విష ఘటికల) నియు, ముప్పదినాల్గు ఘడియలపై యమృతఘటికలనియు, మృదుస్వభావ నక్షత్రమనియుఁ జెప్పఁబడినది.

**అనూరాధపురము** — సింహళద్వీపమునందలి, పాడుపడి తిరుగఁ ద్రవ్వఁబడిన పట్టణము. కేండీ కుత్తరముగా ౭౦ మైళ్ల దూరమున నున్నది. ఇది క్రీ. పూ. ౪౩౭

మొదలు ౭౯౦ వరకు రాజధానియై యుండినది. పురాతనపుఁగట్టడము లనేకములు బయలుదేర దీయఁబడినవి. అందు గయనుండి అశోకచక్రవర్తి సుతయగు సంఘమిత్త తెచ్చి నాటిన బోధివృక్షము (రావి) కలదు. (లంకారాజ్యము చూడుఁడు.)

**అనూరుఁడు** (అరుణుఁడు) - కస్యపప్రజాపతికి వినతయందు అరుణుండును, గరుడుఁడును జనించిరి. వీరు అండజులు. ఈతనియండమును వినత తొందరగ పొదిగినందున నీతఁడు వికలాంగుఁడై జనించెను. ఈ అరుణుఁడు సూర్యుని రథసారథియయ్యెను. గరుడుండు విష్ణుదేవుని వాహనమయ్యెను. ఊరువులు లేకుంట ననూరుఁడనంబరగె. అరుణునిభార్య శ్యేని. సంపాతి, జటాయువు, అనువారలు పుత్రులు. (అరుణుఁడు చూడుఁడు).

**అనేనస్సు** . తండ్రి ఆయువు, కుమారుఁడు శుద్ధుఁడు, కనిష్ఠసోదరుఁడు నహుషుఁడు- ఇంకను కకుస్థుని కుమారుఁడగు అనరణ్యుడనియు, సుయోధనుఁడనియు నామాంతరములు గలవానికి అనేనస్సు అను పేరుగలదు.

**అన్యేనచ అన్యస్యవిధిర్భవతీన్యాయము**
ఒకరిమూలమున వారికి విధియగునది అన్యులకుఁగూడ విధియగునని యర్థము. ఇద్దరికి చక్కని యనుబంధము ఉండినచో, అందొకరి కార్యమునందు రెండవవారికింగూడ బాధ్యత కల్గునని భావము.

**అనోమానది (ఔమి)** — ఇది గొరకుప్పూర్ (గోరక్షకపురము) జిల్లాలో నున్నది. అశ్వఘోషుని బుద్ధచరిత్రయందు గౌతమశాక్యుఁడు (బుద్ధుఁడు) ఇలువెడలి వనమున కేఁగుతరి నీనదిని (ఇపుడు చందావులియనంబడు గ్రామముకడ) దాటెననియు, అటనుండియె ఆయన ఎక్కిన కాంతపమను నశ్వముంగొని ఛందకుఁడను బంటు కపిలవస్తునగరమునకు (రాజధానికి) మరలెననియుఁ జెప్పఁబడినది. కాని దీనిం గూర్చి కొందరనుమానింతురు.

**అనోతత్తసరస్సు** — రావణహ్రదము, రఖుస్తల్. (అనవతప్తసరస్సు చూడుఁడు).

**అన్యోన్యాభావము** — అభావములు చూడుఁడు.

**అన్యోన్యానుబంధ సంబంధము** — దీనికాంగ్లమున Relativity అనియెదరు. న్యాయతః ఇది గణితశాస్త్ర సంబంధము. ఇందు పరిగణింపఁబడు పదార్థములు, ప్రదేశము, పదార్థము అనునవి రెండు. పిదప కాలముగూడ ఇందుచేర్చి త్రిపదార్థములనిరి. ఇవి పరస్పరము యన్యోన్యసంబంధము కలవిగ నుండునవి. ప్రదేశమున పదార్థము నడుచుటకు కొంతకాలముపట్టును. ఆనడచిన ప్రదేశభాగమునకు దూరమని పేరు. ఐన యాలస్యమునకు కాలమనిపేరు. ఇంతదూరము గడచుట కింతకాలమగునని లెక్కించుటయే అన్యోన్యానుబంధసంబంధవిధికిం బ్రయోజనము. అదే ఈ శాస్త్రఫలితము. భూమియే పదార్థమనియు, ఆకాశమే ప్రదేశమనియు, భూమిగడచినపరిమితియే దూరమనియు, అయిన యాలస్యమే కాలమనియు లెక్కించి యున్నారు. కాలముయొక్క హద్దులే సంవత్సరములు, నెలలు, పక్షములు, దినములు, గంటలు, ఘడియలు, విఘడియలు, నిమిషములు, సెకండ్లు మొదలగునవి. ఇంక దూరమును ఈపద్ధతిమేరకే యోజనమనియు, మైళ్లు, ఫర్లాంగులు, గజములు, అడుగులు, అంగుళ

ములు మొదలగు పేర్లతో హద్దుల నేర్పరచి కొలచుచున్నారు.

క్రీ. వె. ౧౯ వ శతాబ్దపు మధ్యకాలమునందు Michaelson and Morley అను ధీశాలురు పరిశీలనలుసల్పి, బయల్పడజేసిన దీచిత్రమే. ౧౯౦౫ సంవత్సరమున ఎనిస్టన్ పండితుఁడు బయల్పరచినదీ 'రిలేటివిటీ' సిద్ధాంతమే. (ఎనిస్టన్ సిద్ధాంతము చూడుఁడు). ఎనిస్టన్ పండితుని యభిప్రాయములకు న్యూటన్ పండితుని 'గ్రావిటేషన్' సిద్ధాంతమునకు గల భేదములను ఇట వివరింపనవసరము లేదు. ఇట వలయునది రిలేటివిటీ సిద్ధాంతము మేరకు బయల్పడు లెక్కయై యున్నది. క్రీ. వె. ౧౯౦౮ లో మాన్కోవిస్కీ (Monkowski) అనిపేరుగల పోలాండుదేశపు గణితశాస్త్రజ్ఞుఁడు కొలతలు పొడవు, వెడలుపు, ఎత్తు లేక లోతు అను మూఁడేకాక, కాలమునను నాల్గవదికూడ పరిగణింపఁబడఁదగినదిగా నిర్ధారణ యొనర్చెను. (న్యూటన్ సిద్ధాంతము, కాలము, కాలవిధానము చూడుఁడు).

**అనౌపమ్య** — బాణాసురుని భార్య. చంపావతీదేవి, ఉషాదేవి, ఈమె కుమార్తెలు. వీరిలో నుషాదేవి అనిరుద్ధునిభార్య. చంపావతీదేవి, ఇప్పటి సంయుక్తరాష్ట్రములోని కుమాంౘడివిజనులోని చంపావతిపురమున నాశ్రమము నిర్మించుకొనియుంట నాపురమున కాపేరయ్యెను.

**అపక్వభానువాసరవ్రతము** — నిరశనార్కవ్రతము చూడుఁడు.

**అపగదేశము (ఆఫ్ఘనుస్థానము రోహదేశము, రోహిదేశము)** — వేర్వేరు కాలములందు వేర్వేరు దేశనామములచే బరగినటుల తొల్లింటి అపగదేశ మిప్పు ఆఫ్ఘనుస్థానమనఁ బరగుచున్నది. ప్రజలు మహమ్మదీయులు; ముఖ్యముగ పఠాను జాతివారు. ఇప్పుడు వీరిదేశమును వీరు విలాయత్ అనెదరు. భాష ముఖ్యమగునది పుష్తు. ఈదేశ దక్షిణభాగమున పాషాణపర్వతము (ఇప్పటి పిషాన్ లేక అమ్రాన్) కలదు. దానిలోయ పిషాన్ (Pishan Valley) అని చెప్పఁబడుచున్నది. అవధానకల్పలత ౯౯-౨౨ యందు పాషాణపర్వత ప్రశంస కలదు. (ఆఫ్ఘనుస్థానము చూడుఁడు).

**అపగోత్రము** — నిధృవగణము చూడుఁడు.

**అపఘువ్య గోత్రము** — కుశికగణము చూడుఁడు.

**అపభ్రంశభాష** — ఇది ప్రాకృతములోని ఒక భాషాభేదము. ప్రాకృతజన్యము. అష్టభాషలలో నొకటి. (భాష యొక్కవివిధములు చూడుఁడు). షట్ప్రాకృతభాషలలో నొకటి. (ప్రాకృతభేదములు చూడుఁడు).

**అపరవిదేహదేశము** — విదేహమన మిథిలదేశమునకు బ్రతినామమని అందరెరింగినదే. ఇది అపరవిదేహదేశము. దీనిసంబంధమేమో తెలియకున్నది. లలితవిస్తారమను గ్రంథమనువదించుచు డాక్టర్, ఆర్. యల్. మిత్రా యను పండితుఁడు (వంగదేశీయుఁడు) అభిప్రాయముం దెల్పియున్నాఁడు. ఇంతకన్న దీనింగూర్చి యేమియు తెలియదు.

**అపరశేకదేశము** — శేకదేశమునకు దక్షిణదిశగా నుండెను. తొల్లి శేకదేశములోఁ జేరియుండెను. అట్టితరిని (రెండు దేశభాగములను) సహదేవుఁడు జయించినటులఁ జెప్పఁబడినది. రెండును వేరై నపిదప నే యపర శేకదేశమని పేరందెను.

**అపరాంత లేక అపరాంతకదేశము**— అపరాంత లేక అపరాంతకదేశము పరశురామ క్షేత్రములలోనిది. సప్తకొంకణములలోని కొంకణోత్తరభాగ ప్రదేశము. రాజధాని శూర్పారకపురము. దీనిని శూర్పారకక్షేత్రమనియు ననుటకలదు. పాండవులు ప్రభాస తీర్థమునకేగుచో నిటకొంతకాల ముండినటుల మహాభారత వనపర్వ కథాసందర్భమునఁ జెప్పఁబడినది. శూర్పారకపురమిప్పుడు 'సుపరా' యనుపేరఁ బరగుచున్నది. మార్కండేయపురాణమున నపరాంతకదేశ ప్రశంస కలదు. దీనింగూర్చి పెక్కుమార్పులు జరిగి యుండనోపు. పొరుగుననేయుండిన యరణ్యక దేశము పెక్కండ్రం బొరపాటుల పాల్జేసి యుండనోపును. టోలేమీ (Ptolemy) పండితుఁడు (చరిత్రకారుఁడు) ఈ దేశము నర్మదానది మొదలు ప్రారంభమై, దక్షిణమునకు వ్యాపించియుండె నని చెప్పెను. భగవన్లాలు ఇంద్రజీ పండితుఁడు హిందూ దేశపు పశ్చిమ సముద్రతీరభాగ మపరాంతక దేశమని వ్రాసెను. మాహీ మొదలు గోవా వర కీదేశ ముండినదని బొంబాయి గెజిటీర్ ౧ వ భాగము ౩౬ యందున్నది. భట్టస్వామి కౌటిల్యుని అర్థశాస్త్రమునకు వ్యాఖ్య వ్రాయుచు నపరాంతకము కొంకణమేనని సూచించెను. రఘువంశమున మహాకవి కాళిదాసు దీనిని సహ్యాద్రి (Western Ghats) కినీ, సముద్రమునకును నడుమ నుండు భూభాగపుపీఠిక యగునట్లు సూచించెను. వీనినన్నిటిం జక్కగఁ బరిశీలించిన Dr. Sir, R. G. Bhandarkar భాండార్కరు పండితుఁడు అపరాంత ముత్తరకొంకణమనియు, శూర్పారకపురము రాజధానియై యుండెననియు నభిప్రాయపడి యున్నాఁడు. శూర్పారక, సుపర యనఁబరగుచు ఇప్పటి బేసిన్పట్టణ సమీపముననున్నది. మళయాళ కొంకణదేశముల సంధినుండి, యొకప్పుడుండి యున్నదని కొందరు తలంచుచున్నారుగాని, కొంకణోత్తర భాగమనుట కేసందియమును లేదు. అశోకచక్రవర్తి ఈ దేశమునకు క్రీ. పూ. ౨౮౫ సంవత్సరమున యోనధర్మరక్షితుఁడనువానిని బౌద్ధమత వ్యాపకమున కంపెనని బౌద్ధగ్రంథ చరిత్రయందు కలదు. బ్రహ్మపురాణము ౨౭, ౫౮ యందు శూర్పారకపురము రాజధానియని చెప్పఁబడినది. రఘువంశము ౪ సర్గలో మురళానది ఈదేశమున చెప్పఁబడినది.



**అపరాజితాదేవిక్షేత్రము** —దేవీపురాణ ప్రసిద్ధంబగు నీ మహాదేవి క్షేత్రము ఈస్టిండియన్ రెయిల్వే లూప్లైనుపైనున్న మురా రెయిల్వేస్టేషనునుండి పశ్చిమముగా మూడు మైళ్ల దూరమునం దున్నది.

**అపరాద్ధే ఘోరివ ధానుష్కస్య కంఠాడంబర ఇతిన్యాయము** — కార్య చతురతలేని వాగాడంబరము, నేర్పు లేనివాని చేతి ధనుష్టంకారమువలె హేళన కాస్పదమగునని భావము. సంస్కృతలోకోక్తి.

**అపరానందానది** — అలకానందానది చూడుఁడు.

**అపరాయణగోత్రము** — విష్ణువృద్ధ ఉపగణము చూడుఁడు.

**అపవాదై రుత్సర్గా బాధ్యన్తేతి న్యాయము** — సామాన్య పద్ధతులు ప్రత్యేక పద్ధతులచే నతిక్రమింపఁబడునని యర్థము. అన్నిటికీ సామాన్యముగా వర్తించు

పద్ధతులు, కొన్నిటికే వర్తించు ప్రత్యేక పద్ధతులచే బాధింపఁబడునని భావము.

**అపశకునములు** — ప్రయాణమేగుతరి పోవలదని వారించి యాపుటయు, భుజించి పొండని వారించుటయు, ఎచటికేగెదరని ప్రశ్నించి యడుగుటయు, తాముగూడవత్తుమని పల్కుటయు, పయనమైయేగువారి చెరఁగుబట్టుకొనియాపుటయు నపశకునములు. అవ్యక్తులవలన నిట్టివి సంభవములు కాకుండ ముందుగ జాగ్రతం గొనవలయునని శకున శాస్త్రవేత్తలగు మహర్షులు నుడివిరి.

**అపసారితాగ్ని భూతలన్యాయము**— భూమిపైనుండిన యగ్ని నటనుండి తీసివేసినను పిదప గొంతకాలమువరకు వేడినిలచి యుండును. అట్లే ఒక్కొక్కదోషమును తొలఁగినను ఇంకనూకొంతవరకు బాధింపనోపునని భావము. ఇట్టిదే చంపకపటన్యాయము (సంపంగిపూలంగట్టినగుడ్డ ఆపూవులు తీసివేసిన పిదపకూడ కొంతతడ వాపరిమళము నిచ్చును).

**అపస్మారము (మూర్ఛ)** — ఆంగ్ల Hysteria, Unconsciousness శరీర స్మారకము తప్పించెడి మూర్ఛరోగము. ఇది స్త్రీలకువచ్చినతరి 'కాకిసోమాల'యనుటయుం గలదు. నోట చొంగలుగారుట, నురుగు వచ్చుట, మూల్గుట మొదలగు లక్షణములం గల్గియుండును.

**అప్పకవి** — కాకునూరి అప్పకవి. అప్పకవీయమను లక్షణగ్రంథము రచించినవాఁడు. ఈ కవి కృష్ణాతీరమునందలి కామేపల్లియను గ్రామమున శాలివాహనశకాబ్దము పదునారవ శతాబ్దమునాఁటివాఁడందురు. కామేపల్లికి తంగేటినగరమనియుఁ బేరుండెనట.

**అప్పదీక్షితులు (అప్పయదీక్షితులు) కవి** — సంస్కృతకవి. తండ్రిపేరు నారాయణదీక్షితులు. చిదంబరపుర నివాసియై యటనే మృతినందినవాఁడు. గొప్ప విద్వత్కవి. ఈతనిని శతాధిక గ్రంథకర్తయనెదరుగాని, వీరు రచించిన విక్కాలమున చిన్నాపెద్దాకలసి ఎనుబది లెక్కింపఁబడినవి. గొప్ప శివభక్తుఁడు. శివభక్తిని వ్యాపింపఁ జేసినవాఁడు. శివార్చనచంద్రిక, శివతత్వవివేకము, ఆత్మార్పణము మొదలగు గ్రంథము లీయన కృతములు.

**అప్పప్ప భట్టురాజకవి** — ఈతఁడు రచించినది, శశిరేఖాపరిణయమను ప్రబంధము.

**అప్పర్బర్మా దేశము** — ఆసియాఖండమున ఇండోచైనీస్ద్వీపకల్పమునందు బర్మాదేశభాగము. బ్రిటీషువారి ప్రభుత్వమునందున్నది (బర్మాదేశముచూడుఁడు). ౧౫౦౦౦౦ చతురపుమైళ్ల వైశాల్యముకలది. అప్పర్బర్మా యందు ఐరావతినది పెద్దయోడలు, సముద్రమునుండి ౮౦౦ మైళ్ల దూరమునంగల భామోపురమువరకు పోదగినలోతుం గల్గియున్నది. ఐరావతీనదీతీరముననున్న మండలీపురము (Mandalay) ముఖ్యపట్టణము. ఇప్పటి మండలీపురము నవీననిర్మితము. పురాతనపు భూపతులనాడు రాజధానులుగ నుండిన ఆవాపురము, అమరపురము ఈ పరిసరములందున్నవి. అం దమరపురము బౌద్ధుల యాత్రాస్థలమై యున్నది. ఇందు బౌద్ధదేవాలయము లధికముగాఁగలవు. ఉత్తరముననున్న భామోపురమున రంగూనునుండి ఓడలును, చీనాదేశమునుండినాటువ ర్తకమును మార్చుకొనుతావు. మరియు నిది రంగూను నుండియు, లోవనుండియు, ఇనుపబాటలు

కలియు సంధిగ నున్నది. గనులం దినుము విస్తారము దొరకుచున్నది. నూతులందు పెట్రోలియమ్ లభించుచున్నది. విగ్రహములు చేయుటకు పనికివచ్చు ప్రశస్తమైన తెల్ల మార్బెలురాయి దొరకుచున్నది. ఉత్తర భాగమున కెంపులు, బేడ్రత్నములు దొరకు గనులు సుప్రసిద్ధములు. పల్లపుప్రదేశము లందు వరిపంట యధికముగా పైరుచేయం బడుచున్నది. అడవులందు కలపయు, వెదురు పొదలును మితిమీరియున్నవి. చీనాతో నాటునను లోయరుబర్మాతో నదిపై యోడ లలో వర్తకము నడచుచున్నది. (లోయరు బర్మా చూడుడు).

**అప్పర్గినియాదేశము** — ఇది ఆఫ్రికా ఖండమున, ఆఫ్రికా పశ్చిమభాగమున నున్న దేశము. ఇది సముద్రతీరమున ఐరోపాదేశ ములవారిలో కొందరు ట్రేడింగుసెంటరుగను, ప్రొటక్టరేటులుగను, ఏర్పర్చుకొనిన కాలనీ, స్టేషనులు విభాగములుగా గల్గియున్నది. అందు ముఖ్యములు:—౧. సియ్యర్లీయోన్, ౨. లైబేరియా, 3. ఫ్రెంచి ఐవరీకోస్టుకాలనీ, ౪. ఇంగ్లీషు గోల్డుకోస్టుకాలనీ, ౫. జర్మను టోగోలాండు, ౬. డాహోమీ, ౭. లాగోస్, ౮. నైగేరియా (ఇది ఉత్తర నైగేరియా, దక్షిణనైగేరియా యని రెండువిధములు), ౯. జర్మను కామరూన్.

**అప్పర్సిండ్ ఫ్రాంటియరుజిల్లా** — బొంబాయిరాజధాని సింధు డివిజనులోని జిల్లా. జాకోబాబాదుపురముప్రధానస్థానము.

**అప్రతిరథుఁడు** — పూరువంశస్థుఁడగు క్షత్రియుఁడు. మతిసారుని మూఁడవ కుమారుఁడు. కుమారునిపేరు కణ్వుఁడు. సోదరులు ధృవుఁడు, సుమతి.

**అప్రతిష్ఠము** — ఇది యొక నరకము. ఇందు ఘటీయంత్రశిక్ష ధర్మము.

**అప్సరలు, స్త్రీలు** — అప్సరలు దేవ తలలో నొకశాఖ. ఎక్కువ సౌందర్యవతు లని ప్రతీతి. వీరెందరో సరిగా దెలియరా కున్నది. పురాణములం దీక్రిందిపేర్లు కాన నయ్యెడిని. కశ్యపునకు మునియను భార్య యందుఁ బుట్టిన సంతతి. వీరిని మౌనేయు లనియు ననుట గలదు. అంజన : ఈమె ఒక శాపవశమున కామరూపిణియగు వాన రమై జన్మింపవలసివచ్చెను. కేసరి యను వానరుని భార్య. ఈమె తండ్రి కుంజరుఁడను పేరుగల వానరము. ఈమె ఒకతరి మానుష్య రూపమున నుండునపుడు వాయుదేవుం డీమెంజూచి మోహించి ఈమెయం దాంజనే యుని గనియెనని చెప్పఁబడినది. అద్రిక. కర్ణిక : ఆనకునిభార్యయు నీపేరుగలదియె గాని యప్సరకాదు. ఘృతాచి. చంద్రరేఖ. జలపద. తార : బృహస్పతిభార్యపేరు తార. తారుని కుమార్తె పేరును తారయె. వేరొక తారాదేవియుం గలదు. తిలోత్తమ. దమనిక : తల్లి మేనక. సుపర్ణగోత్రుఁడగు కందరునిభార్య (పక్షి). కుమారుఁడు తార్క్ష్యి. ధాన్యమాలిని: ఈమె రావణునివలన అతికాయుఁడనుసుతునిం బడసెను. నంద : పంచాప్సర తీర్థములలో నొకటి నందాసంబంధము. నంద, సౌరభేయి, సమీచి, వస, లత, యనుపేరుగల యప్సర లైదుగురు ఒక మునిశాపమున మహాగ్రహా ములైయుండి తీర్థయాత్రలు సల్పు కాలమున నర్జునునిచే శాపవిము గాంచిరి. వారి యైదు తీర్థములు ...ంచిరి. నంద సౌభద్ర తీరము, సౌరభేయి పౌలోమతీర్థము, సమీచి కారండవతీర్థము, వస ప్రసన్నతీర్థము, లత

భారద్వాజము అను తీర్థముల నిర్మించిరి. (నారీతీర్థము లేక పంచాప్సర తీర్థములు చూడుఁడు). పంచచూడ : నారదునిచేఁ బ్రశ్నింపబడి స్త్రీలస్వభావలక్షణము లీమె యాతని కెఱింగించినటుల చెప్పఁబడినది. ప్లమోచ : ఈమె కండుఁడను ఋషివలన మరీషయను కుమార్తెను కనినట్లు చెప్పఁబడినది. పుంజికస్థల : ఈమె పారుఁడను ఋషివలన కళావతియను కుమార్తెం గనెను. కళావతి సౌందర్యవతియనియు, శివభక్తురాలనియు, పార్వతీదేవి ఈమెకు పద్మినీవిద్య (కోరినసౌఖ్యము లొనఁగూర్చు విద్య) నొసంగెననియు, ఆమె స్వరోచి కావిద్య నుపదేశించి యాతనిం బరిణయమయ్యెననియుం జెప్పఁబడినది. ఇంకను వరుణుని కూతురునకు పుంజికస్థలయనిపేరు. ఈమెయు నప్సరయే. పూర్వచిత్తి : ఈమె యగ్నీధ్రుని భార్యగఁ జెప్పఁబడినది. మంజుఘోష. మదాలస : మదాలసయను అప్సర యొకతె ఋతుధ్వజుని భార్య. వేరొక మదాలస విశ్వావసుఁడను గంధర్వుని కుమార్తె. కువలయాశ్వుని భార్య. వీరి సుతుఁడు అలర్కుఁడు. మేనక : మేనకయను పేరుగల యప్సర యొకతె విశ్వామిత్రుని తపోభంగమొనర్ప నియమింపఁబడి, యాయనవలన శకుంతలయను సుతం గనెను. మరియు వేరొక మేనక స్థూలకేశుఁడను ఋషిచేఁ బంపఁబడి విశ్వావసుని భార్యయయ్యెను. రంభ : చక్కదనమునకుఁ బేరందిన యప్సర. ఈమెకును, నలకూబరునకును యన్యోన్యానురాగము కలదని చెప్పఁబడినది. వజ్ర : వసయని నామాంతరము (పంచాప్సర తీర్థములు చూడుఁడు). వపుష్య : ఈమె నారదునిచేఁ బ్రోత్సహింపఁబడి దూర్వాసమహర్షి తపోభంగమొనర్పఁ జేరి యత్నించి, యాతనిచే శపింపఁబడి పక్షియైనటుల చెప్పఁబడిన యప్సర స్త్రీ. వరూథిని : ఈమె గంధర్వ వనితయనియుం గూడ చెప్పఁబడినది. స్వరోచి తల్లియనియు, స్వారోచిషమనువునకు పితామహి యనియు చెప్పుదురు. సమీచి : పంచాప్సరతీర్థము చూడుఁడు. స్వయంప్రభ : హేమయొక్క కుమార్తె. నివాసము కాంచనబిలము. సోమద : ఈ అప్సర చూళియను ఋషివలన బ్రహ్మదత్తుఁడను సుతునింబడసెను. ఆతనిభార్యలు కుశనాభుని నూర్వురు పుత్రికలు. వీరు వాయుశాపమున కుబ్జలైరి. వీరి సంతతి కన్యాకుబ్జులు. (సౌరభేయి, పంచాప్సరతీర్థములు చూడుఁడు.) హారిణి. హేమ : స్వయంప్రభకు తల్లి. అప్సరలు క్షీరసముద్రసంజాతులనియుం జెప్పఁబడినది.

**అప్-ఎ-క్లోజ్** (Up - a - Close) — స్కాట్లండుదేశపు ఉక్తి. పగతురు తన్ను దరముకొనివచ్చుతరి వారినుండి మరుగుపడుటకొక తెలియరాని ఇరుకుసందుమార్గముగాని, బలమైన యావరణగల్గిన యొక స్థలముగాని, దొరకువరకు పరుగిడుచుండు యవస్థకు వాడుచుండు ఉక్తి. ఇక్కాలమున ఏమియుం దోచని దుస్థితికి వాడుచున్నారు.

**అప్‌సెట్-ప్రైస్** (Upset-Price) — వాణిజ్యసంబంధ పరిభాషాపదము. వేలమున తానెంతధరకు విక్రయింపనెంచెనో ఆధర దానికి తక్కువవచ్చినచో నమ్మనిష్టములేదని భావము.

**అపాగ్రేయగోత్రము** — ముద్గల ఉపగణము చూడుఁడు.

**అపానాసనము** - యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. స్వస్తికాసనమున గూర్చుని (స్వస్తికాసనము చూడుఁడు) కుడిచేతి అరచేయితో (ఉప్పల వాఁయి ముఖ్యము) కుడివైపు నడుమును, ఎడమచేతి అరచేయితో ఎడమవైపు నడుమునుగట్టిగ నానుకొనియుండుట. దీనివలన అపానవాయువు క్షీణించునని చెప్పఁబడినది.

**అపాపపురి** — బీహారుదేశములోని బీహారు పట్టణమునకు ఆగ్నేయదిక్కున ఏడుమైళ్ల దూరమునను, గిరియాకునకు ఉత్తరమున రెండు మైళ్ల దూరమునను, ఇప్పటి పావాపురి యని సంస్కారులచేతను, పాపా యని సర్వసాధారణముగ నెల్లరచేతను పిలువంబడుచున్న జైనయాత్రాస్థలము. ఇది జైనతీర్థకరులలో కడపటి (౨౪వ) తీర్థకరుఁడగు మహావీరస్వామి నిర్వాణపధమందిన తా వనెదరు. ఆ పవిత్ర స్థలమున నిప్పుడు నాల్గు జైనుదేవాలయములు కలవు. (మహావీరస్వామి చూడుఁడు).

**అపాయకరములగు వృక్షములు** — టెలిగ్రాఫుట్రీ (Telegraph Tree) అనంబడు వృక్షమున విద్యుచ్ఛక్తి ఘనీభవించియుండునని కనిపెట్టఁబడినది. ఈవృక్షముకడకు తెలియక ప్రమాదవశమున నేగినవారికి విద్యుద్ఘాతలు (Electric Shocks) తగులునట. బలహీనుల కపాయకరమని చెప్పఁబడినది. ఈచెట్లు భరతదేశమునఁగూడఁ గలవట. ఆస్ట్రేలియా ఖండమునందలి కేనిబాల్ ట్రీ (Cannibal Tree) మనుష్య శరీరమును బంధించి, ప్రాణమునుబాపి తన యాకులచే నాక్రమించి మూసిపట్టి యాకలే బరమును పీల్చివేసెడి శక్తికలదని గనిపెట్టబడియెయున్నది. ఇంకను దక్షిణఅమెరికాయందు (A Kind of Vegetable Octopus) ఒకజాతివృక్షము జంతువులంబట్టి బాధించి ప్రాణముందీయు శక్తికలది కలదు. ఒకవృక్షశాస్త్రజ్ఞుఁ డొకయడవియందు తిరుగుచు తన కుక్క గోండ్రింపు విని యాదిశకుంబర్విడి యొక వృక్షము బలమగు త్రాళ్ళవంటి సాలిపట్టుం బోలిన యావరణముకల్గించి దరికేగిన యాశునకమును నిర్బంధించియుంటయు, కుక్క లోన గోండ్రించుటయుంగని కష్టముతో దన మొలకత్తిచే నాపట్టుఛేదించి కుక్కనులాగఁ గలెనట. కుక్క శరీరమున విస్తారముగను, ఆతనిచేతులు ముఖములకు కొంచముగను గాయములై రక్తస్రావముకల్గి చర్మము పాడయ్యెను. దీని కాతఁడు ల్యాండు ఆక్టొపస్ (Land Octopus) అని పేరిడెనట.

**అపాస్ట్రోఫీ** (Apostrophe) — ఇది యాంగ్లభాషా సాంగత్యమున ఆంధ్రభాషలోనికి తెచ్చుకొనిన గురుతు ( ' ), ఒకని యొక్క, అను షష్ఠీవిభక్త్యర్థమును సూచించును. ఇది ఆంగ్లభాషయందు ఉపయోగించునుగాని ఆంధ్రభాషకు నిరుపయోగమని తేలుచున్నది.

**అప్తాల్మోస్కోపు** (Aphthalmoscope) నేత్రమునందున్న పరిస్థితులను దీనియందుఁ బ్రతిఫలించి, నేత్రమునఁ బడి, చక్కగఁ దెలియునట్లు చూపుపరికరము. ఇది రాత్రులందే చూడనగుచున్నది.

**అప్పశాస్త్రికవి** — ఈతనిం గూర్చి యేమియుం దెలియదు. రచించినది లవలీపరిణయమను నాటకము. సారస్వతాదర్శము. వాదార్థమను నైయాయికగ్రంథము.

**అప్రాప్తే శాస్త్రమర్థవత్ ఇతి న్యాయము** — అన్యత్రా సిద్ధింపని యర్థ

ప్రయోజనములు శాస్త్రమువలన సిద్ధింపఁ జేయనగునని యర్థము. అనగా, సరియగుయర్థముగాని, సరియగు ప్రయోజనముగాని, సరియగు విధిగాని తెలియనివానికి శాస్త్రమెటుల విధించుచున్నదో అట్లే గ్రహింపవలెనని భావము.

**అపికాయునిగోత్రము** — వాధ్ర్యస్య లేక మిత్రయువగణము చూడుఁడు.

**అపిశాయునగోత్రము** — వాధ్ర్యస్య లేక మిత్రయువగణము చూడుఁడు.

**అపిశాలి గోత్రము** జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.

**అపిశిల గోత్రము** — వాధ్ర్యస్య లే మిత్రయువగణము చూడుఁడు.

**అప్పిచ్చినది, అవసరమున కక్కరకు వచ్చునా?** — ఆంధ్రలోకోక్తి.

**అప్పిచ్చినవాఁడభివృద్ధికోరును, అప్పుపుచ్చుకున్నవాఁడుకీడు కోరును** ఆంధ్రలోకోక్తి.

**అప్పియన్వే** (Appian Way) — ఇది ఇటలీ దేశమునందున్న ఒకగొప్పబాట. ఆపేరుగల చక్రవర్తికాలమున వేయంబడుట వారి పేరిడఁబడినది. క్రీ. పూ. ౩౧౨ సంవత్సరము నాటిది. ఆచక్రవర్తిపేరు Appius Claudius. రోమకపురినుండి Caplia మీఁదుగా బ్రిండిస్సిపురమునకు పోవునది. ౩౬౦ మైళ్ల పొడవు. ఆదికాలమున చాల సుప్రసిద్ధమైన బాటగానుండి, పిదప పాడై వదలివేయఁబడి ఇటీవల త్రవ్వఁబడి బయల్పడుచున్నది.

**అపీలవపురము (పల్వాల్)** — మహాభారత ప్రసిద్ధమగు, అపీలమని పోల్చియున్నారు. ఇప్పటి వాడుకపేరు పల్వాల్. తొల్లింటి ఇంద్రప్రస్థరాజ్యములోనిది. క్రీ. పూ. ౫౭ సంవత్సరప్రాంతమున విక్రమాదిత్యుఁడు దీనిని రక్షించెనట పంజాబుదేశములోని గుర్గాంజిల్లాలో నున్నది. గుర్గాం పట్టణమిటకు ౪౪ మైళ్లదూరము. పల్వాలు నుండి గుర్గామునకేగు బాటయందు సగము దూరమున రెండు ఉష్ణకుండములు ప్రసిద్ధములు. ఇవి స్నాన యాత్రాస్థానములై యున్నవి.

**అపురూపము** — దుష్కరలభ్యమై దొరకక దొరకక లభించినదాని నపురూప మని యందురు. దొరకరానిదయ్యు నెట్లో లభించినదాని నపురూపమని యందురు. ప్రియులైనవారి నపురూప మందురు.

**అప్పుదొరికినచో పప్పూకూడూ** ఆంధ్రలోకోక్తి.

**అప్పులున్నవానితోడను చెప్పులున్నవారితోడను నడవరాదు** ఆంధ్రలోకోక్తి.

**అప్పులేనిగంజి దొప్పెడే చాలును.** ఆంధ్రలోకోక్తి.

**అప్పులేనివానికి ఉప్పూగంజీయైనను శ్రేయము** — ఆంధ్రలోకోక్తి.

**అపూర్వ (నవీన) పంచకము** — ౧. సూర్యోదయము, ౨. బంగారముయొక్క సువర్ణత, 3. భారతకథ, ౪. ప్రియురాలగు భార్య, ౫. మనస్సుకలసిన స్నేహితుఁడు. ఈ యైదును ప్రాతవియయ్యును, ఎల్లప్పుడు క్రొత్తవివలె మనోహరములై యుండును.

**అపొస్తలులు** (Apostles) — ప్రభువైన ఏసుక్రీస్తు ప్రధానశిష్యులు. పంద్రెండుగురు.

౧. సైమను- ఈయనకు పీటరని పేరుకలదు. ౨. ఆంద్రూ. 3. జేమ్సు-జెబీడీ కుమారుడు. ౪. యోహాను (జాన్)- జెబీడీ కుమారుడు. ౫. ఫిలిప్పు. ౬. బర్తాలోమ్యూ. ౭. థామాసు. ౮. మాత్యూ. ౯. జేమ్సు-అల్ఫాకసు కుమారుడు. ౧౦. తడ్డికసు. ౧౧. సైమన్- ఇతనికి జలాత్తనియుం బేరుండెను కనానీయుడు. ౧౨. యూదా (జూదాస్)- ఇస్కారియెట్.

**అఫిషియల్** (Official) - ఒద్యోగి లేక ఉద్యోగ సంబంధమని యర్థము స్టాకు ఎక్ఛేంజి సంఘసభ్యులొకని ఒక Defaulting Broker యొక్క ఆస్తులను Wind Up చేయనియమించుతరి, నాయనకు Official Assignee of the Stock Exchange అనెదరు. ఒక Non-delivery సందర్భమున చెప్పఁబడిన సెక్యూరిటీలను కొనుటకు గాని, అమ్ముటకుగాని ఒక బ్రోకరు (కమీషన్ వర్తకు) నకు స్వతంత్రమిచ్చిన నతనికి Official Broker అనెదరు. ఇటులనే Board of Trade మొదలగు సంస్థలు ఒకని దివాలావ్యవహార సందర్భమున అతని యాస్తులను Wind Up చేయుట మొదలగు కార్యములొనర్ప Trustee in Bankruptcy గా అధికారమిచ్చి బాంకిరప్టీ శాసనమునందు విధించబడిన కార్యముల నిర్వహించ నేర్పరచిన నాతనికి Official Receiver అనివాడెదరు. తగాదా లెక్కల సందర్భమున చిక్కులు సడలించి వివరింప న్యాయస్థానము వారిచే నియమింపఁబడిన యుద్యోగికి (Official Referee) అనిపేరు.

**అబద్ధాల పంచాంగమున అరువది గడియలు వర్జ్యమే (త్యాజ్యమే)** — ఆంధ్రలోకోక్తి.

**అబ్జర్వేటరీ** — నక్షత్రశాల చూడుఁడు.

**అబ్రహాం, ఎబ్రహాము లేక ఎబ్రేము, అబ్రహాం, ఇబ్రహిం** (Abraham or Abram) — హిబ్రూపేరు. జనసంఘము నకు జనకుఁడని యర్థము. మహమ్మదీయుల యందీపేరు ఇబ్రహీం అని రూపించును. యూదులలో నీపేరు విస్తారము వాడఁబడు చున్నది. పురుషనామము. అబ్రహాము యూదుల దేవునకు మిత్రుఁడు. ఈపదమును వేర్వేరు భాషలందు వేర్వేరు ఉచ్చారణతో పల్కుచున్నారు. (క్రైస్తవ నామములు చూడుఁడు).

**అబిజా** (Abijah) — హిబ్రూపేరు. యూదులకు రాజుగా నుండెను. నాతండ్రియే దేవుఁడు (ప్రభువు) అని యర్థము. పురుష నామము. (క్రైస్తవనామములు చూడుఁడు).

**అబియతార్** (Abiathar) — హిబ్రూ పేరు. యూదుల గురువులలో నొకనిపేరు. సమృద్ధికి జనకుఁడని యర్థము. పురుష నామము. (క్రైస్తవనామములు చూడుఁడు).

**అబ్బాసెదువంశపు ఖాలీఫాలు** — బాగ్దాదుపట్టణమున రాజ్యమేలిన ఖాలీఫాలు.

**అబ్రాకడబ్రా మంత్రము** — ఇది Gnostic మతసంబంధము. ఈమతస్థులు రెండవశతాబ్దమున అలెగ్జాండ్రియా పురదేశము

A B R A C A D A B R A
A B R A C A D A B R
A B R A C A D A B
A B R A C A D A
A B R A C A D
A B R A C A
A B R A C
A B R A
A B R
A B
A

లందుండెరి. Serenus Sammonicus గారి వ్రాతలలో నిది ఇటీవల బయల్పడియెను. ఈమంత్రము నిటులప్రస్తరించి వ్రాయుట యందు, మహామహిమావంతమగు భగవన్నామ మొకటి యిందుంట, నది రోగములఁ గుదుర్చుననియు, కీడులం దొలఁగించుననియు, ఆపదలనుండి రక్షించుననియుఁ జెప్పంబడినది. దీనిని తొమ్మిదిదినములు మెడయందు పార్చిమెంటు లేక పాపైరస్ లేక లోహపురేకు పైవ్రాసి ధరించి, పదియవదినమున తన కుడి వైపునకుఁ బ్రవహించు నీటిపారుదలలో వదలివేయవలెనని చెప్పఁబడినది.

**అబ్ధి పేనాన్యాయము** — సముద్రము స్థిరమైనను, సముద్రముచేసిన పనియగు నురుగు (సౌమరూపములు) స్థిరముకాదు. ఇట్టి సందర్భముల నీన్యాయము వాడుదురు.

**అబ్బిగాడుచస్తే ఆపంచనాదిఅన్నట్లు**- ఎదురు లేకపోతే నాదేపెత్తన మనువారల కీన్యాయము వాడుచుందురు. ఆంధ్రలోకోక్తి.

**అబ్సీనియాదేశము** — ఆఫ్రికాఖండమున ఈజిప్టున కాగ్నేయదిశగను, న్యూబియా సెన్నారులకు తూర్పునను, బ్రిటీషు ఈస్టు ఆఫ్రికా కుత్తరముననుఉన్న దేశము. దీనికి తొల్లింటిపేరు ఎథియోపియాదేశము. పరిమాణము ఇంచుమించు ౩౨౦౦౦౦ చతురపు మైళ్లుండునని అంచనావేయబడినది. దేశమంతయు నించుమించు సముద్రపు నీటిమట్టముపై నెన్మిదివేల యడుగుల ఎత్తుగల పీఠభూములును కొండలంగల్గియుండును. అధిక వర్షములుగల దేశము. ఆరోగ్యప్రదమై చల్లగనుండి ఫలవంతభూములుగల దేశమై యున్నది. ఈదేశపర్వతములందు బ్లూనైలు జన్మించును. ఇది బురదనదియై ఇట్లు పేరందినది. సముద్రతీరపు పల్లపుభూములు వేడిగనుండును. గోధుమలు, జొన్నలు, కాఫీ విస్తారము పైరుచేయఁబడుచున్నవి. బంగారము, రత్నములు, గనులందు దొరకుచున్నవి. ఏనుఁగుదంతము లడవులందు గల ఏనుఁగులనుండి విస్తారము లభించుచున్నవి. ప్రజలు ఎక్కువ నాగరికులు కారనియు, ఎథియోపిక్ భాషాసంబంధ పదములు విస్తారముగాగల వేరుభాషను మాట్లాడుచురనియు, ఏదోఒకమోస్తరు క్రైస్తవమతస్థులేననియుం జెప్పఁబడినది.

అబ్సీనియాదేశము తొల్లి చాలాబలవంతప్రదేశముగనుండి తర్వాత పటిమచెడి మూడు భాగములుగనై ముప్వురిపాలన పాలయ్యెను. ఆ ముప్వురిభూపతు లన్యోన్యకలహప్రియులై దేశారిష్టకరులై యుండ మూటినేకముచేయ వలసివచ్చెను. అవి మధ్యనున్న అంహారా సీమ- దీని రాజధాని గొండార్పురము; (డెంబియా సరస్సున కుత్తరమున) టీగ్రేసీమ- దీని రాజధాని ఏక్జమ్పురము; షోవాసీమ- దీని రాజధాని అంకోబార్పురము. ఇందు ఏక్జమ్పురములోని ప్రధాన స్థానమును అడోవాపురమునకు మార్చియున్నారు.

పిదప నీమూడురాజ్యము లేకముచేయబడి ఒకే భూపతిపరిపాలనయందుండినవి. దానితో మూడురాజ్యము లొకేరాజ్యమునందు మూడు ఖండములుగను రాజధానులు వానియందు ప్రధానపురములుగను చేయఁబడినవి. భూపతికి నీగస్ (రాజాధిరాజు) అని బిరుదముకలదు. ఈయనను ఎథియోపియా చక్రవర్తి యనుచున్నారు. ఇక్కాలమునందు అడిస్బేబాపురము రాజధానిగను,

ప్రధాన రాజ్యకార్యనిర్వహణ స్థానమునై యున్నది ఈదేశపు చక్రవర్తియగు మేనెలిక్ పరిపాలనమున ఇటలీవారీదేశమునకై కలహించి క్రీ. శ. ౧౮౯౬ లో అడ్వా యుద్ధమున పరాజితులైరి. ఈ దేశము లోనిదగు మస్సోవాపురము రేవుస్థలమై ఇటలీవారి వశమునందున్నది. క్రీ. శ. ౧౯౩౬ సంవత్సరమున ఇటలీవారు అబిసీనియాపై యుద్ధము ప్రకటించి, జయించి తమ సామ్రాజ్యములోఁ గలుపుకొనిరి.

**అబ్బే** (Abbey)-దీనిని కాన్వెంటు (Convent) అనియు నందురు. పండ్రెండుగురు క్రైస్తవ సన్యాసులుగాని, అంతమంది 'నన్సు' గాని ఉండుటకు లోపము రారాదని నియమము కలదట. అట్టిమఠము ఒక అబ్బాటు (Abbot) చే నిర్వహింపఁబడుచు స్వపరిపాలన నెరపుచుండుదానికి అబ్బే యని పేరు. ఇవి క్రీ. శ. ఆరవశతాబ్దకాలమునుండి ఏర్పడుట ప్రారంభమాయెను. ఇందు సాధారణముగ చతుష్కోణముల చౌకముచుట్టు కట్టఁబడిన తలుపులు లేని ప్రార్థనమందిరములు, ఒక చర్చి (దేవాలయము), ఉపన్యాసపుటిల్లు, వంటశాల, కర్మాగారము (Workshop), పరుండు ఇల్లు, ఫలహారములశాల, వైద్యశాల, నూతనాగతుల నివాసగృహము, మఠాధికారుల కార్యగృహము, సామానుల నిలవకొట్లు, ఉండెడివి. కొన్ని అబ్బేలయందొక పాఠశాల కూడ నుండుటకలదు.

**అభంగతాళము** – తాళములు చూడుఁడు.

**అభంగలీల** — తాళములు చూడుఁడు.

**అభయజాత గోత్రము**— జమదగ్నిబీథా ఉపగణము చూడుఁడు.

**అభయదాతా గోత్రము** జమదగ్ని బీథాఉపగణము చూడుఁడు.

**అభయుఁడు**– ధర్ముని కుమాళ్లలో నొకఁడు.

**అభ్యంతరాశ్చ సముదాయేఽవయవాః** చెట్టు కదలుచున్నదనిన దానికొమ్మలుకూడా కదలుచున్నవని వేరే చెప్పనక్కరయుండదు. సంస్కృతలోకోక్తి.

**అభ్యర్హితంపూర్వమ్ ఇతిన్యాయము**– ఎక్కువ యర్హతగలవి ముం దాదరింపఁబడవలెనని భావము.

**అభ్రకము** — ఆంగ్ల. Mica మరియు Talc. సం. అభ్రమ్, గిరిజామలమ్, నిర్మదం, బహుపత్రం. పాశ్చాత్య విద్వాంసులు మైకా, టాల్కను ఆంగ్లపదము లొకేవస్తువు కీపర్యాయపదములని తలంచినను పెక్కండ్రమతమున రెండును అభ్రకములోని భేదపదార్థముల కన్వయించెడిని. అభ్రకము తొలుత, తెల్లరంగుఁ గల జాతియు, నల్లరంగుగల జాతియు నని రెండు భేదజాతులుగ నున్నది. అందుఁ దెల్లజాతికి శ్వేతాభ్రకమనియు, నల్లజాతికిం గృష్ణాభ్రకమనియు నందురు. అందొకటి టాల్కు (Talc) అనియు, మైకాయనియు రెండుభేదములుగ నుండును. మైకా పొరలు పొరలుగ నుండునది. అది భూమియందుండుతఱి, రసాయన శాస్త్రసంబంధములగు మార్పులనంది, వేడులకుంగరగి, గట్టిపడి, ఘనీభవించి, స్లేటు పలకలవలె శిలత్వము నందియుండును. దానికి Mica Schist (Mica Slate) అనిపేరు. దీని నభ్రకశిల యందురు. లాటిన్భాషయందు మైకా (Mica) అని యందురు. మైకేర్ (Micare) అన మెరయుట లేక ప్రకాశించుట యనియర్థము. దానినుండియే

దీని కీపేరువచ్చినది. ఇది భూమినుండి త్రవ్వి యెత్తబడుఖనిజము. అనేకములగుపల్చనిపొరల కూడికయై యున్నది. అవి యద్దమువలె స్వచ్ఛతం గల్గి తళతళ మని మెరయును. మరియు వేడికిఁ జక్కగ నాగగలవుకాన Gas Lamps ల చిమ్నీలుగను, Boiler లలో Peep Holes గను వాడఁబడుచు, అద్దమునకుఁ బ్రత్యామ్నాయ పదార్థమై యున్నది. అభ్రకమునందింకొకవిశేషముకలదు. ఇది Non-conductor of Heat గాన విద్యుచ్ఛక్తియంత్రము(Electrical Apparatus) లలో నుపయోగింపఁబడుచున్నది. సైబేరియాదేశమున గవాక్షముల తలుపుల కద్దములకు మారుగా నభ్రకపురేకులు వాడఁబడుచున్నవని తెలిసెడిని. తొల్లింట రష్యాదేశపు యుద్ధనావల (Port Holes) రంధ్రములకు అభ్రకపురేకులు వాడుచుండిరట. ఇంక నభ్రకపురేకు లంటుకొని కరగి రాయిమైనది పలురూపములుగ దొరకెడిని. ఆరు, నాల్గు, ఎన్మిది, పలకలుగల కడ్డీలుగను, ఇంక ననేకాకారములుగను దొరకెడిని. వానిని, స్ఫటికము (Crystals) లనియెదరు.

ఇంక టాల్కు-ంగూర్చి వివరింతుము. ఇది Magnesium Silicate అనిపోల్చఁబడినది. ఇది స్వచ్ఛతంగల్గు రేకులుగను, నునుపైన పలకల కడ్డీలుగను దొరకును. ఒకప్పుడు టాల్క్‌స్లేటు పలకరాళ్ల యందునను, శానాపు రాతి (కఠినశిల) యందునను కలిసియుండుట యుంగలదు. బ్రిటీషు దీవులందు, కార్ని వాల్ కడనున్న లిజర్డునంటి బయలుదేరు స్లేటు పలకలలో నెక్కువభాగము Talc కలదు గాన వాటికి Talcky Slates అని పేరయ్యెను. అట్లే శానాపు రాళ్ల (Granite) యందు Talc కలిసియుండుట నారాళ్లను Talcoid Granite అనియు, Talcous Granite అనియు, Talcose Granite అనియు పేర్లుగలవం'దురు. అట్టివి విక్లో అనఁబడు తావుకడఁగలవు. ఇట్టి రాళ్ల యందుఁగల Talc ను Talcite అని వాడుచున్నారు. ఇవి ఆదేశమున Acid Baths, Sinks, Hearth- stones గా నుపయోగింపఁబడుచున్నవి. Talc అనునది ఫ్రెంచి భాషాపదము. తొలుత అరబ్బీపదమగు Talque నుండి పర్పడియెనట. Talc ను గుండచేసి తోళ్లకుఁ బదును వేయుదురు. రబ్బరుకుఁ బదునిచ్చుటయందు వాడుదురు. కొన్నియెడల Dry Lubricate గా నుపయోగించుటయుఁ గలదు. ఈ గుండను రంగులు, వార్ణిషులు చేయుటయందునను, సబ్బుచేయు పదార్థములందునను, కల్పి వాడుటయుంగలదు. అమెరికా సంయుక్త రాష్ట్రములనుండి యెక్కువ Talc త్రవ్వి యెత్తఁబడుచుండును. అది సబ్బురంగు గల్గి, తాకిన సబ్బుం దాకినటులనుండును. ఇంకను వెండివలె తెల్లని Talc ను, ఆకుపచ్చ రంగు Talc ను, తెలుపు ఆకుపచ్చలు కలిసిన రంగు Talc ను ఇందు భేదజాతులు.

Talc, Acids కు చెడక నిలచియుండునది. ఆల్కలీస్ (Alkalis) నకును చెడదు. ఇది మంచి Insulator అనగా Non-conductor of Heat గాన Electrical Apparatus లందు వాడుదురు. ఆయుర్వేద వైద్యశాస్త్రమున కృష్ణాభ్రకము శ్రేష్ఠమనియు, శ్వేతాభ్రక మధమజాతిదనియుం జెప్పఁబడినది. నూరు పుటములు వేయఁబడిన కృష్ణాభ్రక సింధూరము (ఎర్రబడిన

భస్మము) అనుపానవిశేషములచే ననేక రోగములు నివారించుననియు, త్రిదోష హారమై, స్వర్ణభస్మముచేయు గుణము నిచ్చుటయందు తక్కువగాదనియు చెప్పఁబడి నది. అభ్రకము సరిగా భస్మముగాకపోయి నను, పుటములు చాలకపోయినను పెక్కు దుర్గుణముల కాస్పదమగును. దానికి, ఉసిరి కాయరసము లేక ఉసిరికపప్పు నీళ్లతో నూరి తీసిన రసము విరుగుడులని చెప్పఁబడినది.

**అభావములు** (లేకఅభావచతుష్టయము)— అనగా నాలుగువిధములగు లేకుండుటలు. తర్కశాస్త్రమునఁ జెప్పఁబడినవి. ౧. ప్రాగ భావము-ఇప్పుడావస్తువుండినను లేకుండినను, ఒకప్పుడుండినను,దానియుత్పత్తికిఁ బూర్వమా వస్తువులేకుండుట ప్రాగభావ మనంబడును. ఉత్పత్తికి పూర్వమదిలేకుండుట ప్రాగభావ మని యెరుంగునది. ౨. ప్రధ్వంసాభావము- ఒకప్పుడొక వస్తువుయుండి, పిదప నాశనమై, ఇప్పుడు లేకుండుట ప్రధ్వంసాభావ మనఁ బడును. 3. అన్యోన్యాభావము - అనేక పదార్థములలో నొకవస్తువు వేరొక వస్తువు యందు లేకుండుట అన్యోన్యాభావ మనఁ బడును. ౪. అత్యంతాభావము- ఆపదార్థ మనంబడు వస్తు వసలే లేకుండుట (దాని యున్కి యసలే లేకుండుట) అత్యంతాభావ మనఁబడును.

**అభాస్వరులు** — భాస్వరగణము చూడుఁడు.

**అభ్యాగతి**—తనకు హితవగు రాకఁగలవాఁడు అభ్యాగతి. అనగా తనను బాధించుట మొదలగు నహితకార్యము లొనర్చుటకుఁ గాక, తనకు ప్రమోదముంగూర్చుట కేతెం చినవాఁ డభ్యాగతియని భావము. (అతిథి చూడుఁడు).

**అభ్యాసము కూసువిద్య** — అనగా అభ్యాసాతిశయమున విద్యయందు విశార దత్వము కలిగి దానిని చులకనగాఁ (కూసు విద్యగ) జేయునని భావము. (ఆంధ్రలోకోక్తి).

**అభ్యాసములేనివాఁడందల మెక్కితే అటూ ఇటూ ఊగినదట** — అభ్యా సములేని కార్యము చేయఁదలంచిన వక్ర మార్గముం బొందగలదని భావము. (ఆంధ్ర లోకోక్తి).

**అభ్యాసయోగములు మూడు** — యోగములు చూడుఁడు.

**అభ్యాసయోగములు నాలుగు** — యోగాభ్యాస మొనర్చువారికి చతుర్విధా భ్యాసములు యోగశాస్త్రమునం జెప్పఁ బడినవి. ౧. ప్రాకృతము లేక మంత్ర యోగము, ౨. వైకృతము లేక లయ యోగము, 3. కుంభకము లేక అఠయో గము, ౪. రాజయోగము (యోగములు చూడుఁడు).

**అభిఘాతజ్వరము** — విశేష దేహ ప్రయాసవలనఁ గల్గిన జ్వరము. దేహమునకు దెబ్బలు తగులుటవలన సంభవించినను సంభ వించును.

**అభిచారతంత్రము** (షట్ప్రయోగములు)- ఇది షడ్విధములు. ౧. మారణము, ౨. మోహనము (ముగ్ధులం జేయుట), 3. స్తంభనము (స్తంభింపఁజేసి వశపర్చు కొనుట, వాక్స్తంభనము,అవయవ స్తంభనము మొదలగునవి), ౪. విద్వేషణము (అన్యు లందు కలహముఁ గల్గించుట), ౫. ఉచ్చాట నము, ౬. వశీకరణము.

**అభిజిత్ నక్షత్రము** (బ్రహ్మానక్షత్రగోళము)- క్షత్రములు భారతీయులు గురించినవి చూడుఁడు.

**అభిజిత్తు** — అభిజిన్నక్షత్రమునకు బ్రహ్మ అధిదేవత. దీనికింకను అప్రకాశమనియు పర్యాయనామము కలదు. దీనింగూర్చి యేమియుం దెలియదు. అభిజిల్లగ్నము కూడ కలదని జెప్పఁబడినది. దీనినింకను అభిజిన్ముహూర్తమనియు నందురు. అభిజిన్ముహూర్తములు- ఉదయసంధ్యాకాలము, మధ్యాహ్నిక, పూర్వాహ్ణ, పరాహ్ణసంధికాలము, సాయంసంధ్యాకాలము లేక గోధూళికకాలము నని చెప్పంబడినది. ఈమూడుకాలములందు ప్రయాణాదులుజయప్రదములని చెప్పఁబడినది.

**అభిజిత్తు క్షత్రియుఁడు** — ఇది యొక నక్షత్రమునకుఁ పేరు. మరియు నభిజిత్తని పేరుగల యాదవక్షత్రియుఁ డొకఁడుగలఁడు. ఆతనికి విద్యోతుఁడనియుం బేరుకలదు. అతఁడు దుందుభియను నామాంతరముగల వృష్ణి కుమారుఁడు. కుమారునిపేరు ఆహుకుఁడు. ఇంకను అభిజిత్తను బేరుగల ముహూర్త మొకటిగలదు. అది మధ్యాహ్నము వేళను అనగా ౧౨ గంటలసమయము తెలిపెడిని.

**అభిజిత్ గోత్రము** — ఔతథ్య ఉపగణము చూడుఁడు.

**అభిధ** — లక్షణ చూడుఁడు.

**అభిధానచింతామణి** — జైనసిద్ధాంతమునకు నిఘంటువు. హేమచంద్రుఁడు కర్త.

**అభిధానరత్నమాల** — ఒక నిఘంటువు. హలాయుధుఁడు కర్త.

**అభినందన తాళము** — తాళములు చూడుఁడు.

**అభినందననాథుఁడు**— జైనతీర్థకరులలో నొకఁడు (తీర్థములుచూడుఁడు.) వీరి చిహ్నము మర్కటము. ఇక్ష్వాకువంశక్షత్రియుడు. తండ్రి శంబరరాజు, తల్లి సిద్ధార్థదేవి, జన్మస్థానమయోధ్య, పొడవు ౩౫౦ధనస్సులు (ధనస్సు మూడున్నర మూర), వర్ణము సువర్ణచ్ఛాయ, ఆయువు ఏబదిలక్షలు, గణధరసంఖ్య ౧౦౩, నిర్వాణస్థలము సుమేరుశిఖరము (శిఖరీజీ లేక ఆబు -అర్బుద పర్వతశిఖరము), తొమ్మిదిలక్షలకోట్ల సాగర్, అని వీరిం గూర్చి చెప్పఁబడినది.

**అభినయ (భరత) శాస్త్రము** — అభినయశాస్త్రము లేక భరతశాస్త్రమను పేరు సర్వసాధారణముగ ప్రచారమందున్నను, నిజమున నీశాస్త్రమునకు గంధర్వవేదమునందలి భావాధ్యాయమని పేరు శాస్త్రతః ఒప్పెడిని.

'గాం' అనిన గానమును 'ధర్వ' అన ధరించినవారు గాన, గాంధర్వు లనంబడుదురు. వారి సంబంధవిద్య గాంధర్వమని యర్థము. ఇది నృత్తము, గీతము, వాద్యము లనంబడు తౌర్యత్రిక నైపుణీవిశేషముం దెలుపు విద్యయని భావము. ఈవిద్యను గాంధర్వవేదమనియు, నిది సామవేదమున కుపవేదమనియు, శాస్త్రగ్రంథములందు వాడియున్నారు. గాంధర్వవేద మీశ్వరప్రోక్తమని చెప్పఁబడినది.

గాంధర్వవేదమునందు భావాధ్యాయము, రాగాధ్యాయము, తాళాధ్యాయము నని మూడధ్యాయములు కలవు. అందు భావాధ్యాయమున కభినయశాస్త్రమనియు, నాట్యశాస్త్రమనియు, భరతశాస్త్రమనియు వ్యవహారనామములు ప్రచారమునందియున్నవి.

అదియే ప్రస్తుత మీ వ్యాసమున వ్రాయఁబడునది.

ఇంక రాగాధ్యాయమునకు సంగీతశాస్త్రమని వ్యవహారికనామము. మరియుఁ బెక్కండ్రు రాగాధ్యాయ తాళాధ్యాయములు కలిసి సంగీతశాస్త్ర మనియెదరు. ఎవరెట్లన్నను, భావ, రాగ, తాళాధ్యాయయుతమగు నీశాస్త్రము తొలుదొలుత సర్వవిద్యాధిపతి యగు పరమేశ్వరప్రోక్తమై వెలువడి, రాను రాను భావము ప్రకటించుటయే (పనిగా) వినియోగముగా గల నాటకములందు (నాటకములు:-౧. నాటకము, ౨. ప్రకరణము, ౩. భాణము, ౪. ప్రహసనము, ౫. డిమము, ౬. వ్యాయోగము, ౭. సమవాకారము, ౮. వీథి, ౯. అంకము, ౧౦. ఈహామృగము.) ఉపయోగమున ప్రధానాంగములుగ నెన్నుకొనఁబడినవి. ఇది బహుశః నాటకరచనాప్రారంభకాలమున నీఎన్నిక జరిగియుండనోపు. నేటికిని నాటక ప్రదర్శనమునకు భావప్రకటనయు, రాగ ప్రకటన (రాగయుక్తమని భావము) యు, తాళ నియతియు, ప్రధానాంగములుగనే యున్నవి.

భావాధ్యాయమునందు భావమును వెల్లడించుట ప్రధానముగ గైకొనఁబడినది. తా వచించుదానియొక్క-భావమని ఇందలియర్థము. దీనికభినయమనియుఁ బేరుకలదు. అభినయన = ఎదుటను నయము, యనపొందించు (చూచు వారలకు, వినువారలకు సూచించి దెల్పు)ట యని భావము. ఎదుటివారలకుఁ దెలుపుట యని ఎరుంగునది. ఇంకనుకొందరు భావప్రకటనము అభినయమనియు, వ్యంజకమనియు ద్వివిధముగ విభజించిరి. వ్యంజించుట యన శోభింపఁజేయుట యని యర్థము.

నందికేశ్వర విరచితమగు భరతార్ణవమను నభినయశాస్త్రమందు దీనింగూర్చి సమగ్రముగ వివరింపఁబడినది. ఇంకను శృంగార తిలకము, రసకలిక, రసమాలిక, రసపదఘటిక మొదలగు కొన్ని గ్రంథములునుకలవు. వీని మేరకు భావప్రకటనకు కావ్యములు రూపక (నాటక) ములు అనుద్వివిధగ్రంథములే సాధకములు.

అభినయము- ౧. ఆంగికము, ౨. వాచికము, ౩. ఆహార్యము, ౪. సాత్త్వికము అని చతుర్విధములు:—

౧. ఆంగికము- అంగములచే నొనర్చినది; కనుబొమలు, చేతులు మొదలగు అంగములతోఁజూపి ప్రకటించునది. ౨. వాచికము- గేయములగు (పాడుచున్న) వాక్యమునందు, అర్హమైన కాకువు మొదలగు స్వరభేదముల నుపయోగించి భావము నెరిగించు ప్రకటనము. ౩. ఆహార్యము - శరీరాభరణాది పదార్థ వితతితో, వానినుపయోగించుచు, భావము నెరింగించుప్రకటనము. ౪. సాత్త్వికము- స్వేదము, స్తంభము, రోమాంచ, స్వరభంగ, వేపథు, వైవర్ణ్యా, శ్రు, మూర్ఛలను నెన్మిదివగ వద్ధికలచే భావము నెరింగించుచు ప్రకటించుట.

మరియు నీయభినయమున పదముయొక్క అర్థము నభినయించుతరి నాట్యమనియు, వాక్యముయొక్క అర్థము నభినయించుతరి నృత్యమనియు, అర్థము ననుసరింపక మనోహరమైన తాళముతోఁగూడి, స్వరజతుల ననుసరించి యడుగులువేయు గాత్రవిక్షేపము నృత్తమనియు వాడఁబడుచుండును. ఇట్టి నృత్తమును పురుషులు కఠినప్రయోగముగ నాడుతరి తాండవమనియు, స్త్రీ సుకుమారముగ నాడుతరి లాస్యమనియుఁ బేరులు

కలవు. నాట్యమునం దుపయోగించు శరీరాంగములు ౧౭. వానింగూర్చి వివరింపఁబడును.

౧. శిరస్సు - ఈ అవయవముచే నభినయించు క్రియలు ౧౭ కలవు. ౧. ధుతము, ౨. విధుతము, ౩. ఆధూతము, ౪. అంచితము, ౫. కంపితము, ౬. ఆకంపితము, ౭. పరావృత్తము, ౮. అవధూతము, ౯. అధోముఖము, ౧౦. నికుంచితము, ౧౧. ఉత్క్షిప్తము ౧౨. లోలితము, ౧౩. పరివాహితము, ౧౪. సమము, ౧౫. ఆలోలితము, ౧౬. ఉద్వాహితము, ౧౭. సౌందర్యము.

౨. దృష్టిక్రియలు - దృష్టిచేనభినయించు క్రియలు నాల్గు తెరంగులు. అవి ౧. దృష్టి, ౨. రసదృష్టులు, ౩. రసస్థాయిభావజనిత దృష్టులు, ౪. సంచారిభావజనితదృష్టులు.

౧. దృష్టి క్రియలు ౧౮ - ౧. సమదృష్టి, ౨. ఆలోకితదృష్టి, ౩. సాచిదృష్టి, ౪. ప్రలోకితదృష్టి, ౫. ఉల్లోకితదృష్టి, ౬. అవలోకితదృష్టి, ౭. అనువృత్తదృష్టి, ౮. విలోకితదృష్టి, ౯. పార్శ్వగతదృష్టి, ౧౦. యాతదృష్టి, ౧౧. నిమీలితదృష్టి, ౧౨. అర్ధనిమీలితదృష్టి, ౧౩. ఉన్మీలితదృష్టి, ౧౪. అధస్థలదృష్టి, ౧౫. . అంతర్మీలితదృష్టి, ౧౭. ఊర్ధ ష్టి, ౧౮. వ్యావర్తదృష్టి.

౨. రసదృష్టులు ఎన్మిది విధములు - ౧. శాంతదృష్టి, ౨. కరుణదృష్టి, ౩. హాస్యదృష్టి, ౪. రౌద్రదృష్టి, ౫. వీరదృష్టి, ౬. , ౭. ష్టి. ౮ అద్భుతదృష్టి.

౩. రసస్థాయీభావజనితదృష్టులుఎన్మిది - ౧. స్నిగ్ధదృష్టి, ౨. హృష్టదృష్టి, ౩. దీనదృష్టి, ౪. క్రుద్ధదృష్టి, ౫. దృప్తదృష్టి, ౬. సభయదృష్టి, ౭. జుగుప్సదృష్టి, ౮. విసి ట

౪. సంచారిభావజనితదృష్టులు ఇరువది - ౧. శూన్యదృష్టి, ౨. మలినదృష్టి, ౩. ౩. శ్రాంతదృష్టి, ౪. లజ్జాదృష్టి, ౫. శంకితదృష్టి, ౬. విషణ్ణదృష్టి, ౭. లలితదృష్టి, ౮. ముకుళదృష్టి, ౯. అర్ధముకుళదృష్టి ౧౦. గ్లానదృష్టి, ౧౧. జింహాదృష్టి, ౧౨. కుంచితదృష్టి, ౧౩. ృష్టి, ౧౪. అభితప్తదృష్టి, ౧౫. అకేకరదృష్టి, ౧౬. వికాసదృష్టి, ౧౭. విభ్రాంతదృష్టి, ౧౮. విప్లుతదృష్టి, ౧౯. త్రస్తదృష్టి, ౨౦. మదిరదృష్టి.

౩. తారలు (తారాక్రియలు)— కంటిలో నల్లగుడ్డుచే నభినయించు క్రియలు ౯ - ౧. వేపనము (కంపనము), ౨. చలనము (కదలుట), ౩. పాతము (పడుట), ౪. భ్రమణము ౫. ప్రవేశనము, ౬. నివర్తనము, ౭. నిష్క్రామము, ౮. సముద్వృత్తము, ౯. ప్రాకృతము.

౪. పుట (కనురెప్ప) - కంటిరెప్పలతో నభినయించు క్రియలు తొమ్మిది- ౧. వివర్తితము, ౨. ఉన్మేషము, ౩. పిహితము, ౪. కుంచితము, ౫. సమము, ౬. పితాళితము, ౭. స్ఫురితము, ౮. నిమేషము, ౯. ప్రసృతము.

౫. భ్రూ (కనుబొమలు) క్రియలు - కనుబొమలతో నభినయించు క్రియలు ౭:— ౧. భృకుటి, ౨. నికుంచితము, ౩. రేచితము ౪. పాతనము, ౫. ఉత్క్షేపము, ౬. సహజము, ౭. చతురము.

౬. నాశికము (ముక్కు)- ముక్కుతో నభినయించు క్రియలు ఆరు:- ౧. స్వాభా

వికి, ౨. నత, ౩. మందము, ౪. సోచ్ఛ్వాసము, ౫. నికూణితము, ౬. వికృష్టము.

**౭.** గండములు (చెక్కిళ్లు)- గండస్థలములతో నభినయించు క్రియలు ఆరు— ౧. కంపితము, ౨. కుంచితము, ౩. పూర్ణము, ౪. క్షామము, ౫. ఫుల్లము, ౬. సమము.

**౮.** అధరము — అధరముతో నభినయించు క్రియలు ఆరు:- ౧. వివర్తితము, ౨. కంపితము, ౩. విసృష్టము, ౪. వినిగూహితము, ౫. సందష్టకము, ౬. సముద్గకము.

**౯.** చుబుకము (గడ్డము)- చుబుకముతో నభినయించు క్రియలు ఎన్మిది:- ౧. వ్యాదీర్ణము, ౨. శ్వశితము, ౩. వక్రము, ౪. సంహతము, ౫. చలసంహతము, ౬. స్ఫురితము, ౭. లలితము, ౮. లోలము.

**౧౦.** కంఠము- కంఠముతో నభినయించి చూపు క్రియలు నాలుగు- ౧. సుందరీ కంఠము, ౨. తిర్యగీనకంఠము, ౩. పరివర్తిత కంఠము, ౪. ప్రకంపితకంఠము.

**౧౧.** ముఖక్రియలు - ముఖముతో నభినయించి చూపు క్రియలు ఆరు- ౧. భుగ్న ముఖము, ౨. వ్యాభుగ్నముఖము, ౩. ఉద్వాహిముఖము, ౪. విధుతముఖము, ౫. వివృత్త ముఖము, ౬. వినివృత్తముఖము.

**౧౨.** హస్తము (చేయి) - హస్తముతో నభినయించి చూపు క్రియలు పెక్కులుకలవు. అందు ప్రధానములు ఐదుకలవు. మరియు నీయైదింటి మతాంతరభేదము లైదుకలవు. వానిని వివరింతుము.

౧. బాహుప్రచారములు ౧౦ -౧. ఊర్ధ్వ ప్రచారము, ౨. అధోముఖము, ౩. తిర్యక్ప్రచారము, ౪. అపవిద్ధప్రచారము, ౫. సారితప్రచారము, ౬. అంచితప్రచారము, ౭. మండలగతిప్రచారము, ౮. స్వస్తిక, ౯. ఉద్వేష్టితప్రచారము, ౧౦ పృష్ఠానుసారి.

౨. హస్తప్రచారములు ౧౫- ౧. ఉత్తాన ప్రచారము, ౨. అధస్తలప్రచారము, ౩. పార్శ్వతలప్రచారము, ౪. అగ్రస్థలప్రచారము, ౫. స్వసమ్ముఖతలము, ౬. ఊర్ధ్వముఖము, ౭. అధోముఖము, ౮. పరాఙ్ముఖము, ౯. సమ్ముఖము, ౧౦. పార్శ్వతో ముఖము, ౧౧. ఊర్ధ్వగప్రచారము, ౧౨. అధోగతప్రచారము, ౧౩. పార్శ్వగతప్రచారము, ౧౪. అగ్రగప్రచారము, ౧౫. సముఖాగతము.

౩. హస్తకరణములు ౪ - ౧. అవేష్టిత కరణము, ౨. ఉద్వేష్టితకరణము, ౩. వ్యావర్తితకరణము, ౪. పరివర్తితకరణము.

౪. హస్తక్షేత్రములు-ఉత్తమము, మధ్యమము, అధమము అని త్రివిధములు- ౧. ఉత్తమక్షేత్రములు మూడు- ౧. లలాటము, ౨. భుజమధ్యము, ౩. మధ్యము (నడుము); ౨. మధ్యమక్షేత్రములు ఐదు- ౧. కపోలము, ౨. అధరము, ౩. పృష్ఠము, ౪. కటి, ౫. ఊరువులు; ౩. అధమక్షేత్రములు ఆరు- ౧. నాభి, ౨. శ్రవణము, ౩. స్తనాగ్రము, ౪. మణిబంధము, ౫. హనువు (చెక్కిలి మీదిభాగము), ౬. కంఠము.

౫. హస్తక్రియలు ౨౦- ౧. విసర్గము, ౨. ధూనము, ౩. రక్షణము, ౪. సంశ్లేషణము, ౫. మోక్షణము, ౬. విక్షేపము, ౭. ఆందోళనము, ౮. నిగ్రహము, ౯. పరి

గ్రహాము, ౧౦. ఆకర్షణము, ౧౧. వికర్షణము, ౧౨. వియోగోత్కర్షణము, ౧౩. తాడనము, ౧౪. మోదనము, ౧౫. భేదనము, ౧౬. ఛేదనము, ౧౭. స్ఫోటనము, ౧౮. ఆహ్వానము, ౧౯. తర్జనము, ౨౦. తోదనము.

ఈ హస్తముతో నభినయించు క్రియలగు బాహుప్రచార క్రియలు, హస్తప్రచార క్రియలు, హస్తకరణములు, హస్తక్షేత్రములు అను నైదింటి మతాంతరముగ వేరు గ్రంథములందు వేరుగ నైదువివరింపఁబడినవి. వానిని వివరింతుము.

౧. మతాంతరహస్తక్షేత్రములు ౧౩ (పదమూడు) - ౧. ఉభయపార్శ్వములు, ౨. అగ్రము, ౩. పృష్ఠభాగము, ౪. ఊర్ధ్వము, ౫. అధోభాగము, ౬. లలాటము, ౭. శ్రవణము, ౮. స్కన్ధము, ౯. వక్షము, ౧౦. నాభి, ౧౧. కటి, ౧౨. శిరము, ౧౩. ఊరుద్వయము.

౨. మతాంతర సంయుత (కలుపఁబడిన లేక మార్పఁబడిన లేక చేర్పఁబడిన) హస్తములు ౩౨- ౧. పుష్పపుట హస్తములు, ౨. చతురిశ్రము, ౩. స్వస్తికచ్ఛదము, ౪. కర్తరీస్వస్తికము, ౫. అవహిత్థము, ౬. వర్ధమానము, ౭. పతాకస్వస్తికము, ౮. ఉత్తానవంచితము, ౯. కలశము, ౧౦. పక్షవంచితము, ౧౧. మిత్రోత్సంగము, ౧౨. ఉత్సంగము, ౧౩. తిలకము, ౧౪. నాగబంధము, ౧౫. వైష్ణవము, ౧౬. అంజలి, ౧౭. శకటము, ౧౮. శంఖము, ౧౯. చక్రము, ౨౦. సంపుటము, ౨౧. కర్కటము, ౨౨. కటకవర్ధమానము, ౨౩. గజదంతము, ౨౪. నిషిద్ధము, ౨౫. భేరుండము, ౨౬. ఖట్వము, ౨౭. కీలకము, ౨౮. మంజులము, ౨౯. వల్లభాయితము, ౩౦. రతామోదము, ౩౧. శివలింగ హస్తము ౩౨. డోలహస్తము.

౩. మతాంతరఅసంయుతహస్తములు౪౫. ౧. పతాకహస్తము, ౨. త్రిపతాకము, ౩. అర్ధపతాకము, ౪. కర్తరీముఖము, ౫. మయూరాస్యము, ౬. అర్ధచంద్రహస్తము, ౭. చంద్రకళాహస్తము, ౮. అరాలహస్తము, ౯. శుకతుండము, ౧౦. ముష్టి, ౧౧. శిఖరము, ౧౨. కపిద్థము, ౧౩. కటకాముఖము, ౧౪. సూచీముఖము, ౧౫. అర్ధసూచీముఖము, ౧౬. పద్మకోశము, ౧౭. బాణహస్తము, ౧౮. సర్పశిరము, ౧౯. చలసర్పశిరము, ౨౦. సర్పచతురము, ౨౧. మృగశీర్షము, ౨౨. సింహముఖము, ౨౩. లాంగూలము, ౨౪. అలపల్లవము, ౨౫. చతురము, ౨౬. ఖండచతురము, ౨౭. భ్రమరము, ౨౮. హంసాస్యహస్తము, ౨౯. హంసపక్షహస్తము, ౩౦. సందంశ హస్తము, ౩౧. ముకుళహస్తము, ౩౨. ఊర్ణనాభము, ౩౩. తామ్రచూడము, ౩౪. మణిహస్తము, ౩౫. గజతుండహస్తము, ౩౬. త్రిశూలహస్తము, ౩౭. ఖంజహస్తము, ౩౮. కపిలహస్తము, ౩౯. వంశాలహస్తము, ౪౦. సాంగకహస్తము, ౪౧. స్వర్ణరంజకహస్తము, ౪౨. యష్టికహస్తము, ౪౩. స్వస్తికహస్తము, ౪౪. విరళహస్తము, ౪౫. రాజమండలము.

౪. మతాంతరహస్తప్రాణములు ౧౨ - ౧. ప్రసారణము, ౨. కుంచితము, ౩. రేచితము, ౪. పుంఖితము, ౫. అపవేష్టితము,

౬. ప్రేరితము, ౭. ఉద్వేష్టితము, ౮. వ్యావర్తకము, ౯. పరివర్తము, ౧౦. సంకేతము, ౧౧. చిహ్నము, ౧౨. పదార్థటీక.

౫. మతాంతర నృత్తహస్తములు ౨౯ - ౧. ఉద్ధృతము, ౨. తలముఖము, ౩. విప్రకీర్ణము, ౪. గజదంతము, ౫. అరాలకటకాముఖము, ౬. అవిద్ధవక్త్రము, ౭. సూచీవిద్ధము, ౮. రేచితము, ౯. అర్ధరేచితము, ౧౦. పల్లవము, ౧౧. నితంబము, ౧౨. కేశబంధము, ౧౩. లతాహస్తము, ౧౪. కరిహస్తము, ౧౫. దండపక్షము, ౧౬. ఊర్ధ్వమండలము, ౧౭. పార్శ్వమండలము, ౧౮. ఉరోమండలము, ౧౯. నలినీపద్మకోశము, ౨౦. ఉరఃపార్శ్వమండలము, ౨౧. కపోతము, ౨౨. మకరహస్తము, ౨౩. జ్ఞానహస్తము, ౨౪. వరదాభయము, ౨౫. ముద్రాహస్తము, ౨౬. గరుడపక్షము, ౨౭. ముష్టిస్వస్తికము, ౨౮. ముకుళస్వస్తికము, ౨౯. ప్రయుక్తాల పల్లవహస్తము.

**౧౩.** వక్షము- వక్షముతో నభినయించు క్రియలు ఐదు. (వక్షః క్రియలు) - ౧. సమము, ౨. ఉద్వాహితము, ౩. నిభుగ్నము, ౪. ఆభుగ్నము, ౫. ప్రకంపితము.

**౧౪.** జఠరము (కడుపు)తో నభినయించు క్రియలు మూడు-౧. ఖల్వము, ౨. క్షామము, ౩. పూర్ణము.

**౧౫.** పార్శ్వము (ప్రక్క)-పార్శ్వముతో నభినయించు క్రియలు ౫- ౧. సమున్నతము, ౨. నతము, ౩. ప్రసారితము, ౪. వినివర్తితము, ౫. అపసృతము.

**౧౬.** కటి (మొల)-కటిస్థానముతో నభినయించగల క్రియలు ౫- ౧. వివృత్తము, ౨. రేచితము, ౩. భిన్నము, ౪. కంపితము, ౫. ఉద్వాహితము.

**౧౭.** ఊరు స్థానముచే నభినయించగల క్రియలు ౫- ౧. వలితము, ౨. కంపితము, ౩. స్తంభితము, ౪. ఉద్వర్తితము, ౫. నివర్తితము.

**౧౮.** జంఘ (పిక్క) స్థానముచే నభినయించగల క్రియలు ౫- ౧. ఉద్వాహితము, ౨. నతము, ౩. క్షిప్తము, ౪. పరివృత్తము, ౫. ఆవర్తితము.

**౧౯.** చరణ (పాదము) స్థానముచే నభినయించు క్రియలు ౬- ౧. అంచితము, ౨. కుంచితము, ౩. సూచి, ౪. అగ్రతల సంచరము, ౫. ఉద్ఘట్టితము, ౬. సమము.

ఈపందొమ్మిది యవయవ భేదములచే నభినయించు క్రియలే అభినయశాస్త్రమున ప్రధాన క్రియలు. ఇంకను ఈశాస్త్రజ్ఞానమునకు ౩౦ స్థానకములు, ౧౬ భూచారులు, ౧౬ ఆకాశచారులు, ౧౦ భౌమమండలములు, ౧౦ ఆకాశమండలములు, ౧౦౮ కరణాభినయములుకూడ నెరుంగదగినవికలవు. ఇవియన్నియు నభినయనీయములేయగును. వానిని వివరింతుము.

స్థానకములు ౩౦- ఇవి పుంస్థానకములు౬ అనియు, స్త్రీస్థానకములు ౩ అనియు, తక్కినవి ౨౧ ఏకవింశతిస్థానకములనియు పిలువఁబడుచుండును. ౧. పుంస్థానకములు ౬- ౧. వైష్ణవము, ౨. సమపాదము, ౩. వైశాఖము, ౪. మండలము, ౫. ఆలీఢము, ౬. ప్రత్యాలీఢము.

౨. స్త్రీస్థానకములు ౩- ౧. ఆయతము, ౨. అశ్వక్రాంతము, ౩. అవహిత్థము.

తక్కిన ఏకవింశతిస్థానకములు ౨౧- ౧. సంహతము, ౨. సమపాదము, ౩. స్వస్తికము, ౪. వర్ధమానము, ౫. నంధ్యావర్తము, ౬. చతురశ్రము, ౭. పార్ష్ణివిద్ధము, ౮. పార్ష్ణిపార్శ్వగతము, ౯. ఏకపార్శ్వగతము, ౧౦. ఏకజానుకృతము, ౧౧. పరావృత్తము, ౧౨. పృష్ఠోత్తానతలము, ౧౩. ఏకపాదము, ౧౪. బ్రాహ్మము, ౧౫. వైష్ణవము, ౧౬. శైవము, ౧౭. గారుడము, ౧౮. వృషభాసనము, ౧౯. సమసూచికము, ౨౦. విషమసూచికము, ౨౧. చండసూచికము.

భూచారులు ౧౬- ౧. సమపాదము, ౨. అర్ధగతి, ౩. స్థిరావర్తము, ౪. త్రయూషితము, ౫. ఊరూవృత్తము, ౬. తము, ౭. బద్ధము, ౮. జనితము, ౯. ఉచ్ఛండితము, ౧౦. స్యందితము, ౧౧ శకటాస్యము, ౧౨. అవస్యందితము, ౧౩. సమాసాదితమత్తల్లి, ౧౪. మత్తల్లీ, ౧౫. ఏకాకి, ౧౬. క్రీడితము.

ఆకాశచారులు ౧౬ - ౧. అతిక్రాంతము, ౨. ఊర్ధ్వజానువు, ౩. సూచి, ౪. నూపురపాదికము, ౫. విద్యుద్భ్రాంతము, ౬. దండము ౭. భుజంగత్రాసితము, ౮. డోలాపాదము, ౯. ఉద్వృత్తము, ౧౦. అక్షిప్తము, ౧౧. మృగప్లుతము, ౧౨. పార్శ్వక్రాంతము, ౧౩. అపక్రాంతము, ౧౪. భ్రమరి, ౧౫. అవిద్ధము, ౧౬. ఆలాతము.

భౌమమండలములు ౧౦ - ౧. భ్రమరము, ౨. శకటాస్యము, ౩. సమము, ౪. స్ఫురితము, ౫. అధ్యర్ధము, ౬. పుట్టకుట్టము, ౭. ఏకక్రీడితకము, ౮. అస్కందితము, ౯. ఆవర్తము, ౧౦. అధోగతము.

ఆకాశమండలములు ౧౦- ౧. అతిక్రాంతము, ౨. దండపాదము, ౩. సూచీవిద్ధము, ౪. అలాతకము, ౫. విచిత్రము, పిహితము, ౭. క్రాంతము, ౮. వలితసంచరము, ౯. వామావిద్ధము, ౧౦. వలితము.

కరణములు ౧౦౮- ౧. తలపుష్పపుటము, ౨. లీనము, ౩. వర్తితము, ౪. వలితము, ౫. మండలస్వస్తికము, ౬. వక్షస్వస్తికము, ౭. అక్షిప్తరేచితము, ౮. అర్ధస్వస్తికము, ౯. పృష్ఠస్వస్తికము, ౧౦. దిక్స్వస్తికము, ౧౧. స్వస్తికము, ౧౨. అంచితము, ౧౩. అపవిద్ధము, ౧౪. సమనఖము, ౧౫. ఉన్మత్తము, ౧౬. స్వస్తికరేచితము, ౧౭. నికుట్టనము, ౧౮. అర్ధనికుట్టనము, ౧౯. కటిచ్ఛన్నము, ౨౦. కటీసమము, ౨౧. కటీసమము, ౨౨. భుజంగత్రాసితము, ౨౩. ఆలాతము, ౨౪. ఆక్షిప్తము, ౨౫. నికుంచితము, ౨౬. ఘూర్ణితము, ౨౭. ఊర్ధ్వజానువు, ౨౮. అర్ధరేచితము, ౨౯. మత్తల్లీ, ౩౦. అర్ధమత్తల్లీ, ౩౧. రేచకనికృష్టకము, ౩౨. లలితము, ౩౩. వలితము, ౩౪. దండపక్షము, ౩౫. పాదాపవిద్ధకము, ౩౬. నూపురము, ౩౭. భ్రమరము, ౩౮. భిన్నము, ౩౯. భుజంగత్రస్తరేచితము, ౪౦. లతావృశ్చికము, ౪౧. ఆక్షిప్తము, ౪౨. అర్గళము, ౪౩. తలవిలాసితము, ౪౪. లలాటతిలకము, ౪౫. పార్శ్వవికుట్టనము, ౪౬. చక్రమండలము, ౪౭. ఉరోమండలము, ౪౮. ఆవర్తనము, ౪౯. కుంచితము, ౫౦. డోలాపాదము, ౫౧. వివృత్తము, ౫౨. వినివృత్తము, ౫౩. పార్శ్వక్రాంతము, ౫౪. నిసుంభితము, ౫౫. విద్యుద్భ్రాంతము, ౫౬. భుజంగాంచితము, ౫౭. అర్ధరేచితము,

౫౮. చతురము, ౫౯. కటిభ్రాంతము, ౬౦. వ్యంసితము, ౬౧. చక్రాంతము, ౬౨. వైశాఖరేచితము, ౬౩. వృశ్చికకుట్టితము, ౬౪. వృశ్చికరేచితము, ౬౫. అతిక్రాంతము ౬౬. విక్షిప్తము ౬౭. వివర్తితము ౬౮. గజక్రీడితము, ౬౯. గండసూచితము, ౭౦. గరుడప్లుతము, ౭౧. తలసంస్ఫోటితము, ౭౨. పార్శ్వజానువు, ౭౩. గృధ్రావలీనకము, ౭౪. సూచి, ౭౫. అర్ధసూచి, ౭౬. సూచీవిద్ధము, ౭౭. హరిణప్లుతము, ౭౮. పరివృత్తము, ౭౯. దండపాదము, ౮౦. మయూరలలితము, ౮౧. ప్రేంఖోలితము, ౮౨. సన్నతము, ౮౩. సర్పితము, ౮౪. కరిహస్తకము, ౮౫. ప్రసర్పితము, ౮౬. అపక్రాంతము, ౮౭. నితంబము, ౮౮. స్ఖలితము, ౮౯. సింహవిక్రీడితము, ౯౦. సింహాకర్షితము, ౯౧. అవహిద్ధకము, ౯౨. నివేశము, ౯౩. అలకాక్రీడితము, ౯౪. జనితము, ౯౫. ఉపసృతము, ౯౬. తలసంఘటితము, ౯౭. ఉద్వృత్తము, ౯౮. విష్ణుక్రాంతము, ౯౯. లోలితము, ౧౦౦. మదస్ఖలితము, ౧౦౧. సంభ్రాంతము, ౧౦౨. విష్కంభము, ౧౦౩. ఉద్ఘట్టితము, ౧౦౪. శకటాస్యము, ౧౦౫. ఊరువృత్తము, ౧౦౬. వృషభక్రీడితము, ౧౦౭. నాగాపసర్పితము, ౧౦౮. గంగావతరణము.

పాదక్రియలు (పాదములచే వేయఁబడు అడుగులకు) ఈశాస్త్రమున అడుగులనియు, అడవలనియు, గంతులనియు, సాధారణముగ నెమ్మదిగ వేయఁబడుచున్నప్పుడు వాడుకపేరులుకలవు. ఆ యడుగులే త్వరితముగ వేయఁబడుతరి కుప్పీలనియు, పేరెములనియు, అల్లీలనియు, మొగ్గలు, మెరవములనియు వాడుకపేరులచే బరగుచుండును. పాదముల నెత్తి వేయుట, ఎగురుటలకు చారియనియు, మండలమనియు, స్థానకములనియుం బేర్లుకలవు.

శిరము మొదలు పాదపర్యంతావయవముల అంగోపాంగ ప్రత్యంగాభినయ క్రియలన్నియు తాండవమనియు, లాస్యములనియు ద్వివిధ భేదము లని మున్నె వివరింపఁబడియెయున్నది. అందొక్కొకటి - ౧. మార్గము, ౨. కుండలి, ౩. ఉద్ధతము, ౪. విలాసము, ౫. దేశీయము, ౬. బహురూపము అను షడ్విధభేదములం బరగి పండ్రెండు తెరంగులెనవి. మరియు నీ పండ్రెండును ఒక్కొకటి- ౧. భానుడము, ౨. శుద్ధపద్ధతి, ౩. బహురూపము, ౪. దండలాసకము, ౫. ప్రేంఖణపద్ధతి, ౬. ప్రేరణపద్ధతి, ౭. కుండలీకృత్యము, ౯. భాండికము, రాసక్రీడ, ౧౦. హల్లీసకము, ౧౧. చిత్రపద్ధతి, ౧౨. దేశ్యపద్ధతి, ౧౩. చర్చరి, ౧౪. కందుకనృత్యము, ౧౫. చారీనృత్యము, ౧౬. కోలాటము అని పదునారు తెరంగులుగ నేర్పడి మొత్తము (౧౨ X ౧౬ = ) ౧౯౨ విధములుగ భేదములై తనరారెడిని.

**అభినవకాళిదాసు** — ఈతనికిది బిరుద నామము. ఈతనిపేరు జగన్నాథమిశ్రుఁడు. కాళిదాసు (సంస్కృతకవి) చూడుఁడు.

**అభినవగుప్తాచార్యుఁడు** (మహామాహేశ్వరాచార్యుఁడు) — ఈ మహనీయుఁడు కాశ్మీరపండితుఁడు. శివభక్తుఁడు. ప్రత్యభిజ్ఞ శైవమతమునకుఁ గర్త. ప్రత్యభిజ్ఞ యన తానే (పరమేశ్వరుండగు) శివుఁడని తెలిసికొనుట కర్థము. జగత్తు శివస్వరూపమైనను శివునుండి వేరుపదార్థమని యాయనమతము.

మాయ యనునది ఈతని మతమున పదార్థమే. దాని సంబంధమున ప్రత్యభిజ్ఞా యుండక మరుగుపడుననియు, జ్ఞానోదయ మగుటతో, బంధవిముక్తి కల్గుననియు, నతఁడు ముక్తుండనియు నీతనిమతము. ఈ మహాత్ముని అందరు మహామహేశ్వరాచార్యుం డనుచుండువారట.

**అభిన్యాస సన్నిపాతము** — సన్నిపాత దోషము చూడుఁడు.

**అభిభూతిభయాదసూనతః సుఖము జ్ఝన్తి నదామమానినః**— ఇది సంస్కృత లోకోక్తి. మానవంతులు అవమానమునుండి తప్పించుకొనుటకు ప్రాణమును సౌఖ్యమును కూడ వదలిపెట్టెదరని భావము.

**అభిమంచకులగోత్రము** – ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు). అభిమంచకులగోత్రము, ఏకాక్షేయగోత్రము(౨౬),సంస్కృతగోత్రము, యాజ్ఞవల్క్యస, యాజ్ఞవల్క్యగణము, ఆపస్తంభసూత్రము, యజుశ్శాఖ, ప్రమాణగ్రంథ మాద్యప్రవరఖండ, ఆయుతేశుఁడు దేవత, (భార్య) అమృతాంబ, మేరువు తపస్థానము, అమృతాంబోనిధి తటాకము, జపము లక్ష, దీపములు౧౬, క్షేత్రసంఖ్య ౩౦, షోడశమహాదానములు దానము. నెలికాయ వర్జనీయము.

**అభిమన్యు ఖేరా (అమీన్)** — కురుక్షేత్రమునందు అమీన్ దిబ్బకలదు. అభిమన్యుని దిబ్బయని యర్థము. ఇచట నభిమన్యుఁడు మృతినందెనట. మరియు నీతావ్యుమ చక్రాభ్యువనియు ననుటకలదు. అనగా కేంద్ర సైన్యస్థానమని యర్థము. మరియు నిచటనే అదితి తపంబొనర్చి సంతానముఁగనెనట. ఈ ఉన్నతస్థలి ఉత్తరదక్షిణములకు రెండువేల అడుగులును తూర్పుపడమరలకు ఎన్మిది వందల అడుగులును ఉండును. ఇరువది యైదు మొదలు ముప్పది యడుగులవరకు నెత్తుకలది. ఈ దిబ్బపై అదితి దేవాలయమును, దానింజుట్టి గౌడబ్రాహ్మణులు వసించిన అమీన్ అను గ్రామమునుకలదు. దీనికిం దూర్పుగా సూర్యకుండమను సరస్సుకలదు. మరియు దానికిం బశ్చిమముగ సూర్యదేవ స్థానమున్నది. అది సూర్యజన్మస్థానమట.

**అభిమన్యుఁడు** — పాండవమధ్యముండగు నర్జునునకు శ్రీకృష్ణసోదరియగు సుభద్ర యందు జనించిన కుమారుఁడు. ఇతనికి బలరాముని సుతయగు శశిరేఖయు, మత్స్యదేశాధీశుఁడగు విరటుని కుమార్తె ఉత్తరయు నిర్వురు భార్యలు. భారతయుద్ధమున పద్మవ్యూహ సంగరమున మడసినవాఁడు. అప్పటికి ఉత్తర గర్భవతియైయుండి పిదప పరీక్షిత్తుం గనెను. కాన పరీక్షిన్న రేంద్రుఁడతని సుతుఁడై వీరి వంశము సాగించెను.

**అభిస్థలి** — సామంతపంచకము చూడుఁడు.

**అభిసార, అభిసారి లేక హాజర దేశము** — ఈదేశము వితస్థ (Jhelam) నదికినీ, చంద్రభాగ (Chenab) నదికినీ మధ్యప్రదేశమని ప్రతీతికలదు. Dr. Stain పండితుఁడు కొంతవరకు దీని నంగీకరించుచు, ఈనదులనడుమ భూమియందు, మధ్యభాగమును, క్రిందిభాగమునందలి కొండల ప్రదేశమును, ఇప్పటి కాశ్మీరరాజ్యమందలి రాజపురి (ఇప్పటిపేరు రాజౌరి) యను పరగణాయును కలసి యభిసారదేశమై యుండెనని యభిప్రాయపడి యున్నాఁడు. గ్రీకు చరిత్ర

కారులు దీనిని అభిసారిస్ అనిపేర్కొనిరి. ఇప్పటి పెషావరు డివిజనుకు వాయవ్యదిశ యందుండునదిగ పెక్కండ్రు పోల్చుచున్నారు. మహాభారతము సభాపర్వము ౨౭ అధ్యాయమున అర్జునుఁడు జయించినటుల చెప్పఁబడినది. పద్మపురాణము ఆది ౬ అధ్యాయమున దీనింగూర్చిన ప్రశంసకలదు.

**అభిహూ** (Abihu) — హిబ్రూపేరు. ఆరోన్ (Aaron) కుమారునిపేరు. ఈతఁడు దేవుని యాజ్ఞను తిరస్కరించి యగ్నిచేఁ గాల్పఁబడినవాఁడు. 'నాతండ్రి' యని శబ్దార్థము. పురుషనామము. (క్రైస్తవ నామములు చూడుఁడు.)

**అభీరదేశము** — ఈదేశముయొక్క ఎల్లలం గూర్చి నిర్ణయించుటకు పరికరములు చాల కున్నవి. విష్ణుపురాణము పంచమాధ్యాయమునను, బ్రహ్మాండపురాణము షష్ఠాధ్యాయమునను, సింధునది అభీరదేశముగుండా ప్రవహించునదిగ ప్రశంసింపఁబడినది. మహాభారతము సభాపర్వము ౩౧ అధ్యాయమున అభీరదేశము సముద్రముదనుక సరస్వతీ నదీ తీరముగఁ జెప్పఁబడినది. మరియు నిందు సోమనాథక్షేత్రముండునని, యందే వివరింపఁ బడినది. తారాతంత్రమను గ్రంథమున అభీర దేశము తపతీనది పశ్చిమతీరముదనుక కొంకణ దేశపు హద్దునుండి వ్యాపించిన దేశమని చెప్పఁబడినది. గ్రీకుచరిత్రకారు లభీరదేశమున బేరియా యని వ్రాసియున్నారు. MacCrindle అనునాతఁడు సింధునది పాయలై డెల్టానేర్పర్చుకడ తూర్పుతీరమందుండెనని వ్రాసెను. Sir Henry Elliot అను పరిశీలకుఁడు సముద్రతీరమునుండి దేవఘడము వర కభీరదేశమని తన Elliots' Supplemental Glossary Vol. I, II, III యందు వివరించెను. W. Scoff అను గ్రంథకర్త గుజరాతుకు దక్షిణదేశమనియు, సూరత్ నగర మాదేశములోనిదే యనియు నభిప్రాయపడియెను. నర్మదానదీ ముఖ ద్వారము అట కాగ్నేయదిగ్భాగ ప్రదేశ సీమల నభీరదేశముండిన తావని పోల్చఁదగి యున్నది. వీరు ఉత్తరమహారాష్ట్ర సీమలను, గుజరాతుభాగ (పశ్చిమ ఇండియా) సీమల నేలిన నృపులు. (అభీరదేశము చూడుఁడు). రాజపుత్రశాఖలు ౩౬ లోను కీచీ యను పేరుగల (హిందీపాటల) కవి ౨౯ వ శాఖగను చంద్ అను పేరుగల (హిందీపాటల) కవి పదియవశాఖకును, భయమునెరుంగని శూరులగుట అభీరులని బిరుదనామము గలవా రాశూరులని వ్రాసియున్నాఁడు. వీరి పాలననుండియే అభీర దేశమని పేరుగలైనని చెప్పఁబడినది.

**అభీహహిత్ సరస్సు** — తొల్లింటి అచ్ఛోదము. (కాశ్మీరదేశము చూడుఁడు).

**అభువనగణము** — ఇది విశ్వబ్రాహ్మణుల యందొక గణము. ఇందైదుగోత్రములు చెప్పఁబడినవి. (సామశాఖవిశ్వబ్రాహ్మణులు చూడుఁడు). ౧. అభువనర్షిగోత్రము-అభువన త్వష్ట్ర విశ్వరూప (త్ర్యార్షేయప్రవర). ౨. భద్రదత్తర్షిగోత్రము- అభువన త్వష్ట్ర విశ్వరూప త్రిరూప భద్రదత్త (పంచార్షేయ ప్రవర). 3. కాండవర్షిగోత్రము- చంద్రదత్త, విశ్వగోచర, కాండవ, (త్ర్యార్షేయ ప్రవర). ౪. విశ్వరూపర్షిగోత్రము- విశ్వరూప, అతిరూప, విశ్వగోచర (త్ర్యార్షేయ ప్రవర). ౫. శ్రీముఖర్షిగోత్రము- కాండవ కవి శ్రీముఖ (త్ర్యార్షేయప్రవర).

**అభూత్యగోత్రము** — నిధృవగణము చూడుఁడు.

**అమరకంటకము** — ఇది తొల్లింట మేఖల పర్వతముపైనున్న క్షేత్రము. ఇప్పుడు మధ్య రాష్ట్రములందు (C. P.) గొండ్వానా పరగణాలో నున్నది. బెంగాల్, నాగపూర్ ఇనుపదారి బిలాసపూర్ కట్నీల మధ్యలైనుపై పెండ్రారోడ్డుస్టేషనుకు ౨౫ మైళ్ల దూరమున నున్నది. తొల్లింట అమరకంటకుఁ డను పేరుఁగల రక్కసునితావు. ఇచట కపిల ధారయనంబడు జలపాతమునుండి నర్మద, జోహిల, శోణభద్రానదులుత్పన్నమై వేర్వేరు దిశలకుం జనియెడిని. ఇచటికి కతిపయదూరమున, మార్కండేయక్షేత్రమును, గులేబకావలీస్థానమును కలవు. మహాకవి కాళిదాసు జన్మించినతావు కపిలాశ్రమము. (దీనింగూర్చి మత్స్యదేశము చూడుఁడు). కాళిదాసు మేఘసందేశమున అమరకూటమని వ్రాసిన తావిదియె. (ఉపప్లవ్యదేశము చూడుఁడు.)

**అమరకూటము (పర్వతము)** — అమరకంటకము (మత్స్యదేశము) చూడుఁడు.

**అమర గంగానది** — కాశ్మీరదేశము చూడుఁడు.

**అమరనాథము** — కాశ్మీరదేశమందలి (హిమవన్నగర) భైరవఘాటీ పర్వతముపై నున్న శివక్షేత్రము. అమరగంగానదీతీరము (దీనింగూర్చి కాశ్మీరదేశము చూడుఁడు).

**అమరనాశన గోత్రము** — కణ్వ ఉపగణము చూడుఁడు.

**అమరసింహుఁడు కవి** — ఈతఁడు సంస్కృతకవి. బౌద్ధుఁడు. విక్రమార్క మహారాజాస్థానమున నవరత్నములనఁబడిన విద్వత్కవులలో నొకఁడు (విక్రమార్కరాజాస్థాన నవరత్నములు చూడుఁడు). ఈతఁడు రచించినది నామలింగానుశాసనమను పేరుగల అమరకోశము. దీనికింకను అమరమని వాడుక నామము కలదు. ఇది సుప్రసిద్ధనిఘంటువగుట వేరుగ వ్రాయనక్కరలేదు. అక్షర వర్ణ క్రమమునగాక, వర్గముల అనుక్రమణిక శ్లోకరూపమున రచించిన నిఘంటువు.

**అమరాంతద్వీపములు** — ఇందులో ముఖ్యమైనది శేషెల్ ద్వీపము. అమరాంత ద్వీపములు మారిషస్ ద్వీపములకుం జెందినవి. బ్రిటీషువారివి. మారిషస్ ద్వీపములకు త్తరముగనున్న పగడపుచట్టుదీవులు.

**అమరావతి** — ఈపేరుగల పురము లనేకములు కలవు. తొల్లింట నగరహారమను ఉపనామముగల అమరావతీపురము అపగదేశమునందుండెను. అది యిప్పుడు ఆఫ్గనుస్థానములోని జలాలాబాద్ నకు పశ్చిమముగా నగరాకనంబడు చిన్న పల్లెటూరు జుట్టియున్న పాడుదిబ్బలుగ నున్నది. ఇంకొకటి మధ్యరాష్ట్రములందు (తొల్లింటి విదర్భ) నేటికినీ అమరావతియనంబడుచునేయున్నది. వేరొకటి యాంధ్రదేశమున కృష్ణానదీ తీరమున బెజవాడకు (తొల్లింటి విజయవాడ) పశ్చిమముగ ౧౮ మైళ్ల దూరమున ధరణికోట గ్రామమునకు దక్షిణముగా నది దక్షిణతీరమున నున్నది. ఇట నొక బౌద్ధస్థూపము కలదు. దీనికొకప్పుడు నాగరాజదేశమని పేరుండెనట. ఇచటి స్థూపముండిన వనము నాంధ్రబౌద్ధులు క్రీ. వె. ౩౭౦-౩౮౦ మధ్యను నాటిరని శాసనము కలదు.

బెజవాడనుండి ముప్పదిమైళ్ల దూరమున నిప్పటి గుంటూరుమండలముననున్న పాడు

పడిన తొల్లింటి రాజధాని. (ఆంధ్ర దేశము చూడుఁడు). మరియు (వాసిరెడ్డి వెంకటాద్రి నాయుఁడు చూడుఁడు) వాసిరెడ్డి వెంకటా నాయుని పరిపాలనకాలమున నిటనొక బౌద్ధ స్థూపమునందు చలువ మార్బెలురాళ్లు మొదలగునవి దొరకిన దీయమరావతియె. క్రీ. వె. మొదటి శతాబ్దకాలమునాఁటి నాణెములు కొన్ని యిటదొరకుట నీస్థలము నాపూర్వకాలమున పట్టణమైయుండెనని తేలుచున్నది. పట్టణముండిన యానవాళ్లు గానవచ్చెడిని. నదీతీరమందు జైనదేవళముండినటులతోచెడిని. (అమరావతిస్థూపము చూడుఁడు.)

**అమరావతి స్థూపము** — ఇది గుంటూరు మండలమున సత్తెనపల్లి తాలూకాలో కృష్ణానది దక్షిణతీరమున మునేరు కృష్ణయందు సంగమించుతావున కెదురుగనున్న గ్రామము. పూర్వమిదియు, ఈప్రాంతముననే యున్న ధరణికోటయుం గలసి యొక పట్టణమై, గొప్ప వైభవముల ననుభవించినదిగ నుండెను. ఈప్రాంతమున గల విప్రవినోదులు తాము బ్రాహ్మణ, బౌద్ధ కలహములందు బ్రాహ్మణులకు సహాయపడితిమని గర్వముగ పల్కుచుందురు. అమరావతియందుఁ గల బౌద్ధస్థూపము దేశప్రసిద్ధము. దీనియందు బుద్ధభగవానుని ఎముకముక్క యొకటి యున్నదట. దీనిం జుట్టియున్న ప్రాకారములలో నొకటి నాగార్జునసిద్ధుఁడు కట్టించెనందురు. నాగార్జునునియాశ్రయ మీప్రాంతసీమయందే పల్నాడుతాలూకాలో నాగార్జునుని కొండయను పేరంబరగుచున్నది. దాని తొల్లింటిపేరు విజయపురియనియుండెననియు, అటనిక్ష్వాకువంశజులను నృపులు ఆప్రాంతసీమ నేలుచుండిరనియు, అచటకిం గలిపయ దూరముననే, నాగార్జునసిద్ధుని యాశ్రమముండిన తావుగలదనియు, నచటివారనుచున్నారు. అటఁ ద్రవ్వఁబడిన శాసనముల మేర కారాజుల పాలనకాలమున నది మహాసాంఘికవాదబౌద్ధమున కునికిపట్టుగ నుండవలెనని తేలుచున్నది. ఇటఁ బ్రధానస్థూపమున దొరకిన ఎముకముక్క బుద్ధభగవానునిదిగనెంచి బౌద్ధులు సారనాథమునందలి మూలగంధకుటీవిహారమునందుంచి పూజించుచున్నారు. ఇంక నమరావతీస్థూపము నశోకచక్రవర్తినాఁడే భగవానుని ఎముకముక్క నుంచి నిర్మించినదిగ పరిశీలకులనుచుందురుగాని, శాసననిదర్శనములు లేకున్నవి. స్థూపములందలి ప్రతిభాగమును దేనికో చిహ్నముగ నుండునట. దానిపైనుండు మూఁడు ఛత్రములు- దేవ, మానవ, నిర్వాణపదచిహ్నములట. అసలు స్థూపమే మేరువకు చిహ్నమట.

అమరావతియందమరేశ్వర శివక్షేత్రము కలదు. దీని కీప్రాంతవాసులు కడుంగడు భక్తితో వినతులొనర్చి పూజింతురు. దీని పూర్వోత్తరములు సరిగా తెలియవు. అమరులచే నర్చింపఁబడెననుట యొక నిజస్థితిగ గైకొనదగినదికాదు. కాని ఆంధ్రదేశమునందలి పంచారామ క్షేత్రములలో నొకటి యనెదరు. అమరావతి జీర్ణస్థితినందియుండ నీప్రాంతసీమలనేలిన (చింతపల్లి భూపతి) రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుఁడుగారిట నివాసమేర్పరుచుకొని బాగు చేయించి విశాలమగు బాటల నిర్మించి, వైశ్యులను రప్పించి యుద్ధరించెనని చెప్పంబడినది. ఆభూపతి కమ్మకులజులను క్షత్రియులు. అమరేశ్వరునకు నైజాం ప్రభుత్వ




**అమరావతి స్థూపము.**

మువారినుండి ఏఁటేటముట్టునగదు మామూలు కలదు. ఇది చందూలాలు మంత్రి నాఁడు కల్గెనట. మరియు నారాజ్యముననే కొన్ని యీనాంభూములు కలవట.

క్రీ. వె. ౧౧౮౨ నాఁటి యొకశాసనమునందు - శ్లో॥ అస్తిశ్రీ ధాన్యకటకం । పురం సురపురాత్పరమ్ । యత్రామరేశ్వరశ్శంభు । రమరేశ్వరపూజితః॥ అనియుంట నీపేరులు రెండును, ఆనాఁటికి పూర్వమే యుండుట తెలియనగుచున్నది. పిదప ధాన్యకటక మెట్లో ధరణికోటగ మారియుండనోపు. బహుశః పురమునందు అమరేశ్వర దేవస్థానపరిసరవీధుల కమరావతియని పేరుండి తర్వాత యంతకును వ్యాపించెనేమో. పరిశీలననుండి కొందరీయమరావతీస్థూపము క్రీ. పూ. ౨౦౦ నాఁటిదని తలంచుటయుం గలదు. నాగార్జునుని సుహృల్లేఖయందు వివరింపఁబడిన దానపతి, ఆయన మిత్రుఁడగు శాతవాహనుఁడను నాంధ్రరాజు అనేక శాసనము లీస్థూపమున వేయించిన వశిష్ఠీపుత్ర శాతవాహనునకు పుత్రుఁడే నని పెక్కండ్ర యభిప్రాయము. అమరావతీ స్థూపనిర్మాణ మొకతరిఁగాక నాల్గు వేర్వేరు కాలములందు చేయించి పూర్తిగావించిరని తెలియుచున్నది.

**అమర్చినదానిలో నత్తగారు వ్రేలు పెట్టినదంట** — తాఁజేసినట్లని భావము. ఆంధ్రలోకోక్తి.

**మరుక కావ్యము** — అలంకారశాస్త్రమున వివరింపఁబడిన మేరకుశృంగారనాయికానాయకుల లక్షణలక్ష్యములను చేష్టలరూపమున వర్ణనలంగల సంస్కృతకావ్యము. దీనిని అమరుకుఁడు రచించెనని కొందఱనెదరు. శంకరభగవత్పాదులు రచించిరని కొందఱనెదరు. దేనికిని సరియగు నిదర్శనములు కానరావు. అధిక మేమన నీయమరుకుఁడెవ్వరో తెలియదు. కాని కావ్యముప్రౌఢము; రసవంతము. క్రీ. వె. తొమ్మిదవ శతాబ్దమునాఁటివాఁడగు ఆనందవర్ధనాచార్యుఁడు తారచించిన ధ్వన్యాలోకమునందిందలి శ్లోకముల నుదాహరించుటంజేసి యంతకింకను పూర్వకాలమునం దుండినవాఁడని తేలుచున్నది. కాని ఆమహానుభావుఁడగు కవి యెవ్వఁడో బయల్పడదు. అమరుకమున కర్జునదేవ, పెదకోమటి వేమభూపాలుఁడు, రుద్రమదేవుఁడు, శేషరామకృష్ణుఁడు, సూర్యదాసుఁడు మొదలగు వ్యాఖ్యాతలు సంస్కృత వ్యాఖ్యలు రచించిరి. అందు వేమభూపాలుఁడు కొండవీటిరాజ్యమును క్రీ. వె. ౧౪౦౦-౧౪౨౦ రాజ్యమేలినవాఁడు.

సీసపద్యములతో దీనినెవ్వరో తెనిగించిరట. మరియొక తిరువేంగళప్పకవి (తాళ్లపాటి వేంకటేశ్వరదీక్షిత పుత్రుఁడట) కూడ తెనిగించెనట. మంగిపూడి శ్రీరామచంద్ర శాస్త్రి విరచితాంధ్రానువాదపద్యకావ్యము వేరొకటి కలదట.

**అమరేశ్వరము** — నర్మదానదీతీరమున ఓంకారమాంధాతక్షేత్రమున కెదురుగ నదికవ్వలిగట్టున (దక్షిణతీరమున) పర్వతముపైనున్న శివక్షేత్రము. స్కాందపురాణ రేవాఖండమునను, శివపురాణమున ప్రథమభాగపు ౩౫ అధ్యాయమునను దీని ప్రశంసకలదు. మరియు బృహత్ శివపురాణమున ద్వితీయభాగపు ౩-౪ అధ్యాయముల నీశివక్షేత్రము వివరింపఁబడినది. ఇది తొల్లింటి అనూపలేక హైహయరాజ్యములో నుండినది. (అనూపదేశము చూడుఁడు, ఓంకారమాంధాతక్షేత్రము చూడుఁడు).



**మలకుల గోత్రము** — ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు). అమలకులగోత్రము, ఏకార్షేయగోత్రము (౭౩)- దీనిని అగ్రమూలకుల, అఘ్యమూలకుల, అనియు నందురు. సంస్కృతగోత్రము, ఆచ్యాయనస, ఆచ్యాయనగణము, ఆశ్వలాయనర్షి, ఆపస్థంబసూత్రము, యజుశ్శాఖ, ప్రమాణగ్రంథము ఆద్యప్రవరఖండ, సమానగోత్రము ఆశ్వలాయనస, నర్మదేశుఁడు దేవత, (భార్య) జంబ్వాంబ, మేరువు తపస్థానము, జాంబూసరస్సు తటాకము, జపము లక్ష, దీపములు ౬౦, క్షేత్రసంఖ్య ౭౦, ఏనుఁగు దానము, మేడిపండు వర్జనీయము.

**అమ్మకమునందలి విధానము** — విక్రయ వ్యాపారము చూడుఁడు.

**అమ్మగారు గృహప్రవేశము, అయ్యగారు శ్మశానప్రవేశము** — దురదృష్టవంతురాలని భావము. ఆంధ్రలోకోక్తి.

**అమ్మ తా పెట్టదు, అడుక్కుతిననీయదు** — అపకారమని భావము. ఆంధ్రలోకోక్తి.

**"అమ్మదగ్గిర క్రిందపరున్నా అయ్య దగ్గిర నేలపరున్నా ఒక్కలాగే ఉన్నది"** అన్నదట ఆంధ్రలోకో. నిష్ప్రయోజనమని భావము.

**"అమ్మ పెట్టేవి నాలుగు అప్పుడే పెడితే చెయ్యలేకపోయినానా ?"** అన్నదట — ఆంధ్రలోకోక్తి.

**అమ్మబోతే అడవి కొనబోతేకొరవి-** దురదృష్టకాలమని భావము. ఆంధ్రలోకోక్తి.

**అమ్మలాచార్యకవి —** తండ్రి ఘటికశత సుదర్శనాచార్యుఁడు. వైష్ణవుఁడు క్రీ. వె. ౧౭ వ శతాబ్దాంతముననో ౧౮ ప్రారంభము ననో ఉండినవాఁడు. రచించినవి ౧. యతి రాజవిజయము (దీనినే వేదాంతవిలాసమందు రట. రామానుజ దిగ్విజయకథనమట), ౨. వసంతతిలకభాణము, 3. చోలభాణము.

**అమాంత చాంద్రమాన మాసము—** మాసములు చూడుఁడు.

**అమాల్బర్టు** (Amalbert) — ట్యూటో నిక్కు పేరు. Wrok Bright అనియర్థము. పురుషనామము. (క్రైస్తవ నామములు చూడుఁడు.)

**అమావాస్యాయన గోత్రము —** కపి ఉపగణము చూడుఁడు.

**అమావాస్య సోమవారవ్రతము —** అమావాస్యదినమున సోమవారము సంభవించునేని యీ వ్రత మాచరింతురు. ఇది సూర్య గ్రహణతుల్య పవిత్ర వ్రత దినము.

**అమితాభుఁడు (బుద్ధుఁడు)** పంచ ధ్యానిబుద్ధులలో నాల్గవబుద్ధుఁడు. సుఖావతీ (పశ్చిమ) స్వర్గాధినాథుఁడనియు, శాంతముగ ధ్యానమొనర్చుననియునందురు. భద్రకల్పమనం బరగు వర్తమానకల్పమున కీతండధిదైవమట. (పద్మపాణి సృష్టిమొనర్చును). రక్తవర్ణుఁడు. మయూరద్వయలాంఛనుఁడు. జలములకు రక్తవర్ణములకు రసనేంద్రియములకు గార కుండై ధ్యానముద్రాంకితుఁడై చేతులం దొడల యందిడుకొనియుండు శాంతికరుఁడు.

**అమితాయువు (బుద్ధుఁడు)—** బౌద్ధ మతపరిణామకర్త. దీర్ఘాయువు నొసంగుట కధిపతి. అమృతకుండికలాంఛనముగగల్గినవాఁడు. కిరీటధారి. త్రయోదశ భూషణాలంకృతుఁడు. అమూల్యాంబరధారి. ధ్యానముద్రాంకితుఁడు తొడలపై చేతులానుకొని యుండువాఁడు. టిబెట్టుదేశస్థులీతని నెక్కువగాఁ బూజింతురు.

**అమిలాయన గోత్రము —** జమదగ్ని వత్స ఉపగణము చూడుఁడు.

**అమీాన్ (అభిమన్యుఖేరా) —** కురుక్షేత్రము చూడుఁడు. అభిమన్యుఖేరాచూడుఁడు.

**అమీారు —** మహమ్మదీయ మతగ్రంథము లందు ఆజ్ఞనిచ్చువాఁడని యర్థము చెప్పఁబడినది. ఇది సైన్యసంబంధముగాఁ దోఁచెడిని. ఇక్కాలమున నది బిరుదమైయున్నది. హైదరాబాదు రాజ్యమున నెక్కువగఁ బ్రచారము నందియున్నది. ఆఫ్ఘనుస్థాన ప్రభున కమీారని బిరుదముకలదు. ఇవి మహమ్మదీయ బిరుదములు. వారియందు పేరులుగగూడ వాడుట కలదు.

**అమీాబా —** (Worm) ఇది సూక్ష్మజీవుల (Worms) నుండి సంభవించు నంటువ్యాధి. దీనిని నులిగడు పనియు, జిగటవిరేచనము లనియు, రక్తవిరేచనములనియు, తెలుఁగు

నను, డీసెంట్రీ యని ఆంగ్లమునను అనుచుదురు. విరేచనములు చీముగాని, రక్తము కలిసిగాని అగుచుండును. లోన మలకోశమున ఒరసినట్లు కురుపుగ నగు నంగురు. క్రుడ్ల వలన జనించు సూక్ష్మజీవి. దీనిక్రుడ్లు విరేచనముతో బయటికి వెడలుచు జలసంపర్కదోషమున తిరుగ లోనికరుగుచుండు నంటు వ్యాధిగ నగుచుండు నని చెప్పంబడినది. (అంటువ్యాధులు, సూక్ష్మజీవులు చూడుఁడు). (రక్తగ్రహణి Dysentery చూడుఁడు).

**అముస్టర్డమ్ కెనాల్** — నెదర్లాండ్సు దేశములోనిది. సముద్రపుటోడలు అముస్టర్డమ్ పురమునకుఁ బోవుటకుఁ ద్రవ్వంబడిన కాలువ. నార్తుసీ నుండి త్రవ్వంబడినది. పదునారున్నరమైళ్ల పొడవును, ఎనుబదియెన్మిది అడుగుల వెడలుపును, ఇరువదిమూడడుగుల లోతును గలది. దీనిగుండా ఓడలు జూడర్జీ గుండాపోవు కష్ట మక్కరలేక తిన్నగా పోఁగలుగుచున్నవి.

**అమృతమథనము** — తొల్లి దేవాసురులేకమై సముద్రముంజిలికి మథించిరి. అందు హాలాహాలము, లక్ష్మి, చంద్రుఁడు, ఉచ్చైశ్రవము, కౌస్తుభమణి, పారిజాతవృక్షము, కల్పవృక్షము, కామధేనువు, అమృతమును జనించెనట. పిదప కమండలస్థ వైద్యశాస్త్రవేత్తయగు ధన్వంతరి జన్మించెనట.

**అమృతఫలము చెట్టు** — జామిచెట్టు చూడుఁడు.

**అమృతము** — అమృతమన చావులేనిదను యర్థము. దేవాసురులు తొల్లి సముద్రమును మథించ నం దమృతము పుట్టెనట. వైద్యశాస్త్రమున,ఆరోగ్యకరములగు వస్తువులని ) అమృతములని వాడియున్నారు. పాలు, పెరుగు, నెయ్యి, తేనె, ఫలరసములను పంచామృతములని వాడుచున్నారు.

**అమృతసర్ స్వర్ణదేవాలయము** — దీనికి హరిమందిర్ అనియు, దర్బారు సాహెబ్ అనియుఁ గూడ పేరులు కలవు. కొందరింకను సువర్ణదేవాలయమనియు, స్వర్ణదేవాలయమనియుంగూడ వాడుట కలదు. పాంచాలదేశమున లాహోరుపట్టణమునుండి ముప్పదిరెండుమైళ్లదూరమున రావి (తొల్లింటి రవి) నది, బియాస్ (తొల్లింటి విపాశా) నదుల నడుమగా అమృతసర్ అనంబడు పురము కలదు. అది చాల ధనవంతమగు నగరమని ప్రతీతినందియున్న పురము. పురమునకు మధ్యభాగమున నమృతసరస్సను చెరువును, దాని మధ్యభాగమున నొకద్వీపమున సువర్ణ దేవాలయమగు హరిమందిరమును కలదు. ఇది సిక్కుమతస్థుల దేవస్థానము. కాన దీని చరిత్ర వివరించుటకుఁ బూర్వము సిక్కుమతముంగూర్చి ఇంచుక వివరించుట సమంజసము.

తొల్లింటి యాదికాలమున రావీనదీతీరము నందలి శాలాతురనగరమున నానక్ అను పుణ్యమూర్తి క్రీ. వె. ౧౪౬౯ వ సంవత్సరమున జనించెను. ఆ మహనీయుండు హరిభక్తుఁడై, అదివరకు దేశమునందు వ్యాపించి యుండిన క్రీడాబ్రహ్మవాద సిద్ధాంత మతమునే హరిభక్తిగా జనులకు బోధించుచు, కొన్ని కట్టుబాట్ల నేర్పరిచి, మతమునకు గురుఁడనిపించుకొనియెను. ఆనానకుదేశికుఁడు ఇప్పుడు స్వర్ణ దేవాలయముండిన తావున నొక చిన్న యింటియందు వసించువాఁడట. ఆయన కెక్కువమంది శిష్యులుండిరట.

షడ్గుణైశ్వర్యములను స్వాధీనమందుంచుకొనిన వాఁడనియు, పరిపూర్ణ యాత్రార్థియనియు, గగనసంచారియనియు పేరందినవాఁడు. ఆ జగద్దేశికుఁడు మనస్సునందుకోరిన సర్వమును తనకడకు రా నొనర్పఁగ జేసినవాఁడనియు, జగమునకుఁ దెల్విగల్గింపఁ బుట్టిన కారణ జన్ముఁడనియుఁ జెప్పఁబడినది. ఈ గురుస్వామి యవసానదశయందు తన గురుపీఠమును తన కుమారున కీయక శిష్యులలో నగ్రగణ్యుఁడని పేరందిన లహానున కొసంగి, యాతని కంగద గురుండని పేరిడి, శిష్యులం గాచుచుండుమని యాజ్ఞనొసంగెను. రానురాను ఆ గురుపీఠమునకు అకాల్తఖ్తు అనియు, ఆ మతస్థుల కకాలీమతస్థులని పేరయ్యెను. నేఁటికినీ యీపే రీమతస్థులకు సర్వసామాన్యముగ వర్తించుచున్నను, దేవాలయార్చకులను అకాలీలు అని వాడుచున్నారు.

అంగదగురునకుం బిదప అమరదాసుఁడను మహాత్ముఁడు గురుపీఠ మధిష్ఠించెను. ఆతనికిఁబిదప ఆతనిసుతుండగు రామదాసు నాల్గవ గురుఁడయ్యెను. ఆమహనీయుఁడే క్రీ. వె. ౧౫౭౧ సంవత్సరమున తనయింటి ప్రదేశము నొకద్వీపమువలె వదలివైచి చుట్టును అమృతసరస్సు అనంబడు పవిత్ర సరోవరముం ద్రవ్వించెను. నేఁటికిని దేవాలయమునకుం దూర్పున నొకస్నానముల రేవు బహుపవిత్రవంతమైనది కలదు. రామదాసు గురుం డాదిగ తర్వాతి జగద్దేశికులందరూ స్నానము లొనర్చుచుండిరట. నేఁటికిని వేల కొలదిజనులం దనుదినము జలకములాడుచుందురు. రామదాసుగురుఁడే స్వర్ణదేవాలయ నిర్మాణమునకు సంకల్ప మొనర్చినవాఁడట. తనశిష్యుల నాయమృతసరస్సు చుట్టు పట్టణము నిర్మింప బురికొల్పుచుండెనట. ఆతనికిఁ బిదప అర్జునగురుండు పీఠమధిష్ఠించి తండ్రి సంకల్పించిన దేవాలయ నిర్మాణాదులగు పనులం బరిపూర్తినొందించెను. అమృతసర్ పట్టణము మహానగరమై చేతిపనులకును వర్తకమునకునూ పేరంది వన్నెగాంచెను. ఈ మతస్థు లందరాతనికి శిష్యులగుట నీ మతమున గురుశిష్యధర్మము ప్రధానమగుటయు శిక్కు లనిపేరందిరి. మరియు నీయర్జునదేశికుండే నిజమతరక్షణకు యుద్ధతంత్రముద్బోధించినవాడు. పూర్వగురువుల యాజ్ఞలం గూర్చియు, కొన్ని తానందుజేర్చియు నొక గ్రంథముగ రచించినవాఁడు. ఆకాలముననె నిర్మింపబడి గురువులనివాసమైయుండిన భవనమటనె కలదు. అది అకాలభంగ్ అని నేటికిఁ బిలువఁ బడుచున్నది.

అర్జునగురునకుంబిదప హర్గోవింద గురుఁడును, ఆతనికిఁబిదప హరిరాయి గురుడును, పిమ్మట హర్కిషనుడు, నాతనికిఁబిదప తేగ్బహదూర్ గురుఁడును అకాల్తఖ్తు నధిష్టించిన దేశికులు. వీరియభివృద్ధిం జూచి యోర్వని యౌరంగజీబు చక్రవర్తితో సంభవించిన సంగరమున తేగ్బహదూరు గురుడు నిజమతరక్షణకై పోరుచు మడసి శ్రీహరిపథముం జేరెనట. పిదప తెగ్బహదూరు సుతుండగు గోవిందసింగు గురుపీఠ మధిష్ఠించి తొమ్మిదవ దేశికుం డాయెను. ఈ మహాప్రతాపసంపన్నుని కాలమున వీరికి ముసల్మానులతో గొప్పయుద్ధము నడచెను. అకాలీ సైన్యముల నన్నిటి నొకచోజేర్చి పండ్రెండుభాగములుగ నొనర్చి ౧. బంగీమిసల్, ౨. రామగడ్ మిసల్, ౩. ధనియామిసల్, ౪. నకియామిసల్, ౫. అలువాలామిసల్, ౬. ధలియాలామిసల్

౭. నిశానాన్వాలామిసల్, ౮. సైజల్పురియా మిసల్, ౯. ఖోరాసింధియామిసల్, ౧౦. షాహిల్మరినిహాంగ్మిసల్, ౧౧. ఫల్కియామరి భేకియామిసల్, ౧౨. సుకర్చకియామిసల్ అని పండ్రెండు భాగములు చేయఁబడియెనట. వీరు వైశాఖ పౌర్ణమికి, ఆశ్వీయుజ బహుళ అమావాశ్యలకు అమృతసర్ నందు కూడుచు జరుపవలసిన విధివిధానముల నేర్పర్చుకొను చుండువారట. అట్లు అప్రమత్తులై ముసల్మానులతో సంగర మొనర్చుచున్నను, వీరికిం గడగండ్లు తప్ప వయ్యెను. ఇక్కాలమున చరత్సింగను శూరుఁడు వీరికి సైన్యాధిపతి యని చెప్పఁబడినది. ఈ సైన్యములు ముసల్మాను సైన్యముల నెదుర్కొనుచుండెనట.

అహమ్మదుషాదురాణి యను ముసల్మాను సైన్యాధిపతి యొకతరి, అమృతసర్ దేవాలయముందోచుకుని,దానినిభగ్నపర్చి, సరస్సుం గప్పించివైచి యందు గోహత్య లొనరించె ననియు, అందుల కకాలీశూరులు రోషావేశ పరులై ఘోరసంగరమొనర్చి వారిం దును మాడి దరిమివైచి తిరుగ దేవాలయముం గట్టించి, చెరువుంద్రవ్వించి, బాగుచేసి యిప్పటి స్థితికిం దెచ్చిరనియు, నానాటికది బంగారు రేకులమయమై ప్రస్తుతపుస్థితిని విరాజిల్లు చున్నదనియు చెప్పుదురు. పిదప రణజిత్ సింగను ప్రభువుక్రింద వీరు స్వతంత్రులై ఖాల్సా (విముక్తులు) యని పిలువఁబడు చున్నారు. ఇంక నొక్క సంగతితో దేవాలయమునకుం జేరుదము. దేవాలయ మహా ద్వారమునకుం గుడిప్రక్కను స్వర్ణ ఖచితములగు ధ్వజములు రెండు కలవు. అందొకటి రామదాసుగురు పవిత్రనామము ధరించియున్నది. రెండవధ్వజముపై "వహావ్వా గురూజీకి ఫతే" అను యక్షరములు చెక ... ం ధ్వజములు స్వర్ణ మయములు; బహుపురాతనములు. యుద్ధ కాలములందు సైన్యాగ్రమునం దుంచుచు జాగరూకతతో కాపాడుకొనుచుండువారట. "వహావ్వా గురూజీకి ఫత్తే" యన, 'భళీ దేశికేంద్రునకు జయము' అని యర్థము. సిక్కులందు 'వహావ్వా గురూజీకిఫత్తే' యను యరపు నేటికిని రణధ్వనియైయున్నది.

గోవిందుసింగు గురునకుం బిదప నాయన యొక గురువును నియమింపక, మతగ్రంథమే తనకుం బిదప గురుస్థానమున నుండగల దనియు, అట్లే నడచుకొనుఁడనియు శిష్యుల కాజ్ఞనిచ్చి శ్రీహరిపదముం జేరెను. నాఁ డాదిగ శిక్కులందుగురువులు లేరు. మతగ్రంథ మును (గ్రంథ సాహెబ్) హర్మందిర మగు స్వర్ణదేవాలయమునందిడి, దానిని దర్బార్ సాహెబ్ అని పిలచెదరు. దానినే గురు నిగ నెంచెదరు; పూజించెదరు. స్వర్ణ దేవాలయమున గొప్పగొప్ప సంగీతపాఠకులు నియమింపఁబడియున్నారు. తాళ, మృదంగ యుక్తముగ నీగ్రంథసాహెబును అకాలతఖ్తు కడ నిత్యము పాడుచుండు పాట కడుశ్రావ్య ముగ నుండెడిని.

అమృత సరస్సునకు నాల్గువైపులను చక్కని బాటలును, వాటినంటి యవ్వల గొప్పగొప్ప ప్రాసాదములు నిర్మింపఁబడినవి. సరస్సులోనికిం దిగుటకు తెల్లని మార్బెల్ రాతి పలకలతో నిర్మింపఁబడిన సోపాన పంక్తులు కలవు. సౌధములు సుందరవంతములు, వైభవోపేతములుగఁ దోచును. వానిపై కెక్కి క్రిందికింజూచిన నీట దేలుచున్న బంగారు కలశమో యనున ట్లీస్వర్ణ దేవాల

యము గప్పబడెను. దక్షిణ తీరమునుండి దేవాలయములోని కేగుటకు వంతెన కట్టఁబడి చంద్రకాంత శిలాఫలకములచే సర్వత్రా కప్పఁబడి నేత్రానందకరమై గప్పబడెను. బయట వంతెనపైకిగల మార్గమున ఒక మహాద్వారము నిర్మింపఁబడి విభ్రమముం గొల్పుచుండును. వంతెన కిరుప్రక్కలను బంగారు రేకులు మలామాచేసిన దీప స్తంభములు, కమరమ్యముగ నమర్పఁబడియుండెడిని. రాత్రులందు దీపములు, క్రిందిజలములలో ప్రతిఫలించుచుండ దేదీప్యమానమగు దీపకాంతులు స్వర్ణచ్ఛాయలపైఁబడి మెరయుతరి నుదయ సాయంకాలములందు సూర్యునికాంతులు స్వర్ణకాంతులం గలిసికొని యన్యోన్యతేజంబులచే పైకిగల్గించు మహాతేజమునుగాంచిన నిది పవిత్రస్వర్గమో యనిపింపకపోదు. దేవాలయమహాద్వారము చాలాపెద్దది; గంభీరమైన పనితనముకలది. వంతెనపొడవు నూటయేబది యడుగులుండును.

దేవాలయము వెలుపలను, లోపలను ఒకే విధముగ బంగారు రేకులచే గప్పఁబడియుంట సువర్ణమయమై కాన్పించును. ఆవైభవము చూచితీరవలయుఁగాని వ్రాయనలవికాదు. అచటి యైశ్వర్యవైభవములు గాంచిన నిది కుబేరనగరమో యనిపించును. కొందరి కిది స్వర్గపురియేమో ననిపించుటకుం గారణములు లేకపోలేదు. దేవాలయము రెండంతస్తులం గల్గియున్నది. మధ్యభాగము కప్పఁబడకయుంటంజేసి క్రిందియంతస్తున గల దర్బారుసాహేబునందు గ్రంథసాహేబునకు నడచుపూజలు, గానసంకీర్తనలు, పైయంతస్తునుండి క్రిందికిఁ జూడనగును. క్రింది యంతస్తునందే శ్రీమంటపమను వేదికయందు గ్రంథములను జరీవస్త్రములతోఁజుట్టి సువర్ణమయమగు నొక యెతగు పీఠముపైఁబెట్టి పూజింతురు. దానిపై యాచ్ఛాదన చాల విలువగలది. దానినుండి చుట్టును రత్నఖచితమైన కుచ్చులును, ఆణిముత్తెముల కుచ్చులును వ్రేలాడుచుండును. ఇదియే ప్రధానస్థానమగు దర్బారుసాహేబు. ఇందీ పీఠమున శ్రీమంటపముపైనుంచి పూజించునదియే గ్రంథసాహేబు.

చూడవచ్చినవారి నీయకాలీలు చాల గౌరవమొనర్చి యాదరించి యన్నిటిం జూపుదురు. ఇచట పుష్పములర్పించుటయే పూజ. ఆపుష్పములనే ప్రసాదముగ నిత్తురు. ఈ మతధర్మములు, కట్టుబాట్లంగూర్చి (క్రీడాబ్రహ్మవాదసిద్ధాంతము చూడుఁడు). శిక్కులకందరికి సింగను బిరుదము పేరుకడ నుండితీరవలయును. వీరందరు క్షత్రియతుల్యులేగాని జాతిభేదము పాటింపరు. ఇతరులను వీరి మతమునందు జేర్చుకొని వీరి దీక్షనిచ్చుట కలదు. విగ్రహారాధన వీరియందు లేదు. శిఖ, గడ్డము, పాగ, కృపాణధారణము వీరియందు ముఖ్యము. స్వమతసంరక్షణకొనర్చిన సంగరమును, కోల్పోయిన ద్రవ్యమును పరమేశ్వరుఁడగు హారికి సమర్పితములగును. అది ధర్మసంగ్రహము. పరమేశ్వరున కనేక నామములు కలవు. అందు హారి యనఁబడునది కడుపవిత్ర మగునది. గోవిందుఁడు మొదలగు మరికొన్ని నామములు పవిత్రవంతములే. ఐనను హారియను నామము ఎక్కువయైనది, లోకసంబంధమైనది యని చెప్పఁబడినది.

**అమెరికా** — తొలుత నమెరికాఖండమును గనిపెట్టినవాని పేరు 'అమెరిగో వెస్పూచీ.'

ఈతఁడు Naval Astronomer గ నుం డెను. హ్లాకెన్సుకాఫురస్తుఁడు. తాను కనుంగొనినచరిత్ర నాతఁడువ్రాసెను. అది జర్మను దేశమున జర్మనుభాషయందు సుప్రసిద్ధ గ్రంథమై వ్యాపకమునందియున్నది. అతనినుండి అమెరికాయని పేరుకల్గెనని చెప్పఁబడినది. ఉత్తరఅమెరికా, మధ్యఅమెరికా, దక్షిణ అమెరికాలుకలసి అమెరికాయనంబడుచున్నది. పశ్చిమ గోళార్ధమునందు భూభాగమున కమెరికా యనుట వాడుక నందియున్నది. ఈ మూటియొక్క ఉత్తరదక్షిణముల కొలత ఇంచుమించు పదివేల మైళ్లనియుఁ దలంపఁబడుచున్నది.

**అమెరికా ఖండము** — అమెరికా మూఁడు ఖండములు కలసినయైనపేరు. ఉత్తర అమెరికా ఒక ఖండముగను, మధ్య అమెరికా ఒక ఖండముగను, దక్షిణ అమెరికా ఒక ఖండముగను భూగోళశాస్త్రజ్ఞులచే నెన్నఁబడినది. (అమెరికా చూడుఁడు). ఉత్తర అమెరికాయందు వెండి, బంగారు లేగాక రాగి, ఇనుము, సీసము, రాక్షసబొగ్గుల గనులు కలవు. బంగాళాదుంప, పొగాకు, అనాస, పనసపండ్లు, చింకోనా తోటలు విస్తారముగ నుండుటయెగాక వీటి నన్యదేశముల కందజేసి విత్తనమిచ్చిన దీయమెరికాదేశమేనని చెప్పఁబడినది. ఉత్తర అమెరికాఖండమున బ్రిటిషు అమెరికాయనియు, అమెరికాసంయుక్తరాష్ట్ర దేశమనియు, దక్షిణభాగమున మెక్సికో, గువాతేమాలా, సాల్వెడోర్, హొండూరాస్, నికారాగువా, కోస్టారికా, వెస్టిండియా ద్వీపములు చేరియున్నవి. బ్రిటిషు అమెరికాయందు న్యూఫౌండ్లాండు, కెనడాదేశమును గలవు. ఉత్తర అమెరికా కీశాన్యదిశగా గ్రీన్లాండు అని పేరుగల గొప్ప ద్వీపమును గలదు. ఇదిగాక ఉత్తరదిశగా సౌతాంప్టన్, కాక్సకన్, మెల్విలి ద్వీపములును, సెంటు లెన్సు, సంయుక్తాగ్రగుడమున కేప్ బ్రిటన్, ప్రిన్సు ఎడ్వర్డు ద్వీపములు, ఉత్తర దక్షిణ ... దీవులు, బ్రిటిషు అమెరికాకుఁ బశ్చిమన వెన్కోవర్ ద్వీపము, క్వీన్ ఛార్లోటీదీవులు సేర్కొనఁదగిన ద్వీపములై యున్నవి.

ఉత్తరదిశను ఆర్కిటిక్కుమహాసముద్రమున ప్రిన్సాఫ్ వేల్సు ద్వీపము, ప్రిన్సుఆల్బర్టు లాండు అనుపేరుగల ద్వీపము, బాంక్సు లాండు ద్వీపమును కలవని చెప్పఁబడినది గాని వాటింగూర్చి ఏమియుం దెలియదు. వాటియందు మనుష్యులుండరనియు, ఉండినను ఎస్కిమోజాతివారే యుండియుందురనియుఁ దలంపబడుచున్నది. సెంటులారెన్సు సంయుక్తాగ్రగుడమునందు ఏంటికోస్టి ద్వీపమును, న్యూయార్కునగరముకడ లాంగు ఐలండు ద్వీపమును, యునైటెడ్ స్టేట్సునకుఁ దూర్పుగా బ్రిటిషువారివగు బెర్మూడా ద్వీపములును వచింపఁదగిన ద్వీపములైయున్నవి.

**అమెరికా గొప్పజలమార్గము** (సెంటు లారెన్సునది) — ఇది ఓడలు సముద్రమున నడచు, స్వతస్సిద్ధజలమార్గముంబోలి కొన్ని సరస్సులు, కొన్ని నదులు, కొన్ని కాలువలఁ గూర్చి ఒకటికొకటింజేర్చి ఒకకడనుండి సముద్రములోనికిగుండా నిర్బాధకరముగ నుండునటుల ౨౧౦౦ మైళ్లదనుక చక్కఁజేయఁబడిన మార్గము. ప్రపంచమందిటి కృత్రకజలమార్గములలో నిదియె గొప్పదనుచున్నారు. తొలుత నిపిగాన్ సరస్సునుండి ఈమార్గ మారంభమగును. అది లోతు గలదియెగాని

ఒకపాటి చిన్న సరస్సు. ఈనిపిగాన్సరస్సునుండి ప్రారంభమైన జలమార్గముకడకు సెంటు లారెన్సునదిగుండాGulf of St.Laurance ఎశ్చుఅరీలోనికిం జేరి మాంట్రేల్ క్యూబిక్కునగరముల రేవులకుం జేర్చుంగాన దీనికి సెంటు లారెన్సు జలమార్గమని పేరిడియున్నారు. ఓడలు తిన్నగా నిపిగాన్ సరస్సునుండి యట కుం జేర్చును. నిపిగాన్ సరస్సునుండి లేక్ సుపీరియరుదనుక నుండిన వెడలుపులేని ఒక తంపరంద్రవ్వి లోతుచేసి, ఓడలు నడచునట్లు కుదిర్చిరి. దీనిగుండా ఓడలు సుపీరియరు సరస్సు లోని కరుగును. ఇది చాలాగొప్పది యగు తీయనీటిసరస్సు; ౩౫౦ మైళ్లు పొడవును ఎక్కువ వెడలుపగుతావున ౧౬౦ అడుగుల వెడలుపుండును. సర్వేసర్వత్రా ఇంచుమించు ౫౦౦ అడుగుల లోతుంగల్గి శీతాకాలమం దప్పటప్పట కొన్ని తావులు తీరములందు ఘనీభవించుట, ఓడలకుఁ గష్టముం గల్గించుచుండునట. దీనియొక్క ఆగ్నేయ దిశనుండి వెడలుచుండు జలప్రవాహమునకు ఆదినే సెంటుమేరీనదియని పేరిడి యుండి దానినిత్రవ్వి లోతుగజేసి యోడలను నడపుదురు. ఈనదియంతయు ౭౭ మైళ్ళు పొడవుగలది. ఇందు నడుమను అరమైలుకు కొంచెముపైగా నది పల్లములోనికింబడు మార్గము (Rapids) కలదుగాన ఆతావున కిరు పార్శ్వములందు రెండు కాల్వలంద్రవ్వి రాక కొకటియు, పోక కొకటియు నేర్పర్చి ఓడలను వానిగుండా నడపి, తిరుగ నదికింజేర్చి ప్రయాణముసాగించి హురాన్ సరస్సుకుం జేర్చుదురు.

హురాన్ సరస్సు ౨౮౦ మైళ్లపొడవును, వెడలుపగు తావున ౧౦౭ మైళ్లు వెడల్పును, ఇంచుమించు వెయ్యి అడుగుల లోతుంగల్గి యుండును. కాని దీనియం దోడలట్టికాలము నడువక, దీనికొన కంటియున్న మిచిగాన్ సరస్సునం జేరును. ఇది ౩౪౭ మైళ్లు పొడవును, ఎనుబదినాల్గు మైళ్లు వెడల్పును, నగటున వేయిఅడుగుల లోతును గల సరస్సు. దీనితీరమునందే నైరుతిదిశను చికాగో నగరమున్నది. మరియు మిచిగాన్ సరస్సు నుండి మిసిసిప్పీ నది కొక ఓడలకాలువయుం గూడ కలదు. మిచిగాన్ సరస్సునుండి బయలుదేరిన ఓడలు సెంటుక్లేయరునది (ఇం దుత్పన్నమై లోతుచేయంబడిన నది) గుండా సెంటుక్లేయరు సరస్సున కరగెడిని. దూరము ముప్పదిమూడు మైళ్లుండును. సెంటుక్లేయరు సరస్సు ఇరువదియైదుమైళ్లు పొడవుగల చిన్న సరస్సు. దీని యవ్వలికొననుండి మొదలిడి పదునెన్మిదిమైళ్ల దూరమునకు త్రవ్వి లోతు చేయఁబడిన డిట్రాయె ట్నదీప్రవాహము గుండా నడచి ఎర్రిసరస్సునకుం జేరనగును. ఇది ౨౭౦ మైళ్ల పొడవును, ౮౦ మైళ్ల వెడలుపుం గల్గియున్నది గాని లోతుచాలని మెరకసరస్సుగాన, దీనిగుండా ఎర్రి కాలువను లోతుగనుంచి ఓడలనడపుచుందురు. మరియు నీలోతులేని సరస్సునకు శీతకాలమున ఘనీభవించు దుర్దశకూడ కల్గుచుండునట.

ఎర్రి సరస్సునుండి ఓడలు నయగారానదిం జేరును. దీనిపొడవు ౨౮ మైళ్లు. ఈనడుమనే జగత్ప్రసిద్ధమగు నయగారా జలపాతమున్నది. (నయగారా జలపాతము చూడుఁడు). జలపాతమును దానికిం బూర్వపు రేపిడ్సును తప్పించుకొనుటకు ఓడలకాలువ యొకటి ప్రక్కగ త్రవ్వఁబడి, దానిగుండా ఓడలు నడచి, నయగారాగోర్జింగడచి, శాంతమైన

తావున తిరుగ నది లోనికిఁ జేరుకొనును. నయగారాగోర్జి ఏడుమైళ్లు పొడవును, నడుమ నొక సుడిగుండముకలిగి అపాయకరముగ నుండును., పిదప మరి యేడుమైళ్లలో నయగారానది అంటారియా సరస్సునకుం జేర్చును. ఎర్రి సరస్సునందే బఫెలోపురము కలదు.

అంటారియోసరస్సు ౧౯౨ మైళ్లపొడవు, ౫౨ మైళ్ల వెడలుపుఁగల్గి, ౪౦౦ అడుగుల లోతుగనుండును. దీనింగడచుటతో సెంటు లారెన్సునది యనఁబడు ప్రవాహముగుండా గమనము మొదలిడినను అది (Rapids) దొరలుట విస్తారముగాన ప్రక్కంద్రవ్వఁబడిన కాల్వలగుండా నడువవలసి యుండును. మార్గమున సెంటు లూయీసరస్సు కలదు. అందు ఒటావానది సంగమించును. అచటికిం గతిపయదూరముననే మాంట్రీలు నగరపు రేవుస్థలము కలదు. నది లోతుచేయంబడి ఓడలు సౌఖ్యగమనమున క్వ్యూబెక్కు రేవు గడచి, విశ్చలరీగా నగుచున్న నది సెంటు లారెన్సు సంయుక్తాగ్రగుడ సముద్రముం జేరుకొనును. దీనిని స్వదేశస్థులు ఉత్సాహపూరితులై St. Laurance River అనెదరు.

**అమెరికన్ ఇండియనులు** — తొల్లింటి యమెరికాదేశవాసులు. క్రిష్టఫర్కొలంబసను నాతఁడు ఇండియానుగూర్చి వెదకుచు, అమెరికాకువచ్చి అదే ఇండియాయనుకొని అచటి ప్రజలను ఇండియనులని వాడఁదొడంగెనట. ఇది క్రీ. వె. ౧౪౯౩. ఉత్తర అమెరికా వారిని రెడ్డిండియన్సు అనెదరు. క్రీ. వె. ౧౯౩౦ నాటి లెక్కప్రకారము అమెరికా సంయుక్త రాష్ట్రములందు ౩౫౫౫౦౦౦, కనడాదేశమున ౧౧౦౦౦౦ ఇండియనులు కలరని తెలియుచున్నది. వీరందరు అమెరికా యాదిమ నివాసులే.

**అమెరికా సంయుక్త రాష్ట్రములు** (United States of America) — ఉత్తర అమెరికాయందు దేశమునకు దక్షిణముగా నున్నది. తూర్పున అట్లాంటిక్కు మహాసముద్రము, పశ్చిమమున పసిఫిక్కు మహాసముద్రము, దక్షిణమున మెక్సికో దేశము, మెక్సికో సంయుక్తాగ్రగుడమును, ఎల్లలు. ఐరోపాఖండమంతటితో నించుమించుగ పరిమాణమున తులదూగు నీదేశమును ఒక ఖండముగ నెన్నఁదగును. ఇదిగాక ఇందు అలాస్కాయును, పెక్కు ద్వీపములును, చేరియున్నవి. ప్రజాపరిపాలనదేశము. అనేక సీమ లిందు సంయుక్తమైయుంట సంయుక్త రాష్ట్రములని పేరయ్యెను.

అలాస్కా ౫౩౦౦౦౦ చతురపుమైళ్ల వైశాల్యముకలది. తొల్లింట దీనికి రష్యను అమెరికా యని పేరు వాడఁబడుచుండెను. దానిని సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వము మూల్యమిచ్చి కొని కలుపుకొనెనని చెప్పఁబడినది. ఉత్తరభాగములు శీతలముగను, దక్షిణ భాగములు సమశీతోష్ణముగను ఉండును. ఉత్తరసీమలందు శీతకాలమున ఘనీభవించు మంచునెత్తి నిల్వయుంచుకొని యుపయోగించుకొనియెదరు.

సంయుక్త రాష్ట్రములందు గొప్ప పర్వత పఙ్క్తులు కలవు. వాటినడుమనుండు ఎత్తైన పీఠభూములకు Parks అనిపేరు. అట్టివాటి యందు Yellow Stone NationalPark చాల గొప్పది. పర్వతములందు ఎన్నఁదగిన శిఖరములు:- లాంగ్సు శిఖరము ౧౪౨౭౧ అడుగులును, పైక్సు శిఖరము ౧౪౧౩౪ అడుగులును, హార్వార్డు శిఖరము ౧౪౩౭౫ అడుగులును, బ్లాంకా శిఖరము ౧౪౪౬౩

అడుగులును, పెకోమా శిఖరము ౧౪౪౪౪ అడుగులును, విట్నీ శిఖరము ౧౪౮౮౮ అడుగులును సముద్రపు నీటిమట్టముపై ఎత్తుగలవి కలవు. ఇవన్నియు మంచుతో దట్టముగ గప్పఁబడియుంటయేగాక ప్రక్కలందు దట్టమైన అరణ్యములు కలవు.

అమెరికా సంయుక్తరాష్ట్ర దేశమువలె ప్రపంచమందలి మరియేయింత పరిమాణ వైశాల్యములుగలదేశమును ఇంతజలసమృద్ధిం గల్గియుండలేదని గొప్ప భూగోళశాస్త్రజ్ఞులు వచించియున్నారు. మంచినీటిసరస్సులేగాక నదులును ఈదేశమున విస్తారముగాగలవు. దేశము కడువిశాలవంతమగుట నైసర్గికముగ నదులు చాలాపొడవుగల్గినవి కలవు అవి చాలాదూరముదనుక విస్తారము లోతుగలవి గను, ఈ భూమియందు లెక్కకుమీరియున్న సరస్సులగుండా ప్రవహించుచుంటయు, పొగ యోడలు నడచునవియై రాకపోకలకు, వర్తక వ్యాపారముల కనుకూలించునవిగ నున్నవి. మిసిసిపీ నదిలో మిస్సోరీనది కలియుట కొంత వరకు వింతయనిపించకపోదు. స్వచ్ఛమైన నిర్మలోదక ప్రవాహముగల మిసిసిపీయందు బురదనీరుగల మిస్సోరీ కలిసినపిదప చాలా దూరము రెండుజలములు కలియక ప్రవాహము సంయుక్తమయ్యు, రెంటిజలములు వేర్వేరై తెలియునటుల నడుచుచుండును. ఇది ౪౩౦౦ మైళ్ళ పొడవుగలది. ఇందు ఓహియోనది, ప్లాటీనది, అర్కాన్సాస్‌నది, రెడ్ రివర్ అను నది దీనికుపనదులై దీనియందు జేరుకొనును. ఇవి వరుసగ ౧౦౦౦, ౪౦౦, ౨౦౦౦, ౧౫౦౦ మైళ్ళ పొడవుగలవి. మిసిసిపీయన మహానదియనియు, మిస్సోరీయన పంకజలమనియు అర్థములట. మిస్సోరీనదియె ౩౧౪౭ మైళ్ళ పొడవుకలది. ఇందు ౨౬౪౨ మైళ్ల దూరము పొగయోడలు నడుచునని చెప్పఁబడినది.

కన్నెక్టికట్టనది, హడ్సన్‌నది, డెలవారీనది, సస్క్వెహాన్నానది, పోటోమేక్‌నది, సాక్రమెంటోనది, కొలంబియానది, కొలోరెడో నది (దీనింగూడ రెడ్‌రివర్ అనెదరు) యను నవి గొప్ప నదులుగ జెప్పఁబడదగినవి. ఇంక చిన్నచిన్న నదులు పెక్కులు గలవు. (నయగారానదిం గూర్చి నయగారా జలపాతము చూడుఁడు). సెంటులారెన్సునది అంటారియో సరస్సునందు పుట్టి, మూడు లేక నాల్గు సరస్సులగుండా నడచి, అట్లాంటిక్కు మహాసముద్రమునఁ గలియును. ఈ నది విచిత్రములలో నొకటిగ నున్నది. జన్మించిన తోడనే కనడాదేశముతోగల హద్దున నడచి, వేయిద్వీపముల సరస్సుంజొచ్చును. ఇందలి ద్వీపములు వేయి అనిపేరేగాని చిన్నాపెద్దా ౧౬౯౨ కలవని లెక్కింపఁబడినవి. పిదప నీరొడుదుడుకుగ నించుక పల్లమునకుందిగుచు తొమ్మిదిమైళ్లు నడచి, సెంటుఫ్రాన్సిస్‌సరస్సుం జొచ్చును. ఇది ౨౯ మైళ్లు పొడవు, ౬ మైళ్లు వెడల్పు యుండును. ఇందు ద్వీపములును కలవు. పిదప సెంటులూయీస్ సరస్సుం జొచ్చును. ఇది ౧౨ మైళ్లు పొడవు, ౬ మైళ్లు వెడల్పుగలది. పిదప తిరుగ నొడుదుడుకై Lachine Rapids అనంబరగి, తదుపరి నదిరూపమునను, తర్వాత నదీముఖ ద్వారమువలెను, పిదప సంయుక్తాగ్రగుడాకారమునఁ దనరి సముద్రమునం జేరుకొనును.

ఈ దేశమునఁగల సరస్సులకు మితిలేదు. (కెనడాదేశమునకు, దీనికి నడుమనుండు లేకు సుపీరియర్ చూడుఁడు). మిచిగాన్‌సరస్సు

(త్రిరగం చతురపుమైళ్లు), హురోన్సరస్సు (తొరం౦చ మైళ్లు), ఎరీసరస్సు(మిచిగాన్లో సగము), అంటారియోసరస్సు ముఖ్యములు. ఇవి యన్నియు నొకటితోనొకటి సంబంధము కలవియై పొగయోడలు నడువఁ దగినవిగ నున్నవి. నదులయందింకను కొద్దిగనో గొప్పగనో ప్రాముఖ్యతనందినవిగఁ జెప్పఁదగిన నదులు Wiscon Sin నది, ఇల్లినోయిస్ నది, సాక్రమెంటో నది యని చెప్పవలయును.

ఈ పెద్దదేశమున నుత్తరభాగములు శీతలముగను, మధ్యభాగములు సమశీతోష్ణములుగను, దక్షిణభాగము ఉష్ణప్రదేశములుగ నుండుననియు; మెక్సికో సంయుక్తాగ్రగుడతీరమున పల్లపుఁ బ్రదేశములనారోగ్యములుగను, జ్వరములఁ గల్గించునవిగ నుండుననియు; ఆకాశము సర్వసాధారణముగ మేఘములులేక స్వచ్ఛమై యుండుననియుఁ జెప్పఁబడినది. ఇనుము, సీసము, రాక్షసబొగ్గు, విస్తారము దొరకుచున్నవి. బంగారు, వెండి, కొలఁదిగ రాగి గను లచ్చటచ్చటఁ గలవు. పెట్రోలియమ్ విస్తారముగ భూమినుండి తీయఁబడుచున్నది. కొన్ని Mineral Gases భూమినుండి లభించును.

అలాస్కా మొదలగు కొన్ని సీమలు వ్యవసాయమున కనర్హములైనను, సగటున సంయుక్తరాష్ట్రముల భూమి మంచి దనియే చెప్పవచ్చును. నీటియిబ్బంది లేకుండ సస్య సమృద్ధిగ నున్న దేశ మని చెప్పఁబడినది. గోధుమలు, జొన్నలు, మొక్కజొన్న పొత్తులు, ప్రత్తి, పొగాకు, చెరకు, ధాన్యములు, ఉన్ని, నారలు, వేత్త్వరుజాతుల కర్రలు, విస్తారము పైరుచేయఁబడి పెంచఁబడి ఎగుమతి చేయఁబడుచున్నవి. దక్షిణ దేశములందు చెరకునుండియు, మధ్యదేశములందు బీటు దుంపనుండియు, ఉత్తరదేశములందు Sugar Maple Tree రసమునుండియు, పంచదార విస్తారము చేయఁబడుచున్నది. సంయుక్త రాష్ట్రములందుఁ గూలినాలుల ప్రజలు లేరు కాన, ప్రతికార్యమునందు యంత్రసాహాయ్య మధికముగ నుపయోగింపఁబడుచుండును.

నిగ్రోజాతులప్రజలు దినదినాభివృద్ధినందుచు నధికసంఖ్యాకులగుచున్నారు. గ్రోలు యథాస్థితినే యుంచుక యభివృద్ధిగాంచుచున్నారు గాని క్షీణించుటలేదు. ఆదిమనివాసులగు నమెరికా ఇండియన్ జాతులు క్షీణించుచున్నవనియె చెప్పఁదగును. ప్రజలయందు సంచలనమధికము. కార్యదీక్ష ద్రవ్యార్జనయందు గాననగుచుండును. పనిపాటలు త్వరితముగఁజేసి ముగించుటయందు బాధ్యతనొందు. వర్తకవ్యాపారములందుఁ బ్రజలు నిపుణతగలవారుగను సర్వసాధారణముగ విద్యావంతులుగ నుందురు. స్నేహమున ముందడుగు వైచెదరు. మానమును గంభీరత వహించుట సహింపనివారు. తమ ధైర్యోదారసాహసములను, స్నేహితులగు నన్యులకెరింగించు ప్రసంగములందుసాహసముగలవారు. మొత్తమునఁ గ్రియాశూరులు, కార్యదక్షులుగఁ జెప్పఁబడినవారు. విద్య చక్కగ వ్యాపించి యున్నది. దేశమున తూర్పునుండి పడమరగ గొప్ప ఇనుపబాటకలదు. గొప్ప పట్టణము లన్నింటికి చక్కని రైల్వేమార్గములు వేయఁబడినవి. టెలిఫోన్ సదుపాయములు దేశమంతటను వ్యాపించియున్నవి. ఆకాశమువైపు చాలా ఎత్తునకు Sky Scrapers అను పేరుగల మేడలు నిర్మించుటయందు అమెరికా వారెక్కువ పే రందినవారు. కొన్నికొన్ని

స్కైస్క్రేపరు భవనములు ముప్పదియంతస్తులవికూడ కలవు. ఇట్టి భవనములు సర్వసాధారణముగ నన్ని పట్టణములందుఁ గానవచ్చెడిని. ధనవంతమగు దేశమగుటచే నన్యుల నాదరించుటయందును, ఎక్కువదానధర్మము లొనర్చుటయం దీదేశము పేరందినది.

ఇది ప్రజా ప్రభుత్వదేశము (Federal Republic). ఒక అధ్యక్షుఁడును, ఒక ఉపాధ్యక్షుఁడును నాల్గు సంవత్సరముల కొకసారి ఎన్నుకొనంబడుచుందురు. House of Senators సభయు, House of Representatives సభయు, నిర్వాహధ్యక్షులును కలిసి కాంగ్రెస్‌సభ యనఁబడునది శాసననిర్మాణసభగా నుండును. ఈ సంయుక్తదేశమున అనేక రాష్ట్రములు (States) కలిసి యీ సభ నెన్నుకొనుచుండును. ఇదిగాక ప్రతిస్టేటు ఒక్కొక ప్రతినిధిని సభ కనుపుచుండును. వారు మాట్లాడుటకుఁ బ్రశ్నించుటకు సావకాశము కలదుగాని, ఓటుచేయు స్వాతంత్ర్యములేదు.

౧౯౪౦౦౦ జనుల కొక ప్రతినిధి (Representative) ఎన్నుకొనఁబడును. ప్రతిస్టేటునకు శాసనముల నమలుజరుపు నధికారికి గవర్నరు అనిపేరు. ఈగవర్నరులను నియమించు నధికార మధ్యక్షుని యందుండును. టెరిటరీలు ప్రభుత్వమువారి పరిపాలనయం దుండును. ప్రతిస్టేటునకు తన స్వంతపరిపాలనము నెరపుకొను స్వాతంత్ర్యము కలదు. సెనెటరుమెంబరులు ఆరు సంవత్సరముల కొకసారియు, రిప్రజంటెటివ్ ప్రతినిధులు రెండుసంవత్సరముల కొకసారియు నెన్నుకొనఁ బడుచుందురు. క్రీ. వె. ౧౬౨౪ మొదలు ౧౭౩౨ వరకు ఈదేశము కాలనీ లనఁబడి బ్రిటీషు ప్రభుత్వము క్రింద నుండెను. పిదప స్టేటుల క్రింద మార్పునందుచున్నను ౧౭౭౬ వఱకు బ్రిటీషువారి పాలన క్రిందనేయుండి, ఒకపన్నుంగూర్చి తిరుగుబాటుజరిగి ప్రజ లేకస్థులై తమస్వతంత్రమును ప్రకటించుకొనిరి. (డిక్లరేషన్ ఆఫ్ ఇండిపెండెన్సు చూడుఁడు.) పిదప నేడుసంవత్సరములు యుద్ధము జరగినది. కడకు నింగ్లాండుపార్లమెంటువారు వీరి స్వాతంత్ర్యము నొప్పుకొనిరి. ఇప్పుడిందు ౪౮ స్టేటులును, ఆరు టెరిటరీలును సంయుక్తమై యున్నవి. వీటి చిహ్నములుగ నమెరికా సంయుక్తరాష్ట్రపు జండా (National Flag) యందు నలుబదియైదు నక్షత్రములు (Stars), ఆరు గీతలు (Stripes) లిఖింపఁబడియున్నవి. దీనినుండి ఈదేశమునకు Land of Stripes and Stars అని వాడుకపేరు (Nick Name) కల్గినది. (నిక్నేమ్సు చూడుఁడు.)

ఉత్తరపు స్టేట్సు ఆరు — వీటిని న్యూ ఇంగ్లాండు స్టేట్సు అనియు ననుచున్నారు. ౧. మెయిను, ౨. న్యూహేంప్‌షైరు, ౩. వెర్మాంటు, ౪. మసాచుసెట్సు, ౫. రోడ్ ఐలెండు, ౬. కనెక్టికట్ అనఁబడునవి. ఇందు మెయిన్ అనఁబడిన స్టేటు తక్కిన యన్నిటికన్న పెద్దది. పిదపనిది యనేక చిన్నభాగములుగ విభజింపఁబడినది. వెర్మాంటు అందలి పర్వతములనుండి అట్లుపేరందినది. ఆపర్వతములకు Green Mountains అనిపేరు. మసాచుసెట్సును Bay State అనియు నందురు. ఇందు సుప్రసిద్ధ పాఠశాలలుకలవు. రోడైలండుస్టేటు చాలాచిన్నది. కన్నెక్టికట్టు స్టేటు నామమునకు దీర్ఘనదమని యర్థము.

మధ్యఅట్లాంటిక్కు స్టేట్

౧. న్యూయార్కుస్టేటు, ౨. న్యూజర్సీస్టేటు, ౩. పెన్సిల్ వేనియాస్టేటు, ౪. డెలావరిస్టేటు, ౫. మేరీలాండుస్టేటు, ౬. వర్జీనియాస్టేటు, ౭. పశ్చిమపు వర్జీనియాస్టేటు అనంబడినవి. ఇందు న్యూయార్కు స్టేటును ఎంపైరుస్టేటు యనియు నందురు. యార్కుప్రభువు పేరిడంబడినది. జనసంఖ్య ఇం దధికము. వర్తకము విస్తారము నడచుచుండు సీమ. పెన్సిల్ వేనియా యను నామము, ఇటకాలనీ ప్రారంభించిన పెన్ అనువారి పేరునంబరగు చున్నది. ఇం దినుము, రాక్షసబొగ్గు, పెట్రోలియమ్ విస్తారములభించుట ధనవంతమై జన బాహుళ్యము కలదిగానున్నది. మేరీలాండు: ఇంగ్లాండుదేశమేలిన ఒకటవ చార్లెసుభూపతి రాజ్ఞియగు మేరీరాజ్ఞి పేరునంబరగుచున్న సీమ. వర్జీనియా: సర్ వాల్టరురాలెవల్లనీకాలనీ ప్రారంభింపఁబడి Virgin Queen అనం బడిన ఎలిజబెత్ రాజ్ఞి పేరిడఁబడినది. ఇందు పొగాకుపంట విస్తారము. దీనిని తర్వాత భాగములుగ విభజించిరి. దక్షిణ అట్లాంటిక్కుస్టేట్లు నాలుగు, ౧. నార్త్ కరోలినా, ౨. సౌత్ కరోలినా, ౩. జార్జియా, ౪. ఫ్లోరిడా అనఁబడునవి. ఇందు కరోలినా నామము ఒకటవచార్లెసుభూపాలుని పేరం బరగు సంబంధనామము. ఉత్తరకరోలినా యందు తారు, బెండ్లు విస్తారముచేయఁబడు చున్నవి. దక్షిణకరోలినాయందు ధాన్యపు పంట యధికము. జార్జియా: ఆంగ్లదేశ మేలిన రెండవజార్జిభూపతిపేరునంబరగుసీమ. ఫ్లోరిడాపేరు యాసీమయందుగల సౌందర్య వంతములగు పూలజాతులచే, స్పానియా దేశస్థు లిడినపేరు. ఇంచుక నుత్తరముగా మధ్యనున్న స్టేట్లు పండ్రెండు. అవి, ౧. ఓహియో, ౨. ఇండియానా, ౩. ఇల్లినాయ్స్, ౪. మిచిగాన్, ౫. విస్కాన్సిన్, ౬. మిన్నెసోటా, ౭. ఇయోవా, ౮. మిస్సోరీ, ౯. నార్ డకోటా, ౧౦. సౌత్ డకోటా, ౧౧. నెబ[illegible], ౧౨. కాన్సాస్ అనఁబడునవి. ఇందు ఓహియో ధనవంతము [illegible]వంతము నగు సీమ. [illegible]యోయనిన, [illegible]దర్యవంత మగు నదీసీమ యని యర్థము. ఇండియానా యందు ఇండియను లధికసంఖ్యాకులుగలరు. [illegible]యిస్ అనిన మహాజనుల సీమయనియర ము. దీనిని ప్రైరీస్టేటు (Prairie State) అనియు నందురు. మిచిగాన్ అనిన గొప్పసరస్సుసీమ యనియర్థము. ఇందు రాగి గనులుకలవు. విస్కాన్సిన్ అనిన Wild Rushing River సీమ యని యర్థము. మిన్నెసోటా యన, ఆకాశపురంగు నీటిభూమి యని యర్థము. ఇయోవా యనిన సుందరభూమి యని యర్థము. మిస్సోరీ యనిన పంకయుత నదీజలదేశమని యర్థము. ఇందు ఇనుము, రాక్షసబొగ్గు అధికముగ దొరకుచున్నది. నెబ్రాస్కా యనిన లోతులేని నీటిదేశమనియర్థము. కాన్సాస్ అనిన ధూమ్ర నదీదేశ మని యర్థము.

దక్షిణముగా మధ్యనున్న స్టేట్లు ఏడు– ౧. కెంటకీ, ౨. టెన్నెసీ, ౩. ఆల్బామా, ౪. మిసిసిపీ, ౫. లూశియానా, ౬. టెక్సాస్, ౭. ఆర్కన్సాస్ అనఁబడునవి. కెంటకీ యనిన రక్తకాళభూమి యని యర్థము. ఇందు గొప్ప గుహాలు కలవు. అలబామా యనిన విశ్రామస్థలమని యర్థము. ఇట ప్రత్తి విస్తారము పై రగుచున్నవి. మిసిసిపీ యనిన మహాజలమని యర్థము. ఇదియు

ప్రత్తివిస్తారముగ పైరగుచున్నవి. లూసియానా యందు పచార విచారముగ చేయఁబడు చున్న [illegible] అనగ న్యూయూ వినోద సీమ యని యర్థము. ఇది చాల విశాలవంత [illegible] వె. ౧౮౭౬ లో సంయుక్త మైనది. దీనిని, Cattle Breeding State అనియెదరు. ఇందు పశువులుతిరుగు బీళ్లకు Ranches రేంచెస్ (Ranges) అనియెదరు.

పశ్చిమమున నున్న [illegible] ష్ట్ర [illegible] ములు- ౧. మాంటానా, ౨. వోమింగ్, 3. కొలరేడో, ౪. ఊట్, ౫. నెవాడా, ౬. ఇడాహో, ౭ వాషింగ్టన్, [illegible] ౯. కేలిఫోర్నియా [illegible] కొలరేడో: దాని యందుగల రాళ్లరంగునుం[illegible] ఇందు బంగారు, వె[illegible] గనులు [illegible] ఊట్ స్టేటు: మార్మనులకు స్వస్థానము. ఇందు Salt Lake కలదు. ఇది తరువాత సంయుక్తతలోనికిఁజేరినది. నెవాడాయందు బంగారు వెండిగనులు కలవు. వాషింగ్టన్ స్టేటు మొదటి యధ్యక్షుఁడగు జనరల్ వాషింగ్టన్ సేనానిగారి పేరునం బరగుచున్న సీమ. కేలిఫోర్నియాస్టేటు: పండ్లకు, ధాన్యముల పంటలకు పేరొందినది. కేలిఫోర్నియాయన అగ్నికుంపటియని యర్థము. వేసవికాలమున నీసీమయందు వేడియధికముగాన నీపేరయ్యెను ఈసీమయందుఁగలయూసెమైటు (Yosemite Falls) అరమైలు ఎత్తునుండి పడు గొప్ప జలపాతము కలదు. ఈరాష్ట్రమందు వెండి, బంగారు గనులు కలవు.

ఈ సంయుక్తమునందు ఆరు టెరిటరీలు చేరియున్నవి. అవి ౧. ఓక్లహామా, ౨. న్యూమెక్సికో, 3. అరిజోనా, ౪. ఇండియన్ టెరిటరీ, ౫. అలాస్కా, ౬. హవాయ్ అనఁబడునవి. అందు అలాస్కా రష్యావారి [illegible] ఇందు బంగారుగనులు కలవు. అవి [illegible] సంయుక్తరాష్ట్రమునందలి పురములలో ప్రథమము వాషింగ్టను [illegible] పోటోమేక్ నదీతీరమున కొలంబియాయందున్నది. ఇది సంయుక్త ప్రభుత్వాధికారస్థానము. ఇందు అధ్యక్షుఁడు వసించుచుండుట కేర్పరచబడిన భవనమునకు [illegible] అనిపేరు. ప్రభుత్వకార్యాలయములు, [illegible] సభలుకూడు భవనమునకు కేపిటోల్ అనిపేరు. ఈ రెండును మహా గొప్ప భవనములు. పురమున వెడలుపైన బాటలు విస్తారముగ నుండి, ఇరుదెసలం జక్కని దివ్యభవనములం గల్గియున్నది. ఇటనే వాషింగ్టన్ మెమోరియల్ కలదు (చూడుడు).

న్యూయార్కునగరము గొప్ప జనసంఖ్య గల నగరము. గొప్ప వర్తకస్థలము, ఓడ రేవు. హడ్సన్ నదీముఖద్వారమున మాన్హాట్టన్ ద్వీపమున నదీజలములమధ్య నున్నది. నదీశాఖల కవ్వల బ్రూక్లీన్ నగరము, జర్సె నగరము ఇరుదెసలను కలవు. వీటింగల్పుటకు ప్రపంచమంతటను పేర్వడసిన గొప్ప వంతెన లిరుదెసల రెండు నిర్మింపఁబడినవి. వాణిజ్యవిస్తారమున నిది ప్రపంచమున రెండవ స్థలమని చెప్పఁబడియున్నది. నగరమంతయు స్కై-స్క్రేపరు మేడలమయమై యుండును. వీధులయందు స్తంభములపై నిర్మింపఁబడిన ఇనుపదారులు కలవు. ఇంకను చికాగో, వాషింగ్టన్ మున్నగు ప్రపంచప్రసిద్ధములగు గొప్పగొప్ప పట్టణములు, వర్తకకేంద్రములు కలవు. వాషింగ్టన్ పురమునందు అమెరికను రిపబ్లికు అధ్యక్షుఁడు నివసించుచుండును. అది అమెరికా ముఖ్యపట్టణము. చికాగోలో ననేకములగు రైల్వేలు కలియును.

**అమెరికా సంయుక్త రాష్ట్రమందలి ఏడు గొప్పవింతలు** — ౧. సుపీరియర్ సరస్సు (Lake Superior)- ఇది ప్రపంచమున సరస్సులలోనెల్ల పెద్ద సరస్సని చెప్పఁబడినది. ౨. మామత్ కేవ్ (Mammath Cave)- ఇది సంయుక్త రాష్ట్రములలోని కెంటకీస్టేటునందున్నది. ఇది ప్రపంచమందలి గుహాలలోనెల్ల చాల పెద్దదిగ చెప్పఁబడినది. 3. నయగారా జలపాతము (Nayagara Water Falls)- దీనింగూర్చి ప్రత్యేకముగ వివరింపఁబడినది. ఇచటి జలములు ముప్పాతిక మైలు వెడలుపుగలవి. జలపాతము ౧౭౫ అడుగులు గలది. ఇత్తావు అమెరికా సంయుక్తరాష్ట్ర దేశమొకదెసను, కనడాదేశ మొకదెసను గల్గియున్నది. ౪. వర్జీనియా రాతివంతెన (Natural Bridge Over Bedar Creak)- ఇది సంయుక్తరాష్ట్రములందలి వర్జీనియా స్టేటునందున్నది- జలప్రవాహముపై వంతెనవలె నొక శిల సర్వలక్షణములతోఁ దనరారుచున్నది. ౫. వాషింగ్టను మాన్యుమెంటు (Washington Monument)- ఇది అమెరికా సంయుక్తరాష్ట్రములలోని వాషింగ్టన్ నగరమున జనరల్ వాషింగ్టన్ (ప్రెసిడెంటు) గారి జ్ఞాపకచిహ్నముగ నిర్మింపఁబడిన ౫౫౫ అడుగుల ఎత్తుగల స్తంభము. ౬. యోసెమైటు వేలీ (Yosemite Valley) లోవ- ఇది కాలిఫోర్నియా స్టేటునందున్న లోవ. ఎన్మిది లేక పదిమైళ్ల పొడవును, ఒక మైలు వెడలుపును గల్గి ఏటవాలేమియులేని చాల ఎత్తుగనుండు కొండలచే చుట్టుకొనంబడి భయంకరాకారము గలదిగ నుండును. చుట్టుకొనియుండు పర్వతములు మూఁడువేల అయిదువందల అడుగుల ఎత్తనియు, అనేకశతాబ్దముల నీట వలె చిన్నగా నెత్తునుండిన శిలాప్రదేశమే నాలుగువేల యడుగుల ఎత్తుగ నున్నదనియుఁ జెప్పఁబడినది. ఆలోవయందే వేరొకచో ఇంచుమించు ఏటవాలులేని శిలాతలపుగోడ మూఁడువేల రెండువందల యెబ్బది యడుగుల ఎత్తని చెప్పబడినది. ఈలోవయందు జలపాతము లేడువందలు మొదలు వేయిఅడుగుల యెత్తునుండి క్రిందికి బడునవి కలవు. ౭. సబ్జువియల్ వంతెన (The Subjhuvial Bridge or Tunnel Under the Hudson River)- ఇది న్యూయార్కు నగరముకడ నున్నది. పెన్సిల్వేనియా రైల్రోడ్ కంపెనీవారి నిర్మాణము. ప్రపంచమున నిట్టి కట్టడములలో మొదటిదట.

**అమేరాపని** (Amarah Work)—ఇరాక్ దేశమున టైగ్రిస్ నదీతీరమందు అమెరాయను పట్టణమున తొలుత ప్రారంభింపఁబడిన పని. ఇటీవల నాదేశమం దితర పట్టణములందుఁ గూడ చేయంబడుచున్నపని. వెండిసామానులపై చిత్రవిచిత్రమగు రూపములను వ్రాసి రంగులువేయుదురు. ఎనెమిల్ వంటి పని, చాలామనోహరమై యుండు గొప్ప విశారదత్వముగలది. ఆరబ్బుపనివాం డ్రీ అమెరాపని యందు నేర్పరులు. ఈసీమయందీపని చేయుచు బహుజనులు జీవనోపాధింగాంచుచున్నారు.

**అమోనియా** (Ammonia)—గ్రీకుభాషా పదమగు Ammoniakon పెట్లుప్పు అనుపదము నుండి కల్గినది. ఇదియొకగాలి. ద్రవరూపముగఁ జేసి దీని నుపయోగించుచున్నారు. దానికి Carbonate of

Ammonia అని రసాయనశాస్త్రజ్ఞులు పేరిడి యున్నారు. అమోనియా సోడా చేయుటయం దుపయోగించును. రంగులకు పనికివచ్చును. ఇది Bi-product. రాక్షస బొగ్గు దీనికి మాతృక. అమోనియానుండి అమోనియమ్ సాల్టులుతీయుదురు.

**అయంగోత్రము**— శండిలగణముచూడుడు.

**అయనకులగోత్రము** — ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుడు). అయనకులగోత్రము ఏకాన్నేయ గోత్రము (౧౮). సంస్కృత గోత్రము పింగళస, హారితగణము, ఆపస్తంభ సూత్రము, యజుశ్శాఖ, ప్రమాణగ్రంథ మాద్యప్రవరఖండ, భోగీశుఁడు దేవత, (భార్య) నాగాంబ, వేదారణ్యము తపస్థానము, పున్నాగసరస్సు తటాకము, జపము కోటి, దీపములు ౪౦, క్షేత్రసంఖ్య ౧౬, షోడశ మహాదానములు దానము, అవిసెకూర ద్వాదశిభోజనము వర్జనీయములు.

**అయనపుణ్యకాలము** — పుణ్యకాలములు చూడుఁడు.

**అయనములు** — సంక్రాంతులు, విషువత్తులు- భరతదేశపు విధానమున సంవత్సరమునం దయనములు రెండు. సూర్యుఁడు తిరుగుట భూమిపైవారి కగుపడుచుండు రీతిని, భూమధ్యరేఖ (Equator) దానికుత్తరమునను దానికిదక్షిణమున నుండెడిని. ఉత్తరదిశయందుంట నుత్తరాయణమనియు, దక్షిణదిశయందుండుకాలమున దక్షిణాయణమనియు, జ్యోతిషశాస్త్రమున పేరులువాడఁబడియున్నవి. ఈసందర్భమున, సూర్యుఁడయనించుట యనియె భావము. ఇంక సంక్రాంతియన ప్రవేశించుకాలము. సూర్యుఁడు మేషాది ద్వాదశ రాసులందుఁ బ్రవేశించు కాలమని భావము. సౌరమున సూర్యుఁడు మేషాది ద్వాదశ రాసులందుఁ సంచరించు కాలములకు ద్వాదశసౌరమాసము లనిపేరు. ఈకాలమానము భరతదేశపు దక్షిణసీమలందు (Southern India) వాడుకయందున్నవి. వానినే అరవదేశస్థులు తమిళభాషయందు చిత్రినెల వైయ్యాశినెల మొదలగు ద్వాదశనామములతో వాడుచున్నారు. (నక్షత్రము లిరువదియేడు వివరణము చూడుఁడు.)

భూమిపైవారలకు భూమిచుట్టు సూర్యుఁడు దినమునకొకసారి తిరిగి వచ్చుచుండున ట్లగుపడు విధానమున, భూమధ్యరేఖ (ఈక్వేటరు) మధ్యస్థానమునందున్నదని మనము మనసునందుంచుకొనఁదగినది. ఏలనన, ఈవిధానమున సంవత్సరకాలమును లెక్కించుట యన, మేషాది ద్వాదశరాసులందుఁ దిరుగుకాలమే యగును. అనగా, మేషరాశియందుఁ బ్రారంభించి తిరుగ మేషరాశికిం జేరుట కొక సంవత్సరకాల మగునని భావము.

ఈరాసులం దొక్కొక్కదానియందుఁ దొమ్మిదిచొప్పున మొత్తము నూటయెన్మిది పాదము (అంశలు) లున్నవి. ఇరువదియేడు నక్షత్రము లొక్కొక్కటి నాల్గేసి పాదముల చొప్పున నూటయెన్మిది పాదములేయగుట నా యిరువదియేడు నక్షత్రములును ద్వాదశ రాసులం దిమిడి, సరిపోయియే యుండుటచే వానింగూర్చి యీ సందర్భమున వేఱుగ వివరింప నక్కరయేలేదు.

ఈ విధానమున సంవత్సర కాలమును లెక్కించుచు, ద్వాదశరాసులందు సూర్య

గమనమును గమనించుటయగు, భూమధ్యరేఖ కుత్తరముగా మేష, వృషభ, మిధునరాసులం గుర్తించుకొనవలయును. ఇందు మేషరాశి ప్రారంభము (అశ్విని ప్రథమపాదము) భూమధ్యరేఖయందే యుత్తరభాగమునుండెడిది. అచట మొదలిడి, సూర్యుఁడు కొంచము కొంచముగ నుత్తరమున కయనించుచు, చుట్టు తిరుగుచుండునట్లు మేష, వృషభ, మిధునములం గడచి, మిధున రాశి అంతమునకుఁ జేరును. అటనుండి ఉత్తరాయణగతిని మాని, దక్షిణాయనగతితో నడచుట ప్రారంభించి, భూమధ్యరేఖకుం జేరును. అనగా తిరుగుటయందు, కర్కాటక, సింహ కన్యారాసులం గడచునని భావము. ఈ సందర్భమున మిధునరాశినిగడచి, కర్కాటక రాశింజేరు సంధికాలమునకు జ్యోతిషశాస్త్రమునందు అయనపుణ్యకాలమని పేరు.

అటుల భూమధ్యరేఖకడకు సూర్యుఁడు చేరువరకు కన్యారాశియంతముం జేరెడిని. దానింగడచి యివ్వల దక్షిణముననున్న తులారాశికింజేరు (మధ్యసంధి) కాలమునకు విషువత్పుణ్య కాలమని జ్యోతిషశాస్త్రమునందు పేరు.

అటులనే దక్షిణాయన ధర్మముననే యరుగుచు భూమధ్యరేఖందాటి, తులారాశింజేరి, దానింగడచి, వృశ్చికరాశి, దానినుండి ధనూరాశికింజేరి, దానింగూడ గడచి, మకర రాశికిం బ్రవేశించు సంధికాలమునకు జ్యోతిష శాస్త్రమున అయనపుణ్యకాలమని పేరు. మరియు మకరరాశి ప్రారంభమునుండి దక్షిణాయనగతి సూర్యుఁడు మాని ఉత్తరాయణ గతి ప్రారంభించెడిని. అటుల మకర, కుంభ, మీనరాసులం గడచుటతో (అనగా నుత్తరాయణగమనమునే, భూమధ్యరేఖకడకుం జేరుకొనును. ఇటుల మీనమునుం గడచి, తిరుగ మేషమునం బ్రవేశించు సంధికాలము జ్యోతిషశాస్త్రమున తిరుగ విషువత్పుణ్యకాల మని పేర్కొనబడినది. ఇక్కడ మేషాది, మేషపర్యంతమొక సంవత్సరకాలమగును.

ఈ సంచార విధానమును చక్కగ గ్రహించినవారలకు మధ్యనున్న భూమధ్యరేఖకడ రెండు విషువత్పుణ్య కాలములును, ఒక అయనమునుండి వేరొక అయనగతికి మరలు స్థానములందు రెండు అయన పుణ్యకాలములును స్పష్టపడకపోవు. ఇంకను ఋత్వాది సమస్త కాలభేదములకు నీ విధానమున కాలమునందు హద్దుల నేర్పర్చుటయుం గూడ తెలినది. అంతమెరుఁగని సూర్య, భూభాగము లేవి యెటులుండిరుగుచున్నను, భూమధ్యరేఖయే రెండు అయన గతులకును మధ్యస్థానమనియు, దానికుత్తరముగా దక్షిణాయనగతియందు మూడు సంక్రాంతులును, ఉత్తరాయణ గతియందు మూడు సంక్రాంతులును గడచుననియు, నట్లే దక్షిణముగాఁ గూడ నారుసంక్రాంతులు గడచుననియుం దేలినది. ఇందునుండి సాధారణముగ నెల్లరు కర్కాటకసంక్రాంతి దక్షిణాయనగతికినీ, మకరసంక్రాంతి ఉత్తరాయణ గతికినీ ప్రారంభములుగ నెంచనగుచున్నది. తక్కిన భూమధ్యరేఖమైనంటిన విషువత్పుణ్య కాలములు సమకాలమధ్యస్తములుగఁ దలంపనగుచున్నది. పాశ్చాత్యజ్యోతిషమున మకర సంక్రమణ సమీపమునందున్న అయనపుణ్య కాలమునకు Mid Winter Day యని యందురు. అది డిశంబరు ౨౧ లేక ౨౨ తేదీల నుండును. కర్కాటక సంక్రమణ

సమీపమునందున్న అయనపుణ్యకాలమునకు Mid Summer Day యని యందురు. ఇది జూన్ ౨౧ లేక ౨౨ తేదీలయందుండును. ఇంక భూమధ్యరేఖపైనే సంభవించు మీన మేష సంధికాలమగు విషువత్పుణ్యకాలము కు పాశ్చాత్య జ్యోతిషశాస్త్రమున Vernal Equinox అని పేరు. ఇది మార్చి నెల ౨౧ లేక ౨౨ తేదీలందు సంభవించెడిని. తక్కిన కన్యా, తులా, సంధికాలమగు విషువత్పుణ్యకాలమునకు Autumnal Equinox అని పేరు. అది సెప్టెంబరు ౨౧, ౨౨ తేదీలను సంభవించును. (ఈక్వినోక్సు చూడుడు).

ఈసందర్భమున అయనగతులకు వేరొక చిత్రగమనము కలదని భరతదేశపు పూర్వ జ్యోతిషవేత్తలు కనిపెట్టిరి. భూమధ్యరేఖకుం గొంతదనుక నుత్తరమునకు, మరికొంతదనుక దక్షిణమునకు అయనగతులు మారుచు మధ్య మధ్య భూమధ్యరేఖకుం జేరుకొనుచుండునటు లనే, ఈవిధాన గమనమంతయును, పైనవివ రింపఁబడిన నాల్గు సంక్రాంతి సంధికాలముల నుండి, ఒకతరి ముందునకు ఒకతరి వెను కకు మారుచు నడచుచు నడుమనడుమ తిరుగ సరిగనుండి కాలములకుం జేరుకొనుచుండెడిని. అటులనే క్రీ. వె. ఆరవశతాబ్ద ప్రాంతముల సంధికాలములందే తటస్థించుచుండెడిది. రాను రాను సంవత్సరకాలమునం దైదు లేక ఆరు లిప్తలకాలముచొప్పున మార్పునందుచు, క్రీ. వె. ౧౯౩౮ నాఁటి కిరువదిమూడు దినములు ముందుకు నడచినది. అనగా డిశంబరు ౨౨ లేక ౨౧ తేదీలనే అయనము మార్పున్ను, జనవరి ౧౪ తేదీ ప్రాంతములకు దానిసంక్రాంతి సంధికాలమును సంభవించుచున్నవి.

**అయముపరోగండస్ఫోటపరిస్ఫోటరీతిన్యాయము** — కురుపుపై మరియొక కురుపు అని యర్థము. ఒక కష్టముపై నింకొకకష్టమనిభావము. సంస్కృతలోకోక్తి.

**అయస్కాంతము** (Magnet) — ఇది రాయి, ఇనుమును ఆకర్షించుకొను శక్తికలది. చిన్న సూదులు మొదలగు పరికరములను వెతకుకొనుటకు దీనితో తడవి యాకర్షింపఁ జేతురు గాన, దీనికి సూదంటురాయి యని పేరు వాడుకయయ్యెను. Electric Magnet డైనామో మొదలగు యంత్రములయం దుపయోగించుచుందురు. అయస్కాంతమునం దుత్తరదిక్కుం జూపు గుణముకలదు గాన దీనిని పైనలందిన ఇనుపముల్లును కంపసను యంత్రపరికరమునం దుత్తరదక్షిణ దిశలం జూపుయంత్రము(Mariner's Compass) సముద్రమునం దోడలునడచుతరి, నావికులకు దిక్కులం జూప నుపయోగపడుచున్నది. ఈదిశలం జూపు అయస్కాంతగుణమున కాంగ్లమున Ampere's Rule అను సుప్రసిద్ధ నామము కలదు. దీనికర్థముగా "If you try and imagine yourself swimming with the current along the wire, the North Pole will always be on your left" అని చెప్పుచున్నారు.

ఎలక్ట్రిక్ మేగ్నెటు లను నాల్గు టన్నుల బరువు, ఐదడుగుల వ్యాసము (Diameter) గలవానినిచేసి వానిచే నిరువదిటన్నులవరకు బరువుల నెత్తుటకుపయోగించుదురు. ఇనుప దుక్కలు, ఉక్కుదుక్కలు, ఇనుపదూలములు మొదలగునవి, వీనిచే నెత్తంబడుచు ఎగుమతి దిగుమతులు చేయుచుందురు. ఇట్టి ఎలక్ట్రిక్

మేగ్నెట్లు ఎలక్ట్రికు-
టిక్కు వరుంగల్గి అని చేయగనే ఇదియు
నిలచిపోవుచుండును.

**అయస్కాంతము (కాంతలోహము)** - దీనికాంగ్లమున Magnetic Iron అనియు Load Stone అనియుం బేరులు. సంస్కృతమున అయస్కాంతః, కాంతలోహం, కాంతాయసమ్, మహాలోహం, కాంత మనియు ననుటగలదు. ఇది Magnetic Oxide of Iron. దీనికి ధృవానుబంధము కలదు. రసాయనశాస్త్రమున Magnetite అనియుం బేరుకలదు. ఇది ముఖ్యముగ స్వీడనుదేశమున లభించుచున్నది. కంపసు (దిక్కులంజూపు యంత్రము) లోని Magnetic Needle చుట్టుపట్ల నుండు ఇతర Magnets వల్ల కలవరపర్చబడకుండ నీ కాంతలోహముతో కంపసుపెట్టెం ను యందా Magnetic Needle నుంచుదురు. కాంతలోహపు రేకులు మెత్తగనుండి పని నిచ్చునట. ఆయుర్వేద వైద్యులు ఈ లోహమును భస్మముఁజేసియు, సింధూరముఁ జేసియు వాడుదురు. అది గంధకదోషమును విరుచును. దీర్ఘరోగములను వాతరోగ ములను నివారించును. లోహభస్మము గుణ ములు దీనికింగలవు. కాని యంతకన్న సౌమ్య ముగ పనిచేయునని చెప్పఁబడినది. స్వర్ణ భస్మమునకుంబదులు దీనిని వాడుచుందురు.

**అయస్కాంతన్యాయము** — కదలని ఇను పసూదికి అయస్కాంతము చలనము కల్గించు నని భావము.

**అయ్యకు విద్యాలేదు అమ్మకు గర్వ మూలేదు** — అనగా భర్త విద్యతో భార్య గర్వపడుచుండునని భావము. ఆంధ్ర

**అయ్యగారి వీరభద్రకవి** — ఆంధ్రకవు లలో నాధునికులందుఁ బరిగణింపఁబడినవాఁడు. ఆర్వేలనియోగి బ్రాహ్మణుఁడు. శివభక్తుఁడు, శైవుఁడు, కౌండిన్యసగోత్రుఁడు, తండ్రి పేరు సోమనారాధ్యులు. రచించినది రాఘవ యాదవ పాండవీయము అనుత్ర్యర్థికావ్యము. ప్రౌఢమగు కవిత్వము.

**అయ్య దాసరులకూ అమ్మ జంగాల కూ దానంచేసినట్లు** ఇద్దరిదీ ఒక మతముకాదని భావము. ఆంధ లోకో

**అయ్యనార్** హరిహరపుత్ర దేవస్థానములు చూడుఁడు.

**అయ్యారక కులమువారు** — వీరు విశాఖ పట్టణ మండలమున అందు ముఖ్యముగ శృంగవరపుకోట తాలూకాయందుఁ గాన నగుచున్నారు. ఈ కులస్థు లీమండలమున పదునేడువేలు కలరందురు. వీరినామముకుం బినప పాత్రుఁడను బిరుదనామముండును. అయ్యారకమన గౌరవతను సూచించు నర్థము స్ఫురించెడిని. కాని వీరింగూర్చిన యితర సంగతులం దెలుపుగ్రంథములు బయల్పడుట లేదు. వీరు కాపులలో నొక తెగయని ౧౯౦౭ విశాఖపట్టణమండల గెజిటీరునందు చెప్పఁబడి నది. అన్యప్రాంతములకరిగి కాపురముకుదిరిన వీరి వారు, తాము ఎడ్లకాపులమని యనుట యుంగలదు. వీరియందు పెదిరెడ్లవారి తెగ యనియు, లంకవారి తెగయనియు, రెండు తెగలు కలవు. ఇరు తెగలవారికిని భోజన ప్రతిభోజనములు సంబంధ బాంధవ్యములును కలవందురు. వీరాదిని యుద్ధవీరులుగనుండిన

పౌరుషశాలురుగఁ గన్పించుదురు. విజయనగర భూపతుల కొల్వునందు వారిని సైనికులుగ నుండిరట. శృంగవరపుకోట తాలూకాయందు కొన్ని ప్రత్యేకగ్రామములు వీరివి కలవందురు. గోలకొండ సైన్యములు వీరిగ్రామములపైఁ ద్రోల్లి దాడివెడలినతరి పురుషులేగాక వీరి స్త్రీలుసైతము ఆయుధములంబూని యుద్ధరంగమునఁ బ్రవేశించి పోరుసల్పి తురకలందరిని వైచిరట. ఆనాటి వీరిశౌర్య పరాక్రమములం గూర్చినగాథలు నేఁటికిని వారుచెప్పుకొనుచుందురు. వీరికిక్కాలమున సేద్యము వృత్తిగానున్నది. వీరియందు పెదిరెడ్లతెగవారు నాగుపాము లేక నాగగోత్రమువారు, వారుపామును ముట్టుకొనరు. చంపినపామును దహనమొనర్తురు. వారునాగపూజ యొనర్తురు. లంకతెగవారు తాబేలు నంటరు, వారిది తాబేలు గోత్రమట, వారు తాబేలుం బూజింతురట. వీరి యిండ్ల వివాహకార్యములు నగరాల యిండ్లకార్యములం బోలియుండునట. వారికిని పాత్రుఁడను బిరుదనామముండును. ఆడుపిల్లల కర్త వారింటి పద్ధతియే అవలంబనీయమట.

**అయ్యరాకపోతే అమావాస్య ఉండిపోతుందా ?** — ఆంధ్రలోకోక్తి.

**అయ్యలరాజు నారాయణకవి** - ఆంధ్రకవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడినవాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. క్రీ. వె. ౧౮౦౦ సంవత్సరము కాలమువాఁడు. కౌండిన్యసగోత్రము. తండ్రిపేరు సూరపరాజు. తల్లిపేరు కొండమాంబ. రచించినది హంసవింశతి పద్యకావ్యము.

**అయ్యలరాజు భాస్కరకవి** అయ్యలరాజు అయ్యలకవి (భాస్కరకవి చూడుఁడు).

**అయ్యలరాజురామభద్రరాజు కవి** — ఆంధ్రకవులలో మధ్యకవులందుఁ బరిగణింపఁబడినవాఁడు. ఆరువేలనియోగిబ్రాహ్మణుఁడు. తండ్రిపేరు అక్కరాజు, తాతపేరు పర్వతన్న. ప్రపితామహునిపేరు తిప్పయామాత్యుఁడు. కడపమండలములోని యొంటిమిట్ట నివాసియైయుండి, అచటి వీరరాఘవస్వామిపై నొకశతకముం జెప్పెను. రామభద్రయ్య పరవస్తు వరదాచార్య శిష్యుఁడై విష్ణుభక్తికలవాఁడు. పరవస్తు ముమ్మడి వరదాచార్యుఁడనియు నీతనికి వాడుకగలదు. రామభద్రయ్యకు చాలా సంతానము గల్గియుండ, పిల్లలరామభద్రయ్యయని వాడుచుండిరట. కొంతకాలము గడచినపిదప విజయనగరముఁ జేరుకొని శ్రీకృష్ణరాయ సార్వభౌముని యాస్థానకవియై సకలకథాసారసంగ్రహమను గ్రంథమును రచించెంగాని, అది ముగియకమునుపే శ్రీకృష్ణరాయలు చనిపోవుటంజేసి, కృతి యీయబడక నిలచిపోయి, రామభద్రకవి తిరుగ యాశ్రయముం గోల్పోయి దేశములఁ దిరిగి, గుత్తి యప్పలరాజుగారి నాశ్రయించెననియు, పిదప శ్రీకృష్ణరాయని యల్లుఁడగు రామరాజు మేనల్లుని (గొబ్బూరి నర్సరాజు) యాశ్రయమున జీవనము గడపుచు, రామాభ్యుదయము రచించి యాయనకుం గృతి నిచ్చెననియు చెప్పుచున్నారు. ఈ కవి క్రీ. వె. ౧౫౫౦ వరకును జీవించియుండినవాఁడట. రామరాజభూషణుని కీర్తనిపై విరోధభావమని చెప్పఁబడినది.

**అయ్య వాతపెట్టినా, బర్రె బ్రతకనూనా ?** — చేతకాదని భావము. ఆంధ్రలోకోక్తి.

**అయ్యవారిని చెయ్యబోతే కోతి అయినట్లు** — విగ్రహమునా చేయుట యని భావము. ఆంధ్ర లోకోక్తి.

**అయఃపిండము** — ఇనుపముద్ద యని యర్థము. స్కాందపురాణములోని కాశీ ఖండమున కీపేరుండెను. అది చాల కష్టమైన కావ్యము. దీనిని శ్రీనాథమహాకవి యాంధ్రీకరించెను. మరియు నాతఁడే విద్వదౌషధమని చెప్పఁబడిన హర్షనైషధకావ్యముఁ గూడ శృంగారనైషధమనుపేర, నాంధ్ర కావ్యముగ రచించియుంట, సుప్రసిద్ధిగ నేఁటికిని ఆయన గ్రంథములంగూర్చి "కాశీఖండమయఃపిండమ్ నైషధమ్ విద్వదౌషధమ్" అని చెప్పుచుందురు.

**అయాచితమండన న్యాయము** — అప్రయత్నముగా శృంగారము (గుణము) లభించుతరి, అయాచితమండన మనఁబడును. కుమ్మరి నల్లని గోలెములు చేయుచున్నాఁడను తరి, గోలెములును, నలుపును కూడ చేయుచున్నాఁడనియు, నాసిలత్వము నందే సంక్రమించుననియు భావము.

**అయిరిదేవి** (అహిరిదేవి) — తొల్లింట దీనికి అహిరిదేవి యని పేరుండెనందురు. హిమవన్నగముపై దేవీధురమున గల యీక్షేత్రము సంతానపదక్షేత్రమని పేరందినది. ఆదిని అసిరి యని పేరుండెననియు, అది అహిరి యాయెననియు నందురు. (దేవీధురము చూడుఁడు).

**అయూక్నది** — అపగానది చూడుఁడు.

**అయూధ (యౌధేయ) దేశము** — హైదాస్పిస్ మొదలు సింధునది వరకుం గల దేశమని చెప్పఁబడినది. దీనికొకప్పుడు యవనదేశమనియుఁ బేరుండెనట. దీని యేమియుం దెలియరాకున్నది. దీని వాయుపురాణము ౯౯ అధ్యాయము హరివంశము ౧౨ అధ్యాయములను ఇంకను అలహాబాద్ (ప్రయాగ) కోటలోని సముద్రగుప్తచక్రవర్తి శాసనమును దీని ప్రశంసకలదు. పాంచాల భూమి యందు సింధునదీ వితస్తా (జీలమ్) నదిచేరు తావునుండి ఆనదుల నడుమనుండు దేశమని పరిశీలనలవలన తెలిసెడి.

**అయెషా** ఈమె మహమ్మదు జగద్గురుని భార్యలలో నొకతె. ప్రియభార్యగాఁ జెప్పఁబడిన వనిత. తండ్రిపేరు అబూబకర్ గారు. మదీనాపురమున క్రీ. శ. ౬౧౧ సంవత్సరమున జన్మము. ఈ దేవిని తొమ్మిదవ యేటనే ఆయనకుం బరిణయమొనర్చిరట. ఆయన అనంతర మీమె యల్లుఁడగు ఆలీని తరువాతవానిగ నిరాకరించి, తన తండ్రిని మొదటి ఖలీఫాగాఁ జేయఁగల్గెనట. భర్త మృతి ౬౩౨ అనియు, ఈమె మృతి మదీనా పట్టణమున ౬౭౮ అనియు, నీమెకు సంతానము లేకున్నను, మహమ్మదీయ భక్తులకు మాతయని పేరందెనందురు.

**అయోధనపురి** (ప్రాక్పట్టణము) — పాంచాలదేశమునందలి మాంట్గోమరీజిల్లాలోని మామోక్ఘాటునుండి, ఎన్మిదిమైళ్ళ దూరమున రావీనదికి పశ్చిమదిశగా నైదు మైళ్ళ దూరమున నిప్పుడున్న తావు. మహాలగ్జాండరుకాలమున నిది గొప్పనగరమైయుండినటుల నాతనిచరిత్రకారులు వ్రాసియున్నారు.

**అయోధ్య (పోవిన్సు) (Oudh)** — దీని నాంగ్లమున ఔడనుచున్నారు. నేపాళదేశము గంగానదుల నడుమనున్నది.

౨౪౦౦౦ చతురపుమైళ్ల వైశాల్యముకలది. ఉత్తరము తరైమన్యము. ఆగ్రాప్రోవిన్సునకును వలె దీనికిని గలదు. (ఆగ్రాప్రోవిన్సు చూడుడు) ఇంచుమించు సమతలప్రదేశము. గుమితీ (తొల్లింటిగోమతి) గ్రా (తొల్లింటిఘర్ఘరా) నదులు ముఖ్యములు. ఇతరచిన్నసదులనేకములుకలవు. వేసవియందు ఉష్ణమధికము. శీతకాలమున చలి యధికము. భూమి సారవంతమై గోధుమలు, ధాన్యములు, ఆముదములు, నూవులు, చెరకు, నీలిమందు, గసగసాలు, ప్రత్తి విస్తారము పైరుచేయఁబడుచున్నవి. హిందీభాష హిందువులును, ఉరుదుభాష మహమ్మదీయులును మాట్లాడుచున్నారు. ఇది తొల్లింటి కోసలదేశము. (ఉత్తరకోసలదేశముచూడుఁడు). ఇది నవాబునుండి బ్రిటీషువారు లాగికొనిరి. ౧౮౫౬ లో బ్రిటీషు ప్రభుత్వము హస్తగతమై ౧౮౭౭ లో ఆగ్రాప్రోవిన్సుతో సంయుక్తము చేయఁబడినది. (ఆగ్రా, అయోధ్య సంయుక్త రాష్ట్రములు చూడుఁడు). ఇందు లక్నో డివిజను, ఫైజాబాదు డివిజనునను రెండు డివిజనులు కలవు. లక్నో డివిజనునందు ౧. లక్నోజిల్లా, ౨. ఉనావోజిల్లా, 3. సీతాపూరుజిల్లా, ౪. రాయిబరేలీజిల్లా, ౫. హార్డోయిజిల్లా, ౬. ఖేరీజిల్లాలను ఆరును; ఫైజాబాదు డివిజనునందు, ౧. ఫైజాబాదు జిల్లా, ౨. బహరైచిజిల్లా, 3. గోండాజిల్లా, ౪. సుల్తానుపూరుజిల్లా, ౫. పర్తాప్గఘుజిల్లా, ౬. బారాబంకీజిల్లాలను ఆరుజిల్లాలును మొత్తము పండ్రెండుజిల్లాలుగ విభజింపఁబడియున్నది.

లక్నోనగరము దేశమంతకు ప్రధాన నగరము. బ్రిటీషు ఇండియాయందు జనసంఖ్యచే మూడవపట్టణముగ నున్నది. గోమతీ నదీతీరము- ఇది గొప్ప సుందరభవనములచేఁ జేరంచిన నగరము. తొల్లింట శ్రీరామసోదరుఁడగు లక్ష్మణస్వామిపేరఁ బరగుచుండిన లక్ష్మణపురియను పట్టణమిట నుండెనందురు. అది నబాబులనాఁటి పెద్దపట్టణముగనై రాజధానిగ నుండెనట. ఇప్పుడు ఆగ్రా, అయోధ్య సంయుక్తరాష్ట్రములప్రధానస్థానమైయున్నది. ఫైజాబాదుపురము జిల్లాయందుముఖ్యపట్టణం ఈపరిసరముల తొల్లింటి యయోధ్యానగరపు పాడుకలదు. అది పుణ్యక్షేత్రమైయున్నది (అయోధ్య చూడుఁడు). ఇది రామగంగానదీతీరము. ఇంకను గుమితీనదిపైనున్న సుల్తానుపూరు, రాయబరేలీపురము ఆయా జిల్లాలయందు ముఖ్యపట్టణములు. అయోధ్యయందు కోతులు మెండు.

**అయోధ్య (సాకేతనగరము)—** ఇప్పటి ఔడ్ ప్రోవిన్సుకుంజెందిన అయోధ్య ఆగ్రా సంయుక్త రాష్ట్రములలోని ఫైజాబాదుపురము మ్యునిసిపల్ హద్దులలోని పాడైన యాత్రాస్థలముగ నున్నది. ఆదిని సూర్యవంశపు రాజులకు రాజధానియై యుండిన నగరము. దీనిని మనువు నిర్మించెనందురు. కాని ఏమనువో చెప్పలేదు. అయోధ్య యన, (శత్రువులగు) యోధులకుఁ జొరనశక్యంబైనదనిగాని, అన్యుల కజేయమైనది యనిగాని యర్థము. సరయూనదీ తీరము. దీనికి గోగ్రాయనియు నందురు. అయోధ్యకు సాకేతనగరమనియుఁ బేరుండెను. ఇటీవలివారు కొందరు రెండును వేర్వేరు పురములనియు, నొకటికొకటి సమీపమునందుంట కొంత కాలమునకుం గలసిపోయి యుండుననియు నొక వాదము బయలుదేరదీసి, బౌద్ధ గ్రంథములందల్లియుంట నిదర్శనములు

మాపసాగిరి, గాని యది నిరాధార నిర్ణక వాదమని స్పష్టము చున్నది. అయోధ్య మోక్షదాయకములని చెప్పఁబడిన సప్తపుర ములలో నొకటి (చూడుఁడు). రఘుమహా రాజునాఁటికే 'పితురనంతర ముత్తరకోసలాః' అని మహాకవి కాళిదాసు తన రఘువంశము నందు వచించియున్నాఁడు, గాన యానాటికే కోసలము అయోధ్య రాజధానిగ గల యుత్తరకోసలమనియుఁ దేలుచున్నది. దక్షిణ కోసలకే మహాకోసలమనియు వాడుక యుండెను. బౌద్ధగ్రంథములం దిద్దానినే తోసలయని వాడుట కాననగును. శ్రీరాము నకుంబిదపఁ యయోధ్య క్షీణించుచు రాజ ధానిపదవిం గోల్పోయి యాత్రాస్థలముగ మాత్రముండగ, ఋషభరాజు పునరుద్ధరించె ననియు, నలమహారాజునాఁడు ఋతుపర్ణుం డిటనే రాజ్యమేలుచుండెననియు, పాండవుల నాఁడు దీర్ఘయుగ్యుఁడు రాజ్యము చేయు చుండెననియు, నీతండు మహాబల సంపన్నుఁ డనియుఁ జెప్పఁబడినది.

జైనులనాఁడు తీర్థకరులలో మొదటి వారగు ఆదినాథులును, రెండవవారగు అజితనాథుఁడును, నాల్గవవాఁడగు అభినంద నాథుఁడును, ఆరవవాఁడగు సుమంతనాథుఁ డును, అయోధ్యయందే జన్మించినవారని చెప్పంబడినది. (జైనతీర్థకరులు చూడుఁడు). బౌద్ధమతకాలమునను, బుద్ధభగవానుఁడిట వసించుచు తన సిద్ధాంతములను బోధించు చుండెననియు, అప్పటిపేరు సాకేతపుర మనియు, బౌద్ధగ్రంథములందున్నది. ఎవరో విక్రమాదిత్యుండనుభూపతి యొకడయోధ్యం దిరుగగట్టించి, నాగేశ్వరనాథ శివాలయముం బాగుచేయించెనట. క్రీ. వె. నాల్గవ శతాబ్దమున గుప్తరాజులు అనఁగా సముద్ర గుప్తుఁడు (౩౦౦-౩౩౪ కాలమునాఁడు), ఆయన సుతుఁడు అయోధ్యయందే రాజ్య మేలిరట. సరయూ నదీతీరమున తూర్పు దిశను రామఘట్టము మొదలు పడమటికడ నున్న గుప్తారాట్ వరకారు మైళ్లు దూరముం డెను. అయోధ్య పరిసరములలో నిప్పుడు ౯౬ హిందూదేవస్థానములు కలవు. అందేడు వైష్ణవమఠములు కలవు. ౯ జైనమందిర ములు, ౩౬ మసీదులు కట్టంబడినవి. రామ్ కోటను తొల్లింటి అయోధ్య (సూర్యవంశపు రాజులదుర్గము) కడుపవిత్రస్థలిగ నున్నది. అందు శ్రీరామజన్మస్థానము మొదలగునవి కలవు. శ్రీరామునినాఁడే యట తిరిగి పెద్ద కోటంగట్టించి, ఒక్కొకబురుజొక్కొక సేన యధీనమందుంచెననియు, నిట్లే హనుమాన్, జాంబవంత, సుగ్రీవాది బురుజు లిరువది యుండెనందురు. ఇప్పటి కట్టడములు ౧౮ లేక ౧౯ శతాబ్దమునాఁటివని పరిశీలకులు పోల్చు చుందురు. పురాతనపువి పాడుపడినవి. కనక భవనము, రత్నభవనము మొదలగు శ్రీరామ మందిరములును, మూడులక్షల రూప్యముల విలువగల బలీలుబేగం గోరీయును నేడు దర్శనీయములైయున్నవి. (అయోధ్యరాష్ట్రము చూడుఁడు).

**అయోముఖి** — దండకారణ్యమం దుండిన యొక రక్కసి. దీనిని శ్రీరాముని కనిష్ఠ సోదరుఁడగు లక్ష్మణుఁడు ముక్కు, చెవులు తెగగోసి పరాభవించెను. ఈమె గోళ్లు పెద్దవియగుటచే శూర్పనఖయని వాడుకపే రందినది. ముక్కు, చెవులు గోసిన తావు నాశిక యనఁబడుచున్నది.

**అరకా(న్ ప్రోవిన్స్** — లోవరు బర్మాదేశము చూడుఁడు.

**అరచే కుక్క కరవదు, కరిచే కుక్క అరవదు** — ఆంధ్రలోకోక్తి.

**అరచేతి వైకుంఠము** — గొప్ప నిర్వాహకము లవలీలగఁ గుదుర్చుదునని మాయ మాటలఁ జెప్పి నమ్మించుట కీ యుక్తిని వాడుచున్నారు. ఇది ఆంధ్రభాషాసాంప్రదాయార్థపదము.

**అరజ** — శుక్రుని పెద్దకుమార్తె. ఇక్ష్వాకు పుత్రుఁడగు దండకునిఁగూడి ఈమెయు శుక్రాచార్య శాపమున నిహతురాలయ్యెను. (వైవస్వతమనువు చూడుఁడు). దండకుఁడు ఇప్పుడు దండకాటవి యనంబడు యరణ్యమునకు (దన యసురకృత్యములవలన తండ్రిచే ననుపఁబడినవాఁడు) వెడలగొట్టఁబడి, యట మధుమంతమను పురమును నిర్మించుకొని యుండియు, శుక్రుని సుతయగు నరజంగూడ, శుక్రుండలిగి వారలనిర్వురను శాపహతులుగ నొనర్చి పురముం బాడుచేసెను. తొల్లి యాతనివలననే వింధ్యారణ్యమునకు దండకారణ్యమని పేరయ్యెను. (దండుఁడు, ఛండా మార్కుఁడు చూడుఁడు).

**అరఁటిచెట్టు** — అరఁటిచెట్టు నెరుంగనివారాంధ్రభూమియందు లేరు. ఇందనేకభేదములున్నను ముఖ్యమగు భేదములు, కూరకు పనికివచ్చు కాయలుగలవి, పండ్లకుఁ బనికివచ్చు కాయలుగలవి, ఆకులకుఁ బనికివచ్చు అరఁటులు నని త్రివిధముగ నుండెడిని. ఆకులకుం బనికివచ్చు అరఁటి కాయలు పనికిరావు. వీనికి కీసలరఁటి యనియు నందురు. వీని యాకులు భోజనముచేయుటకు వాడుదురు. ఇంకఁ గూరకుఁ బనికివచ్చు కాయలుగల అరఁటులందు బూడిదబొంతయనియు, సాదా బొంతయనియు, బత్తీసుఫేనాయనియు ముఖ్యభేదములు మూడుగలవు. బూడిదబొంత కాయలుపెద్దవియై పైని తెల్లనిబూడిద పులిమినట్లుండును. ఇవి కూరకు మిక్కిలి రుచికరములని యందురు. సాదాబొంతయు, పెద్దకాయలుగ నుండుంగాని బూడిదయుండదు. ఇంక బత్తీసుఫేనాకాయలు గెలయందు విస్తారముండును. అరఁటులందు,పండ్లకుపయోగించు జాతులు నూటికన్న నెక్కుడుగఁ గలవందురు. అవి రుచిభేదములచే గల్గును గాని భేదము కడుస్వల్పముగనుంట అంత ప్రాముఖ్యము కాదు. పండ్లఅరఁటులందు ముఖ్యమగు భేదములు ౧. వామనకేళి (పొట్టిమొక్కయు,గెలపెద్దదియు),౨. బంగారు అరఁటి (పసుపుపచ్చరంగు అరఁటి), ౩. ఎర్ర అరఁటి (పండు ఎర్రగనుండెడిని). తెల్లచక్రకేళి, గిన్ని, అమృతపాణీ మొదలగు కొన్ని మాత్రమే గలవు. అందు అమృతపాణీ జాతియు, గిన్ని (దీనిని వాసన అరఁటిపండనియు నందురు) జాతియు సర్వసాధారణముగ నాంధ్రదేశమున నెల్లెడలను వ్యాపించియున్నవి. ఎర్రఅరఁటి, తెల్లచక్రకేళియు, పచ్చఅరఁటి (ఇది అరవదేశమునఁ జక్కఁగ వ్యాపించియున్నది. పండు పండినపిదపను గూడ ఆకుపచ్చరంగు గల్గియుండును) యు, వామనకేళియు, బంగారు అనఁటియు నరుదుగ నుండును. ఇంక అరఁటిపువ్వులోని కాడలును అరఁటిదూట లేక దవ్వయు, భోజనపదార్థములుగ కూర కుపయోగించునవియే.

అరటికాయ - అగ్నిమాంద్యము, అతిమూత్రము, కుష్ఠురోగము, గ్రహణి, గుద

రోగములు, జ్వరాతిసారము, దగ్గుదమ్ము రక్తముపడురోగము, నేత్రరోగములు, నోటి వెంట రక్తముపడు రోగములు, ప్రమేహము, ప్రదరము లేక కుసుమరోగము (స్త్రీలకు), మేహరోగములు, రక్తపైత్యము, పైత్య రోగములు. విదాహము, సంగ్రహణి, సమస్త క్రిమిరోగముల నడంచును. వీర్యమునకు చలవజేయును. కొంచెము గురుత్వము, విరేచనబద్ధము జేసి వాతమును బలపర్చును.

అరఁటిపండు- పొడిదగ్గు, విదాహము, ఆకలి నడఁచును. వేడిచేసి నీరుపెంచును. ఆలస్యముగ జీర్ణమగును. భోజనానంతరము పుచ్చుకొనిన, మనోహరముగనుండి ఉత్సాహము గల్గించి, చిక్కని రక్తముంగల్గించును. మేహశాంతి, వీర్యపుష్టి, బలముజేయును. గొంతుకను శుభ్రపర్చి Kidneys కు బలముకల్గించి, గుండెలు పొట్టను బలపర్చును. అజీర్తి, మూలవ్యాధి, దగ్గు, వాతశ్లేష్మము లను హెచ్చించును. మూత్రమునందు సుద్దను గల్గించును. మరియు సాధారణముగ నరఁటికాయ గుణములను గల్గియుండును.

అరఁటిదుంపరసము- అతిసారము, కుసుమ రోగము, కఫవాతము, తాపము, నోటివెంట రక్తముపడుట, పైత్యములు, మేహరోగ ములు, మూత్రకృచ్ఛములు, రక్తపైత్యము, రక్తవిరేచనములు, రక్తస్రావము, విదాహము, సెగరోగము, స్ఫోటకసంబంధ రోగముల నడంచును. చలువ, వాతము, వీర్యపుష్టి జేయును. విరేచనబద్ధము గల్గించును.

ఎండిన అరఁటిఆకులుగాని, ఎండిన అరఁటి పట్టగాని, కాల్చినచూర్ణమునందు పొటాషు సాల్టు కలదు. అది తేనెతో లోనికిచ్చిన దగ్గులు, కడుపునొప్పి, అజీర్తి, గుండెలలో మంట నివర్తించును. ఇంకను అరఁటియొక్క ఉపయోగములు చెప్పఁగలవు. బంగారు అరఁటిపండు రుచి, గుణము, శీతలము కూడ నధికములని చెప్పఁబడినది. అరఁటిచెట్టునకు లాటిన్భాషయందు Musa Sapientum అనియు, Musa Paradisiaca అనియును, ఆంగ్లమున Plantain Tree అనియు సంస్కృతమున కదళీ, రంభా, భానుఫలా యనియు నందురు. మరియు నాంగ్లమున అరఁటిపండ్లను Bananas అనెదరు. అరఁటి కాయకు విరుగుడు నేయి అని చెప్పఁబడినది. నువ్వులచెట్టు కాల్చినబూడిదయు విరుగుడే. అరఁటిపండునకు వానిపైతొక్క విరుగుడని చెప్పఁబడినది. మరియు పంచదార, తేనె, ఏలకులు, మిరియాలపొడి, బొగడపండు, అల్లము, ఉప్పు, విరుగుడులని చెప్పఁబడినవి. అరఁటిజాతికి నీరెక్కువ కావలసియుండును.

**అరఁటిపండొలిచి అరచేతఁ బెట్టి నటుల** — తినుమని భావము. ఆంధ్ర లోకోక్తి.

**అరణ్యములు** — (పవిత్రారణ్యములు) చతుర్దశారణ్యములు — ౧. నైమిశా రణ్యము - తొల్లింట ఋషుల తపస్థలము. సూతుఁడు శౌనకాదులకుఁ బురాణగాథ లెఱిఁగించినతావు. శిలాదుఁడు శివునకై తపం బొనర్చిన నందికేశ్వరక్షేత్రము, ఈస్టిండియ న్రైయిల్వే శీతాపూర్ లైనుపైనున్న నిమ్సార్ స్టేషనుకడ నున్నది. సంయుక్తరాష్ట్రముల లోనిది. ౨. బదరికారణ్యము - బదరీ నాథము లేక బదరీనారాయణక్షేత్ర పరిస రారణ్యము. నరనారాయణు లనఁబడిన ఋషుల తపస్థానము. 3. దండకారణ్యము- తొలుత వింధ్యారణ్యములోనిది. శుక్రా చార్యునిచే దండకమహారాజునకు రాజ్యముగ నొసంగఁబడి, పిదప వానిచే నరణికొరకై

శపింపఁబడి పైకి యాయనపేర దండకారణ్య మనఁబడుచున్న యటవీప్రదేశము. నాశికా త్ర్యంబకము లిందులోని వనియు, శ్రీరాముఁడిందు వనవాసకాలముఁ గొంత గడపెననియుఁ జెప్పఁబడినది. ౪. చంపారణ్యము లేక చంపకారణ్యము - మధ్య రాష్ట్రములలోని రాజిమ్‌పురమున కైదుమైళ్లలోనున్నది. ఇప్పుడు జైనులకు, బౌద్ధులకు యాత్రాస్థలమై యున్నది ౫. కామికారణ్యము - మహాభారతమున కామ్యకవనమని చెప్పఁబడిన వనము. సరస్వతీ నదీతీరము. కురుక్షేత్రముకడ నున్నది. ద్రౌపది పాండవులకు వండి భోజనమిడిన తావిందుగలదు. ౬. బృందావనము - వ్రజమండలములోనిది. సుప్రసిద్ధము. శ్రీకృష్ణుని బాల్యక్రీడల స్థలము. ౭. కదళికారణ్యము- హిమాలయప్రాంతమునందున్నదని చెప్పఁబడినది. ఈ స్థలమునం దాంజనేయుఁడు జన్మించెను. ౮. గుహారణ్యము, ౯. దేవతారణ్యము - ఇప్పటి సంయుక్తరాష్ట్రములలోని కుమాన్ డివిజనుకుం జెందిన చంపావతికడనున్న క్రాంతేశ్వరక్షేత్ర పరిసర ప్రదేశారణ్య మని పోల్పఁబడుచున్నది. ౧౦. కేదారారణ్యము- ఇప్పుడు కేదారనాథము లేక బదరీకేదారమనఁబడుచున్న క్షేత్ర పరిసరారణ్యము. అర్జునునకుఁబరమేశ్వరుఁడు పాశుపతాస్త్ర మొసంగిన తావిందుకలదు. పంచకేదారక్షేత్రము లిందున్నవి. సుప్రసిద్ధ స్థలము. ౧౧. ఆనందవనము- ఇప్పుడు బనారస్ నగరమున్న తావునను, ఆపరిసరములను తొల్లింట ఆనందవనముండెను. సుప్రసిద్ధమగుతావు. ౧౨. దారుకావనము- దేవదారువనమనియుఁ బేరుండెను. ఇందు ద్వాదశ తేజోలింగములలో నొకటియగు నాగేశ్వరనాథ శివలింగముకలదు. నైజాము రాజ్యములోని జౌంధాయనంబడు తావుకడ నున్నది. దారుకావన (శివ) లీలలు సుప్రసిద్ధములు. భైరవజన్మస్థాన మీదేశారణ్యమునందే యుండెడిది. ౧౩. పీఠారణ్యము.- ౧౪. మహావనము- వ్రజమండలములోనిది. సుప్రసిద్ధ స్థలము. మధుర (ఇప్పటి ముత్రా నగరమున) కెదుట యమున కవ్వలనున్నది. శ్రీకృష్ణుని బాల్యవినోదలీలల తావు. (నవారణ్యములు చూడుఁడు).

**అరణ్యరోదనన్యాయము** — అటవియందేడ్చిన ఓదార్చువా రుండరు. ప్రతిఫలము కలుగుగతి తావులంబడిన శ్రమంగూర్చి యీ న్యాయము వాడుదురు. అరణ్యచంద్రికా న్యాయము (అటవింగాచు వెన్నెల) నకు నిదియేభావము.

**అరనోట్లు** (Half Notes) — వాణిజ్య సంబంధ పరిభాషాపదము. Half Notes విస్తారము సొమ్మును టపాద్వారా పంపవలసినతరి, నోట్లను సగము సగముగ రెండు ముక్కలుగఁజేసి, మొదటి సగముక్కలను పంపి, అవి యందినట్లు తెలిసినపిదప తక్కిన రెండవసగము ముక్కలను(Other Halves) పంపుదురు. ఇట్టితరి రెండవసగము ముక్కలు చేరువరకు మొదటి సగముముక్కలు పంపిన వారివేయై యుండునని న్యాయవాదు లభిప్రాయపడియున్నారు.

**అరఫాత్ పర్వతము** — అరేబియా దేశమునందు మక్కానగరమునుండి తూర్పుగా ౧౩ మైళ్ళ దూరమునందున్న యొక పవిత్ర పర్వతశిఖరము. దీనినరబ్బులు, జుబెల్-ఎర్-రహీమ్ (అనగా Mountain of Mercy అని యర్థమట) అనియెదరు. రెండు వందల

అడుగుల ఎత్తుగలది. అరేబియా యందలి తోటనుండి వెడలఁగొట్టఁబడిన పిదప, మొదట ఆదమ్ ప్రవక్తయు, ఈవ్ జగన్మాతయు నిచటనే కలసికొనిరట. ఇది ఇస్లాంమతస్థుల యాత్రాస్థలమైయున్నది. మాతస్థులు మక్కాలో కాబాపదక్షిణాములొనర్చి (పాపపరిహారశిలను) ముద్దిడి జెంజెం తీర్థోదకపానము సల్పి రాత్రి యిటకే తెంచి యొక ప్రార్థనను వినెదరు. పిదప నిటఁజేయఁదగిన కర్మయుం గొంత యాత్రావిధియును కలదని చెప్పంబడినది.

**అరబిక్ అంకెలు**(Arabic Figures)- అరబిక్కు అంకెలు ఆంగ్లమున సర్వసాధారణముగ వాడఁబడుచున్నవి. ఇవి నిజమున అరబ్బీదేశపు అంకెలుకావు. ఆప్రాంతవాసులగు భరతదేశస్థులు కనుగొని వాడుకొనుచుండ నరబ్బు లవలంబించి రఁట. వారినుండి పాశ్చాత్యులు గైకొని ఈపేరిడిరఁట.

**అరబ్బీ దేశము** (Arabia) — ఈదేశము ఇసుకయెడారులమయము. దీనిని స్వదేశస్థులు జజీరా ఆలరబా యనెదరు. మహమ్మదీయ మతస్థులకు సుప్రసిద్ధ యాత్రాస్థలములగు మక్కానగరము, మదీనానగరము, కాఫీగింజల వ్యవసాయ మితరదేశసీమలకుం గల్గించిన మోఛాపురము లీదేశములోనివే. మదీనా పట్టణమును అల్మదీనాతున్నబీ యనెదరు. అనఁగా మహాబోధకుని నగరము అని యర్థము. మక్కాయందు కాబా యనంబడిన బైతుల్లా దేవస్థానమును, జెంజెంబావియుఁ గలవు. ఈదేశపుప్రజ లరబ్బులనఁబడుదురు. ఇంచుమించు ౧౨౦౦౦౦౦ చతురపుమైళ్ల వైశాల్యమని అంచనావేయఁబడినది.

**అరబ్బీ (అరేబియా) దేశపు సామెతలు** — అప్పుడప్పుడు సంభవించే సావకాశములు, ఆకాశమునందలి మేఘములవలె సంతరించుకొనిపోయి నిలచియుండునవికావు. కుక్కరుపువైపు దారిలోనికిపోరి, నక్కరుపువైపు శ్మశానమును దాటి. కోపమును స్వాధీనముంచుకొని నడిపినపని పరిపాలన వంటిదే. కోపము మనస్సునందలి యగ్ని జ్వాల. కోపము పానమునకు లొంగి పోవును. కోర్కెలను దూరముగా నుంచుట యైశ్వర్యముల మూలము. ధనమునకు దాపరికము, విద్యలకు వెల్లడింపు. ధనమువాడితే తరిగిపోవును; విద్యాజ్ఞానములు వాడితే వృద్ధిఁ బొందుతవి. నీ జన్మకాలములో ఒక దినము, నీ జీవచరిత్రలోని ఒక పుట. నీవు చేయవలసిన గొప్ప యుద్ధము నీతోనే యని ఎఱుంగుము. పశ్చాత్తాపము కల్గుట కాన వాలు, పాపకార్యములు మానుటయే. పశ్చాత్తాపమువల్ల వచ్చే నల్లని కన్నీరు, నేత్రముల కారోగ్యముం గల్గించును. ప్రపంచము పీనుగవంటిది, దానిని అనుభవించ గోర్కెగలిగినంతవరకు మనుజులు నక్కలవంటివారే. ప్రార్థన మతమునకు స్తంభమువంటిది. బాణముఁ వంకరగానుండుట శరము సరిగా తగులుటకు, బలముగా పోవుటకు నని యర్థము. మనస్సున జ్ఞానమే లేకుండెనేని, శరీరమున నేత్రము లుండిన ప్రయోజనమే యుండదు. ముండ్లచెట్ల బంక చాలా శ్లేష్మము; పటుత్వముగలది. రాత్రికలిగే భయము పగలుండదు. లోభి వర్షముకురి యని వేసవిమేఘమువంటివాఁడు. సామెతలు మాటలలో దీపాలవంటివి.

**అరవదేశపు లిపులు** — ౧. అరవ లిపి, ౨. గ్రంథాక్షరలిపి, 3. తుళులిపి, ఇవి

చేరలిపి సంబంధములు. చేరదేశ వైభవ కాలము క్రీ. పె. 3 శతాబ్దము మొదలు 8 శతాబ్దము దనుకననియెరుంగునది. ఇప్పటి మైసూరు, కోయంబత్తూరు, దక్షిణమళయాళము, కొచ్చిన్ రాజ్యము, తొండైమండలము లేక తొండైనాడులం గల్పుకొనిన యావత్తు దేశము, చేరదేశమై తమిళ వైభవముతో దనరుచుండినది. చేరలిపి, రెండుశాఖలు గలది. అందొకటి చెన్నపురిప్రాంతసీమయగు తొండైమండలమునం దెక్కువ ప్రచారము గల్గియుండెను. ఇప్పటి యరవలిపి కిదియె మాతృక. ఈసీమ చేరభూపతులకు సామంత రాజ్యముగ నుండెనట. చేరలిపి రెండవ శాఖ. మైసూరు, కొడగు ప్రాంతసీమలందు ప్రచారమునందియుండి క్రీ. పె. ౮౭౭ ప్రాంతములందు చోళులాసీమల నాక్రమింప, వాడుకం దొరంగి నశించినదిగఁ జెప్పంబడినది. అరవలిపి యందక్షరములు తక్కువ. క, ఙ, చ, ఞ, ట, ణ, త, న, ప, మ, అనునవి అనగా వర్గాది, వర్గాంతాక్షరములుమాత్రము కలవుగాన సంస్కృతపద మరవవ్రాతయందు వ్రాయుట తటస్థించుతరి గ్రంథాక్షరములతో వ్రాయుచుందురు.

**అరవదేశమున వర్షపాతము** — అనినెల పదియవదినమున, ఆడినెల ఎన్మిదవ దినమున, ఆవనినెల ఆరవదినమున, పెరటాశి నెల నాల్గవదినమున, అల్పిశినెల రెండవ దినమున, కార్తికినెల మొదటిదినమున, సూర్యోదయకాలముల తుషారము లేక చినుకులు గల్గినతావులందు ఆసంవత్సరము మంచివర్షములు కురియునని, అరవదేశమునం దొకవాడుకగలదు.

**అరవభాష వ్యాకరణము** — తమిళభాష వ్యాకరణము చూడుఁడు.

**అరవసంగములు** — తమిళసంగములు చూడుఁడు.

**అరవదేశపు సామెతలు** అందవికారపు మొగమున కద్దమేమిచేయును? అధమున కైశ్వర్యము గల్గిన అర్ధరాత్రి వేళ గొడుగు తెమ్మన్నాడట. అధికముగాతింటే అమృతమైనను విషమగును. అరగదీసిన గంధపుచెక్క తరుగుంగాని వాసన గోల్పోవునది కాదు. అరిచేకుక్క వేటకు పనికిరాదు. అల్లరిచేసే పిల్ల కనఁటిపండు చూపినట్లు. ఆడి నెలలో ఆకులు రాలిపోయినట్లు. ఇద్దఱు సవతులున్నయింట్లో అగ్నిహోత్రం వేతే ముట్టించనక్కరలేదు, అది తనంతటతానే అంటుకుని ప్రజ్వలించును. ఎండిపోయిన చెట్లెన్నటికి చిగిర్చవికావు. ఏనుఁగ నెక్కిన వాఁడు దిడ్డిగంతలో దూరగలఁడా? ఓర్వలేని తనమునకు హృదయవేదన ప్రథమశిక్ష. కనుపాపలలోనిదోషము కంటికెట్లగుపడును? కుక్కలున్నచోట దెబ్బలాటలు సిద్ధమే. కోతలకాలంలో ఎలుక కేడుగురుభార్యలున్నా పరవాలేదు. గద్దకెదురుగానున్న పాము. గాలిపాటుచూచి ధాన్యమెగరబోయవలెను. గుడిలోపుట్టి పెరిగినపిల్లి దేముడికి జడియునది కాదు. గొడ్డలికామ స్వసంఘు శత్రువు. గొర్రెలమంద తడిసిపోయినదని తోడేలేడ్చినట్లు. తక్కిన అవయవములకన్న తల ఎక్కువ ప్రధానమైనది. తప్పుకు రాజదండనమవునో కాకపోవునోకాని దేవుని దండన తప్పనిది; కాని అదిఆలస్యము. తలనొప్పి వచ్చినదని తలగడమారిస్తే తగ్గునా? త్రాగుబోతుల యిళ్లన్నీ దారికడ్డపుయిళ్ళే. తింటేనేగాని ఆకలితీరునా? తెల్లకాకులుండవు. నమ్మకమున్న ఔషధము నాటికే గుణమిచ్చును. నక్కపిల్లకు అరవడం నేర్పనక్కరలేదు. నిండు

కుండలు తోఁణకవ్వ; వెల్తివే తోఁణకుటు. నిల్వచేసినరూక గడించే రెండుహవాయి లంతటిది. ఎలుక పులిపిల్లయితే గోళ్లుండవాపేమి ? పెట్టెలో నున్న ంతకాలం గొడుగు నెమడిగా నేయుంతును. దుష్టబుద్ధికి ద్రోహచింతను మంగలు-డవ్వు. బయట వ్యర్థుఁడైనవా డింటా వ్యర్థుఁడే. భయంకరుఁడైన మహాత్ముఁడు ప్రబలమైన దొంగయే. మంగళిబాలునకు మవిషి వెంట్రుక లబ్బురమా? యజమానిచూడనిచేను ఎంతపెరిగినా నిష్ఫలమే. మొగడమ్రింగే వారికి వెన్నవచ్చు టెట్లు? రాజాధిరాజైనా తల్లిదండ్రులకు కుమారుఁడేయగును. వెయ్యి అబద్ధాలాడి వెంకటేశ్వరపెరుమాళ్లు నారాధించినసరి. స్వర్గమునకుపోతూ చంకను ఏకులరాట్టమెందుకు ? శ్మశానవైరాగ్యం సావిట్లోకి తిరిగివచ్చేవరకే. సాహసం లేని వాడికి కత్తి సరిగా తెగదు. హస్తిమశకముల తారతమ్యము.

**అరసున్న** — అరసున్నయనఁగా ఖండబిందువు లేక అర్ధానుస్వారము. ఇది కేవలము ఆచ్ఛికశబ్దములయందు మాత్రమేగల యపూర్వసంజ్ఞ. దీనికి ధ్వనిలేదని కొందరందురుగాని అది పొరపాటు. ఒకవిధమయిన అనునాసిక ధ్వని యీసంజ్ఞయందు ద్యోతకమగుచున్నది. పోఁగు = దారము అను నర్థమిచ్చు శబ్దము పోన్గు అనుదానికి దగ్గరగానుండు అనునాసికధ్వనితో నుచ్చరింపఁ బడుచున్నది. పోగు అని పకార ఓకారగకార ఉకారములు మాత్రమేయుచ్చరింపఁబడుచుండుట లేదు. ఒకే యక్షరములుగల పదము లర్ధబిందుసహితములై యొకయర్థమును, రహితములై వేఱొక యర్థమునుఇచ్చునవి యచ్చ తెనుఁగు నందనేకములుగలవు. ఉదాహరణము వీఁడు = సర్వనామము గ్రామము; నాఁడు = దినము, ... = ... . ... = రా కుండ; కలుగు = ఉండు, కలుఁగు = రంధ్రము మొదలయినవి. ఈ యర్ధబిందువు సాధారణముగా నచ్చ తెనుఁగు శబ్దములయందుఁ బరుష సరళములకుముందే కానఁబడుచున్నది. ఇది సిద్ధము సాధ్యము అని రెండువిధములుగా నుండును. పూర్ణబిందువువలెనే శబ్దము ...

సిద్ధము: ఉ॥ కలఁత, కడఁక, పూఁత, ఈఁదు. మొదలయినవి. శబ్దమునందు స్వతస్సిద్ధముగా లేక వ్యాకరణకార్యములగు సంధి మొదలగు ...నివలన వచ్చినది సాధ్యబిందువు. ఉ॥ ..., గోవ్రలఁదో ...ని మొదలయినవి.

హ్రస్వముమీఁది యరసున్న వైకల్పికముగా నిండుసున్న యగునుగాని, దీర్ఘము మీఁది యరసున్న యెన్నఁడును నిండుసున్న గాదు. నాలుగైదు సంవత్సరముల క్రిందటి శాసనలిపులలో వ్రాతయం దరసున్న వ్రాయఁబడియున్నను ఉచ్చారణయందు నిండుసున్నగానే యుచ్చరింపఁబడుట చూచుచున్నాము. గుంటూరు మండలము, రాయలసీమ మొదలగు ప్రదేశములయందు కొన్ని గ్రామములలో నిప్పటికిని కొన్ని తెగలవారిచే నరసున్న నిండుసున్నగానే యుచ్చరింపఁబడుచున్నది. ఉదా॥ వచ్చిచూడఁగా అనునది చూడంగాయనియు వెంచేసియుండఁగా యనునది ఉండంగా యనియు నుచ్చరింపఁబడుచుండుట మనము వినుచున్నాము. అరసున్న చేర్చుటవలన నొక్కొక్క శబ్దమున ననేకములగు రూపములు కలుగుచున్నవి. ఉదాహరణము: కలఁగు ధాతువునుండి కృదంతరూపము కలఁగుఁడు అని వచ్చుచున్నది. దాని కొన్ని విధములగు రూపాం

తరములు వచ్చుట కవకాశమున్నదో చూడుడు. కలఁగుడు, కలంగుడు, కలఁగుండు, కలంగుండు అన్నిరూపములకును కలఁతయని యే అర్థము. దక్షిణహిందూదేశపు భాషల యందుఁగాని, ఉత్తరాదిభాషలయందుఁగాని నాసధ్వనికి (Nasal Sound) ప్రత్యేకముగా నొకయక్షరము,ఒక తెనుఁగుభాషయందేగాని మఱియేభాషయందును గానరాదు. అను నాసికధ్వని యన్నిభాషలయందును గలదు గాని ఆంధ్రమునందువలె దానికి ప్రత్యేకాక్షరములేక అక్షరసంయోగమువలన కలుగుచున్నది. ఆధునికాంధ్ర గ్రంథములయందు ప్రస్తుతపు నవీనకవులలోఁ గొంతమంది నిరర్థకమని యర్ధానుస్వారమును విసర్జించి కబ్బములల్లుచున్నారు. అది వారికి సాహిత్యమునందుఁగల సంకుచిత దృష్టినే తెలుపునుగాని, అర్ధానుస్వార మెన్నఁటికైనను వ్యర్థమయినది కానేరదు.

అచ్చతెనుఁగు మాటలలో అఁట, ఇఁక, చూఁడు మొదలగువానియం దర్ధానుస్వారము కలదు. ఇది పూర్వోక్తసూత్రము ననుసరించి వైకల్పికముగా నిండుసున్నయగును. కొన్ని కొన్ని శబ్దములయందు సిద్ధముగానున్న పూర్ణబిందు వట్లే యుండుంగాని అది ఖండబిందువు కానేరదు. అట్లే దీర్ఘాక్షరములమీఁది ఖండబిందువును పూర్ణబిందువు కానేరదు. వాఁడు, నాఁడు, నేఁడు అను వానిమీఁది యర్ధానుస్వారమట్లేయుండును. ఈసూత్రమునుబట్టి ప్రాతాదుల తొలియచ్చు మీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళము, లుప్తశేషంబునకు పరుషసరళంబులు పరమగు నపుడు నుగాగమం బగును. ద్రుతముమీఁది పరుషములు సరళములగును. ఆదేశ సరళంబులకు ముందున్న ద్రుతంబునకు బిందు సంశ్లేషంబులు వైకల్పికముగానగును. అను సూత్రచతుష్టయ ప్రయోగమువలన సిద్ధించిన ప్రాఁజదువు, లేఁజిగురు మొదలగువానియందలి యరసున్న యట్లేయుండునుగాని ప్రాంజదువు, లేంజిగురు అనురూపనిష్పత్తి చేయుటకు వీలులేదని చిన్నయసూరి పల్కియుండెను.

**అర్ఘలక్షణ పరీక్ష** — (కాలవిజ్ఞానము చూడుఁడు). ౧౮. అర్ఘలక్షణపరీక్ష - అర్ఘమన వెలయని యర్థము. పండినవి, ప్రజల కవసరమగునవి, వర్తకమున కాధారమగునవి యగుసరకుల ధరలంగూర్చి పరీక్షించుటయని భావము. సంవత్సరమునందలి పౌర్ణములు, అమావాస్యలం దీపరీక్ష యొనర్తురు. పౌర్ణమి - గత పౌర్ణమినుండి సరిగా ముప్పది దినములకు గల్గిన ధరలు సమముగానుండును. ఒకరోజు తక్కువయైన ధరలుతక్కువయగును. ఒకరోజెక్కువైన ధర హెచ్చియుండును. పౌర్ణమిని మీనరాశియం దైదుగ్రహములుండిన ప్రజాపీడనమనియు, ఆదినమున శుభగ్రహములు చూచిన సుభిక్షమనియు ఆచంద్రుని పౌర్ణమియందు క్రూరగ్రహములు వీక్షించునేని ధరలు పెరిగిపోవునని చెప్పఁబడినది. ఇంక దర్శ (అమావాస్య) యందు ఇంద్రధనస్సు కల్గుటయు, పరివేషము కల్గి అందు (సూర్యపరివేషము) నల్లనిరేఖలుండుటయు, దశవర్ష ధాతువులు అమావాస్యయందు గల్గియుండుటయు సుభిక్షకరము. ఇతరదినములం దివి సంభవించుట దుర్భిక్షకరము. ౧. చైత్రమాసము — పౌర్ణమి: రాత్రి తుంపరవాన, ఉరుము, ధూమ్రమగు పరిధి, పొగవలెనున్న మబ్బు, పశ్చిమమున నింద్రధనస్సు, వీనిలో నేదైనకల్గిన ధాన్యము ప్రత్తి ధరగల్గి యమ్మును. అమావాస్య - రవి ఈదినమున వృషభప్రవేశమైనను, అమా

వాస్యనాఁటి చిహ్నములు తీర్చినను పంట లధికమై, కందమూలాదులు పండియుండును. ౨. వైశాఖమాసము:- పౌర్ణమి- పౌర్ణమి నాఁటి చిహ్నములు తీర్చియుండిన ప్రత్తి, కుసుమధాన్యములు, పెసలు, వాసనద్రవ్యములు ధరలఁగల్గియుండును. అమావాస్య- నాఁడు సూర్యుఁడు మిథునప్రవేశ మగుట, అమావాస్య చిహ్నములు తీర్చియుండుట గల్గిన ఉప్పు మొదలగు రసవర్గపదార్థములు చౌకయైయుండునని రత్నాకరుఁడు చెప్పెను. 3. జ్యేష్ఠమాసము:- పౌర్ణమి- పౌర్ణమి లక్షణములు తీర్చిన ధాన్యము ధరగల్గియుండును. అమావాస్య-చిహ్నములుతీర్చిన ధాన్యములు సమృద్ధిగాఁబండును. ౪. ఆషాఢమాసము:- పౌర్ణమి చిహ్నములు తీర్చిన గోధుమలు, రాగులు,యవధాన్యము ధరలుకల్గియుండును. అమావాస్య చిహ్నములు తీర్చిన నేయి, నూనె, తేనె, చందనము ధరగల్గియుండును. ౫. శ్రావణమాసము:- పౌర్ణమి- రాత్రియందు పౌర్ణమిచిహ్నములుతీర్చిన నూనె, కందమూలములు ధరగల్గియుండును. అమావాస్య- అమావాస్యచిహ్నములు తీర్చుటయు, చంద్రసూర్యులు కూడియుంటయు, బంగారము, వెండి, మణులు, ఏనుఁగులు, గుఱ్ఱములు వెలలు గల్గియుండును. ౬. భాద్రపద మాసము:- పౌర్ణమి- పౌర్ణమి చిహ్నములు తీర్చిన సీసము, గంధకము, ఆయుధములు, పెట్లుప్పు, ధరలుకల్గియుండును. ఇది యుద్ధ సూచకము. అమావాస్య-చిహ్నములుతీర్చిన జొన్నలు, లోహములు ధరగల్గియుండును. ౭. ఆశ్వీజమాసము - పౌర్ణమి - పౌర్ణమి చిహ్నములు తీర్చిన గోధుమలు, బెల్లము, వరిగెలు, నువ్వులు ధరలుగల్గి యుండును. అమావాస్య - గుర్తులు తీర్చిన నూలు, కంబళ్లు, కుంకుమపూవు మున్నగు రసవర్గములు ధరలుగల్గియుండును. ౮. కార్తికమాసము:- పౌర్ణమి- పవడములు, కంబళ్ళు, నల్లధాన్యములు, బంగారు ధరలుగల్గి యుండును. ౯. అమావాస్య- చిహ్నములు తీర్చినను వృశ్చికరాశియందు రవి యుండుటయు కందమూలాదులు రత్నములు ధరలుగల్గియుండును. మార్గశీర్షమాసము- పౌర్ణమి - చిహ్నములు తీర్చినచో పంచదార, తేనె, నెయ్యి, ... ధరలు గల్గి యుండును. అమావాస్య- రవి ప్రవేశమున ఆకాలమున అమావాస్యచిహ్నములు తీర్చుటయు గల్గిన శంకులు, పవడములు, ముత్యములు, కుంకుమపూవు ధరలు గల్గియుండును. ౧౦ పుష్యమాసము:- పౌర్ణమి- రాత్రి పౌర్ణమి చిహ్నములుతీర్చిన పోకలు, తగరము, రంగులు, వాసనద్రవ్యములు ధరలుగల్గియుండును. అమావాస్య- మకరమందైనను, కుంభమందైనను రవిప్రవేశించుటయు నత్తరి నమావాస్య చిహ్నములు తీర్చుటయు గలిగిన ధాన్యము, లోహములు ధరలు గలిగి యుండును. ౧౧. మాఘమాసము:- పౌర్ణమి- చిహ్నములు తీర్చునధాన్యము, రసవర్గములు ధరలు గలిగియుండును. అమావాస్య - మీన రాశియందు సూర్యుఁడుండుటయు నత్తరి నమావాస్య చిహ్నములు తీర్చుటయుఁ గల్గిన కందమూలములు, ఇనుము, అనుములు, రసవర్గములు, ధరలు గలిగి యుండును. ౧౨. ఫాల్గుణమాసము: - పౌర్ణమి - పౌర్ణమి నాఁడుండవలసిన చిహ్నములుతీర్చిన గంధకము, కంచు, కందమూలములు ధరలంగల్గి యుండును. అమావాస్య - అమావాస్య నాఁడుండవలసిన చిహ్నములేయుండి తీర్చి

నేని దవనమను ధాన్యము వెల హెచ్చుగ నుండును. ఈయమావాస్యయందు పాపగ్రహ కూటమి ధరల తగ్గుటకు గుర్తనియు శుభగ్రహకూటమి ధర హెచ్చుటకనియు నిటుల రెట్టదైవజ్ఞుఁడు చెప్పియున్నాఁడు.

**అర్ఘ్యమూలకుల గోత్రము** — ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (అమలకుల చూడుఁడు.)

**అర్చికపర్వతము** — వైడూర్యపర్వతము

**అర్చిరాదిమార్గము** — అద్వైతమతమున సగుణబ్రహ్మోపాసకులు బ్రహ్మలోకమునకుం బోవుమార్గమనియు, సూర్య, చంద్ర, విద్యుల్లోకములగుండా జనునదియనియుం జెప్పఁబడినది. (మార్గములు చూడుఁడు).

**అర్జునుఁడు** (పాండవ మధ్యముఁడు) — పాండవ మధ్యముని తండ్రి పాండురాజు. తల్లి కుంతీదేవి. ఈమె భర్తయనుజ్ఞవడసి, ఇంద్రునివలన నీతనిం గనెనని చెప్పఁబడినది. సోదరులు పాండవులు. గొప్ప నేర్పరి. విలువిద్యావిశారదుఁడు. చీఁకటియందు విలువిద్య నెరప గలవాఁడు. శివునిఁ దపంబున మెప్పించి పాశుపతాస్త్రమందినవాఁడు. భారతయుద్ధమున శ్రీకృష్ణుఁడీతనికి భగవద్గీత యను కర్మయోగ ముపదేశించెను. ఈతనికి ద్రౌపది వలన శ్రుతకీర్తి యను సుతుఁడును (ఈతఁడు పాండవులలోనివాఁడు. అశ్వత్థామ ఈతఁడు నిద్రించుతరి చంపివేసెను) పాండ్యరాజపుత్రికయగు చిత్రాంగదవలన బభ్రువాహనుఁడను సుతుఁడును, కృష్ణ సోదరియగు సుభద్రవలన నభిమన్యుఁ డనువాఁడును ముప్వురుసుతులు కలరు. పాండవు లైదుగురు సోదరులే. అర్జునుని ధనస్సునకు గాండీవమనియు, శంఖమునకు దేవదత్తమనియుం బేరులు. అర్జునునకు- ౧. అర్జునుఁడు, ౨. ఫల్గుణుఁడు, ౩. పార్థుఁడు, ౪. కిరీటి, ౫. శ్వేతవాహనుఁడు, ౬. భీభత్సుఁడు, ౭. విజయుఁడు, ౮. కృష్ణుఁడు, ౯. సవ్యసాచి, ౧౦. ధనంజయుఁడు అని పది బిరుద నామములు కలవు. అతనికి బృహన్నలుఁడని అజ్ఞాతవాసనామము. (జావా ద్వీపమున నరునునిగూర్చిన దురభిప్రాయము చూడుఁడు).

**అర్జికియానది** — ఇది విపాశా (బీయాస్) నది. పాంచాలదేశము చూడుఁడు. అరాష్ట్రిదేశము చూడుఁడు. దశపవిత్రప్రవాహములు చూడుఁడు.

**అర్జునీదేవి** — బాణాసురుని కుమార్తె. (బాణాసురుఁడు చూడుఁడు).

**అర్జునీనది** (ధబలా) — బాహుదా లేక ధబలానది కిది పూర్వనామము. దీనినే అర్జునీనది యనుచున్నారు.

**అర్ణవగోత్రము** — ముద్గలగణము చూడుఁడు.

**అర్థకుఁడు కవి** — కవి కవులుచూడుఁడు.

**అర్ధకూర్మాసనము** — యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన ఆసనములలో నొకటి మోఁగాళ్లు నేలకుఁ దగులునట్లును మడమలు పిరుదులకు తగులులాగునను కాళ్లుమడిచి మఠము వైచుకొని కూర్చుండి అట్లేముందుకు వంగి బోర్లపరుండు రీతిని మోచేతులు మోకాళ్లకుం దగిల్చి యానించి అరచేతులతో నోటిని మూసినటుల ముందుకు వంగి యుండుట. ఇందువలన శ్వాసగతి తగిలి ఇంద్రియములు స్వాధీనమగునని చెప్పబడినది.

**అర్ధకృచ్ఛవ్రతము** — ఇదియొక వ్రతము. ఒక దినము సాయంకాలమునం దొకదినము

తెల్లవారుఝామునందు భుజించుట, రెండవదినములు తానడుగకుండ నితరులు పెట్టినది భుజించియుండుట, రెండవదినము ఉపవాస ముండుటయు నియమముచేతురు.

**అర్ధగంగానది** — దక్షిణదేశమందలి కావేరీనది కీపేరుగలదని హరివంశము ౧ వ అధ్యాయమునఁ జెప్పఁబడినది.

**అర్ధచంద్రాగ్రము** — బాణాగ్రములు చూడుఁడు.

**అర్ధచంద్రహస్తము** — హస్తాభినయము చూడుఁడు, భరతశాస్త్రము చూడుఁడు.

**అర్ధజరతీయన్యాయము** — ఇది చాల సంశయగ్రస్తమగు వాడుకలుగలది. తరుచుగ నేపనియందును స్థిరచిత్తములేక చేయు ప్రయత్నములకీన్యాయమునువాడుచున్నారు.

**అర్ధపంచక నాటకము**—ఇది మన్మథుం గూర్చిన యొకనాటకము. ఇందలి యైదంక ములలోను వరుసగ చింతాయోగ, సమా రంభ, వ్యాపార, హేతుదర్శన, అభీష్టలాభ ములు వర్ణింపఁబడియున్నవి. కవి యెవ్వరో తెలియదు గాని దక్షిణదేశస్థుఁడై యుండ వలయును. తంజావూరు మండలములోని తిరు క్కణ్ణపురమను విష్ణుక్షేత్రము కలదు. అందు శౌరిరాజప్పెరుమాళ్లకు దేవస్థానమున్నది. శివ నేత్రాగ్నిచే భస్మమై తనశరీరముం గోల్పోయిన మన్మథుఁడు, శౌరిరాజప్పెరు మాళ్ గర్భంబున పుత్రుఁడై జన్మించెనట. పుట్టిన పదియవనాఁడే శంబరాసురుఁ డా బాలుని సముద్రమునఁ బారవైచెనట. వాని నొకచేపమ్రింగి శంబరుని సేవకులచేఁ బట్టు వడ, దానింగోసి యందలిబాలునిజూచి శంబ రుని కూతురు వానింజాగ్రతగఁ బెంచుచుండె నట. (ఇట శంబరపుత్రిక రతీదేవి యవతార మని చెప్పంబడినది). ఆబాలుఁడును పెరిగి శంబరాసురుంజంపి యాతని పుత్రికం బరిణయమయ్యెనట. ఆశౌరిరాజ ప్పెరుమాళ్ దేవస్థానపు మహిమందెలుప నిసంగతి యిందు వ్రాయఁబడినది.

**అర్ధపంచకము** — జీవము, ఈశ్వరుఁడు, ఉపాయము, ఫలము (లేక పురుషార్థము), విరోధము అనునవి యైదు అర్థములు. మరల నివి యైదును, ఒక్కొక్కటి యైదేసి తెరంగులుగనుంట నన్నియు నిరువదియైదగును. ౧. జీవము- ఇది నిత్యము, ముక్తము, కేవ లము, ముముక్షువు, బద్ధము నని యైదు తెరంగులు. ౨. ఈశ్వరుఁడు - పరము, వ్యూహము, విభవము, అంతర్యామి, అర్చ యని ఈశ్వరునియందలి పంచప్రాకారములు. 3. ఉపాయము- కర్మయోగము, జ్ఞానయో గము, భక్తియోగము, ప్రపత్తియోగము, ఆచార్యాభిమానయోగమునని పంచోపాయ యోగములు. ౪. ఫలము - ధర్మము, అర్థము, కామము, కైవల్యము, మోక్షము లనునవి పంచపురుషార్థ ఫలితములు. ౫. విరోధము- స్వస్వరూపవిరోధము, పర స్వరూప విరోధము, ఉపాయ విరోధము, పురుషార్థ లేక ఫలవిరోధము, ప్రాప్తివిరో ధము నని యైదు విరోధములు. ఇవి విశిష్టా ద్వైత వైష్ణవధర్మమున చెప్పఁబడినవి.

**అర్ధపతాకహస్తము** — హస్తాభి నయము చూడుఁడు. భరతశాస్త్రము చూడుఁడు.

**అర్ధపాదాసనము** — యోగశాస్త్ర మునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. ఒంటికాలున నిలిచి, రెండవకాలిమడమను మొదటికాలి మోకాలునొద్ద నానించి, చేతు

లను హృదయముకడ జోడించుట అర్థపాదాసన మనంబడును. దీనియభ్యాసమున శరీరము బలపడుట, యుచ్ఛ్వాసగతి తగ్గుటయు సంభవించునని చెప్పఁబడినది. ఇది వామార్ధపాదాసనమనియు, దక్షిణార్ధపాదాసనమనియుం ద్వివిధములుగ నాచరింపఁ బడుచున్నది. ౧. వామార్ధపాదాసనము - కుడికాలివ్రేళ్లపైనాని మడమంబైకెత్తి పిరుదుక్రిందనానించి కుడిమోకాలిపై ఎడమమోకాలి నదిమి బంధించి చేతులను వెనుక నేలనాని కూర్చుండుట వామార్ధపాదాసనమనియందురు. ౨. దక్షిణార్ధపాదాసనము- ఎడమకాలివ్రేళ్లపైనాని మడమంబైకెత్తి పిరుదుక్రిందనానించి ఎడమమోకాలిపై కుడిమోకాలి నదిమి బంధించి చేతులను వెనుక నేలనాని కూర్చుండుట దక్షిణార్ధపాదాసనమనియు నందురు. దీని యభ్యాసమున శ్వాసగతి మందగించునని చెప్పఁబడినది.

**అర్థము సరిగాలేని మాటకన్నీ అపార్థములే** — ఆంధ్రలోకోక్తి.

**అర్థలేఖి గోత్రము** — వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.

**అర్థలౌకికన్యాయము** — శబ్దార్థము లోకవాడుకనుండియే తెలియును. ఇది పిల్లి, ఇది కుక్క, ఇది కాగితము అను జ్ఞానము లోకమున అందరు ఎట్లు వాడుచుందురో తాను నట్లే వాడవలయునని భావము.

**అర్థవశాద్విభక్తిపరిణామః**- విభక్తులు ఎనిమిది వాడుకయందున్నవి. అవి ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థి, పంచమి, షష్ఠి, సప్తమి, సంబోధన యని. ఇవి శబ్దముయొక్క అర్థమునుండియే ఏర్పడును అని భావము. సంస్కృతలోకోక్తి.

**అర్ధవైశాసన్యాయము** — సగముం జంపి సగముచంపక వదలుట యని యర్థము. ఇచట భావము ద్వివిధము. ౧. సగము చంపిన, తక్కిన సగమును వేఱుగఁ జంపనక్కఱ లేదనియు, అదే చచ్చుననియు నొకభావము. ౨. సగముచంపిన తక్కిన సగము (చావక యుండినచో) మిగుల బాధకరమనియు నొక భావము.

**అర్థశక్తిమూల** — లక్షణ చూడుఁడు.

**అర్ధశవాసనము** — యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన ఆసనములలో నొకటి. భూమిపై వెల్లకిలపరుండి కాళ్లనుమడచి పాదములను పిరుదులక్రిందకు వచ్చునట్లుంచి రెండు చేతులను హృదయకడ జోడించుట. దీని యభ్యాసమున మలబద్ధము నివారణమగునని చెప్పఁబడినది.

**అర్థశాస్త్రము** అర్థమన పొందఁబడునది లేక ప్రయోజనముగలది యని భావము. ఒక వ్యాపారమునఁ గొంత ధనము వెచ్చించియు లేక ఒక కార్యమునఁ గొంత శ్రమచేసి ప్రయత్నించియుఁ బొందు ఫలితమున కర్థమనిపేరు. ఇట్టి అర్థములు పలుతెరంగులుగ నుండును. వేర్వేరు కార్యములందు వేర్వేరు రూపముల ఫలములు గల్గెడిని. మఱియు నటులఁ బ్రయత్నించిన గలుగు ఫలితములు లాభరూపమునఁ గాని, నష్టరూపమున గాని యుండవచ్చును. అట్టి ఫలితము లన్నియు అర్థములే. వానింగూర్చి తెలుపువిద్య కర్థశాస్త్రమని పేరు. ఈ అర్థవిద్యను కొందఱర్థవేదమనియు వాడియున్నారు. వేదములు ౪, వేదాంగములు ౬, ఉపవేదములు ౪, ఉపాంగములు ౪ మొత్తము పదునెన్మిది విద్యలుగఁ బరిగణింపఁ బడుచున్నవి. అందు

అర్థవిద్య ప్రధానవిద్యయనియు, దీని పరిణామములు తక్కినవనియు, పెక్కండ్రర్థశాస్త్రవేత్తలు నుడివిరి. దీని నాంగ్లమున Science of Wealth అనియు, Political Economy అనియు, Science of Practical Life అనియు నందురు. దీని నెరుంగుట అన్నివృత్తులవారికిని రాజ్యకార్యనిర్వాహకులకు నవసరమేయగును. సర్వవిద్యాధిపతియగు పరమేశ్వరుఁడు విష్ణుదేవునకును, ఆతండు బ్రహ్మకును, బృహస్పతికి నుపదేశించెనని చెప్పఁబడినది. బృహస్పతి ఇంద్రునకును, మరీచునకును నుపదేశించెనట. మరీచి భృగువున కుపదేశించెనట, నాతండు పెక్కండ్ర ఋషులకిచ్చెనట. నానాఁటి కిది వ్యాపించి, నీతిగఁ దనరి, నీతిశాస్త్రమనియు పేరందెనట. ఇప్పటికి నీతిశాస్త్రమని పేరంది యుండిన అర్థశాస్త్రము, ఆదియందుఁ బెక్కండ్రచే గ్రంథములుగ రచింపఁబడ నారంభమయ్యెను. ఇందు ధర్మార్థ కామమోక్షములు నాల్గును దెల్పఁబడియుంట ధర్మభాగమును స్వాయంభువమనువు గైకొని మనుస్మృతిగ రచించెనట. అర్థశాస్త్రభాగమును బృహస్పతి గైకొని యొక గ్రంథమును, ఆయననుండి యుపదేశమందిన ఇంద్రుఁడొక అర్థశాస్త్రగ్రంథమును రచించిరి. కామశాస్త్రభాగమును నందికేశ్వరుఁడు గైకొని యొక గ్రంథము రచించెను. మోక్షశాస్త్రభాగమును సనకసనందనాది పెక్కండ్రు ఋషులు గైకొనిరి. మనకుం బ్రస్తుతమగు నర్థశాస్త్రభాగము బృహస్పతి రచించిన గ్రంథము మూఁడువేల అధ్యాయములుగను, ఇంద్రుఁడు రచించినది ఐదువేల అధ్యాయములుగను చెప్పఁబడినది.

శుక్రాచార్యుఁడు ఔశనస మనుపేరున వేయి అధ్యాయముల గ్రంథము రచించినటులం దెలియుచున్నది. ఇతరులగు కొందరర్థశాస్త్రవేత్తలు చాలతగ్గించి మున్నూరధ్యాయముల పరిమితికిం దగ్గించిరట. అంగదేశాధీశుండగు వశిష్ఠమహారాజు కాలమున నర్థశాస్త్రవేత్తగనుండిన కామందకుఁడను నాతఁడు వేయిశ్లోకముల పరిమితి నొక గ్రంథమును, దండనీతిశాస్త్రమనుపేర సూత్రములుగ రచించెను. దీని నిప్పుడు కామందక మనుపేరనఁ బిలుచుచున్నారు. ఇం దిరువది సర్గలుకలవు. ౧. ఇంద్రియజయాధ్యాయము ౨. విద్యాసముద్దేశములు, ౩. ఆచార్యవ్యవస్థ, దండనీతి, ౪. సప్తప్రకృతిభాగము, ౫. సేనాధర్మములు, ౬. కంటకశోధనవిధులు, ౭. ఆత్మరక్షణవిధులు, ౮. మండలవికల్పము, ౯. సంధివికల్పము, ౧౦. విగ్రహవికల్పము, ౧౧. యానవిధులు, ౧౨. మంత్రవికల్పములు, ౧౩. దూతవికల్పములు, ౧౪. ప్రకృతివ్యసనవిభాగములు, ౧౫. రాజవ్యసనభేదములు, ౧౬. యాత్రావిధులు, ౧౭. స్కంధావారనివేశవిధులు, ౧౮. ఉద్యోగవిధులు, ౧౯. యుద్ధసన్నాహవిధులు, ౨౦. వ్యూహవిభాగాదులు. పిదప కౌటిల్యుఁడను విప్రుఁడొక యర్థశాస్త్రగ్రంథము రచించెను. దీని నిక్కాలమున కౌటిల్యుని అర్థశాస్త్రమనుచున్నారు. ఈతనికి విష్ణుగుప్తుఁడనియు, మల్లనాగుఁడనియు,చాణక్యుఁడనియువాడుక నామములు కలవు. ఈయర్థశాస్త్రవేత్త గొప్పరాజతంత్రజ్ఞుఁడు. కలియుగమునయుధిష్ఠిరశకము ౧౦౧౫ ప్రాంతముననుండినవాఁడు. ఈకౌటిల్యుని అర్థశాస్త్రమే వాడుకయందున్న గ్రంథము. కామందకము, కౌటిల్యుని యర్థశాస్త్రముఁ దప్ప దక్కినఅర్థశాస్త్ర గ్రంథములు దుర్లభ్య

ములుగనున్నవి. ఔశనస మెచ్చుటనో గల దందురుగాని సంపూర్తిగఁ గానఁబడుట లేదు. ముద్రారాక్షసనాటకమున కౌటిల్యునిఁ గూర్చి వివరింపఁబడినది. భారతమునందలి విదుర నీతులు భీష్మనీతులు పంచతంత్ర హితోపదేశ గ్రంథములు శుక్రనీతిసారమును, అర్థశాస్త్ర గ్రంథములుగనో లేక నీతిశాస్త్రగ్రంథభాగములుగనో పేర్కొనఁబడుచున్నవి. మొత్తమున నర్థవిద్యయందు ఇరువదియేడు పదార్థములు పేర్కొనఁబడినవి. వానింగూర్చియె ఈశాస్త్రమున వివరింపఁబడినది.

౧. ద్వైధీభావద్వయము- ఇందు స్వతంత్రము, పరతంత్రము అను రెండును చర్చింపఁబడును.

౨. శక్తిత్రయము- ఇందు ౧. ప్రభుశక్తి, ౨. మంత్రశక్తి, ౩. ఉత్సాహశక్తి. (ప్రభుశక్తి సైన్యబలమనియు, మంత్రశక్తి యోచనాబలమనియు, ఉత్సాహశక్తి సాహసబలమనియు నెరుంగునది).

౩. సిద్ధిత్రయము- ఇది ౧. ప్రభావసిద్ధి, ౨. మంత్రసిద్ధి, ౩. ఉత్సాహసిద్ధి యని త్రివిధము. శక్తిత్రయముం బోలినదియె.

౪. ఉదయత్రయము- దీనికిఁ ద్రివర్గమనియుం బేరు వాడఁబడినది. ౧. క్షయము (క్షీణింపఁజేయుట), ౨. స్థానము (స్తంభింపఁజేయుట లేక అట్లే నిలబడునటులఁజేయుట), ౩. వృద్ధి (వృద్ధిజెంది బలవత్తరమగునట్లొనర్చుట).

౫. చతురంగములు- ఇవి సైన్యాంగములు. ౧. ఏనుఁగులు, ౨. గుర్రములు, ౩. రథములు, ౪. కాల్బలము లేక సైనికులు.

౬. రాజవిద్యలు- ఇవి నాల్గువిధములు. ౧. అన్వీక్షకి- సాంఖ్యయోగ తర్కశాస్త్రాది విద్యల నేర్చియుంట, ౨. త్రయి- వేదములఁ బఠింపనేర్చియుండుట, ౩. వార్త- ఇది త్రివిధము. ౧. వ్యవసాయము, ౨. పశుపాలనము, ౩. వర్తకము లేక వాణిజ్యము. ౪. దండనీతి- చతురంగబలసైన్యముల ననునయించువిద్య. దీనికై యుద్ధతంత్రము లేక సైన్యశాస్త్రము ననిపేరు.

౭. ఉపాయచతుష్టయము-౧. సామము (మైత్రిచే లేక స్నేహభావముచేఁ గార్యముఁ జరపికొనుట), ౨. దానము (ఈవివలన కార్యము నెరపికొనుట), ౩. భేదము (అన్యులం దొకరొకరికి విభేదములు కల్పించి తనకార్యము నెరవేర్చుకొనుట), ౪. దండము (తన బలప్రదర్శనమొనర్చి వెరపించియో లేక శిక్షించియో కార్యము నెరపికొనుట).

సప్తోపాయములు - ౧. సామము, ౨. దానము, ౩. భేదము, ౪. దండము, ౫. మాయ, ౬. ఉపేక్ష, ౭. ఇంద్రజాలము.

౧. సామము- ఇది ఐదు విధములు. ౧. పరస్పరోపకారదర్శనము, ౨. గుణకీర్తనము (పొగడుట), ౩. అన్యోన్యబంధుప్రవచనము, ౪. ఆయతిసంప్రదర్శనము (స్నేహప్రదర్శనము), ౫. సాధువాదము (మంచిమాటలు, సత్వగుణప్రదర్శనము).

౨. దానపంచకము- ౧. సంప్రాప్తము, ౨. ఉత్సర్గము, ౩. సంప్రాప్తధరోత్సర్గము, ౪. స్వయంగ్రాహము, ౫. ప్రతిమోక్షము.

౩. భేదము- ఇది మూడు విధములు ౧. స్నేహరాగాపనయనము (స్నేహభావము వదలుట), ౨. సౌందర్యోత్సాహము (సోదరభావము వదలుట), ౩. సంతర్జనము (బెదరించుట లేక అదలించిచూచుట).

౪. దండ (ఉపాయ) ము- ఇది త్రివిధము. ౧. దండము- సామదానభేదములకు లొంగని శత్రువునింగాని, తనపైఁ బగఁబూనినవానిం గాని, నరహత్యలు మొదలగు ఘోరకార్యము లొనర్చు చుండినవానిని గాని వధించుట. ౨. అర్థహరణదండము- తనపై యకారణముగ నెదుర్కొనుచుండు శత్రునింగాని, తా బలాఢ్యుఁడను మదమత్సరములచే నన్యుల నకారణముగ వెరగందఁజేసి బాధించు దుష్టునిఁగాని, వానిద్రవ్య మర్ధమగునంత దనుక దండుగగొనుట లేక ఇచ్చునటుల బలాత్కరించుట. ౩. పరిక్లేశదండము- దుష్టులను చెరయందు నిర్బంధించి వానికిఁ బుద్ధివచ్చునటుల పరిక్లేశము గల్గించుట.

౫. మాయ.

౬. ఉపేక్ష.

౭. ఇంద్రజాలము.

౮. తంత్రము- ఇది యైదువిధములు. ౧. భేదతంత్రము, ౨. పరీక్షాతంత్రము, ౩. విశ్వాసతంత్రము, ౪. వంచనాతంత్రము, ౫. మిత్రకార్యతంత్రము.

౯. అంగపంచకము- ఐదువిధములు. ౧. సహాయాంగము, ౨. సాధనోపాయాంగము, ౩. దేశ, కాల విభాగాంగము, ౪. వినిపాత ప్రతీకారాంగము, ౫. సిద్ధి.

౧౦. యానపంచకము- ౧. విగృహ్యాయము, ౨. సంధానము, ౩. సంభూయయము, ౪. ప్రసంగము, ౫ ఉపేక్ష.

౧౧. సంధులు- (పదునారు విధములు) ౧. కపాలసంధి, ౨. ఉపహారము, ౩. సంతానము, ౪. సంగతము, ౫. ఉపన్యాసము, ౬. ప్రతీకారము, ౭. సంయోగము, ౮. పురుషాంతరము, ౯. అదృష్టతరము, ౧౦. ఆదిష్టము, ౧౧. ఆత్మామిషము, ౧౨. ఉపగ్రహము, ౧౩. పరిక్రియ, ౧౪. ఉచ్ఛిన్నము, ౧౫. పరదూషణము, ౧౬. స్కంధోపనీయము.

౧౨. విగ్రహము- ఇది ఇరువదిభేదములు గలది. ౧. రాజ్యము, ౨. స్త్రీ, ౩. స్థానము, ౪. దేశము, ౫. జ్ఞానము, ౬. ధనాపహారము, ౭. వందనము, ౮. మానము, ౯. విషయపీడ, ౧౦. జ్ఞానార్థము, ౧౧. ప్రభుశక్తి, ౧౨. మంత్రశక్తి, ౧౩. ఉత్సాహశక్తి, ౧౪. దైవము, ౧౫. మిత్రుఁడు, ౧౬. అవమానము, ౧౭. బంధువినాశము, ౧౮. భూతానుగ్రహవిచ్ఛేదము, ౧౯. మండలదూషణము, ౨౦. ఏకార్థాభినివేశము.

వీనికి సాధారణ లక్షణములు, విశేష లక్షణములు, అవాంతరభేదములు, కార్యకారణభావములు, వినియోగక్రమములు వివరింపఁబడినవి. (ఇంకను అరిషడ్వర్గములు, షడ్గుణములు, రాజ్యసప్తాంగములు, రాజసభాసప్తాంగములు, సప్తసంతానములు, సప్తవ్యసనములు, సప్తవర్గములు, అష్టైశ్వర్యములు, అష్టభోగములు, రాజమండలములు చూడుఁడు).

**అర్థసమర్థో విద్యానధిక్రియతే** — ఎవ్వని కవసరముండునో యాతఁడే ప్రయత్నింపఁదగినవాఁడు. అవసరములేకుండినఁ బ్రయత్నించుట నిరర్థకమని భావము. (సంస్కృతలోకోక్తి).

**అర్థసాక్షిగోత్రము** — వసిష్ఠగణము చూడుఁడు.

**అర్థస్య పురుషోదాసో దాసస్త్వర్థోనకస్యచిత్** — ధనమునకు మనుష్యులు దాసులుగాని, ధనమెవ్వరికిని దాసిగా నుండదని భావము. ఇది సంస్కృతభాషా లోకోక్తి.

**అర్మణము** — ముప్పదిరెండు శేర్ల (శేరు ౨౮ తులములు) ప్రమాణమునకు అర్మణ మని పేరు.

**అర్హతమత (జైనమత) ము** — ఇది వేదబాహ్య (లేక అవైదిక) మతములలో నొకటి. అవైదికమతములందు ఋగ్యజుస్సామాథర్వణాత్మక వేదమును ప్రమాణముగఁ గైకొనరు గాని వేదమతముల లక్షణధర్మములను గైకొనుచుందురు. ఈమతమునకుఁ బ్రత్యేక వేదములు పండ్రెండు కలవు.

జైనమతమనుపేర తొల్లింటికాలమునుండియు నొకమతముండెనని గన్పించుచున్నది. పిదప నర్హాన్మహర్షి యను గొప్ప మహానీయుఁ డీసిద్ధాంతమును స్థిరపర్చి సంస్కరించియు,చక్కఁబరిచియు, స్పష్టపర్చియు గ్రంథరూపమునకుందెచ్చి యుద్ధరించెనని తేలుచున్నది. ఈ విద్వాంసుఁడు యుధిష్ఠర శకము ౧౮౮౫ సంవత్సరప్రాంతము వాఁడనియు, పాటలీపుత్ర ప్రాంతవాసియనియు, తలఁపఁబడుచున్నవాఁడు. అర్హతుఁడన పూజ్యుఁడని యర్థముగాన నిది బిరుదనామమేమో యని సంశయముతోఁపకపోదు. కాకున్న జినదేవునివలన జైనమతమని పేర్వడసి నటులనే పూజ్యుఁడగు నాజినదేవునికి నర్హతుఁడను పేరన్వయించి అర్హతమతమని వాడదొడంగియుందురనిగూడఁ దలంపవచ్చును. అమితగతి జైనాచార్యకృతమగు సామాయిక పాఠమనఁబడు జైనగ్రంథమున జినదేవుఁ డర్హతుఁడని పేర్కొనఁబడి యున్నది. కాని సంబుద్ధులందు దేవ, నాథ, మునీశ, ప్రభో, పరమాత్మ, భద్ర, మొదలగు మాటలు వాడఁబడినవి కాని అర్హతశబ్దము వాడఁబడలేదు. మఱియు నీమతకర్తయో లేక ప్రవర్తకుఁడో స్పష్టముగఁ దెలియరాకున్నను క్షపణికజగద్దేశికుని మతప్రధాన మహానీయునిగ నీమతస్థులందఱు పాటించుచుందురు. క్షపణికుండన లజ్జారహితుఁడని యర్థము.

ఈ మతసిద్ధాంతమున దేవుఁడు, ఆత్మ, లోకము, కాలము, వేదము, కర్మము నను షట్పదార్థములు చెప్పఁబడినవి.

౧. దేవుడు- ఈమతమున దేవుఁడు, జినుఁడు, అర్హతుఁ (పూజ్యుఁ) డనియు ననుట కలదు. ధర్మచక్రత్రయ విరాజితుఁడు, చతుర్ముఖుఁడు, ఆద్యంతరహితుఁడు, జగద్గురుఁడు, స్వయంనిర్మాత (అనగా తానే చేయునుగాని అన్యులవలన చేయించువాఁడుకాఁడు), జ్ఞానప్రేరేపకుఁడు, భవదుఃఖవిముక్తిగల్గించువాఁడు, సర్వజ్ఞుఁడు, సర్వాంతర్యామి, రాగాదిదోషరహితుఁడు, కర్మకళంకాతీతుఁడు, సమాధిగమ్యుఁడు (అనగా చిత్తస్థైర్య సమాధినందినవారి కగుపడువాఁడు) పరమాత్మ, నిరింద్రియుఁడు, జ్ఞానమయుఁడు, సర్వవ్యాపి, సిద్ధుఁడు, మంగళప్రదుఁడు, దేవుని చూచుటతో విశ్వమంతయు భేదబుద్ధితో ఏవస్తువునకావస్తువును వేర్వేరుగఁ జూచుటయగుననియు, లోకములం బ్రకాశింపఁజేయుగల సూర్యుఁడుసైతము దేవున కెదురై ప్రకాశింపఁజాలఁడనియు అనగా స్వాత్మస్థితి, స్వప్రకాశములం గలవాఁడనియును జెప్పఁబడినది. దేవుని పాదభక్తి మనస్సున స్థిరపడునేని యజ్ఞానము నశించునని చెప్పఁబడినది.

౨. ఆత్మ- ఆత్మకు జీవుఁడనియుఁ బేరుకలదు. ఇది అనాదిసిద్ధముగ నున్నది కాని యొకప్పుడొకరివలన సృష్టింపఁబడినదికాదు. ఆదినుండియు మోహము మొదలగు దోషయుక్తమై యున్నది. జీవుఁడు భోక్తయగు నాత్మ, స్వరూపనిత్యము, సంకోచ వికాసములు స్వధర్మములుగాఁ గలది. ఆద్యంతరహితము, సర్వజ్ఞత్వసర్వదర్శనజ్ఞానముల సహజముగ గలది. సుఖదుఃఖములను స్వాభావికముగఁ గల్గియుండినదికాదు.

భోక్తయగు నాత్మయన- జీవుఁడజీవపదార్థముల ననుభవించుచుండునదియనియు, స్వరూప

నిత్యమన- బౌద్ధులు చెప్పునటుల సర్వము క్షణిక మను బాధకు లోనగునది కాదనియు, అనగా ఆత్మక్షణికమై క్షణక్షణమునకు మారుచుండు టయే ఆత్మలక్షణము కాదనియు, స్వరూపనిత్య 'మనియు భావము. క్షణికమై మారుచుండు టయే' సంభవించుచుండునేని, కార్యమొకఁడు చేయుటయు దానిఫలితమింకొకఁ డనుభవించు టయు నను దోషము సిద్ధించును.

సంకోచ వికాసములు, ఆత్మధర్మము లన జీవుఁడు, చీమ, దోమ మొదలగు చిన్న చిన్న శరీరముల నందుతరి, ముడుచుకొని ఆ శరీరము నందే యిముడఁగల్గియుండును. దీనికి సంకోచ మని పేరు. ఏనుఁగు మొదలగు పెద్ద శరీరముల నుండుతరి నెక్కువగ వికసించి, ఆపెద్దశరీరమంత టను వ్యాపించియుండును. దీనిపేరు వికాసము. ఇట్లనుటవలన నాత్మ యెంత చిన్నశరీరమునం దైనను సంకోచావస్థయం దిమిడియుండగల దనియు, ఎంతపెద్దశరీరమునందైనను వికాసావస్థ యందు వ్యాపించి యుండఁగలదనియు నందురు గాన సంకోచ వికాసము లాత్మధర్మములుగఁ జెప్పఁబడినవి.

ఆద్యంతరహిత మన, జీవు లొకరివలన సృజింపఁబడక ననాదిగ నల్లేయుంట, ఆదిలేని వనియు, నశింపుజెందక ఎవ్వరియందు నైక్యమగు బాధలేక నిలచియుంౘునవి గాన, అనంతము లనియుఁ జెప్పఁబడినవి.

సర్వజ్ఞత్వ సర్వదర్శకజ్ఞానమును సహజముగ గలదియన- ప్రాణికిం గర్మలు, కళంకములు, అజ్ఞానములులేని పరిశుద్ధమగు నవస్థయందు దర్శనజ్ఞానమయవిశుద్ధి గల్గియుండును గావుననే జైనమతవిధానమున సాధనత్రయమునెరపి యంత రాయములం జయింపఁగల్గి పరిశుద్ధుండగునేని దర్శనజ్ఞానమయవిశుద్ధిఁ గల్గి యూర్ధ్వగతిం జెంది జీవుఁడు ముక్తుఁడగుచున్నాఁడు. కర్మకళంకాజ్ఞాన మున నీశక్తులు సదా జీవునియందు మరుఁగుపడి యుండును.

సుఖ దుఃఖములు స్వభావసిద్ధములుకావు. ఏమన ప్రాణికి సుఖముగాని,దుఃఖముగాని, అవాంత రముగసందర్భించుచుండుంగాని స్వభావసిద్ధములు కావు. అగ్నిసంపర్కమున శీతలస్వభావముగల యుదకము వేడిగనైనను కొంతసేపటికి తన సహజ లక్షణమగు చల్లఁదనమునకే మరలునటుల, యాత్మ కన్యకారణముల సుఖదుఃఖములు ప్రాప్తించి లోఁబరుచుకొనినను కాలక్రమమున వానినివీడి స్వతఃసిద్ధమగు ప్రశాంతావస్థకుం జేరును. కాన స్వభావసిద్ధలక్షణముగాదని చెప్పఁ బడినది.

జైనమత ధర్మమున, ఆత్మ శరీరమునుండి వేరగునది. అజ్ఞానవశమున శరీరమే నేనని తలంచు నంతటి యహంభావపూరితమై యుండినను, అజ్ఞానము నశించినంత ఆత్మ శరీరమునుండి వేరగునదని స్పష్టముగఁ దెలియనగునని చెప్పఁ బడినది. శరీరేంద్రియములందు జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు నంగీకరింపఁబడినవి. ఇంద్రియ ములును ఆత్మకన్న వేరగునవిగఁ జెప్పఁబడినవి. ఇంద్రియములును భౌతికములే. పుద్గలమయ ములే. ఆపుద్గలములు ధర్మాధర్మప్రేరితములుగఁ జెప్పఁబడినవి.

ఆత్మలకు దేహమునంతటనువ్యాపించి అజ్ఞాన తన్మయత దేహమే "నేను" అను భావము బల పడి దేహాభిమానవంతములై సిగ్గును, మోమోట మును సిద్ధమగును. అందు మోమోటము పలు దోషములకు మూలమగును. సిగ్గు, వస్త్రధార ణాదులం గల్గించుననియు, ప్రాణికి సర్వవ్యాప కత్వ, సర్వదర్శికత్వ, సర్వజ్ఞత్వములను నిరో ధింప శరీరమే యొక అంతరాయమగుచుండ

మఱియొక యంతరాయముగ వస్త్రధారణాదులు సిద్ధమగుట యనర్థమని దిగంబర జైనస్వాములు వస్త్రధారణమును నిరసించి దిగంబరులుగ నుందురు. ఇంక శ్వేతాంబర జైనులంగూర్చి వేఱుతావున వివరింపఁబడినది (చూడుఁడు).

జైనసిద్ధాంతమున ఆత్మ ఏకము అనగా ఏప్రాణి కాప్రాణి ప్రత్యేకప్రత్యేకమేగాని, ఒకదానితో నొకదానికే సంబంధము నుండదని చెప్పఁబడినది. ఆత్మ శరీరమునం దుండుతఱి, శరీరమంతయు వ్యాపింపఁగల్గును. అనగా అడ్డుకలుగువరకు వ్యాపించును. శరీరమందడ్డు లేనిచో జగత్తంతయు వ్యాపింప శక్తిని గల్గియుండును. కాన ప్రాణి పరశుద్ధావస్థయందు సర్వవ్యాపకముగఁ జెప్పఁబడినది. కర్మకళంకవశమున నజ్ఞానపరివృతమై శరీరమే తాననుకొనుట ప్రాణి కవాంతరముగ సంభవించిన సంసార వేదనానిపాత హేతువగు వికల్ప (సంశయ) జాలపరివృతావస్థగఁ జెప్పఁబడినది. ఆత్మకుఁ దానున్న శరీరముతో నేసంబంధము లేకుండగా నన్యశరీరధారులగు పుత్రమిత్ర కళత్రాదుల (ప్రాణముల) తో నేసంబంధ ముండజాలదనియు, ఉండునని తోఁచు మోహము, ప్రేమ, యభిమానము మొదలగునవి యజ్ఞానజన్య భ్రాంతులనియుఁ జెప్పఁబడినది.

ఈ మతసిద్ధాంతముమేరకు నాత్మలు ప్రపంచ సుముఖములనియు, ప్రపంచ విముఖములనియు ద్వివిధములుగను, అందు సుముఖాత్మలు బద్ధాత్మలనియు, నారకీయములనియుం ద్వివిధములనియు ప్రపంచవిముఖములగు నాత్మలు, మణిమంత్రౌషధుల ప్రభావమునను బ్రహ్మచర్యాదియోగాభ్యాసమునను పరిశుద్ధములై తనరును. బద్ధాత్మలు కర్మబద్ధములై జననమరణముల పాలగుచుండును. నారకీయములు పాపకార్యము లొనర్చుచు నరకవాసక్లేశము ననుభవించుచుండెడిని.

3. లోకము- జైనమతసిద్ధాంతము మేరకు లోకములు నైసర్గికములుగ ననాదిగ నల్లై యున్నవి. ఒకరివలన సృష్టింపఁబడినవి కావు, నశించునవిగావు గాన నాద్యంతరహితములని ప్పఁబడినవి. అవి పుద్గలములనఁబడు భూపరమాణుసముదాయ పిండములుగ నిర్వచింపఁబడినవి. ఆ పుద్గలసముదాయము లొక్కొకరూపము జెందుచో నొక్కొకనామముచేఁ (సంజ్ఞచే) దనరుచుండి, యారూపముం గోల్పోవుతఱి దాని నామములఁగూడఁ గోల్పోవుచుండును. అవి యన్నియు, లోకముల సముదాయమై జగత్తనఁబడును. ఆపుద్గలము లెప్పుడు శాశ్వతముగఁ జెడునవి నశించునవియుగావు గాన సత్యములుగను, నామరూపములం జెందిన భాగములు మాత్రము నశించుచుండి తిరుగ పుద్గలరూపము నకుం జేరుచుండుంగాన లోక (పదార్థ) ము వస్తుతః సత్యమనియుఁ జెప్పఁబడినది. లోకముల వస్తువగు పుద్గలమునందు వర్ణము (రంగు), గంధము (వాసన), రసము (రుచి), స్పర్శము (తాకినఁ దెలియునటులఁ జేయుగుణము) లు కలవని చెప్పఁబడినది.-

ఇక భూపుద్గలములు, జలపుద్గలములు, అగ్ని పుద్గలములు మొదలగునవిగ నుండుతఱి సూక్ష్మభూతరూపమనియు, వీని సంఘాతము (కూడిక) వేర్వేరాకారములుగనై స్థూలభూతరూపములుగ పరిణమించుననియు, అవియే పృథ్వి, జల, అగ్ని, వాయు రాకాశములనంబరగుచు జగమున కుపాదానమగుచున్నవనియుం జెప్పఁబడినది.

లోకములు నూటపదునెన్మిదిగఁ జెప్పఁబడినవి. అందూర్ధ్వలోకము నూరును, మధ్యలోక మొకటియు, అధోలోకము పదునేడును గలవని చెప్పఁబడినది.

ఊర్ధ్వలోకములు ౧౦౦—ఒక జ్యోతిర్లోకము, ఒక వియంతరలోకము,పదునారు దేవలోకములు,

ఎనుబదియొక దేవాధిప లోకములు, ఒక నిర్వాణలోకము (ఇది అన్నిటికన్న ఎత్తైనది) గ జెప్పఁబడినది. ఇందే జినదేవుండుండునని చెప్పఁ బడినది. మఱియు నూర్ధ్వలోకములు నూటియొంటు జ్యోతిర్లోకము క్రిందిదియని చెప్పఁబడినది).

మధ్యలోకము ౧- ఇదియే మనుష్యులుండు మర్త్యలోకము.

అధోలోకములు ౧౭— మర్త్యలోకమునకుం దిగువ నరకలోకము లేడును, పవనలోకములు పదియుం గలవని చెప్పబడినది.

ఇటులనుండు లోకములందలి పుద్గలములు భౌతికములుగను, వస్తుతః సత్యములుగను, నామ రూపతః మిథ్యగను, దేహములందలిపుద్గలములు ధర్మాధర్మప్రేరితము లనియుం జెప్పఁబడినవి. పంచభూతములందలి యాకాశము ఏకమనియు, అనంతప్రదేశముగలది యనియుం జెప్పఁబడినది.

౪. పదార్థము కాలము- యుగములుగ విభజింపఁబడినది. ప్రతియుగమునందు ఉత్సర్పిణి యనియు, అవసర్పిణి యనియు రెండుభాగములు గలవు. ఉత్సర్పిణి వృద్ధికాలము- అనగా నందు జీవించువారు రుత్తరోత్తరము ఆయుర్వృద్ధింగల్గి జీవించుచుందురు. అవసర్పిణిక్షీణకాలము: అనగా నందుజీవించువారు ఉత్తరోత్తరము ఆయుఃక్షీణతం గల్గి (తక్కువకాలము) జీవించుచుందురు. గత యుత్సర్పిణికాలమున, పదునల్వురు మనువులుద్భవించిరి. అందు గడపటిమనువు నాభిమహారాజు. ఆయనకాలమున విజ్ఞానమధికరించెను. ఆయనయే విధాత. ఆయన గర్భమున ఋషభతీర్థకరు లుద్భవించిరి. వారికాలముతో నుత్సర్పిణీకాలము ముగిసెనని చెప్పఁబడినది. కాలమణుస్వరూపమనియు, అనిత్యమనియు, దాని గమనమును లెక్కింప నుత్సర్పిణీయవసర్పిణిగతు లేర్పర్చబడిన వనియుం జెప్పఁబడినది.

౫. వేదము— వేదము లనాదిసిద్ధములు. వేదములకు కర్తలేఁడు. ఇవి ధర్మముల వివరించెడిని. ఇవి ముక్తిదము లనియు, అధ్యయ నార్హము లనియు, స్వతఃప్రమాణములనియు, ఆత్మనిర్వాణ సూచకములనియుం జెప్పఁబడినది. ఈవేదముల కనుబంధము లనఁదగిన మతగ్రంథములు కొన్ని కలవు. అవి ధర్మపరీక్ష, చింతామణి, మహాపురాణము, మేరుమందిరపురాణము, త్రిలోకసారము, పదార్థసారము, రత్నకరండము, నీలకేశివాదము, నయచక్రము, ధవళము, విజయధవళము, మహాధవళము, సుబోధిని యనఁబడునవి.

౬. కర్మము— కర్మములు జైనధర్మమున ౧౪౮ చెప్పఁబడినవి. ఇవి జినదేవుని కంటఁజాలవు. ఇవి శరీరసంబంధముతోఁ గూడిన యాత్మలం బాధించుచుండును. ఆత్మలకు స్వయంకృత కర్మజన్యములగు ఫలములు అనుభవనీయములే యగుచున్నవనియు, స్వకర్మఫలానుభవము ప్రాణి కిందప్పని దనియు, దానింగడకుద్రోసి మఱి యే యితర ఫలానుభవములును ఎవ్వరు నీయఁజాల రనియు, ఎప్పుడు కర్మనిరర్థకము గానేరదనియు, అటులగాలేడిబుద్ధి నిరర్థకమనియుం జెప్పఁబడినది. కర్మఫలానుభవ మాత్మకు శుభాశుభరూపమున సంభవించుచుండును. మఱియు నాసంభవము దృష్టరూపమునను, అదృష్టరూపమునను గూడ సంభవించుటయుఁ గలదు. మఱియు నీయర్హాత సిద్ధాంతమున కర్మజన్యదోషములు వివరింపఁబడినవి. ఇవి ఆత్మలకు శరీరసంయోగమునఁ గల్గు కళంకములుగ నిర్వచింపఁబడినవి. విముక్తిమార్గ ప్రతికూలవర్తనము బుద్ధిని ఇంద్రియములకు వశపర్చెడిని. తోడనే ఇంద్రియములు విజృంభించి బుద్ధియు దుర్బుద్ధియయ్యెడిని. అందువలన చరిత్రశుద్ధి చెడి, ఆత్మకుపాపములు (కళంకములు) కలుగ

నారంభించును. రాగాదిదోషములు ప్రకోపితములై అశేషశరీరవర్గమును లోఁబఱచుకొనును. ఈపాప (కళంక) ములను మనోవచఃకాయకషాయపరిణామములుగను, భవదుఃఖ (సంసారవేదనానుభవ) కారణములుగఁ జెప్పఁబడినవి. ఇవి పదమూఁడు.

మనోదోషములు మూఁడు- ౧. మనశ్శుద్ధిలోపము, ౨. రాగద్వేషాది దోషములు, 3. విషయభోగలంపటమున నతిసక్తదోషము (అనఁగా ఎక్కువగా మనస్సుదవిలియుంట). ఈ సందర్భమున మమకారమన సమబుద్ధిలేకుండుట యని నిర్వచింపఁబడినది.

వాగ్దోషములు నాలుగు- ౧. అర్థహీన, ౨. మాత్రహీన, 3. పదహీన, ౪. వాక్యహీన ప్రసంగములొనర్చుట.

కాయదోషము లారు- ౧. అతిక్రమదోషము (సుచరిత్రకర్మల నతిక్రమించుట), ౨. వ్యతిక్రమదోషము (సుచరిత్రకర్మలకు వ్యతిరేకించుట), 3. అతిచారదోషము (జినధర్మాతిచార మనఁగా విధికన్న నెక్కువగ నొనర్చుట), ౪. అనాచారము (జినధర్మానాచారము అనఁగా విధినాచరింపకపోవుట), ౫. విషయభోగలంపటము, ౬. శీలవృత్తివిలంఘనము (శీలములను పాటింపక చేయు వర్తనము)

ఇందు మనోదోషములు వినిందము (నిందించుకొనుట) వలనను వాగ్దోషములు ఆలోచనము (తనవాక్కులను తావిమర్శించుకొనుట) వలనను, కాయికదోషములు నిర్వేదన (గర్హించుకొనుట) వలనను శమించునని చెప్పఁబడినది. ఇంకను, ఆత్మకుంగల్గిన వాక్కళంకము సరస్వతింధ్యానించి క్షమనర్థించుటవలన నశించుననియు, సరస్వతి చింతితార్థప్రదాన చింతామణియనియు, ఆదేవినర్థించి వేడినచో బోధిస్సమాధి (శబ్దజ్ఞాననిశ్చలసిద్ధి) ని, వాక్పరిణామశుద్ధి (వాక్పరిశుభ్రత)ని, ప్రసంగార్హశక్తి ని, స్వాత్మోపలబ్ధి (ఆత్మజ్ఞానము) ని, శివసౌఖ్యసిద్ధి (మంగళప్రదసౌఖ్యసిద్ధి) ని, బసంగుననియును, కాయికకళంకము జినదేవుని ధ్యానిం క్షమనర్థించుటమూలమున నశించుననియుం జెప్పఁబడినది.

జైనమతమునఁ బ్రధానములు జీవము, అజీవము అనునవి రెండైనను, వేఱ్వేఱుకాలముల వేఱ్వేఱు విద్వాంసులు పలువిధములుగ చెప్పియున్నారు. కొందరు జీవము, ధర్మము, అధర్మము, పుద్గలము, ఆకాశము నని యైదుగగూడ నుడివిరి. మఱికొందఱు కాలముంగూడఁ జేర్చి యాఱుగనుడివిరి. మఱియుం గొందఱు జీవము, అజీవము, అస్రవము, బంధము, సంవరము, నిర్జరము,మోక్షమునను సప్తతత్వములు నుడివిరి. ఇంకను గొందఱు వీనికి పుణ్యము, పాపము గూడ చేర్చి తొమ్మిది తత్వములనిరి. ఇవి యన్యమతములందు పదార్థములనంబడువాటిం బోలినవిగఁ దోఁచెడిని.

౧. జీవము- భోక్తయగుఆత్మ. దీనిం గూర్చి యిదివఱకే వివరింపఁబడినది. ౨. అజీవము- భోక్తయగు ఆత్మ అనుభవించు పదార్థవితతి. 3. ధర్మము- జంగమములగతికి (గమనమునకు) హేతువగు వ్యాపిద్రవ్యము. ౪. అధర్మము- స్థావరములస్థితి (ఉనికికి) హేతువగు వ్యాపిద్రవ్యము. ౫. పుద్గలము (పరమాణువు). ౬. ఆకాశము. ౭. కాలము- వీనిం గూర్చి యిదివఱకే వివరింపఁబడినది. ౮. అస్రవము- శబ్దాదివిషయములం గూర్చి శ్రోత్రాది ఇంద్రియములు పోవుట. అనఁగా శ్రోత్రేంద్రియము వినుటయు, త్వగింద్రియము స్పర్శము నెఱుఁగుటయు, చక్షురింద్రియము రూపముజూచుటయు, జిహ్వేంద్రియము రసమును రుచిజూచుటయు, ఘ్రాణేంద్రియము గంధము నాఘ్రాణించుటయు.

నై యున్నవి. ౯. బంధము- దీనినే కర్మ యనిరి. తానొనర్చిన కర్మవలనఁ గల్గిన శరీరముల (జన్మలందు) పరంపరనుండి విముక్తినందుటకు వీలు కాకుండ నిర్బంధమగు నద్దానిని బంధ మనిరి. ౧౦. ఇంద్రియవ్యాపారమును దొలఁగింపఁదగిన యమనియమాది యోగసాధనములను సంవర మందురు. ఇవి చిత్తవృత్తికి నిరోధములని సాంఖ్యమతములందు వచింపఁబడినవి; కాని, ఈ జైనమతమున నింద్రియవ్యాపార నిరోధమొనర్చు నవిగఁ జెప్పఁబడినవి. ౧౧. నిర్జరము- పాప పరిహారమగుటకు తప్తశిలారోహణాది కాయశుద్ధి కార్యములొనర్చుట. ఎండవలన కాలుచున్నగండ శిలలపైఁ బరుండియు, కూర్చుండియు, శరీరమును దపింపఁజేయుటవలన కాయికదోషము లడంగునని చెప్పఁబడినది. ౧౨. మోక్షము- నిర్వాణ మనియు ననియెదరు. ప్రాణికి కర్మనాశనమై జన్మనిర్బంధము తొలఁగి, దర్శనజ్ఞానమయవిశుద్ధి నంది, జ్ఞానవంతమై ఊర్ధ్వగతిం గల్గియుండుట మోక్షమనఁబడును. ౧౩. పుణ్యము- సత్కార్యాచరణ ఫలితము. ౧౪. పాపము- దుష్కార్యాచరణ ఫలితము.

ఇందు జీవ, ధర్మ, అధర్మ, పుద్గల, ఆకాశముల నైదింటిని పంచాస్తికాయము లందురు. అస్తికాయములన అనేకదేశవర్తియై యున్న ద్రవ్య మనియు, నాస్తికాయములన ఏదేశమునందును వ్యాపించియుండని ద్రవ్యమనియుఁ నెఱుంగునది. ఈ జైనమతతత్త్వముల పేరులం బల్కుతఱి సర్వమగునటుల అస్తికాయ యనిగాని, నాస్తికాయ అనిగాని కడంజేర్చి పల్కుచుందురు. అటులఁ బలుకుట అహింసాధర్మమని జైనమతాభిప్రాయము ఖండించుచు నైనను వాదించుతఱి నట్టు ప్రయోగించిన మాటలందుగూడ హింసించు భావము లేకుండునని చెప్పఁబడినది. ఇంకను దీనికిందోడు స్యాద్వాదమనంబడు సప్తభంగీ న్యాయమార్గమును గూడ నుపయోగించుచుందురు. (సప్తభంగీన్యాయ స్యాద్వాదము చూడుఁడు).

ఈ మతమునందుఁ బ్రత్యక్ష అనుమాన ప్రమాణము లంగీకరింపఁబడినవి. ఇంకను శబ్ద ప్రమాణము నొకవిధమున నంగీకరింపఁబడిన దనియే చెప్పవలయును. శబ్దప్రమాణమన ఆగమ ప్రమాణమని యీ మతపరిభాష యందలి యర్థము. (ప్రమాణములు చూడుఁడు). ఈ మతమున ధర్మము, అధర్మము అనుమాన ప్రమాణములుగఁ జెప్పఁబడినవి. మఱియు జైనులను తమ మతగ్రంథములంగూర్చియున్నవా, లేవా, యని ప్రశ్నించిన ప్రత్యుత్తర మీయకుందురు. అది దోషముగఁ దలంతురు.

జైనసిద్ధాంతమున జీవము శరీరముచే నావరింపఁబడియుండుటే బంధమని చెప్పఁబడినది. ఈ అంతరాయము సహజముగ ప్రాణికింగల శక్తులను మరుగుపర్చునని ఇదివరకే చెప్పఁబడినది. ప్రాణము స్వకీయకర్మను పరిహరింప వీలు లేకున్నను నిర్వాణకాముఁడగువాఁ డేకముం దైనను కర్మకళంకములు విజృంభింపకుండ సమాధిని బ్రహ్మచర్యవిధానమున నభ్యసించినచో ప్రాబల్యముతగ్గి క్రమముగ నంతరించెడిని. అందువలన నాత్మకు సర్వసమత్వము కుదిరి ఓర్పు కలుగును; మమకారమును అంతరించును. దీనిని విధి నిషేధముల నెఱింగి యభ్యసింపవలయును.

విధులు- ౧. సత్త్వేషుమైత్రిమ్, ౨. గుణిషు ప్రమోదమ్, 3. క్లిష్టేషుజీవేషుకృపాపరత్వమ్, ౪. మాధ్యస్థభావం విపరీతవృత్తౌ అని చెప్పఁబడినవి. నిషేధములు జంతుహింసాదులు విధులకు వ్యతిరేకకార్యములని యెఱుంగునది.

ఈయభ్యాసము బుద్ధి జ్ఞాన ధర్మములను మూఁటి నర్హమార్గముల నడపుట మూలమునం

జరుపవలయును. సమ్యగ్బుద్ధి లేక క్రమబుద్ధియను మనస్సునం దెప్పుడు జైనధర్మముల నాచరింప ననురక్తిం గల్గియుండుట. క్రమజ్ఞాన మన తనకుం గల్గు సుఖదుఃఖముల నోర్పుతో సహించి లొంగిపోక కనిపెట్టుచు నిర్లక్ష్యముగ నుండుట. క్రమధర్మ మన నింద్యవిషయములం దగులక భోగలాలసత్వము తనయందు మితిమీరకుండ జాగ్రతంగొని యుండుట యని చెప్పఁబడినది.

నిర్వాణమోక్షసాధనములు మూడు. అవి ౧. సమ్యగ్దర్శనము, ౨. సమ్యగ్జ్ఞానము, ౩. సమ్యక్చారిత్రము. వీటికి రత్నత్రయమని పేరు. ఈమూడును కలసి యొకటిగనై మోక్ష సాధనమని చెప్పఁబడినది.

౧. సమ్యగ్దర్శనము- అర్హాతుని సూక్తులందు నిసర్గము (స్వభావము) నగాని, గురూపదేశమున గాని కల్గు నాస్తిక్యబుద్ధి, అనఁగా జినదేవుని యందు నమ్మకము. ౨. సమ్యగ్జ్ఞానము- జీవాది పదార్థస్వరూపాదులను ఉన్నవున్నటుల నెఱుంగు సత్యజ్ఞానము. ౩. సమ్యక్చారిత్రము- అహింస, సూనృతము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము, అను పంచమహావ్రతములం గల్గియుంటయు, పాతకములం గల్గించు కర్మల నాచరింపకుంటయు నీనియమముతో జీవనముం గడపుటయు సమ్యక్చారిత్ర మనంబడును.

మట్టిపూతచే బరువెక్కిన యానపకాయతుంబ నీటమునిఁగియు గ్రమముగ నాపూతమన్ను కరగినకొలఁది తేలికయై నీటిపైఁదేలునట్లు రత్న త్రయాంతర్గతవిశేషము లనఁదగిన మలహరణ, దిగంబరత్వ, విషయవైరాగ్య, పాణిపాత్రభోజన, కేశోల్లుంచన, వాఙ్నియమాది ధర్మనియతులచే నాత్మజ్ఞానాభివృద్ధి కలుగ ప్రకృతిబంధముసడల ప్రాణికూర్ధ్వగతి కలిగి దర్శనజ్ఞానశక్తియు, సర్వ వ్యాపకత్వముంగల్గుట మోక్షమని చెప్పఁబడినది.

స్వాత్మజ్ఞానధ్యానమున తినలో నిశ్చలము గల్గియుంటకు (అనన్యవృత్తి లేకుంటకు) సమాధి యనిపేరు. ఇంక నీమతబోధకులైన స్వాములు తీర్థకరులనఁబడుదురు. వా రిరువదినల్వురు. (జైన తీర్థకరులు, దిగంబర, శ్వేతాంబర జైన విభేదములు చూడుఁడు).

**అర్హనాథుఁడు** — జైనతీర్థకరులలో నొకఁడు. (తీర్థకరులు చూడుఁడు.) వీరిచిహ్నము చేప. కురువంశ క్షత్రియుఁడు. తండ్రి సుదర్శన రాజా. తల్లిపేరు మిత్రాదేవి. జన్మస్థానము హస్తినాపురము. పొడవు ౩౦ ధనస్సులు (ధనస్సు మూడున్నర మూర). సువర్ణచ్ఛాయ. ఆయువు ౮౪ వేలు. గణధర్సంఖ్య ౩౦. నిర్వాణ స్థలము సువేరుశిఖరము. అంతరాళము వేయి కోట్ల వర్షములు.

**అర్హసాక్షిగోత్రము** — జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.

**అరాటదేశము** పాంచాలదేశము చూడుఁడు. (అరాష్ట్రదేశము చూడుఁడు).

**అరాటదేశము** — హైరాట పురము (గుజరాత్) దేశము. (గుజరాత్ జిల్లాచూడుఁడు).

**అరారాత్ శిఖరము** (Mt. Ararath) ఇది ఆర్మీనియాదేశములోని ఒక పర్వతశిఖరము. టర్కీదేశమున సుల్తాన్ అబ్దుల్హామీదను భూపతి యొకఁడు ఆర్మీనియా యను దేశనామ ముండ రాదని శాసించెను. నాఁటినుండి అన్యనామము లలో నున్నది. బైబిలునందు చెప్పఁబడిన Noa's Ark జలప్రళయకాలమున నీ అరారాట్శిఖరమ్ము నకుందగిలి నిలచెనని చెప్పఁబడినది. అరారా ట్శిఖరమున పారసీకరాజ్యము, టర్కీ సామ్రాజ్యము, రష్యాసామ్రాజ్యపు సరిహద్దులతావు కలియుచుండినది. ప్రజలు ఆర్మీనియనులు. ఏర్జెరమ్ పట్టణప్రాంతము.

**అరాళహస్తము** — హస్తాభినయము చూడుఁడు, భరతశాస్త్రము చూడుఁడు.

**అర్కాయణగోత్రము** — జమదగ్ని వత్సఉపగణము చూడుఁడు.

**అర్ఘ్యాయణగోత్రము** — జమదగ్ని ఉపగణము. జమదగ్ని బీథా ఉపగణము చూడుఁడు.

**అర్కావతీనది** మైసూరురాజ్యమున నందిదుర్గమున జన్మించి బెంగుళూరుమండలమున ఉత్తరమునుండి దక్షిణవాహినిగఁ బ్రవహించుచు గొప్పగొప్ప వ్యవసాయఁపుఁ జెరువులను జలములతో నింపి కుముద్వతి, వృషభావతి యను పేళ్లు గల చిన్న నదులను తనయందుఁ గల్పుకొని ౧౨౦ మెళ్లు ప్రవహించి కావేరీ నదియందు సంగమించును.

**అర్ఘ్యాయణగోత్రము** ఆత్రేయ గణము చూడుఁడు.

**అర్ఘ్యాంగములు ౮** (అష్టార్ఘ్యాంగములు) అర్ఘ్యమిచ్చు వస్తువులు ఎన్మిది. ౧. ఉదకము, ౨. క్షీరములు, 3. దర్భలు లేక దర్భోదకము, ౪. పెరుగు, ౫. అక్షతలు, ౬. తిలలు, ౭. యవ (ధాన్యము) లు, ౮. తెల్ల ఆవాలు.

**అర్థాగ్రక్షీ** (Orthography) — సక్రమమగు వర్ణక్రమమును, సరియగు నుచ్చారణను దెలుపు శాస్త్రము. ఇది వ్యాకరణశాస్త్రమునం దొక భాగము.

**అర్థాత్సమర్థో విద్వానధిక్రియతే-** ఆవిద్యయందెవ్వఁడు పూర్ణుఁడో అతఁడే అర్థము చెప్పఁదగినవాఁడనియు, విద్యలేనివాఁ డర్థము చెప్పఁదగఁడనియు భావము. సంస్కృతలోకోక్తి.

**అర్ధానుస్వారము**- శిరసును చూడుఁడు.

**అర్ష్టిదిగోత్రము** — కణ్వ ఉపగణము చూడుఁడు.

**అరిచ్ఛత్రము** — భారత యుద్ధమున కురుసైన్యములు విడిసినతావు.

**అరిటాకువచ్చి ముల్లుమీఁబడినా అరిటాకుకే నష్టము — ముల్లువచ్చి అరిటాకుమీఁ బడినా అరిటాకుకే నష్టము** — ఆంధ్రలోకోక్తి.

**అరిదళము** (హరిదళము) — దీనికి ఫ్రెంచిభాషయందు (Orpiment) అనిపేరు. ఇది నైసర్గికముగ పసుపుపచ్చరంగు. మఱియు నిది ట్రైసల్ఫైడ్ ఆఫ్ ఆర్సెనిక్ (Trisulphide of arsenic) అని పోల్చఁబడినది. ఈరంగును Kings Yellow అనికూడ నందురు. ఇది హంగెరీదేశమున గనులందు దొరకెడిని. మునుపు క్యాలికో (Calico) గుడ్డలద్దుటయందు, మందులలోను వాడుచుండిరి గాని ఇక్కాలమున దీని వాడుక కొంతతగ్గినది. అరిదళమునందు వెంట్రుకల నూడదీయు గుణముకలదు గాన, తోళ్లు బాగు చేయువారు చర్మములనుండి వెంట్రుకల నూడదీయ దీని నుపయోగింతురు. అజ్ఞతగా దీనిని హరిదళమనియు వాడుచుందురు. అరిదళమునకు సంస్కృతపుఁబేళ్లు నటమండనము, నటసంజ్ఞకం, ఆరింతాలః. అరిదళమును సరిగా శుద్ధిఁజేసియు, భస్మముజేసియు, ఆయుర్వేదవైద్యు లుపయోగింతురు. విషదోషమును హరించి, విషజ్వరము నివారించి, ఎముబది వాతముల హరించి, ప్రమేహము, మూలవ్యాధి మొదలగు పెక్కురోగముల నిర్మూలించుననియు, నిది సరిగాశుద్ధిగాక సరిగా భస్మముకాకపోయినచో దాని లోనికిచ్చుటవలన వాతపైత్యములు ప్రకోపించుట, వంగుత్వము గల్గుట పీత ధూమవర్ణములు శరీరమునఁ బబలి

కుష్ఠురోగముసైతము కలుగవచ్చుననియు ననెదరు. దానికివిరుగుడు బియ్యపుకడుగు, సర్పాక్షి రసము శర్కరకల్పి సేవించుట, జీలకఱ్ఱ శర్కరలుకల్పి పుచ్చుకొనుట, దానిమ్మపండ్ల రసము, వాకుడువేళ్లు, నేలవేముల కషాయము నని యందురు. మున్ను భాగవతము వీధి నాడు దినములందు స్త్రీవేషముల ముఖములకు అరిదళముతో కోటా వేయుచుండిరి. ఇప్పటికిని అచ్చటచ్చట కలదు.

**అరియనిజమ్ సిద్ధాంతము** (Arianism) — క్రైస్తవమతమునందు క్రీస్తుప్రభువు దైవసంబంధికాఁడనియు, దైవసమానుఁడు కానేరఁడనియు సిద్ధాంతము. ఈసిద్ధాంతమును క్రీ. వె. నాల్గవ శతాబ్దమున అలెగ్జాండ్రియా యందు క్రైస్తవమతగురువుగానుండిన అరియస్ అనుపేరు గల ఆచార్యునిచే బోధింపఁబడినదట. ఈ సిద్ధాంతమును అథానసిసస్ (Athanasisus) అనునాతఁడెదిరించెనట. కడకు అరియస్ శిక్షింపఁబడెనట.

**అరియుపాద లేక వేలాయుధ క్షేత్రము** — తిరువాన్కూరు రాజ్యమున కొల్లం (Quilion) పట్టణమునుండి ముప్పది యారుమైళ్ల దూరమునందున్న సుప్రసిద్ధక్షేత్రము.

**అరిశట్ల గోత్రము** — ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. హారిశిష్టకుల గోత్రము (త్ర్యార్షేయము) చూడుఁడు.

**అరిశిష కుల గోత్రము** — ఆర్య వైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. హారిశిష్ఠ కుల (త్ర్యార్షేయము) చూడుఁడు.

**అరిషడ్వర్గములు** — ౧. కామము, ౨. క్రోధము, 3. లోభము, ౪. మోహము, ౫. మదము, ౬. మత్సరము. వీనిని శత్రువర్గమనియు నందురు.

**అరిష్టనేమి** — కశ్యపున కీపేరుకలదు. పుష్యమాసమున సూర్యునికడనుండు నొక గంధర్వుఁడును విదేహ వంశజుఁడగు పురుజిజ్జనకుని సుతుండును, శ్రుతాయువు తండ్రియు నీపేరఁ బరగువారె. ప్రాచేతసదక్షుని కుమార్తెల నల్వురం బరిణయమైన యాతఁడొక యరిష్టనేమి కలఁడు.

**అరిష్టపర్వతము** — సింహళద్వీపము లోనిదనియు, సీతను వెతకుచుపోయిన యాంజనేయుఁ డిందు నిలచెననియు, వాల్మీకిరామాయణము సుందరకాండ కథాసందర్భమున కలదు. పోల్కి తెలియరాదు.

**అరిష్టపురము** — తొల్లింటి శివిదేశపు రాజధాని. ఆనవాళ్లు తెలియవు.

**అరిష్టసేనర్షి** — భృగుకులోత్పన్నుఁడని చెప్పఁబడినది. ఇతని వంశజులకు ఆరిష్టసేను లని పేరుండెనట. యుధిష్ఠిర మహారాజున కితనితోఁ సంవాదము జరిగినటుల చెప్పఁబడినదని భారతము వనపర్వము నందుకలదు.

**అరిష్టుఁడు** — దనుపుత్త్రుఁడు అరిష్టుఁడు. ఇంకను మిత్త్రునకు రేవతియందు కల్గిన పుత్త్రునకును, వృషభరూపియై శ్రీకృష్ణునితోఁ గలహించి నిహతుఁడైన రక్కసునకు నరిష్టనామముకలదు.

**అరుంధతీదేవి** — ఈమె కరంజ్యోతి యనియుఁ బేరుకలదు. భర్త వశిష్ఠమహర్షి. కర్దమునికూతురు. ఆయ నేవసిష్ఠో తెలియకున్నది. (అదృశ్యంతి చూడుఁడు).

**అరుంధతీనక్షత్రము లేక గోళము** — నక్షత్రములు భారతీయులు గుర్తించినవి. చూడుఁడు.

**అరుంధతీప్రదర్శన న్యాయము** — పెండ్లియం దరుంధతీ నక్షత్రమును నూతన వధూవరులకుఁ జూపుచుందురు. కాని నిజమున

నరుంధతీ నక్షత్రమట నేదియో ఎవ్వరికిని తెలియ రాకుండుట సర్వసాధారణమే. బహుశః చూపు వారికే తెలియ కుండెడిని. ఆచారము మేరకు నర్థముందెలియని పనులొనర్చుట కీన్యాయమును వాడుచుందురు.

**అరుణ గోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**అరుణాచలము** (అరుణగిరి) — దీని నిప్పుడు తిరువణ్ణామల (తిరు-అరుణ-మలై) యనుచున్నారు. చెన్నరాజధాని దక్షిణదేశము. ఇట తేజోలింగము కొండపైగలదు. కొండ దిగువను గ్రామమున అరుణాచలేశుని దేవస్థానము కలదు. దీనింగూర్చి బ్రహ్మాండపురాణము ౫౧ ఆధ్యాయమునను, స్కాందపురాణము అరుణాచల మహాత్మ్యమునను ప్రశంసలుకలవు.

**అరుణాత్రేయగోత్రము** — ఆత్రేయ గణము చూడుఁడు.

**అరుణానది** —సప్తకౌశికలు చూడుఁడు.

**అరుణాయుని గోత్రము** — ఔతథ్య ఉపగణము చూడుఁడు.

**అరుణాశ్వుఁడు** — ఇక్ష్వాకువంశపు క్షత్రియుఁడు. బర్హిణాశ్వుని రెండవ కుమారుఁడు.

**అరుణి** — దనువుయొక్క పుత్రుఁడు.

**అరుణోదదేశము—చతురశీతిలింగ దేశము**—గద్వాలు సంస్థానరాజ్యము. హిమవన్నగముపై నున్న గద్వాల సంస్థానపుఁ బ్రాంత ర్థేశము. బదరీకేదారాది మహాస్థలములు,పెక్కు శివలింగములు నీదేశముననుంట దీనికి చతురశీతి (౮౪) లింగదేశమనియుఁ బేరుండెను. స్కాంద పురాణ అవంతీఖండమున నీదేశముం గూర్చిన ప్రశంసకలదు. బదరీనారాయణక్షేత్ర మీదేశము లోనిదే. ఇట నరనారాయణ దేవస్థానమును, బ్రహ్మకపాల మనఁబడు పితృ్యాణవిముక్తి క్షేత్రమును, వసుధార యను అలకానంద జన్మస్థాన, తీర్థమును, తప్తకుండతీర్థమును కలవు. అలకానందను విష్ణుగంగ యందురు. ఇటఁ గల పర్వతమును గంధమాదనమనియు, దీని శిఖరము రామేశ్వరమున నున్నదనియు నందురు. మహాభారతము వనపర్వమున దీనింగూర్చి బదరి, విశాలబదరి యని పేర్కొనఁబడినది. మఱియు బదరీకేదారముండిన తావునంటి దారుకావనము కలదు. దారుకావనలీల పురాణప్రసిద్ధము. అందు నాకేశ్వరనాథ శివలింగము కలదు. మొట్టమొదటి శివలింగము దారుకావనప్రాంతముననే గంగాతీరమునఁ బ్రతిష్ఠింపఁబడినదిగ కూర్మపురాణము ౨-౩౭-౩౮ యందునను, శివపురాణము ౪-౧౩-౧౬ యందునను, రామాయణము కిష్కింధాకాండము ౪౩ యందునను చెప్పఁబడినది.

**అరుణ్య గోత్రము** విష్ణువృద్ధ ఉపగణము చూడుఁడు.

**అర్బుద గోత్రము** అగస్త్య ఉపగణము చూడుఁడు.

**అర్బుద దేశము** — ఈపేరుగల దేశమొకప్పుడుండినదని తెలియుటకన్న దీనింగూర్చి యేమియుం దెలియరాకున్నది.

**అర్బుద శిఖరము** (ఆబుశిఖరము) — రాజపుత్రస్థానములోని శిరోహిసంస్థానపు హద్దులలో అరావళీపర్వతపజ్తిశిఖరములలో నొకటి. దీనినిప్పుడు మౌంటు ఆబూ (Mount Abu) అనెదరు. తొల్లింటి వసిష్ఠాశ్రమము. విశ్వామిత్రుఁడు తనకామధేనువును బలాత్కారముగ గొంపోవుతరి వసిష్ఠుఁడు పరమారుఁడనుక్షత్రియుని తనహోమగుండమున నుద్భవింపఁజేసి యాతని వలన తిరిగి తన ధేనువును తాఁ దెప్పించుకొనియెను. ఆతనిసంతతి క్షత్రియులే ఇప్పటి పరమారరాజకులు

క్షత్రియులుగనున్నారు. ఇట అంబాభవానిదేవాలయమును, ఋషభనాథజైను దేవాలయమును ప్రసిద్ధములు. ఇది చల్లనితావు. సమశీతోష్ణప్రదేశము (Sanatorium). గిరిపంచకము చూడుడు.

**అర్కే తేన్మధువిందేత కిమర్థం పర్వతంవ్రజేదితిన్యాయము** — సమీపమునఁగల జిల్లేడుచెట్లయందే తేనె లభించునేని దూరమునగల కొండయడవుల కేల తుమ్మెదలు పోవలసియుండునని భావము. అనఁగా సమీప పరికరము లనుకూలములగుటకతన దూరపు స్థితిగతులకై ప్రయత్నించుట కీన్యాయమును వాడుదురు. (సంస్కృతలోకో

**అరేబియా దేశము** ఆసియా ఖండములోని ద్వీపకల్పదేశము. ఇది ప్రపంచమంతటికి పెద్దద్వీపకల్పమని పేరందినది. విదేశస్థులగు ప్రాత్యాశ్చు లరేబియాయని పేరిడిరిగాని, స్వదేశస్థులు దీనిని జజీరాఆలరబా యనెదరు. వైశాల్యము ౧౨౦౦౦౦౦ చతురపుమైళ్లుండునని అంచనావేయఁబడినది. దేశముంజుట్టిన సముద్రతీరములు, పల్లపు ఇసుకమయములుగను, నడుమ ఉత్తరమువైపు పటవాలుగల పీఠభూమిగను, మధ్యను కొండలుగను ఉన్నదేశము. దక్షిణమునను, ఉత్తరమునను సముద్రతీరములందు పర్వతపు వ్యాపించి యున్నది. సూయజు సంయుక్తాగ్రగుడము, అకబా సంయుక్తాగ్రగుడములనడుమ సీనాయిపర్వతములు కలవు. అందు మోసెసు ప్రవక్తకు జిహ్వాదేవుడు ఆజ్ఞాదశకము (Ten Commandments) ను చెప్పి ఇశ్రాయేలీయుల కాచరణవిధిగఁ దెల్పెనని బైబిలునందు జెప్పఁబడినది. దేశమున నదులు లేవు. ఉన్నను ఓడలునడువఁ బనికిరావు. సరస్సులు అసలేలేవు. ఇసుక ఎడారు లందచ్చటచ్చట ఖర్జూరపుచెట్లు, నీటివసతులు, ఇంచుక చెట్లుచేమలు, పచ్చికయుంగల ఓయాసిసులనంబడు సుభిక్షస్థానములుండును. దేశమధ్యభాగము సారవంతమైనది. ఉత్తర పశ్చిమదిశలు ఇసుకఎడారులు. అతివేడిగలిగి చెమ్మలేని దేశము. సైమూనులని పేరుగల వేడిగాడుపులు దేశమున నప్పటప్పటవీచుచుండును. ఇవి విషపుగాలులని చెప్పఁబడుచున్నవి.

అరేబియాదేశమం దాకాశము నిర్మేఘమంతమై తరుచు కానంబడుచుండును. ఎండ తీక్ష్ణమై వేడిగాడుపులు (సైమూన్ లేక సమీూయేలు) విసరుతరి, ఇసుక మేఘములంబోలి పైకిగాలిలోనికి ఎత్తఁబడి కాలి నేలరాలుచుండుట చాల బాధకరమైయుండును. శీతకాలమున రాత్రులందు చలిగాలులు వీచుచుండును. పీఠభూమియందు నడుమను వర్షించుంగాని ఎడారులందు వర్షములు తరుచు కురియకనే గడచుచుండునని చెప్పవలయును. కొండసెలయేరులు కొన్ని కలవుగాని యవియు నతిత్వరితముగ భూమియందింకి యారిపోవునుగాని చెమ్మయుండదు. ఎడారులందు ఒయాసీస్ గల తావుల నంతర్వాహినులగు జలప్రవాహములను వాడీలనియెదరు.

అరేబియాదేశపు జొన్నలకు తొలుత మెక్కానుండి తేబడిన విత్తనము గాన భరతదేశమున మెక్కా-జొన్న యనంబడి క్రమముగ మొక్క-జొన్నగా మారినది. ఇది ఈదేశమే మూత్పస్థానముగా గలది. పెద్దజొన్నలు పైరుచేయఁబడు చున్న పంటలు. ద్రాక్షలు కొంచముగను, ఖర్జూరపుపండ్లు విస్తారముగను, ఒంటెల పాలు భోజనపదార్థములుగ నుపయోగించుచున్నవి. కాఫీ చాలా ప్రశస్తమైనది ఈదేశమునుండియే తొలుత భరతదేశమునకు తేఁబడినది. దేశపు నైఋతిదిశగా కాఫీ విస్తారము పైరుచేయంబడి మోఛా రేవునుండి వెనుక ఎగుమతిచేయంబడుచుండినది. గోపరసమను సాంబ్రాణివంటి బంకయు (సువాసనద్రవ్యము) ను, ముసాంబ్రము, సాంబ్రా

ణియు ఈదేశపువని పేరందియుండెనుగాని నిజముగ నవి ఈదేశపు పదార్థములుకావు. దేశమున గుఱ్ఱములు చాల శ్రేష్ఠజాతివికలవు. అవి ప్రయాణములకు తఱచు పనికివచ్చుచున్నవి. ఒంటెలు వర్తకపుసరకుల మోయుజంతువులు. నిప్పుకోళ్లును, అడవిగాడిదలు, లేళ్ళు, చిట్లపులులు దేశమందు కలవు. పరిషియన్ గల్ఫునందు ముత్యాలసలాపము బ్రిటీషువారి హస్తగతమై యున్నది.

జ్యోతిషశాస్త్రము అరబ్బీదేశమున వ్యాపించి యుండెను. అరబ్బులందనేక తెగ లున్నను ముఖ్యముగ వీరు రెండుతెగలవారని చెప్పవలయును. ఒకతావున నివాసగృహమును కాపురమునుగల్గిన అరబ్బులు ఎక్కువ నాగరికతంగల్గినవారు. ఇండ్లు వాకిండ్లులేక మందలతో దేశద్రిమ్మరులై తిరుగుచు, గుడారముల గ్రామములలో నివసించుచు తిరుగుచుండువారు బెడూయీను లనంబడుచున్నారు. వీరు అపాయకరులు. ఆదికాలమునుండియు దోచుకొనుచుండుటయు, మందలను మేపుకొనుటయు వీరివృత్తి. ఒక్కొకగుంపున కొక షేకు అధిపతి. అందరు గలసి గుడారములగ్రామములతో సంచరించుచుందురు. The hand of Arab has been against every man and every man's hand against his, అని ప్రాశ్చాత్యులు సామెతగా బల్కుచుందురు.

అరబ్బులు మహమ్మదుగురుని స్వదేశస్థులు; మహమ్మదీయ మతస్థులు. భాష అరబ్బీభాష. అదికురాన్షరీఫ్భాషయందే జనించినది. మహమ్మదుగురుఁడు జిబ్రెలువలన ఉపదేశింపబడుటయు అరబ్బీభాషలోనే. ఈభాషను కుడివైపునుండి ఎడమవైపునకు వ్రాయుచుందురు. మహమ్మదుగురుఁడు క్రీ. వె. ౫౭౦ లో మక్కాయందు జన్మించి తనమతమును బోధించి, మక్కాప్రజలవలన బాధింపఁబడి క్రీ. వె. ౬౨౨లో మదీనాకుఁ బలాయనుఁడై అటనే క్రీ. వె. ౬౩౨ లో మృతినందెను.

మక్కానగరము మహమ్మదీయుల యాత్రాస్థలము. జిడ్డాపురము దీని రేవుపట్టణము. (మహమ్మదీయమతము చూడుఁడు). మదీనాపురమున మహమ్మదుగారి గోరీకలదు. ఇదియు యాత్రాస్థలమే. దీనిని భక్తిపారవశ్యత అల్మదీనా తున్నబీ యనుచుందురు. మదీనా యనిన పురమని యర్థము. దీనికి యెంబోపురము రేవుపట్టణము. మక్కామదీనాలు కలసియున్న దేశభాగమునకు హెడ్జాజనియెదరు. తొల్లింటి అరేబియాదేశము హెడ్జాజనియు, యీమేననియు, ఓమాననియు మూడుభాగములుగ నుండినది. హెడ్జాజనిన యాత్రాస్థలమని యర్థమట. సానాపురము యీమేనుభాగమున ప్రధానపట్టణము. దీనికి హోడెడ్డాపురము రేవుపట్టణము. రియాదుపురము వహాబీసుల్తానుల రాజధానిపురము. ముస్కాటుపురము వర్తకస్థానము. ఇది ఓమాను సుల్తానులకు రాజధాని. ముత్యాలసలాపముగల బహరేయిన్ ద్వీపము బ్రిటీషువారిది. ఏడెన్ పరగణా బ్రిటీషువారి వశమందుండి ఇండియాకుం జెందినది. ఇట రాక్షసబొగ్గునకై ఓడలు నిలచురేవు గలదు.

**అరోరాఆస్ట్రియాలిస్** — అరోరా బొరియాలిస్ చూడుఁడు.

**అరోరాబొరియాలిస్** (Aurora Borealis) — భూమిగుండా అయస్కాంతశిలాసంబంధమగు నాకర్షణమార్గపు జాడలు కలవనియు, ఆ అయస్కాంతశిలలు భూమియొక్క ఉత్తరపుకొనను, దక్షిణపుకొనను ధృవములందు మనుష్యుల కగమ్యమగు శీతలప్రదేశములందు, బహుశః సముద్రములందు జలములపైకిగూడ నగుపడుచు పర్వతములుగ నుండనోపు ననియు తలంపఁబడుచున్నవి. కావనే దిక్కులంజూపు

కంపనములు ఉత్తరదక్షిణదిశల నాకర్షింపబడు చుండుననియు తలంచుచున్నారు. ఈధ్రువము లందాకాశమున నెత్తుగనుండు గాలిపొరలు కడు పలుచనవిగనుండు (Thin air) కొట్టుకొనలందు విద్యుచ్ఛక్తి ప్రవాహము లయస్కాంతశిలలచే నాకర్షింపఁబడుచు, ఎల్లప్పు డాదిశలకు బర్విడుచు మధ్యమార్గమున నొక ప్రవాహముతో వేఱొక్క ప్రవాహ మెదుర్కొని ఢీకొనుటచే నుండుచు, పలురూపములతో వివిధవర్ణములతోఁ బ్రకాశించుచుండును. దీనికె అరోరాబొరియాలిస్ అనిపేరు. ఇవి ఉత్తరధ్రువముకడ దక్షిణదిశ నుండి ఉత్తరమునకును, దక్షిణధ్రువముకడ ఉత్తర దిశనుండి దక్షిణమునకును అయస్కాంతశిలల వైపు బర్విడుచుఁ గాననగుచుండును.

సూర్యరశ్మియొక్కపని ఈ ప్రాంతముల గాన రాదు. ఏలనన ఈక్వేటరు (భూమధ్య ప్రదేశము) న కిరుదెసలందు ఉత్తరాయణమున ఉత్తర దిశయందునను, దక్షిణాయనమున దక్షిణదిశయం దునను ఆభాగములు సరిగా తలపైనే యుండు నట్లు తిరుగు సూర్యుని కిరణములు ప్రక్కవాటుగ కడు దూరము ప్రసరించుటమాత్రమేగాక, పోను పోను వంగుటతో సంబంధదూరముగఁజేయబడిన ఉత్తర దక్షిణ ధ్రువములయందు సూర్యరశ్మి పగలుగను, రాత్రిగను తెల్పు విభజనకు పనికి రాదు. కాన నుత్తరధ్రువమున ఉత్తరాయణ మారు నెలలు ఒకే పగలుగను,దక్షిణాయన మారునెలలు ఒకే రాత్రిగను పరిగణింపనగుచు, రోజున కిరువది నాల్గు గంటలుగలభాగము పనిపాటలకు, భోజన విశ్రాంతులకు, నిదురజెందుటకు మాత్రము పరిగ ణింపఁబడుచుండును. ఇట్లే దక్షిణధ్రువముకడ ఉత్తరాయణమంతయు సూర్యదర్శనమేలేని ఒకే రాత్రిగను, దక్షిణాయన మారుమాసములు నొకే పగలుగను కన్పించెడిని.

ఇంక నీ రెండుధ్రువములందు ఒకేరాత్రిఁగ దనరు ఆరుమాసముల దీర్ఘకాలము నంధకార బంధురముగ నుండునని తోఁచక మానదు. అట్టి యెడ నీ యరోరాబొరియాలిస్ (ప్రకాశము) మాటిమాటికి నెడతెరిపియనునది లేక భూవలయ రేఖ (Horizon) నాని పెద్దపెద్ద ప్రకాశప్రదేశ ములుగను (Sheets and Curtains of Light), వంకరలుగల వివిధాకారములుగను, కిరణములుగను, లోవలుగను, వృత్తములుగను, ప్రకాశించుచు, పర్విడుచు చక్కని వెలుఁగున నంతయుఁ గన్పడునట్లు జేయుచు మరలిపోవు చుండును. ఈ ప్రకాశము తెలుపు, ఎఱుపు, ఆకుపచ్చ, పసుపుపచ్చ, బంగారురంగుల నన్నిటి నొకేతరిగాని, కొన్నిటింగాని, యొక్కొక్కటిం గాని గల్గి ప్రకాశించుచుండెడిని. ఈ అరోరా బొరియాలిస్ ప్రకాశము ధ్రువప్రదేశములందే కాక ఉష్ణప్రదేశము (Temperate zone) లందు కూడ చాలాదూరము కన్పించునందురు; కాని, ఉత్తర దక్షిణ ధ్రువప్రదేములనే సంపూర్ణ ప్రదర్శనమని చెప్పఁబడినది. దీని సాహాయ్యము ముననే అట నా చీకటియం దెల్లకార్యములు నెరవేరనగునట.

దక్షిణధ్రువ ప్రాంతములఁ గనపట్టునట్టి విట్టివే యగు వెలుఁగు (కాంతు)లకు ఆరోరా ఆస్ట్రియా లిస్ (Aurora Austrialis) అని పేరిడి యున్నారు.

**అర్ధోఘటిఘోషముఁజేతినూనం-** వెలితికుండ లెక్కువ ధ్వనిచేయునని భావము. నిండుకుండ తొణకదను తెలుగుసామెతయునిట్టిదే. సంస్కృతలోకోక్తి.

**అర్ధోదయ పర్వకాలము** — అమా వాస్యతిథి - ఆదివారము - శ్రవణ నక్షత్రము వ్యతీపాతలు పుష్యమాసమునగాని మాఘమాస

మునగాని కూడిన నాపుణ్యకాలమున కర్ధోదయ పర్వకాలమనియు, దీని కించుకన్యూనమైన మహోదయపుణ్యకాలమనియుఁ జెప్పఁబడినది. శ్లో॥ అమార్కపాతశ్రవణై ర్యుక్తాచేత్పుష్య మాఘయోః । అర్ధోదయస్సవిజ్ఞేయః కించిన్న్యూనమ్మహోదయః॥ అని చెప్పఁబడినది. ఇది పుష్యమాఘమాసముల నమావాస్యతిథియందు పైకూటమికల్గినచో సిద్ధించెడిని, అర్ధోదయ మహోదయ పుణ్యకాలములందు సముద్రస్నానము మహాఫలప్రదమని చెప్పఁబడినది. అందు నదీసాగరసంగమ ప్రదేశములం దెక్కువ శ్రేష్ఠముగ నెన్నబడుచున్నది.

**అర్ధోదయ వ్రతము** — మాఘ బహుళ అమావాస్య. బ్రహ్మవిష్ణు రుద్రపూజ.

**అలంకారశాస్త్రము**— అలంకారములఁ గూర్చి ప్రత్యేకశాస్త్రమని యభిప్రాయము గల్గి వానిని వివరించి లోకమున వెలుఁగుపఱచిన విద్వాంసులు భోజమహారాజు, భామహుఁడు, వామనుఁడు, భట్టనాయకుఁడు, ఆనందవర్ధనుఁడు, ఉద్భటుఁడు, ఆచార్యదండి మొదలగువా రీపట్ల చిరస్మరణీయులు. భోజుఁడు తన సరస్వతీకంఠాభరణమున శబ్దచిత్రము శబ్దాలంకారమనియు, అర్థచిత్ర మర్థాలంకారమనియు, నుభయచిత్ర ముభయాలంకారమనియు,అలంకరించుటను త్రివిధములుగవిభజించెనుగాని,తరువాతి యలంకారికులు ఉభయచిత్రాలంకారభాగమును నిరసించి, అన్ని యలంకారములును ఉభయ చిత్రములనుచు, వానికి ప్రత్యేకత నొసంగుట యసంగతమనిరి.

అలంకారికులు తాఁజెప్పదలచిన యుక్తిని వినువారి మనస్సులకుఁ జక్కగ నాటుటకై ఉపమానాదులతో నాకర్షణీయ వాక్యములచే వివరింపఁగల్గుట యలంకరించుటయని నిర్వచించిరి. అనగా కావ్యమును రుచులచే నలంకరించునవి గాన అలంకారములనియు, విశిష్ట శబ్దవిన్యాసము కావ్యమనియు, ఇచట విశిష్టమనిన విశేషతగలవి యనియు, శబ్దములనిన శబ్దార్థములు రెండుననియు భావము. ఈ సందర్భమున నింక నొకసంగతిఁ దెలుపఁదగును. ఆదికాలపు టలంకారికులు కావ్యమునం దితరలక్షణములకన్న నలంకారములే ప్రధానము లను నభిప్రాయములం గల్గియుండిరి. అట్టివారిని పరిశీలకులు అలంకార సాంప్రదాయమువారనివాడుచున్నారు. వీరు ధ్వని,రసము, గుణము, వ్యంగ్యార్థము, అలంకారాంతర్గతములనియు, అందే చేరదగినవనియు గాని అలంకారేతరములు కావనియు నభిప్రాయపడిరి. వీరియందు కాల మతిక్రమించిన కొలఁదియు నభిప్రాయభేదములేర్పడియెనట. వైశిష్ట్యము,ధర్మరూపమనికొందఱు, వ్యాపారరూపమని కొందఱు రట. దానినే వ్యంగ్యరూపమని మఱికొందఱనిరట. ఇంకనుకొంతకాలముగడువ, కావ్యవైశిష్ట్యము ధర్మరూపమని తలంచువారియందు, అలంకారములే ముఖ్యమనువారు కొందఱును, గుణములేముఖ్యమనువారుకొందఱును, అభిప్రాయభేదము లందిరి. కావ్యవైశిష్ట్యము, వ్యాపారరూపమని తలఁచువారియందు ఉక్తివైచిత్ర్యము(అనగా మాటలసొంపు) ముఖ్యమనువారు కొందఱును, రసవిషయిక వ్యంజనవ్యాపారము ముఖ్యమనువారు కొందఱును, అభిప్రాయ భేదములంగల్గుట చీలికలేర్పడి, ప్రాచీనాలంకారులైదు తెఱఁగులైరని వారి గ్రంథములనుండి కన్పట్టును. కాని తరువాతకాలపు టలంకారములు, సత్కావ్యమునందు, శబ్దార్థములు, శరీరాంగములం బోలినవియనియు, ధ్వని ప్రాణమువంటిదనియు, రసము ఆత్మలేక అంగివంటిదనియు, ఓజమాధుర్యాదులు శౌర్యాదులవంటివనియు, అలంకారము లాభరణములంబోలిన యలంకారములే యనియు నభిప్రాయములను స్థిరపఱచుకొనిరి. కీ. వె. ౧౨

శతాబ్దమునాఁటి వాఁడగు మమ్మటుఁడు అలంకారములు ఉక్తి వై చిత్ర్యములని తనకావ్యప్రకాశమునందు వివరించియున్నాఁడు.

అర్థాలంకారములు క్రీ. పె. మొదటిశతాబ్దమునాఁడు భరతుఁడు ఉపమ-రూపక-దీపకాలంకారములు మూఁడేననియు, తక్కినవన్నియు నామూడింటియందు చేరినవే యనియు నభిప్రాయపడియుండెను. ఆచార్యదండినాఁడు ముప్పదినాలుగలంకారముగ నవి విభజింపబడి, ప్రత్యేకత నీయంబడినవి. మమ్మటుని కాలమున కావ్యప్రకాశికయందు, సంకరసంసృష్టులుగాక వేఁబదితొమ్మి దలంకారములుగ నాయలంకారవితతియే విభజింపఁబడినదనియు, విద్యానాథుని కాలమున నతని ప్రతాపరుద్రీయమునం దరువది మొదలంకారములుగనవ్వియేవిభజింపబడెననియు, జయదేవుని కాలమున అతని చంద్రాలోకమునం దాయలంకార పుంజమే నూరలంకారములుగఁ జెప్పంబడినదనియు, ఇంక నప్పయదీక్షితులనాఁడు ఆయన కువలయానందమున నాయలంకారములే నూటపదునేనుగ వచింపఁబడినవనియు వివరించిరి. ఇటులపెరుగుట క్రొత్తవి తీసికొనిరాఁబడలేదని తెలుపుటయె ఈవ్యాసమునందలి యభిప్రాయము. కాన ౧౨ పె. పండ్రెండవ శతాబ్దమునాఁటి వాఁడగు హేమచంద్రుఁడు ౨౮ అర్థాలంకారములను వివరించియుంట ఈతండు వీటిసంఖ్యఁ దగ్గింపఁ దలంచెనా యని యనిపించకపోదు. ఇప్పటి యలంకారికుల మతమున అర్థచిత్రమె అర్థాలంకారమనియు, సరియగు అర్థములేని శబ్దచిత్రము నిరర్థకాలంకృతి యనియు, శబ్దచిత్రము అర్థచిత్రయుతమగునేని, అప్పుడది కవిప్రౌఢిమను సూచించుననియు నున్నది. ఇంక నిక్కాలపు మతమున వాని పేర్లను వివరింతుము.

అలంకారములు- కావ్యమునందలి పద్యములను రుచులనే నలంకరించునవి. గాన నలంకారములని పేరందినవి. మనుష్యులకు భూషణములెట్లు అలంకారములో పద్యములకు రుచు లట్టి యలంకారములు. అలంకారశాస్త్రముమేరకు శబ్దాలంకారములు, అర్థాలంకారములు నని అలంకారములు ద్వివిధము. శబ్దముల విన్యాసమునందే రుచులంగల్గించుటచే శబ్దాలంకారములుగను, అర్థముచే రుచులంగల్గించిన నర్థాలంకారములుగను పేరిడఁబడినవి. శబ్దాలంకారములు నాల్గుగను, అర్థాలంకారములు నూరుగను అలంకారికులు విభజించియున్నారు.

శబ్దాలంకారములు- ౧. ఛేకము, ౨. వృత్త్యనుప్రాసము, ౩. లాటానుప్రాసము ౪. యమకము ననునవి శబ్దాలంకారములు. ఇందు నాల్గవది యగు యమకము, ౧. పాదయమకమనియు, ౨. పాదాంతపాదాది ముక్తపదగ్రస్త యమకమనియు, ౩. సింహావలోకన ముక్తపదగ్రస్త యమకమనియు, ౪. పునరుక్తిదాభాస యమకమనియు, ౫. చిత్రాలంకార యమకమనియు, ౬. బంధకవిత్వ యమకమనియు నారు తెఱంగులుగ జెప్పఁబడినది. మఱియుఁ గడదియగు బంధకవిత్వము తిరిగి పదునాలుగు భేదములు కలది.

అర్థాలంకారములు—ఇవిశుద్ధాలంకారములు అరువదినాల్గును, సంకరాలంకారములు ముప్పదియారును కలసి నూరలంకారములుగ నలంకారశాస్త్రమున గాననగు చున్నవి.

శుద్ధార్థాలంకారములు —(౧) ఉపమాలంకారము. ఇది పూర్ణోపమయనియు, లుప్తోపమనియు, ద్వివిధములు. ౧. పూర్ణోపమ అర్థియనియు, శ్రౌతియనియు ద్వివిధము. ౧. అర్థి ఇది వాక్యగతమనియు, సమాసగతమనియు, తద్ధితగతమనియుఁ ద్రివిధము. ౨. శ్రౌతి, వాక్యగతమనియు, సమాసగతమనియుఁ ద్వివిధము. ౨. లుప్తోపమ ఇది యైదు భేదములు కలది. ౧. అనుపాత్తోపమాన

లుప్త. ౨. అనుపాత్త వాచకలుప్త. 3. వాచక ధర్మోపమానలుప్త, ౪. వాచక ధర్మోపమాన లుప్త. ౫. ధర్మోపమ ఇది వస్తుప్రతివస్తూప మయనియు, బింబప్రతిబింబోపమయనియు ద్వి విధము.

(౨) అనన్వయాలంకారము.

(౩) ఉపమేయూపమాలంకారము.

(౪) స్మరణాలంకారము.

(౫) రూపకాలంకారము- ఇది సావయవ మనియు, నిరవయవమనియు, పరంపరితమనియుఁ ద్రివిధము. ౧. సావయవరూపకము- ఇది సమస్తవస్తువిషయమనియు, ఏకదేశ (తల) వర్తి యనియుఁ ద్వివిధము. ౨. నిరవయవరూపకము- ఇది కేవలమనియు, మాలయనియు, ద్వివిధము. 3. పరంపరితరూపకము-ఇది కేవలము,మాలయని ద్వివిధము. ౧. కేవలపరంపరితరూపకము- ఇది శ్లిష్టమనియు, అశ్లేషమనియు ద్వివిధము. ౨. మాలాపరంపరితరూపకము- ఇదిశ్లిష్టమనియు అశ్లేషమనియు ద్వివిధము.

(౬) పరిణామాలంకారము- ఇది ఒకేవిధము.

(౭) సందేహాలంకారము- ఇది ౧. శుద్ధసం దేహమనియు, ౨. నిశ్చయగర్భితసందేహమనియు, 3. నిశ్చయాంతసందేహమనియుఁ ద్రివిధభేద ములు కలది.

(౮) భ్రాంతిమతి అలంకారము- ఒకేవిధము.

(౯) అపహ్నవాలంకారము- ఇది ఆరుభేద ములు కలది. ౧. శుద్ధాపహ్నవము అలం కారము, ౨. హేత్వాపహ్నుతి- అలంకారము, 3. పర్యస్తాపహ్నుతి అలంకారము, ౪. భ్రాంత్యా పహ్నుతి అలంకారము, ౫. ఛేకాపహ్నుతి అలంకారము, ౬. కైతవాపహ్నుతి అలంకారము,

(౧౦) ఉల్లేఖాలంకారము ఒకేవిధము.

(౧౧) ఉత్ప్రేక్షాలంకారము- ఇదివాచ్యము, గమ్యము అని ద్వివిధము. [౧] వాచ్యోత్ప్రేక్ష- ఇది జాతి, గుణము, క్రియ, ద్రవ్యములని నాల్గు భేదములుకలది. ౧. జాతివాచ్యోత్ప్రేక్ష - ఇది భావము, అభావము అని ద్వివిధము. ౧ భావము- ఇది స్వరూపము, హేతువు, ఫలమునని త్రివిధము. ౧ స్వరూపము- ఇది ఉపాత్తగుణనిమిత్తమనియు, ఉపాత్తక్రియానిమిత్తమనియు, అనుపాత్తనిమిత్త మనియుఁ ద్రివిధము. ౨. హేతువు- ఇది ఉపాత్త గుణనిమిత్తమనియు, ఉపాత్తక్రియానిమిత్తమ నియు ద్వివిధము 3. ఫలము- ఇది ఉపాత్త గుణనిమిత్తమనియు, ఉపాత్తక్రియానిమిత్తమ నియు ద్వివిధము. ౨. అభావము- ఇదియు స్వరూపము, హేతువు, ఫలమునని త్రివిధము. ౧ స్వరూపము- ఇది ఉపాత్తగుణనిమిత్తమనియు ఉపాత్తక్రియానిమిత్తమనియు, అనుపాత్తనిమిత్త మనియుఁ ద్రివిధము. ౨. హేతువు- ఇది ఉపాత్త గుణనిమిత్త మనియు, ఉపాత్తక్రియా నిమిత్త మనియు ద్వివిధము. 3. ఫలము- ఇది ఉపాత్త గుణనిమిత్తమనియు, ఉపాత్తక్రియానిమిత్తమ నియు ద్వివిధము. ౨. గుణవాచ్యోత్ప్రేక్ష- ఇదియు జాతివాచ్యోత్ప్రేక్షవలెనే భావాభావ భేదములచే రెండై, అందొక్కొక్కటి స్వరూప, హేతు, ఫలములుగ త్రివిధములుగ దనరుచు, తిరుగ అవి వానివలెనే అంతర్భేదములం గూడ గల్గి పదునాల్గుగ నాపేర్లచేతనే తనరెడిని. 3. క్రియావాచ్యోత్ప్రేక్ష- ఇదియుజాతివాచ్యో త్ప్రేక్షవలెనే పదునాల్గు భేదములుగల్గి ఆపేర్ల చేతనే దనరెడిని. ౪. ద్రవ్యవాచ్యోత్ప్రేక్ష- ఇదియు జాతివాచ్యోత్ప్రేక్షవలెనే పదునాల్గుభేద ములుగల్గి ఆపేర్లచేతనే తనరెడిని. [౨] గమ్యోత్ప్రేక్ష- ఇదియు జాతి, గుణ, క్రియా, ద్రవ్య ము లను నాల్గుతెఱంగులుగను, అందొక్కొక్కటి భావాభావభేదములచేఁ దిరుగ రెండుగను, అందొక్కొక్కటి స్వరూప హేతు ఫలములచే తిరుగ మూడేసిగను, అవియు నొక్కొకటి

౧. అనుపాత్త గుణనిమిత్త మనియు, ౨. అనుపాత్త క్రియానిమిత్తమనియు రెండేసిగ నగుచు, మొత్తమున గమ్యోత్ప్రేక్ష యంతయు నలుబది యెన్మిది భేదములుగ నయ్యెడిని.

(౧౨) సహోక్త్యలంకారము- ఇది ఒకే విధము.

(౧3) వినోక్త్యలంకారము- ఇది చారుతా వినోక్తి యనియు, అచారుతా వినోక్తియనియు, ఇరుదెఱంగులు.

(౧౪) అతిశయోక్త్యలంకారము- ఇది యైదు విధములు. ౧. సంబంధాసంబంధము, ౨. అసంబంధసంబంధము, 3. భేదాభేదము, ౪. అభేదభేదము, ౫. కార్యకారణవిపర్యయరూపము అని యైదుభేదములు కలది.

(౧౫) సమాసోక్త్యలంకారము- ఒకేవిధము.
(౧౬) వక్రోక్త్యలంకారము- ఒకేవిధము.
(౧౭) స్వభావోక్త్యలంకారము-ఒకేవిధము.
(౧౮) వ్యాజోక్త్యలంకారము- ఒకేవిధము.
(౧౯) మీలనాలంకారము- ఒకేవిధము.
(౨౦) సామాన్యాలంకారము- ఒకేవిధము.
(౨౧) తద్గుణాలంకారము- ఒకేవిధము.
(౨౨) అతద్గుణాలంకారము- ఒకేవిధము.

(౨3) విరోధాభాసాలంకారము- ఇది పది విధములు. ౧. జాత్యాజాతివిరోధాభాసము, ౨. క్రియయాక్రియవిరోధాభాసము, 3. గుణేన గుణవిరోధాభాసము, ౪. ద్రవ్యేనద్రవ్యవిరోధాభాసము, ౫. జాత్యాక్రియావిరోధాభాసము, ౬. జాత్యాగుణవిరోధాభాసము, ౭. జాత్యాద్రవ్యవిరోధా భాసము, ౮. క్రియయాగుణవిరోధాభాసము, ౯. క్రియయాద్రవ్యవిరోధాభాసము, ౧౦. గుణేన ద్రవ్యవిరోధాభాసము.

(౨౪) విశేషాలంకారము- ఇది మూడు విధములు. ౧. అధారరహిత ఆధేయవిశేషము, ౨. ఏకానేకగోచరవిశేషము, 3. అశక్యకరణ విశేషము అని.

(౨౫) అధికాలంకారము- ఇది ౧. అధికాధేయము, ౨. అధికాధారమునని ఇరుదెరంగులు.
(౨౬) విభావనాలంకారము- ఒకేవిధము.
(౨౭) విశేషోక్త్యలంకారము- ఒకేవిధము.
(౨౮) అసంగతాలంకారము- ఒకేవిధము.
(౨౯) విచిత్రాలంకారము- ఒకేవిధము.
(3౦) అన్యోన్యాలంకారము- ఒకేవిధము.

(3౧) విషమాలంకారము- ఇది మూడు విధములు. ౧. విరుద్ధకార్యవిషమము, ౨. అనర్థవిషమము, 3. విరూపమానవిషమము.

(3౨) సమాలంకారము- ఒకేవిధము.

(33) తుల్యయోగితాలంకారము- ఇది ప్రకృతతుల్యయోగిత, అప్రకృతతుల్యయోగిత యని ద్వివిధము.

(3౪) దీపకాలంకారము- ఒకేవిధము.

(3౫) ప్రతివస్తూపమాలంకారము- ఒకే విధము.

(3౬) దృష్టాంతాలంకారము- ఒకేవిధము.
(3౭) నిదర్శనాలంకారము- ఒకేవిధము.
(3౮) వ్యతిరేకాలంకారము- ఒకేవిధము.

(3౯) శ్లేషాలంకారము- ఇది ౧. ప్రకృతశ్లేషము, ౨. అప్రకృతశ్లేషము, 3. ప్రకృతాప్రకృతశ్లేషము నని త్రివిధము.

(౪౦) పరికరాలంకారము- ఒకేవిధము.

(౪౧) ఆక్షేపాలంకారము- ౧. ఇష్టనిషేధాభాసమనియు, ౨. అనిష్టనిషేధాభాసమనియు నిది ద్వివిధము.

(౪౨) వ్యాజస్తుతి- ౧. నిందాకృతస్తుతి యనియు, ౨. స్తుతినిందయనియు నిది ద్వివిధము.

(౪3) అప్రస్తుత ప్రశంసాలంకారము ఒకే విధము.

(౪౪) పర్యాయోక్త్యలంకారము ఒకేవిధము.
(౪౫) ప్రతీపాలంకారము ఒకేవిధము.

(౪౬) కావ్యలింగాలంకారము ఇది వాక్యార్థ హేతుకమనియు, పదార్థ హేతుకమనియు ద్వివిధము.

(౪౭) అర్థాంతరన్యాసాలంకారము. ఇది విశేషసమర్థిత సామాన్యార్థాంతరన్యాసమనియు, సామాన్యసమర్థిత విశేషార్థాంతరన్యాస మనియు ద్వివిధము.

(౪౮) యథాసంఖ్యాలంకారము ఒకేవిధము.

(౪౯) పరిసంఖ్యాలంకారము ఒకేవిధము.

(౫౦) ఉత్తరాలంకారము. ఇది ఉత్తరోన్నేయ ప్రశ్నోత్తరమనియు, ప్రశ్నోత్తరమాలికోత్తరమ నియు ద్వివిధము.

(౫౧) వికల్పాలంకారము ఒకేవిధము.

(౫౨) సముచ్చయాలంకారము. ఇది గుణ సముచ్చయము, క్రియాసముచ్చయము నని ద్వివిధము.

(౫౩) సమాధి అలంకారము ఒకేవిధము.

(౫౪) భావికాలంకారము ఒకేవిధము.

(౫౫) ప్రత్యనీకాలంకారము ఒకేవిధము.

(౫౬) వ్యాఘాతాలంకారము ఒకేవిధము.

(౫౭) పర్యాయాలంకారము ఒకేవిధము.

(౫౮) సూక్ష్మాలంకారము.

(౫౯) ఉదాత్తాలంకారము ఒకేవిధము.

(౬౦) పరివృత్త్యలంకారము. ఇదిసమపరివృత్తి అధికదానాల్పదానము, అల్పదానాధికదానమునని త్రివిధము.

(౬౧) కారణమాలాలంకారము-ఒకేవిధము.

(౬౨) ఏకావళిఅలంకారము- ఒకేవిధము.

(౬౩) మాలాదీపకాలంకారము-ఒకేవిధము.

(౬౪) సారము- ఒకేవిధము.

సంకరార్థాలంకారములు(ఇవిముప్పదియారు.)

(౧) ఆవృత్తదీపకము- ఇది పదావృత్తము, అర్థావృత్తము, ఉభయావృత్తము నని త్రివిధము. ఈక్రిందివన్నియు నొకేరూపముగల యలంకారములు. ౨. పరికరాంకురము, ౩. ప్రస్తుతాంకురము, ౪. వ్యాజనింద, ౫. అసంభవము, ౬. అల్పము, ౭. కారకదీపము, ౮. కావ్యార్థాపత్తి, ౯. వికస్వరము, ౧౦. ప్రౌఢోక్తి. ౧౧. సంభావనము, ౧౨. మిథ్యాధ్యవసితి, ౧౩. లలితము, ౧౪. ప్రహర్షణము, ౧౫. విషాదము, ౧౬. ఉల్లాసము, ౧౭. అవజ్ఞ, ౧౮. అనుజ్ఞ, ౧౯. లేశము, ౨౦. ముద్ర, ౨౧. రత్నావళి, ౨౨. పూర్వరూపము, ౨౩. అనుగుణము, ౨౪. తము, ౨౫.ఉత్తరాలంకారము- ఇది శుద్ధమనియు చిత్రమనియు ద్వివిధము. ౨౬. పిహితము, ౨౭. గూఢోక్తి, ౨౮. వివృతోక్తి, ౨౯.యుక్తి, ౩౦. లోకోక్తి, ౩౧. ఛేకోక్తి, ౩౨. అత్యుక్తి, ౩౩. నిరుక్తి, ౩౪. ప్రతిషేధము, ౩౫. విధి, ౩౬ హేతువులంకారము.

**అలక** — అశ్మక చూడుఁడు.

**అలకానందనది**–(విష్ణుగంగ. ధవళీగంగ). గంగానదిలోఁగలియు నుపనది. బదరీనారాయణ మనుపేరుగలబదరీనాథమునకుఁగతిపయదూరము నందుగల వసుధారయనంబడు జలపాతమున జనించిన విష్ణుగంగ (దీని కలకానందయనియు ననుటకూడకలదు) నదితో సరస్వతీనదియొక్క శాఖగ చెప్పఁబడు వేఱొకనది సంగమించినపిదప అలకానందగ పేరందియుండునని పెక్కండ్రయభిప్రాయము. దీనికిధవళీగంగయనియు ధవళియనియు బేర్లుకలవు. గడవాలు (అరుణోద) దేశపు రాజధానియగు శ్రీనగర మీనదీతీరమందేయున్నది. దీని ప్రశంస స్కాందపురాణము, విష్ణుఖండము మూడవ అధ్యాయము ౬ యందు గానఁబడు చున్నది.

బదరీనారాయణమునకు కతిపయ దూరమున నే వసుధారయనంబడు జలపాతమున జనించి, బదరీనారాయణము (బదరీనాథము) ప్రక్క

ప్రవహించుచుండెని, విష్ణుగంగ, సరస్వతి నదులను విష్ణుప్రయాగకడం గలుపుకొని (విష్ణుగంగకు ధవళీనది లేక ధవళీగంగయనియుం బేరుకలదు). బ్రిటీషు గడ్వాలులోని శ్రీనగరముగుండా ప్రవహించి దేవప్రయాగకడ మందాకినింజేరి పిదపగంగయందు చేరుకొనును. అలకానందను ధవళీ సరస్వతీ నదులు కలిసిననది యనెదరు.

**అలగ్జాండ్రియా పురము** — అలసందపురమును చూడుడు.

**అలగ్జాండ్రైటురత్నము** (Alexandrite Stone) — నలుపు ధాతువుగల ఆకుపచ్చరంగుగల (Chrysoberyl) జాతిరత్నము. యూరల్ పర్వతములందు త్రవ్వివెత్తబడును. ఎర్రని కిరణములుండి యానుటయుంగలదు. కొంతవరకు విలువగల రత్నముగనేయున్నది.

**అలగిచ్చకూర** — భావంజి కూర చూడుడు.

**అలచందచెట్టు** — లా. Dolichos Catiang లేక Dolichos Sinensis అనియు సంస్కృతమున రాజమాష, నీలమాష అనియు నందురు. అలచందలు (గింజలు) తొక్కలు సహా వగరుగనుండి మలమూత్రములను వెడలించును. కఫమునడంచును. తృప్తిగనుండి పైత్యము, కొంచెము గురుత్వముజేయును. దీనికి విరుగుడు శొంఠి, కరక్కాయ, ఉప్పు కల్పి చేసినచూర్ణము. అలచందపప్పు పొట్టుతీసినది వండినపప్పు గురుత్వము, పైత్యముచేయును. విరేచనబద్ధము గావించును. దీనికివిరుగుడు పైచూర్ణము, పిప్పళ్లు విస్తారము ఉదకము. అలచందకాయలలోని పచ్చిగింజలు గురుత్వము, పైత్యోద్రేకము, విరేచనబద్ధము గావించును. విరుగుడులు పైచూర్ణము, నువ్వులచెట్టు కాల్చినబూడిద, మరియు శొంఠియు, పిప్పళ్లు కూడ దీనికి విరుగుడులే.

**అలచందలు వ్యవసాయము** — వీనిని బొబ్బర్లనియు నందురు. కొన్నిసీమలందు లంకలనియు వాడుటకలదు. ఇది ఇతరజాతులతో కల్పి జల్లిన నంతగా ఫలించునదిగాదు. ఎక్కువబలిసి ఇంచుమించు పాదులవలె నావరించుకొని ప్రాకును. దీనికి నితరజాతులవలె పురుగులు తినివేయుటవలని నష్టముకన్న దీనియందుగల ఒక విధమగు వాసననుండి దూరములనుండియైనను పశువులు వచ్చి దీనిం దినివేయుటవలని నష్టమధికమై యుండును. కాన జాగ్రతగా కాయుచుండవలయును. తేలికయగు గరపభూము లీపంటకు శ్రేష్ఠములు. నల్లరేగటి యంతయధిక ఫలితము నీయజాలదు. తొలకరి దీని నాటుటకైనకాలము. దీని నజ్జులు చిక్కుడుజాతికిం జెందినదిగ పోల్చెదరు. ఈ చెట్టు సాంగముగ పశుజాతికి చాలా బలకరమైన యాహారమైయున్నది. తక్కిన స్థితియందు పెసర, మినుములంబోలిన పంటయైయున్నది. (పెసరవ్యవసాయము, మినుముల వ్యవసాయము చూడుడు).

**అలంపూషానాడి** — అష్టాంగయోగములు చూడుడు.

**అలంబస** — ఇక్ష్వాకువంశస్థుడగు తృణబిందువుభార్య. విశాలునితల్లి.

**అలంబసుడు** — బకాసురునితమ్ముడు. ఘటోత్కచునిచే నిహతుడైనవాడు.

**అలంబిక** — ఇప్పుడు అలవియనుచున్నారు. బౌద్ధసలము దీనిని హ్యూయనత్సాంగ్ నవదేవకులమనియు ఫాహియాన్ ఆల్ అనియు వివరించిరి.

కనూజ పట్టణమున ఆగ్నేయముగా ౧౭ మైళ్లను ఇటవానుండి ఈశాన్యముగ ౨౨ మైళ్లు దూరముననను గంగానదిపైనున్నది. తొల్లి ఇది కోసల, మగధ దేశముల మధ్య సరిహద్దుగ

నుండెనని డాక్టరు కెరన్ (Kern) పండితుడు అభిప్రాయపడి యున్నాడు. అగ్గలవచైత్యమను బౌద్ధమఠమిందుండెను. జైనులు దీనిని అలభి యని వాడుచుండిరి. మహావీరజైనస్వామి ఇట నుండినవాఁ డందురు. కల్పసూత్రముల వివరింపఁ బడిన ఆలంభికాపురమిదియె. బుద్ధ భగవానుఁ డిట పదునారవ వర్ష కాల (పర్యాటనము) ముం గడపెనట. ఈపదునారవ వర్షము బుద్ధత్వ మొందినపిదపనని ఎఱుంగునది.

**అలబాస్టర్ రాయి** (Alabaster) — దీనిని చంద్రకాంతశిల యని కొందర నెదరు. ఆంగ్ల రసాయనవేత్తలు Translucent Form of Gypsum అని పోల్చిరి. పెట్లుప్పుతో కలసి గనులందు దొరకుచుండు రాయి. విలువ గల రాయి గాన పలకలుగకోసి నేలనుపఱచుటకు గోడలకతికించుటకు అలంకారముగ నుపయో గించుచున్నది. ఆది యందు గ్రీకుదేశమున అలబాస్ట్రన్ (Alabastron) అను తావున దొరకుట నీపేరయ్యెనని ప్లినీ (Pliny) మహాశయుని వ్రాతలనుండి తెలియుచున్నది. చాల చల్లగా నుండురాయి. హిందూస్థానదేశమున దీనిని సంగమర్మర్పత్తర్ అనెదరు.

**అల్లపుగడ్డి** — ఇది గడ్డిమొక్క. దీనిని నలిపి వాసన చూచిన అల్లమువాసన గొట్టెడిని. దీనినాంగ్లమున జింజర్ గ్రాస్ (Ginger Grass) అనియెదరు. దీని కషాయము జ్వరములను హరించును. కాకజేసె పరములకు బలము, పొట్టకు సత్తువ నిచ్చును. దీనితోదీసినతైలము వాతనొప్పులను హరించును.

**అల్పవిద్యోమహాగర్వీతిన్యాయము**— అల్పవిద్యగలవాఁడు గర్వముగలవాఁడై యుండు నని భావము.

**అలభిదేశము** — ఆలంభిక చూడుఁడు.

**అలవి** — నవదేవకులము చూడుఁడు.

**అలసందపురము** (...యా) — ఇది యోనదేశపు ముఖ్యపట్టణమై యుండెను. ఇది పాంచాలదేశమున నైరుతమున కలియుతావున మహాలెగ్జాండ నిర్మింపఁబడినదట; గాని, దీనిం గూర్చి పెక్కండ్రు సంశయింతురు. వారు దీనిని కాబూలునది కుత్తరముగ నిరువదిమైళ్ళ దూరమున పాడుపడిన యొక పట్టు స్థలమని పోల్చెదరు. (ఉపనివేశదేశము చూడుఁడు)

**అలసట** — ఎక్కువపనిచేసినగాని, విసిగి వేసరినప్పుడుగాని మేదస్సున విషపదార్థ మేర్పడును. అట్టితరి శరీరమునగల్గుస్థితికి అలసట యనిపేరు. ఇట్టిస్థితి ఎండవేడిమికిగాని అగ్ని వేడిమికిగాని బడలు యదనునగూడ గల్గుటకలదు. బడలిక యధికనిద్రనుదెచ్చును. అలసిన జంతు రక్తమించుక తీసి, అలసటందెందని జంతువుశరీర ములోనికి పిచికారికిగుండా పంపినదియు నలసి పోయిన లక్షణములుకలది యగునని ఇటీవల పరిశీలకులు కన్పెట్టియున్నారు. అలసియున్నతరి జీర్ణశక్తి బలహీనమైయుండునుగాన బలకరమైన భోజనము మంచిదికాదు. కాని, సేదందీర్చు పానీయములు మంచివనియందురు. నైసర్గికముగఁ గల్గుచుండు నిద్రకన్న యలసినపిదప గల్గునిద్ర గాఢముగను ఆరోగ్యకరముగ నుండునని కని పెట్టఁబడినది.

**అలహాబాద్ నగరము** ఉత్తరదేశమున సంయుక్తరాష్ట్రములలోని నగరము. తొల్లింటిపేరు మాధవప్రయాగయనియు (క్లుప్తముగ ప్రయాగయనియు) నుండెను. అనేక యాగములు (క్రతువులు) త్రివేణికడ నిట జరుగుచుంట యాగములకుఁ బ్రధానస్థానమగుట ప్రయాగయని పేరయ్యెను. మత్స్యపురాణాంతర్గత ప్రయాగక్షేత్రమాహాత్మ్యమున నీక్షేత్రము

కు దూర్పున ప్రతిష్ఠానపురము, దక్షిణమున అలార్కపురము, పశ్చిమమున అక్షయవటము, హద్దులుగా గల్గిన త్రికోణాకార మధ్యప్రదేశము ప్రయాగక్షేత్రమని చెప్పబడినది. ఇందువలన నీపవిత్రక్షేత్రము ముఖ్యస్థానమగు త్రివేణిసంగమ స్థానమని తేలుచున్నది. ఆసమీప నివాసప్రదేశముకూడ నాపేరుననే పరగసాగెనని తేలుచున్నది.

ఈఅక్షయవటముండిన ప్రదేశము అలహాబాదులోని కోటలోనున్న పాతాళపురి దేవాలయమునందు జూపుచున్నారు. ప్రతిష్ఠానపురము (తొల్లింటి చంద్రవంశపురాజుల రాజధాని) కోట కెదురుగ గంగానదికవ్వలి (తూర్పు) తీరము పొడవునను ఉండెనని పరిశీలనవలన తేలినది. అలార్కపురమును, ఇప్పుడు అరెయల్ అనెదరు. ఆగ్రామము కోటకెదురుగ యమునానది కవ్వలి (దక్షిణ) తీరమున గంగాయమునల నడుమనున్నది. ఇటుల త్రివేణియొక్కతావుగ ప్రయాగ క్రీ. శ. ౧౫౮౩ వఱకు నుండనోపును. అప్పుడు అక్బరుచక్రవర్తి యమునపైరస్తాను తనయధికార స్వాధీనములందుంచుకొనుట కాగ్రాయందు కోటగట్టిన తెఱంగున నిట త్రివేణికడకూడ నీకోటను గట్టియుండెను. మఱియు నాయనభాషయం దీపవిత్రస్థలికి దైవనివాసమని యర్థమగు యల్లాబాస్ (అల్లావాసము) అనివాడుచుండ నాపేరును వాడుకనందెను. పిదపనింక నచ్చట పట్టణము పెరుగ నౌరంగజేబు దానికే అల్లా అబాదని శాసించెను. ఇప్పు డల్లాబాదన బడుచున్నది. త్రివేణికి సమీపముగనుండినయాత్రాగ్రామమునకు షాజహాన్ జ్యేష్ఠపుత్రుండగు దారాపేరునబరగు నటుల దారాగంజియని మార్పుగల్గెను. ఇట్లయ్యు ప్రయాగయనబడుపేరు మాసిపోక యట్లేనిలచి యున్నది. మత్స్యపురాణముననను, పద్మపురాణముననను, మహాభారతముననను రామాయణముననును, ఋగ్వేదమునను, ప్రయాగం గూర్చిన ప్రశంసలుండుట నిది కడుపురాతన స్థలమనుట కేసంశయమును లేదు. దీనిని తీర్థరాజ మందురు. ఇచటనె గంగాతీరమున కులపతియనంబడిన భరద్వాజమహర్షి యాశ్రమముండెడిదనియు, అటనె భరద్వాజుడు శ్రీరామభరతులకు విందులొసర్చెననియు రామాయణమున జెప్పబడినది.

శ్లో॥ త్రివేణిం మాధవంసోమం భరద్వాజంచ వాసుకిం । వందేఽక్షయవటం శేషం ప్రయాగేతీర్థనాయకే॥ అనిచెప్పబడియుంట ప్రయాగయందు దర్శనీయ యాత్రాస్థానము లేడుగలవు. త్రివేణి గంగాయమునలు బహిర్వాహినులుగను, సరస్వతి అంతర్వాహినిగను సంగమించు తావు. ఇది ఇప్పటి అల్లాబాదునగరమున కాగ్నేయదిశగ కోట కవ్వలనున్నది. మాధవ దేవస్థానములు రెండుకలవు. కోటలో నాదిమాధవుడనియు, దారాగంజియందు వేణీమాధవుడనియు రెండు దేవస్థానములను యాత్రస్థులు దర్శించుచుందురు. సోమేశ్వరశివలింగము త్రివేణి కవ్వల గంగానది దక్షిణతీరమున నున్నది. భరద్వాజాశ్రమ ప్రదేశమునకిప్పుడు 'కల్నెల్‌గంజి' యనిపేరు. ఇందానాటి శివలింగముకలదు. వాసుకిదేవస్థానము దారాగంజి కుత్తరముగ గంగాతీరమునందున్నది. ఇట గంగలోనికి సోపానములు కలవు. ఇట నాగపంచమినాడు స్నానయాత్ర జరుగుచుండును. అక్షయముండిన తావు నిప్పుడు కోటలోని పాతాళపురి దేవాలయముగ జూపుచున్నారు. దీనిక్రిందనే కామ్యకూప ముండెడిదట. అందే ముకుందబ్రహ్మచారి యనబడిన నివసించుచు భ్రమాదవశమున నజ్ఞానకృతముగ పాలలో గలసిపోయియున్న గోరక్తమును పానమొనర్చినకతన విరక్తిపై నందుబడి మృతినందెనట. తపోబలమున చక్రవర్తిత్వమును, దోషమున జన్మమును గల్గి అక్బరుచక్రవర్తియై జన్మించె

ననియు, నాతని యం దధికభక్తిం గల్గి గురునితో తానును ప్రాణత్యాగ మొనర్చిన శిష్యుఁడు వీరబల మహారాజుగ జన్మించెననియు వాడుకగలదు. ఈఅక్షయవటమును హ్యూనత్సాంగు క్రీ. వె. ఏడవశతాబ్ద మధ్యకాలమున దర్శించి యున్నటుల వ్రాసియున్నాఁడు. దీనికి శ్యామవటమనియుం బేరుండె నట. ఇంక శేషించిన శేషనాగదేవస్థాన మిప్పుడు త్రివేణినుండి మూఁడుమైళ్ల దూరమున గంగ కుత్తరతీరముననున్న బద్రేవనబడుగ్రామమున గలదు. దేవునిసైత మచ్చటివారు బలదేవుఁడు (బలభద్రస్వామి) యనివాడుచుందురు. తొల్లింటి శేషనాగమను పేరిప్పుడు చాట్నాగ్ అయి హిందూస్థానివారిచేత వాడఁబడుచున్నది. ఇవిగాక పాతాళపురి దేవాలయమున యమునివిగ్రహమును, గోరక్షకనాథగురుఁడని (గురు-గోరఖ్ నాద్)యను చున్నారు.

అలహాబాదు శాసనములలో నొకశాసనమున హర్షవర్థనుని సంతకము "(శ్రీ)మన్మహారాజాధి రాజ (శ్రీ)హర్షస్య స్వహస్తోమమ" అనియుంటఁ గాననగును. ఇది సంతకము గానోపు. దీనిని బన్నేఖరాశాసనమనియునందురు. బుద్ధభగవానుఁ డిటకువచ్చి తన మతబోధఁ గావించెనట. అశోక చక్రవ ర్తి క్రీ. పూ. మూఁడవశతాబ్దమున నిట కేతెంచెనట. మఱియు నాచక్రవర్తియే ఇప్పు డలహాబాదు కోటయందుఁ బాతఁబడియున్న శాసనముల స్థంభమును ఇచటికి ముప్పదిమైళ్ల దూరమున యమునానదిపైనుండిన కౌశాంబి నగరమున వేయించెనట. కౌశాంబి నగరము, హస్తినాపురము గంగానదియందుఁ గలసినపిదప పాండవుల సంతతిప్రభువులు రాజధానిగ రాజ్య మేలినతావు. వత్సమహారాజునకిదియే రాజధాని. ఇంకను కౌశాంబి యధికారకాలమున పాడైన ప్రతిష్ఠానపురపు తావున నొక సైన్యదుర్గముండెడి దట. ఈ స్థంభ మెవ్వరివలననో అలహాబాదు కోటకడకుం జేర్పఁబడెనట. ఇప్పుడు కోటలో నిలువంబెట్టి పాతఁబడియున్నది. దీనిపై నారు అశోకశాసనములు, సముద్రగుప్తుని జయశాసనము, రెం డితరశాసనములు, జహాంగీరు సింహాసన మెక్కిన వారశిశాసనమొకటియు, నింక మఱి కొన్ని శాసనములును కలవు.

అక్బరువలన అలహాబాదు, సుబాగా నేర్పరు పఁబడెను. అందు బీహారమువరకుఁ గల తూర్పు జిల్లాలును, దక్షిణమున కాలాంజరము వరకుఁ గల ప్రదేశమందలి జిల్లాలును, పశ్చిమమున కారామానిక్పురము వరకుంగల ప్రదేశమందలి జిల్లాలును చేరియుండెను. ఈ నగరముననే ఈస్టిండియా కంపెనీవారికి బంగాళాదేశపు దివానీ యొసంగుచు రెండవ షాలంపాదుషా సన దొసం గెను. అది క్రీ. వె. ౧౭౬౫వ సంవత్సరము. జహాంగీరు చక్రవర్తి జ్యేష్ఠపుత్రుఁడు తండ్రితోఁ గలహించి, పట్టుబడి, కారాగారవాసము నిటనే గడపెనట. ఆతని గోరీ అలహాబాదునందలి ఖుసురూబాగునందున్నది. ఆప్రక్కనే ఆయన తల్లి షాబేగం గోరీకలదు. ఆమె భర్తకును పుత్రునికిఁగల స్థితింగాంచి ఖేదమంది, పుత్రుని మరణమునకు దుఃఖితయై ప్రాణహత్య గావించు కొనెనందురు. ఆమె క్రీ. వె. ౧౬౦౪ లో జహాంగీరునకుఁ బరిణయమై ౧౬౦౭ ఖుసురును గని ౧౬౨౩ లో మృతిఁజెందెనని చెప్పఁబడినది.

అలహాబాదుకోట ఆంగ్లసైన్య స్థానముగ నొనర్పఁబడి ఈస్టిండియాకంపెనీవారి యాక్రమణ క్రిందికి క్రీ. వె. ౧౭౬౩ లో వచ్చెను. సిపాయిల తిరుగుబాటుకాలమున నాయకుఁడగు లైఖత్ ఆలీ వశమై ౧౮౫౭ మొదలు ౧౮౫౮ వరకు కొలది కాలముండెనుగాని నీలుసేనాని క్రింద మెడ్రాసు పటాలము లరుదెంచగనే యతఁడు పాఱిపోవ ఆంగ్లులవశమాయెను. తిరుగుబాటు చల్లారినకతన విక్టోరియా మహారాజ్ఞి పరిపాలనకుం జేర్చినటుల

ప్లాక్లెమేషను అలహాబాదునందే కోటవెలుపలి బురుజుపై క్రీ.శ. ౧౮౫౮ నవంబరులో మొదటి రాజప్రతినిధిగా కానింగుప్రభువు చదివియుండెను. అలహాబాదునందు దారాగంజికి సమీపమున నలోపీదేవి దేవస్థానము చూడఁదగినదని యందురు. ఇది ౧౮౦ పీఠములలో నొకటి. (శక్తిపీఠములు చూడుఁడు). ప్రతిష్ఠానపుర ముండినతావున నిప్పుడు ఝూసీ యను గ్రామము కలదు. (ప్రతిష్ఠానపురము చూడుఁడు). చైతన్య స్వామి యిటకు యాత్రవచ్చినటుల చైతన్య చరితామృతమునఁ జెప్పఁబడియున్నది.

**అల్లమరాజు రామకృష్ణకవి —** ఆంధ్రకవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడి నవాఁడు. ఆరామద్రావిడశాఖ బ్రాహ్మణుఁడు.హారితస గోత్రము. తండ్రిపేరు రంగనాథము. నివాసము పిఠాపుర ప్రాంతముననున్న చేబ్రోలు. రచించిన గ్రంథములు కవిచకోరచంద్రోదయము, (ఇది ద్రాక్షారామ భీమేశునకుఁగృతి), వైనతేయ విజయము, సత్యభామావిలాసము, గౌతమీ మహాత్మ్యము, ద్రౌపదీపరిణయము, సుశోభా వివాహము, హనుమదాఖ్యానము, సుకవిజన మనోరంజనము, మదాలసా పరిణయము, శంతను విలాసము, అధ్యాత్మ రామాయణము, అచ్చ తెలుఁగు భాగవతము, రామకృష్ణీయము (ఇది ఆంధ్రశబ్దచింతామణికి వ్యాఖ్యానము).

**అల్లము చెట్టు —** లా. Zingiber Officinali. ఆంగ్ల Ginger. సం. ఆర్ద్రిక, కటుభద్ర, గుల్మమూల. ఇది చాల వైద్యగుణములు గలది. దుంపజాతి. కారము, వగరు, రుచులఁగల్గి యుండునది. అల్లమునందు హీనపుజాతిని అడివి అల్లము, కారు అల్లము నని యందురు. త్రిదోష ములు హరించును. అజీర్తివిరేచనములు కట్టును. అగ్నిమాంద్యము, అగ్నిపైత్యములు, ఉబ్బు జాడ్యము, కంఠరోగములు, కడుపునొప్పులు, కాలు సేతుల పోరలూడుట, గుల్మము, నాస రోగములు, పాండువు, పీనస, మూత్రకృచ్ఛ్రము, మలమూత్ర నిరోధము, మేహరోగములు, శ్వాస కాసలు, శ్లీపదము (బోదకాలు), శూలలు, శోష, సన్నిపాతము, క్షయ నివారించును. వేడి చేసిఆర్చును. జఠరదీప్తి, బలము, వీర్యవృద్ధి, దేహపుష్టి, కాంతి, జ్ఞాపకశక్తి, వీనిని వృద్ధిఁజేయును. జీర్ణశక్తి, కార్శ్యము వీనికి బలముగల్గించును. లోని చెడు పదార్థములను వెడలించి క్రిములఁజంపి లోనశుభ్రపర్చి విదాహమునడఁచును. అజీర్తి విరేచనములనుమాన్పును. మలమువెడలించును. గొంతుక బొంగురుపోజేయును. దీనికి విరుగుడులు_ చందనము, వాతశరీరులకు పాలు, వేడిశరీరులకు బాదంనూనె. ఇంక నీ యల్లము నకుం జెందిన మామిడల్లము ప్రసిద్ధ భోజనపదార్థము. లాటిన్భాషయందు Curcuma amada అనియు, ఆంగ్లమున Mango ginger అనియుపేర్లు.దుంప లందు నీళ్ల విరేచనములు కట్టుగుణము కలదందురు. దీని నూరవైచి ఊరగాయ జేయుదురు.

**అల్లమురాజు సుబ్రహ్మణ్యకవి —** ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడిన వాఁడు. ఈతఁడల్లమరాజు రామకృష్ణ కవికిం దమ్ముఁడట. రచించినవి శ్రీకృష్ణ కళ్యాణమను ప్రబంధము (ఇది కాకినాడ బచ్చు రామేశం గారికిఁ గృతియీయఁబడినది), మణిధ్వజచరిత్ర, భద్రాపరిణయము, ఆత్మబోధము (ఇది ప్రశ్నోత్తర రత్నమాల యనఁబడుచున్నది), శేష ధర్మము (ఇది లింగంపర్తిలోని శ్రీరాముల కంకితము). ఈ కవి నివాసము పిఠాపురమునకుం గతిపయ దూరముననున్న చేబ్రోలు గ్రామమట. ఆరామద్రావిడ బ్రాహ్మణుఁడు, హారితసగోత్రము, తండ్రిపేరు రంగనాథము.

**అల్లము వ్యవసాయము** — ఇది పసుపుఁబోలిన వ్యవసాయము. దీనికి భూములు, వేయు ఎరువులు, నీడ, నీరుదోడుటలు మొదలగు పరిస్థితులన్నియు పసుపు వ్యవసాయముఁ బోలి యుండును. (పసుపు వ్యవసాయము చూడుఁడు.) ఎకరమునకు ౧౨ వందలు మొదలు ౧౫ వందలు పౌన్లు వరకు ముదరుటల్లము ముక్కలుగఁ గోసి రెండు, మూడు అంగుళముల లోతునకు తొమ్మి దంగుళముల దూరమున కొక్కొక్కటిగా నాటి, వీటి వ్రేళ్లకు చెమ్మమాత్రము తగిలి, నీరు నిలువ కుండ నారిపోవునటుల నీరుగట్టుదురు. అల్లము నకుఁ గలుపుండరాదు గాన, అవసరముబట్టి అయి దారు సార్లు కలుపుఁదీయుదురు. ఇది ఆరునెలల పంట. ఎకరమునకు ౧౨ వేల పౌనులు సిద్ధ పరుపఁబడిన యల్లము ఫలితముగల్గును. అల్లము నకు ఎరువు తక్కువైనను, నీరు తక్కువైనను, ఎండబారినను చక్కగ పెరుగదు. అల్పజాతి అల్లమునందు పీచెక్కువై యుండును. పరిస్థితు లనుకూలించిన యెడల నల్లము కండఁగలిగి, పెద్ద పెద్ద దుంపలుగ నూరును. అల్లమును శొంఠిగఁ జేసి, నిల్వయుంచుకొనెదరు.

**అల్లరచిల్లరమూక** — ఆంధ్రభాషా సాంప్రదాయార్థపదము. చిల్లరయన తక్కువవా రని యర్థము. అల్లరచే లాతివారని భావము.

**అల్లరిబాజా** — ఆంధ్రభాషా సాంప్ర దాయార్థపదము. అల్లరిచేయుచు, కేకలు, ఏడ్పు మొదలగు ధ్వని నధికముగనొనర్చుపిల్లలను అల్లరి బేజాయని వాడుటకలదు గాని, యిదిసుప్రసిద్ధము కాదు. ముద్దుకొలది పెద్దవారు చిన్నపిల్లల నిట్లనుటఁ గాననగును.

**అలర్కుఁడు** — కాశ్యపుని సంతతి వాఁడు. ప్రసిద్ధికెక్కిన మహారాజు. తండ్రి కువల యాశ్వుఁడు. కొడుకు సన్నతి. దత్తాత్రేయునివలన యోగమార్గవిద్యోపదేశ మందినవాఁడు. ఇంకను వేఱొక యలర్కుఁడు చంద్రవంశ క్షత్రియుఁడు. తండ్రి కువలయాశ్వుఁడను నామాంతరముగల ప్రతర్దనుఁడు. కుమారుఁడుభార్గవుఁడు. మనుమఁడు భర్గభూమి.

**అల్లసాని పెద్దనామాత్యకవి** — ఆంధ్రకవులలో మధ్యకవులందుఁ బరిగణింపఁబడిన వాఁడు. నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు. తండ్రి పేరు చొక్కనామాత్యుఁడు. బళ్లారిప్రాంతమున దూపాటిసీమలోని దోరాలగ్రామమితని పూర్వ నివాసము. తర్వాత విజయనగర రాజధానియం దున్నవాఁడు. శ్రీకృష్ణరాయ సార్వభౌముని యాస్థానమున విద్వత్కవులగు నష్టదిగ్గజకవులలో నగ్రగణ్యుఁడు. మొట్టమొదట ప్రబంధరచనకు మార్గముంజూచి తాను మనుచరిత్రను రచించి, తర్వాతికవులకు మార్గముంజూపినవాఁడగుట, ఆది ప్రబంధకర్త యనఁబడినవాఁడు. చక్రవర్తియగు కృష్ణదేవరాయునివలన ఆంధ్రకవితా పితామహుఁ డను బిరుదమును, గండపెండేరములును బహు మానమంది, యనేకాగ్రహారములఁ బొందిన వాఁడు. మనుచరిత్ర మనఁబడు స్వారోచిషమను సంభవంబను మహాప్రబంధము రచించి, శ్రీకృష్ణ రాయ సార్వభౌమునకుం గృతియిచ్చెను. అద్వైతము మొదలగు కొన్నిగ్రంథముల రచించిన వాఁడు. మఱియు నీతఁడు హరికథాసారమను గ్రంథము మొదలగు ననేకగ్రంథములను పెక్కు చాటుధార పద్యములు రచించెనట. చాల సుప్రద్ధుఁడగు కవివరేణ్యుఁడు.

**అల్లజీరా** (మెసపొటేమియా లేక మసాల్ దేశము) — ఆశియాఖండమున టర్కీవారి. రాజ్యములోనిది. తొల్లింటిపేరు మెసపొటేమియా మసొలుపురము రాజధానియై ప్రధాననగరమై యుంట, మసొలుదేశ మనఁబరగుచుండెను. కురుడుస్థానమునకు దక్షిణమున టైగ్రిస్ యూఫ్ర

టీసు నదులనడుమ నున్న దేశము. అల్జజీరా యన అరబ్బీభాషయందు ద్వీపమని యర్థము. మెసపొటేమియా యనినను మధ్యభూమి యనియే యర్థము. తొల్లింట గొప్ప ఫలవంతమగు దేశముగా నుండెను. నీటికాల్వలు మరమ్మతు లేక పాడై డొంకలమయమైపోయిన చక్కని సమతల ప్రదేశము. వేసవికాలమున గాడ్పు లధికముగా వీచును. ఇప్పుడు పట్టణములందున్నవారే ప్రజలు. దేశమందు దేశద్రిమ్మరులగు అరబ్బు బెడోయీనులు తిరుగుచుందురు. ముఖ్యస్థానమగు మసౌలుపురము తొల్లింట మజిలినుతానుల నేతకుం బేరందియుండెను. ఈబట్టలనేతకీపేరు ఈ పురమునుండియే కలిగెను. మసౌలుపురము టైగ్రిసు నదీతీరము. ఎదురుగనే తొల్లింటి రాజ్యకాలము నాంటి రాజధానిగనుండిన నినివేపురపు పాడు కన్పించుచుండును. (కురుదుస్థానము చూడుండు). నదియందు డయార్బేకరువరకు ఓడలు పోవును. తొల్లింట ఓర్ఫాపురమిప్పుడు ఉర్ అనియు పిలువంబడుచున్నది. ఖాల్డీసువారినాండు ఎడెస్సా యనంబడుచుండెను.

**అల్హాంబ్రా ప్రాసాదము**—అరేబియన్ నైట్సు కథలందుం బ్రసిద్ధమైన భవనము. స్పానియా దేశమున డారోనదీతీరమున గ్రనడా పట్టణము కడనుకొండపై నున్నది. ఇది గ్రనడారాజ్యమును క్రీ. వె. ౧౨౩౨ మొదలు ౧౨౭౨ వరకు పాలించిన ౧ వ మహమ్మదు సుల్తాను కాలమున బ్రారంభింపంబడినది యనియు, క్రీ. వె. ౧౩౩౩ మొదలు ౧౩౫౩ వరకూ పాలించిన యూసూఫు సుల్తాను కాలమున బూర్తి చేయం బడినదనియు దెలుచున్నది. చూడదగిన సుందరతర భవనములలో నొకటి. దీనిని ఆంగ్లభాషా కోవిదులు కొందఱు (Red Castle) అని వాడియున్నారు. క్రీ. వె. ౧౮౧౨ లో ఫ్రెంచి సేనానియైన్న మహానుభావుం డొకండొనర్చిన దుండగపు విధ్వంసనములవలనను, కాలముగడుచుటవలనను ఈ మహా భవన సౌందర్యము కొంత తగ్గినను నేటికిని దర్శనీయమై యున్నది. క్రీ వె. ౧౮౨౮ లో కొంతగను, ౧౮౭౭ మొదలు ౧౮౯౦ వఱకు కొంతకొంతగను పునరుద్ధరణము జరిగినది, గాని, చాలదని తోపకపోదు. స్పానియా దేశమందలి గ్రనడా పట్టణమునుండియే దీనింగాంచ నేగవలయును. అత్తరికొండ నెక్కుచు, నొక సుందరోద్యానవనముగుండా నేగవలసియుండును. ఇందు నీటివసతులు మెండుగ సమర్పంబడియున్నవి. దరి కేగువఱకీమహాప్రాసాదపు వింత యేమియుం గానరాక మరుగుపడి యుండును. ఇది మూరు జాతివాండగు సుల్తానును, ఆతని సుతుండును నిర్మించిరట. అల్హాంబ్రా మధ్యభాగమున రెండు గొప్ప వాకిళ్లు కలవు. అందొకటి చేపలంబెంచుకుండుకలది. ఈహాజారము పొడ వుత్తరదక్షిణములుగ ౧౩౮ అడుగులు, తూర్పు పడమరలుగ వెడల్పు ౭౪ అడుగు లుండును. రెండవది సింహముల ఔత్కానాయుండు వాకిలి. ఇందుం బండ్రెండు సింహములు చలువరాతివి కుక్కలంబోలినవి ప్రమోయు ఔత్కానా కలదు. ఈ రెండు వాకిళ్లంజుట్టియె తక్కిన భవనభాగములున్నవి. భవన పార్శ్వములందు ముఖమంటపములనుబోలు కట్టడము లనేకము లున్నవి. అవి చలువరాతి స్తంభములచే భరితములై యున్నవి. ఈమంటపములు వాకిళ్లలోనికిం ద్రోసికొనివచ్చినట్లుండును. భవనమునందున్న కొల్వుకూటములు (చావిడులు) వాకిళ్లలోనికిందెరువంబడి యుండును. ఇందు అబెన్సెరేజస్ అనంబడుసావిడి ప్రేలాడు తేనెపట్టులంబోలిన పనితనముం బ్రదర్శించు ప్లాస్టరు (పాలగచ్చులతోనిండి యద్భుతపుం జేతి) పనింబ్రదర్శించుచు నచ్చెరువుం గొల్పెడిని. రాతి చెక్కడపు పనియు విచిత్ర మనిపించకపోదు.

**అల్వనర్ (పరగణా)** — ఆల్వారు చూడుడు.

**అలాండుద్వీపములు** (Aaland or Aland)—ఈద్వీపసముదాయము బోతినియా సంయుక్తాగ్రముకడ నున్నది. ఇవి ముప్పదికలవు. ఇపుడు ఫిన్లాండు ప్రజాప్రభుత్వమునకుం జేరియున్నవి. ఇం దన్నియు జననివాసములుగ లేవు. ఇందు పెద్దదియు ప్రధానమునగు ద్వీపము పదునెన్మిది మైళ్ల పొడవుగలది. దానినుండియె ద్వీపసముదాయమునకుఁ బేరుగల్గెను. ద్వీపములన్నియు గలిసి ౫౫౦ చతురపు మైళ్ల వైశాల్యమనియు, నందు ౨౭౦౯౩ జనులు వసించుచున్నారనియు, క్రీ. శ. ౧౯౨౦ సంవత్సరమున లెక్కింపఁబడిరి. క్రీ. శ. ౧౯౨౧ జాతిసమితి (League of Nations) తీర్మానమునను సరించి ఫిన్లాండునకుఁ జేరియున్నవి.

**అలాబూశలాక న్యాయము** — ఆనపకాయ యొక రాతినెరదలో పుట్టి పెరుగుటవలన, నారాతినెరద యాకృతినే ధరించునట్లు పరిసరమగు నాశ్రయస్వభావమునే పొందిన దానింగూర్చి చెప్పఁబడు న్యాయము.

**అల్లా (నామము)** — మహమ్మదీయ మత సిద్ధాంతమున అల్లాయనునది దేవునిపవిత్ర నామము. వారిమతమున దేవునకు మూడువేల నామములు కలవు. అందు మిగులపవిత్రవంతమై పరమేశ్వర ప్రీతిగాంచినది "అల్లా" యను నామము. వీనింగూర్చి తఫ్సీరిబహా రనంబడు ఇజ్మాగ్రంథములందు వివరింపఁబడియున్నది. దేవదూతలెరింగిన నామములు ౧౦౦౦, దేవునిప్రవక్తలకుఁ దెలిసినవి ౧౦౦౦. యూదమతగ్రంథమునగలవి ౩౦౦, యూదమత గీతములందుగలవి ౩౦౦, మంత్రములందుగల నామములు ౩౦౦, ఖురాన్ షరీఫునందున్న నామములు ౯౯, ఎవరికీ తెలియక లోకమెరుంగని నామమొకటికలదు ౧, మొత్తమన్నియుకలసి ౩౦౦౦.

**అల్ట్రావయొలెట్ రేస్**—సూర్యాగ్రకిరణచికిత్స చూడుడు.

**అల్పారంభః క్షేమకర** — ఇది సంస్కృత భాషయందలి లోకోక్తి. కొంచెముగా నారంభించి పనిచేయుట క్షేమకరమని భావము.

**అలిజ్యరెన్ రంగులు** (Alizarin Paints) — అరబ్బీపదమునుండి కల్గినది. ఆపేరుగల చెట్లరసము ననేకరంగులుగ నొనర్చుదురు. అన్నియు అలిజ్యరెన్ రంగులుగనే పేరందినవి. ఈరంగులకుఁ గృతకముగ వేఱు చౌకపదార్థములతో నీరంగులేతయారుచేయ పెర్కిన్ అనునాయన చాలా ప్రయత్నించి శ. ౧౮౬౮ లో జయప్రదముగ సఫలుఁడయ్యెను. ఆరంగు చౌకగ కిట్టెనదట.

**అల్లి (పండ్ల) చెట్టు** — లా. Memecylon tinctorium. ఇది పండ్లనిమిత్తమై ఉపయోగించు ఒక పాటి చిన్న పొద లేక డొంకచెట్టు. పుష్పములు, పండ్లు నీలవర్ణమై పండ్లు రుచిగానుండెడిని. వర్షాకాలమున పూచి శీతకాలమున పండును. క్రిమింగల్గించును. చెట్టువేళ్లు ఆకులు కషాయము మేహశాంతినిజేసి విరేచనములను గట్టును. అతిఋతురక్తస్రావము, సెగరోగము, కుసుమ వీనినిఁదగ్గించును. దీనిఆకురసము వేడినీళ్లతోకల్పి వడగట్టినది నేత్రరోగములం గుదుర్చును. ఆనీళ్లతో నేత్రములం గడుగుదురు.

**అలీఫ్ అక్షరము** — అరబ్బి అక్షరములలో మొదటియక్షరము. పరమేశ్వరుఁడగు అల్లాయొక్క అర్ధస్వరూపము. పరమకల్యాణప్రదము, మంగళప్రదము, గాన మహమ్మదీయులలో పత్రములశిరమున వ్రాయుచుండు యాచారమొకటి కలదు.

**అలీయూటియన్ ద్వీపములు** — సైబీరియాకుంజెందిన కామ్చట్కా ద్వీపకల్పము నుండి అమెరికావరకు వ్యాపించియున్నవి. ఇవి సైబీరియా ప్రభుత్వమువారివి. (సైబీరియా దేశము చూడుడు).

**అల్జీరియా దేశము** (Algeria) — ఆఫ్రికాఖండమున బెర్బరీస్టేట్సు అనంబడుస్టేటులలో నొకదేశము. (ఆఫ్రికాఖండము బెర్బరీస్టేట్సు చూడుడు). వైశాల్యము ౧౮౫,౦౦౦ చతురపుమైళ్లు. ఇది ఫ్రెంచివారాక్రమించియుంట వారివశమైనదేశమై యున్నది. క్రీ. పూ. ౧౮౩౦ సంవత్సరమున దీని నేలుచుండిన ప్రిన్సు డే (Prince Dey) ను జయించి వారాక్రమించి యుండిరి. ఇందించుమించుగ నేబదిలక్షల జనులున్నారనియు, నందు రెండులక్ష లైరోపాదేశస్థులనియుఁ జెప్పఁబడినది.

అల్జీరాశబ్దమునకు ద్వీపములపురమనియర్థము. దీని తొల్లింటి రాజధానిపేరు అల్జీరాయనియె యుండెను. బహుశః దానినుండియె దేశమునకీపేరై యుండనోపు. అల్జీరాపురవాసులు తొల్లింట గొప్ప యోడదొంగలుగనుండిరట. వారికడ పెక్కండ్రు క్రైస్తవులు బానిసత్వమునందుండిరట. క్రీ. వె. ౧౮౧౬ లో ఎక్సుమూరు ప్రభు వీపట్టణమును విధ్వంసనమొనర్చి క్రైస్తవ బానిసలను విడిపించెనట. ఈపురముయొక్క రేవున హార్బరునందుగల ద్వీపములనుండి అల్జీరాయనుపురము గల్గియుండును. అల్జీరియాదేశ * మెడారి ప్రదేశముగ నుండును. ఫ్రెంచివా రీయెడారులయందు ఇనుపబాటలనువేసి నూతులంద్రవ్వించి దాహాలోదకవసతి నభివృద్ధిపఱచిరి. మంచి తావులందు గోధుమలు, బార్లీధాన్యము, ఎస్పార్టోగడ్డి పైరు చేయఁబడుచున్నవి. ద్రాక్షతోటలు, ఓలివ్ తోటలు, పట్టుపురుగుల పెంపకమునకు మల్బెరీ వృక్షముల తోటలు పెంచఁబడుచున్నవి. ఇప్పుడు అల్జీరుసుపురము పొగయోడలు బొగ్గువేసుకొను స్థానము (Coaling Station) గ నున్నది. కాన్స్టాంటైనుపురము కాన్స్టాంటైను చక్రవర్తిచే తిరుగ కట్టంబడినది. తూర్పున బోనాపురమును, పశ్చిమమున ఓరాన్‌పురమున వర్తకము నడచు రేవుపట్టణములు, ఈ దేశమును ఫ్రెంచివారు చాలా అభివృద్ధిపర్చి బాగుజేసియున్నారు.

**అల్బేనియా స్టేటు** — ఐరోపాఖండమున టర్కీ ఇన్స్యూరపుబోనిది (టర్కీదేశము చూడుడు).

**అల్లు లలో మలు పెద్ద** — ఆంధ్ర లోకో

**అల్యూమినియమ్** — ఏటి బంద్రుమట్టి చూడుడు.

**అలెగ్జాండరు ది గ్రేటు యుద్ధయాత్ర** — ప్రపంచమునందనేకుల కనేక వాంఛలు. ఈతనికి సంగరవాంఛ. ఐరోపా ఖండమునందలి గ్రీసుదేశమున మేసిడోనియా యనఁబడు చిన్నరాష్ట్రముండెను. దాని సీతని తండ్రి రెండవ ఫిలిప్పు ప్రభువు పాలించుచుండువాఁడు. తండ్రి జీవితకాలమున నలెగ్జాండరాకాలపు ప్రసిద్ధపండితుఁడగు అరిస్టాటిల్ గారికడ్డై విద్యాభ్యాసమొనర్చెంగాని ఆయన శాస్త్రమీయన పాటించినట్టు కనపడదు. అలెగ్జాండరు క్రీ. ము. ౩౫౬ లో జన్మించి ౩౨౩ లో మృతినందుటంజేసి ముప్పదిమూడేండ్లు మాత్రమే జీవించినట్లగుపడుచున్నది. విద్యాభ్యాసము ౩౪౩ మొదలు ౩౩౬ వరకు అనగా నేడేండ్లని లెక్క తేలినది. రాచకార్యనిర్వహణ మొనర్ప సీతని ౧౬ వ ఏట నారంభించి తన ఇరువదియవయేట తండ్రి చనిపోగా నీతఁడు ప్రభువయ్యెను.

తొలుత మేసిడోనియాప్రాంత సీమలన్నిటిపై దాడివెడలి వశపర్చుకొని క్రీ. పూ. 334 లో యుద్ధయాత్రకు వెడలి యావత్సరమే పెక్కండ్రు పారశీకప్రభువుల నోడించెను. ఫోనీషియా, సైప్రస్ రాజ్యములను వశపర్చుకొని 332 లో ఈజిప్టును వశపర్చుకొనెను. 331 లో పారశీక సామ్రాజ్యమును గెల్చి చక్రవర్తియగు దారా (డెరయసు) నుండి కప్పముంగొని బాబిలోనియా, సుసాదేశముల వశపర్చుకొని కప్పములంగొని పారశీకపుం బురాతనరాజధానియగు పర్సీపోలిస్ నగరముం దోచుకొని, ఆచక్రవర్తి మోసగానిచే జంపంబడిన కతన తానేప్రభువై క్రీ. పూ. 330 మే లో చక్రవర్తి పదమంది ఆఫ్ఘనుసానము, బెలూచిస్థానముల నాక్రమించి హిందూకుష్ కనుమలం దాటి బాక్ట్రియాకుంజని యట తన ప్రతాపముం జూపి మరలి కైబరుకనుమమార్గముగుండా భరతదేశమువై పుసడచెను. సింధునదిని క్రీ. పూ. 326 లో దాటి తన మామూలుపనులనే నెరపుచు హైడాస్పస్ అని తాపేరిడిన సెట్లజ్ నదియొడ్డున పురుషోత్తమభూపతింగెల్చి యాతనికి బోరస్సని పేరిడెనట. అటనుండి విపాశ నదియొడ్డునకు వచ్చి (దానికి హి-ఫాసిస్ అనిపేరిడి) దాటంబోవ నాతనిసైన్యములు తిరుగంబడి ముందునకుం జన నిరాకరించెనట. చేయునదిలేక అలెగ్జాండరు మరలి సింధునదికింజేరి యోడలలోం బయనమొనర్చి ఆనదీముఖమున సముద్రముం జేరి బెలూచిస్థానమున దరిజేరి నాటున సుసాకుం జేరెనట. కాన నావీరుండు భరతదేశమున మూడేండ్లుండినటుల పరిశీలకు లనుచుందురు. సుసాలో నుండుతరి పారశీకులతోం దన గ్రీకుల కనుబంధము బలపరుప నిర్వురు పారశీకాంగనలం బరిణయమాయెనట. కాని, ఆయన తనస్వదేశముందిరుగం జూడనేలేదు. ఆయనకింకను అరబ్బీదేశముపై కన్నుండెనటగాని, కొన్ని పరిస్థితులవలన కార్యము నెరవేరనేలేదు.

అలెగ్జాండరు క్రీ.పూ. 323 లో స్వర్గమున కరిగెనని ఆయన చారిత్రకారులు వ్రాసిరిగాని అది యుద్ధయాత్ర కాదు. ఇటులజీవయాత్ర 32 సంవత్సరములును, ప్రభుత్వమొనర్చినది 12 సంవత్సరములునని తెలినది. అలెగ్జాండరు పేరు పారశీక భాషలో సికందర్ అనియును, అరబ్బీ భాషలో ఇస్కందరనియును, అశోక శాసనములందు అలకసుందరనియును వాడంబడినట్లు కాననయ్యెడిని. మహారాష్ట్రులు పారశీకపుంబద్ధతినే వాడిరి. ఈతని యాత్రనుండి కొన్ని గ్రీసుదేశపుపద్ధతులు వ్యాపించినటులగాననగును. చరిత్రకారులీయనను అలెగ్జాండరు ది గ్రేటు అని వాడియున్నారు.

**అలెగ్జాండ్రియా పుస్తక భాండాగారము** (Alexandrian Library)–మాసిడోనియాభూపతి మహాలెగ్జాండరు మృతిజెందిన పిదప, ఆయన పాలించిన రాజ్యము చీలికలై ఆయన రాజధానిగనుండిన అథెన్సు నగరము వైభవముం గోల్పోయినతరి, అలెగ్జాండ్రియా పట్టణము విజృంభించి విద్యలకాస్పదమై గ్రీకు విజ్ఞానమున కునికిపట్టనంబడియెను. అలెగ్జాండరు నకుంబిదప గ్రీకురాజ్యపాలనమొనర్చిన మొదటి టోలెమస్ (Ptolemies I) భూపతి విద్యావినోదియై తనరినవాండు. ఇంకను సోటర్, ఫిలడెల్ఫసు, ఎనర్గెటసు (Soter, Philadelphus, Energetes) అనువారు మువ్వురును విద్యావ్యాపకమునకుం డ్రిమూర్తులనంబడినారు. విద్యల నాదేశమునం దుద్ధరించియుండిరి.

ఫిలడెల్ఫస్ కాలమున వారి ప్రయత్నములు:– ధనసాహాయ్యమున నిరు తెగలవారిని గ్రంథసంపాదనకై నియమించి, వేర్వేరుతావుల కనిపిరి. వారిగుండా ఎఱిగిన ప్రపంచభాగములనుండి పెక్కు

సాహిత్య గ్రంథములు మొదలగునవి పాపిరస్ రేకులపై వ్రాయంబడి, ఆ చుట్టలు తీసికొనిరాఁబడి, రెండు తావుల గ్రంథ భాండాగారము లేర్పఱుపఁబడినవి. అందొకటి రాజప్రాసాదమున బ్రూబియన్ భవనమునను, రెండవది సెరఫిన్ దేవస్థానమున నుంచబడినవి. రాజప్రాసాదమున ౪౯౦౦౦౦ పాపైరస్ చుట్టలును, దేవాలయమున ౪౨౦౦౦ చుట్టలు నుంచబడెననియు, నిందొకే గ్రంథమునకు వేర్వేరు భేదముల ప్రతులుండెననియు, అరిస్టాటిలుగారి గ్రంథములే ఐదు వందల చుట్టలుండెననియు చెప్పఁబడినది.

క్రీస్తునుపు ౪౭ సంవత్సరమున జూలియస్ సీజరు అలెగాంఢ్రియాపై దాడివెడలుసరికి దేవస్థానమునందలి గ్రంథసముదాయము సంఖ్య ఇంచుమించు ఏడులక్షలవరకు పెరిగెననియు, కాని అకస్మాత్తుగ సంభవించిన యొక అగ్ని ప్రమాదమున కొన్ని కాలిపోయెననియు, నొక బలమగు ప్రతీతికలదు. ఇంతియేగాక తియోడోసియస్ పరిపాలనకాలమున కొందఱు క్రైస్తవ యువకులు బలాత్కారముగ కొన్ని గ్రంథములం గొంపోయిరందురు. మరియు, కేలిఫ్ ఓమార్ యొక్క సైన్యాధిపతి అమర్ అనునాయన అలెగ్జాండ్రియా కొల్లగొనెననియు అత్తరి గ్రంథ భాండాగారము పాడుచేయఁబడెనని యొక ప్రవాదము కలదుగాని తగిన నిదర్శనములు కానవచ్చుటలేదు.

తక్కిన రాజప్రాసాదస్థ గ్రంథ భాండాగార సంబంధియై ప్రభుత్వ వ్రయమున నొక మ్యూజియమును, ఏదోయొకవిధమగు విద్యాపరీక్షాస్థానమునుకూడస్థాపింపఁబడినవనియు, అందు కొందఱు పండితులు గ్రంథములను తరగతులుగను, గ్రంథ కర్తల విభజనవారీగను విభజింప నిర్ణయింపఁబడిరనియు, మొదటి గ్రంథ భాండాగారోద్యోగి జెనోడోటస్ (Zenodotus) అను పేరుగలవాఁడనియు పరిశీలనలనుండి తేలుచున్నది. ఇది ఐరోపాదేశములవారి సుప్రసిద్ధ ప్రథమ గ్రంథాలయముగాన దీనిచరిత్ర ఇంచుక ఆంధ్రవిజ్ఞానమునం దుండుట సమంజసమని తలంపనైనది.

**అలెగ్జాండర్, అలెక్సియుస్, అలెక్సిస్, అలెక్సియా** — (Alexander, Alexius, Alexis, Alexia) గ్రీకు పేర్లు. Alexander the Great (King of Masidonia) అలెగ్జాండరు యొక్క పేరునకు helper of men అని యర్థము. ఈపేరు రష్యాదేశమునం దెక్కువ ప్రచారము నం దున్నది. Aleck, Alick, Eck, Sandy, Sawnie అనునవి దీని ముద్దు పేర్లు. ఇందు Sandy, Sawnie అను రెండును స్కాట్లాండు దేశమున విస్తార ప్రచార మందియున్నవి. పురుషనామము. క్రైస్తవ నామములు చూడుడు.

**అల్బెరూనీచరిత్రకారుఁడు** — గజనీ మహమ్మదుగారి చరిత్రకారుఁడు. క్రీ. వె. ౯౭౩-౧౦౪౮ కాలమునాఁటివాఁడు. ఈతనిపూర్తియగు పేరు అబూరైహాన్ మహమద్ బిన్ అహ్మద్ అల్ బెరూనీ యట. అరబ్బీ రేఖాగణితము, తర్కము, జ్యోతిషవిషయముల నెఱింగినవాఁడట. చాల దేశములంజూచి భరత దేశమున కొన్ని శాస్త్రములం జదివినవాఁడఁట. తారీఖుల్ హింద్ అనుపేరున భరతదేశపు ఆనాఁటి చరిత్రను వ్రాసినవాఁడు. గ్రీకుగ్రంథములను కొన్నింటి ననువదించె నందురు. క్రీ. వె. ౧౦౪౮ లో ఆఫ్ఘనిస్థాన్ దేశమున మృతినందెను.

**అలేఖ్యతము**—వాడుకయందిది ఇటులఁ బేరుది యున్నను నిజమున దీని కలేఖ్యమహిమా బ్రహ్మమని పేరుండుటయె సమంజస మనిపింపక పోదు. దేవుండగు బ్రహ్మము అలేఖ్యము (వ్రాయశక్యముగాని) లగు మహిమలుగలది యని

భావము. ఇది యీ రావి నుత్కలదేశము నం దుద్భవించిన మతము. సనాతనమగు నాస్తే: నుండి కొంతమార్పుజెంది ఎక్కువగా నోడ్రుల యందును, ఇటీవల చెక్కలి ప్రాంతమున, గుంటూరు హైదరాబాదు ఆంధ్రులందు కొంతగను వ్యాపించియున్నది. ఈ మత స్థాపనాచార్యునకు మహిమాగుసాయి యని పేరందురు. ఆయన సిద్ధపురుషుcడనియు, అయోనిజుం డనియు, ధర్మప్రచారావతారుం డనియు నీమతగ్రంథములందుc జెప్పంబడియుంట యీ మహాత్ముc కీపే రాయన బోధించిన మతమునుండి కల్గియుండునేమో యని స్ఫురింపకపోదు. ఈ జగద్దేశికుcడు తామ్ర (రాగి) చ్ఛాయcగల శరీరుడు; మస్తకమునుండి వ్రేలాడు పంచరంగులు గల జటలు గలవాcడట. విష్ణుదేవుని చిహ్నములగు శంఖుచక్రాదులను, అంకుశమును ధరించి యుండినవాcడట.

ఈ మహాదేశికునింగూర్చి వీరి గ్రంథములందుc బూర్తిగc దెలియరాకున్నది. ఉత్కల (ఓఢ్ర) దేశమునం దీసిద్ధపురుషుcడు క్రీ. వె. ౧౮౨౬ సంవత్సరమునం దగుపడెనట. ఘూడోడెంకనాల్ సంస్థాన రాజ్యమునందు కుంభవృక్ష, వకుళ (చెట్టుమొక్క పైపొర లేక పట్ట) పరిధానముతోc గానవచ్చె ననియుం జెప్పcబడినది. ఆ పవిత్రస్థలి యందే వీరి ప్రధాన మఠము నిర్మింపంబడినది. ఈ ప్రధాన మఠమునే మహిమాఘుసాయి సమాధి కలదు. ఇదిజురుండాయను గ్రామము కడ నున్నది. అం దీమతాధికారియగు గోసాయిస్వామి వసించుచున్నాcడు. పరిశీలనవలన నచ్చట లోకులకు దర్శన మిచ్చుట క్రీ. వె. ౧౮౩౮ అని యీ మతస్థు లనెదరు. ఈ మఠమిప్పుడు బెంగాల్ నాగపూర్ రెయిల్వే స్టేషనునకుం బదునాలుగు మైళ్ల దూరమునం దుత్కల దేశమున డెంకనాల్ సంస్థాన రాజ్యము నందున్నది.

పూరీ (జగన్నాథము) పట్టణమున జగన్నాథుని దేవాలయావరణమునcగల ముక్తిమంటపమునం దీమతాచార్యుcడు వసించుచు, మతబోధలొనర్చుచు ఏకేశ్వరవాదమును సల్పుచుండువాcడు. ఇది క్రీ. వె. ౧౮౪౦ ప్రాంతమని చెప్పంబడుటయు, ఇంచుమించు పద్రెండు వత్సరముల కాలమిట మతబోధ కార్యములు నెరపుటయు తెలియుచున్నది. ఈ బోధకుcడు ఫలాహారమును, దుగ్ధాహారమును గైకొనుచుండు వాcడని చెప్పc బడినది. ఇక్కాలముననే ఈయనకుc బ్రధాన శిష్యుcడనంబడిన సిద్ధపురుషుcడు గోవింద బాబాగా రీయనందర్శించి, బోధనలంది శిష్యుండాయెనట. ఇరువదియొకదినము లీమహిమా గోcసాయిగారు అనంతశయనమున పద్మాసనాసీనులై బోధించెనని వీరి మత గ్రంథములందు కలదు. ఈ మత గురువు గోవింద బాబాగారికి, కపిలారణ్యమున ౬౪ సిద్ధులకును బోధించెను.

అలేఖ్మహిమా బ్రహ్మ మతమున ప్రపంచము ఉపాదాన కారణముగ పరమేశ్వరునిచే సృష్టింపc బడెను. జగత్పదార్థములు వేఱ్వేఱుగ నామరూపాత్మకములై పరమేశ్వరునికన్న యన్యములై తోcచుట భ్రాంతి; అనగా జగమంతయుc బరమేశ్వర పదార్థమేనని భావము. పరమేశ్వరుcడు అలేఖ్యమహిమాన్వితుcడు, " అలేఖ్మహిమా స్వామి " యని స్మరించుచుందురు. చెప్పునపుడు " అలేఖ్మహిమా బ్రహ్మ"మనియెదరు; నిర్గుణుం డనియెదరు. నిర్గుణత్వమే పరమేశ్వరునియందు సత్య లక్షణము. సాకారము, సగుణారోపణము మిథ్య యనెదరు గాన బ్రహ్మ, విష్ణు, శివారాధన లీమతమున నిరసింపc బడినవి. జగమంతయు పరమేశ్వర పదార్థమే గాన బ్రహ్మము సర్వవ్యాపి. ఇంక ప్రాణులు కర్మ బంధమునందు తగుల్కొని యుంట జన్మ పరంపరలు కల్గుట సహజము. దేవుం డద్వితీయుcడు గాన అన్య

దేవతారాధకు లీమతమున పాషండులనఁబడుదురు. అజ్ఞానకల్పితములే యగు విగ్రహారాధనలు, తులసిపూజలు, సాలగ్రామ, శివలింగార్చనలు, తీర్థాటనములు, క్షేత్రయాత్రాదులు, అన్యదేవతోపాసనలవలెనే ఈమతమునందు నిషేధములు; తీర్థప్రసాదస్వీకరణముగూడ నీ మతధర్మమున నిషేధింపఁబడినది. ప్రాణి కర్మబంధమునుండి విముక్తిగాంచుటకు భక్తియోగమే సర్వశ్రేష్ఠము, ఇదియే ఈమతమున ప్రాణికి శరణ్యమని చెప్పఁబడినది.

బ్రహ్మముహూర్తమున (సూర్యాస్తమయము నకుంబూర్వము) సూర్యునిదెసందిరిగి ప్రార్థించుట పరమేశ్వరార్చనము. చనిపోయినవారి శరీరములనీమతస్థులు సమాధి యొనర్తురుగాని, దహన మొనర్పరు. వీరియందు రాత్రిభోజనము నిషేధము. భక్తిముదిరినవారు జేగురురంగు శాటీలనే ధరింతురు. వీరియందు స్త్రీలకు ఋతుదినములు ఏడు పరిగణింపఁబడునట. ఈ మతస్థులందు దారాపుత్రులంగల్గిన గృహస్థులు, స్త్రీసంగమము మితముగ నుండవలయునను విధికలదు. రాక్షస ప్రకృతిగలవారికి పరమేశ్వరకటాక్షము చేకూరదని వీరు నమ్ముదురు. రామనామస్మరణము, సాలోక్య ముక్తిప్రద మనియు, మైత్రేయోపనిషదుక్తకరస్థ ముక్తియు, బ్రహ్మైక్య ముక్తియు, ప్రాణికిం ద్రివిధముక్తు లీమతమునఁ జెప్పంబడినవి.

మహిమాధర్మప్రతిపాదనము, సత్యమహిమాధర్మభాగవతము, బ్రహ్మనిరూపణము, స్తుతిచింతామణి మొదలగు మతగ్రంథములు వీరికిం గలవు. శ్రీయుత విశ్వనాథబాబాగారి సత్యధర్మమహిమాకమిటీ ప్రాచీనముద్రాక్షరశాల కటకమున వీరి మతగ్రంథకార్యాలయము కలవు.

**అలేఖనగోత్రము** — జమదగ్ని వత్స ఉపగణము చూడుడు.

**అల్మోడాపట్టణము** — దీని నాంగ్లేయులు ఆల్మోరా యనుచుందురు. ఆల్మోడా (అయోధ్య, ఆగ్రా) సంయుక్తరాష్ట్రములకుం జేరిన కుమాఁ డివిషన్ నందు ప్రధానపురము. కమిషనరు వసించుతావు. సముద్రపు నీటిమట్టముపై ౫౫౦౦ అడుగుల ఎత్తున పర్వతముపై నున్నది. సంయుక్తరాష్ట్రములు చూడుఁడు. హిమాలయ సీమలకరుగు బాట లనేకము లిచటనుండిప్రారంభమగును. ఇటనుండి కాత్గోడమ్ రైలుస్టేషనుకు మాత్రము బండ్లుపోవురస్తా కలదు. తక్కినవి కాలినడక, డోలీలు మాత్రము పోఁదగినబాటలు.

**అలోపతీ** (Allopathy) — ఈ కళా విధానమునే ఆంగ్లదేశపువైద్యులు అభ్యసించి నడపుచున్నారు. ఈవిధానమున రోగియొక్క రోగమునకుం గారణములగు పరిస్థితులను మార్చునట్లు ఔషధములనడపి ఆరోగ్యము గల్గింతురు. ఫ్రెంచిభాషమాటయగు Allopathie నుండి యీశబ్దము కల్గినది.

**అవక్రరాగములు** — సంగీతశాస్త్రము మేరకు వక్రగతి (వక్రరాగములు చూడుఁడు) నందని సమస్తరాగములు అవక్రరాగములే యగును. ఇవి రాగరత్నాకరముమేరకు ప్రస్తరింపఁబడిన సుపూర్ణషాడవ ఔడవభేదజములగు కర్తారాగములు, జన్యరాగములు నని యెఱుంగునది. వీటియందు వక్రగతి యుండదు.

**అవక్రతుఁడు** ఋషి. భరద్వాజ మహర్షి కుమారుఁడు. విద్యలను జదువక, తపం బొనర్చి సకలవిద్యలనెఱింగి గర్విష్ఠుడై రైభ్యునితోఁ గలహించి, యాతనికోపాగ్నిచే హతుఁడై రైభ్య పుత్రుండగు అర్వావసునిచే ప్రార్థింపఁబడిన దేవతల వలన పునర్జీవితుఁడైన వాఁడు.

**అవంతి-దక్షిణాపథము** - అనూప దేశము చూడుఁడు.

**అవగూదపండుచెట్టు** - (మహాకాల) ఇది చెట్లపై కెక్కు బ్రాకుతీగ. చేదుపుచ్చజ రకములోనిది. ఎఱ్ఱనిపండ్లు గల్గియుండును. లా. Trichosanthes palmata ఆంగ్ల. Palmated Gourd. సం. మహాకాలా. హింది లాల్ ఇంద్రా (అనఁగా ఎర్ర చేదుపుచ్చ యని భావము). ఇంకను దీనికి ఉరుకాలః, ఉరుకాలకః, కాలః, దేవదాలికా, కాకమర్దః, కింపాకః, దాలా, దాలికా, జలంగః, ఘోషకాకృతిః యని పర్యాయనామములు గలవనియు పర్యాయము క్తావళియందు చెప్పఁబడినది. దీనికాయలనుకాచిన కొబ్బరినూనెలో కల్పి నూరి చెవులలో బోసిన మానని కురుపులును, ముక్కులోఁబోసిన సమస్త విషయుక్తమగు నాసికావ్రణములును, దుర్గంధపు పీనస మొదలగునవి శమించుననియు, కాయ లెండించి చేసిన ధూమపానము శ్వాసహార మనియు చెప్పఁబడినది. ఈజాతిలోనిదే చిన అవగూదచెట్టు ఒకజాతికలదు. లా. Illecebrum lanatum. దీనివేరు చేదుగనుండును, దాని రసముగాని, చూర్ణముగాని చెవిలోఁబోసిన చెవి లోని పుండ్లు, వాపు, నొప్పి మానును.

**అవగ్రామగోత్రము** – కుండినగణము చూడుఁడు.

**అవచ్ఛేదకము** – అవచ్ఛేద్యాఽవచ్ఛేదకములు చూడుఁడు.

**అవచ్ఛేద్యాఽవచ్ఛేదకములు** — తర్కశాస్త్రమునందలి పరిభాషాపదములు. ఏధర్మమునుండియొకటి ఇతరమునుండి వేఱుచేయఁ బడునో ఆధర్మమున కవచ్ఛేదక మనియు, దాని వలన వేఱుచేయఁబడినదాని నవచ్ఛేద్యమనియు నందురు. "తెల్లనిమనుష్యుఁ" డనునపుడు తెలుపు ధర్మము. ఈ తెలుపునుండియె అతఁడితరమనుష్యుల నుండి వేఱుచేయఁబడినవాఁడుగాన, వేఱుచేసిన తెలుపు అవచ్ఛేదకమనియు, వేఱుచేయఁబడిన (తెల్లని) మనుష్యుఁడు అవచ్ఛేద్య మనియు భావము. ఒక్కొక్క (తావున) పదార్థమునందు కొన్నిధర్మములసమూహము అవచ్ఛేదకముగ నుండును. వాటి నన్నిటిని గలిపి యొక్కటిగ నవచ్ఛేదముగఁ జెప్పవలెనన్న "త్వ" ప్రత్యయము నంతమునందుఁ జేర్చిన, మనుష్యత్వము మనుష్యునకును, ఘటత్వము ఘటమునకు, చక్కఁదనము చక్కని వస్తువునకును అవచ్ఛేదకములగును. ఈ అవచ్ఛేద్యావచ్ఛేదకభావములను సర్వసాధారణముగ ద్వివిధముగ నుడువుచున్నారు. ౧ స్వరూప సంబంధ రూపము: ఇప్పుడు గుఱ్ఱపు సాలలో గుఱ్ఱము లేదనుతరి ఇక్కాలమునకును, గుఱ్ఱము లేకపోవుటకును అవచ్ఛేద్యావచ్ఛేదకభావము చెప్పఁబడినది. ౨ వ్యాప్యవ్యాపక భావరూపము: పృథ్వి గంధవతి యనుతరి గంధమునకును, పృథ్వీత్వమునకును అవచ్ఛేద్యాఽవచ్ఛేదక భావము కలదు. పృథ్వి వ్యాప్యము; గంధము వ్యాపకము. మరికొందఱీ లక్షణములను అవచ్ఛేదకత్వమనగా అనతిరిక్తవృత్తిత్వమనియు, అవచ్ఛిన్నత్వమనగా అన్యూనవృత్తిత్వమనియుఁ జెప్పియున్నారు. అనతిరిక్తవృత్తిత్వము: ఈవస్తువందంతటనుగల ధర్మము అన్యత్రాఉండదని భావము. అట్టిధర్మమని యర్థము. అన్యూనవృత్తిత్వము కొంచమైనను కొదువలేకుండ ఈవస్తువునందుండు ధర్మమని భావము. కొదువ లేక నీవస్తువయందున్నదని యర్థము. ఇంకనుకొందఱు శాస్త్రవిదులు స్వరూప సంబంధరూపమునందు విషయతావచ్ఛేదకమనియు, లక్ష్యతావచ్ఛేదకము, ప్రతియోగితావచ్ఛేదకము, కారణతావచ్ఛేదకము, మొదలగు కొన్ని యంతర్భేదముల వివరించిరిఁ కాని, అవియంతగా పాటింపఁబడుటగానరాదు.

**అవంతి, లేక అవంతిక– (మాళవ దేశము)**—అవంతిపురమురాజధానిగాయుంట

నీదేశమున కవంతిదేశమని నామకగల్గెను- అవంతి పురమున కుజ్జయని యని వాడుకనామము కలదు. ఇంకను ధారానగరము, మండపపురమును వేర్వేఱు కాలములందు రాజధానులుగ నుండిన నగరములు. ఈదేశ మొకప్పుడు తూర్పుమాళవ, పశ్చిమమాళవ యని రెండుదేశములుగ నయ్యెను. తూర్పుమాళవకు అకరదేశమనియు, పశ్చిమమాళవకు అవంతిదేశమనియు పేర్లుండెను. రెండునుకలసిన దేశమునకు అకరవేనావంతి, లేక అకరావంతిదేశ మనియు వాడుకనామములు గాన నయ్యెను వరాహమిహిరుని బృహత్సంహితయందు అకరవేనావంతిక యనియు, బ్రహ్మపురాణము ౪౩ అధ్యాయమున, అవంతిదేశమునకు అవంతి (ఉజ్జయని) రాజధాని యనియు, చెప్పఁబడినది. భోజ మహారాజు పినతండ్రియగు ముంజుని పరిపాలన ౹. వె. ౯౭౪—౧౦౧౦ యనియు, ఆకాలమున హాలాయుధుఁడను విద్వాంసుఁడు ముంజుభూపతి యాస్థానమం దుండెననియు తెలుచున్నది. ఎట్లైనను, క్రీస్తువెనుక ఏడు, ఎన్మిది శతాబ్దములకు పూర్వము అవంతిదేశ మనియె పేరుండనోపు. పిదప మాళవదేశమని పేరు వాడుక నందియుండు నని తోచెడిని.

పండితులు:- హాలాయుధుఁడు ముంజుని యాస్థానవిద్వాంసుఁ డని మున్ను వచింపఁబడినది. ప్రసిద్ధవైద్యగ్రంథమగు వాగ్భట్టమును రచించిన, వాగ్భటుఁడు భోజమహారా జాస్థానపండితుఁ డని టానీ (Towney's) ప్రబంధచింతామణి ౧౯౮ లో చెప్పఁబడినది. మయూరుఁడు (బాణభట్టుని మామగారు) పెద్దభోజుని యాస్థానవిద్వాంసుఁ డని Indian Antiqueries 113, 114 యందు చెప్పఁబడినది. విక్రమార్కమహారాజాస్థానమున, మహాపండితు లనేకు లుండుట ప్రసిద్ధమే. వారికి నవరత్నము లని పేరుండెను. వారు కాళిదాసు, ధన్వంతరి, శంఖుడు మొదలగు వారు. వరాహమిహిరుఁడును అచటివాఁడే నని చెప్పఁబడినది. ఎట్లైనను అవంతిదేశము పండితులచే పేరందిన దేశము.

భూపతులు:- ముంజభూపతికాలము సంగతి ఏదిరాజధానియో సరిగా తెలియకున్నను భోజ మహారాజుకాలమున ధారానగరము రాజధానియై యుండెను. అంతకు పూర్వకాలమున అవంతి పురము (ఉజ్జయని) రాజధానిగ నుండెను. ఉజ్జయనీపురము గంధవతి లేక కాళీనదీతీరము. ఇచటమహాకాళలింగముగలదు. అదిద్వాదశ తేజో లింగములలో నొకటిగఁ జెప్పఁబడినది. ఇచట గల మహాకాళిశక్తిపీఠము మహాపీఠము. ౧౦౮ శక్తిపీఠములలో నొకటిగ చెప్పఁబడినది. మఱియును అవంతికాపురి సప్తమోక్షదాయకపురము లలో నొకటి. ఈపురప్రశంసలు బ్రహ్మపురాణము ౪౩ అధ్యాయమునను, స్కాందపురాణ మహేశ్వరఖండము నందునను, కేదారఖండము ౧౭ అధ్యాయమునను కలదు.

కాళికాచార్యుం డనువాని సోదరిని అవంతీ పురాధినాథుండగు గార్ధబలుఁడను నృపతి యవమానించెననియు, కాళికాచార్యుఁడు పగబూని తంత్రమునడపి శకవంశనృపతిని రప్పించి అవంతీ పురసింహాసనమెక్కించి గార్ధబలుని పదభ్రష్టుని జేసెననియు, కొంతికాలమునకు గార్ధబలుని సుతుఁడు విక్రమాదిత్యుఁడు శకవంశనృపతింజంపి తాను రాజయ్యెననియు చెప్పఁబడినది. కాని ఈ విక్రమాదిత్యుఁడెవ్వరో సరిగా తెలియరాకున్నది. సముద్రగుప్త చక్రవర్తి సుతుండగు రెండవ చంద్రగుప్తుఁడు (ఈతనితల్లి దత్తాదేవి) క్రీ. వె. ౩౭౫ ప్రాంతమున నీరాజ్యాధిపత్యము వహించి, విక్రమాదిత్యుండను నామమువహించిన వాఁడుకలఁడు. అప్పు డేలనో ప్రభుత్వకార్యా

లయములు పాటలీపుత్రమునం దుండినటుల తెలియుచున్నది. ఆతనితండ్రినాఁడే ప్రభుత్వస్థానమయోధ్యకు మార్చబడియుంట నాతఁడయోధ్యయందే వసించువాఁడు. ఈతఁడు శకనృపతిం జంపి అవంతీరాజ్య మాక్రమించినవాఁడని కొందఱు పరిశోధకులు తెల్పుచున్నారు. మఱియు నా శకవంశనృపతి సత్యసింహుని సుతుండగు రుద్రసింహుఁడని తెలిసెడిని. పరిశీలకులింకను దీనిం బరిశీలించదగును. పిదపఁ బ్రభుత్వకార్యాలయములు క్రీ. వె. 3౽గి సంవత్సరమున ఉజ్జయినికి మార్చఁబడినవట.

శంకరభగవత్పాదుల కాలమున నవంతీరాజ్యమును సుధన్వుఁడను నృపతి పరిపాలించుచుండినటులను, బౌద్ధులను మిగుల నొత్తిడిచేసినటులను చెప్పఁబడినది. ఇది క్రీ. వె. ఏడవ శతాబ్దకాలము. క్రీ. వె. ౧౧వ శతాబ్దమున నొకతరి మహమ్మదీయులు దండయాత్ర సల్పగా ధారానగరమందుండిన రాజధానిని మండపపురమునకు మార్చిరని లలితపూరు శాసనమునఁ గలదు. మండపపురమిప్పుడు మాండూ అనుపేరం బరగుచున్నది. ముల్తాన్‌ప్రాంత మల్లదేశమునకును మాళవదేశమని ఒకప్పుడు పేరువాడుకయాయుండెనట. కాని ఈదేశమే వేఱని ఎఱుంగవలయును. ఈసంగతి హర్షచరిత్ర ర అధ్యాయమునను, మహాభారతము సభాపర్వము 3౨ యందునను ప్రశంసగలదు. అవంతి (ఉజ్జయిని) పురముం గూర్చిన ప్రశంస స్కాందపురాణ అవంతీఖండమునఁ గాననగును. (ఉజ్జయిని చూడుఁడు).

## అవంతిపురము (ఉజ్జయిని)

హేమచంద్రుని నిఘంటువునం దీపట్టణమునకు విశాలా, పుష్పకండిని యను పేర్లుపర్యాయ పదములుగ వాడఁబడినవి. మాళవదేశ ముండినకాలమున నిది రాజధానిగనుండెను. ఇప్పుడు సింధియా రాజ్యము నందున్న పురము. సప్త మోక్షదాయకపురములలో నొకటి. కాళీనదీతీరము. దీనిని సిప్రా యనియు, అవంతీనది యనియు కూడ నందురు. సుందోప సుందులు రాజ్యముచేసిన తావిదియె. ఈరు దుర్యోధన పక్షావలంబులై యర్జునునితో బోరి నిహతులైరట. భాస్కరాచార్యుఁడు శ్లో॥ నిరక్షదేశాత్ । క్షితిషోడశాంశే- భవేదవంతీ గణితేనయస్మాత్ - తదంతరం । షోడశసంగుణం స్యాత్ - భూమానమస్మాత్ । బహుకింతదుక్త్యా। అని చెప్పియుంట అవంతిభూమధ్యరేఖనుండి ౨౨౺ అంశలున్నది (అనగా అంశ ౧ కి ౭౦ మైళ్లు). ఆంగ్లజ్యోతిషవేత్తలు ౨3 అంశలనుచున్నారు. అవంతిదేశము (మాళవ చూడుఁడు).

## అవతావగోత్రము — అగస్త్య ఉపగణము చూడుఁడు.

## అవతారము — అవతరించుటయన దిగి వచ్చుటయని యర్థము. క్రీస్తుప్రభువు జహోవా యనంబడు సత్యదేవుని కుమారుఁడుగ నవతరించెనని బెబిలునందు చెప్పఁబడినది. దక్షిణామూర్త్యవతారము, శివాంశమున కల్గిన యవతారమని యనెదరు. విష్ణుదేవునికి ఇరువదియొక్క అవతారములు చెప్పఁబడియున్నవి. ఇవి మతభేదములచే ఒకరికొకరు పాటించుకొనరు.

ఏకవింశత్యవతారములు - ౧. విధాత, ౨. యజ్ఞవరాహావతారము, 3. నారదమహర్షి, ర. నర (నరనారాయణులలో నొకరు), ౫. కపిలుండను సిద్ధుఁడు, ౬. దత్తాత్రేయుఁడు, ౭. యజ్ఞావతారము, ౮. ఉరుక్రమ (ఋషభ) అవతారము, ౯. పృధుచక్రవర్తి, ౧౦. మత్స్యావతారము, ౧౧. కూర్మావతారము, ౧౨. ధన్వంతరి, ౧3. మోహినీదేవి(దారుకావనవిహారసందర్భము) ౧ర. నృసింహావతారము, ౧౫. వామనావ

తారము, ౧౭. భార్గవ (పరశురామ) అవతారము, ౧౮. వ్యాసర్షి ౧౯. శ్రీరామావతారము, ౧౯. బలరామ, ౨౦. శ్రీకృష్ణ, ౨౧. బౌద్ధావ తారము.

చైతన్యమతధర్మమున పంచవింశద్యవతార ములు (౨౫) చెప్పఁబడినవి. వారు కల్క్యవ తారమునుకూడ కలిపియున్నారు. పంచదశావ తారములు- ౧. సనకుడు, ౨. సనందనుఁడు, 3. సనత్కుమారుఁడు, ౪. సనత్సుజాతుఁడు, ౫. సనాతనుఁడు, ౬. నరుఁడు, ౭. నారాయ ణుఁడు, ౮. కపిలుఁడు, ౯. ఋషభుఁడు, ౧౦. విష్ణుదేవుఁడు, ౧౧. హయగ్రీవావతారము, ౧౨. వ్యాసమహర్షి, ౧3. ధన్వంతరి, ౧౪. అనంతుఁడు, ౧౫. శ్రీకృష్ణావతారము. దత్తా త్రేయుఁడే బ్రహ్మ, విష్ణు, రుద్రాంశలు మూడింటి చేతను అత్రిగర్భమున జనించెనని పెక్కండ్ర మతము.

**అవత్సరగోత్రము** — శండిలగణము చూడుఁడు.

**అవధ్యకవచము** — ఇతరులు చంపుటకు అసాధ్యమగు కవచము. ఇది సింహళద్వీప ప్రభు వగు రావణుని సుతుఁడగు అతికాయునకు బ్రహ్మ యొసంగెననియు చెప్పఁబడినది. అతికాయుఁడు చూడుఁడు.

**అవధానము** — అవపూర్వకధాఞ్ ధాతువునుండి జనించిన ఈ అవధాన శబ్దమునకు జ్ఞాపకశక్తిచే మనస్సునందు ధరించి నిలుపుటయని యర్థము. అవధానమన జ్ఞప్తియందు నిలపి యుంచుట (మరువకయుండుట) యనిభావము. తొలుత నీజ్ఞాపకశ. వేదపాఠకుల నేర్పుగ నుండెడిది. దానినుండియే వేదపాఠకులకు "అవ ధానులు" అని బిరుదనామము వాడుక గల్గెను. అనగా వేదబుక్కులు, పన్నములు, పనసలు, మొదలగునవి జ్ఞాపక శక్తిచే మనస్సు నందు ధరించుటయని యర్థముగాని, వేఱుకాదు. కంఠతఃవల్లెవేయుట యని భావము. దీనిని తరు వాత కాలమున కవిత్వరచనయం దారితేరిన విద్వ త్కవులు అవధానశక్తిని అలవడజేసికొనసాగిరి. తొలుదొలుత అష్టావధానములు ప్రారంభమై (అష్టావధానములు చూడుఁడు) రాను రాను శతఘంటావధానమువరకు వృద్ధియాయెను. అక్కా లమున తాటియాకులపై ఘంటములతో వ్రాయు చుంట ఘంట కవిత్వమనియు అనగా నూరు ఘంటములతో వ్రాయుచుండిన నూర్గురు లేఖకు లకు ఒక్కొక చరణముచొప్పున కోరిన సంగతులు పద్యములు రచించుటయును, ఇందు తాఁజెప్పిన చరణములను మరచిపోక జ్ఞాపకమున ధరించియుంటయు అవధానమగును. దీనికి శతఘం టావధానమని పేరు. చిత్రభారతమున "శతలేఖ న్యవధానపద్యరచనా" అని మొదట సంబోధించి యున్నారు. నేత్రావధానమును ఇట్టిదియె యని యెరుంగునది. అవధానములు పెక్కులుకలవు. కవిత్వమున- అష్టావధానములు ౧. కవిత్వరచన, ౨. చతురంగమాడుట, 3. వ్రాయుట, ౪. చదు వుట, ౫. గణితమొనర్చుట, ౬. సంగీతము, ౭. యుక్తిచెప్పుట, ౮. వ్యస్తాక్షరి. శైవమత ధర్మమున దశావధానములు- ౧. దృష్టి, ౨. దృక్పూజ, 3. త్వగ్వ్యాప్తి, ౪. స్తుతి, ౫. మనోవ్యాప్తి, ౬. సానురాగమనోఽర్చన, ౭. గణప్రణామము, ౮. గణస్తుతి, ౯. గణలీలా నందనిమగ్నత, ౧౦. లింగనిమగ్నత.

**అవని** — మైసూరురాజ్యములోని కోలారు జిల్లా ముల్బగాల్ తాలూకా అవనిగ్రామమును అచటివారు అవంతీక్షేత మనియెదరు. ఈగ్రామ మునఁగల శివాలయమునందలి రామలింగేశ్వర శివలింగము శ్రీరామప్రతిష్ఠితమనియు, ఈపరిసర ములనేయున్న ఒకపర్వతముపై వాల్మీకాశ్రమ

ముండిన తావుయుఁ జెప్పెదరు. గ్రామమున పెక్కు దేవళములు కలవు. రామ, లక్ష్మణ భరత, శత్రుఘ్నుల దేవాలయము లున్నవి. శ్రీరాముడు లంకనుండి మరలునపుడు రామలింగేశ్వర శివలింగము ప్రతిష్ఠించెననియు, పిదప సీతాదేవిని శ్రీరాముడు వదలివేసినతరి నామె గర్భవతియయ్యు నిట వాల్మీకాశ్రమమున కేతెంచెననియు, అటనే కుశలవులు జనించిరనియు ఘంటాపథముగ పల్కుచుందురు.

**అవమచంద్రషష్ఠి** — భా॥ బహుళ షష్ఠి చంద్రునిఁ బూజించు పర్వదినము. (పండుగలు, షులు, వ్రతదినములు చూడుడు. కపిలాషష్ఠి చూడుడు).

**అవమచతుర్దశి** — ఆశ్వీజ శుద్ధ చతుర్దశి (పండుగలు చూడుడు).

**అవయవ ప్రసిద్ధే సముదాయ ప్రసిద్ధిర్బలీయసీతిన్యాయము** - అవయవమునుండి సముదాయమునకు ప్రసిద్ధమగునామము (వాడుకనామము) కల్గును. అనఁగా బలమగు వానినుండి వాటిసముదాయము పేరందునని భావము.

**అవయవార్థవత్త్వాత్సముదాయార్థవత్త్వమితిన్యాయము** — వాక్యములోని భాగములకు అర్థమున్ననే వాక్యమంతటికి నర్థము కుదురునని భావము.

**అవయవే కృతంలింగం సముదాయస్య విశేషకంభవతి** — ప్రత్యేకముగా నవయవమునకుఁ జెప్పఁబడిన లక్షణవిశేషము సముదాయమునకంతకు విశేషనామము తెచ్చును. ఆవునకు కొమ్ములులేకుండెనేని ఒక్కకొమ్ములందుగల లక్షణవిశేషము ఆవుకంతకు బోడియావని పేరుగల్గించును.

**అవరోధకృత్ గోత్రము** — గవిష్ఠర గణము చూడుడు.

**అవరోహణవక్రరాగములు**— వక్ర రాగములు చూడుడు.

**అవస్థలు** - జీవితమున నవస్థలు మూడు:- ౧. వస్థ (దీనినే మెలకువ యందురు). ఈ అవస్థయం దహంకారము తీవ్రమై వ్యాపకము గల్గియుండెడిని. అనగా అహంకార మింద్రియములపై బాగుగ వ్యాపించి (కూడి) వ్యాపారము లొనర్చుచుండెడిని. ౨. సుషుప్త్యవస్థ (దీనిని నిద్రయందురు). ఈ యవస్థ యందు శరీరము అలసి శీతలసనమై అడగియుండెడిని. అనగా అహంకారము తగ్గిపోయి యుండెడిని. 3. స్వప్నావస్థ (స్వప్నమన నిద్రయందు కలలువచ్చుట యని భావము). ఇందు జాగ్రత కలవాటుపడి బలకరమై యుండు మనోవ్యాపకము తీవ్రమై యుండును. కలలు భోజనాధిక్యత, వైత్యాధిక్యము, జీర్ణలోపములవలన గల్గెడిని. స్వప్నములు చూడుడు)

దశమన్మథావస్థలు — ౧. కనులఁ జూచుట. ౨. మనస్సంగమము (మనసుతగులుట). 3. సంకల్పము (కోర్కెగల్గుట). ౪. జాగరము (నిదుర పట్టకుండుట). ౫. కార్శ్యము (కృశించుట). ౬. అరతి (ఇతరవాంఛలు లేకుండుట). ౭. అలజ్జ ౮. ఉన్మాదము. ౯. మూర్ఛ. ౧౦. మరణోద్యమము. కొందరింకను వీటికి జ్వరము, సంతాపము గూడ జేర్చి ద్వాదశావస్థ లనియున్నారు.

**అవస్థాపూజ్యతే రామ నశరీరం కదాచన** — శ్రీరామునకు భరద్వాజర్షి యొనర్చిన, లంకకేగునప్పటి మొదటివిందునందు దుంపలు మొదలగునవియు, లంకనుండి తిరుగ నేతెంచి యయోధ్య కేగుతరి గొప్ప భక్ష్యభోజ్య చోష్యపానీయములతో మహావైభవోపేతమగు

ంమును, ఒకర్ప్ శ్రీరాముఁడు "స్వామీ! ఇట్లేల యొనర్పవలసె"నని యడిగెనట. అందుకా మహర్షి "అవస్థాపూజ్యతే రామ నశరీరం కదాచన" (ఓ శ్రీరామమహారాజా! అవస్థ పూజింపఁబడును గాని శరీరము కాదు) అని ప్రత్యుత్తర మిచ్చెనట,

శరీరముంగూర్చి, ఎవ్వరు గారవింపరనియు, ఆ శరీరము నాశ్రయించిన యవస్థంబట్టి శరీరము గౌరవముఁనుగాని, లాఘిం గాని పొందుచుండున నియు వాడుకొనుచుందురు.

**అవ్వ పేరే ముసలమ్మ** — ఆంధ్ర లోకోక్తి.

**అవాంతరవాక్యములు**—వాక్యములు చూడుఁడు.

**అవ్యాప్తిదోషములు** — లక్షణ త్రివిధము చూడుఁడు.

**అవ్వాకావలయును బువ్వాకావల యును** — ఆంధ్రలోకోక్తి.

**అవ్వాకులు చెవ్వాకులు** – ఆంధ్ర భాషా సాంప్రదాయార్థ పదము. అనరాని వాక్కులు, వినరాని వాక్కులు అగుమాటలను ఇట్లనుచున్నారు. అవాక్కనిభావము. తక్కినది ఊతపదమై యుండనోపు.

**అవికారవాద్విశైవము**—ఇది చతుర్దశ శైవ భేదమతములలో నొకటి (చూడుఁడు). ఈ మతమునందు త్రిపదార్థములు, మలత్రయము, శివసమవాది శైవమునందువలెనే చెప్పఁబడినవి. దీనిని కపాలశైవమనియు నందురు. పతి వికా రములేనివాఁడనియు, నిత్యుఁడనియు, ఈశ్వరుఁ డనియు, అనన్యుఁడనియు, పశువు అజ్ఞానమగు చీకటిలోఁబడి అనేక ఆత్మలుగ ప్రాణులనఁబడు చుండుననియు, పతి, పశు, పాశములు (త్రిపదా ర్థములు) మూడును అనాదిగనున్న వియేయనియు, ఇది స్వరూపలక్షణమనియు నందురు. ఇంక పతి శీతోష్ణజలములవలె ఐక్యమగుననియు, పశువున కధికారజ్ఞానము, తెల్విగల్గింప సర్వము నెరుంగుననియు, పాశము మరుగుపడి శివస్వరూ పము గల్గుననియు, ఇది తటస్థలక్షణమనియు నందురు. మరియుఁ గర్తృత్వమే సంహారము. వీనిం దొలగించి శివధ్యానపరాయణులై, నర కపాలము (మనుష్యుని పుణికె) న భిక్షుయొనర్చి భుజింపవలెననియు, ఇది వేషలక్షణమనియు నందురు, గాన వీరికి కపాలమతస్థులని పేరయ్యెను

**అవిగోత్రము** — జమదగ్నివత్స ఉప గణము చూడుఁడు.

**అవిచారపురీమధ్యేయః పలాయతి జీవతి** — ఇది సంస్కృత భాషయందలి లోకోక్తి. యుక్తము, అయుక్తము నను వివేకము నందుండరాదనియు, దానిని వీడిపోయిన వాఁడు సుఖపడుననియు భావము.

**అవిద్యలు ౨** — ౧ మూలావిద్య, తూలావిద్య. మూలావిద్య- ఈశ్వరుని యందుఁగల్గిన యజ్ఞానము. తూలావిద్య- జీవుని యందుఁగల్గిన యజ్ఞానము.

**అవిముక్తక్షేత్రము** కాశీక్షేత్రమును అవిముక్తవారణాశీక్షేత్ర మనియెదరు. సనత్కు మారసంహిత ౪౧ అధ్యాయమునను, మత్స్య పురాణ ౧౮౨-౧౮౪ అధ్యాయములను దీని ప్రశంసకలదు. కాశీలోని విశ్వనాథుని దేవాల యములోనే గర్భాలయమునకెదుట అవిముక్త లింగము కలదు.

**అవిరవికన్యాయము** — అవి, అవిక అను పదములు రెంటికి గొఱ్ఱె యని యర్థమే యైనను, అవిక (గొఱ్ఱెమాంసము) శబ్దమునుండి

అవిశబ్దము ఏర్పాటయ్యెను. ఇట్టిసందర్భముల నీన్యాయము వాడుదురు.

## అవివేకితో స్నేహముకన్న వివేకితో వైరము మేలు — ఆంధ్రలోకోక్తి.

**అవిశెచెట్టు**—లా. Agati grandifera లేక Linum usitatissimum. ఆంగ్. Linseed Tree. సం. అతసీ, ఉమ, అగస్త్య, రుద్రపత్నీ: దీనిని అవిశెచెట్టనియు, అగిసిచెట్టనియు, అగస్తిచెట్టనియు నందురు. మ్రానుపట్ట చూర్ణము బలకరము. ఆకురసము-కఫము, క్రిమిరోగము, పైత్యము, జ్వరము, రక్తపైత్యము నడంచును. విరేచనము జేయును. సర్పవిషము, పురికొసవిషముల నడంచును. అగ్నిమాంద్యము, అరుచిం బోగొట్టును. గవదబిళ్లలు హరించును. గాయములమాన్పును దురదలను శమింపజేయును. జ్వరముల ఉద్రేకమును తగ్గించును. కాయలు లేక ఆకులు-కూరగజేసి పుచ్చుకొనిన విరేచనముజేసి సర్పి, శూలలు, కఫవాతములు, గుల్మము, ప్లీహ, పాండువు, హృద్రోగములు, విషములు, హరించును. గింజలు-వేడిచేసి ఆర్చును. వాతము హరించును. వ్రణములమాన్పును. కఫము, పైత్యము, అగ్నిమాంద్యము, కాక, కండ్లయందలి పొండిమరోగము నడంచును. గురుత్వముగ నుండును. వాపులనడంచును. గింజలనూనెయుం దీగుణములే కలవు. గింజల కషాయము నీళ్ళవిరేచనములం గట్టును. రక్తగ్రహణి, సెగరోగములు, మూత్రనిరోధము, ఋతుబద్ధముల నడంచును. అవిశెపువ్వులు-వాతము, పైత్యము, దగ్గు, రేజీకటి, నీరసముల నడంచును. పువ్వుల నెండించి చూర్ణముజేసి లోనికింబీల్చిన జ్వరములంగట్టును. పువ్వులరసము కండ్ల మసకలు, మందదృష్టి వీనిని హరించును.

**అవిశెనార పరిశ్రమము** — "క్రిమికోమాణిచత్వారో వస్త్రయోనయః" అని చిరకాలముక్రిందట మనపూర్వులు చెప్పినట్లు నేడును, తోళ్ళు, పండు, పురుగు, వెంట్రుక అను నీ నాలుగింటివలన వస్త్రములు నేయబడుచున్నవి. అందు ఫలమునుండి ప్రత్తి మొదలగు వస్తువులవలన గలుగు నూలుపోచలతో నేయబడు వస్త్రములకన్నం బురుగులవలనం బుట్టు పట్టు, ఆ తిప్పోగులతో నేయబడు బట్టలు తరచుగా ప్రతిదినపు వాడుకకుపయోగింపబడవు. మేకలు, గొఱ్ఱెలు మొదలగు జంతువుల రోమముతోం బేనబడు దారములతో నేయబడు ఉన్ని వస్త్రములు మనదేశపు శీతోష్ణస్థితికి వేసవికాలములో ననుకూలింపవు. ఇంక త్వక్కుతో నేయబడునవి అనగా చెట్లతొక్కను చితుకగొట్టి ఆపోగులను దారముగాపేని నేయబడు వస్త్రములు మనమంతగా నుపయోగించుటయే లేదని చెప్పవచ్చును. అప్పుడప్పుడు నరుదుగా నుపయోగింపబడునవియైనను నారపంచెలు, రవికలగుడ్డలు, డైమన్ సిల్కుబట్టలుమాత్రమే కనిపించుచున్నవి. ఇదివఱలో నీనారబట్టలు ముతకగా నేయబడుచుండెడివిగాని నేటివల విదేశీయుల చేతను, కొన్ని స్వదేశీమిల్లులలోను అతి సున్నితముగా నేయబడి పట్టుబట్టలను మరపించుచున్నవి. ఇట్టిరకములలో జపానుదేశపు సరకు కడుసున్నితమయినది. అట్టి బట్టలను మనదేశమునందు తయారుచేయించవలెనన్న అందు కుపయోగించు నార మనదేశమునందు లభించునా, ఒకవేళ లభించినను ఆనార నంత నాజూకుగా తయారుచేయు సాధనసంపత్తియు పనివాండ్రును మనదేశమునందు కలరా యని యనుమానింపవలసియున్నది.

మనదేశమునకును తక్కిన మరికొన్ని దేశములకును గావలసినన్ని వస్త్రములను నేసియిచ్చు

టకుఁ దగినంత నూలును, పట్టును, ఉన్నియును మనదేశమున లభించుచున్నవి. కాని పైనివివరించిన సన్నవిడినార బట్టలను నేయఁదగిన నార మాత్ర మింకను లభింపలేదని ప్రత్యేకపరిశోధకులు చెప్పుచున్నారు.

పూర్వకాలమున మనఋషులు కేవలము వల్కలములను, నారచీరలనే యుపయోగించుట వానియం దెన్నియో సుగుణము లుండఁబట్టియే యని మన మూహింపవచ్చును. మఱియు నీజిప్టు దేశస్థులు నారబట్టల యుపయోగమును మన పూర్వులవలననే గ్రహించి వారిదేశమున సమృద్ధిగా వాడుకొనుచున్నారు.

తెల్లని నారబట్ట పవిత్రమైనదనియు, శరీరమునకు సుఖావహమగునదియు గనుకనే సకల దేశములందును జనులకు దానిపై వ్యామోహము గలుగ సాగినది. బట్టలనేత కుపయోగించు నారలలో ప్రధానమైనది అవిసెనార. ఈనార యూరపు ఖండము నందును, అమెరికా యందును విశేషముగా లభించుచున్నది. దీని కాంగ్లేయ భాషలో ఫ్లాక్సు (Flax) నియు, దీని గింజలకు లిన్‌సీడ్సని (Lin-Seeds)యు నందురు.

వడికి, నేతకుపయోగించునటు సిద్ధపరచిన వెనుక ఈ నారకు లినెన్ (Linen) అని పేరు. తెనుఁగున ఈ చెట్టునకు అవిసె లేక అగిసె అందురు. ఈచెట్టు విత్తులవలన దీయఁబడు నూనె మన దేశమునందుగూడ సుప్రసిద్ధమయి యున్నది. గంగాతీరమున నీగింజలనుండి నూనె తీయుటకే యీ చెట్లను బెంచుదురు. నూనెకొఱకు గింజల నాసించిన యెడలఁ జెట్లకు నారరాదు. నారకాసించిన యెడల నూనెకు గింజలు పనికిరావు. నారయు, నూనెకు గింజలును గూడ లభించున ట్లమెరికా ఖండమువారు క్రొత్తగా నేదో మార్గము కనిపెట్టిరట. ఈ యవిసె గింజలు పిండిచేసి, యుడికించి వ్రణములకుఁ గట్టిన, అది శులభముగా పగులును. శీతజ్వరములకు, దీని కషాయము మంచిది. అవిసె నూనె రంగులు వేయుట యందుపయోగింపఁబడును. నూనె యాడిన వెనుక మిగిలిన పిండి పశువుల మేతకుఁ బనికివచ్చును. గింజలవలన నిట్టి యుపయోగము లన్నియు నటుండ, చెట్టు నారవలన నుపయోగము మరియు నధికముగా నున్నది.

నారకొఱకవిసె విత్తులను చైత్ర వైశాఖ మాసములలో జల్లవలయును. ఆ మొక్కలు భాద్రపద మాసాంతమునకు నారకుపయోగించు రీతిని పెరుగును. ఈ యవిసె చేలు వర్షాకాలారంభమున చిన్నచిన్న నీలిరంగు పువ్వులతో కన్నులవిందు చేయుచుండును. భాద్రపద మాసాంతమునకుఁ గాయలుకాచి, మొక్కలు ముదిరి 20, 30 అంగుళముల పొడుగున బెరిగి యుండును. మొక్కలు పైరగు చున్నపుడు వాని కాడలు పసుపురంగు దాల్చుట కారంభించగనే పెరికివేయ వలయును. అప్పటికి గింజలుకూడ ఆకుపచ్చరంగునువిడచి, గౌరవర్ణమును దాల్చుట కారంభించును. పెరికిన మొక్కలను, దువ్వెనలవంటి పండ్లుగల యినుప పన్నెలతోఁ జిక్కుదీసినట్లుదువ్వి కాయలన్నిటిని రాల్చివేసి, కాడల మొదళ్లన్నియు నొకవైపునఁ జేర్చి కట్టలుగట్టవలయును. కట్టలనన్నిటిని జేర్చి నాలుగడుగులు లోఁతుగల నీటిలో నడుగున గడ్డి గాదరలను బరచి దానిమీద నిలువుగానిలిపి పయినిగొంచెము బరువెత్తి పది పదునాల్గు దినము లూరవేయవలయును. వానకారున నీటి యందుఁగల వెచ్చఁదనముచేత కాడలు చక్కగా నూరి నారకును, కాడలోని కఱ్ఱకును గల పట్టు వదలిపోవును. పిమ్మట కాడల కట్టలనువిప్పి,

తడిమూరిపోవున ట్లూరఁబెట్టి, నారదీయవచ్చును. ఈనారను జనుపనారః ఫ్లేక్సుగడ్డిః ఆగఁబెట్టిన నది మంచి తెల్లఁదనముగలిగి, తళతళ లాడుచుండును. ఒకయెకరము విస్తీర్ణముగల పొలమునందు పైరుపెట్టిన, మొక్కలవలన ౧౬౦ వీసెల నారవచ్చును. వీసెడునార మూడు రూపాయిలు వెలగలిగియుండును. మనదేశము నం దీవ్యవసాయము పూర్తిగాఁ జేయుటలేదు. కాఁబట్టి విశేషలాభకరమగు దీనిని జనులవలం బించి నార తయారుచేయించి యమ్ముకొనిన యమ్ముకొనవచ్చును. లేదా బట్టలు నేయించిన నేయింప

అవిసెపైరుచేయువిధానము :— కాయధాన్యములు బాగుగా ఫలించు భూములీ పైరున కుపయుక్తములు. చెఱకు నీలిమొదలగునవి పెరుగు భూములును ఇందునకనుకూలములు. య ౧ కి రెండుమణుగుల విత్తులు జలవలయును. విత్తనము లధికముగా వేయుటవలన మొక్కలు దట్టముగ పుట్టి, పెరుకువ ౫ కంటె నధికముగా నుండక పోయినచో శ్రేష్ఠమైన నార వీనినుండి లభించును. పూర్తిగాఁ బెరిగిన చెట్ల నార బిరుసుగానుండుటచే ధర తగ్గిపోవును. నారకొఱకు పెంచుపద్ధతి యిట్లేయైయున్నది. పూర్తిగాఁ బెరిగిన చెట్ల కాయల గింజలనుండి నూనె తీయఁబడును. ఇది తక్కువముదుపుతో పైరగు పంట. ఒకప్పుడు వానలు ఎద్దడియైనను మంచువలన ఫలించును. చలికాలపుపంట ఆరు మాసములు చాలును. పైరుపెట్టిన నూరు దినములకే నారదీయుటకు సిద్ధమగును. నూనె విత్తునుండివచ్చు పొట్టు య ౧ కి ఆరు మణుగుల చొప్పున లభించును. ఇది పశువుల కాహారపదార్థము. నూనెదీసిన పిండి (అవిసెపిండి) భూమి సత్తువచేయుట కెరువుగను, పశువుల కాహారముగను గూడ నుపయోగించును. భరతదేశమునందు నదీజలము ఉష్ణము సాధారణముగ 60° F అయియుండును గాన అన్ని ఋతువుల యందును అవిసెపైరుచేయుట కవకాశముకలదు.

**అవిశ్రేణ్యగోత్రము** భార్గవ గణము చూడుఁడు.

**అవిష్ఠాయన గోత్రము** — పరా గోత్రము చూడుఁడు.

**అవిష్ఠి గోత్రము** — లౌగాక్షిగణము చూడుఁడు.

**అవిక్షితి గోత్రము** — వశిష్ఠగణము చూడుఁడు.

**అవీక్షిత్తు** — కరంధముని కుమారుఁడు. ఈతని జన్మకాల లగ్నమునకు దుష్టగ్రహవీక్షణము లేనందున నీతని కవిక్షిత్తని పేరుకల్గెనట. ఈతని కుమారుఁడు మరుత్తు. అతఁడు చక్రవర్తియాయెను. (అగ్నివర్ణుఁడు చూడుఁడు.)

**అవ్వడూరి కిచ్చయ్యకవి** — ఆంధ్ర కవులలో నాథునికులందుఁ బరిగణింపఁబడిన వాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. హారితస గోత్రము. తండ్రిపేరు గురవయ్య. విద్యాగురువు పేరు చెన్నకృష్ణశాస్త్రి. రచించినది, కాళిదాస కృతమైన రఘువంశ కావ్యమును పద్యకావ్యముగా రచించెను.

**అవెస్తా లేక జెండవెస్తా గ్రంథము** — ఇది జరథుస్త్ర జగద్గురుబోధిత, అహురభక్తి (అగ్నిపూజ) మతస్థుల పవిత్రమత గ్రంథము. జెండుభాష, అవెస్తాపదము, వేద పదమునుండి కల్గినదట. మతవిజ్ఞానగ్రంథమని భావము. ఇందుమూలము వ్యాఖ్య కూడ కలసి యున్నవి. ఇందు ఇరువదిలక్షల శ్లోకరూపకములగు ఉక్తులు కలవు. తొల్లింట పండ్రెండు వేల చర్మములపై వ్రాయఁబడి యుండెనట.

ఇరువదియొక్క భాగములుగనుండి కొంత నాశనమైపోయెనట. ఇరువదియవ అధ్యాయము (భాగము) చెడలేదు. దానిని జరథుస్త్రజగద్గురుడు ఉద్ధరించెనట. అందు వెండిడాడ్ అనునది ౨౨ అధ్యాయములు గను, యాజ్నా యనంబడు భాగము ౭౨ అధ్యాయములుగను, విస్పరాద్ అనంబడునది ౨౩ అధ్యాయములుగను, యాష్ట్సు అనంబడునవి ౨౮ ను, మరికొన్ని ఇతరములును కలసి అవెస్తా యనంబడుచున్నవి. ఇందు కొన్ని జరథుస్త్రగురుని రచితములు.

ఇదిపారసీకుల వేదగ్రంథము. జండు వారి పూర్వపుభాష. ఇది వారికి పవిత్రమైనది. పారశీకుల పూర్వులు భరతదేశపు ఆర్యులవలెనే మేరుపర్వత (హర్బ రేజా) ప్రాంతసీమల వసించుచుండినవారు. దేవాసుర యుద్ధములనాఁడు రాక్షసపక్షావలంబులై, దేవతలు జయించినకతన భరతదేశమును వీడి, గాంధారాపగాదిదేశములం గడచి యవ్వలి పర్శిపోలిస్‌నకుం జేరి యటనుండి పారశీకు లనంబడిరి. నేటికిని ఆర్యులమనియే చెప్పుకొనుచుందురు. పిదప కొంతకాలమునకు మహమ్మదీయాక్రాంతమైనను, నేటికిని పదివేల మంది యాదేశమునందు పూర్వపుమతస్థులున్నారు. పెక్కండ్రు తిరుగ భరతదేశమునకుం జేరి, బొంబాయిప్రాంతముల వసించుచు పారసీకులనంబడుచున్నారు. వారీ అవెస్తావేదమునే పాటించుచున్నారు.

ఆదికాలమునం దవెస్తాయం దిరువదియొక మండలములు, ౧౨౦౦ సూక్తములు, ౨౦౦౦౦౦౦ (ఇరువదిలక్షల) బుక్కులు ఉండెడివందురు. వారి పార్సీపోలీసునం దీగ్రంథము ౧౨౦౦౦ తోళ్ళపై వ్రాయంబడినదందురు. దీనికి జరదుస్త్ర జగద్గురుఁడు కర్తయని కొందరనెదరు గాని, కొందరామహాత్ముఁడు అవెస్తాయందలి భగ్నభాగములం గొన్నిటిని పూరించినవాఁడందురు. జరథుస్త్ర శిష్యుండగు విష్టాస్ఫుండను నృపతి (షాఇన్షా) అర్వారీతిం భద్రపరచెం గాని క్రీ. పూ. ౩౩౦ లో సంభవించిన యాపద (అనగా ఇస్కందరు లేక సికందరు) దాడి (అలెగ్జాండరు ది గ్రేటు యుద్ధయాత్ర చూడుఁడు). నగరముం గాల్చుతరి, అవెస్తాగ్రంథమును చాలా భాగము కాలిపోయెనట. నేటికిని పారశీకులాతని నామమును శపించుచునే యుందురు. తర్వాత పారశీకులగు రాజులు తమ రాజ్యమునందలి మతగురువులను, పండితులను అవెస్తా (వేద) వేత్తను రావించుచు జ్ఞాపకమున్నంతవరకు అవెస్తాభాగములను వ్రాయించి చేర్చిరని చెప్పంబడినది.

పిదప నరబ్బీల మహమ్మదీయ మతోద్ధృతము పారశీదేశమును ఇస్లాంమతము పాల్జేసెనట. ఇది క్రీ. వె. ౬౪౧ ప్రాంతమని లెక్కించుచున్నారు. అప్పుడే మాజ్దాయాస్నా లేక అహురమతము వీడనొల్లనివారు, దేశమును వీడి భరతదేశమునందు చేరి, ఇప్పటి పారశీకులై యున్నారు.

ఇప్పటి జెండవెస్తా రెండు భాగములుగనున్నది. అందు మొదటిభాగము తిరుగా, ౧. వెందీదాద్ అనియు, ౨. వీస్పెరెద్ అనియు, ౩. యాస్న అనియు మూడు భాగములై యున్నది.

వెందీదాదునందు పురాణగాథలుగ, మతనియమధర్మములు వివరింపఁబడినవి. విస్పెరెమునందు మంత్రములును, యాస్నయందు కథలును కలవు. ఈకథలు ప్రార్థనలను వివరించునవి. ఇప్పటి జెండవెస్తాయొక్క రెండవభాగమునకు ఖోర్ద అవెస్తా యనెదరు. దీనికిఁ జిన్న వేదమని యర్థమట. ఇందు పఠనీయమంత్రము లుండునట. ఇవి నిత్యపఠనీయములుగను, నైమిత్తిక పఠనీయ

ములుగను (అనగా నెల నెలకు, సంవత్సరమున కొక సారిగను) పఠనీయములట. ఇవి మైను ప్రార్థనలు గల్గిన గాహామంత్ర మొకటిగను, ముప్పది మంత్రములుగల సిరోజా భాగముగను, మూడు సూక్తములుగల ఆఫ్రీన్గాన్ గను, ఆరు పనసలుగల న్యాయిషీగను, నాల్గు భాగములై యున్నది.

పారసీ లగ్నిపూజ లొనర్పువారు. వారి దేవ స్థానములం దగ్నినారనీయరు. జెండుభాష తొల్లింటి హిందువుల వేదమునందలి సంస్కృ మునకు దగ్గిరగా నుండును.

**అశక్తాస్తత్పదంగన్తుం తతోనిన్దాం ప్రకుర్వతే** — ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. అచటికేగ లేకపోయినవాఁడు దానిని నిందించునని భావము.

**అశక్తోఽహం గృహారంభే శక్తోఽహం గృహభంజనేతి న్యాయము** — ఇల్లు కట్టుట కష్టముగాని, కట్టిన ఇంటిం గూల్చుట సుకరమనుటయం దీన్యాయమును వాడుచున్నారు.

**అశక్నినది** — దీనికి చంద్రభాగయనియుం పేరుకలదు. ఇప్పుడు చీనాబ్ అనుచున్నారు. పాంచాలములోని ఐదు నదులలో నొకటి. (ఆరాష్ట్రదేశము చూడుఁడు).

**అశనాదేవి** — బలిచక్రవర్తి భార్య. కుమారుఁడు బాణాసురభూపతి.

**అశ్మకుఁడు** — ఇతని తండ్రి కల్మాష పాదుఁడు. కుమారుని పేరు మూలకుఁడు. మూల కునకు నారీకవచుఁడను పేరుండెను. అశ్మకుని తల్లి ప్రసవవేదనకాలమున వసిష్ఠుఁడు రాతితో గర్భముంగీచి, శిశువును బయటకుం దీయుటంజేసి యశ్మకుఁడని పేరయ్యెనని చెప్పఁబడినది. ఒక తరి విదేహదేశమేలుచుండిన జనకమహారాజునకు బంధువియోగదుఃఖము సంభవించి విరక్తుఁడై, సర్వమును త్యజింప సంసిద్ధుఁడై యుండుతరి యశ్మకుఁడు బాంధవ్యనిజతత్వమును, సంసారతత్వము నెఱింగించి, విరక్తిమూన్పి, రాజ్య బాధ్యత, కుటుంబబాధ్యతలం బోధించి ప్రశాంతవృత్తి మరల్చెనని చెప్పఁబడినది.

**అశ్మక్రవ గోత్రము** — జమదగ్నివత్సు ఉపగణము చూడుఁడు.

**అశ్మన్వతీ నది** — ఆక్సను (చక్షు బక్షు) నది కీపేరు తొల్లింటి నామము. ఈపేరు ఋగ్వేదము ౧౦-౫౩-లోయందు వివరింపఁబడినది.

**అశ్మరథ్య గణము** — ఇది విశ్వామిత్ర మహర్షి సంతతి అశ్మరథ్య గణము. ఇందు గోత్రములు తొమ్మిదికలవు- ౧. అశ్మరథ, ౨. కామలాయన, ౩. కామకాయని, ౪. కౌశిక, ౫. ఘోటముఖ, ౬. పాపాయని, ౭. నేత, ౮. మాథూల, ౯. లాజులి. ఈ అశ్మరథ్యగణము నందలి తొమ్మిదిగోత్రములకుం బ్రవర, విశ్వామిత్ర, అశ్మరథ్య, వాథూల.

**అశ్మరథ్య గోత్రము** — అశ్మరథ్య గణము చూడుఁడు.

**అశ్మరథ్య గోత్రము** — కుండినగణము చూడుఁడు.

**అశ్మరి (రోగము)** — మూత్రకృచ్ఛ్రము చూడుఁడు.

**అశ్మలోష్ట న్యాయము** — దూదికన్న మట్టిబెడ్డ (ఇటుక) గట్టిదైన నగుంగాని, రాతితో పోల్చిన గట్టిదికాదని భావము. తనకన్న తక్కువ వారిపై తా నధికారియైనను, తనపైవారికన్న తాను తక్కువయే యనుట కీన్యాయమును వాడుదురు. పాషాణేష్టకా న్యాయమును ఇట్టిదే!

**అశ్రద్ధ పితరుల కేతాము తర్ప ణము** — పేతము = నీళ్లు నూతినుండి తోడు యంత్ర పరికరము. ఆంధ్ర లోకోక్తి.

**అశ్వకచ్ఛ దేశము** కచ్ఛదేశము చూడుడు.

**అశ్వక్రాంత పర్వతము**— కామరూప దేశమున (ఇప్పటి ఆసాములోని గౌహతి నగరముకడ) అశ్వక్రాంత పర్వతముండుట యోగినీ తంత్రమున, ఉత్తరఖండము మూడవ అధ్యాయమున జెప్పంబడినది. (కామరూప దేశము చూడుడు).

**అశ్వగంధి** — పెన్నేరు (గడ్డ) చెట్టు చూడుడు.

**అశ్వతరీగర్భన్యాయము** — కంచర గాడిద ఈనగానే చచ్చునని భావము. ఇట్టిదియే అళీవళీకర్కట వేణురంభా (చూడుడు).

**అశ్వతాపనగోత్రము**—కుశికగణము చూడుడు.

**అశ్వతీర్థము** — తొల్లింటి కన్యాకుబ్జ దేశమున గంగానదిలో కాళీనదీ సంగమము కడ నున్న స్నానతీర్థము. ఋచికునకు సత్యవతినిచ్చు తరుణమున నొసంగ గాధిమహారాజు కోర్కె మేరకు వేయి అశ్వముల నుత్పత్తి యొనర్చిన తావు గాన అశ్వోత్పత్తి తీర్థమని, తొలుత పేరు గల్గి, పిదప నశ్వతీర్థమని పేరయ్యెనట. మహాభారతము అనుశాసన పర్వము నాల్గవ అధ్యాయమున గంగానది కాళీనది సంగమించు తావని చెప్పఁబడినది. మరియు వామన పురాణము ౮౩ అధ్యాయమునందునను కలదు. కనూజమండలములోనిది.

**అశ్వత్థ గోత్రము** — కుండిన గణము చూడుడు.

**అశ్వత్థనారాయణ క్షేత్రము**(పెన్నేరు)- మెడ్రాసు సదరన్ మహారాటా రెయిల్వే పెద్దలైను (బ్రాంజెలైను) పైనున్న తాడిపత్రినుండి ఎన్మిది మైళ్ల దూరమునను, గుత్తికి ఇరువది రెండుమైళ్ల దూరమునను ఉన్న జూతూరుస్టేషనుకు దక్షిణముగా రెండుమైళ్ల దూరమునగల పెన్నేరను గ్రామమున గల దేవస్థానము. పెన్నేరను పేరుగల నదీతీరమునం దేర్పడిన యీగ్రామమునకును అదేపేరు గల్గియుండనోపు. ఈదేవస్థానము నవీనమని తెలియుచున్నది. శింగంభట్టను ఒక మహారాష్ట్ర బ్రాహ్మణుడట గొప్ప తపంబొనర్చెనట. గోదావరీమండలములోని ద్రాక్షారామమున సరస్తీరమున నొక రావిచెట్టుక్రింద నొక అశ్వత్థనారాయణక్షేత్రము కలదు. బహుశః ఇదియు నవీనమే నని యనుచున్నారు.

**అశ్వత్థామ** —బ్రాహ్మణుడు. ద్రోణాచార్యునిసుతుడు. విలువిద్యా పారంగతుడు. చిరంజీవి. భారతయుద్ధమున కడపటిరాత్రి పాండవుల శిబిరముజొచ్చి నిద్రించుచున్నవారిని హత్యయొనర్చెను. అత్తరి ద్రౌపదీపుత్రులగు ఉపపాండవు లేవురుగూడ మడసిరి. అందుకై యర్జునునిచే నవమానింపఁబడినవాఁడు. బాలవధ యొనర్చినకతన వ్యాసమహర్షిచే దుర్గంధరక్తదిగ్ధదేహుఁడగునట్లు యశ్వత్థామ శపింపఁబడినవాఁడు. ఈతఁడు పాండవులకును, అందు ముఖ్యముగ యర్జునునకును ప్రబలవిరోధి. ప్రపంచము నపాండవమొనర్తునని శపథమొనర్చి, యభిమన్యుని భార్యయగు ఉత్తర గర్భముననున్న పరీక్షిత్తునిసహావధింప శరప్రయోగ మొనర్చిన వాఁడు. అట్టితరి గర్భస్థుఁడగు పరీక్షిత్తును శ్రీకృష్ణుండు రక్షించెనట. అశ్వత్థామ కామక్రోధాది యరిషడ్వర్గాంశమున జనించినవాఁడని చెప్పఁబడినది. ఈతఁడు భారతయుద్ధమున సర్వసైన్యాధిపత్యకాంక్షచే పలుసారులు ప్రయత్నించియు విఫలుఁడైనవాఁడు.

**అశ్వత్థామగిరి** — ఇది రానురాను అశీర్, అశేర్, అశ్వేర్ఘర్ ఆయెను. పృథ్వీరాజు

పాలనతో సంబాధముగలతావు. మధ్యరాష్ట్రములలోని బురాన్పూరున కుత్తరముగా పను నొకండుమైళ్ల దూరము.

**అశ్వనీ.కుమారులు** వీరు దేవవైద్యులు. కడుంగడు రూపవంతులు. కవలవారుగ జన్మించిన సోదరులు. పెద్దవానిపేరు నాసత్యుఁడు, రెండవవానిపేరు దస్రుఁడు అనియు, వీరికి పాండురాజపత్నియగు మాద్రికి వీరిద్వర యంశంబున నకుల సహదేవులు జనించిరనియు చెప్పంబడినది. అశ్వరూపము ధరించిన సరణ్యకు సూర్యునివలన అశ్వనీకుమారులు జనించిరనియు, సరణ్యా దేవశిల్పియైన త్వష్టకుమార్తె యనియుఁ జెప్పంబడినది.

**అశ్వనీనక్షత్రము** — ఆకసమున అశ్వముఖముం బోలునటుల మూడు నక్షత్రములు కలసియుండు నక్షత్రసముదాయము. జ్యోతిశ్శాస్త్రమునందు దీనికి అశ్వః, అశ్వీ, ఆద్యః, తురగః, తురంగః, తురంగమః, దస్రః, వాజీ, హయః, హరిః అను మాటలను పర్యాయపదములుగ వాడియున్నారు. అశ్వనీదేవత లధిదేవతలనియు, దేవగణ నక్షత్రమనియు, తిర్యఙ్ముఖ నక్షత్రమనియు, పుంస్వభావమనియు, గుర్రము, గండభేరుండపక్షి, ముష్టిచెట్టు దీని సంబంధములనియు, అశ్వని ప్రవేశించినపిదప ఏబది ఘుడియలపై త్యాజ్యము (దోషఘటికల) నియు, నలువదిరెండు ఘుడియలపై అమృతఘటికలనియు, ఇది క్షిప్రస్వభావనక్షత్రమనియుం జెప్పఁబడినది. చాంద్రమాన సంవత్సరాదిని అశ్వనినక్షత్రముండును.

**అశ్వనీముద్ర** — యోగాభ్యాస విధానమునఁ జెప్పఁబడిన వింశతి ముద్రలలో నొకటి. గుదద్వారమును ఆకుంచన ప్రసారములు (మూయుట, తెరచుట) చేయుచుండుట, యభ్యసించుట అశ్వనీ ముద్రయనియు, దీని యభ్యాసము వలన గుదరోగ నివారణము, శరీరబలము, చురుకుదనము, కుండలినీ ప్రబోధము సిద్ధించు ననియుఁ జెప్పఁ బడినది.

**అశ్వపతి** — మద్రదేశ మేలిన యొక భూపాలుఁడు. ౧౮ సంవత్సరములు సావిత్రీదేవిం గూర్చి తపంబాచరించి, యొక కుమార్తెంబడసి సావిత్రియని నామంబిడినవాఁడు. భార్య పేరు, మాళవిదేవి. (సావిత్రి చూడుఁడు). ఇంకను కేకయదేశ నరపతియును, దశరథ మహారాజు భార్యలలో నొకతె యగు కైకేయికిని యుధాజిత్తు మహారాజునకును తండ్రియగు అశ్వపతి మహారాజునకు నిదే పేరు కలదు.

**అశ్వపరీక్ష** (ఆంగ్లవిధానము)— గుఱ్ఱములు ఆంగ్లపరీక్షావిధానమున గాడిద, జీబ్రా, క్వాగ్గా, జంతువుల జాతికిం జేరినవి. అనాటొమీశాస్త్రముమేరకు నివి యన్నియు నొక్క కుటుంబములోనివే. ఇవి యన్నియు నొక్క డెక్కయే గల పాదముపై నిలుచును. చనిపోయిన గుఱ్ఱముల యెముకల పరీక్షనుండి యాదికాలమున గుఱ్ఱములకు నాలుగు చీలికలుగల డెక్కలైయుండినట్లు తెలియుచున్నది. ఇప్పటికిని ఒంటిడెక్క కిరుప్రక్కలను, రెండు చీలికలు గల గురుతులు గన్పట్టుటం జేసి, రెండు డెక్కలు క్రమముగ నేకమై, రెండు డెక్క లంతరించునటులఁ దెలియుచున్నది.

అడవిగుఱ్ఱములు మంగోలియా సీమలందు మాత్రమిపుడు గానవచ్చుచున్నవి. అందునను Przenalsky జాతిగుఱ్ఱములు మెండుగఁ గనఁబడుచుండును. ఇది చిన్న తట్టువలె నుండును. తోకయందలి వెండ్రుకలు కురుచలుగను, నెత్తిపై జూలుకుచ్చుగను నుండును. దీనిపోలిక సంబంధము జీబ్రాతోడను, గాడిదతోడను గూడ కలిగియుండును. దక్షిణఅమెరికాయందు ఒక జాతి

యడవిగుఱ్ఱములు కలవందురు గాని, నిజము పరిశీలించిన నవి యడవియందే పుట్టి గిట్టుటగాక, సామాన్యపు దేశీయములగు గుఱ్ఱములకంటె భేద మేమియుఁ గనబడదు. పూర్వ యైరోపా దేశములందు, జనులు గుఱ్ఱపుమాంసమును దినెడి వారట. అయినను దానిని స్వారిచేయుట కుప యోగింపకపోలేదు. ఆదినుండియు నరబ్బీ దేశస్థులు, గుఱ్ఱములవర్తకము చేయువారు. ఐరోపా దేశములందు వ్యవసాయపు జంతువులుగ వాడుచుందురు. ఇంగ్లాండుదేశమున షైరుజాతి గుఱ్ఱము ప్రపంచమునందలి గుఱ్ఱము జాతులలో పెద్దది యందురు. దీనియెత్తు పదునేడు మూరలట. బరువు రెండువేల పౌనులట. షెట్‌ల్యాండు పోనీలును, బర్మాదేశపు పెగూలును పరుగెత్తుటకు ప్రసిద్ధి నొందినవి.

**అశ్వభృత్యన్యాయము**— గుఱ్ఱమెవరిది యన వీఁడెవ్వరిభృత్యుఁడో వారిదనెనట. వీఁడెవ్వరి భృత్యుఁడన గుఱ్ఱముకలవారి భృత్యుఁడనెనట. ఇట్టి పెడసగపుమాటలు చెప్పెననుట కీన్యాయము వాడుచుందురు.

**అశ్వమేధజుఁడు** — భారతమున (ఆది పర్వము) శతానీకున కశ్వమేధజుఁ డుద్భవించె నని కలదు. భాగవతమున (నవమస్కంధము) శతానీకునకు సహస్రానీకుఁడు నాతని కశ్వమేధ జుఁడు పుట్టెనని కలదు. మత్స్యపురాణమున శతానీకునకు అధిసీమకృష్ణుఁడు పుట్టెననికలదు.

హరివంశమున శతానీకునకు(చంద్రాపీడునకు) సత్యకర్ణుఁడుపుట్టి హస్తిపురినేలెననికలదు. మరియు సత్యకర్ణునకు శ్వేతకర్ణుఁడుపుట్టి విరక్తుఁడై రాజ్యమును విడిచిపోవఁగా నాతనిభార్య గర్భవతి యైనను, భర్తతో వనమునకేగి, పర్వతపు లోయలో శిశువునుగని యచటనే విడిచిపోయెననియు, ఆశిశువు రాలనడుమ దొరలుచుండఁ గౌశికగోత్రజులగు బ్రాహ్మణు లాశిశువునుఁ బెనిచి ప్రక్కలు పుండ్లుపడి నల్లని మచ్చలుగా మారుటచే నాతనికి 'అజపార్శ్వుఁడు' అనుపేరు నిడిరనియు, నాతఁడు రాజ్యము జేసెననియుఁగలదు.

భాగవతమున సహస్రానీకునకునశ్వమేధజుఁడు, వానికి అసీమకృష్ణుఁడు, వానికి నిచక్షుఁడు పుట్టెననియు, నాఁడు గంగలో హస్తిపురి కొట్టుకొనిపోవుటచే కౌశాంబిఁ జేరెననియుఁ గలదు. మత్స్యపురాణ విష్ణుపురాణాదు లించుమించుగ నీరీతినె చెప్పుచున్నవి. పిమ్మట హస్తిపురి కురురాజ్యమున కెపుడును రాజధాని కాలేదు.

పాండవవంశజులలో ఉదయనుఁడు అనుమహారాజు (క్రైస్తవశకమునకుఁ బూర్వ మేడవ శతాబ్దమున) ప్రసిద్ధినొందియున్నాఁడు. ఆతని రాజధాని కౌశాంబి. ఆతని చరితము కథాసరిత్సాగరమున విస్తారము వర్ణింపఁబడియున్నది. భాస, సుబంధు కవులాతని చరితమును నాటకముగాను, గద్యకావ్యముగాను గ్రంథములజేసిరి. కాళిదాసాది కవులును ఉదయనునిఁ బ్రశంసించిరి. ఉదయన, శతానీకు లకు నడుమనుండినవా రనామతరువులగు రాజులై యున్నారు.

**అశ్వమేధయాగము** — అశ్వమును ప్రధాన యాగపశువుగ గల యాగము. ఇది భూపతులు చక్రవర్తులు ఆచరింపఁదగినక్రతువు. పుణ్యస్థలములయందీ యాగమంటపమునునిర్మించి యాగమొనర్తురు. కాశీమొదలగు స్థలములందివి యాచరింపఁదగినవి. కాశీయందలి దశాశ్వమేధ ఘట్ట మిటులనే పేరందినది.

క్రతువొనర్చుటకుం బూర్వము చైత్రశుద్ధ పౌర్ణమియందు సాంగ్రహాణి, ఇష్టినీ, అమావాస్య యందు సుజ్ఞాని, ఇష్టినీ, వైశాఖశుద్ధ పౌర్ణమి యందు ప్రాజాపత్య పశ్వాలంభమును, నెరపవలె నని చెప్పఁబడినది. అశ్వమేధమునకు శ్యామ

కర్ణాశ్వముండవలయునను నియతికలదు. దానిని స్నానార్థము తీసికొనిపోవునపుడు, ౧. ప్రాగ్దిశయందు పశ్చిమాభిముఖుఁడై నిలచియున్న యధ్వర్యుఁడు, ౨. ఉత్తరాభిముఖుఁడై దక్షిణ దిశయందు నిలచి యున్న బ్రహ్మయు, ౩. పశ్చిమదిశయందు ప్రాగభిముఖుఁడై నిలచియున్న హోత, ౪. ఉత్తరదిశయందు దక్షిణాభిముఖుఁడై నిలచియున్న ఉద్గాతయు, ప్రోక్షించి పవిత్రపర్చెదరు. పిదప దానిని రక్షకులువెంటరా స్వేచ్ఛగా తిరుగ విడచెదరు. ఒక సంవత్సరమైన పిదప దానిం దెచ్చి క్రతు వొనర్చుదురు. ఈవత్సరము, దేవ యజన మొనర్తురు.

అశ్వమేధమునందు ౨౧ మూరల (అరత్నుల) పొడవు కలవి ౨౧ యూపస్తంభములుండును. ఇది దిగ్విజయ మొనర్చిన భూపతులు తమ పాపములం బరిహరించుకొన నీమహాయాగము లేక మహాభిషేకము నొనర్చుకొందురని చెప్పం బడినది. ఈక్రతువు నొనర్చిన మహారాజులు పండ్రెండుగురని ఐతరేయ బ్రాహ్మణమున కలదు. వారు, ౧. జనమేజయుఁడు, ౨. శార్యాతుఁడు, ౩. శతానీకుఁడు, ౪. అంబష్ఠ్యుఁడు, ౫. యుధాం శ్రేష్ఠి, ౬. విశ్వకర్మ (భువన పుత్రుఁడు) ౭. సుదాసుఁడు, ౮. మరుత్తు, ౯. అంగుడు, ౧౦. భరతుఁడు (దుష్యంత పుత్రుఁడు), ౧౧. దుర్ముఖుఁడు. ౧౨. అరాతి. ఇంకను, దిలీపుఁడు, దశరథుఁడు, శ్రీరాముఁడు, యుధిష్ఠిరుఁడు, పుష్యమిత్రుఁడు ఈ క్రతువు నొనర్చిరని తెలిసెడిని. కలియుగమునందీ క్రతువొనర్చినది చాళుక్యవంశ క్షత్రియుఁడైన వాతాపి ( ఇప్పటి బాదామీ ) పురము రాజధానిగ రాజ్యమేలిన రెండవపులకేశి మహారాజనియందురు (మహారాష్ట్ర దేశము చూడుఁడు).

**అశ్వలాయనగోత్రము** – వాధ్ర్యస్వ లేక మిత్రయువగణము చూడుఁడు.

**అశ్వవతగోత్రము** – ధనంజయగణము చూడుఁడు.

**అశ్వవాతాయనగోత్రము**— నిధృవ గణము చూడుఁడు.

**అశ్వశాస్త్రము** — అశ్వశాస్త్ర గ్రంథములు తొల్లింట ఎన్నియుండెనోగాని, ఇక్కాలమునకు చాలాభాగము ఖిలమైనవి. హయలీలావతి, రేవంతోత్తరమను గ్రంథములు సరిగాలభించుటలేదు. ఆ స్త్రమునునది చిన్నఅసమగ్ర గ్రంథము. ఇంక భోజరాజీయము, హాలాస్య మహాత్మ్యములలోని భాగములం దీశాస్త్రముం గూర్చి వ్రాయఁబడినది పాటింపఁదగినదియెకాదు. ఐనను లోకమునందెక్కువ ప్రచారమందియున్న కతన కొంత వ్రాయనవకాశములభించినను పూ యనుటకు వీలులేదు.

అశ్వశాస్త్రమున ఆవర్తములు (సుడులు) వాని స్థానములు, అశ్వముల వర్ణములు, గతులు, స్థానములు, శిక్షాకాలములు, సంచార మార్గములు, ఫలములు మున్నగునవియుండును. ఆవర్తములు శుభావర్తములనియు, అశుభావర్తములనియు రెండువిధములుగఁ జెప్పఁబడినవి. ఇవి ఎన్మిదిభేదములుగల రూపములుగ నుండునని చెప్పఁబడినది. ౧. శుక్తి (ముత్తెపుచిప్పాకారము), ౨. ఆవర్తము (సున్నాకారము), ౩. సంఘాతము (గట్టి దెబ్బతగిలినటుల యానవాలువలె నుండుట), ౪. పాదుక (పాదము), ౫. అర్ధపాదుక, ౬. అవలీఢము (పశువులచే నాకఁబడినట్టి రూపము, నాకుడు ఆనవాలువలె వెండ్రుకలు వాలియుండుట), ౭. శతపది (జెర్రివలెను లేక రోకటిబండవలెను కాననగు ఆనవాలు, ఇదియును వెండ్రుకలనుండియే ఏర్పడునది), ౮. ముకుళము (అరవిరిమొగ్గ లేక చేతియైదువ్రేళ్లను కల్పిపట్టిన

చేతిరూపము), గుఱ్ఱపుసుడు లీయెన్మిది ఆకారములలో నుండును.

అందు శుభావర్తము (సుడులు) లు ధృవులనియు, ఆగంతుకములనియు, ద్వివిధము. ధృవులు పది విధములుగాన దశధృవులని వాడుకనామము కలదు. శ్లో॥ ద్వావురస్యౌ శిరస్యౌద్వౌ। ద్వౌద్వౌ రంధ్రోపరంధ్రయోః। ఏకఃఫాలే ప్రపాణేచ । దశావర్తా ధృవాస్మృతాః॥ అని రేవంతోత్తరమునచెప్పఁబడియుంట వక్షస్థలమున రెండు సుడు లుండుననియు, శిరమున రెండుసుడులును, మలద్వారముకడ రెండు సుడులును, మూత్రద్వారముకడ రెండుసుడులును, లలాటమున నొక సుడియు, క్రిందిపెదవి యందొక సుడియునుండు ననియును, వీనికే దశధృవులని పేరు కాని, వేర్వేరు ప్రత్యేకపు పేర్లు వీనికి లేవనియు, తెలియుచున్నది. ఇవి హెచ్చు తగ్గులు లేక సరిగా నుండిన అశ్వము శుభప్రదమనియు, లేకున్న దోషమనియు చెప్పఁ బడినది.

ఆగంతుకములు (సుడులు) పదునారు కలవు. ఇవి యోగ్యములగు యశ్వముల కుండదగిన శుభప్రదావర్తములు. ౧. రోచమానము ఒక సుడి, ౨. శ్రీవృక్షము ఐదు సుడులు, ౩. దేవమణి ఒకసుడి, ౪. మేఘుల రెండుసుడులు, ౫. వృషభావర్తములు రెండు సుడులు, ౬. అంగదావర్తములు రెండుసుడులు, ౭. యమళములు రెండుసుడులు, ౮. త్రేతాగ్ని సుడులు మూడుసుడులు, ౯.చాతురంతికమునాల్గుసుడులు, ౧౦. నిశ్రేణికము (నిచ్చెన) మూడుసుడులు, ౧౧. కేశాంతజములు రెండుసుడులు, ౧౨. స్తువజము ఒకసుడి, ౧౩. సృక్విజములు రెండు సుడులు, ౧౪. కంఠాభరణములు నాల్గు సుడులు, ౧౫. శతపది ఒకసుడి, ౧౬. లింగమణులు రెండు సుడులు.

శ్లో॥ వక్షోభవావర్త చతుష్టయంచ కంఠే భవేద్యస్యతురోచమానః । శ్రీవృక్షనామా హయస్సభర్త స్సుతపుత్రపౌత్రార్థవివృద్ధయేస్యాత్॥

అని హయలీలావతియందు జెప్పఁబడియుంట, శుభావర్తములగు రోచమానాది పదునారు సుడులలోను రోచమానము, దేవమణి, మేఘుల, కడుయోగ్యములనియు, అన్నిటికన్నను శ్రీవృక్షకమను సుడి మహాయోగ్యతమమై పుత్రపౌత్రాభివృద్ధిం గల్గించు శుభప్రదమైనదనియు తలంపఁబడు చున్నది.

అశుభావర్తము (దోషపు సుడు)లు:—౫౦. ౧. ఉత్తరోష్ఠావర్తము- పై పెదవియందు సుడి. ఒకే సుడి, ౨. ద్వినాసాపుటావర్తము- రెండు సుడులు, రెండు ముక్కురంధ్రములకడను ఉండు సుడులు, ౩. ప్రపాణోత్తర ప్రదేశావర్తము - మూడు సుడులు, ౪. ప్రోథావర్తము- ఒక సుడి, ౫. గండావర్తము- బుగ్గలయందు రెండుసుడులు, ౬. అశ్రుపాతావర్తము- కండ్లవెంబడి కారు నీరు ధారలు కలియు చోటనున్న సుడి, ౭. నేత్రకూటావర్తము- రెండు సుడులు, ౮. భ్రూమధ్యావర్తము- ఒక సుడి, ౯. కర్ణాగ్రావర్తము- రెండుసుడులు చెవులకొనను, ౧౦.విద్యావర్తము- ౨ సుడులు, ౧౧. కటావర్తము- ౩, ౧౨. శంఖావర్తము- ౨, ౧౩. ఘోటావర్తము- ౨, ౧౪. హన్వావర్తము- ౨, ౧౫. క్రోడావర్తము- ౧, ౧౬. ఘోణావర్తము- ౧, ౧౭. సేవన్యావర్తము- ౧, ౧౮. కుక్ష్యావర్తము- ౨ (కడుపునందు), ౧౯. పార్శ్వావర్తము- ౨ (ప్రక్కలందు), ౨౦.జాన్వావర్తము-౨ (పిర్రలపై రెండు),౨౧.జానుపృష్ఠావర్తము- రెండు సుడులు (పిరుదుల వెనుక ప్రక్క), ౨౨. జానుపార్శ్వావర్తము ౨ సుడులు (పిరుదులకు రెండుప్రక్కలను), ౨౩. మందరావర్తము ౨ సుడులు, ౨౪. జంఘా

వర్తము - ౪ సుడులు జంఘములందు, ౨౫. కళావర్తము ౪ సుడులు, ౨౬. కూర్చావర్తము ౪ సుడులు, ౨౭. కుష్టికావర్తము ౪ సుడులు, ౨౮. కణ్ఠావర్తము ౨ సుడులు, ౨౯. హృదయావర్తము ౧ సుడి గుండెలపై, ౩౦. ఉదరావర్తము ౧ సుడి కడుపుపై, ౩౧. నాభికావర్తము ౧ సుడి నాభికడ, ౩౨. కుక్షిస్ఫురణా వర్తము ౪ సుడులు, ౩౩. మన్యావర్తము ౨ సుడులు, ౩౪. గ్రీవావర్తము ౧ సుడి కంఠమున, ౩౫. గళావర్తము ౧ సుడి గళనాళమున (మెడయందు), ౩౬. స్కంధావర్తము ౨సుడులు, ౩౭. మహావర్తము ౨ సుడులు, ౩౮. కాకసావర్తము ౧ సుడి, ౩౯. కకుదావర్తము ౧ సుడి మూపురముకడనున్న సుడి, ౪౦. ఆసనావర్తము ౧ సుడి గుదస్థానముకడనున్న ఒక సుడి, ౪౧. త్రికావర్తము ౧ సుడి, ౪౨. జఘనావర్తము ౧ సుడి జఘనములందు ఒక సుడి, ౪౩. పుచ్ఛావర్తము తోకయందు ఒకసుడి, ౪౪. గుదావర్తము గుదస్థానముక్రింద ఒకసుడి, ౪౫. స్థూలావర్తము ౨ సుడులు, ౪౬. బీజావర్తము ౨ సుడులు, ౪౭. కోశావర్తము ౨ సుడులు, ౪౮. ఘోసలావర్తము ౨ సుడులు, ౪౯. స్ఫిగావర్తము ౨ సుడులు, ౫౦. పాదావర్తము పాదములందు చెరియొకసుడి (౨సుడులు).

వర్ణము:-అశ్వముల వర్ణములు త్రివిధము. ౧. వర్ణము (ఇది నాల్గుభేదములు), ౨. అనువర్ణము (ఇదిపండ్రెండుభేదములు), ౩. చిత్రవర్ణము (ఇది ముప్పదిభేదములు). ఇటుల అశ్వముల వర్ణములు నలుబదియారుగ జెప్పఁబడినది.

వర్ణములు ౪:-౧. కర్కవర్ణము, ౨. హేమావర్ణము, ౩. హారితవర్ణము, ౪. శోణవర్ణము (తెలుపు, పొగరంగు, పసుపుపచ్చ, ఎరుపు).

అనువర్ణములు ౧౨:- ౧. గంగాజలవర్ణము, ౨. మేఘవర్ణము, ౩. కపిలవర్ణము (నలుపు), ౪. శుకవర్ణము (చిలుకవంటి ఆకుపచ్చ), ౫. నీలోత్పల (నల్లకలువ) వర్ణము, ౬. కుముద (తామరపూవువంటి) వర్ణము, ౭. నీలవర్ణము (నీలిమందువంటి రంగు), ౮. మధుపుష్పవర్ణము (ఇప్పపూవురంగు), ౯. సితాసిత (నలుపుతెలుపు కలసినరంగు), ౧౦. అంజనవర్ణము (కాటుకవంటి నల్లరంగు), ౧౧. రక్తపాటల (ఎఱ్ఱపాటల పుష్పపు) వర్ణము, ౧౨. సింధువారవర్ణము (వావిలిరంగు).

చిత్రవర్ణములు ౩౦:- ౧. పంచకల్యాణము, ౨. అష్టమంగళము, ౩. శ్యామకర్ణము, ౪. చతుర్భద్రము, ౫. దివావైజయికము, ౬. నిశావైజయికము, ౭. రక్తాగ్రకర్ణి, ౮. శ్వేతబాహువు, ౯. త్రిభద్రము, ౧౦. శ్వేతఖురి, ౧౧. హారితదక్షిణపాది, ౧౨. ఊర్ధ్వానేక రేఖప్రోథి, ౧౩. త్రిరేఖప్రోథి, ౧౪. దీర్ఘైకరేఖావిశిష్ట, ౧౫. శ్రీకారరేఖాప్రోథి, ౧౬. వామహనురేఖ, ౧౭. వాలహీమభాగరేఖ, ౧౮. దక్షిణాగ్రశ్విత్రి, ౧౯. వామకర్ణాగ్రశ్విత్రి, ౨౦. జానుశ్విత్రి, ౨౧. అండశ్విత్రి, ౨౨. కంఠశ్విత్రి, ౨౩. కక్షశ్విత్రి, ౨౪. నాభిశ్విత్రి, ౨౫. వక్షశ్విత్రి, ౨౬. మార్జాలవర్ణి, ౨౭. సారంగవర్ణి, ౨౮. హారితాగ్ర, ౨౯. నీలాగ్రకర్ణి, ౩౦. వల్గ (ముఖరజ్జువు=వాగె).

అశ్వగతులు ౧౩:- ౧. ఉత్క్షిప్తగతి, ౨. శిథిలగతి, ౩. ఉత్తరవతి, ౪. మందవైహాయసగతి, ౫. విక్షిప్తైకకరగతి, ౬. అర్ధకంధరము, ౭. సమము, ౮. ఉత్కీర్ణము, ౯. విభక్తము, ౧౦. అత్యుత్క్షిప్తతలము, ౧౧. ఉద్ధృతగతి, ౧౨. వ్యాగూఢగతి, ౧౩. గోకర్ణికగతి.

అశ్వగుణములు ౬:- ౧. సాధ్వసస్ఫురితసత్వము, ౨. సాధ్వసస్ఫురితరజము, ౩. సాధ్వసస్ఫురితతమము, ౪. సతతోత్థితసత్వము, ౫. సతతోత్థితరజము, ౬. సతతోత్థితతమము.

అశ్వసంచార వీథులు (సంచార ప్రదేశములు) ౯—౧. సమతలము, ౨. ఉన్నతస్థలి, ౩. విషమాంబుకీర్ణస్థలి, ౪. శుద్ధస్థలి, ౫. నతాగ్రస్థలి, ౬. తృణవీరుదాఢ్యస్థలి, ౭. స్థానప్రకీర్ణస్థలి, ౮. ఉపలసంప్రకీర్ణస్థలి, ౯. పార్శ్వోన్నతస్థలి యని చెప్పఁబడినవి. మరియు నీతావులందు అశ్వ సంచారపుగతి విశేషములు ఆరు చెప్పఁబడినవి. అవి ౧. ఉరశ్చాలి, ౨. శిరశ్చాలి, ౩. పృథులము, ౪. బధ్యమానకము, ౫. ఆలీఢము, ౬. ప్రత్యాలీఢము, ౭. ఉపధ, పదచారి లేక పాదచారి, ౯. సర్వగము.

అశ్వధార (నడక) లు ౫.— ఆస్కందితము (తెలుగుపేరు రవగాలు నడక), ౨. ధౌరితకము (తెలుగున జోడననడక), ౩. రేచితము (పేరెము నడక), ౪. వల్గితము(చౌకళింపు లేక ఎగిరిపాటు), ౫. ప్లుతము (దువాళము లేక దాడు gallop). వీనికి మతాంతరమున, ౧. గతి, ౨. పుల, ౩. చతుష్క, ౪. మధ్యజవ, ౫. పూర్ణవేగములనియు గూడ గాననయ్యెడిని. మరియు నీధారలు (నడకలు) ౧. లఘ్వీ, ౨. మధ్య, ౩. దీర్ఘయసి, త్రివిధమని గూడ చెప్పఁబడినది. దీనినిగూర్చి హయలీలావతి నుండి రెండును, రేవంతోత్తరమునుండి యొకటియు, వైజయంతి నుండి యొకటియు శ్లోకము లిట వ్రాయుట కడు సమంజసమని తోఁచెడిని.

శ్లో॥ ప్లుతాంప్లవంగా మహు! ర్వ్యాధారాంతులనాభిధా। పునరేనాంచ డోలాయాం। పులామిత్యాహదేశికః ॥

శ్లో॥ క్షిపతి సమవిశేషా నుత్క్షిపన్నగ్ర పాదాన్। ప్రసరతిపురతో ఽశ్వస్సాచేధారాపులాఖ్యా।విలసితసమపాదో త్క్షేపణాకుంచనానామ్। కరణమిహ గతిజ్ఞాః ప్రాహురన్యేపులాఖ్యామ్ ॥ - హయ

శ్లో॥ నత్వోవ కుంచిత ముఖం నవకోహసాధ్య। మశ్వం చతుష్క సమయే ముఖసిద్ధ మాహుః॥
— రేవంతోత్తరము.

శ్లో॥ పంక్తీకృతానామశ్వానాం నేమనోన్నమనాః। అతివేగ సమాయుక్తా గతిపూర్ణా రుదాహృతా ॥ - వైజయంతి.

ఇంకను అశ్వములకు ౧. ఉపవేశకాలము, ౨. నిద్రాకాలము, ౩. స్ఖలితకాలము, ౪. దుష్టచేష్టాకాలము, ౫. బడబా [ఆడుగుర్రము] లోకనౌత్సుక్య కాలము, ౬. వితతహేషిత కాలము, ౭. సంత్రాస కాలము, ౮. దురుత్థానకాలము, ౯. విమార్గ గమన కాలము (తప్పుదారికీడ్చి పరుగెత్తుట), ౧౦. భయమందిన కాలము, ౧౧. శిక్షాత్యాగ కాలము (పద్ధతులనువదలి తిరుగుబాటొనర్చినతరి), ౧౨. చిత్తచాంచల్య (మదించిన) కాలము. ఇవి శిక్షాకాలములనియు, అర్హమగునటుల కమ్చీతో ప్రహరింప (కొట్ట) వలయుననియుఁగూడ చెప్పఁబడినది.

**అశ్వసేనుఁడు** — నాగము. తండ్రి తక్షకుఁడు. ఖాండవవనము నివాసము. పాండవమధ్యముండగు యర్జునుఁడు ఖాండవవనమును, యగ్నిదేవుని క్షుధకై దహనమొనర్చుతరి, అందు నివసించువాఁడగుట మంటలంజిక్కి, దేవేంద్రునిచే రక్షింపఁబడి, అర్జునునిపైఁ బగఁబూని, భారతయుద్ధమున కర్ణునిచే యర్జునునిపై వదలఁబడిన నాగాస్త్రముగ దనరి, యర్జునుని కిరీటమపహరించియు నాతనిచే నిహతుఁడయ్యెను.

నలచక్రవర్తి యరణ్యవాసమున నాతనిం గరచి వికృతునిగ నొనర్చి ఆపదరోజులు గడచు కతన విముక్తి గల్గించి విషహరణ మొసంగిననాగము.

**అశ్వాయుర్వేద విద్య** — గుఱ్ఱముల వైద్యము. ఈవిద్యను శాలిహోత్రుఁడు తన సుతుండగు, సుశ్రుతున కుపదేశించెనట. రాను

హాను ఉపదేశపరంపరలుగా జయదత్తుఁడు, గర్గుఁడు విద్య నెరింగిరట. గర్గుఁడీవిద్యను "అశ్వాయుర్వేద" మనుపేర శాస్త్రగ్రంథముగ రచించెనట.

**. అశితీ గోత్రము** — శాండిలగణము చూడుఁడు.

**అశిలా దుర్గము** — దీని నిప్పుడు జూనగడ్ అనుచున్నారు.

**అశ్మకదేశము** — ఈ దేశముంగూర్చి పెక్కు యభిప్రాయ భేదములు చెప్పఁబడినవి. అశ్మకుఁడనురాజు పాలించుట నీపేరు కల్గెననియు, ఆతని కుమారునిపేరు మూలకుఁడనియు, ప్రతీతి కలదు. దీని ప్రశంస మహాభారతము భీష్మ పర్వము ౯ అధ్యాయమున కలదు.

బ్రహ్మాండపురాణము పూర్వ ౪౮ వ అధ్యాయమున దక్షిణదేశమందలి రాజ్యమని యున్నది. కూర్మపురాణమున పాంచాలములోని యొక దేశముగ నుడువంబడియెను. బృహత్సంహిత ౧౪ అధ్యాయమున భరతదేశపు పశ్చిమోత్తర దిశయందుండునని చెప్పఁబడియె.

Spencer Hardy's Manual నందుఅస్సక (అశ్మక) దేశము గోదావరీ, నర్మదానదులపైగా మాహిష్మతిదేశమునకు దిగువ నుండుననియున్నది. Prof. Rhys Davids డేవిడ్సు చరిత్రకారుఁడు అశ్మకదేశము అవంతికి వాయవ్యదిశయని తలంచి బౌద్ధగ్రంథములం దస్సకయని వాడినదేశమేనని వ్రాసెను. MacCrindle పరిశోధకుఁడు సరస్వతీ నదికి తూర్పుభాగమందని అభిప్రాయపడెను. ఇటీవల పరిశోధనలు ఈదేశము ఛేదిదేశమునకు దక్షిణమునను, గోదావరినది కుత్తరముగను ఉండినదని వెల్లడించెను. మరియు దీనిరాజధాని ప్రతిష్ఠానపురమని యుండెనట. అది నైజాము రాజ్యమందలి పైఠణ అని కొందరు తలంచుచున్నారు. మహాభారతమున పౌడన్య పురమనియు, ప్రతిష్ఠానపురమనియు పేర్కొనఁబడినది. బౌద్ధులు పోతనపురమనియు, పోతలీపురమనియు పేరిడిరి. అశోకచక్రవర్తి కాలమున నశ్మకదేశము మహారాష్ట్రముం జేరియుండెనని తెలియనగును.

టిల్యుని అర్థశాస్త్రమునకు వ్యాఖ్య వ్రాసిన భట్టస్వామి అశ్మకదేశము మహారాష్ట్రమునకుం జేరినదనియు, ౯ వ. ఆరవ శతాబ్దమున వ్రాయఁబడిన దశకుమారచరిత్రయందు దండికవి అశ్మకదేశము విదర్భకు స్వాధీనరాజ్యమనియు నుడివిరి. అనగా నీకాలములం దీదేశపాలనము నెరుంగునది.

**అశ్మి (లేక అస్మి) గోత్రము** — గర్గఉపగణము చూడుఁడు.

**అశ్వినీ దేవతలు**—బడబారూప మందిన సంజ్ఞాదేవి (సూర్యుని సంబంధము) యొక్క నాసికమునుండి జనించిన (ఆమడ) వారు. అతి రూపవంతులు. దేవవైద్యులు.

**అశీ నది** — అశి యన ఖడ్గముయొక్క (వాడి) మొనయని యర్థము. ఇది కాశీ పట్టణమున వారణాశీ క్షేత్రభాగమునకు దక్షిణముగ నున్న చిన్న నది. (ఉత్తరమున వరుణానది కలదు). వరుణకును, అశికిని, మధ్యనుండునది గాన కాశి వారణాశి యని పిలువఁబడెడిని. ఈపదము వ్యాకరణ శాస్త్రముమేరకు ఒప్పునదైనను, తొల్లింటి కాలమునుండియు నల్లె వాడుక యందున్నది

**అశీలంకస్య నామస్యాన్న ఖలీకార కారణమ్** — శీలము లేని దుష్టునికి అవమానము తప్పదని భావము. సంస్కృత లోకోక్తి.

**అశుద్ధముంగదుపుట**

నీచునితో ఏసంబంధము లేకయుండుట శ్రేయమని భావము. ఆంధ్ర లోకోక్తి.

**అశుభ శకునములు** — కడకుఁబోయిన యాకుడియు, విధవరాలు, నీచజాతి మనుజులు, కట్టెలమోపు, ఒట్టికుండలు, బొగ్గులు, పయనకాలమున నెదురగుటయు, కాకులఱచుచు గల్లత్తుచేయుటయు, ఆపత్కరమనియు, కుంటేలు, నంబితంబళులు, తెలుకులి, పాములగుంపు, ఎదురగుటయు, మనస్సునకు ప్రోత్సాహము లేకుండుటయు, పయనమునకు ముప్పుగ జెప్పఁబడినవి. మరియు చేతియందున్న గొడుగుగాని, కర్రగాని, తలపైనుండిన పాగ, పైనుండు ఉత్తరీయముగాని, నేలంబడుట దుశ్శకునమనియు, ప్రయాణమున నష్టముఁ గల్గింపనోపునవియు, సంఖ్య ద్విజులు (బ్రాహ్మణ క్షత్రియ వైశ్య జాతులవారు), సరిసంఖ్య శూద్రులు, బోడితలలవారు ఎదురగుట ప్రయాణమునకు హానికరమనియు, ప్రయాణమగుతరి పెద్ద ధ్వాగ గానంబుటయు, మొండివాఁడు, ముక్కు పోయినవాఁడు, ఎదురగుటయు, అత్తరుణమున పెద్ద కలహముగాని, పెనుగాలి గాని, దుమారముగాని, చినుకులు గాని, తటస్థించుటయు దోషములనియు, అత్తరి ప్రయాణ మాపుట శ్రేయోదాయకమనియు, తలకుబట్ట వేసుకొన్నవాఁడు, తలంటుకొని చమురు రాసుకొనినవాఁడు, విరబోసికొనిన వెంట్రుకలు కలవాఁడు, ఎర్రనిజడలు కలవాఁడు ఎదురగుట ప్రయాణమున మైత్రిచెడి కలహములు గల్గి రసాభాసము సిద్ధమగుననియు ఋషులుదెల్పిరి

**అశుభ స్వప్నములు** — స్వప్న శాస్త్రము చూడుఁడు.

**అశోకవనికాన్యాయము** — రావణాసురుఁడు సీతాదేవి నశోకవనమునం దుంచెనని శ్రీమద్రామాయణమునఁ జెప్పఁబడినది. కాని ఆమె నశోకవనమునందుంచుటయం దాయన లోపలి యభిప్రాయమేమో, ఏడుపయోగమును గాంక్షించియో ఎవ్వరికిని గోచరింపలేదు. తమకు చక్కగా సుబోధకము గానట్టి తమ పెరవారిపనిం గూర్చి యీన్యాయమును వాడుచుందురు.

**అశోకవృక్షము** (ఏడాకుల పొన్నచెట్టు)- లా. Alstonia scholaris. ఆంగ్ల. Dita. Bark Tree. సం. గ్రహనాశ, గ్రహపత్రిగుచ్ఛపుష్ప, సప్తపర్ణ అనియును, పెక్కుగ్రంథములందు విశాలత్వక్, విశారద, విషముచ్ఛద, విద్ధ, వినద, విన్యాక, సారద, దేవవృక్ష, శిరోరుజ, శూతిపత్ర, శుక్తిపర్ణ, బహుపర్ణ,ఆయుగ్మచ్ఛద, శాల్మలీపత్రక, గంధిపర్ణ, మదగంధ, శరిద లేక శారిదపుష్ప అను పేర్లుకూడ వాడఁబడియున్నవి. కొన్నిదేశములందు దీనిని ఏడాకులయనఁటి యని కూడ వాడుచున్నారు. ఆకులు బూరుగ (శాల్మలీ వృక్షము) ఆకులవలె నుండి కొమ్మకేడేసియాకులంగల్గియుంట దీనికీపేరు గల్గియుండ నోపు. ఇది పెద్దవృక్షముగఁ బెరుగును. దీనివేరు రసముఁదీసియు, చూర్ణమొనర్చియు వైద్యులు వాడుదురు. అది త్రిదోషములను హరించి బల మొసంగునని చెప్పఁబడినది. మఱియును అండవృద్ధిదోషము, అతిశీతదోషము, క్రిమిదోషము, కుష్ఠురోగము, గుల్మరోగము, చెముడు(బధిరము), జ్వరములు, తాపములు, భ్రమలు, వ్రణములు, వాతనొప్పులు, శూలలు, నివారణ మగునని చెప్పఁబడినది. ఇవియన్నియు వేరునందున్న గుణములు. మఱియు అశోకముచెట్టు- లా. Saraca indica లేక Jonicia asoka. సం. అశోక, శోకనాశ, హేమపుష్ప. విస్తారము పుష్పించువృక్షము. చల్లనినీడగలది. దీనిపట్ట మేహవాతనొప్పులు, కుసుమరోగము, ఋతు దోషములు హరించును. వ్రణములు, క్రిమిరోగములు మాన్పును. జంతువిషముల నివారించును.

**అశోకచక్రవర్తి** (అశోకవర్ధన మహారాజు) — మగధరాజ్య మేలిన మౌర్యవంశపు

ప్రభువులలోఁ జాల గొప్పవాఁడు. ఇచ్ఛకము నకు, మౌర్యవంశమును మయూరవంశముగా కొందఱు పలుకం దొడఁగిరి. ఇది ఉత్పత్తియందు గల కళంకమును మఱుఁగుపర్చుటకు గాఁబోలును. కాని, వీరి పూర్వులలో కడపటివాండనకు ముర యను నాల్గవజాతి స్త్రీయందు కల్గిన సంతానపు వారగుట మౌర్యులని పేరందినవారికి మయూర శబ్దము వర్తించుట యసంభవము. (మగధదేశము చూడుఁడు).

మౌర్యాశోకుడు క్రీ. ము. ౨౭౨-౨౩౧ నాఁటివాఁడు. బౌద్ధమతస్థుఁడు. రాజధాని పాటలీపుత్రము. ఇప్పటి పాట్నాకడ పాడుపడియున్నది. (చూడుఁడు). తండ్రి జీవించియుండుతఱి నశోకుఁడు తక్షశిల, ఉజ్జయినీ రాజ్యములకు రాజప్రతినిధిగా నుండెను. తండ్రి యనంతర మీతఁడు ౨౭౨ లో ప్రభుత్వమునకు వచ్చి క్రీ. ము. ౨౬౯ లో పట్టాభిషేకము చేసికొనెను. బౌద్ధకుటుంబమున జన్మించినను, భూతదయ యంతగా నీతనికి మనంబున నెలకొనలేదట. క్రీ. ము. ౨౬౧ లో కళింగదేశముపై దాడి వెడలి, అచటి బలవంతుఁడగు భూపతి గాంగవంశజుఁడు లొంగి సామంతుఁడగుట, గోదావరీ మహానదుల నడుమనుండు రాజ్య మీతని సామ్రాజ్యములోనిదిగ నేర్పడియెను. కాని ఈ కళింగసంగరమాతనియందొక గొప్ప మార్పును గలుగఁజేసెను. యుద్ధమునందు చక్రవర్తి స్వయముగ పాల్గొనుచుంట పెక్కండ్రు సైనికుల చావులను కండ్లార మూచి, పశ్చాత్తాప నిమగ్నుఁడై తన రాజ్యతృష్ణ ఎన్నిచావులకుం గారణమైనదో ఎఱింగి పరమసాధువుగా మారి, రాజ్యతంత్రమును ప్రజానుకూలముగ నెరపుచు, బౌద్ధధర్మవ్యాప్తికి సర్వప్రయత్నము లొనర్చుచు, తక్కిన జీవితముం గడుప మొదలిడెను.

ఉపగుప్తుఁ డను బౌద్ధభిక్షువుబోధ లితనిహృదయమునకు చక్కఁగ నాటి, బౌద్ధధర్మముల ననుష్ఠింప నారంభించి తా భిక్షువు కాకున్నను పరమసాధువగ ప్రభువై న్యాయమూర్తిగను, ధర్మస్వరూపుఁడుగను పిలువంబడుచు రాజ్య మేలుచుండెను. క్రీ. ము. ౨౬౭-౨౬౯ లలో రాజ్యమందంతటను ధర్మశాసనములను వేయించ మొదలిడి ౨౪౯ లో బౌద్ధపవిత్ర క్షేత్రములం దర్శింప యాత్ర వెడలెను. నేపాలదేశమును వశపఱ్చుకొని యట లలితపట్టణమను పేరను (ఇప్పటి పటాన్) కాశ్మీరమున, శ్రీనగర మను పేరను, రాజధానులను నిర్మింపఁజేసెను (కాశ్మీరదేశము చూడుఁడు). లలితపట్టణమునకు నాల్గువైపుల నాలుగు, నడుమ నొకటియు బౌద్ధస్తూపముల నిర్మించెను.

ఆయనతో నీయాత్రయందు కూడనుండిన కుమార్తెయగు చారుమతియు, అల్లుఁడగు దేవపాలుఁడును, పశుపతినాథ ముకడ దేవపట్టణమను పేర నొకమఠనిర్మాణ మొనర్చుకొని యందు నివాసముండిపోయిరట. క్రీ. పూ ౨౪౨ లో చక్రవర్తి సప్తస్తంభశాసనముల వేయించి పశువధ అనర్హమని యందు శాసించెను. క్రీ. పూ. ౨౪౦ లో తాను బౌద్ధభిక్షువుగనై సన్యసించి నను రాజ్యపరిపాలనము నెరపుచునే యుండెను. తరువాతి శాసనములు ఆయనపేరింటనే యుంట అధికారము వీడలేదని తెలుచున్నది.

క్రీ. పూ. ౨౫౧ లో అశోకచక్రవర్తి బౌద్ధభిక్షువుల మూడవ పరిషత్తు (మహాసభ) పాటలీపుత్రమునందు జరిపించియుండెను. బౌద్ధగ్రంథములందు చేరిన ప్రక్షిప్తము లీమహాసభయందు వేరుచేయఁబడెనందురు. మహెంజోదారో హారప్పగ్రామముద్రికా శాసనములకుం బిదప మౌర్యాశోకుని ధర్మశాసనములే మనకు

పురాతనములని ఎల్లరందురు. (భరతదేశపు లిపులుచూడుఁడు). అశోకుఁడు బౌద్ధభిక్షువుగ నైనపిదప, ప్రియదర్శి యనునామమును తాను ధరించెనని తరువాతి శాసనములనుండి తెలియు చున్నది.

అశోకుని శాసనములంగూర్చి వివరించుట యందు లఘుశిలాశాసనములను మఱువరాదు. ఇవి క్రీ. ము. ౨౫౭-౨౫౬ లో నైజామురాజ్యమునందలి రాయచూరుజిల్లా మాస్కి-శాసన మొకటియు, మైసూరు రాజ్యమునందలి కర్నూలు మండలములోని గుత్తికి సమీపమున గల ఎఱ్ఱగుడియం దిటీవల యొకటియు బయల్పడినవి. పరిశిష్టస్తంభశాసనములు, ౭ ఏడు స్తంభశాసనములు, రెండు తెరయిస్తంభశాసనములు, మూడు గుహాశాసనములు (గయకడ బరాబరను గ్రామమున అజీవక బౌద్ధభిక్షువులకు వేయంబడినవి). ధర్మసిద్ధాంత బోధకములై ఏడుతావులందున్న పదునాల్గుశాసనములును ఈతనివి కలవు. తాను భిక్షువుగ నైనపిదప బుద్ధబోధయం దేడు మహావాక్యములు ప్రధానములని వేయించిన బాభ్రా శాసనము అగ్రగణ్యమని బౌద్ధులనుచుందురు.

ఈ చక్రవర్తికాలమున పెక్కుబాటలు నిర్మింపంబడినవి. వైద్యశాలలు, ఔషధశాలలు ఏర్పరుపంబడినవి. ప్ర ధర్మమార్గానువర్తులుగ నుండుటకు ధర్మాధికారులుండిరి. రాజ్యపరిపాలన నడుపుటకు నల్వురు రాజప్రతినిధులుండిరి. భోపాలురాజ్యమునందలి సాంచిస్తూప మీచక్రవర్తి నిర్మాణమనుచున్నారు.

**అశోకవర్ధనమహారాజు** — అశోక చక్రవర్తి చూడుఁడు.

**అశోకత్రయోదశి** — ఆశ్వీజ శుద్ధ త్రయోదశి. దక్షిణదేశమున అశోక త్రిరాత్ర వ్రతమొనర్చు వ్రతదినము. (పండుగలు చూడుఁడు).

**అశోకాష్టమి** — చైత్రశుద్ధ అష్టమి. అశోకగౌరీవ్రతమాచరించి అశోకవృక్షముక్రింద గౌరీదేవిని అశోకమొగ్గలం బూజించి వానిం దినెదరు. ఈదినమున బుధవారము పునర్వసు నక్షత్రము కూడ కలసివచ్చినచో నతిపవిత్రముగ నెంతురు. (పండుగలు చూడుఁడు). ఇంకను భవానీయుత్పత్తిగ నానదీతీరముల పూజలొనర్తురు. ఇంకను కొందరు ఆశ్వీజబహుళ అష్టమిని అశోకగౌరీవ్రతమాచరించుచు దాని నశోకాష్టమి యని వాడుచున్నారు.

**అష్టకంప్ర** (అష్టకప్ర) — స్తంభపురము లేక స్తంభతీర్థమున కీపేరుండెను. దీనినిప్పుడు కాంబే (రేవుస్థలము) అనుచున్నారు (బొంబై రాజధాని). జైన బౌద్ధగ్రంథములందిది తంబతీర్థమని చెప్పఁబడినది. కుమారపాలభూపతి పాలనమున ఇట శాలిగవశాహికదేవళమున సుప్రసిద్ధుండగు హేమచంద్రుఁడు సన్యసించి స్వామియాయెనని చెప్పఁబడినది. ఇది క్రీ. వె. ౧౨ శతాబ్దమునాఁడని చెప్పఁబడినది. దీనింగూర్చి ప్రబంధచింతామణి యను గ్రంథమున ౧౪౩ యందు వివరింపఁబడినది. (స్తంభతీర్థము, తంబపురము చూడుఁడు).

**అష్టకష్టములు** — ౧. దేశాంతర గమనము, ౨. భార్యావియోగము, ౩. ఆపత్కాల బంధుదర్శనము, ౪. ఒకరుతినగా మిగిలినది తాఁ దినవలసివచ్చుట, ౫. శత్రుస్నేహానిర్బంధము, ౬. పరాన్నప్రతీక్షణము, ౭. భంగపడినయవస్థ, ౮. దారిద్ర్యమనుభవించుట అష్టకష్టము లనంబడును. (కష్టములు చూడుఁడు).

**అష్టకాదిచతుష్టయము** — వీరు యయాతిమహారాజు దౌహిత్రులు. నలుగురు. ౧. అష్టకుఁడు, ౨. ప్రతర్దనుఁడు, ౩. వసుమనుఁడు,

౪. ఔశీనరుఁడు అనువారు. ఔశీనరుని శిబి చక్రవర్తి యనియునందురు. యయాతిచక్రవర్తి వీరికి నీతుల నుపదేశించెనని చెప్పఁబడినది. ఇంకను విశ్వామిత్రుని కుమాళ్లలో నొకనికి అష్టకుఁడని పేరుకలదు.

**అష్టకి గోత్రము** — లోహిత గణము చూడుఁడు.

**అష్టకోణ రేఖ** — పురుష సాముద్రికము చూడుఁడు. స్త్రీ సాముద్రికము చూడుఁడు.

**అష్టగంగలు** — గంగలు చూడుఁడు.

**అష్టగంధములు(గంధాష్టకము)**- గణపతి ప్రీత్యర్థము ౧. చందనము, ౨. అగరు, 3. కర్పూరము, ౪. ఆకుపత్రి, ౫. కురువేరు, ౬. రక్తచందనము, ౭. కుంకుమపూవు, ౮. చంగల్వకోష్టు.

దేవతాప్రీత్యర్థము ౧. చందనము, ౨. కర్పూరము, 3. నాగకేసరాలు, ౪. కురువేరు, ౫. తుంగముస్త (దుంప) లు, ౬. దేవదారు, ౭. గోరోచనము, ౮. కుంకుమపూవు.

**అష్టగణపతులు** — గణపతులు చూడుఁడు.

**అష్టగుణమండము** — ౧. పాలు బియ్యము, ౨. అరపాలు పెసలు కొద్దిగ వేయించి ఉడకబెట్టుచు, అందులో 3. సైంధలవణము, ౪. ధనియాలు, ౫. ఆకుపత్రికం, ౬. శొంఠి, ౭. పిప్పళ్లు, ౮. మిరియాలు, సమభాగములుగ చేసిన చూర్ణముకల్పి (అవసరమగునేని కొంచెము ఇంగువయు కల్పుటకలదు.) పలుచనగ పచనముచేసినది. ఇది జ్వరములు, త్రిదోషములు, హరించి రక్తవృద్ధి, జఠర దీప్తి నిచ్చి సమధాతువు గల్గించును.

**అష్టగ్రామము** — మైసూరుసీమ యందు శ్రీరంగ పట్టణమున పాలకుఁడైన యొక రామానుజీయ శ్రీవైష్ణవున కొసంగఁబడిన ఎనిమిది గ్రామముల పరగణా.

**అష్టచండీశక్తులు** — ఛండీశక్తులు చూడుఁడు.

**అష్టదిక్కుల గాలులు**—ఆయుర్వేద వైద్య విధానమున నెన్మిది దిక్కులనుండి వీచు గాలుల కీక్రిందిగుణములు చెప్పఁబడినవి.

౧. తూర్పునుండి వీచుగాలి, విదాహము కల్గించును, కఫము, పైత్యము, ఉబ్బురోగము, వాతరోగము నుద్రేకింపఁ జేయును. ౨. ఆగ్నేయము నుండి వీచు గాలి జిగటగను, వేడిగను ఉండును. నేత్రములకు బలకరము. 3. దక్షిణ దిక్కునుండి వీచుగాలి, సౌఖ్యము, ఆరోగ్యము, కల్గించును, త్రిదోషముల శమింప జేయును. ౪. నైఋతి దిశనుండి వీచుగాలి అనారోగ్యమైనది, మేహము, తాపములం గల్గించును. ౫. పశ్చిమమునుండి వీచుగాలి, మిక్కిలి వేడి చేయును. ౬. వాయవ్య దిశనుండి వీచు గాలి ఒంటి నీరార్చును, కఫము, పైత్యము శమింపజేసి, దాహము, తాపము పుట్టించును. ౭. ఉత్తరమునుండి వీచుగాలి జిగటగా వాతకరమై యుండి, శీతపైత్యముల నుద్రేకించును, చల్లగా నుండి, ధాతువులకు బలమొసఁగును. ౮. ఈశాన్య దిశనుండి వీచు గాలి, మధురముగ మనోహరమై సమధాతువు గల్గించును, రక్తపైత్యము నుద్రేకించును, నేత్రరోగములంగల్గించును, కంపవాతము, స్తంభవాతము, కఫవాతము, శీతపైత్యముల నడంచి, ఆకలిగల్గించును.

**అష్టదిగ్గజ కవులు** — శ్రీకృష్ణదేవరాయ సార్వభౌముని యాస్థానమున నుండిన మహాకవులు. ౧. అల్లసాని పెద్దన -

ఆంధ్రకవితా పితామహుండను బిరుదమును, కాలికి గండపెండేరములును కలవు. పురము దూపాటిసీమలోని ద్రోణాదులయను గ్రామము. రచించినవి మనుచరిత్రము, రామస్తవరాజము అద్వైతము నను గ్రంథములు. ౨. భట్టుమూర్తి భట్టుపల్లెకాపురస్థుడు. రచించినవి నరసభూపాలీయము, వసుచరిత్రము. 3. నంది తిమ్మరాజు-ముక్కుతిమ్మనయని బిరుదనామము. కాపురము గన్నవరమను గ్రామము. రచించినది పారిజాతాపహరణము. ౪. పింగళి సూరన్న- రచించినవి రాఘవ పాండవీయము, కళాపూర్ణోదయము మొదలగునవి. ౫. అయ్యలరాజు రామభద్రకవి- కాపురము ఒంటిమిట్టప్రాంతము కడపమండలము. రచించినది రామాభ్యుదయము. ౬. తెనాలిరామలింగకవి- ఇంటిపేరు ఈశ్వరప్రగ్గడవారు. బాల్యమున మేనమామకడ తెనాలి గ్రామమున పెరుగుటంజేసి ఇంటిపేరు తెనాలియని వాడుకగల్గెను. రచించినది పాండురంగవిజయము లేక పాండురంగ మాహాత్మ్యము. ౭. ధూర్జటికవి-రచించినది శ్రీకాళహస్తీశ్వరశతకము మొదలైనవి. ౮. శంకరకవి- ఈతనింగూర్చి చాలా సంశయములు కలవు. ఆస్థానకవికాడని తోచెడిని.

**అష్టదిగ్గజములు** — దిక్పాలురు చూడుడు.

**అష్టదంష్ట్ర గోత్రము** — రథితర గణము చూడుడు.

**అష్టనాగములు** నాగము లెన్మిది చూడుడు.

**అష్ట పంచాక్షరీ మంత్రములు** పంచాక్షరీమంత్రము లెన్మిది చూడుడు.

**అష్టపది**— జయదేవకవి (చైతన్యుడు) రచించిన గీతగోవిందకావ్యము.

**అష్ట పాద పర్వతము** — టిబెట్టు దేశమున మానసరోవరముకడ నున్న కైలాస పర్వతమున కీపేరు కలదు. (కైలాసపర్వతము చూడుడు.

**అష్టపాదశిఖరము**— గిరిపంచకము చూడుడు.

**అష్ట ప్రమాణములు** ప్రమాణములు ఎన్మిది చూడుడు.

**అష్టప్రయాగలు** — పంచప్రయాగలు చూడుడు.

**అష్టబంధము** — ఇది దేవాలయములందు విగ్రహములను, శివలింగములను, స్థాపించు తరి నంటించి బిగించు జిగురు పదార్థము. (శిల్పశాస్త్రము విగ్రహములు చూడుడు). దీనిచే దేవతా విగ్రహములు, శివలింగములు, మొదలగువాని బంధింతురు. ౧. వెన్న, ౨. ముసాంబ్రము, 3. దూది, ౪. కురువిందము, ౫. రాతిపిండి, ౬. జేగురురాయి, ౭. లక్క ౮. మైనము, సమభాగములను ఆవుపాలతో నూరి, సన్నని మంటపై వండిన శ్రేష్ఠమగు అష్టబంధమయ్యెడిని. ప్రకారాంతమున తేనె, సున్నము, అరటిపండ్లు, మర్దించిగాని, రాతిపొడి, రాతిసున్నము, తేనె, మర్దించిగాని, బంధింతురు. అష్టబంధము— దేవాలయమున శివలింగమును ప్రతిష్ఠించు తరి చేయు బంధము. (బంక లేక జిగురుపదార్థము) ౧. లాక్ష (లక్క),౨. సజ్జరసము, 3. శిక్థం (మైనము), ౪. కురువిందము (గులివిందగింజలు నూరినముద్ద), ౫. గుగ్గిలము, ౬. గైరికమ్, ౭. గుడం (బెల్లము), ౮. తైలమ్ (నూనె), శ్లో॥ లాక్షా సజ్జరస స్సిక్థం। కురువిన్దశ్చ గుగ్గులమ్। గైరికంగుడ తైలఞ్చ। అష్టబన్ధమితి స్మృతమ్॥

**అష్టబౌద్ధ చైత్యములు** — ఈ ఎన్మిది చైత్యములు బుద్ధభగవానుని సంబంధము లగుట బౌద్ధులకు పవిత్రస్థలములై బౌద్ధ యాత్రా స్థలులై యున్నవి. ౧. లుంబినీవనము- (కపిలవస్తుప్రాంతము) బుద్ధభగవానుని జన్మస్థలము. ౨. బోధివృక్షము- బుద్ధగయ, గయజిల్లా, బీహారుపరగణా. ఈ వృక్షచ్ఛాయను బుద్ధుడైన తావు (దీనిని మహాబోధి యందురు). ౩. మృగదావ- బనారసు నగరము కడనున్న పవిత్రస్థలి, దీనిని సారనాథమనియు నందురు. సంయుక్తరాష్ట్రములలోనిది. ఇట బౌద్ధమత ప్రథమ బోధోపన్యాస మాబుద్ధభగవానుఁ డొసంగెనట. ౪. జేతవనము-ఇది శ్రవస్తికడనున్నది.ఇటబుద్ధభగవానుఁడు కొన్ని మాహాత్మ్యములం జేసి చూపెనట. ౫. శంకాశ్య - ఇది కనూజ మండలములో నున్నది. ఇట త్రయస్త్రింశ స్వర్గములనుండి దిగెనందురు. ౬. రాజగృహ - మగధదేశపు తొల్లింటి రాజధాని. ఇట వసించి శిష్యులకు బోధలొనర్చినతావు. ౭. విశాలి — ఇట ఆనందుఁడను శిష్యునితోఁ దనజీవితముం గూర్చి ప్రసంగించెనట. ౮. కుశినగరము- ఇట సాలవనమునమృతిఁజెందినిర్వాణపదమందినతావు.

**అష్టభయములు** — భయాష్టకము చూడుఁడు.

**అష్టభువనములు** —భువనాష్టకము చూడుఁడు.

**అష్టభోగములు** భోగములు చూడుఁడు.

**అష్టభైరవులు**—భైరవులుచూడుఁడు.

**అష్టమంగళములు** మంగళములు చూడుఁడు.

**అష్టమంత్రులు**— తొల్లి శ్రీరాముని తండ్రియగు దశరథమహారాజుకడ నుండిన ఎనమండుగురు మంత్రులు గొప్ప పేరందియుండిరి, వారి కష్టమంత్రులని నేఁటికిని వాడుక గలదు. ౧. విజయుఁడు, ౨. దృష్టి, ౩. మంత్రపాలుఁడు, ౪. సిద్ధార్థుఁడు, ౫. అర్థసాధకుఁడు, ౬. అశోకుఁడు, ౭. జయంతుఁడు, ౮. సుమంతుఁడు.

**అష్టమదములు** — మదములు చూడుఁడు.

**అష్టమిక ప్రమాణము** — ఆయుర్వేదమానము చూడుఁడు.

**అష్టమూత్రములు** — ఆవు, గాదె, మేక, గొఱ్ఱె, ఆడఏనుఁగు, ఆడలొట్టిపిట్ట, ఆడగుఱ్ఱము, ఆడగాడిద మూత్రములకు ఆయుర్వేద వైద్యశాస్త్రమున అష్టమూత్రములందురు.

**అష్టమూర్తి** — ఇది రుద్రుని పేరు. పరమేశ్వరునకు ఎన్మిది శరీరము లనంబడు ఎన్మిది యాకారములు. ౧. భవుఁడు-స్థానము జలము. భార్య ఉమ. కల్గిన పుత్రుఁడు శుక్రుఁడు. ౨. శర్వుఁడు-స్థా. భూమి, భా. సుకేశి, పుత్రుఁడు అంగారకుఁడు. ౩. ఈశానుఁడు-స్థా.వాయువు, భా. శివాదేవి, పుత్రు. ఆంజనేయుఁడు. ౪. పశుపతి-స్థా. అగ్ని, భా. స్వాహాదేవి, పుత్రు. స్కంధుఁడు. ౫. భీముఁడు- స్థా. ఆకాశము, భా. దిశ, పుత్రు. స్వర్గము. ౬. ఉగ్రుఁడు-స్థా. స్వధర్మనిష్ఠగల్గిన బ్రాహ్మణరూపము, భా. దీక్ష, పుత్రు. సంతానుఁడు. ౭. మహాదేవుఁడు-స్థా. సోముఁడు, భా. రోహిణీదేవి, పుత్రు. బుధుఁడు. ౮. రుద్రుఁడు-స్థా. సూర్యుఁడు, భా. సువర్చలాదేవి, పుత్రుఁడు శనైశ్చరుఁడు.

ఇంకను పరమేశ్వరుని అష్టమూర్తు లిట్లుకూడ చెప్పఁబడినవి. ఉష్ణమూర్తులు ౨:—౧. సూర్యుఁడు, ౨. అగ్ని. శీతలమూర్తులు ౨:—౩. జలము, ౪. చంద్రుఁడు. సమమూర్తులు ౨:—౫. పృథ్వి, ౬.

వాయువు. అస్పర్శమూర్తులు ౬:-౭. ఆకాశము, ౮. అంతరము.

**అష్టలోహములు** — ఆయుర్వేద వైద్యశాస్త్రమున బంగారము, వెండి, రాగి, తీక్ష్ణలోహము, ముండలోహము, కాంతలోహము, తగరము, సీసములకు అష్టలోహములని పేరు.

**అష్టవర్గము** ఆయుర్వేద వైద్యశాస్త్రమున మేద, మహామేద, జీవకము, ఋషభకము, ఋద్ధి, వృద్ధి, కాకోళి, క్షీరకాకోళి, వీటికి అష్టవర్గమని పేరు. ఇంకను దీనికి మతాంతరముగ కొందరు మేదమహామేదలకు ప్రత్యామ్నాయముగ శతావరిని, జీవకఋషభకములకు ప్రతిగా నీలగుమ్మడిన్ని, ఋద్ధివృద్ధులకు ప్రతిగా వారాహికందయున్నూ, కాకోళిక్షీరకాకోళికి ప్రత్యామ్నాయముగ పెన్నేరును వాడుచున్నారు. దీనికి కాకోళ్యాది గణమనియుం బేరు వాడుక గలదు. ఋద్ధి, వృద్ధి (శంఖపుష్పి), కాకోళి, క్షీరకాకోళి, మేద, మహామేద, జీవకము, ఋషభకము, వీటి కష్టవర్గమని పేరు. ఆయుర్వేద వైద్యవిధానమున వీని చూర్ణము లేక కషాయము చలువ,వీర్యవృద్ధి, పైత్యవాత శమనము గల్గించునని చెప్పఁబడినది. వనౌషధిశబ్దార్థనిఘంటువునందు, ౧. తిప్పతీగె, ౨. అడవిపెసర, 3. అడవిమినుములు, ౪. పద్మకాష్ఠము, ౫. తవాక్షీరి, ౬. కర్కాటశృంగి, ౭. ప్రపౌండరీకము, ౮. జీవంతి (మఱియుం గొందఱి మతమున యష్టిమధుకము, ద్రాక్ష) ఇవి కాకోళ్యాది గుణమని చెప్పఁబడినది.

**అష్టవసువులు**-భారతమునఁజెప్పఁబడినటుల ప్రజాపతి పుత్రులు ౧. ధరుఁడు-౨. ధృవుఁడు, 3. సోముఁడు, ౪. అహుఁడు, ౫. అనిలుఁడు, ౬. అగ్ని, ౭. ప్రత్యూషుఁడు, ౮ ప్రభాసుఁడు.

ఇతర పురాణములందుఁ జెప్పఁబడినటుల దక్షప్రజాపతి కుమార్తెలలో పదిమందికి భర్తయగు ధర్ముని భార్యలలో, వసువనునామెకు జనించిన ఎనమండుగురు పుత్రులుగాన అష్టవసువు లనబడిరి. వీరొకప్పుడు వశిష్ఠమహర్షి యొక్క హోమధేనువు నపహరించి, ఆయనచే శపింపఁబడి, శంతనచక్రవర్తి యనుంగుసతియగు, గంగాదేవికిం బుత్రులై జన్మించిరి. వారిలో నెల్లమిక్కిలి యపరాధియగు ప్రభాసుఁడు, తక్కిన ఏడ్గురుసోదరుల దోషములందలి చతుర్థాంశములను తాను వహించి, భీష్ముఁడను పేరంబరగుచు, చిరకాలము మహాశూరుఁడై, ధర్మవేత్తయునై, జీవించెను.

ఇందు ధరునకు ఆపుఁడనియు, అహునకుధర్ముఁడు లేక అధ్వరుఁడనియు, అనలున కగ్ని యనియు, నామాంతరములు వాడబడినవి. మఱియును సోమాగ్ను లిరువురకును, నహుషుని జయుని వసువులుగఁ బేర్కొనియున్నారు. ఇంకను ధృవునకుఁ బదులుగ విష్ణుని వసువుగ వివరించిరి. ధరుఁడు లేక ఆపునకుఁబదులు వరుణుఁడని కొన్ని చోట్ల ప్రయోగములు కలవు. వసువులలో నగ్ని నాయకుఁడని చెప్పఁబడినది. ఈ భీష్ముఁడను పేరంబరగి బహుకాలము జీవించి మహాశూరుఁడును, ధర్మవేత్తయునై భారతయుద్ధమందు నంపశయ్యపైఁ బండి ఉత్తరాయణపుణ్యకాలము ప్రవేశంబగు మాఘశుద్ధఏకాదశినాఁడు ప్రాణములు వదలెను. అదియాదిగ భీష్మఏకాదశి యనఁబడుచున్నది. (వసుగణము చూడుఁడు.)

**అష్టవిధవివాహములు** — వివాహములు చూడుఁడు.

**అష్టవిధాయుములు**— వాస్తుశాస్త్రమున నివాసగృహములు, దేవాలయములు కట్టుటకు గృహముయొక్క పొడవు, వెడలుపు అడుగులను (వెడలుపు అడుగుల సంఖ్యచే పొడవు అడుగుల సంఖ్యను గుణించి) ఎన్మిదిచేత భాగింపగా మిగిలిన శేషమున క్రిందివిధముల ఫలముల గ్రహింపవలయును.

౧. ధ్వజాయము : బ్రాహ్మణులకు శ్రేయస్కరము. స్వతస్సిద్ధముగా శుభకరమైనది. ౨. ధూమాయము : ఇది నివాసగృహమునకు శ్రేయస్కరము గాదు. వంట యింటికి, కర్మాగారములు (Mills & Factories), అగ్నిహోత్రములుండు ప్రత్యేకపు గదికిని కుదిరిన శ్రేయస్కరము. 3. సింహాయము : శుభకరమైనది. యులకుశ్రేయస్కరము. ౪. శ్వానాయము : అశుభకరము. కుక్కలు మొదలగు పశువులుండు ఇండ్లకుం బ్రత్యేకముగ గుదిరిన శ్రేయస్కరము. ౫. వృషభాయము : శుభకరమైనది. వైశ్యులకు శ్రేయస్కరము. ౬. ఖరాయము : అశుభకరమైనది. గాడిదలు, గుఱ్ఱములు మొదలగువాని సాలలకు ప్రత్యేకముగ గుదిరిన శ్రేయస్కరము. ౭. గజాయము : శుభకరమైనది. శూద్రకులము లవారికి శ్రేయస్కరము. ౮ (లేక సున్న మిగిలినచో) కాకాయము : అశుభకరమైనది. ప్రత్యేకముగ పక్షులుండు ఇండ్లకుం గుదిరిన శ్రేయస్కరము.

**అష్ట వినాయక క్షేత్రములు** — మహారాష్ట్ర దేశమునందుం బ్రసిద్ధికెక్కినవి. ౧. రంజన్గామ్- ఇది జి. ఐ. పి. రెయిల్వేపై నున్న గ్రామము. ఇట మూతామూలానదితో భీమానది కలియుతావున విఘ్నేశ్వర దేవస్థానము; పూనాజిల్లా. ౨. మార్గాన్- (మోరేశ్వరము) జజూరీనుండి ఆరుమైళ్లు దూరము. పూనామండలము, ఎమ్. ఎస్. ఎమ్. రెయిల్వేపై నున్నది. 3. థెయూర్- (పూనామండలము). (స్థేవర క్షేత్రము) జి. ఐ. పి. రైల్వే. ౪. లేనాద్రి- జి. ఐ. పి. రైల్వే తెలిగాన్ నుండి ౫౦ మైళ్లు. పూనాజిల్లా. ౫. ఒజహార్- పూనామండలము. ౬. పాలి- (బల్లాల) మరుదగణపతి బొంబైనుండి ౪౬ మైళ్ల దూరము. పంత్ సచివ్ రాజ్యములోని క్షేత్రము. ౭. మాథ్- (మహాడా) జి. ఐ. పి. పైనున్న క్షేత్రము, థానాజిల్లా. ౮. సిద్ధటేక్- భీమానదీతీరము అహమన్నగర్ జిల్లా, జి. ఐ. ది క్సాల్ నుండి మైళ్లు. మః దేశమునం బ్రసిద్ధికెక్కిన అష్టవినాయకక్షేత్రములు.

**అష్ట విరాగములు** — మదములు చూడుడు.

**అష్ట స్వయంవ్యక్త క్షేత్రములు**— స్వయంవ్యక్తక్షేత్రములు చూడుడు.

**అష్ట సాధనములు** — ౧. నిత్యానిత్య వివేకజ్ఞానము (దీనినే ఆత్మానాత్మవివేకమందురు). ౨. ఇహాముత్రార్థఫలభోగవిరామము, 3. శమదమాదిషట్కసంపద, ౪. ముముక్షుత్వము, ౫. జీవ లేక సర్వప్రాణికారుణ్యము (భూతదయ), ౬. నిర్వంచక (ఇతరులను ద్రోహముచేయని) జీవనము, ౭. అవ్యభిచార (అన్యవ్యాపకము జెందని) భ[illegible]రత[illegible] ము.

**అష్టస్థాన (పరీక్ష) లు** — వైద్యపరీక్షాస్థానములు చూడుడు.

**అష్టక్షారములు** క్షారాష్టకము చూడుడు.

**అష్టక్షీరములు** — ఆయుర్వేద వైద్యశాస్త్రమున ఏనుగుపాలు, లొట్టిపిటపాలు, గుర్రపుపాలు, ఆవుపాలు, గేదెపాలు, మేకపాలు, గొర్రెపాలు, చనుబాలు (స్త్రీ) వీటికి అష్టక్షీరములని పేరు.

**అష్టాంగమార్గములు** — (ఆర్యాష్టాంగ మార్గములు) ౮. బౌద్ధమతధర్మమునందు భిక్షువులకు (అర్హమైన) సమ్యగ్మార్గములు. ౧. సమ్యగ్దృష్టి (చూచుట), ౨. సమ్యగ్సంకల్పము (చేయదలచుట), 3. సమ్యగ్వాక్కు (మాటలాడుట), ౪. సమ్యక్కర్మ (అర్హమగు పనులుచేయుట), ౫. సమ్యగ్జీవనము, ౬. సమ్యగ్వ్యాయామము, ౭. సమ్యగ్విచారము ౮. సన్న

గ్సమాధి (నిష్ఠ) ఇని అష్టాముగ నుండవలయునని భావము.

**అష్టాంగయోగములు**— (యోగాభ్యాసము) — ౧. యమము, ౨. నియమము, 3. ఆసనము, ౪. ప్రాణాయామము, ౫. ప్రత్యాహారము, ౬. ధారణ, ౭. ధ్యానము, ౮. సమాధి యనునవి అష్టాంగయోగములు- వీని నభ్యసించుటయె యోగాభ్యాసము. వీనిని గూర్చి, పతంజలిమహర్షి సూత్రములు వ్రాసెను. వానిని పతంజలియోగసూత్రము లందురు. ఇందు మొదటిసూత్రముననే యోగశ్చిత్త వృత్తినిరోధ, "యోగము చిత్తముయొక్క (చంచలమగు) వృత్తిని నిరోధించు (నిలుపు) టయె" అని యైయున్నది. కాన యోగాభ్యాసమునకు ఫలము మనస్థిమితము గల్గుటయని తెలుచున్నది.

తొల్లికృతయుగముననే ఉండిన శ్వేతయోగి మొదలు లకులీశునివఱకు యోగాచార్యులనియు, వీరి శిష్యులు ౧౧౨ గురనియు చెప్పఁబడినది. కాని వీరు రచించిన గ్రంథము లెక్కడను గానరాకున్నవి. అష్టాంగయోగములం గూర్చి వివరించుటకు ముందు దశవాయువులు, దశనాడులు, షట్క్రియలం గూడ వివరించుట సమంజసము వాయువులు ౫, ఉపవాయువులు ౫ కలిసి దశవాయువు లగును. వాయుపంచకము- ౧. ప్రాణవాయువు, ౨. అపానవాయువు, 3. వ్యానవాయువు, ౪. ఉదానవాయువు, ౫. సమానవాయువు. ఉపవాయుపంచకము:— ౧ నాగవాయువు, ౨. కూర్మవాయువు, 3. కృకరవాయువు, ౪. దేవదత్తవాయువు, ౫ ధనంజయవాయువు. దశనాడులు- ౧. ఇడానాడి దీనిని చంద్రనాడి యందురు. ముక్కు ఎడమరంధ్రమున వ్యాపించియుండునది- ప్రాణవాయువునకు ముఖ్యమార్గము, ౨. పింగళానాడి- (సూర్యనాడి) ముక్కు కుడిరంధ్రమున వ్యాపించియుండును. [illegible] వాయువునకు మార్గము, 3. సుషుమ్నానాడి (సూర్యనాడి) ఇడా పింగళానాడుల నడుమను, బ్రహ్మరంధ్రము వరకు వ్యాపించియుండును ప్రాణవాయు మార్గము, ౪. గాంధారీనాడి- ఎడమ కంటియందు వ్యాపించి యుండును, ౫. హస్తిజిహ్వ- కుడి కంటియందు వ్యాపించియుండును, ౬. పూషనాడి- కుడిచెవి యందు వ్యాపించియుండునది, ౭. యశస్విని- ఎడమచెవియందు వ్యాపించియుండునది, ౮. అలంపూషనాడి- ౯. కుహూనాడి- లింగస్థానమున వ్యాపించియుండునది, ౧౦. శంఖినీనాడి- గుద (మూల) స్థానమున వ్యాపించియుండునది.

షట్క్రియలు- ౧ ధౌతిక్రియ. ఇది నాల్గు విధములు. ఇది ౧. అంతర్ధౌతి, ౨. దంతధౌతి, 3. హృద్ధౌతి, ౪. మూలశోధనధౌతి యని.

౧. అంతర్ధౌతి-ఇది వాతసారధౌతి, ౨. వారిసారధౌతి, 3. వహ్నిసారధౌతి, ౪. బహిష్కృతధౌతి యని నాల్గు తెరంగులు. ౨. దంతధౌతి- ౧. దంతమూలధౌతి, ౨. జిహ్వ (మూల) ధౌతి, 3. కర్ణధౌతి, ౪. కపాలరంధ్రధౌతి యని నాల్గు తెరంగులు 3. హృద్ధౌతి- ౧. దండధౌతి, ౨. వమనధౌతి, 3. వస్త్రధౌతి, యని త్రివిధము. ౪. మూలశోధనధౌతి. ఇందు భేదములు లేవు. ఒకే విధము. ౨. బస్తి లేక, బస్తిక్రియ- జలబస్తి స్థలబస్తి యని ద్వివిధము. 3. నేతిక్రియ- ఒకే విధము. ౪. నౌలిక్రియ-ఒకేవిధము. ౫. తాటకక్రియ- ఒకేవిధము ౬. కపాలభాతిక్రియ- ౧. వ్యుత్క్రమకపాలభాతి యనియు, ౨. వామక్రమ కపాలభాతి యనియు, 3. సీత్క్రమకపాలభాతి యనియు త్రివిధయోగములం గూర్చి వేఱ్వేఱు తావులందుఁ గననగును.

**అష్టాదశ కులములు** — భరత దేశమునందలి కులముల యుత్పత్తిని గూర్చిన

కథనములు ఆయాజాతులకుఁ బ్రత్యేక ప్రత్యేకముగఁ గలవు. అందు సుప్రసిద్ధ వర్ణములగు బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రజాతులకుఁగల కథనములు దేశప్రసిద్ధములే. (జాతులు వేఱ్వేఱు తావులందుఁ గానవగును). (విశ్వబ్రాహ్మణులు చూడుఁడు). తక్కిన పదునాలుగు కులములు కూడ పైవానితో సంబంధములు కలవిగ నగుపడవు. ఏలనన వానికిం బ్రత్యేకములగు నుత్పత్తి కథనములు గానవయ్యెడిని. వీనింగూర్చి స్పష్టముగఁ దెల్పు గ్రంథములు కానరాకున్నను ఆయాకులములందు జ్ఞాపకపరంపరగ చెప్పుకొనుచుండు కులకథనములు వారివారిలో పవిత్రములుగ నెన్నఁబడుచున్నవి. వీనింగూర్చి "శబ్దరత్నాకరమను" గ్రంథమందిట్లు వివరింపఁబడియున్నది. అవి ౧. వ్యావహారికకులము, ౨. గోరక్షక (గొల్ల) కులము, ౩. శిల్పకకులము, ౪. పంచాణకులము, ౫. కుంభకార (కుమ్మరి) కులము, ౬. తంతువాయ (పద్మశాలీ) కులము, ౭. క్షౌరక (మంగలి) కులము, ౮. రజక (చాకలి) కులము, ౯. వస్త్రఛేదక (దర్జీ) కులము, ౧౦. చర్మకార (గొడారి) కులము, ౧౧. తిలఘాతక (తెలుకుల) కులము, ౧౨. లుబ్ధక (బోయ) కులము, ౧౩. ఛాండాలకులము, ౧౪. మాతంగ (మాల) కులము. ఈ పదునెన్మిదికులములను అష్టాదశవర్ణములని గ్రంథములందు వాడియున్నారు.

**అష్టాదశ దేవతా గణములు** — దేవతాగణములు చూడుఁడు.

**అష్టాదశ ప్రాకృతములు** – ప్రాకృతభేదములు చూడుఁడు.

**అష్టాదశవిద్యలు**—విద్యలుచూడుఁడు.

**అష్టాదశసిద్ధవైద్య ప్రవర్తకులు**—అగస్త్యసాంప్రదాయ వైద్యము చూడుఁడు.

**అష్టానందములు** — ఆనందములు చూడుఁడు.

**అష్టామ్లవర్గము** — ఆయుర్వేద వైద్యశాస్త్రమున, నిమ్మపండు, గజనిమ్మపండు, మాదీఫలము, చింతపండు, రేగుపండు, వాకపండు, చుక్కకూర, పుల్లచించలికూర, వీనికి అష్టామ్ల వర్గమని పేరు.

**అష్టావక్రఋష్యాశ్రమము**—హరిద్వారమునుండి నాల్గుమైళ్లదూరమున, రఘుగ్రామ మనంబడు తావున, (ఇప్పుడు రైలాలేక రైవాలాయనెదరు) అష్టావక్రా (చిన్న) నదీతీరమున, అష్టావక్రాశ్రమముఁ జూపెదరు. ఇంకను, గదవాలు రాజ్యములోని, శ్రీనగరప్రాంతమున పౌరీగ్రామముకడ అష్టావక్రాశ్రమమని జూపెదరు. ఇటనున్న పర్వతమును అష్టావక్రపర్వతమని పిలచుచున్నారు. ఇది హిమాలయభూమి పైనున్నది.

**అష్టావక్రుఁడు** — ఈతఁడొక ఋషి. తండ్రి ఏకపాదుఁడు. తల్లి సుజాత. అతితేజోవంతుఁడు. తండ్రిచేతనే అష్టవక్రములతో జన్మించునటుల శపింపఁబడి జన్మించినవాఁడు. లోకవంద్యుఁడైయుండిన మహనీయుఁడు. ఈతని కురూపముజూచి రంభాద్యప్సరలు నవ్వుకొనినందున నీతఁడు వారలను దొంగలచే పట్టుబడుదురుగాక యని శపించెనట. వారు గోపికారూపముల భూమియందు జన్మించి శ్రీకృష్ణనిర్యాణానంతరమున యర్జునుని వెంటఁబడి వచ్చుచో దొంగలచే పట్టువడిరట.

**అష్టావధానము**—అవధానముచూడుఁడు.

**అష్టావరణములు** — ఆవరణము ప్రహరీగోడల మధ్యప్రదేశమని యందరెఱింగినదే. ఇది రక్షణ మనిభావము. శైవాగమములందు ఆవరణములెన్మిదియని చెప్పఁబడినది. ౧. తీర్థము,

౨. ప్రసాదము, ౩. గురుభక్తి, ౪. తా పూజించు ఇష్టదైవభక్తి, ౫. జంగమభక్తి (జంగమ మన తనకు జ్ఞానాభివృద్ధిం గల్గించు అతిథియనిభావము), ౬. తా జపించుమంత్రము, ౭. తాధరించు రుద్రాక్షాదులు, ౮. తాధరించు భస్మ త్రిపుండ్రాదులు అష్టావరణములని చెప్పఁబడినది.

**అష్టగ్రామ (ము)** — ఇప్పుడు దీనిని రావల్ అనుచున్నారు. ఇట రాధ తన మాతామహుఁడగు శూరబాహునింటఁబుట్టి ఒక సంవత్సరము వఱకుఁ బెరిగెను. పిదప నాబాలనామె తండ్రి బ్రిషభానుఁడు (తొల్లి యిటనె కాపురముండువాఁడు) బార్షనపురమునకు కాపురము పోవుచు గొంపోయెను. దానికిం బిదపకాలమున బ్రిషభానుపురమని పేరయ్యెనట. ఇది బర్షాను పర్వతపార్శ్వముననున్న పట్టణము. సంయుక్త రాష్ట్రములలోని మధురజిల్లా ఛాటా పరగణా లోని భరతపూరు సమీపము. (వ్రజమండలము చూడుఁడు).

**అష్టోత్తర శతోపనిషత్తులు** — ఇవి జ్ఞానప్రతిపాదకములు. (ఉపనిషత్తులు చూడుఁడు.)

**అసంగుఁడు**— ఆర్యసంగుఁడు. (అచింత కందరము చూడుఁడు. వేఱొకఅసంగుఁడు యదువంశక్షత్రియుఁడు; అక్రూరుని కనిష్ఠసోదరుఁడు.

**అసంభవదోషము**— లక్షణత్రివిధము చూడుఁడు.

**అసమంజసుఁడు** — ఇక్ష్వాకు సంతతి సూర్యవంశ క్షత్రియుఁడు. తండ్రి సగరచక్రవర్తి. తల్లి సుకేశి (విదర్భ రాజపుత్రిక). కుమారుఁడు అంశుమంతుఁడు. ఈతఁడు బాల్యమున దుర్మార్గుఁడై యుండి తండ్రిచే రాజ్యభ్రష్టునిగఁ జేయఁబడెనట. పిదప భిన్నోదర సోదరు లరువదివేవురు కపిలమహర్షిచే పాతాళమున భస్మముగ నొనర్పఁబడ వారి సద్గతికై తానును తపం బొనర్చుచు గాలము గడిపినవాఁడు. తపఃఫలితముఁ గాంచకయె తానును మృతినందినవాఁడు.

**అసలు వెండి హాలుమార్కు** — బ్రిటిషుదేశములందుఁ బహునాళ్లవ శతాబ్దమున ఒక్కొక ప్రధాననగరమున వెండిబంగారుపనివా రందఱు నొక సంఘముగ జేరి, తమలోనుండి ఎక్కువ నాడెమెఱింగిన ఆరిందాపనివారిని కొందరి నెన్నుకొని వారిమూలమునఁజేయఁబడిన వస్తువులపై 'అసలువెండి' లేక, 'బంగారము' లని పూచీ ముద్ర (Mark) వేయించుట మొదలిడిరట. వారి సంఘకార్యస్థానమునకు కంపెనీగిల్డుహాలు (Company's Guild Hall) అని పేరయ్యెనట. అందు మార్కు వేయఁబడిన వెండివస్తువులకు పూచీనమ్మకములు గల్గుతరి విక్రయమగుటయు సిద్ధముగనే యుండసాగుచుండెనట. ఆ 'డుక ప్రబలి అంను కొంతపేరు తగ్గి హాలు మార్కు అని వాడుచుంట సర్వసాధారణ మయ్యెనట. ఆపద్ధతి ఇప్పుడంత యవసరముగ లేకున్నను నమ్మకమునకు హాలుమార్కు (Hall Mark) అని వాడుక నిలచియున్నది

ఈమార్కు పెక్కులు విధములుగఁ బిదప నయ్యెనట. లండనునగరమున చిరుతపులి తలయు, బర్మింగుహామునకు లంగరును, షెఫీల్డునకు కిరీటమును ఇట్లే వేఱ్వేఱు తావులకు వేఱ్వేఱు గురుతు లుండెనట. అన్నిటికిని హాలుమార్కని పేరట.

క్రీ. శ. ౧౮౯౦ సంవత్సరము వఱకు కొంచము సుంకమును తీసికొనుచుండిరట. ఇప్పుడట్టిబాధ లేదు. సింహాము ఆంగ్లహాలుమార్కుగ నిప్పుడు నడచుచున్నది. హాలుమార్కుండవలయునను నిర్బంధ మిక్కాలమున లేదు.

**అసలే చెట్టులేని దేశములో ఆముదపుచెట్టే మహావృక్షము** — ఆంధ్రలోకోక్తి.

**అసహ్యాజ్ఞాతిదుర్వాక్యం మేఘాంతరితర్కాద్రవత్** — ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. జ్ఞాతిపల్కెడి దుర్భాషలు, మేఘము లందలి అగ్నివలె సహింపశక్యము గానివై యుండు నని భావము.

**అస్త్రములు** — ధనుర్విద్య చూడుడు.

**అస్త్రమస్త్రేణశామ్యతీతి న్యాయము** ఎట్టివిరోధి కట్టిప్రతీకార మొనర్పవలెనని యర్థము. అనగా దుర్మార్గునికి దుర్మార్గ ప్రతీకారమువలన? ప్రత్యుతర మీయనగునని భావము. ఆంధ్రమున కత్తికి కత్తియె జవాబు, కర్రకు కర్రెయె జవాబు, మాటకు మాటయె జవాబనియెడి లోకోక్తి వంటిది. ఇంకను శత్రువు లొనర్చు ప్రయత్న మెంతటి బలమగునదో యంతటి బలమగు ప్రయత్నము తా నొనర్చినను గాని శాంతి కలుగదని భావమును కలదు.

**అస్త్రహృదయము** — సకలరిపు నాశనకరమును యశస్కరమును అగు నొక యస్త్రవిద్య. ఈయస్త్రమును రుద్రుడు స్వాయంభువునకు, అతడు వశిష్ఠమహర్షికి నాతడు చిత్రాయుధుడను గంధర్వునకు, నతడు తన దౌహిత్రి యగు మనోరమకు నుపదేశింప, నామె తన మేనత్త యగు వరూధినీ తనయుడగు స్వరోచికి నుపదేశించి యిచ్చినటుల మార్కండేయ పురాణమున (స్వారోచిషమను సంభవమను మనుచరిత్రయందునను) చెప్పబడియున్నది.

**అస్వరేశాఖక్షత్రియులు** — క్షత్రియ కులము చూడుడు.

**అసాబ్ (ప్రో)ఔక్ట రేటు** — తూర్పు ఆఫ్రికాయందున్నది. (చూడుడు). ఇదియు బేబెల్మాండబు జలసంధికి సమీపము. ఇటలీవారి రక్షణయందున్నది. అసాబుపట్టణమును, మసోవ పట్టణమును శేవ్రస్థలములు.

**అసితుడు** — ఇక్ష్వాకుసంతతి. సూర్యవంశ క్షత్రియుడు. తండ్రి ధృవసంధి. పితామహుడు మాంధాత. సోదరుడు భరతుడు. కుమారుడు సగరచక్రవర్తి. అసితునకు బాహుకుడనియు పేరుకలదు. ఇంకను అసితుడని పేరుగల పౌరాణికుడు వేఱొకడు కలడు. ఇతడు ఋషి. సకలపురాణరహస్యము లెఱింగిన వాడని చెప్పబడినది.

**అసిధారామధులేహనన్యాయము** — కత్తిదారున తేనెను నాకుటయని యర్థము. అపాయకరమగు సంతోషము దెల్పుతరి యీ న్యాయమును వాడుదురు.

**అసిపత్రము** — ఇదియొక నరకము. నరకములు చూడుడు.

**అస్తీకుడు** — నాగము. తండ్రి జరత్కారుడు, తల్లిపేరు జరత్కారువు. ఈమె వాసుకియనుసర్పరాజునకు గనిష్ఠసోదరి. ఈతడు మునియైనవాడు. జనమేజయుడొనర్చిన సర్పయాగబాధలనుండి తక్షకాదులం గాపాడి నిల్పిన వాడీయ స్తీకమునియె (పరీక్షిత్తు చూడుడు).

తక్షకుడు జనమేజయుని సర్పయాగభయమున నుండ న స్తీకుడు తక్షకుని నింద్రుని సింహాసనముం జుట్టుకొనియుండ నియమించి, ఇంద్రుని రక్షణ నిప్పించెను కొంతవడికి జనమేజయుని మంత్రబలమధికమగుకతన "సహేంద్రతక్షకాయస్వాహా" యని హోమము వ్రేల్చ సింహాసనముపైనున్న ఇంద్రునితోసహా ఆతక్షకనాగము అగ్నిగుండములోనికి లాగబడెను. అంతట న స్తీకుడే జనమేజయుని వినుతించి, వారలకు జనమేజయు నుండి మన్నన నిప్పించెను.

**అస్థిగత జ్వరము** — ఆంగ్ల Simple Continued Fever. దీనికిం బురాణజ్వర మనియుఁ బేరుకలదు. శరీరమున జీర్ణించి, అనగా శల్యములదనుక వ్యాపించి, దేహమును క్షయింపజేయు జ్వరము,అదేపనిగ తగులుచుండు జ్వరము. దీనినింకను ఉష్ణము వెన్నున బట్టిన దనుటయుంగలదు.

**అస్థిపంజరము** — అస్థులన ఎముకలు. ఇవి శరీరమునందలి గట్టిపదార్థము. శరీరము నందలి అస్థిపంజరము ఒక చట్రమని (Frame work) యు, శరీరము నిలువఁబడుటకు సాధనమై యున్నదనియు, పైఁగప్పబడిన చర్మము లోన నిముడ్చంబడిన మాంసాదులును ముడుచుకొని పోకుండ నిదియె కారణమై యున్నదందురు. మఱి యును దీని బలమునను, దృఢత్వమునను లోననున్న అంగములు అపాయములనుండి సురక్షితములై యున్నవి.

శరీరమునందలి యస్థిపంజరము, తల సంబంధపు పుర్రె మొదలగు ఎముకలు ఇరువదిరెండు, మెడ యందు వెన్నెముకకుం జెందిన మొదటి ఆరె ముకలు, వెన్నుప్రక్కలు హృదయము కలసిన తుండెము (Trunk) అనంబడు భాగమునందలి ఎముకలు అనగా వెన్నెముకలు ౨౬, ప్రక్క ఎముకలు పండ్రెండు జతలు (౨౪), హృదయ మధ్యస్తమగు Sternum bone లేక Breast plate అనంబడు ఎముక, మెడ కిరుప్రక్కలం క్రిందిభాగమునందున్న రెండు Collar bones ఎముకలు, రెండు రెక్కగూటి ఎముకలు (Shoulder blades or Scapulae bones), కడ్డివద్ద ఎముకలు రెండు (Pelvis bones), ఒక్కొక కాలియందు ముప్పది చొప్పున రెండు కాళ్లయందు అరువది ఎముకలు (Lower Limbs), ఒక్కొక చేతియందు ముప్పది చొప్పున రెండుచేతులందు అరువది ఎముకలు (Upper Limbs), ఇటుల అస్థిపంజరమునందలి ఎముకలు ౨౦౬. వీనిని నాల్గుతెగలుగభాగించిరి.

ఇందు (Femur Bones) తొడ ఎముకలు, (Tibia and Fibula) పిక్క ఎముకలు, (Humurus) దంతఎముకలు, (Radius and Ulna) ముంజేతి ఎముకలు, (long bones) పొడవు ఎముకలని చెప్పఁబడుచున్నవి. పుర్రె ఎముకలు (Skull bones), హృదయమధ్య శల్యము (Sternum bone), మొదలగునవి Flat Bones అని చెప్పఁబడుచున్నవి. వెన్నె ముక సంబంధమగు శల్యములు Cylindrical bones అనంబడుచున్నవి. . ముంజేయి చీల మండలకడనున్న ఎముకలు Irregular bones అనంబడుచున్నవి. మీఁజేతులు పాదములందున్న ఎముకలు Short Bones అనంబడుచున్నవి. భాస్వరము (Phosphorous) కర్బనము (Carbon) కేల్సియము (Calcium) ఎముకల యందుండునని చెప్పఁబడినది. ఎముకల మధ్య నున్న కాళీప్రదేశములందు Marrow అనఁబడు పదార్థముండుననియు, అది రక్తమును ఆహారము కొఱకు అనగా శరీర అవయవ భాగముల పోషణ (Nourishment) కొఱకు పీల్చుకొను చుండు ననియుఁ జెప్పఁబడినది. ఎముకలు గట్టి పదార్థ ములు. వయస్సు ముదురుచున్నకొలది Brittle గా నగుచుండుననియు, లేత శరీరములందు వంగు అవస్థ యందుండుననియు పరిశీలనలవలన తేలు చున్నది. ఈసందర్భమున నెముకలంగూర్చి ఒకటి రెండు సంగతులిట వివరించి ముగించుట సమంజసము. ఎముకలు వేఱ్వేఱుగనుంటయు, అవి ఒకటితో నొకటి Ligament అనఁబడు రబ్బరుంబోలిన పదార్థముల సముదాయముచే నొకటితో నొకటి బిగింపఁబడి యుంటయు, వెన్నెముకలు, మోచేతులు, మోకాళ్లు, చేతి వ్రేళ్లు, మొదలగునవి వంగుటకు అవకాశముకల్గు

చున్నది. బుర్రలోని, పుఱ్ఱెకోని ఎముకలు (Immovable Joint) గట్టిగబిగింపఁబడి యుండుటచేసట్లు వంగజాలవు. ఇట్టికీళ్ళు (joints) నాల్గురకములుగ చెప్పఁబడినవి

౧. Pivot joint- దీనికి శాస్త్రమున atloaxoid joint అనియుం జెప్పియున్నారు. ఇవి వెన్నెముకకుఁబైభాగమున నున్న మొదటి రెండెముకలం గల్పునదిగా నున్నది. అందు మొదటి ఎముక పుఱ్ఱె కంటియుండును. దానికిని క్రింద axis అనఁబడు క్రింది ఎముకకును నడుమ నీ joint ఉండి పైఎముకను పుఱ్ఱెను కదలునట్లు చేయుచున్నది. దీని ఆకారమును బట్టి దీని కీ పేరు కల్గియుండనోపు.

౨. Hinge joint- దీనికి సాదృశ్యములు మోచెయ్యి, మోకాలు, క్రిందిదవడ, ముంజేయి, వ్రేళ్లు (Phalaugal joint or knuckle joints) నై యున్నవి. ఇవి బందుతో నతకఁబడిన తలుపుద్వారములం బోలియుంట నీ పేరయ్యెఁ గానోపు.

3. Ball and socket joints- దండకు పైనున్న చంకలకడనున్న కీలును, తొడలకు పైనున్న గజ్జలకడ జాయింటును దీనికి ఉదాహరణములు.

౪. Gliding joint- చేతి, కాలి చీలమండలు అనగా (Wrist and ankle joints) సంధులకడ నున్నవి దీనికి ఉదాహరణములు. వీటి మూలమున నాయాయెముక లుండిన తావులు కదలుట, వంగగలుగుట జరుగుచున్నవి.

ఈ ఎముకలనడుమ Cartilage యను పేరుగల మెత్తనిపదార్థము గలదు. అది మెత్తవలె ఎముకల కేదెబ్బయు, రాపిడియు, ఒత్తిడియుం గలుగనీయక కాపాడుచుండును.

ఇంతియె గాక ఈ పై యెముకల అంచులందు Synovial అనంబడు జిడ్డుపదార్థము (L ubricating Liquid) అరుగుదలం గలుగకుండ సమకూరియుండును. ఈ జాయింట్లు లేకుండిన నడక, వంగుట, పనిచేయుట దుర్లభమే యగును.

**అస్సియారేంజిపర్వతములు**— చతుష్పీఠపర్వతము. (ఖండగిరిగుహలు చూడుఁడు)

**అస్తీదేవి** — జరాసంధుని కుమార్తె, కంసుని పెద్దభార్య.

**అస్సీరియాదేశము** — కురుడుస్థానము చూడుఁడు.

**అసురాచలశిఖరము** వాలుకాదేవి చూడుఁడు.

**అసురులు లేక రక్కసులు** — కశ్యపునకు సురసయందు జన్మించినవారు రాక్షసులు. ఇంకను వేరుఋషులు మొదలగువారికిని జన్మించిన రాక్షసులలోఁజేరినవారును కలరు. వీరందరు రాక్షసులనంబడుదురు. దీనియొక్క ఆంధ్రరూపము రక్కసులు. వీరు దానవులు, దైత్యులవంటి అందరు రాక్షసులే. సురసయందు కల్గిన సంతతి, జన్మించినతోడనే క్షుత్పిపాసాతురులై, కొందరు 'రక్షామ' యనియు, కొందరు 'యక్షామ' యనియు నేడ్వసాగిరట. దానంజేసి, వారిరుతెగలై రాక్షసులుగను, యక్షులుగను పేరందిరట. వీరు సుర (దేవత)లకు విముఖులగుట యసురులనియుం బేరందిరి. సర్వసాధారణముగ, దానవులను, దైత్యులనుకూడ రాక్షసులనియు, అసురులనియు వాడుచునేయుందురుగాని యక్షులనుమాత్రము వేఱుగఁబల్కుచుందురు. నిజమునకు వారునూ రాక్షసులలోని యొకతెగవారేనని తెలిసెడిని.

అకంపనుఁడు - తంత్రిడిసుమాలి, రావణపక్షమువాఁడు, జనస్థానమున ఖరదూషణత్రిశిరసులు శ్రీరామునిచేజంపఁబడినవార్తను రావణభూపతికెరింగించినవాఁడు. ముట్టడికాలమున లంకాపుర

పశ్చిమద్వారమున నాంజనేయునిచే నిహతుఁడైన వాఁడు.

అఘాసురుఁడు - బకాసురుని కనిష్ఠసోదరుఁడు. (బకాసురుఁడు బృందావనమున శ్రీకృష్ణునిచే నిహతుఁడైనవాఁడు.) అజగరాకారమున నీతఁడును శ్రీకృష్ణునితో పోరి నిహతుఁడాయెను.

అంజనపర్వుఁడు- తండ్రి ఘటోత్కచుఁడు. పితామహుఁడు భీమసేనుఁడు. పాండవులలో నొకఁడు. భారతయుద్ధమున నశ్వత్థామచే నిహతుఁడైనవాఁడు.

అతికాయుఁడు- తండ్రి రావణాసురుఁడు. సోదరులు త్రిశిరుఁడు, దేవాంతకుఁడు, నరాంతకుఁడు, మహాపార్శ్వుఁడు, మేఘనాధుఁడు (లేక ఇంద్రజిత్తు). అతికాయుఁడు లంకాయుద్ధమున లక్ష్మణుని బ్రహ్మాస్త్రమునకు గురియై మరణించిన వాఁడు.

అనిలుఁడు- తండ్రి మాలి. అనిలుఁడు విభీషణానుచరుఁడు.

అయోముఖి- దండకారణ్యవాసినియగు నొక రక్కసి. లక్ష్మణుఁడు దీని ముక్కుచెవులుకోసి వంచించినటుల చెప్పఁబడినది.

అయోముఖుఁడు- ఈతని దనువుపుత్రునిగఁ గూడ జెప్పియున్నారు.

అరిష్టుఁడు- వృషభరూపమునవచ్చి శ్రీకృష్ణునితోఁబోరి నిహతుఁడైన రాక్షసుఁడు.

అలంబసుఁడు- ఈపేరుగల అసుర లిర్వురు కలరు. బకాసురుని తమ్ముఁడొకఁడు. ఈతఁడు ఘటోత్కచునిచేఁ జంపఁబడినవాఁడు. రెండవయాతఁడు జటాసురుని కుమారుఁడు. ఈతఁడును ఘటోత్కచునిచే నిహతుఁడైనవాఁడే.

అక్షుఁడు-తండ్రి రావణభూపతి. తల్లి మండోదరి (ఈమె మయునికుమార్తె). సోదరులు అతికాయుఁడు, త్రిశిరుఁడు, దేవాంతకుఁడు, నరాంతకుఁడు, మహాపార్శ్వుఁడు, మేఘనాధుఁడు లేక ఇంద్రజిత్తు. అక్షుఁ డాంజనేయునిచే చంపఁబడిన వాఁడని చెప్పఁబడినది.

ఇంద్రజిత్తు- ఈతనికి మేఘనాధుఁడనియుం పేరుకలదు (అక్షుఁడు చూడుఁడు). ఇంద్రజిత్తు పదునాల్గు వత్సరములు నిద్రాహారము లెఱుఁగని వానిచేగానిఁ జచ్చువాఁడుగాఁడట కాన లక్ష్మణుఁ డీతనిం గూల్చెనట.

కబంధుఁడు- దండకారణ్యమున నొక వికారరూపముగల రాక్షసుఁడు. శ్రీరామలక్ష్మణులు సీతను వెతకుచుంబోయినతరి వారిని మ్రింగబోయి నరకబడి గంధర్వుఁడాయెను. తొల్లింట నీతఁడు దనువను గంధర్వుఁడట. స్థూలకేశుఁడను ఋషి శాపమున నిట్లైనవాఁడట. మఱియు బాణాసురుని మంత్రియగు కుంభాండుఁడనువానికిం గబంధుఁడనియు నామాంతరము కలదట.

కాలకార్ముకుఁడు- సుమాలి కుమారుఁడు.

కాలకేయులు- తండ్రి కశ్యపుఁడు; తల్లి కాల. ఈమె సంతానమందఱు కాలకేయులనఁబడుదురు. వీరు సముద్రమున దాగియుండి, దేవతలను కడు బాధించువారనియు, అగస్త్యమహర్షి వీరు దాగియుండిన సముద్రభాగమును త్రాగివేయ నర్జునుఁడు వీరి నశేషనిహతులం జేసెననియుం జెప్పఁబడియున్నది. వీరి రాజధాని హిరణ్యపురమని చెప్పఁబడినది.

కాలనేమి- రావణుని మేనమామ. తల్లి కేతుమతియను గంధర్వస్త్రీ. సోదరుఁడు ప్రఘనుఁడు. తండ్రి సుమాలి. సోదరి కైకశి. మఱియు తారకయుద్ధమున విష్ణువుచేఁ జంపఁబడిన యొక దానవుఁడును కాలనేమియను పేరుగలవాఁడే.

కిమ్మీరుఁడు- బకాసురునితమ్ముఁడు. కామ్యకవనమున భీమసేనుఁడు వీనిం బరిమార్చెను.

కుంభకర్ణుఁడు- తండ్రి విశ్రవసు, తల్లి కైకశి. భార్య విద్యుజ్జ్వాల. ఏకోదర సోదరులు రావణ విభీషణులు. భిన్నోదర సోదరులు కుబేర, మహోదర, మహాపార్శ్వ, ఖరాసుర, దూషణ, త్రిశిరులు. సోదరి శూర్పణఖ. పుత్రులు కుంభుఁడు, నికుంభుఁడు. ఈతఁడు ప్రమాదవశమున నిద్రవర మందినవాఁడు.

కుజంభుఁడు- ఈతఁడు విదూరథుని కుమార్తె యగు సౌనంద లేక ముదావతి యను కన్య నెత్తుకొనిపోయి పాతాళమునందు దాచెననియు, వత్సంద్రుఁడను భూపతి యీతనిం బరిమార్చి యాబాలం గొనిపోయి తాను పరిణయమయ్యె ననియుం జెప్పఁబడినది. ఈతనికడ సర్వశత్రు నిర్మూలకమగు నొకముసలము (రోకలి) యుండె నట. దానితో నతండు పెక్కండ్రం బరిమార్చు వాఁడట. దాని నీముదావతియే పాడుచేసెనట.

కుంభాండుఁడు- ఇతనికి కబంధుఁడనియుం బేరుగలదు. బాణాసురునికడ మంత్రిగ నున్న వాఁడు.

కుంభీనస- రాక్షసస్త్రీ. సుమాలి కుమార్తె. భర్త విశ్రవసుఁడు. కుమాళ్ళు ఖర దూషణ త్రిశిరులు.

కుంభుఁడు- తండ్రి కుంభకర్ణుఁడు. తల్లి విద్యుజ్జ్వాల. సోదరుఁడు నికుంభుఁడు. సుగ్రీవునిచే నిహతుఁడైనవాఁడు.

కుముదుఁడు.

కైకశి- తండ్రి సుమాలి (రాక్షసుఁడు). తల్లి కేతుమతియను గంధర్వస్త్రీ. సోదరులు ప్రహస్తుఁడు, కాలనేమి. భర్త విశ్రవసు. (రెండవ భార్య) సుతులు రావణ, కుంభకర్ణ, విభీషణులు.

కైటభుఁడు- ఈతఁడును, మధుఁడును విష్ణుదేవునినుండియె జనించిరనియు విధాతం బాధింప విష్ణుదేవుండు వారించి తనచేత వారుచచ్చునట్లు వారివలననే వరముం గొని వారిం బరిమార్చిన కతమున, విష్ణుదేవునకు మధువైరి, కైటభారియని బిరుదు నామములుగూడ గల్గినవనియుం జెప్పఁబడినది.

ఖరుఁడు-(ఖరాసురుఁ) తండ్రి విశ్రవసుఁడు. తల్లి రాక. ఏకోదరసోదరులు దూషణుఁడు త్రిశిరుఁడు. భిన్నోదరసోదరులు కుబేర, రావణ, కుంభకర్ణ, విభీషణ, మహోదర, మహాపార్శ్వులు. ఖరాసురుఁడు జనస్థానమందలి రావణ సైన్యమున కధిపతి. శ్రీరాముఁ డీతని వధించెనని చెప్పఁబడినది.

గజకర్ణుఁడు— ఈతఁడొక యక్షుఁడు.

గ్రసనుఁడు- ఈతఁడు తారకయుద్ధమున విష్ణుదేవునిచే నిహతుఁడైనవాఁడు.

ఘటోత్కచుఁడు- తండ్రి పాండవులలో నొకఁడగు భీమసేనుఁడు. తల్లి హిడింబ. మేనమామ హిడింబాసురుఁడు. కుమారుఁడు అంజనపర్వుఁడు. భారతయుద్ధమున శత్రుసైన్యములం బరిమార్చి, అర్జునునిపై కర్ణునిచేవదలఁబడిన శక్తి బాణాహతిం గూలినవాఁడు.

చండుఁడు- ఈతఁడును, ముండుఁడును, శుంభ నిశుంభుల భృత్యులు. కౌశికీదేవిచే నిహతులైన వారు.

చాణూరుఁడు- ఈతఁడు కంసునికడ మల్లుఁడుగనుండిన రాక్షసభటుఁడు. మిక్కిలి శూరుఁడనియు, శ్రీకృష్ణునితోఁ గలహించి మల్లయుద్ధ మొనర్చుచు నాతనిచే హతుఁడైనవాఁడని చెప్పఁబడినది.

చార్వాకుఁడు- దుర్యోధనుని మిత్రుఁడు. భారతయుద్ధానంతరము యుధిష్ఠిరుని పట్టాభిషేక కాలమున ఋషివేషధరుఁడైవచ్చి విఘ్న మొనర్ప యత్నించి ఋషుల కోపమునకుగురియై నీరైపోయినవాఁడని చెప్పఁబడినది.

జటాసురుఁడు- గంధమాదనపర్వతమున భీమ సేనునిచే జంపఁబడినవాఁడు.

జంభాసురుఁడు- ఇంద్రుని వైరి. తారకయుద్ధమున దేవేంద్రుఁడీతనిం జంపి, జంభాసురారి యని వాడుక నందెనట. ఈతని కుమార్తె దత్తాదేవి హిరణ్యకశ్యపుని భార్యయయ్యెను.

జంబుకుమారుఁడు- తండ్రి విద్యుజ్జిహ్వుఁడు. తల్లి శూర్పణఖ. మేనమామలు రావణ, కుంభకర్ణ, విభీషణులు. సవతిమేనమామలు కుబేర, మహోదర, మహాపార్శ్వ, ఖరాసుర, దూషణ, త్రిశిరులు.

జంబుమాలి- తండ్రి ప్రహస్తుఁడు. జంబుమాలి రావణసైన్యాధిపతులలో నొకఁడనియు, అశోకవనమున నాంజనేయునిచేఁ జంపఁబడెననియుఁ జెప్పఁబడినది.

త్వష్ట్ర- భార్య రచన. పుత్రులు విశ్వరూపుఁడు, వృత్రాసురుఁడు. త్వష్ట్రి బ్రహ్మమానసపుత్రుఁ డని చెప్పఁబడినది.

తాటక- తండ్రి సుకేతుఁడు. భర్త సుందుఁడు. పుత్రులు మారీచ, సుబాహువు. వీ రిర్వురు అగస్త్యునివలన రాక్షసులగునట్లు శపింపఁబడి రాక్షసులైరని చెప్పఁబడినది. స్వతస్సిద్ధముగ తాటక కొన్ని యేనుఁగుల బలముకలదట. ఈమె గర్భవతిగ నుండ నీమెభర్త చనిపోయెనట. ఆదుఃఖవశమున నగస్త్యుని యాశ్రమమునకుఁ బర్విడి యాయునం బెదరింప మొదలిడ, నాతఁడు నీగర్భముననున్న సుతులు రాక్షసులగుదు రని శపించెనట. ఈమె కడు క్రూరురాలనియు, శ్రీరాముఁడు విశ్వామిత్రుని యాగరక్షణకై యేగుచో మధ్యేమార్గమున నీతాటకను బరిమార్చెననియుఁ

తాళకేతుఁడు- ఈతని జ్యేష్ఠసోదరుని పేరు పాతాళకేతుఁడు.

త్రిజట- తండ్రి విభీషణుఁడు. తల్లి సరమాదేవి. సీత లంకయందు వనవాస మొనర్చు కాలమున నీమె సీతాదేవి కుపచార మొనర్చుచు నూరటవాక్యములం దెల్పుచుండెనని చెప్పఁబడినది.

త్రిశిరుఁడు- ఈపేరుగల రాక్షసు లిర్వురు గానవచ్చెదరు. అందొకఁడు విశ్రవసునకు రాకయందు కల్గిన సుతుఁడు. సోదరులు ఖరుఁడు, దూషణుఁడు. ఈతఁడు జనస్థానమందలి రావణసైన్యముల కధిపతులలో నొకఁడు. మఱియొక త్రిశిరుఁడు రావణునకు మండోదరియందుఁ గల్గిన సుతులలోనివాఁడు. ఈతనిసోదరులు మేఘనాధుఁడు (ఇంద్రజిత్తు), అతికాయుఁడు, మహాపార్శ్వుఁడు, దేవాంతకుఁడు, నరాంతకుఁడు అను వారలు.

తూపలకుఁడు- ఈతఁడు చాణూర ముష్టికులతోసహా శ్రీకృష్ణునితో మల్లయుద్ధమొనర్చి యాతనిచే నిహతుఁడైనవాఁడు.

తృణావర్తుఁడు- వీనికి చక్రసమీర దైత్యుఁడనియుం బేరుకలదు. ఈతఁడు దైత్యుఁడనియు, అసురుఁడనియుం గూడ చెప్పఁబడుటచే స్పష్టము గాకున్నది. శ్రీకృష్ణునిచేఁ జంపఁబడెను.

దత్తాదేవి- జంభాసుర పుత్రిక. హిరణ్యకశ్యపునిభార్య. ప్రహ్లాదునితల్లి.

దంతఘాతకుఁడు- వీఁడు విశ్వామిత్ర సృష్టియనియు, హరిశ్చంద్రుని భ్రమింపఁజేయు విశ్వామిత్రునిచే నియమింపఁబడినవాఁడనియుం జెప్పంబడినది.

దనువు- అయోముఖుని తండ్రి.

దుందుఁడు- ఈతనింజంపుటచేఁ గువలయాశ్వునకు దుందుమారుఁడని పేరు వాడుకగల్గెను.

దూషణుఁడు- తండ్రి సుమాలి. తల్లి రాక. సోదరులు ఖర, త్రిశిరులు. వేరొక దూషణుఁడు జనస్థానముననుండువాఁడు. విశ్రవసునికుమారుఁడు.

దేవాంతకుఁడు- తండ్రి వణుఁడు. తల్లి మండోదరి. హనుమంతునిచే జంపఁబడినవాఁడు

నరకాసురుఁడు- తండ్రి వరాహావతారమునున్న విష్ణుదేవుఁడు, తల్లి భూదేవి,సోదరుఁడు మురాసురుఁడు,రాజధాని ప్రాగ్జ్యోతిషపురము, వాహనము సుప్రతీకమనెడి ఏనుఁగు, కుమారుఁడు భగదత్తుఁడు. నరకమహారాజు అదితినుండి కర్ణకుండలములు,వరుణునుండి ఛత్రము, ఇంద్రునుండిమణిపర్వతమనియెడి అమరాద్రిస్థానము హరించిన వాఁడు. ఈతఁడొకప్పు డింద్రు నోడించి అమరావతీ పురమాక్రమించినవాఁడు. శ్రీకృష్ణునర్థించి యాయన సాహాయ్యమున నీతని నింద్రుఁడు జయింపఁగల్గెనట.

నరాంతకుఁడు- తండ్రి రావణాసురుఁడు, తల్లి మండోదరి, సోదరులు మేఘవాహనుఁడను నింద్రజిత్తు, అతికాయుఁడు, మహాపార్శ్వుఁడు, దేవాంతకుఁడు, త్రిశిరుఁడు. అంగదునిచే జంపబడినవాఁడు. నికుంభుఁడు:- తండ్రి కుంభకర్ణుఁడు, తల్లి విద్యుజ్జ్వాల, సోదరుడు కుంభుడు. హనుమంతునిచే నిహతుఁడైనవాఁడు. నివాతకవచులు:- వీరు దైత్యులలోని వారనియుం గూడ కొన్నితావులచెప్పఁబడియున్నది. ప్రహ్లాదుని వంశస్థులట. భాగతమున నివాతకవచులు దానవులని చెప్పఁబడినది. వీరంద ఱొకేరూపము, ఒకేబలము, ఒకే ప్రతాపము కలవారని చెప్పఁబడినది. వీరి సంఖ్య ముప్పది కోట్లు. వీరిరాజధాని పురములు అన్నియు సముద్రమున నుండెడివి. అందు హిరణ్యపురమనునది ప్రధాన నగరమై యుండెడిది. నివాతకవచులు, కాలకేయులు కలసి మెలసి యన్యోన్యమున నివసించువారట. ఇంద్రప్రేరితుఁడై యర్జునుఁడు వీరినందరిం బరిమార్చెనట. అగస్త్యుఁడు కాలకేయులకై ఆసముద్రభాగమును పీల్చివేయ నర్జునుఁడందరిం బూర్తిగ బరిమార్చెనట.

ప్రఘసుఁడు- సుమాలి కుమారుఁడు. సోదరుఁడు కాలనేమి. (రావణుని మేనమామలు).

తోబుట్టువ కైకశి (విశ్రవసు భార్య). తల్లి కేతుమతి యను గంధర్వస్త్రీ.

ప్రలంబుఁడు- బలరాముని చంపవలయు నని గోపాలరూపమున వచ్చి, అతనితో నాటలాడు నట్లు నటించి అతనిచే నిహతుఁడైనవాఁడు.

పల్వలుఁడు- ఇల్వలుని కుమారుఁడు. బలరామునిచే నిహతుఁడైనవాఁడు.

ప్రహస్తుఁడు- సుమాలికొడుకు. వీనిసుతుఁడు జంబుమాలి.

ప్రహేతి- సృష్ట్యాదిని సృష్టింపఁబడిన రాక్షస ప్రభువు. భార్య కాలభగినియగు భయాదేవి. కుమారుఁడు విద్యుత్కేశుఁడు. సోదరుఁడు హేతి. ప్రహేతి మిగులధార్మికుఁడై కడకు సంసార, సంగమువీడి తపంబొనర్చెననియు, తొలుత తామసుఁడైయుండి రాజ్యమేలెననియుం జెప్పఁబడినది. మరియు నీతఁడు మాల్యవంత రాక్షస వంశపు మూలపురుషుఁడు.

పాకాసురుఁడు- వృత్రాసురుని తమ్ముఁడు. మిగుల బలాఢ్యుఁడు. ఈతనిని జయించుటచేత నింద్రునకుఁ బాకశాసనుఁడని పేరుగల్గెను.

పాతాళకేతుఁడు- ఈతఁడు మదాలసను ఎత్తుకపోయినవాఁడనియు, గాలవర్షికి తపోభంగము గావించినవాఁడనియుఁ జెప్పఁబడినది. ఈతని కనిష్ఠసోదరుఁడు తాళకేతుఁడు.

పూతన- రాక్షసస్త్రీ. శ్రీకృష్ణుని బాల్యమున వ్రేపల్లెకరిగి బాలింతవేషమున శ్రీకృష్ణునకు స్తన్య మిచ్చునటులనటించి విషమిూయఁ బ్రయత్నించి యాతఱి నాతనిచేఁ జంపఁబడినది.

బకాసురుఁడు- ఈతఁ డేకచక్రపురమను (ఇప్పటి ఇటావాసంధినుండి నైఋతిదిశగా పదునారుమైళ్ళ దూరముననున్న చక్రనగర్) తావున దినమున కొక్కనిచొప్పున భక్షించుచుండువాఁడట. పాండవులు లాక్షాగృహ

దహనగండమునుండి దప్పించుకొని ఇటకేగి మారుమాపమున నివసించుచుండుతరి భీమసేనుఁడు బకాసురుని బరిమార్చెనట. పిదపనే ద్రౌపదిం బరిణయమైరని చెప్పఁబడినది.

మఱియు వేఱొక బకాసురుఁడు శ్రీకృష్ణుఁడు బృందావనమున నుండుతరి, కంసుని పంపున బక రూపధారియై వచ్చి శ్రీకృష్ణుని మ్రింగఁబోయి కలహించి యాతనిచే నిహతుఁడైనవాఁడు.

బలాకుఁడు- సుశర్మ్మయనువాని భార్యనెత్తు కొనిపోయినవాఁడనియు, ఉత్తానపాదుని కుమారుఁడగు నుత్తముని భార్యను అతనికి మరల తెచ్చి యిచ్చినవాఁడనియుఁ జెప్పఁబడినది.

భగదత్తుఁడు-నరకాసురుని పుత్త్రుఁడు. ప్రాగ్జ్యోతిషపురము (కామరూపదేశము) నేలినభూపతి. కుమారుఁడు వజ్రదంతుఁడు.

భాసకర్ణుఁడు- తండ్రి సుమాలి.

భీషణుఁడు- బకాసురుని తమ్ముఁడు.

మకరాక్షుఁడు- తండ్రి ఖరాసురుఁడు. శ్రీరాముని వలన లంకముట్టడికాలమున ఆగ్నేయాస్త్రమునకు గురియై నిహతుఁడైనవాఁడు.

మత్తుఁడు- మాల్యవంతుని కుమారుఁడు. సోదరులు విరూపాక్షుఁడు, వజ్రముష్టి, సుప్తిఘ్నుఁడు అనువారలు.

మందేహారిణులు - వీరు సూర్యవిరోధులు. గొప్పవరములందినవారు. త్రికాలములందు సంధ్య అర్ఘ్యము లీమందేహారిణుల నుపశాంతి యొనర్చుటకని చెప్పఁబడినది.

మండోదరి- దితిపుత్త్రుఁడగు మయునికుమార్తె, రావణునిభార్య. సోదరులు మాయావి, దుందుభి. కుమాళ్లు ఇంద్రజిత్తు మొదలగువారు. (రావణుఁడు చూడుఁడు) మండోదరి గంభీరాకారముగలదని చెప్పఁబడినది.

మధుఁడు- (కైటభుఁడు చూడుఁడు) లవణాసురుఁడు పుత్త్రుఁడు.

మయుఁడు- తండ్రి కశ్యపుఁడు. తల్లి దితి. కుమాళ్ళు మాయావి, దుందుభి. కుమార్తె మండోదరి (రావణునిభార్య). ఈతఁడు దానవ విశ్వకర్మయనఁబడును.

మహాపార్శ్వుఁడు- ఈపేరుగలవారిద్దరు గానఁగుచున్నారు. రావణుని పినతల్లి (పుష్పోత్కట) కుమారుఁడొకఁడును, రావణుని సుతుఁడొకఁడు (ఋషభునిచే నిహతుఁడైనవాఁడు) ను మహాపార్శ్వుఁడను పేరుగలవారలే.

మహాబలుఁడు- సుమాలి కుమారుఁడు.

మహోదరుఁడు- ఈపేరుగలవారిద్దరు గానఁగుచున్నారు. రావణుని పినతల్లి పుష్పోత్కట కుమారుఁడొకఁడును,రావణునికొమారుఁడొకఁడు (నీలునిచే నిహతుఁడైనవాఁడు) ను మహోదరులే. వీరుగాక మూడవవాఁడు మరియొకమహోదరుఁడు గలఁడేమోనని సంశయము గల్గెడిని. వీఁడు శ్రీరామునిచేఁ జంపఁబడినవాఁడట. ఈతని తలపుఱుక ఒక తపస్వికాలికిందగులుకొని రాక గొప్ప వేదన కల్గించుచుండెనట. శుక్రునియాశ్రమముకడనున్న కపాలమోచనమున విముక్తమయ్యెనట.

మారీచుఁడు- తండ్రి సుందుఁడను యక్షుఁడు, తల్లి తాటక. ఈమె సుకేతుఁడను యక్షుని కుమార్తె, సోదరుఁడు సుబాహు, అగస్త్య మహర్షి శాపమువలన రాక్షసులైన కుటుంబము (తాటక చూడుఁడు).

మాల్యవంతుఁడు- తండ్రి సుకేశుఁడు, సోదరుఁడు మాలి.

మాలి- తండ్రి సుకేశుఁడు, సోదరుఁడు మాల్యవంతుఁడు. ఈతఁడు దేవాసురయుద్ధమున

విష్ణువుచే నిహతుఁడైనాఁడు, కుమారుఁడు సంపాతి.

ముండుఁడు- చండముండులలోని అసురుఁడు, శుంభనిశుంభులు భృత్యులు, కౌశికీదేవివలన నిహతుఁడైనవాఁడు.

మురాసురుఁడు- తండ్రి వరాహావతారమున నున్న విష్ణువు, తల్లి భూదేవి, సోదరుఁడు నరకాసురుఁడు (ఒకప్పు డింద్రపదవి నాక్రమించిన వాఁడు), వీరిది కామరూపదేశపురమగు ప్రాగ్జ్యోతిషము, శ్రీకృష్ణునిచే నిహతుఁడైనవాఁడు, (నరకాసురుఁడు చూడుఁడు) పుత్రుఁడు శ్రవణుఁడు, (శ్రీకృష్ణునిచే చంపఁబడినవాఁడు).

ముష్టికుఁడు- ఈతఁడును, చాణూరుఁడును, తూపలకుఁడును, ముష్టియుద్ధమున శ్రీకృష్ణునిచే నిహతులైనవారు.

మూకాసురుఁడు- శివుఁడు మాయాకిరాతవేషమున అర్జునునకు ప్రసన్నుఁడగుకతన, మూకాసురుఁడు వరాహరూపమున అర్జునుని కలఁతపెట్టినట్లు చెప్పబడినవాఁడు.

మేఘనాధుఁడు- తండ్రి రావణుఁడు. తల్లి మండోదరి. ( రా వ ణు డు చూ డు ఁ డు ). మేఘనాధుఁడింద్రుని జయించి, ఇంద్రజిత్తని పేరందినవాఁడు. లంకాయుద్ధమున లక్ష్మణునిచే నిహతుఁడైనవాఁడని చెప్పఁబడినది.

యజ్ఞకోపుఁడు- తండ్రి మాల్యవంతుఁడు.

యజ్ఞఘ్నుఁడు- యజ్ఞవరాహావతారరూపియగు విష్ణుదేవునిచే నిహతుఁడైనవాఁడు.

రాక- రాక్షసస్త్రీ. సుమాలి కుమార్తె. విశ్రవసునిభార్య. ఖరదూషణ త్రిశిరసుల తల్లి. మరియుం ధాతభార్యలలో నొక రాక గలదు.

రావణుఁడు- రాక్షసుల ప్రభువు. రాజధాని లంకాపురము. ఇప్పుడు సముద్రముచే నాక్రమింపఁబడి గ్రేటుబెసిన్, లిటిల్ బెసిన్ అనంబడు తావుల సింహళద్వీపముకుం జేరి యుండినతావు. దీనినిప్పటికి రావణుని కోటలతావుగ నచటివారు జూపుదురు. రావణుని మేనమామలు ప్రఘసుఁడు కాలనేమి. తండ్రి విశ్రవస్సు. తల్లి సుమాలి కుమార్తెయగు కైకశి. భార్య మయుని కుమార్తెయగు మండోదరి. కుమాళ్లు మేఘనాధుఁడు (లేక ఇంద్రజిత్తు), అతికాయుఁడు, మహాపార్శ్వుఁడు, దేవాంతకుఁడు, నరాంతకుఁడు, త్రిశిరుఁడు. ఏకోదరసోదరులు కుంభకర్ణుఁడు, విభీషణుఁడు. ఏకోదరసోదరి శూర్పణఖ (ఈమె విద్యుజ్జిహ్వుని భార్య. ఈమెపుత్రుఁడు జంబుకుమారుఁడు). భిన్నోదర సోదరులు కుబేరుఁడు, మహోదరుఁడు, మహాపార్శ్వుఁడు, ఖరుఁడు, దూషణుఁడు, త్రిశిరుఁడు. సవతితల్లులు ఇలబిల, పుష్పోత్కట, రాక అనువారలు. తండ్రిసోదరులు అగస్త్యుఁడు, అగస్త్యభ్రాత. పితామహుఁడు పులస్త్యమహర్షి. మాతామహుఁడు సుమాలి. రావణుఁడు బలాఢ్యుఁడగు భూపతి. గొప్ప విద్వాంసుఁడు. రావణభుజంగస్తోత్రము రచించిన కవీశ్వరుఁడు. హిమవన్నగమున కైలాసశిఖరము కడ రావణహ్రదము (లేక రాక్షసతలము ఇప్పటి రఖస్థల్) నేర్పరిచి ఘోరతపంబొనర్చి పరమేశ్వర మహాబలముంగొని గోకర్ణక్షేత్రమున మహాబలేశ్వరశివలింగమును గోకర్ణరంధ్రమున ప్రతిష్ఠించిన మహాత్ముఁడు. ఇంక నిట్టికార్యము లీమహానీయుఁడొనర్చిన వెన్నియోయున్నను శ్రీరాముని రాణియగు సీత నెత్తుకపోయి లంకాయుద్ధమున శ్రీరామునిచే నిహతుఁడైనవాఁడు. ఈతనికిం బిదప నీతనితమ్ముఁడు విభీషణుఁడు లంకారాజ్యమున కధిపతియయ్యెను.

లవణాసురుఁడు- తండ్రి మధువు. శ్రీరాముని సోదరుఁడగు శత్రుఘ్నునిచే నిహతుఁడైనవాఁడు. ఈతఁడు చాల క్రూరుఁడని చెప్పఁబడినది.

వజ్రజ్వాల- కుంభకర్ణుని భార్య.

వజ్రదంష్ట్రుఁడు- రావణునిభటుఁడు. లంకా పట్టణము ముట్టడింపఁబడుతరి అంగదునిచే దక్షిణ ద్వారమున నిహతుఁడైనవాఁడు.

వజ్రనాభుఁడు- కుమార్తె ప్రభావతి (ప్రద్యుమ్నుని భార్య), సోదరుఁడు సునాభుఁడు.

వజ్రదంతుఁడు- భగదత్తుని కుమారుఁడు.

వజ్రముష్టి- తండ్రి మాల్యవంతుఁడు. సోదరులు విరూపాక్షుఁడు, మత్తుఁడు.

వత్సుఁడు- కంసుని భటుఁడు. ఈతఁడు కోడె దూడరూపమున వచ్చి, శ్రీకృష్ణుఁడు గోవులను మేపుతరి పశువులం బాధించి, శ్రీకృష్ణునిచే నిహతుఁడైనట్టు చెప్పఁబడినది.

విటకుఁడు- సుమాలి పుత్త్రుఁడు.

విద్యుత్కేశుఁడు- తండ్రి హేతి. తల్లి భయ.

విద్యుజ్జిహ్వుఁడు- రావణ భటుఁడు. మాయకాఁడు. సీతాదేవి లంకయందు నిర్బంధముననుండుతరి, శ్రీరామలక్ష్మణుల తలలవలె మాయతలలను కల్పించి యామెకుఁజూపి వెఱపించినవాఁడు.

మఱియొక విద్యుజ్జిహ్వుఁడు శూర్పణఖ భర్త. రావణుని భావమరిది. (శూర్పణఖ చూడుఁడు). ఈతఁడు కాలకేయుల సంతతివాఁడు. కుమారుఁడు జంబుకుమారుఁడు.

విద్యుద్రూపుఁడు- కుబేరుని అనుచరుఁడు. కంకుఁడను పక్షిని జంపి, కందరుఁడను పక్షిచే నిహతుఁడైనవాఁడు.

విభీషణుఁడు- తండ్రి విశ్రవసుఁడు. తల్లి కైకసి. భార్య సరమాదేవి. కుమార్తె త్రిజట. లంకాయుద్ధమున శ్రీరామపక్ష మవలంబించి రావణునితో కలహించినవాఁడు. రావణుని పిదప లంకారాజ్యాధిపతి యైనవాఁడు. ఈతఁడు చిరంజీవి. (రావణాసురుఁడు చూడుఁడు).

విరాధుఁడు- ఈతఁడు తొల్లింట తుంబురుఁడను గంధర్వుఁ డనియు, కుబేరశాపమున రాక్షసుఁడై దండకారణ్యమున శ్రీరామునెదిర్చి పోరి యాతనిచే నిహతుఁడాయెననియు, దానితో శాపవిముక్తి గల్గెననియుం జెప్పఁబడినది.

విరూపాక్షుఁడు- ఈ పేరుగలవారు అసురులలో నొకఁడును, దానవులలో నొకఁడును గానఁగుచున్నారు. అసురుఁడు: తండ్రి మాల్యవంతుఁడు. సోదరులు మత్తుఁడు, వజ్రముష్టి, సుప్తఘ్నుఁడు అనువారు. దానవుఁడగు మఱియొక విరూపాక్షుఁడు- కశ్యపదనువుల సుతుఁడు.

వ్యోముఁడు- కంసుని భృత్యుఁడు. ఈతఁడు శ్రీకృష్ణునిచే వ్రేపల్లెయందు నిహతుఁడైన వాఁడు.

వృత్రాసురుఁడు- తండ్రి త్వష్ట్ర.

శకటాసురుఁడు- కంసుని భటుఁడు. వ్రేపల్లెయందు శ్రీకృష్ణుని (శిశువుగా నుండుతరి) పాద తాడనమున వికలాంగుఁడై మడిసెను.

శ్రవణుఁడు- తండ్రి మురాసురుఁడు. శ్రీకృష్ణునిచే నిహతుఁ డయ్యెను.

శార్దూలుఁడు- రావణ భటుఁడు.

శుంభుఁడు- శుంభ నిశుంభులలోని వాఁడు. (నిశుంభుఁడు చూడుఁడు).

శూర్పకుఁడు- వీనింజంపుటచేత మన్మథునకు శూర్పకారాతియని పేరయ్యెను.

శూర్పణఖ- రావణ సోదరి, విద్యుజ్జిహ్వుని భార్య, కుమారుఁడు జంబుకుమారుఁడు (రావణుని చూడుఁడు.)

సంపాతి- తండ్రి మాలి, సోదరుఁడు నారుఁడు. ఈతని సోదరులిరువురు విభీషణునికడ మంత్రులు.

సంహ్రాది- తండ్రి సుమాలి.

సుకేశి- మాల్య[illegible] తండ్రి విద్యుత్కేశుఁడు, భార్య దేవవతి.

సునాభుఁడు- వజ్రనాభుని కనిష్ఠ సోదరుఁడు.

సుప్తఘ్నుఁడు- తండ్రి మాల్యవంతుఁడు, సోదరులు మత్తుఁడు, విరూపాక్షుఁడు, వజ్రముష్టి అనువారలు.

సుపార్శ్వుఁడు- తండ్రి సుమాలి.

సుబాహుఁడు- తండ్రి సుందుఁడు. తల్లి తాటక, సోదరుఁడు మారీచుఁడు. శ్రీరామునిచే విశ్వామిత్రుని యాగకాలమున నిహతుఁడయ్యెను (మారీచుఁడు చూడుఁడు).

సుమాలి- తండ్రి సుకేశుఁడు, సోదరుఁడు మాల్యవంతుఁడు, రావణుని మాతామహుఁడు, కుమారులు ప్రఘనుఁడు, కాలనేమి, కుమార్తె కైకశి (విశ్రవసు భార్య), భార్య కేతుమతి యను గంధర్వస్త్రీ.

హరుఁడు- తండ్రి మాలి, సోదరుఁడు సంపాతి. ఈ యిరువురు విభీషణుని కడ మంత్రులుగ నుండిరట.

హిడింబాసురుఁడు- పాండవ ద్వితీయుఁడగు భీమసేనుని భావమఱది. సోదరి హిడింబి (ఈమె భీమసేనుని భార్య. ఈమెసుతుఁడే ఘటోత్కచుఁడు, భారత యుద్ధమున మడిసినవాఁడు). భీముఁడే వీనిఁ జంపెను.

హిడింబ- సోదరుఁడు హిడింబాసురుఁడు, భీమసేనుఁడు భర్త, కుమారుఁడు ఘటోత్కచుఁడు.

హేతి- సృష్ట్యాది యందు సృజింపఁబడిన రాక్షస భూపతి, భార్య కాలభగినియగు భయాదేవి, సోదరుఁడు ప్రహేతి, కుమారుఁడు విద్యుత్కేశుఁడు, ఈతఁడు మాల్యవంతుఁడు మొదలగు రాక్షస వంశములకు మూలపురుషుఁడు.

**అసగ్ధరము** (కుసుమరోగము) — ఆంగ్ల. Leucorrhoea. దీనికిఁ గుసుమరోగ మనుటయుఁగలదు. ఇది స్త్రీలకుంగల్గు జబ్బు. ఇది నాల్గువిధములు. మర్మావయవముగుండా నలుపు, తెలుపు, పసుపు, ఎరుపురంగుల ద్రవములు స్రవించుచుండెడి జబ్బు. ఈ ద్రవము జిగటగ దుర్వాసన గల్గియుండును.

**అస్నేహదీపికాన్యాయము** — చమురంతయు కాలిపోయిన దీపపుకాంతియనియర్థము. త్వరలో పతితుఁడు గానున్నవాని విజృంభణమును (నిరసనగా) దెల్పుటకు ఈన్యాయమును ంథుదురు.

**అహమద్నగర్** థోండుమన్నాడు ఇనుపబాటయందున్న పట్టణము. జిల్లా ముఖ్యపట్టణము. ఇచటికిఁ గతిపయదూరమున నున్న నగర్ గ్రామమునగల దుర్గము గుజరాతుదేశ మేలినతరి మహమ్మదీయులు నిర్మించిరి. ఇది కొంతకాలము వారికి రాజధానిగ గూడ నుండెనట. అహమ్మదాబాదునకుఁ బదునాల్గు మైళ్ల దూరమందున్న హాపీవెలీ Happy Valley యనంబడు కొండలో వేసవియందు చాలచల్లగను మనోహరముగను నుంట సమశీతోష్ణ ప్రమనంబరగి పెక్కండ్రకు వేసవికాలపు నివాసమైయున్నది.

**అహమద్నగరంజిల్లా** — అహమద్నగరుపురము ప్రధానస్థానము. (బొంబై రాజధాని చూడుఁడు).

**అహమదాబాదుజిల్లా** — బొంబాయి రాజధానిరాజ్యము చూడుఁడు. ప్రధానపురము సబర్మతీ నదీతీరమందున్న అహమ్మదాబాదుపురము.

**అహమ్మద్బాబాదుపురము** — గుజరాత్ దేశమున మహమ్మదీయులకాలమున ముఖ్యపట్టణమైయుంట, ఇట మసీదులు మొదలగు పెక్కు మహమ్మ కట్టడములు కలవు

పట్టణమున నూలుబట్టల నేతపరిశ్రమ ఎక్కువగా గలదు. పట్టుపనియు కొంతవరకు బాగుగనే యున్నది. జలతారు ఇట విస్తారముగ జేయు చుందురు. కాన అహమ్మదాబాదు పురము నూలు, పట్టు, జలతారు దారము లాధారముగ బ్రతుకుచున్నదని సామెత పల్కుచుందురు. జిల్లాయం దిప్పుడు ముఖ్యపట్టణమై యున్నది. అనేక ఫ్యాక్టొరీలుకల పట్టణము. సబర్మతీనదీ తీరము. ఇంచుకదూరమున ఆనదీతీరముననే సబర్మతీ యాశ్రమము కలదు.

**అహద్యూతి** — పూరువంశస్థుడగు క్షత్రియుడు. తండ్రిపేరు సమ్యాతి. తల్లి భానుమతి. ఈమె చేదిదేశపు నరపతియగు కార్తవీర్యార్జునుని చెల్లెలు అనిచెప్పబడినది.

**అహార్యక్షత్రియులు** — శిశోదియా క్షత్రియులు చూడుడు.

**అహల్య** — తండ్రి ముద్గలుడు. భర్త గౌతమర్షి, సోదరుడు దివోదాసుడు. అత్రి, చంద్ర, పూరు సంతతిని జన్మించి, బ్రాహ్మణియైన క్షత్రియవనిత. ఈమె భర్తవలన శపింపబడి శ్రీరాముని పాదము సోకుటవలన శిలయై పడియుండిన రూపమును వదలి శాపవిముక్తి నందినది.

**అహల్యనిర్యాణ స్థలము** (అహ్యారి)- ఇప్పుడు దీనిని "అహ్యారి" గ్రామముగ పోల్చి యున్నారు. దర్భాంగజిల్లా యందు, బెంగాల్ నార్త్ వెస్ట్రన్ రెయిల్వే (B. N. W. R.) కాంటీపుల్ రెయిల్వే స్టేషను నుండి ఒక మైలు దూరము. శ్రీరామనవమిని ఇట గొప్ప స్నాన యాత్ర ఉత్సవము జరుగును. ఈ అహల్య గౌతమమహర్షి భార్య.

**అహల్యాశాపవిమోచన స్థానము**— (దూమ్రాన్) ఈస్టిండియన్ రైల్వే బక్సార్ స్టేషను నుండి, పదిమైళ్ల దూరమునగల డూమ్రాన్ అను పేరున బరగుచున్న తావు. ఇట గౌతమశాపమున రాయియై పడియున్న అహల్య, శ్రీరాముని పాదము సోకి, శాపవిముక్తినంది తిరుగ స్వస్వరూపమునందిన తావని చెప్పబడినది.

**అహింసాపరమోధర్మః** — ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. అహింసకన్న ఎక్కువధర్మములేదని భావము.

**అహి** — అత్రి; చంద్ర, యాదవక్షత్రియుడు. తండ్రి వృజనివంతుడు. కుమారుడు ఉశంకు.

**అహికుండల న్యాయము** – పాము చుట్టచుట్టుకొని పడగపై కెత్తుకొని కూర్చుండును. ఇందు పామువేఱు చుట్టవేఱుగ జెప్పబడినను, పరమార్థమున రెండును ఒకటియేయైనట్లు నిజమున నొకటియేయైయుండినస్థితిని రెండుగా చెప్పవలసివచ్చుటయం దీన్యాయమునువాడుచుందురు.

**అహిచ్ఛత్రపురము** (ఆదికోట) ఉత్తరపాంచాలదేశమునకు రాజధానిగ నుండెను. దీనినే ఛత్రవతియని మహాభారతము ఆదిపర్వమున నొక అధ్యాయమున వివరింపబడినది. శాసనముల నిది అధిఛత్రమని చెప్పబడినది. అహిచ్ఛత్రమున కాదికోటయనియుం బేరుండెనట. (ఉత్తరపాంచాలము చూడుడు).

**అహినకులన్యాయము** – పామునకు ముంగిసకు నెడతెగని జాతివైరము. విరోధమున కీన్యాయము వర్తించును.

**అహినిర్లయినీ న్యాయము**— పాము కుబుసమని యర్థము. ఇది జైనన్యాయము. పాము కుబుసమును విడుచువరకు తన శరీరమే తానే యనుకొనును. విడిచినపిదప అది వేరని గ్రహించునని భావము.

**అహిర్నవమి** భాద్రపద బః నవమి.

**అహుండు**— అష్ట వసువులలో నొకఁడు. (అష్టవసువులు చూడుఁడు). కుమారుని పేరు జ్యోతి. విష్ణుపురాణమున అహుని వసువుగ పేర్కొనక ఆపుఁడని చెప్పియున్నారు. ఆపునికి స్తబ్దుఁడు, శ్రముఁడు, శ్రాంతి, ధ్వని యని నల్వురు పుత్రులుండినటులఁ జెప్పఁబడినది.

**అహూగాయక గోత్రము** నిధృవగణము చూడుఁడు.

**అహ్వార్ క్షత్రియులు —** శిశో దియా క్షత్రియులు చూడుఁడు.

**అహేయిరియా ఉత్సవము**— అహేయిరియా అనఁగా రాజపుత్రుల భాషలో వసంత కాలపు వేటయని యర్థము. ఇయ్యది వసంత పంచమిగ్గయెన వెనుక ఫాల్గుణమాసములోజరుపుట రాజపుత్రుల యాచారము. ఈ యుత్సవము నకు ముందురోజున రాణావారు తమ దివాణము నందలి రాజపుత్ర యువకుల కందరికిని, వేటలో పాల్గొను వారి వారి పరివారమునకును, మృగ యాచిహ్నమగు ఆకుపచ్చ దుస్తుల నిత్తురు. ఆ యుత్సవమునాఁడు వారందరును ఆకుపచ్చని దుస్తులనే ధరింపవలయునను నియమము. గౌరీదేవి కర్పించుటకు అడవిపందిని వేటాడుటకు పురోహితునిచే నేర్పాటుచేయఁబడిన శుభముహూర్త మున రసపుత్ర రాజకుమారులు రాణావారితో బయలుదేరుదురు. అందుచేతనే అహేయిరియాను ఆదేశపుభాషలో "ముహూర్తకాసికార్" అని మరి యొకపేరు. ఆ దినమునందలి వేటయొక్క ఫలాఫలములనుబట్టియే రాఁబోవు సంవత్సర ములో తమ జయాపజయములు నిర్ణయింపఁబడు నని వారి నమ్మకము. అందుచేత ప్రతి రాజ పుత్రకుమారుఁడును ఈ వేటయందు జయము గాంచవలయునను సంపూర్ణోత్సాహముతో అడవిపందులుండు తావులు తెలిసికొని పసిబట్టుటకు వేటకుక్కలను, వాని పోకడల నెఱింగి ముంగోలుగ దెల్పుటకు గూఢచారులను ముందు గానే యేర్పాటుచేసికొని జంభముగా బయలు దేరుదురు. ... రితోడను, వారిపుత్రుల తోడను తక్కిన సర్దారులందఱును యలుదేరుదురు. ప్రతి రాజకుమారుఁడును వేటకై ప్రత్యేకముగా తర్ఫీదుచేయఁబడిన ఆజానేయ ములపై నారోహింతురు. ఆవేటలో నొకరి నొకరతిక్రమింపవలయునను ఉత్సాహ మధిక ముగా నుండును. ఆరావళీపర్వతప్రాంతారణ్యపు లోయలలో అడవిపందులు విశేషముగా నుండుటచే పందిని సంధించుటకు విశేషప్రయత్నపడ నక్కఱలేదు. పందులున్న జాయలను పసిబట్టి ఒకచోఁ జేరునట్లు అడవియంతయు రుప్పుట కారంభింతురు. ఆ రుప్పుపని మిక్కిలి నేర్పుతోఁ జేయవలసియుండును. మొదట యూథనాయకునివలె నొక యెనుము బయటికి వచ్చును. దీనినే యొంటరి యందురు. దీనిని పొడుచుట మిగుల కష్టము. ఆపాద మస్తకము మిగుల కండఁబట్టి మెడలుదిరుగని శరీరముఁగలిగి నిశాత ములగు బలిష్ఠదంష్ట్రలు వెలువడ రోమములు గగుర్పొడువ నొక్కపరి యత్తెత్తిమాచిన దానెంత ధైర్యవంతుడైనను భయక్రాంతుఁడు కావలసినదే.

ఒక యొంటరి కంటఁబడిన వెంటనే వేట యారంభమగును. ప్రతియాశ్వికుఁడును తనయశ్వ మును అదలించి బల్లెమును పట్టుకొని రాయనక, రప్పనక, గట్టనక, మెట్టనక ఆపందిపోయిన మార్గమును విడువక వెన్నాడఁ దొడగును. ఈ యహైరియా వేటతమకములో నొండొరుల మించవలయునను వీరావేశము విశేషముగా నుండుటచే తరుచుగా ప్రమాదములు సంభవించు

చుండును. ఒకప్పుడు చందావతు రాజకుమారుఁడు హామీర్ అనువానికి కుడికాలు సమూలముగా విరిగిపోయినది. చిత్తూరురాణావారి సన్నిహితజ్ఞాతి సుయోధనసింగు రెండవకుమారుని గుండెలో దగ్గరనున్న రాజకుమారుని బల్లెము వెన్నుమొయ్య గ్రుచ్చుకొనిపోయినది.

ఈ వేటకు రాజకుటుంబములు తమ కందా సిబ్బందులతోఁగూడ బయలుదేఱుట యాచారము. బయలుదేరి అనువగు నొకస్థలమునందు సపరివారముగా తమ కందరికిని ఒకచో కందా తయారుచేయించి తాము పొడిచిన పందిమాంసముతో నందరు విందారగింతురు.

రసపుత్రవీరులు తాము మహాపదలలోనున్నను, మహాయుద్ధములమధ్యమున మునిగి తేలుచున్నను, శ్రీగౌరీదేవి కర్పించుటకు వరాహమునిమిత్తము చేయు ఈ మృగయావిహారోత్సవము అహేయిరియా ఆచరించుటమాత్రము మానరు. అందులో చిత్తూరు శిశోదియావంశము వారి కీయుత్సవమున మఱియు పట్టుదల. చిత్తూరు వంశీయుఁడగు లాలాజీ తనకుమార్తెకు వివాహము తలపెట్టెను. ఇంతలో ఫాల్గుణమాసమందు అహేయిరియా దగ్గఱకు వచ్చెను. లాలాజీ తుకరాయి అరణ్యములో పందివేఁటకుబోయెనని కైత్సింగ్ మరియొకని కీ సమాచారము తెలిపి పెండ్లివారి నెదిరించెను. అప్పుడు లాలాజీ అహేరియాలో జయముగాంచి వెంటనే వచ్చి యుద్ధమునందు శత్రుసంహారము చేసి వివాహము నిరాటంకముగా నిర్వహించెను.

**అహోబలుఁడు లేక అహోబల పతి** — ఈతఁడు నన్నయభట్టీయ సూత్రములకు (ఆంధ్రవ్యాకరణము) వ్యాఖ్య రచించిన పండితుడు. అది అహోబల పండితీయము లేక కవిశిరోభూషణమని ప్రసిద్ధి కెక్కియున్నది.

**అహోబిలము** — ఆంధ్రదేశమున, కర్నూలు మండలమునందలి శిరివేలు తాలూకాలోని యొక నృసింహక్షేత్రము, ఈపర్వతమునకు గరుడాద్రియని పేరు. ఇందు కొండప్రారంభమునం దొక గుహయు, కొండకు సగమెత్తున నొక గుహయు, కొండ పైభాగమున నొక గుహయుం గల్గి మూడింటను నృసింహస్వామి విగ్రహములే కలవు. వీనినంటి దేవాలయముల కట్టడములు నిర్మింపఁబడినవి. ఈ దేవస్థానమును శంకరభగవత్పాదులు దర్శించినటుల శంకరవిజయమునను, మధ్వరాయస్వామి దర్శించినటుల మధ్వచరిత్రమునను, చైతన్యస్వామి దర్శించినటుల చైతన్య చరితామృతమునను చెప్పఁబడినది. ఏటేట ఫాల్గుణపౌర్ణమికి గొప్ప యుత్సవము జరుగుచుండెడిని.

**అహోంవంశనృపతులు** — క్రీ. వె. పదమూడవ శతాబ్ది ప్రారంభ కాలమున తూర్పునుండి కామరూప దేశము (అసాం) నకుం జేరినదని చెప్పఁబడినది. (కామరూప దేశము చూడుఁడు). వీరు నరకాసురుని సంతతివారేనని కొందఱు పోల్చుచున్నారు. అట్లేయైనచో కామరూప దేశమేలిన నరకాసురుఁ డతని సుతుఁడు భగదత్తుఁడు కూడ అహోంవంశజులై కావలసియుండును. వీరు దానవులు. అను నరకాసురుడొకప్పుడు దేవతలం జయించి ఇంద్రత్వ పదవి నందినవాడని చెప్పఁబడినది.

**అహ్రిమాన్** — జరథుస్త్ర జగద్గురు బోధిత పారశీక మాజ్దాయాస్నా మతధర్మమునఁ కీడు, దోషము, దుర్మార్గము మొదలగు నవి మూర్తీభవించిన రూపము లేక వ్యక్తిత్వమునకు అహ్రిమానని పేరు. ఈతనిం గూర్చి ఉదాసీనత వహించి ప్రతివారును దూరముగ జాగ్రతగానే యుండవలెనని ఆమతగ్రంథమగు అవెస్తాయందు

హెచ్చరింపఁబడి యున్నది. ఆహ్రిమానుఁడు వందనీయుఁడు పూజనీయుఁడుకాఁడు. (అహ్మజ్దు చూడుఁడు).

**అళియరామరాజు** — చంద్రవంశ క్షత్రియుఁడు. శ్రీకృష్ణరాయ సార్వభౌముని యల్లుఁడు. ఈయన సోదరుఁడగు తిరుమలరాజు వసుచరిత్ర కృతిపతి. రామరాజు కిద్దరు చెల్లెండ్రు కలరు. అందు లక్కమ్మ సుతుఁడు అహోబలనర్సరాజు, నరస భూపాలీయమును కృతినందినవాఁడు. రెండవ సోదరి ఓబమ్మ. ఈమె సుతుఁడు గొబ్బూరి నర్సరాజు, రామాభ్యుదయమును కృతినందినవాఁడు. (ఆర్వీటి బుక్కరాజు వంశ వృక్షము చూడుఁడు).

**అళీవళీకర్కట వేణు రంభా వినాశ కాలే ఫలముద్భవన్తీతిన్యాయము** — తుమ్మెదలు, రోకలిబండలు, ఎండ్రకపీతలు, వెదురుపొదలు, అనఁటిచెట్లు నశించుకాలముననే సంతానముం గనునవి. అనఁగా, ఇవి సంతానముం గనుటతోడనే చచ్చును. వెదురు కాచిన అనతి కాలముననే ఎండిపోయి మృతినందును. అనఁటిచెట్టు కాచి (గెలవేసి) పండుటతో మరణించునని భావము. వినాశకాల ఫలప్రదస్థితిం దెల్పుట కీన్యాయములు వాడుచుందురు.

**అక్షతృతీయ** — వైశాఖశుద్ధ తృతీయ. ఆంధ్రదేశపు ప్రాగ్భాగమునఁ గల సింహాచల క్షేత్రమున నృసింహదేవున కనుదినము పూయుచుండిన చందనమును కడిగి తీసివైచి, అభిషేకాదులొనర్చి తిరుగ చందనపుపూఁత ప్రారంభించెదరు. (గంధంఅమావాస్య చూడుఁడు). ఈ దినమున రాత్రి ప్రథమయామమున పునర్వసు నక్షత్రము సంభవించునేని పరశురామజయంతి యనెదరు. (పండుగలు, పర్వతిథులు, వ్రతదినములు చూడుఁడు).

**అక్షపాదగౌతముఁడు** — ఈ మహా[illegible]ంసుఁడు పదార్థ తత్త్వజ్ఞానమును దెల్పు న్యాయశాస్త్రము రచించెను. గౌతముఁడని యీతని పేరుండెను, అక్షపాదుఁడని పేరు ప్రసిద్ధిగల్గియుంట నిట్లు తెలియఁబడుచున్నవాఁడు. ఇది గొప్ప తర్కశాస్త్రగ్రంథము. అందు పొందుపరుపఁబడిన యీతనిమతమునకు అక్షపాదమతమని వాడుకకల్గెను. (అక్షపాదమతము చూడుఁడు).

**అక్షపాదమతము** (నైయాయికశాస్త్రమతము) — న్యాయశాస్త్రమునకుం గర్త గౌతమ మహర్షి. ఈతని పాదమునం దొక కన్నుండుటం జేసి, అక్షపాదుండని పేరు కలదని చెప్పఁబడినది. ఈ గౌతముఁడు త్రేతాయుగము నందుండినవాఁడట. ఈమతమునకు కాణాద మతము లేక వైశేషికమతముతో పోలికలదు. ఈమతమున పరమేశ్వరుఁడు వేదములకు కర్త. జ్ఞానమయుఁడు (జ్ఞానమును స్వతస్సిద్ధముగ గల్గినవాఁడు). ఆత్మలకువలె నీశ్వరునకు పదార్థములతో మనస్సంయోగము కల్గి జ్ఞానోదయము కానక్కరలేదు. పుణ్యపాపముల కర్మఫలముల నాత్మల కొసంగుట మొదలగుగాఁగల సర్వకార్యములు నిర్వహించు నధికారి. అనగా నీశ్వరుఁడు సర్వనిర్వాహకుఁ డని భావము. అద్వితీయుఁడనియు, జగత్కర్తయనియు, శాశ్వతుఁడనియుం గూడ తలంపఁబడినది. దీనియందు జగత్తు పరమాణువులచేఁగల్పింపబడినది. ఇవి పృథ్వి, జలము, అగ్ని, వాయువులను నాల్గు భూతములయొక్క పరమాణువులు మార్పుజెందునవి నశించునవి కావు గాన, స్థిరములనియు, శాశ్వతములుగ నల్లియుండునవి గాన సత్యములనియు, అవి వేర్వేఱు రూపములనందుచు, వేర్వేఱు పేరులం బరగుచుండుం గాన, అట్టి నామరూపముల అవస్థయందు నశించునవి గాన మిథ్యయనియుం జెప్పఁబడినది. ఇంక నైదవభూతమగు ఆకాశము, పరమాణువులచే

రచింపఁబడినది కాదనియు, నశింపక ఎప్పుడు నొకేరీతి నట్లె యుండునదియనియుగాన, మిథ్య కానేరదనియు (సత్యమే ననియుం), జెప్పఁబడి నది. జగత్తు ఈ పంచభూతాత్మకమనియు, వస్తుతః సత్యముగను నామరూపతః మిథ్యగను చెప్పఁబడినది.

ఈమతమునం దాత్మ లనేకములు. అవి శరీర శరీరేంద్రియములకన్న వేఱుగనుండునవి. ఆత్మలు పునర్జన్మములం గల్గి ఒక శరీరమును వీడి వేఱొక శరీరమునకు పోవుటగా జన్మము నిర్వచింపఁబడి నది. ఆత్మలకు, తామొనర్చిన కర్మల ననుస రించి ఫలము లనుభవించుచుండుట చెప్పబడినది. పుణ్యకార్యాచరణము ఆత్మకు సుఖదాయక మనియు, ఉనికియొక్క అంతము బాధానివారణ మనియుం జెప్పఁబడినది. మఱియు బదార్థతత్త్వ జ్ఞానముం బడసి, పదార్థ తత్త్వమునందు మనస్సం యోగము స్థిరపడి ధ్యానమూలముగ తన్ను తాఁ దెలిసికొనుటవలన నాత్మకు సుఖము గల్గు ననియు, పదార్థతత్త్వజ్ఞానమున మనస్సంయోగము కల్గు కతన జనించిన జ్ఞానమున, పాషాణమువలె అన్యచైతన్యరహిత నిశ్చలజ్ఞాన స్థిమితమునందుండు అవస్థయే, ఈమతమున మోక్షము. ఈశ్వరుఁడు పదార్థతత్త్వజ్ఞానము నెఱుంగగల్గు వాంఛ కల్గించు టకు ప్రేరేపకుఁడనియు కల్గినపిదపమనస్సంయోగ కారకుఁడనియు, పిదపగల్గు నిశ్చలత్వమునకు తత్ఫలితముగ నగు మోక్షమునకు ఈ సర్వకార్య ములకు నిర్వాహకుఁ డనియు చెప్పఁబడినది. న్యాయశాస్త్రమతమునకు గౌతముఁడు రచించిన న్యాయభాష్యము ప్రధానగ్రంథము. ఇందైదధ్యాయములుకలవు. పిదప ఉదయనాచార్యకృత మగు కుసుమాంజలియు, మతగ్రంథములు. ఈ మతమునపదార్థతత్త్వజ్ఞానమును విమర్శించియెఱుంగ నాల్గు ప్రమాణములును, పండ్రెండు ప్రమేయ ములును, ఐదుపదార్థములును వివరింపఁబడినవి.

ప్రమాణములు ౪- ౧. ప్రత్యక్షప్రమాణము, ౨. అనుమానప్రమాణము, 3. ఉపమానప్రమాణము, ౪. శబ్దప్రమాణము. ప్రమేయములు ౧౨- ౧. ఆత్మ, ౨. శరీరము, 3. శరీరేంద్రియములు, ౪. అర్థము, ౫. బుద్ధి, ౬. మనస్సు, ౭. ప్రవృత్తి, ౮. దోషము, ౯. ప్రేత్యము (ప్రాణము శరీరమును విడచినపిదప సంభవించెడి ప్రియతత్త్వము), ౧౦. భావము, ౧౧. ఫలదుఃఖములు, ౧౨. అపవర్గము. ఈ సందర్భమున ప్రమేయసిద్ధికి ప్రమాణ మత్యవసరముగ విధింపఁబడినది. అనగా ప్రమాణసిద్ధి స్పష్టముగ లేకున్న ప్రమేయసిద్ధి అంగీకరింపఁబడరాదని భావము.

ఈశాస్త్రమున వాదపక్ష, ప్రతివాదపక్షముల చర్చ జరపుటకుఁ గథయను సంజ్ఞ. కథత్రివిధము. తత్త్వనిర్ణయమే ఫలముగాఁగల్గిన కథకు వాదకథ యనియు, ఉభయపక్షములకు సాధనమైన కథ జల్పకథ యనియు, స్వపక్షస్థాపన లేక ఊరక అడ్డుదగులుచుండునటుల వాదించు కథ వితండ కథ యనియుం జెప్పఁబడినది. రాగద్వేషము లీమతమున దోషములుగ జెప్పఁబడినవి. ఇవి మోక్షప్రతిబంధకములు. అనాత్మ యగు శరీరమునందు ఆత్మ యను భ్రమ (బుద్ధి) కల్గుట రాగ మనంబడును. దీనికి మిథ్యాజ్ఞానమనియుం పేరు కలదు. ప్రతికూలములగువాని యందు జనించిన నిరభిలాష మొదలగు భావనలకు ద్వేష మని పేరు. ఇంకను ఇందు వివరింపఁబడిన ప్రవృత్తిద్వివిధము. పాపకార్యములందు వ్యాపించినది పాపప్రవృత్తి యనియు, సత్కార్యము లందు వ్యాపించినది పుణ్యప్రవృత్తి యనియు, ఇవి ఉచ్చనీచజన్మ లొసంగుననియుం జెప్పఁబడినది.

నైయాయికమతమున వాదసౌకర్యమునకు షోడశపదార్థములును, తత్త్వజ్ఞాన విచారణకు పంచపదార్థములును అంగీకరింపఁబడినవి.

నాదపదార్థములు ౧౬:- ౧. ప్రమాణము ఇది సాధనముకంటెను ఆయముకంటెను వేఱు కానిదియయ్యు యదార్థజ్ఞానము గల్గించునదిగ నిర్వచింపఁబడినది (ప్రమాణములు నాలుగు చూడుఁడు), ౨. ప్రమేయము- (ప్రమేయసిద్ధికి ప్రమాణబల మత్యవసరముగఁ జెప్పఁబడినది) (ప్రమేయములు పండ్రెండు చూడుఁడు). 3. సంశయము, ౪. ప్రయోజనము, ౫. దృష్టాంతము, ౬. సిద్ధాంతము, ౭. అవయవము, ౮. తర్కము, ౯. నిర్ణయము, ౧౦. వాదము, ౧౧. జల్పము, ౧౨. వితండ, ౧3. హేత్వాభాసము, ౧౪. ఛలము, ౧౫. జాతి, ౧౬. నిగ్రహస్థానము అనునవి. ఇంక మిగిలిన తత్త్వవిచారణకు వివరింపఁబడిన పంచపదార్థములను గూర్చి విచారింతము. అక్షపాదుని నైయాయికశాస్త్రమున నివియే కడుముఖ్యములు, ప్రధానములు. వీనిం గూర్చి వివరించుచో జాగరూకులై యుండు టత్యవసరము. ఇవి మొదను ద్రవ్యపదార్థములనియు, గుణపదార్థములనియు ద్వివిధములుగఁ జెప్పఁబడినవి. అందు ద్రవ్య పదార్థములు తొమ్మిది. అవి నవద్రవ్యములని చెప్పఁబడినవి. ౧. పృథ్వి, ౨. జలము, 3. వాయువు, ౪. అగ్ని. ఈ నాల్గుభూతములు పరమాణువుల కూడికలని చెప్పఁబడినవి. పరమాణువులు స్థిరములు, నాశముచెందనివి గాన సత్యములని చెప్పఁబడినవి. ౫. ఆకాశము- ఇందు పరమాణువులు లేవు. నాశముచెందునది (మిథ్య) కాదు. ఇదియు సత్యమని చెప్పఁబడినది. ఇవి మొదను పంచ భూతము లనంబడునవి. ౬. కాలము- ఇది మార్పు జెందునది కాదు. నశించునదియుంగాదు. కాన నిత్యము సత్యమని చెప్పఁబడినది. ౭. దిక్కులు- దిక్కులు ౧. తూర్పు, ౨. ఆగ్నేయము, 3. దక్షిణము, ౪. నైఋతి, ౫. పడమర, ౬. వాయవ్యము, ౭. ఉత్తరము, ౮. ఈశాన్యము, ౯. ఊర్ధ్వదిక్కు, ౧౦. అధోదిశ (క్రిందిదిక్కు). ఇంకను కొందరవాంతర దిశంగూడ పేర్కొని యున్నారు. కాని ఇది లెక్కింపబడలేదు. దిక్కులు సత్యములే. ౮. ఆత్మలు- ఇవి అనేకములు. ఒకటితో నొకటి సంబంధము లేక వేఱ్వేఱుగ వేఱ్వేఱు శరీరము లందుండునవి. ఇవి నిత్యములు, సత్యములు.

మనస్సు- ఇది నిత్యము, సత్యము నని చెప్పఁబడినది. ఇవి నవద్రవ్యములు లేక ద్రవ్య పదార్థములు.

౨. గుణపదార్థము- ఇది ఇరువది నాల్గు భేదములు కలది. ౧. రూపము (పైకిగన్పించు ఆకారము), ౨. రసము (రుచి), 3. గంధము (వాసన), ౪. స్పర్శము (తాకుట), ౫. సంఖ్య (లెక్కింపబడుట), ౬. పరిమాణము, ౭. పృథక్త్వము (వేఱుగనుండుస్థితి), ౮. సంయోగము (కలయిక, కలిసియుండు లేక కుదిరియుండు స్థితి), ౯. విభాగము (వేఱగుట, వేఱుగనగుట), ౧౦. పరత్వము (అన్యపదార్థముగనుండుస్థితి), ౧౧. అపరత్వము (స్వపదార్థముగనుండుస్థితి), ౧౨. గురుత్వము (బరువుగ లేక భారముగనుండు స్థితి), ౧3. ద్రవత్వము, (పలుచగను, ద్రవించుచుండుస్థితి), ౧౪. స్నేహము (మైత్రి, ఒకటితో నొకటి విరోధించని స్థితి), ౧౫. శబ్దము (ధ్వని), ౧౬. బుద్ధి, ౧౭. సుఖము, ౧౮. దుఃఖము, ౧౯. ఇచ్ఛ (కోర్కె), ౨౦. ద్వేషము (ప్రతికూలములగు వానియందు గల నిరభిలాష), ౨౧. ప్రయత్నము, ౨౨. ధర్మము (పద్ధతికి లోఁబడువిధి), ౨3. అధర్మము (పద్ధతికి లోఁబడక దాటుట), ౨౪. సంస్కారము, పూర్వవాసన లేక స్మృతి (జ్ఞాపకమునకు) కి సాధనమగు దానికి సంస్కారమని పేరు.

3. కర్మపదార్థము.- ఇది యైదువిధములు. ౧. ఉత్క్షేపణము (ఎత్తుట లేక పైకి ఎగురుట), ౨. అవక్షేపణము (పడుట లేక క్రిందికిదించుట లేక పడద్రోయుట), 3. ఆకుంచనము( వంచుట లేక వంగుట లేక ముడుచుకొనుట), ౪. ప్రసారణము (వ్యాపించుట లేక చాచుట లేక సాగుట), ౫. గమనము (నడచుట లేక జరగుట లేక పోవుట).

౪. సామాన్య పదార్థము- ద్వివిధము. ౧. పరసామాన్యము- (చేయుట, చూచుట, తినుట మొదలగునవి). ౨. అపరసామాన్యము- (గోత్వము, ఘటత్వము, వృక్షత్వము మొదలగునవి).

౫. సమవాయపదార్థము- ఇది ఒకే విధమని చెప్పఁబడినను కొందరు యైదు విధము లని యున్నారు. సమవాయమన నిత్యసంబంధమన్ని యర్థము. "ఘటము తెల్లగా నున్న" దను తరి ఘటమునుండి తెల్లదనము వేఱుచేయఁబడజాలదు. అది నిత్యసంబంధమని ఎరుఁగునది. ౧. అవయవ అవయవులకు గల నిత్యసంబంధము ౨. జాతి-వ్యక్తులకు గల నిత్యసంబంధము. 3. గుణ-గుణులకు గల నిత్యసంబంధము. ౪. క్రియ-క్రియావంతులకు గల నిత్యసంబంధము. ౫. నిత్య ద్రవ్య విశేషములకు గల నిత్యసంబంధము. ఇవి యైదును అక్షపాదుని నైయాయిక మతమున దెల్పఁబడిన పంచపదార్థములు. వీనికిం గాణాద కృతమైన వైశేషికమతమున విశేషమనంబడు ఆరవపదార్థముం గూడ చేర్చియుండుట నా మతమునకు (ఆ ఆరవపదార్థము విశేషమనంబడిన పదార్థమునుండి) వైశేషికమతమని పేరయ్యెను.

**అక్షయతిథులు** — అమావాస్య తిథి యందు సోమవారమును, సప్తమితిథియందు ఆదివారమును, చతుర్దశితిథియందు మంగళవారమును సంభవించినతరి, వానిని అక్షయతిథులనెదరు. ఇది జ్యోతిషశాస్త్రప్రసిద్ధము.

**అక్షయతృతీయ** — వైశాఖ శుద్ధ తదియ యందు కృత్తికరోహిణులు నక్షత్రములు సంభవించునేని, దాని నక్షయతృతీయ యని యెదరనిస్కాందపురాణమునను, భవిష్యత్పురాణమునను చెప్పంబడినది. ఇందు దానములు శ్రేష్ఠము లందురు.

**అక్షయనవమి** — కార్తీకశుద్ధనవమి. వ్రతదినము. మఱియుఁ దీనిని కూష్మాండనవమి యనియు నందురు. (కూష్మాండనవమి, పండుగలు చూడుఁడు).

**అక్షరములు** — అక్షరములు ౫౦. నశింపనివని యర్థము. ఇవి పంచాశద్రుద్రరూపములని క్రియాసాగరము నందునను, సిద్ధాంతశేఖరమునను వివరింపఁబడినది. తొల్లి సర్గసంహారకాలమున సృష్టి యొనర్చు తలంపు పరమేశ్వరునకుఁ గలుగగనే పరమేశ్వరునియం దడఁగియుండిన శక్తికి సంక్షోభముగలుగ, నాద ముత్పన్నమయ్యెను (ధ్వని). పిదపబిందువును, కలయుం గలిగెను. ఆనాదము తొలుదొల్త ఆద్యస్వరముగ 'అ'కారముగను, దానినుండి జన్యస్వరములుగ ఇ. ఉ. ఋ. స్వరములును కలిగెను. పిదప వీని వికారరూపములుగ ఆ. ఈ. ఊ. ౠ. ఌ. ౡ. లును ఏర్పడియెను. పిమ్మట మిశ్ర స్వరములుగ అ+ఇ కలసి ఏ యయ్యెను. అ+ఉ కలిసి ఓ యయ్యెను. అ+ఏ కలసి ఐ యయ్యెను. అ+ఓ కలసి ఔ యయ్యెను. పిమ్మట బిందువుగ అనుస్వారము కల్గెను. పిదప విసర్గ (ః) కలిగెను. ఇక్కడికి పదునారు స్వరములి ట్లయ్యెను. వీనికి స్వరములనియు, ప్రాణులనియు పేర్లు. వీనిని అచ్చులనియు (అచ్ ప్రత్యాహార మధ్యాక్షరములు) నందురు. శక్తి

యొక్క పంచాంగ (పంచకర్మేంద్రియ) ముల నుండి యిరువదియైదు వర్గాక్షరములు కల్గెను.

క. ఖ. గ. ఘ. ఙ. (కవర్గము), చ. ఛ. జ. ఝ. ఞ. (చవర్గము), ట. ఠ. డ. ఢ. ణ. (టవర్గము), త. థ. ద. ధ. న. (తవర్గము), ప. ఫ. బ. భ. మ. (పవర్గము).

శక్తియొక్క సప్తధాతువులనుండి ఏడు (ధాతువులు) జనించెను. ధాతు అక్షరములు ౭. య. ర. ల. వ. శ. ష. స.

శక్తిప్రాణమునుండి "హ" కారము కల్గెను. వర్గధాతువులకు ఉభయాత్మకమై "క్ష"కారము కల్గెను. ఇట్లు వర్ణ, ధాతు, ప్రాణాక్షరములును, ఉభయాత్మకాక్షరమును మొత్తము ముప్పది నాల్గు వర్ణములయ్యె. వీనిని హల్లు (హల్ ప్రత్యాహార మధ్యాక్షరము) లందురు. (భాషలవర్ణముల చూడుడు).

అచ్చులు పదునారును, హల్లులు ముప్పది నాల్గును కలసి ఏబదియక్షరము (వర్ణము) లయ్యెను. ఇవి పంచాశ (ఏబది మంది) ద్రుద్ర రూపములని వివరింపఁబడినవి. ఆరుద్రులపేరులను వివరింతుము. అక్షరముల కన్వయించు రూపములుగల రుద్రులపేరులు ౫౦ :- ౧. ఖడ్గేశ రుద్రుఁడు, ౨. బకేశరుద్రుఁడు, 3. శ్వేతేశ రుద్రుఁడు, ౪. భృంగీశరుద్రుఁడు, ౫. భగలండేశ రుద్రుఁడు, ౬. ద్విరండేశరుద్రుఁడు, ౭. మహాకాళేశరుద్రుఁడు, ౮. భుజంగేశరుద్రుఁడు, ౯. పినాకీశ రుద్రుఁడు, ౧౦. దారుకేశరుద్రుఁడు, ౧౧. అర్ధనారీశరుద్రుఁడు, ౧౨. ఉమాకాంతేశ రుద్రుఁడు, ౧3. ఆషాఢీశరుద్రుఁడు, ౧౪. ఛండీశరుద్రుఁడు, ౧౫. అత్రీశుఁడు, ౧౬. మీనేశుఁడు, ౧౭. మేషేశుఁడు, ౧౮. లోహితేశుఁడు, ౧౯. శశీశుఁడు, ౨౦. క్రోధేశుఁడు, ౨౧. ఛండేశుఁడు, ౨౨. పంచాంతకేశుఁడు, ౨3. శివోత్తమేశుఁడు, ౨౪. ఏకరుద్రేశుఁడు, ౨౫. కూర్మేశుఁడు, ౨౬. ఏకనేత్రేశుఁడు, ౨౭. చతురాననేశుఁడు, ౨౮. అజేశుఁడు, ౨౯. శర్వేశుఁడు, 3౦. సోమేశుఁడు, 3౧. లాంగలీశుఁడు, 3౨. సంవర్తకేశుఁడు, 33. శ్రీకంఠేశుఁడు, 3౪. అనంతేశుఁడు, 3౫. సూక్ష్మేశుఁడు, 3౬. త్రిమూర్తీశుఁడు, 3౭. అమరేశుఁడు, 3౮. అర్ఘేశుఁడు, 3౯. భారభూతేశుఁడు, ౪౦. అదితీశరుద్రుఁడు, ౪౧. స్థాణీశుఁడు, ౪౨. హరేశుఁడు, ౪3. ఝంటీశుఁడు, ౪౪. భౌతికేశుఁడు, ౪౫. సద్యోజాతేశుఁడు, ౪౬. అనుగ్రహేశుఁడు, ౪౭. అక్రూరేశుఁడు, ౪౮. మహాసేనేశుఁడు, ౪౯. లకులీశరుద్రుఁడు, ౫౦. శివేశరుద్రుఁడు.

## అక్షరవర్ణములు, వానిధ్వనులు

(Alphabet)తొల్లింటి నాగరాక్షరము లనేక మార్పులనుజెంది, ఇంచుమించు పూర్వాకారము లం గోల్పోయినవని ఎరుంగుదుము. నాగరాక్షరము లేబదియు, రుద్రచిహ్నములని చెప్పబడినవి. ఆంధ్రాక్షరములు వాటి ననుసరించినవే గాని, కొంచెము భేదము పాలైనవి. ౙ, ౘ అక్షరములు పిదప కల్పింపబడి చేర్పఁబడినవి. 'ళ' అక్షరమును నవీనమే. నాదమునుండి తొలుత అకారము పుట్టెననియు, ఆది ఇ. ఉ. ఋ. ఌగ పరిణమించెననియు, వీని వికారరూపములుగ ఆ. ఈ. ఊ. ౠ. ౡ. కల్గెననియు చెప్పఁబడినది. పిదప అ. + ఇ. అక్షరములు కలసి ఏకారముగ నయ్యెను. (ఆంధ్రమున హ్రస్వపు 'ఎ' చేర్పంబడెను). అకారమును, ఉకారమును కలసి ఓ. యయ్యెను. (ఆంధ్రమున హ్రస్వపు ఒ. చేర్పంబడెను). అ. + ఏ లుకలసి ఐ. వర్ణమాయెను. అ. + ఓ. లు కలసి ఔ. వర్ణమాయెను. అనుస్వారము (సున్న) ను విసర్గయు నట్లే కల్గినవి చేర్పఁబడెను. పరమేశ్వ

రుని శక్తి నుండి పంచవర్గాక్షరములు కల్గెను. అనగా కవర్గ, చవర్గ, టవర్గ, తవర్గ, పవర్గాక్షరములని భావము. ఇవి క. ఖ. గ. ఘ. ఙ. యనియు, చ. ఛ. జ. ఝ. ఞ. యనియు, ట. ఠ. డ. ఢ. ణ. యనియు, త. థ. ద. ధ. న. యనియు, ప, ఫ, బ, భ, మ యనియు నెఱుంగునది.

ఇటులనె శక్తియొక్క సప్తధాతువులనుండి య, ర, ల, వ, శ, ష, స యని పల్కు సప్త వర్ణములును, శక్తిప్రాణమునుండి హకారమును కల్గెను. ఉభయాత్మకమగు క్షకారమును కల్గెను. అనగా అంగమునుండి కల్గిన కకారమును, ధాతువుమండి కల్గిన షకారమును, "క్ష" యగుట నది ఉభయాత్మక మనంబడెను. ఇత్తెరిని ఆంధ్రాక్షరములలో 'ర' వర్ణసంబంధమున శకటరేఫ (బండి-ఱ) యొకటి యేర్పడి ఆంధ్రాక్షరములకు చేర్పఁబడినదని చూపింపఁదగినది. ఇంక అరబ్బీ అక్షరవితతియందు అలీఫ్, బె, పె, తె మొదలగు అక్షరములు కలవు. ఇందు 'ఖై' వర్ణమొకటి అధికము. అరవభాషయందు అట్టిదే 'ఴ' అక్షరమొకటి యధికముగ నున్నది. అక్షరము లన్నియు వేఱ్వేఱు ధ్వనులం దెల్పుచు మాటలుగ పల్కుటకు వీలుగల్గించునవిగ నుండును. గ్రీకుభాషయం దక్షరములలో మొదటి రెండక్షరములగు ఆల్ఫా, బీటా యనంబడు వానినుండి ఆల్ఫబెట్ (Alphabet) అనంబడి, అది ఆంగ్లవర్ణవితతికి పేరయ్యెను.

ఆంగ్లాక్షరవితతి కొన్నివయములందు లాటిన్ తెగలోనిదిగఁ జెప్పవలసియున్నది. అచ్చక్షరములను ఇంగ్లాండుసీమలందు రోమన్ టైపు అని యింకను అనుచుండుట కలదు. వ్రాత అక్షరములు, నవీనకల్పితములు. అచ్చక్షరములందు కేపిటల్సు అనంబడునవి రోమనుల అచ్చక్షరముల పోల్కిం గల్గియె యుండును. గ్రీకుల అక్షరములు తొల్లింటి ఫోనీషియన్ (Phoenician) వ్రాతలనుండి రూపము లందినవనియు, అది చాలా పురాతనపు సంగతి యనియు, ఛాలెయిస్(Chaleis) నందు వాడఁబడిన (Euboca) వానిపోల్కిగ గ్రీకు అక్షరవితతి యుండుననియు, క్రీ. వె. ఎనిమిదవ శతాబ్దారంభమున ఇటలీదక్షిణసీమలకు వలస పోయిన గ్రీకువారివలన నట వాడుకలోనికి తేబడి యుండుననియు, క్రీ. వె. ఐదవశతాబ్దమున సెంట్ పాట్రిక్కుమహాత్మునిచే దక్షిణపరాసుసీమలకు ఐరిషుఅక్షరవితతి గొంపోవఁబడినదనియు నూహింపఁబడుచున్నది.

**అక్షరసమామ్నాయము** — లిపి చూడుఁడు.

**అక్షలింగనగరము**— ఇప్పటి హనుమకొండ. ఇప్పటి నైజామురాజ్యములోని అనుమకుందపురము (హనుమకొండ) న కొకప్పు డీ పేరుండెను. త్రిలింగదేశములోనిది. ఇట నుండు ఒక పెద్ద శివలింగమునుండి ఈపేరు గల్గినదట. ఏకశిలానగరము. (తెలింగానాదేశముచూడుఁడు.)

**అక్షాభూరిగోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**అక్షితగోత్రము** — కుండినగణము చూడుఁడు.

**అక్షిపత్రన్యాయము** — అక్షిపత్ర మన కంటిగ్రుడ్డు అని యర్థము. అతిసున్నితమును సూక్ష్మగ్రాహిత్వము గల్గియుండుంగాన, అట్టి పరిస్థితులం దీ న్యాయము వర్తించెడిని.

**అక్షిత్రయము** — ౧. కామాక్షీదేవి, చెంగల్పట్టుజిల్లా కంచీపురమునందు; ౨. మీనాక్షీదేవి, మధురజిల్లా మధుర (దక్షిణ) యందు; ౩. విశాలాక్షీదేవి, ఉత్తరహిందూస్థానమున సంయుక్తరాష్ట్రములలోని (కాశీ) బనారస్ నందు.

**అక్షుఁడు** — రావణభూపతి కుమారుఁడు. ఆంజనేయునిచే నిహతుఁడైనవాఁడు.

**అక్షేత్రే బీజముత్సృష్ట మన్త్రైరేవ వినశ్యతి** — పంట కనుకూలించని భూమి యందు నాటిన విత్తనము మధ్యనే నశించెడిని.

**అక్షోభ్యముని** — విశిష్టాద్వైతమత సన్యాసి, విద్యారణ్యుల సమకాలికుఁడు. ఒకతరి విద్యానగరమున (ఆంధ్ర కర్ణాటక సామ్రాజ్య రాజధాని) బుక్కభూపాల సమక్షమున వీరికి మతవాదము కల్గెనట. వేదాంత దేశికలు చూడ నేగి, "అసినాతత్త్వమసినా పరజీవప్రభేదినావిద్యారణ్య మహారణ్య మక్షోభ్యముని రచ్ఛినత్" ని నుడివిరట. ఎవరు జయించినదీ, నిదర్శనములు కానరావు. విశిష్టాద్వైతుల గ్రంథములందు అక్షోభ్యమునియే జయించెననియు, అద్వైతుల మతగ్రంథములందు "అక్షోభ్యాంక్షోభయామాస విద్యారణ్యో మహామునిః" అని చెప్పఁబడినది. అద్వైతులే జయించిరని చెప్పుచున్నారు. నిజమున నత్తరి నెవరు జయమందినది తెలియకున్నది.

**అక్షౌహిణి** ఇది భారత ప్రసిద్ధము. యుద్ధ సైన్య సంఖ్య. రథములు ౨౧౮౭౦, ఏనుఁగులు ౨౧౮౭౦, గుఱ్ఱములు ౬౫౬౧౦, కాల్బలము అనగా సైన్యము ౧౦౯౩౫౦.

**ఆంకోరు నగరము** — (Angkor Ruined City) — తొమ్మిదవ శతాబ్ది కాలమున నుండియుండిన పురాతన పట్టణములలో నొకటిగ చెప్పఁబడిన ఆంకోరునగర మిప్పుడు పాడుదిబ్బయై త్రవ్వఁబడుచు ఫ్రెంచి కొచ్చిన్ చీనాదేశమునందు కాంబోడియాయం దున్నది. కాంబోడియా ఫ్రెంచి ప్రభుత్వపు పొటెక్టరేటు.

అది కాంబోడియా (తొల్లింటి కాంబోజ) దేశపు రాజుల వైభవమును దెల్పుచుండును. అది వేయి సంవత్సరములు రాజధానివై భవము ననుభవించినతావు. పట్టణముంజుట్టి ౩౬౦ అడుగుల వెడలుపుగల కందకము కలదు. కోట గోడలు శిథిలమై ఐదు ద్వారములు, బురుజులు కన్పించుచున్నవి. గొప్ప దేవాలయమును, ఊరికి నడుమగ రాజనివాస భవనపు పాడునుం గాననగును. అనేక గొప్ప విగ్రహములు కన్పట్టెడిని. ఇది చతురస్రమైనది. కొన్ని చక్కని విగ్రహములు పారిస్‌నగరమునకుం గొంపోవఁబడి యున్నవి.

**ఆంగీరస గోత్రము** — కణ్వ ఉపగణము చూడుఁడు.

**ఆంగీరసనక్షత్రము లేక గోళము**- నక్షత్రములు భారతీయులు గుర్తించినవి చూడుఁడు.

**ఆంగీరస గోత్రము** — శిష్టకరణములవి. (శిష్టకరణములు చూడుఁడు.) వీరికి ప్రధానర్షి ఆంగీరసుఁడనియు, ప్రవరరూపము ఆంగీరస, ఆయాస్య, గౌతమ యనియు, వీరిలో కొందఱకు వాగీశ్వర, సగంగీరస, ఉపగోత్రములని చెప్పఁబడినది. శిష్టకరణములలో ౧. అనంత పట్నాయకునివారు, ౨. కంటెమహంతివార్లు,

౩. కల్లేపల్లివారు, ౪. జగుమహాంతివారు, ౫. నాగుమహాంతివారు, ౬. నారాయణమహాంతి వారు, ౭. సౌపడావారు, ౮. పట్నాయకుని వారు, ౯. పెదపెంకివారు, ౧౦. పొట్నూరి వారు, ౧౧. మక్కువవారు, ౧౨. మండవ కుంటివారు, ౧౩. రఘుపాత్రునివారు, ౧౪. ఉరిటివారు, ౧౫. సంతపురిటివారు అను ఇంటిపేర్లు గలవారీగోత్రజులైయున్నారు.

**ఆంగిరసమహర్షి సంతతి** (వంశావళి) — వీరు స్వసంతతివారు. అనగా అగ్నితత్వ సంబంధముగ కలిగినవారుకారు.

ఆంగిరసమహర్షి. ౪.

బృహస్పతి. భార్య తార. ౪-౧
కచుఁడు

కుమార్తె యోగసిద్ధి. వసువగు ప్రభావసుని భార్య. కుమారుడు విశ్వకర్మ. ౪/౨

ఉతథ్యుఁడు. భార్య మమత. ౪-౩

దీర్ఘతముఁడు. భార్య ప్రద్వేషిణి. ౪-౩/౧

భరద్వాజర్షి. ౪-౩/౨.

గౌతమ మహర్షి. భార్య అహల్య. ౪-౩/౨.

ద్రోణాచార్యుఁడు. భార్య కృపాదేవి. ౪-౩-౨/౧

శతానందుఁడు. ౩

అశ్వత్థామ చిరంజీవి. ౪-౩-౨/౨

శరద్వంతుఁడు లేక సత్యధృతి. ౪.

కృపాచార్యుఁడు చిరంజీవి. ౫.

**ఆంగీరసుఁడు** — (అంగిరస మహర్షి) బ్రహ్మామానస పుత్రులలో నొకఁడు. ఈతని కాంగీరసుఁడనియుం బేరుకలదు. పుత్రులు- బృహస్పతి, ఉతథ్యుఁడు అనువారలు. బృహస్పతి ఇతనికి అగ్నిత్వము కలిగినప్పుడు పుట్టిన పుత్రుఁడనియుం గూడ కానఁగుచుంట స్పష్టముగా దెలుప వీలుగానున్నది. కుమార్తె యోగసిద్ధి. ఈమె అష్ట వసువులలో నొకఁడగు ప్రభావసుని భార్య. ఈప్రభావసు యోగసిద్ధుల కుమారుఁడే విశ్వకర్మ. ఆంగీరసుఁడు అగ్నియైన వెనుక కల్గిన సంతానముంగూర్చి అగ్ని చూడుఁడు.

అగ్ని యొకతరి దేవతలతోఁ గలహించి వెడఁ పోవ నంగీరసున కగ్నిత్వ మొసంగెను. కొంత కాలమున కాదియగ్ని మఱలిరా నాతనిఁ బ్రథమాగ్నిం జేసి యాంగిరసు నాతనికిఁ బుత్రుగఁ నిలిపిరి. అట్టితరి యగ్నిసాహూప్య కాలమున శివ యను పేరుగల భార్య వలన నాంగిరసాగ్నికి నగ్నిస్వరూపులైన యేడుగురు పుత్రులును యేడుగురు పుత్రికలు నుద్భవించిరి. (అగ్ని- అగ్నిజిహ్వలు చూడుఁడు). మఱియు నిక్ష్వాకు సంతతిలోని ఉల్ముకుని కుమారున కాంగీరసుఁడని పేరుకలదు. అతని భార్య పేరు స్మృతి జ్యేష్ఠ సోదరుఁడు అంగుఁడు.

**ఆంగ్ల దేశపు సామెతలు** అందఱితోను గుసగుసలాడువాఁ డపాయకరమైనవాఁడు; అద్దాలతలుపులున్న ఇండ్లలో వసించువా రితరులపై రాళ్ళు రువ్వరాదు; అధికారమున కంతా హక్కేగాని అన్యాయ మేమిటి? అప్పు లేకుండిన నపాయమే యుండదు; అబద్ధము, అప్పు వీపుపై నెక్కి స్వారీచేయవలసినవే; అభ్యాసము ఆరిందాతనమునకు దారి; అసందర్భపుకారణములు నుడువుటకన్న ఊరకుండుట ఉచితము; అసలుమానుటకన్న ఆలస్యముగనైన నొనర్చుట మంచిది; అసూయాపరుఁ డందఱికిని చెడ్డవాఁడేగాని తనకు తా బాధకుఁడు; ఆత్మస్తుతి శిఫారసు కానేరదు; ఆపేక్ష లేకపోతే అన్నీ తప్పులే; ఇతరులు నీ కేమి చేయఁగోరుదురో అదే వారికి నొనర్పుము; ఇనుము ఎట్లాగా కాలియున్నప్పుడే సాగఁగొట్టవలయును; ఊహాపోహ లెక్కువ యైనచో నుద్ధృత ముండదు; ఎంతపెద్దచెట్టున కంత పెద్దపాటు; ఎగరగల్గితే ఉత్సాహంతోడనే యుండును; ఎవ్వరి కష్టకాలమున వారికి ముందాలోచన తోఁచదు; ఏకాభిప్రాయులైనవా రెవ్వరైనా మిత్రులే; ఒకఅబద్ధము చాలఅబద్ధాలకు దారితీయును; కుక్కకు తనగుమ్మములో కావలసినంత బలము; గాడిదకు తనకూత శ్రావ్యమే; గాలివానకుం బిదప కావలసినంత విశ్రాంతి; చక్కగాఁ బ్రారంభించుట సమంజసమైనను చక్కగా ముగించుట చాల శ్రేష్ఠము; చక్కగా ముగిసిన వన్నియు చాలాబాగా జరిగినవే; చెడినపనిని తిరిగి రెండు సార్లు చేసియైనఁ సాధింపవలయును; చేసిన తప్పు చేయలేదని బుకాయించుట రెండు తప్పులు చేయుటవంటిది.

జ్ఞానము శక్తివంటిది; తెలియని సంగతులకు ఆచారమే కర్తవ్యము; తేనెటీగకు తీరుబడి లేని పని; దుబారా లేకున్న ఇబ్బందియు నుండదు; ధైర్యసాహసములు ఉన్నచోట అదృష్టముగూడ నుండును; నాల్గునేత్రములు రెంటికన్న బాగా చూడఁగలవు; నేఁడు చేయఁగల్గినది రేపటికుంచకుము; పగసాధించుట భరించి అనుభవించుటకన్న తక్కువే; ప్రతిదీపము వెన్కను క్రీనీడే ఉండును; ప్రతిమనుష్యునకు నేదో యొకటి లోపమే; పని నేర్పులేనివానికి పరికరము లనుకూలింపవు; పంట లెక్కువయైనకొలదీ బాధ్యతలూ ఎక్కువే; పరిశ్రమలేనిది ఫలము ఉండదు; పెద్ద ఉపన్యాసము లిచ్చేవారు పెద్దపనులు చేయఁజాలరు; పేరుప్రసిద్ధి అయినపిదప పరున్నా సరే పని జరుగుతుంటుంది; బద్దలైన గంట బాగుగా వాగనేరదు; బుద్ధిలేనివానికి సగముపనిలో ఏదీ చూపకూడదు; మంచిమాటలకు వ్యయముండదు గాని విలువయుండును; మంచిమార్గమునకు మఱలుట మఱియొక మంచికే; మంచిపేరు సంపాదించుటకును గష్టపడవలెఁగాని, పోగొట్టుకొనుట సులభమే.

మాటలు ఆకులవంటివి, చేతలు ఫలములవంటివి; ముసలికుక్కలు ఊరక మొఱగవు; మూఢులు, మూర్ఖులు న్యాయవాదులను బాగుజేయువారు; మెఱసిన వన్నియు వజ్రాలుగావు,

పచ్చని దంతయు బంగారము కాదు; రక్తము నీటికన్న చిక్కగ నుండునది; రాకుండగనే జాగ్రత్తపడుట వచ్చినపిదప కుదుర్చుకోవడంకన్న చాల శ్రేయస్కరమైనది; రాఁగల అపాయమును ముందుగా గ్రహింపఁగల్గిన, సగము అపాయము తప్పినట్లె; రాయి యెల్లప్పుడు దొర్లుట అరగిపోవుటకే; రెండు నలుపులుకలిసినా ఒక తెలుపు కానేరవు; లోతునీరైతే నిశ్చలముగా నుండవలసినదే; వజ్రమును భేదించుటకు వజ్రమే కావలయును; విద్యాధిక్యతకడ వివేకము, అవివేకముకూడ నుండవచ్చును; విరుగుటకన్న వంగుట శ్రేయము; సలహామంచిదయినచో నెవ్వరు చెప్పినదైననేమి? సాహసములేనిదీ ఏపనీ జరుగదు; స్నేహితుఁడుకసిరిన కసురు వైరి నవ్వుకారముకన్న శ్రేష్ఠము; సోమరిపోతు అడుక్కొని తినేవానికిఁ దమ్ముఁడు వంటివాఁడు.

**ఆంగ్లదేశములందు నావికాదళ సైన్యము** — వీనికి Senior Service అనియు, భూసైన్యములకు Junior Service అనియుం బేర్లు. ఆంగ్ల జాతీయతఁగల్గిన కాలము నుండియు ఆంగ్ల సైనికదళము, ఆంగ్ల నావికాదళము కల్గియుండినట్లుచెప్పుచురుకాని, రెండును సమానస్థితులందుండియుండలేదు. నావికాసైన్యములు ప్రభుత్వమునకుఁజెందియుండి జాతీయ సైనికవర్గముగ పరిగణింపఁబడుచుండెడిది. ఇంక భూసైన్యములు ఆంగ్లభూపతులకు సామంతరాజులుగ నుండిన ప్రభువుల (Lords) కుంజెందిన దేశరక్షణమున కుపయోగింపఁబడుచుండెడివి.

క్రీ. శ. పదునేడవ శతాబ్ది మధ్యకాలము వఱకు ఆంగ్లజాతీయసైన్యము లనునవి యేర్పరుపఁబడిన జాడలు దేశచరిత్రలందుఁగానరావు. పిదప మఱియేబది వత్సరములకు సైన్యార్థ పరిస్థితుల నంది వృద్ధినందినవి. Royal Dock Yards సైనికపు టేర్పాటుకు మున్నొక శతాబ్దమునకు పూర్వకాలముననే యుండినట్లు కొందఱు నిదర్శనములం గనిపెట్టియున్నారు. కాన నాంగ్లసీమలందు సీనియర్ సర్వీసు (Senior Service)అని నావికాదళ సైన్యములకును, జూనియర్ సర్వీస్ (Junior Service) అన భూమిపై యుద్ధమొనర్పగల కాలిబంట్ల పటాలములకును వాడుకయయ్యెను.

**ఆంగ్ల భాషయం దక్షరముల వాడుక** — A అక్షరము ౮౫ సార్లు వచ్చుతరి B ౧౬ సార్లు వచ్చును, C ౩౦, D ౪౪, E ౨౦, F ౨౫, G ౧౭, H ౬౪, I ౮౦, J ౪, K ౮, L ౪౦, M ౩౦, N ౮౦, O ౮౦, P ౧౭, Q ౫, R ౬౨, S ౮౦, T ౯౦, U ౩౪, V ౧౨, W ౨౦, X ౪, Y ౨౦, Z ౨ సార్లువచ్చును. ఇది కేవలము అంచనాలెక్కయని చెప్పకనే తెలియుచున్నది. ఇది సరియగుతరి, ఇన్ని అక్షరములు వాడఁబడిన పదజాలమున ౧౦౬౯ అక్షరము లుండవలసి యుండును. అనఁగా ౧౦౬౯ యక్షరములు ఉపయోగించి వ్రాసిన (ఆంగ్ల) వ్రాఁతయందీ యక్షరము లించుమించు నిన్నేసియుండునని ఎఱుంగవలసియుండును.

**ఆంగ్లభాషా సుప్రసిద్ధోక్తులు** — ప్రసిద్ధులగువారి ఉక్తులు, అనుభవముగలవారి ఉక్తులు, గొప్పగొప్ప విద్యలంజదివి నేర్చినవారి ఉక్తులు ఇతరుల మనస్సులకు నాటినవి. అవి కలకాలమేగాక తరతరములుగ వాడుకయందు నిలచియుండెడిని. అట్టివి రానురాను ప్రసంగములందు కాలానుగతముగ దృఢపరిచయమంది సామెతలవంటివియే యగుచున్నవి. ఆంగ్లభాషయందలివైనను దాని సహవాసము తరుచుగ గలిగియున్న యాంధ్రులకును ఉపయోగకరములేగాన ఆంధ్రవిజ్ఞానమున జేర్చఁదగినవియే. వాని నాంగ్లాక్షర వర్ణక్రమమున వివరించుచున్నాము.

**ఆంగ్లమీటియోరోలజీ మేరకు దశముఖ్య మేఘములు** — మీటియో రోలజీ కళ వాతావరణ పరిస్థితులు, మాన్సూను వర్షపు గాలులు, విజిబిలిటీ (దృశ్యలక్షణములు) మేఘముల స్థితి, గాలి ఒత్తిడి, ధృతములు మొదలగువాని తెల్పును. వీనింబట్టి ఫోరుకేస్టు లం దెల్పుచుందురు. ఇది ప్రాశ్చాత్యకళ గాన ఐరోపాదేశములం దార్యాభాషలలో వ్రాయఁబడి యున్నది. భరత దేశమునందు ఆంగ్లమీటియో రోలజీ శాస్త్రమే వాడుకయందున్నది. అందు వివరింపఁబడిన మేరకు, ఆకాశమునందెత్తున నేర్పడు మేఘములు, హైక్లౌడ్సు(high clouds) (medium clouds) అనియు, లోక్లౌడ్సు (low clouds) అనియు త్రివిధములు. అందు హైక్లౌడ్సు త్రివిధములుగను, మీడియమ్ క్లౌడ్సు ద్వివిధములుగను, లోక్లౌడ్సు పంచవిధ ములుగను మొత్తము దశవిధ మేఘకూటములని చెప్పంబడినవి. ఈసందర్భమున మేఘకూటములం గూర్చి ఇంచుక స్పష్టపర్చుట సమంజసము. ఇవి ఆకాశమునం దాయా ఎత్తుప్రదేశముల గాలిలోఁ దిరుగుచు చేరుకొని, కలసిన మేఘ ముల సముదాయము. వానియాకారములు మొదలగునవి ముందు వివరింపఁబడును. అట్లు కూడిన మేఘములు ఆ ఎత్తునుండి కదలి రూప మును గోల్పోవుతరి వాని నామములంగూడ గోల్పోవుచుండును. ౧. సిర్రస్ హైక్లౌడ్, (cirrus high clouds) సముద్రపు నీటిమట్ట ముపై 30000 మొదలు ४0000 అడుగుల ఎత్తున నేర్పడు మేఘము. ఆకారమున పక్షి ఈకెలం బోలియుండునది. దీని సంబధమునసే కొంచెము పలుచనగ గట్టులవలె వరుసలం దీర్చి యుండు మేఘపట్టులను Bands of cirrus అనియు, Mares tails అనియుఁ గూడ వాడుటకలదు. పరిశీలకులివి హైక్లౌడ్సుగ నుం డియు సముద్రపు మట్టముపై నైరుమైల్లు లేక ౨౬४00 అడుగుల ఎత్తునఁ దఱచుగ నేర్పడు చుండునని చెప్పుచున్నారు. సూర్య చంద్రులం జుట్టి కన్పట్టు దూరపరివేషముల కీమేఘములే కారణ మనియు, ఈమేర్సుటెయిల్సు మేఘములందు చిన్న చిన్న మంచు ముక్కలు ఏర్పడి, అందు నిలచియుండునని యుఁ గూడఁ దెలియుచున్నది.

ఇంకను ఈ Bands of cirrus మేఘ పటులు కొంత కిందికిఁ దిగి ఆయాకారము ననే ఎక్కువ యందముగ నొక్కొక తఱిఁ గన్పట్టుననియు, అత్తరి దానికి Speckled అని పేరనియు, ఆ యాకారమునం దింకను మారి, భేదరూపమున మేర్సుటెయిల్సుకన్నను కొంత దిగువగ నొక్కొకతఱిఁ గన్పట్టుననియు, దానికి Mackerl cloud అని పేరనియుఁ జెప్పంబడినది.

(౨) సిర్రస్ స్ట్రేటస్ హైక్లౌడ్ (Sirrus Stratus High Cloud) సముద్రపు నీటిమట్ట ముపైని, ౨3000-33000 అడుగుల ఎత్తు వరకు నేర్పడుచుండును. ఆకారమున నీమేఘ కూటము, దూదిపింజలవలె నుండెడిని. ఇది గన్ప ట్టుట Fair weather ను గల్గించి, ఆరో గ్యవంతపు గాలి వీచుటకు సూచకములని చెప్పఁ బడినది.

(3) సిర్రో కమ్యులస్ హైక్లౌడ్ (Sirro-cumulus High Cloud) సముద్రపు నీటి మట్టముపై, ౨3000 మొదలు ౨౬000 వేల అడుగుల ఎత్తున నేర్పడు మేఘకూటము. ఆకార మున నిది దూదిబంతులవలెను, పక్షియీకల వలెను, ఒక్కొకతఱి ముద్దలుముద్దలుగను గన్పట్టు చుండెడిని. ఈమేఘదృశ్యము Fair weather నకును, Healthy Wind నకును సూచకమని చెప్పంబడినది. ఈమేఘములే సూర్యచంద్రులం జుట్టి యప్పుడప్పుడు గన్పించుచుండు చేరువ గుడుల (Short Halo) గల్గించునదిగ జెప్పం

బడినది. మఱియు నీమేఘకూటమి సంబంధమే యగుచు నించుక భేదాకారము గలదానిని (మేఘమును) Dappled Cloud అనియెదరు గాని, దీనిం గూర్చి యభిప్రాయభేదములు కల వందురు.

(౧) ఆల్టోక్యుమ్యులస్ మీడియమ్ క్లౌడ్ (Alto-cumulus Medium Cloud) ఇది సముద్రపు నీటిమట్టముపైనుండి ౧౩౦౦౦ మొదలు ౨౦౦౦౦ అడుగుల ఎత్తున ఆకసమునం దేర్పడు మేఘకూటము. అకారమున పెద్ద దూది పింజలంబోలిన పొడవువరుసలుగను, అచ్చటచ్చట గుంపులంబోలి గన్పట్టుచుండు మేఘము. బూడిద వర్ణము (Grey Colour) తో నంచులందు తెల్లగ నుండును. ఉదయమునకుఁబిదప తొమ్మిది గంటలనుండి అపరాహ్ణమునుక నేర్పడుచు గన్పించుచుండెడిని. ఒక్కొకప్పుడు సూర్య చంద్రులం జుట్టి కన్పట్టు సమీప పరివేషము (చేరువగుడు) లం గల్గించునదిగ చెప్పఁబడినది.

(౨) ఆల్టోస్ట్రేటస్ మీడియమ్ క్లౌడ్ (Alto-Stratus Medium Cloud). ఇది సముద్రపు నీటిమట్టముపై ౧౦౦౦౦ మొదలు ౨౦౦౦౦ వేల అడుగుల ఎత్తుననేర్పడి గన్పట్టుమేఘము. ఆకారమున బూడిదవర్ణమున అచ్చటచ్చటను, అచ్చటచ్చట పలుచగను మబ్బుఁగ్రమ్మి ఆకాశ మున వ్యాపించి మూసివేయుచుండునది. ఉదయ మెన్మిదిగంటలనుండి పండ్రెండు గంటలదనుక నేర్పడుచు గన్పట్టుచుండెడిని. దీనిగాలి ఆరోగ్య వంతముకాదని చెప్పఁబడినది.

(౧) స్ట్రాటోకుమ్యులస్ లోక్లౌడ్ (Strato-cumulus Low Cloud). సముద్రపు నీటి మట్టముపై ౬౫౦౦ మొదలు ౧౩౦౦౦ అడు గుల ఎత్తుననేర్పడి గన్పట్టుమేఘము. ఆకారమున నిది ఏకిన దూదిరూపముగలది. ఏకులంబోలి పొడవుగట్టులను బోలియు, పలుచని బూడిదరంగు (Grey Colour) బంతులంబోలియు, ఎచ్చుతగ్గు గుబురులంబోలియు శరీరాకారములం గల్గి తరుచు సాయంతనమునుండి రాత్రియం దేర్పడి కన్పట్టు మేఘము. దీనిగాలి ఆరోగ్యవంతము కాదందురు. ఈమేఘమేర్పడినతరి నొక్కొకప్పుడు పెనుగాలి వీచి కురువనున్న వర్షముంబోగొట్టును. ఈ మేఘ కూటమి చల్లగాలి తగులుటతో నుదయము లందునను, వర్షము గురిసిన పిదప చల్లఁదనము నందు కూడ నేర్పడునందురు.

౨. క్యుమ్యులస్ లో క్లౌడ్ (Cumulus Low Cloud) సముద్రపునీటిమట్టముపై ౩౦౦౦ మొదలు ౧౦౦౦౦ అడుగులవఱకు నాకాశమునం దెత్తున కూడ గన్పట్టు మేఘము. ఆకారమున నల్లని పెద్దకొండలవలె వరుసలందీర్చి అంచులందు తెలుపుగలమేఘము. సాధారణముగ ఉదయము తొమ్మిది గంటలనుండి సాయంకాలము దనుక నేర్పడి గన్పట్టుచుండెడిని. ఇవి Fair weather నకును, Healthy Breeze నకును సూచక ములని చెప్పంబడినది. ఒక్కొకతరి నీమేఘ ములు Cumulus nimbus గా మారిపోవుట యుం గలదు. అత్తరి చినుకులు పడుటయు వర్షించుటయు సంభవించెడిని. ఒక్కొకతరి పొగమంచు కల్గెడిని. (కుమ్యులస్ నింబస్ చూడుఁడు).

3. కుమ్యులోనింబస్ లో క్లౌడ్ (Cumulo nimbus Low Cloud) సముద్రపు నీటిమట్ట ముపై ౧౫౦౦ మొదలు ౩౦౦౦ అడుగుల ఎత్తున నాకసమునం దేర్పడి కన్పట్టు మేఘము. ఆకారమున నిది ఎత్తగు కొండలవలె క్రిందిభాగము నలుపు, పైభాగము తెలుపురంగులం గల్గి, చల్లగాలి వీచుటతో చినుకులుగాని, వర్షము గాని, పొగమంచుగాని కల్గించును. ఈ మేఘము

దూదిపింజల (Cotton wool) వలెను, ఫ్యాక్టరీ చిమ్నీ (పొగగొట్టము) ల నుండి పైకివెడలు రాక్షసబొగ్గుపొగనుబోలు రంగుగ నుండుటయును గలదు. (కుమ్యులస్ లోక్లౌడ్ చూడుడు.) ఇది ఉఱుములు గల్గించు మేఘముగాన, థండర్ క్లౌడ్ అని పేరందియున్నది

౪. నింబస్ లో క్లౌడ్ (Nimbus Low Cloud) సముద్రపునీటి మట్టమునకు ౧౫౦౦ మొదలు ౬౫౦౦ అడుగుల ఎత్తున నాకసమునం దేర్పడి గన్పట్టు మేఘము. ఆకారమున ననేక పొరలం గలిగి, చీకటివలె నీలచ్ఛాయను గూడ నిబంధనలేక, దళసరిగా చీలిపోయిన ట్లుండు అంచులతో గన్పట్టెడిని. ఇది ఉఱుములు, మెఱపులును గల్గిన వర్షమేఘము. ఈ నీలమేఘపు పొర లొండొంటితో రాపిడిగలుగ, చల్లగాలి తగులుటతో నీరై వర్షించును. ఒక్కొక తరి నీమేఘము వర్షాంతమున (Alto cumulus)గా మారిపోవుటయు, అత్తరి సుడిగాలి ధూళితుపానులు గల్గుటయును గలదు. ఈ మేఘముల కాకాశమున నడచు వాయువిమానములు భయపడుచుండును.

౫. స్ట్రేటస్ లో క్లౌడ్ (Stratus Low Cloud) సముద్రపు నీటిమట్టమునకు ౧౫౦౦ మొదలు ౨౫౦౦ అడుగుల ఎత్తున నాకసమునం దేర్పడి గన్పట్టు మేఘము. ఆకారమున నిది నల్లగా దూదిఏకులం బోలి పొడవున వరుసలుతీరి యుండెడిని. సాధారణముగ గాలివానలకుం బిదప నేర్పడి, పొగమంచును గల్గియుండును. ఇదియే వానపాముగ నగును. Lines Quall Cloud ఒక్కొకప్పుడు ఇది యేర్పడుతరి పెనుగాలి వీచి వర్షించెడిని.

ఇంకను వీనినుండి స్వల్పభేదములు గల Bands of cirrus లేక Mares tails మేఘమొకటియు, Speckled cloud ఒకటియు, Mackerl cloud ఒకటియు, Dappled cloud ఒకటియు, Wool pack cloud ఒకటియు వీనిసంబంధములుగాన వేఱుగ పరిగణింపఁబడనక్కఱలేదని పరిగణింపక వదలియున్నారట.

**ఆంగ్ల లేఖలు వ్రాయు కళ** — లేఖలు వ్రాయుట చూడుడు.

**ఆంగ్ల వివాహ విధానము** —ఆంగ్లసీమలందు ౧౭౫౩ సంవత్సరమువఱకు వివాహమునుగూర్చిన శాసనము సరిలేక పలువిధములుగ జరుగుచు ననేక చిక్కులకుఁ గారణమగుచుండె నట. మఱియు వానిఫలితములుగ ననేక అపయశములు వ్యాపించుచుండెనట. పిదప క్రీ. శ. ౧౭౫౩ సంవత్సరమున హార్డ్విక్ శాసనము విధింపఁబడి వివాహమునకుం బూర్వము, ముందు వివాహమాడబోవువార్ల పేర్లు ప్రకటింపఁబడుట పద్ధతి యయ్యెనట. మఱియు వివాహమొనర్చునుద్యోగికి సర్వకాలపరిమితితో నోటీసునిచ్చి వివాహపు లైసెన్సు (Licence) పొందు నేర్పాటు చేయఁబడెనట. ఆశాసనము మేరకు క్రైస్తవదేవాలయములందు పవిత్రపర్చబడుటకు అర్హకాలముగ చర్చియొక్క కాలమునసే (Old Canonical hours) అనగా ఉదయము ఎన్మిది గంటలు మొదలు మధ్యాహ్నము పండ్రెండు గంటలవఱకు విధింపఁబడినదట. పిదప నాశాసనము కొంత సవరింపఁబడుచో నీకాలమును ఉదయము ఎన్మిదిమొదలు మధ్యాహ్నము మూడు గంటలవఱకు హెచ్చించిరి. నేటికిని అట్లే యున్నది.

**ఆంగ్లవైద్యమున రోగముల కౌషధ నిర్ణయ విధానము** — ఆంగ్లవైద్యవిధానమున రోగులం బరిశీలించి, అర్హౌషధములు నిర్ణయించుచుండు పనికి ప్రిస్క్రిప్షన్

(Prescription) అనియెదరు ఈ ప్రిస్క్రిప్షన్ వ్రాయుట, ఆంగ్లవైద్యవిద్య నెఱుంగనివారల కగమ్యగోచరముగ నుండెడిని గాన దానినించుక వివరింతుము. ప్రిస్క్రిప్షనునందు నాలుగు భాగము లుండును. ౧. Superscription- దీనికి సర్వసాధారణముగ R అక్షరమును వ్రాయుచున్నారు. ఈయక్షరము Recipere అను లాటిన్ మాట సంబంధము గలది. ఈమాటకు (To take) పుచ్చుకొనుట యని యర్థము. తొల్లింటికాలమున నీ R అక్షరము Jupitor గ్రహమునకు చిహ్నముగ వాడఁబడెడిదట. ౨. Inscription- ఇది ప్రిస్క్రిప్షనునందు వాడఁబడు పదార్థములను వానికొలత(మోతాదు)లు దెల్పెడిని. దీనిని Body of Prescription అనియు ననుట కలదు. ఇందు నాలుగు భాగములు కలవు. దీనియందే రోగి కీయఁదలంచిన ఔషధములు వివరింపఁబడును. ౧. Basis or principal active ingredient రోగముపై పనిచేయు ప్రధానౌషధములు. ౨. Adjuvant- దీనిని Auxiliary అనియు నందురు. ఇది ఔషధముచేయు గుణములకు బలమొసంగునది. ఇట్టిదాని నాయుర్వేదవైద్య లనుపానమనియెదరు. 3. Corrective- ప్రధానౌషధమునందు గల కొన్ని గుణములు రోగికి ననవసరములుగనో, కొంతవఱకు నపాయకరములుగనో, బాధకరములుగనో తలంపఁబడెనేని వాని శాంత పఱచుటకు నందు చేర్చెడి వేఱుఔషధము లేక ఔషధపదార్థము. ఇది ప్రధానౌషధము గల్గించునని తలంచిన బాధకర గుణమునకు ప్రతిక్రియ యొనర్చునది. అనగా ఔషధ ప్రధానగుణమును ఎదర్చక దాని యితరదుర్గుణముల మాత్ర మెదుర్చుచు, వానిని శాంతింపఁజేయునని యెఱుంగునది. ౪. Vehicle- దీనిని Excipient అనియు నందురు. ఇది చేర్చుటవలన ఔషధము పుచ్చుకొన నర్హమై లేక అబాధకరమై లేక రుచికరమై సేవింపనగుట ఇందు ప్రధానమగు నభిప్రాయము.

3. Subscription- ఇది ఔషధమును ప్రిస్క్రిప్షనుమేరకుం గలిపి సిద్ధపఱుచు Dispenser లేక Compounder కు ఇచ్చు సలహాలం గల్గియుండును. ఇట్టి ఔషధము నెట్లు కలిపి సిద్ధపరచుటయో వివరింపఁబడును.

౪. Signature- ఇది రెండు భాగములు గలది. మొదటి భాగమున ఈ యౌషధము సేవించుతరి రోగి గమనించవలసిన విధులును, రెండవభాగమున వైద్యుని సంతకచిహ్నమును గల్గియుండును. ఈ రెండుభాగములును ఆంగ్లమునగాని, లాటిన్ భాషనుగాని, గూడ నుండ వచ్చును సాధారణముగ మొదటి భాగ మాంగ్లముననే వ్రాయఁబడును. ఆంగ్ల వైద్యమున రోగములకౌషధనిర్ణయ విధానము కొంద ఱాంగ్లవైద్యులు తమ సంతకమునుగూడ లాటిన్ భాషయందే జేయుదురని వినుట కాశ్చర్యము గొల్పెడిని. ఇంక నాంగ్లవేషధరులగు నాంగ్ల విద్యావిశారదులమనుకొను భారతీయులే భాషలో సంతకమొనర్చినను ఒకటే.

**ఆంగ్ల వ్యాకరణము** —ఇందు ముఖ్య భాగములు నాల్గు చెప్పఁబడినవి. ౧. ఆర్థాగ్రఫీ. (అక్షరవిచారభాగము), ౨. ఇటిమాలోజీ (పదవిచార భాగము), 3. సింటాక్సు (వాక్యవిచార భాగము), ౪. ప్రోసోడీ (చందో విచార భాగము).

**ఆంగ్లసారస్వతము** — ప్రపంచసారస్వతచరిత్రలో నాంగ్లసారస్వతప్రసక్తి యుత్తమస్థాన మందఁగల్గును. ఆంగ్లసారస్వత మన్నిటనిక్కాలమున పూర్ణత్వ మందినదనుట నిర్వివాదాంశము. ఆంగ్లసారస్వతకృషిలోఁ జేరందిన మహనీయులు తమరచనలచే విశ్వమున సాహితీ

కన్య కలంకారములు ప్రసాదించిరి. ఆంగ్లసారస్వతమున నవలరచన యొక నవ్యమార్గము. నాటకకృషి ప్రత్యేకశాఖ. వచనరచన వన్నె మీరిన త్రోవ. విమర్శన మొక కళ. వ్యాసరచన భాసురసృష్టి. కవిత సుమనోజ్ఞము. ఈ విశేషములచే సంస్కృతవాఙ్మయము తరువాత నేఁడాంగ్లసారస్వతమే తక్కుఁగల సారస్వతములకుఁ బురోగామి కాఁగలిగినది. తత్సారస్వతాభివృద్ధి నీక్రిందఁ బొందుపరుపఁబడిన పరిణామావస్థలు తేటతెల్లము గావింపఁగలవు.

క్రీ. శ. ౫౭౬-౧౦౬౬ వఱకుఁ గల నాంగ్లోశాగ్సను యుగమునం దాంగ్లసారస్వతబీజములు గాన్పించును. ఈయుగకాలమున లాటినుభాషా ప్రాబల్యము విశేషము. క్రైస్తవమతవ్యాప్తితో సారస్వతకృషికూడఁ జక్కఁగ సాగినది నాఁటి రచనలన్నియు మతసంబంధములు నైతికములును. పదునొకండవ శతాబ్దమున సారస్వతాభివృద్ధి సన్నగిల్లినను కథారూపమగు వేల్సు (wales) దేశపు కవిత యొక ప్రత్యేకతను సంపాదించుకొనినది. ఆంగ్లసారస్వత ప్రారంభదశ పదునాల్గవ శతాబ్దమధ్యమునఁ బ్రారంభమైనది. ఈ యుగమునే పదునేనవ శతాబ్దాంతమువఱకుఁ బొడిగింపవచ్చును. ఆంగ్లసారస్వతము విలక్షణమగు నొక జాతీయతతో విరాజిల్ల మొదలిడినది. ఇందులకు ముఖ్యకారణము, ఈ యుగకర్తయగు ఛాసరుకవి పరిశ్రమలు. పూర్వసారస్వతానుభూతులతో సమన్వయింపఁబడిన ఇటలీపరాసు వాఙ్మయమార్గము లీతనిలో నూతనత్వము నందికొనినవి. తొలుత నాంగ్లశైలి జాతీయముగ సృష్టింపఁగల్గిన దీతఁడే. ఇతని కాంటర్బరీకథలు (Conterbury Tales) సుప్రసిద్ధగ్రంథము. క్రొత్తగా కనిపెట్టఁబడిన ముద్రాయంత్రము సారస్వతవ్యాప్తికి తోడ్పడినది. యూరపు నంతయు మతనాగరికతావిషయములలో వింతగ మార్చివేయఁగల్గిన నవజీవనోద్యమము (Renaissance and Reformation) ౧౪౭౭-౧౫౭౯ ఆంగ్లసారస్వతముపై నత్యద్భుతప్రభావము చూపినది. ప్రాచీనసాహిత్యపునరుద్ధరణమునవ్యసారస్వతసాంప్రదాయములకు బాసటయైనది. స్కాట్లండు ఇంగ్లాండుదేశములం దీకాలమున పెక్కు కవు లుద్భవించిరి.

పిదప నాంగ్లసారస్వత చరిత్రలో ఎలిజబెతు యుగము ౧౫౭౯-౧౬౨౦ ముఖ్యమైనది. వాఙ్మయము జాతీయతను ప్రతిబింబింపఁజేయునదియై, సాంఘికవ్యవస్థతో సామరస్యము కల్గినదైనది. ఇందు స్పెన్సరు, షేక్సిపియర్లు సుప్రసిద్ధులు. నాటకరచన ప్రజల నాకర్షించిన దినము లవి. బెంజాన్సను, బ్యూమంటు, ఫ్లెచరు కవుల నాటక నిర్మాణమున కాలదేశవస్త్వైక్యతలు గమనింపఁదగినవి. మానవ జీవితముల నన్నిత్రోవలలోను చిత్రించుటలో షేక్సిపియరు మహాకవి లేఖిని సిద్ధిఁజెందినది. పిదప బ్రజలపై క్రీ. శ. ౧౭౦౦ నాఁటికి నాటకప్రాబల్యము తగ్గినదనవచ్చును. కాని, గోల్డుస్మితు, షెరిడను మున్నగువారు నాటకరచనా ప్రయత్నములను మానలేదు.

వచనరచన ఆంగ్లసారస్వతములో నొకశాఖ. బన్యన్ గ్రంథకర్త రచనలు (Bunyan's Pilgrim's Progress) వచన గ్రంథములలో నేఁటికిఁ బ్రసిద్ధమైనది. వచనశైలికి మార్గదర్శకుఁడు డ్రైడన్. ఎడిసన్ స్టీలుతోఁ గలసి ప్రకటించిన స్పెక్టేటర్ టేట్లరు (Spectator and Tatler) పత్రికలు వచనమును వ్యాప్తిలోనికిఁ దెచ్చినవి. వ్యాసరచన వచనమున నొక ప్రత్యేకశాఖ. బేకనుపండితుఁడు వ్యాసముల దొలుత వ్రాసినవాఁడు. తరుపరి వ్యాసరచనలలో ప్రసిద్ధులైనవారు డిక్విన్సీ, రస్కిను, స్టీవెన్సన్,

లేంబ్, హేజ్లిట్ మొదలగువారు. భావనలో గాంభీర్యము, రచనలో రమణీయత, భాషలో పాండిత్యము, వాదమున తర్కము, వీరి వ్యాస లక్షణములు.

విమర్శన మొకకళగా నాంగ్ల సారస్వతమున నభివృద్ధి గాంచినది. పాశ్చాత్య సాహితీవిశారదుల దృక్పథము విమర్శనాయుతమైనది. కావ్యకర్త దృక్పథమునే మనసునందిడుకొని, వ్యక్తిగతాభిప్రాయ రహితమగు విమర్శనములే ఉత్తమములని చూపినవారిలో లేంబ్, హేజ్లిటు, కోల్ రిడ్జి మున్నగు ముఖ్యులు కలరు.

నవలలు విక్టోరియాయుగమున (౧౮౩౭-౧౯౦౭) ప్రజాకర్షణ బొంది వృద్ధిగాంచినవి. ఈనవలలోఁ బ్రదర్శింపఁబడినవి కథాకల్పనము, భాషాపాండిత్యమే కాక, ఉత్కృష్టమగు మానవ జీవితాదర్శములుకూడను. ఈరచయితలలో డికెన్సు థేకరీ, ఇలియట్ హార్డీ, స్కాటు మున్నగువారు ముఖ్యులు. ఆధునికులలో వెల్సు బెర్నార్డుషా, గాల్సువర్దీ ప్రముఖుల రచనలు ముఖ్యములు.

ఆంగ్లకవిత షేక్సిపియరు తరువాత మిల్టను రచనలలో నుత్కృష్ట స్థితి నందినది. కలము చేఁబట్టగల్గిన కవులందఱు ప్రసిద్ధ భాషావేత్తలగుట ఆంగ్ల సారస్వతమునకు నవజీవనము కలిగినది. కవితనుదాటి విమర్శనయు, విమర్శనము నతిక్రమించి కవితయు నడచినవి. ఫ్రెంచి విప్లవము ౧౭౮౯ - ౧౮౩౨ కవితలోఁ గ్రొత్తదారులఁ జూపినది. కవిత రాజప్రాసాదములు వెలువడి సామాన్య ప్రజా దృక్పథమును వెలార్చినది. కేవల ఛందోబద్ధమగు పోపు మున్నగు వారి రచనల యందాదరము తగ్గినది. భావనకు దివ్యానందము కలుగఁజేయు సౌందర్య ప్రధానమైనదే కవిత యను సిద్ధాంతము వీరిది. ఈనవ్యమార్గము కోల్‌రిడ్జి వరడ్సు వర్తు కవులు ప్రకటించిన కావ్య సంపుటి (Lyrical ballads 1798) తో ప్రజాహృదయము నాకర్షించినది. ఈమార్గపు కవులలో నింకను షెల్లీ, బైరను, కీట్సు, స్విన్‌బరన్ ముఖ్యులు. నేటి యాంగ్ల కవులగు డ్రింకువాటరు, మేస్‌ఫీల్డు మున్నగు వారి రచనలు కవితనింకను ముందునకుఁ దీసికొనిపోయినవి.

**ఆంగ్లో శాక్సను జాతి** — ఆంగ్లేయులందు వీరధికముగాఁ గలరు. ఆంగ్లిసీసు తెగవారి సాక్సను తెగవారి యైక్యత ఆంగ్లో శాక్సను జాతిగఁబరిణమించినది. తర్వాత రాజకీయ సందర్భముల కనుకూలించునటుల నందఱు కలసి బ్రిటీషువా రనిపించుకొనుట ఎక్కువ మోదావహమైనది.

**ఆంగ్లౌషధములు పండ్రెండు విధములు** — ఆంగ్లౌషధములు వైద్యుని నియామకముమేరకు ఓషధీపరిమాణమునందుగాని పుచ్చుకొన నేర్పఱచినకాలమునందుగాని, ఇంచుకైనను ఎచ్చుతక్కువలులేకుండ చూడవలెనని కఠిననియామకము కలదు. మాత్రలు మ్రింగుట కష్టమనితోచినతరి కొంచెముపాటి ఉదకము తోడనే నోటంబోసికొని త్రాగదగునుగాని మాత్ర కరగిపోవుటకును దగినంతవఱు త్రాగరాదనియుఁ జెప్పఁబడినది.

ఆంగ్ల వైద్యవిధానమున ఔషధములు పండ్రెండు విధములుగ నుండును. ౧. Aperients (ఎపరైంట్స్)- ఇవి చులకని Laxatives వంటివి. వీనిని పసిబాలుర కీయుచుందురు. చిరకాలమునుండి వాడఁబడుచున్నవి Brimstone Powder అనునదియును, Treacleఅనునదియు. ఇందు మొదటిది పాలతో నిత్తురు. తక్కినవి Caster Oil (ఆముదము), Jalap, Senna, Epsom Salt, Rhubarb అనుపాన ౨. Drinks (డ్రింక్సు)- ఇవి లోనికిచ్చునవి.

కములు. కొన్ని వేడియు, కొన్ని చలువయు, కొన్ని జలుబును చేయుటకు లోనికిత్తురు. 3. Emulsions (ఎమల్షన్సు)- ఇవి ఔషధములలోనివే. లోనికిచ్చుతరి రోగముపై పని యొనర్చగల బలముగలవియే. ౪. Laxatives (లేక్సటివ్సు)- ఇవి కాలవిరేచనమును ఇంచుక బలముతో వెడలజేయుంగాని, విరేచనమునకిచ్చు బలమగు నౌషధములుకావు. విరేచనములు చేయించవలసినతరి వీటిపని చాలదు. ఇవి Drugs లోనివి. ౫. Purgatives (పర్గెటివ్సు)- ఇవి విరేచనములుగల్గించు ఔషధములు. మలబద్ధము బలమగుతరి నీయతగినవి. ఇవి Drugs లోనివి. ౬. Powders (భస్మములు)- ఇవి వెనుక నొకప్పుడు తరుచుగ వాడబడుచు సర్వసాధారణములై యుండెడివి. ౭. Pills (మాత్రలు)- వీటిని Tabloids అనియునందురు. ఈమాత్రలందు వేఱ్వేఱు ఔషధపదార్థములం గల్పి మ్రింగవీలుగ నుండునటుల రచింతురు. ౮. Stimulants (దీపనములు)- ఇవి శరీరమునకుగాని, మనస్సునకుగాని తాత్కాలికబలము, ఉత్సాహము లేక నిద్ర లేక మత్తు, వీటింగల్గించి పిదప అది చేయగల పనింజేయును. ౯. Narcotics— (Drugs చూడుఁడు). ౧౦. Ante Spasmodics— (Drugs చూడుఁడు). ౧౧. Ointments (తైలములు)- వీనికి Emollients అనుటయుం గలదు. పుండ్లు, కాలినపుండ్లు, కొట్టుకుపోయినపుండ్లు, కవుకుదెబ్బలు మొదలగు చర్మమునకుగల్గెడి అపాయములకు, రోగములకు, తామరతీట,గజ్జి,చిడుము, మొదలగు చర్మవ్యాధులకు నుపయోగింతురు. ఇందు Embrocations అనంబడు కొన్ని మందులు కలవు. అవియు వీటివలె *నుపయోగింపఁబడునవియే. ౧౨. Tonics— (Drugs చూడుఁడు).



**ఆంజనేయుఁడు** (హనుమంతుఁడు)

వానరుఁడు. తండ్రి కేసరియను వానరుఁడు, తల్లి అంజనాదేవి. ఈమె గౌతమునకు అహల్యయందు కల్గిన కుమార్తె. వాలిసుగ్రీవులు అంజనకు సోదరులు (వాలిసుగ్రీవులు చూడుఁడు.) తొల్లింట అంజన యొక అప్సర, పుంజికస్థలయని పేరుగలది. ఒకప్పు డీమె (అంజన) మనుష్యరూపధారిణిగ విహరించుచుండ, వాయుదేవుం డీమెంగాంచి వలచి యీమెంగూడ, గర్భవతియై హనుమంతుం గనియె. అంజనసుతుండు గాన హనుమంతునకు ఆంజనేయుఁడని వాడుకనామము గలదు. సూర్యునికడ విద్య లభ్యసించినవాఁడు. జన్మస్థానము ఋష్యమూకపర్వతముకడ నున్న అంజనాద్రి. ఈతని మేనమామలగు వాలిసుగ్రీవుల (వాలి అహల్యయందు ఇంద్రునకును, సుగ్రీవుఁడు అహల్యయందు సూర్యునకును జనించినవారు,అంజనకు సోదరులు)కు కలహముకల్గి వాలి సుగ్రీవుని వెడలగొట్టుతరి యాతడు ఋష్యమూకముపై మతంగమహర్షి శరణుజొచ్చి రక్షణనందుతరి, సుగ్రీవున కుపచారము లొనర్చుచు అతని కడ మంత్రిగ హనుమంతుఁ డుండినవాఁడు. పిదప శ్రీరాముఁడు సీతం గోల్పోయి వెతకుచు, ఋష్యమూకముకడ కేగి సుగ్రీవుని మైత్రిబడసి వాలిం జంపి కిష్కింధరాజ్యము సుగ్రీవునకు వశపర్చ, హనుమంతుఁడు ‘రామభక్తుండై లంకాయుద్ధమున మహావీరుడను బిరుదనామము వడసినవాడు. నేటికిని ఆబిరుదనామమున వాడబడుచున్నాఁడు. చిరంజీవి. రాఁగలయుగమున హనుమంతుఁడు బ్రహ్మపదవి నందునని చెప్పఁబడినది. లంకాయుద్ధమునకుం బిదప శ్రీరాముండు రామేశ్వరమున రామనాథ (సైకత) శివలింగముం బ్రతిష్ఠించ,హనుమంతుఁడును ఆరామనాథలింగమునకు ప్రక్కగన్నే,విశ్వేశ్వరలింగమనుపేర ప్రతిష్ఠించెను.

**ఆండ్రోసుద్వీపము** — గ్రీసుదేశము లోని, ఐలండ్సుగ్రీసు నందలి యొక ద్వీపము, చూడుఁడు.

**ఆంథ్రోపోమెట్రీ** (Anthropometry) ఫ్రెంచిమాటయగు Anthropometrie యొక్క వికారము. జర్మనుభాషలో Anthropose = మనుష్యుఁడు. Metron = కొలత. వేర్వేఱు జాతుల మానవుల శరీరములయొక్కయు, శరీర భాగములయొక్కయు, కొలతలు, పరిమాణముల విచారణయొనర్చు కళ. వేర్వేఱు జాతులవారి శరీరములందలి వేర్వేఱుఅవయవములు, వేర్వేఱు అవయవ కాలములందు వాని పరిమాణములు ఒకటితోనొకటి పోల్చిచూచిన గన్పించు భేదములను వివరించు కళ.

**ఆంథ్రోపోగ్రఫీ** (Anthropography)- ఫ్రెంచిమాటయగు Anthropograpie యొక్క వికారరూపము. వేర్వేఱుజాతుల మానవులు తొల్లింటికాలముల నేయేతావులనుండి, నేయే మార్గముల జరగుచు, నేయేదేశముల తావుల కేగిరో ఆవివరములందెలుపు కళ.

**ఆండీసు** (లేక ఏండీసు) **పర్వత ప్రదేశము** — దక్షిణ అమెరికాఖండపు పశ్చిమ భాగమున నుత్తరదక్షిణములకు ౪౪౦౦ మైళ్ల పొడవున వ్యాపించి యున్నది. పర్వత పఙ్క్తి నడుమగ గొప్ప పీఠభూమియు, ఇటునటు నెత్తగు శిఖరములును కలవు. పీఠభూమి యుత్తరము నుండి నడుమదనుక నూరుమైళ్ల వెడలుపుతో నున్నది. ఈపర్వతముప్రక్క చరియలందు సముద్రపుమట్టముపై ౧౨౫౪౦ అడుగుల ఎత్తున నొక పీఠభూమియు, దానినడుమను టిటికాకా యని పేరుగల యొక గుండ్రని (వృత్తాకారపు) సరస్సును కలదు. ఆండీసంతయు నగ్నిపర్వతములు గలప్రదేశము. దానింబండితులు భూకంపముల ప్రదేశమనియు ననుచుందురు. కొండమడతలలోని లోవలింకను పైకి ఉబుకునటుల నడుగు నుండి త్రోయంబడుచునేయున్నవని పరిశీలకు లనుచున్నారు, తూర్పునుండి ట్రేడు విండ్సు (Trade Winds) పర్వతములం దాకుటయు, దక్షిణ భాగములందు Westerly Winds పర్వతములం దాకుచుంటయు, అమెజాను నదీ లోవయు పశ్చిమమందున్న ఎడారియు, గొప్ప గొప్ప వర్షముల నందుచున్నవనియు, తూర్పున నున్న గొప్పగొప్ప మైదానపుబయళ్లు విశేష వర్షముల నందుచున్నవనియు నందురు. ఇందలి గొప్పశిఖరములలో ఇల్లంపు (లేక సొరాటా) శిఖరము ౨౧౨౮౦ అడుగుల ఎత్తున బొలీవియా దేశమునందున్నది. తరువాతఁ జెప్పఁదగిన ఇల్లిమని శిఖరమును ఆదేశమునందే ౨౪౬౩౩ అడుగుల ఎత్తుగనున్నది. చిలీ, అర్జంటైను దేశముల మధ్య హద్దుగనున్న ఏకన్కాగువా శిఖరము ౨౩౦౮౧ అడుగుల ఎత్తునున్నది. బొలీవియా దేశమునందున్న సహామాఅగ్నిశిఖరము ౨౧౪౭౦ అడుగుల ఎత్తు. ఇకువాడోరునందున్న కోటోపాక్సీ అగ్నిశిఖరము ౧౯౬౧౩ అడుగుల ఎత్తని చెప్పఁబడినది.

**ఆందోళన తృతీయ** — చైత్ర శుద్ధ తృతీయ,ఇది ఉయ్యాలలూగు పండుగ. (పండుగలు పర్వ తిథులు, వ్రత దినములు చూడుఁడు).

**ఆంధ్రకవితా పితామహుఁడు** — అల్లసాని పెద్దనామాత్య కవి చూడుఁడు.

**ఆంధ్రదేశమందలి ద్రావిడులు** — ద్రావిడ బ్రాహ్మణులు చూడుఁడు.

**ఆంధ్రదేశమందలి గ్రామసాంకేతికములు** — ఏదేశమునందైనను పెద్ద పెద్ద నగరములు బహుస్వల్ప సంఖ్యాకముగ నుంటయు, పట్టణములు అంతకన్న కొంచె మెక్కువగ నుం

టయు, గ్రామములు విస్తారముగ నుంటయు అంద రెరింగినదే. ఇవియన్నియుఁ బ్రజా నివాసమున కేర్పడిన తావులే యైనను, ముఖ్యముగ పెద్ద పెద్ద నగరములను, పిదపపట్టణములను ఎన్నుటకు వానియందేర్పడిన ప్రాముఖ్యతయే కారణము. కాని హీని నామముల సాంకేతముల నెఱుంగ వలయునన్న ఇతర ప్రాముఖ్యతలం బాటింపక గ్రామములను, పట్టణములను, నగరములను గూడ నొకేరీతింజూచి వాని నామములం దేసాంకేతిక పదములున్నవో పరిశీలింపఁదగును. ఈమూఁడును ప్రజా నివాసస్థానములే యైనను "ప్రజానివాస స్థాన" పదార్థమును సూచించు మాటలే, సాంకేతిక పదములుగ నుండుట యరుదు. కొన్నిటి యందు కేవలము వాడుకయే కారణముగ, వేర్వేఱు అర్థములనిచ్చు పదములు సాంకేతికము లుగ గుదిరినవి. ఇంకను కొన్ని పదములు ఆయా స్థానములందుగల ప్రసిద్ధములగు వాటినుండి గుదిరినవి. కొన్నిటి కేసంబంధము గానరాని సాంకేతిక పదములు గుదిరినవి. ఇందు కొన్ని సంస్కృత నామములుగను, కొన్ని తత్సమ పదములుగను, కొన్ని శుద్ధాంధ్ర పదములుగను గానవచ్చెడిని. ఈసాంకేతిక పదయుక్తములగు ప్రజానివాసస్థల ములు పెక్కు ప్రసిద్ధ పురుషుల పేర్లను, దైవ స్థానముల పేర్లను, పుష్ప ఫలాదుల పేర్లను, మెరక పల్లముల పేర్లను, పర్వతముల పేర్లను, వృక్షముల పేర్లను, కులముల పేర్లను, చెరువులు, దుర్గములు, తోటలు, తంపరలు, ద్వీపములు, పక్షులు, జంతువుల పేర్లను, రంగుల పేర్లను, సంఖ్యల (అంకెల) పేర్లను, ధాన్యాదుల పేర్లను, శాలలు, సత్రములు, సముద్రములు, నదులను గూడ స్ఫురింపఁజేయుచున్నవి.

ఇట్లు వహించిన నామసాంకేతికము లందు పెక్కుమార్పులను కాననయ్యెడిని. ఆమార్పులు ఆప్రాంతములతో సంబంధముగల ఇతరభాషా పదముల ననుసరించి కొన్నియును, శబ్దములకు విశేషార్థములు గల్గునట్టుల కొన్నియు, ఆపేర్లకు గంభీరత వినుటకు సొంపు గల్గునట్టుల కొన్నియు, [illegible]ంధము గానర [illegible]డుకయందు కాలాను గతముగ మార్పుగల్గినట్టుల కొన్నియుఁ గాన వచ్చెడిని. ఈ గ్రామనామములలో పెక్కులు. ఆంధ్రకుటుంబములలో ననేకముల కింటిపేరులుగ (Sur names) నమరియుంట ననేకములు గానం బడుచున్నను, అందు కొన్ని పేరుల గ్రామము లిపు డాంధ్రభూమి నెచ్చటను గానరాకున్నవి. అట్టి పేర్లం బరగు గ్రామములు తొల్లింటికాలమున నుండియు, మధ్యకాలముల నంతరించి, ప్రధ్వంసాభావదశ నందెనని తలంపఁబడుచున్నవి.

అయ్యంకి, పోరంకి మొదలగు పేరులందుగల "అంకి" సాంకేతికము. ఉప్పుంగలయందు "అంగల" సాంకేతికము. జోనంగి, కోరంగి మొదలగు పేరు లందుగల "అంగి" శబ్దము సాంకేతికము. వెంక టాచలము, ద్రోణాచలము మొదలగుపేరులందుగల "అచలము" సాంకేతికము. ఇట్లే ఆచంటయందు గల "అంట" యు, బాపట్ల, అరట్లయందుగల "అట్ల" శబ్దమును, ఉప్పల, చింతల మొదలగు పేర్లయందున్న "అల" శబ్దమును, తుగ్గలి, చావలి, పిన్నలి మొదలగు నామములందుగల "అలి" శబ్ద మును, అట్లే సాంకేతికము. ఈ సాంకేతికము లన్నియు ప్రజానివాసస్థలములగు గ్రామమునకో, పట్టణమునకో, మహానగరమునకో సాంకేతికము లని ఎఱుంగునది. నైఘంటికపరమగు వీనియర్థము లెట్లున్నను, ప్రజానివాసస్థానమును సూచించు లక్షణమున నీయెల్ల సాంకేతికపదములు ప్రజా నివాసస్థానమునకే యర్థమగుచున్నవి. వాని నీ క్రింద వివరింతుము.

అంకి, అంగల, అంగి, అచలము, అంట, అట్ల, అల, అలి (అళి), ఆల, ఆము, ఆడ, ఆలి (ఆళి),

ఆరామ, ఇడి, ఇలి, ఈశ్వరము, ఉట్ల, ఉండి, ఊరు, ఊట, ఎద్ద, ఎల్ల (ఎళ్ల), ఎర, ఏరు, ఓలు (వోలు), కంచి, కట్ల, కటకము, కాని, కిర, కిరి, కుంట (గుంట), కుదురు, కొండ, కొలను (కొల్లు), కోట, కోన, గట్టు, గళ్ల, గామ, గిరి, గుప్తము, గుంట (కుంట), గుండము, గూడెము, గుర్త (గుర్తు), గొప్పుల, గోక, గడ్డ, ఘళ్ల (గళ్ల), చర్ల, చిలి, చెండ్ల (జెండ్ల), చెరువు, చేరు, జెండ్ల, తంపర, తాండ్ర, తిండి (దిండి), తేరు, దరి, దిన్నె (తిన్నె), దీవి, దేపి, దేవము, నగరము, నలి, నాడ, నేని (నీడి), పంగల, పట్ల, పట్టణము, పట్టు, పల్లి (పల్లె), పాలెము, పాళ, పాక, పురము, పూడి, పెద్ది, పెంట, పేట, ప్రోలు (ఫోలు), బాడ, మంచి, మజిలి, మట్ట (మట్టల), మండలము, మడుగు, మని, మర, మరుగు, మఱ్ఱి, మల్ల (మళ్ల), మాక, మిల్లి, మిట్ట, ముక్కల, మూడి, మెట్ల, మెట్లు, రాయి, రెడ్డి, రేవు (రేవుల) లంక, వటము, వధి, వరము, వలస, వలి, వల్లి, వహి, వాడ, వాయి, వాసరము, విడి, వీడు (ఊడు), వెలుగు, వృక్షము, శీల, శిల, శాల, సముద్రము, సాని, సాల, శాల.

ఇంకను ఏరు ఏటి, ఓడు ఓటి, కన్ను కంటి, కల్లు కంటి, కుదురు కుదిటి, కుఱ్ఱ కుఱ్ఱి, తుఱ్ఱ తుఱ్ఱి, నాడు నాటి, పఱ్ఱ పఱ్ఱి, పాడు పాటి, బండ బంటి, బంద బంటి, మఱ్ఱ మఱ్ఱి, వఱ్ఱ వఱ్ఱి, వెన్ను వెంటి, మొదలగు ద్విరూపసాంకేతికపదములు కొన్నియును, రేవు రేవుల, గంతు గంతుల, మొదలగు బహువచనరూపయుక్తములగు సాంకేతికములు కొన్నియును, వ్వ, ళ్ల, ట్ల, మొదలగు ఏకాక్షరసాంకేతికపదములు కొన్నియును గానుపించుచున్నవి. ఈ సాంకేతికపదసముదాయ మంతయు గ్రామపర్యాయపదములే.

**ఆంధ్రదేశమందలి క్షత్రియులు** — ఇప్పు డాంధ్రదేశమునందున్న క్షత్రియులు, ఉత్తరహిందూస్థానపు క్షత్రియుల సంబంధులు. (క్షత్రియకులము, క్షత్రియకులము నందలి శాఖలు చూడుఁడు). ఐదుగోత్రములవారు దక్షిణముగా నాంధ్రదేశమున కేతెంచిరని తెలుచున్నది. వీరి నుండియె కొందఱు క్షత్రియులప్రాబల్యకాలమున దక్షిణదేశమున కరిగిరనియు, అట స్థిరపడిరనియుఁ జెప్పఁబడినది. ఆంధ్రదేశమున నాంధ్రులవలెను, అరవదేశమున నరవలవలెను వేషభాషలం గైకొనియున్నారు. ఆంధ్రదేశమునందున్న క్షత్రియులు వసిష్ఠ, ధనంజయ, కౌండిన్య, కాశ్యప యను నాల్గుగోత్రములవారుగను, భరద్వాజగోత్రస్థులు అరవదేశమున తిరునెల్వేలి జిల్లా రాజపాళయను గ్రామమునను, తత్పరిసరములను గానవచ్చుచున్నారు.

ఇటీవల నీ యైదుగోత్రములక్షత్రియుల కింటిపేరు లేర్పడినవి. అవి కొన్ని పౌరుషనామములుగను, కొన్ని మహనీయులగు పూర్వుల నామములుగను, కొన్ని గ్రామనామములుగను దనరుచున్నవి. ఈ యింటిపేర్లం గూర్చి, క్రీ. వె. ౧౮౭౮ సంవత్సరమున కేతవరపు (అనగా గోదావరిజిల్లా, మొగలితుర్రి) ప్రభుం డగు మహామండలేశ్వర పూసపాటి రాచిరాజుమహారాజులుంగారు వసిష్ఠగోత్రమునకుం జెందిన ఏబదియారు కుటుంబములవారి యింటిపేరుల నొక సీసమాలికగా రచించియుండిరి. వీరిది వశిష్ఠగోత్రము. (రాచిరాజుగారి సీసమాలికఁ జూడుఁడు). పిదప కొండూరి చిన్నంరాజుగా రని పేరుగల క్షత్రియపండితుఁ డొకఁడు, నూటఇరువదిరెండు ఇంటిపేరులుగల క్షత్రియకుటుంబముల నొక సీసమాలికగ రచించెను గాని, యది పూర్తిగా లభింపకున్నది. వీరిది ధనంజయగోత్రము. తరువాత మహామహోపాధ్యాయ శ్రీమాన్పరవస్తు రంగాచార్యులయ్యవార్లం గారను మహాపండితుఁ డొక సీసమాలికను రచించి యందు ౧౦౮

క్షత్రియకుటుంబముల ఇంటిపేర్లం బొందుపర చెను. అం దాయన వశిష్ఠ, ధనంజయ, కౌండిన్య, కాశ్యప గోత్రములవారి ఇంటిపేరులనే వివరించెంగాని దక్షిణసీమలందున్న భరద్వాజ గోత్రస్థులం గూర్చి వివరింపలేదు. (పరవస్తు రంగాచార్యులవారి సీసమాలిక చూడుఁడు. క్షత్రియకులనామగోత్రములఁ దెల్పు శిష్టు కృష్ణమూర్తి గారి సీసమాలికను చూడుఁడు). ఇటీవల కాకినాడపురప్రాంతవాస్తవ్యులు దువ్వూరి జగన్నాథ శర్మగారను పరిశీలకు లొకరు పై నాల్గుగోత్రములవారిం గూర్చి, క్షత్రియకులగోత్రప్రకాశిక యను నొక పుస్తకమును ప్రకటించిరి. ఇటుల దెలియనైనవి ౧౩౦ ఇంటిపేరులు.

౧. వశిష్ఠగోత్రజులు- ఈక్రింది యింటిపేర్లుగల క్షత్రియులు. ౧. అంగరాజు, ౨. అడ్డాల, ౩. అడ్డూరి, ౪. అద్దేపల్లి, ౫. అయినంపూడి, ౬. అల్లూరి, ౭. ఇందుకూరి, ౮. ఇమ్మిడిరాజు (ఇమిడిరాజు, ఇమ్మనరాజు, ఈమనరాజు), ౯. ఇసుకపల్లి, ౧౦. ఈమని, ౧౧ కంతేటి, ౧౨. కాకర్లపూడి, ౧౩. కుచ్చెర్లపాటి, ౧౪. కునంతరాజు, ౧౫. కూనపరాజు (కోనపరాజు, కునంతరాజు), ౧౬. కూసంపూడి, ౧౭. కొలుకులూరి, ౧౮. కోసూరి, ౧౯. గణపతిరాజు, ౨౦. గాదిరాజు, ౨౧. గురజాల, ౨౨. గొడవర్తి, ౨౩. గోకరాజు, ౨౪. గోరింట, ౨౫. చల్లగళ్ల (చల్లబంద, చెర్లబంద, చెల్లబళ్ల), ౨౬. చెరుకువాడ, ౨౭. చేకూరి, ౨౮. చోడ్రాజు, ౨౯. దినముకొండ, ౩౦. దెందుకూరి, ౩౧. ధేనుకొండ, ౩౨. నడింపిల్లి, ౩౩. నందేల, ౩౪.పిన్నమరాజు, ౩౫. పూసపాటి, ౩౬. పెమ్మరాజు, ౩౭. పేరిచర్ల, ౩౮. పొత్తూరి, ౩౯. బోలరాజు, ౪౦. బుద్ధరాజు, ౪౧. బెజవాడ(పూసపాటి), ౪౨. భైర్రాజు, ౪౩. మంతెన, ౪౪. ములగపాటి, ౪౫. రావిపాటి, ౪౬. రుద్రరాజు (రుద్దరాజు), ౪౭. వత్సవాయి, ౪౮. (వసపర్తి), ౪౯. వాడపల్లి, ౫౦. వెలగనాటి, ౫౧. వెలగలేటి, ౫౨. వేగిరాజు, ౫౩. వేగేశ, ౫౪. వేజెళ్ల, ౫౫. వేటుకూరి, ౫౬. సకినేటి, ౫౭. సరిపెల్ల, ౫౮. సాగిరాజు, ౫౯. సామంతపూడి, ౬౦. సిరుగూరు, ౬౧. చిరువూరి (చిలుకూరి, శిరిగూరి, చిరుగూరి, శిరవూరి), ౬౨. సంయపరాజు.

౨. ధనంజయ గోత్రజులు- ౧. అడ్డాల, ౨. కంకిపాటి, 3. కంతేటి, ౪. కమ్మెల(కమ్మెళ్ల), ౫. కళ్ళేపల్లి, ౬. కూసంపూడి, ౭. కొల్లెర్లపాటి, ౮. కొందూరి, ౯. కొత్తపల్లి, ౧౦. కొప్పెర్ల, ౧౧. కొలనువాడ (కొల్లాటి, కొలనువాటి, కొలన్వాటి), ౧౨. కొవ్వూరి, ౧౩. గుంటూరి, ౧౪. గూడూరి, ౧౫. గొట్టిముక్కల, ౧౬. గోకరాజు, ౧౭. చంపాటి, ౧౮. చింతలపాటి, ౧౯. చెరుకూరి, ౨౦. చేకూరి, ౨౧. జంపన (వర్ణాటజంపన), ౨౨. జుజ్జూరి, ౨౩. తోటకూరు, ౨౪. తిరుమలరాజు, ౨౫. దండు, ౨౬. దంతులూరి, ౨౭. దాట్ల, ౨౮. దోసపాటి, ౨౯. నల్లపరాజు, ౩౦. నున్న, ౩౧. పత్సమట్ల, ౩౨. పాకలనాటి, ౩౩.పెన్మెత్స, ౩౪. భూపతిరాజు, ౩౫. భేతాళ(భేతాళరాజు), ౩౬. భైర్రాజు, ౩౭. మద్దాల, ౩౮. మృదుండి, ౩౯. వడ్లమూడి, ౪౦. వీపూరి, ౪౧. వేగిరాజు, ౪౨. వేటుకూరి, ౪౩. సాగిరాజు, ౪౪. ఉద్దరాజు, ౪౫. వానపాల.

౩. కౌండిన్య గోత్రములు- ౧. అద్దేపల్లి, ౨. అయినంపూడి, 3. కలిదిండి, ౪. చామర్తి, ౫. చిట్రాజు (చిట్టిరాజు), ౬. ముదునూరి (ముద్దునూరి), ౭. వేములవాడ, ౮. సరిపెల్ల.

౪. కాశ్యప గోత్రజులు- ౧. ఈదరపలి, ౨. ఈపూరి, 3. ఉప్పలపాటి, ౪. కఠారి, ౫. కనుమూరి, ౬. గుండ్రాజు, ౭. గోరింట,

౮. దొనకూరి, ౯. పాతపాటి, ౧౦. బెల్లంకొండ, ౧౧. మందపాటి, ౧౨. సాయపరాజు, ౧౩. నంబూరి.

౫. గోత్రములు తెలియనివారు- ౧. అబ్బరాజు, ౨. అమలరాజు, ౩. ఇమ్మరాజు, ౪. ఈవనరాజు, ౫. ఉయ్యూరి, ౬. ఉలిశి (వులిశి), ౭. ఏటుకూరి, ౮. ఓరుగంటి, ౯. గరికిపాటి, ౧౦. దుర్గరాజు, ౧౧. పోచిరాజు, ౧౨. బొమ్మడాల (బొమ్మిడాల), ౧౩. ముమ్మరాజు, ౧౪. లకమరాజు (లంకరాజు), ౧౫. శేకూరి, ౧౬. అక్కోటి, ౧౭. సంపతిరాజు.

**ఆంధ్రదేశము** కృష్ణా, గోదావరీ నదుల మధ్యదేశ మాంధ్రదేశమని కొందఱనెదరు గాని, అది తమ స్వాతిశయముం దెల్పుకొనుటగా నుండును. ఆంధ్రభాష మాటలాడబడు దేశ మాంధ్రదేశమనుట సమంజసము. దీనిప్రభుత్వము వేఱ్వేఱు భాగములు, వేఱ్వేఱు కాలముల వేఱ్వేఱు రాజధానులు గల్గియుండెను.

కృష్ణాతీరమున ధాన్యకటకము శాతకర్ణులకు రాజధాని. ఇచటి స్థూపములం గూర్చియు, చైత్యములంగూర్చియు హ్యూయనత్సాంగు పూర్వశైల సంఘారామమని వ్రాసెను. నాగరాజను భూపతి పాలించినట్టుల శాసనము కలదు. బౌద్ధుం డగు ఆంధ్రభూపతి (పేరు తెలియకున్నది) స్థూపమును క్రీ. వె. ౩౭౦-౩౮౦ నిర్మించెనని శాసన మొకటి కలదు. కొంతకాలము వేఁగిపురమును, కొంతకాలము రాజమహేంద్రవరమును చాళుక్య భూపతులగు విష్ణువర్ధనుఁడు, రాజరాజనరేంద్రులకు రాజధాని. వేఁగిపురమును పల్లవులు పాలించిరనియు, వారిని చాళుక్యులు జయించిరనియు, వారిని చోళులు జయించిరనియు, వారిని జైనులును, ధరణికోటరాజులును జయించిరనియు చరిత్రలు కలవు. తొల్లి యాంధ్రభూపతులకు శాతకర్ణులకు కృష్ణజిల్లాలోని శ్రీకాకుళము రాజధానియని తేలుచున్నది. (త్రిలింగదేశము [తెలింగాణము] చూడుఁడు).

**ఆంధ్ర బ్రాహ్మణులు** — పంచద్రావిడశాఖలలో నొకతెగవారు. (బ్రాహ్మణులు చూడుఁడు). ఆంధ్రదేశవాసులగుట ఆంధ్రులనఁబడుచున్నారు. (ఆంధ్రదేశము చూడుఁడు). ఆంధ్రబ్రాహ్మణులలో ననేక తెగలు కలవు. మహారాష్ట్రబ్రాహ్మణులు కొంద ఱాంధ్రదేశమున కాపురము కుదిరి, నియోగులలో కొందఱు జేరిపోయిరి. కరణ కమ్మ వ్యాపారులలో కొందరు చేరిపోయిరి. మహారాష్ట్రదేశపు బ్రాహ్మణులును, కన్నడదేశపు బ్రాహ్మణులును, ద్వైతమతస్థులాంధ్రభూమిం గాపురము కుదిరినవారు మధ్వులనంబడుచు, ఉడిపిమఠములకుం జెందినవారయ్యు నాంధ్రులై యున్నారు. అరవదేశమునుండి ఏతెంచిన స్మార్తబ్రాహ్మణులు పేరూరిద్రావిడులనియు, దిమిలి ద్రావిడులనియు, పూమూరిద్రావిడులనియు పేరులంబరగి ఆంధ్రదేశమున నాంధ్రులైయుండుట గాననయ్యెడిని. మఱియు నాంధ్రసీమల నివాస మేర్పర్చుకొనిన ఆరామద్రావిడులాపేరనె ఇట నాంధ్రులైరి. గురుక్కల్ శాఖవా రరవసీమల నుండి యాంధ్రదేశమున కేతెంచి ఆదిశైవులై యున్నారు. అరవదేశపు రామానుజీయవైష్ణవులు ఆంధ్రదేశవాసులై ద్రావిడవైష్ణవు లనంబరగుచు ఆంధ్రులై యుంటయు, వారియందుగల వడగలై తేన్గలై భేదముల్లెట్లు ఆంధ్రభూమియందు బాటింపబడుచుండుటయు గాననగును. వీరందఱు ఆంధ్రదేశమున నాంధ్రులుగనే యున్నారు. ఉత్కలదేశమునుండి ఏతెంచిన శిష్టుకరణములు ఆంధ్రులై గౌడబ్రాహ్మణ శిష్టుకరణములనంబరగుచున్నారు. అరువగ సారస్వతులు ఆంధ్రదేశమున నాంధ్రసారస్వత బ్రాహ్మణులై యుంట గాననయ్యెడిని.

ఆంధ్రులందే అసలు అంతశ్శాఖలు కొన్ని గలవు. అవి ౧. వెలనాటి శాఖ- వీరిని వైదికులనియు నందురు. వీరియందు వెలనాటి వైదిక బ్రాహ్మణులనియు, పెరుంబేటి వెలనాటివారనియు, వెలనాటి పూజారులనియు మూడు అంతశ్శాఖా భేదములు గలవు. (వెలనాడు చూడుడు).

౨. నియోగులు- వీరును వెలనాటి శాఖకాదియందు జెందియు మధ్యకాలములందు చీలిరని తెలిసెడిని. లౌక్యవృత్తియందు నియోగింపబడిన వారని యర్థము. అం దాఱ్వేల కుటుంబములు క్య వృత్తియందు చేరందియుంట నాఱ్వేల నియోగులనఁబరగిరి. వారియందు ఇంటిపేరులు రాజులనియు, ప్రగ్గడలనియు బిరుద నామములు గల్గిన కుటుంబములు కొన్ని గలవు. ఇంకను నియోగులందు శైవులై లింగధారణ దీక్షనందిన వారు కొందఱు కలరు. నంబులలో కొందఱు శైవులై లింగధారణ దీక్షంబడసి లింగధారి నియోగులలో చేరినవారును, యాజ్ఞవల్క్యుల నుండి శైవ లింగధారణ దీక్ష నందినవారును నియోగులలో చేరిపోయి యున్నారు. ఇంతయె కాక కేవల కృష్ణ యజుర్వేదులగు నియోగుల యం దచ్చటచ్చట శుక్లయజుర్వేదుల నియోగు ల్నును కలసియే యుండుట గానసగును. రామానుజీయ వైష్ణవ దీక్షయగు సమాశ్రయణ దీక్ష నందిన నియోగులును కలరు. ద్వైత (మధ్వ) మతస్థులగు నియోగులును గలరు.

• ఆరాధ్యు లందఱును నియోగులలో లెక్కగ నెంచుకొనుచుందురు. ప్రత్యేకముగ నియోగులనే ఎంచిచూచినచో ౧. ఆఱ్వేలనియోగులు, ౨. ఆఱ్వేలకమ్మలు, 3. బడగలనాటి నియోగులు, ౪. పెసరవాయి నియోగులు, ౫. చక్రధారినియోగులు, ౬. నందవరీకులు, ౭. ప్రాజ్ఞాడు నియోగులు (వీరిని పాకనాటినియోగు లనియు, తూర్పునాటి నియోగు లనియు కూడ నందురు) అని ఏడు అంతశ్శాఖాభేదములు గానసగును. ఇంక నారాధ్యులలో ఆరాధ్యత్రయ మనియు, పండితత్రయ మనియు, రాజత్రయ మనియు, మూడు తెఱంగులుగ నున్నారు. ౧. వేమనారాధ్యులు, ౨. ఉద్భటారాధ్యులు, 3. పండితారాధ్యులు. వీరి సంతతివారు ఆరాధ్యత్రయము.

శ్రీపతి పండితులు, మల్లికార్జున పండితులు, మంచనపండితులు. వీరిసంతతివారే పండితత్రయ మనంబడుచున్నారు. మఱియు గొట్టూరు, బాచిరాజు, సకలేశ్వర మాదిరాజు, మండంగి బసవ రాజు అనువారల సంతతివారు రాజత్రయమనం బరగుచు, ఆరాధ్యులై యున్నారు. ఇవి ఆరాధ్య శాఖలు.

3. కరణకమ్మలు- వీరిని కరణకమ్మ వ్యాపారులనియు ననుట కలదు. వీరు స్మార్త శాఖవారగు నద్వైత మతస్థులయ్యు ద్వైతులగు మధ్వులతో సంబంధబాంధవ్యములం గల్గియున్నారు. వీరియందు ఓగోటికరణకమ్మలనియు, కొలిజేటికరణకమ్మలనియు, బగల్నాటికరణకమ్మలనియు మూడు అంతశ్శాఖలు కలవు.

౪. తెలఁగాణ్యులు- వీరియందు నియోగి, వైదికియను అంతర్భేదములుకలవనికొందఱందురు గాని స్పష్టముగఁ గానరాకున్నది. వీరు వాజసనేయ ప్రథమ శాఖీయు లనంబడుచున్నారు.

౫. మురికినాటిబ్రాహ్మణులు- ఇది ములుకునాడనియు కొందఱనియెదరు. మఱికొందఱు వీరు తొల్లింటి ద్రవిడదేశమునుండి వచ్చిన అరవలనియు, మురుక్కునాడు స్వస్థలమనియు ననెదరు గాని ఏనిదర్శనములు గానరావు. ఇప్పుడాంధ్రులుగనే యున్నారు. వీరియందు చేన్నూరి మురికినాటివారని ఒక అంతశ్శాఖయుం గలదు. వీరును వాజసనేయ ప్రథమ శాఖకుఁ జెందినవారు.

౬. కాసరనాటివారు, ౭. ఉసలనాటివారు,

౮. వేగినాటివారు, ౯. వరుణసాలురు, ౧౦. తైలంగ సామవేదులు (త్రిలింగ దేశపు వారు). వీరందఱు స్మార్తులగు బ్రాహ్మణశాఖలే. ౧౧. ఆంధ్ర శ్రీవైష్ణవులు- వీరు రామానుజీయ వైష్ణవ మతస్థులు, విశిష్టాద్వైత సిద్ధాంతము వారు. ౧౨. తూర్పునాటి శ్రీవైష్ణవులు- వీరు రామానుజీయ వైష్ణవమత, విశిష్టాద్వైతసిద్ధాంత మతస్థులు. ౧౩. బ్రహ్మపుర వైష్ణవులు- వీరు గోల్కొండ వ్యాపారు లనఁబడుచున్నారు. రామానుజీయ వైష్ణవ విశిష్టాద్వైత సిద్ధాంత మతస్థులు. ౧౪. వైఖానసులు- వీరు రామానుజీయ వైష్ణవ విశిష్టాద్వైత మతస్థులు. విఖనస సూత్రము వీరికి ప్రధాన గ్రంథము. వీరు వడగల సాంప్రదాయ నామమును ముఖమున ధరింతురు. అనగా ముక్కుపైకి దిగునట్లు పాదమిడరు. ౧౫. పౌన్నాడీ బ్రాహ్మణశాఖ- వీరు స్మార్తులు, చాల అరుదుగ నున్నారు. ౧౬. నంబులు- వీరు స్మార్త బ్రాహ్మణశాఖ. ఆరామ ద్రావిడులమని చెప్పుదురు గాని, ఆరామద్రావిడులమని చెప్పుకొను వేఱొక శాఖ వారితో వీరికేసంబంధము లేదు. పెక్కండ్రు పౌరోహిత్యము వృత్తిగాఁ గలవారు. జ్యోతిషశాస్త్రమునందారితేరిన విద్వాంసులు వీరియందు గలరు. వైద్యులును అచ్చటచ్చట గానవగుదురు.

**ఆంధ్రభాష**—ఇది వికృతి. అష్టభాషలలోనొకటి. భాష ఎన్మిదివిధములు చూడుఁడు. (తెలుఁగు చూడుఁడు).

**ఆంధ్రభాష నాల్గు విధములు** (చతుర్విధాంధ్రములు) — ౧. తత్సమము- సంస్కృతపదమునకే, ఆంధ్ర (విభక్తి) ప్రత్యయముం జేర్చి వాడుకొను పదములు. ౨. తద్భవము- సంస్కృతమునందే పుట్టి సంస్కృత పదము కొంత మార్పు జెందుటతో నాంధ్రమై భాషయందున్న పదములు. ౩. దేశ్యము- ఆంధ్రదేశమున వేఱ్వేరుభాగములం దచ్చటచ్చట వాడబడుచుండు దేశీయములగు శుద్ధాంధ్రపదములు. ౪. గ్రామ్యము- ఆంధ్రవ్యాకరణములచే గౌరవింపబడకున్నను, ప్రజలచే వాడబడుచుండు నవియగు నాంధ్రపదములు.

**ఆంధ్ర భృత్యులు** — వీరు శాతవాహన, శాతవాహన, శాతకర్ణి ప్రభువులని కూడ యనంబడినవారు. ఇవి వారికి బిరుదనామములట. వీరు మగధరాజ్యము నేలుచుండిన కణ్వనృపతింజయించి పిదప సింహాసనముకువచ్చిరట. క్రీ. పూ. ౩౧ మొదలు క్రీ. వె. ౩౧౨ వరకు ౩౪౩ సంవత్సరములు పాలించిరి.

గౌతమీపుత్ర శాతకర్ణి యను భూపతి ఆంధ్రదేశమందలి ధాన్యకటకము రాజధానిగ క్రీ. వె. ౧౩౮-౧౫౪ నాప్రాంతరాజ్య మేలెను. శాతకర్ణులకు మూలపురుషుఁడు, శ్రీముఖ శాతకర్ణికి సింధుకుఁడు, శిశుకుఁడు, శ్రీపకుఁడు అనివాడుక పేర్లుండెనట. ఈతఁడే కణ్వనృపతిం జయించి మగధసింహాసన మెక్కెనట. అతని పుత్రుఁడు పులమేయి క్రీ. వె. ౧౫౪ మొదలు నాల్గు సంవత్సరములు రాజ్యమేలెనని చెప్పఁబడినది. (నాగార్జునుని సుహృల్లేఖ, మగధరాజ్యము చూడుఁడు). నాగరాజునకు కృష్ణాజిల్లా శ్రీకాకుళము రాజధానియని శాసనము కలదు.

**ఆంధ్రరాజ కవులు** — ఆంధ్ర కవిత్వము రచించిన ప్రభువులనైనను, రాజబంధువులనైనను, మంత్రులనైనను రాజకవులని ఇది వరకే వాడుకగలదు. మేము దానిని మార్పనొల్లక ఉన్నదాని నున్నట్లే ఆంధ్రవిజ్ఞానమున నివేదింపఁదలచి, పదునార్గురాంధ్ర కవుల నిందు వారి కృతములగు గ్రంథములతో వివరించితిమి. (వారిని వారివారిస్థలములందుజూడనగును). వారు

నన్నెచోడుఁడు, భద్రభూపాలుఁడు, గోకర్ణనృపతి, శ్రీకృష్ణరాయ సార్వభౌముఁడు, కదిరీపతినాయకుఁడు, కళువే వీరరాజు, కట్టవరదరాజభూపతి, తంజావూరి రఘునాథరాజు, రంగప్పరాజు. మల్లారెడ్డి, సాయప వేంకటపతి, రేచర్ల మాధవరాయుఁడు, గద్వాల సోమభూపతి, పామనృపాలుఁడు, కోటరాయ రఘునాథుఁడు, చిజ్జుళ తిమ్మభూపాలుఁడు. ఇంకను ఎఱ్ఱభూపతి, ఎల్ల విభుఁడు, దామెర వేంకటపతి, దొడ్డరాజు, నంజరాజు, ముద్దళగిరి విజయరఘునాథుఁడు, విజయ రాఘవుఁడు మొదలగు కొందరు రాజకవులింకను గలరుగాని వారిగ్రంథములో లేక చరిత్రయో విశదముగా దొరకనందున విచారముతో వదలి వేయఁబడిరి.

**ఆంథ్రోపోజనీ** — (Anthropogeny) ఫ్రెంచిమాట యగు Anthropogenie యొక్క వికారరూపము. మానవుల యొక్క పూర్వస్థితియు, ఎటులపెరిగి అభివృద్ధిజెందుచు మారిన స్థితియు వివరించు కళ.

**ఆంధ్రవాఙ్మయము** — సంస్కృత ప్రాకృతముల వికారమగుటఁ జేసి ఆంధ్రభాష వికృతి యనఁబడినది. నానాఁటి కభివృద్ధిఁజెందిన యాంధ్రభాష కొక యాకృతి నన్నయభట్టారకుని కాలమునఁ గలిగినదనవచ్చును. నన్నయకు ముం దాంధ్రభాషారూపము ప్రత్యేకముగ లేదని దీని భావము కాదు. సంస్కరింపఁబడి గ్రంథస్థమైన యాంధ్రభాషారూపము నన్నయ నాఁడే కలిగినదని దీని యర్థము. ఇతని ఆంధ్రశబ్దచింతామణి ఆంధ్రభాషకుఁ దొలుదొలుత వ్రాయఁబడిన వ్యాకరణము. తెనుఁగుపద్యములలో నొక ఛందస్సును గూడ నన్నయ వ్రాసినట్లు కలదు. నన్నయకాలము మొదలీ తెనుఁగభివృద్ధికి వచ్చుటం జేసి, తరువాతికవు లంద ఱితనినే యాదికవిగా స్తుతించుచుండిరి. నాఁటినుండి నేఁటివఱకు నాంధ్రవాఙ్మయ మనేక పరిణామరూపము లందుచు నభివృద్ధిఁ గాంచినది. మ॥ మహి మున్ వాగను శాసనుండు సృజియింపం గుండలీంద్రుండు న ॥ న్మహనీయస్థితి మూలమై నిలువ శ్రీనాథుండు బ్రోవన్ మహా ॥ మహులౌ సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటించు నీ ॥ బహుళాంధ్రోక్తిమయప్రపంచముఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్॥ అను పద్యమున వసుచరిత్రకారుఁ డగు రామరాజభూషణకవి ప్రాచీనాంధ్రవాఙ్మయాభివృద్ధి యెల్లె వరివలనఁ గలిగినదియుఁ గొంతవఱకు సరిగనే నిరూపింపఁ గలిగినాఁడు. ఆంధ్రవాఙ్మయప్రభలను వెలార్చిన మొదటిగ్రంథము ఆంధ్రమహాభారతము. ఇది అనువాదమే యైనను, కొన్నియెడలఁ బెంచఁబడియు, మఱికొన్ని యెడల సంక్షేపింపఁబడియు, అనేకప్రదేశముల స్వతంత్రరచనలతోఁ గూడి యుంట నాంధ్రవాఙ్మయమున నొక స్వతంత్రగ్రంథము గనే దీని నెన్నవలసి యుండును. ఆంధ్రమహాభారత కర్తలగు కవిత్రయములో నొకఁ డగు నన్నయ భట్టారకుఁడే ఆదికవి యని వ్యాసాదియందే వివరింపఁబడియున్నది. ఆతఁడు పదునొకండవ శతాబ్దకాలమున రాజమహేంద్రవరము నేలిన చాళుక్యభూపతియగు రాజరాజనరేంద్రుని యాస్థానకవి. 'ఉభయవాక్ప్రౌఢి' గల పండిత ప్రకాండుఁడుగ నన్నయ స్తుతింపఁ బడినవాఁడు. ఈతఁడు భారతమున మొదటి రెండు పర్వములు మూడవది యగు నారణ్యపర్వమున కొంతభాగము నాంధ్రీకరించెను. ఇతని రచన సంస్కృతపద భూయిష్ఠమై తెలుఁగుపదముల తక్కువగాఁ గల్గియున్నది. ఇతనికి ముందు వ్రాయఁబడిన యాంధ్రగ్రంథము లేవియు లేకపోవుటయు, ఈతఁడే ప్రథమాంధ్రకవియు నగుటచే నాంధ్రశబ్ద ప్రాముఖ్య

మంతగ నీతని రచనయందుఁ గాన్పింపకున్నది. కుమారసంభవకర్తయగు నన్నెచోడుఁడు నన్నయకుఁ బూర్వుఁడని కొందఱందురు గాని యా యభిప్రాయము నిర్వివాదమైనదికాదు. ఎట్లైనను ఆంధ్రవాఙ్మయదశ యగు పురాణయుగము నన్నయతోనే ప్రారంభమగుట నాతనినే యుగకర్తగాఁ గైకొనుట సమంజసము. ఈపురాణయుగము క్రీ. వె. పదునాల్గవ శతాబ్దమువఱకుఁ గూడ నున్నదనవచ్చును. ప్రసిద్ధ సంస్కృత కావ్యము లాంధ్రీకరింపఁబడుటయే ఈ యుగ విశేషము.

ఆంధ్రవాఙ్మయాకాశమున స్వర్ణదీధితులతో వెలుఁగొందువాఁడు తిక్కనసోమయాజి. ఆంధ్రకవులలో నగ్రతాంబూలము తిక్కనదే. ఇతఁడు రాజనీతిజ్ఞుఁడు, పండితాగ్రగణ్యుఁడు, కళావిశారదుఁడు, కవిసార్వభౌముఁడు. కవితా రచనయందును, భావనయందును బరమావధి చూపఁ గలిగినవాఁ డీతఁ డొకఁడే. సర్వప్రపంచమందలి యుత్తమకవులతో స్థానమందఁ గల్గినవాఁడు తిక్కన. భారతమునఁ బదునేను పర్వములును, ఉత్తరరామాయణమును రచించిన కవి సత్తముఁడు. ఈతనికవిత రసాభ్యుచితబంధముగనుండునదిగఁ బ్రసిద్ధికెక్కినది. ఆంధ్రకవితాస్వరూపస్వభావాదులఁ బూర్తిగ గ్రహించినవాఁడగుటచే తెలుఁగుశబ్దములనే మిక్కుటముగవాడి, తన రచనయంతటను ఆంధ్రజాతీయతను వెలార్చి ఆంధ్రవాఙ్మయగౌరవమును నిలపెను. కవితకుఁ గావలసిన సర్వసుగుణము లీతనిరచనయందుఁ గలవనుటకన్న నీతనిఁగూర్చి చెప్పుటకలవిగాదు. రామాయణము గూడ నీయుగముననే యాంధ్రీకరింపఁబడినది.

పురాణ యుగానంతరము ప్రబంధయుగమాంధ్రవాఙ్మయచరిత్రలోఁ బ్రముఖస్థానమలంకరించినది. పదునాఱవ శతాబ్దమందలి పెద్దనార్యునితోఁ బ్రబంధయుగ మారంభమైనప్పటికి నంతకుఁ దగుబ్రయత్నమంతయు పోతన, శ్రీనాథులనాఁడే యారంభమైనది. వీరిద్దఱు క్రీ. వె. పదునేనవ శతాబ్దమునకుఁ జేరినవారు. భాగవతము నాంధ్రీకరించినవాఁడు పోతన. ప్రసిద్ధములగు నైషధ కా డాది కావ్యములఁ దెనిఁగించినవాఁడు శ్రీనాథుఁడు వీరిద్దఱు పురాణములను బ్రబంధరీతి నాంధ్రీకరించిన యుత్తమకవులు. వీరికారణమున నాంధ్రవాఙ్మయమునకు చాల యభివృద్ధికల్గినది. ఉత్తరరామాయణము ననువదించిన కంకంటి పాపరాజ కవి కూడ నీశ్రేణిలోఁ జేరినవాఁడే. వర్ణనావిశేషములు, కల్పనావైచిత్ర్యము, విశేషశబ్దార్థాలంకారములు వీరికవితలో విశేషములు. పోతన కవితావేశమునకు లంత్యప్రాసయుతములగు శబ్దాలంకారము లొకయందము నాకర్షణాశక్తియు నిచ్చినవి. శ్రీనాథుని భాసురమగు నూతనపదసృష్టియు, ప్రౌఢోక్తియు మెండు. ప్రబంధసృష్టికి వీరే మూలకారకులని చెప్పవచ్చును.

ప్రబంధములలో రెండు రకములు గలవు. ప్రాచీనగ్రంథప్రసిద్ధమగు కథాంశములఁ గైకొని స్వకల్పిత వర్ణనాదులచే విశేషముగఁ బెంచఁబడి వ్రాయఁబడినవి మొదటితెగ. మనుచరిత్రాది కావ్యము లీతెగకుఁజెందును. సంస్కృత కావ్యప్రసిద్ధములగు రాజుల కథలను కూర్చి వ్రాయఁబడినవి రెండవతెగ. అనంతుని భోజరాజీయ మిందుఁజేరినదే. ప్రబంధయుగమునాఁటి కాంధ్రకవితకు రాజాదరణము హెచ్చినది. ఆకారణముననే పదునేనవ శతాబ్దము మొదలు పందొమ్మిదవ శతాబ్దము వఱకుఁగల ప్రబంధకవులందఱును రాజాస్థానాశ్రితులు కాఁగలిగిరి. భూపాలుర చిత్తవృత్తి కనుకూలమగునటుల గూడ వారు వ్రాయవలసినవారైరి. ఈ కారణముచేతనే ప్రబంధము లన్నిటియందును శృంగారరసము

ప్రధానమైనది. ప్రబంధరచనలోఁ బురోగామియైన స్వారోచిషమనుసంభవ కర్త అల్లసానిపెద్దన ఆంధ్రకవితా పితామహుఁడను బిరుదమునందెను. ప్రబంధకవితకు బాసటయైన భూపతులలో విజయనగరాధిపతి కృష్ణదేవరాయలు లగ్రగణ్యుఁడు. ఈతని యాస్థానముననే ప్రసిద్ధులగు నష్టదిగ్గజములుండిరి. (చూడుఁడు). వారే పెద్దన, నందితిమ్మన, ధూర్జటి, రామకృష్ణకవి మున్నగువారు. వీరి కావ్యములన్నియు నాంధ్ర సాహితీకన్య కలంకారప్రాయములైనవి. కృష్ణరాయ లాంధ్రవాఙ్మయము నభివృద్ధికిఁదెచ్చి పోషించినవాఁడేకాక తాను కవియై విశేషసారస్వతసేవఁ గావింపఁగలిగెను. ఆకాలమున నాతఁడుజన్మింపకుండినచోఁ బ్రబంధసృష్టి తప్పక కొంతవెనుకఁబడియుండెడిది. ప్రబంధములన్నిటిలో భాషాపాండిత్యము, ప్రౌఢకవితారచన, విశేషములగు వర్ణనలు, ఆకర్షణీయములగు శబ్దాలంకారరచన, శృంగారరసాతిశయము ప్రాముఖ్యమునందుచు వచ్చినవి. ఈ కాలముననే శ్లేషకవిత్వమునకుఁ బ్రాముఖ్యము హెచ్చినది. శ్లేషలందు విశేషపాండిత్య మవసరమగుటచే శ్లేషకావ్యకర్తలగు రామరాజభూషణుఁడు, పింగళి సూరన్న మున్నగువారికి విశేష గౌరవము వచ్చినది. ఈకాలముననే ద్వ్యర్థి, త్ర్యర్థి కావ్యములు బయలుపడినవి. ఈవిధమగు కావ్యరచన ఆంధ్రమున ప్రత్యేకముగ వన్నెకెక్కినదని చెప్పవచ్చును. ఇందులకుఁ గావలసిన పాండిత్యముగల కవులశక్తి మఱియుఁ బ్రశంసనీయము. ఇన్ని గుణములున్నను కవితకాదర్శప్రాయమైన సామాన్య ప్రజాజీవితము ప్రబంధ సారస్వతమున స్థాన మందకపోవుట యొక కొఱఁతయే. ప్రబంధకవిత శబ్దాలంకారములకు ప్రౌఢోక్తుల కిచ్చినంత ప్రాముఖ్యతను భావార్థములకీయలేదు. కావలసి తెచ్చిపెట్టుకొనిన యలంకారములు కల్పనలు కలిగియుంట కొన్ని ప్రబంధములు కృతకములై సహజకవితా మాధుర్యము గలిగియుండలేకపోయినవి. ఒకే మూసలో దిగిన వస్తువులవలె ప్రబంధములన్నియుఁ గన్పట్టుట కిదియేకారణము. ఈ కారణముచేతనే వసుచరిత్రానంతరము పిల్లవసుచరిత్రలెన్నియో బయలువెడలినవి. కొన్ని ప్రబంధములం దానాఁటి తెలుఁగురాజుల వైభవము తెలిసికొనవగును. ప్రాచీనాంధ్రదేశ వర్ణనము శ్రీనాథకృత భీమఖండమునఁ గొంతగలదు. తిక్కనవాఁడు తెలుఁగుదనముతో వెలిఁగి ఆంధ్రజాతీయతను వెలార్చిన యాంధ్రకవిత ప్రబంధయుగమున తిరిగి సంస్కృత ప్రభావమునఁబడినది. ఎట్లైనను ఆంధ్రసారస్వత చరిత్రలోఁ బ్రబంధయుగము ముఖ్యతరమైనది; ప్రబంధకవులు పండితప్రకాండులు.

ప్రబంధయుగానంతర మాంధ్ర వాఙ్మయాభివృద్ధి కొంతసన్నగిలినను, కొన్ని నూతనమార్గము లందు గన్పించుచున్నవి. శతకకవు లభివృద్ధిఁగాంచి శత సంఖ్యానీకములగు శతకములను భక్తిపూరితములుగను, ఆత్మీయములుగను, కవితావిలసితములుగను వ్రాసిరి. ఆంధ్ర విమర్శకులు శతకవాఙ్మయము నశ్రద్ధగాఁజూచుట విచారకరమైన విషయము. ఇంతదనుక ప్రాచీనాంధ్రకవులను విశేషముగ నాకర్షింపని నాటకరచన యీ శతాబ్దమున వృద్ధిగాంచినది. వచనరచన కూడ ననేకవిధముల నాదరింపఁబడినది.

ఇంతవఱకు నాంధ్రవాఙ్మయ మభివృద్ధిగాంచుటకు ముఖ్యకారకులు నియోగు లనవచ్చును. ప్రాచీనకవులందఱును నియోగులగుటయే యిందులకుఁ గారణము. ఈకారణముచే నాంధ్రసారస్వతచరిత్రయందు నియోగి వంశములకు గౌరవస్థానము లభించుచున్నది.'

ఇరువదియవ శతాబ్ద ప్రథమ పాదమున నాంధ్ర సారస్వత మనేక విధముల నభివృద్ధినొంది

నది. పాండిత్య లోపము గల్గిన యధమ రచనలనేకము లీయాధునిక యుగమునన్నను, విలువ గలవి కూడ గలవు. ముఖ్యముగ నాటకములు, నవలలు (Novels), ఏకాంకరూపకములు(One-act Plays), పరికథలు (Short Stories), వ్యాసములు (Essays), విమర్శనలు (Criticism), వివిధ విజ్ఞాన గ్రంథములవలన నాంధ్ర వాఙ్మయ మభివృద్ధి గాంచి భారతదేశ సాహిత్యములలో నుత్తమ స్థానమాక్రమించుచున్నది. ఈ యభివృద్ధి కాంగ్ల సారస్వత ప్రభావము కూడ గొంత కారణ మనవచ్చును. ఈ శతాబ్ది సాహిత్యము ప్రజాదరణ పాత్రమై సామాన్య ప్రజా సాంఘిక జీవనమును వెలార్చి జాతీయతను ప్రతిబింబింపఁ గల్గుట ప్రశంసనీయము. పత్రికలు (Journals) గూడ సారస్వతమున కనేక విధములతోడైనవి. భావన కానందము గలుగఁజేయు సౌందర్యనిధిగఁ గవిత నుపాసించి విలక్షణ ఛందో పద్ధతుల భావ ప్రధానములగు కావ్యము లీకాలమున రచింపఁబడుట ప్రశంసనీయము.

**ఆకలి** (క్షుధ) — శరీరపోషణకు కొంత యాహారము కావలసియుండును. ఆహారము లేకున్న శరీరమందలి శక్తియే బాధనొందిన దగును. శరీరమందలి **వేడియె** శరీరబలము. ఆవేడి దహించుకొను శక్తిగలదిగాన దహింపబడుట కేదేని యుండవలయును. శరీరమందలి వేడిచే దహింపబడుటకు, ఆహార మత్యవసరము. దహించుటనే జీర్ణమగుట యందుము. దహించుట యన రూపముమార్చుట. కర్రలురూపము మారి బూడిద యగును. అట్లే ఆహారము దహింపఁబడి వేఱ్వేఱు రూపములందును. కర్రలు దహింపఁబడునంతటి వేడి శరీరమునందలియాహారమును జీర్ణముచేయుట కక్కర లేదు. కొంచెము వేడి చాలును. ఇదియే ఆహారము జీర్ణమగుట. శరీరమందంతటను వ్యాపించియున్న బలమనంబడు వేడి, కడుపునందు కొన్ని ద్రావకములరూపమున నుండును. ఈద్రావకము పులుసు. ఇది దేని పయింబడునో దానిని దహింపగలదు. ఆహార పదార్థముల పయింబడుతరి వాని జీర్ణమొనర్చెడిని. ఆహారపదార్థము శరీరమందలి వేడికి కావలసినప్పు డీద్రవము బయట పడును. ఆహార మట సిద్ధముగ లేకున్న నది దేనికి తాకునో అత్తావుల మంటగ నుండును. దానినే మన మాకలి యగుచున్నదని తలంతుము. మన కాకలి లేకుండిన, శరీరమందలి వేడికి ఆహార మక్కర లేదని భావము. అత్తరి భుజించితిమేని సరిగా దహింపఁబడక, లోన పులిసి చెడిపోవును. దానిని యజీర్తియను కొందుము.

**ఆకలి రుచి నెరుఁగదు, నిద్ర సుఖ మెరుఁగదు, అక్కర అవమానము నెరుఁగదు** — ఆంధ్రలోకోక్తి.

**ఆకస్మికలక్షణపరీక్ష** — (కాలవిజ్ఞాన శాస్త్రము చూడుఁడు): ఈ క్రిందిగుర్తులు వర్షమురాగల చిహ్నములని రెట్టవిద్వాంసుఁడు తనపరిశీలనవలన గనుంగొనియెను. బెల్లపుకుండ, ఉప్పుకుండ చెమర్చుట; చీమలు గ్రుడ్లం గైకొని మెరకల కెక్కుట; కుండలదొంతివలె మేఘములు గానవగుట; చికిలి చేయుచున్నను ఆయుధములు త్రుప్పుపట్టుట; అడవియీఁగలు పశువులం జేరుట; కాకు లాకసమున నెగురుచుండుట; నీటినుండి చేపలు బైటకెగిరిపడుట; నీటికోళ్లు భూమిపై వ్రాలుట; నెమలి ఆడుచు కూయుట; నల్లచీమలు బారులుతీర్చి నడచుట; తూరీగలు ఎగురుచుండుట; కుక్క లిండ్లమీదను, చెరువులకడం జేరి కూయుట; పిచికలు పచ్చికం దినుచుండుట; భూమియం దడుసుతావులు బుడబుడ మని పొంగుట; సర్పములు పొదరిండ్లపైకిఁ బ్రాకుట.

**ఆకారోహ్రస్వోగుణాస్తు విపులాః** — పొట్టివానికి పుట్టెడుబుద్ధులు అని తెలుఁగుసామెత కలదు. పిట్ట కొంచము కూత ఘనము ననెడి సామెతకు నిదియే యర్థము.

**ఆకాశగరుడ** — (లేక నాగదొండ, మురుదొండ, రాకాశిగడ్డ). లా. Bryonia, epigoea. ఇది తీగ. గబ్బువాసనగల్గి ఎఱ్ఱని పండ్లంగల్గి యుండును. చేదుగ నుండునది. దుంపయందించుక పులుపురుచియు, జిగటయుం గలదు. దుంపను వ్రేలాడదీసినను దీనినుండి వ్రేళ్లు, మొక్కలు లేచును. తత్వమునుమార్చి మేలుకల్గించి క్రిములను హరించును. విరేచనముం జేయును. సవాయి మొదలగు సుఖజాడ్యములను సర్పవిషమును హరించును. రక్తగ్రహణి శమింపజేయును.

**ఆకాశమందలి రంగులు** — నిజమున నాకాశమునందు కన్పించునవి ఆకాశపు రంగులు కానేరవు. చిన్నచిన్న త్రసరేణువులు రంగులబుగ్గి; ఆకులలముల పరమాణువులు, పుష్పాదులు, కేసరములు మొదలగునవన్నియు వాయుపథమందుచేరి అకాశమున కెగరగొట్టఁబడియుంటనట్టి గాలిగుండా నగుపడు ఆకాశమున రంగు రంగులు గన్పించెడిని. దానికవ్వల సూర్యచంద్రులు ప్రకాశించుతరి మేఘములందుసహా నివి యిటులనే జూపట్టెడిని. (మీటియొరాలజీ చూడుఁడు).

**ఆకాశము విరిగి తన్నపైబడకుండ తీతువపిట్ట కాళులంపైకెత్తిపరుండునట్లు** — బుద్ధిహీనుని జాగ్రత్తయని భావము. ఆంధ్రలోకోక్తి.

**ఆకాశమునకు నిచ్చెనవేయ నెంచినట్లు** — సాగనిపని యనిభావము. ఆంధ్రలోకోక్తి.

**ఆకాశముష్టి హననన్యాయము** — ఆకాశమును పిడికిలితో గ్రుద్దబోవుట యని యర్థము. నిరర్థకప్రయత్నమని భావము. తన కున్న ద్వేషముతో గొప్పవారి నకారణముగ బాధించుటకీ న్యాయమును వాడుచుందురు.

**ఆకుపత్రికము** — లా. Cassia lignea లేక, Cinnamomum tamala. సం. తేజపత్ర, పాకరంజనపత్ర, లవంగచెట్టు ఆకులుగాన దీనిని లవంగపత్రమనియు నందురు. (లవంగచెట్టు చూడుఁడు).

**ఆకూతీదేవి** — సర్వతేజస్సుని భార్య, కుమారుని పేరు చక్షుర్మనువు. ఇంకను ప్రజాపతులలో ఆకూతిప్రజాపతి యనియుం గలఁడు. అతనిభార్య ప్రసూతీదేవి. స్వాయంభువమనువునకు శతరూపయందు కల్గిన కుమార్తె. మఱియు నా స్వాయంభువమనువునకు శతరూప యందు కల్గిన కుమార్తెలలోనే ఆకూతియనునామెయుం గలదు.

**ఆక్షసునది** — చక్షునది; ఇక్షునది; ఆముదారియానది చూడుఁడు.

**ఆక్లాండుద్వీపములు** — పసిఫిక్కు మహాసముద్రపు దక్షిణదిశనున్న అగ్నిశిఖర పర్వతములుగల ద్వీపములు. ఎవ్వరు వీటియందు నివసించుటలేదు. న్యూజీలండుకు దక్షిణముగ ౧౮౦ మైళ్లు దూరము. ఇవియన్నియు న్యూజీలండుకుఁ జెందినవియే. ఇందు పెద్ద ద్వీపము ఆక్లాండుద్వీపము. అది ౨౮౦ చతురపు మైళ్లుండుననియు, మొత్తమున నివియన్నియు 330 మైళ్ల వైశాల్యమనియుఁ జెప్పఁబడినది.

**ఆక్టిలీయస్** — న్యూమరికల్సు చూడుఁడు.

**ఆక్సిజెనుగాలి** — ప్రాణవాయువు చూడుఁడు.

**ఆక్సోమీటర్** — Telescope యొక్క గాని, ఇతర optical instruments యొక్క గాని, magnifying power కొలచు పరికరము నకు Auxometer అని పేరు.

**ఆక్షన్** — వాణిజ్యసంబంధ పరిభాషా పదము (Auction)- బహిరంగముగ నమ్ముట, ఎల్లరకుం దెలుపుచు బిగ్గరగ ధర నరచుచు దెలుపుచుండుట వేలము. ఇటుల వేలము వేయుచుండుట వ్యాపారముగాఁ గలుగు నాతనికి auctioneer అని పేరు.

**ఆఖ్యాతానామర్థం బ్రువతాంశక్తిః సహకారిణీతి న్యాయము**— చెప్పుచున్న దానిని వినువారు చక్కగా గ్రహించుచుండుట (సహకారిణీ శక్తి) క్రియల యందు పనియొనర్చుట యనిభావము. శ్రద్ధగా వినుట కొంతవర కంగీకార సూచకమని ఇచ్చట యర్థము. కొందఱు వ్యాఖ్యాతలు, వినలేని చెవిటివారు, గ్రహింపులేని అసమర్థులు ఇట్టి సందర్భములకు అనర్హులని తెల్పుచున్నారు. ఇంకను అప్రయత్న పూర్వకముగ నరాత్తు సంభవించిన ఫలితము జయము గాని, అపజయము (ఓటమి) గాని కాదని వ్యాఖ్యానము చేయఁబడి యుండిన సంగతి మనస్సునం దుంచుకొనవలయును.

**ఆగమములు** — ఆగమములు (ఆగమములన వచ్చినవని యర్థము) పరమేశ్వరునుండి వచ్చిన ధర్మములని భావము. పరమేశ్వరుఁడే ధర్మములు వచించెనని దీని భావము. ఇవి శైవాగమములు. సిద్ధాంతాగమములు ౨౮. ఇవి వేదసమ్మతములు. పూర్వాగమములు ౧౫. ౧. కామికాగమము, ౨. యోగజము, ౩. చింత్యము, ౪. కారణాగమము, ౫. అజితాగమము, ౬. దీప్తాగమము, ౭. సూక్ష్మాగమము, ౮. సహస్రము, ౯. అంశుమానాగమము, ౧౦. సుప్రభేదాగమము, ౧౧. విజయము, ౧౨. నిశ్వాసము, ౧౩. స్వాయంభువు, ౧౪. అనిలాగమము. ఉత్తరాగమములు, ౧౪, ౧౫. వీరాగమము, ౧౬. రౌరవాగమము, ౧౭. మకుటము, ౧౮. విమలము, ౧౯. చంద్రజ్ఞానము, ౨౦. బింబాగమము, ౨౧. ప్రోద్గీతము, ౨౨. లలితము, ౨౩. సిద్ధాగమము, ౨౪. సంతానము, ౨౫. శర్వోక్తము, ౨౬. పారమేశ్వరము, ౨౭. కిరణము, ౨౮. వాతులాగమము. ఇందు మొదటి పది యాగమములు శివభేదములనియు, తక్కిన పదునెన్మిదియు రుద్రభేదములనియు పేరులఁబరగెడిని. ఇంక వైష్ణవాగమములు పాంచరాత్రములని, వైఖానసములనియు ద్వివిధము.

**ఆగమ్మకాకి** ఆంధ్రభాషాసాంప్రదాయార్థపదము. ఆదరించి చేరదీసి దిద్దితీర్చువారు లేక తిరుగుచుండువారిం గూర్చి ఆగమ్మకాకి వలె తిరుగుచుండె ననుచుందురు. కాని ఆగమ్మయెవరో పూర్వగాథయేమో సరిగా తెలియరాకున్నది.

**ఆగస్టసు సీజరు** సీజరు, ఆగస్టసు చక్రవర్తి చూడుఁడు.

**ఆగా లేక అగర్** (Aga or Agar) — ట్యూటోనిక్కు పేరు. (Love) మక్కువ అని యర్థము. పారశీకులయం దెక్కువ వాడుకగానున్న మహమ్మదీయ పురుషనామము. (క్రైస్తవ నామములు చూడుఁడు).

**ఆఁగాకర** (తీగ) లా. Memordica diocia. సం. మహాజాలీ, విషఘ్నీ, కర్కోటకీ. ఇది అడవిజాతితీగె. దీని కాయలు కూరకుఁ బనికివచ్చుంగాన దీనికి వాడుకగల్గెను. ఆఁగాకరకాయలు- అగ్నిదీప్తినిచ్చి నేత్రములకు బలముగల్గించి త్రిదోషముల నుపశమింపఁజేయుననియు, మూలవ్యాధి నివారించుననియు, తేలికగ జీర్ణమై పథ్యముగ దనరుననియుఁ జెప్పఁబడినది.

ఎక్కిళ్లు, శ్వాసకాసలు,గుల్మము, క్రిమిరోగము, ప్రమేహము, క్షయ, వ్రణములు, గళరోగములు నివారించునందురు. ఆఁగాకర దుంపయొక్కగాని లేక ఆకుయొక్కగాని కషాయము దగ్గు, వగర్పు, జ్వరము, హృద్రోగములం గూడ నివారించునని చెప్పఁబడినది. పైత్యము, వేడిచేయును. ఆకు మూలశంఖవ్యాధిని నివారించును. విషములు హరించును. ఆఁగాకరపువ్వు- మచ్చలు మచ్చలుగా బయలుదేరెడి కిలాసకుష్ఠువు రోగమును నివారించును. జిహ్వయందు రుచిఁ గల్గించును. ఆఁగాకరదుంప లేహ్యము- రక్త విరేచనములు, రక్తముపడు మూలశంఖవ్యాధి, అతిసారముల నివారించును. ఆఁగాకరసమూలము కషాయముతీసి ప్రసవస్త్రీలకిచ్చిన ఋతురక్తమందలి మైలను చక్కఁగ వెడలించును. ఈ జాతియందే గొడ్డుఆఁగాకర లేక పోతుఆఁగాకర యని యొక భేదజాతిగలదు. దీనిదుంప, దుంపచూర్ణము, ఆకురసము, సర్పవిషము, ఎలుక కాటువిషముల నివారించుననియు, కంటియందు పుట్టెడు లూతమను వ్రణములను, భగంధర రోగమును, వ్రణములును, కఫవాతమును నివారించుననియు, దీని దుంపచూర్ణము కొంచముగ స్త్రీలఋతుకాలమునందు పచ్చిఆవుపాలతో లోనికిచ్చి, ఉప్పుకారములు మాన్పి పథ్యము నడపిన వంధ్యత్వము నివారణమగుననియుం జెప్పఁబడినది. ఈగొడ్డాగాకర కాయలంగాయదు. దీనికి సంస్కృతమున వంధ్యాకర్కోటకీ యనియు, యోగీశ్వర యనియుం బేర్లుకలవు.

**'ఆగా' బిరుదము** — తొల్లింట టర్కీ దేశమున జెనిస్సరీస్ అనంబడిన పటాలముల గొప్ప సైన్యముండెడిది. దాని ప్రధానోద్యోగికి 'ఆగా' బిరుదముండెడిది. ఇక్కాలమున నా పటాలము తీసివేయఁబడినది. రాజ్యవిధానమును మారినది. ఆగా బిరుదము మాత్రము మహమ్మదీయులందు నామముగను, గౌరవార్థపదముగను వాడుకొనంబడుచున్నది.

**ఆగారిక్** (Agaric) — జర్మను భాషా పదము Agarikon పదమునుండి గల్గినది. దానికి ఫంగస్ అర్థము. కొన్ని మొక్కల ఆకుల వెన్క పట్టు తెల్లని ఫంగస్ జాతుల దోషములకు ఆ తెగవే యగు కుక్కగొడుగులు(పుట్టకొక్కులు) మొదలగు ఫంగస్ జాతులకన్నిటికీ సాముదాయముగ ఆంగ్లవృక్షశాస్త్రమున (Botany యందు) వాడఁబడుపదము.

**ఆగియన్ స్టేబిల్** (Augean Stable)- Augeas అను పేరుగల ఒక నరపతియొక్క పశువులశాల శుభ్రపర్చబడక చిరకాలము, మలమూత్రములతో నిండి యట్లె యుండెడిదట. కాన చిరకాలముగ నపరిశుభ్రస్థితియందున్న దానిని Augean Stable అని ప్రసంగములందు వాడ నారంభించిరట. మరియు నాభూపతికి మూడువేల పశువు లుండెడివట. హెర్క్యులసును వాని నా పశువులశాల యొక రోజులో శుభ్ర పర్చుమని యారాజు నియమింప, నా హెర్క్యులస్సు ఒక జలప్రవాహమును మరల్చి, ఆ గోశాల గుండా ప్రవహింపఁ జేసి, అట్లె ఒక దినములోపు నదె దానిఁ బరిశుభ్రమగునట్లొనర్చెననియుం జెప్పబడినది. ఆ జలప్రవాహము, ఆల్ఫియస్ నదినుండి యనియుంగూడ చెప్పఁబడినది.

**ఆగ్నేయపురాణము** — ఇది యొక ఉపపురాణము, భృగుప్రోక్తము. యజ్ఞములు మొదలగు నగ్ని విషయముల నెరింగించు పురాణము. దీని శ్లోకసంఖ్య పదునేను వేలు.

**ఆగ్రా, అయోధ్య, సంయుక్త రాష్ట్రములు** — దీనిని సంయుక్తరాష్ట్రములనియు, యునైటెడ్ ప్రోవిన్సెస్సు ఆఫ్ ఆగ్రా అండ్ ఔధ్ అనియు, యునైటెడ్ప్రోవిన్సెస్సు

నియుకూడ వాడుచున్నారు. క్రీ. శ. ౧౮౭౭ లో యీరాష్ట్రపు చేర్పాటు జరగినది. అత్తరి North-western Provinces and Oudh అని పేరిడఁబడెను. అప్పటికి ఆగ్రా ప్రోవిన్సే నార్తు వెస్ట్రన్‌ప్రోవిన్సనంబడుచుండెను. బంగాళ మున కిది వాయవ్య (North-west) దిశగా నుండుటయే దీనికిం గారణము. క్రీ. శ. ౧౯౦౧ లో నార్తు వెస్ట్రన్‌ప్రాంటియర్‌ప్రోవిన్సును వేరుగ నేర్పర్చుచో ఆ తొల్లింటిపేరును రద్దుపర్చి ఆగ్రా ప్రోవిన్సని వాడునట్లొక ప్రొక్లమేష నొసంగఁబడి యెను. సంయుక్తరాష్ట్రములు ౧౦౭౦౦౦ చతురపుమైళ్ల వైశాల్యముకలది. చదరపుమైలు నందు ౪౪౫ జనులున్నట్లు లెక్కింపఁబడినది. (ఆగ్రాప్రోవిన్సు, అయోధ్యరాష్ట్రము చూడుఁడు). మరియుం గొందరాంగ్లేయోద్యోగులు యు. పి. (U. P.) అనెదరు. ఇది ఆంగ్లమున United Provinces అనుటకు గురుతేకాని వేరుకాదు.

**ఆగ్రా నగరము** — తొల్లింట వ్రజ మండలవనములలో నగ్రవనమనంబడిన యిత్తావున గల నగరము ఇప్పు డాగ్రాయనంబరగుచున్నది. దీని చరిత్ర తర్వాతకాలమునం దెట్లున్నదీ తెలి యరాదుగాని లోడీవంశపు ప్రభువులకిది రాజ ధానిగ నుండెను. వారినే పానిపట్టుకడ జరిగిన సంగరమున బేబరు చక్రవర్తి యోడించి రాజ్య మాక్రమించెను. ఆగ్రానగరముయొక్క ఇప్పటి యాకారరూపములు ఇంచుమించు మొగలాయి చక్రవర్తులగు అక్బరు, జహాంగీరు, షాజహానుల వల్లను పిదప ఆంగ్ల [illegible] మువారి వలనను గల్గినవి.

పానిపట్టు యుద్ధమున నీ రాజ్యము స్వాధీన మైనపిదప బేబరు సుతుఁడు హుమయూనునకు కొహినూరు వజ్రము ఈ యూరునందే గ్వాలి యరుసంస్థానపు రాజకుటుంబమువారిచే కాన్కగ నొసంగఁబడెనట. క్రీ. శ. ౧౫౩౦ డిశంబరు ౧౭ వ తేదిని బేబరిటనేమరణించెంగాని యాయన శరీరము కాబూలునకుం గొంపోఁబడి, అట గోరీచేయఁబడియెను. హుమయూనునకుఆగ్రాతో ఇతర సంబంధములు గాన్పింపవు. తరువాత నక్బరు చక్రవర్తి క్రీ. శ. ౧౫౬౫ లో తనరాజ ధానిని ఆగ్రాకు ఢిల్లీనుండి మార్చెను. అక్బరు రాజపుత్రస్థానపు ఎడారియందొక చెట్టుక్రింద ౧౫౪౨ అక్టోబరు ౧౫ తేదీని జనించినవాఁడు. తల్లిపేరు హామీదా. ఈమె పారసీకదేశపు వనిత. తండ్రి యనంతరము తన పదునాల్గవ సంవత్సరమున ఢిల్లీయందు సింహాసనమెక్కి, అట నేడుసంవత్సరములుపాలించి, రాజధానిని ఆగ్రాకు మార్చెను. తోడనే యమునాతీరమున నిప్పు డున్న కోటంగట్టెను. మైలున్నర పొడవుకలదు. కోటలలో ప్రపంచమున నిది నిరుపమానమైనదిగ చెప్పఁబడుచున్నది.

కోటగోడల ఎత్తు డెబ్బది యడుగులుండును. ఈ కోట యధికారస్థానముగా కాబూలు మొదలు డక్కావరకును, కాశ్మీరము మొదలు దక్షిణ మున అహమద్నగరువరకు నుండిన రాజ్యము పాలింపఁబడెను.

అక్బరునకు సంతానముగలుగుట యాలస్యమై ఆగ్రానుండి కొంతదూరమునంగల శిక్రీయనుగ్రామ మున వసించుచుండిన షేకు సలీమ్‌ఛిస్టియనంబడు ఒక మహాత్ముని వరప్రసాదముగ జహాంగీరు జనింప మిగుల యుప్పొంగి అక్బరు శిక్రీయందు తనరాజధాని నేర్పర్చుకొనియెను. కాని అక్బరు మరణానంతరము ఏబది సంవత్సరములలో నది వదలివేయఁబడి తిరుగా నాగ్రాకే జేర్పఁబడెను. తర్వాత జహాంగీరును, ఆయనకుంబిదప షాజహా నును ఆగ్రాయందలి పెక్కు కట్టడములంగట్టించిరి. అక్బరు గోరీ చాల పెద్దది: అది ఆగ్రా కైదుమైళ్ల దూరమున నున్నది. చూడఁదగిన గొప్పకట్టడము: ఆగ్రాకోటలోని మార్బెలు కట్టడములును తాజ

మహాలును, ఢిల్లీలోని జుమ్మామసీదును కట్టిన వాఁడు షాజహానుచక్రవర్తియే. (ఫతేపూరు శిక్రీ చూడుఁడు). తాజమహాల్ పగటియందు రాత్రి యందు కూడ చూడదగినది. అక్కాలపు జనులకు ప్రయాణమార్గములలో ప్రధానమైయుండిన యమునానదియందలి మార్గమును తన స్వాధీనము నందుంచుకొన నక్బరుచక్రవర్తి యాతావున తన దుర్గమును నిర్మించియుండనోపు. ఆగ్రాయందు చూడఁదగినతావులు చాలకలవు. వానినెన్నాయుట కిది తావుకాదు.

**ఆగ్రాప్రోవిన్సు** — దీని కుత్తరమున హిమాలయము, అయోధ్యరాష్ట్రము, నేపాల దేశము, తూర్పున బీహారుదేశము, దక్షిణమున రీవా బుందేలుఖండము, గ్వాలియరు సంస్థానము, పశ్చిమమున రాజపుత్రస్థానము, పంజాబుదేశమును ఎల్లలు. (ఆగ్రా, అయోధ్య సంయుక్త రాష్ట్రములు చూడుఁడు). వైశాల్యము ౮౩౦౦౦ చతురఁపుమైళ్లు. ఇండియాదేశమంతటిలో శ్రేష్ఠ భాగము. ఇందున్న కనూజపురము తొల్లింటి కన్యాకుబ్జ దేశమునకు రాజధానిగ నుండినది. పిదప జయచంద్రునకు (పృథ్వీరాజు ప్రతిస్పర్థి) రాజధానిగ నుండిన పురము. ఆగ్రాపురము (తొల్లింటి యగ్రవనము) ఒకప్పుడు మొగలాయి చక్రవర్తులకు రాజధానిగ నుండినది క్రీ. వె. ౧౭౭౫ లో బనారసు నగరము బ్రిటీషువారికి వశమయ్యెను. గత ౧౯ వ శతాబ్దారంభకాలమున ఇతరజిల్లాలు బ్రిటీషు పరిపాలనకుం జేర్పఁబడెను. క్రీ. వె. ౧౮౭౭ లో ఈప్రోవిన్సు, అయోధ్య ప్రోవిన్సునకుం జేర్పఁబడి, ఏకపరిపాలనకుం దేఁబడెను.

దేశము గొప్ప సమతలప్రదేశము, గంగా యమునా నదులును, వాని యుపనదులును, దేశముగుండా ప్రవహించు నదులు. గంగాయమునల నడుమనున్న దోఆబు మిగుల ప్రాముఖ్యమైనది. నీటికాల్వలు దేశమునం దంతటను గంగాయమునా జలముల నవ్వారిగఁ బ్రవహింపం జేయు సస్యానుకూలమై యున్న దేశముగ నున్నది. హరిద్వారముకడనున్న సహారాన్పూరు (సముద్ర మట్టముపై ౧౦౦౦ అడుగుల ఎత్తు) నుండి (౩౮౭ అడుగుల ఎత్తునున్న) బనారసు నగరము వరకు, ఈదేశ మేటవాలుగ నున్నది. శివాలిక్ (సపాదలక్ష) పర్వతములు గంగానదికిని విపాశ (ఇప్పటి బియాస్) నదికిని నడుమనున్నవి. రామ గంగానది ఉత్తరమునుండియు, వేత్రవతీ నది (ఇప్పటి బేట్వా) దక్షిణమునుండి గంగానది యందు సంగమించెడి యుపనదులు. గోధుమలు, గసగసాలు, నూనెగింజల పంటలు, నీలిమందు, చెఱకు, పత్తి, తేయాకు మొదలగు పంటలవ్వారిగఁ బండుచున్నవి. వర్షము లెక్కువ లేకున్నను కాలువల నీరు సమృద్ధిగాఁ గల దేశము, హిందువులు హిందీభాషను, మహమ్మదీయులు ఉరుదు భాషను మాట్లాడుచుందురు. ఆగ్రాప్రోవిన్సునం దేడు డివిజనులు కలవు. అవి జిల్లాలుగ విభజింపఁబడి యున్నవి.

ఇవి ౧. ఆగ్రాడివిజను, ౨. ఝాన్సీడివిజను, ౩. బనారసుడివిజను, ౪. అలహాబాదుడివిజను, ౫. మీరటుడివిజను, ౬. కుమాన్ డివిజను, ౭. రోహిల్కండు డివిజను.

**ఆగ్రాయణ గోత్రము** - నిహృవ (గణము చూడుఁడు).

**ఆగ్రాయణ పౌర్ణమి** – ఆగ్రాయణ మనిన జూదము, పాచికలాట. కౌముద పౌర్ణమి. (జూదముల పౌర్ణమి చూడుఁడు.)

**ఆచరణీయములు లేక ఆచరణ చతుష్టయము** — ౧. శ్రవణము- శ్రద్ధగా వినుట, ౨. చింతనము- వినినదానిని పిదప తిరిగి

తిరిగి తలపోయుట. 3. నిశ్చయము- తలపోసిన దానిం దన మనస్సున స్థిరపరచుకొనుట. ౪. నిష్ఠ- మనస్సున స్థిరపరచుకొనిన దానిని తనకు నియతిగ నేర్పరచుకొని యాచరింపఁ బూనుట, లేక స్థిరపరచుకొనిన దానిని తాను వాడుకొను చుండుట.

**ఆచరణీయకృత్యములు** — ౮ (శైవ ధర్మమున నిత్యకృత్యములు) శ్లో॥ రుద్రాక్షధారణం భస్మ ధారణం లింగమజ్జనమ్। (శ్రీమత్షడక్షరీమంత్రో) పాసనాచర పూజనమ్। గురుపూజా చలింగార్చనాదికం యైక్య భావనా॥ ౧. భస్మ, ౨, రుద్రాక్ష ధారణలు, 3. మజ్జనము, ౪. షడక్షరీ మంత్రజపము, ౫. గురు, ౬. చరపూజలు, ౭. శివ పూజావిధి, ౮. ఐక్య భావన. ఈ ఎనిమిదియు శైవ ధర్మ నిత్య కృత్యములు.

**ఆచారకాండము** — ధర్మశాస్త్రమగు విజ్ఞానేశ్వరీయములోని ఒకకాండము. ఇందు చతుర్వర్ణములకు విధ్యుక్తాచార ధర్మములు వివరింపఁబడినవి. మఱియు గర్భాధాన, పుంసవన, సీమంత, గర్భదోష నివారణకర్మలు, జాతకర్మనామకరణ చౌలోపనయనాది విధాయక కర్మలు మొదలగునవి వివరింపఁబడినవి.

**ఆచారః ప్రథమోధర్మః** — సనాతనముగా నడచుచుండు నాచారము మొదటి ధర్మమని భావము. (ఇది సంస్కృత భాషయందలి లోకోక్తి).

**ఆచారమున కంతమూ లేదు, అనాచారమున కాదియూ లేదు** — ఆంధ్రలోకోక్తి.

**ఆచెన్-హిలింగుస్ఫా**— శార్లేమాగాన్ చక్రవర్తి రాజధాని చూడుఁడు.

**ఆజ్ఞాచక్రము** ఇది యోగశాస్త్రమున శరీరమందలి షట్చక్రములలో నారవది. భ్రూమధ్యమున (కనుబొమలనడుమ) సుషుమ్నా నాడియందున్నది. దీనిం ద్రికూట మనియు నందురు. ఇట శంభుఁడు లేక పరమశివుం డధిదైవతముగను (ఇది హంసరూపముకవలె నుండునవి), హాకినీశక్తిగను, ప్రణవమగు ఓంకారము బీజాక్షరముగను, ఈ చక్రముంగూర్చి చెప్పఁబడినది. ఇది భౌతికశరీరమందలి మనస్సుతో సంబంధము కలదనియు, ఇట రెండు యోగనాడులు కలవనియు, ఇట హం, క్షం అను ధ్వను లుత్పన్నమగుచుండుననియు, దీనిని రుద్రగ్రంథి యని వాకొనుచుందురనియు చెప్పఁబడినది. ఆజ్ఞాచక్రము పూర్ణచంద్రబింబముం బోలి శ్వేతవర్ణముగ నుండుననియు, బిందు, నాద, శక్తులిందుండుననియు మహాలోక సంబంధమనియు ఇట ధారణ మొనర్చిన కర్మనాశమగుననియు, జీవన్ముక్తి సిద్ధించుననియు, అష్టమహాసిద్ధులు, ద్వాత్రింశ (3౨) లఘుసిద్ధులు స్వాధీనమగుననియు, జ్ఞానయోగులు ప్రణవధారణ మొనర్తురనియు చెప్పఁబడినది. ఆంగ్లవైద్య విద్యావిశారదులు Cavernous Plexus అని పేరిడిన నాడికడ నీచక్రస్థానముండుననియు, ఇది మన స్తత్వసంబంధమనియు, గుండ్రని యాకారము గలదనియు, సంకల్పవికల్పములకు తావనియు, ఐతరేయలింగమనియు ఈ చక్రము వివరింపఁబడినది. ఈ చక్రమునందు అజప దినమునకు వేయి నడచుచుండుననియుఁ జెప్పఁబడినది.

**ఆటమ్నల్ ఈక్వినోక్సు** (Autumnal Equinox) — సీజన్సు చూడుఁడు, ఈక్వినోక్సు చూడుఁడు.

**ఆటలమ్మ వ్యాధి** (Chicken Pox) — ఇది మశూచికముం బోలిన వ్యాధి. అంత బలకరమైనది, అపాయకరమైనది కూడ కాదు. దానియందువలెనె తొలుత తలనొప్పి, జ్వరము,

కల్గి గాని, ఏదో యొకటి కల్గిగాని ఒక్కొకతావున కలుగకుండగాని సంభవింపవచ్చును. మఱియు మశూచికమువలెనె శరీరమంతయు పొక్కులు కల్గుంగాని, ఇవి చాల తక్కువగను, తేలికగను ఉండును. ఇది మూడు లేక ఐదు దినములలో దిగిపోవును. దానివలెనె పొక్కులు ఎండి రాలి పోవుట సంభవించును. కొందరు బాలురు ఆడుకొనుచునే యుందురు, జ్వరము తగులకుండ గనే సంభవించుతరి నతిచులకనగ నివారణ మగును. ఇది అంటువ్యాధియగుట జాగ్రత్త గొనవలసియుండును. వేపఆకు పసపు దీనిదోష నివారకముండును. రోగి సంపర్కమువలన నీ రోగము వ్యాపించుచుండును. ఈవ్యాధి కుదిరినపైని శరీరమున మచ్చలుండవు. (అంటువ్యాధులు సూక్ష్మజీవులు, మశూచికము చూడుడు). ఈవ్యాధి కోడిపిల్లలకుం గూడ తగులుచుంట, దానింబట్టి ఆంగ్లమున చికెన్ పాక్సు అని పేరయ్యెనందురు.

**ఆటోగ్రాఫీ** (Autography) — ఒకని స్వహస్తాక్షరిగాని, సంతకముగాని వ్రాతపోలికవలెనే ఒక కర్రబిళ్ల లేక లోహపురేకు మొదలగు వానిపై చెక్కిన,యట్లే పెక్కుముద్రించవచ్చును. అట్లు రచించు కళ.

**ఆట్మోమీటర్** (Atmometer) — జర్మను భాషయందు ఆట్మస్ (Atmos) అనిన నీటియావిరికర్థము. మీట్రన్ (Metron) అనిన కొలచుట. నీరు ఆవిరిగ మారుచుండు పరిమాణపు లెక్కందెలుపు పరికరము.

**ఆడంబోయిన తీర్థ మెదురుగా వచ్చినట్లు** — అదృష్టమని భావము. ఆంధ్ర లోకోక్తి.

**ఆడభీర** — భీర చూడుడు.

**ఆడలేక మద్దెల ఓటిదన్నట్లు** అనగా తన యసమర్థతను పరికరములపైంగాని, యన్యులపైంగాని బెట్టుటందెల్పుసామెత. ఆంధ్ర లోకోక్తి.

**ఆడాలు** — లా. Arabis chinensis. ఆడాలు ఆవాలవలెనే యుండును. సౌమ్యమగు కాక జేయునదియు, పైకి పట్టువేసిన కవుదు దెబ్బలు, గుండెలు, ప్రక్కలు, ఇంక నిట్టితావుల గల నొప్పులలో రక్తము గూడుకట్టిన బాధలు నివారించి కరిగించునని చెప్పంబడినది. గర్భిణీ స్త్రీల కధికముగ నీయరాదు ఇచ్చిన గర్భ స్రావముం గల్గించెడిని.

**ఆడిటరు** (Auditor)— లెక్కలను బరిశీలించి అవి సరిగా నున్నటుల గాని లేక లేనటుల గానిదెల్పు నాతండు. గొప్ప గొప్ప వర్తకసంస్థలు ఏటేట నొకసారి ఆడిటరు పరిశీలనల చేత లెక్కలను పరీక్షింపం జేయుట యవసరమేనని తలంచుచున్నారు. జాయింటు స్టాకు కంపెనీల లెక్కల కాడిట్పరిశీలన ధర్మమును, శాసనము విధించుచున్నది. పరిశీలనకు ఆడిటింగు (Auditing) అని పేరు. అన్ని కాగితములు, అన్ని పుస్తకములు ఆడిటరుకు చూపి తీరవలసి యుండును. లెక్కలు సరిగానుండిన అందు సరిగా నున్నవని వ్రాసి ఆడిటరు సంతకము చేయును. లేకున్న, కల దోషములను, తేడాలను, తప్పులను వివరించి చూపి సంతకము చేయుచుండును.

**ఆడిఫోన్** (Audiphone) — చెముడు గలవారికి వినిపింపంజేయు పరికరము. ఇది పండ్ల కడ చేర్పంబడి, పండ్ల గుండా, ఎముకల గుండా మెదడునకు చేరి వినిపింప జేయునని చెప్పంబడినది.

**ఆడియోమీటర్** — ఒక టెలిఫోను (Telephone) న కమర్చి యొకనియొక్క కర్ణేంద్రియమునకుగల శ్రవణ శక్తి ఎంతబలముగ నున్నదో కొలచు పరికరము.

**ఆడేకాలు పాడేనోరు ఊరుకొన లేవు** — ఆంధ్రలోకోక్తి.

**ఆఢకము** (కుంచము) — నాల్గుశేరులు. (అయుర్వేదమానము చూడుఁడు).

**ఆతతాయి** — ఆతతాయి అనఁగా విషముపెట్టి చంపువాఁడని సర్వసాధారణముగ నర్థము. ఈ క్రిందివారిని షడాతతాయి లందురు, ౧. విషముపెట్టి చంపుదుర్మార్గుఁడు, ౨. ఇండ్లు గాల్చుదుర్మతి, 3. ఆయుధములతో పైకురికి కలియఁబడి బాధించుక్రూరుఁడు, ౪. ధనమపహరించిన దుష్టుఁడు, ౫. భూమినాక్రమించు దుర్జనుఁడు, ౬. అన్యస్త్రీలను ప్రోద్బలమున చెరిపి లేవదీసికొనిపోవు దుర్మతి. శ్లో॥ అగ్నిదో గరదశ్చైవ । శస్త్రపాణిర్ధనాపహః । క్షేత్ర దారాపహారీచ । షడైతే ఆతతాయినః॥ ఆతతాయివచ్చినచో నాలోచింపక వాని వధింప వలసినదనియు, ఆతతాయిని జంపుటవలనఁ జంపిన వాని కేదోషమును గలుగదనియు వచించి యున్నారు. అనఁగ నంతపాపులని వ్యక్తమగు చున్నది. "ఆతతాయినమాయాంతం హన్యా దేవావిచారయన్ । నాతతాయివధే దోషోహంతు ర్భవతికశ్చన॥"

**ఆతపగోత్రము** — నిధృవగణము చూడుఁడు.

**ఆతపత్రరేఖ** (గొడుగు) — దీనిని దండ సహితాతపత్రరేఖ యనియు నందురు. (పురుష సాముద్రికము చూడుఁడు, స్త్రీసాముద్రికము చూడుఁడు.)

**ఆతపస్నానము** (Sunbath) — సూర్యాగ్రకిరణచికిత్స చూడుఁడు.

**ఆతురే నియమోనాస్తి** — ఆతురత (నిదానము లేకపోవుట) గలవానికి నియమ ముండదని భావము. ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి.

**ఆత్మ** — ఆత్మయన చైతన్యస్వరూపము. ఇది సర్వసాధారణముగ నగు అర్థము. ఇది జీవాత్మ, పరమాత్మ యని ద్వివిధముగ నుండును. జీవాత్మ యన ప్రాణమనియు, పరమాత్మ యన ప్రాణములకు మూలస్థాన మనందగు పరమేశ్వరుఁ డనియు సర్వసాధారణముగ శాస్త్రములందు వాడిరి. ఇంక పరమేశ్వరు నంగీకరించని బౌద్ధ మతస్థులు మొదలగువారు ఆత్మను బుద్ధి యని గాని, మనస్సనిగాని వారలకనుకూలమగునట్లు వాడిరి.

**ఆత్మచ్ఛిద్రంనపశ్యంతిపరచ్ఛిద్రానుసారిణః** — ఇది సంస్కృత భాషయందలి లోకోక్తి. ఇతరుల తప్పుల నెన్నువారు తమ తప్పులం బాటించుకొనరని భావము.

**ఆత్మభవ గోత్రము** — కపిఉపగణము చూడుఁడు.

**ఆత్మానందము** — ఆనందములు చూడుఁడు.

**ఆత్మానాత్మవివేకము** — దీనికి నిత్యానిత్యవివేకము అని పేరు. సాధనచతుష్టయము చూడుఁడు.

**ఆత్రేయగణము** — ఇది అత్రిమహర్షి సంతతియందలి యొక గణము. ఇందు నూట పండ్రెండు గోత్రములు కలవు.

బోధాయనసూత్రోక్త గోత్రములు (౫3) — ౧. అంగిమా, ౨. అత్రి, 3. అరుణాత్రేయ, ౪. ఆత్రేయ, ౫. ఇంద్రాతిథి, ౬. ఔద్దాలకి, ౭. కాలాయని, ౮. కావిష్ఠర, ౯. కార్ష్ణాయని, ౧౦. కృష్ణాత్రేయ, ౧౧. కాద్రేయ, ౧౨. గాధిపతి, ౧3. గోపవన్య, ౧౪. గోభేయ.

౧౫. గౌరగి, ౧౬. గౌరగ్రీవి, ౧౭. గౌరాత్రేయ, ౧౮. చంద్రాతిథి, ౧౯. ఛందోగి, ౨౦. ఛాగల, ౨౧. ఛాంది, ౨౨. తృణబిందు, ౨౩. దత్తాత్రేయ, ౨౪. దాక్షి, ౨౫. ద్రోణనాభ, ౨౬. ధౌరాంగి, ౨౭. నంగి, ౨౮. నీలాత్రేయ, ౨౯. నీలాయన, ౩౦. పుష్పి, ౩౧. పౌష్టిక, ౩౨. బాలేయ, ౩౩. భాగల, ౩౪. భాంగతి, ౩౫. భూమి, ౩౬. భారద్వాజాయన, ౩౭. మహాత్రేయ, ౩౮. మాలరుచ, ౩౯. మాహులి, ౪౦. వామరథ్య, ౪౧. వ్యాలి, ౪౨. వైతభావి, ౪౩. వైదేహ, ౪౪. శ్యామాత్రేయ, ౪౫. శిశుపాల, ౪౬. శ్వేతాత్రేయ, ౪౭. శోద్రేయ, ౪౮. సంచవ్యాని, ౪౯. సాకేతాయన, ౫౦. సుపుష్పి, ౫౧. సోహచ్ఛరాల, ౫౨. సౌగయ, ౫౩. సౌరగి.

కాత్యాయన సూత్రోక్తగోత్రములు (౧౯) - ౧. ఆహోయన, ౨. ఔషస, ౩. కైరజి, ౪. గోపవన, ౫. జానుకి, ౬. చైత్రాయణ, ౭. తైలేయ, ౮. పంచజన, ౯. భాగమాన, ౧౦. బాహుతంత్రి, ౧౧. బాహుమిత్ర, ౧౨. విదర్కి, ౧౩. వైలేయ, ౧౪. శాక, ౧౫. శాంఖరి, ౧౬. శౌనకర్ణి, ౧౭. శ్వేతకి, ౧౮. సౌభృతి, ౧౯. హార.

మాత్స్యసూత్రోక్త గోత్రములు (౧౨) - ౧. ఆర్యపథ, ౨. ఉద్గరగ్రీవి, ౩. కానజిహ్వ, ౪. గోణిపథ, ౫. గార్వన్య, ౬. జగలద, ౭. భాగలి, ౮. వైడాలి, ౯. శాకటాయన, ౧౦. సాంఖ్యేయ, ౧౧. సారాపగ, ౧౨. సౌత్కవర.

ఇతరగ్రంథోక్త గోత్రములు (౨౮)-౧. అర్ఘాయన, ౨. ఔతిథి, ౩. ఔపమిత్య, ౪. కృష్ణచేంద్రి, ౫. గణపతి, ౬. చైత్రేయ, ౭. దార్భ్య, ౮. దులాభ, ౯. సమథత్రి, ౧౦. నిశాయన, ౧౧. పాదభూత, ౧౨. పౌర్వతిక, ౧౩. బాదంతి, ౧౪. బాదర్యాయన, ౧౫. బాహ్వాంతర, ౧౬. బాహుక్షి, ౧౭. మతంగ, ౧౮. మద్రణ, ౧౯. రామని, ౨౦. రిషము, ౨౧. వైశాఖి, ౨౨. వైశ్వానికి, ౨౩. శకిలాకి, ౨౪. శాకలి, ౨౫. శాథూలకి, ౨౬. స్వస్తికృత్, ౨౭. సాత్యకి, ౨౮. సాత్వకి. ఈ ఆత్రేయగణమొదలి ౧౧౨ గోత్రములకు ప్రవరరూపమొకటే. ఆత్రేయ, అర్చనానస, శ్యావాశ్వ.

**ఆత్రేయగోత్రము** — ఆత్రేయగణము చూడుడు.

**ఆత్రేయర్షిగోత్రము** — (శిష్టకరణములు చూడుడు). ఈగోత్రమువారికి బ్రహ్మర్షి అత్రియనియు, ప్రవర, ఆత్రేయ, అర్చనానస, శ్యావాశ్వయనియు చెప్పఁబడినది. శిష్టకరణములలో కొండవలసవారు, ములగవల్సవారు, వాండ్రంకివారను ఇంటిపేర్లు గలవారీగోత్రజులై యున్నారు.

**ఆత్రేయాయణగోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుడు.

**ఆత్రేయినది** — బంగాళదేశమున రాజషాహిమండలమున మాండాయనంబడిన గ్రామము ప్రక్కఁబడి ప్రవహించు నదికి ఆత్రేయి యని పేరు. అట శ్రీరామనవమికి యాత్ర జరుగునట. దినాజిపూరు మండలముగుండా ఆత్రేయీనది ప్రవహించెడిని. శ్రీస్థానదియందు జన్మించును. ఆత్రేయీనదిం గూర్చిన ప్రశంస కామాఖ్యతంత్రము, ఏడవ అధ్యాయమున కలదు.

**ఆదమ్** (Adam) — యూదమతస్థులకు, క్రీస్తుమతస్థులకు, మహమ్మదీయమతస్థులకు మూలపురుషుఁడు. మహమ్మదీయులకు మొదటి ప్రవక్త, భార్య ఈవు, కుమారుల్ను ఆబెల్ కెయిన్ అను వారలు. దేవునివలన ఈడెన్ తోటలో నుంచబడెను. విజ్ఞానమొసంగు

వృక్షపుపండ్లు తప్ప తక్కినవి తినవచ్చునని యాజ్ఞాపింపబడి, ఆయాజ్ఞ మీఱి స్వర్గమునుండి బహిష్కరింపఁబడిరనియు, ఆతఁడు సింహళమందలి ఆడమ్సుపీక్ (సామంతకూట పర్వతశిఖరము) న బడెనట. అట తపంబొనర్చి దిగి వచ్చి, ఏడమ్సు బ్రిడ్జి అనంబడు ఇసుకగట్టుపై నడచి సముద్రముం దాటి భరతదేశమున భార్యం గలుసుకొనెనని బైబిలునందు చెప్పఁబడినది.

**ఆదమ్మైత్తైగమహామ్మదీయులు** — ఆఫ్రిడీతెగ మహమ్మదీయులు చూడుఁడు.

**ఆదాము** — ఏడమ్ చూడుఁడు.

**ఆదాముహవ్వలువసించుతోట** — ఏడెన్సుగార్డెన్ (అనంబడిన) ప్రదేశము చూడుఁడు.

**ఆదికాలపు (ప్రపంచమందలి గొప్ప వింతలు** (Seven Wonders of the World, Old Ages) — ౧. ఈజిప్టుదేశము లోని పిరామిడ్సు, ౨. బేబిలన్ నగరపు ఉద్యానవనము, ౩. మాసోలియస్ సమాధి, ౪.(ఎఫిససునందు)డయానాదేవళము, ౫.రోడ్సు పురమందలి గొప్ప సూర్యవిగ్రహము, ౬. (ఫిడియస్‌డోన్ రచించిన) జ్యూపిటర్ విగ్రహము, ౭. ఈజిప్టుదేశమందలి ఫరాస్ భవనము (బంగారు భవనము). ఇవి యాదికాలమున ప్రపంచమునందు సప్తమహాశ్చర్యకరములగు నిర్మాణములని చెప్పంబడినవి. వీనిని ఒక కవి ఆంగ్లమున పద్యముగ జేసెను. ఇవి ఆదికాలపు వింతలు (Wonders) గఁ జెప్పఁబడినవి. (ఆయాతావులందు చూడుఁడు). మధ్యకాలములందిట్టివే ఏడు చెప్పఁబడినవి. అమెరికాదేశస్థులు ఇట్టివే ఏడు వింతలు చెప్పుచున్నారు.

**ఆదితాళము** — తాళములు చూడుఁడు.

**ఆదిత్యగణము** (ద్వాదశాదిత్యులు) — ౧. ధాత (పాఠాంతరమున అజుఁడని చెప్పఁబడినవాఁడు), ౨. మిత్రుఁడు, ౩. అర్యముఁడు, ౪. శక్రుఁడు (పాఠాంతరమున పర్జన్యుఁడని చెప్పఁబడినవాఁడు), ౫. వరుణుఁడు, ౬. అంశుమంతుఁడు (పాఠాంతరమున ఇంద్రుఁడని చెప్పఁబడినవాఁడు), ౭. భగుఁడు, ౮. వివస్వంతుఁడు, ౯. పూషుఁడు, ౧౦. సవిత (పాఠాంతరమున అర్కుఁడని చెప్పఁబడినవాఁడు), ౧౧. త్వష్ట, ౧౨. విష్ణువు. వైవస్వతమన్వంతరమున శక్రుఁడు, విష్ణువు ఆదిత్యులుగనుండి చక్షుర్మన్వంతరమున తుహితులైరని చెప్పంబడియున్నది. కల్పాదియందు పండ్రెండుగురు దేవర్షులు సృష్టింపఁబడిరనియు, వారికి జయులని పేరుండెననియు, వారు సృష్టికి వ్యతిరేకులై బ్రహ్మచే ప్రతిమన్వంతరమునందు తిరుగతిరుగ జన్మించుచుండుటకు శపింపఁబడిరనియు, వారే ద్వాదశాదిత్యులుగ జన్మించిన వారనియు చెప్పఁబడినది. వీరి నామములు సూర్యునకుఁ గూడ నామాంతరములుగ వాడుచున్నారు. ఆదిత్యులు నవదేవతాగణములలోని వారు. (పితృగణము చూడుఁడు).

**ఆదిత్యగతిన్యాయము** — సూర్యుఁడు తిరుగుట యని యర్థము. చేయు కనపడక పని నడేపనిగ జేయుటం దెల్పు న్యాయము.

**ఆదిత్యసేనగణము** — ఇది విశ్వబ్రాహ్మణులయం దొక గణము. ఇందైదు గోత్రములు చెప్పఁబడినవి. (ప్రణవశాఖ విశ్వబ్రాహ్మణులు చూడుఁడు) ౧. ఆదిత్యసేన గోత్రము- ఆదిత్యసేన, తపనీయ, అర్వంత (త్ర్యార్షేయ ప్రవర). ౨. అర్వంతర్షి గోత్రము- తపనీయ, అర్చిత, ప్రార్చిత, ప్రియమేధస, అర్వంత (పంచార్షేయ ప్రవర). ౩. అర్చితర్షి గోత్రము- అర్చిత, ప్రార్చిత, ప్రియమేధస (త్ర్యార్షేయప్రవర). ౪. కర్దమ గోత్రము- అర్వంత, రవిరస్మి, కర్దమ,

(త్రయార్షేయప్రవర). ౫. పరాశ్చిత స్థిగోత్రము- కర్దమ; రవిరస్మి, ఆర్వాంత, ప్రియమేధస ప్రాశ్చిత, (పంచార్షేయప్రవర).

**ఆదిద్రావిడి క్షేత్రము** — అజ్జిన్లగరు సెటిల్మెంటు చూడుడు.

**ఆదిపచ్ఛఘునా** — ఇది యొక ఓషధి. దీనిని శునశ్శేఫ మని కొందఱనెదరు. ఇది పైత్య ముజేసి, సమస్త వాతములను, సర్వదోషములను నివారించి సర్వాంగములకు వేడి చేయుననియు చెప్పఁబడినది.

**ఆదిల్ వంశనృపులు** — తొల్లింట బహామనీరాజ్యము క్రీ. వె. ౧౪౮౯ లో ఐదు చిన్న రాజ్యములుగ చీలుటతో నేర్పడిన రాజ్య ములలో నొకటియగు బీజపూర్ రాజ్యము నేలిన ముసల్మాను నృపులు. వీరిలో యూసూప్ ఆదిల్షా, అడి ఆదిల్షా మహమ్మదు, ఆదిల్షా మొదలగు వారు పేర్కొనం బడఁదగినవారు.

**ఆదివారము** (Sunday) — ఇది ఆదిత్యవారమను పదమునుండి క్లుప్త పర్చంబడినది. వారమునందలి మొదటిదినమని హిందువులు వాడుదురు. సూర్యప్రతిపాదకమైన దినముగ నెంచుదురు (మాఘమాసమందివి చాల ముఖ్య మగు పవిత్రదినములు).

క్రైస్తవులు వారమునందు కడదినమనియు, జహోవాదేవుఁడు గత ఆరుదినములందు సృష్టి యొనర్చి ఏడవదియగు ఆదివారమున విశ్రాంతి గొనెంగాన దీనికి సేబతని పేరుగలైననియునందురు. ఆదిని వారి పూర్వులు క్రైస్తవులు కాకమున్ను దీనిని వారమున మొదటి దినముగ నెంచి, ఈదిన మున సూర్యునారాధించుచుండిరందురు. బైబిలు నం దిది కడదినముగఁ జెప్పఁబడినది, బైబిలునందు మనుష్యుల కేర్పరుపఁబడెంగాని మనుష్యులు సేబతుకొరకు సృష్టింపఁబడ లేదని చెప్పంబడినది.

**ఆదివెలమలు** — వీరి కులోత్పత్తిని గూర్చి వీరియందొక కథనము గలదు. మూల పురుషులగు పద్మనాయకులు, ఆదినాయకులు ననంబడువారిద్దరుండిరట. వారిద్దరును వైరులై కలహింప నందాదినాయకులు నిలువజాలక నొక జాలరివాని సాహాయ్యమున తప్పించుకొని నదిం దాటి సురక్షితులైరట. వారి సంతతివారే యాదివెలమలట. తక్కిన పద్మనాయక సంతతి వారు రాచవెలమలు లేక వెలమదొరలనంబడు చున్నవారట. కాని ఉభయతెగలవారు బలిజ వారేనట. జాలరివానియందుగల కృతజ్ఞతా సూచకముగ నేటికిని ఆదివెలమలందు వివాహ ములలో పాలచెట్టునకు జాలరివలను వ్రేలాడదీసి వానింబహూకరించి వివాహము నెరపెదరట. వీరి వివాహకాలములందు సప్తపదిని (సన్నికల్లు), త్రొక్కుట యాచారము లేదని తెలిసెడిని. వీరి యందరువదిమూఁడు గోత్రములు, అన్ని ఇంటి పేరులును కలవందురు. (వెలమవారు చూడుడు)

౧. కోనతుల్లగోత్రము- అయినాలవారు
౨. వంతమారిగోత్రము- అంకాలవారు (౧)
౩. అయంబకగోత్రము- అంకాలవారు (౨)
౪. ఆయుస్తగోత్రము- అంకాలవారు (౩)
౫. నేమాకులగోత్రము- అమ్మనేనివారు
౬. శ్రీవంతసగోత్రము- ఆకునూరివారు
౭. పాలంకిగోత్రము- ఆకులవారు
౮. ఉల్లంబాకులగోత్రము- ఆరుమాకవారు
౯. పువ్వాడగోత్రము- ఇమ్మానేనివారు
౧౦. కౌండిన్యగోత్రము - ఉతెల్లరువారు
౧౧. పొన్నివెలగలగోత్రము- ఉమ్మడిసింగువారు
౧౨. దేవకలగోత్రము- కనకాలవారు
౧౩. వెల్లమూడిగోత్రము- కనకపల్లివారు
౧౪. పట్టిల్లగోత్రము- కావేరివారు
౧౫. పాలకులగోత్రము- కల్లివారు
౧౬. నలకలగోత్రము- కొప్పిశెట్టివారు

౧౭. వసిష్టగోత్రము- కల్లింబాకవారు
౧౮. పైనూరిగోత్రము- కోకావారు (౧)
౧౯. కూటవల్లి గోత్రము- కోకావారు
౨౦. దేవేంద్ర గోత్రము- కంచివారు
౨౧. రాయకుల గోత్రము- కొలితవారు
౨౨. కాడుల్ల గోత్రము- చిలంబివారు
౨౩. కరికుల గోత్రము- తలగరివారు
౨౪. ఒడివెల్ల గోత్రము- తాయివారు
౨౫. సకుడి గోత్రము- తిక్కానివారు
౨౬. కడవకూళ్ల గోత్రము- తీర్థవారు
౨౭. కాంతళ్ల గోత్రము- నంగిరెడ్డివారు
౨౮. క్షేత్రాల గోత్రము- నాయనివారు
౨౯. శ్రీవత్సల గోత్రము- నానిశెట్టివారు
౩౦. వసవలన గోత్రము- పరిమివారు
౩౧. నేమాకుల గోత్రము- పంచేటివారు
౩౨. యమగాని గోత్రము- పాలల్లువారు
౩౩. యమగాని గోత్రము- పాతానివారు
౩౪. బుగియడుగోత్రము- పాపినేనివారు
౩౫. నెక్కంద్రాగోత్రము- పాకనాటివారు
౩౬. శాండిల్యగోత్రము- పాకలవారు
౩౭. శెట్టిళ్లగోత్రము- పారలివారు
౩౮. కలియుగలగోత్రము- పిల్లారిశెట్టివారు
౩౯. శాండిల్యగోత్రము- పోకలవారు (౧)
౪౦. యమకల్లగోత్రము- పోకలవారు (౨)
౪౧. శెట్టిళ్ళగోత్రము- పోకలవారు (౩)
౪౨. వెలివెల్లగోత్రము- పోకలవారు (౪)
౪౩. ఆత్రేయగోత్రము- పోకలవారు (౪)
౪౪. ఉందంతలగోత్రము- పార్లభూతివారు
౪౫. నేమాకులగోత్రము- పోలుముదేలవారు
౪౬. సప్తర్షి గోత్రము- పోయింతలవారు
౪౭. కార్సతాలగోత్రము- మరగానివారు
౪౮. ఆమాకులగోత్రము- మాదిరాళ్ళవారు
౪౯. ఉద్దండలగోత్రము- మాగర్లవారు
౫౦. తామేలనగోత్రము- మాదిరెడ్డివారు
౫౧. పురసక్యాన్ గోత్రము- మొగలిశెట్టివారు
౫౨. శెట్టిల్లగోత్రము- మోటుపల్లివారు (౧)
౫౩. కర్మాలగోత్రము- మోటుపల్లివారు (౨)
౫౪. నెమిలికలగోత్రము- రాజనాలవారు
౫౫. కౌండిన్యగోత్రము- పడియారుశెట్టివారు
౫౬. కూటవల్లిగోత్రము- వందివారు
౫౭. కలియుగలగోత్రము- వందంశెట్టివారు
౫౮. పెన్నివెలగలగోత్రము- వరదావారు
౫౯. వెలిసాలగోత్రము- వారణాసివారు
౬౦. వేయికళగోత్రము- వెలమాదివారు
౬౧. హరిదాసగోత్రము- సానంశెట్టివారు
౬౨. కడవకూళ్ళగోత్రము- చిరుతావారు
౬౩. కడవకూళ్ళగోత్రము- చిరువ్రూరివారు

తండ్రి కశ్యపప్రజాపతి, తల్లి కద్రువ, సవతితల్లిపేరు వినత, సవతి తల్లి కుమారుఁడు (సోదరుడు) గరుత్మంతుఁడు. ఆదిశేషుఁడే కద్రువసంతానమున జ్యేష్ఠుఁడు. ఈతని తల్లి కద్రువ, సవతియగు వినతను మాయ చేసి వంచించిదాసిగఁ జేసికొన నామె సుతుండగు గరుత్మంతుడు, ఈమె సుతులుకోరిన యమృతము దెచ్చియిచ్చి యామె దాస్యమును మాన్పెను. కద్రువసుతుఁ డాదిశేషుండు సహా ఖేదమునంది, గోకర్ణము బదరికాశ్రమము, గంధమాదనమునను గొప్ప తపం బొనర్చి పరమేశ్వరానుగ్రహము కల్గి విష్ణుదేవుని పాన్పుగను, భూభారము వహించునదిగను, నాగులకు రాజుగను పదవులనందెను. ఆదిశేషువున కొకతరి భృగుమహర్షి శాపముకల్గి, శ్రీకృష్ణ జన్మకాలమున, కొంచెము ముందుగ బలరాముఁడై భూమియందే జన్మింపవలసి వచ్చెనని చెప్పఁబడినది. కద్రువ, దక్షుని కూతురు. ఈమెయందు నాగకులము జనించెను. అందు ఆదిశేషుఁ డగ్రజుడు, వాసుకి, కర్కోటకుడు, తక్షకుడు, ఐరావతుఁడు, ఏలాపుత్రుఁడు మొద

లగు నాగములు ఆదిశేషువునకు (సవతి) కు రులే, కద్రువపుత్రులే. వాసుకి శివున కాభరణ మయ్యెను. (నాగకులము చూడుఁడు).

**ఆదిశైవమతము** (గురుక్కళ్ తెగ) - ఈమతస్థు లాంధ్రకరాటక ద్రవిడదేశములందు గానఁగుచున్నారు. వీరికి గురుక్కళ్ అను బిరుదము గలదనియు, తామె యాదిశైవుల మని యు జెప్పుకొనుచున్నారు. ఆరాధ్యుల లోని శ్రీపతి పండితకృత, శ్రీకరభాష్యము వీరికి గ్రంథమనియు తామే నిజమున శైవులమనియుఁ జెప్పుకొందురు, వీరు శివాలయములందు పూ రులుగ నున్నారు, వీరికిం దీక్షకలదట. దే లయ ప్రతిష్ఠలు వీరు చేయుచుట ఆగమో మనియు, వీరందఱు గురుసాంప్రదాయస్థు లనియు జెప్పుకొందురు. వీరిమతము, అద్వైతుల మతమే నని తెలిసెడిని. వీరియం దాగమోక్తధర్మము లధికము. ఐక్యమే వీరియందునను ముక్తి. పతి పశుపాశములను త్రిపదార్థములును, సకల నిష్కలారాధనయుం గూడ వీరియందు కలదం దురు. బ్రాహ్మణులు. నాల్గు ఆశ్రమములును వీరియందు కలవు.

**ఆదొండతీగ** — లా. Capparis Zeilancia. సం. అర్జట, అర్తగళ. కొందఱు దీనిని ఆరుదొండ యనియు నందురు. ఆదొండ వేరు-దారుణములగు వాతరోగముల హరించును. విరేచనకారి. దీనిని నాభికివేసికట్టిన పైగుణ ములు గల్గించును. ఆదొండకాయలు-కొందఱు కూరజేయుదురు. వాతశ్లేష్మము, గళరోగములు, నేత్రరోగములు, విషములు, హరించును. కాక, పైత్యము, అగ్నిమాంద్యము, మలబద్ధము జేయును. క్రిమినిహరించి, హృదయమునకు బలమిచ్చును. దీనికి విరుగుళ్లు- ౧. నువ్వు చెట్టు కాల్చినభస్మము (లేక క్షారము), నెయ్యి, పులుసు.

**ఆద్యమాషక** — ఐదురతులు (౫ గురి వెందగింజల) ఎత్తు. ఇది బంగారము తూచుట యందుపయోగించు ప్రమాణముగ నుండెనుగాని ఇప్పుడు వాడుకయందు లేదు.

**ఆధారచక్రము** (మూలాధారచక్రము)- యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన శరీరమందలి షట్చక్రములలో నొకటి. ఆధారచక్రము గుద స్థానమందుండును. రక్తవర్ణము, అధోముఖము, నాల్గుదళములుగల్గి వానిపై వ, శ, ష, స, అను నాలుగక్షరములు ఒక్కొకటొక్కొక్కదళముపై గల్గియుండును. 'లం" అనునది బీజమనియు, గణపతిదేవత యనియుఁ జెప్పఁబడినది. ఇందు …యున కారువందల నొప్పున అజప నడచునని చెప్పఁబడినది.

**ఆధు లేక అధుగోత్రము** – కధక గణము చూడుఁడు.

**ఆధ్వల గోత్రము** — వశిష్ఠగణము చూడుఁడు.

**ఆనందగిరిస్వామి**– తోటకాచార్యుఁడు చూడుఁడు.

**ఆనందతీర్థస్వామి-మధ్వాచార్యులు** జగద్గురుఁడని వాడుక నందిన మతాచార్యులలో నొక్కఁడగు నీమహాత్ముఁడు ద్వైతమత స్థాపకుఁ డు; వైష్ణవుఁడు. తండ్రి పేరు మధ్యగేహభట్టు. తల్లి పేరు వేదవతి. తల్లి దండ్రుల నివాసము శివ రూప్యమనంబడు గ్రామము. ఇందు పాచకులు, (వంటజేయు బ్రాహ్మణులు) నివసించుచుంట పాచ క గ్రామమనియు వాడుక పేరుండెనట. ఇది ఉడిపి గ్రామమునకుం గతిపయ దూరమునందుఁ గలదు. మధ్యగేహభట్టు గొప్ప తపంబొనర్చినవాఁడు. జన్మకాలము క్రీ. శ. ౧౧౯౯ యనియు, శాలీ వాహన ౧౧౨౦ అనియు విళంబి ఆషాఢ బహుళ చతుర్థి యనెదరు. వీరిని వాయుదేవుని

యంశగను, కారణ జన్మునిగను, మధ్వులు చెప్పు చున్నారు. తల్లిదండ్రులిడిన తొల్లింటి నామము వాసుదేవాచార్యులు. రజతపురమనంబడిన ఉడిపి యందలి అనంతేశ్వర స్వామియందు వీరికి భక్తి మెండు. వీరి తమ్ముని పేరు విష్ణుతీర్థులు. వీరిచరిత్రను వివరించిన ద్వైతమతస్థులు కొందఱుపసిబాలు రుగ నుండిన వీరిని అడవియందు పిశాచములు నుతించెననియు, ఆరునెలల బాలురుగ నుండి నప్పుడు నలుబదిశేర్లు ఉలవ గుగ్గిళ్లు తినివైచి రనియు, మఱియొకప్పుడు వీరు రెండువందల అనఁటి పండ్లు దినివైచిరనియు మొదలగువాటిని మహి మలుగ నుడివిరి గాని, అంతకన్న నతిశయము లగు మతస్థాపనమును మత గ్రంథరచనము మొద లగు కార్యములు ప్రశంసనీయములుగ జీవ చరిత్రయందుఁ గాన్పించును.

వాసుదేవాచార్యులవారికి బాల్యమునందే వారి పురాణనైపుణికి మెచ్చి వారికి ఘృతవల్లి గ్రామమును దానమిచ్చిరట. మఱియు విద్యా భ్యాసకాలమున వారినొకపాముకరచి, ఆసర్పమే మృతినందెననియు, వారి కేవిషబాధయుం గలుగలేదనియుఁ జెప్పఁబడినది. వీరి కుపన యన మైనటుల జెప్పఁబడినదిగాని, వివాహ మైనటులఁ జెప్పఁబడి యుండలేదు. గొప్ప విద్యాధికులు; శాస్త్ర పాండిత్యము కలవారు. వీరు యౌవనారంభకాలముననే తురీయాశ్రమ స్వీకరణ మొనర్చినటుల తెలియనగుచున్నది.

హస్తినావతియను గ్రామమున నివసించుచుం డిన అచ్యుతప్రేక్షులను యతివరేణ్యుఁడు వీరికి సన్యాసమొసంగిన గురుఁడని చెప్పఁబడినది. అచ్యుతప్రేక్షులు గొప్ప విరాగి. వీరిని దొలుత ఉడిపియందు కలిసి తమకు సన్యాసమిప్పించుఁడని వాసుదేవాచార్యులు కోరిరటగాని తలిదండ్రు లియ్యకొనక విలపించసాగిరట. పిదప కనిష్ఠసోద రుండగు విష్ణుతీర్థులు జన్మించినపిదప సన్యాస స్వీకరణ మొనర్చిరట. వారికప్పుడు అనంత తీర్థులని పేరిడిరట. కాని ఆనందతీర్థులని వాడుక ప్రబలమయ్యెనట. విద్యావిశేషముచే పూర్ణ ప్రజ్ఞులనియు మధ్వాచార్యులనియు వాడుకలు గలవు. వీరు బోధించిన మతమునకు మధ్వ మతమనియు, ద్వైతమతమనియు, పూర్ణప్రజ్ఞ మతమనియు, తత్వవాదిమతమనియు, బ్రహ్మ వాదిమతమనియు కూడ వాడుకనామములు సుప్రసిద్ధములయ్యెను.

ఆనందతీర్థులు వారిమతమును బోధించుచు దిగ్విజయయాత్ర సల్పిరనియు, అందు వీరి గురుఁడగు నచ్యుతప్రేక్షులు కూడ నుండిరనియు, అత్తరి వీరి కనేకశిష్యబృందము లేర్పడి వీరికడ మతదీక్ష నందిరనియు తెలియుచున్నది. వీరు దిగ్విజయయాత్రయందు భాగవతమునకు వ్యాస హృదయమును వీరి మతసాంప్రదాయార్థమును బోధించుచుండువారు. గురువుగారివల్ల నియమిం తులై బ్రహ్మసూత్రమునకు ద్వైతమతార్థమిచ్చు నటుల భాష్యము వ్రాసిరి.

వీరికి శంకరభగవత్పాదుల మతమును ఖండిం చుట ముఖ్యముగా నుండెనట. అద్వైతుల నెంద ఱినో యెదుర్కొని వారిసిద్ధాంతములను ఖండించు చుండువారని చెప్పుదురు. వీరు విష్ణుసహస్ర నామంబులు నూరర్థములను జెప్పగల్గినవారట. గీతాభాష్యమును స్వమతానుసారముగ రచించి రట. దానిని బదరికాశ్రమమున నారాయణ స్వామికి సమర్పించిరని చెప్పఁబడినది. అట అనంతమఠమును నిర్మించి అందు నిరశనవ్రతము నెరపిరట. పిదప వ్యాసాశ్రమమునకరిగి సన్మా నములనంది తమ బ్రహ్మసూత్ర భాష్యమును వినిపించి వారి యామోదమునందిరట. వ్యాసుల వారు నిదే వారి స్వాభిప్రాయముగఁ దెల్పి వీరిని బహూకరించిరట. మఱియు నానందతీర్థస్వామి

కెన్మిది సాలగ్రామములను వ్యాసుఁ డొసంగెనట. అవి ఇ సుబ్రహ్మణ్యమునను, ఒకటి ఉడిపియందు నను, ఒకటి మధ్యతాలమను తావునను కలవు ఇంకను ఈ మహనీయునకు ద్వారకనుండి ఏతెంచిన ఒక ఓడయందు లభించినట్టి శ్రీకృష్ణ విగ్రహము గైకొని దానిచలంగియున్న గోపీ చందనమును తాముధరించి, ఆవిగ్రహము నుడిపి యందు ప్రతిష్ఠించిరని చెప్పఁబడినది.

వీరు రచించిన ముప్పదియేడు మతగ్రంథ ములలో, ఋగ్వేదభాష్యము, ఉపాధిఖండనము, ప్రాపంచిక విద్యాత్వనుమానఖండనము, తత్వ వివేకము, బ్రహ్మసూత్రభాష్యము, ఉపనిష ద్భాష్యము నననవి సుప్రసిద్ధములు. వీనికి వ్యాఖ్యలు వ్రాయునట్లు వీరిశిష్యులగు జయతీర్థుల కాజ్ఞలొసంగిరట.

శిష్యులలో పద్మనాభతీర్థులు, నరహరి తీర్థులు, మాధవతీర్థులు, అక్షోభ్యతీర్థులను నల్వు రిని వీరి మతప్రచారమునకు నియమించిరని చెప్పఁబడినది. వీరి వయస్సు డెబ్బదియేడు సంవత్సరముల ఆరు నెలల ఇరువదిదినములు కాగా తమవెనుక పద్మనాభతీర్థులను మతపీఠాధిపతిగ నియమించి, మఱల వ్యాసాశ్రమమునకరగిరనియు నట జీవించియున్నారనియు మధ్వమతస్థు లను చుందురు.

**ఆనందపురము** — ఘూర్జరదేశము చూడుఁడు. అనర్తదేశమునకు రాజధానిగ నుండెను. దీనికి అనర్తపురమనియు వాడుక యుండెను. (చమత్కారపురము చూడుఁడు).

**ఆనందమందిరాసనము** — యోగ శాస్త్రమునఁ జెప్పఁబడిన ఆసనములలో నొకటి. మడమలను పిరుదుల క్రిందనునిచి గొంతుకూర్చుని చేతులతో మడమలంబట్టుకొని, కాళ్లవ్రేళ్లను భూమికానించియుంచి మడమలం బైకెత్తి యుండుట. ఇందువలన మలాశయ శుద్ధియగునని చెప్పఁబడినది.

**ఆనందమతము లేక రామానంద మతము** — మతకర్త కాశీ నివాసియగు రామానందులను విద్వాంసుఁడు. ఈయన బ్రాహ్మణుఁడు. విష్ణుభక్తుఁడు. రామానుజీయ వైష్ణవుఁడనియు, రామానుజదేశికుని శిష్యుఁడని యందురు కాని నిదర్శనములెవ్వియుఁ గానరావు. కాని ఈతని మతధర్మములు పెక్కు రామాను జీయవైష్ణవమతము ననుసరించియే యున్నవి. ఈమతస్థులు తేన్గలతిరుమణివలె నామమును గోపీచందనముతో ధరింతురు. ఈ మతమున శ్రీరామపారమ్యము సీతయేశక్తి. వీరికి భక్తిమాల యను పేరుగల మతగ్రంథము కలదు. రామా నందులకు విఠల్‌పంత్ అనువారును, కబీరు అను వారును ముఖ్యశిష్యులు. వీరికాలమున పన్నిద్దరు శిష్యులుండిరందురు. వీరి సమాధి కాశీపట్టణము నందున్నది. వీరిమతమున గృహస్థులందు జాతి భేదముకలదు. కర్మ ఆచారాదులుం గలవు. ఈమతస్థులగు బైరాగిసాధువులు కొందఱు కలరు. వారియందు జాతిభేదములేదు. రామానంద దేశికులు తొలుదొలుత తురకజాతివాఁడగు కబీరును శిష్యునిగ నంగీకరింపక మంత్రోపదేశ మొసర్పనిరాకరించెనట గాని కబీరునకాయన యందు భక్తి వీడక వదలకుండెనట. ఒకనాఁటి రాత్రి కబీరు కాశీపట్టణమునందు గంగాతీరమున మెట్లపై నిదురించుచుండ తెల్లవారుజామున రామానందులు గంగాస్నానమునకై యేగి చీకటి యందు కబీరునిపై కాలువైచి ఖిన్నుఁడై "రామ రామ, మనుష్యునిం ద్రొక్కితి" నని పశ్చాత్తాప మున వల్కెనట. కబీరందులకు "స్వామీ ఇదియే నాకు మంత్రోపదేశమగుగాక" యన నాతని గాఢ భక్తికిం గనికరమొదవ లెమ్మని స్నానముజేయించి కబీరునకా రామనామమంత్రము నుపదేశించెనట.

అటుల కబీరు రామానందుల శిష్యుండాయె నందురు. (కబీరు- కబీరువాడీ చూడుఁడు).

**ఆనందములు ౮** — (అష్టానందములు) ౧. బ్రహ్మానందము- నిద్రావస్థవంటి యానందము. ౨. వాసనానందము- పూర్వజన్మ వాసనవలన నైసర్గికముగ నుత్సాహ సంతోషములంగల్గి (బహిర్వ్యాపారమునందు) యుండుట. 3. విషయానందము- జిహ్వా, నాశికము, కర్ణము, ఉపస్థేంద్రియము మొదలగు నింద్రియముల ద్వారా కల్గిన యానందము. ౪. ఆత్మానందము- తనకే కొరంతయు లేకుండుటచే గల్గిన యానందము. ౫. విద్యానందము- తాను నేర్చిన విద్యాజ్ఞానమువలన గల్గిన యానందము. ౬. సహజానందము- తాను కృతకృత్యుఁడగుట వలనగల్గిన యానందము. ౭. అద్వైతానందము- తనయాధిక్యతవలన తనకుంగల్గిన యానందము. ౮. యోగానందము- తనకుఁ బ్రాప్తించిన అతిశయములు, ఐశ్వర్యములు, ధనాదులు, వస్తువితతి మొదలగు వానివలన గల్గిన యానందము. ఇవి వేదాంతార్థ సూచకములైనను ప్రపంచ ధర్మము లందిటుల నర్థమగుచు వాడఁబడియున్నవి.

**ఆనందవనము** — అరణ్యములు బనారస్ నగరము చూడుఁడు.

**ఆనకుఁడు** —వసుదేవుని తమ్ముఁడు, యదువంశక్షత్రియుఁడు.

**ఆనబ** (ఆనప) తీగ — లా. Lagenaria vulgaris లేక Cucurbita lagenaria. ఇంగ్లీ. Bottle gourd. సం. అలాబూ తుంబి, రాజాలాబు. దీనికాయలు కూరకొర కుపయోగించునుగానదీపేరందినది. ఆనబకాయలు నల్లనివి, తెల్లనివి, గుండ్రనివి, పొడుగుపాటివి మొదలగు భేదములు కల్గినను సామాన్యముగ నన్నియు నొకేరీతిని పరిగణింపఁబడుచున్నవి. దేశభేదములచే దదరుకాయ, అనుగుకాయ, సొరకాయ యనుపేరులంగూడ గల్గియున్నది. ఆనబకాయ కూర చలవజేయును, దాహమడంచును. పైత్య శాంతిమొనర్చి ఆకలి మందగించును. వీర్యవృద్ధి, శ్లేష్మము, వాతము, మలబద్ధము జేయును. మూత్రము వెడలించును. దేహతత్వమును సౌఖ్యపరచును. వాతరోగుల కపథ్యమును మేహ పైత్యతత్వముల వారికి పథ్యముగను ఉండును. శీతపైత్యము నుపశమింపఁజేయును. దీనికి విరుగుడులు- పులుసు, ఆవాలు, శొంఠి, ఉప్పు, జీలకర్ర, తేనె, మోదుగక్షారము.

ముదిరిన ఆనబగింజలలోని పలుకులు (పంచదారతో కల్పితినిన) మేహశాంతిజేసి. వీర్యవృద్ధి. వీర్యస్తంభనము, రతిసౌఖ్యములును గల్గించునని చెప్పఁబడినది. ఆనబతీగ కొనలు కూరగఁ జేసి పుచ్చుకొనిన, ఆమరోగము, అరుచి, క్రిమిదోషము, పైత్యాధిక్యత, విషదోషము, శూల కఫదోషముల నడంచి, అగ్నిదీప్తినిచ్చి, ఇంచుక వాతప్రకోపము గల్గించుననియు, దీనికి పులుసువిరుగుడనియు, జెప్పఁబడినది. మఱియు నానపాకుల కషాయము (పంచదారకల్పి) పాండురోగము హరించునని చెప్పఁబడినది.

చేదుఆనబ - ఆకులపసరు, ఆయాసము లేకుండ వమనముఁ గల్గించును. చేదు ఆనబకాయలు గుంజు, ఆకులరసము లంపు జ్వరములు, శ్వాస కాసలు, విషములు, పాండువు, ఉబ్బులను జయించుగుణము కలదని చెప్పబడినదిగాని అపాయకర పదార్థముగాన వైద్యులు వాడసాహసింపరు. చేదుఆనబకాయలను నాగస్వరపు కాయ లందురు. పాములవాండ్రు దీనిని గానముచేయ వాడుచుందురు.

**ఆనభిన్న గోత్రము** కుశికగణము చూడుఁడు.

**ఆనాముదేశము** (కొచ్చిన్చీనా) — ఆసియా ఖండమున ఇండూ చైనీస్పెనెన్సులా యందు తూర్పుతీరమున నున్నది. ఆనామనిన దక్షిణదేశమని యర్థము. స్వదేశరాజ్యము. ఇప్పుడు ఫ్రెంచిప్రభుత్వము రక్షణయందు చేరియున్నది. దీనినికొందఱు కొచ్చిన్చీనా యని యనుటయుంగలదు. ఈదేశము సుప్రసిద్ధమగు కోళ్లకు ప్రసిద్ధికెక్కినది. ప్రజలు చీనావారి నించుకపోలియుందురు. బౌద్ధమతస్థులు. హ్యూకట్టణము దీనికి రాజధానిపురము. ఇట దుర్గము ఐరోపాదేశమందలి దుర్గములనుబోలి యుండును.

**ఆనీకుఁడు** — యదువంశక్షత్రియుఁడు. వసుదేవుని తమ్ముఁడగు అనకుని రెండవ కుమారుఁడు.

**ఆన్‌కాల్** (On Call) — అడుగగనే యని వాణిజ్యపరిభాషయం దర్థము. కొంచెము గడువుతోనైనను ఇచ్చివేయునటుల అప్పిచ్చిన సొమ్మునకు లేక అట్టిన అప్పున కీపేరు వర్తించును. ఆన్ డిమెండు (On Demand) అనఁగా అడగగనే యిచ్చివేయు ప్రోనోట్లు. దర్శన హుండీలు యిందుచేరునవియే. దర్శనహుండీలకు చూచినట్లు అంగీకరించుట అవసరములేదు. చూడగనె సొమ్మిచ్చుటయో నిరాకరించుటయో జరగవలసియుండును.

**ఆన్ ది కార్పెట్** (What is on the Carpet ?) — ఇప్పుడే యంశము చర్చింపఁబడుచున్నది? యనుట కీయుక్తిని వాడుదురు. తొల్లియొకప్పుడు నార్మండీసీమయందు ఫ్రెంచి దేశమున రాజకీయములు తర్కింపఁబడుచుండు భవనమున ఉపరిభాగము ఎత్తుగనుండి, తివాచీ (Carpet) పరువంబడి, అందుపైన సభ్యులు కూర్చుని చర్చించుచుండ మిగతవారు తివాచీలేని దిగువగనుండి వినుచుండువారట. చర్చలు తివాచీపై జరుగుచుండుటంజేసి యీయుక్తికల్గెను.

**ఆపగానది** — దీనిని అయూక్ నది యనియెదరు. పాంచాలదేశమున కుపనదిక పశ్చిమముగ కొంత దూరమున నున్నది. కురుక్షేత్రమునందున్న ఓఘావతీశాఖ (అపాయ లేక మార్కండేయు) ను ఆపగానదియని కొందఱు భ్రమపడిరి. కాని అది సరికానేరదు.

**ఆప గోత్రము** — ఉపమన్యు గణము చూడుఁడు.

**ఆపగోత్రము** — వశిష్ఠగణము చూడుఁడు.

**ఆపద(మొక్కులు సంపదమఱపులు** - ఆంధ్రలోకోక్తి.

**ఆపదలవెన్క నాపదలు సంపదల వెన్క సంపదలు సిద్ధమౌతవి**—ఆంధ్రలోకో

**ఆపస్తంభ గో(త్రము**— భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**ఆపస్తంభి గో(త్రము** — భృగుసంతతి. ఆర్ష్టిషేణ గణము చూడుఁడు.

**ఆపస్తంభుఁడు ఋషి**—ఈమహాత్ముఁడాంధ్రుఁడని బలమగు ప్రతీతి కలదు. ఈయన రచించిన ఆపస్తంభ సూత్రములు సుప్రసిద్ధములు. బోధాయనునకుం దరువాతి వాఁడని కొందఱనుచున్నారు. కడు ప్రాచీనుఁడని వేఱుగ వ్రాయనక్కరలేదు. ఈతని సూత్రములనుండి అక్కాలమున దేశమున వ్యాపించియుండిన దేవర న్యాయాది దురాచారముల నిషేధించి ధర్మోద్ధరణ సంస్కారము నీతండొనర్చినవాఁడని తేలుచున్నది. వింధ్య దక్షిణముగనున్న భరతదేశపు దక్షిణా పథమున నీతనిధర్మసూత్రము లెక్కువ వాడుకయందుంట గాననగును. యజ్ఞ యాగాది సమస్త క్రతువులందునను, జాతకర్మ, నామకరణ, చౌల, ఉపనయనాది సమస్తములగు (షోడశ)

కర్మలందుననను, ఈతని సూత్రధర్మములు ప్రాముఖ్యము నంది యాచరణ యందుండును. ఇంగ్లాండు నందు మాక్సుముల్లరు (Max Muller)పండితుని సంపాదకత్వమున వెలువడిన Sacred books of the East గ్రంథమాలిక రెండవ సంపుటమున జార్జి బుల్లారు పండితుడు ఈసూత్రముల ననువదించి ఆంగ్లమునఁ బ్రకటించెను. (సూత్రములు చూడుడు).

పిదపఁ జెప్పఁదగిన ఆపస్తంభ ధర్మసూత్రములందలి ధర్మవిధులు, మనుధర్మశాస్త్రము (మనుస్మృతి) యాజ్ఞవల్క్య స్మృతులకాపత్తియైనను లఁ గన్పించెడిని. యాజ్ఞవల్క్యస్మృతికి విజ్ఞానేశ్వరుడు రచించిన మితాక్షరయందలి ధర్మములు భరతదేశమున వారసత్వధర్మములై తన రారుచున్నవి.

ఆపస్తంభుడు పూర్వజన్మమున కడపటి వశిష్ఠపుత్రుడగు శక్తియొక్క శిష్యులలో నొకండగు కాలదమనుడను వైశ్యుడని వామన పురాణమునఁ జెప్పంబడినది. ఈయన భార్యపేరు అక్షసూత్రయనియు, కుమారునిపేరు కల్కియనియు నందేకలదు. ఆపస్తంభుడను పేరు జలస్తంభనవిద్యయందారితేరినవాడగుట కగ్గెనని పెక్కండ్రు తలంచుచుండినను, ఇతనికి వేఱు నామమెచటం గానరాకుంట నది తల్లిదండ్రులిడిన నామమేమోయని స్ఫురింపకపోదు.

తరువాత చెప్పందగినవి ఆపస్తంభశుల్బసూత్రములు. ఇవి రేఖాగణిత (Geometry) శాస్త్రసంబంధములు. భరతదేశపు రేఖాగణిత విద్యను కనిపెట్టి ప్రారంభించినవాఁ డీమహాత్ముఁడేయని చెప్పవలయును. శుల్బ సూత్రములు ప్రారంభించినవాఁడు నిజమున బోధాయనుఁడైనను ఆపస్తంభునివలె విరివిగ వ్రాసియుండలేదు గాన నితనినే పేర్కొనుచుందురు. శుల్బమనిన కొలత్రాడు (Measuring tape) న కర్థము. ఆపస్తంభశుల్బసూత్రములు కల్పసూత్రములకుఁ గడ భాగముగ నెన్నంబడినవి.

**ఆపుష్టికి ఈనష్టికి సరియన్నట్లు** - ఆంధ్రలోకోక్తి

**ఆపొజిషన్** (Opposition) — ఎదుర్కొనుటట్టి కార్యమున కర్థము. ఎస్ట్రోనమీ శాస్త్రమున గ్రహణ సందర్భమునందు పౌర్ణములందు సూర్యుడు, భూమి, చంద్రుడు ఒకేతిన్నని వరుసగనుండుచో చంద్రుడు సూర్యున కెదురు నడచుచుంట కీపేరిడియున్నారు. (గ్రహణములు చూడుడు. ఎస్ట్రోనమీ చూడుడు).

**ఆపోస్తలులు** (Apostles) — రామానుజీయమతమున కాళ్వారులవలెను, జైన మతమునకు తీర్థకరులవలెను, క్రైస్తవమతమునకు ఆపోస్తలులు పదునేనుగురుకలరు. వీరు క్రీస్తుప్రభునకు శిష్యులై ఆ యనంతరం, మతవ్యాపకము నకై నియమింపఁబడినవారు వీరు మహాత్ములని ఈమతస్థులనెదరు. ౧. మాత్యూ (Matthew) ఇథియోపియా యందు మతమునకై బలాత్కారముగ చంపబడి martyrdom పొందిరి. వీరిసమాధి, ఇటలీదేశమున Salerno అనుతావున కలదు. ౨. మార్కు (Mark) ఈజిప్టు దేశమున - అలగ్జాండ్రియాపుర వీధులగుండా ఈమహాత్మ నీడ్చి, అలగ్జాండ్రియాయందు బలాత్కారమరణము పాల్జేసిరనియు, వీరిసమాధి ఇటలీదేశమున వెన్నిస్‌నగరమున గలదనియు చెప్పఁబడినది. 3. లూక్ (Luke) ఈమహాత్ముని గ్రీసుదేశమున ఒక ఆలివు చెట్టున కురిదీసిరనియు, ఈయన గోరీ పాడియా యనంబడు తావునఁ గలదనియు (Padua) ఈయన Evangelist అనియుఁ జెప్పఁబడినది. ౪. యోహాను (John) ఈమహాత్ముని కాగుచున్న తైలపుబానలోఁ బడవై చిరట

గాని ఈయన చావలేదట. పిదప వీరిని Patmos అను తావునకు వెడలఁగొట్టిరట. ఈయన గోరీ ఎఫిసస్ (Ephesus) అను తావున కలదని చెప్పఁబడినది. ౫. పీటరు (Peter) - ఈ మహాత్ముని రోమక పురియందు తల క్రిందుగ వ్రేలాడదీసి శిలువ వైచిరట. వీరి సమాధి రోము నగరమున St. Peter దేవాలయమున కలదని చెప్పఁబడినది. ౬. జేమ్సు (James) ఈమహాత్ముని జరూసలేము నగరమున శిరచ్ఛేదముచేసి చంపిరట. వీరి సమాధి స్పానియా దేశమున St. Jago'de Compostila అనంబడు తావున కలదు. ౭. చిన్న జేమ్సు (James the Less) ఈమహాత్ము నొక దేవాలయపు మంటపమునుండి క్రిందికిం బడద్రోసి, బాది చంపిరట. వీరిసమాధి రోమకపురియందు (ఇటలీ) Church of Holy Apostle అనంబడు దేవాలయమునందుఁ గలదు. ౮. ఫిలిప్పు (Philip) ఈమహాత్ముని ఫిర్జియా (Phyrgia) యను పురమున ఒక స్తంభమునకు ఉరిదీసి చంపిరట. ఈమహాపురుషుని సమాధి ఇటలీలోని రోమక పురియందు కలదట. ౯. బార్తలోమ్యూ (Bartholomew). ఈ మహాత్ముని జీవించియుండగనే రోమకపురి వాసులుఒంటిచర్మమునొలిచిచంపిరట. వీరిసమాధి రోమకపురికడ టైబరునది యందొక ద్వీపమున వీరిపేరుగల చర్చియందున్నది. ౧౦. ఆంద్రూ (Andrew)- ఈమహాత్ముని నేపిల్సు పురవాసులు ఈయన బోధించుచుండుతరి నొక శిలువకుం గట్టి వైచి చంపిరట. వీరిసమాధి నేపిల్సు (ఇటలీ) పురము Amalfi అను తావున గలదు. ౧౧. థామస్ (Thomas)-. ఈ మహాత్ముని భరతదేశమున కోరమండలమను తావునందు పొడిచిచంపిరట. వీరిసమాధింగూర్చి అభిప్రాయ భేదముకలదు. కొందఱు చెన్నపురి యందనియు, కొందఱు నేపిల్సుపురమున ఒర్టానా (Ortana) యనంబడుతావునయనియుతలంచుచున్నారు. చెన్న పురిమొకనో సెంటుథామస్‌మౌంటు అయ్యె ౧౨. యూదా (Jude)- ఈమహాత్ముని తుపాకితో కాల్చిచంపిరట. వీరిసమాధి రోమకపురియందుకలదని చెప్పఁబడినది. ౧౩. మేథియస్ (Matthias)- ఈమహాత్ముని రోమకపురివాసులు రాళ్లతోకొట్టిచంపి తరువాత శిరస్సు నరకిరట. వీరి సమాధి రోమకపురియందు బాసిలికా (Basilica) దేవస్థానముక్రింద పాతఁబడినదఁట. ౧౪. బెర్నాబాస్ (Bernabas)- ఈమహాత్ముని సాలోనికాయందు యూదులు రాళ్లతోకొట్టి చంపిరట. ౧౫. పాల్ (Paul)- ఈమహాత్ముని రోమకపురియందు నీరో(Nero) భూపతి కత్తితో నరకి చంపెనట. వీరిసమాధి ఎచటనో ఇటలీ దేశమున గలదందురు. వీరినిజంపినకత్తి స్పానియా దేశమున Lalisla అను గ్రామమున ఒక కాన్వెంటు (Convent) నందు కలదు.

**ఆఫ్ఘనుస్థానదేశము** — (తొల్లింటి అపగదేశము). ఆసియా ఖండముననున్న ఒక కొండలదేశము. ౨,౧౫,౦౦౦ చతురపు మైళ్ల వైశాల్యము కలది. ఇది పీఠభూముల మయమైన దేశము. ఈశాన్య దిశను హిందూకుష్పర్వతములును, దానిశాఖయగు కోహిబాబా పర్వతపఙ్క్తియు, పియాకో పర్వతపఙ్క్తియు, సఫెదో-పర్వతపఙ్క్తియునైయుండి దేశమందున్నవి. తూర్పు సరిహద్దున సులేమాన్పర్వతములు కలవు. నైరుతి దిశను శీస్తాన్ ఇసుకఎడారికలదు. దానియందు హామూననుపేరుగల తంపరసరస్సును కలదు. అధర్వణ వేదమున సరస్వతీనదియనియు, జరథుస్త్రపారశీకులు అవెస్తాగ్రంథమున హార్హైతీ యనియుఁ జెప్పఁబడిన హెల్మ్యాండునది ఆఫ్ఘనుస్థానదేశముగుండా నైరుతిదిగ్వాహినియై ప్రవ

హించుచు నిందు సంగమించును. వేదములందు కుభానదిగఁ జెప్పఁబడిన కాబూల్నది యీదేశము గుండా కాబూల్నగరము ప్రక్కఁబడి ప్రవహించుచు, సింధునదికుపనదియై యందు జేరుకొనును. ఇదియే దేశమున ముఖ్యమైన నదిగా నున్నది. హారియాజ్నది పశ్చిమముగా ప్రవహించుచు ఇసుకలం దింకిపోవుచున్నది.

దేశమున వేసవియందు వేడియధికము, శీతకాలమున చలి మిక్కుటముగా నుండును. దేశము కొండలమయమై ఎడారులవలెనున్నను, కొన్ని అనుకూల ప్రదేశములందు ధాన్యము, ప్రత్తి, జొన్నలు పైరగుచున్నవి. ఇంగువచెట్ల నుండి ఇంగువయు, ద్రాక్షలోటలు, ఖుర్బానీచెట్ల తోటలు, ఖర్జూరపుతోటలు సుప్రసిద్ధములు. గుఱ్ఱములు, పశువులు, గొఱ్ఱెలు, మేకలు దేశమున ప్రశస్తమైనవికలవు. ఒంటెలుబరువుమోయు జంతువులు. ప్రజలు పఠాన్జాతి మహమ్మదీయులు. వీరియం దనేక తెగలు కలవు. అందు హాజా తెగవారును, ఘిల్జాయి తెగవారును అధికముగ వసించుచున్నారు. ఇతర తెగల పఠానులును కలరు. భరతదేశమునుండి అట కాపురము కుదిరిన వైశ్యులు కలరు. అరవదేశస్థులు ఉద్యోగములందు గుమాస్తాలుగఁ గొననగుచుందురు.

దేశభాషకు పుష్తు అని పేరు. వీరు తమదేశమును బిల్లాయ తనెదరు. ఆఫ్ఘనుస్థాన మనునది తొల్లింటి అపగ దేశమను శబ్దమునుండి కల్గిన పేరు. మతము మహమ్మదీయ మతము. వైశ్యులు, అరవలు హిందూమతస్థులు. దేశమున తొల్లింటి బౌద్ధ మతస్థూపములు మొదలగునవి పాడగుచున్నవి కలవు గాని, బౌద్ధులెవ్వరును లేరు. హిందూ దేవస్థానములు ఒకటి రెండు నిలచియున్నవి. (అపగదేశము; గాంధారదేశము చూడుఁడు). (డురాండు లైను చూడుఁడు). చిత్రాల్ సంస్థాన రాజ్యమునకును, ఆఫ్ఘనుస్థానమునకును నడుమ ప్రదేశమునకు ఆఫ్రిస్థాన్ అని పేరు. అది మధ్యకాలమున ఈ రాజ్యమునకుం జేరిపోయినది. ప్రభుత్వ మిటీవల లిమిటెడ్ మోనార్కీ యైనది. భూపతికి అమీరని బిరుదునామము. అనేకదండయాత్ర లీదేశముగుండా భరతదేశములోనికి వెనుక వచ్చినవి. ఇప్పటి బ్రిటీషు ప్రభుత్వమువా రీదేశపు హద్దున (పశ్చిమోత్తరమున) గొప్ప సైన్యముల నిల్పియుంచియున్నారు. ఆఫ్ఘనుస్థానమునకు కాబూల్నగరము రాజధాని పురము. కాబూల్ (తొల్లింటికుభా) నదీతీరము గొప్ప వర్తకస్థలము. ఇది సముద్రపు నీటి మట్టముపై ౫,౮౦౦ అడుగుల ఎత్తుగల పీఠభూమి యందొక పెద్ద లోయలోనున్నది. ఖైబరు మార్గముకడనున్న జలాలాబాదనుపురము ఆఫ్ఘను సైన్య స్థానము. కొంత వర్తకమును గలదు. గజనీపురము, గజనీమహమ్మదునకు రాజధానియై యుండినపురము. వర్తక స్థలముగనున్నది. కాంధాహార్పురము- తొల్లింటి గాంధారపురము. ఇది ఒక నదిపై నున్నది. ఆనది హెల్మండునందు కలియును. వాయవ్యదిక్కుగా సరిహద్దున హీరట్పురము కలదు. ఇది పారశీకుల ముట్టడుల ననేకము చూచినపురము. ఉత్తరము బాల్ఖుపురము యొక రాజ్యమునకు రాజధానిగ నుండి ఇప్పుడు పాడగుచున్నది. ఇది జరథుస్త్రదేశికుని జన్మస్థానము. ఆదిని బలిచక్రవర్తి రాజ్యమువందుండి ఆయన పేరఁ బరగినది. బదక్షాను పురముకడ కెంపుల గనులు కలవు. (అపగదేశము చూడుఁడు).

## ఆఫ్ఘనిస్థానదేశపు సామెతలు —

…లు) ఆపదలు సిద్ధమగునపుడే, అల్లా జ్ఞాపకమునకు వచ్చుట. ఆహారమన్యులదైనా, తినేనోరు తనదే. ఈటెపోటు నొప్పి మానుట కెంతోకాల మక్కర లేదుగాని, నోటిమాట నొప్పి మానుటకు నాల్గు తలాటము.

లైనను కావలెను. కన్నతల్లి తోడేలైనా, తన పిల్లలను తినదు. కన్నులు పెద్దవైనా, కనుపాపలు చిన్నవిగనే యుండును. కోడి కూయక పోయినా, తెల్లవారకపోదు. గాడిద కెన్నేళ్ళు వచ్చినా, యజమాని యింటిని బోల్చలేదు. గాడిదలతో స్నేహము, కాలితన్నులకే. గుఱ్ఱములు తమకు తామే నాళ్ళు వేసికొనగలిగితే, కప్పలుసైతము కాళ్ళు పై కెత్తుతవి. చంకలో ఖురాను, దారిపై దృష్టి. చేను ఎద్దు తినిపోతే, గాడిదకు చెవులు తెగగోసినటులు. ధనము తానుభవించిన వానిదిగాని, దాచినవానిది కాదు. నల్లదేశంలో తెల్లవస్తువునకు ప్రకాశం ఎక్కువ. పనిచేయుచు కష్టపడడం ఎవరికి సరదా? ప్రపంచము సత్రమువంటిది. బుద్ధిహీనునితో చెలిమి భల్లూకాలింగనము వంటిది. భల్లూక సరసము, బరకడం పీకడమే. మేఘములు నలుపైనా, కురిసేవాన తెలుపే.

**ఆఫ్టరు సైటు** (After Sight) — చూచినపిదప చేయవలసిన పనులకు After Sight అనిమెదరు.

**ఆప్టిక్సు లేక ఆప్టికల్ సైన్సు**— (దృష్టిశాస్త్రము చూడుడు). ఇది కేవలము పాశ్చాత్యవిద్య. అంను భరతదేశమునందు వ్యాపించినది. ఆంగ్లదేశపుకళ. ఇది దృష్టిని గూర్చినకళ. ఒక సుప్రసిద్ధ విద్యావిశారదుడు ఆప్టిక్సు అనిన Science of light and Vision అని నిర్వచించియున్నాడు. మనకు సమీపముననేయుండినను మనము చూడజాలమి లోపమునకుం గల కారణములు వానినిజిక్కంజేయు సాధనములంగూర్చి వివరించు కళగా మానవుల కుపయోగించుచున్నది. ఫిజిక్సులోని యంతర్భాగమగు జామిట్రికల్ ఆప్టిక్సు అనబడు శాస్త్రభాగమునం గల మూలసూత్రములం దీవిషయములు చక్కగ వివరింపంబడిన వందును. ఈ శాస్త్రమునుండి యెఱుంగగల ముఖ్యాంశములు నాల్గు గానంబడుచున్నవి. లుతురు ఏలక్షణము గలదైనను ఏ రంగుగలదైనను నేత్రమునం కనుపడగనున్న వస్తువుయొక్క రూప, ఆకారములను రంగులతోసహా కనుపాపయందు ప్రతిబింబింపంజేయునది యనియు, అటుల ప్రతిబింబించుటయే అగుపడుట యని ఈశాస్త్రాభిప్రాయము. ఇట్లగుపడుట ఆకనిపించు వస్తువునుండి కనుపాపకడకు ఒక Straight Line గా సరిపోవును. ఈసంగతి కడవరకు మనసునందుంచుకొనందగినది.

౧. నీడ- వెలుతురు యొక్క మూలస్థానమునుండి కిరణములు వీలగునన్ని దెసల కరుగుచుండును. వానికడ్డముగ నేదేని opaque body ఉండినచో ఆకిరణములు దానిందాకి వెనుకకు మఱలును. తోడనే ఆ అడ్డమున్న ఒపేక్ బాడీ నుండి యవ్వలకు దాని యాకారపు నీడ కల్గెడిని. అది నల్లగనుండును; దానికే కీ నీడ యనిపేరు. నీడ చీకటింగల్గించు గుణముకలది. చీకటిరాత్రులందు చీకటి కల్గించునది సూర్యుని వెలుతురు కిరణముల కడముగనున్న భూమియొక్క నీడగాని వేఱేమియుంగాదు. పగలిండ్లయందుచీకటింగల్గించునదినీడయే. చంద్రగ్రహణముం గల్గించునదియు భూమియొక్కనీడయే.(గ్రహణములుచూడుడు). వెలుతురునకు విరోధము చీకటి. అది దానివికారాకారమేయగును. నీడ బలవిశాలతలను గల్గిననందలి చీకటియు దట్టమైనదిగనే యుండెడిని. నీడలేక చీకటియొక్క నల్లరంగు నంద నేకరంగులు కలసియున్నవనియు నందంచులకడం గల రంగులను deffraction ధర్మముల బరిశీలించిన తెలియనగుననియు నీశాస్త్రవేత్తల యభిప్రాయమైయున్నది. ఈచీకటిని reinforced illumination జయిస్తున్నదియుం బరిశీలకు లనుచున్నారు.

ఈ (Shadow) నీడ అంబ్రా (Umbra) యనియు, పెనంబ్రా (Penumbra) యనియు ద్వివిధముగ శాస్త్రజ్ఞులు విభజించియున్నారు. నీడయొక్క ప్రధాన మధ్యభాగము కడునల్లగా నుండును. దానిని అంబ్రాయందురు. దానిచుట్టును Partially illuminated portion of the shadow అనగా కడునల్లనునుండి క్రమక్రమముగ తగ్గుచు, నల్లనిరంగుం గోల్పోవుచు, పలుచబడి, కడకు వెలుతురుతో కలసిపోవు నీడ (భాగమున) కు పెనంబ్రాయనియు నందురు. ఇట్లీనీడ నిర్వచింపఁబడినది.

నీడ వెలుతురుయొక్క బలాతిశయము ననుసరించియే యేర్పడునదిగాన, తక్కువబలముగల వెలుతురునందు పెనంబ్రానీడ కడు బలహీనమై ఎక్కువ దగ్గరగా పరిశీలించినంగాని యగుపడకనే యుండెడిని. (ఛాయ లేక నీడ చూడుఁడు).

౨. వెలుతురు— సూర్యుఁడు, చంద్రుఁడు దీపము మొదలగునవి వెలుతురునకు మూలస్థానములని ఈశాస్త్రదృష్ట్యా చెప్పనగుచున్నది. ఇట్టి మూలస్థానములనుండి దెసలకు వెలుతురు వ్యాపించుచు ప్రసరించుచుండును. మఱియు నది కిరణములుగ ప్రసరించుచుండుననియు, ఆ కిరణములు గీతలంబోలి కడు సన్నములై వలము లేక పొడవునుమాత్రము గల్గియుండుననియు, అట్టి కిరణ సముదాయము ప్రసరించుటయే కిరణ ప్రవాహమనియు పరిశీలనలనుండి కన్గొనంబడినది. కిరణము లసంఖ్యాకములు. ఇవి straight lines వలె నుండుననియు, వానికి light rays అని పరిభాషా నామ మనియు; ఆప్టిక్సు శాస్త్రమున చెప్పఁబడియున్నది. వీనింగూర్చి విచారించిన reflection అనియు, refraction అనియు, రెండు సంగతుల నెఱుంగవలసి యుండును. (౧) రిఫ్లెక్షన్- వెలుతురు మూలస్థానమునుండి వెడలి కిరణములుగ ప్రసరించుచుండుతఱి నడ్డముగ నేదేని యొక ఒపేక్ బాడీ ఉండుట సంభవించెనేని అట నాకిరణములాగి మరలి వెన్కకు గాని ప్రక్కలకుఁ గాని తిరుగ ప్రసరించును. అత్తఱి తిరుగ నేదేని వేఱొక ఒపేక్ బాడీ యుండుట సంభవించునేని దానిపై నింకొక వెలుతురుపడును. దానిని రిఫ్లెక్షన్ అనియెదరు. అనగా ప్రతిఫలించుట యని భావము. మఱియు నీధర్మవిధులను పరిశీలించిన నాల్గుసంగతులు బయల్పడును. [౧] ప్రతిఫలించిన కిరణములును మూలస్థానమునుండి ప్రసరించువానివలెనె straight lines గనే సరియగు కిరణధర్మములను వీడక ప్రసరించును. [౨] వెలుతురు ప్రారంభమైన మూలస్థానమునకు కిరణప్రసారమున కడ్డముగనున్న ఒపేక్బాఁ perpendicular గా నుండుట సంభవించునేని కిరణములు తిన్నగ (దిశలకరుగక) వెలుతురు బయలుదేరిన మూలస్థానమునకుం జేరుకొనును. [3] వెలుతురు ప్రసారమున కడ్డముగనున్న ఒపేక్బాడి మెరక పల్లములను కొద్దిగనో, ఎచ్చుగనో గల్గినదగుచో దానిపయింబడిన వెలుతురు రణములు వీలగునట్లు దెసలకుంజని, వేఱ్వేఱు కోణములు (Angles) గ ప్రసరించి చెదరిపోవును. [౪] కిరణప్రసారమున కడ్డమైన ఒపేక్బాడి సమతలమగునేని రిఫ్లెక్షను లక్షణములు గాననగును. ఆసమతలము పరిపూర్ణముగ మంచిఅద్దము వంటిదిగనో, లేక నునుపుగలలోహపు రేకువంటిదిగనో ఉండెనేని దాని పయింబడి ప్రతిఫలించిన వెలుతురుకిరణములు regular reflection దశనంది తిరుగ ప్రసరించు కోణమున కర్వస్థలమున ప్రతిబింబమును గన్పడఁజేయును. దానిని రిఫ్లెక్టెడ్ ఇమేజి అనియెదరు. మఱియు నాప్రతిబింబము ఫినామినాయని చెప్పంబడినది. (౨) ఇంక నా కిరణప్రవాహమునకు అద్దము, జలము, గాలి మొదలగు Transparent bodies అడ్డమగుతఱి నవి స్వచ్ఛతంగల్గినవి గాన వానిగుండా వెలు

తురు,కిరణములు ఆవ్వలి కరిగెడిని.(ఇత్తరి అవతలి భాగమునసీడయుండను). అటులఅడ్డముగనుండి తనగుండా కిరణములంబోనిచ్చిన దానిని శాస్త్ర పరిభాషయందు Medium అనియెదరు. సర్వ సాధారణముగ నట్టి మీాడియముగుండా నడచి యవ్వలకుంజనిన కిరణములు కొంత వంగును. ఆవంగునట్టి స్థితిని refraction అనియెదరు. ఈ రిఫ్రేక్షను ధర్మములను పరిశీలించుటయందు రెండు Geometrical Statements వివరింపంబడినవి. వానినట్లేవివరింతుము. (౧) The incident ray, the refracted ray and the normal ray are in one plane. (౨) The sine of the angle of incidence bears to the sine of the angle of refraction a ratio which is definite for two given media. గాలినుండి అద్దము దనుక రేషియో $\frac{3}{2}$, అద్దమునుండి గాలివరకు $\frac{2}{3}$, గాలినుండి నీటిదనుక $\frac{4}{3}$, నీటినుండి గాలివరకు $\frac{3}{4}$, నీటినుండి అద్దముదనుక $\frac{9}{8}$, అద్దమునుండి నీటి వరకు $\frac{8}{9}$ రేష్యో లని శాస్త్రజ్ఞులు లెక్కించి యున్నారు.

3. రీడింగుగ్లాసెస్, టెలిస్కోపులు, కేమెరాలు (Reading Glasses, Telescopes, Cameras) మొదలగువానియందుండు Lenses వలన గల్గింపంబడు ప్రతిబింబములు (Images) మూలస్థానమునుండి వెడలుచుండు వెలుతురు కిరణములు Deviation కారణముగ గల్గింపంబడుచున్నవనియు, అవి Images యొక్క Points గుండా నడచి వేత్వేఱు కోణములుగా రీడైరెక్టు చేయబడి Real and Virtual గతులనంది కండ్ల కగుపడుచుండునని గ్రహింపఁబడినది. ఇది జియోమెట్రికల్ మెథడ్సుయొక్క Deduction విధానమున నని యెరుంగునది. దీనికై పెక్కు పరిశీలనలు సల్పియున్నారు. వాటినన్నింటిని వివరించుచు గ్రంథబాహుళ్యమున కాయత్తపడుట యాంధ్రవిజ్ఞానమునకుఁ దగదు. అది కేవల శాస్త్రగ్రంథములం దుండఁదగినది. వాటినుండి Phenomena of interference, Defraction, Polarisation, Chromatic Despersion మొదలగు వానింగూడ నెరుంగ నగుచున్నది.

౪. పోలారైజేషన్. ఒక Incident కిరణమునకు ప్లేను పోలారైజేషన్ సంప్రాప్తించినచో అనగాప్రతి రిఫ్రాక్టెడ్ కిరణమునకు వేత్వేఱు ప్లేన్సు ఆకిరణములం గల్గియుంట సంభవించునేని, వేత్వేఱువిధుల పాలగునని చెప్పంబడినది. అందు సర్వసాధారణమగు విధి, ఇటుల శాస్త్రమునందు వివరింపఁబడినది. దాని నట్లే వివరింతుము. "If the ray is directed on to a piece of glass at a definite angle and if the planes of polarisation of the ray is at right angles to the plane of incidence on the glass, no reflection takes place; the entire energy of the ray being transmitted into the the glass" ఇట్టి విషయములం గూర్చి గ్రంథబాహుళ్యము కాకుండ సుబోధకమగు నటుల వివరించుట యసాధ్యమగును. గత రెండు శతాబ్దములనుండియు నీవిషయము పరిశీలనల నందుచునే యున్నది. దీనికింకను Physical Optics అనియుం బేరు వాడుచున్నారు.

ఇంక నీసందర్భముననే, కొన్ని పరిభాషాపదముల నీ ఆప్టిక్సు శాస్త్రమునం దుపయోగపర్చఁబడినవి వివరింపవలసియుండును. (౧) వెలుతురు కిరణములు వెలుతురు వచ్చు మూలస్థానమునుండి అడ్డుగనున్న ఒపేక్బాడిని తాకుదనుక Normal ray యనంబడును. (౨) అటనుండి మరలి తిరుగ ప్రసరించు కిరణము Incidental ray యనంబడును. (3) ఆ యడ్డమున్న ఒపేక్బాడీ, రిఫ్లెక్టరు లేక పాయింటుసోర్సు అనంబడును.

(ర) అందుగన్పించిన ప్రతిబింబము Point image అనంబడును. ఒక అద్దపు గొట్టముపై వెలుతురు కిరణప్రసారము గల్గించినచో నటనుండి ప్రతిఫలించికల్గిన ప్రతిబింబము (చుక్కవంటి స్థానము) ను ఈపేరుతో వాడుచుందురు. (గ) గిల్టులేక కళాయి పూయంబడిన నిలువ్వుటద్దమునందు, ఎదుటనున్నవారి రూపము అద్దమునందు చక్కగ ప్రతిబింబించినది Real image అనంబడును. ఱ. అద్దమునందు గల హెచ్చుతగ్గు (పోతలోని తప్పులు) వలన, కళాయి చేయంబడిన అద్దమందు కన్పించిన, వంకరటింకర రూపములను బహుముఖము లని యందురు.

ఇంక నీసంగతులను చక్కగ మనస్సున కలవడ జేసికొని కండ్ల దృష్టి స్థితింబట్టి క్రిష్టల్సు రాళ్లతోగాని, వాని గుణలక్షణములతోనే చేయంబడుచున్న Lense glass తో గాని, దృష్టికి వ్రాతలు, వస్తువులు, దగ్గరవి, దూరపువి (Distance) చక్కగను, బలముగను అగుపడునట్లు, సులోచనముల నీ శాస్త్రవేత్తలు రచించుచున్నారు. (ఐస్లాండు స్పార్ చూడుడు). ఇందు క్రిష్టల్సు అన స్వచ్ఛతం గల్గిన Pebbles అని యెరుంగునది. అవి ఐస్లాండుస్పార్ రాళ్లు, ఫ్లోర్ స్పార్ రాళ్లు, మైకా అరగోనైటు రాళ్లు అనంబడునవియై యున్నవి.

**ఆప్త నేత్రవనము** — అయోధ్యరాష్ట్రములోని బహరైచ్ జిల్లాలోని ఇకొనాదరి పాడుగ (Fuhrer's MAI). పోల్పంబడినది. దీనిని హ్యూయనత్సాఙ్గంగు దర్శించినటుల వ్రాసియున్నాఁడు.

**ఆప్షన్** — వాణిజ్యసంబంధ పరిభాషాపదము. (Option) కొనుగోలు విక్రయముల కొక వర్తకుఁడొకవర్తకునకు కొంత సరకుగాని, కొన్ని వాటాలుగాని కొనుటకో, అమ్ముటకో యిచ్చిన ఆర్డరునందు చేర్చబడు స్వాతంత్ర్యము.

**ఆఫ్రికా ఖండము** — ఐరోపా దేశస్థులు దీనిని డార్కు-కాంటినెంటని హేళనగా ననుచుందురు. ఇది పూర్వగోళార్థములోనిది. ఉత్తరమున మధ్యధరాసముద్రము, తూర్పున రెడ్సీ హిందూమహాసముద్రము, దక్షిణమునను, పడమరను అట్లాంటిక్కు-మహాసముద్రమును దీనికి ఎల్లలు. పరిమాణమించుమించు ౧,౨౦,౦౦,౦౦౦ చతురపుమైళ్లని అంచనావేయఁబడినది. నైసర్గికముగ దీనికింజెందిన ద్వీపములు లేవు. మెడగాస్కరు ద్వీపము దీనికింజెందినదికాదని భూగోళశాస్త్రవేత్త లనెదరు. దీనికి దక్షిణపుకొనను గుడ్హోపు అగ్రము చనువది లెఱుంగనిది కాదు. ఆదిని నావికుండగు బర్తాలోమ్యూడయెజ్ దీనిని తుపాను అగ్రమని పేరిడెనటగాని, పోర్చుగలు దేశపు భూపతిగానుండిన జాన్ నరపతి దీనిం గను గొనుటనుండి ఇండియాదేశమునకు మార్గముం గనుంగొన వీలగునను నమ్మకము తనకు గలిగిన కతన దీనికిప్పటిపేర్చు తగునని పేరిడెనట.

ఆఫ్రికా మధ్యభాగములు ఒకపాటి ఎత్తుగల పీఠభూములు. వానికిని, సముద్రప్రాంత భూములకును నడుమ పర్వతపజ్తులు కలవు. ఖండము యొక్క దక్షిణభాగము ఇంచుక హెచ్చుతగ్గులతో సముద్రపునీటిమట్టముపై 3,గ౦౦ అడుగుల ఎత్తుకలదిగ నున్నది. ఇందున్న సహారా ఎడారి లోకప్రసిద్ధమగు నిసుకప్రదేశము. అచ్చటచ్చట దూరముగ నీటియూటయును, దానిం జుట్టి చిన్న చల్లని ప్రదేశమును, అందు కొలదిగ ఖర్జూరపుచెట్లును గల తావులుండును. వానిక్కి ఒయాసిస్సనియెదరు. వానిగుండా పలుదెసలకు ఒంటెలపై నడచిపోవు కాలిబాటలు కలవు. ఈ ఖండమున అట్లాసుపర్వతపజ్తి, కాంగుపర్వతపజ్తి లుపటాపర్వతపజ్తి మొదలగునవి కలవు. అబీసినియా పర్వతపజ్తియు, కిలిమన్జారో కెనియా పర్వతపజ్తియు చెప్పఁదగినవియే.

ఇంత విస్తారపు పరిమితిగల ఈ ఖండమునందు నదులు చాల తక్కువసంఖ్యగలవి. ఉన్నకొలది నదులు దాట శక్యముగాక అపాయకరముగ నుండును. ఇందు గొప్పనదికి నీలానది (Nile) అనుచున్నారు. ఇది ౪౩౦౦ మైళ్ల పొడవు కలది ఆల్బర్టున్యాసా యనుసరస్సున జన్మించి ఉత్తరముకు ప్రవహించుచు కొన్ని యుపనదులజలము లంగలుపుకొని మధ్యధరాసముద్రమున కలియుచున్నది. ఇందు వైట్నైలునది, బ్లూనైలునది, అతాదానది ఉపనదులై కలియుచున్నవి. కాంగో, ఆరెంజి, జాంబెసీనదులు ముఖ్యములు. ఈభూభాగమున న్యాసా, టాంగనాయికా, బంగ్వియో రూడోల్ఫు, తెహడాసరస్సులు కలవు. వీనికన్న చిన్నసరస్సులును పెక్కులు కలవు.

ఆఫ్రికా ఖండము మూడువంతులు టోరిడ్ జోనునందుంట వేడిప్రదేశమనియే చెప్పవలసి యుండును. ఎఱ్ఱసముద్ర ప్రాంతముల వేడి యధికము. ఈజిప్టుదేశమున నైలునది కిరుప్రక్కల నుండు ఫలవంతమగు ప్రదేశమున వర్షములు ఉండవు. నైలునది నీటియాధారమే లేకుండిన నది నిరుపయోగ వ్యవసాయస్థలమే యైయుండును. ఎఱ్ఱసముద్రమునంజేరు నదియే లేదు. సహారా ఎడారియందు వర్షములేదనియే చెప్పవలయును.

మధ్యభాగమున ఆఫ్రికాఖండమునందు నదుల ఇసుకలందు బంగారము దొరకుచున్నది. దక్షిణ ఆఫ్రికాదేశములందు బంగారము, రత్నములు గనులు కలవు. ఉప్పుగను లంతటను కలవు.

ప్రజలయందనేక జాతులవారుకలరు. హెమిటిక్ జాతి, కోప్టుజాతి అరబ్బీవారిసంతతివారు. నీగ్రోలు హాటూజాతులు, జూలూజాతి, కాపరుజాతి, అక్కాన్ జాతి మొదలగు జాతు లెన్నియో లెక్కింపనగును. చాల భాగము చిన్న చిన్న దేశములుగ ఐరోపా ప్రభుత్వముల వశమున నున్నవి. ఈజప్టుదేశము ఖడీవను బిరుదముగల భూపాలునిపాలనయందు లిమిటెడ్ మోనార్కీయై యున్నది.

**ఆఫ్రిడీ తెగ మహమ్మదీయులు** — ఏమ పఠాన్ తెగలోని అంతర్భాగము అఫ్ఘను స్థానమువైపు సరిహద్దుసీమలందుండువారు. వీరి యందెన్మిది అంతర్భాగములు కలవందురు. కోహాట్ మార్గమున నుండువారు ఆదమ్ఖేల్ తెగవారనియు, ఖైబరుకనుమ మార్గమునందు వసించువారు జక్కాఖేల్ తెగవారనియు చెప్పఁబడినది.

**ఆబుద్రలో విత్తనాలే అన్నీ** — ఆంధ్ర లోకోక్తి. అందరు సమానులే నని భావము.

**ఆబువ్వ తీగె** — ఇది వైద్యోపయోగకరమగు లత. దీని వేరు, ఆకులరసము, కషాయము, చూర్ణము వైద్యు లుపయోగింతురు. చేనుగనుండి అతిసారము, కుసుమరోగము, కుష్ఠువు, ఆమపైత్యము, గ్రహణి, చర్మరోగములు, ప్రమేహము, త్రిదోషములు వీనిని హరించును.

**ఆబ్స్క్యురేషన్ (Obscuration)** — వాణిజ్యసంబంధ పరిభాషా పదము. ఇది ఆబ్కారీ (కస్టమ్సు) ఉద్యోగులు సారాయమును (Spirit) పరీక్షించుతరి సారాయి సరియగు బలమునకును, పైవేసినబలమునకు గల భేదమును వివరించుటకు (అనఁగా భేదమునకు) పేరు.

**ఆబూ శిఖరము** — అర్బుద శిఖరము చూడుఁడు.

**ఆబెల్ కాబెల్** — ఇది రామేశ్వరము నందు గల రెండు గోరీల ప్రదేశము. ఆబెల్, కెయిన్ అనువారలు సోదరులు. ఆదముప్రవక్త సంతతి. ఈగోరీలు నలుబది యడుగులవి. ఒక

తావున పల్లమున ప్రక్కప్రక్కనే గలవు. ఇం దేశాసనములు లేవు. ఇందు కెయిన్, ఆబెలును చంపెనట. పరమేశ్వరుఁడు అర్హమైన యొక గుర్తు నిచ్చుదనుక నాశవమును మోసికొనుచు భూసంచార మొనర్చుటకు విధింపఁబడెనట. అనేక భూముల సంచార మొనర్చి డస్సి, కెయిన్ ఎట్ట కేలకు రామేశ్వరముకడ సీతావున కేతెంచువరకు రెండు కాకులు కలహించుచు నందొక కాకి రెండవదానిని జంపుటంగాంచెనట. తన విముక్తి కిదియె గురుతని కెయిన్ గ్రహించి అట నలుబది యడుగుల గోరీగోతింద్రవ్వి యం దాబెలును పూడ్చి తానును మృతిజెంది యాప్రక్కనే పూడ్చఁబడియెనట. ఇక్కాలమున నాగోరీలు ఒక మహమ్మదీయుముల్లా వశమున నున్నవి. ధనవంతమైన తావుకాదు.

**ఆఁబోతుకు ముకుదాడు** లొంగ తీయునదని భావము. ఆంధ్రలోకో

**ఆఁబోతుల కలహము ఆవుదూడలకు ప్రాణభయముం గల్గించును** ఆంధ్రలోకోక్తి.

**ఆభణకన్యాయుము** — సామెత చెప్ప బోయినట్లు అనుటయు అనగా "సామెతచెప్పినట్లు" అని అనుటయు, ఆసామెతఏదో తాఁజెప్పలేకపో వుటయు ననిభావము.

**ఆమడలు దూరమైతే అంతఃకరణాలు దూరముగునా?**— ఆంధ్రలోకోక్తి.

**ఆమము** — భుజించు పదార్థములు చక్కగ జీర్ణముగాక దుష్టపదార్థములోన నేర్పడి జిగురుగనై (తెల్లని బళ్లలుగ) ఘనీభవించుటవలన గల్గిన అసౌఖ్య వేదనకు ఆమ మందురు. ఆమాధిక్యత జ్వరమును గల్గించునని చెప్పఁబడినది. ఆమాతిసారము ఆమమువలననే గల్గునందురు.

**ఆమలకగ్రామము** — (సహ్యామలక గ్రామము) సహ్యాద్రిపై (పడమరకనుమలు) నుండుటంజేసి సహ్యామలకగ్రామ మనియు వాడుక యయ్యెను. చెన్నరాజధాని తిరునల్వేలి మండలమున నున్నది. తొల్లింటి పాండ్యరాజ్యములోని తావు. దీనింగూర్చి బ్రహ్మాండ పురాణమునను, నారసింహ పురాణమునను ప్రశంసలు కలవు.

**ఆమలకద్వాదశి** — ఉపేంద్రద్వాదశి చూడుఁడు.

**ఆమవసువు (క్షేత్రవృద్ధుఁడు)** — చంద్రవంశక్షత్రియుఁడు, నహుషమహారాజు సోదరుఁడు, తండ్రి ఆయువు, కుమాళ్లు సుహోత్రుఁడు కుశుఁడు.

**ఆమవిరేచనములు** — ఆమాతిసారము చూడుఁడు.

**ఆమాతిసారము** (గ్రహణి) — ఈరోగమున కాంగ్లమున డిసెంట్రీ (Dysentery) అని యందురు. ఆయుర్వేదవైద్యమున నీవ్యాధి అతిసారము (విరేచనముల) వ్యాధులలో నొకటిగ జెప్పంబడి, ఆమాతిసారమని పేరిడంబడినది. దీనినింకను జిగటవిరేచనము లనియు, రక్తగ్రహణి యనియు, నులిగడుపనియు, ఆమవిరేచనము లనియుఁగూడ వాడుచుండుట కలదు. ఆమాధిక్యత కారణముగ లోన ఒరసి, పుండై చీముగాని, చీము రక్తము కలసిగాని, మలముతో విరేచనమగుచుండును. కడుపునొప్పి, నిస్త్రాణము, ఒక్కొకతరి జ్వరము తగులుట దీనికి లక్షణములు, ఇది చాల మొండిజబ్బు. ఈవ్యాధి రెండు భేదములుగ నుండును. అమీబాయను సూక్ష్మజీవులవలన గల్గునది యొకజాతి. రెండవది ఆమాధిక్యమున గల్గునది. ఈ అమీబా సూక్ష్మజీవి, మనుష్యుల పెద్దప్రేగులలోనికిం జేరి, చిన్న కురుపులను ఒరపువలె గల్గించి, ప్రేగుల నుండి కార్జమునకుం జేరి, దానినిండా చీముతో కూడిన వ్రణములం గల్గించి గ్రుడ్లుపెట్టుచు, నభి

వృద్ధినందుచు, చీము విరేచనములం గల్గించును. ఈవ్యాధి ముదిరినకొలది పురుగులందు మార్పు గల్గును. కావననే చిరకాలము బాధించు వ్యాధిగ నిది చెప్పఁబడినది. మలముతో నీ సూక్ష్మ జీవులు వెలువడుచు రోగవ్యాపనమును గల్గించు నని తేలుచున్నది. ఆగ్రుడ్లు ఆహారపదార్థము లకుగాని, దాహోదకములకు గాని ఈగలు, పిల్లులు, కుక్కలు మొదలగు జంతువుల సంచార ముల సంపర్కమున చేరి, మానవశరీరమునందు జేరుకొని రోగమును వ్యాపింపంజేయుచుండెడిని. తడిబట్ట నెక్కువగా ధరించువారును, చలిగాలికి గురి యగువారును, రోగమున కతిసులభముగా పాల్పడుదురని పరిశీలకు లనుచున్నారు. రక్త గ్రహణి కణికవంటి రూపముగల సూక్ష్మజీవివలన గల్గుచున్నది. ఇదియు పైవిధముననే వ్యాపించు చుండునట. రోగి బట్టలు, పాత్రలు రోగమును వ్యాపింపఁజేయును. ఈగలును వ్యాపింపం జేయును. ఉదరభాగమును ఉన్నివస్త్రముచే గప్పి వెచ్చనుంచుట మంచిదని చెప్పంబడినది. (అంటువ్యాధులు, సూక్ష్మజీవులు, అమీబా చూడుఁడు).

**ఆముక్తాభరణసప్తమి** — భాద్రపద శుద్ధ సప్తమి. పర్వదినము.

**ఆముదపుచెట్టు** - లా. Recinus communis. ఇంగ్. Castor Tree. సం. ఏరండ, పంచాంగుల, వర్ధమాన. చిట్టిఆముదపు చెట్టునకు రుద్రకమని పేరు. ఆముదపుచెట్టు పెద్దగింజలు కలదానిని పెద్దఆముదపుచెట్టు అనియు, చిన్నగింజలు కలదానిని చిట్టిఆముదపు చెట్టు అనియు ఆముదపుచెట్లు ద్వివిధము. రెంటి యొక్క గుణలక్షణములు ఒకటియేగాని చిట్టా ముదము ఆయుర్వేదవైద్యవిధానమున నెక్కువ బలకరముగ పనిచేయునని చెప్పఁబడినది. మఱియు నీచిట్టాముదమునకు కొన్ని వనౌషధులు, రస ములంజేర్చి మందాముదమని నందురు. ఇది పసిపిల్లలకు పట్టిన విరేచనమై ఆరోగ్యకరముగ నుండి పెక్కుజబ్బులను రాకుండ గాపాడునందురు. ఆముదముయొక్క గుణములు:- విరేచనము జేయును, వేడిచేసి అర్చును, జఠరమును బల పర్చును, ఊపిరిగొట్టునొప్పి నడంచును, పొత్తి కడుపును శుభ్రపర్చి అచటఁ బుట్టెడిరోగములు, వాతగ్రంథులందలి దోషములు, అండవృద్ధి, అంతర్వృద్ధి హరించును. రక్తముగూడి గట్టిపడి నెడిపోయిన దోషనిలయమును గరగించును. శరీరమునందలి దుష్టజలనిలయములను కదల్చి వెడలించును. శిరోవాతమును హరించును. నరములను శుభ్రపర్చి బలపర్చును. మూత్రపు తిత్తిలోని దోషములు, నడుములోనిదోషములు, స్త్రీలబుతురక్తదోషములు నివారించును. శ్లేష్మ, గుల్మ, మూలశంఖ, విషమజ్వర, దద్రు, గర్భస్థ కీటక దోషములఉధృతమును శాంతింపఁజేయును. వాతదోషము లడంచును. రసదోషములు శిరో వాతములు హరించును. ఆముదపు ఆకుల గుణము:- వేడి, పైత్యముజేయును. వాతము, శ్లేష్మమును నివారించును. తలపోటు నివారించును. ప్రసవించిన స్త్రీలకు (ఆముదముతోచరిమి వెచ్చ జేసి) పైకట్లు కట్టుచుండుటవలన పాలుపడును. పొత్తికడుపుపైఁ గట్టుటవలన బుతురక్తదోషము వెడలఁజేయును. తల్పైకట్టుటవలన శిరో వాతము, తలనొప్పి, మెదడులోనివేడి హరించును. ఆముదపువేరు కషాయముచేసి లోనికిచ్చిన గొప్పవాతములు, శ్లేష్మములు, హృద్రోగములు శమించును. (ఎండుమిరపకాయలు పొగాకులతో నూరి) గుజ్జములకుం దినిపించిన కడుపునొప్పి తగ్గును. ఆముదపుపువ్వు- వేడిచేసి, వాతము హరించి దేహపుష్టి, అగ్నిదీప్తినిచ్చును. ఆము దపుకాయలు- గుల్మములు(కడుపులోని బల్లలు) మూలవ్యాధి నివారించును. దీనికి విరుగుడు

పుదీనా అని చెప్పఁబడినది. మఱియు, అతిసార దోషము, ప్రమేహ, అపస్మార, ఉన్మాద విష దోషములు గలవారును, విషూచి,రక్తపైత్యము, తీవ్రజ్వరము, చర్ది, మూర్ఛ బాధలుకలవారును ఆముదము త్రాగకూడదని చెప్పఁబడినది.

**ఆముదారియానది (ఆక్ససునది)** - (మధ్యతురుష్కస్థానము చూడుఁడు). ఈ నదికి తొల్లింట వేఱ్వేఱు కాలములందు వక్షునది, సుచక్షునది, చక్షునది, ఇక్షునది, అశ్మన్వతీనదియని పేర్లుండెను. ఇది శకద్వీపముగుండా ప్రవహించు నదిగాఁ జెప్పంబడినది. ఇంకను భగవద్గంగ, పటలగంగయనుపేర్లు భాగవతమునఁజెప్పంబడినవి.

**ఆమోద షట్పద న్యాయము** — వాసనంబట్టి తుమ్మెద పూవులున్న తావులకు వెదకికొనుచు పోవుటందెల్పు న్యాయము.

**ఆమ్నాయములు** — ఆమ్నాయమనిన విద్యకర్థము. ఉపదేశమగు విద్యయని భావము. ఇది శాక్తేయ సంబంధమువలె నుండును. పరమేశ్వరుఁడగు సదాశివుని ఆరుముఖములనుండి వెలువడినవి ఆమ్నాయము లనంబడినవి. తూర్పుదిశ ముఖము నుండి పూర్వామ్నాయము, దక్షిణదిశ ముఖము నుండి దక్షిణామ్నాయము, పశ్చిమదిశ ముఖము నుండి పశ్చిమామ్నాయము, ఉత్తరదిశ ముఖము నుండి ఉత్తరామ్నాయము, ఊర్ధ్వముఖమునుండి ఊర్ధ్వామ్నాయము, అధోముఖమునుండి అనుత్తర లేక అధః ఆమ్నాయమును వెలువడినవని చెప్పఁబడినది. ఈ షడామ్నాయములం గూర్చి సమయాచార తంత్రమునందలి ద్వితీయపటలమున నిటుల వివరింపఁబడినది. శ్లో॥ శ్రీవిద్యా భేదసహితా- తారాచత్రిపురాతథా। భువనేశీచాన్నపూర్ణా- పూర్వామ్నాయే ప్రకీర్తితాః। బగళాముఖీచ వసీనీ- త్వరితాధనటాతథా (వాలభైరవి)। మహిషఘ్నీ మహాలక్ష్మీ- దక్షిణామ్నాయకీర్తితాః। మహాసరస్వతీవిద్యా- తదావాగ్వాదినీపరా। ప్రత్యంగిరా భవానీచ- పశ్చిమామ్నాయకీర్తితాః॥ కాలికాభేదసహితా- తారాభేదైశ్చసంయుతా। మాతంగీ భైరవీ ఛిన్నా- తథాధూమావతీ పరా। ఉత్తరామ్నాయకథితాః- కలా శీఘ్రఫలప్రదాః। సమస్తభేదసహితాః- కాలికాయ్యఃప్రకీర్తితాః॥ ద్వావింశత్యక్షరీతాసాం- దక్షిణామ్నాయకీర్తితాః। ఏకజటాషడామ్నాయె- మహామోక్షప్రదాయినీ॥ తత్పరా పరమావిద్యా- నవిద్యాంతర గోపితా। పరప్రధానసంతాశ్చ ఊర్ధ్వామ్నాయేప్రకీర్తితాః॥ ఊర్ధ్వామ్నాయోహ్యధశ్చైవ- కేవలం మోక్షదోభవేత్। ధర్మార్థ కామమోక్షార్థేఆమ్నాయాన్యేప్రకీర్తితాః॥

**ఆమ్రసేక పితృతర్పణ న్యాయము**- మామిడిచెట్లకు నీరువోయుటయందు పితృతర్పణ మొనర్చినట్లు బాధ్యత, భక్తి, శ్రద్ధ లేక కార్యములు నెరపుటందెల్పుట కీన్యాయమువర్తించును.

**ఆమ్రాన్పృష్టః కోవిదారానాచష్టే తిన్యాయము** — మామిడిచెట్లం గూర్చి యడిగితే కోవిదారములంగూర్చి ప్రత్యుత్తర మిచ్చినట్లని యర్థము. అడిగిన ప్రశ్నకు సరియగు ప్రత్యుత్తరము లేక వేఱొక ప్రత్యుత్తరము వచ్చుటయం దీన్యాయము వర్తించును.

**ఆమ్రేఫలార్థే నిమిత్తే ఛాయాగన్ధ ఇత్యనూత్పద్యేతీతి న్యాయము** - మామిడిచెట్లు ఫలములకై ముఖ్యముగ నాటఁబడినను చల్లని నీడయు, ఇంచుక పరిమళముంగూడ నవి కల్గించును. ఒకకార్యమునకై చేయఁబడినపని ఇతర కార్యములంగూడ జేయునని భావము. ఫలవత్సహకార న్యాయమునకును ఇదియె యర్థము.

**ఆమ్లఫల పంచకము** — (ఆమ్లపంచకము) ఆయుర్వేదవైద్యమున గజనిమ్మ, పుల్ల

నారింజ, ఆమ్లవేతసము (అనగా నిమ్మచెట్టువంటి ఒకజాతిచెట్టు, మతాంతరమున బెత్తపుకాయల చెట్టు), చింతచెట్టు, మాదీఫలముచెట్టు పండ్లకు ఆమ్లపంచఫలములని పేరు. ఇంకను కొందఱు మతాంతరముగ రేగుపండ్లు, చింతపండు, చుక్కకూర, ఆమ్లవేతసఫలము, పుల్లదానిమ్మపండ్లకు ఆమ్లపంచఫలము లనిరి.

**ఆమ్లవర్గము** — ఆయుర్వేద వైద్య శాస్త్రమున పుల్లచెంచలి, ఆమ్లవేతసము, నిమ్మ, నారింజ, మాదీఫలము, దాడిమ, వెలగ, వాక (పండ్లకు) ఆమ్లవర్గమని పేరు.

**ఆయతనాజ్ఞానములు పండ్రెండు** వైభాషిక బౌద్ధమతము చూడుడు

**ఆయతనములు** — (ద్వాదశాయతనములు) బౌద్ధమతమునందుజ్ఞానేంద్రియములు ౫-ఘ్రాణ, జిహ్వా, చక్షు, శ్రోత్ర, త్వగింద్రియములు. కర్మేంద్రియములు ౫ - వాక్కు, పాణి, పాద, పాయూపస్థలు, ౧౧. మనస్సు, ౧౨. బుద్ధి ఈ పండ్రెండును ద్వాదశాయతనములనిరి. ఇంకను మతాంతరమున జ్ఞానేంద్రియము లైదు, తన్మాత్రలు ౫ (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు), ౧౧. మనస్సు, ౧౨ ధర్మాయతనమును కలిపి ద్వాదశాయతనములని కొందఱనిరి. ఈ ద్వాదశాయతనములందు ఒక్కొక్కటి ౧. కామతృష్ణ (కోర్కెలనెడి విదాహము), ౨. భవ (సంసార) తృష్ణ, 3. విభవ (వైభవము) తృష్ణయనిమూడేసి తెఱంగులుగ నుండెడిని. కాన (౧౨ × 3=3౬) ముప్పదియారుగ బౌద్ధమత గ్రంథములందు "స్రోతష్షట్త్వింశతి" యని పేర్కొనఁబడినవి.

**ఆయతి** — తండ్రి మేరువు. భర్త మృకండుఁడు. అతఁడు ధాత కుమారుఁడు.

**ఆయిల్ పాం, నూనెచెట్టు** (Oil-Palm) — ఈచెట్టు ముప్పదియడుగుల ఎత్తున పెరుగును. ఈతచెట్టువలె నుండును. మట్టలు మఱి పదునేను అడుగుల పొడవుగలవి. ఎఱ్ఱటి కోలని కాయలం గాచును. వానిని నీటియం దుడకబెట్టి పిసికిన వెల్లవంటి ముద్ద (పేశము) వచ్చును. దానింగాచి నూనెతీయుదురు. దీని పిక్కలనుండియు నూనె వచ్చును. దీని నూనె సబ్బులుచేయుటయం దుపయోగించుచున్నారు.

**ఆయిల్సు** (Oils) చమురులు—ఆయిల్సు అనిన, నూనెలని యర్థము జెప్పుచున్నారు కాని పాశ్చాత్త్యుల భావమునగల యర్థమిది కానేరదు. భరతదేశమున నూనెలు జిడ్డుగల ద్రవపదార్థములుగను, నూనెలు, నేతులు, ఆముదములు అని త్రివిధభేదములు గలవిగను తలంపఁబడుచున్నవిగాని, పాశ్చాత్త్యాభిప్రాయములం దట్లు గాదు. ఆయిల్సు నాల్గు తరగతులుగ విభజింపఁబడినవి. అవి ౧. Essential oils, ౨. Mineral oils, 3. Vegetable oils, ४. Animal oils అని. ౧. Essential oils-ఇవి మొక్కలనుండియు, ఆకులు, పువ్వులు మొదలగు వానినుండియు, చెట్లనుండియు తీయఁబడునవి. పరిమళమునకై ఉపయోగింపఁబడునవి. కొన్ని పండ్లనుండికూడ లభించునట. ౨. Mineral oils-ఇవి భూమినుండి తీయఁబడు పెట్రోలియం మొదలగునవి, రష్యా బర్మా, పారశీకము మొదలగు దేశములందునను, అమెరికా సంయుక్తరాష్ట్రము లందునను విస్తారముగా దొరకుచున్నవి. 3. Vegetable oils- ప్రత్తిగింజలు, బాదంగింజలు, నువ్వులగింజలు, ఆముదపుగింజలు మొదలగువానినుండి పిండి తీయఁబడు చమురులు, Olive oil అనునదియు ఈ తెగకుం జెందినదియే. ४. Animal oils-ఇవి తిమింగలములోని క్రొవ్వునూనె, Cod liver oil మొదలగు జంతువులనుండి తీయఁబడు నూనెలు, క్రొవ్వులు మొదలగునవి.

**ఆయువత్సగోత్రము** — శాండిలగణము చూడుఁడు.

**ఆయయాతి** — చంద్రవంశ క్షత్రియుఁడు. తండ్రి నహుషమహారాజు. తల్లి ప్రియంవదా దేవి.

**ఆయాస్య ఉపగణము**—ఇది ఆంగీరస సంతతియందలి గౌతమగణములోని యొక ఉప గణము. ఇందు ఇరువదియొక గోత్రములు కలవు. ౧. ఆయాశ్య, ౨. కఠోర, ౩. కాత్రముగ్రిక, ౪. కారేణి, ౫. కౌశిక, ౬. కాక్షీవ, ౭. కిలాలి, ౮. క్షౌమారవత్య, ౯. తాండి, ౧౦. దర్భి, ౧౧. దేవకి, ౧౨. నైకరిష్టి, ౧౩. పార్థివ, ౧౪. భౌభ్య, ౧౫. మూఢరథ, ౧౬. హేయ, ౧౭. వాత్సి, ౧౮. శ్రోణీచేషక, ౧౯. సత్యతి, ౨౦. సైవ్రదేహ, ౨౧. సైమకి. ఈ (ఆయాస్య ఉపగణ) గోత్రములకుఁ బ్రవరరూపములు- ౧. ఆంగీరస, ఆయాశ్య, గౌతమ. ౨. ఆంగీరస, ఔతథ్య, గౌతమ. ౩. ఆంగీరస, ఔతథ్య, ఔసిజ.

**ఆయాస్య గోత్రము** ఆయాస్య ఉపగణము చూడుఁడు.

**ఆయాస్య గోత్రము** ఔతథ్య ఉపగణము చూడుఁడు.

**ఆయుతజిత్తు** — యదువంశపు క్షత్రియుఁడు. సహస్రజిత్తు కనిష్ఠసోదరుఁడు.

**ఆయుతాయువు** — కురువంశ క్షత్రియుఁడు. రథికుని కుమారుఁడు. ఇంకను సింధు ద్వీపుని కుమారుఁడును కలఁడు. ఇతనికి భంగా సరియని నామాంతరము కలదు. పుత్రుఁడు ఋతుపర్ణుఁడు.

**ఆయుధములు** — యుద్ధకాలమున శరీరమునందు ధరించి యుద్ధమొనర్పనగువాని కాయుధములని పేరు. ఇందు తుపాకులు,పిస్తోళ్లు, రివాల్వరులు, కత్తులు, కఠారులు, బాకులు, ఈటెలు, బల్లెములు, గండ్రగొడ్డళ్లు, గదలు మొదలగునవి యుండును. ఫిరంగులు ఘన్నులు) ఆయుధములు కానేరవు. ఇవి యుద్ధ పరికరము లనంబడుచున్నవి. దేవతలకు త్రిశూలము, యమపాశము, ముద్గలము, తోమరము, చక్రము, గద, అంకుశము మొదల గునవి భరతదేశమున నాయుధములుగఁ జెప్పఁ బడినవి. భిండివాలము, క్రకచము మొదలగు కొన్ని యాయుధములును చెప్పఁబడియున్నను వానింగూర్చిన వివరములు తెలియకున్నవి. కాలములు మారుటతో నాయుధములును మారినవి. ఆయుధములు ముప్పదిరెండని చెప్పఁ బడినవి. (వీటింగూర్చి ధనుర్విద్య చూడుఁడు.)

**ఆయుర్దాయ రేఖ** — పురుష స్త్రీ సాముద్రికములు చూడుఁడు.

**ఆయుర్వేద పంచపల్లవములు** — పంచపల్లవములు చూడుఁడు.

**ఆయుర్వేద మానము**—ఆయుర్వేద వైద్యవిధానమున ఈక్రింది రీతిని తూనికలు చెప్పఁబడినవి.

౬ ఆవగింజల ఎత్తు- ౧ యవప్రమాణము.

౩ యవల ఎత్తు (యవధాన్యము)- ౧ రతి (దీనిని గురిగింజయెత్తుయందురు).

౬ రతుల ఎత్తు (గురిగింజలు లేక గులివెందగింజలు)- ౧ అణా.

౧౦ రతుల ఎత్తు- ౧ మాషప్రమాణము (మినపగింజ).

౪ మాషముల ఎత్తు- ౧ ధరణము (దీనికింకను టంకమనియు, కానమనియుం బేరులుకలవు).

౨ ధరణముల ఎత్తు- ౧ తులము (దీనికింకను వటకమనియు, కషూర్ద్రకమనియు, ద్రంఖనమనియుం బేరులుకలవు).

౨ తులములు- ౧ కర్షము (దీనికింకను అక్షమనియు, ఉదుంబరమనియు, కరమధ్యమనియు, కవడగ్రహాయనియు, కించిత్తనియు, చిమక యనియు, పానియనియు, పానిమానికయనియు, పానితలయనియు, పిచు యనియు, విడాలపద యనియు, షోడశికయనియు, సువర్ణయనియు, హంసపదయనియుఁ బేర్లుకలవు).

౨ కర్షములు- ౧ కు (దీనికింకను అష్టమిక యనియు, అర్ధపలమనియుం బేర్లుకలవు).

౨ కుక్తులు- ౧ పలము (దీనికింకను చతుర్థిక యనియు, ముష్టియనియు, ప్రకుంచయనియు, షోడశియనియు, విల్వ లేక బిల్వయనియు బేరులుకలవు).

౨ పలములు- ౧ ప్రశ్రిత లేక ప్రశ్రితియనియు నందురు).

౨ ప్రశ్రితములు- ౧ అంజలి (దీనికింకను కుడవ యనియు, అష్టమానమనియు, అర్ధకరవనియుం బేర్లుకలవు).

౨ అంజలులు- ౧ కరవ (దీనికింకను శేరు లేక మానికయనియుం బేరులు వాడుకయందున్నవి).

౨ కరవలు (శేరులు)- ౧ ప్రస్థము.

౨ ప్రస్థములు (లేక ౪ శేరులు)- ౧ ఆఢకము (దీనికింకను కుంచమనియు, భాజనమనియు, •మనియు, పాత్రమనియు కంచమనియుం బేరులు కలవు).

౨ ఆఢకములు- ౧ ద్రోణము (దీనికింకను కలశము, ఆర్మ్మణము, ఉన్మనము, ఘటము, రాశి యను పేర్లుకలవు).

౨ ద్రోణములు- ౧ కుంభము, లేక శూర్పము.

౨ కుంభములు- ౧ ద్రోణి లేక గోని (బస్తా).

౪ ద్రోణములు- ౧ ఖారి.

ఇంకను ౧౦౦ పలముల నొక తులమనియు, ఇన్నూరు పలముల నొక భారమనియు కొన్ని సీమలందు వాడుక గలదు.

**ఆయుర్వేదము** — దీని నాయుర్వేద వైద్యవిధానమనియు ననుట కలదు. ఆయు విందతి వేత్తి వా ఆయుర్వేదః అనివ్యుత్పత్త్యర్థము. అనగా ఆయుర్వుంగూర్చిన జ్ఞానము. ఆయు వన ప్రాణిశరీరమునందు వ్యాపించియుండుకాలమాయు కాలమనంబడుచున్నది. వేదమనజ్ఞానమనియర్థము. ఔషధాది ప్రతిక్రియలచే, ఆయువునకుం గల్గు దోషముల నివారించి ఆయుకాలమును రక్షించునది గాన ఆయుర్వేదవైద్యమని చెప్పఁబడుచున్నది. అథర్వణ వేదమున కాయుర్వేదము ఉపవేదముగ జెప్పఁబడినది. మఱియును ఋగ్వేదమున చికిత్సాబోధకశృతులు కొన్ని కానంబడుచుంట, నాయుర్వేదమును ఋగ్వేదమంతటి ప్రాచీనమైనదే యని తెలియుచున్నది. ఆయుర్వేదమును, పరమేశ్వరుఁడు విధాతకును, విధాత దక్షప్రజాపతికిని, అతఁ డశ్వనీదేవతలకును, వా రింద్రునకును, నాతం డాత్రేయులకును, ఆత్రేయు లగ్నివేశులకును, అగ్నివేశులు జాతూకర్ణ, ధన్వంతరి, భేడ, చరక, శల్యశ్రుతాదిఋషులకును, పరంపరగ నుపదేశించిరని చెప్పఁబడినది. ఇందు విధాతయొ లేక ఇందలివా రెవ్వరోగాని, శృతి రూపకముగ నుండిన నీయాయుర్వేదతంత్రమును ౧. శల్యతంత్రము మొదలగు అష్టతంత్రములుగ విభజించి వేఱ్ఱేఱు గ్రంథములుగ రచించిరని చెప్పఁబడినది కాని, అట్టి గ్రంథములు గానవచ్చుటలేదు. ఇవి వీనికి శ్లోకరూపకములనియు, లక్ష గ్రంథమనియు, బ్రహ్మసంహిత యని పేరనియు మాత్రమే తెలియుచున్నది.

౧. శల్యతంత్రము- దీనికాంగ్లమున Surgical Treatment అనియుందురు. ఇది శరీరమున కారణాంతరములచే శరీరమునందు చిక్కిన అన్య పదార్థములవలనఁ గల్గెడి బాధానివృత్తికైన శస్త్రవిధానము. ఇంకను విషవ్రణములు, మానని మొండిజాతి కురుపుల నుండి ఆయువుకు

భంగమురాకుండ రక్షించుటకు వలయు శస్త్రచికిత్సల నొనర్చు విధానము. (శస్త్రచికిత్స చూడుఁడు).

౨. శాలాక్యతంత్రము - దీని నాంగ్లమున Eye Diseases etc. అని యందురు. ఇది భుజములకు పైభాగమున గళము, నేత్రములు, కర్ణములు, నాల్క, దంతములు, ముఖము, దౌడలు, మెదడు మొదలగు భాగములందు గల్గెడి రోగముల కుపశాంతులం దెల్పునది.

3. కాయచికిత్సాతంత్రమున దీనికాంగ్లమున Treatment of General Diseases అని యందురు. ఇది శరీరమంతటను ఒకేవిధముగ నొకేకాలమునందు బుట్టెడు జ్వరములు మొదలగు రోగముల కుపశాంతులం దెల్పునది. ఇందు అతిసారము, క్షయ, రక్తపైత్యము మొదలగు కొన్ని రోగములు చేరియుండును.

౪. భూతవిద్యాతంత్రము - దీనికాంగ్లమున Mental Diseases అని యందురు. ఇది మనోభ్రమ సంజాత రోగములం గుదుర్చు సాధనముల వివరించెడిని.

౫. కౌమారభృత్యతంత్రము - దీనినాంగ్లమున Treatment of Children అనియెదరు. ఇది చంటిపిల్లల రక్షణ, పాలపిల్లల రోగములు ఉపశాంతులు తెల్పునది.

౬. అగదతంత్రము - దీని నాంగ్లమున Texicology అనియు నందురు. ఇది ఎలుక కాటు, సాలెపురుగు కాటు, పాముకాటు, తేలు కుట్టు, వెఱ్ఱికుక్కకాటు, నల్లికళ్లపాము ఊదుట మొదలగు విషజంతుబాధల కుపశాంతులం దెల్పునట్టిది.

౭. రసాయనతంత్రము - దీని నాంగ్లమున Science of Rejuvenation అనియెదరు. ఇది ముదిమి, రోగాతిశయము మొదలగు కారణముల శరీరము పటుత్వము తగ్గియు బలహీనమై శరీరేంద్రియములు సరిగా పనిజేయజాలకుండుతరి పరిహార విధానముం దెల్పునది.

౮. వాజీకరణతంత్రము - దీని నాంగ్లమున Science of Aphrodisiacs అనియెదరు. ఇది కారణాంతరముల క్షీణమగు రేతస్సును బలపర్చి పుష్టింగల్గించు నౌషధవిధానముం దెల్పుభాగము.

వీనిపై వేర్వేఱు వైద్యగ్రంథముల వేర్వేఱు ఋషులు రచించియున్నారు. అందు ఆత్రేయ, అగ్నివేశ, భేడాదిఋషులు రచించిన కాయ చికిత్సా తంత్రమును గూర్చిన గ్రంథములకు ఆత్రేయసాంప్రదాయమని పేరుకల్గెను. ఇటులనే ధన్వంతరి, సుశ్రుత, ఔపధేనవ, ఔరభ్ర, గోపురక్షిత, ప్రభృతి ఋషిసత్తములచే రచింపఁబడిన శల్యతంత్రగ్రంథములకు ధన్వంతరిసాంప్రదాయమని పేరుకల్గెను. ఈ ఆత్రేయధన్వంతరిసాంప్రదాయములను వైద్య విద్యావిశారదులు వైదిక సాంప్రదాయములనియెదరు.

ఇటుల వేదముల కాలమున నభివృద్ధినందిన అగస్త్యధన్వంతరి సాంప్రదాయములు వైదిక సాంప్రదాయము లనంబడినట్లే, తంత్రముల కాలమున (తాంత్రికయుగమున)నాగార్జునాదిసిద్ధులచే వృద్ధినొందింపఁబడి, ఖనిజవస్తు సమ్మేళనముతో గూడిన వైద్యకపద్ధతులకు, ఆగ్రంథములకు తాంత్రికసాంప్రదాయమని పేరు. మఱియు నీ తాంత్రికసాంప్రదాయమునే రససాంప్రదాయమనియు నందురు. ఇంక దక్షిణదేశమున నగస్త్యసాంప్రదాయమని వేఱొక విధానమున వైద్యము కలదు. ఆ వైద్యవిధానమున కగస్త్యవైద్యమనియుం బేరు వాడుచుందురు. (అగస్త్యవైద్యము చూడుఁడు). దీనిని సిద్ధవైద్యమనియు నందురు. ఇంక నాయుర్వేద వైద్యగ్రంథకర్తలగు పూర్వులలో ముఖ్యులను, వారి గ్రంథములను వివరించి ముగింతుము.

౧. అగ్నివేశుఁడు-ఈఋషి రచించిన గ్రంథమున కు పేరేమో తెలియకున్నది. కాని దానిని చరక మహాముని సవరించి విడదీసియుంట చరకసంహిత యను పేరంబరగుచున్నది. దానింగూర్చి ముందు వివరింతుము.

౨. అశ్వనీదేవతలు- దేవవైద్యులని పేరందిన వారు. వీరు కాయచికిత్సను, శస్త్రచికిత్సను వివరించు గ్రంథములను రచించిరట.

3. ఆత్రేయుఁడు- ఈఋషిసత్తముఁడు రచించినది ఆత్రేయసంహిత. మిగుల పురాతన గ్రంథమని పేరందినది. ఐదుభాగములును, నలువది యారువేల శ్లోకములుగల మహాగ్రంథము, ప్రమాణగ్రంథము.

౪. గోపాలదాసు- ఈతఁడు చికిత్సాసార మను గ్రంథమును రచించెను.

౫. చక్రదత్తుఁడు- ఈతఁడు చికిత్సాసంగ్రహమును రచించినవాఁడు.

౬. చక్రపాణి- ఈతఁడు చక్రదత్త, ముక్తావళి యను గ్రంథములను రచించినవాఁడు.

౭. చరకమహాముని- తండ్రిపేరు విషుదముని. కాశీపట్టణమున క్రీ. పూ. 3౨౦ సంవత్సరప్రాంతమున జన్మించినవాఁడనియు, అక్కాలమున ఘనవైద్యుఁడనియు, ఆదిశేషుని యవతారముగఁ దలంపఁబడినవాఁడనియు, జనులచే నెన్నఁబడెనని ప్రతీతి కలదు.

ఈతఁడగ్నివేశుఁడురచించిన సంహితను సవరించి శ్లోకస్థానము, కల్పస్థానము, సిద్ధిస్థానము, నిదానస్థానము, విమానస్థానము, శరీరస్థానము, ఇంద్రియస్థానము, చికిత్సాస్థానము నని అష్టభాగములుగ విభజించి, నూటయిరువది యధ్యాయములుగ నొనర్చెననియు, నాఁటనుండి యాతని పేరంబరగుచున్నదనియు చెప్పుదురు. ఇది కాయచికిత్సలను వివరించుటయం దుత్తమ గ్రంథమని పేర్వడసినది.

అరబ్బులును, వారినుండి గ్రీకులును, దీని ననువదింపఁజేసి తమ భాషలలోనికి దీనిం దీసికొనిరనియు, అది క్రీ. వె. ఎన్మిదవ శతాబ్దకాలమనియు వాడుకలు గలవు.

౮. భట్టమోహేశ్వరుఁడు- వైద్యామృతమును రచించెను.

౯. భావమిశ్రుఁడు- ఈతఁడు మద్రదేశనివాసి యనియు, క్రీ. వె. ౧౫౫౦ సంవత్సరము కాలమునాఁటివాఁడనియు, పిదప కాశీయందు వసించుచుండెననియు, పెక్కండ్రకు విద్యఁగరపినవాఁడనియుఁ జెప్పఁబడినది. ఈతఁడు భావప్రకాశ మను గ్రంథమును రచించెను. అందు, అప్పటి పూర్వపువారగు ఘనవైద్యుల యనుభవ విశేషములను సంగ్రహముగ పొందుపరచెనట.

౧౦ మాధవాచార్యుఁడు- ఈమహావిద్వాంసుఁడు సన్యసించి విద్యారణ్యస్వామి యని పేరందిన ప్రఖ్యాతపురుషుఁడు. ఈతఁడుమాధవనిదాన మను వైద్యగ్రంథము రచించెను. ఇతఁడు నిట్లే మాధవవేదార్థ ప్రకాశమను గ్రంథమును, మాధవవృత్తి, భాషావిషయికవృత్తి గ్రంథమును, కాలమాధవీయమును,జ్యోతిష గ్రంథమును, వ్యవహారమాధవమను న్యాయశాస్త్ర విషయిక గ్రంథమును కూడ రచించినవాఁడు. పరాశరస్మృతికి వ్యాఖ్య వ్రాసినవాఁడు. అది ఇప్పుడు "పరాశర మాధవీయమను పేరఁబరగెడిని. రోగోత్పత్తి రోగవివరణములం దెల్పుటకుమాధవనిదానమును మించిన గ్రంథమింకొకటి లేదందురు. రోగనిదానమున మాధవాచారికిని, యేయే అవస్థలం దేయే రీతుల రోగిని సంరక్షింపనగునో ఆ వైద్యవిధుల నెరింగించుటకు వాగ్భటాచారికిని, చికిత్సలందెల్ప చరకాచార్యునకును సాటివారింక లేరని వైద్య శాస్త్రవిదు లనెదరు.

౧౧. లోలంబరాజు- ఈతఁడు సద్వైద్యజీవన మను వైద్యగ్రంథమును రచించెను. దీనికి లోలంబరాజీయమనియు వాడుక పేరుకలదు.

౧౨. వాగ్భటాచార్యుఁడు- ఈమహానీయుఁడు సింధుదేశమున జన్మించినవాఁడు. క్రీస్తు మునుపు రెండవ శతాబ్దమునాఁటివాఁడందురు. అష్టాంగ హృదయమను గ్రంథము రచించినవాఁడు. ఇతని పూర్వ వైద్యవిద్యావిశారదుల యనుభవముల నుండి సంస్కరించినతీరున తనగ్రంథము రచించిన వాఁడు. మఱియు నీతఁడు చరక, సుశ్రుత, అగ్ని వేశ, భేడర్షులకు తర్వాతివాఁడట.

౧౩. శార్ఙ్గధరుఁడు- ఈతఁడు రచించినది శార్ఙ్గధరసంహిత. ఇందిరువది యాధ్యాయములు కలవు. ఉపయుక్తంబులగు పెక్కువిశేషము లీగ్రంథమునఁ జెప్పఁబడినవి.

౧౪. సుశ్రుతుఁడు-ఈతఁడు చరకుని తర్వాత వాఁడట. శ్రీరాముని సమకాలికుఁడగు విశ్వామిత్రుని సుతుఁడనియు, కాశీరాజును, ధన్వంతరి యొక్క యవతారముగ నెన్నఁబడి శస్త్రవిద్య యందకాలమున మహానిపుణత గలవాఁడని పేరందిన దివోదాసునకు శిష్యుఁడై వైద్యవిద్య నభ్యసించినవాఁడనియు నందురు.

ధన్వంతరి యుపన్యాసమునుండి సుశ్రుత సంహిత యను గ్రంథమును రచించెననియు చెప్పుదురు. ఇందు శస్త్రచికిత్సయు శరీరశాస్త్రమును వివరింపఁబడినది. ప్రమాణగ్రంథము, యంత్రసాధనములు, శస్త్రములు మొదలగునవి విపులముగఁ జెప్పఁబడినవి. (శస్త్ర చికిత్స చూడుఁడు). ఇంకను రసరత్నాకరము, నాగార్జునీయము మొదలగు వైద్యగ్రంథములు పేర్కొనఁదగినవి కలవు. (కల్పచికిత్సచూడుఁడు).

**ఆయువు** (మహారాజు) — తండ్రి పురూరవ చక్రవర్తి (చంద్రవంశ క్షత్రియుఁడు). తల్లి ఊర్వశియను నప్సరస్త్రీ. పుత్రులు ౧. నహుషుఁడు, ౨. క్షత్రవృద్ధుఁడు, ౩. రజి, రంభుఁడు, ౫. అనేనస్సు అనువారలు. రాజధాని ప్రతిష్ఠానపురము. దీనిస్థల మిప్పు డలహాబాదు పుర మందలి ఝారాగంజి కెదుట గంగానది కవ్వల పాడై కాననగుచుండును (ప్రతిష్ఠాన పురము చూడుఁడు)

**ఆయుష్మంతుఁడు** — తండ్రి ప్రహ్లాదుఁడు. పితామహుఁడు హిరణ్యకశ్యపుఁడు.

**ఆరంగ్ పట్టణము** — (భాగేశ్వర దేవస్థానము) మధ్యరాష్ట్రములలో రాయపూర్ జిల్లాయందున్న పట్టణము. మహానది ఇచటికి నాల్గుమైళ్లుండును. ఇది త్రొల్లింట గొప్ప వైభవమనుభవించెనందురు. చక్కని కొలనులు, జైనకట్టడములు, పాడుపడిన గొప్ప భవనములు కలవు. బెంగాల్ నాగపూర్ ఇనుపదారి, రాయపూర్ విజయనగరములైనుపై ఆరంగ్మహానది స్టేషనుకు సమీపమున నున్నది.

**ఆరటంతీ చతుర్దశి** — మాఘబహుళ చతుర్దశి. దీనిని శివభక్తులు మహాశివరాత్రి యనెదరు.

**ఆరణ్యక దేశము** — మహాభారతము సభాపర్వమున ఉజ్జయినికిని, విదర్భకును దక్షిణ భాగముగ నారణ్యకదేశముండినదని చెప్పఁబడినది. దీనికి దేవీపురాణము ౪౬ అధ్యాయమున నరణ్యదేశమని చెప్పఁబడినది. దీని కరణ్యక్షేత్రమని పేరుండనోపునని కొందర భిప్రాయపడుచున్నారు. నిజాంరాజ్యములోని ఔరంగాబాదు, దౌలతాబాదు ప్రాంతదేశమని పెక్కండ్రుపోల్చుచున్నారు. రాజధాని తగరపురము. దీని నిప్పటి దౌలతాబాదని పెక్కండ్రు పోల్చిరి.

**ఆరభటి- (వృత్తి)** — లక్షణచూడుఁడు.

**ఆరవీటి (ఆర్వీటి) బుక్కరాజు** — (వంశావళి) ఈ చంద్రవంశపు కులావతంసుఁడు శ్రీకృష్ణరాయ సార్వభౌమునికి సామంతుఁడగు

నృపతి. బహు పరాక్రమశాలియై బుక్కశౌరి యని పేరందినవాఁడు. చాల చక్కని ఁడని ప్రతీతికలదు. తండ్రిపేరు పిన్నమరాజు. కుమారుఁడు ఒకటవ రామరాజు. పౌత్రులు మ్మరాజు, కొండశౌరి, శ్రీరంగరాజు అనువారలు. (వంశావళి చూడుఁడు).

**ఆరా** — ఆరామనగరము చూడుఁడు.

**ఆరాటపు కదురు ఏరాట్టమునఁ బెట్టినా బరబరే** — ఆరాటము = పరితాపము. ఇట నల్లరియనిభావము. బరబర నని పెద్దధ్వనియని భావము. ఆంధ్రలోకోక్తి.

**ఆరాదనగరము** — ఆరామనగరము చూడుఁడు.

**ఆరాధ్యత్రయము** (ఆంధ్ర బ్రాహ్మణులు చూడుఁడు). ఉద్భటారాధ్యులు, వేమనారాధ్యులు, పండితారాధ్యులు.

**ఆరాధ్యులు** — ఆంధ్రబ్రాహ్మణులు చూడుఁడు.

**ఆరామ (నగర) ము లేక ఆరాద (నగర) ము** — దీనినిప్పుడు ఆరా యనుచున్నారు. బీహారు పరగణాలోని షహాబాద్ జిల్లాలోనిది. తొల్లింట బుద్ధభగవానుని విద్యాగురుఁడగు ఆరాముఁడను పురుషుని నివాసమగుటనారాద నగరమని పినప కొంతవాడుకయుం గల్గెనట.

**ఆరాముఖము** — బాణాగ్రములు చూడుఁడు.

**ఆరావళి పర్వతములు** — అదర్వావళి చూడుఁడు.

**ఆరెంజి రివర్కోలనీ** — దక్షిణ ఆఫ్రికాలోనిది. క్రీ. శ. ౧౮౦౦ వఱకు ప్రజా పరిపాలితదేశమై(రిపబ్లికు) యుండెను. ౧౮౯౯లో ప్రజా ప్రభుత్వము తిరుగుబాటు గావించి యుద్ధమున నిల్వలేక బ్రిటీషు సామ్రాజ్యమున స్వపరిపాలన గల కోలనీగ చేయఁబడినది. ట్రాన్సువాలును ఈపర్పాటునకల్పి రెంటిని ఏక కోలనీగ చేసియున్నారు. జోహాన్సుబర్గు ప్రధాన స్థానము. దేశమున బంగారుగనులు కలవు. (దక్షిణఆఫ్రికా చూడుఁడు).

**ఆరిక (లేక ఆళ్లు) చెట్టు** — లా. Paspalum frumentaceum లేక Paspalam scrobiculatum. సం. కోద్రవ, కోరదూష, మదనాగ్రక. దీని బియ్యమును అన్నమువండియు, క్షీరాన్నముచేసియు, పిండిని రొట్టెలు మొదలుగాగల భోజనపదార్థములుగ నొనరుతురు విషమును హరించును. చలువఁజేసి విరేచనబద్ధముజేయును. పైత్యము (ముఖ్యముగ రక్తపైత్యము), గ్రహణి, సంగ్రహణి, కఫముల నడంచును. మూర్ఛరోగమున కుద్రేకము గల్గించును. ఆళ్లను బాతులకు,కోళ్లకు నిపించుచుండిన అధికముగ గ్రుడ్లనుపెట్టును. ఆళ్లకు విరుగుడు- అప్పుడుపితికి వేడిచల్లారని ఆవుపాలు, తెల్ల చిరగడదుంపలు, బెల్లము గల్పినపుల్ల (బూడిద) గుమ్మడికాయలోని జలము.

**ఆరియానాసీమ** (ప్రదేశము) — మధ్య ఆసియాయందు దెచ్చటనో ఈసీమ యుండెనని Strabo పరిశీలకుఁడు వ్రాసెను. కాని సరియగు దేశము గానరాకున్నది. పారశీకుల అవెస్తా (జెండుభాష) గ్రంథమున దీనిని, వెరియన్వెజో అని వివరించియుంట గాననగును. ఇది ఆర్యవిజయమను శబ్దవికారమందురు. ఇది చలి ప్రదేశమనియు, భరతదేశమున కుత్తరభాగ మనియు, Belurtagh నకును, Mustagh (హిమగిరి) నకును, పశ్చిమముగ ఆమూనది సైహన్ నదుల జన్మస్థానప్రాంతమనియు, పామీర్ అను సీమ యిందులోనిదనియునిషరింపఁబడెను. ఇటనుండియె

కొంద ఱార్యులు ఐరోపాదేశముల కరిగిరనియు, పిదప మఱికొందఱు పారశీపోలిస్ నకును, ఇరాన్ దేశమున కరిగి పారశీకు లనంబడిరనియు, మఱి కొందఱు దక్షిణముగ భరతదేశమున కరగిరనియు అభిప్రాయములు కల్గియున్నవి. భరతదేశవాసు లగు ఆర్యుల పూర్వులు తొలుత సరస్వతీ నదీ తీర వాసులుగ నిలచిరని మాక్సుముల్లరు పండితుని భాషాశాస్త్రము (Max Muller's Science of Language) నందు వివరింపఁబడినది. కాని, పెక్కండ్రు భరతదేశీయులగు పరిశీలకు లీయభిప్రాయము నంగీకరింపక నిరాకరించుచున్నారు. వీరంద ఱనాదిగ యార్యులు భరతదేశ నివాసులనియు, పైదేశములనుండి దిగిరనుట నిరాధారమనియు ననెదరు.

**ఆరిస్టాటిల్ పండితుఁడు** — (Aristotle) ఈమహానీయుఁడాంధ్ర దేశమునకుఁ గాని, భరతభూమికిఁగాని ఏమాత్రపు సంబంధమును కలవాఁడుకాకున్నను ప్రాత్యాశ్చదేశస్థులీయనను "Father of Learning" జ్ఞాన పితామహుఁడు అని గారవించుచుందు రతన నీపండితుని చరిత్రమించుక వివరించుట ఆంధ్ర విజ్ఞానమునకు సమంజసమని వ్రాయఁబడినది. ఈయన తత్వశాస్త్రవేత్త యందురు. ఐరోపా ఖండమున మాసిడోనియా దేశమునందలి స్థాగిరా పురమున క్రీ. పూ. ౩౮౪ వ సంత్సరమున జనించినవాఁడు. Amyntas II భూపతికడ వైద్యవిదుఁడై యుండిన Nicomachus భిషగ్మణి పుత్రుఁడు. ఈభూనాథుఁడు సుప్రసిద్ధుండగు అలగ్జాండరు ది గ్రేటు గారి పితామహుండని ఎరుంగునది. బాల్యమున ఆరిస్టాటల్పండితుఁడు ఏథెన్సు నగరమున క్రీ. పూ. ౩౬౭ మొదలు ౩౪౭ దనుక పదునేడు వత్సరములు Plato పండితుని శిష్యుఁడుగను సహచరుఁడుగను ఉండి విద్యల నేర్చినవాఁడట. పిదప మైసియా కరుదెంచి వసించుచు విద్యాగోష్ఠి నుండుచుండినతరి క్రీ. పూ. ౩౪౩ లో అప్పటినరపతియగు ఫిలిప్పు (Philip) భూపాలుఁడు తన సుతుండగు నలెగ్జాండరునకు విద్యాగురునిగ నీతని కుద్యోగమిచ్చి మేసిడోనియాకు రప్పించి తన సుతుని విద్యాభ్యాస విధాన మీపండితుని వశ మొనర్చెను. అప్పటి కలగ్జాండరు పదునాల్గువత్సరముల వయస్సువాఁడట. ఏడు వత్సరములటుల విద్యలంగరపి ఆ అలగ్జాండరు రాజ్యకార్యములు, యుద్ధకార్యములు నిర్వహించుకొన మొదలిడుటతో నాతని సహాయసంపత్తిం జేయూతగ నైకొని ఏథెన్సుపురమున కరిగి Lyceum అనంబడు తావునందొక Peripatatic పాఠశాలను స్థాపించి, తా నధ్యాపకుఁడై కాలముంబుచ్చుచుండువాఁడట.

ఈ నడుమ అలగ్జాండరు ది గ్రేటు భరతదేశముపై క్రీ.పూ. ౩౩౪ లో దాడివెడలెను. మరియు నారిస్టాటల్పండితుఁడు తన పాఠశాలయందు విద్య నభ్యసించువారి కుపన్యసించుచుంటయే గాక విద్యాపరిశీలన లొనర్చుచు, విద్యావ్యాసంగముననే నిమగ్నుఁడై, అనన్యవ్యాపకచేతస్కుఁడై, అవ్యభిచార విద్యాదీక్షా సమన్విత కాలయాపనుఁడై, విజ్ఞానియైయుండువాఁడని చెప్పంబడినది.

క్రీ. పూ. ౩౨౩ లో సంభవించిన అలెగ్జాండరు ది గ్రేటు గారి మృతి మన ఆరిస్టాటలుగారి జీవితమున గొప్పమార్పుం గల్గించినది. ఆయన అదివరకే యెరింగిన సోక్రటీసు పండితుని దుర్గతిం దలంచుకొని తాను దీనుఁడనైతినను బెంగతో ఈబో అను తావునకుం జేరుకొని విశ్రాంతిగ కాలముగడపుచు మరికొన్ని మాసముల లోనే క్రీ. పూ. ౩౨౨ సంవత్సరమున భౌతిక దేహమును విడచి దివంగతుఁ డాయెను. చనిపోవుచో నీమహాపండితుఁడనిన కడపటి పలుకు "Athens must not sin a second

time against Philosophy" అనియుందురు. ఇది సోక్రటీసు పండితునకుం గల్గినదుర్గతిం గూర్చియేయని తోపక పోదు.

ఈపండితుని యభిప్రాయములు, మార్గములు ప్లేటో విధానము ననుసరించియే యుండు ననుట యబ్బురముకాదు. ఎప్పుడు రచించెనో గాని ఈపండితుఁడు రచించిన గ్రంథములు కొన్ని యుండెను. అవి యెన్నియో సరిగాఁ దెలియ రాకున్నది. ఈయనదృక్పథము లోకమున కొక (Science, Philosophy, Learning) విజ్ఞానగ్రంథమని పొగడొందినది. ఈమహనీయుని గ్రంథము లన Letters, Speeches, Poems, Philosophical Dialogues, Treatises on National Festivals, Dramatic Contests, Manuals of Natural History and Rhetoric సంబంధము లనియు, అవి పెక్కునాశనమంది కానరాకున్న వనియుఁ జెప్పఁబడినవి. క్రీ. వె. ౧౮౯౧ లో నీయన గ్రంథములు పాపైరస్ చుట్టలనుండి ప్రకటింపఁబడినవి కొన్ని కలవు. ఆయనను భక్తిపారవశ్యమునీ Master of "Who Knows" అని నుతించువారును పాశ్చాత్త్యు లందు కలరు.

**ఆరుకణుపుల (కానుగుచెట్టు** — సం. షడ్గ్రంథః, హస్తివారణః. దీని వేరును, చెక్కయు, ఆకురసము, దీని కషాయమును, ఆయుర్వేదవైద్యమున మూలశంఖ వ్యాధి, కుష్ఠువు, క్రిమిరోగము, ప్రమేహముల నడఁచు ననియు, శ్లేష్మమును శమింపఁజేయుననియుఁ జెప్పఁబడినది.

**ఆరుగంట్ల కచోరముమొక్క** — సం. పలాశః. ఇది శీతలముగల్గించి, ఆమరోగము, జ్వరము, దగ్గులు, రక్తదోషములను హరించును. ఇంచుక మలబద్ధముజేయును, తేలికనిచ్చును. ఆరుగంట్లకచోరమును కషాయముగను, చూర్ణముగను గూడ జేయుదురు.

**ఆరు చెవులలోఁబడినది అనతే రహస్యమనిపించుకొనదగినదికాదు** - ఆంగ్లోక్తి.

**ఆరుణి** — ధౌమ్యుని శిష్యుఁడగు అయోదుఁడితని గురువు.

**ఆరుమూడు** – ఆంధ్రభాషా సాంప్రదా యార్థపదము. అదివఱకుండినదానిలో సగము పాడైనదని తెల్పుట కీపదము వాడుచుందురు. ఆరు మూడుగ నగుటయని భావము. జనసామా న్యమున నిది వాడుకలో రానురాను, ఒక కార్యము జరుగుచుండ, మధ్య నవాంతరము వలన చిక్కులోపడి ఆగిపోయినచో, దానికి ఆరుముడి (ఆరు మూడు) అయ్యెనని యను చున్నారు.

**ఆరెంజినది** (Orange River) — ఆఫ్రికా లోనిది. పొడవు ౧,౦౦౦ మైళ్ళు. దక్షిణ ఆఫ్రికాయందుకురిసిన వర్ష జలములు ప్రవహించు మార్గమిదియే. ట్రాన్సువాలుదేశము ఆరంజి ఫ్రీస్టేటుదేశముల నడుమనుండి ప్రవహించు వాల్ నది దీనియందు చేరును. చేరినదాదిగ ఆరెంజి నదియందలి జలము లింకిపోనారంభించి నిరర్థకపు నదిగ నడచుచు, కడకు సముద్రముం జేరును. నదీముఖద్వారమున నిసుకగట్టు అడ్డుగ నేర్పడి యున్నది. నదీమధ్యభాగమున పొలములకుం గొంత యుపయోగించును గాని పిదప సంవత్స రమునం దెన్మిది మాసము లెండిపోయియుండి వర్షకాలమున కొంచెముపాటి ప్రవాహమును జూపించుచుండెడిని.

**ఆరెంజిసొసైటీ** — ఐర్లాండుదేశమున Armagh పురమున స్థాపింపఁబడిన రాజకీయ సంస్థ. ఇది క్రీ. వె. ౧౭౯౫ సంవత్సరమున బయలు

దేరినది. దీని ముఖ్యోద్దేశము ప్రోటస్టాంటు మతమునకె యున్నది.

**ఆరెచెట్టు** దీనిని కొందఱు పెద్దఆరె చెట్టు అని కూడ పిలిచెదరు గాని చిన్న ఆరె చెట్టుంగూర్చి ఏమియుం దెలియరాదు. లా. Bauhenia spicata లేక Woodfordia floribunda లేక Grislea tormentosa సం. అగ్నిజ్వాలా, అశ్మాంతక లేక అశ్మంతక, ధాతకీ, వాలుకాపర్ణా. దీనిని చెక్కరసముగను, కషాయముగను వాడుచున్నారు. చెక్కరసము చేదుగనుండి, కాస, కర్ణవ్రణములు, వ్రణములు, పైత్యములు, నాడివ్రణములు, గొప్ప పైత్యములు హరించును. కషాయము చలువజేసి, కఫమును, రక్తపైత్యమును హరించును. ఇంచుక విరేచనబద్ధమును జేయును. దీని పువ్వులు- వీనిని సంస్కృతమున ధాతకీ, అగ్నిజ్వాల, వహ్నిపుష్ప యని వాడిరి. పూవుల చూర్ణము లేక రసము వేడిచేయును. కఫము, అతిసారము, ఉబ్బులు, పాండువు, పైత్యము, విసర్పి, వీనిని హరించును.

**ఆరేటరీ** (Oratory) — బహిరంగముగ నుపన్యసించుటను గురించిన కళ. వక్తృత్వము (Oration) చూడుడు.

**ఆరోగ్యము బాగుంటే అన్నీ పథ్యపు వస్తువలే యగును** ఆంధ్రలోకోక్తి.

**ఆరోన్** (Aaron) హిబ్రూ పేరు, యూదుల మొదటి ప్రధానగురుని పేరు. పురుష నామము. (క్రైస్తవనామములు చూడుడు.)

**ఆరోరూటు (అ(రోటు) పిండి**— లా. Maranta Arundinaces. ఆంగ్ల Arrow-root. ఉష్ణ దేశమునందయ్యెడు కొన్ని జాతుల దుంపల చూర్ణము. ఇది యొకజాతి దుంప కాదనియు, వర్తకపు లాంఛనముగ నిడబడిన నామమాత్రమనియుం దెలిసెడిని. వెస్టు ఇండీసుద్వీపములందలి ఈదుంపలనుండి దీనిని చేయుదురట, లేక ఈదుంప లట లభించు నని తెలుచున్నది. ఇంకను ఈస్టు ఇండీస్‌దీవులు, బ్రెజిల్‌రాజ్యములందుగూడ నివి లభించునని తెలిసెడిని, కాని శ్రేష్ఠమగు జాతివి అమెరికా దేశమునం గల Maranta Arundinacea •అను దుగల చెట్టుదుంపలని చెప్పఁబడినది. దుంపలం గడిగి, చెక్కదీసి తరిగి,• ఎండించి యంత్రములం దిడి గుండజేయుదురట. దీని నాయుర్వేద వైద్యులు జావగాచి రోగుల కాహారముగ నిత్తురు.

**ఆరోహణవక్రరాగములు** — వక్రరాగములు చూడుఁడు.

**ఆరోహణావరోహణన్యాయము** — ఎక్కుట దిగుట యని యర్థము. ఒకస్థితియందు లేనివారినిగూర్చి తెలుపున్యాయము.

**అర్జంటైనా దేశపు ప్రభుత్వము** — అమెరికాఖండమునందలి ప్రజాప్రభుత్వదేశము. పదునొకండులక్షల ఏబదిమూడువేల చతురపు మైళ్ల వైశాల్యముగలది. ఒకకోటి తొమ్మిదిలక్షల జను లందు వసించుచున్నారనియుఁ జెప్పఁబడినది.

**అర్జంటైన్ ప్రజాపాలిత దేశము** (Argentine Republic)— దక్షిణఅమెరికా యందు లాప్లాటాదేశమున అంతఃకలహములచే వేఱుపడిన ప్రజాప్రభుత్వదేశము. ఇది అట్లు వేఱుపడిన మూడు ప్రజాపాలిత దేశములలోనికెల్ల పెద్దది. ౧౧,౧౮,౦౦౦ చతురపుమైళ్ల వైశాల్యముకలది. (లాప్లాటాదేశము, దక్షిణఅమెరికా చూడుఁడు). బ్యూనోస్ ఐరీసు నగరము ప్రభుత్వకార్యాలయము లున్నతావు. గొప్ప వర్తకస్థానము. ఇది లాప్లాటా నదియొక్క Estuary వద్దనున్నది. ఇంచుమించు తొమ్మిది లక్షల జనులువసించుచున్నారు. దీనికి స్పానియా భాషయందు మృదుతరమైన వాయువు అని

యర్థమట. సమశీతోష్ణ స్థలముగుట ఏపే విశిరట. కార్డోబా నగరము మఱియొకపట్టణము. ఇం దెక్కువముంది ఇటలీదేశస్థుల సంతతివారు కలరు. టెర్రాడెల్ఫ్యూగో ద్వీపములందు తూర్పువైపు సగము ద్వీపము లీ ప్రభుత్వము వారివి. ఇందు ఇండియనుజాతులు నివసించుచున్నారు. (ఛిలీదేశము చూడుఁడు). పెటగోనియా దేశము దీనికిం జేరియున్నది. అది తొల్లింట వేఱుదేశముగఁ దలంపఁబడుచుండెనట. పెటగోనియా దక్షిణ అమెరికాకు కడుదక్షిణముగ. కడనున్న దేశము. చాల చలిదేశము. రాళ్లమయమైన నిరుప యోగప్రదేశములచే నిండి ఊసరక్షేత్రముగనున్న భూమి. ఇండియను జాతులవా రిందువసించు ప్రజలు. వారు చాల క్రూరులనియందురు. సదా గుఱ్ఱములపైం దిరుగుచు వేటాడుచు జీవించు వారు. ఇప్పుడు అర్జంటైను ప్రజాప్రభుత్వము వారికింజెందియున్నది. ఇందు పట్టణములని వేత్తే లేవు. (పెటగోనియాదేశము చూడుఁడు).

**ఆర్జవంహి కుటిలేషు ననీతిః** — కుటిలాత్ములయందు ఋజుభావన నీతికాదనియు భావము. (అనఁగా కుటిలాత్మునకు కుటిలత్వము చేతనే బుద్ధిగలుగఁజేయవలయునని భావము).

**ఆర్డరు** — దీనికి ఉత్తరువు అని యర్థము. వాణిజ్యసంబంధమున ఇండెంటు అని యర్థము. (ఇండెంటు చూడుఁడు).

**ఆర్తభాగ గోత్రము**— జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.

**ఆర్థడాక్సి** (Arthodoxy) — ప్రామాణిక వాదపద్ధతి. శాస్త్రముగాని, ఆచారముగాని ఒప్పునిపని చేయుకుండు విధానము.

**ఆర్నమెంటాలిజమ్** (Ornamentalism) — అలంకారముచేయు విధానము. శిల్పము, చిత్రకళ, ఆభరణములు వీనిచే నలంక రించుటలో నేర్పరితనము.

**ఆర్శరోగము** — ఆంగ్ల. Piles. దీనికి మూలశంఖ యనియు, మూలవ్యాధి యనియు కూడ వాడుకనామములు కలవు. గుదస్థానము లోపలగాని, వెలుపలగాని పుండయి మాంసపు ములకలు జనియించి, రక్తము స్రవించుచుగాని, స్రవించకుండఁగాని బాధగల్గించు జబ్బు. దీని కాయుర్వేదవిధానమున ఔషధము పట్టెలును, పాశ్చాత్య వైద్యవిధానమున శస్త్రమును చేయుదురు.

**ఆర్యపథ గోత్రము** — ఆత్రేయగణము చూడుఁడు

**ఆర్యపురము** — చాళుక్యరాజుల పశ్చిమపు రాజధానిగ నుండెనది. ఏడవ, ఎన్మిదవ శతాబ్దముల నాఁటిది. ఇప్పుడు అహిహోల్ అను పేరం బరగుచున్నది. దీనిని పురాతనపు శాసనములందు అయ్యావోల్ అని వాడిరని ఆర్కిలాజికల్ సర్వేరిపోర్టు లందు కలదు. బొంబైరాజధాని, బిజాపూరుపూరు జిల్లాలోని బాదామీ తాలూకాలోనున్న తావు.

**ఆర్యభట్టుఁడు** — సుప్రసిద్ధ జ్యోతిష వేత్త. క్రీ. వె. ४७६ కాలమువాఁడు. ఈతని జన్మస్థానముం గూర్చి మగధదేశము చూడుఁడు. గొప్ప పండితుఁడుగాన నీతని యభిప్రాయముల నార్యభట్టమత మనుచున్నారు. శాలివాహన శకము మూడవదని యనుచున్నారు.

**ఆర్యవైశ్యులు** — (గవరకోమటులు) వీరిని ఆర్యవైశ్యులయొక్క క్లుప్తరూపముగ ఆర్యులనుటయుం గలదు. అన్యజాతులవారు, వీరిని గవరకోమటులని ఒక్కొకప్పుడు వాడుట యుంగలదు. ఇది అన్యులగు బేరికోమటులు, భేరీకోమటులు, కళింగకోమటులనుండి వేఱుగ వివరించుటకుగాని వేఱుకాదు. గౌరవ శబ్దము వికారరూపములపాలై గవర అనుపద మేర్పడినది.

ఇంకఁ దక్కిన కోమటి యనుపదము గోమతి యనుపదమునుండి కల్గినరూపము. వీరిప్పుడు ఆంధ్రదేశమునను, దక్షిణ (అరవ) దేశమునను నివశించుచున్నారు. తఱచుగ వర్తకులుగ నున్నారు. ధనికులలో కొందఱు వడ్డీవ్యాపారము చేయువారుగను, కొంద రుద్యోగముల నిటీవలం బ్రవేశించుట కారంభించిరి. ఎటులనైనను వీరు వర్తకులని చెప్పకతప్పదు. నైసర్గికముగ వీరియూహాపోహాలు తెల్వితేటలు వర్తకవిద్య కనుకూలించునవిగ నుండెడిని. వీరియం దిప్పుడు నూటఒక్కగోత్రములు కలవు. ఆంధ్రదేశమున ప్రతి పల్లెటూరునందు ఒక్కొక వైశ్యగృహముండకుండిన నాయూరి కొకలోపముగనే యుండెడిని.

ఆదియందు వైశ్యులు బ్రహ్మ, క్షత్రియ జాతులకుం దరువాతిజాతిగ సృజింపంబడిరనియు, అత్తరి వారియందు ఏడునూట పదునాల్గు గోత్రములును, అన్నిగణంబులును గల్గియుండెననియు, వీరికాదికాలమున కృషి, వాణిజ్య, పశురక్షణంబులు వృత్తులుగ నుండెననియుం జెప్పఁబడినది. విధాత్రునకుఁ బులస్త్యుండును, పులస్త్యునకు విశ్రవసుండును, విశ్రవసునకుం గుబేరుండును కలుగ నా కుబేరాంశమున వైశ్యులు కల్గిరనియు, వీరు సృష్టియందిటుల భూమియందు జనించినవారై, యపరార్కుం బురోహితునిగాఁ గైకొని కొంతకాల ముండిరట.

అట్లుండుతరి వారికిం గైలాసవాసముపై వాంఛదగిలి పురోహితుఁడగు యపరార్కుతో సహా విధాతృననుమతిం గైకొని గొప్ప తపంబులాచరించి, పరమేశ్వరుని మెప్పించి, కైలాసవాసంబునకుం జేర్పఁబడి, యట శివసన్నిధిని వాకిలి హాజారము గాచుచుండ నియమింపబడిరి. అట నటుల చిరకాలముండిరని చెప్పఁబడినది.

అక్కాలమున నొకతరి వైశ్యర్షులు సత్యలోకంబున విధాత సభకేగుటయు, అందు దూర్వాసాది మహర్షులుగూడ నుంటయు సంభవించెనట. ఏదియో ప్రసంగవశమునఁ బరమేష్ఠి తన సృష్టియందు బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులలో నెక్కువ గోత్రము లెవ్వరియందున్నవని ప్రశ్నింప, వైశ్యర్షులు తమ కేడునూటబదునాలు గోత్రంబులును, మరి యన్ని గణంబులును గలవారమని యతిశయంబుగబల్క, వారియం దారునూరులపండ్రెండు గోత్రములవా రితరులం బరిహాసించునట్లెలుగెత్తి నగిరట. దానికా దూర్వాసమహర్షి కాగ్రహముకలిగి "వైశ్యాధములారా! మీరు గర్వాంధులుగాన, మీరలొకప్పుడు వేదబాహ్యులై కర్మభ్రష్టులగుదురుగాక" యని శపించెనట. పరిహాసింపని నూటరెండుగోత్రములవారు వేఁడఁ గరుణించి "ఇకమూడు యుగంబులనాఁడు ఒకకన్యకకై మీరు పరిహాసించినవారినుండి వేరై నిత్యకర్మానుష్ఠానాసక్తులై, ధనవంతులుగ నభివృద్ధిం గాంచెద" రని పలికెనట. (వైశ్యగోత్రములు, చూడుఁడు)

మఱియొకప్పుడు దేవర్షియగు నారదుఁడు శివసందర్శనార్థియై కైలాసంబున కేగి, వాకిలింగాచు వైశ్యులచే నడ్డగింపఁబడి, కోపావేశమున "మీరు భూమికిం దిరుగబోవలసివచ్చుంగాక" యని శపించి నిజేచ్ఛంజనియెనట. ఇది ఇట్లుండ భూలోకంబున వైశ్యులుండమి, కృషి చతుర్థకులమువారి పాలయ్యెను. వాణిజ్యము క్షీణించి పండని తావులందు కాటకము గల్గుచుంట తప్పనిదయ్యెను. పశురక్షణమును అభివృద్ధియందుండమి యితరులపాలై తగ్గియుండెను. ధనికులగు వైశ్యకులము లేకుండుట దుస్థితివ్యాపించి, ప్రజ లల్లాడుచుంట గోచరించుచుండెను. వైశ్యకులమునకు మూలపురుషుఁడగు ధనదుం డీశ్వరునికడ విన్నవించి, భూలోకమునకు వైశ్యుల ననుగ్రహించినఁగాని

చితి తీరదని ప్రార్థించుచుండెను. అటకేలకు పరమేశ్వరుండును, వైశ్యులులేక భూమి చిన్న బోయి యున్నదని తలంచి, వైశ్యప్రముఖులతో "మీరాలెచ్చటనున్నను మిమ్ముం గాచుచుండు వాడ, భూమియందుండుఁ" డన నాయార్యు "లో దేవా, మమ్మిటుల బొమ్మనంజనను, మిమ్మెక్క బాసి మే మేగజాలము. మమ్ముం దయజూచి నేటకుం బొమ్మనకుఁ" డని యెంత మొఱలిడినను నాశివుం డియ్యకొనఁడాయెనట అంత నా వైశ్యులు వైకుంఠంబున కరిగి, విష్ణుదేవునితో విన్నవించినను ఫలితము కలుగదాయెనట. ఆ దేవుఁడు "ఓ వైశ్యులార, నగరేశ్వరుండను పేరున శివుండును, జనార్దనుండను పేర నేనును, ఇందు వాసినియను పేర పార్వతీదేవియు, కోనకమల యను పేర లక్ష్మీదేవియు మీ కిష్టదైవములమై కాచుచుందుము. పరమేష్ఠి భాస్కరాచార్యుం డను పేర కులగురువై మీయింట సమస్త శుభ కార్యంబుల నడపుచుండు"నని యభయముం బొసంగి వారిం భూమికిం గొనిపొమ్మని కుబేరున కొప్ప గించెను.

కుబేరుండు వారిని, పదునెన్మిది పురంబు లకును జేర్చెను. అవి యన్నియు ఆంధ్రభూమి యందే యున్నవి. అవి ౧. పెన్గొండ, ౨. ఆచంట, ౩. ధనదాఖ్యపురము, ౪. శివపురము, ౫. పాలబాలనిరవద్యము, ౬. జగన్నాథపట్టణము, ౭. వీరనారాయణనగరము, ౮. హేలాపురము, ౯. దెందులూరు, ౧౦. దివ్య ఘంటసాల, ౧౧. భీమపురము, ౧౨. ముమ్మడి గ్రామము, ౧౩. విశాఖానగరము, ౧౪. కళింగ పురము, ౧౫. పాలకొలను, ౧౬. శ్రీనరసింహ నగరము, ౧౭. నగరవీడు, ౧౮. ధర్మనగరము, అనఁబడునవి. ఇందు పెన్గొండ ప్రధానస్థానమై యుండెనని చెప్పంబడినది. మఱియు నక్కాల మున సమాధిశ్రేష్ఠియని పేరుగల వైశ్యశిఖామణి కులపెద్దయై యుండెనట. ఇటుల భూమికిం చేర్పింబడిన వైశ్యవరులు బహుధనవంతులై, సకల భోగంబు లనుభవింపుచు, దానధర్మ నిరతులై, తపోనిష్ఠలను, సత్కర్మలను వీడక, ప్రజ లందు ప్రాముఖ్యులై, వాణిజ్యము లొనర్చుచుండ కృతయుగ, త్రేతాయుగ, ద్వాపరయుగంబులు గడచి, కలియుగంబునను చాలకాలము గడచె. అక్కాలమునకు పెన్గొండయందు కులపెద్దగ నుండిన, కుసుమశ్రేష్ఠిగారి కొక పుత్రుండును, ఒక పుత్రికయు సంతానము గల్గియుండిరి. వా రిర్వురను ఆదంపతులకు పుత్రకామేష్టి సలుపం గల్గిన వరప్రసాదులు. వారు బహు ధనవంతులును, సకల ఐశ్వర్యసంపన్నులునై యుండిరి. ఒకనాఁ డాదేశమేలు భూపతి (రాజమహేంద్రవరము రాజధానిగ వేఁగిదేశ మేలుచుండిన) విష్ణువర్ధనుండను క్షత్రియ కులావతంసుం డేతెంచి (ఈయన తూర్పుచాళుక్య భూపతులందు రెండవచాళుక్య భీమవిష్ణువర్ధనుం డని తలంచుచున్నారు) పురజనులవలన గౌరవిం పంబడి నగరేశ్వరదేవాలయ మంటపమున విడసి యుండ వైశ్యాంగనలు హారతులనిచ్చిరట. అత్తరి నాకుసుమశ్రేష్ఠిగారి కొమరితంగాంచి యామెం దనకిచ్చి పరిణయమొనర్పుఁడని వారికి వర్తమాన మంపెనఁట. వారును కులమహాజనులతో యోచించి కులాచారముమేరకు మేనల్లునకిచ్చి వివాహమొనర్ప వలయునేకాని అన్యకులస్థుల కీయనొల్లరైరట. రారాజును పట్టుదలవీడమి వారందఱు భూపతిప్రతాపమునకు వెరచి, ఆబాలికతోసహా యగ్నిగుండంబునఁబడి భౌతిక శరీరములంబాసి పరలోకగతులైరట. అట్లు గుండంబులంబడినవారు నూటరెండు గోత్రముల వారనియు, తక్కినవారు పారిపోయిచెదరిరనియు, అగ్నిగుండంబునంబడిన ౧౦౨ గోత్రములవారి సంతతివారే ఆర్యవైశ్యులు లేక గవరకోమటు

లనంబడుచున్నదనియుఁ జెప్పఁబడినది. (కన్యకా పరమేశ్వరి చూడుఁడు).

ఆబాలిక వారితో నగ్నిగుండంబునం బడుతరి తాను పూర్వకారణముమేర కట జన్మమందిన శచీదేవియనియు, తనతో నగ్నింబ్రవేశించినవారి సంతతివారిని రక్షించుచు, **వాసవకన్యకాపరమేశ్వరి** యనుపేరంబరగుచు, కులదైవంబుగనుండి కాచుచుండెదననియు వరమొసంగెనని చెప్పఁబడినది. నాఁడాదిగ నార్యవైశ్యులు కన్యకాపరమేశ్వరిని కులదైవముగనారాధించుచున్నారు. వారగ్నింబడిన వార్తవినఁగనే విష్ణువర్ధన మహారాజును మృతినందెనట. ఆతని పుత్రుండు మిగిలిన వైశ్యబాలుర నోదార్చి యాదరించెనని చెప్పఁబడినది.

ఈ కథనము కన్యకాపురాణమను గ్రంథమునందు కలదు. ఈ గ్రంథ మొక యాధునికునిచే నిటీవల వ్రాయఁబడియుండుంగాని, కథ పూర్వకాలపుదేమైయుండుట కేసందియుంబును లేదు. ఆ గ్రంథమునందాపండితుఁడు వాసవకన్యకాపరమేశ్వరితో ఆర్యవైశ్య లగ్నిగుండంబునం బడినకాలము కలియుగమున ౨౪౨౦ సంవత్సరములాయెనని వివరించెను. ఇట్లగునేని అక్కాలము క్రీ. పూ. ౬౮౦ ప్రాంతము కావలసియుండును. ఇటులనే యగుతరి క్రీ. పూ. ౬౮౦ నాఁటికి రాజమహేంద్రవరమే నిర్మింపఁబడినటులఁగాని, విష్ణువర్ధనుఁడనంబడిన భూపతికి రాజధానిగనుండినటులఁగాని చెప్పఁ వీలుండదు. పరిశీలనల వలన చాళుక్యభూపతు లీదేశమున కేతెంచియే యుండరు. (వేఁగిదేశము చూడుఁడు).

ఇది బహుశః రాజమహేంద్రవరము రాజధానిగ నారాజ్య మేలుచుండిన భూపతి విష్ణువర్ధనుఁడను పేరుగలవాఁడు రెండవ చాళుక్యభీముండను విష్ణువర్ధనుఁడై యుండునని తలంపఁబడుచున్నది. ఈతఁడు బహుబల సంపన్నుండైన జయశీలుఁడని పేరందినవాఁడు. ఈయన క్రీ. వె. ౯౪౭ లో మృతినందినవాఁడు. ఈయన సుతుఁడు అమ్మరాజయాదిత్యుఁడు రాజమహేంద్రుఁడని వాడుకనామము గల్గియుంట, కన్యకాపురాణగ్రంథకర్త పొరఁబడి రాజరాజనరేంద్రుఁడని వ్రాసియున్నట్లు తోఁచెడిని. ఇదియే సరియగునేని కలియుగము ౪౦౪౮ సంవత్సరములును, శాలివాహనశకము ౮౬౯ సంవత్సరములును, క్రీస్తుశకము (క్రీ. వె.) ౯౪౭ ను అయియుండును. దీనింగూర్చి ఇంకను పరిశీలనలు జరుగఁదగుననియే మాతలంపు.

రాజరాజనరేంద్రుఁడు శాలివాహన శకము ౯౪౪ శ్రావణబహుళ ద్వితీయా గురువారము ఉత్తరాభాద్ర నక్షత్రమున పట్టాభిషేకమునందిన వాఁడుగాన, క్రీ. వె. ౧౦౨౨ జూలై ౧౯ అయియుండును. ఇది మిగుల వెనుకకాలమగుటయేగాక, ఈ రాజరాజు తండ్రియగు విమలాదిత్యునకు విష్ణువర్ధనుండను పేరులేదు. ఇంక నింపుల చిత్రమేమనిన, రాజరాజనరేంద్రునిపేరే విష్ణువర్ధనుఁడని యుండ మాతామహ సంతతివారందఱు రాజరాజనరేంద్రుఁడని పిలచుచుండిరి. కాన రాజరాజోదార్చెననుటయు, విష్ణువర్ధనుఁడు కామించెననుటయు కాలము సరిగాకుండును.

**ఆర్యసంగుఁడు** — (అసంగుఁడు) బౌద్ధమత యోగాచార్య సిద్ధాంతధర్మమునకాది పురుషుఁడనంబడినవాఁడు. గొప్ప పండితుఁడు. అచింతకందరమున నివసించుచుండిన వాఁడు. (అచింతకందరము చూడుఁడు).

**ఆర్యసత్య చతుష్టయము లేక చతురార్య సత్యములు** — బౌద్ధమత ధర్మమున ౧. దుఃఖము, ౨. దుఃఖసముదయము, ౩. దుఃఖనిరోధము, ౪. దుఃఖనిరోధగామినీప్రతిపదము. (వైభాషిక బౌద్ధమతము చూడుఁడు)

**ఆర్యసమాజమతము** — మతము. హిందూమతమునం దద్వైతసిద్ధాంత సంబంధము. ఈమతమును స్థాపించినవారు దయానంద సరస్వతీస్వామి. వీరు సంస్కరించిన రూపమున నున్నది- ఈమతమున దేవుఁ డద్వితీయుఁడు. స్థూలదేహమునందుండు ప్రాణము, ఆత్మయనఁబడును. పరమేశ్వరుఁడు పరమాత్మయనంబడును ఆర్యమతసిద్ధాంతము మేరకు ఆత్మపరమాత్మలు వేఱు. ఒకేపదార్థమని (అద్వైతులనునట్లు) అనరాదని చెప్పఁబడినది. విగ్రహారాధన ఆర్యమతమునందు నిషేధింపఁబడినది. జాతిభేదములు వృత్తులనుండి కల్గినవి గాన స్థూలశరీరసంబంధములని తలంచుట పొరపాటనియు; విగ్రహారాధనము, జాతివివక్షతలు, వేదసమ్మతములు కావనియు, వీరందురు. ఏ అన్యమతస్థులైనను, వీరు తమ ఆర్యసమాజమతములోనికి (పరిశుద్ధులుగ నొనర్చి) కలుపుకొందురు.

ఆర్యసమాజ మతస్థులకు విద్య, వీర్యము, బలము, ధైర్యము, న్యాయము, దయ, శాంతి యను సప్తగుణములు ప్రధానములు. ఇవి పరమేశ్వరుని గుణములు గాన ప్రతివారును తప్పక గౌరవించుచు నలవడఁ జేసికొనఁదగినవి. ౧. విద్య- ఇది జ్ఞానము. దీనికొఱకై విదేశములకేగినను విద్య నారాధించుటయే యగును. ౨. వీర్యము- పురుషులందు వీర్యమనియు, స్త్రీలయందు రజస్సనియు, వీర్యము ద్వివిధమనియు, పురుషుల కిరువదియైదవయేటను, స్త్రీలకు పదునారవయేటను, వీర్యము పక్వమగుననియు, అంతవఱకు స్త్రీపురుష సంయోగములు నిషేధమనియు, అది పరమాత్మశాసనము నెదుర్కొనుటయనియు, వీరిసిద్ధాంతము గాన వీర్యము పక్వముగానిదే వివాహమాడరాదని వీరిధర్మము. వీర్యము పక్వమైనకొలదియు శరీరమునకు తేజము బుద్ధికి వికాసము గల్గుంగా నంతదనుక బ్రహ్మచర్యముచే వీర్యోద్ధరణ మొనర్పవలయును. శారదాశాసనకర్తయగు హరబిలాస శారదగారు ఆర్యసమాజికులు. రజస్వలాపూర్వ వివాహములు వారికి విరోధములగుట మతపద్ధతియే. 3. బలము- బలముకొఱకార్యులకు బ్రహ్మచర్య వ్రతము, వ్యాయామము (కసరత్తు), భోజనవిధి మూఁడును మతధర్మములే. మనుజులు వీర్య భ్రష్టులై బలముగోల్పోవుట, ఆర్యసమాజధర్మమున, పాపకార్యమని భావము. ౪. ధైర్యము- ధైర్యములేకున్న మనస్సుసరిగానుండదు; బుద్ధి చక్కఁగా యోచింపదు; కాన, సత్యాసత్యవిచక్షణ చెడును. కాన ధైర్యము వీడరాదు. వీడుట దైవాపరాధమగునని ఆర్యమతసిద్ధాంతము. ౫. న్యాయము- దైవసంబంధమగు దీనినితప్పుట పరమేశ్వర శాసనధిక్కారమే. వర్ణాశ్రమాచారము మొదలగు నన్యమతధర్మములు దోషములని వీరి తలంపు. ౬. దయ- ఇది గుణరాజమనియు, ఇదియే లేకుండిన మనుష్యుఁడగుట కర్హుఁడుగాఁడనియు వీరితలంపు. స్త్రీ పునర్వివాహములు దయలోఁ జేరినవియె. ౭. శాంతి- సద్గుణములవలన మనస్సునం గల్గు నెమ్మదికి శాంతియనిపేరు. ఇది పరమాత్మసంబంధము.

ఆర్యసమాజ మతమును వేదమతమనియు, ఆర్యమతమనియు, మతోద్రేకమునకు, వైదికాగ్నియనియు, వీరిధర్మములు లోకుల కందరికిని బలాత్కారముగనైన వర్తింపఁజేయుట పరమార్థమేననియు, ధర్మాచరణ మాత్మసమర్పణమేననియు, వేదమొక్కటి (ఋగ్యజుస్సామాథర్వణాత్మక వేదసామాన్యము) యే పరమేశ్వర జ్ఞానము బోధించునదియనియు, నిజమగుభక్తియు నాత్మసమర్పణమును, వేదమునుండియే కల్గునవనియు, పరమేశ్వరుఁడు సర్వాంతర్యామి గాన విగ్రహములఁ జేయుటతగదనియు, వీరిమతసిద్ధాం

తము. పంజాబు, అజమీరు ప్రాంతముల సీమతము వ్యాపించియున్నది. దయానంద సరస్వతీ విరచితమగు గోకరుణానిధియను గ్రంథమును, దయానందస్వామి దిగ్విజయమును వీరి మతగ్రంథములు. వేదము ప్రమాణగ్రంథము. (దయానంద సరస్వతీస్వామి చూడుఁడు)

**ఆర్ద్రంవస్త్రంసమంతాద్వాతానీతం రేణజాతముపాదత్తేతిన్యాయము** — తడిబట్టలు గాలినుండి మురికిని (దుమ్మును) వేగముగ నాకర్షించుకొనును. ఇది జైనమత సిద్ధాంతమునందలి న్యాయము. కర్మమున నాక్రమింపఁబడినప్రాణి సకలకలుషముల నాకర్షించుకొనునని భావము చెప్పఁబడినది

**ఆర్ద్రపురుగు** (ఇంద్రభోగపుపురుగు) — లా. Mutella occidentalis ఆంగ్ల. May-bug. ఆర్ద్రి కార్తియం దార్ద్రి పురుగులు భూమినుండి వెలువడును. ఇది వర్షాకాల ప్రారంభమునన్నె యుండును. ఎఱ్ఱనిరంగుతో ముఖముల గుడ్డనుబోలిన మేనితో మిక్కిలి మృదువుగ నుండు పురుగు. వీనికి భోగపుఁబురుగులనియు, సూర్యపుటపుఁబురుగులనియుం గూడ వాడుకపేరులు కలవట. వీని చూర్ణము లోనికిచ్చిన పుంస్త్వము దృఢపడి వీర్యవృద్ధి, వీర్యస్తంభనబలము గల్గుననియు, సర్పవిషమును నివారించుననియుఁ జెప్పఁబడినది.

**ఆర్ష్టిభిగోత్రము** — సంకృతి ఉపగణము చూడుఁడు.

**ఆర్కాడు** — షడారణ్యము చూడుఁడు.

**ఆర్గానిజమ్** (Organism) -అవయవము దేనికది వేఱుగనుండియు నొకదానితో నొకటి సంబంధముకలిగి, అన్నియు జీవితమునకుఁ దోడ్పడుట మనుజునియొక్కగాని, జంతువుయొక్కగాని, చెట్లయొక్కగాని అవయవములను వర్గవిభజనము జేసి అన్నిటియొక్క సామాన్యధర్మమును నిరూపించు సిద్ధాంతము.

**ఆర్ష్యాయణ గోత్రము** జమదగ్ని వత్స ఉపగణము చూడుఁడు.

**ఆర్యావర్త దేశము** — సర్వసాధారణముగ హిమవద్వింధ్యనగముల మధ్యప్రదేశమును ఆర్యావర్తమందురు. ఇటులనే మనుసంహిత ద్వితీయాధ్యాయము ౨౨ శ్లోకమునందునను చెప్పఁబడినది. పతంజలికాలమున ఆర్యావర్త దేశమున కుత్తరమున హిమాలయము, తూర్పున కాలకవనము(రాజమహాల్ కనుముల యరణ్యము), దక్షిణమున పారియాత్రకము, పశ్చిమమున ఆదర్శావళి (ఆరావళిపర్వతము) ఎల్లలుగ వివరింపఁబడినవి. మఱియు రాజశేఖరుఁడు నర్మదానదిని ఆర్యావర్త దక్షిణాపథములకు మధ్య సరిహద్దున గుర్తించెను.

**ఆర్ద్రా నక్షత్రము** — ఇది యాకసమున పవడపువర్ణమునగన్పించు నొకనక్షత్రము. దీనికి జ్యోతిషశాస్త్ర గ్రంథములందు పురజిత్, భవః, శర్వః, స్థాణుః, హరిః యను పదములను పర్యాయపదములుగ వాడియున్నారు. దీనికి రుద్రుఁడధిదేవతయనియును, మనుష్య గణము, ఊర్ధ్వముఖము, స్త్రీ స్వభావనక్షత్రమనియు, కుక్క, క్రౌంచపక్షి, వేపచెట్టు, ఈ నక్షత్రసంబంధములనియు, ప్రవేశించిన ఇరువదియొక ఘటికలపై త్యాజ్యము (విషఘటిక) ను, ముప్పదియైదు ఘటికలపై యమృతము ననియు, దారుణస్వభావ నక్షత్రమనియుం జెప్పంబడినది.

**ఆర్ద్రాష్టమి** — అష్టమి తిథియం దార్ద్రానక్షత్రము సంభవించిన ఆర్ద్రాష్టమి యందురు. పర్వదినము (పండుగలు చూడుఁడు).

**ఆర్కిటిక్ మహాసముద్రము** — ఉత్తరధ్రువ మహాసముద్రము చూడుఁడు.

**ఆర్కిటిక్ సర్కిల్** (Arctic Circle)- ఉత్తరధ్రువరేఖ చూడుము.

**ఆర్కిటెక్చర్** — ఫ్రెంచిమాట యగు Architecte యొక్క వికారరూపము Architecture. దేవుని The great architect అని Free masons అనెదరు. ఇండ్లు, భవనములు, వంతెనలు, మార్గములు మొదలగు కట్టడముల నిర్మాణవిధానమగు కళ. ఇందు పెక్కుభేదములు కలవు. ఇందు సున్నముతో రాతినిగాని, ఇటుకలం గాని బంధించికట్టుటను Masonary అనెదరు. ఇక్కాలము Architecture నందు వివిధశాఖ లున్నను ౧. సైనిక (Military), ౨. నావిక (Naval), 3. భవననిర్మాణము (Civil Architecture) లని త్రివిధభేదములు కలవు. తొల్లింటికాలపు శిల్పము (Architecture) నందైదు మోస్తరులు ప్రధానములుగ తలంపఁ బడినవి. ౧. Doric- ఇది చాల పురాతన మైనది. గ్రీకుదేవాలయముల నిది కాననగును. ౨. Ionic- ఇదియును గ్రీకుదేశపుదే గాని, చాల తేలికగను, ఎక్కువ శృంగారముగను గాననయ్యెడిని. ఏథెన్సు నగరమున Erichtheum నందు గాననగును. 3. Corinthian- ఇది Alexander the Great కాలమునవాడుక లోనికివచ్చెను. ఇది స్తంభముల తలల యందు మునకు వాసికెక్కినది. పనితనమును బాగుగ నుండెడిని. ౪. Tuscan- ఇది రోమనులు గనిపెట్టినదందురు. డోరిక్ పని పోలికగల గట్టి పనియట. ౫. Composete- ఇది Ionic పద్ధతి. Corinthian పద్ధతియుఁ గలిసియుండి కాల శీతోష్ణముల కనుకూలమై తనరారెడిని. పరిస్థితుల కనుకూలించునది. ఇంకను ఆంగ్ల దేశమున Saxon, Norman, Semi-Norman, Early English or Gothic, Decorated English, Perpendicular English (15 శతాబ్దము A. D.), Debased English (A. D. 1509 మొదలు క్రీ. శ. 1640 వరకు) అనఁబడు ఆరు మోస్తరులు గాన నయ్యెడిని. ఇంకను Renaissance style అనియు, Queen Anne style అనియు కూడ కలవందురు. ఇవిగాక Egyptian Style, Assyrian Style, Etruscan Style, Persian Style, Chinese Style, Jewish Style మొదలగునవియుం గాననయ్యెడిని.

**ఆర్కియాలజీ** (Archæology) ఇది నవీనశాస్త్రము. పురాతన చిహ్నములం బట్టి ఆనాఁటిచరిత్రాంశముల నెఱుంగఁజేయు శాస్త్రము. ఇది అనేకవిధముల నిటీవల వ్యాపించి యభివృద్ధినందుచున్నది. దీనివిజ్ఞాన మింకను అభివృద్ధినందవలసియున్నదని మాతలంపు. ఇంతవఱకు నీశాస్త్రదృష్ట్యా గల్గిన విజ్ఞానము, అస్సీరియాసంబంధము, ఈజిప్టుసంబంధము, హిటిటిసంబంధము, గ్రీకుసంబంధము, రోమన్ సంబంధము, గాల్లోరోమన్సంబంధము, కెల్టిక్కు సంబంధము నని తెల్పునవిగా నున్నవి. ముఖ్యముగ నీ విజ్ఞానమునుండి యెఱుంగఁదగినవి చరిత్రాంశములే గాన, దీనియందలి స్థితిగతుల నీ క్రిందివివరముల క్రింద పరిశీలనల సల్పుచున్నారు. అవి కట్టడములు, చిత్రకళ; నాణెములు, విజ్ఞానములు మొదలగునవి. కాని, ఇంకను ప్రత్యేకప్రత్యేకములుగ శాఖలను విడదీసి వానిం జోల్పదగిన పరిపూర్ణత కలుగవలసియే యుండును.

పురాతనపు చిహ్నముల పరిశోధన మూఁటి యందిమిడియున్నది. ౧. పరిశోధనము (Investigation), ౨. బహిరంగపర్చుట (Exposition), 3. స్పష్టపర్చుట (Interpretation). ఇందు పరిశోధనమునందు వ్యాపించుట, త్రవ్వించుట, వెదకుట, దొరకిన వస్తువులం బరిశీలించుట మొదలగునవి చేరియుండును. ఈ సందర్భమున

క్రీ. వె. ౧౯౨౨ నాఁటినుండి యలవడుచున్న వాయువిమానములనుండి (అనగా ఆకసమునుండి) తీయఁబడుచున్న ఛాయాపటములు అధికోపయోగకరములై యున్నవని వ్రాయవలసియున్నది.

తరువాత చేయఁదగిన రెండవపని దొరకిన వానిని ప్రత్యేక నిర్మితములగు ప్రదర్శనశాల (Museums) లందుఁ జేర్చి యమర్చి, పరిశీలనలకు, యోచనలకు, అధికముగ వీలు కలుగఁ జేయుట, తరగతులుగ విభజించుట, చిత్రవిచిత్ర వస్తువుల భాగములనుజేర్చి కుదురుపర్చుట, ప్లానులను, ఫొటోగ్రాపులను, భోగట్టాలను వ్రాసి సిద్ధపర్చుట, ఇవి అతిజాగ్రతగ ప్రత్యేకవిద్యలం గరచిన ఆరిందాలచేఁ జేయఁబడవలసి యుండును.

ఇంక నిట్టిపరిస్థితులు గల్గించినదానిం బరిశీలించినపిదప తేలినసారాంశములను తీర్మానించి వ్రాయుట, మూడవభాగముగ నున్నది. బ్రిటీషు దేశమున ఆర్కియాలోజీ, విద్యాధికులు యూనివర్సిటీలందు ప్రబోధకులుగ నున్నారనియు, పరిశీలనలకు సంస్థలుకలవనియు వింటిమి. జెరూసలెమ్ పట్టణమున British School of Archaeology కలదు. ఏథెన్సు రోమునగరముల పరిశీలన సంస్థలుకలవు. క్రీ. వె. ౧౮౪౩ లో నేర్పడిన British Archaeological Association అనఁబడిన సంఘము చాలసహకారియై యున్నదందురు. క్రీ. వె. ౧౮౫౬ సంవత్సరమున గ్లాస్గోనగరమున Scottish Archaeological Society ఏర్పడి, పనుల నిర్వహించుచున్నది. The Royal Archaeological Institute of Great Britan and Ireland పరిశీలనలను నెరపుటయేగాక, ఒక పత్రికను నడపుచు ప్రకటించుచుండుట ముఖ్యముగ గమనింపఁదగినది.

మఱియు నీవిజ్ఞాన విధానము వేఱ్వేఱుజాతుల జంతువుల ఎముకలందు కొలతలు, లక్షణములు, పోలికలు, కాలముందెలుపు చిహ్నములు, పోలిక సాధనములు మొదలగునవి వివరింపఁబడియుండు గ్రంథములు కలవు. చరిత్రక విధానమెక్కువ ఉపకారమొనర్చుచు, తెలియని సంగతుల నెఱుంగఁ జేయుట కికముందు తోడ్పడునను నాశకలదు. చిన్న సామంత ప్రభుత్వములు కూడ భరతదేశమున నీ Archaeological ప్రభుత్వశాఖ నేర్పరచి పరిశీలించుచుండుట మోదావహము.

**ఆర్చిపిలెగో** — (ద్వీపసముదాయము) Archipelago (Arkipel-a-go) సమీపమున గుమిగూడియుండు కొన్నిద్వీపముల (Islands) సముదాయమునకు Archipelago అని పేరు. ఇందు ద్వీపములును, వానిమధ్యగా నుండు సముద్రభాగమును జేరి యీపేరం బరగును. సర్వసాధారణముగ నైరోపాయందు గ్రీసునకును, ఏష్యామైనరునకును మధ్యంగల ద్వీపసముదాయమును ఆసియాఖండప్రాంతమున సుండా ద్వీపములు, బార్నియోద్వీపము, ఫిలిప్పైన్ ద్వీపములు, సెలిబిస్ ద్వీపము, మలాకాద్వీపములం గల్గిన ద్వీపసముదాయములు ఆర్చిపిలెగో (Archipelago) లను పేరులం బరగుచున్నవి.

**ఆర్చిబాల్డు - ఆర్చర్** (Archibald_Archer) — ట్యూటోనిక్కు పేరు. Holy Prince అని యర్థము. ఇందలి ముద్దుపేర్లు Archie, Archy అనునవి. పురుషనామము. (క్రైస్తవనామములు చూడుఁడు).

**ఆర్చిబ్రిడ్జి** (Arch-Bridge)— వంతెనలు చూడుఁడు.

**ఆర్టికిల్సు ఆఫ్ ఎసోసియేషన్**

వాణిజ్యసంబంధ పరిభాషాపదము. (Articles of Association). కొంద ఱొకసంఘముగ జేరి కొన్ని కార్యములం జేయుచుండుటకు కొంత

మూలధనమేర్పరుచుకుని వ్రాసికొనిన సమాఖ్య పద్ధతులని యర్థము. ఇది అచ్చుకావలెననియు, పేరగ్రాఫులకు సంఖ్యలు వేయఁబడవలెననియు, అదివఱకు వ్రాయఁబడిన Memorandum of Association కు వ్యతిరేకముగ నుండరాదనియు, కొంతనిర్ణీతమూలధనముతో నియతికి మీరని (వర్తక) సంఘముగ నుండవలయుననియు, ప్రభుత్వశాసనము కలదు.

**ఆర్కిటిక్సర్కిల్** (Arctic Circle) – ఇది ఉత్తరధృవము నుండి భూమధ్యరేఖవైపున నిరువదిమూడున్నర డిగ్రీల దూరమున నున్నట్లు భావింపఁబడిన రేఖ. దీనికిని, ఉత్తరధృవమునకును మధ్యప్రదేశమున ఆరునెలలు పగలుగను, ఆరు నెలలు రాత్రిగను ఉండి Midnight Sun అగుపడుచుండునని చెప్పంబడినది. (అంటార్కిటిక్సర్కిల్ చూడుఁడు). అంటార్కిటిక్ సర్కిల్ (Antarctic Circle). ఇది South Pole దక్షిణ ధృవము నుండి భూమధ్యరేఖవైపున ఇరువదిమూడున్నర డిగ్రీల దూరమున నున్నట్లు భావింపంబడిన రేఖ. దీనికిని దక్షిణధృవమునకును నడుమనుండు ప్రదేశమునం దారునెలలు పగలును, ఆరునెలలు రాత్రియు నని చెప్పంబడినది. (అంటార్కిటిక్ సర్కిల్ చూడుఁడు).

**ఆర్టిజన్ వెల్** (Artisan well) — దీనిని పాతాళగంగ యనికొందఱుచెప్పుచున్నారు. ఆర్టిజన్ నూతులందు మామూలు నూతులందు వలె ప్రక్కలనుండి నీరురాదు. నాల్గువేల అడుగులవఱకు త్రవ్వఁబడిన నూతు లచ్చటచ్చట కలవు. అడుగున నీటినిల్వయో లేక వేఱొక ఎత్తగు తావునందు నిల్వయయి భూమిలోని నూతిగొట్టపు టడుగునకుం దాకిన జలమార్గమో తగులువఱకు, ఈ నూతులం ద్రవ్వకొనుచు గొట్టములం దింపుచుందురు. కాన వీనిని ట్యూబ్ వెల్సు (Tube wells) అనియునందురు.

ఈ నూతులు రెండువిధములు. ఆర్టిజన్ వెల్ (Artisan well) అనియు, సబార్టిజన్ వెల్ (Sub artisan well) అనియును. అందు ఆర్టిజన్ వెల్ నుండి నీరెడతెగక, ఒకేరీతిని క్రింది ఒత్తిడివలన తనంతట తానే పైకి ప్రవహించుచుండును. సబార్టిజన్ వెల్సు నందట్లుకాక నూతియందు కొంత ఎత్తునకెక్కి నిలచిపోయి యుండును. దానిని బయటికి పంపులమూలమునం దోడుకొనవలయును. తొలి ఫరాసు (France) దేశములోని ఆర్టాయిస్ (Artois) అను మండలమున నీనూతులు ప్రారంభమగుట నాపేరునం బరగ నయ్యెను.

**ఆర్టిఫిషియల్ వూల్** (Artificial wool) **పరిశ్రమ** — ఇది కృతకమగు ఉన్ని పరిశ్రమ. ఇటీవల ప్రారంభింపఁబడిన విద్య. దీనిని నార (Jute) నుండిచేయుదురు. దీనింగూర్చి కెమికల్ ఇండస్ట్రీస్ "Chemical Industries" నందు వివరింపఁబడియున్నది చూడుఁడు.

25 to 30 percent strenth గల caustic potash నందు కొలఁదికాలము నానునటుల ముంచి ఒక Rotating Drum నందు ప్పుచు నెండించి, శుభ్రపర్చుదు రనియు, అది ప్రత్యేకముగ నేయంబడుటకాని, ఊలుతో కాని, పట్టుతోకాని, పత్తినూలుతోకాని కలిపి నేయవచ్చుననియు, అందే వివరింపఁబడినది. ఇది ఇంకను సరియగు స్థితికి రావలసియుండును.

**ఆర్టిఫిషియల్ రేడియమ్** (Artificial Radium)— ఇది కృతకమగు రేడియమ్ పదార్థము. రేడియమ్ లోకప్రసిద్ధద్రవ్యము. కాని అది చాల నరుదు. ఇంతదనుక ప్రపంచమంతటను ఇరువదియాఱౌన్సులు మాత్రమే యున్నదనిన ఎంతయరుదో గ్రహింపనగుచున్నది. ఇంతవఱ కది గొప్పగొప్ప ఆసుపత్రులందు

Specialists కడ మాత్రమేయున్నకతన విలువ లేనిదిగనున్నది. అతిభయంకర వ్యాధులం గుదర్చుంగల నీమహత్వదార్థము సులభసాధ్యము కాదు. కొందఱు రసాయన శాస్త్రవిదులు దీనిం గూర్చి కొంతకాలముగ యోచించుచుండిరి. అందు డాక్టరు మిల్లికాను(Dr. A. Millikan) పండితుఁడు చేసిన ప్రయత్నములు కొంతవఱకు ఫలించినవనియే చెప్పవలయును. ఈమహానీయుం డిదివఱకు Cosmic Rays సందర్భమున గొప్ప పేరందియుండెను. కృతకమార్గమున New Radio-active Substances కనుఁగొనెనని తెలియుచున్నది. ఈతండు అమెరికాదేశమున California Institute of Technology సంస్థయందు పరిశీలనలను సాగించుచుండెను. డాక్టరు మిల్లికాన్ (Dr. A. Millikan) పండితుఁడు బయలుదేరఁదీసిన క్రొత్తవింతపదార్థములు రేడియమ్, ఎక్సురే, ట్యూబులనుండి వెడలువాటింబోలు కిరణముల (Gama Rays) ను వెడలించుచు రెండులక్షణములలో వానింబోలియే యున్నదనియు, పరిశీలనలింకను జరుగనున్నవనియు తెలియుచున్నది. (ఆరమ్ చైరు సైన్సు అను పత్రికనుండి. చూడుఁడు).

**ఆర్డినెన్సు సర్వేకొలత** (Ordinance Survey) — ఇట్టికొలత సైనికకార్యములకుం గాను చేయఁబడునది యని స్ఫురించుచునే యుండెను. తొలుత నింగ్లాండు, స్కాట్లండు, ఐర్లాండు దేశములంగల్పి సైన్యాధికారులచే ముక్కోణములు (Triangles) గా విభజింపం బడి కొలతచేయంబడినదాదిగ నట్టి కొలతలకు ఆర్డినెన్సుసర్వే యని పేరు వాడుకనందెను. భరతదేశమునందునను ఇట్టి సర్వేకొలతల కేర్పాటులుకలవు. తరుచుగ నిట్టి ముక్కోణముల తావులు హద్దుగ పర్వతాగ్రములుగ నేర్పరుచు కొనుట పద్ధతియైయున్నది. అవిలేనితావుల దిమ్మలనుగట్టియు, గొప్ప స్తంభములను పాతియు పనిచేయుచుందురు. వీనిపై నూదాదీపములను వెల్గించి రాత్రులందు సర్వేపనులు నెరపుట సుకర మందురు. ఇటులనే భూమధ్యరేఖ (Equator) నుండి ముక్కోణములతో భూమి యంతటింగూడ గొలుచుటకు వీలుకల్గెను.

**ఆర్థికసూత్రములు — (Principles of Economics)** నేఁటికాలమున భౌతిక నాగరికత యధికమైనకొలఁదియు నార్థిక విషయము ప్రాముఖ్యము నందుచున్నది. ప్రపంచ చరిత్ర యంతయు నార్థికవ్యవస్థపై నాధారపడియున్న దనిన నత్యుక్తి కాదు. ఆకారణముననే అర్థశాస్త్రము, ఆర్థికసంబంధముగు మానవచరిత్ర (Study of man in relation to wealth) గా నార్థికశాస్త్రకారులచే నిర్వచింపఁబడినది. ఇదియొక ప్రత్యేకశాస్త్రముగా బరిణతినందుచు నింకను నూత్నసాంప్రదాయములచే నభివృద్ధి యగుచున్నది. వెనుకటి దినములలో దీనిని పొలిటికల్ ఎకానమీ (Political Economy) అనువారు. ఈ అర్థశాస్త్రమునకు సంబంధించిన సూత్రముల (Principles of Economics) నీక్రిందఁ బొందుపఱచిన విధమునఁజెప్పఁబడినవి. ఆధునికార్థశాస్త్రము ధనధాన్య వస్తురూపకమగు సంపద యేవిధమున నుత్పత్తిచేయఁబడి తుదకెటు లనుభవింపఁ బడుచున్నదో వివరించును. ఈ శాస్త్రమున నాలుగు విభాగములు గలవు.

౧. ఉత్పత్తి (Production). — ఈ భాగమున వివిధవస్తువితతియొక్క ఉత్పత్తి తెలియనగును. ఉత్పత్తియన ననేకములగు వస్తువుల నొకచోఁగూర్చి ఉపయుక్త (Utility of an Article) గల రూపముగా నొనర్చుటే కాని క్రొత్తవస్తువును తయారుచేయుటకాదు. ఉదా.

సాలెవాడు ప్రత్తినుండి దారముతీసి ఉపయోగ కరమగు వస్త్రముగా నొనర్చునుగాని, వస్త్రము నూత్నసృష్టి కాదు. ఉత్పత్తిసాధనములు నాలుగు.

(౧) భూమి (Land)- ఉత్పత్తికి భూమియే యత్యవసరము. భూమిపైనున్న నదులు, పంట నేలలు, అరణ్యములు, పర్వతములు, సముద్రములేకాక, భూమిలోనున్న గనులు, విలువగల పదార్థములుకూడ వస్తునిర్మాణమున కనుకూలించుచున్నవి. యంత్రము లుపయోగమునకు వచ్చిననాటినుండియు యంత్రసాహాయ్యమున భూమిపై ననేకయంత్రాలయములు (Factories) నిర్మింపఁబడి మానవున కుపయుక్తములగు వివిధ వస్తునిర్మాణమునకు సాధనము లగుచున్నవి. ధాన్యసమృద్ధములగు పైరు పంటలకు భాగ్యవంతములగు ఖనిజసంపదకుఁ గూడ భూమియే యాధారము; అది లేనిచో నుత్పత్తియే యసాధ్యము.

(౨) కార్మికులు (Labour)- ఉత్పత్తికి రెండవసాధనము కార్మికసముదాయము. ఉత్పత్తిస్థానము భూమియైనను, అందుఁ బనిచేయుటకుఁ గార్మికులవసరము. వ్యవసాయకులుగను, యంత్రశాలలలోఁ బారిశ్రామికులుగను, నేఁడు కోట్లకొలఁది ప్రజలు పనిఁజేయుచున్నారు. ఈమానవశక్తి కూడ నుత్పత్తిసాధనమే. కార్మికు లెంత పనితనము (Skill) చూపిన నుత్పత్తి యంత యెక్కువ ఉపయుక్తమగునదియు, విలువగలదియు నగును. అమెరికా మొదలగు దేశముల పరిశ్రమ లభివృద్ధిలో నుండుట కందలి కార్మికుల పనితనమే కారణమందురు. ఉత్పత్తిసాధనములన్నిటిలో నిదియే ముఖ్యమైనదని సామ్యవాదుల (Socialists) యభిప్రాయము. కార్మికుల పనితనము సామాన్యముగ దేహస్థితి, శీతోష్ణస్థితుల ప్రభావము, విద్య, అభ్యాసము మున్నగు వానిపై నాధారపడి యుండును.

(౩) పెట్టుబడి (Capital)-ఉత్పత్తిసాగుటకు, కార్మికులను బోషించుటకు, భూములనద్దెకుఁదీసికొనుటకు, యంత్రాలయములనిర్మించుటకు, ముడివస్తువుల కొనుటకు మూలధనమవసరము. దీనినే పెట్టుబడియందురు. ఉత్పత్తి కుపయోగపడు నుపకరణములు (Several tools, Instruments and Machines) కూడ పెట్టుబడి కిందకు వచ్చును. ఈ పెట్టుబడి నొకరే భరించుటకష్టముగాన చాలమంది వాటాదారులుగఁ (Share Holders) జేరి పెద్దపెద్ద యంత్రశాలలునిర్మింపఁ గలుగుచున్నారు. వీరందఱి సహకారము వలననే సంయుక్తవ్యాపారసంఘములు (Joint Stock Companies) వంటి పెద్దపెద్దసంస్థలు బయలుదేరుట కవకాశము గలుగుచున్నది. అప్పు తెచ్చినసొమ్ముపై వడ్డీచెల్లింపగా మిగిలిన లాభమును జరిగిన ఒప్పుదలప్రకారము వాటాదారులకుఁ బంచుదురు.

(౪) వ్యాపారనిర్వహణము (Business Organisation)- భూమి, పారిశ్రామికులు, పెట్టుబడియున్నను నేర్పుగల వ్యాపారజ్ఞుఁడొకఁడీ కార్యములన్నియు దక్షత బాధ్యతలతోఁ జూడక పోయినచో పనిసాగదు. ఇతనినే వ్యవహారవేత్త (Enterpreneur) అందురు. ఇతఁడుసమర్థతతో సంస్థనంతయుఁ బరిశీలించుచు విడుదలకొనుగోలులు (Buying and Selling) లాభకరమగునటుల వ్యవహారము సాగించుచుండును. ఇతని నైపుణ్యముమీదనే సంస్థ యభివృద్ధి యాధారపడి యుండును. ఉత్పత్తి, పూర్వ గృహపరిశ్రమలనుండి (Cottage Industries) నేఁటి యంత్రశాలలందలి ఉత్పత్తివరకు ననేకదశలందినది.

౨. మారకము (Exchange)- అర్థశాస్త్రమునందిది యొక ముఖ్యాంగము. ఒక దేశమునందొక జాతికి సంబంధించినవరకమే కాక అంత

జాతీయవర్తకము (International Trade) గూడ నీసిద్ధాంతముపైననే యాధారపడియున్నది. ఒకదేశము తనకు లాభకరమగునటుల నుత్పత్తిజేసిన సరకుల నెగుమతిజేసి యాదేశమునుండి ఎగుమతి సరకుల విలువగల సరకులను తన కుపయుక్తమైనవానిని దిగుమతి జేసికొనును. దిగుమతిసరకుల విలువను ఎగుమతి సరకులచేఁ జెల్లింతుగని భావము. (Exports paid for Imports). ఈవిధానము రెండు దేశములకు వీలుగానుండి సరిపడకపోయినచో మూడవదేశము పరముగ సరిజూచుకొందురు. ఇంగ్లాండు తన యినుపయంత్రముల నమెరికాకెగుమతిచేసి దానికి బదులచటినుండి గోధుమలు దిగుమతిచేసికొనును. ఇందు లెక్కలు సరిపోవకపోయినచో కెనడా గూడ వీనిలోజేరును. ఇంగ్లాండునుండి ఉన్ని వస్త్రములు దిగుమతిచేసికొనిన కెనడా, తన సొమ్మునకు తిన్నగ నింగ్లాండునకుపంపక అమెరికా (గోధుమ ఇంగ్లాండున కెగుమతిజేసి యాదేశము నుండి డబ్బు పొందవలసిన) దేశమునకు కాఫీగింజలుపంపి తనయప్పునుతీర్చును. అమెరికాకు ఇంగ్లాండీయవలసిన బాకీలను, ఇంగ్లాండునకు బాకీపడిన కెనడా చెల్లించును. దీనినే త్రివిధాన వ్యాపారము (Tri-corner Trade) అందురు. మాటి మాటికి విదేశములకు ధనమును పంపి తెప్పించుకొనుటకైన ఖర్చులను తప్పించుకొనుటయే ఇందలివిశేషము. పూర్ణాభివృద్ధినందిన బ్యాంకులు (Joint Stock Banks) విదేశ మారకపు బ్యాంకులు, (Foreign Exchange Banks) ఇందులకు మిక్కిలి ఉపయోగపడుచున్నవి.

3. సంపద్విభజనము (Distribution). పైవిధమున నుత్పత్తి చేయఁబడి, దేశదేశముల వ్యాప్తినందిన వస్తువులనుండి కలుగు ఫల మెవరి కేవిధమున విభజింపఁబడినదియుఁ దెలుపుట ఆర్థికసూత్రములలో నొకటి. ఉత్పత్తిసాధనముల కన్నిటికి వానివాని భాగముల ప్రకారము ఫలితము వచ్చును. భూముల కద్దెయు (Rent), కార్మికులకు, జీతములును (Wages for Labour), మూలధనమునకు (పెట్టుబడి) వడ్డీయు (Interest), వానినన్నిటిని సరిచూచు వ్యవహారవేత్తకు (Enterpreneur) పై ఖర్చులు చెల్లింపగా మిగులు లాభము వచ్చును. వీనిలో నేవిషయము మార్పు జెందినను సంస్థకువచ్చు లాభములు కూడ మారును. వీని నిర్ణయములలో. నెవరి యనుకూలము వారు చూచుకొందురు.

౪. అనుభవము (Consumption) — ఉత్పత్తిచేయఁబడుట అనుభవించుట కొఱకే. ఆకారణమున నిదియు నర్థశాస్త్రమున ముఖ్యాంశముగఁ బరిగణింపఁబడినది. ప్రాచీనులీవిభాగప్రాముఖ్యము నంతగఁ బాటించినట్లగపడదు. మానవులు సహజముగ వాంఛలు (Wants) కలవారు. వాంఛాసిద్ధికై వారు పనిజేసి వానిని బొంది యనుభవింతురు. ఇందు వస్తువుయొక్క ఉపయుక్తినే (Utility of an article) వారు పొందుదురన్నమాట. ఈ వాంఛలలో నత్యవసరములు (Necessities), సుఖప్రదములు (Comforts), భోగములు (Luxuries) అను విభాగములుకలవు. జీవితమున కన్నిటికన్న అన్నవస్త్ర గృహాదు లత్యవసరములు. వీనిని పొందుటకే మానవుఁడు మిగుల ప్రయత్నించును. నాగరికత హెచ్చినకొలదియు రేడియో, మోటారుకారుల వంటివి (Comforts and Luxuries) కూడ నత్యవసరము లగుచున్నవి. ఇది నాగరికతకు లక్షణమని కొందఱివాదము. వస్తువుల ఉత్పత్తి, మారకము, విభాగములకు పరమావధి అనుభవము (Consumption) అని తెలిసికొనినప్పు డీవిభాగములకుఁగల యంతస్సంబంధ మర్థమగును. ఆంగ్లమున ఈశాస్త్రము

నకు ఎకనామిక్సు (Economics) అనెదరు. (అర్థశాస్త్రము, ఎకానమీ చూడుఁడు.)

**ఆర్బిట్రేజి** — వాణిజ్యసంబంధపరిభాషా పదము. (Arbitrage Price) దామాషాయి ధర- వేఱ్ఱేఱు తావుల నొకేకాలమున గల ధరలను దామాషాయి (Average) చేసిన ధర.

**ఆర్బిట్రేషన్** — (వాణిజ్యసంబంధపరిభాషాపదము) (Arbitration)- మధ్యవర్తి చేయు ఫైసలాతీర్మానము. ఇది వర్తకవ్యవహారములో నాచారమై యున్నది. కల్గిన ప్రతి తకరరునకు ప్రభుత్వపున్యాయస్థానముల కేగుట ధనవ్యయమే గాక, కాలాతీతముకూడ సంభవించు గాన, ఒక (సంబంధములేని) మధ్యవర్తిచే వ్యవహారము పరిశీలింపఁజేసి యాతని తీర్మానమున కిరుతెగలవారును అంగీకరించుట కీపేరు వర్తించెడిని.

Arbitration of Exchange - ఒక దేశమునుండి వేఱొక దేశమునకు సొమ్మును వర్తకవ్యాపారసంబంధముగ పంపవలసినయపుడు మారకపు రేటు (Exchange rate) ప్రకారము మార్పువట్టము తగులును. ఈమార్పువట్టము వేఱ్ఱేఱు దేశములమధ్య వేఱ్ఱేఱు (ఎచ్చు, తక్కువ) రేట్లు గల్గియుండును.

ఒక్కొకతరి ఒకదేశమునుండి సరాసరి వేఱొక దేశమునకు సొమ్ముపంపుట కగు మార్పువట్టము కన్న, ఆసొమ్ము ఆదేశమునకే వేఱుగ నింకొక దేశముగుండా పంపినచో మార్పువట్టము తక్కువయై కుదురుచుండుటయుం గలదు. అట్టితరి ముందా దేశమున కాసొమ్ము నంపి, అటనుండి యొక మధ్యవర్తిమూలమున మఱియొక దేశమునకంపుదురు. దానికి Simple arbitration of exchange అని యందురు. మఱియు నిటులనే ఒకటికన్న నెక్కువ (వేఱ్ఱేఱు) దేశములగుండా యాసొమ్మును పంపవలసిన దేశమునకంపుటను Compound Arbitration of exchange అని యందురు. Arbitration of exchange యన సొమ్ముమార్పునకు మధ్యవర్తిత్వమని యర్థము.

**ఆర్మినియానిజమ్** (Arminianism)- (Protestant Christian Doctrine). Jacobus Arminius లేక డచ్చిభాష యందు Jakob Harmensen అనునాతఁడు హాలండుదేశమున ౧౫౬౦ సంవత్సరమున జనించెను. ఈతఁడు జాన్ కాల్విన్ (John Calvin) బోధించిన సిద్ధాంతమును నిరాకరించినవాఁడు. దేవుడే కొందరిని రక్షించుటకెన్నుకొని తక్కినవారిని నశింపఁజేయుటకు వదలివేయుననుట నిరాకరించి ఈక్రింది నాల్గుసిద్ధాంతములను ప్రతిపాదించెను. ౧. ఆదినుండియు దేవుఁడు మనుష్యుల ప్రాణములకు రక్షణయే సంకల్పించి, ఏసుక్రీస్తునందు శరణ్యమునంది, నమ్ముకొనియున్నవారల కారక్షణ సిద్ధించుటకు నియమించెను. ౨. ఏసుక్రీస్తునందు శరణ్యము పొంది ఆయనను నమ్మినవారలకే మోక్షరక్షణలు కల్గుటకేర్పాటైనను ఏసుక్రీస్తు మనుష్యులందఱి కొరకు మరణమునందినవాఁడు. 3. మనుష్యులందఱకు సామాన్యముగ తమలో రక్షణసాధనము Saving Grace లేకున్న లేకపోవచ్చును. కాని Holy Spirit మూలమున వానిలో నాలక్షణము (Saving Grace) ఉదయించి కలుగవచ్చును. ४. ఈ Saving Grace ను ఎదుర్కొని ఆపినను ఆపనగును. ౫. ఈ Saving Grace నుండి పతితుఁడైనను నగును. పిదప John Wesley అనునాతఁడీతనికి శిష్యుఁడయ్యెను. కాన Wesleyan Methodists యొక్క మతసిద్ధాంతములు చాలభాగము యీ ఆర్మినియను (Arminian) సిద్ధాంతముల

ననుసరించుమనే యుండెడిని. ఆర్మీనియనిజమ్ (Arminianism) వాదమున మానవులకు మనోస్వాతంత్ర్యము కలదనియు, నమ్మికయే రక్షణకు ఆధారమనియు, అట్టినమ్మిక మనోస్వాతంత్ర్యమునుండి గల్గినదే యనియు సిద్ధాంతము. దీనిని జాకోబస్ ఆర్మీనియస్ అనువాతఁడు బోధించెను. దీనినెదుర్చుచు నెవ్వరో వాదించెనట హాలండునందు క్రీ. వె. ౧౭ శతాబ్దకాలమట, బోధకుఁడు హాలండుదేశస్థుఁడు. ఆయన గొప్పవిద్వాంసుఁడు. జెనీవాయందు చదువుకొని లెయిడన్ పట్టణమున క్రీ. వె. ౧౬౦౩ నుండి తానుమృతినందువరకు అనఁగా ౧౯ అక్టోబరు ౧౬౦౯ వరకు ప్రొఫెసరుగా నున్నవాఁడని తెలియుచున్నది.

**ఆర్మీనియా దేశము** — ఆర్మీనియా దేశపు ప్రజలు ఆర్మీనియను లనఁబడుచున్నారు. వీరు భరతదేశమున సర్వసాధారణముగ పెద్ద నగరములందుఁ గానఁబడుచున్నారు. కలకత్తా చెన్నపురి మొదలగు నగరముల వీరు విస్తారముగ నున్నారు. వీరు ఆసియాఖండపువారే గాని ఐరోపాఖండమువారు కారు.

క్రైస్తవమతప్రారంభమున ఆదిని వీరుక్రైస్తవ మత మవలంబించినవారట. వీరి మతవిధానమున కార్మీనియన్చర్చి యనిపేరు. వీరిదేశ మార్మీనియా మూడు ముక్కలుగనై, పర్షియారాజ్యమున కొంతయు, రష్యారాజ్యమునకొంతయు, తురుష్క రాజ్యమున కొంతయుం గలసిపోయి, వీరిలో ననేకులు విదేశములపాలై పోయిరి. యూదుల వలె వీరును చెదరిపోయి, అనేక దేశములందు గాన్పించుచున్నారు. పర్షియాయందలి వర్తక స్థానమగు టేబ్రియజ్బురము ఆర్మీనియాదేశభాగములోనిదే. ఆసియాదేశపు రష్యాలోని ట్రాన్సుకాకాసియన్ప్రోవిన్సునందున్న ఎరివాన్పురమును, షెట్ఛా పురమును, ఆర్మీనియాదేశ భాగములోనివే. ఆసియాదేశపు టర్కీలోనున్న వర్తకస్థలమగు ఎజ్రేరమ్పురమును, సరిహద్దునను న్న అరారాత్పర్వతమును, తొల్లింటి ఆర్మీనియా దేశములోనివే. ఇప్పుడాయరారాత్పర్వతశిఖరము కడ టర్కీరాజ్యము, పర్షియారాజ్యము, రష్యారాజ్యము సంధించుచున్నవి.

ఈ దేశమురదృష్టమేమియో కాని ఆర్మీనియా కిచ్చట ప్రారంభమనిగాని, ఇచట కడయని తెల్పుటకు వీలుకాకుండ ఎలలు మాసిపోయి, నామమాత్రావశిష్టమె నిలచియున్నది. వెనుక టర్కీ సుల్తానుగానుండిన రెండవ అబ్దుల్హమీదుగారి పాలనమున ఆర్మీనియనులపై వారికిం గల్గిన యసూయత, వారిరాజ్యమున ఆర్మీనియాయను పేరులేకుండ నీఆర్మీనియను విలాయతులు కురుదుస్థానము మొదలగు ఇతరప్రావిన్సులందు గలిపివైచుటయేగాక వారి సెన్సరులకు ఆర్మీనియాయను పేరుగల ప్రతి పుస్తకమునను, ఆపేరు కొట్టివేయఁబడుట, చెరిపివేయఁబడుట కాజ్ఞల నొసఁగిరట. ఒక గ్రంథకర్తయొక్క Kieth Johnston's Book on Geography లోని కొన్నిపుటలు పరిహరింపఁబడినవని తెలియుచున్నది. దేశము పీఠభూములమయమని చెప్పవచ్చును. అరారాత్పర్వత మీదేశములోనిదని చెప్పవచ్చును. యూఫ్రటీసునది దీనిగుండా ప్రవహించుననియు, కుర్ నది, అరాస్నది ఈ దేశముగుండానడచి, ఈ దేశపు హద్దుగానుండిన కాస్పియనుసముద్రమును జేరునని చెప్పవచ్చును. అయిదువేల అయిదు వందల అడుగుల ఎత్తునగల ఉప్పునీటివాన్సరస్సు ఈదేశములోనిదే.

వేసవికాలమున కొంతవఱకు వేడి ఎక్కువగానేయుండి శీతకాలము మంచు భూమిపై వేరుకొని యుండునంతటి చలిగానుండును. ఎజ్రేరము పురపు వీధులం దొక్కొక సంవత్సరమున శీతకాలమునందు మంచు ఎక్కువ పడినకతన ద్వార

ములకడకు లోతుగ మంచును ద్రవ్వి మార్గములు జేసికొనెదరట.

ఆర్మీనియనులు తొల్లింటి జలప్రళయాంత మున, నోవామహాత్ముని ఆర్కు ఓడ జలప్రళ యాంతర మీాయరారాత్పర్వత శిఖరమున తగిలి యాగెననియు, (నోవాస్ ఆర్కు చూడుఁడు) ఆయన కుటుంబ మటదిగి వసించిరనియుం జెప్పు దురు. ఏటేట నాపండుగ నొనర్చుచుందురు. అత్తరిని వారు ఓడయందు మిగిలిన యాహార పదార్థములగు పండ్లనన్నిటిం బిసికి ఏదో పిండి వంట జేసికొనిరట. అట్లే నాఁడునుచిక్కిన పండ్లం బిసికి ఏదో పిండి వంటఁ జేసికొనెదరు. వెల్లువజల ముల సూచకముగ నొకరిముఖములపై నొకరు కొంచెము జలములం జల్లుకొందురు. భక్ష్యము లను పక్షులవలెను, మృగములవలెను జేసికొం దురు. ఆరారాత్పర్వతము యొక్క దక్షిణము వైపున ఏటవాలు ప్రదేశముననే నోవామహాత్ముఁ డు ద్రాక్షతోటను నాటెనని ప్రతీతి కలదు. నేఁటి కిని ఆసీమ యాతయు ద్రాక్షతోటలు, ఆ తోటల మయమై యున్నది.

క్రీ. వె. మూఁడవ శతాబ్దాంత కాలమున నప్పటి వీరి భూపతియగు గ్రెగ్రీసనువారిని క్రైస్తవ మతాధ్యక్షుడగు Pope Gregory the Illuminator క్రైస్తవ మతమునకుం జేర్చి దీక్షనిచ్చుటంజేసి వీరి ఆర్మీనియన్ చర్చి గ్రిగోరియన్విదాన మనియెదరు. ఆర్మీనియనుల స్వభాషయు, లిపియు ప్రత్యేకముగ గలవు. వీరి లిపియందు ౩౮ అక్షరములున్నవి. తొల్లింటి ఆర్మీనియా భాష దేవాలయములందు వాడుటయె గాని అందఱి కర్థము కాదు. ఇటీవల పాఠశాల లందు నేర్పుట ప్రారంభమై ప్రచారములోనికి వచ్చుచున్నదని వింటుము. వీరు ఇరువది లక్షల మంది కలరనియు, అందు టర్కీరాజ్యమున పది లక్షలు కలరనియు, ఒక ఇస్తంబూల్నగరముననే లక్షా యాభై వేల మంది కలరనియుం దెలియు చున్నది. వాణిజ్య చతురతలు వీరికిం జక్కగా తెలియును. బద్ధకమనునది లేక పనిపాటు లొన ర్తురు. కాని పిరికివారని చెప్పఁబడినది. ఎక్కువ నమ్మకస్థులు. ద్రోహమొనర్చుట వీరియందు గొప్పతప్పు. వీరియందు కూలినాలులం జేయు వారికి ఇస్తంబూల్నగరమున హామాలని పేరు. వారు గొప్ప బలాఢ్యులు. ఒక గుఱ్ఱము మోయఁ దగిన బరువులో సగముబరువు నొక్కఁడు మోసి కొని పోగలఁడట.

## ఆర్కిమేడిస్ సిద్ధాంతములు —

ఈ మహానీయుఁడు, ఇటలీదేశమునకు దక్షిణమున నున్న సిసిలీ దేశస్థుఁడు. సైరాక్యూజు పట్టణ నివాసి. అది యక్కాలమున మూఁడు లక్షల జనాభాగల నగరమని చెప్పఁబడినది. ఆదేశ మక్కాలమున హిరోయని పేరుగల భూపాలు నిచే పాలింపఁబడుచుండెను. ఆర్కిమేడిస్ వారికి సమీపబంధువు, ప్రాణమిత్రుఁడు, సంప న్నుఁడు, బుద్ధిశాలి, పరిశీలకుఁడునై యుండు వాఁడు. మఱియు హిరోభూపాలుని పుత్రుఁడగు గెలోయువరాజునకు విద్యాగురువు. ఆయన జన్మకాలము క్రీ. పూ. ౨౮౭ గ చెప్పఁబడినది. ఈధీశాలి యొనర్చిన పరిశీలనలనుండి, కొన్ని ప్రకృతిరహస్యములు, లోకమున కెరుకయైనవి. వేఱ్వేఱు లోహములు సమానబహిః ప్రమాణము లం గల్గియున్నను, తూనికయందు (భారము) ఎక్కువ తక్కువలు తూఁగునని, ఎల్లరెరుంగుదురు గదా. వానినే నీటియందుఁదూచిన నింకను తక్కువ తూఁగునని ఆర్కిమేడిస్ కనుఁగొనెను. ఇటుల తూచుటకు, ఆయన ప్రపంచవస్తువులను నీటమున్గునవియు, నీటం దేలునవనియు ద్వివిధ ములుగ విభజించెను. నీటిలో మునుగు వస్తు వులు, నీటికంటె భారమగుటచే మునిఁగెడిని. అందలి నిజతత్వమేమన, నీటం బడవైచిన వస్తువు

యొక్క బాహ్యాకారపరిమాణ మెంతయుండునో, అంత పరిమాణమేగలనీటిని, ఆ జలపాత్రమునుండి పైకి ఉబకచేయుటగాని, (పాత్ర పట్టనిచో) పైకి పొగలచేయుటగాని, యొనరించును. ఇట్లనుట వలన, వేఱొక సంగతి స్ఫురించెడిని. వస్తువు లేకుండ జలము నింపిన పాత్రను తూచి, పిదప ఆవస్తువనందుంచి తూచినయడల (అధికమైన నీరందే నిలచియుండినచో) ఆవస్తువబరువే అధికమై తూగునుగదా. (వస్తువనం దుంచుటవలన నధికమైన) నీరు ఆవస్తువయొక్క బాహ్యాకార పరిమాణ మెంతగలదో అంత పరిమాణము గల నీ రెంత తూగునో, అంత భారమె ఇందు అధికమగును. కాన ఆనీటి బరువే నీటియందుంచి తూచిన ఆవస్తుభారమునుండి తగ్గి (హ్రాసునందు) అగుపడునట్లు తూగెడిని, అనగా గాలియందెక్కువ తూగుటయు, నీటియందు తక్కువ తూగుటయు ధర్మరహస్యమిది.

ఇంక కఱ్ఱముక్కలు, జీలుగుబెండు మొదలగు నీటియందు తేలు వస్తువులు, నీటి శరీరపుభారము కన్న, శరీరభారము తక్కువ కలవి గాన నీటియందు తేలును. అనగా జలకణములచే పైకి నెట్టఁబడునని భావము. అట్టివస్తువులను నీటియందుంచి తూచినచో, అవి నీటిపై తేలుచుండినను, నీటం బడుటవలన, ఎంత నీటిని పై కుబుకఁజేయునో లేక వెలుపలికి ఒలకనిచ్చునో అంత నీటియొక్క బరువునే (నీటినుంచి తూచినపుడు) తగ్గును. ఈ మహానీయుఁ డీసంగతులను పరిశీలించి కనుగొని లోకమునకు వెల్లడించెను. మరియు నీపరిశీలకుఁడే ఘనమానము (Cubical measure) నందు, గోళమానము (Round measure) మూడింట రెండుపాళ్లుండుటం గన్గొనిఁ వెల్లడించెను. ఇంకను ఈతండే మీట (Liver), కప్పి (Pulley), స్క్రూ (Screw) లంగూడ గన్పెట్టెనట.

**ఆర్మజ్ద** — పారశీక జరథుస్త్రధర్మమున మంచికిని, వెలుగున కధిపతియైనవాఁడు. యోగ్యుఁడని చెప్పఁబడినవాఁడు. ఈతని సోదరుఁడు అహ్రిమాననునాతఁడు చీఁకటికి చెడ్డకు అధిపతి. దుష్టుఁడని చెప్పఁబడినవాఁడు. మానవుల హృదయములను ప్రేరేపించుచుందురు. ఎట్లు ఎప్పుడు జరగినను ఆర్మజ్ద కడకు జయమందునని చెప్పఁబడినది.

**ఆర్యులు** — తొల్లింటికాలమున భరతదేశముననిలచినవారుగాక, ఐరోపాదేశములవైపున కేగినవారు పశ్చిమపు ఆర్యులనియు, తూర్పు ఆర్యులనియు రెండుగనైరి. అందు పడమట ఆర్యులందు ఐరోపా కేగినవారనియు ౧. ట్యూటానిక్కుతెగ, ౨. కెల్టిక్కుతెగ, 3. ఇటాలిక్కుతెగ, ౪. హెల్లినిక్కుతెగయని తిరుగ నాల్గు తెగలవారైరనియు, తూర్పుఆర్యులు ౧. బాల్టోస్లావోనిక్కుతెగ, ౨. ఆల్బేనియన్ తెగ, 3. ఆర్మేనియన్ తెగ, ౪. ఇండోఇరానియన్ తెగ యని తిరుగ నాల్గుతెగలవారైరనియు నాంగ్లులు పోల్చుచున్నారు. ఆర్యులన సంస్కృత భాషయందు పెద్దలనియు పూజ్యులనియు నర్థము. ఇందువలన తక్కిన పైభాషలకన్న సంస్కృత మాదియందుండిన భాషయని తేలుచున్నది.

**ఆర్చేవారేకాని తీర్చేవారుండుట అరుదు** — ఆర్చుటయన ఓదార్చుటయనియు, తీర్చుటయన భర్తీచేయుటయనియు భావము. ఆంధ్రలోకోక్తి.

**ఆర్ష్ణేయ గోత్రము** — జమదగ్ని బీధా ఉపగణము చూడుఁడు.

**ఆర్థోడోక్సీ - హెటెరోడోక్సీ** — Orthodoxy is my doxy and Heterodoxy is another man's doxy. అనగా అర్థముసరిగా గ్రహింపని పక్షపాతపు వాదమున కీ.

ఉక్తి నుపయోగించుచున్నారు. ఒకప్పుడు బ్రిటీషు పార్లమెంటునందు Test Laws ను గూర్చి చర్చ జరుగుచుండుతరి శాండ్విచ్చిప్రభువు ఆర్థోడాక్సీ హెటెరోడాక్సీ పదములు తాను చాల పర్యాయములు వింటింగాని సరిగా వానియర్థము గ్రహింపజాలకున్నానని నుడువ ఆప్రక్కనే కూర్చునియున్న Bishop Warburton ప్రభువు Arthodoxy is my doxy and Heterodoxy is another man's doxy యని చెవియం దేకాంతముగఁ బల్కెనట. ఆర్థోడాక్సీ (Orthodoxy) యన శాస్త్రసమ్మతమైన సనాతన మతము, లేక ధర్మము, లేక సాంప్రదాయ (ఆచార) మని యర్థము. హెటెరోడాక్సీ(Heterodoxy) యన పైవానిం బాటింపక మార్పుంగోరుట యని యర్థము, లేక వ్యతిరేకించునది యని భావము.

**ఆర్మొలూలోహము** (Ormolu) – రాగి గిలా పాళ్లు, జింకు ౨౬ పాళ్లు, తగరము ౧౬ పాళ్లుగల్పి చేయఁబడిన ఇత్తడివంటి లోహము. దీనితో చిన్నబొమ్మలు చేయుదురు. ఈరేకులపై చెక్కఁబడిన రూపమున ఎనేమిలు రంగులంబోసి యూరించిన చక్కని పనితన మేర్పడును.

## 'ఆర్' అక్షరమునకుం జెందిన క్రైస్తవ పురుష నామములు —

Raleigh- (ఉచ్చారణ Ralley లేక Rawlie అని).

Ralph, Randolph, Randal, Randull- ట్యూటోనిక్కు పదము, House woulf అనిపేరు.

Ramsay- నవీన స్కాచినామము.

Raoul- ట్యూటోనిక్కు పదము, same as Rodolph, Woulf of Fame అనియర్థము.

Raphael, Rafael- హిబ్రూ నామము, medicine of God అని యర్థము.

Rashleigh- (ఉచ్చారణ Rashly అని) నవీన కల్పిత పదము.

Ravengar- ట్యూటోనిక్కు పదము, raven-spur అని యర్థము.

Ravenshaw- నవీన కల్పిత పదము.

Ravenswar- ట్యూటోనిక్కు పదము, raven spear అని యర్థము.

Raudon- నవీన కల్పితము.

Raymond, Raymund- ట్యూటోనిక్కు పదము, wise protector అని యర్థము.

Raynaud- నవీనకల్పితపదము.

Raynard- ట్యూటోనిక్కు పదము, Firm Judgment అని యర్థము.

Rayner- ట్యూటోనిక్కు పదము, warrior of judgment అని యర్థము.

Rayson- నవీన కల్పిత పదము.

Redmond- ట్యూటోనిక్కు పదము, council protection అని యర్థము.

Regenald- ట్యూటోనిక్కు పదము, power-ful judgment అని యర్థము.

Regulus- లాటినుపదము, little king అని యర్థము.

Reuben, Ruben- హిబ్రూపదము, Behold a son అని యర్థము.

Reynard- ట్యూటోనిక్కుపదము, firm judge అని యర్థము.

Reynold, Reynell- ట్యూటోనిక్కు పదము, (same as Reginald) powerful judgment అని యర్థము.

Rhodes- గ్రీకుపదము, గులాబీపూవని యర్థము.

Rhys- వెల్షుపదము, warrior అని యర్థము.

Richard, Richmond- ట్యూటోనిక్కు పదములు, powerful king అని యర్థము.

దీని ముద్దుపేర్లు Dick, Dicky, Dickon. ఆంగ్లభూపాలుర కీ Richard పేరులు వాడఁబడెను.

**Ritchie**- స్కాచినామము firm ruler అని యర్థము.

**Riversdale** - నవీనకల్పిత పదము.

**Robert**- ట్యూటానిక్కు పదము, famous అని యర్థము. దీనిముద్దుపేర్లు Bob, Bobby, Dob, Rab, Rob, Robin, Robbie. ఇందు కడపటి నాల్గును స్కాట్లాండునం దెక్కువ వ్యాపకము గాంచినవి. స్కాట్లాండు రాజుల కీపే రుండెను.

**Roderic, Roderich, Roderick**- ట్యూటానిక్కుపదము, famous king అనియర్థము.

**Rodney**- నవీనకల్పిత ఆంగ్లపదము.

**Rodolph, Rodolf, Rudolph, Rudolf, Rodolphus, Rudolphus**- ట్యూటానిక్కు పదములు, Woulf of fame అనియర్థము. దీనిముద్దుపేర్లు Rond, Rolf, Rolls, Raoul. ఆస్ట్రియాయం దెక్కువ వ్యాపకమునందిన పేరు.

**Roger, Rogerson**- ట్యూటానిక్కుపదము, Spear of fame అనియర్థము. దీని ముద్దు పేరు Hodge.

**Roland, Rowland**- ట్యూటానిక్కుపదము, Fame of the land అనియర్థము.

**Romanus**- లాటిన్పదము, Roman అని యర్థము.

**Romeo, Romala**- లాటిన్పదము, Fame అని యర్థము.

**Ronald**- స్కాచిపదము, Judge Power అని యర్థము.

**Ronan**- స్కాచిపదము, Famous Judge అని యర్థము.

**Rory**- ఐరిష్షుపదము, same as Rufus ఎర్రని యని యర్థము.

**Rosario**- స్పానిష్షు పదము, Rose అని యర్థము.

**Rosslyn**- నవీన కల్పితపదము, Scottish Origin.

**Rowley**- ట్యూటానిక్కు పదము, Fame of the land (Same as Roland).

**Roy**- స్కాచిపదము, Red అని యర్థము.

**Rufus**- లాటిన్పదము, Red అని యర్థము. (Same as Rory or Roy)

**Rupert**- ట్యూటానిక్కు పదము, Famous అనియర్థము. Robert యొక్క రూపాంతరము.

**Russell**- నవీనకల్పితపదము, ఒక కవీశ్వరుని పేరు.

## 'ఆర్' అక్షరమునకుంజెందిన క్రైస్తవ స్త్రీలనామములు

**Rachel, Rachil**- హిబ్రూపదము. యాకోబు (Jacob) భార్య పేరు. ఈమె Joseph, Benjamin లకు తల్లి.

**Ravelina**- హిబ్రూపదము. దేవుని మందని యర్థము.

**Ray**- ట్యూటానిక్కుపదము, న్యాయమిచ్చు తీర్పరియని యర్థము.

**Rebecca, Rebekah**- హిబ్రూపదము. ఐజాకు భార్యపేరు. దీనినుండి కల్గిన ముద్దుపేరులు Rebe, Beck, Becky.

**Regan**- దీనింగూర్చి ఏమియుం దెలియదు.

**Regina**- లాటిన్పదము. రాజ్ఞియనియర్థము.

**Remia, Renira**- నవీనకల్పితపదములు.

**Renata**- ఇటాలియన్పదము. న్యాయముతీర్చు వీరులని యర్థము. Rene యొక్కయు, Renato యొక్కయు స్త్రీవాచకపదము.

Rhoda, Rhode, Rhodia, Rhona- గ్రీకుపదములు. గులాబీపూవనియర్థము.

Rita- గ్రీకుపదము. ముత్యమని యర్థము.

Robina, Robinia, Roberta- ట్యూటోనిక్కు-పదము. తెల్విగల ప్రసిద్ధియనియర్థము. Robert యొక్క స్త్రీవాచకపదములు.

Rohesia- నవీనకల్పితపదము.

Roma, Romola- లాటిన్పదము, ప్రసిద్ధియని యర్థము.

Rosa, Rose, Rosalie, Rosalia, Rosanne, Roseta, Rosetta, Rosette, Rosania, Rosina, Rosine, Rosita, Roza, Rozalia, Rozina, Ruzalia, Rosena- లాటిన్ పదరూపములు, గులాబీ పూవున కర్థము. దీనింగల్గిన ముద్దుపేరు Rosie.

Rosabel, Rosabella, Rosabelle — లాటిన్పదములు, చక్కని గులాబీపూవు (వంటినాతి) అని యర్థము. దీనియందలి ముద్దుపేరులు Rosie, Bella.

Rosa Clara- లాటిన్పదము, స్వచ్ఛమగు గులాబిపుష్పమని యర్థము. దీనినుండి గల్గిన ముద్దు పేరులు Rosie, Clare.

Rosalind, Rosalinda, Rosalinde, Rosalynde, Rosaline - లాటిన్పదరూపములు, గులాబిపూవువంటి సౌందర్యమని యర్థము. దీనిం గల్గిన ముద్దుపేర్లు Rosie, Linda.

Rosamond, Rosamonde, Rosamund, Rosamunda, Rosamunde, Rosmund - ట్యూటోనిక్కు పదరూపములు, సంరక్షించబడిన గులాబీపూవని యర్థము. దీనంగల్గిన ముద్దుపేరులు Rosie, Munda.

Rosemary- (మహాశాన్నత్యమగు) గొప్ప లేక పెద్ద గులాబీపువ్వని యర్థము. లాటిన్పదము. ముద్దుపేర్లు Rosie, Marie.

Roshilda, Rosilde- ట్యూటోనిక్కు పదములు, గులాబీపూవుంబోలిన సౌందర్యము గల యుద్ధపుపడచని యర్థము. వీనంగల్గిన ముద్దుపేరులు Rosie, Hilda.

Rosia- ట్యూటోనిక్కు-పదము, ప్రసిద్ధినందిన యని యర్థము.

Rowena- కెల్టిక్కు-పదము, తెల్ల అంగీ ధరించు నదియని యర్థము.

Roxana- పారసీక పదము, ప్రాతఃకాలమని యర్థము. దీనియందలి ముద్దుపేరు Roxie.

Ruby- నవీనకల్పితపదము, అదృష్టశాలియగు ధార్మికురాలని సూచించెడిని.

Rudolphina- ట్యూటోనిక్కు-పదము, ప్రసిద్ధినందిన తోడేలని యర్థము. Rudolph లేక Rodolph పదములకు స్త్రీవాచకపదము.

Ruperta- ట్యూటోనిక్కు పదము, చక్కని ప్రసిద్ధియని యర్థము. Rupert యొక్క స్త్రీవాచకపదము.

Rutte- హిబ్రూపదము, సౌందర్యమని యర్థము.

**ఆర్ష్టిషేణగణము** — ఇది భృగు సంతతిలోని యొకగణము. కేవలగోత్రము ఈ గణమునందు కొందఱు చేర్చుచున్నారు. మరి కొందఱు కేవల భృగుగోత్రమును వేరుగణముగ నెన్నుచున్నారు. ఇందు కేవల భృగుగోత్రము కాక పదునారుగోత్రములు కలవు. భృగు లేక ఆర్ష్టిషేణగణమున బోధాయన సూత్రోక్తగోత్రములు ౧౦ :- ౧. ఆర్ష్టిషేణగోత్రము, ౨. కాత్యాయన, 3. గ్రామ్యాయణ, ౪. గారాంభి, ౫. త్వాంద్రాయణ, ౬. నైరథి, ౭. పౌశికలాయన, ౮. రాంభి, ౯. సమునాయన, ౧౦. సింహ్వ.

భృగు లేక ఆర్ష్టిషేణగణమున మాత్స్య సూత్రోక్తగోత్రములు ౫:- ౧. ఆశ్వసగోత్రము,

౨. కవి, ౩. చటాయని, ౪. భృగ్వాందీప, ౫. మార్గపథ.

భృగు లేక ఆర్ష్టిషేణగణమున కాత్యాయన సూత్రోక్తగోత్రములు ౬:- ౧. అనుప, ౨. ఆప స్థంభి, ౩. కార్దమాయని, ౪. గాదర్భి, ౫. నైకషి, ౬. భాల్లవి.

భృగు లేక ఆర్ష్టిషేణగణమున ఇతర గ్రంథోక్తగోత్రములు ౫:- ౧. నివధిత, ౨. భార్గవ, ౩. బైజవ, ౪. మాఠర, ౫. శాఠర.

కేవల భృగుగోత్రము- ఇది భృగుమహర్షి యొక్క స్వసంతతియని చెప్పఁబడినది. దీనికి భార్గవయని ఏకార్షేయ ప్రవరయును, వత్స, భార్గవ చ్యావన, ఆప్నువన, ఔరవ, జమదగ్న్యయని ఆరుఋషుల ప్రవరయుంగూడ వాడుచున్నారు.

ఈ గోత్రములకు ప్రవరరూపములు (ఆప స్థంభ)- ౧. భార్గవ (ఏకార్షేయప్రవర). ౨. భార్గవ, చ్యావన, ఆప్నువన, ఔరవ, బైదా (పంచార్షేయప్రవర). ౩. భార్గవ, చ్యావన, ఆప్నువన (త్ర్యార్షేయ ప్రవర). ౪. భార్గవ, చ్యావన, అవట. ౫. భార్గవ, చ్యావన, స్థూలాశిర. ౬. భార్గవ, శాఠర, మాఠర. ౭. భార్గవ, చ్యావన, ఆప్నువన, బైజవ, నిమథిత. ౮. భార్గవ, ఆర్ష్టిషేణ, అనుప. ౯. భార్గవ, చ్యావన, ఆప్నువన, ఆర్ష్టిషేణ, అనుప.

**ఆర్ష్టిషేణగోత్రము** — భృగుసంతతి, భృగు లేక ఆర్ష్టిషేణగణమొదలి భోదాయన సూత్రోక్తగోత్రము. (ఆర్ష్టిషేణగణము చూడుఁడు.)

**ఆలపాడి యెన్నాళ్లు, ఐశ్వర్యమెన్నాళ్లు, బర్రెపాడెన్నాళ్లు, భాగ్యమెన్నాళ్లు** — ఆంధ్రలోకోక్తి.

**ఆలంభికదేశము, అలభిదేశము, నవదేశము, నవదేవకులదేశము** — ఈ దేశము గూర్చి సరిగా తెలియరాకున్నది. రాజధాని అలంభిక యని కల్పసూత్రమందు చెప్పఁబడినది. జైనులు అలభి యనిరి. డాక్టరు కెరన్ పరిశీలకుఁడు మగధకోసల కిది సరిహద్దు పుర మని అభిప్రాయపడి యున్నాడు. డాక్టరు హెర్నల్ అను గ్రంథకర్త న్యూఆల్ లేక నవాల్ అను నామ ముండెనని వ్రాసెను. హుయ్యానత్స్యాంగు రాజధాని నవదేవకులమని వ్రాసెను. ఫాహియాను ఆల్ అని వ్రాసెను. (కీ. వె. 399_413).

కనూజకు ఆగ్నేయముగ ౧౯ మైళ్లదూరము నను, ఇటవానుండి ఈశాన్యదిశగా ౨౭ మైళ్ల దూరముననుగంగానదీతీరమునం దిప్పుడు అలావి అను పేరం బరగుచున్నది. ఈప్రాంతదేశమై యుండనోపు.

**ఆలవాయనగోత్రము** — ఉపమన్యుగణము చూడుఁడు.

**ఆలవాల గోత్రము** - ముద్గల ఉపగణము చూడుఁడు.

**ఆలస్యాదమృతంవిషమ్** — ఇది సంస్కృతలోకోక్తి. ఏపనినైనను సకాలమున నడుపక ఆలస్యమొనర్చుట తగదనియు, అది చెఱుపనియు భావము.

**ఆలింగనములు** - కామశాస్త్ర చూడుఁడు.

**ఆలింపస్ శిఖరము** (Olympus Mount) గ్రీసుదేశపు ఆదిమనివాసుల మతమున నిది వారి దేవతానిలయమైయుండెడిది. థెస్సెలీ, మాసిడోనియాల సరిహద్దునం గల పర్వతశిఖరము. సదా మంచుచేఁ గప్పఁబడి మహాటవీదృశ్యమధ్యమున నుండునది. అప్పుడిది వారికి పవిత్రదర్శనీయ యాత్రాస్థలమై యుండెను.

క్రైస్తవమతావలంబనమున ప్పూః దీనిం బాటించుటలేదు.

**ఆలికి అన్నమిడుట ఊరికి ఉపకారమా ?** — ఆంధ్రలోకోక్తి.

**ఆలినొల్లనిమగఁడు ఈలకూరలో ఉప్పు చాలదన్నాఁడట** — ఆంధ్రలోకోక్తి.

**ఆలివ్ బ్రాంచి పిటీషను** (Olive Branch Petition) — క్రైస్తవులందు ఆలివ్ చెట్లకొమ్మ శాంతిగౌరవములకు చిహ్నము. అమెరికా సంయుక్తరాష్ట్రములకు వలసపోయి యుండిన బ్రిటీషుదేశపుప్రజలు తమకు రాజ్యపాలనాపద్ధతి (Constitution) ప్రసాదించుమని బ్రిటీషు ప్రభుత్వమువారికంపిన విన్నపపత్రమున కేరిడంబడినది. ఇది క్రీ. వె. ౧౭౭౫ సంవత్సరమున జరిగినది. యుద్ధమునకుం బూర్వమిదియే వారొనర్చిన కడపటిప్రయత్నమని చెప్పఁబడినది. అదివరకే విరోధభావములు ప్రబలియుంటంజేసి ఈమనవి కాగితము సమర్పింపనేతెంచిన రాయబారులకు సావకాశమీయఁబడలేదని చెప్పఁబడినది.

**ఆలీమసీదుదుర్గము** — (మహాగ్రైస్టేషను) ఖైబరుమార్గము చూడుఁడు.

**ఆలుదుంపలు** (బంగాళాదుంప) చెట్టు— ఆం. Potatoes. సం. ఆలు లేక ఆలుక, హిం. ఆలు, అర, ఉరలక్కలంగు. దీనిని సాధారణముగ బంగాళాదుంపయని వాడుదురు. కొందరాలుదుంపలనియు, ఆలుగడ్డలనియు వాడుదురు. ఉరలగడ్డలనియు కొందరనియెదరు. దుంపలు కొంచెము వేడిచేసి బలకరమైయుండును. సుద్దను పెంచును. కొందరికి కడుపుబ్బరము గల్గించి, వాతము నుద్రేకించును. ఆలుకము మిక్కిలి శ్రమపడువారికి, ఎక్కువ గుణము గల్గించునదిగ చెప్పఁబడినది. దీనికి విరుగుడు బియ్యపుకడుగు.

**ఆలుబాలుచెట్టు** - ఈపండ్లు పుల్లని రుచిగలవి. తియ్యనిరుచిగలవియని ద్వివిధముగ నుండును. మొత్తమున నీపండ్లు అతిశ్రుతము (తుమ్ములూరకవచ్చు రోగము) నివారించును. చలవజేసి ఇంచుక విరేచనబద్ధము జేయును. పుల్లని పండ్లు వేడిచేయుననియు, తియ్యని పండ్లు బలకరమనియుఁ జెప్పఁబడినది.

**ఆలుమగలకలహముఅద్దమ్మువెసర) ఆవగింజ తుళ్లుతున్నంతకాలము** — ఆంధ్రలోకోక్తి

**ఆలుబొఖారా చెట్టు**—లా. Prunus communis. ఆంగ్ల Bokhara plum లేక Prunes. పండ్లు పులుపు, ఇంచుక తీపి గల్గి చలవ, మేహశాంతి, పైత్యశాంతి, దాహశాంతి జేయును. జీర్ణశక్తి గల్గించి విరేచనము జేయును. దీనివేరు విరేచనములగట్టును. కషాయము తాపము, దాహము, పైత్యజ్వరముల నాపును.

**ఆలూరి కుప్పకవి** — ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడినవాఁడు. వెలనాటి బ్రాహ్మణుఁడు. ఆపస్థంబ సూత్రము, కాశ్యపసగోత్రము. తండ్రిపేరు వెంకటేశ్వరులు, తల్లిపేరు నరసమాంబ, పితామహునిపేరు వెంకటగిరి. తంజావూరు నృపతియగు తులజేంద్రుని వలన ఆంధ్రకాళిదాసను బిరుదమందినవాఁడు. ఈతులజేంద్రుఁడు క్రీ. వె. ౧౭౬౫ మొదలు ౧౭౮౭ వరకు తంజావూరు రాజ్యమేలినవాఁడు. ప్రతాపసింహమహారాజు పుత్రుఁడు, మహారాష్ట్రుఁడు. ఆలూరి కుప్ప కవి, కస్తూరి రంగకవి శిష్యుఁడట. ఈకవి రచించినవి- ఆనందగిరికృత శంకర విజయము నాంధ్ర పద్య కావ్యముగ నొనర్చెను.

**ఆలూలేదు చూలూ లేదు కొడుకుపేరు సోమలింగము**— ఆంధ్రలోకో

**ఆలొల్లక అర్థవేయేండ్లు, మగ డొల్లక ముప్పదియేండ్లు, బాలప్రాయము పదియేండ్లు, నూరుసంవత్సరములు సరి** — ఆంధ్రలోకోక్తి.

**ఆలోపతీ వైద్యము** (Allopathy) ఆంగ్లదేశమున వాడుకయందున్న వైద్యవిధానము. ఒక విధమగు స్థితి లక్షణములుగల రోగమునకు దానికి వ్యతిరిక్తమగు వేరు లక్షణములను శరీరమున గల్గించుటకు ఔషధముల ప్రయోగించి పరిస్థితులను మంచికి మార్చుటకైన యారోగ్య మార్గము.

**ఆల్కాలి** — అరబ్బీపదమగు కాలీనుండి కల్గినది. దానికి చౌడని యర్థము. ఇప్పుడు ఒక విధమగు Basic compounds కు అర్థమగుచున్నది. సోడా, పోటాష్, అమోనియాలు, ఆల్కాలీలే ఇంకను కొన్ని గలవట. ఆల్కాలీలు Acids తో కలిపిన, వానిని Neutralise చేయును.

**ఆల్కాలోయిడ్** (Alkaloid) — ఇవి Nitrogenous organic compounds possessing basic properties గలవిగా చెప్పఁబడినవి. చెట్లయందు, పశువులయందు దొరకును. అందు చెట్లయందు దొరకునవి ముఖ్యములు. అవి ఆంగ్లవైద్య విధానముల మందులందు కలియునవి. ఆ Vegetable ఆల్కాలాయిడ్సుయందు Aconitine, Atropine, Quinine, Caffeine, Morphine, Strychnine అనునవి కల్గిన విభాగపదార్థములు

**ఆల్కోహాల్** (Alcohol)— రసాయన శాస్త్రజ్ఞులు దీనిని Ethyl alcohol అనియెదరు. చెరకు, బీటుహాటుమంపలు, కాయధాన్యములు మొదలగువానినుండి చేయఁబడునదిగ జెప్పఁబడినది. ఇది సారాయము మొదలగు మత్తుపదార్థములం గల్పుదురు. ఇందు కొంచెము నీరుండనగును. 1 Percent తూనిక. స్వల్ప భాగముమాత్ర ముండిన దానిని Absolute alcohol అనియందురు. Volume 10 percent నీరుండినదానిని Rectified Spirit అనెదరు. Volume 43 వర కుండిన నది Proof Spirit అనంబడును.

స్పిరిటునం దెక్కువ నీరుండిన అనగా ఇంత కన్న నెక్కువనీరుండిన Under proof అగును. ఇంతకన్నతక్కువనీరుండిన Over proof అగును. (చూడుఁడు). ఆల్కోహాలురంగులేని స్వచ్ఛతం గల్గియుండి దీపమున కంటించిన కాలును. దీనిని పరిశీలించు విధానమునకు Alcoholometry అనిపేరు. ఆల్కోహాలుంగల్పిన మత్తుపదార్థము లధికముగ ద్రావుట కలవాటుపడుస్థితికి Alcoholism అనిపేరు.

**ఆల్కెమీ** (Alchemy) — దీనిని రసాయన శాస్త్రమందురు. ప్రాగ్దేశములందు తొల్లింటికాలములందునుండియు, ఐరోపాదేశములందు, మధ్యకాలములందునను, వాడుకయందుండిన విధానము. తొల్లింటి కాలపు రసాయన శాస్త్రజ్ఞులు స్వర్ణరజితయోగములు దీనిసంబంధమేయనిరి. ఇప్పటి ఐరోపాపండితులు నైసర్గికముగ జరుగు పనిగా నెంచుచున్నారు.

క్రీ. వె. ౧౭౮౩ సంవత్సరమున జేమ్సు ప్రైస్ అను పండితుఁడు మరణించెను. ఆతఁడు ఈశాస్త్రమం దారితేరిన విద్వాంసుఁడనియు, కొన్ని లోహములను బంగారుగను, వెండిగను మార్చినవాఁడనియు జెప్పఁబడినది. తర్వాత నిది నిరర్థక ప్రయత్నముగ వదలివేయఁబడినదట. అరబ్బీదేశమున నీకళకు ఆల్కెమియాయనిపేరు. కాన నాదేశమందు గూడ. తొల్లింటి కాలమున నీకళ వ్యాపించియుండునని తోచెడిని. ఇప్పు డెచ్చటను గానరాదు.

**ఆల్టిట్యూడ్** (Altitude):— (నిమ్నోన్నతము) సముద్రము నీటిమట్టముపైనుండి గాని, పల్లపుభూముల మట్టముపైనుండి గాని, ఆకాశమువైపు పైకి ఎత్తును లెక్కించుతరి వేర్వేఱు ఎత్తులను ఆల్టిట్యూడ్సు (Altitudes) అనెదరు. ఈలెక్క బెలూనులోనుండి ఆకసమునకు లేచునప్పుడుగాని, పర్వతములయొక్క పై భాగముల కెక్కునప్పుడుగాని వేర్వేఱు Altitudes గూడా పైకి జనెదరు. Altitude ఎచ్చైనకొలదియు నెక్కువ చల్లగా నుండునని ఎరుంగునది.

**ఆల్బిజినిసెస్** — వీ ఒక మతస్థులు. అల్బియనుపట్టణమునుండి పేరందిరి. ఈమతము క్రీ. వె. ౧౧ మొదలు ౧౩ వ శతాబ్దాంతము వఱకు వ్యాపించియుండెను. వీరు క్రైస్తవమత విధానమును నమ్మరు. ఏసుక్రీస్తుపరమార్థతః ఉన్నాడనవలయునేగాని తక్కినస్థితి నమ్మదగినది కాదనియు, మానవత్వము జగత్పదార్థములవలెనే పాపభూయిష్ఠమైన దనియు, వివాహబంధము అనర్హకార్య మనియు, తనను తాను నిరాకరించుకొనుటకన్న పాపవిముక్తికి వేరుసాధనము లేదుగాన ఆత్మాభిమానము వదలి, ఆత్మసన్యాసముం గైకొని పాపపరిహారము గావించుకొనవలెననియు, ప్రాణియొక్క భౌతికశరీరములందు పాపసంబంధము పూర్వాగతమై యనాదిగ వచ్చుచున్నదే యనియు వీరి సిద్ధాంతము. బలవంతులగు క్రైస్తవులు వీరిని చాలా బాధించిరని తెలియుచున్నది.

**ఆల్బియన్ ద్వీపము** — (శ్వేతద్వీపము) లాటిన్భాషయందు Alba యనిన తెలుపున కర్థము. ఆదికాలమున గ్రీకులు గ్రేటు బ్రిటన్ కేగినప్పుడు అచట ఏర్పడి స్థిరపడి గంభీరముగ గాన్పించు సీమసుద్ద దిబ్బలం గాంచి యచ్చెరువంది ఈపేరిడిరట. పిదప రోమనుల యధికారకాలమున వారును ఈపేరే వాడం దొడంగిరి. భరతదేశమున బ్రిటీషువారికి శ్వేతద్వీపవాసులని వాడుట యెల రెరింగినదే.

**ఆల్జిబ్రా** (Algebra) — ఇది గణిత శాస్త్రములోని యొకభాగమగు కళ. ఫ్రెంచి మాటయగు Algebre అనుమాటనుండి కల్గినది. ఈశాస్త్రమున నంకెలకు బదులు అక్షరములు, గురుతులు ఉపయోగింపబడెడిని. అవి కలుపుటకు '+', కొట్టివేయుటకు '—', సమానమని తెలుపుటకు '=', గుణించుటకు '×', భాగించుటకు '÷' గురుతులు. ఇంకను '∴' అనగ "గనుక" ననియు. '∵' అనగ "ఎందుచేతనంటే" యనియు గురుతులు. మఱియు ab యన a × b యనియు, $\frac{x}{y}$ యన x. యనియు. $a^2$ యన a యొక్క Square అనియు, $a^3$ యన a యొక్క Cube అనియు, $a^4$ అన a యొక్క 4 బలములనియు, $a^5$ అన a యొక్క అయిదుబలములనియు గురుతులు. ఇట్లే ఎంతబలమైనను చెప్పబడెడిని. ∠a అన a యొక్క Square Root అనియుం దెల్పును. ఈ శాస్త్రవేత్తలు భరతదేశమునను, అరబ్బీ దేశమునను యాదికాలములందే యుండిరి.

**ఆల్టిస్కోఫ్** (Altiscope) — అద్దములు (Mirrors) Lenses పొదవున నమర్చబడిన ఒకగొట్టము. దీనిగుండా నీటిలోని అడుగువస్తువులం జూడవచ్చును.

**ఆల్ట్రూయిజమ్ సిద్ధాంతము** (Altruism) :—మంచి పరిస్థితులం దొకరొనర్చిన కార్యము అతనికిగాక అన్యులకు ఫలించునదియే యను సిద్ధాంతము. ఇది తొలుత అగస్టె కాంప్టె Auguste Compte అనువారికి స్ఫురించెనట.

ఆయన ఈసిద్ధాంతమే విజ్ఞానమునకు, నియతికి పరిణామమని బోధించెనట.

**ఆల్ప్సు పర్వతభాగములు** — ఇవి యూరోపాఖండమున ఇటలీ, స్విజర్లాండు, ఫ్రాన్సు, హంగేరి, బాల్కను రాష్ట్రములకుం గొలదిగనో, కొంతగనో అంటియున్న సుప్రసిద్ధ పర్వతములు. వీనియొక్క క్రిందిభాగములు, వ్యవసాయము క్రింద పొలములుగను, అందు మెరక ప్రదేశములు ద్రాక్ష, కొన్నితావుల ఆలివుతోటలు, కలవు. రెండువేల అడుగుల ఎత్తునుండి, నాల్గువేల అడుగుల ఎతుదనుక నుండు ప్రదేశములందు ఏపిల్సు, పీర్సు, ప్లమ్సు, ఛెర్రీపండ్లు, ఏప్రికాట్సు, పీచస్, మొదలగు పండ్లతోటలు చక్కగ పెరుగుంగాన, వాని తోటలం బెంచుట గానగును. పిదప సముద్రమట్టముపై, నాల్గువేల అడుగుల ఎత్తు మొదలు, ఆరువేల అడుగుల ఎత్తువరకు ప్రదేశములందు, పైను వృక్షములు, అడవులు గాన్పించెడిని. వీనికలప వంటచెఱకుగను, కలపగను, క్రింది సీమలవారి కుపచరించుచుండును. ఆపైని మఱి రెండువేల అడుగుల ఎత్తుదనుక నుండు ప్రదేశములందు బలమగు గడ్డిగాదలు చక్కగ పెరిగెడిని. కాన నట్టితావులను పశువుల మేతభూములుగ నుపయోగపర్చుకొనుచు, ఆల్ప్సు అనుచున్నారు. స్విజర్లాండుదేశమునందిట్టి ఆల్ప్సుప్రదేశములు క్రింది ప్రతిగ్రామమునకుం గొలదిగనో, గొప్పగనో, సాముదాయికముగనో, ప్రత్యేకముగనో యుండి తీరునందురు. వీనియందలి పచ్చికమేత పశువుల కధికబల మొసంగుటయె కాక, పాడియావు లెక్కువ పాలీయం జేయును. అవియె గడ్డపాలు డబ్బాలుగ (Condensed Milk Tins) గా దేశదేశముల కమ్ముడుపోవును అటుపై ప్రదేశము లెల్లపుడు మంచుచేఁ గప్పంబడియె యుండెడిని.

ఆల్ప్సుపర్వతోపరిభాగము లందలి, ఎత్తగు పేటవాలుప్రదేశములందుఁ గల చెట్లు పొట్టిగ నుండునుగాని, చక్కగా పెరుగవు. వేళ్లెక్కువ పొడవుగ భూమిలోనికి చొచ్చుకపోయి యుండును. ఈపర్వతములందు కొండమడతలలో నీరు నిల్వయగుట సరస్సు లేర్పడియున్నవి. అందు కాన్‌స్టెన్సు సరస్సు రెండువందల చతురపుమైళ్లు కలది. దీనిగుండా రైనునది ప్రవహించుచున్నది. ఇంకను ఈనదికి, న్యూఛాటెలు సరస్సు, లూసెరన్ సరస్సుకూడ జలముల నిచ్చెడిని. రోనునదికి జలములను జెనీవా సరస్సు ఒసంగును.

ఆల్ప్సు శిఖరములలో నెత్తగు మాంట్ బ్లేంక్ (Mont Blanc) ౧౫,౭౮౧ అడుగుల ఎత్తనియు, రోసాశిఖరము ౧౫,౨౦౦ అడుగుల ఎత్తనియు, మెట్టర్హారన్ శిఖరము ౧౪౭౮౦ అడుగుల ఎత్తనియు, ఫిన్సటరోహారన్ శిఖరము ౧౪౦౨౬ అడుగులఎత్తనియు, జంగ్ ఫ్రౌ శిఖరము ౧౩౬౭౦ అడుగుల ఎత్తనియు, సెంటుగోతర్డ శిఖరము ౧౨౦౦౦ అడుగులనియుం జెప్పఁబడినది. ఇందు సెంటుగోతర్డ శిఖరమున మూడు గొప్ప నదులు జన్మించెడిని. రైనునది ఉత్తరవాహినిగ నార్త్ సీ లో సంగమించును. రోను నది దక్షిణమున మధ్యధరా సముద్రమునం జేరుకొనును. టిసినోనది పోనదియుందు జేరుకొని ఏడ్రియాటిక్కు సముద్రమునం జేరును.

దక్షిణపు పేటవాలు ప్రదేశముల వానలు పో ఎడిజేనదుల గుండా నడచును. ఈప్రాంతముననే కోమో సరస్సు, మగ్గియోరు, గార్డా సరస్సులును కలవు. పర్వతపు తూర్పుననున్న చరియల వర్షజలములు డాన్యూబునదికిం జేరును. ఈపర్వతములందు కనుమ మార్గములు రెయి టన్నెల్సు అధికము. పంద్రెండుంబాతిక మైళ్ల

పొడవుగల సింప్లను టన్నెలు, తొమ్మిదిమైళ్లుగల సెంటుగోతర్డుటన్నెలు, ఎనిమిది మైళ్లుగల సెన్సి సుటన్నెలు అందు ముఖ్యములు.

**ఆల్ప్సు హారన్** — స్విజర్లాండు దేశమునందు ఆల్ప్సుపర్వతములు సుప్రసిద్ధములు. ఆల్ప్సుపర్వతములపైఁ బశువులను మేపు పచ్చిక బయళ్లను గూడ ఆల్ప్సుయనియే నందురు. ఇవి పర్వత మధ్యభాగమ్ము లందుండు ప్రదేశములు. ఇందచ్చటచ్చట సేటర్ హూస్ యనఁబడు చిన్న కుటీరముల నిర్మించుకొని అందు వేసవిని వసించుచు పశువులనుమేపి పాలంబిలికి కండెన్సుడు మిల్కు (డబ్బాపాలు) జేయుచు వేసవి గడుపుదురు. (కండెన్సుడు మిల్కు చూడుఁడు). ఆ నిర్జనప్రదేశమందు దూరదూరముగ నుండు యీఆల్ప్సున కన్నిటికి వినబడునటుల నొకకట్టె బాకానూదుచు ధ్వనుల నచ్చటచ్చటం జేయుదురు. అది రెండునిల్వుల కధికముగ నుండికొండ ప్రక్కలకుం ధ్వని వినిపించునటులఁ జేయుచుండును. దీనిని ఆల్పైయిన్ హారన్ అనియునందురు.

**ఆల్పేకామృగము** ప్రసిద్ధమగు ఆల్పేకాబట్ట ఈమృగముయొక్క బొచ్చునుండి నేయఁబడు బట్ట. మచ్చికయగు మేక, గొఱ్ఱెలం బోలిన జంతువు. దక్షిణఅమెరికాదేశమున విస్తృతముగఁ బెంచఁబడుచున్నది. ఒంటెజాతియని కొంద అనుచున్నారు. అడవిజంతువులుగ నున్నప్పుడు ౧౦౦ మొదలు ౫౦౦ వఱకు మందలుగా నుండును. ఇక్కాలమున బొచ్చునకై పెంచఁబడుచున్నవి.

**ఆల్ ఫూల్సు డే** (All Fool's Day)— ఇంకను దీనిని ఏప్రెల్ ఫూల్సుడే యనియునందురు. ఏప్రెల్ నెలయందు మొదటిదినము. ఆదినమున పరియాచకములు విస్తారమొనర్చుకొనుట ఆంగ్లులయందాచారమైయుంట నిట్లు వాడుక కల్గెను.

**ఆల్బైన్ హారన్** — ఆల్ప్సుహారన్ చూడుఁడు.

**ఆల్బర్టు మెడల్** (Albert Medal)- క్రీ. శ. ౧౮౬౬ లో విక్టోరియామహారాజ్ఞిగారి వలన నేర్పరుపఁబడిన బహుమానపు గౌరవము. ఇది తొలుత సముద్రమున ప్రాణములు రక్షించుటయందధిక ధైర్యసాహసములం జూపినవారి కీయఁబడుట కేర్పర్చబడెఁగాని, క్రీ.శ. ౧౮౭౭లో భూసైన్యములకు, నావికాసైన్యములకు వ్యాపింపఁజేయఁబడినది.

**ఆల్బియన్ లోహము** (Albian metal) — దళసరి సీసపురేకుపై పలుచని తగరపురేకుపరచి అదిమి ఏకముచేసినది. కత్తి పిడులు, బొమ్మలు, ఆటవస్తువులు, గుండీలు మొదలగునవి చేయుదురు. ఆలోహము నచ్చులలోఁబెట్టి నొక్కి బొమ్మలు మున్నగునవి చేయుదురు. అట్లు చేయఁబడినవస్తువు లవసరమగునంతగట్టిం గల్గియుంటయే గాక చక్కని పనినిచ్చి నిలచునట. దానిపై నికెల్‌పూత మొదలగునవి చేయనగునట.

**ఆల్బైనీ** — ఆల్బానుచూడుఁడు.

**ఆల్మానాక్** (Almanac) — ఆల్మనక్ అనిన సాధారణముగ పంచాంగమని యందురుగాని, అది సరికాదు. ఇది అరబ్బీపదజన్యమని తోఁచెడిని. దీనికాంగ్లమున నైఘంటికముగ Year book అని యర్థము చెప్పఁబడినది. సంవత్సరమున నాయాదినములందు నడచుట కెఱుంగఁదగిన పెక్కుసంగతులను వివరించునదనిభావము. హిందువుల విధానముమేరకట్టి గ్రంథము పంచాంగమనంబడును. ఇతరదేశములందలి విధానములు వారివారి పద్ధతులమేరకుండునుగాన వేఱైయుండును. అందు ఆంగ్లవిధానమునకు ఆల్మనక్ అనిపేరు.

**ఆల్రెడ్ రూటు** (All red route) — "ప్రయాణమార్గమంతటను, ఎఱ్ఱనిరంగే" యని యర్థము. ఆంగ్లభాషను ముద్రింపఁబడుచున్న భూపటము (Map) లందు బ్రిటిషువారి దేశముల కెఱ్ఱని రంగు ముద్రించుట సర్వసామాన్యమై యున్నది. కాన బ్రిటిషురాజ్యవాసులు అట్టి ఎఱ్ఱదేశములగుండా గలమార్గమునకు ఎఱ్ఱమార్గమని గర్వోక్తిగ ననుచుండుట కలదు. అటులనే ఇంగ్లాండుదేశమునందలి లివర్పూలు లేక గ్లాస్గోనగరములనుండి బయలుదేరి ఓడపై మాంట్రీలునగరమునకుఁ జేరి, అటనుండి కన్నెడియన్ పసిఫిక్కు రెయిల్వేపై కన్నడాదేశముం గడచి, వెంకూవరునందు తిరుగనోడనెక్కి ఆస్ట్రేలియాయందలి సిడ్నీనగరమున ఓడ దిగుటకు ఆల్రెడ్ రూటు అనుచుందురు. కాని ఈయుక్తి అన్యదేశస్థులందంతగా వాడుకలో లేదు.

**ఆల్రైట్సు రిజర్వుడు** — (ముద్రణ వ్యాపారమున వాణిజ్యసంబంధపరిభాషాపదము). All rights reserved- ఇవి పుస్తకము మొదలగువానిని ముద్రింపించువారితరులు వానిని ముద్రింపించకుండ తమ హక్కును ప్రభుత్వాధికారుల మూలమున నిలుపుకొనుటకుఁ గొంత రుసుము చెల్లించి (తామె ముద్రించు) హక్కును భద్రపఱ్చుకొనుట.

**ఆల్రౌండు ప్రైస్** — (వాణిజ్యసంబంధపరిభాషాపదము). All Round Price- సరకుల నమ్మువారు కొనువారికి నానాసరకు లక్కాలమున గల ధరలను తెలుపుచుందురు. అట్లుతెలుపు ధరలకు quotation అని పేరు. దానితో నాసరకులం బట్టించుటకు గోనెసంచులు లేక పెట్టెలు, తూచుకూలి, పట్టించుకూలి, రైలుకుగాని ఓడరేవుకుగాని వానింజేర్చు బండి చార్జీలు మొదలగు యావద్వ్యయములం జేర్చి యొకే మొత్తముగా తెలుపు ధరలకు ఆల్రౌండు ప్రైస్ అని వాడుదురు.

**ఆలోగ్రాఫీ** —(Allography). తన కధికారమిచ్చినవారి ఉత్తరువుమేరకు వారి సంతకమును గాని, వారి వ్రాతరూపకమును గాని, లోహము రేకులపైనగాని లేక కఱ్ఱపలకపైనగాని చిత్రింపఁజేసి ముద్రించురూపమునకు allograph అని పేరు. ఆకళను allography అనియెదరు.

**ఆల్వాఖావా** — రాసక్రీడాక్షేత్రము బంగాళములోని దినాజపూర్ మండలమున ఈస్టర్న్ బెంగాల్ స్టేటురెయిల్వే (E. B. S. R) హల్దిబారి స్టేషనునుండి ౩౬ మైళ్ళ దూరముననున్న అల్వాఖావా గ్రామమునందలి శ్రీకృష్ణదేవుని రాసక్రీడా పౌర్ణమిదినమున ఎండించిన యన్నముతోఁబూజించి ఉత్సవ మొనర్తురు. ఇది పదునేనుదినములు జరగు నుత్సవము. లక్షజను లేతెంతురట.

**ఆల్వారురాజ్యము** — (సంస్థానము) ఇండియా దేశములోని రాజపుటానా ఏజన్సీలోని ౨౦ సంస్థానములలో నొక బ్రిటీషురక్షిత సంస్థానము. (తొల్లింటి సాళ్వదేశము చూడుఁడు. రాజపుటానా ఏజన్సీ చూడుఁడు). ఆళ్వారు (తొల్లింటి సాళ్వ) పురము రాజధాని.

**ఆల్ సెయింట్సు డే** — (All Saints' Day). క్రైస్తవమతస్థుల పర్వదినము. నవంబరు నెల మొదటిదినము. తొల్లింటికాలమున దీనినాంగ్లసీమలందు ఆల్ హాలోస్ అను పేరున నాచరించుచుండిరట. గ్రీకుచర్చివిధానమున ఈస్టరు పండుగకు పైనవచ్చిన ఆదివారమున నీ పర్వదినము పాటించుచుందురు.

**ఆల్ సోల్సు డే** — (All Souls' Day). క్రైస్తవమతమున రోమనుకాథలిక్కులందు నవంబరు నెలయందు రెండవదినమున అన్నిప్రాణులకై ప్రార్థనయందు గడపవలసిన వ్రతదినము.

**ఆవ (ఆవాలు) చెట్టు** - ఆః లు భోజనపదార్థములం దీదేశమున ముఖ్యముగ వాడబఁడు కలుపుడువస్తువు. ఇంచుక వైద్యోప యోగమును గలదు. ఆవచెట్టుయొక్క కాయ లోనిగింజలు ఆవాలనంబడును. ఆవాలయం దెఱుపు, తెలుపు, నలుపు మూడురంగుల భేదము లుండును. మఱియు పెద్దగింజలు గల జాతియు, సన్నపుగింజల జాతియు నని ముఖ్యభేదములు మఱిరెండు కలవు. ఎఱుపురంగుగల పెద్దఆవాలు- వీటిని సర్వసాధారణముగ నావాలనియు, కొందరు సరసావాలనియు వాడుదురు. లా. Brassica campestris B. Juncea లేక Dinnapia dichotoma. ఆంగ్ల. Indian Mustard. సం. సర్షప, కటుస్నేహ, తీక్ష్ణగంధ అని పేర్లుకలవు. వెగటు, కారము, ఘాటు లేక పొగరులం గల్గి వేడిచేయును. ధాతువున కించుక నుద్రేకబలములం గల్గించును. జీర్ణశక్తి నుద్రేకించి విరేచనము వెడలించును. అధికముగఁ బుచ్చు కొనిన ఎక్కువవేడిచేసి మలమూత్రముల వెడలు టను తగ్గించును. ఇంచుక పైత్యముజేయును. ఇంకను ఆవాల సామాన్యగుణములు- గ్రంధి వాతము, రేఁజీఁకటి, శుక్లవాతము, శ్వాసలు, శూలలు, పీనస, దద్రు, విసర్పి వీనిని హరించి, తలలోని క్రిములం జంపుననియు, కుష్ఠు, పక్ష వాతము, నీరసము, ఉదరరోగములు, గర్భవాత ములు నివారించుననియు, రక్తపైత్యముం బుట్టించుననియు, ఉష్ణశరీరులకు విదాహము, పైత్యవికారము గల్గించి వమనము జేయించు ననియుం జెప్పఁబడినది. ఇటుల దీనిమూలమున వమనము జేయించుటయుంగూడ కలదు. ఆవాలు కషాయము పైగుణములు చక్కగ నొనర్చు నందురు. శరీరము అపాయస్థితియందు క్షీణా వస్థయందుంసుతరి ఆవాల చూర్ణము, రొటి చూర్ణములను డినీళ్లతోఁ గల్పి మడమలకు, అరికాళ్లకు పట్టువైచిన దేహపువేడి జాఱిపోకుండ ల్చును. ఆవాలు పగులగొట్టకుండ చిన్నచెం చాడు ఆవాలు నీళ్లతో మ్రింగించిన మూత్రమును వెడలించును. విరేచనమగును. ఇవి అన్ని రకముల ఆవాలకు సామాన్యగుణములుగఁ జెప్పఁ బడినవి. ఆవచెట్టు ఆకులు- త్రిదోషములను హరించి, గ్రహణి మూలవ్యాధులను నివారించు నియు, ఇంచుకంత మలబద్ధము జేయుననియుం జెప్పఁబడినది. దీనికి విరుగుడు చంద్రచెక్క పొడి. ఆవనూనె- వెగటు, ఘాటుగల్గి తేలికగ నుండును. వాపులు, నరములపట్ల నొప్పులు, నివర్తింపఁజేయును. నరములకు బలమొసంగును. అవాలగుణము లన్నిటింగల్గి అంతకన్న నెక్కుడు బలముగ పనిచేయును. దీనికి విరుగుడు కలినీళ్లు. ఆవ (గానుగాడిన) పిండి- ఆవగుణములనే కొంచెము తక్కువబలముగ పనిచేయును. ఆవాలు గుండచేసినది- లోనికిఁబుచ్చుకొనిన నాకలిపుట్టిం చును, జీర్ణము గావించును. సన్నావాలు- వీటికి వర్ణావాలనియుం బేరుకలదు. గింజలు చిన్నవిగను నల్లవిగనుఁడుండును. లా. Brassica nigra లేక Brassica campestris. ఆంగ్ల. Black mustard (Small). సం. సర్ష, కటుస్నేహ, తీక్ష్ణగంధి. పెద్దావాలకన్న నెక్కువ పొగరు ఘాటులంగల్గి, ఎక్కువబలముగఁ బనిఁ జేయును. వీర్యమునకు వేడింబుట్టించును. దురద లను, విదాహమును, కడుపుబ్బరము మాన్పును. కర్పూరముతో దీనినూనెంగల్పి పైకిరాసిన మెడ నరములబిగింపునొప్పులు, మేహవాతపునొప్పులు, డెంగ్యూజ్వరపునొప్పులు, దగ్గు వగరుపులవలన గల్గిన గుండెలనొప్పులు తగ్గును. ఆవాల గుణ ములం గల్గియుండును. నలావాలకు- లా. Sinapis ramosa. ఆంగ్ల. Black mustard.

సం. రాజసర్షప, రాజకృష్ణకా, అతితీక్ష్ణ యని పేర్లుకలవు. ఎఱ్ఱఆవాల లక్షణములనే కల్గి యుండును. తెల్లావాలు- Brassica alba లేక Sinapis racemosa. ఆంగ్ల. White Mustard. ౨. రాజసర్షప, సిద్ధార్థ. ఇవి యన్నియు నావాల తెగలోనివే.

**ఆవట గోత్రము** — జమదగ్ని వత్స ఉపగణము చూడుడు.

**ఆవట గోత్రము** — జమదగ్ని ౨ధా ఉపగణము చూడుడు.

**ఆవరణత్రయము (ప్రాణికి)** — ౧. అనృతము, ౨. జడము, ౩. దుఃఖము. ఈ మూడును ప్రాణికి సంసారము లేక కర్మానుభవమునం దావరణములవలె బాధకములై యుండునవి.

ఇంకను ౧. మహత్తు, ౨. అహంకారము, ౩. ఆకాశము, ౪. వాయువు, ౫. అగ్ని, ౬. జలము, ౭. పృథ్వి వీనిని సప్తావరణము లందురు. మఱికొందఱు ప్రకృతింగూడ వీనికిజేర్చి అష్టావరణములందురు.

**ఆవర్తరోగము** — ఆయుర్వేద వైద్య శాస్త్రమున నాభిరోగమునకుఁ బేరు. మఱియుం దీనిని నాభికంటకమనియు ననుటకలదు.

**ఆవా పట్టణము**— బర్మా దేశమునకు క్రీ. వె. ౧౭౮౨ లో అమరపురమునకు రాజధాని మార్చబడువఱకు రాజధానిగనుండి తిరుగ క్రీ. వె. ౧౮౨౩ లో రాజధానిగఁ జేయంబడి అట్టి స్థితియందు ౧౮౩౭ వఱకుండినది. పిదప ఆంగ్లప్రభుత్వమున కీదేశము జేరిపోవు కతన వదలివేయఁబడి రంగూన్ ప్రధాన నగర మాయెను. ఐరావతీ నదీతీరమున మాండలే పురమునుండి నైఋతి దిశగా పది మైళ్లదూరమున క్రీ. వె. ౧౩౬౪ లో ప్రారంభింపఁ బడినదందురు. ఇట ఐరావతి నది.

**ఆవాపము** — ఇది సంగీతశాస్త్రమం దలి క్రియా ప్రాణములోని మార్గక్రియ యందలి నిశ్శబ్దక్రియలలో నొకటి. (క్రియాప్రాణము చూడుఁడు).

**ఆవిరి** — (Vapour or Evaporation) ద్రవపదార్థములకు వేడితో సంయోగము కల్గుతరి నది ఆవిరియై పైకి లేచును. వాయుమండలమున నీరుయావిరి చాలకలదు. మేఘములు ఆవిరియొక్క కూటములే. ఆవిరికి శీతలముతో సంయోగము గల్గిన తిరుగ నీరై బరువెక్కును. ఆవిరి వలన ననేక యంత్రములను నడుపుదురు. ఆవిరియందు కొంత బలముకలదు. ఆవిరియొక్క ప్రవాహబలము బలముగు యంత్రములను నడపగలదు. దానికి Steam అనియెదరు. నీటిని ఆవిరిగఁజేయు వేడింగల్గించుటకు వలయు కట్టెలు, కిరసనాయిలు, చమురు మొదలగు కాలు పదార్థములకు Fuels అనిపేరు. ఎలక్ట్రిసిటీయు నట్టిదియే. వేత్తలు చమురులయొక్క ఆవిరిచేయు శక్తిని లెక్క గట్టియున్నారు. కొంత పరిస్థితి, పరిమాణము కాలమున నేయేపదార్థ మెంత నీటిని ఆవిరిగ మార్చగలదో దానింబట్టి లెక్కించి ఫ్యూయెల్సునందలి ఎవాపరేషన్ వేల్యూ నిర్ణయించెదరు. (ఆవిరియంత్రము చూడుఁడు).

**ఆవిరియంత్రము** (Steam Engine)- వేడియందలి (Energy) శక్తిని నీటి ఆవిరియందారోపింపజేసి దానివలన నుపయోగకరములగు కార్యములం జేయించుచుండుట ఈ యంత్రముల ఉపయోగము. క్రీ. వె. ౧౬౯౮ లో మొదటి ఆవిరియంత్రము పేటెంటుచేయఁబడినటుల తెలిసెడిని. ౧౭౬౯ లో దీనికి Seperate condenser చేర్చబడినదట. దీనిని James

Watt చేయించెనట. పిదప Double acting engine తరువాత నభివృద్ధినందెను.

క్రీ.వె. ౧౮౦౪లో Richard Trevithick అను బుద్ధిశాలి ఆవిరియంత్రమును చక్రములపై నమర్చి, నడిపించి చూపెను. ఇది ఇనుపపట్టాపైఁ బరుగిడునట్లు ఆయనే చూపెనట.

ఆవిరియంత్రములు Single acting యంత్రములనియు, Double acting enginesఅనియు, Condensing engines అనియు, Non condensing engines యనియు, High speed type engines యనియు, Low speed type engines అనియు ముఖ్యభేదములంగల్గియుండును. ఇంకను, అధికముగ జేయంబడిన ఆవిరి రెండుగాని, మూడుగాని, నాల్గుగాని, సిలెండరులలోనికిఁ బోనిచ్చుట కేర్పాటు లొనర్చుకొని, అధికబలముం గల్పించి, ఎచ్చుబరువు పనులం జేయించుకతన నా యంత్రమును Single compound expansion engine అనియు, Triple compound expansion engine అనియు, Quadruple compound expansion engine అనియుననంబడుచుండును.

ఆవిరి యంత్రములందు Automatic valve ఆవిరిని "distributes the steam" అని చెప్పఁబడినది. Governor అనునది "Controls the speed" అనిచెప్పఁబడినది. ఇక్కాలమున కర్మాగారములందు ఆవిరియంత్రములు సర్వసాధారణములై యున్నవి. (ఆవిరి చూడుఁడు).

**ఆవు చేలోమేస్తే వెయ్య గట్టున మేయునా ?** — ఆంధ్రలోకోక్తి.

**ఆవుపాలు** — ఆవుపాలయందు సగటున నీరు 87.1, అల్బ్యూమినోయిడ్సు Albuminoids (Casein Albumin) 3.5, Milk Sugar (Lactose) 4.75, వెన్న (Butter Fat) 3.9, Ash 0.75 భాగములని చెప్పఁబడినది. ఇంకను పరిశీలనలవలన Skin Milk నందు 90 Percent (నూటికి తొంబది పాళ్లును), Whey యందు 93.4 Percent ను ఉదకమని లెక్కింపఁబడినది. (పాలు చూడుఁడు). ఇంకను ఆయుర్వేదవైద్యశాస్త్రమున నల్ల(కపిల) ధేనువుపాలు- కళ్లకు చలువఁ జేయును, బలకరమైనవి, వీర్యపుష్టిజేసి త్రిదోషములు హరించును. పథ్యమైనవి. మఱియు నల్లని (కారునలుపు)రంగు గల ఆవుయొక్కపాలు పైత్యహరమనియుం గూడ చెప్పఁబడినది. ఎఱ్ఱ ఆవుపాలు- కఫము హరించునవియని చెప్పఁబడినది. తెల్లఆవుపాలు- బలకరము, కొద్దిగ గురుత్వము, ధాతుపుష్టిచేయును, విరేచనము జేయును. చారల (మచ్చల) ఆవుపాలు- వాతమును, పైత్యమును హరించి వీర్యవృద్ధిని ఇంచుక కఫముజేయును. ఉదరరోగముల కనుకూలించును, చలువజేయును, త్రిదోషముల హరించును. నిడుపుకొమ్ముల ఆవుపాలు- హృదయమునకు బలమిచ్చి ధాతుక్షీణము గల వారికి, వృద్ధులకు పథ్యమైయుండును. కొమ్ములు లేని బోడియావు పాలు- వీర్యవృద్ధికరము, వాతమును, పైత్యమును శమింపఁజేయును; బలముగల్గించును, పీనసరోగముం దెచ్చును. మొదటియీత ఆవుపాలు- బలకరమై పైత్యశాంతి నొనర్చును. రెండవయీత ఆవుపాలు- వాతహరము. మూడవయీత ఆవుపాలు- శ్లేష్మవాతముల నడంచును. నాల్గవయీత ఆవుపాలు- త్రిదోషహరము. ఐదవయీత ఆవుపాలు- త్రిదోషములం జేయుననియు, పిదప యీతల ఆవులపాలు వర్జనీయములనియుం జెప్పఁబడినది. లేగటిఆవులపాలు వాతముగల్గించుననియు, తరిపి ఆవులపాలు కాకజేయును; వాతముహరించి గురుత్వముగ నుండుననియుం జెప్పఁబడినది. మఱియుం దెలికపిండి విస్తారము తినిన ఆవుపాలు చిక్కగ నుండును. అవి గురుత్వముగనుండి

శూల బుట్టించును. కఫముజేయును. ప్రత్తిగింజలు విస్తారము దినిన ఆవుపాలనుండి ఎక్కువ వెన్నవచ్చును. ఆవుపాలు వాతముజేసి అపథ్యమై యుండును. ఎండుగడ్డిమేసిన ఆవుపాలు త్రిదోషహారమనియు, పచ్చిగడ్డి విస్తారముమేసిన ఆవుపాలు దోషరహితమనియుం జెప్పఁబడినది. ఎండుగడ్డికన్న పచ్చిగడ్డి ఎక్కువ మేసిన ఆవులు చాల పాలిచ్చును. జనుముమేసిన ఆవులపాలు బలకరము, వాతకరములై యుండును. కుడితి విస్తారముద్రావెడి ఆవులపాలు పడిసెముగల్గించి దోషకరమై యుండి, అరుచి గల్గించునని ఆయుర్వేదవైద్యవిధానమునఁ జెప్పఁబడినది.

**ఆవులింత** — (Yawning) మనకు మనస్సువ్యాపారమునం దలసటగల్గి కొంత మనోవిశ్రాంతి యవసరమగుతరి మనము పీల్చు ఊపిరి కొంత తగ్గి నడచుట ప్రారంభించును. ఇది శరీరమునందలి యలసట కాకున్నను మనసునం దలసటకల్గిన ఫలితము. అట్లు సన్నముగ గల్గిన యూపిరివలన కొంచెము కొంచెముగ గాలిలోని కేగుచు, బయటకు విడువబడుచు (ఉశ్వాసనిశ్వాసములు గలిగియు) నుండును. ఇటుల లోని కేగు కొంచెముగాలినుండి లోని పరిశుభ్రత కవసరమగు ఆక్సిజెన్ (Oxygen) చాలినంత సంభవించక కొంతతగ్గుటను లోన పరిశుభ్రతకువలసినంత కుదరక ఊపిరితిత్తులకడ కొంత అవిశ్రాంతి తటస్థించును. అప్పుడు మనకు బద్ధకము గల్గును. పిదప అచిరకాలమున ఆక్సిజెన్‌యొక్క అవసరము ఎక్కువయగును. దానితో ఊపిరితిత్తులు వాటంతట అవే తెఱచికొన నారంభించును. ఇది ఎక్కువగాలి నాశించియె.

ఈ అక్కరను పీల్చు ఊపిరి పూర్తిచేయజాలదు. అది దానిప్రమాణము (Capacity) మట్టునకే లోనికిం గాలిని పంపగలదు. ఇంకను అత్తరుణమున అలికచే నూపిరియు బలముగ పనిచేయక సన్నగిలియుంట అసలే జరుగదు. కాన నోరు తెఱచికొని కొంత బలాత్కారముగ గాలి లోని కేగుటయు, అందునుండి ఎక్కువగా ఆక్సిజెన్ లోన గల్గుటయు జరగును. దీనినే ఆవులింత యందురు. మనోవిశ్రాంతికి నిద్ర యవసరముగాన నిదురకు అంతరమున నున్ముఖులమై యుందుము. ఆవులింతలు నిద్రకు చిహ్నము లని తలంతుము.

**ఆవులూ ఆవులూ కలహించి లేగలకాళ్లు విరగద్రొక్కినట్లు** — ఆంధ్రలోకోక్తి.

**ఆవేటి** — ఈమాట యెట్లేర్పడినదో సరిగా తెలియరాకున్నది. ఆషాఢమాసమున పౌర్ణమికి ఆవేటిపౌర్ణమియనియు, అమావాస్యకు ఆవేటిఅమావాస్య యనియు ఆంధ్రదేశపుసీమలలో కొన్నిటియందు వాడుట కలదు.

**ఆవేశము** — ఆవేశము మనస్సునకుం గలుగునది. కలుగగనే బుద్ధికి అపరిమితమగు బలమును ప్రచారమును గల్గి విజృంభించ శరీరము మనోబుద్ధుల స్వాధీనముగనుండి సాహసకార్యము లొనర్పగలుగును. ఈ ఆవేశ మనేకతెరంగులు. కలహాసంబంధమునం గలుగు నావేశమునకు వీరావేశ మందురు. భక్తిసంబంధావేశమున అనన్యవృత్తి మెగ్రమ్మును. దైవసంబంధమగు ఆవేశమున మతగ్రంథరచనలు మున్ముందు జరుగగల లేక సంభవింపఁగల సంగతులం దెల్పుట (ప్రవచించుట) మొదలగునవి సంభవించెడిని.

మహమ్మదుదేశికుఁడు ఖురానును జెబ్రెయిల్ వలన గ్రహించి తెలుపుట ఆవేశయుక్త మని చెప్పఁబడినది. క్రీస్తుప్రభువు కొన్ని భవిష్యత్తులను నుడువుటయు నొకవిధమగు ఆవేశయుతమే. దాసురాండ్రు శివమాడి ప్రవచించుట ఆవేశ

సంబాధమే. దుఃఖభరమున శపించుట, కోపమున తిట్టుట, ప్రేమతో దీవించుటయు, ఆవేశసంబంధములే. మద్యపానజన్యమగు నిషావికార మావేశమువలె యొక్కొకనియందుఁ గన్పించినను ఆవేశము కానేరదు.

**ఆశ కంతమూ లేదు, నిరాశ కాదీ లేదు** — ఆంధ్రలోకోక్తి.

**ఆశ బోధించునది, అవమానము బాధించునది** — ఆంధ్రలోకోక్తి.

**ఆశాపురీదేవిక్షేత్రము** — పాంచాల దేశమున కోట్కాంగ్రాపురమునకు నైఋతిదిక్కున 3౦ మైళ్ళ దూరమునంగల బైజనాద్ నకు నైఋతిదిశగా పండ్రెండుమైళ్ల దూరమున నొక ఎత్తగు కొండపైఁగల దేవస్థానము. ఆశాపురీదేవి దేశప్రసిద్ధమైనశక్తి. (త్రిగర్తదేశము చూడుఁడు).

**ఆశామోదకతృప్తన్యాయము** — మిఠాయి యిచ్చి సంతోషపెట్టి పంపుట కర్థము అనలుకార్యము చేయుట కిష్టములేక, ఆదరణ తియ్యనిమాటలతోఁ దృప్తిపర్చుటయని భావము.

**ఆశాయా దాసాయేతే దాసాస్సర్వస్య లోకస్య ఆశా దాసీయేషాం తేషాం దాసాయతేలోకఃన్యాయము** లోకములో నాశాపాశమునకు లోనైన దుర్బుద్ధిగలవారి కిట్టి దురవస్థ కల్పింపఁబడగలదనుటకీన్యాయమును వాడుచుందురు.

**ఆశావళము** — ఆశావల్, ఎస్సబాల్ లేక ఆశాపల్లిగా నానాఁటికి మారి మహమ్మదీయుల కాలమున అహమ్మదాబాద్ అయిపోయెను. నేఁటికిని అట్లేయున్నది. ఘూర్జరదేశపు కోనను సబరీమతీ (ఇప్పటి సబర్మతీ) నదీతీరము.

**ఆశిల గోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**ఆశీర్ఘడ్** — అశ్వత్థామగిరి చూడుఁడు.

**ఆశుకారసన్నిపాతము** — సన్నిపాతదోషము చూడుఁడు.

**ఆశ్చర్యార్థకచిహ్నము** — Note of Exclamation. ఇది యాంగ్లభాషాసాంగత్యమున నాంధ్రభాషలోనికిం దెచ్చుకొనిన గురుతు ( ! ). ఆశ్చర్యముం గల్గించు సంగతిని వివరింపనీ గురుతు నిడుదురు.

**ఆశ్మన్వతీనది** — దీనింగూర్చి ఋగ్వేదమున ప్రశంసింప బడినది. దీనిని గ్రీకులాకస్నదియనిరి.

**ఆశ్రమచతుష్టయము** ౧. బ్రహ్మచర్యాశ్రమము- ఉపనయనమై వివాహము కాకపూర్వము. ౨. గార్హ్యస్థము- వివాహమై భార్య పిల్లలతో నింట కాపురమొనర్చు ఆశ్రమము. 3. వానప్రస్థము- భార్యంగూడి గాని, తానొక్కఁడే గాని విజనప్రదేశమున తపమొనర్చు ఆశ్రమము. ౪. సన్యాసము- సర్వమును త్యజించి (విరాగియై) తురీయాశ్రమమున గృహస్థు లిండ్ల భిక్షయొనర్చుచు దినములు గడపుచు ముక్తిం గాంక్షించుచుండు ఆశ్రమము. ఈసన్యాసమున చతుర్విధాభ్యాసములు కలవు. ౧. హంస, ౨. పరమహంస, 3. బహూదక, ౪. కుటీచక సన్యాసములు.

**ఆత్రితుఁడు** — అత్రిసంతతి. చంద్రవంశ క్షత్రియుఁడు. కుమాళ్లు పాండ్యుఁడు, చోళుఁడు, కేరళుఁడు అనువారలు. వారలు వేఱ్వేఱు వంశములకుమూలపురుషులైరి. మఱియు పాండ్య, చోళ, కేరళదేశములు వారిపేరుల బరగుచున్నవి. వారు ముగ్గురును భూపతులే.

**ఆశ్రేష నక్షత్రము** — ఆకసమున సర్పాకారముగఁ గూడియుండు ఆరునక్షత్రముల

సముదాయము. జ్యోతిష గ్రంథములందు దీనికి అహిః, ఉరగః, సర్పః, భుజంగః వ్యాళసంజ్ఞకః, సార్పః అనుపదములను పర్యాయపదములుగ వాడియున్నారు. దీనికి ఆదిశేషుండధిదేవత యనియు, రాక్షసగణ నక్షత్రమనియు, అధో ముఖము, స్త్రీస్వభావము గలదియనియు, పిల్లి, చిట్టికుర్విపక్షి, పొన్నచెట్టు ఈనక్షత్రసంబంధము లనియు, ప్రవేశించిన ముప్పదిరెండు ఘటికలపై త్యాజ్యము (విషఘటికల) నియు, ఏబదియారు ఘటికలపై నమృతమనియు, దారుణస్వభావ నక్షత్రమనియుఁ జెప్పఁబడినది.

**ఆశ్వలాయనఋషి** — ఆశ్వలాయన సూత్రకర్త. ఇది ఋగ్వేద కర్మల ధర్మములం గూర్చి వివరించు గ్రంథము.

**ఆశ్వలాయన గోత్రము** — కుశిక గణము, భరద్వాజ ఉపగణము, వసిష్ఠ గణము చూడుఁడు.

**ఆశ్వసగోత్రము** — ఆర్ష్టిషేణగణము చూడుఁడు.

**ఆస్సీళ్లు** — టోల్సు చూడుడు.

**ఆషాఢభూతిగాడు** — అగునని తలంచి ప్రయత్నించుచున్న కార్యమునకు నడ్డముగ సిద్ధమై భంగమొనర్పఁ బనిచేసెడివాని నాషాఢభూతిగాడని యందురు. ఇది పంచతంత్ర ప్రసిద్ధము.

**ఆషాఢవాతే చలతి ద్విపేంద్రే చక్రీవతో వారిధి రేవకాష్ఠా ఇతిన్యాయము** — ఆషాఢమాసపు వానగాలికి (అనగా గాలివానకు) ఏనుఁగులు సైతము పరుగెత్తుచుండ, కట్టపుల్ల సముద్రముం జేరవలసినదే గాని దిక్కేమిటి? ఇది "మహాగజాః పలాయంతే మశకానాంతుకాగతి రితిన్యాయము". ఏనుఁగులు పారిపోతూంటే దోమలకు దిక్కేమిటి? సామెతకు నిట్టియర్థమే.

**ఆష్ వెడ్నెస్ డే** (Ash Wednesday)- బుధవారము క్రైస్తవమత పర్వదినము. లెంటు పండుగదినములలో నాదిదినము. రోమన్కాథలిక్కు క్రైస్తవదేవాలయములలో దీని నాచరించుదురు. ఆ దినమున తలపై బూడిదనించుక పులుముకొనుట యాచారమట.

**ఆసదీవతి** — ఇదియొక ప్రదేశము. ఈ ప్రదేశమును పోల్చుటకును, గుర్తించుటకును (అనగా యిప్పటి హిందూదేశపు భూగోళపటమున Locate చేయుటకు) పరిశోధకు లింకను ప్రయత్నములు సలుపుచునే యున్నారు. స్థల నిర్దేశ మిప్పటికింకను చేయఁజాలకున్నను, పురాణములననుసరించి తత్ప్రదేశప్రాముఖ్యతమాత్రము తెలుపఁగలము. ఎట్లన, జనమేజయుఁడు 'ఆసందీవత'యనుప్రదేశమున ధాన్యముందినుచున్నట్టియు, లలాటమున బంగరు పట్ట (శ్వేతలాంఛనము) కలిగినట్టియు, పుష్పమాలవలె, దేహమును వ్యాపింపఁజేసి నడచునట్టియు, బలముకలిగి యాగమున కర్హమైనట్టిదియు నగు గుఱ్ఱమును దేవతల కొఱకు బంధించెను. కవషుని పుత్రుఁడగు తురుఁడు, పరీక్షిత్పుత్రుఁడగు జనమేజయునకు మహాభిషేకము సేయుతరి పై వాక్యములు వచియించెను.

**ఆసన గండమాల** — గండమాల చూడుఁడు.

**ఆసన (నిరీక్షించు) గుణము** — రాజనీతియందలి షడ్గుణములలో నొకటి. షడ్గుణములు లేక షడ్గుణైశ్వర్యములు చూడుఁడు.

**ఆసంసారం జగత్యస్మిన్నేకా నిత్యాహి అనిత్యతా** — ఇదిసంస్కృతభాషయందలి లోకోక్తి. ఈ జగమున సంసారియై యున్నంత

కాలము, అనిత్యతయే నిత్యమై (ఎప్పుడు సిద్ధమై) యుండునని భావము.

**ఆసనములు** — యోగశాస్త్రమున కూర్చుండువిధానమునకు నాసనమని పేరు. ఆసన మనిన కూర్చుండుటకైనది యనియర్థము. శ్వేత యోగి మొదలుగాఁగల ఆదిమయోగవేత్తలు ఎనుబదినాల్గులక్షల యోగాసనములు కలవనిరట; కాని, పాతంజలియోగసూత్రములందు ఎనుబది యారు పేర్కొనఁబడినవి. మఱియు నందు రెండు ఆసనము లుపయోగానర్హములై యపాయకర ములుగనుంట ఎనుబదినాల్గు వాడఁబడుచు నేఁటికి నభ్యసింపఁ బడుచున్నవి. నిద్రయు, ఆలస్యము మొదలగు కొన్ని యోగాభ్యాసము నకు నాటంకములైయుంట వానికి యోగాంత రాయములని పేరుకలదు. మఱియు రోగము లును యోగాంతరాయములే. కాన నిద్రాల స్యాదులం జయించుట యొంతముఖ్యమో యోగ సాధనమునకు రోగములంజయించి యారోగ్య ముదు స్థిరపడఁజేయుటయు నంతముఖ్యమే. కాన వానింజయించుటయే కాక యోగసాధనమైన ప్రాణవాయువును సుషుమ్నా నాడియందు ప్రసరింపఁజేయ నీయోగాసనములు సాధకములని యోగశాస్త్రమున చెప్పఁబడినది. నాగరాజగు అనంతుఁడు యోగాసనవిధానములకు ఆదిమ దేశికుఁడని యోగులు, యోగాభ్యాస మొనర్చు వారును, అభ్యాసమునకుముందు "ఫణిభ్రాజ త్ఫణాసహస్రవిధృత విశ్వంభరామండలాయా నంతాయ నాగరాజాయనమః" అని యాది శేషుని స్మరించి నమస్కరించుదురు. సుప్రసిద్ధ లగు యోగశాస్త్రవేత్తలు ఆసనవిధానమునందు సవ్యాపసవ్యముగ మార్చుచు ఆసనములు వేయవచ్చునని నుడివియుండిరి. అది ప్రచార మందియు వాడుకయందుండుట కానరాదు. ఇకను యోగాభ్యాసమునఁ బరిపూర్ణులును, అనుభవైకవిదులు నగు పరమహంస పరివ్రాజ కాచార్య (శ్రీ) బ్రహ్మానంద సరస్వతీయతీంద్రులు యోగాసనవిధు లభ్యసించుతరి "ఆసనవిధులందు శిరస్సు నెట్లుంచవలెనదియు చెప్పఁబడనిచో స్వాధీన మగునేని జాలంధరము యోగ్యమనియు, దృష్టి నియమము చెప్పఁబడనిచో స్వాధీనమగునేని భ్రూమధ్యముననిల్పుట యోగ్యమనియు, చేతు లెట్లుంచవలసినది చెప్పఁబడనిచో సిద్ధాసనము నందువలె నుంచుట యోగ్యమనియు, చేతులచే నడుమునైనను పట్టుకొమ్మని చెప్పఁబడనిచో బొటనవ్రేలుతర్జని కల్పిపట్టుట యోగ్యమనియు నుడివియున్నారు.

ఆసనములు ఎనుబదినాల్గు; వానివివరములు :- ౧. సిద్ధాసనము; వజ్రాసనము, గుప్తాసనము, ముక్తాసనము, సంబంధాసనములు. ౨ పద్మా సనము; బద్ధపద్మాసనము, లఘుపద్మాసనము, ౩. దృఢాసనము, ౪. వీరాసనము; ప్రకారాంత వీరాసనము, ౫. పవనముక్తాసనము, ౬. వామ పాదపవనముక్తాసనము, ౭. ధీరాసనము, ౮. దక్షిణపాదపవనముక్తాసనము, ౯. శ్వాన గమనాసనము; దక్షిణశ్వాన గమనాసనము, వామశ్వానగమనాసనము, ౧౦. పశ్చిమతానాస నము, ౧౧. వాతాయనాసనము, ౧౨. మయూ రాసనము, ౧౩. మత్స్యేంద్రాసనము; ప్రకా రాంతమత్స్యేంద్రాసనము, ౧౪. కుక్కుటాసనము, ౧౫. గోరక్షాసనము, ౧౬. భద్రాసనము, ౧౭. ఊర్ధ్వపద్మాసనము, ౧౮. అర్ధపాదాసనము, ౧౯. పూర్ణపాదాసనము, ౨౦. దక్షిణాసనము, ౨౧. శవాసనము; దండాసనము, అధ్వాసనము, ౨౨. వామదక్షిణపాదాసనము, ౨౩. ధనురా సనము, ౨౪. ద్విపాదశిరాసనము; ప్రకారాంతర ద్విపాదశిరాసనము, వామపాదశిరాసనము, దక్షిణ పాదశిరాసనము, ౨౫. స్థిరాసనము, ౨౬. వృషాస

సనము, ౨౭. చక్రాసనము, ౨౮. తాడాసనము, ౨౯. దక్షిణచతుర్థాంశపాదాసనము, ౩౦. ఊర్ధ్వధనుషాసనము, ౩౧. వామసిద్ధాసనము; దక్షిణసిద్ధాసనము, ౩౨. స్వస్తికాసనము, ౩౩. వివేకాసనము; స్థితివివేకాసనము, ౩౪. తర్కాసనము, పూర్వతర్కాసనము, వామతర్కాసనము, దక్షిణతర్కాసనము, ౩౫. నిశ్వాశాసనము, ౩౬. అర్ధకూర్మాసనము, ౩౭. గరుడాసనము; ప్రకారాంతగరుడాసనము, ౩౮. సింహాసనము, ౩౯. త్రికోణాసనము (దక్షిణ); వామత్రికోణాసనము, ౪౦. ప్రార్థనాసనము, ౪౧. పాదత్రికోణాసనము; వామపాదత్రికోణాసనము, దక్షిణపాదత్రికోణాసనము, పూర్ణపాదత్రికోణాసనము, ౪౨. భుజాసనము (వామ); దక్షిణభుజాసనము, ౪౩. హస్తాభయంకరాసనము; దక్షిణహస్తాభయంకరాసనము, వామహస్తాభయంకరాసనము, ౪౪ (వామ) అంగుష్ఠాసనము, ఏకపాదాంగుష్ఠాసనము, ౪౫. ఉత్కటాసనము, ౪౬. జ్యేష్ఠికాసనము, ౪౭. వామార్ధపాదాసనము, దక్షిణార్ధపాదాసనము, ౪౮. హస్తభుజాసనము, ౪౯. వామవక్రాసనము, ౫౦. వామజానాస్వాసనము, దక్షిణజానాస్వాసనము, ౫౧. శాఖాసనము; వామశాఖాసనము, దక్షిణశాఖాసనము, ౫౨. త్రిస్థంభాసనము, ౫౩. పాద అపాన గమనాసనము; వామపాద అపాన గమనాసనము, దక్షిణపాద అపాన గమనాసనము, ౫౪. హస్త చతుష్కోణాసనము; వామహస్త చతుష్కోణ, దక్షిణహస్తచతుష్కోణ, ౫౫. కూర్మాసనము (గోముఖాసనము), ౫౬. గర్భాసనము, (ఉత్తాన కూర్మాసనమనియు పేరు), ౫౭. ఏకపాద వృషాసనము, ౫౮. ముక్తహస్త వృషాసనము, ౫౯. ద్విపాద పార్శ్వాసనము, ౬౦. కంద పీడాసనము, ౬౧. ప్రౌఢపాదాసనము, ౬౨. ఉపధానాసనము, ౬౩. ఊర్ధ్వ సంయుక్తపాదాసనము, ౬౪. అర్ధశవాసనము, ౬౫. అపానాసనము, ౬౬. యోన్యాసనము, ౬౭. మండూకాసనము, ౬౮. పర్వతాసనము, ౬౯. శలభాసనము, ౭౦. కోకిలాసనము, ౭౧. లోలాసనము, ౭౨. ఉత్తమాంగాసనము, ౭౩. ఉష్ట్రాసనము, ౭౪. హంసాసనము, ౭౫. ప్రాణాసనము, ౭౬. కార్ముకాసనము, ౭౭. ఆనంద మందిరాసనము, ౭౮. ఖంజనాసనము, ౭౯. గ్రంథిభేదనాసనము, ౮౦. సర్వాంగాసనము, ౮౧. సమానాసనము, ౮౨. భుజంగాసనము, ౮౩. పవనాసనము, ౮౪. మత్స్యాసనము. అష్టాంగ యోగములు చూడుడు.

**ఆసఫ్** (Asaph) హిబ్రూపేరు- కలియువాఁడని యర్థము. పురుషనామము. మహమ్మదీయులందు ప్రచారమందియున్నది. క్రైస్తవ నామములు చూడుడు.

**ఆసా** — (Asa) హిబ్రూపేరు- వైద్యుఁడని యర్థము. పురుషనామము. క్రైస్తవనామములు చూడుడు.

**ఆసాముదేశము** — ఇండియాలోనిది. (కామరూపదేశము చూడుడు). అహోం వంశనృపాలపాలితమై మధ్యకాలములందు (అనగా కామరూపదేశమను పేరు మాసినపిదప) అహోంస్వామ్యమని పేరం బరగుచు రానురాను ఆంగ్లోచ్ఛారణవిధికి లోనై ఆసామనం బరగుచున్నది. బంగాళా క్రాంతమునుండి క్రీ. వె. ౧౮౭౪ లో వేఱుచేయఁబడినది. పిదప సిల్హెట్టుమండల మిందుఁ జేర్పఁబడినది. ౪౦,౦౦౦ చతురపుమైళ్ల వైశాల్యము. జనసంఖ్య చాల తక్కువ. బర్మాదేశమున కిది యెట్లో చేరియుండి వారినుండి క్రీ. వె. ౧౮౨౪ లో బ్రిటీషువారి యధీనమైనది. సగటున మైలునకు ౧౧౨ గురు జనులు గలరని లెక్కింపఁబడినది. ఉత్తరదక్షిణ ప్రదేశములు కొండలు

మయములు. తక్కిన వ్యవసాయానుకూలప్రదేశములకు బ్రహ్మపుత్రానది నీరవ్వారిగ ప్రవహించును. రాక్షసబొగ్గుగనులు దేశమునందుఁ గలవు.

ఆసాముదేశమున వరి విస్తారము పంట కలదు. తేయాకుతోటల కీదేశము పేరందినది. ఇండియా దేశమున మొదటి తేయాకుతోట యిటనే నాటఁబడినటుల చెప్పఁబడినది. ఆసాముదేశము ౧. గోఅల్పారాజిల్లా, ౨. కామరూపజిల్లా, 3. డర్రాంగుజిల్లా, ౪. నౌగాంగుజిల్లా, ౫. శిబ్సాగరు (శివసాగరము) జిల్లా, ౬. లకింపూర్ (లక్ష్మీపురపు) జిల్లా యని ఆరు జిల్లాలుగ విభజింపఁబడినది.

కామరూపజిల్లాలోని గౌహతిపురము ప్రధాన పట్టణము. బ్రహ్మపుత్రానదీతీరము. ఈప్రాంతముననే తొల్లింటి కామరూపదేశపు రాజధానిగ నుండిన ప్రాజ్యోతిషపురము పాడు కానవచ్చెడిని. ఇది చాల చిన్నపట్టణము. శిబ్సాగరు జిల్లాలోని శిబ్సాగరు పురము తేయాకు తోటల సీమయందు నడుమగా నున్నది. తేయాకు వర్తకము జరుగుతావు. డిబ్రుఘర్ పురము-బ్రహ్మపుత్రా నదిలో పొగయోడలు పోఁదగిన లోతుమార్గముకడనున్న రేవు. షిల్లాంగుపురము పర్వతముపై నున్నది. ఇచటి కాసియాపర్వతములు ౬,౪౫౦ అడుగుల ఎత్తుగలవి. చిర్రాపుంజి-ప్రపంచమున నెక్కువవర్షములు కురియుతావని పేరందినది. (చూడుఁడు). కాశియాపర్వతములకు దక్షిణప్రదేశమున సిల్హెట్టుపురము బంగాళీలున్నతావు. ఈప్రాంతమున నారింజపండ్లు (ప్రశస్తమైనవి) పేరందినవి. సిల్హెటు సురమా నదీతీరము-సురమానదిని స్వదేశస్థులు బరాకునద్ది యనియు నందురు. ఇది మెగ్నానదియందు సంగమించును. సిల్హెటునకు తూర్పుననున్న కాఛారుసీమ తేయాకుతోటలకు పేరందినది. ఇందు సిల్చారు పురము ప్రధానస్థానము. తొల్లింట చీనాదేశమునుండి ఇంగ్లాండున కెగుమతిచేయంబడుచుండిన తేయాకు యిప్పుడు అస్సాముదేశము నుండియు, సింహళమునుండియు నెగుమతి యగుచున్నది.

**ఆసియాఖండము** — (Asia). ఇది చాల గొప్ప భూఖండము. ప్రపంచమందలి భూభాగమున నిది మూఁడవ వంతని చెప్పఁబడినది. సూయజుకాల్వయె లేకుండిన నిది ఆఫ్రికాతోఁ గలసియుండిన ఖండమే. ఐరోపాతోఁ గలసియె యున్నది.

ఇందలి కాస్పియను సముద్రము ప్రపంచమున నెక్కువ పెద్దదియగు నుప్పునీటి సరస్సు. దానికిం దూర్పుగానున్నదిఅరాల్సముద్రము. బైకాల్సరస్సు సైబీరియాలో దక్షిణ భాగమందున్నది. ఇది ఆసియా ఖండమునఁ బెద్దతీయనీటి సరస్సు. అరాల్సముద్రమునకుం దూర్పున బాల్కాషు సరస్సు, దానికిఁ దక్షిణమున ఇస్సిక్కుల్సరస్సు, పారశీకదేశమున ఉరుమియా సరస్సు, వాన్సరస్సు, తుజ్జోల్సరస్సు, పాలస్తీనా దేశములోని డెడ్సీ, గలిలియో సరస్సులు, టిబెట్టుదేశములోని మానసరోవరము, రావణహ్రద (రక్షస్తల్సర) ము, కాశ్మీరదేశములోని డాల్ (లేకు) సరస్సు, మొదలగునవి చెప్పఁదగిన సరస్సులు.

ఉత్తరభాగములు శీతలములుగను, దక్షిణ భాగములు వేడిగను ఉండును. ఆర్కిటిక్కు సముద్ర ప్రాంతముల నతిశీతలమై యుండును. ఆసియా ఖండమున సర్వలోహములు, రాక్షస బొగ్గు, గనులందు దొరకుచున్నవి. చీనాయందు, ఇండియాయందు జనబాహుళ్య మధికముగా నున్నది. ప్రపంచమున గొప్ప మతము లాసియా యందే జనించినవి. క్రైస్తవ మతము, బౌద్ధ మతము, మహమ్మదీయ మతము మొదలగునవి

వన్నియు నీఖండమునందలివే. జరథుస్త్ర మతము, హిందూ మతములు నిందలివె యైయున్నవి.

ఆసియాఖండమున పరిపాలనాభేదముచే రాజ్యములుగఁ జెప్పఁబడినవి కలవు. అవి ౧. ఇండియా దేశము, ౨. సింహళద్వీపము, 3. ఆర్మీనియా, ౪. బర్మాదేశము, ౫. సయాముదేశము, ౬. మలయాదేశము, ౭. స్ట్రెయిట్సు సెటిల్మెంట్సు, ౮. చీనాదేశము, ౯. రష్యాతురుష్కస్థానము, ౧౦. మధ్యతురుష్కస్థానము, ౧౧. చీనాతురుష్కస్థానము, ౧౨. కొరియాదేశము, ౧3. జపానుదేశము, ౧౪. సైబీరియాదేశము, ౧౫. ట్రాన్సుకాకాసియన్ ప్రోవిన్సు, ౧౬. ఆఫ్ఘనుస్థానము, ౧౭. బెలూచిస్థానము, ౧౮. ఏష్యాటిక్కుటర్కీ (ఏష్యామైనరు, సిరియాదేశము, పాలస్తినాదేశము కలసి), ౧౯. పారశీకదేశము, ౨౦. అరేబియాదేశము, ౨౧. ఇరాకరాజ్, ౨౨. మెసపొటేమియాదేశము. (ఇండియాయందనేకదేశము లున్నవి. చీనాయందు మంచూరియా మంగోలియా, చీనా, టిబెట్టులు కలవు). వానిని వేఱ్వేఱు తావులందుఁ గాంచనగును.

**ఆసియామైనరు** — చిన్న ఆసియా యనంబడును. ఏష్యామైనరు చూడుఁడు.

**ఆసీమకృష్ణుఁడు** — పాండవసంతతి క్షత్రియుఁడు. తండ్రి అశ్వమేధజుఁడు. పితామహుఁడు సహస్రానీకుఁడు. పుత్త్రుఁడు నిమి లేక నేమిచక్రుఁడు.

**ఆసుపత్త్రి** (Hospital) — రోగులకు, గాయములు తగిలినవారికి వైద్యసహాయమిచ్చు సంస్థ. భరతదేశపు వైద్యశాలల పద్ధతిని గాక, ఆసుపత్త్రులు ఐరోపాదేశములందు ఏర్పాటులను గాంచిన విధములు వేఱుగనున్నవి. ఇందు రోగ పరిశీలన, ఔషధములిచ్చుట, అవసరమగునేని శస్త్రవైద్యము మొదలగునవి జరుపఁబడుచుండును. ఈఆసుపత్త్రులందు తఱచుగ నాంగ్లవైద్యవిధానమే నడచుచుండును. కలకత్తాయందు హోమియోపతి వైద్యశాల లీపద్ధతినే నడుపఁబడుచున్నవి. ఆంధ్రదేశమునను, అరవదేశమునను ఆయుర్వేద వైద్యవిధానమునను, అగస్త్యవైద్య విధానమునను, సిద్ధవైద్యవిధానమునను, కొన్ని ఆసుపత్త్రులు నడుపఁబడుచున్నవి. ఆసుపత్త్రి వైద్యశాలకుఁ బ్రత్యామ్నాయముగ నేర్పడినదనియు, ఆపనినే చేయుచుండుననియు నెఱుంగవలయును.

**ఆస్ట్రలేషియా** — ఇది ఓసినియా యందలి ద్వీపసమూహములలో నొక ద్వీపసమూహము. స్వదేశీభాషయందు దక్షిణపు ఆసియా యని యర్థమట. ఇందు ఆస్ట్రేలియా, టాస్మీనియా, న్యూజీలాండు అను మూడు పెద్ద ద్వీపములును, వానికిఁ జెందిన యితర చిన్నద్వీపములు మూడుభాగములుగ నెన్నంబడుచున్నవి. ఈ మూడుభాగముల నాయాతావులందుఁ జూడనగును.

**ఆస్ట్రిచ్** — నిప్పుకోడి చూడుఁడు.

**ఆస్ట్రియాదేశము** — ఐరోపాఖండమున ఆస్ట్రియా హంగేరీ యనంబడుచున్న సంయుక్తదేశము. (హంగేరీ వేఱుగ వివరింపఁబడినది చూడుఁడు). ఆస్ట్రియా యన తూర్పుదేశమని యర్థము. అనగా తొల్లింటి కాలపు Charlemagn చక్రవర్తిరాజ్యమున తూర్పుదేశ మని యర్థము. ఆస్ట్రియా హంగేరీలు కల్పి ౪,౫3,౦౦,౦౦౦ చతురపుమైళ్ల వైశాల్యమని చెప్పఁబడినది. చాల చిన్నప్రదేశము ఎడ్రియాటిక్కుసముద్రము నంటియున్నది. కాని దీనికి సముద్ర మధికముగా లేదు. కొన్ని ద్వీపములును కలవు. తూర్పుప్రదేశము సమతలమగు బోహిమియాపీఠభూమి. అది వాయువ్యదిశయం దున్నది. దీనిచుట్టి పర్వతములు కలవు.

కార్పేతియను పర్వతము లర్ధచంద్రాకారముగ నుండును. ఇవి ఆస్ట్రియాపోలండులను హంగేరీ నుండి వేఱుచేయుచున్నవి. రహెటి యను పర్వతములు ఆల్ప్సుపర్వత సంబంధములు. వీనిని నారిక్కాల్ప్సు అనియు నందురు. ఓరట్లర్స్పిట్జె శిఖరమే పశ్చిమపుహద్దున నున్నది. ౧౨, ౭౮౯ అడుగుల ఎత్తుకలది. డాన్యూబు నది, అందుం గలియు నుపనదులు మధ్యగుండా ప్రవహించును. ఉత్తరదిశను నీస్టరునది, విశ్చులానది, ఎల్బనది ప్రవహించుచున్నవి. డాన్యూబునది ఆస్ట్రియా హంగేరీదేశము నుండి అవ్వలకేగు తావున దగ్గరగనె యుండు రెండు కొండలనడుమనుండి నడచును. దీనికి వెరగ్నేటు అని పేరిడియున్నారు. పశ్చిమదిక్కున కోర్నియోలా యనంబడుతావున నొక లోతైన గుహాయు, దానియందు అంతర్వాహిని యగు నొక నదీప్రవాహమును, ఒక అగాధమగు సరస్సును కలవు. అవివింతగొల్పెడిని.

ఆస్ట్రియా హంగేరీదేశమధ్యమున బాలాటన్నను పేరుగల సరస్సు కలదు. దీనిని ప్లాటేన్సీ అనియు ననుచుందురు. ఆస్ట్రియాదేశమున వెండి బంగారము లధికముగా గనులందు దొరకుచున్నవి. రాగి, ఇనుము, సీసము, రాక్షసబొగ్గు, పాదరసము పలుతావుల లభించుచున్నవి. క్రాకో దగ్గరనున్న సైంధవలవణపు గనులు లోకప్రసిద్ధములు. హంగేరీదేశమున ఓపల్ అనంబడు రత్నములు లభించుచున్నవి. గోధుమలు ధాన్యములు, బార్లీ, ఓట్లు, జొన్న, నారచెట్లు ద్రాక్షతోటలు, ఆలివ్ తోటలు దేశమున చక్కగ పైరగుచున్నవి. రైధాన్యము బంగాళాదుంపలు, ఫలించెడిని. దేశమున నాల్గవవంతు అడవులు కలవు. ఆస్ట్రియాయందు జర్మనులసంతతివారు విస్తారము కలరు. వారు మాట్లాడు భాషయు జర్మనుభాషయె. హంగేరీయందు మ్యాగ్యారు జాతివారు విస్తారము కలరు. (వీరిం గూర్చి హంగేరీదేశము చూడుఁడు). స్లావోనియన్ జాతులు, హంగేరియాజాతి, రుమేనియన్ జాతివారును వేర్వేఱు భాషలు మాట్లాడువారు కలరు. ఇందు స్లావోనియనులు జనాభాయందు సగముమంది కలరనియు, నాల్గవవంతు జర్మను సంతతివా రనియు చెప్పఁబడినది. జర్మనుజాతి విద్యాధికులును పలుకుబడికలవారు నని యందురు. యూదులు కొందఱును, జిప్సీజాతివారు (దేశదిమ్మరులు) లు తర్చు గానగుచుందురు. దేశమున ౧౭ భాషలు వాడుకయందున్న వందురు. మాగ్యారు తెగవారు వ్యవసాయికులు. నిమ్రోదుచక్రవర్తి సంబంధులని యనుచున్నారు. జిప్సీలు సంగీతప్రియులు; నాట్యకళావినోదులు, పురుషులు కమ్మరముపనిని, గుఱ్ఱములవర్తకమును చౌర్యమును చేయుచుందురట.

దేశమున వర్తకముకన్న వ్యవసాయమధికముగ నున్నది. లినెనుబట్ట, ఉన్నిబట్ట, నూలుబట్టల నేత కొందఱికి జీవనవృత్తియైయున్నది. ప్రజలు క్రైస్తవులు. ప్రభుత్వము రిపబ్లిక్కు (ప్రజాప్రభుత్వము). ఆస్ట్రియాదేశము, హంగేరీదేశము వేర్వేఱు ంత్రములం గల్గియున్నవి. దేని చట్టముల నదియే నిర్మించుకొనుచు రక్షణార్థమైక్యతంగల్గియున్నవి.

ఆస్ట్రియాదేశము- ఇది క్రీ. వె. తొమ్మిదవ శతాబ్దమున చిన్న టెరిటరీగా నుండెను. దీనిని మార్గ్రెవు పరిపాలించువాఁడు. క్రీ. వె. ౧౧౫౬లో నిది యభివృద్ధినంది పెద్దదిగాఁ జేయంబడియెను. అత్తరి నిది డచ్చీయయ్యెను. ప్రభువకు డ్యూకను బిరుదనామము గల్గెను. క్రీ. వె. ౧౨౭౬ లో హేప్సుబర్గు కొంటుగనుండిన రుడాల్ఫ (Rudolph) జర్మను చక్రవర్తిగా నెన్నఁబడినకతన నాయన సుతుని నాస్ట్రియా డ్యూకుగాఁ జేసిరి.

క్రీ. వె. ౧౮౦౬ లో ప్రాన్సీసు భూపతి ఆస్ట్రియా చక్రవర్తిగా బిరుదమువహించెను. ఆస్ట్రియా హాంగేరీల యైక్యత క్రీ. వె. ౧౮౬౭ సంధి (Compromise) వలన నేర్పడియెను.

ఆస్ట్రియాయందుఁ జేరియున్న రాజ్యభాగములు పదునొకండు కలవు. ౧. బొహిమియా- ఇది ఉత్తరముననున్న ప్రావిన్సు. ఒకప్పుడు ప్రత్యేక రాష్ట్రమైయుండెను. ఇందలి ప్రజలు స్లావోనిక్కు జాతివారు. వీరిని జెక్సు (Czechs) అనియందురు. ఇందు అద్దపుఁబనులు విశేషముగ చేయంబడు చున్నవి. బొహిమియన్ గ్లాసు లోకప్రసిద్ధమైనది. ప్రేగ్పురము బొహిమియాయందు ముఖ్యపట్టణము. చక్కనిపట్టణము. ఇది విశ్వ విద్యాలయ మున్నతావు. John Huss, Jerome అను పేర్లుగల సంస్కర్తలకిది జన్మ స్థానము. ౨. మొరావియా- దీనియందు బ్రన్పురము (Brun) ముఖ్యపట్టణము. ఈ ప్రాంతముననే గల ఆస్టర్లిట్జి కడ నెపోలియ న్సేనాని ఆస్ట్రియనుల నోడించెనట. ఇది ఉత్తర మున నున్న ప్రోవిన్సు. 3. సైలీషియా-ఇదియు నుత్తరపు ప్రోవిన్సే. ౪. టైరోల్- ఇది దక్షిణ మున నున్న ప్రోవిన్సు. ఇన్ నదీతీరముననున్న ఇన్సుబ్రక్పురము ముఖ్యపట్టణము. ఎదిగేనదిపై నున్న ట్రెంటుపురము వేఱొకపట్టణము. వర్తక స్థలము. ఇట క్రీ. వె. ౧౫౪3-౧౫౬3 మధ్య నొక రోమన్కాథలిక్కు కౌన్సిలు జరిగినతావు. ౫. స్టైరియా- ఇది దక్షిణముననున్న ప్రావిన్సు. ఇందు గ్రట్జుపురము ముఖ్యపట్టణము. డ్రేవు నదీ తీరము. ఇచట ఉక్కుపనులు విస్తారము చేయంబడుచుండుట నిది పేరందినది. ౬. కోస్టు లాండు ప్రోవిన్సు- ఇది ఎడ్రియాటిక్కు సముద్ర తీరము. ట్రిస్టీపురము దీని ప్రధానస్థానము (Trieste). ౭. డాల్మేటియా- ఇది దక్షిణ మునున్న ప్రోవిన్సు. ఇందు రగూసాపురము ప్రధానస్థానము. ఇటఁ దొల్లియొకప్పుడు ప్రజా ప్రభుత్వకార్యస్థాన ముండెడిది. ౮. గలీషియా- ఈశాన్యదిశగానున్న ప్రోవిన్సు. ఇందు లెంబర్గు పురము ముఖ్యపట్టణము. గొప్ప వర్తకస్థలము. ౯. పోలాండు- ఈశాన్యదిశగా నున్న ప్రోవిన్సు. ప్రజలకు పోలులని పేరుగూడ కలదు.

పురము తొల్లింట పోలాండుదేశపు రాజధానిగ నుండెను. అది విశ్చులానదీతీరము. తొల్లింటి రాజుల సమాధులు నిటగలవు. తొల్లింట పోలాండుదేశమును రష్యాప్రభుత్వము, ప్రష్యా ప్రభుత్వము, ఆస్ట్రియాప్రభుత్వము పంచుకొని కల్పుకొనిరి. ఇప్పుడు ఆస్ట్రియాయందుఁ జేరి యున్న పోలాండుభాగమునకు పోలిష్ ప్రోవిన్సు అనుచున్నారు. ౧౦. బుకోవియా- ఇది ఈశాన్యదిశగానున్న ప్రోవిన్సు. ౧౧. ఆర్చిడచీ ఆఫ్ ఆస్ట్రియా- ఇది మధ్యనున్న ప్రోవిన్సు. ఇందు వియన్నా నగరము ప్రధానపురము. ఇదియే ఆస్ట్రియా సంయుక్తదేశముల కంతకు ప్రధాననగరమై యున్నది. డాన్యూబు నదీ తీరము గొప్ప వర్తకస్థలము. ౧౬,౭౫,౦౦౦ జనసంఖ్య గల నగరము.

తొలుతనిది నదిని కాయుచుండుట కేర్పర్చఁ బడి రోమన్కాంపుగ నుండినది. క్రీ. వె. ౧౫౨౯ తురుష్కులు ముట్టడించిరి. తిరుగవారే ౧౬౮3 లో కూడ ముట్టడించిరి. రెండవపర్యాయపు ముట్టడి పోలండుభూపతియగు John Sobieski యనునాయన లోపాయికారీతో నడచెనట. దానితో పోలండురాజ్యము మూడు ముక్క లాయెను. ౧౮౦౫ లో నున్ను, ౧౮౦౯ లో నున్ను ఫ్రెంచివారి ముట్టడి నీనగరము చూచెను. (హంగేరీదేశము, ఐరోపాఖండము చూడుఁడు). బాస్నియా ప్రోవిన్సు, హెర్జిగోవినా ప్రోవిన్సు టర్కీవారివై యుండునవి. క్రీ. వె. ౧౮౭౮ లో ఆస్ట్రియా దీని ఆక్రమించి కల్పుకునెను.

**ఆస్ట్రేలియా ద్వీపము** — ఓసీనియా యందలి ద్వీపములలో ఆస్ట్రలేసియా ద్వీపసమూహమునకుం జెందిన పెద్దద్వీపము. భూమియందలి ద్వీపములలో నిది యెక్కువ పెద్దది. తూర్పు పడమరలకు ౨,౫౦౦ మైళ్ళును, ఉత్తరదక్షిణములకు ౨,౦౦౦ మైళ్ళునుంగల్గి గొప్ప వైశాల్యవంతమైయుండ, దీనిని ద్వీపఖండమనియు, ఆస్ట్రేలియాఖండమనియు ననుచుందురు. ఆస్ట్రేలియా యనిన దక్షిణభూమియనిస్వదేశభాషయందర్థము. ఆస్ట్రేలియాగుండా మకర (Tropic of Capricorn) రేఖ జనుచుండును. పరిమాణముముప్పది లక్షల చతురపుమైళ్ళుండునని చెప్పఁబడినది. తొలుత దీనిని డచ్చివారు క్రీ. వె. ౧౬౦౬ లోఁ గనుగొని న్యూహాలెండు (New Holland) అని పేరిడిరని చెప్పఁబడినది.

ఆస్ట్రేలియాద్వీపము పూర్తిగా పరిశీలించి చూచినవారింకనువ్వరును లేరనిఒకవదంతికలదు. ఆగ్నేయదిశగానున్న పర్వతములకు ఆస్ట్రేలియను ఆల్ప్సు అని పేరిడియున్నారు. ఈఖండమునకు ఉత్తరదిశను యార్కు అగ్రము (Cape York) అనియు, ఆగ్నేయదిశగా హ్యూఅగ్రము (Cape Howe) అనియు, నైఋతిదిశగా ల్యూవిన్ అగ్రము (Cape Leuwin) అనియు మూడు అగ్రములుకలవు. ఆస్ట్రేలియా ద్వీపమున ఈశాన్యదిశగా సముద్రతీరమునుండి ముప్పది మైళ్లదూరమున నీటియందు సముద్రము ననుసరించియే ౧,౨౦౦ మైళ్ల పొడవుగల రాళ్లగుట్ట, పగడపుచక్కగట్టునీటియందుమునిగియుండి ఓడలు నడువ నభ్యంతరపర్చుచుండును. దీనికి Barrier Reef అని పేరు వాడుచున్నారు. ఆస్ట్రేలియన్ ఆల్ప్సుపర్వతములందు ౭,౧౭౬ [illegible]ల ఎత్తుగల మౌంట్ కోసియస్కో (Mount Kosciusko) అనుపేరుగల శిఖరము [illegible]దికలదు.

ఇంకనుబ్లూమౌంటెన్ రేంజి (Blue Mountain range) అను పర్వతపంక్తి సుప్రసిద్ధము. ఆస్ట్రేలియాయందలి ముఖ్యమగు నది ముర్రే. ఇందు డార్లింగునది చేరును. తక్కిన మధ్యభాగపు నదులు సముద్రముదనుక నేగక, అచ్చటచ్చట ఉప్పుపట్టులయందు, ఇసుకనేలలం దింకిపోవును. ఇట్టి యుప్పుపట్టులందు వర్షకాలమున టారెన్సు (Lake Torrens) అనుసరస్సు ఏర్పడుచు వేసవికాలమున నింకిపోవుచుండునదికలదు. ద్వీపము యొక్క ఉత్తరార్ధము వేడిదేశము, దక్షిణార్ధమంత వేడియుండక సాధారణముగ నుండును.

బంగారు, వెండి, రాగి, తగరముగనులుకలవు. రాక్షసబొగ్గుగనులు చాలకలవు. అరణ్యములు, పచ్చికబయళ్ళు, ఇసుకఎడారులు కూడ కలవు. బంకనిచ్చు చెట్లు విస్తారముగనున్నవి. ఫెర్న్ (Ferns) జాతులు విస్తారముదొరకెడిని. గోధుమలు, ఓటుధాన్యము, నారదినుసులు, పొగాకు, ద్రాక్షజాతులు, దక్షిణసీమలందుఁ జక్కగా పైరగుచున్నవి. ధాన్యములు, ప్రత్తి, చెరకు ఉత్తరసీమలందు పైరుజేయంబడుచున్నవి. అడవులందు గట్టికఱ్ఱలు, గట్టి ఆకులుగలచెట్లు విస్తారముగ నున్నవి. కాంగరూమృగములు, నల్లహంసలు, గొఱ్ఱెలు, మేకలు, గుఱ్ఱములు, ఒంటెలు కలవు. స్వదేశస్థులగు నడవిజాతులవారు, విదేశస్థులగు ఐరోపాజాతులవారును ప్రజలు.

ఆస్ట్రేలియా ఆంగ్ల సామ్రాజ్యమున స్వపరిపాలన నందిన దేశమైయున్నది. ఇది Commonwealth of Australia అనంబడుచున్నది. ఇది యైదుకాలనీలుగా విభజింపఁ బడియున్నది.

౧. న్యూ సౌత్ వేల్సు- ఇది చాల పురాతనమైనది. తూర్పుననున్నది. ఇందు బ్లూమౌంటెన్సు కలవు. గొర్రెలం బెంపుట, బంగారముం ద్రవ్వుట ముఖ్యమగు వృత్తులు. దీని వైశాల్యము

౩,౧౦,౩౬౭ చతురపు మైళ్లు. ఇందలి ముఖ్యపట్టణము సిడ్నీనగరము ౮౪౪,౦౦౦ జనులు గలది. ఇది ఆస్ట్రేలియాకంతకు ప్రభుత్వస్థానమై యున్నది. పారామెట్టాయనునది పురాతనపు పట్టణము. సిల్వరు కొనునందు ప్రాంతములందు నొకపాటి వెండి గనులు కలవు.

౨. విక్టోరియా- న్యూ సౌత్ వేల్సునకు దీనికి నడుమ ముర్రే నదికలదు. సమశీతోష్ణసీమ. భూమి సారవంతమైనది. ఆస్ట్రేలియా యందు విస్తారము బంగారము దొరకు కాలనీ యిదియే. ఉన్ని విస్తారము ఇటనుండి యెగుమతి యగుచుండును. ౮౭,౮౮౪ చతురపు మైళ్ల వైశాల్యము కలది.

౩. క్వీన్సులాండు కాలనీ- ఈశాన్యదిశగా నున్న ప్రదేశము. నవీనముగ నాక్రమింపఁబడినది. వేడి ప్రదేశములలో నొకటి. ధాన్యము, చెరకు, ప్రత్తి, ఇందు విస్తారముగ పైరు చేయఁబడుచున్నవి. బ్రిస్బేన్ నగరము ప్రధాన నగరము. బ్రిస్బేన్ నదీతీరమున దాని ముఖద్వారమున నున్న నగరము. ౬,౬౮,౪౯౭ చతురపు మైళ్ల వైశాల్యముగల సీమ.

౪. దక్షిణ ఆస్ట్రేలియా కాలనీ- మధ్యభాగమంతటను వ్యాపించి యున్నది. గోధుమలు, ద్రాక్షలు, విస్తారము పైరు చేయఁబడుచున్నవి. ఆలివ్ ఆయిలును విస్తారము చేయఁబడుచున్నది. రాగి గనులు కొంతవఱకు బాగుగనే పనిచేయుచున్నవి. భరత దేశమునఁ బ్రసిద్ధములగు ఆస్ట్రేలియా గుఱ్ఱము లిటనే పెంపఁబడుచున్నవి. ఆసంస్థలు విశేషముగ గలవు. ఈకాలనీయందు ఎడిలేడి నగరము ప్రధానస్థానము. జనసంఖ్య ౧,౬౧,౦౦౦. ఇది విన్సెంటుసింధుశాఖ(Gulf of St. Vincent) తీరముననున్న నగరము. పోర్టు డెర్విన్ కడ పామర్స్టన్ అను తావు టెలిగ్రాఫుల కడ స్థానము. దక్షిణ ఆస్ట్రేలియాయందు టారెన్సు (Lake Torrens) అనియును, ఈరీ (Lake Eyre) అనియుఁ బెద్ద సరస్సులు కలవు. ౯,౦౩,౬౯౦ చతురపు మైళ్ల వైశాల్యము.

౫. పశ్చిమ ఆస్ట్రేలియా కాలనీ- ౯,౭౫,౯౨౦ చతురపు మైళ్ల వైశాల్య ప్రదేశమైనను జనాభా చాల తక్కువ. ఇందు ఎడారిప్రదేశ మధికము. ఇందు ఉప్పు పఱ్ఱలు, ఔకునేలలు ఎక్కువగా గలవు. గొఱ్ఱెలం బెంచుట ముఖ్యమగు వృత్తి. కొంతవఱకు బంగారము దొరకు గనులు కలవు. పెర్తు(జనసంఖ్య౩౬,౦౦౦) ప్రధాన నగరము. ఇది శ్వాన్ నదిపై నైరుతిదిశగా సముద్ర తీరముననున్న పురము. ఆల్బెనీ పురము రాక్షసబొగ్గు స్థానము. దీనికిఁ దొల్లింట శ్వాన్ నది కాలనీ యని పేరుండెనని చెప్పఁబడినది.

**ఆస్సి** - ఎస్సేటు చూడుఁడు.

**ఆస్ఫాల్టు** (Asphalt) — కోల్తారు (Coal-tar) నందు ఇసుక పాలుగూర్చి, కరగించి ఆస్ఫాల్టు చేయుచున్నారు. ఇది బాటలపై ధూళిరేగక గట్టిపడుటకుం జేయఁబడును. కాని ఆస్ఫాల్టు మెసపొటేమియాదేశమున కొన్ని సరస్సులందు త్రవ్వి తీయుచున్నారు. ఆఫ్రికాఖండమునందలి గోల్డుకోస్టు దేశమున ట్రినిడాడ్పురపరిసరమున నున్న ఒక ఆస్ఫాల్టుసరస్సు జగత్ప్రసిద్ధము. ఇందు త్రవ్వఁబడిన గోతులు కొంతకాలమునకు తిరుగ నాస్ఫాల్టుచే నిండిపోవుచుండును. అనగా భూమిలోనుండి ఆస్ఫాల్టుపైకి నెట్టఁబడుచుండునని తేలుచున్నది. ఈ సరస్సు ౧౧౪ యకరముల ప్రదేశమని చెప్పంబడినది. ఇటీవల ఆల్బర్టాదేశమున అతబాస్కా నదీతీరప్రాంతములం దాస్ఫాల్టు గనులు కనిపెట్టఁబడినవని వినుచున్నాము.

**ఆహాయన గోత్రము** — ఆత్రేయ గణము చూడుఁడు.

**ఆహారము కడను వ్యవహారము కడను మోమాట ముండరాదు**
ఆంధ్రలోకో.

**ఆహవనీయాగ్ని** — అగ్నిత్రయము చూడుడు. ఇది యాచార్యునివలనగల్గిన యగ్ని.

**ఆహికజ్వరము** — ఆంగ్ల. Intermittant Fever. ఇది శీతపైత్య జ్వరముల లోనిది. ఏదో యొకవరుస లెక్కమేరకు దినము విడచి దినమో, లేక రెండుదినముల కొకసారిగనో, లేక ఏవో కొన్ని దినములకొకసారియో తప్పక చలితో వచ్చుచుండుజ్వరము. దీనిని మన్యపు జ్వరమనియు, చలిజ్వరమనియు, వరుస జ్వరమనియు కూడ ననుటయుం గలదు. గులాబీ పూవుల చెట్టుఆకులు నలిపి వాసనచూచుటవలన నీజ్వరము రాకుండ నాపనగునని కొంద అనుచున్నారు.

**ఆహుకి** — దేవకునికి మేనత్త.

**ఆహుకుఁడు** — అత్రి, చంద్ర, యాదవక్షత్రియుఁడు. తండ్రి విద్యోతుఁ డను నామాంతరము గల అభిజిత్తు. కుమాళ్లు దేవకుఁడు, ఉగ్రసేనుఁడు. దేవకుని కుమార్తె దేవకీదేవి. ఈమె వసుదేవుని భార్య. ఇంక ఉగ్రసేనుఁడు సౌవీరదేశాధిపతి. కుమారుఁడు కంసుఁడు. శ్రీకృష్ణునిచే నిహతుఁడైన విరోధి.

**ఆళ్వారులు (౧౨)**— (పన్నిద్దరాళ్వార్) రామానుజీయ వైష్ణవమహాభక్తులు. శ్లో॥భూతం సరశ్చ మహదాహ్వయభట్టనాథ । శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్ । భక్తాంఘ్రిరేణుపర కాలయతీంద్రమిశ్రాన్ శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోఽస్మినిత్యమ్॥

౧. పూదత్తాళ్వార్ - వీరికి భూతయోగి యనియు, మల్లాపురాధీశ యనియుం బేరులు. విష్ణుదేవుని గదాంశసంభూతులు. మల్లాపురి (తిరుక్కడల్మల్లై) యనుగ్రామమున నొకపవిత్ర సరస్సున నల్లకలువపూవులో నయోనిజుఁడై సరోయోగి పుట్టినమఱునాఁడు జనించెనందురు. అల్పిశి నెల తులామాసమున ధనిష్ఠ వీరి తిరునక్షత్రము.

౨. పొయ్‌గైయాళ్వార్ - వీరికి సరోయోగి యనియు, సరోమునీంద్రులనియు, కాసారయోగి యనియుఁ బేర్లుకలవు. విష్ణుదేవుని శంఖము యొక్క అంశమున జనించిరి. కాంచీపురియందు పొయ్‌గైయనఁబడు పుష్కరమున బంగరు తామర పూవులో విష్ణుదేవుని పాంచజన్యాంశమున ద్వాపరయుగాంతమున జనించిరి. అల్పిశినెల తులామాసమున శ్రవణము వీరి తిరునక్షత్రము.

3. పేయాళ్వార్ - వీరికి మహాయోగి యనియు, మైలాపురాధిపులనియుఁ బేరులుకలవు. విష్ణుదేవుని నందకాంశము (ఖడ్గము) న జనించిరి. మాయూరు (మామరైనగర్) అనఁబడుగ్రామమున నొక సరస్సున ఎఱ్ఱకల్వపూవులో నయోనిజుఁడై భూతయోగిపుట్టిన మఱునాఁడు జనించిరి. అల్పిశినెల శతభిషము వీరి తిరునక్షత్రము.

౪. పెరియాళ్వార్ - వీరికి భట్టనాథులనియు, విష్ణుచిత్తులనియుఁ బేర్లుకలవు. ద్రావిడప్రబంధములందు వీరికి శాణ్ణువణ్ణం శెయిదపెరుమాళ్ అని పేరుగలదు. వీరు ఆండాళ్ అనఁబడు శ్రీ గోదాదేవి తండ్రి, శ్రీరంగనాథస్వామికి మామగారు, వైనతేయాంశసంభూతులు (గరుత్మంతుడు). శ్రీవిల్లిపుత్తూర్ అనఁబడు గ్రామమున నొక పురశ్చూడుఁడగు (ముందుజుత్తుగలవాఁడు) వైష్ణవునకు జనించిరి. (అచటివటపత్రశాయిని పూజించుచుండిరి). అనినెల మిథునమాసమున [illegible] త్రము వీరి తిరునక్షత్రము.

౫. తిరుముழిశైయాళ్వార్ - వీరికి భక్తిసారులనియు, మహాసారపురాధీశు [illegible] బేర్లుకలవు. అష్టాంగయోగముల నభ్యసించినవారు. భార్గ

వాత్మజులు. విష్ణుదేవుని సుదర్శనాంశ (చక్రము) సంభూతులు. పొయ్ గై, పూధత్త, పేయాళ్వారులు జనించిన మూడు నెలలకు మహాసార క్షేత్రమున తిరుముడిషి. అను తావునతపమొనర్చు చున్న భృగుమహర్షికి (ఇంద్రునిచే ప్రేరేపింపఁబడిన) అప్సరస్త్రీయందు జనించిరి. భగవద్భక్తుఁడగు మేదరివాఁడొకఁడు వీరిఁ బెంచెను. తై నెల మకరమాసమున మఖనక్షత్రము వీరి తిరునక్షత్రము.

౬. (శ్రీ) ఆండాళ్ - వీరికి శ్రీగోదాదేవి, ఆముక్తమాల్యద, చూడికుడుత్త నాంచార్, చాడి = తా ననుభవించి, కుడుత్త = సమర్పించిన, నాంచారనియుఁ బేర్లు కలవు. శ్రీరంగనాథ స్వామి యర్ధాంగి; పెరియాళ్వార్ కూతురు. కటకమాసము (ఆడినెల) పూర్వఫల్గుణి నక్షత్రము వీరి తిరునక్షత్రము.

౭. కులశేఖరాళ్వార్ - వీరికిఁ గుక్కుటపురాధీశు లనియుఁ గొల్లిపురాధీశు లనియును పేర్లు కలవు. విష్ణుదేవుని కౌస్తుభమణి యంశమున జనించిరి. కలియుగాదియందు దృఢవ్రతుఁ డను రాజునకుఁ బుత్రుండై జనించి, ధనుర్వేదాది విద్యల నేర్చి జ్ఞానియై భగవత్కటాక్షమును పొందెను. మాశినెల కుంభమాసమున పునర్వసు వీరి తిరునక్షత్రము.

౮. తిరుప్పాణియాళ్వార్ - వీరికి యోగివాహు లనియు, మునివాహు లనియు, గాయక సార్వభౌము లనియుఁ బేర్లు కలవు. విష్ణుదేవుని శ్రీవత్సాంశ (పుట్టుమచ్చ) సంభూతులు. కలియుగమున మూడునూరుల సంవత్సరములకుఁ బిదప చోళనిచుళాపుర (ఒడయూర్) మను గ్రామమున నయోనిజుండై జనించెను. బిడ్డలులేని పంచమ దంపతులచేఁ బెంపఁబడి వీణాగాన తుంబురుఁ డని పేరందెను. కార్తికనెల వృశ్చికమాసమున రోహిణి వీరి తిరునక్షత్రము.

౯. తొండరడిప్పొడియాళ్వార్ - వీరికి విప్రనారాయణు లనియు, భక్తాంఘ్రిరేణువు లనియుఁ బేర్లు కలవు. విష్ణుదేవుని వనమాలాంశమునఁ జనించిరి. చోళదేశమున మడంగుడి అనఁబడు గ్రామమున ఒక పురశ్చూడుఁ (ముందు జుత్తుకలవాఁడు) డగు వైష్ణవునకుఁ బుత్రుఁడై కలియుగమున రెండువందలసంవత్సరములప్పుడు జనించిరి. మార్గళినెల ధనుర్మాసమున జ్యేష్ఠనక్షత్రము వీరి తిరునక్షత్రము.

౧౦. తిరుమంగైయాళ్వార్ - వీరికిఁ బరకాళ యతి యనియు, కలిధ్వంసను లనియు, కవిలోక దివాకరు లనియు, చతుష్కవిశిఖామణి యనియు, షట్ప్రబంధకవి యనియు, కలివైరి యనియుం బేర్లు కలవు. విష్ణుదేవుని శార్ఙ్గాంశము (ధనస్సు) న జనించిరి. నీలుఁ డను శూద్రునకు జనించి, ధనురాదివిద్యల నేర్చి, చోళభూపతికడ నుద్యోగియై, అయోనిజయగు కుముదవల్లిం గోరి మోహించి, దొంగిలుచు విస్తారధన మార్జించి, ఆ విత్తము తో నామెం బరిణయమయ్యెను. కార్తికనెల వృశ్చిక మాసమున కృత్తిక వీరి తిరునక్షత్రము.

౧౧. నమ్మాళ్వార్ - వీరికి పరాఙ్కుశముని, శఠగోపయతి, శఠారి యనియుఁ బేర్లు కలవు. కారితనూజులు, స్తన్యపానము జేయకనే పెరిగిరి. కారి యను పేరుగల సచ్ఛూద్రునకు, ధర్మపత్ని యగు ఉడయనంగైయందు జనించిరి. కలియుగాది తిరుక్కురుగై (కురుగాపుర) యందు జన్మమంది మహాభక్తులై శ్రీరంగనాథస్వామివలన నమ్మాళ్వార్ (మనయాళ్వారు) అని పిలువఁబడి ఈ పేరొందిరట. విష్వక్సేనాంశసంభూతులు. మఱియు వీరు వకుళాభరణు లనియు, విష్వక్సేన శిష్యు లనియుఁ జెప్పఁబడినది. తామ్రపర్ణీ తీరమున కురుకాయను గ్రామము వీరి జన్మస్థలము. జన్మనామము 'మారన్'. కలియుగాది ౪౩ దినమగు ప్రమాథి సం॥ వైశాఖ శు ౧౪ శుక్రవా

రము కర్కాటకరాశి వీరి జన్మకాలము. వైయాశి నెల వృషభమాసమున విశాఖ వీరి తిరునక్షత్రము.

౧౨. మధురకవి యాళ్వార్ - వీరు పరాఙ్కుశ ద్దాసు శిష్యులు. పాండ్య దేశమున తిరుక్కోళూ రను గ్రామమం దొకపురశిఖాడుఁ (ముందరజుట్టు గల) డగు బ్రాహ్మణునకుం గుముదాంశమునఁ జనించిరి. సామవేదముం జదివినవారు. వీరు అయోధ్యకుం బోయి అటనుండగా దక్షిణదేశ మున నమ్మాళ్వారు లవతరించిన యానవాళు తేజోరూపమున వీరికగుపడెనట.

దానినెఱింగి దక్షిణదేశమునకు మఱలి నమ్మాళ్వార్ (పరాఙ్కుశముని) నాశ్రయించి, వారి శిష్యులై జ్ఞాని యయ్యెనట. పండ్రెండుగురు ఆళ్వారులలో నమ్మాళ్వార్ అగ్రగణ్యులు, ముఖ్యులు. మధురకవి యాళ్వారును కొందఱు పండ్రెండుగురిలోఁ బాటించి పూజించుట లేదం దురు. ఇంక పెరియాళ్వార్ కుమార్తె యగు ఆండాళ్ చాల భక్తురాలుగనుండి 'తిరువాయి మొళి' అను పవిత్ర మహాగ్రంథమును రచించెం గాన దానిని భక్తితో పఠింతురు.

**ఇంకిపోవు నదులు** (Parched Rivers) — నదులు పుట్టుతావులందు వర్షాధిక్యమగుటంగాని, గొప్ప జలనిలయములగు సరస్సులుండుటంగాని, మంచు విస్తారము కరగి జలములై యిందుఁ బడుటచేగాని, నదులు విస్తార జలములంగల్గి ప్రవహించుచుండనోపుఁ గాని కొంత జనినపిదప భూమి జలములంబీల్చి నది నింకింపఁ జేయునదియైనచో రానురాను అవి నిర్జలము లగును. అందువలన వాని కీపేరిడియున్నారు. వర్షములందు, వరదలందు, వీనియందుఁ గొంత దూరముదనుకగాని, కడవరకుంగాని నీరుండెడిని. ఆస్ట్రేలియాలోని ముర్రేనది, ఆఫ్రికాలోని ఆరెంజి నది, ఆఫ్ఘనుస్థానమున పారశీకముపైపు హారి రూద్నది, ఇట్టినదులకు సాదృశ్యములు. ఈజిప్టునందు నైలునదికూడ [illegible] పొల్పడుచుంట తప్పు లేదని కొందఱనుచున్నారు. హారిరూదు నది కడకు కేవలమింకిపోవునదియే.

**ఇంగ్లండు దేశము** — ఐరోపా ఖండమున గ్రేటుబ్రిటన్ ద్వీపమునందున్న దేశము. ఇదియు, వేల్సుదేశము నొకే పరిపాలన క్రింద నున్నవి. ఇవి తొల్లింట యొకప్పుడు కౌంటు లను సామంత రాజులచేఁ బాలింపఁ బడుచుండెను. ఒక్కొక కౌంటు యొక్క రాజ్యమునకు కౌంటీలని పేరయ్యెను. ఇప్పుడట్టి కౌంటీల పాలన లేకున్నను దేశముయొక్క భాగములకుఁ గౌంటీలని పేరు వాడుకయందున్నది. అట్టి కౌంటీలు ఇంగ్లాండునందు నలువదియు, వేల్సునందు పండ్రెండును కలవు. ఇవి తిరిగి కూడ పరిపాలన సౌకర్యములుకుగాను పారిష్‌ల క్రింద విభాగములు చేయంబడినవి. కౌంటీలకు షైరులనియు వాడుక నామముగలదు. ఇవి భరత దేశమందలి జిల్లాలు తాలూకాల వంటివి.

ఇంగ్లాండు ౫౦,౦౦౦ చతురపు మైళ్లు గల దేశము. వేల్సు ౭,౫౦౦ చతురపు మైళ్లు.

ఇంగ్లాండనిన ఏంగిల్సు (Angles) అను తెగవారి భూమి యని యర్థము. వేల్సు శబ్దమునకు విదేశమని యర్థము.

ఇంగ్లాండునందు ముఖ్యమగు నదికి థేమ్సు అనిపేరు. ఇది ౨౧౫ మైళ్ల పొడవుకలది. లండను నగరము గుండా ప్రవహించును. ఇది కోట్సువోల్డు కొండలందు జనించి నార్తు సీ యందు సంగమించును.

ఇక నీదేశమున సెవరన్, ట్రెంటు, ఉజ్, మెడ్వే ఆవన్, మొదలగు చిన్న చిన్న నదులు కలవు. ఆవన్, డోర్వెంటు, ఊజ్, వేయి మొదలగు ననేక నదుల పేర్లు ఉదకము, నీరు, జలము, నది, ప్రవాహము మొదలగు కెల్టిక్కు భాషా పదముల నుండి కల్గినవి. దేశము చిన్నదగుట గొప్పనదు లిందుండుట యసంభవము. ఇంగ్లాండునందు సరస్సు లనేకములు కలవు. లేక్ డిస్ట్రిక్టు (Lake District) అను భాగము వినోదముగ విహరించు సీమగా మాత్రమున్నది. ఇంగ్లాండు చెమ్మగనుండు ఆరోగ్యవంతమగు దేశము. దక్షిణపశ్చిమముల నించుక వేడి యధికముగనుండును. మఱియు నిటనే ఎక్కువగా వర్షించును. తూర్పుతీరమం దేటేట ౨౭ అంగుళములును, పశ్చిమతీరములందు ౪౫ అంగుళములును వర్షించుచుండునని చెప్పఁబడినది. కెస్విక్ నందు ౭౧ అంగుళములును, కంబర్లాండులోని సీత్వేయిటు నందు ౧౪౦ అంగుళములును వర్షము లేటేట పడుచుండునని చెప్పఁబడినది. ఈదేశమున వర్షకాలమని యొక ప్రత్యేక కాలము లేదు.

ఇంగ్లాండునందినుము, రాతిసబొగ్గు, సైంధవ లవణము విస్తారము దొరకుచుంటచే నినుపపను లధికముగాఁ గలవు. వేల్సుదేశమున స్లేటురాయి అధికముగ దొరకుచున్నది. సీసము, గ్రాఫైటు అనేకచోట్ల దొరకుచున్నది. ఇది కంబర్లాండునందధికము. భూమి తక్కువయైనను సారవంతమగుట, గోధుమలు, బార్లీ ధాన్యము, ఓట్సు ధాన్యము పైరగునుగాని వరిధాన్యము పండదు. బంగాళాదుంపలు, టర్నిప్పుదుంపలు, విస్తారము పైరుచేయఁబడుచున్నవి. ఆపిల్పండ్లు, పీర్పండ్లు, ప్లమ్‌పండ్లు, చెర్రీపండ్లు, గూస్బెర్రీపండ్లు, స్ట్రాబెర్రీపండ్ల తోటలు కలవు. ప్రజలు ఆంగ్లేయులు. చేతిపనులు యంత్రములతో కర్మాగారములందు విస్తారము చేయఁబడుచున్నవి. వర్తక మపరిమితముగ నడచుచున్నది. సముద్రములోని ద్వీపమగుట చాల రేవులు కల్గి ఓడలవర్తకము విశేషమని చెప్పవలసియున్నది. ఇనుపదారు లపరిమితముగఁ గలవు.

బ్రిటీషుప్రభుత్వము చాల బలాఢ్యమైనదగుటచే నితరదేశములపై నధికారము గల్గియున్నది. నావికాదళము, కాల్బలములు, శతఘ్నిదళములు, వాయువిమానదళములు లెక్కకు మితిమీరి యున్నట్లుండును. ఇంగ్లాండు, స్కాట్లాండు, ఐర్లాండులే గాక ప్రపంచమున నాల్గవవంతు బ్రిటీషుప్రభుత్వమునకుం జేరియున్నది. ఇంగ్లాండునం దారు యూనివర్సిటీలు కలవు. అందు ఆక్సుఫర్డు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములు సుప్రసిద్ధములు. వేల్సునం దొక విశ్వవిద్యాలయ మున్నది. సర్వకళాశాల లపరిమితముగ నున్నవి. పుస్తకభాండాగారములకు లెక్కలేదు. ప్రొటెస్టాంటు క్రైస్తవమతము దేశమత మని చెప్పఁబడినది.

పట్టణములు - ఇంగ్లాండు చిన్నదేశమైనను ప్రజాధిక్యతయు, వాణిజ్యాధిక్యతయు, ప్రభుత్వబలాధిక్యతయు, ధనాధిక్యతయుం గల దేశముగాన, దేశమున పట్టణము లధికముగఁ గలవు. ఇంత చిన్నదేశమున నిన్ని పట్టణములుంట చాల అరుదు. లండన్‌నగరము దీని రాజధాని. గొప్ప

వర్తకస్థలము. థేమ్సునదిపై నున్న నగరము. లెక్కలేని గొప్ప భవనములతో నిండియున్నది. రాజనివాసభవనమునకు బక్కింగ్హామ్ పేలస్సని పేరు. లండనునగరమున భూమిగుండా సొరంగములం ద్రవ్వి ఇనుపబాటలు వేసియున్నారు. నదిని దాటుట కనేకవంతెనలు కలవు. నీటిక్రింద నుండు సొరంగములగొట్టములం జొప్పించి,అవ్వలి కివ్వలికి ఇనుపబాటలను వైచియున్నారు. లండను నగరము పదిమైళ్ల పొడవును, ఏడుమైళ్ల వెడలుపునుగల్గి నలువదియారులక్షలజనులకు నివాసమై యున్నదందురు.

లివర్పూల్, బర్కేన్ హెడ్, బ్రిష్టల్, మాంఛెస్టరు, బర్మింగుహామ్, లీడ్సు మొదలగు పట్టణములు గొప్ప వ్యాపారకేంద్రములు. ఇంగ్లాండు దేశపాలన పార్లమెంటు అధికారమున నున్నది. ఇది ప్రభువుల సభ (House of Lords), కామన్సు సభ (House of Commons) అను రెండుసభలఁ గల్గియున్నది. కామన్సు ప్రజా ప్రతినిధులు. చక్రవర్తి కూడ గలఁడు. కాని సర్వాధికారములు ప్రజాప్రతినిధుల హస్తగతములై యున్నవి.

**ఇంగ్లాండు దేశమునం దాంగ్లజాతి** (The English) — జట్లాండునుండి జూట్సు (Jutes from Jutland) మొదట వచ్చి కెంటునందు హాంపుషైరునందు కాపురము గుదిరిరి. సాక్సనులు (Saxons), ససెక్సు, వెసెక్సులలో నివాసమేర్పర్చుకొనిరి. ఏంగిల్సు (Angles) నార్తుఫోకు, సౌతుఫోకుల నాక్రమించిరి. ఇందు సౌత్ ఫోకునకు తూర్పుఆంగ్లియా (East Anglia) యని పేరు కూడ గల్గెనట. ఇట్లే వేర్వేఱు తెగలు వారింగ్లండున కాపురము లేర్పర్చుకొని జాతియొకటయ్యందేకమై ఆంగ్లేయులను పేరఁబరగుచున్నను, అట్టునట వారివారి పూర్వుల భాషలు వేర్వేఱుగ వాడుకగ వినఁబడుచుండును. శతాబ్దములుగ నేకమైయుంటయు, ఐకమత్యము వలని లాభములు పూర్తిగ నెఱిఁగియు ననుభవించియునుంట పీలగునంతదనుక భేదములం బాటింపరు.

**ఇంగ్లాండుదేశమున కౌంటీలు, షైరులు** — తొల్లిఇంగ్లాండుదేశము పెక్కు సామంతరాజులచేఁ బాలింపఁబడుచుండినది. వారు దేశపాలకునకు సామంతులుగ నుండుటయేతప్ప పాలనమున స్వతంత్రులే. తొలుత శాక్సనులు (Saxons)ను, పిదపనార్మనులును(Normans) మరికొందఱును ఈ సామంత పరిపాలకమండలిగ నుండెడివారు.

శాక్సను పదమగు Shire నకు పరిపాలన స్థానమని యర్థము. ఈ షైరు పదమునుండియే ఇప్పటి యాంగ్లపదమగు Share విభజింపఁబడిన భాగము అనుపదముకల్గెనట. షైరును పరిపాలించు శాక్సను సామంతునికి Shire Reeve లేక షెరీఫ్ (Sheriff) లేక Elderman ఎరల్ (Earl) అని వాడుక లుండెనట.

నార్మనులు దేశాధిపతులయినపిదప కౌంటీ (County) పదము సిద్ధమయ్యెను. ఒక కౌంటీని పాలించునాతనికి కౌంటు అనిపేరు. కౌంటునకు స్త్రీలింగరూపము కౌంటెస్ (Countess). కొన్ని షైరులపేర్లు అట్లే నేఁటికి యున్నను, కొన్నిటికి పేరులు మారి కౌంటీలని క్రొత్తపేర్లు వాడుకకల్గెను. శాక్సను రూపమగు Earl నకును, నార్మన్ రూపమగు Count నకును అర్థము సామంతుఁడనియే. స్త్రీలింగ రూపము రెంటికిని Countess అనియే. ఇక్కాలమున వారి పరిపాలనాధికారము వదలిపోయి ప్రభుత్వమునందే చేరిపోయెను.

ఇంక పూర్వపుఅధికారపదవులగు డ్యూకు, ఎరల్, కౌంటు మొదలయినవి పిదప బిరుదము

లుగా మారిపోయి నిజార్థములేనివై పూర్వాస్తిత్వముం దెల్పుచు గౌరవనిర్ణీతములుగ బిరుదులై యున్నవి.

మఱియుం దొల్లింటి కాలమున (కౌంటీల యధికార కాలమున) దేశములం దచ్చటచ్చట కౌంటుయొక్క అధికార కార్యనిర్వహణస్థానములుండునవి యట. వానియం దాప్రాంతదేశపు ప్రభుత్వకార్యములు నిర్వహింపఁబడుచుండినవి. ఒక్కొకతరి కౌంటు అందువసించినను వసించుచుండువాఁడు. వానికి పేలటైన్ అనియు, కౌంటీపేలటైన్ (County Palatine) లని పేరు. పేలటైనుశబ్దము రాజనగరున కర్థమిచ్చు Palace శబ్దమునుండియె కల్గినది.

ఆంగ్లదేశమున ముఖ్యమగు పేలటైన్ కౌంటీలలో మిగుల ప్రధానములైనవి, లాంకషైరు, డర్హామ్ చెషైరు అనుపేరులు గల కౌంటీలు. ఇవి తమ పరిపాలనా స్వతంత్రతను తక్కిన కౌంటీలకన్న నెక్కువ కాలమువఱకు నిలుపుకొనఁగల్గెనట. నేఁటికిని లాంకషైరు డర్హాము లకు ప్రత్యేక న్యాయస్థానములు (Special Courts of Chancery) నిలచియే యున్నవి.

ఇంగ్లాండు దేశమున నిట్టి కౌంటీలు ౪౦ కలవు (ఇంగ్లాండు దేశము చూడుఁడు). ఉత్తరపు కౌంటీలు ౬; కంబర్లాండు షైరు, నార్తంబర్లాండు షైరు, వెస్టుమూరు లాండు షైరు, డర్హామ్షైరు, లాంకషైరు, యార్కుషైరు. పశ్చిమపు కౌంటీలు ౯; చె షైరు, షార్పు షైరు, హెరిఫర్డు షైరు, మాన్మొత్ షైరు, గ్లాసెస్టర్, సామర్సెట్ షైరు. తూర్పుకౌంటీలుగ. లింకన్ షైరు, నార్ఫోకు షైరు, సఫోకుషైరు, ఎస్సెక్సుషైరు, కేంబ్రిడ్జిషైరు. (దక్షిణకౌంటీలు ౯) కెంటుషైరు, సర్రేషైరు, ససెక్సు, బెర్కుషైరు, హాంప్షైరు, విల్ట్షైరు, డార్సెట్ షైరు, డెవన్ షైరు, కారన్వాలు షైరు. (మధ్య కౌంటీలు ౧౪) స్టాఫోర్డు షైరు, డర్బీ షైరు, నాట్టింగ్హాం షైరు, వొర్సెస్టరు, వార్విక్కు షైరు, లీచస్టరు షైరు, రట్లాండు, నార్తాంప్టన్, హంటింగ్టన్, ఆక్స్ఫర్డు షైరు, బక్కింగ్హామ్ షైరు, మిడిల్సెక్సు షైరు హెర్టుఫోర్డు షైరు, బెడ్ఫోర్డు షైరు, మొత్తము నలుబది కౌంటీలు.

**ఇంగిలీకము**— లాటిన్. Cinnabar. జర్మను Kinnabari. ఆంగ్ల. Cinnabar. సం. హింగులు, హింగులిః, దరద, పారద. ఇంకను ఆంగ్లరసాయనవేత్తలు Sulphide of Mercury అనియు నందురు. ఇది గనులలో దొరకును. దీనినుండి పాదరసము వచ్చునుగాన పాదరసమునకిది మాతృక యనఁదగును. ఇందు పాదరసము సర్వసాధారణముగ నూటికి ౮౬ పాళ్లుండునని లెక్కింపఁబడినది. మఱియు నిందు గంధకము ౧౩.౭౧ భాగములుండెడిని ఇందనేక అపరిశుభ్రపదార్థములుండుటయు, అపరిశుభ్రత లేకుండి కొంతవఱకు స్వచ్ఛతంగల్గియుంటయుఁ గూడ కలదు. ఎఱ్ఱగనుండునది. నలుపువర్ణము లోనికిం జేరును. ముఖ్యముగ నిది స్పానియా దేశములోని ఆల్మాడెనునందునను, కార్నియోలా కడ ఇడ్రియాయందు, మెక్సికో దేశమునందలి న్యూ ఆల్మెడెన్ కడను కాలిఫోర్నియాయందును దొరకుచున్నది. దీనిని గుండచేసి వెర్మిలియన్ రంగులందు కలుపుదురు. ఆయుర్వేదవైద్యులు క్రమముగ శుద్ధిచేసిన ఇంగిలీకమును, శాస్త్రోక్తముగఁ జేసిన ఇంగిలీకభస్మమును కఠినపథ్యము విధించి రోగులకిచ్చెదరు. పథ్యము చాలి ముఖ్యము. లేకున్న నపాయము వాటిల్లును. ఇంగిలీకము జాగ్రతగ నడపిన సమస్త రోగములు నివారించునని చెప్పఁబడినది. కుష్ఠరోగము మొదలగు సమస్త చర్మవ్యాధులు నివారణమగునని యందురు. దీనికి చనుబాలు, పాలసుగంధి

కషాయము, ఫిరంగిచెక్క, మిరియాలపొడిం గల్పిన నెయ్యి విరుగుడులని చెప్పఁబడినది.

**ఇంగ్లీషు గోల్డుకోస్టుకాలనీ** — అప్పర్గినియా చూడుఁడు.

**ఇంగువ చెట్టు** — లా. Ferula assafoetida (లేక Alliacea). ఆంగ్ల. Assafoetida. సం. హింగు, సూపధూపన, జంతునాశన. దీనిపరిశుభ్రత, వాసనల ననుసరించి యనేకతరగతుల ఇంగువలు కలవు. ఇంగువచెట్టు యొక్క పాలు లేక జిగురు. భరతదేశమున భోజనపదార్థముగను, కొంతవఱకు ఆయుర్వేదీయ ఔషధములందునను వాడఁబడుచున్నది. వేర్వేఱువిధముల నుపయోగించుతరి ననేక గుణములు గల్గియుండుటచే నెక్కువ యుపయోగములందుఁ జేరందినది. దీనికి విరుగుడులు- ౧. మంచిగంధము, ౨. బాదంజిగురు, 3. దానిమ్మకాయ యని చెప్పఁబడినది. (ఇంగువ చూడుఁడు).

**ఇంగువ** — లా. Ferula assafoetida, Ferula alliacea. ఆంగ్ల. Assafoetida. సం. జంతునాశనం, జంతుఘ్నం, హింగు అని పేర్లు. (హింగుపత్రముసహా) ఇంగువ భోజనపదార్థములకుఁ బరిమళమిచ్చుటకై చేర్పఁబడునది. ఇది ఇంగువచెట్ల పాలనుండి చేయఁబడుచున్నది. ఇంగువచెట్లు కాబూల్, పెషావరు మొదలగు దేశపరిసరముల విస్తారము పెంచఁబడుచుండును. దీనికి వయస్సు వచ్చినతోడనే, కొమ్మల కొనలందుండు చిగుళ్లమధ్యమునందు చిన్న ముత్తెములంబోలి తళతళలాడు కాంతిఁగల్గి, ఇంచుక పసుపురంగు ధాతువుతో పాలుఘనీభవించిన జిగురు మోటట రెండుసారులు బయలు వెడలుచుండును. దీనింగనిపెట్టి చెట్లక్రిందచాపలు, బట్టలు పఱచి గోధుమపిండి, తుమ్మబంక మొదలగువానింజల్లి చెట్లకు గంట్లుచేయుదురు. చెట్లనతిశయముగ విజృంభించినపాలు కారి, తోడనే బిగియ నారంభించును. ఇది ఇంగువపంట. దీనిం భద్రపర్చి యనేకవిధముల పలురకముల ఇంగువలను చేసి విక్రయించెదరు. ఇంగువలందు మిక్కిలి ప్రశస్తమైనరకము మంచిపాల నొడించినది. ఇంగువయొక్క యతిశయము దానిపరిశుభ్రత, ఇతరపదార్థము లెక్కువ కలియకుండమి ననుసరించి యుండెడిని. ఇంగువ లనేకరకములు విక్రయమునకుఁ జేయఁబడుచు నిటులనే పెక్కు పేరుల నందియున్నవి. ప్రశస్తమైన ఇంగువయందు గుణములు పెక్కు గలవు. ఇది యాకలిని గల్గించుననియు, వీర్యపుష్టి, బలము జేయుననియు, ప్రసవించిన స్త్రీలకిచ్చిన మైలరక్తమును చక్కగ వెడలించుననియు, మూలవ్యాధి రక్తపాతమును నిలుపునందురు. శ్వాసరోగులకు శ్వాస నడచి, విరేచనము వెడలించుననియు, కడుపులోని ఏలికపాములును, నులిపురుగులు మొదలగు పురుగులం జంపుననియు; నారికురుపుల లోని పురుగులం జంపుననియు, నీళ్లలోఁ గలిపి పార్శ్వపు తలనొప్పికి నావైపు ముక్కులోఁబోసిన నివారించుననియు, స్త్రీలకు గర్భస్రావము గల్గించుననియు చెప్పఁబడినది. ప్రశస్తమైన యనేకమందులందుఁ జేరెడిని. దీనికి దానిమ్మకాయరసము, బాదము, మంచిగంధము విరుగుడులని చెప్పఁబడినది. ఇంగువయం దధమపుజాతికి కారుఇంగువ యనిపేరు. దీనికి సంస్కృతమున జంతుకా, జంతుకారీ, హింగునాడికా యనిపేర్లు కలవు. ఇది కేవల వైద్యోపయోగమైనది. దీని ధూపమువేసి, ఉన్మాదరోగము నివారింపవగు ననియు దీనివలన నాభియందుఁ బుట్టెడి విద్రధి యను పేరుగల వ్రణము మానుననియు, మఱియుఁ గడుపులోనిబల్ల, మూలవ్యాధి, ఉబ్బుజాడ్యము, శూలలు నివారణమగుననియుం జెప్పఁ

బడినది. సంస్కృతమున వాష్పకా, వాష్పికా, వాష్పీ, వాష్పికా యని పేర్లు. దీని చూర్ణకషాయము కాకజేసి, త్రిదోషములు హరించి, గుల్మరోగము, జలోదరము, ఆమదోషములను, హరించునదియుఁ జెప్పఁబడినది.

**ఇంచుపకులగోత్రము** — ఆర్య వైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి (వైశ్య గోత్రములు చూడుఁడు). ఇంచుపకులగోత్రము-ద్వ్యాష్రేయగోత్రము (౮) దీనిని ఘోటంకకుల గోత్రమనియు నందురు. సంస్కృతగోత్రము గోపకస, గోపకగణము, ఆపస్థంబసూత్రము, యజుశ్శాఖ, ప్రమాణగ్రంథమాద్యప్రవరఖండ, కీర్తిశుఁడు దేవత, భార్య చంద్రాంబ, ఇంద్రకీలాద్రి తపస్థానము, చంద్రసరస్సు తటాకము, జపము కోటి, దీపములు ౩౦, క్షేత్రసంఖ్య ౨౬, గోదానము, ఎండుపోక తెల్లకలువ వర్జనీయములు.

**ఇంటగెలచి రచ్చఁగెలువవలెను**- ఆంధ్రలోకోక్తి.

**ఇంట పిల్లివలెను, బయట పులి వలెను** — ఆంధ్రలోకోక్తి.

**ఇంట పెళ్లి, ఊళ్లో కుక్కల కడావడి** — ఆంధ్రలోకో

**ఇంటర్ బౌర్సు సెక్యూరిటీస్** — వాణిజ్యసంబంధపరిభాషాపదము. Interbourse Securities. ఒకేరీతిని (మార్కు-పు) వట్టముంగల్గి వే ఱు దేశముల నొకేసమయమున విక్రయింపఁబడు సెకూ ప త్రములు.

**ఇంటర్నల్ కంబస్చన్ ఇంజన్** (Internal Combustion Engine) — దు పెట్రోలు, కిరసనాయిలు, క్రూడా మొదలగునవి కాల్పఁబడునవి. ఆవిరి నెక్కుడుగా పనిజేయును. అనుభవజ్ఞులగు యంత్రశాస్త్రవేత్తలు బాయిలర్ ఆవిరియంత్రములకన్న నివి నూటికేబది రెట్లధికపు పనిం జేయుననుచున్నారు. మోటారుబండ్లయందమర్పఁబడునవి, వాయువిమానములయందమర్పఁబడున వీయంత్రములే. వీటికి గాస్ఎంజినులనియు కూడనందురు.

ఈయంత్రములు రెండు భేదములు కలవిగ నుండును. కొన్ని నాల్గు స్ట్రోకుల సైకిల్ (Four Stroke Cycle) నుపయోగించునవి. వీనిని Otto Engines అనియు నందురు. ఇంక కొన్నిటి ప్రతి Revolution నందు ఒక్కొక Power Stroke ఉండునవి. వీనికి Clork అనియు, Two Stroke Cycle Engines అనియు నందురు. ఈ రెండవతెగ ఎంజినులు ఒకటి లేక రెండు గుఱ్ఱముల బలముగల చిన్న ఎంజినులు మొదలుకొని నూరుటన్నుల బరువుగల Fly Wheel అమర్పంబడు మూడువేల గుఱ్ఱముల బలముగల (Horse Power) పెద్ద ఎంజినుల వరకుఁ గూడ చేయఁబడుచున్నవి. సుప్రసిద్ధమగు డీసెలు ఇంజన్సు (Diesel Engines) ఈ గ్యాసు ఇంజనే (Gas Engine) యట. వీనిని క్రీ. వె. ౧౮౮౩ సంవత్సరమున Gottlieb Daimler అను మహనీయుఁడు వాడుకలోనికిం దెచ్చినవాఁడట. వీనిశక్తి వింతగ అధికపరచిన విధానమునకు Super Charging System అని పేరిడియున్నారు. ఇందు Two Stroke Petrol Engines వేఱు విధముగ పనినొనర్చునవి యని చెప్పఁబడెనట. వానియందు ప్రతి రెండు స్ట్రోకులందు Power Stroke ఉండనేరదు. Four Stroke Cycle నందు అట్లుకాదట.

**ఇంటర్నేషనల్ డేట్ు లైన్** — డేటు లైన్ చూడుఁడు.

**ఇంటర్ నేషనలిజం**(Internationalism)— విదేశసంబంధ మైత్రియందు స్వదేశాభివృద్ధిగలదని నమ్మువారి మతము. యుద్ధము తగ్గదనియు, విదేశపుతగాదాలు అంతర్జాతీయ న్యాయస్థానముల (International Courts) ద్వారా తీర్చుకొని శాంతిం గాపాడవలయునని నమ్మువారి మతము.

**ఇంటికి జ్యేష్ఠాదేవి, పొరుగునకు శ్రీమహాలక్ష్మి** — ఆంధ్రలోకోక్తి.

**ఇంటిగుట్టు ఊరుకట్టు** — ఆంధ్రలోకోక్తి. ఇంటిగుట్టు ఇంటికి బలము. ఊరుకట్టు ఊరికి బలము అనియర్థము.

**ఇంటిదీపమని తాకితే చేయికాలక మానునా?** — ఆంధ్రలోకోక్తి.

**ఇంటి దొంగను ఈశ్వరుడైనా పట్టజాలడు** — ఆంధ్రలోకోక్తి.

**ఇంటిపేర్లు** — ఆంధ్రదేశమున ఇంటిపేర్లు మనుష్యులపేర్లకు ముందుంచబడి వాడబడుచుండును. ఇవి పెక్కు (తొల్లి వారిపూర్వులు నివసించుచుండిన) గ్రామనామములుగను, కొన్ని వారి పూర్వులొనర్చిన ఘనకార్యముల గౌరవార్థమగు పౌరుషనామములుగను, మరికొన్ని ప్రసిద్ధులగు వారి పూర్వుల నామములుగను, మరికొన్ని ఏదో వారి పూర్వులతో సంబంధములుగల ఇతరపదార్థ నామములుగను నుండును. ఇవి అనేకులకొక్కటే పేరుండుట తటస్థించుతరి, వారువారు వేర్వేరుగ తెలియ వారికుటుంబముల పేరులందెల్పుటగాని వేరుకాదు. దక్షిణదేశములందు తండ్రిపేరును ఇంటిపేరుస్థానమునను, తర్వాత తనపేరును చెప్పు వాడుకగలదు. దక్షిణదేశమునందు ఇట్టివాడుక యున్నను, అచటనొకట గ్రామనామము లింటిపేర్లుగ వాడబడుచుంట గాననగుడిని. ఉత్తర దేశములందు కుటుంబనామములు ప్ర[illegible]కముగ కలవు. వానిని పేర్లకుంబిదప వాడుదురు. ఐరోపాదేశములందు ముఖ్యముగనింగ్లాండుసీమలందింటిపేరును Surname అనెదరు. ఇదితొల్లింటి Sire name అనగా కుటుంబమునకు మూలపురుషుడుగ నెంచబడువానిని Sire అని వాడిరి. అవియే నేటికిని ఇంటిపేరులుగ (Surnames) పేరులకు బిదప వాడఁబడుచున్నవి. వీరిలో కొందరికి వారిపూర్వులు వసించిన తావులపేర్లు ఇట్లుకలవు. ఇంకను వృత్తులవలన గొన్నియు, గ్రామములనుండి కొన్నియు, పెట్టుడుపేర్లుగ గొన్నియు (Nicknames) గూడ గలిగియున్నవని తెలియుచున్నది.

ఇంకను ఆంగ్ల క్రైస్తవులకు రెండేసిపేర్లుండెడిని. అందుమొదటిపేరు ఏ సెయింటు(క్రైస్తవర్షి) యొక్క దినమునందా బాలుఁడు జన్మించెనో లేక ఏ సెయింటుయొక్క రక్షణక్రింద ఆ బాలుఁడభివృద్ధినందవలయునని ఆతని తలిదండ్రులు కాంక్షింతురో ఆ సెయింటుపేరు తొలుతనిడుటయు, పిదప బాప్టిజమ్ (క్రైస్తవమత ధర్మములనిచ్చు సంస్కారము) నందు వేరొక క్రైస్తవనామము ఆ బాలున కిడుటయుంగలదు. (క్రైస్తవనామములు చూడుఁడు).

**ఇంటిలో ఈగలమోత బయట సవారీమోత అంతది** — ఆంధ్రలోకోక్తి.

**ఇంటివారుగొడ్డుగేదంటే పొరుగువారు పాడిగేదెయనెదరా?** — ఆంధ్రలోకోక్తి.

**ఇంటివారు వ్రేలుతో చూపితే పొరుగువారు కాలితో చూపుదురు** — ఆంధ్రలోకోక్తి.

**ఇంటెరిమ్ డివిడెండ్సు** — వాణిజ్య సంబంధ పరిభాషాపదము. Interim dividends, అసలు డివిడెండు మొత్తము ప్రకటింప

బడకముందు మధ్యమధ్య (వాటాలకు చెల్లింప నగు) డివిడెండు సొమ్ము చెల్లించుటకుపేరు.

**ఇంటెస్టెసీ** — వాణిజ్యసంధ పరిభాషా పదము. Intestacy ఆస్తికలవాఁడు తనఆస్తిం గూర్చి ఏవిధమైన విల్లు (ఉద్దేశ పత్రము) వ్రాయ కుండ చనిపోయిన స్థితి.

**ఇంట్లో తింటూ ఇంటివాసములు లెక్కపెట్టుట** — కృతఘ్నుఁడని భావము. ఆంధ్ర లోకోక్తి.

**ఇండక్టివ్ మెథడ్** – (Inductive Method) హితోపదేశము చూడుఁడు.

**ఇండస్ట్రియాలిజమ్** – (Industrialism) పరిశ్రమల (Industry) వలన దేశధన మభివృద్ధి కాగలదనియు, కాని industry బల పూర్వవలయుననియు నమ్మెడివారి మతము.

**ఇండియమ్ - లోహము** — అపు రూపమైనది. తెల్లగను, మెత్తగను ఉండు లోహము. దీని కెమికల్ సింబల్ In. atomic weight 114.8. atomic number 49, specific gravity 7.42, melting point సెంటిగ్రేడు థెర్మామీటరు 176 డిగ్రీలు వేడికని చెప్పఁబడినది. తగరముకన్న మెత్తని లోహము. వాతావరణశక్తిం జెడక నిలచి, ఎదిరించగల లోహము.

సిలేసియాలోని ఫ్రీయిబర్గుపట్టణముకడనున్న గనులలో జింకుబ్లెండీయందు తొలుత క్రీ. వె. ౧౮౬౩ సంవత్సరమున కనిపెట్టంబడినది. కని పెట్టిన పరిశీలకులు Reich and Richter అను రసాయనశాస్త్రవిదులు.

**ఇండియాదేశము** — తొల్లింటి భరత వర్షము, లేక భరతవర్ష దేశము రామశాము భరత [illegible]నం బరగుచుండెడిని. ఇం దనేక దేశ ములు అనేకులగు రాజులచే పరిపాలింపఁబడు చుండెను. (తొల్లింటి రాజ్యములు చూడుఁడు). వారినుండి మహమ్మదీయుల హస్తగతమై, వారి నుండి వేర్వేఱు ఐరోపాదేశస్థుల పాలంబడి ఎట్ట కేలకు బ్రిటీషుప్రభుత్వమునకుం జేరియున్నది. ఈ మధ్యకాలములందు మహమ్మదీయులనాడు ఉత్తరభాగమునకు హిందూస్థాన మని పేరుకలిగి అది సర్వత్రా వ్యాపించి దేశమునంతను హిందూ దేశమని విదేశస్థులు వాడసాగిరట. దాని నాంగ్లే యులు ఇండియా యని చెప్ప మొదలిడిరి. నేఁటి కిని అదియె వాడుకయుండినది. దీని కుత్తర మున ముఖ్యమైన ఎల్ల హిమవన్నగపఙ్క్తి; క్రింది మూడుదెసలందు సముద్రమే. తూర్పుసముద్ర మునకు బంగాళాఖాతమనియు (తొల్లింటి రత్నా కరము), దక్షిణదిశనున్నది మహోదధి. (దీని నిప్పుడు హిందూమహాసముద్ర మనుచున్నారు), పశ్చిమముననున్న పశ్చిమసముద్రమున కరేబియా సముద్ర మని ఆంగ్లేయులచే పేరిడంబడినది.

ఇండియాదేశము వైశాల్యము పదునేనులక్షల చతురపుమైళ్లని యందురు. ఇప్పుడు బ్రిటీషు పరిపాలనక్రింద సామ్రాజ్యమై యున్నది. ఇం గ్లాండుభూపతి ఇండియాచక్రవర్తి యనంబడు చున్నాఁడు. ప్రపంచమున నిండియాదేశము ఎక్కువ పెద్దది యగు ద్వీపకల్ప మని చెప్పఁబడు చున్నది. పెద్దదేశమగుటయు, అనేక దేశము లిందు చేరియుంటయు, గొప్ప పర్వతపఙ్క్తులు, నదులు, వేర్వేఱు శీతోష్ణస్థితులం గల్గియుంట భూగోళశాస్త్రజ్ఞు లచ్చెరువంది దీని నొక ఖండ ముగా జెప్పనగునని వచించియున్నారు. ఈమహా సామ్రాజ్యచరిత్ర వ్రాయఁబడలేదు. ఉన్నచరిత్ర పురాణములందు చెప్పఁబడినది.

మూఁడువైపుల నిండియాదేశముం జుట్టిన సముద్రతీర మించుమించు నాల్గువేలమైళ్ళు పొడ వుండును. కాని భూమిలోనికిం జొచ్చుకొనివచ్చి

పొగయోడలకు మంచి నౌకాశ్రయము నొసంగ తగిన వీలుగలతావు లట్టె కానరావు. ఇట్టివి పశ్చిమమున కాంబే సంయుక్తాగ్రగుడము, కచ్చి సంయుక్తాగ్రగుడము, దక్షిణమున మన్నారుసంయుక్తాగ్రగుడము, పాంబన్జలసంధి, పాక్సుజలసంధియు నై యున్నవి. బొంబై రేవు పశ్చిమమున చక్కని రేవుగ నేర్పడియున్నది. తూర్పున చెన్నపురికి అట్టి నైసర్గికమైన సనుపాయములు లేకున్నను కృతకముగ నొక నౌకాశ్రయ మేర్పరుపంబడినది. విశాఖపట్టణపురేవు భూమిలోన నొక తంపరం ద్రవ్వివైచి ...చియున్నారు. చెన్నపురివైపు తూర్పుతీరమునకు కోరమండలతీరమనియు, నైఋతిదిశకు మలబారుతీరమనియు పేరిడంబడినది. ఇంకను కొన్ని సముద్రతీరపు పట్టణములకడ ఓడలనాపు ఏర్పాటు లేర్పరుపంబడియున్నవి.

దక్షిణపుదిశను కన్యాకుమారి అగ్రము మళయాళభూమియందు తిరువాన్కూరురాజ్యమున గలదు. ఇట నొక సుప్రసిద్ధదేవస్థానము కన్యాకుమారీదేవిది కలదు. సింధుదేశమున మోంజీ అగ్రమును (పశ్చిమాగ్రము) డియూ అగ్రము కతియవాడద్వీపకల్పమునకు దక్షిణమ్మునయున్నది. సింహళద్వీపమున కుత్తరకొన కెదురుగ కలిమెరీయగ్రమును, మహానదిముఖద్వారమున కుత్తరముగ పాల్మైయిరా అగ్రమును కలవు.

పర్వతపఙ్క్తులలో హిమాలయమగ్రగణ్యము. ఇది ప్రపంచమంతటిలో నెత్తైన పర్వతస్థలి. దీనియం దెత్తైన గౌరీశంకరశిఖరము (ఇప్పటి ఎవరెస్టు శిఖరము) ౨౯,౦౦౨ అడుగుల ఎత్తుగలది. దీనిని అచటివారు దియోధుంగయనియు ననుచుందురు. నేపాలదేశమునకుం బశ్చిమహద్దున కాంచనగంగ (ఇప్పటి కెంచింజంగ) శిఖరమును కలదు. ఇంకను ధవళగిరి, కైలాసశిఖరము మొదలగు శిఖరము లనేకము లీ హిమవన్నగమున చెప్పందగినవి కలవు. దీనియొక్క శాఖయగుగరళ పర్వతమున గరళశిఖరము, మాంధాతశిఖరము సుప్రసిద్ధములు. మాంధాతశిఖరముకడ నొక గుహయందు సుప్రసిద్ధుం కృతయుగాలంకారభూతుం బరగిన మాంధాతచక్రవర్తి తపం బొనర్చి యోగనిష్ఠచే తన భౌతికశరీరమును వీడిన పవిత్రస్థలియందు నేటికిని ఆయన యస్థులు పూజింపంబడుచున్నవి. హిమవన్నగము ౧,౯౦౦ మైళ్ల పొడవును, అనేకతావుల నెక్కువతక్కువలతో ౨౦౦ మైళ్ల వెడలుపును కలదిగ జెప్పంబడినది. హిమవన్నగమునకు దక్షిణమువైపునగల పర్వతములలో నాదినున్నపఙ్క్తికి శివాలిక్పర్వతములకు (తొల్లింటి సవాలాకనంబడు సపాదలక్షపర్వతము) లక్షాఇరువదియైదువేల శిఖరములుంట నా పేరు గల్గినది. ఇం దడవిమృగములు గల అరణ్యములు కలవు. హిమవన్నగపాదభూమికి తరై యని పేరు కలదు. ఇది చాలా చెమ్మనేలయు, అనారోగ్య ప్రదేశమునై యున్నది. దీనియం దిటీవల తోటలనాటియు, వ్యవసాయముల కనుకూలముగ జేసియు బాగుచేయుచున్నారు.

అఫ్ఘను స్థానమునకు, ఇండియా దేశమునకు నడుమనున్న పర్వతపఙ్క్తికి సులైమాన్ పర్వతములనిపేరు. దీనియం దెత్తైన శిఖరము తఖ్తిసులైమానన సోలోమోన్సింహాసనమని యర్థము. ఇది ౧౧,౩౦౭ అడుగుల ఎత్తుకలది. బెలూచిస్థానమునకును ఇండియాకును నడుమ హాలా పర్వతపఙ్క్తి కలదు. గంగానది, సింధునది ప్రవాహ ప్రదేశములనడుమ ఆరావళి (తొల్లింటి ఆదర్శావళి) పర్వతపంఙ్క్తి కల దిది ౩,౮౦౦ అడుగుల ఎత్తుకలదని చెప్పంబడినది. దీనియం దెత్తైన శిఖరము ఆబు (తొల్లింటి అర్బుదము) శిఖరము. ఇది సముద్రపు నీటిమట్టముపై ౫,౬౫౦

అడుగుల ఎత్తుకలదిగనున్నది. దేశమున నడుమగాం దూర్పు పడమరలకు వింధ్య పర్వత పఙ్త్తి వ్యాపించి యున్నది. ఇది దక్షిణ హిందుస్థానపు (ఇప్పటి డక్కన్) పీఠభూమినంటిన ఉత్తరపు హద్దుగ కాంబేసంయుక్తాగ్రగుడము నుండియుం గలదు. దీనిశాఖలలో నొకటియగు మేఖల పర్వతమున జనించి అరేబియా సముద్రమున సంగమించు నర్మదా (రేవానది) నదిఃోవ కుత్తరపు టెల్లగానున్నది. దీనియొక్క శాఖయొయగు కైమూరు పర్వత పఙ్త్తి తూర్పుగానున్నది. తపతీ, నర్మదా నదుల నడుమంగల పర్వత పఙ్త్తికి సాత్పుర (తొల్లింటి సప్తపుర) పర్వతములనిపేరు. తపతీ దక్షిణభాగమునంగల పర్వత పఙ్త్తికి నార్త రన్ఘాట్సు (ఉత్తరపర్వత) అని యనంబడుచున్నది. దీనికి దక్షిణాపథోత్తర పర్వత పఙ్త్తి యనిపేరు. ఇవియన్నియు నించుమించు విద్యాసంబంధములుగనే యున్నవి.

దక్షిణాపథ (దక్కన్) పీఠభూమికి పశ్చిమపు హద్దుగా సహ్యాద్రి పర్వత పఙ్త్తి కలదు. దీని నిప్పుడు పడమటికనుములు (Western Ghats) అనుచున్నారు. ఇది దక్షిణమున కన్యాకుమారి అగ్రమువరకు వ్యాపించియున్న పశ్చిమాచలము. ఎత్తు ఇంచుమించు సముద్రపు మట్టముపై 3,౦౦౦ అడుగులు. ఈపశ్చిమాద్రి పర్వత పఙ్త్తికిని పశ్చిమ సముద్రమునకును నడుమ ముప్పది లేక నలుబది మైళ్ల వెడల్పుగల భూప్రదేశము కలదు.

ఇటులనే దక్షిణాపథ పీఠభూమికిం దూర్పు టెల్లగ పూర్వాచల పర్వత పఙ్త్తి కలదు. దీని నిప్పుడు తూర్పు కనుములు (Eastern Ghats) అనుచున్నారు. పూర్వాచల మించుమించు రెండు వేల అడుగుల ఎత్తుకలదిగను, అనేకతావుల ననేక నామములం గల్గినదిగను యున్న పర్వత పఙ్త్తి. పూర్వాచల పశ్చిమాచలములు దక్షిణపు కడను పళని పర్వతములందునను కలియుచున్నవి. ఇటుల దక్షిణాపథము యొక్క మూడుదిశలను పర్వత పఙ్త్తులంగల్గి త్రికోణాకార పీఠభూమిగ నున్నది. ఇది పెద్దదియగు పీఠభూమి. దీనిక్రిం బిదప చెప్పందగినది మాళ్వా (మాళవ) పీఠభూమి. ఇది వింధ్యోత్తగ పాదము నంటియేయున్న త్రికోణాకారముననున్న పీఠభూమి చిన్నది. ఇది గంగానది తట్ట ఏటవాలు కలది. దక్షిణాపథ పీఠభూమి సముద్రపుమట్టముపై నించుమించు రెండు వేల వరకు అడుగుల ఎత్తుం గల్గియున్న భూప్రదేశము.

గంగానది ప్రవహించు సమతలము ఉత్తరమున హరిద్వారము మొదలు తూర్పునకును, ఇంచుక ఆగ్నేయమునకును వ్యాపించి బంగాళాఖాతముకడనున్న గంగానది డెల్టాకడ ముగియుచున్నది. ఇది ప్రపంచమున గల సమతలములలో గొప్పవాటియందొక్కటి. మిగుల సారవంతమై ఫలవంతమై బహు జనవంతమైనది. పిదపం జెప్పందగినది సింధునది ప్రవహించు సమతలము. ఇది ఉత్తరమున హిమాలయపర్వత పాదమున ప్రారంభమై దక్షిణమున పశ్చిమ సముద్రము వరకుంగలదు. ఇందు ఉత్తరభాగమున నదికి తూర్పుగా నిసుకప్రదేశము కూడ కలదు. దానికి తార్ అనియు, ఇండియన్ ఎడారి యనియు వాడుకనామములు కలవు. ఈరెండు సమతలప్రదేశములు పాంచాలదేశమున కలియుచున్నవి. ఇట్లయ్యు నివి ఆనదులు ప్రవహించు దిక్కులకు ఏటవాలుం గల్గియున్నవి. ఇంక దక్షిణాపథ పీఠభూమి కిరుదెసలను పూర్వపశ్చిమ పర్వతపఙ్త్తులకవ్వల సముద్రములదనుక వ్యాపించిన సమతలప్రదేశములు కలవు. అందు పశ్చిమమువైపు సమతలము వెడల్పు తక్కువయయ్యు గొప్ప సారవంతమగు భూమి. తూర్పువైపు సమతలము అధికమైన వెడల్పుగలది.

నదులయందు గంగానది అగ్రగణ్యము. దీని సరియగుపేరు భాగీరథి (గంగానది చూడుఁడు). పవిత్రవంతముగ నెంచంబడుచుంటయేగాక వ్యవస్థాయములకు జీవకళనొసంగి ఓడలు నడువందగి నదిగ నున్నది. మిగుల సుప్రసిద్ధము. తరువాతఁ జెప్పఁదగినది బ్రహ్మపుత్రానది. హిమాలయ పర్వతపఙ్క్తి కవ్వలంబుట్టి ఒక పొడవైన లోయగుండా సేంపూనది యని పేరంబరగుచు తూర్పు దెసగా ప్రవహించుచు దిహాంగునదిం గల్పుకొని ఆసాముదేశము ప్రవేశించుచో పాయలుగ జీలును. పశ్చిమశాఖకు కోనై యనియును, తూర్పుశాఖకు మెగ్నాయనియును, మధ్యశాఖకు బ్రహ్మపుత్ర యనియును వాడుకనామములం గల్గి, వేఱొకశాఖ గంగానదితో కలసి పద్మానది (పుడ్డా) యనుపేరంది వేఱొకశాఖ సురమానదితో కలసి గంగతోసహా బంగాళాఖాతమునందు సంగమించును. గంగానది పొడవు ౧,౫౬౦ మైళ్లు, బ్రహ్మపుత్రానది ౧,౮౦౦ మైళ్లు పొడవనియు, వెల్లువలకాలమున ఎక్కువ అపాయకరముగ నుండుననియు, ప్రవాహము ఎక్కువ వడింగల్గి యుండుననియు చెప్పఁబడినది.

గంగానది గంగోత్తరి కించుకయవ్వల గోముఖ హిమనిలయమున భగీరథాశ్రమస్థానమున జనించుచున్నది. గంగోతరి సుప్రసిద్ధతీర్థము. ఇట ఊదారంగు, బంగారురంగు కమలములు గల సరస్సుగుండా నదియుండును. హిందువులకుఁ బవిత్రవంతమగు మహానది. దీనిని నిరసించుటయే విధిగా తలంచు క్రైస్తవులుసైతము పరిశీలనలవలన తేలిననిజము నీటియందు క్రిములు ఉండనేరవను సిద్ధాంతమును కాదనలేక మానముద్రం బూనుదురు. గంగానది కుత్తరమునందు యమునానది, గోగ్రా నది, హిమవన్నగము నుండియు వింధ్యమునుండి శోణభద్రను, ఇంక నితర తావులనుండి గోరు లేక రాప్తినది, గోమతి, గండకీనది, కుశీనదుల నుపనదులుగను, దక్షిణమున టోన్సునది, కర్మనాశ నదుల నుపనదులుగను తనయందు చేర్చుకొనుచున్నది. వింధ్య పర్వతమున జనించు చర్మన్వతీ (ఇప్పటి చంబల్) నదియును, వేత్రవతీ (ఇప్పటి బేట్వా) నదియును యమునానది కుపనదులై, అందుఁ జేరుచున్నవి. టోన్సునదికిఁ దొల్లింటిపేరు తమసానది.

గంగానదియు, బ్రహ్మపుత్ర శాఖయుంగలసి పద్మా (పుడ్డా) నది యైనదని మున్నువివరింపఁ బడినది. అది కోనై నదితో గోవాలేండుకడ సంగమమై నడచును. భాగీరథిగంగయొక్క దిగువభాగమున త్రివేణియను గ్రామమున గంగ మూడుగ చీలును. దీనిని ముక్తవేణియని యందురు. అలహాబాదునగరమందున్న ప్రయాగ (ఇప్పటి దారాగంజి) కడ త్రివేణి యుక్తవేణి యనియు, ఇట సరస్వతీనది యంతర్వాహినియై గంగయందు చేరుననియుఁ జెప్పఁబడినది. కలకత్తా ప్రక్కంబడి ప్రవహించు గంగానదిశాఖకు హుగ్లీ యనిపేరు. ఇది బంగాళములోని హుగ్లీ పట్టణమునంటి ప్రవహించుట నీపేరు వాడుకయైనదిగాని తొల్లింటిపేరు తెలియుటలేదు. గంగా బ్రహ్మపుత్రలుచేర్చిన గొప్ప డెల్టా ప్రపంచమున పెద్దడెల్టాయని జెప్పఁబడినది. దానికవ్వలనున్న చిన్నచిన్న లెక్కలేని దరిదరినే కడుసమీపమున నున్న దీవులన్నియుంగలసి సుందర వనము (Sunderbuns) అనంబడుచు అనారోగ్య ప్రదేశముగను, పులులకు మొసళ్ళకు నునికిపట్టుగను, వేటలతావుగను ఉన్నది.

పిదపఁ జెప్పఁదగినది సింధునది. ఇది ఇండియాలో పెద్దనది. ౧,౮౦౦ మైళ్ల పొడవుగలది. టిబెట్టుదేశమునందలి హిమవన్నగ కైలాసశిఖర పశ్చిమదిశను రావణహ్రద (రఖస్తల్) సరస్సున కవ్వలి పొడువునేలల నీటియూటలందు జనించి,

పశ్చిమవాహినియై నడచును. శతద్రు (ఇప్పటి సట్లెజ్) నదియు ఈనేలనే జన్మించునది. కాశ్మీర దేశముంజొచ్చి దక్షిణవాహినియై యనేక చిన్న ప్రవాహములం గల్పుకొని బలపడి, పాంచాల దేశముంజొచ్చి దక్షిణవాహినియై, యైదునదులం గల్పుకొని సింధుదేశముగుండా నడచి, పశ్చిమ సముద్రమున సంగమించును. దీనికి పశ్చిమమున ప్రధానమగు ఉపనది కుభా (ఇప్పటికాబూల్నది) నది యనంబడుచున్నది. తూర్పునం గలియు నదులు ౧. రవి (ఇప్పటి రావీనది) దీనికింకను వేత్వేఱు గ్రంథములందు ఐరావతి, పరూష్ణి, హైమవతి యను నామములు వాడంబడినవి. ౨. విపాశానది (ఇప్పటి బీయాస్), ౩. అశక్ని (ఇప్పటి చీనాబునది), ౪. వితస్థానది (ఇప్పటి జీలమ్నది) ౫. శతద్రు (ఇప్పటి సట్లెజ్) యను నదు లైదింటిని గల్పుకొనును. ఈయైదు నొకటి నొకటి సంగమించి యైన ప్రవాహమే సింధునది యందు సంగమించును. అద్దానికి పంచనదమని పేరయ్యెను. సింధువనిన సముద్రమని యర్థము. ఎక్కువ • వెడలుపుంగలిగియుంట నీపేరిడియుండి రని తోచెడిని. ఇట్టి గంభీర నామరూపములం గల్గిన యీనది ఎక్కువలోతైనదికాదు. పురాణ ములందిది నదమని చెప్పఁబడినది.

గోదావరి లేక గౌతమీనది- నాశికాత్రయం బకముకడ జన్మించి, నైజామురాజ్యముగుండా నడచి భద్రాచలము, రాజమహేంద్రవరముల ప్రక్కంబడిజని బంగాళాఖాతమున సంగమించును. దీనికి వరద మంజీర మొదలగు నుపనదులు కొన్నిగలవు. కృష్ణానది వేణీనదితోఁ గలసి కృష్ణవేణీ లేక కృష్ణానది యనంబరగుచు బెజవాడ ప్రక్కఁబడిచని బంగాళాఖాతమున సంగమించును. తుంగభద్ర ఉపనదియై దీనియం[illegible] కలియును. తుంగానదియు, భద్రానదియుంగ[illegible] తుంగభద్రా నదిగ పేరందినవి. కావేరీనది దక్షిణదేశమును ఫలవంతముగఁ జేయుచున్నది. మహానది మధ్యరాష్ట్రములగుండా ప్రవహించి కటకము జుట్టి నడచి, ఛండీబాలేశ్వరముకడ సంగమించును. గోదావరి పొడవు ౯౦౦ మైళ్లు. కృష్ణానదిపొడవు ౮౦౦ మైళ్లు, కావేరి ౪౭౦ మైళ్లు, మహానది పొడవు ౫౨౦ మైళ్ళు.

భరతదేశమునవర్ష వాయువులు(Monsoons) రెండుగ నున్నవి. నైఋతిదిశనుండి వీచు వర్ష వాతమొకటియు, ఈశాన్యదిశనుండి వీచు వర్ష వాతమొకటియు వర్షములం గురిపించును. మే నెల మొదలు సెప్టెంబరుదనుక ఈశాన్యదిగ్వర్ష వాతమును, అక్టోబరుమొదలు మార్చి నెలవరకు వాయవ్యదిగ్వర్ష వాతమును వేత్వేఱు తావులందు వర్షములం గురిపించును. ఆంధ్రదేశమున రెంటను, అందు ముఖ్యముగ నీశాన్యదిగ్వాతము వర్షింపఁజేయును. హిమాలయ దక్షిణపు ఏటవాలు ప్రదేశములందునను, బ్రహ్మపుత్రానది ప్రవహించు లోయయందునను, వర్షమధికము కురియును. అచటి కాశీపర్వతములందు, అందు ముఖ్యముగ చిర్రాపుంజి యనుతావున నేటేట ౫౨౩ అంగుళముల వర్షము గురియును. ఇది ప్రపంచమున నెక్కువ వర్షముకురియు తావని చెప్పఁబడినది. ఇత్తావు ఆసాముదేశములోనిద్ది. పశ్చిమసముద్రతీరమున వర్షమధికము. అందు మహాబలేశ్వరపు కొండలందు ౨౪౦ అంగుళముల వర్షము కురియును. తూర్పుకనుమల కవ్వలి సముద్రతీరప్రదేశములందు వర్షము తక్కువగా కురియును. ఆదర్శావళి (ఆరావళి) పర్వతపశ్చిమ భాగమున వర్షము బొత్తిగా తక్కువకురియును. దక్షిణాపథ తూర్పుతీరప్రాంతమున ఈశాన్య దిగ్వాతవర్షములును, పశ్చి[illegible]తీరముల వైపున నైఋతిదిగ్వాత[illegible] వర్షములు[illegible] ముఖ్యములు. బొంబై ప్రాంత[illegible] నేటేట [illegible] అంగుళములును, కలకత్తాయందు ౬౬ అంగుళములును, చెన్నపురి

ప్రాంతమున ౧౦ అంగుళములును, ఢిల్లీప్రాంతముల ౨౮ అంగుళములును, సింధుదేశోత్తరభాగమున రెండంగుళములును, ఏటేట వర్షించుచుండునని లెక్కింపఁబడినది. శీతోష్ణస్థితియు వర్షములం బట్టి చాలవరకుండునందురు. బంగారు, వెండి, రాగి, తగరము, సీసము, తుత్తినాగము, రత్నములు, రాక్షసబొగ్గు, కలప దేశమున కలవు. సముద్రతీరములందు సముద్రలవణమును చేయుచున్నారు. హిందూస్థానపు భాగములందు సైంధవలవణము వాడుచుందురు. రాజపుత్రస్థానములోని సాంబహారు (ఉప్పునీటి) సరస్సునుండి సముద్రపునీటినుండివలెనే ఉప్పునుజేయుచుందురు. దీనికి సౌవర్చలవణమనిపేరు. సింధుదేశపు గనులందు దొరకుటంజేసి సైంధవలవణ మనఁబరగెను. భరతదేశపు భూములం దన్నితావులందు నుదకస్వాస్థ్య ముండెనేని అన్ని పంటలు పండుచున్నవి. వర్షానుకూలమునగాని, కాల్వలగుండ నదీజలములఁ బ్రవహింపంజేసిగాని భూములను ఫలవంతముగఁజేయు ప్రయత్నములు చేయఁబడుచున్నవి. ఇంకను పంటచెరువులందు నీటెనినింపి పొలములకుపయోగించుటయుంగలదు.

దేశమున వసించుప్రజ లనేక జాతులవారు కలరు. అనేకభాషలను మాట్లాడుదురు. అనేక మతములవారు గలరు. జాతులందు బ్రహ్మ, క్షత్రియ, వైశ్యజాతులును, భాషలందు హిందీ, ఉరుదు, ఆంగ్లము, తెలుఁగు, అరవము, బర్మా భాషలును, మతములందు హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ, బౌద్ధ, జైన, మతములు, వాని అంతర్భేదములును వ్యాపించియున్నవి. బాటలు, ఇనుపబాటలు బాగుగనే యున్నవి. దేశము బ్రిటీషుప్రభుత్వ పరిపాలనయందున్నది.

రాజకీయముగ పరిపాలన విధానమునుండి ఇప్పటి ఇం [illegible] ౧. బ్రిటీషు ఇండియా యనియు, ౨. ఫ్యూడేటరీ ఇండియా యనియు, 3. ఇండిపెండెంటు ఇండియా యనియు, ౪. ఫ్రెంచి ఇండియా యనియు, ౫. పోర్చుగీసు ఇండియా యనియు నైదుగా చెప్పవలసియుండును. బ్రిటీషు ఇండియా యన చక్రవర్తిగారి రాజప్రతినిధి యగు వైస్రాయి ద్వారా పరిపాలింపఁబడుచున్న దేశభాగము. ౨. ఫ్యూడేటరీ ఇండియా యన బ్రిటీషు ప్రభుత్వమువారి వైస్రాయి ఇండియాప్రభుత్వపు రక్షణక్రింద స్వదేశీ భూపతులచే పరిపాలింపఁబడుచున్న స్వదేశ రాజ్యము. ఇవి హైదరాబాదు రాజ్యము, మైసూరు రాజ్యము, కాశ్మీరరాజ్యము మొదలగు రక్షిత సంస్థానరాజ్యములు. ఇవి దేశమున పెక్కులు గలవు. కొన్ని వైస్రాయి క్రిందను, కొన్ని గవర్నరుల క్రిందను ఉన్నవి. 3. ఇండిపెండెంటు ఇండియా యన నేపాలరాజ్యము, భూటాను రాజ్యము నను స్వతంత్ర రాజ్యములు రెండు. ఇవి రక్షిత సంస్థానములుకాక స్వతంత్రరాజ్యములై యున్నవి. ౪. ఫ్రెంచిఇండియా యన పుదుచ్చేరి ప్రోవిన్సు, యానాము, కారికాలు, చంద్రనాగోరు, మాహి మైయున్నవి. ౫. పోర్చుగీసు ఇండియా యన గోవాప్రోవిన్సు (పంజమ్ ద్వీపముసహా) డయ్యూ, డామనులై యున్నవి. వీటిపేటింగూర్చి ఆయాతావులఁ గననగును. (భరతదేశము చూడుఁడు).

**ఇండివిడ్యుయలిజము** — (Individualism). కేవల సాంఘికములుగఁ గాకుండ ప్రత్యేక ప్రత్యేకముగ ప్రతి మనుష్యునకు కర్మ స్వాతంత్ర్యముండునటుల ధర్మము, నమ్మకము. ఇది రాజకీయ మతము.

**ఇండుప (కాయలు లేక గింజలు) చెట్టు** — లా. Strychnos potatorum ఆంగ్ల Cle [illegible] -nut tree సం. అంబుప్రసాద, క [illegible]

దీని కాయలలోని గింజలను ఇండుప కాయ లనియు, ఇండుప పిక్కలనియు, చిల్ల గింజ లనియుఁ గూడ వాడుచున్నారు. అరగఁ దీసిన గంధము జిగటగ నుండును. నీటియందలి బురద నడుగంటఁ జేయును. మేహశాంతి, వీర్యపుష్టి జేయును. కంఠ మెఱుపు రోగమును, అగ్నిమాంద్యము, గ్రహణి, మూత్రకృచ్ఛ్రము లను నివారించును. పాలతోఁ గల్పి తినుచుండిన ఇంద్రియ నష్టమును మాన్పును. కాయల కూరను కొందఱు తినెదరని తెలియుచున్నది. అది కఫపైత్యము, రక్తపైత్యము, క్షయ నేత్ర రోగములు, మేహము, ప్రమేహము, విష దోషములు హరించును. విరేచనబద్ధము జేయును. ముదిరిన కాయల చూర్ణము నందు వమనము గల్గించుగుణము గలదు.

**ఇండెంటు** — వాణిజ్యసంబధ పరిభాషా పదము. Indent- దీనిని order అనియు నందురు. ముఖ్యముగ విదేశపు వర్తకులు తమ నిమిత్తము వలయు సరకులంగొని పంపుమని తపశీళ్లతో ధరలతో తెలుపు పత్రమును ఇండెం టనియు, దేశములో నడచు వానికి ఆర్డరనియు, వాడుచున్నారు.

**ఇండెక్సు నెంబర్సు** — (Index Numbers). వాణిజ్య సంబంధ పరిభాషా పదము.

ఈ ఇండెక్సు నెంబరును ఒక దేశమునందొక సంవత్సరమున ధర ప్రమాణము (Price Level) ను తెలుపుట కుపయోగింతురు. ఈ అంకెలను ప్రతివత్సరమును లెక్కగట్టుదురు. ఈ లెక్కలను బట్టి వెనుకటి సంవత్సరమున కన్న వస్తువులధరలు పెరిగినదియు తరిగినదియు గ్ర[illegible]నగును. ఈ [illegible] బట్టి వర్తకము నడచు [illegible]ను. వెనుకటి [illegible] (౧౦౦) అనుకొని ఇప్పటి ధర నూటి కింత పెరిగినదియు, లేక తరిగి నదియుఁ జెప్పుదురు. ఇప్పుడిప్పుడు వీని యుప యోగము మిక్కిలిగఁ గన్పడుచున్నది.

ఈ నెంబరును గనుఁగొను మార్గములు నాలుగు- ౧. సగటు ధర తెలిసికొనుట (Simple Average), అన్ని వస్తువుల ధరలను వరుసగ వేసి కూడగా వచ్చినమొత్తమును వస్తు సంఖ్యచే భాగింపగా వచ్చిన అంకె. ౨. ప్రతి ధర యొక్క స్క్వేరు రూటు (Square Root) ను తెలిసికొని వానినుండి సగటు ధర కని పెట్టుట. 3. ధర లన్నియు నణాలు పైసలు నుండియు క్రమముగా హెచ్చునటుల వరుసగ వేసి, వానిమధ్యనున్న ధరను దీసికొనినచో నది సరిగా సగటు ధరను తెలుపును. ౪. దీనిని (Weighted Average) అందురు. సామాన్య ముగా దీసికొనిన వస్తువులకన్న ఉపయోగమున ముఖ్యమైన వస్తువులు కొన్నియుండును. ఉదా:- ఉప్పు, వస్త్రములు, మొదలగునవి. తక్కిన వస్తు వుల కన్న నది యెన్ని రెట్లు ముఖ్యమైనదో తెలిసికొని అన్నిసారు లా ధరను పట్టికలో జేర్చిన పిదప సగటును తెలిసికొందురు. ఈ విధానమం తగా వాడుకలో లేదు.

ఈ అంకెలను ప్రభుత్వముల్నయుఁ బ్రకటించు చుందును. ఎకనామిస్టు (Economist) మొద లగు పత్రికలు కూడ ప్రకటించుచుందును. రెండు సంవత్సరముల ధరలు పోల్చిచూచినప్పుడు మొదటి వత్సర మెన్నిరకముల వస్తువులు తీసి కొంటిమో మఱుసటి సంవత్సరము కూడ నన్ని టినే, అంత పరిమాణముగల వానినే తీసికొని ధరలు నిర్ణయింప వలెను. ఈ అంకెలిట్లు వాడఁ బడుచున్నను ప్రమాణమును సందేహించు

**ఇండెమ్నిటీ** — వాణిజ్యసంబంధపరిభాషా పదము. హామీయని యర్థము. Indemnity-ఒకరిపనికై, లేక ఒకరిపనికై వేఱొకరు హామీ యుండుమనని పూచీపడుట. అటులాతఁడు వ్రాసిన పూచీపత్రమునకు Indemnity Bond అని పేరు.

**ఇండో చైనీ స్పెన్సు లా** — (ద్వీపకల్పము) ఆశియాఖండమున బంగాళాఖాతము నకును, చీనాసముద్రమునకును నడుమనుండిన ద్వీపకల్పము. వరిపండు ఫలవంతమైన లోవలింపు గల భూమి. గొప్ప కలపనిచ్చు అరణ్యములు కలవు. గటపరచాచెట్లు కొంచెము మిగిలి యున్నను అయిపోయినవని చెప్పవచ్చును. టేకు, ఎబొనీ, వెదురు సమృద్ధిగాఁగలవు ఇది అప్పరు బర్మా, లోవరుబర్మా, షాన్ స్టేట్సు, సయాం దేశము, టాంగ్కిన్ రాష్ట్రము, అనాందేశము, ఫ్రెంచికొచ్చిన్ చీనారాష్ట్రము, కొచ్చిన్ చీనాదేశము, మలయాపెనిన్సులాలు కలసిన దేశభూమి కీపే రిడియున్నారు. (అవి చూడుఁడు).

**ఇండోపార్థియను నృపతులు** — (లేక పహ్లవనృపాలురు). వీరు శకవంశనృపతులకుం బిదప క్రివి, లేక అరాతిదేశమనం బరగిన పాంచాలదేశభాగముల నేలినవారు. వీరి పాలనము క్రీ. పూ. ౧౫౦ మొదలు ౧౫౮ వఱకు నలువదిరెండు సంవత్సరములు. వీరు ౧. గొండోఫారిస్, ౨. అబ్దాగసీస్, 3. అర్థాగ్నీస్, ౪. అర్సాకీస్, ౫. పకోరిస్, ౬. సనబరిస్ అను నార్గురు. వీరు రాజప్రతినిధులద్వారా ఏలినవారు గాని స్వంతముగా పరిపాలించినవారు కారు.

వీరిలో కడపటివ్వారిని కుజల్కాడ్పిసీస్ అను పేరుగల కుషానువృపతి యోడించి పదభ్రష్టునిగ నొనర్చి పరిపాలన యంతమయ్యెను. (క్రివిదేశము చూడుఁడు).

**ఇండోశాఖ క్షత్రియులు** — పురిహరశాఖ క్షత్రియులు చూడుఁడు.

**ఇండోసిథియను నృపతులు** — శకవంశ నృపతులు చూడుఁడు.

**ఇందీవరాక్షుఁడు** — గంధర్వుఁడు, ప్రభువు. తండ్రి నలనాభుఁడు. అక్క వరూధిని. ఒక ఋషివద్ద మాయోపాయమున నాయుర్వేదాభ్యాసమొనర్చి పిదప నాతనిం బరిహసింప నాఋషి యలిగి రాక్షసత్వమందుమని శపించె. నాశాపము వరూధినీసుతుండగు స్వరోచివలన విముక్తియయ్యెనని చెప్పఁబడినది. ప్రశంస మార్కండేయపురాణమునఁ గలదు.

**ఇందుమతీదేవి** — విదర్భరాజపుత్రిక. ఈమె అయోధ్యాపురాధీశుండగు అజమహారాజు. కుమారుఁడు దశరథమహారాజు. మనుమఁడు శ్రీరాముఁడు.

**ఇందుర్తిసీమ** — కృష్ణా, గుంటూరు మండల భాగములందు వ్యాపించి యుండెను. ఇందుర్తిప్రాంత సీమ యని భావము.

**ఇందువరి గోత్రము** — కథ లేక కథ్యగణము చూడుఁడు.

**ఇందుక్ష్వేడ న్యాయము**—చంద్రుఁడు, విషము (హాలాహలము) ఒకేరీతిని పాల సముద్రమున జనించినవేయైనను చంద్రునకు, విషమునకు నేపోల్కయు లేదు. పరమేశ్వరుఁడు చంద్రుని శిరమునధరించి విషమును మ్రింగక, ఉమియక, గళమున నిర్బంధించి యుంచెను.

**ఇందూరు సంస్థానము** — దీనిని హోల్కారున్న ఇరిటరీలనియు నందురు. నర్మదా నది కిరుప్రక్కలను వ్యాపించియున్న రాజ్యము. రాజ్యమున నల్లమం దధికముగా నుత్పత్తి యగు చున్నది. వైశాల్యము ౯,౫౦౦ చతురపుమైళ్లు. రాజ్యమున క్షత్రియజాతివారగు భీలుజాతివారు.

విస్తారము కలరు. మూలపురుషుఁడు రైతనియు, క్రీ. వె. ౧౬౦౩ లో జన్మించినవాఁడనియు చెప్పఁబడినది. ఇండోర్పురము రాజధాని (దీని తొల్లింటిపేరు ఇందూరు). దేశమునందు వింధ్య పర్వతములు కలవు. (సెంట్రలిండియా ఏజన్సీ సంస్థానములు చూడుఁడు). సుప్రసిద్ధదాత, నిర్మాత యగు అహల్యాబాయి (మహారాజ్ఞి) ఈసంస్థాన రాజ్యమేలిన ధర్మాత్మురాలు.

**ఇంద్రకంటి విశ్వపతిశాస్త్రి** — కవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడినవాఁడు. బ్రాహ్మణుఁడు. తెలఁగాణ్యశాఖ. రచించినది నారాయణమనన మను వేదాంతగ్రంథము.

**ఇంద్రకాద్రి** (పర్వతము). బెజ వాడ చూడుఁడు.

**ఇంద్రకౌశికగణము** — ఇది విశ్వామిత్ర సంతతిలోని గణము. ఇందు గోత్రములు మూఁడు కలవు. ౧. ఇంద్రకౌశిక, ౨. కౌశిక, ౩. ఇంద్ర అనునవి. వీనికిప్రవర- విశ్వామిత్ర, ఇంద్ర, కౌశిక.

**ఇంద్రకౌశిక గోత్రము** — ఇంద్ర కౌశికగణము చూడుఁడు.

**ఇంద్రగయ** — మధ్యరాష్ట్రములందు జబ్బల్పూర్ నుండి నర్మదా నదీతీరమునఁ గల మార్బిల్ రాక్సు అనంబడిన తావున గల స్నాన తీర్థము. ఇది ఇంద్రగయ యని చెప్పఁబడుచున్న పితృశ్రాద్ధస్థలము. ఇప్పుడు భేరాఘాటను పేరం బరగుచున్నది. (గయ చూడుఁడు).

**ఇంద్ర గోత్రము** — ఇంద్రకౌశిక గణము చూడుఁడు.

**ఇంద్రచాపలక్షణపరీక్ష** — కాల విజ్ఞానశాస్త్రమునందు చెప్పఁబడిన పరీక్షలలో నొకటి. (కాలవిజ్ఞానశాస్త్రము చూడుఁడు.) ఇంద్రచాపమనను అరివిల్లు లేక, ఇంద్రధనస్సు నియు గూడ ననుట గలదు. ఇంద్రధనస్సు సర్వసాధారణముగ వర్షయోగచిహ్నముగ తలంపఁబడుచుండును. ఇది యనేకములగు చిత్రవర్ణములతోఁ గూడి యగుపడును.

౧. పసుపుపచ్చ, ఆకుపచ్చ, నీలము, తెలుపు, ఎఱుపు వర్ణముల నింద్రచాప మగుపడినను, మేఘములం దావర్ణముల జాడలు దోఁచినను చక్కఁగ వర్షించి పంటలు సుభిక్షముగ పండుననియు, ౨. వాన కురియుచు మెఱుపులు గల్గియుండుతరి పగటియం దింద్రధనస్సు తూర్పు నుండి ఉత్తరమునకుం గాని, పడమటినుండి దక్షిణమునకుం గాని, కన్పించిన సుభిక్షము రానున్న శైలెఱుంగవలెననియు, ౩. అధికవర్షము కురియుచుండుతరి రాత్రియందు ఎఱ్ఱనిరంగుగల మెరుపు చంద్రుఁడు, ఇంద్రధనస్సు, గాన్పించిన భూపతులకుఁ గీడనియు, ౪. రాత్రియం దేదిక్కున నింద్రచాపము దోఁచునో ఆదిక్కున ప్రజలకుఁ గీడనియు, ౫. ఇంద్రధనస్సు పచ్చరంగును ప్రధానముగ గల్గియున్నయెడల ప్రజలకుం గీడనియు, తెల్లగ నున్నయడల దేశమునకుం దుర్దశ గల్గుననియు, ౬. వర్షము కురియుతరి సాయంసంధ్యాకాలమున వాయువ్యదిశయందు నగ్నిహోత్రమువలె ఇంద్రచాపము తోఁచుటయు, చంద్రబింబము అగ్నిరంగున నుండుటయు, పాలకపాలితుల కిర్వురకుం గీడనియు, ౭. జ్యేష్ఠాషాఢ శ్రావణమాసములందు పడమటిదిక్కున నింద్ర ధనస్సు కన్పించిన వర్షము లుండవని యెఱుంగవలయు ననియు రెట్టవిజ్ఞానమయుఁడు తెల్పియున్నాఁడు.

**ఇంద్రజిత్తు** — రక్కసుఁడు. తండ్రి రావణభూపతి. తల్లి మండోదరి. నామధేయము మేఘనాథుఁడు. ఇంద్రు నొకతరి సంగరమున జయించుటంజేసి ఇంద్రజిత్తని ప్రఖ్యాతి కలిగెను. అతి మాయావి. గొప్ప తపం

బొనర్చి పదునాల్గువత్సరములు నిద్రాహారముల నెఱుంగనివానిచేతంగాని హతుఁడుగాకుండ వర మందినవాఁడు. రామాయణ యుద్ధమున శ్రీరామ సోదరుండగు లక్ష్మణునిచే నిహతుడయ్యెను. లక్ష్మణుఁడు నిద్రాహారములు మానెననియు, యాతనినిద్ర నాయనధర్మపత్ని (జనకమహారాజు కూతురు) ఊర్మిళాదేవి యనుభవించుచుండె ననియుం జెప్పఁబడినది. ఇంద్రజిత్తు సింహళము నందలి కుంభిలయనంబడుతావున యాగమొనర్చె నని చూపుచున్నారు. (లంకా రాజ్యము చూడుఁడు).

**ఇంద్రద్యుమ్న (సరస్సు) ము** — ఉత్కలదేశమున పూరీ (జగన్నాధము) యందు ఇంద్రద్యుమ్న నగరమనంబడు జగన్నాధస్వామి విడిదిగృహముకడనున్న యొక సరస్సు. ఇది యా మహారాజుచే త్రవ్వింపఁబడినదని తలంపఁబడు చున్నది. అతండు దానమొనర్చిన గోవుల త్రొక్కిడిచే నైనదని వ్రాసియున్నారు.

**ఇంద్రద్యుమ్నుఁడు** — ఒకమహారాజు. ఉత్కలదేశమున, జగన్నాధమున ఇంద్రద్యుమ్న నగరమున విడిదిగృహము దేవునకర్పించినవాఁడు. గొప్ప విష్ణుభక్తుఁడు. మహాదాత. ఇంద్రద్యుమ్నము చూడుఁడు. తండ్రిపేరు సుమతి. పితామహుఁడు భరతుఁడు. ప్రపితామహుఁడు ఋషభుఁడు. ఇంద్రద్యుమ్నుఁడు అగస్త్యునిచే శపింపఁబడి గజేంద్రమోక్షణకథయందు గజేంద్రుఁడై, తర్వాతిజన్మమున జనించి విష్ణుదేవునిరక్షణ దెనం నని చెప్పఁబడినది.

**ఇంద్రపురము** — సంయుక్తరాష్ట్రముల లోని బులాందుషహార్ జిల్లా అనూపషహార్ భాగములోనిది. భాఘు అనంబడుతావు వాయువ్య దిశగా నైదుమైళ్ళ దూరమున నిప్పుడు ఇందో రనంబడుచున్నది. క్రీ. వె. ४६౫గ. సంవత్సరమున స్కంధగుప్తుని శాసనముల పేర్కొనంబడినది. నందగిరికృత శంకరవిజయమున చెప్పఁబడిన ఇంద్రప్రస్థమనునది ఢిల్లీలోని ఇంద్రప్రస్థమునకు సరిపోవుటలేదు. ఈ ఇంద్రపురమునకు సరిపోవు చున్నది. కాన ఆనందగిరి పండితుఁడు పొరబడి యుండవలెనని తోఁచెడిని.

**ఇంద్రప్రమద గోత్రము** — వశిష్ఠ గణము చూడుఁడు.

**ఇంద్రప్రమితి** — ఋషి. వేదవ్యాసుని శిష్యుఁడగు పైలునికి శిష్యుఁడు. ఋగ్వేదసంహితను చతుర్విధ మొనర్చిన పండితుఁడు. ఇతని శిష్యులు ౧. భాష్కలుఁడు, ౨. బోధ్యుఁడు, ౩. యాజ్ఞవల్క్యుఁడు, ४. పరాశరుఁడు, ౫. మాండూకేయుఁడు, ౬. అగ్నిమతి యను వారలు.

## ఇంద్రప్రస్థదేశము

ఇంద్రప్రస్థపుర మిప్పటి ఢిల్లీయగుట నాప్రాంత దేశ మింద్రప్రస్థదేశమనుట తెల్లము. తొల్లింటి కాలమున నీదేశమునకు నిగమబోధి యనియు వాడుకయుండిన ట్లగపడును. తొల్లి యుధిష్ఠిర మహారాజు కాలమున నిగమబోధి ఘట్టమనఁబడిన యమునానదియందలి స్నానముల రేవిప్పటికి నాపేరం బరగుచు సలీమ్‌ఘడ్‌నకు సమీపమునంగల నిగంబోధి ద్వారమనఁబడు నగరద్వారము కడనున్నది. యుధిష్ఠిరప్రతిష్ఠితమగు శివలింగము (నీలఛత్రీ) నేటికి నట్లేయున్నది. ఇట నా మహారాజొక గొప్ప హోమమొనర్చెనందురు. ఇంద్రప్రస్థపురము తొల్లింట ఖాండవవనమగుట నీదేశమునకు ఖాండవప్రస్థమనియుం బేరుండెను. ఢిల్లీపురమున తొల్లింట పాండవులకోట యుండిన తావునకు ఇంద్రపాట్ అనియు, పురానా ఖిల్లా యనియు ననుచున్నారు. ఇది రాజసూయయాగ మాభూశతి నొనర్చినతావందురు. ఇంక నిట

రాజ్యపాలన మొనర్చిన పృధ్వీరాజు కోటయుండిన తావు కుతుబ్ మీనారు కడను లాల్ఖిలా యనం బడుచున్నది. ఆయన యజ్ఞశాలయందు మహమ్మదీయుల యధికారకాలమున నొక మశీదును గట్టిరి. తక్కిన కట్టడములలో నొక్క జయపూర్ మహారాజగు జయసింగు నిర్మించిన నక్షత్రశాల తప్ప తక్కిన కట్టడములు రమారమి తరువాతవే. ఇంద్రప్రస్థమునకు ఖాండవప్రస్థమనియు, వారణావతమనియు, బృహస్థలి యనియుం గూడ పేర్లు వాడఁబడినవి. సామంతపంచకము చూడుఁడు.

**ఇంద్రబిలము** (ఇంద్రశైలగుహ) — మగధ దేశమున రాజగృహమున కారుమైళ్ల దూరమందున్న గిరిమెల్ కడనున్న పర్వతమునం దిది కలదని లైడ్లే (Laidlay) పరిశీలకుఁడు వ్రాల్చి యున్నాఁడు. ఇది బైపులా రేంజియందున్న పర్వతము. పంచాననానదీతీరము. ఇటనే గిరియెకన్నెడి బౌద్ధగ్రామమున్నది. పర్వతశిఖరములలో నొకదానిపై "జరాసంధుని" బురుజుగల తావున హంసస్థూపమనంబడు బౌద్ధకట్టడము కలదు. ఇంద్రబిలమను గ్రామ మొకటి ఇప్పటి బెంగాల్ నాగపూర్ రెయిల్వే గోమాలైనుపై ఆధ్రాప్రాంతమునఁగలదు.

**ఇంద్రభోగపురుగు** — ఆరుద్రపురుగు చూడుఁడు.

**ఇంద్రలుప్తము**—ఇది యొక రోగము. దీనిని ఖలతిః యని సంస్కృతమునఁ బల్కెదరు.

**ఇంద్రసావర్ణికమనువు** — తండ్రి యింద్రుఁడు. తల్లి శచీదేవి. జ్ఞాని. విష్వక్సేనుఁడని వాడుక యాతనికుండెను. ఆగ్నీధ్ర, అగ్ని, బాహు, శుచి, ముక్తర్షి, మాధవ, శుక్ర, అజితర్ష లనువారు మహర్షులు. జ్యేష్ట శుద్ధ పౌర్ణమి ఇంద్రసావర్ణికమన్వాది.

**ఇంద్రసేన** — మౌద్గల్యమహర్షి భార్య కింద్రసేన యని పేరు. నలునికుమార్తె కింద్రసేన యని పేరు. మౌద్గల్యమహర్షి భార్య ఇంద్రసేన. పతివ్రత. తర్వాతిజన్మమున కాశీరాజు కుమార్తెగను, పిదప ద్రుపదమహారాజు కుమార్తె ద్రౌపది గను జన్మించెనని చెప్పఁబడినది.

**ఇంద్రధనస్సు** — Rain bow. ఇంద్ర చాపమనియు, అరివిల్లనియు గూడ నన్నెదరు. సూర్యకిరణములు వర్షపు చినుకుల గుండా కన్పించుటలో శ్వేతవర్ణ భాగములగు సప్తవర్ణములతోఁ గన్పించును, దీనినే స్పెక్ట్రమ్ అందురు. అందములగు నన్నిరంగులతో నింద్రధనస్సులు సూర్యుని కెదుటిదెసను (అవ్వలిదెసను) గన్పడు చుండును. ఇది వర్షసూచకమందురు. భూవలయరేఖ కడ సూర్యుఁడుండుతరి నెదుటిదిక్కున అర్ధవృత్తాకారమున తరుచుగ గన్పడి సూర్యునితో మాయును. తరుచుగ నెఱుపు బయటి రంగుగను, ఊదా (Violet) లోపల నుండుంగాని, Double rainbow అగుతరి రంగులు వ్యత్యయమగును. ఇంద్రధనస్సు మధ్యగుండా నగుపడు నాకాశభాగము కన్న వెలుపలఁగన్పడు నాకాశభాగము గాఢమై కన్పట్టును. వర్షపు చినుకుల పరిమాణస్థితులనుండి దీనియందలి రంగులుమారునని తలంపఁబడుచున్నది. ఇంద్రచాపలక్షణ పరీక్ష చూడుఁడు. ఊదా, నీలి, మబ్బురంగు, ఆకుపచ్చ, పసుపుపచ్చ, వంగపండురంగు, ఎఱుపువర్ణములీ వరుసగ నింద్ర ధనుస్సులయందుఁ బొడగట్టు చుండును.

**ఇంద్రసేనుఁడు** — నలునికుమారున కింద్రసేనుఁ డని పేరు. మఱియు నరిష్యంతుని సంతతియం దొక ఇంద్రసేనుఁడు కలఁడు. ఇంకను యుధిష్ఠిరుని (ధర్మరాజు) రథసారథి పే రింద్రసేనుఁడు.

**ఇంద్రస్థంభగోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**ఇంద్రాణీక్షేత్రము** — బంగాళమున బర్ద్వాన్ మండలములోని కట్వా సమీపమున అజయనదిపైనున్న క్షేత్రము.

**ఇంద్రాతిథి గోత్రము** — ఆత్రేయ గణము చూడుఁడు.

**ఇంద్రావతీనది** — ఇది బస్తరు సంస్థానములోని జగ్దల్పూరు ప్రక్కనుండి ప్రవహించు నది. గోదావరీనదియందు సంగమించును. దీని జగధరపురమని కూడ ననుటయుం గలదు. ఈ నదియందు గొప్ప వంతెన గట్టియున్నారు.

**ఇంద్రావరజుఁడు** — ఉపేంద్రున కింద్రావరజుఁడని పేరుకలదు.

**ఇంద్రియములు** త్రివిధములు. ౧. జ్ఞానేంద్రియములు, ౨. కర్మేంద్రియములు, 3. అంతరింద్రియములు.

౧. జ్ఞానేంద్రియములు ౫ - ౧. శ్రోత్రము (చెవి), ఈ ఇంద్రియము గ్రహించు తన్మాత్ర శబ్దము. ౨. త్వక్కు (చర్మము) ఇది గ్రహించు తన్మాత్ర స్పర్శము(తాకుట) 3. చక్షు(నేత్రము), ఇది గ్రహించు తన్మాత్ర రూపము. ౪. జిహ్వ (నాలుక), ఇది గ్రహించుతన్మాత్ర రసము (రుచి). ౫. ఘ్రాణేంద్రియము (ముక్కు), ఇది గ్రహించు తన్మాత్ర గంధము (వాసన).

౨. కర్మేంద్రియములు ౫ - ౧. వాక్కు (నోరు మాటలాడునది). ౨. పాణి (చేతులు పనిచేయునవి). 3. పాదములు (నడచునవి). ౪. పాయ్వింద్రియము (గుదము విసర్జనమొనర్చునది). ౫. ఉపస్థేంద్రియము (ఆనందమొనగూర్చునది). ఇవియైదు కర్మేంద్రియములు.

3. అంతరింద్రియములు- మనస్సు, బుద్ధి, అహంకారము (అహంభావము) అంతరింద్రియములనంబడును. దీనికి మతాంతరమున కొందఱు చిత్తముంగూడచేర్చి అంతఃకరణ చతుష్టయమం దురు. జ్ఞానేంద్రియములైదును కర్మేంద్రియములైదును గలసి దశేంద్రియములనంబడుచున్నవి.

**ఇంద్రియాత్మవాదిమతము** – దీనికి లోకాయితమత మనియు, నిరీశ్వరవాదిమత మనియు వాడుకకలదు. ఇదియు చార్వాక మతముతో సంబంధించినమతమే. దానికిని, దీని కినిగలభేద మాత్మ నిర్వచనమునందు కలదు. చార్వాకులు ఇంద్రియసంయోగము (శరీరేంద్రియముల కూటమి) నాత్మ యందురు. విరోచన మతస్థులు స్థూలశరీరమునాత్మయందురు. వీరటుల గాక స్థూలశరీరమునుండి ఆత్మ వేఱందురు. శరీరేంద్రియముల కూటమియే యాత్మయయ్యెను, అది స్థూలశరీరమునుండి వేఱుగనుండును. దేనిని గల్గియుండుతరి జీవించుట సంభవించుచున్నదో, ఏది లేకుండుట మృతి సంభవించుచున్నదో అట్టి యాత్మ శరీరమునుండి వేఱుగ నుండకుండునేని మృతికిం బూర్వమువలెనే పిదపను శరీర మట్లే యుండుట సంభవింపవుగాన, ఇంద్రియసంయోగ మగు నాత్మ శరీరమునుండి వేఱుగనుండునని దీని సిద్ధాంతము. మఱియు మృతి ఇంద్రియముల యధీనముగాన దీనికింద్రియాత్మ వాదిమతమనిపేరు. తక్కిన వన్నియు చార్వాక మతమునుండియే గ్రహింపఁబడినవి. ఈ మతకర్త లోకాయితుఁ డని చెప్పఁబడినది. (చార్వాకమతము దేహాత్మ వాదిమతము, ప్రాణాత్మవాదిమతము చూడుఁడు).

**ఇంద్రుఁడు** — దేవతలకు ప్రభువు. తూర్పుదిక్కున కధిపతి. తండ్రి కశ్యపప్రజాపతి. తల్లి అదితీదేవి. అర్జునుఁడీతని యంశమున జనించినవాఁడు. రాజధాని అమరావతీపురము (దీనిని స్వర్గమనియు నందురు). భార్య శచీదేవి. ఈమె పులోముని పుత్త్రిక. ఆయుధము వజ్రము. ఏనుఁగు ఐరావతము (తెల్లఏనుఁగు). సభ పేరు

సుధర్మ. వాహనము ఉచ్చైశ్రవము (సముద్ర మథనమున జనించిన యుత్తమాశ్వము). ఉద్యాన వనము నందనవనము (పూఁదోఁట). కుమారుని పేరు జయంతుఁడు. రథసారథిపేరు మాతలి. సింహాసనముపేరు చింతామణీభద్రము. ఈతనికి సహస్రాక్షుఁడని పేరుకలదు. దుశ్చ్యవనుఁడనియుం బేరు కలదు. ఇంద్రుఁడు వాస్తుశాస్త్రమున కధిదేవత.

**ఇంద్రుఁడు (ఋషి)**— ఈతని నామముతో గ్రంథము లేవియు కానరాకున్నను, ఇంద్ర నామముతో ఋగ్వేద దశమమండలమునఁ గొన్ని సూక్తములు కలవు. వైకుంఠుడగు నింద్రుఁడొకఁడు, ముష్కములుగల యింద్రుఁడొకఁడు. ఇట్టిరువురు ఇంద్రులు ఋగ్వేద ఋషులలో కానవచ్చుచున్నారు. క్రీ. వె. ౧౬ వ శతాబ్దారంభమున నంది తిమ్మన్నకవి, ముక్కు పెద్ద దగుటచే, ముక్కుతిమ్మన్నమైనట్టులే అండములు పెద్దవగుటచే నీతనిని "ముష్కవానింద్రః" అని యప్పటి ఋషులు చెప్పియుండనోపుదురు.

సూక్త ప్రవక్తలగు యమ, సవిత, ఇంద్రాదులను దేవతలనుగాఁ దలంపరాదు. ఇంద్ర, యమ, సవితాదిమునులు తమ సూక్తములలో ఇంద్ర యమాది దేవతలనే నుతియించుచున్నారు. యమేంద్రాదులగు నీమహర్షులే ధర్మజార్జునుల జనకులేలకాకూడదనియు, వాయువు అనునొక ఋషియుండుట నాతఁడే భీమునితండ్రి యేల కాకూడదనియు నొకవాదమింకను లేకపోలేదు.

**ఇంపెర్సనల్ ఎకౌంట్సు** — వాణిజ్య సంబంధపరిభాషాపదము. మనుష్యసంబంధము లేని సరకులలెక్కలు, సొమ్ములలెక్కలు మొదలగు లెక్కలు

**ఇంప్రెషనిజమ్ (Impressionism)** - తా చూచుట, ఎఱుఁగుటకన్న నెక్కువగాచిత్రించి చూపు నేర్పరితనము.

**ఇంప్రెషనిస్ట్రీ (Impressionistry)** – కేవలము వ్రాసియె కాక, బొమ్మలం జిత్రించి చేయు Caricatures మూలముననను, వ్యంగ్యచిత్రముల (Cartoons) మూలముననను భావములను బలముగ వ్యక్తపరుచు వానికి impressionist అని పేరు. దానిం గూర్చిన కళ.

**ఇంబ్రోద్వీపము** — కేండియాద్వీపము చూడుఁడు.

## 'ఇ' అక్షరముకుంజెందిన క్రైస్తవ పురుష నామములు

— Eamonn- ఐరిషు నామము.

Earle, Eason, Eaton- నవీన కల్పిత నామములు.

Ebenezer- హిబ్రూ నామము, Stone of help అని యర్థము.

Edburgh- ట్యూటానిక్కు నామము, Rich protection అని యర్థము.

Edgar, Edgard, Edgerton- ట్యూటానిక్కు నామములు, Rich spear అని యర్థము.

Edmund, Edmond, Eadmund- ట్యూటానిక్కు పదము (దీనినుండి కల్గినముద్దు పేరులు Ed- Ned- Neddy), St. Edmunds స్వామిపేరు, Rich protection అని యర్థము.

Edred- ట్యూటానిక్కుపదము Rich council అని యర్థము.

Edric- ట్యూటానిక్కు పదము, Rich ruler అని యర్థము.

Edward, Edouard, Eduard, Eadward- ట్యూటానిక్కు పేర్లు. దీనంగల్గిన ముద్దుపేర్లు, Ed, Eddy; Ned, Neddy; Ted, Teddy పెక్కండ్రు భూపతు లీపేరింటి వారుండిరి, Rich Guard అని యర్థము.

Edwin, Edwyn- ట్యూటోనిక్కు పదము Rich friend అని యర్థము.

Edwy- ట్యూటోనిక్కు నామము, ఆంగ్లసీమ నేలిన యొక భూపాలుని పేరు, Rich war అని యర్థము.

Egbert- ట్యూటోనిక్కు నామము, వెసెక్సు రాజు పేరు, Formidably bright అని యర్థము.

Egerton- (Pro-Edgertun) నవీన కల్పిత నామము.

Egmond- ట్యూటోనిక్కు-పదము, Formidable Protection అని యర్థము.

Eitel- ట్యూటోనిక్కు పదము, Vain అని యర్థము.

Eldred- Eldrid ట్యూటోనిక్కు పదము, Battle Councillor.

Eleazea- Eleazar హిబ్రూ నామము, Lord's help అనియర్థము.

Eli, Elia, Elias, Elie, Elihu, Elija, Elijah, Ellis, Ely హిబ్రూ పదము, Exalted God the Lord అని యర్థము.

Eliab- హిబ్రూపదము, God is his father అని యర్థము.

Elidor- లాటిను నామము, Lover of God అని యర్థము.

Elisha- హిబ్రూపదము, God's salvation

Ellison- నవీనకల్పితము.

Ellis- హిబ్రూనామము, God the Lord అని యర్థము.

Elphinstone- నవీన కల్పితము.

Elphin - కెల్టిక్కు-నామము, తెలుపున కర్థము.

Elswald- పురాతన ఆంగ్లనామము.

Emanuel- హిబ్రూపదము, God is with us అని యర్థము.



Emerenteus-లాటినునామము, Deserving అని యర్థము.

Emery- Emeric ట్యూటోనిక్కు పదము, Work ruler అని యర్థము.

Emilius- Emil లాటినునామము, worker అని యర్థము.

Emlyn- ట్యూటోనిక్కు నామము, Work serpent అని యర్థము.

Emmanuel- Immanuel హిబ్రూనామము, God with us అని యర్థము.

Engelbert- ట్యూటోనిక్కు-పదము, Bright angel అని యర్థము.

Enoch- హిబ్రూనామము Dedicated అని యర్థము.

Enrik- Enrique ట్యూటోనిక్కు నామము, Home ruler అని యర్థము.

Eusor- నవీనకల్పితపదము.

Ephraine- హిబ్రూ పదము, Twofold increase fruitful అని యర్థము.

Erasmus- గ్రీకు నామము, Amiable అని యర్థము.

Erastus- గ్రీకు పదము, Lovely అని యర్థము.

Eric -Erik, Erick ట్యూటోనిక్కు పదము, Powerful king.

Erling- ఆంగ్లో సాక్సనునామము, Earl's son అని యర్థము.

Ermin- వెల్షునామము, Lordly అనియర్థము.

Ernald- నవీననామము.

Ernest- ట్యూటోనిక్కు నామము.

Erskine- నవీనకల్పితనామము.

Esau- హిబ్రూనామము, Hairy అనియర్థము.

Esme- నవీనకల్పితనామము.

Esmeralda- గ్రీకునామము, Emerald అని యర్థము.

Essex- నవీనకల్పితనామము, దేశనామము.

Ethelbert- ట్యూటోనిక్కు-పదము, Noble and Bright అని యర్థము.

Ethelred- ట్యూటోనిక్కు-పదము, Noble Council అని యర్థము. ఆంగ్లసీమనేలిన భూపాలుర కీపే రిద్దరి కుండెను.

Ethelwolf, Ethelwulf- ట్యూటోనిక్కు-నామము. Noble woulf అని యర్థము.

Etienne- గ్రీకునామము, Crowned అని యర్థము.

Eugene- గ్రీకునామము, Well born అని యర్థము.

Eusebius- గ్రీకునామము, Pious అని యర్థము.

Eustace- గ్రీకునామము, Firm Happy అని యర్థము.

Evan, Evans- కెల్టిక్కు-పదము, వేల్సు దేశమున ప్రచారముకలది. Young Warrior అని యర్థము.

Evelyn- లాటిన్ నామము, Hazelnut.

Everard- ట్యూటోనిక్కు-నామము, Strong wild Boar అని యర్థము.

Ewan- కెల్టిక్కు-నామము, Warrior అని యర్థము.

Ewart- ట్యూటోనిక్కు- నామము, Firm wild Boar అని యర్థము.

Eyre- నవీనకల్పితనామము (ఉచ్చారణ Air)

Ezekiel-హిబ్రూపదము,God will support అని యర్థము. దీనినుండి గల్గిన ముద్దుపేరు Zeke.

Ezra- హిబ్రూనామము, Helper అనియర్థము.

## 'ఇ' అక్షరమునకుం జెందిన క్రైస్తవస్త్రీల నామములు —

Easter ట్యూటోనిక్కు- పదము. ఈస్తరనంబడు పండుగపేరు.

Edeline- ట్యూటోనిక్కు-పదము, ఉన్నతమగు (గొప్ప) జన్మమని యర్థము.

Edeltrude- ట్యూటోనిక్కు-పదము, ఉన్నత జన్మసంబంధమని యర్థము.

Edena- ట్యూటోనిక్కు-పదము, వెర్యపుకావలి యని యర్థము.

Edgetha- సాక్సనుపదము, Edith వంటిదేనని కొందఱు తలంతురు.

Edgina, Edgiva- సాక్సను పేరులు, తొల్లింట సాక్సను భూపతుల కుమార్తెల కీపేరు లుండెను.

Edith, Editha, Edythe, Edgytha- ట్యూటోనిక్కు పదములు, సుఖకరమగు ఈవి యని యర్థము. St. Edeth అని పేరుగల యొక ఆంగ్లరాకొమరిత యుండినట్లు తెలియుచున్నది. (ఆమె క్రీ. వె. ౯౮౪ లో మరణించెను.) దీనినుండి కలిగిన ముద్దుపేరు, Edie, Edy.

Edna- హిబ్రూపదము. సంతసమని యర్థము.

Edwina- Edwyna, ట్యూటోనిక్కు పదము, ఐశ్వర్యముగలవారితోడి మైత్రియని యర్థము. Edwin- Edward, ల యొక్క స్త్రీ వాచకపదము.

Eereenia- గ్రీకుపదము, శాంతి యని యర్థము.

Eefa, Effie- స్కాచిపదము, మంజులవాగ్ధోరణి యని యర్థము.

Egbertine- ట్యూటోనిక్కు-పదము,Egbert యొక్క స్త్రీవాచకపదము.

Eglantine- కవిత్వమని యర్థము. ఒక పుష్పయొక్క పేరు.

Eguina- సాక్సనుపదము, ఒక సాక్సనుభూపతి కీపేరుగల యొక భార్య యుండెనట.

Eileen- ఐరిషుపదము, వెలుతురని యర్థము.

Eirene- గ్రీకుపదము, శాంతి యని యర్థము.

Ela- నార్వేపదము, పవిత్రత యని యర్థము.

Eleanor, Eleanora, Eleanore, Elinor, Elena, Elana, Elaine, Elayne- గ్రీకు పదములు, వెలుతురని యర్థము. దీనినుండి కల్గిన ముద్దుపేర్లు Ellen, Nellies, Nell, Ella, Nora, Aileen, Helen.

Elfleda- ట్యూటోనిక్కు పదము, అభివృద్ధి అని యర్థము.

Elfrida- ట్యూటోనిక్కు పదము, వెరపించుట కర్థమని కొందఱనెదరు.

Elgina- సాక్సనుపదము, Edward అనుపేరు గల సాక్సనుభూపతి కొమరిత కీపేరుండెను.

Elgiva- ట్యూటోనిక్కు పదము, ఈవి యని యర్థము.

Elizabeth, Eisabeth, Elisa, Elise, Eloise- హెబ్రూపదములు, దేవసంబంధ ప్రమాణమని యర్థము. దీనినుండి కల్గిన ముద్దుపేర్లు పెక్కుగలవు. Bess, Bessie, Bessy, Beth, Betsy, Betty, Bethia, Bettine, Elsa, Elsie, Liz, Lizzie, Libby, Lisa, Liza, Lisette.

Ella, Ellie, Ellen- గ్రీకుపదము, వెలుతురని యర్థము.

Elma- గ్రీకుపదము. కలసిమెలసియుండుటయని యర్థము.

Elsie- ట్యూటోనిక్కు పదము, విశాలహృదయమున యానందమని యర్థము.

Elspeth- స్కాచిపదము, దైవసంబంధ ప్రమాణమని యర్థము. Elizabethయొక్క స్కాచిపదమని కొందఱనెదరు. దీనింగల్గిన ముద్దుపేరులు Elspie, Elsie.

Elvira- లాటిన్పదము, స్వచ్ఛమైన యని యర్థము.

Emerence, Emerentia- లాటిన్పదము, అర్హత యని యర్థము.

Emily, Emilia, Emilie, Emeline, Emelina- లాటిన్ పదములు, శరీరత్రాణ గల పనివంతురాలని యర్థము. దీనిం గల్గిన ముద్దుపేరులు Emm, Emma, Emmie.

Emlyn- ట్యూటోనిక్కు పదము, పనిచేయు సర్పమని యర్థము.

Emma, Emme- ట్యూటోనిక్కు పదము, ముసలమ్మ యని యర్థము.

Ena- కెల్టిక్కు పదము, ప్రాణమని యర్థము.

Enid, Enaid, Oenide- కెల్టిక్కు పదములు, ప్రాణి యని యర్థము.

Enriqueta, Enrichetta- ట్యూటోనిక్కు పదములు, గృహపాలనమని యర్థము. దీని నుండి కల్గిన ముద్దుపేరు Etta.

Eppie- స్కాచిపదము, మంచి ప్రతిష్ఠ యని యర్థము.

Erica, Erika- ట్యూటోనిక్కు పదము, Eric యొక్క స్త్రీవాచకరూపము. బలమగు పరిపాలకురాలని యర్థము

Erina- దీనింగూర్చి ఏమియుం దెలియదు.

Ermelinda- ట్యూటోనిక్కు పదము, ప్రపంచ నాగమని యర్థము.

Ermentrude- ట్యూటోనిక్కు పదము, జాతీయ వనిత యని యర్థము.

Ermin, Erminda, Erminia- వెల్షుపదములు ప్రభు చిహ్నములు గల్గిన యని యర్థము.

Ermyntrude- ట్యూటోనిక్కు పదము, జాతీయ వనిత యని యర్థము.

Ernestine, Ernstine - ట్యూటోనిక్కు పదము, Ernest యొక్క స్త్రీవాచకపదము.

Esmay, Esme- గ్రీకుపదము, పచ్చ (రత్నమని) యర్థము.

Esmeralda- గ్రీకుపదము, పచ్చ (రత్న మని) యర్థము.

Esther, Estelle, Estella, Ester, Esterre- లాటిను పదములు, నక్షత్ర మని యర్థము. దీనంగల్గిన ముద్దుపేరులు Essie, Esther.

Ethel- ట్యూటోనిక్కు పదము, గొప్పజన్మపు అని యర్థము.

Etheldreda- ట్యూటోనిక్కుపదము, ఔన్నత్య వెరపింపు అని యర్థము.

Ethelinda, Ethelind — ట్యూటోనిక్కు పదము, ఔన్నత్యనాగమని యర్థము.

Ethelward- ట్యూటోనిక్కు పదము, కూతురని యర్థము.

Ethelwitha- ట్యూటోనిక్కు పదము, ఆల్బర్టు ది గ్రేటను భూపాలుని పుత్రికపేరు.

Ethelwyne- ట్యూటోనిక్కుపదము, ప్రసిద్ధి కర్థము.

Etiennette- గ్రీకుపదము, కిరీటమని యర్థము. మఱియు Stephen యొక్క ఫ్రెంచిరూప మనియు నందురు.

Etrenne- గ్రీకుపదము, ఈవి లేక బహుమాన మని యర్థము.

Eudora- గ్రీకుపదము, సంతస (లేక సుఖకర మగు) బహుమానమని యర్థము.

Eudoxia, Eudoxie, Eudocia- గ్రీకు పద ములు, ఎక్కువగౌరవమని యర్థము.

Eugenie, Eugenia- గ్రీకుపదములు, ఔన్న త్యజన్మ మని యర్థము. దీనినుండి గల్గిన ముద్దుపేరులు Genie, Eugene యొక్క స్త్రీవాచకపదము. ఇది యొక ఫ్రెంచిచక్ర వర్తిని పేరుగ వ్యాపకమందిన పదము.

Eulalia, Eulalie- గ్రీకుపదము, మంచివాగ్ధో రణి యని యర్థము.

Eunice- గ్రీకుపదము, సంతసమగు జయమని యర్థము.

Euphemia, Euphemie- గ్రీకు పదము, ఎక్కువ ప్రసిద్ధి అని యర్థము. దీనినుండిగలి గినముద్దుపేరులు Effie, Euphie, Phenie.

Euphrasia, Euphrasie, Euphrosine గ్రీకుపదములు.

Eva- Eve - హిబ్రూపదము, ప్రాణమనియర్థము. Adam యొక్క భార్య పేరు. దీనినుండి కల్గిన ముద్దుపేరు Evie.

Evangeline- గ్రీకు పదము, సంతసవార్తలం దెలుపు వనితయని యర్థము.

Eveleen, Evelina, Eveline, Evelyn- కెల్టిక్కుపదములు, మోదావహమైన యని యర్థము. దీనియందుగల్గిన ముద్దుపేరు Evie.

Everhilha, Everilda- ట్యూటోనిక్కు పదము ధైర్యవంతురాలని యర్థము.

**ఇకన్** — ఐకన్ చూడుఁడు.

**ఇకోనోగ్రాఫీ** (Iconography) (విగ్రహ చిత్రలేఖనము) పటములు, విగ్రహ ములు, చిహ్నములు, రత్నములు మొదలగు ఆనవాళ్ళంబట్టి తొలింటి పవిత్ర స్థలములను, చరిత్రలను, విశేషములను పోల్చువిద్య.

**ఇక్థియాలొజీ** (Ichthyology) — మత్స్యజాతుల శరీరనిర్మాణ లక్షణాదులం గూర్చిన కళ.

**ఇక్వూ-ఆజు జలపాతము** — బ్రెజిల్దేశమునకు ఆర్జెంటైనా దేశమునకును నడుమ సరిహద్దునంటిన రెండుమైళ్ల ప్రదేశమునందీ జలపాతము కలదని చెప్పంబడినది. రెండువందల అడుగుల ఎత్తునుండి జలములుపడు జలపాతమట. దీనింగూర్చిన వివరములు సరిగా తెలియ రాకున్నవి.

**ఇకోనోమీటర్** (Iconometer) — పరిమాణమును తానెరింగిన ఒక వస్తువునుండి కొంతదూరమునంగల వేఱొక వస్తువుయొక్క పరి

మాణమును ఆ దూరముయొక్క పరిమాణము నుండి ఎరుఁగనగు పరికరము.

**ఇక్నొలితోలోజీ** (Ichnology or Ichnolithology) a fossil foot print — శిప్పాడు రాళ్లుగ మారియున్న తొల్లింటికాలపు మట్టి ఇసుకలపై నాకాలపు Fossil జంతువుల అడుగులానిన ఆనవాళ్లు కాననగుచుండును. ఇది వానింబట్టి పోల్చెడి కళ.

**ఇచ్చేవారినిచూస్తే చచ్చేవాఁడైన లేచివస్తాఁడు** — ఆంధ్రలోకోక్తి.

**ఇచ్చేవానికిపత్రము, చచ్చేవానికి ఔషధము అనవసరము లైనను ఉండకతీరనివి** — ఆంధ్రలోకోక్తి.

**ఇస్రేలులు** (ఇస్రాయేలులు)—యూదుల దేవుఁడగు జెహోవ (యెహోవా) యాకూబు (Jacob) నకు ఇస్రేలని పేరిడినటుల బైబిలు నందు చెప్పఁబడినది. దీనికి హిబ్రూభాషయందు Perseverer with God అని యర్థమట. రానురాను ఆయన సంతతివారికి, యూదులకు, హిబ్రూలకుంగూడ నదియే వాడుకపేరయ్యెనట.

**ఇటలీదేశపుపూర్వగాథ** — ఐరోపా దేశమందలి రాజ్యము (తొల్లింట చాల పేరందిన బల్లాఢ్యుల మహారాజ్యము, సామ్రాజ్యమునై యుండెను). గొప్ప వక్తృత్వమునకును, కళల కును, ధర్మశాస్త్ర నిర్మాణమునకును, రాజ్యపా లనాతంత్రమునకును పేరందిన రాజకీయవేత్త లీ దేశమున పలువు రుండిరి. మధ్యధరాసముద్రము చుట్టు నీ సామ్రాజ్యరాజ్యము వ్యాపించియుం డినకతన మధ్యధరాసముద్రము రోమనుసర స్సన బడుచుండెను. ఇది గతకాలమునాటి సంగతి.

ఇటలీదేశము ఒకలక్ష పంథొమ్మిదివేల చతు రపుమైళ్ళ వైశాల్యముకలది యనియు, నాల్గు కోట్ల పదునొకండులక్షల ఏబదివేల జనసంఖ్య యనియుం జెప్పఁబడినది. ఇటలీదేశమునకు రోమకపురి (Rome) రాజధాని. ఇందు ఇటలీ దేశపు భూపతియు, రోమనుకాతలిక్కు మతాధి పతియగు పోపు జగద్గురుండును వసించుచుందురు. పోపుమహాత్ముని నివాసభవనము లన్నియుం గలిసి వెటికాన్ అను పేరం బరగెడిని. దీని నిటీవల పోపుమహాత్ముని ప్రభుత్వమున నొక సంస్థాన ముగ నేర్పరచిరి. ఈ వెటికాన్‌సిటీ ప్రభు త్వమున నూటఎన్మిది చదరపుమైళ్ల వైశాల్య ప్రదేశము కలదు. ఎన్మిదివందల ప్రజలు వసించు చున్నారు. వెటికాన్ అనేక భవనముల సము దాయము. ఇందు చాలా సుందరతరమగు పెద్ద పెద్దసౌధములు కలవు.

**ఇటలీ ఫారెన్‌పొజిషన్సు** — రెడ్సీ యొక్క నైఋతిదగ్భాగభూమి తన ప్రోకక్టరే టని చెప్పుచున్నది. తూర్పుఆఫ్రికాలో జూబా నది మొదలుగల ప్రదేశముల నిటీవల వదలివేసి నది. ట్రిపోలీరాజ్యమును టర్కీనుండి ఇటీవల నాక్రమించినది.

ఇటాలియనోసోమలీలాండు తూర్పుఆఫ్రికాయం దున్నది. ఇది ఇటలీరక్షితమై యుండెనట. ప్రజలు సోమలీలు, గల్లాజాతివారును కలరు. వారు క్రూరు లనియు, స్వేచ్ఛాప్రియు లనియుఁ చెప్పఁబడినవారు. ఇటీవల ౧౯౩౬-౩౭ సంవ త్సరములలో నిటలీవారు తూర్పు ఆఫ్రికాయందుఁ గల అబ్సీనియాపై దండెత్తి, యాక్రమించి దానిని తమవలసరాజ్యములలోఁ గల్పుకొనిరి.

**ఇటలీదేశపు సామెతలు** — అప్పు లేకపోవడ మొక యైశ్వర్యలక్షణమే. అబద్ధ మాడతలతువేని, నిజము దానిని బయలుపర్చు కుండానే త్వరపడును. అమ్మేవారి కొక నేత్ర మైనా చాలుగాని, కొనేవారి కనేక నేత్రము లుండవలయును. అరచే కుక్కలు వేటకుఁ బనికి

రావు. ఇంటికెంతకూ ఒక బుద్ధిహీనుఁ డుంటేనే చాలును. ఒక్కటిగనే కల్గిన దురదృష్టమును దీవించబడవలసినదే. ఒకజోడు అందరికీ సరిపోదు. కంచె మంచిదికాకపోతే అంతా దాటుతారు. గడ్డము పొడుగుగా పెరిగితే జ్ఞానియగునా? గొప్పవారితో మైత్రి సింహములతో సోదరత్వము వంటిది. చాలాకాలం మన్నేవస్తువే చౌకగా కిట్టనట్లు. ద్వారం పొట్టిదైతే వంగినడవడం అల వాటుచేసుకో. ధర బాగున్నా డబ్బుచూచు కుని కొనవలసియుంటుంది. నీటిలోదిగి యవ్వలి కేగినవానికి లోతు తెలియకుండునా? నేరం చేసినవాని కంతావిరోధులవలె గన్పిస్తారు. నేర్పు గల న్యాయాధికారి తా నేవస్తువుపై నాశ వదల గలఁడు? పిల్లలు లేనివారికి ప్రేమ సరిగా తెలి యదు. పిల్లికి చేప లిష్టమేగాని నీటిభయము. పెద్దవర్షము వేగమె ముగియుం గాని, చాలని వర్షము చాలాకాలము పట్టును. ప్రేమను కొన వలెనంటే ప్రేమయే ఖరీదు. బాగానడిచిన కార్యము బాగానే కలిసివస్తుంది. బాట బాగుం డకపోతే పరుగెత్తరాదు. బురదనీటియుఁ దేదీ ప్రతిఫలించదు. మంచిప్రారంభము సగముజయము వంటిది. మాటలే ఆడనివానికి అసత్యదోష మెట్లారోపించుట? రెండవసారి కుదిరిన ఆలోచ నలో దండుగరాదు.

**ఇటలీ దేశము** — ఐరోపాఖండమున దక్షిణభాగముననున్న ద్వీపకల్పము. ఇది ౧,౧౦,౦౦౦ చతురపు మైళ్ల వైశాల్యమని యందురు. ఈద్వీపకల్పమునందు దక్షిణపు కడను కలాబ్రియా ద్వీపకల్పము, అపూలియా ద్వీప కల్పము అను రెండు ద్వీపకల్పములు చిన్నవి కలవు. వీనినడుమను టారంటోసంయుక్తాగ్ర గుడము కలదు. మధ్యధరా సముద్రమున సిసిలీ ద్వీపము, సార్డినియా ద్వీపము, లిపారీ ద్వీప సమూహము (చిన్నవి), ఉస్తికా ద్వీపము దీనికిం జెందిన ద్వీపములు. ఇంకను ఇంచుక పశ్చిమమున సిసిలీ ద్వీపమునకు దక్షిణముగా Pantellaria అను పేరుగల వేఱొక చిన్నద్వీపముకలదు. ఇది ఇటలీ దేశమునకుం జెందినదియె. ఇట్టి ద్వీపము లింకను పశ్చిమమున సముద్రతీరముననే విశేష ముగా గలవు గాని, యవి అంత ప్రాముఖ్యమైనవి కావు. పశ్చిమ సముద్రపు బయలు ప్రదేశ మంతయు మలేరియా జ్వరపీడితమై అనారోగ్య ప్రదమైనదికలదు. ఇది టుస్కానీ మొదలు నేపిల్సు వరకునని చెప్పఁబడినది. దీని మారెమ్మయని పేరిడియున్నారు మారెమ్మయనిన సముద్రతీర మని యర్థమట. ఈప్రదేశము కేవల సముద్ర తీరమని యెఱుంగునది. ఉత్తరమున నీప్రదేశమును Campagna de Roma (రోమకపురిబయలు) నడుమను Pontine marshes అను భాగము దక్షిణమును కొద్దిగనో గొప్పగనో అనారోగ్య ములుగ తలంపఁబడుచున్న ప్రదేశములే. ఆల్ప్సు పర్వతము ఉత్తరప్రదేశపు సరిహద్దులందు వంకరగా తిరిగెడిని. దేశము పొడుగునను ఎప్పైనను పర్వతము లగుపడుచుండుట కాననగును.

సిసిలీద్వీపమునందు ఎట్నా యను పేరుగల యగ్నిపర్వతము కలదు. ఇది ౧౧,౦౦౦ అడు గుల ఎత్తు. చుట్టుకొలత ౮౭ మైళ్లు. ఇది దిగువభాగమునందలి కొలత యని యెఱుంగునది. నేపిల్సుపురమునకుఁ బదిమైళ్ల దూరమున వెసూవి యస్సనంబడు వేఱొక యగ్నిపర్వతము నాల్గువేల అడుగుల యెత్తుననున్నది. చరిత్రకెఱుకయగు దీని యుద్ధృతము క్రీ. వె. ౭౯ వ. సంవత్సరమున జరగెను. ఆయుద్ధృతముననే హెర్క్యులేనియమ్ పట్టణమును, పాంపీపట్టణమును నాశనమైనవి. ఇంక స్ట్రాంబోలీ యను వేఱొక యగ్నిపర్వత శిఖరము చిన్నదియైనను చాల వడిగలదిగఁ జెప్పఁ బడినది. ఇది సిసిలీకుత్తరమున లిపారీద్వీపము లందు కలదు. ఈద్వీపములు అగ్నిపర్వతము

లుంట నీపేరందినవి. వీనినుండియే దక్షిణదేశ భాగములు భూకంపముల కాస్పదములని యనెదరు.

ఆల్ప్సు పర్వతములకు ఎప్పినైను పర్వతములకు నడుమగుండా పోనది, అడిగేనదియును పూర్వవాహినులై ఎడ్రియాటిక్కు సముద్రమున సంగమించుచున్నవి. ఏప్పినైను పర్వతములందలి పశ్చిమపు ఏటవాలు ప్రదేశముగుండా ఆర్నోనది, టైబరునది, వోల్టూర్నోనది ప్రవహించి మధ్యధరాసముద్రమున సంగమించుచున్నవి. ఇందు పోనది దేశమునగల నదులలో పెద్దనది. దీనికి మిన్సియోనది, అడ్డానది, టిసినోనది ఉపనదులై దీనియందు సంగమించుచున్నవి. ఈమూడు ఉపనదులును ఆల్ప్సు పర్వతములకడనున్న గార్డా సరస్సు, కోమోసరస్సు, మగ్గియోర్సరస్సులందు జనించిననదులు. పోనది వరదముంపులనుండి కాపాడుట కిరుదెసల గొప్ప ఏటికట్టులను నిర్మించి యున్నారు. మఱియు దీనియుదకములు చాల సస్యోపయోగముగఁ దనరుచు పంటల నుద్ధరించు చున్నవి.

ఎప్పినైను కొండలు మార్బెలు రాళ్లగనులకు పేరందినవి. సిసిలీ దీవియందు గంధకము విస్తారముగ దొరకుగనులు కలవు. ఎల్బాద్వీపమున ఇనుపగనులు కలవు. గోధుమలు, జొన్నలు ముఖ్యములగు పంటలు. ద్రాక్షలు విసారము పైరుచేయంబడుచున్నవి. ఆలివ్తోటలు నూనెకొఱకు విస్తారముగ పెంచఁబడుచున్నవి. పట్టుపురుగుల పెంపకమునకు మల్బెర్రీ తోటలపరిమితముగ గానవచ్చుచుండును. పట్టు ఐరోపాయం దెక్కువ యీదేశముననే నేయంబడుచున్నది. సముద్రములందు పగడములు, స్పంజి విస్తారము సిసిలీచుట్టును లభించుచున్నవి.

ఇటలీ ప్రజలు తొల్లింటి రోమనుల వారమనియెదరు. చాల రసజ్ఞులు. వీరిభాష లాటినాభాషాజన్యము. శ్రావ్యమై కర్ణరసాయనమై యుండుటవిగ పేరందినది. పాశ్చాత్యు లాంధ్రభాషను Italian of the East. అని వారి ఐరోపాభాషగు ఇటలీభాష నతిశయోక్తిగ సాదృశ్యభాషగ బల్కుచుందురు. ఈదేశపు సంగీతపాటకు లైరోపాయందంతటను సంచార మొనర్చుచు ద్రవ్యార్జన మొనర్చుచుందురు. రోమన్ కాథలిక్కు క్రైస్తవమతము దేశమతమై యున్నది. ఈ మతాధ్యక్షుండగు పోపు జగద్గురుండు రోమకపురి పరిసరములనున్న వెటికాన్ నివాసుఁడు.

కొలఁదికాలము క్రిందటివఱకు ఇటలీదేశము ౧. సార్డీనియాస్టేటు, ౨. ఆస్ట్రియనిటలీస్టేటు, 3. పార్మా, ౪. మొడేనా, ౫. టుస్కానీ, ౬. పాపస్టేటు, ౭. నేపిల్సురాజ్యమునను, ఏడుభాగములు ముఖ్యములుగను, కొన్ని ఇతరప్రదేశములుగను, సాన్మారినో యను పేరుగల యొక చిన్న ప్రజాప్రభుత్వముగను చీలియుండినది. క్రీ. వె. ౧౮౫౯ లో ఫ్రెంచివారి సహాయముంగొని లోంబార్డీ ఆస్ట్రియావారి నుండి తిరుగ లాగుకొని సార్డీనియాకుం జేర్పంబడినది. ఆ మఱుసటి సంవత్సరమున పార్మా, మోడేనా, టుస్కానీ స్టేటులును, పాపస్టేటునందలి విస్తారభాగమును సార్డీనియారాజ్యమునకుం జేరిపోయినవి. ఈ దేశమున సుప్రసిద్ధుండగు గారిబాల్డీసేనాని నెపోలియన్ రాజ్యమును బడద్రోసి సార్డీనియాభూపతి నిటలీభూనాథునిగ నొనర్చెను. క్రీ. వె. ౧౮౬౬ లో ప్రష్యావారి సహాయముం గొని ఆస్ట్రియావారినుండి వెనీషియా తిరుగలాగుబడెను. క్రీ. వె. ౧౮౭౦ లో పోపుగారినుండి రోము లాగుకొనఁబడి, ఇటలీకి చేర్చుకొనఁబడి

తిరుగ రాజధానిగ నయ్యెను. ఈ సందర్భమున ఇటలీదేశమునకు భూపతిగ గారిబాల్డీమహాసేనానివలన చేయఁబడినది విక్టరు ఎమాన్యుయల్ భూపతియని చెప్పవలసియున్నది. సాన్మారినో ప్రభుత్వమట్లే నిలుపఁబడినది. ఛేంబర్ ఆఫ్ డిప్యూటీసు అను ప్రజాప్రతినిధి సభయు, ప్రభుత్వమువా రేర్పరిచిన సెనేటుసభయు రెండురాజకీయసభ లేర్పరుపఁబడి ఇటలీరాజ్య మెన్మిది ఖండములుగను, అవి తిరుగ ౬౭ జిల్లాలుగను భాగింపఁబడినవి.

౧. పైడిమాంటు ప్రోవిన్సు- ఇది వాయువ్యదిశగా ఆల్ప్సుపర్వతములకు మధ్యధరాసముద్రమునకు నడుమనున్నది. దీని పశ్చిమమున ప్రాన్సుదేశపు హద్దు కలదు. ఆల్ప్సుపర్వతపాదమునుండుకతన దీని కీపేరయ్యెను. తొల్లింట శావోయి, సార్డీనియాద్వీపములం గల్పుకొని ఇది సార్డీనియారాజ్యముగ నుండెను. ఆస్ట్రియావారితో కలహములో చేసిన సహాయమునకు గాను, శావాయిప్రాన్సుదేశమున కిచ్చివేయంబడి అందు కలసియున్నది. (౧౮౬౦) పైడిమాంటులోని ఆల్ప్సునకు తూర్పుననున్న లోవలందు నివసించుచున్న, వాల్డెన్సెస్ జాతివారు తొల్లింటి Pure form of Christianity మతస్థు లని చెప్పఁబడినది. పైడిమాంటునందు టూరిన్ పురము ప్రధానపట్టణము, పోనదీతీరముచక్కని పురము. ఇట పట్టునేత లధికముగాఁ గలవు. జెనోవాపురమునకు Superb అని యర్థము. ఇది ప్రధానరేవుస్థానము. ఇట పట్టుముఖమలు, బట్టలనేతలకు పేరందినది. ఇటనే పరిసరగ్రామమున కొలంబసు జన్మించెనందురు. ఇది స్విసు రిపబ్లికునందు చేరిన పురము.

౨. లొంబార్డీ ప్రోవిన్సు- దీనిని Garden of Europe అనిరెదరు. ఆల్ప్సుపర్వతములు మొదలు పోనదిదనుక వ్యాపించియున్న తోటలసీమ. మిలానునగరము, పోనదియొక్క ఉపనదిపైనున్నది. ఇచట క్రైస్తవదేవళము లోకప్రఖ్యాతినందిన విలువగలది కలదు. పాల్వాపురము- ఇట నొకటవ ప్రాన్సిసను పేరుగల పరాసుదేశ మేలుచుండిన భూపతి ఓడింపబడి, బందెగా గొంపోవఁబడిన తావు. కోమోపురము, ఆపేరుగల సరిత్తీరముననున్న పురము.

3. వెనీషియా ప్రోవిన్సు- ఇది లొంబార్డీకిని, వెనిస్ సంయుక్తాగ్రగుడమునకును నడుమనున్నది. లోకప్రసిద్ధమగు వెనిస్‌నగర మీప్రోవిన్సులోనిదే. ఇది ఎడ్రియాటిక్కుసముద్రమున, అనేక చిన్న చిన్న ద్వీపములం గల్పి నిర్మింపంబడిన నగరము; సౌందర్యవంతము. ఇందలి ఇండ్లు, గొప్ప ప్రాసాదములు, వీధులందలి బాటలు, నీటికాల్వలు, వాటియందు శకటములవలె నడచుచుండు పడవలకు Gondolas అని పేరు. మధ్యకాలములందిది గొప్ప ధనవంతమైన నగరమై, ఐరోపాయందసమాననగరమని పేరందియుండెను. ఇచటి ప్రజాప్రభుత్వమున కిది ప్రధాన కార్యస్థానమై యుండెను. ఇందలి సెంటుమార్కు దేవాలయము చూడఁదగిన వింత, గొప్ప వైభవోపేతమైన, డోగీస్‌పేలస్ (డూక్సు పేలస్) చూడఁదగిన సుందరభవనము. వెనిస్ నగరమునకు పశ్చిమముగానున్న పాడువాపురము విశ్వవిద్యాలయమున్న పురము. అడిగీనదిపైనున్న వెరోనాపురమును, మిన్నియోనదీతీరముననున్న మంటువాపురమును, సైనికదుర్గములున్న తావులు.

౪. ఎమీలియా (Aemilia) ప్రావిన్సు- ఇందు వెనుకటికాలపు పార్మా, మోడెనా, డచ్చీలిందు చేరియున్నవి. ఇంకను పాపల్‌స్టేటునందు ఒక చిన్నభాగమును కలిసినదైనది. ఎమీలియాయందు బోలోనాపురము (Bologna) న చాల పురాతనపువిశ్వవిద్యాలయము కలదు. పార్మా

పురము తొల్లింటి పార్మాడచ్చీ రాజ్యమునకును, మోడేనాపురము తొల్లింటి మోడేనాడచ్చీకిని, రాజధానులుగ నుండిన పురములు. ఎడ్రియాటిక్కు సముద్రతీరమున నున్న రావెన్నాపురము వెనుకటి రోమనుసామ్రాజ్యమునకుఁ గడపటిరాజధానిగ నుండిన తావు. రావెన్నాపురమునకు దక్షిణమున సేన్మార్నియో యను పేరుగల చిన్న ప్రజాప్రభుత్వము చిరకాలమునుండి కలదు.

౫. టుస్కానీప్రోవిన్సు- ఎమిలియాకు దక్షిణమున నున్నది. తొల్లింట నిది గ్రాండుడచ్చీరాజ్యమై యుండినది. మిగుల ఫలవంతమైన ఆర్నోలోవ ఈ ప్రోవిన్సులోనిది. కడు సుందరవంతము. ఆర్నోకు దక్షిణమున సముద్రతీరప్రదేశమగు మారెమ్మ (Maremma) సీమ బురదనేలలు, అనారోగ్యప్రదేశముల మయమైనది. ఫ్లారెన్సుపురము ఇందు ముఖ్యపట్టణము. సౌందర్యవంతమని యీమాట కర్థమని కొందఱును, పుష్పనగరమని యర్థమని కొందఱును తెల్పుచుందురు. ఆర్నోనదీతీరము. ఇట చిత్రకళావిగ్రహప్రదర్శనశాల కలదు. పైజానగరము ఒరగిన గోపురముకతన పేరందినది. (చూడుఁడు). ఇది గలీలియోపండితుని జన్మస్థానము. లెగ్హారను పురము గొప్ప ఓడరేవు. ఇట గడ్డి అల్లికచిత్రపు పనులు కలవు. లుక్కాపురము, ఆలివునూనెవర్తకమునకుఁ బేరందినది.

౬. పాపట్రేసెట్సు ప్రోవిన్సు- కొంతకాలము పోపుజగద్గురుని రాజ్యమైయుంట నీపేరమ్యెను. ఈ ప్రోవిన్సు ఇప్పుడు పశ్చిమమున రోముపరగణాగను, నడుమను ఉంబ్రియా పరగణాగను, తూర్పున మార్చెసు పరగణాగను మూడుగ భాగింపఁబడి యున్నది. (పోపు చూడుఁడు). క్రీ. వె. ౭౫౫ మొదలు ౧౮౭౦ వఱకు పోపు రాజ్యాధిపత్యముకూడ వహించియుండెను. కొంతకాలము ఫ్రెంచి ప్రభుత్వమువా రీపోపునకు చేయూత యొసంగి నిలువఁబెట్టి యుండిరి. కొంత సైన్యమును వారు రోమునం దుంచుచుండిరి. ఫ్రాంకోజర్మనుయుద్ధము తటస్థమగుకతన నాసైన్యములు యుద్ధరంగమునకుఁ బిలువఁబడు యదనున, ఇటలీదేశపుభూనాధుండగు విక్టరుఎమాన్యుయల్ ప్రభుఁడు అసహాయుండగు పోపున కింకను మిగిలియున్న రాష్ట్రముఁ గల్పుకొని, రోమకపురి నాక్రమించి, తన రాజధానిగ జేసికొనియెను. రోమునగరము (రోమకపురి) టైబరు నదీతీరమునం దున్నది. కొంతకాలము సామ్రాజ్యపురాజధాని, ఇప్పుడు ఇటలీదేశపురాజధాని. ఇట లోకప్రసిద్ధిగల సెంటుపీటరుదేవస్థానము చూడఁదగిన చిత్రము. పాడగుచున్న రోమునగరము ఏడు కొండలపై నిర్మింపఁబడి యుండెను. ఇప్పటి (క్రొత్త) రోమునగర మొక మైదానమున నిర్మింపఁబడినది. ఈ మహానగరము క్రీ. పూ. ౭౫౩ సంవత్సరమున రోమస్, రోమ్యులస్ అను పేర్లు గల ఇర్వురు సోదరులచే ప్రారంభింపఁబడినది. గొప్ప వైభవ మనుభవించి క్రీ. వె. ౪౭౬ లో నాశన మొనర్పఁబడినది. (వెటికాన్ భవనము చూడుఁడు) రోమకపురి వేసవికాలమున మలేరియాజాడ్యోద్రేకమునననారోగ్యప్రదేశముగనుండునని వాడుక కలదు. సివిటావెక్చియాపురము రోముయొక్క రేవుస్థానము. అంకోనాపురము పాపట్రేసెటు ప్రోవిన్సునందు వేఱొక రేవుస్థానము.

౭. నెపోలియను ప్రోవిన్సు- ఇది ఇటలీదక్షిణభాగము. దీనిని సిసిలీద్వీపముతోఁ గల్పిన నేపిల్సురాష్ట్రమై యుండెను. దీనిం గొందఱు రెండు సిసిలీలనికూడ యనుచుండిరి. క్రీ. వె. పండ్రెండవ శతాబ్దమున నేపిల్సురాష్ట్రము నొక నార్మనుభూపతి స్థాపించియుండెను. ఫ్రెంచివారు పిదప స్పానియావారు దీని నాక్రమించియుండిరి. స్పానియావారి వశమున రెండుశతాబ్దముల కాలముండెను. క్రీ. వె. ౧౭౩౪ లో స్వతంత్రరాజ్య

మారెను. తరువాత నిటలీరాజ్యమునకుం జేరి పోయెను. ఇందు నేపిల్సునగరము ప్రధాన పురము. ఇది ఇటలీయందు పెద్దనగరమై యున్నది. ఈనగరసౌందర్యమునకు, ఇచటి సముద్ర సౌందర్యమునకును అచ్చెరువందినవారు See Naples and die అని యనుచుంట వాడుకయందుకలదు. బ్రిండిస్సి పురము ఓడలరేవు. దీనికిం దొల్లింట బ్రుందీసియమ్మని పేరుండెను.

ల. సార్డీనియాప్రోవిన్సు- సార్డీనియాద్వీపము చూడుండు.

**ఇటుకలపరిశ్రమ** (Brick Making)- ఇష్టకమను శబ్దమునుండి ఏర్పడిన పదము ఇటుక. వీనింజేయు పరిశ్రమ భరతదేశము నందాది నుండియుం కలదు. ప్రాత్యాశ్చులిది యొక కళగ నిర్ణయించి దీనిని ఇంజనీరింగు Civil Engineering లోని శాఖగ నెన్నిరి.

ఇటుకలం జేయుటకు బంకమట్టి, ఇసుక, ఉదకమును అర్ధా భాగములుగ గలిసియుండుట యవసరము. ఇసుకలేని బంకమట్టి ఇటుకలు పగిలి బీటలిచ్చుం గాన ఇసుకతో మిశ్రితమైయుండు భూములందు ఇటుకలం జేయుదురు. అందిసుకపాలధికమైన విచ్చిపోయి బలముగ నుండదు. పరిశీలనలనుండి ఐదురెట్లు మట్టి కొకపాలు ఇసుకయని తేలినది. ఇట్టిమట్టి నాంగ్లమున Brick Earth అనియెదరు. ఈపాళ్లు తూనిక బరువువలన గాక పరిమాణము నుండియని చెప్పఁబడినది. ఎట్లైనను ఈపాళ్లు కుదురుటకు రెండు లేక మూడుదినుసుల మన్నులం గూర్చియైనను చేయుదురు. ఇటుకలంజేయు పరిశ్రమ పీలగునంతవరకు కట్టడములకుఁ దగ్గిర నుండకుండిన ఇటుక లటకుం జేర్చుటకు కూలు లధికముగఁదగులును.

ఇటుకలంజేయు మన్నును నానబెట్టుచు కుమ్ముచు లేక పిసుగుచుం బదును కల్గువరకుఁ జెదరు. ఇది రెండు లేక మూడు దినములు పట్టును. దీనికాంగ్లమున Mellowing అనియు, Weathering అనియు, Preliminary preparation అని యనెదరు. మన్నునుకాళ్లతో కుమ్ముటకు Treading అనియు, చేతం బిసుకుటకు Kneading అనియు పేర్లిడిరి.

దీనిపదును- Tough and glue అని వివరించియున్నారు. మరియుం గాళ్లతో కుమ్ముటను Tempering అనియు ననుటకలదు. విస్తారపు పని జరుగుతరి Pugmill నందు చేయుట సుకరము. ఈ మట్టియందు రాళ్లు, పెంకులు మొదలగునవియుండినను, ఇసుక మోటైనను ఇటుకఁ గాల్చుతరి పేలి విచ్చిపోవును. కాన కడుజాగ్రతం గొనవలసి యుండును. సముద్రపు ప్రాంతపు ఇసుక ఇటుకలంజేయఁ బనికి రాదని చెప్పఁబడినది. కాల్చని పచ్చి ఇటుకలనుపయోగించు తరి నానఁబెట్టుట, కుమ్ముట, రాళ్ల చికాకు, ఇసుక చికాకు మొదలగునవి పాటింపనక్కర యుండదు.

ఇటుకల పని- వర్షములు అధికముగు ఎండలు లేని మంచి కాలమునఁ జేయబడిన నష్టము రాకుండెడిని. ఇసుకపాలధికమైన ఇటుక నీటినధికముగఁ బీల్చును. కాన నది గట్టిగ నిలువజాలదు. మూడడుగుల న్నర ఎత్తునుండి నేలంబడపైచిన నిటుక పగులరాదు ఇటుకపై బరువునిడిన (Superstructural weight) చితికిపోరాదు. ఇటుకలం బనేక పరిమాణములు కల వందు గోడ ఇటుకలు $9 \times 4\frac{1}{2} \times 3$ అంగుళములుగను, తారస ఇటుక (Terrace brick) $6 \times 3 \times 2$అంగుళములును పరిమాణముంగల్గి చేయంబడుచున్న ఇటుక అచ్చులకు Moulds అని పేరు. ఇవి కర్రతోను, ఇనుముతోను చేయంబడుచున్నవి. అచ్చులలో మన్ను వేసి కొనలు తేరునట్లు కొట్టియు బరు

విచ్చియు ఇటుకలం జేతురు. లేకున్న ఇటుకకు నిక్కచ్చిగా కొనలు తేలకుండుదురు.

ఇటుకల నెండించుట యారు మొదల లెన్మిది దినములు పట్టునందురు. నీడ నారించుట ఇంకను ఆలశ్యమైన నుత్తమము. గంగానది మొదలగు కొన్ని నదీతీరములందలి మట్టితో జేయంబడిన ఇటుకలు ఎక్కువగట్టిగ నుండి గురుపముతో సైతము బగులక నిల్చును. ఇందలి మట్టియందు Iron మొదలగు లోహ పదార్థము లుండినవని పోల్చియున్నారు. ఇటుకకు శాశ్వతముగు గట్టి నీయందగినది కాలుపై యున్నది. ఇందు పేర్చు సైతము ఇటుక కిటుక యంటక నడుమ గాలి బారునట్లును కర్రలం బేర్చి నడుమ నడుమ పెద్ద సొరంగముల నుంచియు పేర్చుదురు. ఇదియు నేర్పరితనమే. ఇటుక ఆవములకు Brick kilns అనియెదరు.

ఒకలక్ష ఇటుకల ఆవమున ఇంచుమించు ౪౦,౦౦౦ గట్టి ఇటుకలును, ౨౦,౦౦౦ కొంత రద్దు కాల్పుతక్కువ ఇటుకలును, తక్కినవి ముక్కలు రద్దుగనగుట సర్వసాధారణము. ఇటుక లందిక్కాలమున Glazed Bricks, Fire Bricks, Pointed Bricks, Arch Bricks, Terrace Bricks, Tiles, English Bricks మొదలగు పలురకములు కలవు.

**ఇడానాడి** — అష్టాంగ యోగములు చూడుడు.

**ఇడియమ్** (Idiom) — దేశీయపద లక్షణ ధర్మముల నాధారపడు నర్థముగల పదములకు ఇడియమ్ము అని పేరు. వానింగూర్చినకళ.

**ఇడీస్ ఆఫ్ మార్చి** (Ides of March)– రో[illegible]కాలమున మార్చినెల సంవత్సరమున మొదటినెలయై యుండునది. మే నెల, జూలై నెల, అక్టోబరు నెలలందు పదునేనవదినము ఇడీస్ అయియుండునవి. తక్కిన నెలలందు పదమూడవ దినము ఇడీస్ గ పరిగణింపఁబడుచున్నది. క్రీ.పూ. ౪౪ సంవత్సరమున మార్చి (ఇడీస్) ౧౫ వ రోజున సీజరు చంపఁబడెనట.

**ఇతోవ్యాఘ్ర ఇతస్తటీతిన్యాయము**– ఇటు పులి, అటు లోతుగల సరస్సు. అనఁగా ఎటుపోవుటకు వీలులేని ఇరుకని భావము. ముందుకువసే నుయి వెనుకకువస్తే గొయ్యి యను నిట్టి తెలుఁగు సామెతకలదు.

**ఇత్తడి** (పిత్తళి) — ఆంగ్ల. Brass. సం. రీరీ, రీతిః అను పదములు. ఇత్తడి సామాన్యమునకును, సువర్ణకం అను పదము పసిమి ఇత్తడికిని పేర్లు. ఇత్తడి, రాగితో జింకును (తుత్తనాగమును) కల్పిచేయు నుపలోహము. ఇట్లయ్యు నీరెండును ప్రధానభాగములై ఇంక నితరలోహముల గూడ చేర్చి చేయు నితర ఉపలోహములకును తరుచు ఇత్తడనియె వాడుచుందురు. ఐరోపాఖండ దేశములందు క్రైస్తవ సమాధులపై సమర్చఁబడిన పేర్లం దెల్పు రేకుల కిత్తడి యని (Brasses) పేరు వాడుకయుండెనట. ఇత్తడిచేయు కర్మాగారములందు తుత్తినాగపుకాల్పు గాలులం బీల్చుటవలన పనివాండ్ర కనారోగ్యము కల్గి జ్వరము వచ్చుచుండునని వాడుకగలదు. ఇత్తడికి పులుపుతగిలిన చిలుము పట్టును. అది లోనికివెళ్ళిన వికారముపెట్టి, వమనము గల్గించును. ఆయుర్వేద వైద్యులు ఇత్తడిని శాస్త్రోక్తముగ భస్మముచేసి రోగుల కిచ్చుదురు. సరిగా భస్మమైనతరి నది కడుపు లోనిబల్లలు, కామిర, గుదరోగములు (అనఁగా మూలశంఖ, ఆసనగండమాల మొదలగునవి), జ్వరములు, పాండురోగము, పైత్యరోగములు వాతజనితరోగములు, శ్వాస, సంగ్రహణి రోగములు నడంచునని చెప్పఁబడినది.

**"ఇదుగో పులి" అంటే "అదుగో తోక" అన్నాఁడట** ఆంధ్రలోకోక్తి.

**ఇధ్మవాహ గోత్రము** అగస్త్య ఉపగణము చూడుఁడు.

**ఇధ్మవాహుఁడు**— ఋషి. తండ్రి పేరు దృఢస్యుఁడు. తాత అగస్త్యుఁడు. ఇతనికి ఇధ్మ వాహనుఁడనియు, తేజస్వి యనియు నామములు కలవు.

**ఇనకులగోత్రము** — ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి (వైశ్యగోత్రములు చూడుఁడు). ఇనకులగోత్రము, ఏకాశ్లేయ గోత్రము (౭). దీనిని వినకుల, ఇనకోల, వినకోల యనియు నందురు. సంస్కృతగోత్రము సుందరస లేక సౌందర్యస, సుందరగణము, ఆపస్థంబ సూత్రము, యజుశ్శాఖ, ప్రమాణగ్రంథము ఆద్యప్రవరఖండ. విశ్వేశుఁడు దేవత, భార్య వీరాంబ. హేమాద్రి తపస్థానము, వీరసముద్రము తటాకము, జపముకోటి, దీపములు ౧౪, క్షేత్ర సంఖ్య ౬౦, అశ్వదానము, ఎఱ్ఱకలువ వర్జ నీయము.

**ఇనపకులగోత్రము**— ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (ఇషుపకుల చూడుఁడు.

**ఇనాక్యులేషన్**- వేక్సినేషన్ చూడుఁడు.

**ఇనుప గుగ్గిళ్లుకాని మినపగుగ్గిళ్లుకావు** — తనకు లొంగనివారిం గూర్చి చెప్పఁడు సామెత. (ఆంధ్రలోకోక్తి.)

**ఇనుపగోలు చెట్టు** – లా. Plantago ispaghula. ఆంగ్ల. Ispaghul లేక Spogel tree. ఈదేశమున వీనిగింజలు వైద్యోపయోగమునకు వాడఁబడుటదప్ప ఈచెట్లంగూర్చి యేమియుం దెలియదు. గింజలందు జిగటగలదు. చలువజేయును. మూత్రము వెడలించును. వేడి చేసిన కల్లు దగ్గు, గ్రహణి, పురాణగ్రహణి, పురాణరక్తగ్రహణి, మూత్రనిరోధము, సెగ మొదలగు మూత్రనిరోధరోగములను హరించును. గింజల నుడికించినగుంజు దుష్టవ్రణములు, సెలలు మాన్పును. ఆకుల కషాయముగాని, వేరుగంధముగాని సర్పవిషదోషము హరించుననియు, ఆహికజ్వరములు, క్షయదగ్గులు నివృత్తి యగుననియుఁ జెప్పఁబడినది.

**ఇనుపబాట** (Railway) వీనిలో ఎఱ్ఱ, ఆకుపచ్చ రంగుల యర్థము — ఎఱ్ఱరంగు భయంకరచిహ్నముగ నెల్లరకుందోప జేయునదే గాన ఎఱ్ఱరంగు జెండాయును, ఎఱ్ఱరంగు దీపములును అపాయసూచకములుగ నేర్పడియుండుట అందరెరుంగదగినదే.

ఇంక దానికి ఎదురగు రంగు ఆకుపచ్చ అపాయములేదనియో, నెమ్మదిగనో, జాగ్రతగనో రావచ్చుననియు సూచించుగురుతుగ నుండదగినది. ఏలన, ఎరుపునుండి ఆకుపచ్చ నడుమనుండు రంగులలో నేదియు దూరమున కంతస్పష్టముగ గానరానివిగాన పాటింపబడలేదు.

ఈమధ్యకాలమున తెల్లరంగు క్షేమము లేక అనపాయమునకు చిహ్నముగ నుండెంగాని, ప్రమాదవశముల నేరంగు అద్దమైనను పగిలిపోయి పడిపోయినతరి గన్పించునది తెల్లరంగు దీపమేయౌట, అచట నచట ప్రమాదములు సిద్ధమై, పెక్కు ఇనుపదారిసంస్థలవారిచే తెల్లరంగు వదలివేయఁబడినది. ఊదారంగు కొన్ని ఇనుపబాటలయందు వాడబడెంగాని దూరమునకు అనర్హమని తేలుటంజేసి మానుకొనిరి గాన ఎరుపును, ఆకుపచ్చయు వాడుకయందున్నవి.

**ఇనుము (ఉక్కు)** — ఇనుము స్వతస్సిద్ధమగు పంచలోహములలో నొక గట్టి లోహము. అన్నిలోహములకన్నను ఎక్కువ ఉపయోగకరమయ్యు, సర్వసాధారణముగ నెక్కువగ లభించునుగాన చౌకగఁగూడ నైయున్నది.

ప్రాత్యాశ్చవిజ్ఞానులగు పరిశీలకులు మొట్టమొదట ఇనుముంగూర్చి ఎఱుగనిదినములందు రాతితోను, ఇత్తడికంచులతోను, అయుధములు, పనిముట్లు చేసికొనుచుండిరనియు, బహుశః ఇనుము మొట్ట మొదట Meteoric stones నుండి (ఆకాశము నుండిపిడినవి) సంపాదింపఁబడియుండనోపుననియు, తలంచుచున్నారు. కాని, కృతయుగాలంకార భూతుఁడగు మాంధాతమహాపతియె చంద్రాయుధము ధరించినటుల చెప్పఁబడియుంటను, ఇంక నాయుధములంగూర్చియు, లోహముంగూర్చియు మనుస్మృత్యాదులం దుంట, యనాదిగ లోహముం గూర్చి భరతదేశస్థులగువారికి తెలిసియుండునని తేలుచున్నది.

ఇనుము భూమినుండి త్రవ్వి ఎత్తబడును. అట్టి గనులు ప్రపంచమునందు తరుచుగ గలవు. ఇంగ్లాండునందు ఇనుప గనులు, రాక్షసబొగ్గు గనులునుకూడ సమీపములుగ గల్గియుంటం జేసి, ఇనుము గరగించు కర్మాగారములు పెక్కులుగ నేర్పడినవి. భరతదేశమున ఇనుపగను లున్నను కరగించు కర్మాగారములు తగినన్ని లేవు. ఆంధ్రదేశమునను పెక్కుచోట్ల ఇనుపగనులు కలవు త్రవ్వబడిన ఇనుమును Manganese ore అనెదరు. ఇనుము యొక్క గట్టి సుప్రసిద్ధముగాన సామెతలుగ వాడుచుందురు.

Iron cross అను బహుమానము తొలుత ప్రష్యాదేశమున నుండెను. దాని నాంగ్లప్రభుత్వమువారును అవలంబించిరి. ఇది సివిలియను ఉద్యోగులకు సైన్యమందలి యుద్ధవీరులకు బహుమానముగ నీయఁబడు వెండిఅంచులుగల ఇనుపక్రాసు (Cross) అయి యున్నది. దీని నతిశయ గౌరవచిహ్నముగ నెంతురు. గత ప్రపంచయుద్ధమున విరివిగ పంచిపెట్టఁబడినది. క్రొత్తగ పగుల గొట్టఁబడిన ఇనుమురంగును ఆంగ్లమున Iron grey colour అనెదరు.

న్యూజిలండు దేశమునను, భరత దేశమున కొన్ని గనులందునను ఇనుము అతిచిన్నముక్కలుగ నిసుకతో కలసి దొరకెడిని. దీనికి ఇనుపఇసుక (Iron sand) అని పేరు. ఇనుము పెద్దముక్కలుగ రాళ్లం బోలి దొరకు సరకునకు ఇనుపరాయి (Iron stone) అని పేరు. ఇంగ్లాండునందు యార్కుషైరుసీమయందు క్లెవ్‌లాండుమండలమున దొరకు ఇనుము పెద్దపెద్ద రాళ్లవలె నుండెడిని. ఇందు ఎక్కువ Phosphorous ఉండునని కనిపెట్టఁబడినది. స్వీడన్ దేశమున లభించు ఇనుము ఉక్కు చేయుటకు ప్రశస్తమైనదిగ గనిపెట్టఁబడినది. ఇనుమునుండి లభించు ప్రత్యేక పదార్థములు- ఇనుపత్రుప్పు, ఇనుపచిట్టము, ఉక్కు నై యున్నవి. ఇనుమును పృథివ్యాపస్తేజోవాయురాకాశములను పంచభూతములకు అందిచ్చిన దానియందు త్రుప్పుపట్టును. ఇంకను సముద్రపుఉప్పుగాలి, చవిటినేలల ఉప్పు తాకుడులం గల్గించితిమేని అతివేగముగ త్రుప్పు పట్టి అసలుఇనుముం దినివేయును. ఇనుమును గాల్చుట, కాల్చి సాగించుటవలన ఇనుమునుండి కరగి జారి చిట్టము నేలం బడిపోవును. ఇది ఇనుము ఉపయోగించునటుల ఏ పరికరములకు చిట్టము పనికిరానిదని తలంపఁబడుచున్నది. ఇంక ఇనుమునందు కార్బన్ భాగములం గల్పిన నుక్కు అగును. ఇవి మూడును ఇనుమునకు ముఖ్యములగు నుపలోహములు (By products) అనఁబడుచున్నవి. అందు ఉక్కు ఎక్కువపనుల కుపయోగించునది.

ఇనుపత్రుప్పు — ఆంగ్ల Rust of iron- ఆయుర్వేదవైద్యులు ఇనపత్రుప్పును మెత్తగ చూర్ణముఁ జేసి గోమూత్రములో పూసి తడిపి (పదునేను లేక ఇరువది దినములలో నెండునట్లు) ఎండించి లోనికిచ్చియు పైకి రాచియు, ఉపయోగింతురు. పుట్టవ్రణము (సెలలువేయు

వ్రణము) లకు లోనికిచ్చి పైన రాచిన మానుననియు, చాతుర్జాతక (దాల్చినచక్క, ఏలకులు, ఆకుపత్రికము, నాగకేసరములు) చూర్ణముతో కల్పి, తేనెతో లోనికిచ్చిన యెడల మేహ, పాండు, కామిలరోగముల నివారించి నిస్త్రాణ నడఁచి బలము గల్గించుననియు, స్త్రీల ఋతురక్తమును చక్కగ వెడలించుననియు జెప్పుదురు. దీనికిం పథ్య మవసరమని చెప్పుదురు.

ఇనుపచిట్టము- ఇది అసలులోహమువలెనే పనికిం బనికిరాదు. ఆయుర్వేదవైద్యులు ఇనుపచిట్టమును భస్మముగను, సింధూరముగను నొనర్చి వాడుదురు. ఒకపాటియోదు, నూరు వత్సరముల తక్కువకాకుండ భూమియందు ప్రాతబడి, భూపురమైన ఇనుపచిట్టముం దెచ్చి భస్మముగను, సింధూరముగను చేతురు. అట్లు చేయబడిన సింధూరమునకు మాండూరమని పేరు. సింధూరమన ఎర్రబడినది. ఇది కాల్పునందు కలుగవలసిన ఎరుపు. ఇంకచిట్టమును ఎర్రగ కాల్చి గోమూత్రములో గాని, మేకమూత్రములో గాని ముంచుటలు ఏడుసార్లు చేసి దానిం జూర్ణము జేసిన నది చూర్ణమగును. ఈచూర్ణ మాండూరములు లోనికిచ్చిన అగ్నిమాంద్యము, ఆమవాతము, ఉబ్బుజాడ్యము, జలోదరరోగము, కామిల, కార్శ్యరోగము, కాస, క్రిమి, గ్రహణి, జ్వరములు, ప్రమేహము, పైత్యరోగము, మూలవ్యాధి, రక్తపైత్యము, వాతరోగములు, శ్వాస, శరీరస్థూలత్వము, క్షయరోగములపై చక్కగ పనిచేసి నివారించి మంచి రక్తమును బుట్టించుననియు, సరిగా శుద్ధిగాని మాండూరము చూర్ణములు గల్గించు దోషగుణములకు కరక్కాయ చూర్ణము తేనెగల్పినది విరుగు (పరిహార) డనియుం జెప్పఁబడినది.

ఉక్కు- ఇనుమునకు కార్బన్ కలిపిచేయుటవల్ల నైన ఉపలోహము. ఇది కాల్చి పదును గల్గి ఏయాకారమునకైనను సుత్తితో సాగగొట్టి చేయనగునది. పగులను. ఉక్కుతో నగు ఉపయోగము ఇనుముతోనగుటకన్న నధికమనిపించును. ఆంగ్లవిద్వాంసులు మొట్టమొదట ఉక్కునుచేయుట కనిపెట్టినది Sir Henry Biosemer పరిశీలకుఁడని చెప్పుదురు. ఆయన విధానమునకు బిస్మీర్ విధానమని పేరిడిరి. కాని భరతదేశమున ననాదిగ ఉక్కుతో కత్తులు, గండ్రగొడ్డళ్లు, ఈటెలు, బల్లెములు, అంకుశములు, త్రిశూలములు మొదలగు నాయుధములు చేయుచుండినటులను పురాతనచరిత్రల గాన్పించుటచే నిది యీదేశమునకొక క్రొత్తవిద్య గాదని తెలుచున్నది.

ఉక్కు ఇనుమునకన్న బలమైనదిగను, పగులక గట్టిగ నిలచునదిగను ఉండుంగాన ఇటీవల ఇనుమునకన్న నెక్కువగా నుపయోగింపఁబడుచున్నది. కార్బన్ భాగ మెచ్చుతక్కువలుగ కల్పఁబడుటం జేసి యేర్పడు వివిధభేదతరగతుల ఉక్కు వివిధ కార్యముల కుపయోగింపంబడుటయేగాక ఇనుము పనికిరానితావుల నుపయోగింపఁ బడుచున్నది. అధికభాగము కార్బన్ చేరుకతన ఎక్కువ గట్టికల్గి పెళుసగుచుండును. ఇంకను ఈ ఉక్కునకు పదునిడుటయుం గూడ గలదు. ఆముదమున కాల్చిముంచి అధమపుపదును మొదలు అనఁటి దవ్వయందు పదునిడు ఆకరుపదునువర కనేక తరగతుల పదునులు వేయుదురు. ఈ పదునులు ఉక్కుగుణసంపద నినుమడింపఁజేసి ఉపయోగము విస్తరింపఁజేసెడిని. తెగువకు ఆయుధములు, పనిముట్లు, గట్టిగనరగదీయు ఆకురాళ్లు మొదలగువాట్లకు సర్వజాతి ఉక్కు అర్హముగ నీయఁబడిన పదునుతో చక్కఁగ పని జేసెడిని. లోహముల నరకుటకువలయు గట్టిపదునులు

అన్నిటికి నతిశయించియుండును. తొల్లింట ఇనుముతో కొనలను సంధులను భద్రపర్చఁబడు ఓడలికాలమున నుక్కుతో భద్రపర్చఁబడు చున్నవి. అందునను ఉక్కుజాతియు దానికిడు పదునును మిగుల పరిశీలనలతో సతిజాగ్రతగ నమర్పఁబడుట ఆరిందాతనము ప్రదర్శించుట చూడ ముచ్చటగ నుండును. ఉక్కుతో చేయఁబడు కత్తులలో నెక్కువ తెగువ దారు లోహము యొక్క స్వచ్ఛత, పరిశుభ్రతల సమానముగ గల్గియుండు కత్తిని చంద్రాయుధమందురు. ఇందు చిట్టము మొదలగు లోహపుమురికియు, తుప్పు మొదలగు లోహకళంకమును ఉండకుండును. అనఁగా స్వచ్ఛతంగల్గి యుండునని భావము. ఇటులనే ఇందు Tungsten, Chromium, Manganese, Nickel, Vanadium మొదలగు లోహభేదములు నిట్టివియే. Tungsten తో కల్పఁబడి పదునిడఁబడిన ఉక్కుతో యంత్రపు పనిముట్లు చేయఁబడును. ఇవి ఎంతగట్టిగనైన పనిచేయుటగాక మెత్తగ గాలిన లోహముపై తాకి పనిచేయుచున్నను, దానికిడినపదును గోల్పోవక నిలుపుకొనజాలియుండును. రేకులు మొదలగునవి చేయఁబడు మెత్తని ఉక్కునందు తక్కువ కార్బన్ కలియును. దూలములు మొదలగునవి చేయు ఉక్కు మధ్యరకముది. ఇందు కార్బన్పాలు కొంత ఎక్కువగనుండును. నరకు పనిముట్లు, ఆకురాళ్ళు, కత్తులు మొదలగునవి కఠినమగు ఉక్కు. ఇందు కార్బన్పా లధికమైయుండుటయేగాక పదును, బిగువు, ఇతరకూడికలుంగూడ చేరియుండును.

ఆయుర్వేద వైద్యులు- ఉక్కును భస్మముగను, సింధూరముగను చేసి వాడుదురు.

ఇది శరీరమున క్రొత్తరక్తముం బుట్టించి పరిశుభ్ర రక్తముం గల్గించుననియు, సర్పవిషము హరించి శ్వేతకుష్టువు మహాకుష్టువుల నివారించుననియు, సమస్త జ్వరముల నివారించి వీర్యపుష్టి బలము గల్గించుననియు, ఆమవాతము, ఉబ్బు జాడ్యము, గ్రహణి, గుల్మము, ప్రమేహము, పాండువు, ప్లీహ, పిత్తోద్రేకము, దగ్గులు, ధాతుక్షీణత, శరీరక్షీణత, శరీరస్థౌల్యము, శరీర దౌర్బల్యము, రక్తవికారము, వలీపలితము, శ్వాసలు నివారించుననియు జెప్పఁబడినది.

ఇనుము ఉక్కుల రాపిడిగుండా బాణాసంచా (అందు ముఖ్యముగ కాకరపూవత్తులందు క్రిందికి రాలు పూవులకుగాను) యందుచేర్చబడును.

**ఇనుముకరిగే కొలిమిలో ఈగల కేముండును?** — ఆంధ్రలోకోక్తి.

**ఇనుముతోచేరినకతన అగ్నిహోత్రునకుగూడ సమ్మెటపెట్లు** — ఇనుమును ఎర్రగ కాల్చి సాగగొట్టెదరు. అట్టితఱి సమ్మెటదెబ్బలు అగ్నికింగూడ తగులునని భావము. ఆంధ్రలోకోక్తి.

**ఇనుమువిరిగితే అతకవచ్చుంగాని మనస్సువిరిగితే అతకదు** — ఆంధ్రలోకోక్తి.

**ఇన్ కన్వర్టబుల్ పేపర్** — వాణిజ్య సంబంధపరిభాషా పదము. Inconvertible Paper Currency. కావలసినతోడనే రూకలుగా మార్చుటకు వీలుగాని నోట్లు మొదలగు కాగితపు సొమ్మును ఎక్కువ డిస్కౌంటుకు బజారునందడిగెదరు. అట్టివాని కీపేరు వర్తించును.

**ఇన్సల్టు టు ఇంజరీ**- ఇ Adding insult to injury. ఆదివరకే అపాయమొనర్చి నష్టమో బాధయో గల్గించియుండి పిదప వంచన మాటలాడి మనోవేదన గల్గించుట యనిభావము.

**ఇన్గాడ్వుయి ట్రస్టు చిహ్నము** (In God we Trust) —అమెరికా సంయుక్త రాష్ట్రము వెండి, బంగారపు పెద్దనాణెములపై

నీమాటలుండుట గాననగును. అనఁగా దేవుని యందు నమ్మకము అని యర్థము. ఇట నమ్మక మన యాధారపడుట యను భావము స్ఫురించు చునేయున్నది. క్రీ. శ. ౧౮౫౫ మొదలు ౧౮౫౮ వరకు పెన్సిల్వేనియా గవర్నరుగ నుండిన James Pollock గారు భక్తుఁడు గాన అప్పుడు దేశమునందు వ్యాపించియున్న Civil War కలతలందు దైవసహాయమునర్థించి ట్రెజరీ సెక్రెటరీగారికి వ్రాయుచు "Recognition of God on national coinage is a national duty" అని వివరించి పై వాక్యమును సంయుక్తరాష్ట్ర ముద్రికలపై వేయంబడుటకు సలహానిచ్చెను. దీనిని కాంగ్రెసువారంగీకరించి ఏకగ్రీవముగ నొక శాసనమొనర్చిరి. ఇది రెండు సభల యామోదమునుంబడసి దీనిని Motto గా నేర్పర్చిరి. అది మొట్టమొదట క్రీ
లో ప్రచారమందెను.

**ఇన్వార్ లోహము** (Invar) — ఇది కలుపుడులోహము. ముఖ్యమైనది. ఇందు ఉక్కు, నికెల్, కార్బనులు ప్రధానద్రవ్యములు. ఈ కలుపుడులోహము వేడికి విజృంభించుట యందు చాల తక్కువ పరిమితి (Low Coefficient of Expansion) కలదిగాన కొలుచుకునే Metal Tapes మొదలగునవి చేయువారు విస్తారముగ వాడుచున్నారు.

**ఇన్‌క్లినోమీటర్** (Inclinometer)- ఇది త్రివిధభేదములం గల్గిన కొలతపరికరము. పైనుండి క్రిందికి పల్లముగనైన తావులందలి Magnetic force ను కొలచు పరికరమునకును, క్రిందికివంగియుండు మూలల (Angles) కొలచు పరికరమునకును, థియోడొలైటు యంత్రమును దగిలించుచు కొలచు పరికరమునకును ఈపేరు కలదు.

**ఇన్నిస్ఫెయిల్** (Innisfail) —. ఇది ఐర్లాండు ద్వీపమున కవిత్వమునందు వాడఁబడిన పేరు. Isle of Destiny అని యర్థముట.

**ఇన్ఫీరియర్ ప్లానెట్సు** (Inferior Planets) - ఎస్ట్రొనామీ శాస్త్రమున సూర్యుని నుండి భూమికన్న దగ్గరగా తిరుగు గోళములకు పేరు. అవి మెర్క్యురీ, వీనస్సు అనంబడునవి. తక్కినవి సుపీరియర్ గోళములు. (చూడుఁడు).

**ఇన్సూరెన్సు** (Insurance) — తరుచుగ నిన్సూరెన్సు, ఎస్సూరెన్సుల నొకే సంస్థగా భావించి పొరఁబడుచుందురు. ఇన్సూరెన్సు భవనములు, యంత్రశాలలు, ఉగ్రాణములు (Godowns) మొదలగువానిని అగ్ని మొదలగు ప్రమాదములు గల్గుచో వానిని ఇన్సూరు చేసియున్నయెడల అట్లు చేసిన సంస్థ వారింత సొమ్మిచ్చుకొనునటుల నేర్పాటై యుండును. మరియు తామాసంస్థవారికి కొంతసొమ్ము వాయిదాలమేర కేటేట చెల్లించుచుండుటకును ఏర్పాటైయుండును. ఇంకను ఇట్టి ఏర్పాటు మోటారు బండ్లకును చేయించి అపాయము గల్గినచో కొంతసొమ్మా సంస్థవారిచ్చుపద్ధతియుం గలదు. ఏఅపాయములు రాకుండినతరి కట్టినకట్టుబళ్ల సొమ్మంతయు ఇన్సూరుకంపెనీ సంస్థకే దక్కును. ఎస్సూరెన్సు మనుష్యుల జీవితములపైఁ జేయం బడునది. (ఎస్సూరెన్సు చూడుఁడు).

**ఇన్ఫ్లూయెంజా జ్వరము** — Influenza. అతిత్వరితముగా నితరులకంటి వ్యాపించు జ్వరము. ౧౬ వ శతాబ్ద కాలము నుండి ఎరిగిన రోగము. తగిలినతరి నాప్రాంతము లందు గొప్ప వ్యాపకముగాంచునది. సంపర్కము గల్గిన ఇరువదినాల్గు గంటలలో జ్వరము తగులును. బహుశః రొంపయు, చలి, వణకు లక్షణములు, ౧౦౨ లేక ౧౦౩ డిగ్రీల జ్వరముండును.

ఏచిక్కులు లేకుండినతరి త్వరితముగా మూడు రోజులలో నివారణమై యారోగ్యము కల్గును. Complications కల్గి Lungs effect మై న్యూమోనియా, పెన్యూమోనియాలు కల్గిన ప్రాణాపాయము కూడఁగల్గించును.

రోగి విశ్రాంతిగా పరుండుటయు, చులకని యాహారమిచ్చుటయు, విరేచన బద్ధము గలుగ కుండ చూచుకొనుచుంటయు ప్రధానములు. టెంపరేచర్ నార్మలుకు వచ్చిన పిదపగూడ నీవిధులు ఆచరణీయములు. ఈ వ్యాధి క్రీ. వె. ౧౮౯౧ లో చీనాదేశమున బయలుదేరెనట. ౧౯౧౮ లో స్పానియా దేశమునం దగుపడి ఐరోపా యంతటంబ్రాకి ఖండాంతరములకుంగూడ నంటి భరతదేశమునగూడ నగుపడెను. ఆ సంవత్సరమున జూన్ నెలలో తొలుత బొంబాయిలో ప్రారంభమై దేశమంతటను పల్లెటూళ్లకు గూడ నెగబ్రాకి వేధించెను. ఇది అన్ని వయస్సుల వారికింగూడ నొకేతీరున నుండుననియు, పిల్లల కంటె వయస్సు మీరినవారి కెక్కువగా నంటు ననియు, వేసవికంటె శీతకాలమున నుధృతమును జెందుననియు పరిశీలన లొనర్చిన వైద్యసంఘము వారు నివేదించిరి. ఈసూక్ష్మ జీవింగూర్చి రూఢిగా నెవ్వరును తెల్పియుండలేదు. Pfeiffer అను పేరుగల వైద్యుఁడు పరిశీలనలొనర్చి కణికను బోలియుండునని తెల్పియున్నాడు. ఎండ యందిది నిలువలేకఁ జచ్చునట. శరీరము నందభివృద్ధి జెందునటుల వెలుపలవృద్ధినందు చిరకాలము మనజాలదట.

రోగి ముక్కునుండి, ఊపిరితిత్తులనుండి వెలువడు ద్రవమునందు, రోగి నవ్వునప్పుడు, దగ్గునప్పుడు, మాటలాడునప్పుడు గాలిలోనికి తుంపురులగుండా చేరి అన్యులకుం వ్యాపించునుగాన పోటాషియం పెర్మాంగనేటుగాని, టేబిలు సాల్టుగాని వేడినీటం గరిగించి పుక్కిలించుచు నుమియు చుండఁదగునని కొందరు వైద్యులనెదరు. (అంటు వ్యాధులు, సూక్ష్మజీవులు జ్వరము చూడుఁడు).

**ఇన్స్పిరేషనిజమ్—** (Inspirationism) ఏగ్రంథమునందుమైనను ప్రతిమాటయు దైవదత్తమనియు ఆవేశమువలననే కల్గినదనియు నమ్మువారి మతాభిప్రాయము.

**ఇన్స్పెక్టింగు ఆర్డరు —** వాణిజ్య సంబంధ పరిభాషాపదము. Inspecting order Dock నందు, Bonded Warehouse నందు మొదలగు తావులంగల సరకులం దనిఖీచేయ నధికారపర్చుచు నొసంగిన యుత్తరువు.

**ఇన్వేలిడిజమ్ —** (Invalidism) అశక్తతవలన తాటస్థ్యము వహించు (దేనికిని గల్గించుకొనని) వారి మతము.

**ఇన్స్క్రైబ్డు స్టాకు—** వాణిజ్య సంబంధ పరిభాషా పదము. Inscribed stock కొందటికి సాముదాయికముగ నున్న సరకు. వాని యజమానులందరు రిజస్టరు చేయబడుదురేకాని సరకుతో నేసంబంధము గల్పించుకొనరాదు. సంఘము వారధికార పర్చినవారు మాత్రమే దానింగొను గోలు మొదలగుపనుల నెరపుదురు.

**ఇన్సొల్యూబిల్కలర్సు—** (Insoluble Colours) రంగులు. రంగులు చూడుఁడు.

**ఇప్పచెట్టు —** లా. Bassia longifolia లేక Latifolla. ఆంగ్ల Indian butter tree సం. మధూక, మధుపుష్ప, మధుష్ఠీల. హింది, మోవా, లేక మహవామ్. ఇది అనేక విధోపయోగములు గలవృక్షము. అడవివృక్షము, ఇప్పపువ్వు, ఇప్పకాయలలోని గింజల నూనెయు, ఇప్పసారాయము ఉపయోగకరములే.

ఇప్పనూనె- పైత్యవాతములవడంచి చలువ చెంట్రుకలకు బలము, పుష్టినిచ్చును. ఇంచుక

శ్లేష్మమును జేయునందురు. క్రిమిరోగములు, వాపులు, దురదలు, వ్రణములు పైపూతలచే తగ్గును. ఇప్పకాయలు కూరగ నొనర్చి పుచ్చుకొనిన వీర్యమునకు చలువజేసి ఇంచుక విరేచనబద్ధముగల్గించి ఆమదోషము నుద్రేకించును. కఫము, పైత్యము, ప్రమేహము, వాతముల నడంచును. ఇప్పపండ్లు చలువజేసి దేహపుష్టి నొసంగి వాతపైత్యముల శమింపజేయును. ఇప్పపువ్వు పైగుణములను బలముగ నొనర్చునది. దీనికి విరుగుడులు- ధనియాలు, వేపవిత్తులు, నెయ్యి, వేడినీళ్లు.

**ఇమాదువంశనృపులు** — తొల్లింట బహామనీరాజ్యము క్రీ. వె. ౧౪౮౯ లో నైదు చిన్నరాజ్యములుగ చీలుటతో నేర్పడిన రాజ్యములలో నొకటియగు బీరారురాజ్యము నేలిన ముసల్మానునృపులు.

**ఇమాన్హూసేన్ మహాత్ముని గోరీ** — ఇది మెసపొటేమియాయందు ఇరాక్రైయిల్వే నంటియున్న తావుగ నున్న కర్బాలాపురమునందున్నది. కర్బాలాపురము మహమ్మదీయశాఖలలో నొకశాఖవారికి యాత్రాస్థలము. ఇమాన్హుసేన్ మహాత్ముడు మహమ్మదుగారి దౌహిత్రుడు. బలాత్కారమరణ మందినవాడు.

**ఇమామ్** — అరబ్బీ భాషాపదము- నాయకుం డని యర్థము. ఒకప్పుడు మహమ్మదీయపాలకులగు కాలీఫాలకు బిరుదుగా నుండినదట. అరేబియాపరిపాలకులకుగూడ తరువాత బిరుదముగా నుండెనట. మశీదులం దిక్కాలమున ప్రార్థనాదులం జరపి నడపు నుద్యోగికి వర్తించుచున్నది.

**ఇమారీసామాను** — (Porcelain) జపానుదేశమున చేయంబడు సామాను. తెల్లమట్టి ఫాల్స్పతిక్కరాతిపొడుము మొదలగువానితో చేయంబడుచు, పోర్సిలైనుపేరం బరగుచున్నది. అందమై యుండును.

తొలుత జపాను నందలి హిజాన్ సీమలో (అనగా నాగసాకిదేశమున) ౧౬౦౦ సంవత్సరమున కనిపెట్టంబడి ప్రారంభమైనది. మెరుగుగల్గి యుండును.

**ఇమిటేషన్ సిల్వర్** — (కృత్రిమ రజితము). ఈ క్రిందవివరింపంబడిన లోహముల సమ్మేళనమువలన నిజమైన వెండివలె రంగును, తేటును, తళుకునుగల కృత్రిమ రజితలోహము (Imitation Silver) తయారగుచున్నది. రాగి 70 పాళ్ళు, నికిల్ 23 పాళ్ళు, అల్యూమినియమ్ 7 పాళ్ళు, కొంచెము వెలిగారము కలిపి మూసలోంబెట్టి బొగ్గులకొలిమిలోం గరగింపవచ్చును. దీనిలో మఱియొక భేదము- రాగి 57 పాళ్ళు, నికిల్ 20 పాళ్ళు, తుత్తినాగము 20 పాళ్ళు, అల్యూమినియమ్ 3 పాళ్ళు. దీనిని కూడ మూసలో బొగ్గులకుంపటిమీందనే కరగింపవచ్చును. లోహము మూసలో కరగి నీరయిపోవును. ఇది మొదటిదానికన్న చౌక. ఇత్తడితో సమానముగా కిట్టును. దీని రంగు వెండిని మరపించి యుండును. మిక్కిలి తేటుగా మెఱుగుపెట్టుటకు వలయునంత గట్టిదనము కలిగి యుండును.

**ఇమేడియటిజమ్** (Immediatism)— తొల్లింటికాలమున బానిసత్వము వ్యాపించియుండుతరి "తక్షణమే అందరు బానిసలను స్వేచ్ఛాపరులుగ జేసి తీరవలయు"నను అభిప్రాయము గల్గియుండినవారి పట్టుదల.

**ఇయూబోయియాద్వీపము** - గ్రీసుదేశము చూడుడు.

**ఇయోనియన్ ద్వీపములు** — ఐరోపాఖండమున గ్రీసుదేశమునకుం జెందిన ద్వీపములు. మధ్యధరాసముద్రమునందున్నవి. వీనియందు కోర్ఫూద్వీపము, ఇతాకాద్వీపము, కేఫలోనియాద్వీపము, జాంటిద్వీపము ఇందు పెద్దవి ముఖ్యములైనవి. వీనియందు కర్రెంటు తోటలు, ద్రాక్షతోటలు, ఓలివుతోటలు, విస్తారము పైరు చేయంబడుచున్నవి. తేనెయు విస్తారము లభించుతావులు కలవు. ఈ దీవులు తొల్లి యొకప్పుడు వెన్నిస్‌ప్రజాప్రభుత్వమునకుం జెందియుండినవి. క్రీ. వె. ౧౮౧౫ లో వియన్నా కాంగ్రెసు వాటినొక ప్రత్యేకరాష్ట్రముగఁ జేసి బ్రిటిషు ప్రభుత్వమువారి రక్షణయందుండ తీర్మానించెను. క్రీ. వె. ౧౮౬౪ లో బ్రిటిషు ప్రభుత్వమువారు ఈ దీవుల రాష్ట్రమును గ్రీసుదేశమున కిచ్చివైచిరి. (గ్రీసుదేశము జూడుఁడు).

**ఇరా (ఐరా) వతీనది** — ఇప్పుడు రావి యనుచున్నారు. పంజాబులోని నది సింధునదిలో సంగమించును.

**ఇరాకజెమీ** — పారశీకదేశములోని యొక ఖండము. (పారశీకదేశము చూడుఁడు).

**ఇరాక్ దేశ ప్రభుత్వము** (Iraq) — తొల్లింటి మెసపొటేమియా. ఇది ఇటీవల నేర్పడిన సంస్థానరాజ్యము. ఆశియాఖండమునందు అరేబియా, పర్షియా(పారశీకరాజ్యము)ల నడుమ నేర్పరుపబడినది. ఒకలక్షా నలువదిమూడువేల రెండు వందల నలుబది చతురపుమైళ్ల వైశాల్యమనియు, ముప్పదిలక్షల జనసంఖ్య యనియుం జెప్పఁబడినది.

**ఇరాక్ దేశము** — ఆసియాఖండమందలి మెసపొటేమియా లోని కొన్ని సీమలుగల దేశము. ఇందు బాగ్దాదు, బస్రా, మసోల్, విలాయతులు చేరియున్నవి. బాగ్దాదు ప్రధానపురము. బసరా దాని ప్రధాన రేవుస్థానము. ఇరాక్ దేశము ౧,౭౭,౧౪౮ చతురపుమైళ్ల వైశాల్యమును, ౨౮,౪౯,౨౮౨ జనాభాయును, (క్రీ. వె. ౧౯౨౦ జనాభా) కలదని చెప్పఁబడినది. కొన్ని నైలు విస్తారము తీయఁబడుచున్నది. ప్రత్తి గోధుమలు మొదలగుపంటలు పండు భూములు కలవు.

ఐరోపామహాసంగ్రామమున టర్కీక్రిందనుండి లాగుకొనఁబడి ౧౯౧౯ లో మాండేటురాజ్యముగ జేయంబడిన యీ దేశము ఆంగ్లదేశపు స్వాధీనమై క్రీ. వె. ౧౯౨౧ లో రాజ్యమై రాజు నెన్నుకొనియెను. ౧౯౨౨ లో గ్రేటుబ్రిటన్‌తో సంధి యొనర్చుకొనియెను. ౧౯౨౬ లో పర్షియా టర్కీలతో సరిహద్దుల నేర్పరుచుకొని ౧౯౨౭ న గ్రేటుబ్రిటనుచే స్వతంత్రరాష్ట్రముగ నంగీకరింపఁబడి, ౧౯౩౦ లో సంధిపత్రములను ముగించుకొని, ౧౯౩౨ లో తానును జాతిసమితి (లీగాఫ్ నేషన్సు) సభలో సభ్యత్వమంది స్వతంత్రరాజ్యమై యున్నది.

**ఇరాకరాబీ (ఛాల్డియా) దేశము**— ఆసియాఖండమందలి తొల్లింట ఛాల్డియా యనం బరగినదేశము. ఇరాకరాబీ యనునది అరబ్బులిడిన పేరు. టైగ్రీసు యూఫ్రటీసునదులు కలసిపోయినపిదప సముద్రసంగమమగును. (పారశీకసంయుక్తాగ్రగుడమున సంగమించును.) చాల ఫలవంతమగు సమతలప్రదేశము. తొల్లింటిరాజ్యకాలమునాటి బేబిలన్నగరము పాడుదిబ్బలట గలవు. దేశమున ఇనుపదారి వేయఁబడినది.

బాగ్దాదుపురము ప్రధానస్థానము. తొల్లింట కలీఫాల రాజధానిగనుండిన నగరము. ఇప్పుడు వర్తకస్థానమై యున్నది. కేరవాన్వర్తక మిట విస్తారము నడచుచున్నది. హిల్లాపురము బేబిలను పాడులనడుమ నున్నది. తొల్లింటి బస్సోరాపురము ఇప్పుడు బస్రాయనంబడుచు గొప్ప వర్తకస్థానమై యున్నది. టైగ్రిస్ యూఫ్రటీసునదులు

కలసిననదిపై నున్న రేవుస్థానము. (ఛాల్డియా చూడుడు).

**ఇరాకీస్** — అమెరికాసంయుక్తరాష్ట్రములలోను, కనడాదేశములోను వసించుచుండు మొహావక్సు మొదలగు ఇండియన్సుజాతులకు అమెరికానివాసులిడిన పేరు.

**ఇరాన్ దేశము (పెరిషియా)** .— పారశీకదేశమునకు ఆదేశపు స్వభాషానామము. దీనినే ఆదేశప్రభుత్వమును విదేశప్రభుత్వములును వాడుచుందురు. కాకసస్ పర్వతములు, హిందూకుష్ పర్వతములు, పారశీక సంయుక్తాగ్రగుడము, ఖుర్దుస్థానము, టైగ్రిస్‌నది దీనికి ఎల్లలని చెప్పఁబడినది. ఈదేశపు ప్రధాననగరమునకు థా-ఇరాన్ అని పేరు. అనగా ఇరాన్ నగర మని యర్థము. దాని నాంగ్లమున టెహెరన్ అని పల్కుచున్నారు. (పారశీకదేశము చూడుఁడు. పాహ్లావదేశము చూడుఁడు).

**ఇరాన్‌పాలి లిపి** — అశోకచక్రవర్తి (క్రీ. పూ. ౨౭౨—౨౩౧) పాటలీపుత్రము రాజధానిగ మగధరాజ్య మేలినవాఁడు. ఈ మహనీయుఁడు బౌద్ధధర్మములను భరతదేశమునందు పెక్కు ధర్మశాసనములుగ వేయించినవాఁడు. ఉత్తరమున హిమవన్నగము, దక్షిణమున మైసూరుప్రాంతసీమలు, తూర్పున వంగదేశము, పశ్చిమమున ఘూర్జరదేశము గల భూమియందచ్చటచ్చట నీతని శిలాశాసనములు గానవచ్చుచుండును. అవి వాయువ్యదిశను (పశ్చిమోత్తర సరిహద్దు పరగణా) ఖరోష్ఠీలిపియందునను, తక్కిన ప్రాంతముల బ్రాహ్మి (దేవనాగరి) లిపియందునను, లిఖింపఁబడినవి. (బ్రాహ్మిలిపి, ఖరోష్ఠీలిపి, భరతదేశమందలి లిపులు చూడుఁడు). రెండు లిపులు కలియు సంధిప్రదేశము పంజాబుదేశము నందలి జలంధరుజిల్లా. ఇచట నీలిపికి ఇరాన్పాలీ లిపియని యందురు. అనగా రెంటిసంకరరూపమునకు ఇరాన్‌పాలీయని పేరని యెఱుఁగునది. దీనికాంగ్లమున Ariano Pali అని పేరిడియున్నారు. శాసనములు పాలీభాష ధర్మశాసనములే వ్రాయున్నవి.

**ఇరిగేషన్** (Irrigation Engineering)_ వ్యవసాయపు పొలములకు ఎరువులు, నీటివసతి ముఖ్యము. అందు నీటివసతి ఎక్కువ ప్రాముఖ్యమైనది. వ్యవసాయములకు నీటివసతింగల్గించు పనులంగూర్చిన శాస్త్రవిధానమున కాంగ్లమున Irrigation engineering అనిపేరు. ఇరిగేషన్ స్వాభావికమనియు (Natural), కృత్రకమనియు (Artificial) ద్వివిధము.

కేవల వర్షాధారముపై నాధారపడి పండించు పంటలస్థితి కాంగ్లమున Natural irrigation అనియెదరు. ఇట్టిది కేవలము మెట్టపంటలకే యని చెప్పఁబడినను, వర్షాధిక్యముగల ప్రదేశములందు పల్లపు వ్యవసాయములగుచుంట గానవయ్యెడిని. ఇట్టి ప్రదేశములు ఇప్పటి మధ్యరాష్ట్ర (Central Provinces) భాగములందు గాననయ్యెడిని. తక్కిన కృతక విధానము లిఫ్టు ఇరిగేషననియు, డైవర్షన్ ఇరిగేషననియు, స్టోరేజి ఇరిగేషననియు త్రివిధములుగఁ జెప్పఁబడినది. ఏతములమూలమున నీటిం దోడిగాని, గూడవేసి నీటిం బారించిగాని, దోనెలతోనీటిం బైకెత్తి పారించిగాని Water lifts మూలమున నీటిబైకెత్తుచు పారించిగాని, నీటిపంపుల మూలమున నీటిందోడి పారించిగాని, ఈజిప్టుదేశపు షడూపులమూలమున నీటిం బారించిగాని పంటచేలకు నీటివసతింగూర్చు విధానమునకు లిఫ్టు (Lift) ఇరిగేషన్ అనియెదరు.

నదులకు ఆనకట్టలంగట్టి నీటిమట్టమును పంటపొలముల కనుకూలించునటుల నెత్తుచేసి

నిలిపి కాలువలంద్రవ్వి యానీటినిపారించి పొల ములకందిచ్చు విధానమునకు డైవర్షన్ విధానము (Div ertion Works) అని పేరు. ఇంక నదీజలములు మొదలగు Natural Drainage ప్రవాహములను మరలించిగాని, కాలువలగుండా నీరుతేచ్చిగాని రిజర్వోయరు చెరువులందు (Reservoir Tanks) బాధించి నిలువచేసి దానిమూలమున పంటపొలములకు నీటివసతిం గూర్చుపద్ధతికి స్టోరేజివిధానము (Storage Works) అనిపేరు.

ఇర్రిగేషన్ ఏవిధానముచేతనైనను కాలవ్యతి రేకములు సంభవించి పంటపొలములందు నీరధిక మైనచో నానీటింగొంపోయిసముద్రమునకుంగాని, ఇతర జలప్రవాహములకుఁగాని, పల్లపుప్రదేశ ములకుఁగాని చేర్చుటకుఁ గొన్నితావులందు కాలువలుండెడిని. వానికి మురుగు కాలువ లని పేరు. రిజర్వాయరులనుండియు, పంట కాల్వలనుండియు నధికమగు జలములను పైకి వెడలించుటకు సర్ప్లస్వీర్సు, సర్ప్లస్లూసులు మొదలగు ఎస్కేపుసు నిర్మింపఁబడును. ఇంక డైవర్షన్ విధానమునను, స్టోరేజివిధానమునను అవసరములగు కొన్ని నిర్మాణము లర్హస్థానము లందు నిర్మింపఁబడి వాడుకొనఁబడుచుండును. వానింగూర్చి వానితావులందు చూడనగును. అవి- ౧. అక్విడక్టులు, ౨. ఆనకట్టలు, 3. ఏప్రనులు, ౪. గోడలు, ౫. టన్నెలులు, ౬. ట్ర్యాబులు, ౭. డ్రాపులు, ౮. డాములు, ౯. డిప్లెడింగుడ్రాములు, ౧౦. డ్యూటీ ఆఫ్ వాటర్వర్క్సు, ౧౧. ప్లడ్బాంకులు, ౧౨. లాకులు, ౧3. వంతెనలు, ౧౪. స్పిల్లిస్లూసు, ౧౫. సర్ప్లస్వర్క్సు, ౧౬. స్కవరింగుస్లూస్, ౧౭. సూపర్పేసేజి, ౧౮. సైఫనులు, ౧౯. హెడ్లూసస్ మొదలగునవి.

**ఇరిడెంటు సంఘము** — ఇటలీ దేశము తిరుగ రాజ్యమై రాజు నేర్పాటుచేయు వరకు ఇటాలియను ప్రజలు నివసించు కొన్ని తావులారాజ్యమున చేర్పబడక వేఱుగనుండవలసి వచ్చెనట. ఆప్రదేశముల నిటలీరాజ్యమునకుం జేర్పుట కీయుద్యమము ప్రారంభమై అందలి ప్ర లకు ఇటాలియన్ ఇరిడెంటుస్సు అనిపేరుకల్గెనట. పిదప క్రీ శ. ౧౯౨౦ సంవత్సరమునాటికి వీరి ఉద్యమము సఫలమాయెనట. వీరియరపు ఇటాలియా ఇరిడెంటాయని యుండెనట.

**ఇరిడియం లోహము** — ఇది Metallic Element అని చెప్పఁబడినది. దీని Chemical Symbol, Ir. Atomic weight 193.1, Atomic Number 77, Specific Gravity 22.40, Melting point సెంటిగ్రేడు థెర్మోమీటర్ రెండువేల డిగ్రీలని చెప్పఁబడినది. ఇది ప్లాటినమ్ రిఫైనుచేయుటయందు ఇది యొక By-product గా చేయఁబడుచున్న లోహము. మెరుగుగల తెల్లలోహము. ఉక్కువలెనుండి అధికతరమగు కఠినతగలది. వాతావరణపు దోషములను కెమికల్ దోషములకు చెడనిది. అధికవాడుక కాగగల లోహము. ఫౌంటెన్‌పేనాల పాళీల కొనలందు వాడఁబడుచుండును.

**ఇరుగుడు చెట్టు** — లా. Dalbergia sissoo. ఆంగ్ల. Sisu Tree. సం. కృష్ణసార, శింశప. ఈ చెట్టుచేవ మ్రానికర్ర నల్లగ గట్టిగ నుండి వడ్రపుపనికిచాల నుపకరించును. కొందఱు దీనిని రక్తచందనమనియు నందురు. ఈమ్రాని చెక్కయొక్క రసము, కషాయములు, వేడి చేసి కుష్ఠు, క్రిములు, పొత్తికడుపులోని రోగములు, తాపము, మేహము, మచ్చలు, వాంతుల నడంచును. గర్భస్రావము గల్గించును. అగరు, దేవదారు, బొంతచెముడు, మామిడి, ఇరుగుడు చెక్కలరసములు సమభాగములుగ గల్పి నూనెతోఁజేర్చి వండినయానూనె ఇరుగుడు

తైలమందురు. అది కుష్టువు, దుష్టవ్రణములు, దద్రుల నడంచును.

**ఇరువది నాలుగు పరగణాల జిల్లా** — బంగాళదేశములోనిది. కలకత్తా ప్రధానస్థానము. (బంగాళదేశము చూడుఁడు).

**ఇల** — దక్షప్రజాపతి కుమార్తెలలో నొకతె కిలయనిపేరు. ఈమె కశ్యపుని భార్య. ఈమెకు వృక్షములు, లతలు, గడ్డిమొక్కలు సంతానములని చెప్పఁబడినది. ఇంకను వైవస్వత మను పుత్రిక కిల యను పేరు. ఈమె బుధుని భార్య. ఈమె కుమారుఁడు పురూరవచక్రవర్తి. (చంద్రవంశపు రాజులలో మొదటివాఁడు). ప్రతిష్ఠానపురాధీశుఁడు. ఇలకు పురుషత్వము కారణాంతరమున గల్గెననియు, అత్తరి సుద్యుమ్నుఁడను పేరంబరగెననియు, అప్పుడు ఉత్కలుఁడు, గయుఁడు, వినతాశ్వుఁడు అనువారు పుత్రులనియుం జెప్పఁబడినది. ఇల యజ్ఞయాగము లొనర్ప జన్మించిన పుత్రిక.

మఱియు వసుదేవుని భార్యయు నిళాదేవియే. వేఱుచోట వైవస్వతుఁడొక యజ్ఞమొనర్పఁగా ఇల యను పుత్రిక యుద్భవింప వసిష్ఠుననుగ్రహమున నాతఁడామెనొక బంధువున కిచ్చుటచే చంద్రవంశ మభివృద్ధిజెందెనట. తన వంశాభివృద్ధికై యాతఁడు తపమొనర్ప నాసుతయే సుద్యుమ్నుఁడను పుత్రునిగా జన్మించెనని చెప్పఁబడినది.

**ఇలబిలాదేవి** — తండ్రి తృణబిందువు. తల్లి అలంబసాదేవి. పెనిమిటి విశ్రవసుఁడు. కుమారుఁడు కుబేరుఁడు. (ఉత్తరదిశాధిపతి).

**ఇలమంచకుల గోత్రము** — యలమంచకుల చూడుఁడు.

**ఇలావంతుఁడు**— తండ్రి పాండవమధ్యముఁడగు అర్జునుడు. తల్లి నాగకన్యకయగు ఉలూపి లేక ఉలూచి.

**ఇలివింద చెట్టు** — ఇలివిందపండు రుచిగానుండును. ఊపిరిగొట్టునొప్పి, వాతము, శ్లేష్మముల నడంచి, మలమూత్రనిరోధముజేసి ఇంచుక క్రిమిరోగముల నుద్రేకింపజేయును. దీనికి సజ్జాక్షారము విరుగుడని చెప్పఁబడినది.

**ఇల్వలపురము**— ఇల్వలుఁడు, వాతాపి యను రాక్షససోదరులు వసించినతావులు. వీరి నగస్త్యుడు వధించెనని చెప్పఁబడినది. అందిల్వలపుర మేలూరై నానాఁటి శెల్లోరా Ellora యనంబడుచు నైజాము రాజ్యములోని దౌలతాబాద్ పురమునుండి ఏడుమైళ్లదూరమున నున్నది. ఇట గల గుహలలో పర్వతోపరిభాగమున చిత్రింపఁబడిన కైలాసనాథుని దేవాలయగుహ కడు విచిత్రమగు పనితనము గల్గినది. దానిని బాదామియందు రాజ్యమేలిన రాష్ట్రకూటవంశ నరపతి క్రిష్ణరాజు తానొనర్చిన దండయాత్రయందు కల్గిన జయమునకుగాను భక్తితో నిర్మింపజేసినటుల తేలినది. ఫెరుగస్సన్ పరిశోధకుఁడు దీనిని క్రీ. వె. ౬౦౦ మొదలు ౭౫౦ మధ్యకాలమున నిచటి గుహలు నిర్మింపఁబడియుండవలయునని తెల్పుచున్నాఁడు.

**ఇల్వలుఁడు** — దానవుఁడు. తండ్రి విప్రచిత్తి, తల్లి సింహికయను రక్కసి, సోదరుఁడు వాతాపియను దానవుఁడు, అగస్త్యమహర్షిచే నిహతుఁడైనవాఁడు. మహారాష్ట్రభూమియందు ఇప్పటి బాదామిజిల్లా (బొంబైరాజధాని) లోని బాదామికడ నీతనిమొక్కయు, నీతని సోదరుఁడగు వాతాపిమొక్కయు అనవాళ్లు కలవు.

**ఇల్లల్లా తప్పెడు వెంకులుకావు**- చిన్న ఇల్లని భావము. ఆంధ్రలోకోక్తి.

**ఇల్లాలు గుడ్డదగుట ఇంటికుండలకు చేటు** — ఆంధ్రలోకోక్తి.

**ఇల్లు కట్టిచూడు, పెండ్లి చేసిచూడు** — ఆంధ్రలోకోక్తి.

**ఇల్లు కాలుతూంది జంగమయ్యా అంటే, నా చంక జోలెయు నా చేతి గంటయు నాకడనే యున్నవన్నట్లు** - ఆంధ్రలోకోక్తి.

**ఇల్లు విప్పి పందిరి వేచినట్లు** ఆంధ్రలోకోక్తి.

**ఇల్లెక్కి కొరవిఁద్రిప్పినట్టు** ఆంధ్రలోకోక్తి.

**ఇశ్రాయేలులు**— ఇజ్రేలు చూడుఁడు.

**ఇసింటారమ్మంటే ఇల్లంతా నాదే అనేవాఁడు** — అనగా ఉపకారికి అపకారమొనర్చువాడని భావము (దురాశపరుడు). ఆంధ్ర లోకోక్తి.

**ఇషీకహస్త గోత్రము** - పరాశర గణము చూడుఁడు.

**ఇషుకారన్యాయము** — ధనస్సులు చేయువాడని యర్థము. ఇతరజాగ్రతలందు మనస్సును పోనీయక ఏకాగ్రచిత్తుడై తానవలంబించిన పనిం జేయుచుండుట యని భావము.

**ఇషుపకులగోత్రము**— ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు). ఇషుపకులగోత్రము, ఏకాక్షేయ గోత్రము (౪౯). దీనిని ఇసపకుల జనకులగోత్రమనియు నందురు. సంస్కృతగోత్రము, గృత్స్న మదస గృత్స్నమదగణము, విష్ణువృద్ధర్షి, ఆపస్థంబసూత్రము, యజుశ్శాఖ, ప్రమాణగ్రంథములు, ధర్మసింధు, నిర్ణయసింధు, సమానగోత్రములు కృత్స్నస, విష్ణువృద్ధస, కపిలేశుఁడు దేవత, భార్య కపిలాంబ, నర్మదాతీరము తపస్థానము, కపిలాంబుధితటాకము, జపము కోటి, దీపములు ౬౩, క్షేత్రసంఖ్య ౫౫, షోడశమహాదానములు, ఇంగువ వర్జనీయము.

**ఇషుమంతుఁడు** యదువంశ క్షత్రియుఁడు. వసుదేవుని తమ్ముఁడగు దేవశ్రవసుని రెండవ పుత్రుఁడు.

**ఇషువేగక్షయ న్యాయము** — ధనస్సునుండి (బల మొసంగబడి) వదలబడిన శరవేగము రానురాను తగ్గిపోవుట యని యర్థము.

బాణమునుండి వదలబడిన శరము బాణపునారిబిగువు బలము నుండి కొంత త్వరితగమన సామర్థ్యము నొసంగఁబడిన దగుట తెల్లమే. అట్టి శరవేగము సైతము పోనుపోను తగ్గిపోవుచుండునని భావము.

కాలానుగతమున (బలక్షీణత) పటిమ క్షీణించుట కీన్యాయము వర్తించెడిని.

**ఇష్యమాణస్యైవప్రాధాన్యం నత్విచ్ఛాయాః ఇతిన్యాయము** — కోర్కెకంటె కోరినపదార్థము చాలా ముఖ్యమైనదని భావము.

**ఇసుక** — రాళ్లు ఒండొంటి నొరచుకుని నైన చూర్ణమున కిసుకయని పేరు. ఇసుకరేణువులు పెద్దవియైనను, చిన్నవియైనను, చిన్నత్రసరేణువులైనను రాతిపొడియె. ఈరాతిపొడి పర్వతసీమలందైనను, సెలయేగు, వాగు, నదులందైనను నీటిప్రవాహవేగమున రాళ్లు దొరలుచు నొండొకటిపైం బడి చితికి ముక్కలై పొడియైనది ఇసుకయగును. ఇయ్యది తెల్లరంగుగ, నల్లరంగుగ, ఇంచుక ఎఱ్ఱధాతువుం గల్గిన నలుపు తెలుపులు గలిసిన రంగులుగ నుండెడిని. ఇందు నల్లఇసుకయందు ముతుకఇసుక యుండదు. నల్లఇసుక చాలాసన్నముగ నుండును. అద్దుడుకాగితముల నెఱుంగనికాలమున సిరాతో వ్రాసి దానిపై నల్లఇసుకం జల్లుచుండెడి యాచారముండెను. గాన సిరాబుడ్లతో సహా ఒక నల్లఇసుకబుడ్డియు దానిపై భాగమున చిన్న చిన్న రంధ్రములును

ఉండుట నంద తెలిసిగినదే. తెల్లని ఇసుకయందు ముతుకఇసుకయు, సన్నపుటిసుకయుం గూడ నుండెడిని. ముతుకఇసుకను గండ్రఇసుకయనియు నందురు. తెల్లఇసుక సర్వసామాన్యముగ నదులందు, సముద్రతీరములందు, ఎడారులందు, బయళ్లయందు కూడ గాననయ్యెడిని. ఇదియె సర్వసాధారణపు టిసుక.

ఇంక నెఱ్ఱజాతిగండ్రయిసుకకు చక్కని విలువ గలదు. ఏలనన ఇది కరుకులేక చాలమెత్తగ నుండి బంగారు వెండివస్తువులకు మెరుగుపెట్ట నుపయోగించెడిని. దీనిని మెరుగు యిసుకయనియు, కురంజియిసుక యనియుం గూడ వాడుదురు. ఇది దొరకుతావుల శుభ్రపర్చబడి ఎగుమతిచేయఁబడుచు, అంగడులందు చిక్కెడిని. ఇంక నీకురంజియిసుకంబోలిన సన్నయిసుక చాలా అరుదుగ గన్పట్టెడిని. కురంజియిసుక చకుముకి రాయి (Flint) సంబంధమందురు. ఆంగ్లపరిశీలకుల యిసుక Flint లేక Quartz రాళ్ళ గుండ యనెదరు. కందిపొడిరాయి (Sand Stone) గుండయుం గూడ నుండెడినని తోచక పోదు. కొవ్వురాళ్ళగుండయుం గాననగుచునే యుండును.

ఇసుకయొక్క ఉపయోగము లెన్నియోగలవు. ఇసుకనేలలందు సరుగుడుతోటలు, జీడిమామిడి తోటలు, కొబ్బరితోటలు, ఖర్జూరపుతోటలు, ఇతర పరిస్థితులు ప్రతికూలింపనిచో నాటిన పెరుగును. ఇసుకను గోనంకెములలో నింపి యుద్ధరంగమున రక్షణకైయడ్డుగవైచి యుపయోగింతురు. వంతెనలంగట్టు శిల్పశాస్త్రవేత్తలు, ఇసుకబస్తాలచే ప్రవాహపు అపాయముల నాపుదురు. ఇండ్లు కట్టుటకు సున్నము దంపుతరి ఇసుకపాలందు చేర్చబడును. నునుపుచేయు కరాసకాగితము (Sand papers) లిసుక నంటించి చేయఁబడినవి. అద్దములు చేయుతరి నిసుక చేర్చబడెడిని. విగ్రహములు చేయు మూసలకిసుక యవసరము ఇంక నెన్నియో ఉపయోగములు కలవు. ఉత్తరఆఫ్రికా ఖండమునను ఆసియాఖండపుమధ్యభాగమునను, ఆస్ట్రేలియాయందును, ఇంక నరేబియాదేశమునందు, బెల్జియమ్‌దేశమునను ఎన్నియో ఇసుకఎడారులు కలవు. ఆంధ్రదేశమున నదీతీరములనుండు పంటభూములు గాలికి యిసుకమయము లైపోకుండ నదీతీరముల సరుగుడుచెట్లను నాటి ఆపుదురు. మంచు విస్తారము పడు చలిదేశములందు, ఇనుపబాట మార్గమున బరువిడు ప్రతి రైల్వే ఎంజినును కొన్ని ఇసుకపెట్టెలం దగల్చుకొని యేగును. మంచు పడి ఇనుపపట్టీలు బురదవలె జారునేని వానిపై నీ యిసుకం గొట్టములగుండా కార్చుచు బర్విడునట. ఇక్కాలమున ఇసుకం ద్రవ్వి తీసివేయవలసివచ్చునేని ఒక Centrefugal sand pump నుపయోగించి తీసివైచెదరు. ఇది తడి ఇసుకం బీల్చివేయును.

**ఇసుకగడియారము** — రెండు గాజుబుడ్లవలె నుండుచు రెంటింగలుపుచు నడుమ నొక సన్నని గొట్టముంగల్గియుండు గాజుపనిముట్టునకు ఇసుకగడియారమని పేరు. తొల్లింటికాలమున గడియారములులేనితరి నిది వాడుకయందుండెను. ఒకబుడ్డియందు సన్ననిఇసుక పోయంబడి పైకి తిప్పఁబడియుంట నాగొట్టముద్వారా క్రిందిబుడ్డిలోనికి ఇసుక యంతయు కారిపోవువరకు గడియయో గంటయో అగుచుండునటుల ఇది చేయఁబడుచుండెడిది. అక్కాలమున కొన్ని తావులందు నీరు ఇటులనే కారుచు కాలముందెల్పునట్టి నీటిగడియారములును ఉండినవి. కాని ఇసుకగడియారములను తిరుగవైచుచుంటయు, నీటి గడియారములందు తిరుగ నీరునింపుచుంటయు చేయఁబడుచునే యుండవలసియుండెను.

**ఇసుకతక్కిడగానికి వేడతక్కిడ గాడు** — ఆంధ్రలోకోక్తి.

**ఇసుకతుపాను** (Sand Storm) — ఎడారులం దప్పుడప్పుడు వీచు ప్రచండమగు సుడి గాలులు మెత్తగనుండు ఇసుకలోని సన్నని త్రస రేణువుల నెగురవైచి పైకెత్తుకొనిపోవుచుండు తరి నాయిసుక మేఘములవలె దట్టమై కఠిన మగు సూర్యరశ్మిని మరుగుపడఁజేయుచుండును. ఆయిసుక నేలంబడుచో సర్వము వేడియిసుకచే దహింపఁబడున టగుటయు, అసౌఖ్యముం గల్గించుటయు, పిదప జిగటవిరేచనములం గల్గించి బాధించుటయు మార్గస్థులకు సంభవించు చుండును.

**ఇసుకదారి చెట్టు** – ఇసుకరాసి కూరచెట్టు చూడుఁడు.

**ఇసుకదాసరిచెట్టు** – ఇసుకరాసికూర చూడుఁడు.

**ఇసుకరాసి కూరచెట్టు** (ఇసుకదాసరి, ఇసుకరాసి లేక ఇసుకదారి) — లా. Gisekia Pharmacioides. దీనిని కొందఱు కూరగజేయుదురు. దీని రసమును, కసాయ మును మూత్రకృచ్ఛ్రము, మూత్రాశ్మరి, మూల శంఖవ్యాధి వీనిని హరించి తేలికనిచ్చి అనులోమ వాతమును గల్గించును. కూర చలువజేయును.

**ఇసుకలో నుయ్యిత్రవ్వుటయుందు ఒడ్లు (అంచులు) కూలక మానవు**— ఆంధ్రలోకోక్తి.

**ఇసోథెరం** — ఇసోబార్ చూడుఁడు.

**ఇసోబార్, ఇసోహ్యెట్, ఇసోథెరం** (Isobar, Isohyet, Isotherm) — గాలి యొక్క ఒత్తిడి (Air pressure) గాలి వీచుట కెట్టి ప్రధానకారణమగునో, గాలి వీచుటకూడ వర్షమునకట్లె ప్రధానకారణముగాన నీమూటికి నవినాభావసంబంధము కలదు.

ఇసోబార్ అన సమానమైన వాతావరణపు టొత్తిడిగల తావులపై నుండిగీయంబడు లేక భావిం పఁబడు గీత. ఇది భూమిపై నున్నటుల భావింపఁ బడుచు పటములపై నిజముగనే గీయుదురు. ఇట్టి ఇసోబారులు కొన్ని వార్తాపత్రికలం దిక్కా లమునఁ గానఁగుచుండును. వాతావరణపు ఎక్కువ ఒత్తిడి, తక్కువఒత్తిడి గాలివీచుదెసలను (Wind direction) దెల్పెడిని.

ఇవి సముద్రపునీటిమట్టపు ఇసోబారులు; ఏలనన నివి బెరామీటరు రీడింగునుండి తెలియుంగాన ఆ తీసినతావు సముద్రపునీటిమట్టముపై నెంత ఎత్తుననుండునో దానికి వేయి అడుగుల కొక అంగుళముమేరకు తేడాను బెరామీటరు రీడింగు నకుం జేర్చి కల్పుటవలన నేర్పడునది.

ఈ బెరామీటరు రీడింగులు భూమియొక్క ఉత్తరగోళార్ధమునందుకన్న దక్షిణ గోళార్ధమునం దెక్కువ నిష్కర్షగ నుండునని వాతావరణ శాస్త్రజ్ఞులు తలంచుచున్నారు. భూమధ్యరేఖకుం దక్షిణమున Tropic of Capricorn హద్దునకు దక్షిణముగా నొక High pressure belt దీని ఒత్తిడి సముద్రముపై నధికముగను భూమిపై నచో నించుక తగ్గియునుండునని కనిపెట్టంబడినది.

పిదపం జెప్పవలసిన ఇసోహ్యెట్లు గీతలు వర్షపాతముందెల్పుతావులను పటములపై గీయం బడియు నుండుగీతలు. ఇవియు ఇసోబారీతలంబోలి అధికవర్షములు గురియు తావులను, అల్పవర్ష పాతస్థలములను వివరించెడిని. ఇవి సముద్ర తీరముతో సరిసమానము (Parallel) గా తరు చుండుననియు, సముద్రమువైపు వర్షాధిక్యమును భూమివైపు పోనుపోను క్రమముగవర్షముతక్కువ యుంగల్గియుండునని పరిశీలనలవలన తేలినది.

ఇంకను ఎత్తగు పర్వతములున్నచో నా పర్వత పజ్తియొక్క సముద్రపువైపు ప్రక్కను వర్షాధిక్యమును, అవ్వలిప్రక్కను తక్కువవర్షములును ధర్మములు.

ఇంకందక్కిన ఇసోథెరముగీతలు శీతోష్ణస్థితులంబట్టి గీయంబడునవి. ఇది నెలవారీ మీన్ టెంపరేచరుంబట్టి గీయాంబడుచుండును. శీతోష్ణస్థితులు Maximum అనియు Minimum గను రెండువిధములుగ దీయంబడి, వీని ఏవరేజి సముద్రపునీటిమట్టమునుండి ఆ తీయఁబడిన ప్రదేశమెంత ఎత్తుండునో దానికి నూరడుగులఎత్తున కొక డిగ్రీ (ఫార్హైట్ థెర్మామీటరు) ప్రాప్తికి నసలు రీడింగునకుం జేర్పంబడి ఆమొత్తము మేరకు స్థలనిర్ణయములో నర్పంబడి ఈగీతలు గీయంబడుచుండును. (వెదర్ఫోరుకేస్టు వ్రాయుట, బెరామీటరు రీడింగుచూడుఁడు. సముద్రపు నీటిమట్టము చూడుడు. ఫారిన్హైట్ థెర్మామీటరు శీతోష్ణములం గొలుచు యంత్రము చూడుఁడు).

**ఇసోమెరిడీస్** (Isomerides) — కెమిస్ట్రీ (రసాయశాస్త్రమున) "Same elements in same proportions to form different compounds" అని వివరించియున్నారు.

ఉదాహరణముగ Ethyl alcohol, Methyl అనంబడు రెంటికిని C2 H3 O అను Formula (ప్రమాణము) కలదు. ఐనను అవి రెండును వేర్వేఱు పదార్థములుగా చెప్పఁబడినవి. భేదము Atoms యొక్క భేదమగు ఏర్పాటు నందు కలదు. ఇట్టి వానికీపేరు వర్తించును. ఇట్టివి కార్బన్కాంపౌండ్సు నందు గాననగుచున్నవి.

**ఇసోమార్ఫస్** (Isomorphous) — ఒకేవిధమున నొకేలక్షణములతో ననేక Compounds అనఁగా Various Compounds of Various Elements Crystallising పరిస్థితిప్రదర్శనమునకీపేరిడఁబడినది. Arsenates and Phosphates of Sodium, Potassium and Ammonium ఒకేమోస్తరుగా Crystalline form నందును ఇవి మామ్మూలు పరిస్థితులందు Homogeneous mixed Crystals అగును.

**ఇసోహ్యేట్** — ఇసోబార్ చూడుఁడు.

**ఇస్థమస్ (భూసంధి)** (Isthmus) — భూసంధి. రెండు గొప్ప భూభాగముల నడుము నుండి వానింగలుపునట్టి వెడలుపు తక్కువగను, పొడవు ఎక్కువగనుండు భూప్రదేశమునకు ఇస్థమస్ అనిపేరు. (Land Portions చూడుఁడు).

**ఇస్పాహన్ పురము** (Ispahan) — ఆర్యులగు పారసీకులు ఆదిని దీనికి ఆస్పాదనమని పేరిడిరని తెలియుచున్నది. ఇటీవలి మహమ్మదీయులు దాని నిట్లు మార్చిరి. తా ఇరాన్ (టెహిరన్) నగరమునకు దక్షిణముగా ౨౦౦ మైళ్ల దూరమున ౫,౧౦౦ అడుగుల ఎతుగల పీఠభూమిపైనున్న పురము. ఇది షాఅబ్బాసు ప్రభుని రాజ్యకాలమున (క్రి. వె. ౧౫౮౬-౧౬౨౮) రాజధానివైభవముతో గొప్ప ఉచ్ఛ దశననుభవించుచు పదిలక్షల జనులకు నివాసమై యుండెను. సుందరప్రాసాదమయ మనిపించుకొనె నట. అందు నలువది స్తంభముల మేడ యనునది నేటికినిగలదు. ౧౭౨౨ లో కొంత పురము భగ్నమైనదందురు.

**ఇస్లామాబాదు** — తొల్లింటి అనంత నాగపురము. కాశ్మీరదేశము చూడుఁడు.

**ఇస్త్రీనమ్మా వాయన మంటే పుచ్చుకుంటినమ్మా వాయనమన్నట్లు**— ఆంధ్ర లోకోక్తి.

**ఇస్మైలీశాఖ మహమ్మదీయులు**— ఇక్కాలమున సుప్రసిద్ధుండైన హిస్ హైనెస్ ఆగాఖాన్‌గారి శాఖ ఇస్మైలీశాఖ యనంబడు చున్నది. వీరు పారశీకదేశస్థులవలెను, ఆంగ్లేయులవలెను గానవగుచుందురు. మహమ్మదు జగద్దేశికుని అల్లుండగు ఆలీమహాత్ముని సంతతి వార మనుచున్నారు. వీరికి ఖోజాశాఖవారనియు వాడుకనామము గలదని కొందఱనెదరు. ఇక్కాలమున నీశాఖమహమ్మదీయులకు ఆగాఖానుగారే అధిపతులట. ఈశాఖవారు భరతదేశమునందు కూడ కలరు. సింధుదేశమునం దున్నారని తెలిసెడిని. ఇప్పటి ఆగాఖానుగారు వారిపూర్వపరంపరయందు నలుబదిఎన్మిదవ వారట.

ఈసందర్భమున ఆగాఖాన్ బిరుదముంగూర్చి యించుక వివరింతుముగాక. ఇప్పటి ఆగాఖానుగారి పితామహుండు మహమ్మద్ హాసన్ అల్హుసేని గారు అప్పటి పారశీకభూపతి యగు ఫతేఆలీషా వలన మామూలు మేరకు శాఖాధిపతిగా నియమింపఁబడిరట. వీరి తండ్రిగా రగు షాఖలీలుల్లాగా, (శాఖాధిపతిగ) నుండినతరి ఇరాన్ దేశమునందలి యెజ్డుపురమున హత్యగావింపంబడిరట. దేశప్రభుం డగు ఫతేఆలీ (షా ఆఫ్ పరిశియా) గారు మహమ్మదు హాసన్ అల్ హుసేనీ గారికి తనసుత నిచ్చి పరిణయ మొనర్చిరట. వారికి బాల్యమునందు ముద్దుపేరుగ ఆగాఖాన్ అని వాడుకనామ ముండెడిదట. పిదప నాముద్దు పేరే తర్వాత వారికి బిరుదముగ వాడుకగా నుండెను.

**ఇహాముత్రార్థ ఫలభోగ విరాగ శాస్త్రము** — సాధన చతుష్టయము చూడుఁడు.

**ఇక్షుగంధ** — నీటి లేక నీరుగొబ్బి గాని గాలిమిడి చెట్టు గాని చూడుఁడు.

**ఇక్షునది** (Oxus, బక్షు, చక్షు) — దీనినిప్పుడు Oxus అనుచున్నారు. ఇది శాకద్వీపముగుండా ప్రవహించునదిగా విష్ణుపురాణము ౨, ౪ యందు ప్రశంసింపఁబడినది. ఇంకను కూర్మపురాణము ౨, ౩౯ యందు ఇక్షునది నర్మదానది కుపనదిగా చెప్పఁబడినది. బహుశః ఇది వేరు నదియై యుండును.

**ఇక్షుమతీనది** — దీనిని కాళిందీనది యనెదరు. (తూర్పు) కుమాన్ రోహిల్ఖండ్, కనూజమండలము వీనిగుండా ప్రవహించునది. దీనింగూర్చిన ప్రశంస రామాయణము అయోధ్య ౬౮ యందు కలదు.

**ఇక్షురస న్యాయము** (చెరుకు) — చెరుకురసము తీయగ మనోహరమైయుండుంగాని దానియందు తెట్టు (అనగా మలినము) కూడ నుండును. దానిని తీసివేయుచుండవలెను. ఏ సత్కార్యమునకైనను కొన్ని బాధకములుండకపోవు. వాని దప్పించుకొనుచుండవలెనని భావము.

**ఇక్ష్వాకుకులగోత్రము** — ఆర్య వైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్య గోత్రములు చూడుఁడు). ఇక్ష్వాకుకులగోత్రము ఏకాక్షేయగోత్రము (గిరి), సంస్కృత గోత్రము కుత్సస లేక కౌత్సస, కుత్సగణము, మహాతేజస్కర్షి, ఆపస్తంభసూత్రము, యజుశ్శాఖ, ప్రమాణగ్రంథము ధర్మసింధు నిర్ణయసింధు, సమానగోత్రము మహాతేజస్సస, భోగీశుఁడు దేవత, భార్యభోగాంబ, దండకారణ్యము తపస్థానము, భోగసరస్సు తటాకము, జపములక్ష, దీపములు, క్షేత్రసంఖ్య 23, ఏమఁగు గుఱ్ఱము దానము, మంకెనపువ్వు, చెరకు, తామర, వర్జనీయములు.

**ఇక్ష్వాకులు లేక ఇక్ష్వాకువంశ నృపతులు** — వీరు ఆంధ్రదేశభాగముల నేలిన నృపతులు.

**ఇక్ష్వాకుశాఖక్షత్రియులు**— క్షత్రియ కులము చూడుఁడు.

**ఈకంటికీకను రెప్ప లుదూరవా?**- ఆంధ్రలోకోక్తి.

**ఈక్వినోక్సు** (Equinoxes) — ఇవి సమకాలస్థానములు రెండు. లాటిన్ భాషయందు Equns అనిన సమానమనియు Nox అనిన రాత్రి యనియు నర్థముగాన పగలు రాత్రియుఁగూడ సమానముగ పండ్రెండు గంటలు లేక ముప్పది గడియలు కాలము ఏదినమందు సంభవించునో ఆదినములకు ఈక్వినోక్సు (Equinoxes) అని పేరు. (అయనములు చూడుఁడు)




వేసవికాలమునకు శీతకాలమునకు నడుమను సెప్టెంబరు ౨౨ తేదీ ప్రాంతమునను, శీతకాలమునకు వేసవికాలమునకు నడుమను మార్చి ౨౨ తేదీ ప్రాంతమునను సమకాల దినములు సంభవించును. ఇట్టితరి Ecliptic రేఖలు భూమధ్య రేఖను దాటి (సంధించు) తావునకుపైగా సూర్యుఁడగుపడును. మఱియు నట్టితరిసూర్యుని క్రాంతి ఉత్తర దక్షిణధృవములకు సమముగాఁగూడ నాకేసాగి గన్పించెడిని. వీనికి వెర్నల్ ఈక్వినోక్సు (Vernal Equinox) అనియు ఆటమ్నల్ ఈక్వినోక్సు (Autumnal Equinox) అనియుం బేర్లు. ఇది భూమధ్య రేఖను సూర్యుఁడు దాటుటయని చెప్పంబడినది.

**ఈక్విటబుల్ మార్టిగేజి** - వాణిజ్య సంబంధ పరిభాషాపదము. Equitable mortgage- ఒకవిధమగు తనఖా (కుదువ) వ్యవహారము. సర్వసాధారణముగ కుదువయందు తనఖా ఆస్తి అప్పిచ్చినవానికి పద్ధతులమేరకు హక్కుగ కొంతకాలము వర్తించును. కాని ఇందట్లుకాదు. Deeds, Tittle deedsకుదువ, Depositచేసిన గాని, ఎగ్రిమెంటు వ్రాసిగాని ఋణము తీసికొనిన యీ పేరంబరిగెడిని. ఇందు అప్పిచ్చినవానికి Temporary హక్కు కానేరదు.

**ఈక్వేటరు గీత** — భూమధ్య రేఖ చూడుఁడు.

**ఈక్వేటోరియల్ కర్రెంట్సు** — Equatorial currents- భూమధ్యరేఖ (Equator) కిరుదెసలనుండి బర్వెడు సముద్ర జల ప్రవాహములు. దీనింగూర్చి సముద్ర ప్రవాహములు చూడుఁడు.

**ఈక్వేటోరియల్ కామ్సు**— భూమధ్య రేఖ (ఈక్వేటరు) కుత్తరమున పది లేక పండ్రెండు డిగ్రీల దూరపు పరిసరములు ఉత్తరాయణపు వేసవి కాలముననును, భూమధ్యరేఖకు దక్షిణ పరిసరముల దక్షిణాయనపు వేసవి కాలము నను భూగోళ శాస్త్రమున ఈక్వేటోరియల్ కామ్సు అనుపేరఁ బరగు తావులని చెప్పంబడి యున్నది. ఈ స్థలముల దెసకు ట్రేడ్విండ్సు వీచెడిని. అక్కాలములం దిచటి వేడిగాలి ఆకాశ మునకు చల్లగాలి వలన నెట్టంబడుచుండును. ఈప్రదేశము అట్లాంటిక్కు మహాసముద్రమున డోల్డ్రిమ్సు అనంబడుచు గొప్ప వర్షములకు తావై యుండును. ఇందు ఓడల కవసరమగు నంత గాలి వీవక Depressing effect కల్గి యుండుట, తొల్లింట నావికు లీతావులకుపో వెర చుచుండిరట. మఱియు నిట సంవత్సరము పొడవు నను. వేడి యధికమట.

ఇట్టి పరిస్థితి చెటుబాగుగా పెరుగుట కను కూలము గాన భూమియం దీప్రదేశము తగులు జాడలందు భూమిజుట్టు ఈప్రదేశముల నరణ్యము లుండెడిని.

**ఈక్వెడోర్ ప్రజాప్రభుత్వదేశము** (Equador republic) — ఇది దక్షిణ అమెరికా యందున్న రాష్ట్రము (దక్షిణ అమెరికా చూడుఁడు). ఈక్వేటర్ (భూమధ్యరేఖ) పై నుంట స్వదేశభాషయందు ఆపేరననే బరగు చున్నది. ఉత్తరకొలంబియా పశ్చిమమున పసిఫిక్కుమహాసముద్రము, దక్షిణమున పెరూరాష్ట్రము ను ఎల్లలు. ౧,౨౦,౦౦౦ చతురపుమైళ్ల వైశాల్యము కలది. Galapagos ద్వీపము లీదేశము నకుం జెందినవి. పశ్చిమమున ఏండీస్‌పర్వత పజ్తులు రెండు వరుసలుగ నీరాష్ట్రమున గలవు. మధ్య గొప్ప లోవలుకలవు. తూర్పువరుసయందే లోకప్రసిద్ధమైన కోటోపాక్సి అగ్నిశిఖరమున్నది. ఇంకను అటనే పిచించాశిఖరము, చింబోరాజో శిఖరమును కొంచెము తక్కువగా నట్టివే. ఈక్వేటరురేఖపైనున్న క్వైటోపురము ప్రభుత్వ కార్య స్థానము, ౯౫౦౦ అ. ఎత్తుగల లోవలోనున్నది. గువాయాక్విల్పురము రేవుస్థలము. కోకో విస్తారము దొరకు దేశము. గువాయాక్విల్ పురమంతయు వెదురుబొంగులచే నిర్మింపఁబడినది. ఏలనన భూకంపము లిట మెండుగ సంభవించుచుండును. లోపల తోలు, కుట్టంబడుచుండును. రాత్రి యిండ్లు ఇటుకయిండ్లు నిలువజాలవు.

**ఈక్వేషన్ ఆఫ్ టైం** (Equation of time) — కాలవిభజనము చూడుఁడు.

**ఈక్వేషన్ లేక ఈక్వియేషన్ ఆఫ్ పేమెంట్సు** — (వాణిజ్యసంబంధ పరిభాషా పదము).Equation of Payments. వేర్వేఱు వాయిదాలలో సొమ్ము చెల్లింపఁబడుచుండుటకు మాఱుగ అంతకు నొకేసారిగ చెల్లించుటకగు మొత్తమును లెక్కించుటకు లెక్కపద్ధతి.

**ఈఁగ ఎక్కడ వ్రాలవలెనో అక్కడనే వ్రాలును** — ఆంధ్రలోకోక్తి.

**ఈఁగలు** — ఈఁగలు ఇంటింట పగలు వాలుచుండుట నందరెరిఁగినదే. ఇది బాధకర మగు జంతువులలో నొకటి. ఎన్నిచోట్లనో వ్రాలి యుటకాళ్లకంటుకొనినవానితో మరియొకవస్తువుపై

వ్రాలిన దోషపదార్థ మంటుచుండుట కలరా, మశూచికము, ఆటలమ్మ, వేపపువ్వు, కొన్ని జాతుల విషపుపుండ్ల దోషములు మొదలగునవి ఒకతావునుండి వేఱొకతావునకు వ్యాపించెడిని. భరతదేశమున ఆషాఢ, శ్రావణ మాసములందు ఇవి అధికసంఖ్యాకములుగ పెరిగి వృద్ధిబొంది మనుష్యులకు చికాకుం గల్గునటులను, రోగములు వ్యాపించునటులను బాధకరములై యుండును. ఈఁగలందు అనేక జాతులు కలవు. కొన్ని చాల పెద్దవిగ పెరుగునవి. వానికిం బెద్దయీఁగలని పేరు. కొన్ని సర్వసాధారణముగ గనృడుచుండు మధ్యరకపు ఈఁగలు చాల అధికసంఖ్యాకములుగ నుండునవి. మఱియొక జాతి ఈఁగలు చాలచిన్నవి. ఆఫ్రికాఖండమందలి కొన్ని దేశములందు టిట్సీ అను ఈఁగలు కలవు. అవి పసువుల పైంబడి వాని రక్తముం బీల్చి వేయుటవలనను, వీనియందలి విషదోషము పసువులందు ప్రవేశించుటవలనను అవి చనిపోవును. ఇటుల పశునష్టము వాటిల్లుచుండును. పసువులే కాక మనుష్యులు కూడ నిట్టి ఈఁగలు కరచుట వలన మరణింతురట. పెద్దయీఁగలందు తళతళ మెరయు ఊదారంగువంటి రంగులుగల ఈఁగలుండుట మిఠాయిదుకాణములందు గాననగుచుండును. ఇంకను తేనెటీగలు చెట్లయందు తేనెం జేర్చి తేనెపట్టుపెట్టును. కొన్ని ఈగలు పుట్టలయందు పట్టుంబెట్టి పుట్టతేనెం గూర్చుచున్నవి. ఐరోపా దేశములందు, అమెరికా దేశములందు తేనెకై తేనెటీగలం బెంచుసంస్థలు కలవు.

కందిరీగలు మనుష్యులంగుట్టి బాధ కలుగ జేయునవి జోరీగలనంబడునవి పసువులంబట్టుకుని వానిరక్తముంద్రావుచు వదలక వానింబాధించుచుండు దుష్టజాతి యొకటి కలదు గాని, వీనికాటునందు విషములేదందురు. ఇట్టిపనినే చేయుచు పసువులం బాధించు సమ్మోటయీఁగ యనంబడు వేఱొకజాతిఈఁగ పెద్దది కలదు. తూనీగలనునవి వర్షములు గురియుముందు వర్షసూచనం దెల్పు నటుల ఆకాశమున నెగురుచుండునవి. ఇవి నిర్బాధకములు.

## ఈచేతఁజేసి ఆచేత అనుభవించు నట్లు — ఆంధ్రలోకో.

## ఈజిప్టు దేశపు పది ప్లేగుల శాపము

**ఈజిప్టు దేశపు పది ప్లేగుల శాపము** — ఇశ్రాయేలీయులనఁబడు ప్రజలు ఈజిప్టుదేశమున ప్రభువగు ఫరో గారిచే నిర్బంధింపఁబడినకతన పరమేశ్వరుఁడగు యహోవా (జహోవా చూడుఁడు) దేశమునందు పది ప్లేగు (ఆపద) లు కల్గునటుల శపించెనని బైబిలు నందు కలదు. ౧. నైలు నదీజలములు రక్తమగుట, ౨. కప్పలు దేశమునం దధికమగుట, 3. ఈఁగలు దేశమునం దధికమగుట, ౪. పసువుల రోగములు ప్రబలుట, ౫. గొప్ప కురుపులు ప్రాణులశరీరములం దగులుట, ౬. ఉరుములు, పిడుగులు అధికముగాపడుట, ౭. మిడతలదండ్లు చేలందిని వేయుట, ౮. చీఁకటి గాఢమగుట, ౯. ప్రథమసంతానములు నశించుట, ౧౦. పసువుల తొలియీఁత పెయ్యలు చనిపోవుట.

## ఈజిప్టుదేశపు పిరమిడ్లు

**ఈజిప్టుదేశపు పిరమిడ్లు** — (Pyramids of Egypt) ఇది అనేక పరిమాణములుగ పెద్దవి చిన్నవి డెబ్బది కలవు. ఈశబ్దమునకు ఉన్నత మని యర్థమట. ఈజిప్టుదేశము ఇప్పటిరాజధానియగు కైరోనగరము నుండి కొంతదూరమున గిజేయను గ్రామపరిసరముల కడుదూరము వ్యాపించియున్నవి. అటకుం బదిమైళ్లదూరమున నున్న కొండలనుండి రాలం ద్రవ్వి వేల్వేఱు కాలములందు వీని నిర్మించిరి. ఇందు పెద్దదియగుదానిని నిర్మించుట కిరువదిసంవత్సరములు పట్టెనట. అది నలుపలకల చౌకముగ

ఒక్కొక ప్రక్క ౭౫౩ అడుగులును, ఎత్తు ౪౮౩ అడుగులును కల్గియున్నది. అడుగుమట్టము పదునొకండుఎకరముల ప్రదేశమందురు. ఇందలిరాళ్లు కొన్ని ౩౦ అడుగుల పొడవు, ౪ అడుగుల వెడలుపు, ౩ అడుగుల దళసరిం గల్గినవి యున్నవి. ఇందులోని మధ్యగదియందు ఒక ఫరోమృతకళేబగము నుంచుట కీపిరమిడు నిర్మింపఁబడినది. అది ౪౯ అడుగుల పొడవు, పదునారడుగుల వెడలుపు, ౨౩ అడుగుల ఎత్తు ఒకేరాతియందు తొలువఁబడియుంట యాశ్చర్యమగును. ఇది మనుష్యనిర్మితము కాదనిపించును. వెలుపల ఆదికాలమును నునుపుచేయఁబడిన శిలాఫలకము లమర్పఁబడినటు లచ్చుటచ్చుట యానవాళ్లు కలవు. వీనిపై నెక్కి నక్షత్రముల గమనములను పరిశీలించుచుండిరట. గిజేగ్రామముకడ నారును; ఆబూశీర్ గ్రామముకడ నైదును, సక్కారాగ్రామముకడ పదునొకండును, దషూరుగ్రామముకడ నైదును పిరామిడ్లు లెక్కింపనగును. తక్కినవి చెదరియున్నవి. ప్రపంచములో గొప్ప కట్టడములని వీనికి ప్రతీతి కలదు.

**ఈజిప్టు (ఐగుప్తు) దేశము** — దీనిని బైబిలునందు గోషెనుభూమి (Land of Goshen) అని చెప్పియున్నారు. ఆఫ్రికాఖండమునందు ఈశాన్యదిశనున్న రాష్ట్రము. సహారా ఎడారికి తూర్పుగా నున్నది. వైశాల్యము ౪,౦౦,౦౦౦ చతురపుమైళ్లు. ఈదేశమును శాస్త్రజ్ఞులు Gift of the Nile అని యున్నారు. ఆదికాలమున సముద్రము దేశమంతటను ఇంచుమించుగా నుండెనట. ఏలనన, ఇప్పటికొండలపై దొరకు సముద్రపుగుల్లలు దీనికి నిదర్శనము. రానురాను సముద్రము వెనుకకు పోవుచుంటయు, ఏటేట నదీప్రవాహమున కొట్టికొనివచ్చిన బురద నది కిరుదెసలను జేరుచుంటయు జరుగుచుండెను. ఇట్లు జరగిజరగి ఈదేశ మేర్పడుచు కడకు విసనకఱ్ఱవలె మధ్యధరాసముద్రములోనికి లంకపెరుగ నటుల నైలునది, రోసెట్టా, డామియెట్టా అను పేర్లుగల రెండుశాఖలుగ చీలి, ఇరుప్రక్కలను లంకఁ బెంచుచు ముందునకు నడచి ఆపేరనే వహించుచున్న పురములకడ మధ్యధరాసముద్రమునం జేరుచున్నది. ఇంక నేకారణముననో ముందునకు లంకను బెంచుటకు నైలునదికి దుస్సరమై యాగిపోయెను. ఇది ఈజిప్టు ఏర్పడిన వృత్తాంతము. నైలునదిచేసిన కార్యము- ఆదేశభూమి యంతయు వర్షములులేని ప్రదేశమగుట, నదీజలములచే భూమిని దడిపి సారవంతముగఁ జేయుటకు ఆనకట్టలను, డాములను, బారేజిపనులను నదియందు కట్టి నిర్బంధించిన నీటిని నిలపియు, కాల్వలం ద్రవ్వియు, జలనిలయములు (రిజర్వాయర్) నేర్పరిచి త్రవ్వించియు, కట్టించియు, పొలములను దడిపి పెరులం బెంచుచున్నారు. ఈ జలాశయములందు క్రీ. పూ. ౪౪౦౦ ప్రాంతములందు త్రవ్వంబడినట్లు తలంపంబడుచున్న యూసూఫ్‌బహారనుకాలువ ప్రాచీనమైనది. అది అప్పటి ఫరోవద్ద మంత్రిగనుండిన జోసెఫ్‌వల్ల త్రవ్వింపంబడి ఫయ్యూం పురమునకు నీటివసతిం గల్గించునది. ఈమహానుభావుడే స్వప్నఫలములందెల్పు జోసెపు ఇశ్రాయేలు కుమారుడు.

ఈజిప్టుదేశము నైలునది కిరుదెసల నుండు ఫలవంతమగు భూములును, ఆప్రాంతపుభూములనఁదగును. నైలునదికి తొల్లింటిపేరు నీలానది. ఇప్పటిభాషలందు నైలుగ మారినది. ఈ నదియొక్క క్రిందిభాగమును సముద్రముకడ విసనకఱ్ఱరూపమున నేర్పడిన డెల్టాప్రదేశము నని చెప్పఁబడినది. ఇది నీలానది యొక్క రెండుశాఖలగు రోసెట్టా, డామియెట్టానదుల నడుమ నున్న లంక. నైలునదిలోవ ఉత్తరదక్షిణములకు వ్యాపించియున్నదాని కిరుదెసలందు తూర్పుపడమర

లందు పొడవునను రెండుపర్వతముల వరుసలు వ్యాపించియున్నవి. అవి కొన్నితావులం దెత్తైన పర్వతాకారములుగను, కొన్నితావులందు కేవలము పొట్టివియై ఉన్నతప్రదేశములవలెను గానవచ్చుచుండును. ఎత్తైన తావులందు ౨,౦౦౦ అడుగుల ఎత్తుకొండలుగ నున్నవి. దిగువభాగమున నీలానదియం దొక యుపనదియైనను జేరుటలేదు. వ్యవసాయములకుగాను ఇరుదెసలనుండి నదీప్రవాహమునుండి తీసివేయుజలము రానురాను తరగిపోవుచు, సముద్రముం జేరుచోట నీరు కేవలము తగ్గిపోవుట గాననగును. నది ఏటేట వరదలు కల్గినతరి, ఇరుదెసలను పెద్దపెద్ద కాలువలు, జలనిలయములు నింపఁబడి సంవత్సరము పొడవున నుపయోగమునకు నిల్వ చేసికొనఁబడుచుండును. తక్కిన కాలములందు షాడోఫ్ అనఁబడు చక్రములు, నీటిపంపులు, ఏతాములు లెక్కకు మితిమీరి నీటిని పై వ్యవసాయపుఁ బొలములకుం దోడుచుంట ఈదేశమున నిత్యదృశ్యమే.

ఈదేశమున వర్షములు కురియవు. భూమి సారవంతమై నీరందినచోట మిగుల ఫలవంతముగ నున్నది. వేసవియందు వేడి యధికము గాని తక్కిన కాలమున మనోహరమై యుండును. రాత్రులందు దట్టమైన మంచు విస్తారము పడుచుండును. ఇది పంటల కిట చాల నుపయోగించుచున్నది. జొన్నలు, మొక్క జొన్నలు, గోధుమలు, చెరకు, ప్రత్తి, నీలిమందు, పొగాకు, ఉల్లిపాయలు, గుమ్మడికాయలు విస్తారము పైరు చేయఁబడుచున్నవి. నారింజతోటలు, ఖర్జూరపు తోటలు విస్తారము కలవు. అరటితోటలును అచ్చటచ్చట వేయఁబడుచున్నవి.

ప్రజలు ఆదిమనివాసులగు కోప్టుజాతివారు; ఇంకను అరబ్బుసంతతివారు, తురుష్కులు, ఐరోపాదేశస్థులు, దక్షిణసీమలవారగు నీగ్రోలునై యున్నారు. అరబ్బీభాష వాడఁబడుచున్నభాష. వ్యవసాయముచేయుచుండు రైతులను ఫెల్లా (బహువచనము ఫెల్లాహిన్) అనుచుందురు. బటానీపంట కొన్నిప్రదేశముల నపరిమితముగ పైరుచేయుచున్నారు. ప్రత్తి, బటానీలు, గోధుమలు, పంచదార, విదేశముల కెగుమతిచేయఁబడుచున్నవి. ఉల్లియుంగొంచెముగ నెగుమతి చేయుటకలదు. ప్రభుత్వము కాన్‌స్టిట్యూషనల్ మోనార్కీ (Constitutional Monarchy) పద్ధతి. భూపతికి ఖడీవని బిరుదనామము. పార్లమెంటు కలదు.

ఈజిప్టు పూర్వచరిత్రము వింతగొల్పును. ఫరోల కాలమున నిది చాల బలవంతముగు ప్రభుత్వమైయుండెను. పిరమిడులు, స్ఫినిక్సు కొన్ని ప్రాతదేవాలయములు వారినాఁటివేయై యున్నవి. ఆ కాలమునసే ఈజిప్టు నాగరికత నందినదేశమై విద్యావంతమైయుండెను. కడపటి ఫరో క్రీ. పూ. ౩౦ సంవత్సరములవఱకుండెనని పోల్చఁబడినది. క్రీ. పూ. ఐదువేల సంవత్సరములకు పైగా ఫరోభూపతుల పాలన ప్రారంభమని చెప్పవచ్చును. క్రీ. పూ. ౫౨౫ లో పారశీకచక్రవర్తిగనుండిన కాంబైసేసు ఫరోలను జయించి రాజ్యమాక్రమించెను. క్రీ. పూ. ౩౨౨ లో అలగ్జాండరు దిగ్రేటునకీరాజ్యము వశమయ్యెను. ఆయన మరణానంతరము ఆయన సేనానియగు టోలెమీ (Ptolemy) వశమై చిన్నరాజ్యములుగ పిదప విభాగమయ్యెను. క్లియోపాత్రారాజ్ఞి ఆయన సంతతియందు కడపటిది. ఆమె క్రీ. పూ. ౩౦ లో చనిపోయెను. పిదప ఈజిప్టుదేశము రోమనుచక్రవర్తుల వశమాయెను. వారినుండి సరాసినుజాతి మహమ్మదీయుడగు కేలిఫు ఓమార్ వశమై క్రీ. వె. ౬౪౦ మొదలు ౧౫౧౭ వఱకు కొంచెమెచ్చుతక్కువగ నుండి, పిదప తురుష్కసుల్తానుల వశమై

వారినుండి విముక్తి నిటీవలఁబడసి, కొంతకాలము బ్రిటిషువారి రక్షణకు లోఁబడి, ఇప్పుడొకఖడీవు పాలనమున స్వతంత్రరాజ్యమై యున్నది. ప్రభువు మహమ్మదాలీ సంతతివాఁడు. ప్రజలందు సర్వసాధారణముగ మహమ్మదీయమతమును ఆదిమనివాసులగు కోప్టులందొక విధమగు క్రైస్తవ మతమును వ్యాపించియున్నవి.

తొల్లింటి ఫరోలకాలపుఁబనులలో పిరమిడ్సు గొప్పవి. (ప్రపంచమందలి యాదికాలపు వింతలు, మధ్యకాలపువింతలు చూడుఁడు). ఆ కాలపు తీబీసునగరము (అప్పరు ఈజిప్టు) శతద్వారనగరమై యుండెను. స్ఫినిక్సు మనుష్య స్త్రీ ముఖముతో సింహశరీరముం గలదియై యున్నది. చనిపోయినవారి దేహములకేదియో పూసి, కుళ్లకుండఁజేసి మమ్మీలంజేయుచుండెడి వారు. ఆకాలపు పీనుగుమమ్మీ లెన్నియో పిదప బయలుపడినవి. అరబ్బులు వీనిందీసికొని పోయి పొలముల కెరువుగఁ జేసికొనినను ఇంకను కలవు.

కైరోనగరమీ దేశమునకు రాజధాని. దీనికి తొల్లింట ఫేరాయనియు, అల్కవారా (జయస్థలము), ఉముద్దున్యా(భూమాత)యనియెన్నియో పేర్లు వాడుకనందినవి కలవు. ఇది క్రీ. వె. ౯౭౦ లో నిర్మింపఁబడినది. రాజనగరు సల్లాదీన్ భూపతి నిర్మించినది. ఉన్నతస్థానమునగలదు. అది క్రీ వె. ౧౧౭౦ లో నిర్మింపఁబడినది. క్రీ. వె. ౧౨౫౦ మొదలు ౧౫౧౭ వఱకు ఈరాజ్యమును మహమ్మదీయులలో మేమ్లూక్ తెగ మహమ్మదీయులగు సుల్తానులు పాలించిరి. ఇందారు లక్షల జనులు వసించుచున్నారు.

మధ్యధరాసముద్రముపైనున్న అలెగ్జాండ్రియాపురము రేవుపట్టణము. ఇది గొప్ప [illegible] స్థలము. అలెగ్జాండరు ద్విగేటుచే నిర్మింపఁబడినది. సూయజ్ పట్టణము: సూయజుకాలువకు తనపేరిచ్చిన రేవుపట్టణము. ఇది ఎఱ్ఱసముద్రముకడ నున్నది. సూయజుకాలువ పోర్టుసయ్యదు నుండి ఇటకు ౮౭ మైళ్లపొడవున త్రవ్వఁబడినది. అదిమధ్యధరా సముద్రమును, ఎఱ్ఱ సముద్రమును కల్పుచున్నది. ఈకాలువ పెద్దబిట్టరులేకు, చిన్నబిట్టరులేకు మంజెల్లాసరస్సులగుండా నడచును. కాలువ తీరమున మధ్యగా ఇస్మేలియా యను రేవుపట్టణము కలదు. రోసెట్టా, డామియెట్టా అను పేరుగల రేవుపట్టణములు ఆపేర్లుగల నీలనదీ శాఖలు సముద్రగామియగు తావులందు గల చిన్న రేవులు.

అప్పరీజిప్టునందు సియూటు ప్రధానపురము. మొదటి కేటరాక్టుకడనున్న అసౌఆన్ పురము కడ గొప్ప నల్లశానమురాతి గనులున్నవి. కైరోనుండి ౮౦౦ మైళ్ల దూరమున రెండవ కేటరాక్టుకడనున్న వాడీఅఫాపురము ఈజిప్టు దేశపు దక్షిణముకడనున్న పట్టణము. రెడ్సీ తీరమున కొస్సీర్ పురమును, సుఆకిన్ పురమును ఒకపాటి రేవుపట్టణములుగ నున్నవి.

## ఈజిప్టు ప్రత్తి వ్యవసాయము —

ఈజిప్టుదేశమునుండి తేబడి భరతదేశమునందు కొద్దిగనో గొప్పగనో నిలచియున్న ప్రత్తిజాతులు అబ్బాసి, అష్మోని, అఫీఫి, సుల్తానీ, యమ్నోదీచ్ అనునవియై యున్నవి. ఇందు కొంతగా నిలచి సరిగా వర్ధిల్లుచున్న జాతి అబ్బాసి యొకటియె యని చెప్పనగును. వీనిని నాటుతరి పనునించుక యధికమైనచో వేళ్లు కుళ్లి చచ్చిపోవును. చెమ్మ తప్ప యెక్కువ తడియె పనికిరాదు. విత్తనమేపాటి పాతగిలినను మొలవనే మొలవదు. అట్టి గింజలం బగులఁగొట్టి చూచిన లోన పుచ్చిపోయి యుండును. కృష్ణాజిల్లా వ్యవసాయసంఘపు కార్యదర్శిగ నుండిన వీరరాఘవాచార్యులుగారొకతరి,

ఈజిప్టువి_త్తనములు, ఆజిల్లాభూములకు సరిపోవని నుడివియుండిరి. కాని చెట్లు ఎదిగినపైని వారమున కొకసారి నీరు కట్టుచుండవలయును. ఇంకను దీనిని చూడవలసియే యున్నది.

**ఈజ్ మెంటు హక్కు** — (వాణిజ్య సంబంధపరిభాషాపదము). Easement right. ఒకరి ఆస్తిపై నింకొకరికిగల హక్కునకు ఈజ్ మెంటు హక్కు అనిపెదరు. ఇది సర్వసాధారణముగ నొకరి స్థలములోనుండి ఇంకొకరు నడచు మార్గము, హక్కుగా నుండెడిని, దీనికి సనాతనముగ ఆచరణయందుండుట మూలకారణముగ నుండెడిని.

**ఈటెలు, బల్లెములు**— బల్లెములు చూడుఁడు

**ఈడరుడౌన్** (హంసతూలిక)—ఫారోయీ ద్వీపములు చూడుఁడు.

**ఈడుపుకాళ్లు, ఏడుపు మొగము**- దుర్లక్షణములందెల్ల సామెత. (ఆంధ్రలోకోక్తి).

**ఈతకల్లు ముందర యిల్లాలైనా పనికిరాదు** — త్రాగుబోతుకు భార్యయందు కూడ నక్కరయుండదని భావము. (ఆంధ్ర లోకోక్తి).

**ఈతకుమించిన లోతు, గోచికి మించిన లాతియుండదు** — (లాతి = తక్కువ). ఆంధ్రలోకోక్తి.

**ఈతకొట్టు నేర్పు** — సాధారణముగ మనుష్యుని ఊపిరితిత్తులు (Lungs) నిండి గాలి యుండిన నీటంబడుచో తేలగలఁడు. కాని శరీరపు బరువు నిరుదెసలను సమముగ నుంచుకొను నేర్పు కల్గియుండనిచో (ఈతరానిచో) వెచ్చుతక్కువయై జాగ్రతందప్పి నీటనొకతరి మున్గును. ఇత్తరి కొంతనీరు బలాత్కారముగ విధిలేక త్రావును. త్రావిన నీరూపిరితిత్తులలోనికిం జేరి నీటం దేలతగిన పరిస్థితిని కొంతతగ్గించును. కొట్టుకొనుచు, మఱియొకతరియు, ఇంకొకతరియు, బహుశః నాల్గవతరియుంగూడ పైకితేలియు జాగ్రతం దప్పుచు నిస్సహాయత చేదోడువాదోడుగనుంట తిరుగమున్గుచు, నీరుద్రావుచు, ఊపిరితిత్తులను నీటితోనింపుకొనుచు ఎట్టకేలకు పైకితేలలేక నీట నాశరీరముండిపోవును. నీటనాని రెండుమూడు రోజులలో శరీరమంతయునుబ్బి నీటికన్న జులకనయై పైకిందేలును. ఈయపాయపరిస్థితులనుండి తప్పించుకొనుటయే ఈతనేర్పు. పశువులలో పెక్కు జంతువులకు ఈతకొట్టునేర్పునై సర్గికముగ శరీరత్వః కల్గియుండుంగాన నవి విపరీతపరిస్థితులలోఁగాని నీటంబడి ఈదనేరక చనిపోవుట సంభవింపదు. (ఈతకొట్టువిద్య చూడుఁడు).

**ఈతకొట్టు విద్య** (ఈదుట) — నీటి యందుఁగాని, నీటిపైఁగాని తేలుచుకదలుట కీత కొట్టుటయని పేరు. ఈదుటయందు గాలితిత్తులు మొదలగు కృతకసాహాయ్యములుండుట కాదని చెప్పఁబడినది. ఈదుట ప్రాకుటంబోలిన క్రియ యని తేలుచున్నది. పాశ్చాత్యులు Heart Stroke అనియు నొకవిధానముం జెప్పిరి. ఈదుట భరతదేశ విధానమున నిలువుటీత (నిలచుండి ఈదుట), పడకటీత (పరుండిఈదుట) యని ద్వివిధములు. ఈపడకటీత బోర్లపరుండియు, వెల్లకిలపరుండియుఁ గూడ నీదుదురు. ఊపిరి బిగియఁబట్టుటయో లేక కొంతవఱకైనను గాలిని లోన నిర్బంధించుచుండుటతో నూపిరి మెల్లగ విడచుచుండుటయో ఈతయందు శరీరముం దేల గొట్టుచుండుటకు సాహాయ్యపడును. పాశ్చాత్య విధానమున Breast Stroke అనుదానియందు కాలుచేతుల కదలిక ముఖ్యము. ఒకతరి కదలి తిరుగ నారంభించుట మధ్యకాలమున ఊపిరి

దీసికొనుచుండవలెనని చెప్పఁబడినది. చేతులతో కాళ్లును సమకాలముననే కదలవలయునని చెప్పఁబడినది. చేతుల నిరుపార్శ్వములకుం జాచునప్పుడు కాళ్లును చాచవలయును. నీటియందు మున్గియుండుతఱితప్ప, తేలి మునుఁకుఁజనుతఱి తలయెత్తియే యుంచవలసియుండును. ఇంకను పాశ్చాత్యవిధానమున Back Stroke అనియు, Overturn Stroke అనియుం గూడ చెప్పఁబడినవి కలవట. (ఈతకొట్టునేర్పు చూడుఁడు).

**ఈతగింజ నిచ్చి తాటిగింజ లాగేవాఁడు**— ఇచట రెండును నిరర్థకములే యైనను ఈతగింజ చిన్నదియనియు తాటిటెంక పెద్దదియనియు భావము. ఆంధ్రలోకోక్తి.

**ఈతచెట్టు** — లా. Phoenix sylvestris. Eng. Wild Date. పండ్లు వగరు, తీపి గల్గి యుండును. చలువ, ధాతుపుష్టి, కొద్దిగ మేహశాంతి చేయును, మదముం బుట్టించును. వాతము, పైత్యము, రక్తపైత్యము, తాపము, దాహము, క్షయలను హరించి గురుత్వముగనుండును. కడుపులో ఉబ్బరము గల్గించును. పుష్పములరసము లోపలికిచ్చిన, మేహపైత్యము, రక్తపైత్యము, రక్తాతిసారము హరించునని చెప్పఁబడినది. మఱియు ఋతురక్తస్రావము తగ్గుననియు, నీళ్లవిరేచనములు, రక్తవిరేచనములు శమించుననియు చెప్పఁబడినది. ఇంకను నోటిపూత శమించుననియుం గూడ చెప్పఁబడినది. ఈతకల్లు కాకదగ్గు, పైత్యము, మేహవాతపు నొప్పులు శమించునంతటి చలువజేయును. ఈత సారాయము తీవ్రమైన కఫరోగమునడఁచి జ్వరము మూలవ్యాధుల నడఁచును. నీళ్లుకల్పిన తేనెయు, వసకషాయమును, విరుగుడు లని చెప్పబడినది. ఈతచెట్ల జాతి యందధమజాతియగు చిట్టీతచెట్టు జాతి కలదు. దీనికి సంస్కృతపు పేరు ప్రత్యేకముగ గానరాదు. కొందఱు పరూషక, పరాపరయని తెల్పిరిగాని, ఇవి పాలాస్త్రిచెట్టు పేర్లు. దీనిపండ్లు వాతపైత్యముల నివారించుననియు, లేత కాయలు వాతమును హరించి యించుక పైత్యము గల్గించుననియుఁ జెప్పుదురు.

**ఈతచెట్టుక్రింద పాలు ద్రావినా కల్లుత్రాగెనని యందురు** — ఆంధ్రలోకోక్తి.

**ఈత చేతనైతే ఎంతలోతైనా ఒకటే** — ఆంధ్రలోకోక్తి.

**ఈతముల్లు విరగద్రొక్కే కాలము**- (యౌవనమని భావము). ఆంధ్రలోకోక్తి.

**ఈతిబాధలు ౬** — ౧. అతివృష్టి- వర్షాధిక్యమువలన గల్గుబాధ. ౨. అనావృష్టి- వర్షములు లేకుండుటచేఁ గల్గుబాధ. ౩. ఎలుకలవలన గల్గుబాధ. ౪. మిడుతలు- వరిచేలను కొరికివేసి నాశన మొనర్చునవి. ౫. చిలుకలు- తోటలలోని ఫలములను కొరికి పాడుచేయును. ౬. సన్నిహితరాజులు- ప్రభువులకు సమీపమున నుండుట బాధకరముగ నుండెడిని.

**ఈథరు** (Ether) — హైడ్రోజెనుగాలియు హీలియమ్ (Hydrogen and Helium) కలిసి ముఖ్యముగ నీథరగునని పరిశీలకు లనెదరు. ఇది ఆకాశమునుండి భూమివరకుఁగల మధ్య ప్రదేశమున (సావకాశమున) వ్యాపించియుండునని చెప్పఁబడినది. ఇదియె సూర్యుని కాంతిని మనకడకు నడిపించునది. ఇది యదృశ్యమగు పరమాణుసముదాయమనియు, సూర్యచంద్ర నక్షత్రాది సమస్తమును కన్పింపజేయునది యని చెప్పఁబడినది. ఈథరు ఘనీభవించిన గాలికన్న సన్నని వగు మేఘము లగుననియు, వానినుండియె భూమివంటి గోళములు జనించుననియు,

తొల్లి భూమ్యాను లిప్లే యేర్పడి పెరిగినవనియు పాశ్చాత్య పండితులు నుడువుచుందురు.

**ఈదబోతే త్రాగనీరు దొరకనట్లు-** (ఈదబోతే = ఈదుట కేగితే) ఆంధ్రలోకోక్తి.

**ఈదురుపల్లి భవానీశంకర కవి—** ఆంధ్రకవులలో నాధునికుఁడుగ పరిగణింపఁబడిన వాఁడు. ఆర్వేలనియోగి బ్రాహ్మణుఁడు. భారద్వాజసగోత్రము, తండ్రి శంకరయ్య. దిట్టకవి వేంకట రాయకవి కడఁ జదువుకొనినవాఁడు. ఈకవి శృంగారమంజరి యను ప్రబంధమును, ధర్మఖండము నాంధ్ర పద్యరూపమునను రచించెను. కూచిమంచి తిమ్మనకవి సార్వభౌముని కాలమువాఁ డందురు.

**ఈనగాచినక్కలపాలొనర్చినట్లు-** (ఈనుట = ప్రసవించుట) ఆంధ్రలోకోక్తి.

**ఈయనిమొండికి విడువనిచండి** ఆంధ్రలోకోక్తి.

**ఈయూరి కాయూరెంతో ఆ యూరికి నీయూరంతే** — ఎంతో=ఎంత దూరమో, అంతే=అంతదూరమే. ఒకరిమనస్సు తనపై నెట్లుండునో తన మనస్సును వారిపై నట్లేయుండునని భావము. ఆంధ్రలోకోక్తి.

**ఈర్భటి గోత్రము** — కుశికగణము చూడుఁడు.

**ఈర్ష్యాహి వివేకపరిపం** — ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి! ఈర్ష్య వివేకమునకు శత్రువని భావము.

**ఈలకూర చెట్టు** — ఉప్పురుచిం గల్గియుండు కూర. అపథ్యకరమైనది. విదాహమును గల్గించును.

**ఈవినింగ్ స్టార్ (Evening Star)-** శుక్రుఁడు. వీనస్‌గోళము చూడుఁడు.

**ఈవు జగన్మాత సమాధి (జిడ్డా)** (Eve's grave, Jidda) — ఆదమ్ ఈవులు యూద, క్రైస్తవ, మహమ్మదీయ మతములందాదిమ దంపతులుగ జెప్పఁబడినవారు. అందు ఈవు (స్త్రీ) సమాధి అరేబియా దేశమునందలి జిడాపురమున కుత్తరముగ నొకమైలుదూరమునందు కలదు. జిడ్డా మక్కా నగరమునకు ౩౮ మైళ్లదూరమునందున్న రేవుపట్టణము. ఈవు జనని ౧౧౮ అడుగులపొడవని చెప్పఁబడినది. ఈమె సమాధి ౪౦౦ అడుగుల పొడవుగను, ౧౧ అడుగుల వెడలుపునను ఉన్నది. తలకడను, పాదములకడను చిన్న దేవతాస్థానములు నిర్మింపఁ బడినవి.

**ఈశత్వసిద్ధి** – సిద్ధి సిద్ధులు చూడుఁడు.

**ఈశానుఁడు** — పరమేశ్వరుండగు రుద్రుని ఎన్మిది యాకారములలో నొకటి. అష్టమూరులు చూడుఁడు.

**ఈశావాస్యకర్పూరము**– ఇది కర్పూరములలో నొకదినుసు. కర్పూరము కొంచెము పసుపురంగు కల్గి యిసుకంబోలి యుండును. ఇది శైత్యోపచార పదార్థము తాపము నడఁచి, ఇంచుక ధాతుపుష్టిం గల్గించునది. అతిసారము, క్రిమి, చెమట, దగ్గు, భ్రమ, మత్తత, శోషల నడంచును.

**ఈశ్వరకళలు** – కళలు చూడుఁడు.

**ఈశ్వరచంద్రవిద్యాసాగరుఁడు** – ఈయన గొప్ప విద్వాంసుఁడు. వంగదేశీయుఁడు. ఉత్తమకులీన బ్రాహ్మణుఁడు. తల్లి భగవతీదేవి. ఆమె ప్రోత్సాహమున స్త్రీ పునర్వివాహములు శాస్త్రసమ్మతమని వాదించుచు తాను చేయుచుండినవాఁడు.

పెక్కు గ్రంథముల నీయన రచించెను. గొప్ప స్వార్థత్యాగి, సత్యవంతుఁడు నని పేరందిన.

వాఁడు. క్రీ. వె. ౧౪౫౧ లో మృతినందెను.

**ఈశ్వరిచెట్టు** – లా. Aristolochia indica- ఆంగ్ల. Indian Birthwort. సం. విసస్ఫిణి, మహాయోగేశ్వరి, నాగదమని, నాగదలం, నాగద. గ్రామ్యపదముగ ఈసరచెట్టని వాడుదురు. ఇది తెల్లయీశ్వరి, నల్లయీశ్వరి యని ద్వివిధముగ నుండును. ఇందు తెల్లయీశ్వరి శ్రేష్ఠమని వైద్యు లందురు. వెగటు చేదు రుచులం గల్గి కాకఁజేయును. సర్వవిషములకు ముఖ్యముగ సర్పవృశ్చికవిషములను హరించును. పాములు తెల్లయీశ్వరివేరనిన సహింపక వెనుక మొగం బిడును.

మఱియు, శ్వేతకుష్ఠు (బొల్లి), సర్పి, దద్రు, (పల్లికలు మొదలగు దద్దురులు) వ్రణములు హరించుననియు, విరేచనము జేయుననియు, శరీరమునందు గట్టిపడిన దోషపదార్థములను విడగొట్టి వెడలజేయుననియు, అజీర్తివిరోచనముల నాపుననియు, జ్వరములు, నొప్పులు, కంటికురుపులు శమింపఁజేయుననియు, గర్భస్రావము గల్గించుననియు, ఆకులు జ్వరములు హరించుననియుఁ జెప్పఁబడినది.

**ఈషణత్రయుము** — ఈషణ మన ఇచ్ఛ, లేక కోర్కెయని యర్థము వీడకుండు వాంఛయని భావము. ౧. ధనేషణ- ధనమందలియాశ, ౨. దారేషణ- స్త్రీలయందలి వాంఛ, 3. పుత్రేషణ- సంతానము, కుటుంబ వృద్ధి మొదలగు వాంఛ.

**ఈస్ట్రన్ తురుష్కస్థానము** — చీనాతురుష్కస్థానము చూడుఁడు. (తురుష్కస్థానము చూడుఁడు).

**ఈసఫ్కథకుడు, ఈసఫ్కథలు** — Easop's fables అను గ్రంథమునకు కర్త. తొలుత బానిసగనుండి విడుదలయై (సామోసు నందు) తనజన్మస్థానమగు ఫ్రిజియాయందు తిరుగ గొంతకాలముండి, వైడియాప్రభువగు క్రోయెసస్ భూపాలుని కొలువుం జేరి, ఆయన సన్మానము వడసినవాఁడు. మహమ్మదీయమతస్థుఁడు. అరబ్బని కొంద అనెదరు. బహుబుద్ధిశాలియు దూరాలో చనపరుఁడని పేరుందినవాఁడు. తండ్రిపేరు బౌరా. సుప్రసిద్ధుఁడగు జాబ్ అనువానికి బంధువు. దావీదు నెఱింగినవాఁడు. చిరకాలము జీవించెను. అంగవికలుఁడనియు, బానిసగ నుండినతరి ఎతియోఫ్ అను నామమున బరగుచుండెననియు, అసలుపేరు లోక్మాన్‌యూసూఫనియు, ఖురాను నుండి కథలయూహల నందెననియు, అరబ్బు లను చున్నారు. ఈతని కథల నన్నిదేశములవారును గౌరవించుచుందురు.

**ఈస్టు ఇండియా కంపెనీ** (East India Company). ఈపేరుగల సంఘములు బ్రిటన్‌దేశమునను, హాలండుదేశమునను ఇంక కొన్ని ఇతరదేశములందునను కూడ నేర్పడినటుల తెలియుచున్నది. బ్రిటిషు ఈస్టు ఇండియాకంపెనీ, ఈస్టు ఇండీసుతో వర్తకవ్యాపారము సలుపుటకు క్రీ.వె. ౧౬౦౦ డిశంబరు కడను పట్టా(Charter) ను ఎలిజబెత్‌రాణి (Queen Elizabeth) వారివలన పొందెను. వర్తకస్థలములు తొలుత సూరత్తుపట్టణమును, పిదప బొంబై, ఫోర్టుసెంటుజార్జి (చెన్నపట్టణము), గంగాతీరమున హుగ్లీ పట్టణమున శాంతమును చేయుంబడియెను. ఏబదిసంవత్సరములకుఁ బిదప హుగ్లీవర్తకస్థానము కలకత్తాకు మార్చబడియెను.

క్రీ. వె. ౧౭౬౫ లో ఈస్టుఇండియాకంపెనీ బంగాళాదేశమున పరిపాలన మొనర్చువారైరి. బ్రిటీషుపార్లమెంటునందు ౧౭౮౪ వ సంవత్సరమున (Pitt's India Act) పిట్సు ఇండియా

చట్టము ఇందుకొరకై శాసింపఁబడి, అందు తమ కుత్తరవాదిగ పార్లమెంటువా రేర్పరిచిన యొక బోర్డునకును, ఈస్టుఇండియాకంపెనీకిని జాయం టుగా పరిపాలనపరిశీలనాధికారము లీయఁబడెను. కాని ౧౮౫౭ సిపాయిల తిరుగుబాటు (Mutiny) తో పరిపాలనాధికారము బ్రిటీషుప్రభుత్వము వారివశము చేసికొనఁబడి క్రౌన్ పరిపాలనమై ౧౮౫౮ లో కంపెనీ రద్దుపర్పంబడి, అంత మయ్యెను.

**ఈస్టు ఇండీసు** (East Indies) — దీనికి సరియైనయర్థము పాటింపఁబడుట లేదు. ఈస్టు ఇండియాకంపెనీవారి కిచ్చిన ఛార్టరులో ఇండియా దేశముమాత్రము ఇండీసుగా వివరింపఁబడినది. కాని వాడుకయందు, ఇతరకాగితములందు ఇండూ చైనా, మలేపెనన్సులా, మలే ఆర్చిపిలెగో ద్వీపము లన్నియును, సుమత్రా, జావా, బార్నియో, న్యూగినియా, ఫిలిప్పైన్సుద్వీపముల పేర్లును ఇందే గానవచ్చెడివి.

ఇక్కాలమున డచ్చి ఈస్టుఇండీసు (హాలండు ప్రభుత్వమువారివి) నందు సుమత్రా ద్వీపము, జావాద్వీపము, బలిద్వీపము, మధురాద్వీపము, సెలిబీస్, బిల్లిటన్ ద్వీపములు, బాస్కా-ద్వీపము, లొంబొకుద్వీపము, సుండాద్వీపములు, మొలక్కా ద్వీపములు, టిమోరుద్వీపములందు కొన్నియు, బార్నియో ద్వీపభాగము న్యూగినియా చేరి ౭,౩౩,౦౦౦ చతురపుమైళ్లుగా నున్నవి.

**ఈళినుఁడు** — ఈతనికి రైభ్యుఁడనియు పేరుకలదు. పూరువంశపు క్షత్రియుఁడు. తండ్రి పేరు సుమతి. మఱియు రైభ్యుఁడను ఋషి యొకఁడు కలఁడు. ఆతనికి అర్థావసు, పరావసువు లను వారిర్వురు పుత్రులు.

**ఉంగరములచేతితో మొట్టితే నెవ్వ దరొదురు** — ఉంగరములు గల చేయి యన భాగ్యవంతులచేయి యని భావము. (ఆంధ్రలోకోక్తి).

**ఉంగరముల (లెక్క) పద్యము** — దీనింగూర్చి యిటులఁ జెప్పఁబడినది. ఈపద్యము లెవ్వరు రచించిరో తెలియదుకాని యీలెక్క యనాదిగ గలదు.

క. మున్నూటరువదిమాడలు
ఎన్నగఁ బదియుంగరంబు లెంతెంతో భటుం
డెన్నాళ్లు జీతమడిగిన
నన్నాళ్లకు యుంగరంబు లాతండిచ్చున్॥

ఇంకను దీనిం దెలియుట కీపద్యము చెప్పఁ బడినది.

ఆ. ఒక్కటి రెండు మూఁడు నొనరంగ నాల్గిడి
యవియుఁ బెట్టి సున్నలమరఁ బెట్టి
నూరుబెట్టి పిదప నూటయేబది బెట్టి
ఉంగరంబులెత్తు లెఱుగవచ్చు॥

అనగా ఒక మాడ ఎత్తు ఉంగరము ఒకటి,
రెండుమాడల ఎత్తు ఉంగరము ఒకటి,

| | | | | |
|---|---|---|---|---|
| ~~ — | ,, | ,, | ,, | ,, |
| నాల్గు | ,, | ,, | ,, | ,, |
| పది | ,, | ,, | ,, | ,, |
| ఇరువది | ,, | ,, | ,, | ,, |
| ముప్పది | ,, | ,, | ,, | ,, |

నలువదిమాడల ఎత్తు ఉంగరము ఒకటి
నూరు ,, ,,
నూటపఏబది ,,

ఇటులఁ బదియుంగరములు కల్పి మొత్తము మున్నూటరువది మాడలగును. మాడయనిన ఇంచుమించు రెండురూప్యములు విలువగల్గిన ఎత్తుగలది.

**ఉంటేఊరు లేచిపోతే పాడు** ఆంధ్రలోకోక్తి.

**ఉండవల్లి గుహలు** — ఆంధ్రదేశమున బెజవాడకు సమీపమున, ఇప్పటి గుంటూరు మండలమునకుం జేరి కృష్ణానదికవ్వల (దక్షిణ తీరమున) ఉండవల్లి యనంబడు గ్రామముకడ గల గుహాలు. ఇందు ముఖ్యమగు పెద్దగుహ హిందువుల విష్ణుదేవాలయమై యుండెను, ఇది నాల్గంతస్తులుగ తొలువంబడినది. దీనియందు గాలరీలు కలవు. మూడవ యంతస్తునందు శయనించియున్న విష్ణుదేవుని విగ్రహమున్నది. రాబర్టుస్వెల్ పరిశోధకుఁడివి బౌద్ధులను వెడలగొట్టి హిందూమతము తిరుగ విజృంభించిన కాలమున అనగా క్రీ. వె. ఏడుమొదలు పదియవ శతాబ్దముల మధ్యకాలమున చాళుక్యభూపతుల పరిపాలననాఁటివని యభిప్రాయపడియున్నాఁడు. కాని పశాసనములు స్పష్టపర్చలేవు.

**ఉండేదేగట్టి ఊడిపోయినదేపొట్టి**- ఆంధ్రలోకో

**ఉండ్రములోకపిండివంటా? ఊదలోకపంటా?** ఆంధ్రలోకోక్తి.

**ఉండ్రాళ్లతద్ది (తృతీయాతిథి)** — భాద్రపద బహుళ తృతీయ. బాలికలు తెల్లవారు జామున మేల్కాంచి భుజించి యాటలాడుకొని గౌరీదేవిని బూజించి యుండ్రముల నివేదన మర్పింతురు. (పండుగలు, పర్వతిథులు, వ్రతదినములు చూడుఁడు). వ్రతదినము.

**ఉండ్రాళ్లచవితి (చతుర్థి)** — విఘ్నేశ్వరుని చవితి చూడుఁడు.

**ఉక్కు** — ఇనుము చూడుఁడు.

**ఉక్కుతోఁ జేయబడినపొగయోడ నీటందేలుట** — ఉక్కుంబోలిన బరువగునవన్నియు నీటియందు మున్గునుగాని, నీటిపైఁదేలవు. ఏలనన నవి నీటికన్న బరువగు పదార్థములు. మనము ఒక అడుగు పొడవు, ఒక అడుగు వెడలుపు, ఒకఅడుగు దళసరి గల యొకఉక్కుముద్దను నీటంబడవేసితిమేని యది తోడనే మునిగిపోవును. అనగా నది యొక ఘనఅడుగు (Cubic foot) నీటి నవ్వలికిం ద్రోసి యా ప్రదేశమును తానాక్రమించునని భావము. ఒక క్యూబిక్ అడుగు నీరు రమారమి అరువదిరెండు పౌనులును, ఒక క్యూబిక్ అడుగు ఉక్కు అయిదువందల పౌనులు రమారమిగను తూగునుగాన, నీటికన్న బరువగు ఉక్కు నీట మునుఁగునేగాని, నీటిలోఁ దేలదు.

ఆ ఉక్కునే ఎనిమిది క్యూబిక్కు అడుగుల ప్రమాణముగల ఒక తొట్టెగఁజేసి నీటంబడవేసితిమేని అది (౮ × ౬౨½ = ౫౦౦) పౌనులబరువుగల ఎన్మిదిక్యూబిక్ అడుగుల నీటిందొలగించవలయును. అది అయిదువందల పౌనుల బరువుమాత్రమే గాన (నీటికన్న తేలికయై) నీట మునుంగక తేలును. ఈ లెక్కపద్ధతి ననుసరించియే ఉక్కురేకులతో పొగయోడలం జేయుదురు. తొల్లి కఱ్ఱతో చేయుచుండిరి గాని, సముద్రజంతువులవలన నాయోడలు కన్నములు చేయబడి నీట మునిఁగిపోయెడివట. ఇప్పు డుక్కు ఓడల కాభయము లేదు.

**ఉక్కు, మచ్చలు, త్రుప్పు లేకుండుట**- తొల్లింటికాలమున భరతదేశమునం దుక్కు

ఖడ్గములు, ఇతరవస్తువులుగను చేసి, అనటిదవ్వ రసము, కొన్ని జాతుల పసరులు, కొన్నిమూలి కల రసములు, కొన్ని తైలములలో నెఱ్ఱగ గాల్చిన వస్తువులను ముంచి పదునిచ్చుచుండిరి. పశ్చిమదేశములందుఁ బదునిచ్చుపద్ధతి యున్నను, ఉక్కు అసలుఇనుమును కార్బైడ్ ఆఫ్ ఐరన్ (Carbide of iron) ను కల్పి కాల్చియుఁ జల్లార్చియు కల్పిసాగగొట్టినదిగా జెప్పఁబడుచున్నది. రానురాను ఉక్కును రచించు మార్గము లనేకములు గన్పెట్టఁబడినవి. అందు ప్రధానమైనది క్రోమియమ్ (Chromium) సగమును, ఇనుము సగమును కల్పి తయారుచేయు నుక్కుగుచున్నది. ఇటీవల క్రోమియమ్ అధికముగా జేర్చి, త్రుప్పుపట్టని యుక్కు తయారుచేయ మొదలిడిరి.

**ఉక్తుఁడు** — పాండవసంతతి క్షత్రియుఁడు. తండ్రి నిమి లేక నేమిచక్రుఁడు. పితామహుఁడు అసీమకృష్ణుఁడు. కుమారుఁడు చిత్రరథుఁడు.

**ఉగండా దేశము** — తూర్పుఆఫ్రికా యందు విక్టోరియా న్యాసాసరస్సునకు వాయువ్య దిశగానున్న సీమ. ఇది బ్రిటిషుప్రభుత్వమువారి రక్షణయందున్న టెరిటరీ. స్వదేశ ప్రభుత్వ పాలితము. లేకుడిస్ట్రిక్టు అంతయు నిందులోనిది. (తూర్పుఆఫ్రికా చూడుఁడు).

**ఉగాది** — సంవత్సరాది చూడుఁడు.

**ఉగ్రదోషము** — జ్యోతిషశాస్త్రమున ముహూర్త భాగమునం దుపనయన ముహూర్త ముంగూర్చి చెప్పఁబడిన దోషములలో నొకటి. లగ్నాది కేంద్రములందు రాహువుండిన ఉగ్ర దోషమనియు, వటువునకుం గీడనియు జెప్పఁబడినది.

**ఉగ్రశ్రవుఁడు లేక ఉగ్రశ్రవసుఁడు**- తండ్రి రోమహర్షణుఁడు. ఇతఁడు సూతకులజుఁడు. సకలపురాణవేత్త. ఈతనికి సూతుఁడనియు, రోమహర్షణి యనియు వాడుక నామములు కలవు. వ్యాస శిష్యుఁడు. నైమిశారణ్యమున శౌనకాదులకుఁ బురాణగాథ లెఱిఁగించినవాఁడు. సకల ఋషి ముని గణములకు వందితుఁడై వారి వలన బ్రహ్మాసనాసీనునిగఁ జేయఁబడినవాఁడు.

**ఉగ్రసేనుఁడు** - యదువంశ క్షత్రియుఁడగు రాజు. యమునాతీరమున మథురాపురి యందు రాజ్యమేలినవాఁడు. కనిష్ఠ సోదరుఁడు దేవకుఁడు. కుమారుఁడు కంసుఁడు. కుమార్తె కంసాదేవి, కంసవతి అనువారలు. దౌహిత్రుఁడు శ్రీకృష్ణుఁడు. కుమార్తె దేవకీదేవి. (కంస దేవ భాగుని భార్య. కంసవతి దేవశ్రవసుని భార్య). ఇంకను జనమేజయ మహారాజు తమ్ముఁడును, పరీక్షిన్మహారాజు రెండవ సుతుఁ డొకఁ డుగ్రసేనుఁడు కలఁడు. మఱియుఁ గృష్ణుని సంతతి యందు సుబాహు వనువాని పుత్రుఁడొకఁ డుగ్రసేనుఁడను పేరుగల వాఁడుండెను.

**ఉగ్రాయుధుఁడు** — పూరువంశ క్షత్రియుఁడు. కృతికుమారుఁడు. భీముని చేఁ జంపబడినవాఁడు.

**ఉగ్రుఁడు** — పరమేశ్వరుండగు రుద్రుని ఎనిమిది యాకారములలో నొకటి. అష్టమూర్తి చూడుఁడు.

**ఉచ్చనగరము** — జనమేజయు సర్ప యాగస్థలము. సంయుక్తరాష్ట్రములలో అహార్, బులాంద్‌షహార్, అనఁబడుచున్నపురము. ఇది ఢిల్లీ మీరట్‌పురములకు సమీపము. గంగా తీరము. బులాంద్‌షహార్ అనిన దేశభాషయం దుచ్చనగరమని యర్థము. అభిమన్యుని మనుమడును, పరీక్షిత్తు కుమారుఁడునగు జనమేజయ నృపాలుఁడు దీనిని నిర్మింపఁజేసెనట. బులాంద్ షహారున కీశాన్యదిశగా నిరువదియొక మైలు దూరమున నిప్పు డహార్ అనంబడుచున్న తావున

జనమేజయుఁడు సర్పయాగమొనర్చిన తావుం జూపుచున్నారు. తొల్లింట నిదియె ఉచ్చనగరముండినతావనియు, ఇప్పటి బులాంనుమహాక్ పీఠప నవీననిర్మాణమనియుఁ దలంపనగుచున్నది. ఒక జైనుశాసనమున దీనిసంగతి కొంత గానవయ్యెడినిగాని, ఇంకను పరిశీలింపవలసియున్నది. ఉచ్చనగరమను పేరు మారి అహర్ అయ్యెనని తలంపఁబడుచున్నది. (శూద్రకదేశముఁజూడుఁడు)·

**ఉచ్చైర్మన్యు గోత్రము** — జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.

**ఉజని** — బంగాళాదేశములోని బర్ద్వాన్ జిల్లా కట్వా డివిజనులోనిది. ఇప్పుడు ఉజనీ పీఠముండినపురము. కోగ్రామము, మంగళకోట (తొల్లింటి మంగళకోష్టమను పేరఁబతగిన రాజనివాసభవనముండిన తావు) అరాల్ అను మూడు గ్రామములై యున్నది. కోగ్రామము తొల్లింటి ఉజనిపురమున వర్తకులు నివసించు తావట. మఱియు నిదియె చైతన్యమంగలమను ప్రసిద్ధచైతన్యగ్రంథము రచించిన లోచనదాసు జన్మస్థలము. మఱియు నిచ్చానికిది తూర్పుగా రెండుమైళ్లి దూరము. ఉజనియందు మహాంకాళిశక్తిపీఠము కలదు. దీనిప్రశంస బృహద్ధర్మపురాణము(పూర్వ) ౧౪ అధ్యాయమున కలదట. ఇది ఉజ్జయని యని పేర్కొనఁబడి యున్నది. అజయనదీతీరము.

**ఉజాలిక నగరము** — దీని నిప్పుడు ఉజయిన్ అనుచున్నారు. సంయుక్తరాష్ట్రముల లోని రాయిబరెలీపురమునకు తూర్పున ఇరువది మైళ్లదూరమునందున్నది.

**ఉజ్జనక దేశము** — ఉడ్యాణదేశము చూడుఁడు.

**ఉజ్జయంతపర్వతము** — గిరినార్ (జూనగడ్) పర్వతమున కీపేరు కలదు. ఇది కథియవాడునందున్నది. దీనిప్రశంస మహాభారతము వనపర్వము నందుకలదు.

**ఉజ్జయినినగరము (అవంతి)** — ఉజ్జయిని మాళ్వ లేక అవంతిపురమను పేరంబరగిన నగరము. శిప్రా కాళ గంగానదీతీరము. పుణ్యక్షేత్రము. సప్త మోక్షదాయక పురములలో నొకటి. ఇచటి నగరమధ్యమందున్న మహాకాళలింగము ద్వాదశ తేజోలింగములలో నొకటియై యున్నది.

అశోకుఁడు తనతండ్రికాలమున రాజప్రతినిధిగనిటనే యుండువాఁడు. అక్కాలముననే కుమారుఁడగు మహేంద్రుఁ డిటనే జన్మించుటం జేసి మహేంద్రున కుజ్జయనీనగరమే జన్మస్థానము. ఉజ్జయిని అవంతిరాజ్యమేలిన విక్రమాదిత్య మహీపతివలన నెక్కువపేరందినది. ఇట నామహారాజు నాస్థానమున నవరత్నము లనఁబడిన తొమ్మండుగురు మహావిద్వాంసులుండిరి. వారు ౧. కాళిదాసమహాకవి- ఈతఁడు రఘువంశ, కుమారసంభవ, మేఘసందేశాది కావ్యములను, శాకుంతలాది నాటకములును రచించిన వాఁడు. ౨. అమరసింహుఁడు- నామలింగానుశాసనమను అమరకోశము రచించినవాఁడు. 3. వరాహమిహిరాచార్యుఁడు- బృహజ్జాతకము మొదలగు జ్యోతిష గ్రంథముల రచించిన జ్యోతిషవేత్త, బృహత్సంహితకర్త. ౪. వరరుచి- ఈతనికిం గాత్యాయనుఁడని వాడుక గలదు. పాణినీయ వ్యాకరణసూత్రములకు వార్తికము (వృత్తిగ్రంథము) లేక వాక్యకారుఁడను, ప్రకృతిప్రకాశమునురచించినవాఁడు. ౫. ఘటకర్పరుడు- యమక కావ్యము రచించినవాఁడు. ౬. ధన్వంతరి- వృద్ధసుశ్రుత సంహిత యను వైద్యశాస్త్రగ్రంథము రచించినవాఁడు. ౭. క్షపణకుఁడు- దిన్నాగాచార్యుఁడనియును బిరుదుగలవాఁడు.

ఈతడు బౌద్ధమహాస్వాములలో నొకఁడగు వసుబంధస్వామి శిష్యుఁడు;మహాపండితుఁడు. న్యాయప్రవేశమను ప్రసిద్ధ నైయాయిక శాస్త్రగ్రంథకర్త. ౮. శంకుఁడు- మహావిద్వాంసుఁడు. ౯. భేతాళభట్టు. వీరు నవరత్నము లనంబడిన మహావిద్వాంసులు. ఉజ్జయిని నగరమధ్యముననే మహాకాళదేవస్థానము కలదు. ఆ శివలింగము బహుపురాణప్రసిద్ధము. శివపురాణము ప్రథమ పటలమున ౩౮-౪౬ అధ్యాయముల నీమహాత్మ్యము వివరింపఁబడినది.

భూమిలోనికి క్రిందికిం ద్రవ్వఁబడిన భూగర్భమున మహాకాళ శివలింగముకలదు. అద్దానిపై నున్న వేఱొకగదియందుఁ బరశునాథ మహాదేవుని విగ్రహముకలదు. దేవాలయావరణముననే కోటతీర్థమనఁబడుచున్న సరస్సు కలదు. దీనికిఁ బిదప ప్రసిద్ధినందిన వీక్షేత్రమున సిద్ధనాథ దేవస్థానమును, మంగళేశ్వర దేవస్థానమునై యున్నవి. అన్నియును గొప్ప దేవస్థానములే. ధనవంతములే. దేవస్థానముఖ ద్వారమున ౨౪ స్తంభముల మంటపద్వారము చక్కని పనితనముగల కడు పురాతన కట్టడము. నగరముయొక్క ఉత్తర భాగమున కాలీయహ్రద మను బ్రహ్మకుండము కలదు. అది స్కాందపురాణము అవంతీఖండమున బ్రశంసింపఁబడినది. మఱియు నటనే కాలభైరవ దేవస్థానము కలదు. అదియుం బ్రసిద్ధమైనదే. అవంతీక్షేత్రము కాళీగంగానదీ తీరమందు దశాశ్వమేధఘట్టముకలదు. అటవిధాతయె పది యశ్వమేధ యాగము లొనర్చెనట. అచటికి సమీపముననే అంకపాద మనఁబడు (ఇప్పటి అంకపాత్) తావున సాందీపముని యాశ్రమ ముండిన తావు గలదు. ఈయాశ్రమముననే శ్రీకృష్ణ బలరాములు విద్యాభ్యాస మొనర్చిరి. వారు వ్రాసికొను పలకలం గడుగుచుండిన సరస్సునకు దామోదరకుండమని పేరు. నగరమున కుత్తర దిశను రెండుమైళ్ల దూరమున నదీతీరముననే భర్తృహరి గుహగలదు. అటనాతఁడు యోగాభ్యాస తపము లొనర్చువాఁడట. ఈసందర్భమున విష్ణుశర్మ యను తపోనిధి సుతుఁడగు చంద్రశర్మ నాలుగువర్ణముల కన్యలం బరిణయమై బ్రాహ్మణస్త్రీయందు వరరుచిని, క్షత్రియ స్త్రీయందు విక్రమార్కుని, వైశ్యస్త్రీయందు భట్టుని, శూద్రస్త్రీయందు భర్తృహరిని నల్వురు సుతులం గనెను. అందు వరరుచి మహావిద్వాంసుఁడు, తపోనిధి యనఁబరగెను. విక్రమార్కుఁడు విక్రమాదిత్యుఁడు. అవంతీరాజ్యమేలిన మహారాజు. భట్టు ఆస్థానప్రధానమంత్రి. భర్తృహరి నీతిపరుఁడు. విక్రమార్కునకుం బిదప రాజ్యభారము కొంతకాలమువహించి, విరక్తుఁడై సర్వముంద్యజించి విరాగియైనవాఁడు. ఈయన భర్తృహరికావ్యము దేశప్రసిద్ధము. ఈ మహాయోగి సంయుక్తరాష్ట్రములలోని చునార్ కోట (Chunar Fort) లోని రాజభవనమున నొకచో కొంతకాలము వసించుటంజేసి నేటికి నాతావాతనిపేరం బరగుచునేయున్నది.

భర్తృహరి గుహకు భూమిలోనికిం దిగు ద్వారమును, సోపానములు, మార్గములు, గదులు చక్కని పనితనముగల్గి చూడఁదగి యున్నవి. ఈ క్షేత్రమునంగల హరసిద్ధిదేవి దేవస్థానము శక్తిపీఠములలో నొకటి. ఈమె విక్రమాదిత్యమహారాజున కిష్టదేవత యని భేతాళ పంచవింశతియందుఁ జెప్పఁబడినది. నగరముయొక్క ఆగ్నేయభాగమునకడగా గోగాషహీద్ అని యిప్పుడు వాడఁబడుచున్న నొకపాటిగుట్టపై ప్రసిద్ధమగు విక్రమాదిత్యుఁడు గూర్చుండు సింహాసనము భూమియందుండిన తావనియు దానిని మాళవదేశపు నృపతియైన భోజమహారాజు.

త్రవ్వించి తీసికొనిపోయెనని యుం జెప్పి యాతావుం జూపుదురు. పట్టణమున నైఋతిదిశగా నక్షత్రశాలయు, జ్యోతిష విషువచ్ఛాయాయంత్రము (శంఖు) జ్యోతిషాలయముండెను. అది యిప్పుడు పాడై యున్నది. భరతదేశమున ప్రసిద్ధజ్యోతిష శాస్త్రవేత్తలు చాలకాలమిటనుండియే విషువచ్ఛాయాగ్రహణాంకములనిడి పంచాంగములను గుణించుచుండెడివారు. (అవంతిదేశము పురము చూడుఁడు).

**ఉజ్జయకుంభకము** — నోరుమూసి హృద్బలమున రెండుముక్కులగుండా లోనికిం బీల్చిన వాయువును రెండుముక్కులుమూసి లోన నిరోధించి కుంభించుట; పిదప దీనిని నోటిగుండా రేచించవలెనని చెప్పఁబడినది. ఈ యభ్యాసమున హృదయస్థితమైన వాయువు మెడవరకువ్యాపించి సంచరించుచున్న సంగతి తెలియనగుననియు, దీని వలన కఫరోగములు, వాయురోగములు, అజీర్ణ, ఆమ, క్షయ, శ్వాసకాసలు, జ్వరములు, ప్లీహ, మొదలగు రోగములు నివారణమగుననియు చెప్పఁబడినది. (కుంభకముచూడుఁడు, అష్టాంగ యోగములు చూడుఁడు).

**ఉట్టి కెగురలేనమ్మ స్వర్గమున కెగురునా?** — చిన్నపనినే కొనసాగింపలేనివారు పెద్దపనులు చేయఁ దలపెట్టలేరనిభావము. ఆంధ్రలోకో

**ఉడిపి (రజితపురము)** - ఆనందతీర్థ స్వామి చూడుఁడు. తులుదేశము చూడుఁడు.

**ఉడుకొలోన్ పరిశ్రమ** (Eaude Cologne)—జర్మనుదేశములోని కొలోన్ నగరమున నీ పాశ్చాత్యపరిమళద్రవ్యపరిశ్రమ ప్రారంభమగుట నిటుల పేరందెనుగాని, పిదప చాలదేశములందు చేయఁబడుచున్నది. వేఱ్వేఱు తావులందు వేఱ్వేఱు పరిమళముల నిచ్చునటుల నించుక భేదములతోఁ జేయఁబడుచున్నది. ఇందలి మూలసూత్రమగు ప్రధానద్రవ్యము లీక్రింద విపరింపఁబడినవి.

Orange flower water Triple 1 f. ఔన్సు
Terpeneless Bergamot oil 2 fi. డ్రాము
,, Lemon oil, 1 fi. డ్రాము
,, Neroli oil, 20 mins
,, Origanum oil, 6 mins
,, Rosemary oil, 20 mins
,, Rectified spirit, 1 pint.

తొలుత స్పిరిటును ఒక గట్టి మూతగల సీసాయం దిడుకొని పిదపఁ దక్కినవాని నొక్కొక్కటినే అందు కల్పుటవలన నేర్పడును. తొలుత దీనిం జేసినవాఁడు మేరియా ఫారినా (John Maria Farina), ఇటలీదేశస్థుడగు రసాయన శాస్త్రవేత్త; కోలోను నగరమున కాపురమునకు దిగినవాఁడు.

**ఉడుత** మనదేశమున నుడుతల నెఱుంగని వా రుండరు. ఇందనేక జాతుల యుడుతలు కలవు. మన దేశమునందుండు నుడుతలలోఁ బెద్దజాతి పదునెన్మిదంగుళములు పొడవుగ నుండును. చిన్నజాతి పది లేక పండ్రెం డంగుళముల పొడవు; వీపుపైఁ జారలును, శరీరమంతయు వెండ్రుకలును, మచ్చతోకయుఁ గల్గి చెట్లపై వసించు జంతువు. కొన్నిజాతుల చెట్లపైనుండి కాయలు పండ్లందిని, కాపుపాడుచేయుచుండును. ఐరాపాయందు ఆల్ప్సు పర్వతమునను, కార్పేతియన్ పర్వతములందునను పిరినీస్ పర్వతములందునను వసించు నొక జాతి ఉడుతలను మార్మట్ (Marmot) అనెదరు. అవి యిరువది యంగుళముల పొడవును గల్గియుండును.

ఉడుతలం దపాయకరమగు జాతి యొకటి కలదట. అది జర్మనీదేశపు తూర్పు హద్దునను, ఆ ప్రాంతములయందు నుండునట. దాని నా

దేశస్థులు బూబాక్ అనెదరట. ఈ బూబాక్మారట్‌నందు అపాయకరమగు ప్లేగువ్యాధి క్రిములుండునట. ఇవి సంచరించుచో నెలుకలు తటస్థమగుతరి నా క్రిముల నా యెలుకలందు వ్యాపింపఁ జేయునట. ఆ యెలుకలు చచ్చునట గాని వ్యాధి మాత్రము మనుష్యుల కంటుకొని, వేలు, లక్షలుగ ప్రజానాశనము గల్గించునట. ఉడుతలం దెగురునవి వేఱొకజాతివి కలవు; కాని, ఇవి యరుదుగ నుండెడిని.

**ఉడుతకు ఉడుతభక్తి** — ఆంధ్రలోకోక్తి.

**ఉడుతకు ఊరిలో పెత్తనాలు తిండికే** — ఆంధ్రలోకోక్తి.

**ఉడ్వండ** — ఇది సుప్రసిద్ధ పారశీకజరథుస్త్రమతస్థుల యాత్రాస్థలము. ఆదిని భరతదేశమునకు వలసవచ్చిన వీరిపూర్వులిటనే స్థిరపడి కొంతకాలముండిరట. ఆనాఁటి యగ్నిదేవాలయము కలదు. అద్దాని యగ్నిజ్వాలలు నిరతము మండుచుండును. దాని నాతాష్బెహరామ్ (అగ్నిదేవతాస్థానము) అనెదరు. ఏఁటేఁట అడార్ మాసమునను, ఆర్డిబెహెస్టుమాసమునను గొప్ప యాత్రలు జరుగుననియు, పారశీకులు తండోపతండములుగ నత్తరి వచ్చెదరనియు నందురు.

బొంబై నుండి బొంబైబరోడా మధ్యఇండియా రెయిల్వేపై, ఉడ్వండస్టేషను ౧౧౫ మైళ్లను, అటనుండి గ్రామము నాల్గుమైళ్ళను దూరముండును.

**ఉడ్యాణదేశము** — (ఉజ్జనకదేశము, ఉద్యానకదేశము). దీనిని కొంద ఱుజ్జనకదేశమనియు వాడుచుండిరట. కొందఱు గాంధారమని పిలువఁబడు దేశభూమికే యొకప్పు డుద్యానమని పేరుండెననుచున్నారు. గజినీనుండి కాశ్మీరమువఱకు నుడ్యాణముండెనని పెక్కండ్రతలఁపు. పెషావరున కుత్తరమునను, హిందూకుష్పర్వతములకు దక్షిణమున నుండుదేశమనియు, అనగా చిత్రాల్ మొదలుకొని సింధునదివఱకుంగల సీమయనియు, దర్దిస్థానము, స్వాత్సంస్థానభాగము, స్వాత్ లోవ యనంబడు యూసుఫ్‌జాయిదేశము కలిసి ఉడ్యాణమని పిలువఁబడుచుండెనని తలఁపఁబడుచున్నది. మంగళపురము రాజధానిగనుండును. స్వాత్నదికిఁ దొల్లింటిపేరు సువస్తు లేక శుభవస్తు. మహాభారతమున అనుశాసనపర్వమునందునను, పద్మపురాణము స్వర్గ ౧౯ అధ్యాయమునను దీని ప్రశంసలు కలవు. ఇందు పద్మపురాణమున ఉద్యానకదేశమని పేర్కొనఁబడినది.

డాక్టరు స్టెయిను (Dr. Stein) పండితుని పరిశోధనలనుండి ఉడ్యాణదేశము ఇప్పటిచిత్రాల్ రాజ్యభూములు, యాసిన్‌నుండి సింధునదీతీరప్రదేశములగుండా, గిల్గిట్, బిలాస్, బుంచీలను గల్పుకుని కృష్ణగంగ (ఇప్పటి కిషన్‌గంగ) లోవ వరకును, కాశ్మీరదేశపు టుత్తరసరిహద్దున వ్యాపించియుండిన దేశమని చెప్పఁబడినది. దరదదేశ మొకప్పు డీదేశభాగమై యుండెనని కొందఱనిరి; కాని, నిదర్శనములు గానరాకున్నవి.

**ఉడ్డియాణబంధముద్ర** — యోగాభ్యాస విధానమునఁ జెప్పఁబడిన వింశతిముద్రలలో నొకటి. నాభిస్థానమును వెన్నెముకకంటు నటుల లోనికి నొక్కుట ఉడ్డియాణబంధముద్ర యనఁబడును. ఈ యభ్యాసమువలన ప్రాణవాయువు సుషుమ్నామార్గమునఁ బ్రవేశించుననియు, ఇది యపమృత్యువు గల్గకుండఁ గాపాడుననియుఁ జెప్పఁబడినది.

**ఉతకాలకుల గోత్రము** — ఉద్వాహకుల చూడుఁడు.

**ఉతథ్యగోత్రము** — ఔతథ్యఉపగణము చూడుఁడు.

**ఉతథ్యుఁడు** — తండ్రి ఆంగిరసుఁడు. సహోదరుఁడు బృహస్పతి. భార్య పేరు మమత. కుమారునిపేరు దీర్ఘతముఁడు. కారణాంతరమున ఉతథ్యునిభార్య బృహస్పతివలన భరద్వాజమహర్షిని కనెను.

**తీర్థము** — పాండవులు ధౌమ్యుని పురోహితునిగఁ గైకొనినతావు.

**ఉత్కటాసనము** — యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. రెండు పాదముల వ్రేళ్లను నేలకానించి, రెండు మడమలనుపైకెత్తి పిరుదులక్రిందనుండునటుల నుంచి కూర్చునియుండుట యుత్కటాసన మనఁబడుననియు, దీనియభ్యాసమున శ్వాసము స్తంభించుననియు, ప్రాణవాయువు సుషుమ్నానాడీగతమగుననియుఁ జెప్పఁబడినది

**ఉత్కల దేశము** (ఉఢ్ర లేక ఓఢ్ర దేశము) — దీనిని సర్వసాధారణముగ, ఒడ్డె దేశమనుచున్నారు. ఇది ఓఢ్రశబ్ద పరిణామ రూపమేగాని వేఱుకాదు. ఈదేశస్థులు తమ దేశమున కృష్ణార్క, పార్వతీహర క్షేత్రములు నాల్గు మహాపవిత్రస్థలము లుండుకతన నద్దానిని పవిత్రభూమి యని గర్వముగ ననియెదరు. ఇట్టి ఘనతావేశముగల్గిన దేశమునందనేక రాజధానులు మారియుండుకతన రాజధానులంగూర్చి వ్రాయుటకన్న పురములంగూర్చి వ్రాయుటయె సమంజసముగ నుండెడిని.

ఇక్కాలమున నీదేశమునఁగల పుణ్యక్షేత్రములలో నెల్ల కృష్ణక్షేత్రమగు జగన్నాథము ప్రధానమైనది. దీనినిప్పుడు పూరీ యనుచున్నారు. పురుషోత్తమక్షేత్ర మను పేరిటుల మారినది. ఇచట జగన్నాథస్వామి దేవస్థానము చాల గొప్పది. బహుధనవంతము. పెక్కు యాత్రస్థలిటకు తండోపతండములుగ ననుదినమే తెంచుచుందురు. విష్ణుదేవునికిది భోజనస్థానమందురు గాన మితిమీరిన నైవేద్యములు (భోగములు) నడచుచుండును. మఱియు నిట ప్రసాదమును వర్ణవిభాగమును పాటింపక నెల్లరు కలిసిభక్తితో భుజించుచుందురు.

పిదపఁ జెప్పఁదగినది భువనేశ్వరము. ఇది హరక్షేత్రము. ఇచటి దేవాలయము గొప్పది; చాల పనితనముగల్గినది. ఈక్షేత్రమున దేవళములు పెక్కులుకలవు. పెక్కు దేవళములు పాడగుచున్నవి. ప్రధానదేవళము లింగరాజస్వామిది. ఎక్కువ పనితనముగల్గిన దేవళము రాజారాణి దేవళమనఁబడునది; ఇందు ప్రతిష్ఠ కానేలేదు. ఎక్కువ పురాతనమగు దేవళము పరశురామేశ్వర మనఁబడునది. ఇచట బిందుసరోవరమను పుణ్యతీర్థముకలదు. ఆసాగరమును లలితేందుకేసరి యను భూపతి విరివిగఁద్రవ్వించి బాగుజేయించెనందురు. మఱియొక స్నానతీర్థము గౌరీకుండమనఁబడు నీటియూట. ఇటనే కేదారకుండమను చిన్న నీటియూట కలదు. దాని జలము లారోగ్యప్రదములని యందురు. తొలి భువనేశ్వరముండిన తావునను, చుట్టుపట్ల నిప్పటికి నున్నయరణ్యము ఏకాంబ్రవనమని చెప్పఁబడినది. భువనేశ్వరమునకుఁ గతిపయదూరమున ఖండగిరి, ఉదయగిరి యను రెండు చిన్నమిట్టలపైఁ దొలువఁబడిన గుహలు కలవు. ఇవి యిప్పుడు కాళీగా నున్నవి. ఇట కొండపై జైనుదేవాలయమును, క్రింద జైనుల సత్రమును కలవు. ఇట జైనుఁడై స్వర్గమున కేగెనని యచటి జైనులందురు.

ఉత్కలమును కళింగరాజ్యముతోఁ గల్పి కొంతకాలమును, వేఱుగఁ గొంతకాలమును పరిపాలన నడచెను. భువనేశ్వరము రాజధానిగ కేసరివంశ నృపతులలో యయాతికేసరి (మొదటి

వాఁడు) లింగరాజ దేవాలయపు నిర్మాణము ప్రారంభించెను. ఈతఁడు క్రీ. వె. ౮౭౩ మొదలు ౯౦౫ వఱకుఁ బాలించెను. తర్వాతి రాజులును దేవళముపని సాగింప లలితేందుకేసరి పాలనమున ౬౭౮ వ సంవత్సరమున దేవాలయ నిర్మాణము పూర్తియయ్యెను. లలితేందుకేసరి క్రీ. వె. ౬౨౩-౬౭౭ పాలించినవాఁడు. యయాతికేసరి మొదలు లలితేందుకేసరి వఱకు కళింగరాజ్యమను పేర నేలిరట. యయాతికేసరి భువనేశ్వరమునుండి బౌద్ధులను, జైనులను దరిమివైచెనని ప్రతీతి కలదు. లలితేందుకేసరి యచట కోటను గట్టినవాఁడందురు. దాని యానవాళ్లు కలవు. కటకమను పట్టణ మిప్పుడుత్కల దేశమున ప్రధాన నగరమై యున్నది. ఇది నృపకేసరి యను భూపతిచే నిర్మింపఁ బడినదందురు. ఆతఁడు క్రీ. వె. ౯౪౧-౯౫౩ నడుమ పాలించినవాఁడు. రాజధాని నిటకుమార్చి యటనే యొక కోటను గట్టెను. కటకము కజ్జూరీ మహానదుల నడుమ కలియు తావున నున్నది. కజ్జూరీనది . రాతి యంచును మహారాష్ట్రులు దీనిం బాలించుతరి నిర్మించిరట. వైతరిణీ నదీతీరమందలి యజ్ఞపుర మొకక్షేత్రము. దీనిని జాజిపూ రనుచున్నారు. ఇట దేవీక్షేత్రమగు విరజాదేవి పీఠముకలదు. ఇది శక్తి పీఠములలో నొకటి. ఆప్రక్కనేగల నాభిగయ యనఁబడు చిన్న దేవళమున పితృర్పనయు, గయాపర్చితము లొనర్తురు. నదీతీరమందొక ద్వీపమున యజ్ఞవరాహస్వామి దేవస్థానమును, స్నానములరేవగు దశాశ్వమేధ ఘట్టమును కలవు. ఇఁక మిగిలిన సూర్యక్షేత్రము కొనార్క మనఁబడును; జగన్నాథమునుండి యిరువది మైళ్లు దూరము. ఇది పాడైయున్నది. ఇచట సూర్యవిగ్రహము జగన్నాథములోని దేవాలయావరణమున నొకచో స్థాపించిరి.

ఉత్కళ దేశమున ఖండగిరి యందుఁ బ్రారంభమై జాజిపురము వఱకు వ్యాపించిన పర్వత పఙ్క్తికి చతుష్పీట పర్వతమని పేరు. ఉత్కలమును క్రీ. వె. ౮౭౩ మొదలు ౧౧౩౨ వఱకు కేసరి వంశ నృపతులు జాజిపురము, కటకము, భువనేశ్వరము రాజధానులుగను, క్రీ. వె. ౧౧౩౨ మొదలు ౧౫౩౨ వఱకు గంగ వంశపు నృపతులు (చోడగంగదేవు మొదలు ప్రతాపరుద్రదేవు వఱకు), కటకము చౌదుఆర్ బరబాతి పురములు రాజధానులుగను పాలించిరట. మహాభారతము వనపర్వము ౧౧౪ యందు ఉత్కలము కళింగకుం జేరిపోయినదిగ చెప్పఁబడినది. బ్రహ్మపురాణము ౪౭-౭ యందు ఉత్కల, కళింగ దేశము వేఱైయుండెనని చెప్పఁబడినది. రఘువంశము ౪-౩౮ యందు మహాకవి కాళిదాసు ఉత్కలమును స్వతంత్రదేశముగఁ దెల్పెను. తారాతంత్రమున ఉత్కలమున కెల్ల శ్రీజగన్నాథమని చెప్పఁబడినది. కటకమున కెదురుగ మహానది కవ్వలనున్న చౌదుఆర్ మగధరాజులు, గంగులు ఏలుతరి రాజధాని. బ్రిటిషు పాలనక్రింద నిటీవల ఉత్కలమును ౧౯౩౭ వ సంవత్సరమున ప్రత్యేకరాష్ట్రముగఁ జేసి యొక గవర్నరు పాలనక్రింద నుంచిరి. ఆంధ్రదేశ భాగముకూడ కొంత యుత్కళమున నీసందర్భమునఁ జేరిపోయినది.

**ఉత్కల (ఓఢ్ర) బ్రాహ్మణులు** — పంచగౌడశాఖలలో నొకశాఖవారు (బ్రాహ్మణులు చూడుఁడు). వీరు ఉత్కల లేక ఓఢ్ర దేశవాసులగుట నీ పేరందినవారు. (ఉత్కల దేశము లేక ఓఢ్రదేశము చూడుఁడు). వీరు మత్స్యభక్షకులు. వీరియందుఁ బెక్కుశాఖాభేదములు కలవు. అందు ముఖ్యములుగ లెక్కింపఁదగినవి. పదునొకండు గానవచ్చెడిని.

౧. పండాబ్రాహ్మణులు- వీరియందుఁ బదునొకండంతశ్శాఖలు కలవు. ౧. శుద్ధపండా - వీరిని సర్వసాధారణముగ పండాలందురు. వీరు దేవస్థానములందుఁ బూజారులుగ నున్నారు. ౨. దేవతాపండా- జగన్నాథము మొదలగు దేవస్థానములం దర్చకులుగనున్నారు. వీరినుండి వేఱైనవారొకతెగగ బడ్డమహాపాత్రో లనిపించుకొందురు. కాని బడ్డమహాపాత్రోయను బిరుదము అన్యులగు నితరులందుఁ గాననగును. మఱియు వీరియంతశ్శాఖయగు బడ్డమహాపాత్రాంగము శివకుమారులనఁబడు కనిష్ఠజాతి పండాలయందు కూడ కలదు. వీరు భువనేశ్వరమున గాననగుదురు. ౩. సారవాపండా- వీరు బలరామసంతతివారమని యందురు. వీరిలో దేవస్థానమున వంటలుచేయువారు, చారకంద వ్యవసాయమొనర్చువారు, పౌత్తిపంచలవ్యాపారము చేయువారు, వైద్యముచేయువారు, జ్యోతిషము వృత్తులుగాఁగలవారు కలరు. వీరిని కొందఱు స్వారులనియెదరు. ౪. హెరాళువా పండా- వీరును బలరామ సంతతివారే యందురు. హాలికులు (వ్యవసాయ మొనర్చువారు) గాన హాళువా పేరందిరట. ౫. పాడియాశాఖ- చండప్రచండ శాఖలవారమందురు. కొందఱు సామవేదులును, కొందఱు శుక్లయజుర్వేదులును గూడ నున్నారు. ముఖ్యవృత్తి పౌరోహిత్యము. ౬. మహాస్థానులు- వీరు దేవస్థానములందుఁ దరుచుగ పూజారులుగఁ గాననగుచుందురు. వ్యవసాయ మొనర్తురు. ౭. వాఘులీపండా- ౮. వహాలీపండా- ౯. వారీపండా- ౧౦. తిపాడీ పండాలఁగూర్చి సరిగా తెలియరాదు. ౧౧. దాజ పండా- చండప్రచండశాఖవారమందురు. కొందఱు సామవేదులు, కొందఱు కృష్ణయజుర్వేదులు గూడ గలరు.

౨. శిష్టుకరణో- వీరు తొలుత గౌడబ్రాహ్మణులుగనుండి ఉత్కళదేశమునఁజేరి ఉత్కళులైరట. గ్రామోద్యోగులుగనుండి పట్టణానాయక్ (పట్నాయకో) యనియు, ఉపాధ్యాయులుగ నుంట పాఠకో యనియు, విద్వాంసులగుట పండితో యనియు బిరుదనామములు గల్గినవారు. ఆంధ్రదేశమున నివాసము కుదిరినవారు సర్వసాధారణముగ పట్నాయకు లనిపించుకొను చున్నారు. (శిష్టుకరణములు చూడుఁడు).

౩. శాసనీబ్రాహ్మణులు- వీరియం దేడంతశ్శాఖలు గలవు. ౧. ఆచార్యబ్రాహ్మణో- శుక్లయజుర్వేదులు, మాధ్యందినశాఖ. ౨. మిశ్రో బ్రాహ్మణో- ఇందు శారసగణో మిశ్రోయను చీలిన శాఖ యొకటి గలదు. మిశ్రోబ్రాహ్మణులందుఁ బదునొకండు ఉపశాఖలు గలవు. ౧. కొంఠో, ౨. భరాడి ౩. రథో, ౪. ఉపాధ్యో, ౫. పౌత్తిబ్రాహ్మణో, ౬. పాత్రీ, ౭. భేదీ, ౮. పత్రో, ౯. సంధిబిగ్రహో, ౧౦. పాణిగ్రాహి, ౧౧. పాధి లేక పాణీబ్రాహ్మణులు. ౩. కొరా బ్రాహ్మణో- వీరిని కొరాలనియు నందురు. వీరు ఉత్తరపుతెగ లేక యాజ్ఞిపురశాఖ (జాజిపూర్) యనియు, దక్షిణపుతెగ యనియు (అనగా కటకము జగన్నాథముకు వచ్చిన తెగయనియు) రెండు తెగలుగ నున్నారు. ౧. జాజిపూర్ శాఖ- ఇందారు భేదములుకలవు. ౧. కార్యాంగో బ్రాహ్మణులు, ౨. కృష్ణాత్రేయ, ౩. ఘృతకౌశి, ౪. కౌండిన్యబ్రాహ్మణులు, ౫. కౌశికబ్రాహ్మణులు ౫. బాత్సోసాంతో బ్రాహ్మణులు ౨. దక్షిణ శాఖయందు మూఁడు భేదములు కలవు. ౧. కౌండిన్య బ్రాహ్మణులు, ౨. కౌశికబ్రాహ్మణులు, ౩. బాత్సోసాంతో బ్రాహ్మణులు. ౪. శతపస్తి బ్రాహ్మణశాఖ, ౫. నందబ్రాహ్మణశాఖ, ౬. నిశంకుబ్రాహ్మణశాఖ, ౭. పర్ణగ్రాహిబ్రాహ్మణశాఖ వీనిగూర్చి సరిగా తెలియరాకున్నది.

౪. సాంతో బ్రాహ్మణశాఖ- ఇందా రంత శ్శాఖలు గలవు. ౧. గువాతోరియాసాంతోశాఖ, ౨. నోందోసాంతోశాఖ, 3. బంకిణోపళియా సాంతోశాఖ, ౪. బొత్రొసాంతో, ౫. సోర్బా షొడియాసాంతోశాఖ, ౬. బంకిణోపళియా సాంతోశాఖ.

౫. అగ్రభక్షులు- శ్రోత్రియులలో నొక తెగ. గౌడబ్రాహ్మణులలోని అగ్రదానీలవలెనే అపర కర్మములు ప్రేతకార్యములందు, దానమునందు చుండుశాఖవారు.

౬. ఘాటియాలు- పౌరోహిత్యము ముఖ్య వృత్తి. వైతరిణీనది మొదలు, గంగానదివఱకు స్నానము లొనర్చువారికిఁ గర్మలం జరిపించు వృత్తిఁ గల్గి తీర్థములందుఁ గానవచ్చుచుందురు.

౭. తేలీబ్రాహ్మణులు- (తెలుకుల బ్రాహ్మణులు) శ్రోత్రియబ్రాహ్మణశాఖ, వృత్తిపౌరోహిత్యము.

౮. శ్రోత్రియబ్రాహ్మణులు- వీరి ముఖ్యవృత్తి పౌరోహిత్యము.

౯. సాహుబ్రాహ్మణులు- వర్తకులగుట నీ పేరయ్యె నందురు.

౧౦. కొటకీబ్రాహ్మణులు- వీరిం గూర్చి తెలియరాకున్నది.

౧౧. చిటికిబ్రాహ్మణులు- వీరింగూర్చి తెలియరాకున్నది.

**ఉత్కలితము** తీసివేయుట లేక తగ్గింపు. చతుర్విధ గణితములలో నొకటి (గణితము చూడుఁడు).

**ఉత్కలుఁడు —** తండ్రిపేరు ధృవుఁడు పెద్దకుమారుఁడు. కనిష్ఠసోదరుఁడు వత్సరుఁడు. బాల్యమునందే జ్ఞానియై తండ్రిరాజ్యమెల్ల నిరాకరించినవాఁడు.

**ఉత్కృష్టదృష్టిర్నికృష్టేఽధ్యా సిత వ్యేతి న్యాయము —** ఉన్న ఒకస్థితినిపీడి దానికిపై (ఉత్కృష్ట) స్థితినందవలెననిన, వేఱొక ఉత్కృష్టపదార్థము ఉన్నతావు నాధారముగ (పునాదిగ) నిడికొని దానిపై నుండి యుందవలయు నని భావము. అనఁగా నొక ఉత్కృష్టస్థితి నాధారముగఁ జేసికుని దాని నవలంబించి తద్వారా ఉన్నతస్థితి నందవలెననుట కీన్యాయము వర్తించెడిని.

**ఉత్తచేతి మూరకొలత —** నిరర్థక మని భావము. (ఆంధ్రలోకోక్తి).

**ఉత్తమకుల గోత్రము**- ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. వైశ్యగోత్రములు చూడుఁడు. ఉతమకుల (ఉత్తమకుల, ఉతకాల కుల) గోత్రము, ద్వాష్టేయ (౧3) గోత్రము, సంస్కృతగోత్రము ఉత్తమోజస, ఉత్తమోజ గణము, నారదర్షి, ఆపస్తంబ యజుశ్శాఖ, ప్రమాణగ్రంథమాద్యప్రవరఖండ. సమానగోత్రములు, నార్యజౌత్తమోజస, ఉత్తరేశుఁడు దేవత, ఉదకాంబభార్య, హేమాచలము తపస్థానము, ఉత్తరాబ్ధితటాకము, జపము కోటి, దీపములు 3౫, క్షేత్రసంఖ్య ౭౯, జలము దానము, ఉత్తరేణి వర్జనీయము.

**ఉత్తమమనువు** తండ్రి ఉత్తముఁడనియు, తల్లి బహుళాదేవియనియు, ఈతని కాలమున సుశాంతి యింద్రుఁడనియు, వసిష్ఠసంతతి వారగు సుతేజ సంతపాదులు మహర్షులనియుఁ మార్కండేయ పురాణమునఁ గలదు. ఇతర తావుల ఉత్తమమనువు ప్రియవ్రతుని పుత్రుఁడనియు, తామసమనువునకు జ్యేష్ఠసోదరుఁడనియు విష్ణుభక్తుఁడనియు, ఈష, ఊర్జ, భూర్జ, శుచి, శుక్ర, మధు, మాధవ, నభస్య, నభ

సహు లను పదిమంది పుత్రులనియుఁ గాననయ్యె డిని. చైత్రశుద్ధ తృతీయ ఉత్తమమన్వాది.

**ఉత్తమాంగాసనము** — యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యోగాసనములలో నొకటి. పద్మాసనమున మఠము వైచుకొని కూర్చొని (పద్మాసనము చూడుఁడు) అరచేతులను ఎడుటివైపు నేలకానించి యాచేతుల యూనికబలమున శరీరమును పైకిలేవనెత్తుట ఉత్తమాంగాసనము. ఇందువలన శరరమునకుఁ చల్లదనముగల్గి కుండలినీప్రబోధమగునని చెప్పఁబడినది.

**ఉత్తమానసరోవరము** — కాశ్మీర దేశమున నందికేశ్వరక్షేత్రముకడ లోవలోఁగల గంగాబాల్ సరస్సున కీపేరుకలదు.

**ఉత్తముఁడు** — ఉత్తమ మనువు పేరందరెఱింగినదే. మఱియు నుత్తానపాదునకు సురిచికిని జనించిన సుతుఁ డొకఁ డుత్తముఁడను వాఁడుండెను. అతఁడు వేటకుఁజని యొకయక్షునిచే నిహతుఁడై యుండ నాతని తల్లి వెదకుచుంబోయి కళేబరముంగాంచి దుఃఖితయై తానును మరణించెను.

**ఉత్తమౌజుఁడు** — తండ్రి ద్రుపద మహారాజు. భారత యుద్ధమున బదునెన్మిదవ నాఁటి రాత్రి యశ్వత్థామచే నిద్రించుతరి చంపఁ బడిన వారిలో నొకఁడు. ద్రుపదుఁడు చూడుఁడు.

**ఉత్తర** — విరాట్రాజుకుమార్తె. ఉత్తరుని చెల్లెలు. అభిమన్యుని భార్య. పరీక్షిత్తుమహారాజు తల్లి. ఈమె పరీక్షిత్తును గర్భమున గల్గియుండుతరి భారతయుద్ధమున నభిమన్యుఁడు నిహతుఁ డాయెను. అట్టితరి నశ్వత్థామ యీమెగర్భస్థుఁడైన (పరీక్షిత్తు) బాలుని జంప వదలిన యస్త్రమీమె గర్భశోధన మొనర్చుతరి శ్రీకృష్ణుఁడా బాలుని రక్షించి యస్త్రోపసంహార మొనర్చెను. దీనింబట్టి ఆబాలునకు పరీక్షిత్తని నామమిడిరి.

**ఉత్తర (ఉత్తరఫల్గుణి) నక్షత్రము**- ఇది ఫల్గుణీ నక్షత్రమందలి యుత్తరార్ధము. ఆకసమున నిదియు, పూర్వఫల్గుణియుం గలసి నేత్రాకారమున నిరువది యైదు నక్షత్రములు కూడియుండు నక్షత్రవితతి. దీనికింకను పర్యాయ పదములు- ఆర్యం, ఆర్యమ్ణం, ఆర్యమణం, ఉత్తరం, ఉత్తరఫల్గుణీ అనునవి కలవు. దీనికి ఆర్యమ్ణుఁ డధిదేవత, మనుష్యగణము, ఊర్ధ్వముఖము, స్త్రీస్వభావము, ఎద్దు, మాచుకత్తి, పక్షి, రేగుచెట్టు ఈనక్షత్ర సంబంధములనియు, ప్రవేశించిన పదునెన్మిది ఘుడియలపై త్యాజ్యమనియు, నలువది రెండు ఘుడియలపై నమృతమనియు, ఇది స్థిరస్వభావ నక్షత్రమనియుం జెప్పఁబడినది. పుబ్బ (పూర్వఫల్గుణి) నక్షత్రము చూడుఁడు.

**ఉత్తర ఉరిమి వర్షించినా, పాము కరచినా ఊరకపోదు** — ఆంధ్ర లోకోక్తి.

**ఉత్తరకన్నడజిల్లా** — దీనిని కార్వార్ (కార్వాడ) జిల్లాయనియు నందురు. బొంబాయి రాజధాని చూడుఁడు.

**ఉత్తర కుమార ప్రజ్ఞలు** — భారతమున విరాట్రాజ సుతుఁడగు ఉత్తరకుమారుఁడు (ఉత్తరుఁడు) ఉత్తర గోగ్రహణోన్ముఖుఁడై తనప్రతాపమును తాఁజెప్పుకొనినట్లు వివరింపఁ బడినది. ఇక్కాలమునఁ దనశక్తికి మించిన ప్రజ్ఞలంజెప్పుకొను బడాయిమాటలను సామెతగా నుత్తరకుమార ప్రజ్ఞలని హేళనగా వాడుచున్నారు.

**ఉత్తరకురుదేశము** — గఢ్వాల్ హుండేశ దేశములందలి ఉత్తరభాగములు కలిసిన దేశభాగమునకుత్తరకురుదేశమని యొకప్పుడు పేరుండెనని చెప్పఁబడినది. తొల్లియొకప్పుడు

హిమాలయపంక్తికల్పి యవ్వలిప్రదేశము గూడ కొంత యిందు చేరియుండెనని తెలుచున్నది. ఐతరేయ బ్రాహ్మణము (౮-౧౪-౪) నందు చైత్రరథమను కాననమును, మందాకినీనదినిఁ గల్గిన దేశముగ జెప్పఁబడినది. మహాభారతము వన పర్వమున నీసంగతి కలదు.

**ఉత్తరకొంకణము జిల్లా** — థానా జిల్లా. బొంబై రాజధాని చూడుఁడు.

**ఉత్తరకోసల దేశము** — ఆదిని కోసలమంతయు నొకదేశముగ నుండినదో లేదో సరిగా తెలుపఁ బరికరములు లభింపకున్నవి గాని, దిలీపమహారాజునాఁటికే ఉత్తరదక్షిణ, కోసలములు రెండుగనైనటుల మహాకవి కాళిదాసు రఘువంశము చతుర్థసర్గ మొదటి శ్లోకమునవివరించియున్నాఁడు. పిమ్మట శ్రీరామునకుం బిదప ఉత్తరకోసలము తిరుగ నుత్తరకోసలమనియు, కోసలమనియు రెండుభాగములాయెను. దక్షిణకోసలము (తొల్లింటిది) మహాకోసలమనఁబరగెను. ఉత్తరకోసల బహ్రైచ్ మండల ప్రాంతము. దీనిరాజధాని శ్రవస్తి. ఇంక రెండవది యగు కోసలకు రాజధాని కుశావతీపురము. దీనిని కుశుఁడేలెనందురు. రామాయణము ఉత్తరకాండము౧౦౭ యందునను, పద్మపురాణము ఉత్తర ౬౭ యందునను వీనిప్రశంస కలదు. మఱియు "Sanskrit Buddhist Literature of Nepal" by Dr. R. L. Mitra. అను గ్రంథమునఁ జక్కఁగఁ జర్చింపఁబడినది. (ఇందు మహాకోసల చేరలేదు).

శ్రీరామ సుతులగు కుశ లవుల వఱకు నయోధ్య కలసియుండిన ఉత్తర కోసలకు రాజధాని యగుట తెల్లమే. అయోధ్యకు సాకేతపురమనియు పేరుండెను. ఇది సప్తమోక్షదాయక పురములలో నొకటి. సూర్యవంశపు రాజులకు రాజధానియైయుండిన నగరము. ఆనాఁటి భూపతుల కిలవేల్పగు నాగేశ్వరనాథ శివాలయమయోధ్య యందుఁ గలదు. సరయూ నదీతీరము. సరయూనదిని రామగంగ యనియునందురు. వైవస్వతముని మనుమడగు వికుక్షి కుమారుండగు కకుత్స్థుఁడు (పురంజయుఁడు) అయోధ్యను నిర్మించి రాజధానిగ జేసెనని తన పరిశీలనలనుండి జేమ్సు టాడ్ (Leut. Col. James Todd) పరిశీలకుఁడు నుడివియున్నాఁడు.

ఉత్తరకోసల- కోసల విభజింపఁబడిన పిదప ఉత్తరకోసలకు శ్రవస్తిపురము రాజధాని యయ్యెను. ఇక్కాలమున సాహెత్మాహెట్ అనుచున్నారు. తొల్లింట ధర్మపట్టణమని పేరుండెనట. అచిరావతి లేక ఐరావతి నదీతీరము. ఇది సరయూనది యందు చేరు ఉపనది. దీని నిప్పుడు రప్తీనది యనుచున్నారు. దీని ప్రశంస వరాహపురాణము ౨౧౪ యందు కలదు. రెండవది యగు కోసలకు రాజధాని యనఁబరగిన కుశావతికిం గుశాభవనపుర మనియు, కుశస్థలి యనియుఁ బేరులుండెను. ఇప్పటిపేరు సుల్తాన్పూర్. గోమతి (ఇప్పటి గుమ్తీ) నదీతీరము. క్రీ. పూ. ఆరు ఐదు శతాబ్దములనాఁడె గాక బుద్ధభగవానుని కాలమున సహా కోసల బలమగు రాజ్యమై యుండెననియు, బనారస్, కపిలవస్తు పురములందుఁ జేరియుండెననియు, శ్రవస్తి రాజధాని యనియు బౌద్ధ గ్రంథములందుఁ గానఁగుంగాని క్రీ. పూ. ౩౦౦ నాఁటికి కోసల మగధకుం జేరిపోయి యుండెను.

ఉత్తరకోసల నేలిన భూపతులు సూర్యవంశపు రాజులుగాన వేఱుగ నుడువనక్కర లేదు. కాని ప్రసేనచిత్తుఁడను భూపతి బుద్ధభగవానుని సమకాలికుఁడు. ఈయన బౌద్ధమతము స్వీకరించినవాఁడు. బుద్ధభగవానునివిగ్రహము బంగారముతో

చేయించినటుల చెప్పఁబడినది. ఇది రెండవ విగ్రహము. మొదటి విగ్రహమును కౌశాంబీ పురాధీశుఁడగు ఉదయనమహారాజు మంచిగంధపు కర్రతోఁ జేయించెనట. మొదటి విగ్రహమును గూర్చి ఫాహియాన్ వ్రాసియున్నాఁడు. పైజా బాదొకు సమీపమునంగల గోప్రతార (ఇప్పటి గుప్తార) శ్రీరాము నిర్యాణస్థలము. ఇచట గోప్రతార మహాదేవుఁడను శివలింగము కలదు. సరయూనదీతీరము. రామాయణ, ఉత్తర ౧౧౦ యందునను, స్కాందపురాణ అయోధ్య. ౬ అధ్యాయమున గుప్తహరి యని ప్రశంస కలదు.

**ఉత్తర గోత్రము** — నిధ్రువ గణము చూడుఁడు.

**ఉత్తర గోత్రము** — శండిల గణము చూడుఁడు.

**ఉత్తరఘూర్జరము** — అనర్తదేశము చూడుఁడు.

**ఉత్తరఁజూచి ఎత్తరా గంప** — అనగా ఉత్తరకార్తెయందలి వర్షముల స్థితిం జూచి వర్షముల ఆశలేకుండిన సచ్చోటువిడచి ఎచటికైనను లేచిపోఁదగునని భావము. ఆంధ్రలోకోక్తి.

**ఉత్తరధ్రువ మహాసముద్రము** — ఉత్తరధ్రువమునుండి దక్షిణమున కిరువదిమూడు న్నర డిగ్రీల దూరము (ఆర్కిటిక్ సర్కిల్) దనుక వ్యాపించియున్న సముద్రభాగము. మూడున్నర మిలియనుల చతురపుమైళ్ల వైశాల్యము కలద నియు, అందు రెండుమిలియనుల చౌకపుమైళ్ల ప్రదేశము తేలుచుండుమంచుచేఁ గప్పఁబడినది యనియు నంచనావేయఁబడినది. ఇది ఇంచు మించు చుట్టు భూమిచే నావరింపఁబడినదియై. అట్లాంటిక్కు మహాసముద్రమునుండి దీనిలోనికి మూఁడుతావులందు జలసంబంధ మార్గములు కలవు. గ్రీన్లాండు, నార్వేల మధ్య నొకటియు, గ్రీన్లాండు, కనడాల నడుమనున్న బాఫిన్స్ యొకటియు, బేరింగుజలసంధి యొకటియు, అట్లాంటిక్కు మహాంబావధితో దీనికింగల సంబంధ మార్గములుగాన, నీయుత్తరధ్రువ మహాసాగర మును ఒక గొప్ప భూగోళశాస్త్రవేత్త అట్లాంటిక్కు మహాసముద్రముయొక్క ఒక శాఖయగు సంయుక్తాగ్రగుడము (Gulf) అని వివరించి యున్నాఁడు. అట్లే తలంచినచో నిది ప్రపంచ మంతటిలోఁ బెద్దదియగు సంయుక్తాగ్రగుడమై యుండును.

ఈ సముద్రతీరములు కొంతవఱకు లోతు లేనివిగ నున్నవి. ఆ ప్రదేశములందు నోవా యాజెమ్లియా, స్పిట్స్‌బర్గెన్, ఫ్రాంజ్‌జోసెఫ్ లాండు, వ్రాంజెల్‌ద్వీపము, న్యూసైబేరియా ద్వీపము, అమెరికాకుం జెందిన ద్వీపసమూహము మొదలగు ద్వీపములు పెక్కుగలవు. నార్వే దేశపు హద్దులలో ఉత్తరాగ్రము (నార్తుకేపు) కలదు. దానిపై కింగుఓస్కారుకాలమ్ అనఁబడు తావున నొక స్తంభమును నిర్మించియున్నారు. అటనుండి ఉ వము వఱకేమియు నడును యడ్డములు లేవంకురు. మఱియు నంతదనుక నిక్కాలమున పొగయోడలు మనుష్యులం గొనిపోవుచు తిరుగ వెచ్చుచుండును.

ఇతరసముద్రములవలె నిందలినీరంత యుప్పగా నుండక చౌకలుగా నుండును. నదీప్రవాహములు భూమినుండి కరగించి తెచ్చినయుప్పును సము ద్రములోనికిం జేర్చుచుండును. సముద్రమునుండి సూర్యరశ్మి మంచినీటి నావిరిగ జేయును; కాన ఉప్పు అటులనే నిలవయుండునుగానసె సముద్రపు నీరుప్పగానుండెడిని. ఇట నటులగాక నదీప్రవాహ ములు మంచుకరగిన నీటినే ఈ సముద్రమునం జేర్చుచుంటయు, ఇట సూర్యరశ్మిచాలక నీరావి రియై పోవుటకూడఁ జాలమియు నిందలి నీరుప్పగ

నుండెను. కొందఱు పరిశీలకులు పైపొర నీరు చేకలుగనుంట క్రిందిలోతులందు నీరుప్పగ నుండుననుచున్నారు. ఉత్తరధ్రువముం జుట్టి నీరు ఘనీభవించిన మంచును, దానిచుట్టు నీటి యందుఁ దేలుచుండు మంచుగడ్డ (Iceberg) ల సమూహమును కలవు. ఇవియన్నియు గ్రీను లాండునందలి గ్లేసియరులనుండి విడఁబడి నీటం దేలుచుండునవిగఁ జెప్పుచున్నారు.

ఉత్తరదక్షిణ ధ్రువములందు సూర్యుని ఉత్తర దక్షిణాయనముల మేరకుఆరు నెలలో కేపగలుగను, ఆరు నెలలోకే రాత్రిగను ఉండును. అట్టి పగటి యందర్ధరాత్రమునసహా సూర్యునిం జూడనగును. ఆదృశ్యమును Midnight Sun అనియెదరు.

**ఉత్తరధ్రువరేఖ** (Arctic Circle)— ఉత్తరధ్రువరేఖ ఉత్తరధ్రువమునకు దక్షిణపు టెల్ల గా భావింపఁబడినరేఖ. ఇది భూమధ్యరేఖనుండి ఉత్తరముగా నరువదియారున్నర డిగ్రీలదూరమున నుండునది. మఱియు నుత్తర ధ్రువమునుండి దక్షిణముగా నిరువదిమూడున్నర డిగ్రీలదూర మునందు సరిహద్దును దెలుపు రేఖ. ఈ రేఖ పటములందు భావింపఁబడి లిఖింపఁబడునదియె గాని, నిజముగ భూమిపైఁ గాన్పించునదికాదు.

**ఉత్తరపంచనదములు** — పంచనద ములు చూడుఁడు.

**ఉత్తరపథము** — కాశ్మీరము, ఆఫ్ఘను స్థానరాజ్యప్రాంతముల కీపేరుండినటులఁ గుశీరవ శాసనమునుండి తెలియుచున్నది. దీనింగూర్చి Journal of Asiatic Society of Bengal 17- P. 492-498 యందు వివరింపఁబడినది.

**,రపాంచాల దేశము** — ఈదేశ ముగూర్చి సరిగా నేమియుం దెలియరాకున్నది. ఇప్పుడీదేశమును రోహిల్లాండమని యనుచున్నారు. ఈ పేరు రోహిల్లా మహ్మదీయులవలనఁ గల్గిన నవీననామముగ నుండనోపు. ఉత్తరపాంచాల మున కహిచ్ఛత్రపురము రాజధానియైయుండెను. అహి యనిన పాము. ఇట పాము పడగయని భావము. ఛత్రమనిన గొడుగు. మహాభారత కాలమున ద్రోణాచార్యుఁ డడవి నొకచెట్టుక్రింద నిద్రించువాని కొకపాము పడగవిప్పి మోమున కెండతగులకుండ గొడుగువలె ఆచ్ఛాదము పట్టు చుండఁ గాంచి, అది మహారాజయోగలక్షణముగ నెంచి, నీవు భూపాలుఁడవగుదువని యాతనితో ననెననియు, ఆతఁడట్లె భూపాలుఁడాయెననియు, ఆతనిపేరు ఆది లేక అధిరాజనియు, దానినుండియె అహిచ్ఛత్రపురమనియు, నతనినుండి కొందఱు వాడినటుల అధిఛత్రపురమని పేరయ్యెననియు బలమగు ప్రతీతి యాదేశమునఁ గలదు.

ఇప్పటి బరెయిలీపురమునకుఁ బశ్చిమముగా నిరువదిమైళ్ల దూరమునఁగల రామ్నగర్ అను గ్రామ పరిసరములనున్న పాటిదిబ్బల నహిచ్ఛత్ర పురముండిన తావుగఁ బోల్చియున్నారు. ఒకప్పు డీపురమున కధిరాజకోట లేక అధికోటయని కూడ పేరుండెనట. ఇప్పుడట నొక ప్రాచీన దుర్గము కలదు. అద్దానినధికోటయనుచున్నారు. క్రీ. శ. ६३० ప్రాంతముల చీనాయాత్రస్థుఁడగు హ్యూయనచ్వాంగు దర్శించినట్లు తన యాత్రా చరి త్రమున వ్రాసియున్నాఁడు. అందు కోటవెలుపల నాగహ్రదము (సరస్సు) కలదనియు, అట నొక నాగవంశస్థుఁడగు భూపతి తానుబౌద్ధుఁడై గొప్ప పడగవిప్పిన నాగమును, దాని నీడను బౌద్ధవిగ్ర హమును ప్రతిష్ఠించెననియు, క్రీ. పూ. ३४० లో నశోకచక్రవర్తి అత్తావున నొక స్తూపమును నిర్మించి. అహిచ్ఛత్రస్తూపమని పేరిడెననియు వ్రాసెను. కోట గోడలు పడిపోవుచున్నవి. కొంచెము కొంచెము లోపములతో చతురస్ర మైనది. ముప్పదిరెండు బురుజులుండెననియు, అవి ముప్పది యడుగుల యెత్తుగలవనియు, పశ్చిమ

దిశను 3౫ అడుగుల ఎత్తుండెననియు, ఉత్తరపు బురుజు (సాహెబు బురుజు) ౮౭ అడుగుల యెత్తనియుఁ దేలుచున్నది. ఈ దుర్గము నవీన నిర్మితమని తోఁచెడిని. కోటలోపల మూఁడుశివాలయముల పాడుదిబ్బలుండుటవలన మహమ్మదీయుల నాఁటికే యుండిన కోటయేమోనని తోఁపకపోదు. ఇందొకదిబ్బ ఉత్తరపుగోడకు సమీపమునందున్నది. ఇది భూమట్టముపై నరువదియడుగుల ఎత్తున నుంటయు, అటనుండిన గొప్ప శివదేవాలయమందలి శివలింగమునకు భీమేశ్వరుఁడను పేరుండెనని యచటివారు చెప్పుటయును జూఁడ నీ శివలింగము కొన్నిమైళ్లవఱకు గనుపడుచుండునట్లు నిర్మింపఁబడెనాయని తోఁచెడిని. ఆ శివలింగము ఎన్మిదియడుగుల యెత్తును, మూఁడున్నర యడుగుల అడ్డకొలతంగల్గియుండెనట. ఈ పాటి ప్రదేశము త్రవ్వంబడిన తావులందిదేశపు భూపతుల పాతకాలపు నాణెము లనేకములు దొరకినవట. ఇంక నిట మిహిరవిహారము (బౌద్ధులది) పరేశనాథ విగ్రహాము (జైనులది) మొదలగునవి పోల్చియున్నారు. క్రీ. వె. ౧౦౦౮ వఱకు అహిచ్ఛత్రపురము నివసింపఁబడుచుండెడిదట. మహమ్మదీయులు దండెత్తివచ్చిన యదనున వదలివేయఁబడినదట. దీనిని క్రీ. వె. ౧౭౫౦లో రోహిల్లాప్రభువగు ఆలీ మహమ్మదు చాలధనము వ్యయపర్చి కోటంబాగుచేయించినను వదలివేయవలసివచ్చెనట.

ఉత్తరపాంచాలమును వేనుచక్రవర్తి యేలినట్లు తెలుచున్నది. ఈ వేనుఁడు ఏలిననాఁటి సంగతులు మనకు సరిగా తెలియవుగాని యీతనింగూర్చి పురాణగాథలలోఁ జెప్పఁబడినసంగతి నించుక నిత్తరుణమున వివరించుట సమంజసము. స్వాయంభువువంశస్థుండగు. తండ్రిపేరు అంగభూపతి. తల్లి పేరు సునీథ. ఈమె మృత్యుకుమార్తె యని చెప్పఁబడినది. కుమాళ్లు, పృథుచక్రవర్తియు, నిషాదుఁడు ననువారలు, పృథుచక్రవర్తి సుప్రసిద్ధుఁడు విష్ణుదేవుని ఏకవింశద్యవతారములలో నొక యవతారముగఁ జెప్పఁబడినవాఁడు. నిషాదుఁడు నిషాదజాతివారికి మూలపురుషుఁడు. ఈతని పాలననుండియె నిషధరాజ్యమని పేరుకల్గెనని తలంపఁబడుచున్నది. వేనుఁడు దుర్మార్గుడగు చక్రవర్తి. శాపోపహతుఁడై మృతినందెనని చెప్పఁబడినది. పృథుచక్రవర్తికి వేన్యుఁడని పేరుఁ కలదు. బహుశః ఆయనయు నీతనిదేశమునే పాలించియుండనోపు. వేనునికాలమున రాజధాని అహిచ్ఛత్రమని చెప్పఁజాలము. కాని భార్యపేరు కేతపీదేవి యని తెలియుట కాన వాళ్లు కలవు. నగటున వేనుచక్రవర్తి కేతపీదేవి యానవాళ్లు రోహిల్ఖండునీమయం దంతటను గానగుచున్నవి. కొందఱు వేనుచక్రవర్తి రాజధాని పురము. రోహిల్ఖండు కుమాన్ రెయిల్వే కురియాస్టేషనుకు రెండుమైళ్లదూరమున నున్న మతియనం బను గ్రామమునుండి కడుదూరము వ్యాపించియున్న పాటి యానవాళ్లప్రదేశమై యుండనోపు నని తలంచుచున్నారు. కాని యిది యింకను పరిశీలనలకు లోనుగావలసియున్నది. ఈదేశపు పాడులందు దొరకిన నాణెములంబట్టి చూచిన నీదేశమును మిత్రవంశపుభూపతులు, కుషానులుకూడ పాలించియుండిరని తోఁచెడిని.

**ఉత్తరబ్రిటీషు అమెరికా, నార్తువెస్టు టెరిటరీ** — ఇది చాలగొప్ప విశాలప్రదేశము. కెనడాదేశమునుండి ఉత్తరముగా నుత్తరధృవమువైపు చాలదూరము వ్యాపించియున్నది. కడు శీతలప్రదేశము. ఆర్కిటిక్కు సముద్రప్రాంతము. దీని తొల్లింటిపేరు Hudson Bay Territory అని యుండెను. ఇప్పుడు North-West Territory అనఁబరగుచున్నది. అది తూర్పునకు ఉత్తరమునకు ఇంచుక ఏటవాలు

గల సమతలప్రదేశమని చెప్పనొప్పును. ఇందనేక సరస్సులు కలవు. వీనిపై మంచు ఎన్మిదడుగుల వఱకు ఘనీభవించుచుండును.

ఈప్రదేశమున నుత్తరభాగములం దెస్కిమో జాతివారును, దక్షిణభాగములందు అమెరికన్ ఇండియన్ జాతులవారును ఆదిమనివాసులు. వీరు చేపలను బట్టుట, వేటాడుట వృత్తులుగాఁ గల్గిన వారు. ఇటీవల కొందఱు ఐరోపాజాతులవారు బ్రిటీషు తెగవారు కాపురము గుదిరిరి. పూర్వము చర్మములు (Furs) వర్తకపుదినుసులై యుండెను. ఇంగ్లాండుదేశ మేలిన రెండవ ఛార్లెసుభూపతి పాలనమున హడ్సన్ బే కంపెనీ యను నొక వర్తకసంఘమేర్పడి ఇట చర్మములు కొని ఎగుమతి చేయుచుంటయెగాక, ఈ ప్రాంతముల రాజ్యపాల నయు నెరపుచుండెను. పిదప క్రీ. శ. ౧౮౭౫ లో పరిపాల నాధికారమును బ్రిటీషుప్రభుత్వమువారి కీసంఘమువారు వశపర్చిరి. పిదప గొప్ప బం గారుగనులు అలాస్కా సమీపమున యూకాన్ నదీతీరములందు క్లోండైకు ప్రాంతముల దొరకు టంజేసి కొంతమార్పును, అభివృద్ధినిగల్గించినది. ఇప్పు డీప్రాంతసీమల పరిపాలన నెరపుట కొక గవర్నరును బ్రిటీషుప్రభుత్వమువారు నియమించు చుందురు. దీని కుత్తరమున పోలారుప్రదేశమునం దారునెలలు రాత్రియు, ఆరునెలలు పగలును గల్గియుండును. పరిపాలనా కార్యస్థానములు డాసన్ (Dawson City)అను తావున నిర్మించిరి. ఇది యూకాన్‌నది క్లోండికానదుల సంగమము దరిని చక్కనిపురమై తనరారుచున్నది.

ఈ సీమలు వ్యవసాయమున కనర్హము లని చెప్పఁదగియున్నను గోధుమలు, బార్లీ ధాన్యము, బంగాళాదుంపలు అనుకూల పరిస్థితులుగల ప్రదేశముల నాటి పైరు చేయుచున్నారు. ఈప్రాంతముల కస్తూరి ఎద్దులు కలవు. వాటియందు (వార్ధక్యమున) కస్తూరి మృగములందువలెనే కస్తూరి దొరకుచుండును. (కనడా దేశము చూడుఁడు).

**ఉత్తరమద్రదేశము** — పురాణ ప్రసిద్ధమగు మద్రశబ్దము, మదయై రానురాను మాదయై కడకు "మేడియా" గా మార్పైనదని తలంపఁబడుచున్నది. మేడియా తొల్లింటి యార్య సంతతివారగు పారశీకుల నివాసభూమి యని యెఱుంగునది. దేవతా పక్షవలంబులగు నార్యుల నుండి వేఱైన రాక్షసపక్షావలంబులగు తొల్లింటి కాలపు టార్యులు పారశీకు లనఁబడుచున్నారు.

**ఉత్తరవిదేహదేశము** — ఈదేశము నేపాళదేశమందలి దక్షిణప్రాంతమని తలంపఁ బడు చున్నది. ఆకాలమున దీనికి రాజధానియగు గంధవతీపురముండిన ప్రదేశపు పరిసరదేశము. ఇది విదేహ (మిథిల) దేశమున కుత్తరముగనున్న దేశభాగము. విదేహమునకు దక్షిణ విదేహదేశ మనియు, దీని కుత్తరవిదేహ మనియు పేరులు గల్గి యుండనోపు. ఆదియందు విదేహుఁడను భూపతి రెండు దేశముల నేకముగ నేలుకతమున నంతకును విదేహ దేశమని పేరు గల్గియుండుననియు, పిదప విభాగమై ఉత్తరభాగమున కుత్తరవిదేహమనియు, దక్షిణభాగమునకు దక్షిణవిదేహమనియు పేర్లు గల్గియుండుననియు, కాలానుగతముగ నుత్తర విదేహము నేపాళముచే నాక్రమింపఁబడి యుండుఁ జేరిపోయి పేరు మాసియుండును. పిదప దక్షిణ విదేహమె, విదేహదేశమని వాడుక నందియుండు ననియు, మిథిలయను పేరు కారణాంతరమున గల్గియుండుననియు తలంపఁబడుచున్నది.

**ఉత్తరాగమములు** — ఆగమములు చూడుఁడు.

**ఉత్తరాగ్రము** — నార్తుకేప్ అగ్రము చూడుఁడు. ఉత్తరధృవమహాసముద్రము చూడుఁడు.

**ఉత్తరాభాద్ర నక్షత్రము** — ఇది భద్రానక్షత్రమునందలి యుత్తరభాగము. పూర్వోత్తర భాగములుకలసి, భద్రానక్షత్రము మంచపుకోళ్లను బోలి నాల్గు నక్షత్రముల కూడికగాఁ గన్పట్టును. దీనికింకను అహిర్బుధ్న్యయనియు, ఉత్తరాభాద్రక మనియు, నిశాముఖ మనియు పర్యాయనామములు కలవు. ఉత్తరాభాద్రకు అహిర్బుధ్నుఁ డధిదేవత, మనుష్యగణము, ఊర్ధ్వముఖము, దండాకారము పుంస్వభావనక్షత్రము, గోవు, గుడ్లగూబ, పిచుమందవృక్షము, ఈ నక్షత్ర సంబంధములనియు, ప్రవేశించిన ఇరువది నాల్గు ఘడియలపై త్యాజ్యమ (విషఘటికలు) నియు, నలువది ఘటికలపై నమృతమనియు, ఇది స్థిరస్వభావనక్షత్రమనియుం జెప్పఁబడినది. (పూర్వాభాద్ర నక్షత్రము, చూడుఁడు)

**ఉత్తరాయణము** — అయనములు చూడుఁడు. భూచలనము చూడుఁడు.

**ఉత్తరాషాఢ నక్షత్రము** - ఇది ఆషాఢ నక్షత్రము యొక్క ఉత్తరభాగము. పూర్వాషాఢ ఉత్తరాషాఢలు కలసి యాకసము నందొక చౌకమువలె నాల్గునక్షత్రముల కూడిక గోచరించును. దీనికింకను విశ్వమనుపర్యాయ నామము వాడియున్నారు. దీనికి విశ్వదేవతలు అధిదేవత, మనుష్యగణము, ఊర్ధ్వముఖము, స్త్రీస్వభావము, శయ్యాకారనక్షత్రము ముంగిస, కోకిలపక్షి, వేరుపనసచెట్టు ఈనక్షత్ర సంబంధము లనియు, ప్రవేశించిన ఇరువది ఘడియలపై త్యాజ్యమ (విషఘటికల) నియు, ఇరువదినాల్గు ఘడియలపై నమృతఘడియలనియు, స్థిరస్వభావ నక్షత్రమనియుం జెప్పఁబడినది. (పూర్వాషాఢ నక్షత్రము చూడుఁడు).

**ఉత్తరుఁడు** — మత్స్యభూపతియగు విరట్రాజ పుత్రుఁడు. క్షత్రియున కుండదగిన ధైర్య స్థైర్యములు లేనివాఁడు. చెలెలు ఉత్తర. ఈమె అభిమన్యుని భార్య. (ఉత్తరకుమార ప్రజ్ఞలు చూడుఁడు).

**ఉత్తరేణిచెట్టు** — లా. Achyranthes aspera లేక Achyranthes bidentata. ఆంగ్ల. Prickly-chaff flower tree. సం. అపామార్గ, ఖరమంజరీ, మయూరక, అనియందురు. దీనిని వైద్యులు పలువిధముల వాడుచున్నారు. సమూలరసము లేక కషాయము- త్రిదోషములను హరించును. జిహ్వాదోషముబాపును, పైత్యమునడంచును. విరేచనముజేయును. మూత్రము వెడలించును. పుప్పిపంటిబాధ నివారించును ఉబ్బులుతగ్గును. ఉదరరోగములు శమించును. కందిరీగలు, తేనెటీగలు కరచినబాధ నివారించును. ఉత్తరేణి విత్తులలోని బియ్యము కాయసిద్ధికరమని చెప్పబడినది. పుంస్త్వమునడంచి శరీరపుష్టి గల్గించును. వెర్రికుక్కవిషము (Hydrophobia) హరించును. విషహరమై మంటతగ్గించును. పూత వెన్ననూరినముద్ద పట్టించిన సర్ప, వృశ్చికాదుల విషముల నడంచి బాధ శమింపఁజేయును.

ఉత్తరేణి సమూలము భస్మమొనర్చిన నది వ్రణములు మాన్పుననియు, కర్ణరోగముల మాన్పుననియు, మఱియు నుత్తరేణి చూర్ణము ఉబ్బరోగము, రక్తగ్రహణి నివారించుననియు, మూత్రమువెడలించి, ఇంచుక బలకరమగుననియుఁ జెప్పఁబడినది. ఆకునందు చలిజ్వరము, వరుస జ్వరములను రాకుండనాపు గుణముగలదనియుం జెప్పఁబడినది.

**ఉత్పద్యన్తే (పలీయన్తే దరిద్రాణాం మనోరథాః** —దరిద్రులయొక్క మనోరథము (కోర్కెలు) లెట్లుజనించుచుండునో, అట్లే నశించు

చుండునని భావము. ఇది సంస్కృత భాషయం దలి లోకోక్తి.

**ఉత్పన్నైకాదశి** — మార్గశిర బహుళ ఏకాదశి. ఉత్పన్నగమయుని భార్యయని యెఱుం గునది. ఆ సతీమతల్లి పేరంబరగు పర్వదినము. కార్తిక మార్గశిర మాసములయొక్క ఉభయ పక్షములందలి నాల్గు ఏకాదశి తిథులందు శుక్ల, కృష్ణైకాదశీ వ్రతమాచరింతురు. ఇటుల వ్రత దినములుగనైనది. (పండుగలు చూడుడు.)

**ఉత్పలావతీదేవి** — భర్త సురాష్ట్రుఁడు. కుమారుఁడు తామసమనువు. సురాష్ట్రునకు ప్రియవ్రతుఁడనియుం బేరుండెనని తెలియుచు న్నది. ఉత్పలావతీదేవికి కారణాంతరమున శాపము గల్గి మృగరూపధారిణియై భర్తయగు సురాష్ట్రుని స్పర్శమున గర్భము ధరించినదని చెప్పఁబడినది.

**ఉత్పలావతీనది** — దీని నిప్పుడు వైపార్ అనుచున్నారు. అరవదేశమున తిరునె ల్వేలిజిల్లాలోనున్నది. దీనిప్రశంసమహాభారతము భీష్మపర్వము ౯ అధ్యాయమునను, వామన పురాణము ౧౩ అధ్యాయమునను ఉత్పలావతీనది పేర్కొనంబడినది. కాని, ఇది యేనదియో యని పెక్కండ్రు సంశయించుచున్నారు.

**ఉత్పలారణ్యము** — కాన్పూరునకుం బదునాల్గుమైళ్లదూరమునం దున్న బ్రహ్మావర్తము (బిఠూర్) కడనున్న వాల్మీకాశ్రమప్రాంతారణ్య మునకుఁ బేరు. (నవారణ్యములు చూడుడు).

**ఉత్పలావతీపురము** — (పుష్కలావతీ) గాంధారదేశము చూడుడు. ఇప్పుడు కేలీ యనఁ బడు తావు.

**ఉత్సంగహస్తము** — హస్తాభినయనము చూడుడు. భరతశాస్త్రము చూడుడు.

**ఉత్సరిగోత్రము** — కుశిక గణము చూడుడు.

**ఉత్తానపాదుఁడు** — (మహారాజు) తండ్రి స్వాయంభువమనువు. తల్లి శతరూపాదేవి. ఈతఁడు రెండవపుత్రుఁడు. ఈతనికి సునీతి, సురుచి యను పేళ్లుగల యిద్దరు భార్యలు. పుత్రులు సునీతివలన ధ్రువుఁడును, సురుచివలన ఉత్తముఁడును కల్గిరి. ఈయన రాజధాని బ్రహ్మా వర్తపురము (ఇప్పటి బిఠూర్) గ సోల్పఁబడి నది సంయుక్తరాష్ట్రములలో కాన్పూరున కనతి దూరమునందున్నది.

**ఉత్తానబర్హి** — మరీచి సంతతి. సూర్య వంశ క్షత్రియుఁడు. తండ్రి శర్యాతి. పితామ హుఁడు వైవస్వతమనువు. సోదరులు అనర్తుఁడు, భూరిసేనుఁడు, సుకన్యకయనువారు.

**ఉత్మాన్‌రాజవంశము** — ఉస్మాన్ లేక ఉత్మాన్ రాజవంశము చూడుడు.

**ఉత్రాక్షగోత్రము** — ధనంజయ గణము చూడుడు.

**ఉత్తీర్ణేచ జలేపారే నౌకాయాం కింప్రయోజనమ్** — ఏరు దాటిన పిదప నావతో నేమిప్రయోజనమున్నది? లేదనిభావము. ఇది సంస్కృతలోకోక్తి.

**ఉదకమండలము** — దక్షిణదేశము నందున్న సుప్రసిద్ధసమశీతోష్ణప్రదేశము. చెన్నపురి ప్రభుత్వమువారి వేసవి నివాసస్థానము. దీని నాంగ్లులు Queen of Hill Stations అనియె దరు. పళనికొండలయందు నీలగిరి యనఁబడు పర్వతముపైనున్న తావు. సముద్రపు నీటిమట్ట ముపై ౭,౫౦౦ అడుగుల ఎత్తు. ఎక్కువ చల్లని గాలి, వాతావరణము చాల పరిశుభ్రముగా నుండును. సగటున ఉష్ణపరిమాణము (ఫారిన్హైటు థెర్మామీటరు) ౫౭-3.3 డిగ్రీలుండును. ౬౧-౬౬ డిగ్రీలకధికముగాదు. ౫౪-33 డిగ్రీలకు తగ్గదు. జూన్ మాసపు మధ్యభాగమున నైఋతి

మాన్సూను వర్షములు ప్రారంభమగు తావు. రెండునెలలు వర్షించును. జనవరి, ఫిబ్రవరి, మార్చినెలలందు గాలి చాల పొడిగానుండును. చెట్లు చేమలు ఉదకమండలమున చక్కగాఁ బెరుగును. తోటలధికముగాఁ గలవు. బాటలు విశాలమైనవి. పట్టణమంతయు నుద్యానవనము వలెనే తోఁచెడిని. ఉదకమండలముంజుట్టియున్న దృశ్యము తమదేశమునుబోలునని ఆంగ్లులనెదరు. బొటానికల్ గార్డెన్సునందు వింతవింతచెట్లుకలవు.

**ఉదకము** (Water) — జలము. ఉదకము ఉప్పునీరనియు, తీయని నీరనియు ద్వివిధము. సముద్రము సర్వసాధారణముగ ఉప్పునీరు. నదులు ప్రవహించుతఱి, తమతోఁ గొనితెచ్చిన భూమియం దలి లవణమును సముద్రమునవిడచి, ఉదకములు సూర్యుని వేడికి ఆకసమున కేగుచుండును. ఉప్పు సముద్రముననే నిలచియుండును. ఇటుల తరతరము లుగ, కాలములకొలది సముద్రమున జేరిన యుప్పువలన, సముద్రపునీరు సాధారణముగ నుప్పగనే యుండును. సూర్యరశ్మి తగిలి ఆవిరి కాకయు, నదీజలముల సంబంధము దూరముగ నుంటయుంగల ఉత్తర, దక్షిణ ధృవముల నీరంత యుప్పగా నుండక చౌకలుగా నుండును.

వర్షమున గురియు నది మంచినీరే. ఉప్పునీరు మహాసముద్రములుగను, సముద్రాఖాతసంయుక్తాగ్ర గుడాది పలురూపముల దనరెడిని. మంచినీరు నది సరోవర కూప జలపాత జలబుద్బుదాదిరూప ముల దనరెడిని. జలములంగూర్చి ఉదకము దాని రూపములును, Sea portions ను చూడుఁడు.

**ఉదకము దాని రూపములు** — పంచభూతములలో రెండవదియగు నుదకము ఘనరూపము, ద్రవరూపము, వాయురూపము నను మూఁడురూపములుగ నుండునని తలంపఁ బడుచున్నది. ఇందింకను భేదములుగల్గి సగ టున పదిరూపములై తనరెడిని.

ఘనరూపము (Solid form) మంచుగడ్డ మొదలగు గట్టిపడిన ఉదకముయొక్క రూపము గను, ద్రవరూపము (Liquid form) ఉదక రూపముగను, వాయురూపము (Gas form) నీటి ఆవిరిగను ఉండెడిని. అందు ఘనరూపము ౧. Ice, ౨. Hail, 3. Snow అని మూఁడు రూపములు గలది. ద్రవరూపము ఉదకమె. ఇది ప్రవహించదగిన ౧. ఉదకరూపముగను, ౨. మేఘరూపముగను, 3. Mist, ౪. Fog, ౫. Hoar Frost అనంబడు నయిదు రూప ములు గలది. ఇంక మూఁడవది యగు వాయు రూపము. ౧. ఆవిరి (Vapour,) ౨. Dew అనంబడు రెండు రూపములు గలది.

౧. Ice- ఇది భూమినుండి ఆకాశమువైపు చాల నెత్తగు ప్రదేశములనుండి శీతలమువలన నటకేగిన నీటిఆవిరినుండి ఏర్పడిన మేఘములందలి చిన్నచిన్న జలకణములు గట్టిపడి (ఘనీభవించి) మంచు యొక్క చిన్నచిన్న కణములై యుండును. ఇవి సిమ్లా మొదలగు ఎత్తుగనుండు శీతలప్రదేశ ముల వర్షముగ నొక్కొక్కప్పుడు వర్షించుటయుం గలదు. మరియు నీ ఐస్‌ను గట్టిపడిన పెద్దపెద్ద పలకలుగ (Blocks) యంత్రసాహాయ్యమున జేయగలము. దీనిని పగులగొట్టి వేసవికాలమున (Artificial Ice) చల్లగ నుండుటకు Aerated Waters నందుంచి కరగించి త్రాగుదురు.

౨. Hail- ఒకప్పుడు భూమినుండి ఎగుర గొట్టఁబడిన బుగ్గియొక్క త్రసరేణువులు (బుగ్గి యొక్క పరమాణువులు) (Minute particles of dust) చుట్టును ఆకసమునుండి నేలకుం దిగుచున్న Ice particles చుట్టుకొని శీతలము వలన గట్టిపడి చిన్నచిన్న గట్టిముక్కలవలె నేలం

బడును. వీనిని వడగండ్లు (Hail stones) అనెదరు. కాని వడగండ్లు గిట్టిపడిన వర్షబిందువులు కానేరవు.

3. Snow- ఐస్‌యొక్క పరమాణువుల సముదాయము, శీతలముయొక్కపనిగా దగ్గిర చేరి ఒకటి నొకటి హత్తుకొనియును కలసిపోక, పెద్దపెద్దవిగూడ నగుచు, భూమియొక్క ఎత్తగు ప్రదేశములను, అతిశీతలప్రదేశములను పడియుండునది. దీనికిని యంత్రసాహాయ్యమున చేయబడిన Ice blocks కును గల ముఖ్యభేదము, Snow వసులుగానుండి Ice particles వేఱ్వేఱుగ దోచుచున్నను ఒకటికొకటి దగ్గిరగానుండి హత్తుకొనుచు, బురదవలె మెత్తగ నుండుటయు, చేయబడిన Ice blocks నందు, Ice కలిసిపోయి, గట్టిబడి (ఘనీభవించి) రాయివలె కఠినమై యుండుటయు నని యెఱుఁగునది.

ఒకప్పుడు Snow పొరలు పొరలుగ నొకటిపై నొకటి పడఁతరి, పైపొరలయొక్క బరువువలన క్రిందిపొరలు నొక్కబడియు, అదుమబడియు (Hard pressed) గట్టిబడి కఠినమై యంత్ర సాహాయ్యమున చేయబడిన Ice blocks వంటి కఠినతం గల్గినవగును. దీనిని Solid Ice అందురు. ఇంక మేఘములు ఐస్‌గను, స్నోగను మారగల శీతలప్రదేశము, భూమియొక్క వేఱ్వేఱు ఎత్తుప్రదేశములుగ నుండును. దీనికి Snow line అనెదరు. ఈ హద్దునుండి పై ప్రదేశముల వేసవికాలపు ఎండవేడిమికూడ, ఇచటి Snow ను గాని, Ice ను గాని కరగించి నీరుగ మార్చదగు బలము చాలనిదిగనుండును. భూమియొక్క ఉత్తర, దక్షిణ ధృవ ప్రదేశముల (North and South Frigid Zones) నీ Snow line సముద్రపునీటి మట్టముం దాకి, యటనుండియె ప్రారంభమగును. అటనుండి భూమధ్యరేఖ (Equator) వైపు ఏగుతరి, ఉష్ణప్రదేశములలోని కేఁచో సముద్రపు నీటిమట్టముపైనుండి ౧౩,౫౦౦ అడుగుల ఎత్తునుండి ౧౮,౦౦౦ వేల అడుగుల ఎత్తున కెక్కియుండును. భూమధ్యరేఖ ప్రాంతముల సముద్రపు నీటిమట్టముపై పందొమ్మిదివేల అడుగుల ఎత్తున గాని, మేఘములు Snow కరగిన, శీతల ముండ నేరదు. అనగా నంత ఎత్తుగల పర్వతములుండె నేని, అట Snow line ప్రారంభమగుట గాన నగును.

ఇటుల ఐస్, హెయిల్, స్నో మూడును ఉదకముయొక్క (గట్టిపడిన) ఘనరూపములుగా నెఱుఁగునది. పిదప నుదకముయొక్క ద్రవరూపము వివరింపఁబడును. ఇది యైను రూప భేదములుగలది. దీని నాంగ్లమున Liquid form అనెదరు.

౧. ఉదకరూపము- ఇది ఎల్లరకు సర్వసాధారణముగ సముద్రములందు, నదులందుఁ గానఁబడు రూపము. ప్రవహించుటకు వీలగునంత పలచనగా నుండునది. ఉదకమునందలి శీతోష్ణస్థితి మహా వాయుమండలము నందలి శీతోష్ణస్థితి ననుసరించి దానికన్న కొంతయెక్కువగ నుండును. ఏలనన ఉదకలక్షణము శీతము. ఉదకము ద్రవరూపమున ఉదకముగనే యున్నను, ఘనరూపమున మంచుగనున్నను, వాయురూపమున ఆవిరియై యున్నను బహుశాకేరీతిం దూగును. ఒకపౌను ఉదకమును, దానియొక్క యావిరియు, దానితో చేయఁబడిన మంచుగడ్డయుం గూడ నొకబరువే యుండెడిని. ఉదకమునకు వేఁడి విరుద్ధ పదార్థమని సర్వసాధారణముగ నెల్లరచే తలంపఁబడుచున్నది. కాని, ఆర్యుల వేదమునందు. 'సృష్టియందాదిని ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నే రాపః (సంభూతా)' అని చెప్పఁబడినది. అనగా

తొల్లుత ఆకాశమును, ఆకాశమునుండి అగ్నియు, అగ్నినుండి ఉదకమును, కల్గినవని చెప్పఁబడినది. ఇందువలన ఉదకమున కగ్ని మాతృస్థానమని తేలును. ఇంక నీయుదకమున కగ్నితో సంబంధముగల్గుతరి సంభవించు పరిస్థితులను వివరింతుము. ఒకపౌను మంచును థర్మామీటరుతో పరీక్షించిన ముప్పదిరెండు డిగ్రీల వేడి (32°F.) యందుంట గానవగును. ఆమంచును మహావాయు మండలియందు మూయక యుంచితిమేని క్రమముగ మెల్లగ కరగి ఉదకమగును. ఇట్లుకరగి యుదకముగ మారుటకు బహిర్వాయువుండలి యందున్న వేడిని తొంబది డిగ్రీలవఱకు (90°F) మంచు గ్రహించుకొనును. ఇట్లు గ్రహింపఁబడిన వేడి ఘనీభవింప చేయంగల శీతలము (Freezing Point) నుండి ఉడుకునట్లు చేయుంగల వేడి (Boiling Point)వఱకుంగల వేడిలో సగమని (Half way between freezing point and boiling point) మనస్సునందుంచుకొనవలయును. ఇంతవేడి గ్రహించుకొని ఐస్ ఉదకముగ మారినదైనను, ఆయుదకమును మనము Thermometer తో పరీక్షింతుమేని పూర్వమువలె ముప్పదిరెండు డిగ్రీల (32°F.) వేడినే చూపించును. తక్కినవేడిని తనయందణచికొనియుండునని భావము. అట్టివేడిని Latent Heat అని వాడెదరు. అనీటిం దిరుగ మంచు గడ్డగ (Ice block) మార్చినచో నందుండిన వేడి తప్పించుకొని బయటపడి తిరుగ మామూలు (Sensible Heat or Specific Heat) వేడిగమారును. ఉదకమునకు వేడింగూర్చి వెచ్చ జేయుటకు తక్కిన ఇతరపదార్థములను , వెచ్చ జేయుటకు వలయు వేడికన్న నెక్కువ పరిమాణముగల వేడి కావలయును. వేడియొక్క పరిమాణమును కొలచుటకు పాదరస ముపయోగపడును. ఏలనన పాదరసమునకు వేడితో సంబంధముకలుగగనే పైకి యెక్కు లక్షణము దానికిగలదు. కాన థర్మామీటరు నందు పాదరసముంబోసి దానిని వేడికడ నిడి, అందలి పాదరసము పైకిలేచుటనుండి ఇన్ని డిగ్రీల వేడియని గ్రహింప గలుగుచున్నాము. ఇట్లు ఒకపౌను పాదరసమును ముప్పది డిగ్రీల వఱకు ఎత్తగల వేడితో ఒకపౌను ఉదకము ఒకడిగ్రీ ఎక్కువ వేడిగలదగును. అనగా పాదరసమును వేడిచేయుగల వేడియొక్క పరిమాణమునకు ముప్పదిరెట్లెక్కువ పరిమాణము గలవేడిచేగాని నీరు వెచ్చబడదని భావము.

ఇందువలన నొకపౌను ఉదకమునకు ఒకడిగ్రీ వెచ్చదనముం గల్గించనోపిన వేడి, ఒకపౌను పాదరసమునకు ముప్పది డిగ్రీల వెచ్చదనముం గల్గించనోపునని తేలుచున్నది. పాదరసముకన్న ఉదకమునకు ముప్పదిరెట్ల వేడి అధికముగ కావలయును. ఇది Specific Heat అని యెఱుంగునది.

పాదరసము చాల తక్కువవేడింగ్రైకొనునదని ఇందువలన గ్రహించనగును. దీనిని కొలచుట యందుపయోగింతుముగాన దీనిందొల్లుత వివరింపనయ్యెంగాని, ఇతరపదార్థములతో పోల్చి చెప్పునెడ నుదకమునకు నాల్గురెట్లు వేడి యెక్కువ కావలయునని యెఱుంగునది. 5.36 పౌనుల ఉదకము ఘనీభవించుస్థితి (Freezing Point) నుండి, ఉడుకుస్థితి (Boiling Point) కిం జేరుటకు ఎంతవేడికావలయునో అంతవేడిచే ఉదకము ఆవిరిగా మారును. తిరుగ ఆవిరి మంచు గడ్డయగునేని దానియందు Latent గా నడగియుండిన వేడియంతయు బయటంబడి Sensible Heat అగును.

ఇందు వేఱొక చిత్రము గలదు. నీరు ఆవిరి యగుటతో శీతలమును, నీరు ఘనీభవించి మంచు గడ్డయగుటతో వేడియును, చుట్టుపట్ల ప్రదేశము

లకును భూమికింగూడ గలుగును. ఒక Porous పాత్రయగు మట్టికుండయందు నీరుపోసి, వేడిగ నుండు గాలిగల ఎండతగులక వేడిమాత్రము తగులునట్లు నీడయందుంచినచో కుండ ప్రక్కల గుండా పైకి చిమ్ముచున్న (Ooze out) చెమ్మ నీరా వేడిగల వాతావరణమునందావిరియగుచుండ లోని నీరు చల్లబడియుండును. నీటికి తిన్నగా ఎండ తగులునేని, నీరు వేడెక్కుంగాన నీపని జరుగుటకు వీలుండదు. దీనివలన పై సంగతి ఋజువుకాగలదు.

౨. మేఘము - (Cloud) ప్రపంచమందలి జలనిలయములనుండి సూర్యరస్మిచేగాని, వేడి గాడుపులచేగాని, ఇంక వేఱేయే కారణములచేఁ గాని నీరు ఆవిరియై వేడిగలదియై తేలికయగుట నాకసమువైపు పైకివెడలిపోవును. నిజముగ నీటి ఆవిరి కండ్లకగుపడని చిన్న ఆవిరికణములైనను పైకిపోయినకొలఁది గాలియందుండుతరి గాలికిం గల్గిన చల్లదనమువలన ఆవిరియణువులు ఒకటి కొకటిపాతుకొని దరిజేరి కొంచెము దట్టముగుట వలన చిన్నచిన్న ఉదకకణములుగ నేర్పడియు నతితేలికయగుట గాలియందుఁ దేలుచుండుంగాన బరువుగానుండమి క్రిందికి బడజాలకుండును. దీనికిం గొంతరూపముగల్గి కండ్లకు గన్పింపనారంభిం చును. వాయుప్రవాహమెటనుండి యెటువీచిన టు గొట్టుకొనిపోవుచు ఆకసమున దేలుచుం డును. వానికి మేఘములనిపేరు. మేఘములు నిజముగ అతిసూక్ష్మములగు ఉదకకణముల సముదాయమేగాని యావిరిగాదు గాన ద్రవ రూపమగు ఉదకముులజాతియందే చేర్చంబడినది. Mr. Tyndal అను ప్రసిద్ధుండగు శాస్త్రపండి తుఁడు మేఘములను Water dust అనివచించి యున్నాఁడు. మేఘములు వర్షాకాలము సమీ పించుకతన గల్గెడి శీతలవాతావరణమున కలసి పెద్దవగు జలకణములై బరువగుట నేలపయిం బడును. దీనినే వర్షమందుము.

3. Mist- మేఘము కొండప్రక్కలంగాని, భూమిపైఁగాని జేరియుండుతరి మిస్టు అనం బడును. ఇది మేఘముకన్న చాల పలుచనదై యుండును. సముద్రతీరప్రాంతములను, నదీతీర ములను పెద్దపెద్ద సరస్సులయొక్క తీరములందు నను Mist కూడుచుండును. సమశీతోష్ణముగు ప్రాంతముల నీ Mist కూడుంగాని వేడి అధిక మగు తావులంజేరదు. కొండలపై కొంత వేడి తగ్గియుండుంగాన అట Mist జేరుటగాననగును.

౪. Fog-mist ను, Fog ను ఒకటియె నని మున్ను వివరింపఁబడియెను. Fog దళసరిగా నుండును. ఇది ఎక్కువ భాగము, బుగ్గి మొద లగు అన్యపదార్థముల నాశ్రయించి, వానిం జుట్టుకొని యుండెడిని. యంత్రకర్మాగారములు (Factories) విస్తారముగ నుండు తావులందు ఆకసమున వాయుమండలిలోఁ దేలుచున్న బుగ్గి (Dust) కణములం జుట్టుకొని, దట్టమై Frost సూర్యరస్మిం జొరనీయని దట్టము గలదియై, ఆకసము నావరించియుండుటయు పిదప ఎండవేడి మికి తిరుగ నందలి జలకణము లావిరియై, ఎగిరి పోవుటయు చూడనగును.

౫. Hoar frost- నీటియావిరి భూమినుండి ఎక్కువదూరము పై కేగకుండగనే, వాతావరణ మతి శీతలమై భూమి చల్లబడుట, ఆవిరి నాశ్రయించును. శీతలమె యుండెనేని ఆ యావిరి కణములు చిన్న చిన్న జలకణములై భూమియం దున్న గడ్డిపైనను చిన్నచిన్న చెట్లఆకులపైనను, చిన్న ముత్యములో యనునట్లు జలబిందువులు చిన్నవిగా గాననగుచుండును. ఇది తరుచు ఉదయ మున సంభవించును. దీనికిని Dew కును గల భేదము, ఇది ఉదకకణములుగ నుండుటయు, Dew బలపడిన యావిరి మంచురూపమునునుంట యునని ఎరుంగునది. Hoar-frost దట్టముగను,

జలకణములుగను గానగును. Dew అట్లు గానరాక, పలుచనగ మంచుమాత్రమై యుండి యాకులపైనను, గడ్డిమొక్కలపైనను నిల్వయుండి ఎండవేడిమికి ఎగిరిపోవును. ఇటుల నీయుదకము మేఘము, Mist, Fog, Hoar Frost అనం బడు నైదును ఉదకముయొక్క ద్రవరూపములుగ నెఱుంగునది.

ఇంక నుదకముయొక్క వాయురూపము రెండు తెఱంగులు. ౧. ఆవిరి- ఉదకమునకు వేడిసంబంధము గల్గిన నావిరి (Vapour) గ మారెడిని. సముద్రజలములు, నదీజలములు, సరస్సులందలి జలములేగాక, భూమియందుండు చెమ్మయు సూర్యరస్మి కావిరియై గాలియందు తేలుచు పైకెగసి, మేఘములు మొదలగు పెక్కురూపములుగ మారును. ఎట్టి వాతావరణముననైనను నీరు వేడికి నావిరియగునని కనిపెట్టంబడినది. వాతావరణము (Atmosphere) పొడిగా నుండెడిని. నీ రతి త్వరితముగ నావిరియగునని కనిపెట్టఁబడినది. గాలియందు సదా కొద్దిగనో, హెచ్చుగనో ఆవిరి యుండకపోదు. వాతావరణమున వేడిగాలివీచుతరి, అతి త్వరితముగ నీ రావిరియగుచుండుకతన వాతావరణమున (గాలియందు) ఆవిరి విస్తారముగ నుండెడిని. ఒక గ్లాసునందొక మంచు ముక్క (Ice) నిడి చూచుచుంటిమేని ఆ శీతలము చుట్టుపట్లనుండు గాలినుండి యందలి యావిరి నాకర్షించును. ఆయావిరియు నాగ్లాసువెలుపలి ప్రక్కను ఆవిరి రూపముకన్న కొంచెము దట్టముగ జేరియుంట గానవచ్చెడిని. నీటియావిరి బలముగలది. యంత్రములంగూడ దీనిచే నడపుదురు.

౨. Dew- నీటియావిరి భూమినుండి ఎక్కువ దూరము పై కేగకుండగనే, వాతావరణము శీతలమై భూమి చల్లఁబడునేని ఆచల్లదనము గాలియందలి నీటియావిరినాకర్షించును. ఆకర్షింపబడిన ఆవిరి భూమిపైఁజేరి పచ్చగడ్డిపైనను యాకులపైనను మంచువలె నిలచి పలుచనగ గానగును. దీనికి Dew అనిపేరు.

ఒక గ్లాసునందొక మంచుముక్క నిడి చూచుచుంటిమేని లోనిశీతలము చుట్టుపట్లనుండు గాలినుండి యావిరినాకర్షించును. ఆవిరియు గ్లాసువెలుపలిప్రక్కను కొంచెముబలపడి దట్టముగనో, పలుచగనో చేరియుంట గానగును. ఇది Dew భూమిపై జేరుటంబోలిన పనియే. ఇటుల ఉదకము పదివిధముల రూపములు గలది యని తెలుచున్నది. (జలము దాని రూపములు చూడుఁడు).

**ఉదక్సేనుఁడు** — విష్వక్సేనుని కుమారుఁడు. బృహదిషుని వంశస్థుఁడు.

**ఉదఖండపురము** — ఇప్పటి ఛిండ్. ఉండనియు కొందఱనుచున్నారు. గాంధారదేశము చూడుఁడు.

**ఉదఙ్కుఁడు** — ఋషి. గురువులు పైలుఁడును, వేదుఁడును. ఈతఁడొకతరి పౌష్య మహారాజు భార్య కుండలము తన గురుపత్నికీయ నియమింపఁబడి కొంపోవుచో మధ్యమార్గమున తక్షకుఁడను నాగుఁడు అందుండు మణులకై యాతని వెరపించి దానినపహరింపఁ గల్గియుండ, ఎట్లెట్లో దానిందిరుగ సంపాదించుకొని గొంపోయి గురుపత్నికర్పించి, వారికడ సెలవుగైకొని జనమేజయమహారాజుకడకేగి, అతని తండ్రి పరీక్షిత్తునకు పాముచలన గల్గిన మృతికి ప్రతిహతముగ సర్పయాగమొనర్ప ప్రోత్సహించి, సర్పకులనాశనమునకై సర్పయాగము చేయించినవాఁడు.

**ఉదయగిరి గుహలు** — ఖండగిరి గుహలు చూడుఁడు.

**ఉదయపూర్** ఉదయపూర్ రాజపుత్రస్థానదేశపు సంస్థానములలో నొకటి. దీనిం బరిపాలించు ప్రభువునకు మహారాణాయని పేరు. వీరు శ్రీరాముని సుతుఁడగు కుశుని సంతతి వారగు క్షత్రియులు. కాన సూర్యవంశపు క్షత్రియులలో జ్యేష్ఠ శాఖవారగుట క్షత్రియకులజులందరికిమాన్యులుగ నెన్నఁబడుచు కుశ్వాహ క్షత్రియులను పేరంబరగు చున్నారు. ఉదయపూర్ పట్టణము ఆసంస్థానమునకు రాజధాని. బొంబైబరోడా సెంట్రల్ ఇండియా ఇనుపదారిపై నున్న దిబారిస్టేషను నుండి ఆరు మైళ్ల దూరముననున్న పురము. సౌందర్యముల రాసి.

అక్బరుచక్రవర్తి చిత్తూరుఘడమును ధ్వంస మొనర్చిన పిదప మహారాజా ఉదయసింగను మహారాణా, క్రీ. శ. ౧౫౫౯ వ సంవత్సరమున తనపేర నీయుదయపూరు నిర్మాణమునకుంగడంగి క్రీ. శ. ౧౫౬౮ వ సంవత్సరమున తనరాజధానిని, కార్యస్థానముల నిటకుమార్చెను. ఈపట్టణము పిచోలా యనఁబడు మహాసాగరముచుట్టు నిర్మింపఁబడుట పాశ్చాత్యు లీనగరమును వెనిస్ ఆఫ్ ఇండియా యని మెప్పుగా నను టయుం గలదు. ఇది ప్రపంచమందలి సౌందర్య స్థలములలో నొకటిగఁ జెప్పఁబడినది. ఆంగ్లులు దీనిని Fairy-land City అని యందురు. పిఛోలా సరస్సు నందునుండి చూచుతరి సూర్యాస్తమయ మగుకాలమున దాని విన్నాణము మహారాణానివాస భవనముపై నిబడు కిరణముల వలనగల్గిన వింతరంగును జూడ నెన్నటికి మఱపురాని సౌందర్యము దృశ్యమగును. ఇంకను దీనిని City of Palaces అనుటయుం గలదు. ఇందలి ప్రాసాదము లొకటి కొకటి తీసిపోని వింతలుకలవిగ నున్నను మహారాణా నివాసమగు మహాసౌధము వింతలకు వింతగను, విన్నాణములకు విన్నాణమనియు చెప్పఁబడుచు చూచువారల కచ్చెరువు గొల్పుచుండును. దాని యావరణ మొకప్రత్యేక మనం జెల్లునందురు. ఇందలి వీధికడనున్న మహాద్వారము చూడ వింతగొల్పుచుండును. ఇది క్రీ. శ. ౧౬౦౦ వ సంవత్సరమున నిర్మింపఁబడినది. బారీపోల్ అను పేరున బరగుచున్నది. లోపలికిం జనిన త్రిపోలియా ద్వారమని మఱియొకటి కలదు. అందు మూడు ద్వారములు ఏకీభవించి యున్నవి. ఇటనే ఏనుఁగుల శాలయు కావలిరక్షకసైన్యముల నిరీక్షణ నివాసస్థానమును కలవు. వీటిపై నుండు డాబా ఏబదియడుగుల ఎత్తున Master piece of Engineering అని చెప్పఁబడినది. రాజనగరునంటిన వాకిలికి రాయాంగణ్ (రాజాంగణము) అని పేరు. లోన మోతీమహాల్ (ముత్యాల మహాలు), మానిక్‌మహాల్ (కెంపుల మాణిక్య) భవనము, చైనీకీ చిత్రశాల, చాల ముఖ్యమైన తావులు. వీనియందలి చీనాదేశపు, డచ్చిదేశపు అద్దపు పెంకులుపని, సౌందర్యవంతము. నిలువుటద్దములు, స్ఫటికపు పంకాలు, కుర్చీలు, బల్లలు, బొమ్మలు, పటములు, లస్టరులు, గ్లోబులు, వాల్లేమ్పు మొదలగువానిజూచి ఎఱుంగదగినవె గాని, వర్ణింపదరముగాదు. ఇందు ఎలెక్ట్రిసిటీ అన్నిటిలో నొక సౌందర్యగని యనిపించెడిని. వీనిద్వారముకడ రాజపుత్ర శూరులాయుధము లంగొని పహారాయిచ్చుచు నిలువంబడియుంటయె యొకవినోద దృశ్యముగ నుండును. ఈమేవారు రాజ్యపు నాగరిక మిటమూర్తీభవించినట్లు గాననగును.

తెల్ల నెమళ్లు ఉదయపురమునందంతటను గాననగును. అందు రాజాంగణమున నధికము. ఈ రాజనివాసభవనమున ఓష్ఠానాలధికము గాన, వేసవియందు మిగుల చల్లగ నుండెడిని. ఈ ప్రాసాద భవనమునగల పటములలో ఒకటవ

ప్రతాపసింగుమహారాజది, మిగుల పనితనము గలది. ఈయన క్రీ. వె. ౧౯౭౭-౧౯౫౭ ఈ మేవారు రాజ్యపాలనము సల్పినవాఁడు. ఈతఁడే అక్బరు నెదిర్చి దరిఁజేరనీయక, నిలపియుంచిన వాఁడని చెప్పుదురు. ఇంక నిచటి దర్బారుహాలు చూడఁదగినది.

ఇచట ఉదయపూరునం దనేకప్రాసాదము లును, వానిం జుట్టి సుందరతరమగు పూఁదోట లును కలవు. చూచువారలు చక్కఁగఁ బరిశీ లించిన, ప్రాసాదములకన్న పూఁదోటలు విన్నాణ వంతములో, పూఁదోటలకన్న ప్రాసాదములు విన్నాణవంతములో యనిపింపకపోదు. అన్ని పూఁదోటలకు జలప్రవాహములు సమృద్ధిగ గల్గియుంటయు, భూమి యధిక సారవంతమై యుంటయు దీనికిఁ గారణము. ఉద్యానవనము లలో సజ్జన్నివాసమనంబడు గులాబ్ బాగు కడు రమ్యమంతమని పేరందినది. ఇది సజ్జన్‌సింగు అను మహారాణా వృద్ధినందించి తనపేరం బరగ నేర్పరిచెనట. ఇందు బోనులందు నిర్బంధింపఁ బడిన పులులు, చిఱుతలు, మొదలగు నడవి మృగములు, ఐరోపాదేశపు జంతుశాల లందుంచ బడినవాటివలె నిర్వీర్యములై, పరాక్రమహీనత, మనుష్యులతో స్నేహమునకుఁ గడంగక పరా క్రమయుతములగుట నీరాజపుత్రదేశమున మేవారు సీమ పరాక్రమవంతమని తోఁపకపోదు.

ఈ సుప్రసిద్ధ సౌందర్యసీమయందు చూడఁ దగిన భవనము లెన్నియో కలవు. విక్టోరియా హాలు, జగ్మందిరము, సహాప్‌సాగరఘట్టము, చంద్రద్వారపువంతెన, మోహానమందిరము, ముఖ్యములు. విక్టోరియాహాలునందు మ్యూజి యమ్ కలదు. జగ్నివాసభవనము యువరాజ నివాసమునకై ఏర్పర్చఁబడిన గృహము. జగ్మం దిరమున షాజహాన్ చక్రవర్తి తన బాల్యమున తండ్రితో కలహించి ప్రవాసమున గడపెనట. అతనిపేరు ఖుర్రాం అనియుండెనట. అతని పాగా టికి నందు భద్రపర్చఁబడియున్నది. సహాప సాగర్ ఘట్టము చాల సుందరమైనది. దానిని సహాపసింగుమహారాణా (క్రీ. వె. ౧౭౪౨- ౧౭౬౧) నిర్మించెనట.

మేవారు పరిపాలకులు ఆంగ్ల ప్రభుత్వము పట్ల భక్తికలవారు. క్రీ. వె. ౧౮౫౭ లో సిపాయిల తిరుగుబాటుకాలమున వీరు లండ నుకు స్నేహితుఁడు మేవాడయని తెల్పుటయే గాక పెక్కండ్రాంగ్లులకు రక్షణ యొసంగిరట. ఉదయపూర్ సంస్థానముంగూర్చి మేవాడ సంస్థా నము చూడుఁడు.

**ఉదయాశ్వుఁడు** (మహారాజు) — అజాతశత్రుని మనుమఁడు. క్రీ.పూ. ౫౧౯-౫౦౩ నాఁటివాఁడు. క్రొత్త రాజరాజగృహానిర్మాణ మొనర్చిన భూపతి. ప్రపితామహుఁడు విధిసారుఁడు. బృహద్బలుని వంశమున (శైశు నాగుల) అజాతశత్రుం డారవభూపాలుఁడుగ మగధరాజ్య మేలినవాఁడు. పాటలీపుత్రనిర్మాత యనియందురు. (మగధరాజ్యము చూడుఁడు).

**ఉదయాస్తమయకాలముల సూర్య బింబము ఎఱ్ఱగానుండుట** — మన కండ్లకగుపడు తెల్లని వెలుతురునందు అసంఖ్యాక ములగు రంగులుకలవు. అందెఱుపు మొదలుకొని ఊదావఱకుంగల ప్రధానమగు రంగు లేడు అని విభజించియున్నారు. ఈరంగులన్నియుం గలసియె వెలుతురు (లేక తెల్లరంగు) అగుచున్నది. ఇంక మన భూమినిచుట్టియుండుగాలి పొరలుపొరలుగా నుండునదిగాని భూమినుండి యాకాశములోని కుండు గాలియంతయు నొకేపొరగాదు. కాన నీగాలిపొరలు వేఱ్వేఱు అద్దములవంటివని మనసు నందుంచుకొన వలయును. ఈ గాలిపొరలన్ని యుంగలసియె మహావాయుమండలి యగుచున్నది. మఱియు సద్దములగుణములనే గల్గియున్నవి.

ఆకాశమందలి సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు మొదలగువానిని మనము జూచుట యన అద్దములవంటి గాలిపొరలగుండా వెలుతురుకిరణములు మనకండ్లకడనుండి వానికడకుప్రయాణము చేయుటయగును. వెలుతురుకిరణములు ప్రయాణముచేయుటకు కాలపరిమాణ మక్కఱలేదు.

మధ్యాహ్నమున సూర్యబింబము నెత్తికి పైనుండుతఱి మనము వాయుమండలములగుండా తిన్నగాఁ జూడగల్గుదుము. కాన రంగుల సముదాయమగు తెల్లవెలుతురు కల్గియుండును. చంద్రునకును తలపైనుండుతఱి నిట్లే. ఇంక నుదయాస్తమయకాలముల తూర్పుపడమరలను క్రిందుగ సూర్యుఁడుగాని, చంద్రుఁడుగాని యుండుతఱి జూచుటయన గాలిపొరలగుండా తిన్నగా జూడజాలము. కొన్ని అద్దములను కొంచెము పరుండునట్లుంచి (Slanting) వానిగుండా చూచునట్లుండును. ఇట్టితఱి తక్కినరంగులు మఱుగుపడ బలముగల ఎఱ్ఱరంగు నిలచియుంట మనకు బింబము ఎఱ్ఱనిరంగుతోఁ గన్పించును. మఱియును భూమికి సమీపముననుండు గాలిపొరలు నీటియావిరికలిసిన వాతావరణముగుండా సూర్యచంద్రబింబము లగుపడుటయన భూతఅద్దముగుండా చూచినచోఁ దర్శితమై (Magnified) పెద్దదిగ నున్నట్లే పెద్దబింబములై ఎఱ్ఱగ గన్పట్టెడిని.

బ్రిటీషుసీమలందలి గొప్పగొప్ప నగరములందు కర్మాగారముల పొగ గొట్టముల (Factory Chimnies) నుండి ఎగయుపొగతోఁ నానగరముపైనుండు నాకాశమంతయు నిండిపోవునట్లు పొగయు, ఆవిరియు వెడలుచుంట వాయుమండలము స్వచ్ఛమైయుండదు. దానిగుండాకన్పించు సూర్యాస్తమయమాశ్చర్యవిభ్రమములు గొలుపదగిన పలువిధములగు వింతరంగులతోఁ గన్పట్టుచుండును. ఆకాశమును అత్తఱి పలువిధములగు వింతరంగుల చూచినవారికితప్ప నితరు లనుకొనజాలని ప్రదర్శన మొసగెడిని. సూర్యోదయకాలములకు రాత్రి కర్మాగారములు మూయబడియుంట అంతఆవిరి పొగల విపరీతమాకాశమున గ్రమ్మియుండక స్వచ్ఛమై యుండునుగాన మామూలుగనే గన్పట్టుంగాని రంగుల విపరీతములుండవు.

**ఉదరగోత్రము** — నిధృవగణములు చూడుఁడు.

**ఉదరనిమిత్తం బహుకృతవేషాః** — ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. కోటి వేషములు కూటికొఱకేనని తెలుగుసామెతకలదు.

**ఉదరరోగము** — ఇది జలోదరమువంటి జబ్బు. దానికిని దీనికింగూడ ఆంగ్లమున Abdominal dropsy అని పేరు. గర్భమున దుష్టద్రవములు, దుష్టపదార్థములు చేరుటవలన ఉదరము పెద్దదిగనగుట, తక్కిన శరీరావయవములు క్షీణించి సన్నగిలుట మొదలగు లక్షణ ఉలు గల జబ్బు.

**ఉదరేభృతే కోశోభృతః ఇతి న్యాయము** — కడుపునిండితే కనకపుసంచి నిండినట్టే అని యర్థము. ఆశలేనివానింగూర్చిన న్యాయము.

**ఉదవాస గోత్రము** — కౌద్ధకగణము చూడుఁడు.

**ఉదవేణు గోత్రము** — కౌద్ధకగణము చూడుఁడు.

**ఉద్గరగ్రీవి గోత్రము** ఆత్రేయగణము చూడుఁడు.

**ఉద్ఘట్ట తాళము** తాళములు చూడుఁడు.

**ఉద్దండపురము** (బీహారు) — ఇట నుండిన విహారమునుండి ఈపేరయ్యెనట. పిదప విహారపురమయ్యెనట. మగధకొకప్పుడు రాజధానిగనుండెను. (మగధరాజ్యము చూడుఁడు).

**ఉద్వహవ్యగోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**ఉదావర్తము** — మూత్ర, మలము, బద్ధావస్థనంది అతికఠినముగ వెడలుచుండుస్థితి సంభవించుటవలన పొత్తికడుపులోను, మర్మావయవములలోను పోట్లుకలుగుచుండును. దానికి ఉదావర్తమందురు.

**ఉదావసువు** — మరీచి, ఇక్ష్వాకు, నిమి సంతతి క్షత్రియుఁడు. తండ్రి సీరధ్వజుఁడనంబడిన జనకచక్రవర్తి. పితామహుఁడు మిథిలుఁడు లేక విదేహుఁడు. కుమారుఁడు నందివర్ధన మహారాజు.

**ఉద్ధృతదంష్ట్రోరగన్యాయము** — కోరలుతీసిన తాచని యర్థము. తాచు అపాయకరమైనదైనను కోరలు పెరికివైచిన దానివలన బాధకలుగదని భావము. దుర్మార్గుని బలము పోగొట్టిన వానివలన నపాయముకలుగు భయమక్కఱలేదనుట కీన్యాయము వర్తించెడిని.

**ఉద్దానము** — ఉద్యానవనశబ్దమునుండి కల్గిన పదము. ఆంధ్రదేశమున పూర్వము గంజాము మండలమునకు ఇప్పుడు విశాఖపట్టణమునకుం జెంది, నౌపడానుండి ఉత్తరముగా ఇచ్ఛాపురము దనుక, తూర్పున సముద్రమును, పశ్చిమమున బెంగాల్నాగపూర్ రైల్వే ఇనుపదారి బాటయు, ఎల్లలుగాఁ గల్గిన దేశభాగమున కుద్దానమని పేరు. ఉద్దానమున కొబ్బరి, అనటితోట లెడతెరిపిలేక వ్యాపించియున్నవి. ఈసీమయందు కూరగాయ లధికముగ నుత్పన్నమగుట సుప్రసిద్ధము. బహుశః యీపేరు ఈప్రాంతమునకుం జేరుకొని స్థిరపడిన ఓఢ్ర జమీందారీలవారిని స్థిరపర్చిన పేరుగానోపు. ఈసీమయందు కాళింగులు, రెడ్లు విస్తారముగ నివసించుచున్నారు.

**ఉద్దాలకుఁడు** — ఋషి. ఇతనికి ఉపమన్యుఁడని పేరుకలదు. ఇతనికి గురుభక్తి మెండు. అశ్వినీదేవత లితని గురుభక్తికిమెచ్చి వరముకుగుమనగా, తన గురుండగు ధౌమ్యర్షి ని (లోహ దంతములు గలవాఁడు) స్వర్ణదంతునిగ నొనర్పఁగోరెను. కుమారునిపేరు శ్వేతకేతుర్షి. ఈతఁడు ధర్మశాస్త్రకర్త.

**ఉద్ధానైకాదశి** — కార్తీకశుద్ధ ఏకాదశి. బోధనైకాదశి చూడుఁడు. పండుగలు చూడుఁడు.

**ఉదీచ్యదేశము** — సరస్వతీనదికి వాయువ్య దిశగానుండు దేశమని అమరకోశమునఁ జెప్పఁబడినది.

**ఉద్దీప్తే భవనే చకూపఖననే ప్రత్యుద్యమః కీదృశః** — ఇల్లు అంటుకుని కాలుట ప్రారంభించిన పిదప నాన్పుటకు నీటికై నూయి త్రవ్వుట ప్రారంభించినట్లనిభావము. ఇది సంస్కృత భాషయందలి లోకోక్తి.

**ఉదుంవరము ఎత్తు** — రెండు తులములు. ఆయుర్వేదమానము చూడుఁడు.

**ఉద్గురికాంత శిఖరము** — రుద్ర హిమాలయశిఖరములలో నొకటి. గంగానది చూడుఁడు.

**ఉదూర్ణవ గోత్రము** — కథకగణము చూడుఁడు.

**ఉద్యోగం పురుషలక్షణము, అది పాడుచేసుకుంటే అవలక్షణము** ఆంధ్రలోకో -

**ఉద్రాహ గోత్రము** — ఓ గణము చూడుఁడు.

**ఉద్వాహకుల గోత్రము** — ఆర్య వైశ్య గోత్రములలో నొకటి. ఇది వాసవ కన్యకాపరమేశ్వరి జనించిన గోత్రమగుట పవిత్ర వంతమై, అగ్రగణ్యముగ నెంచఁబడుచున్నది. (వైశ్యగోత్రములు చూడుఁడు). ఉద్వాహకుల గోత్రము- ద్వావ్యశ్లేయ(గ) గోత్రము. దీనినిపెండ్లి కుల గోత్రమనియు నందురు. సంస్కృతగోత్రము, ప్రభాతస, ప్రభాతగణము, ఆపస్తంబసూత్రము, యజుశ్శాఖ, ప్రమాణము ఆద్యప్రవరఖండ, కుసు మేశుఁడు దేవత, భార్యకుసుమాంబ,పినాకినీతటము తపస్థానము, కుసుమ సముద్రము తటాకము, జపము దశకోటి, దీపములు ౬౦, క్షేత్రసంఖ్య ౮౦, మార్తికదానము, కుసుమధాన్యము, పెండ్లిండ్లకాలమున బొద్దికూర వర్జనీయము.

**ఉద్ధవుఁడు** చంద్రవంశపు క్షత్రియుఁడు. తండ్రి నహుష మహారాజు. తల్లి ప్రియంవదాదేవి. మఱియు యదువంశ క్షత్రియుఁడగు దేవభాగుని కుమారునకును ఉద్ధవుఁడని పేరు. ఈతఁడు బృహస్పతికి శిష్యుఁడై నవాఁడు. వసుదేవుఁడు పెద్దతండ్రి.

**ఉన్నతసంజ్ఞాస్థానములు ఆరు** — షడున్నతసంజ్ఞాస్థానములు చూడుఁడు.

**ఉన్నమాట చెప్పితే ఊరుమంచిది కాదన్నట్లు** ఆంధ్రలోకో.

**ఉన్నవారికొక్కటే యిల్లు అద్దె కున్నవారికన్నీ యిండ్లే**—ఆంధ్రలోకోక్తి.

**ఉన్నవూరివారికి కాటి (స్మశానము) భయము, పొరుగూరి వారికి నీటి భయము** — ఆంధ్రలోకోక్తి.

**ఉన్ని** — మేకలయొక్కగాని, గొఱ్ఱెల యొక్క గాని, ఆల్పేకాజంతువులయొక్క గాని, అంగోరాజంతువులయొక్క గాని, రోమములను ఉన్నిగజేసి, దారము వడికి బట్టలు నేయుదురు. ఇంకను చెవులపిల్లి వెండ్రుకలు, ఒంటె వెండ్రుకలు కూడ ఉన్నియగునట. ఇవికాక Wood wool అనియు, Stag wool అనియుకూడ కలవు. ఉన్ని ముఖ్యముగ గొఱ్ఱెలబొచ్చు అని చెప్పఁబడినది. దీనికింకను బలముగ త్రాడగుటకు మెత్తని ఇతర బొచ్చు పదార్థములం గల్పి వడికి త్రాడుగ చేసు దురు. ఉన్నిబట్టలు అంత ఎత్తుగల నూలుబట్టల కన్న ఎక్కువ వెచ్చగ శీతకాలమునందునను, ఎక్కువ చల్లగ వేసవికాలమునందున నుండుంగాన ప్రాశస్త్యము వహించియుండును. లామాజంతువుల ఉన్ని ఎక్కువ వెచ్చదనమిచ్చుననియు, ఆల్పెకాజంతువుల ఉన్ని సన్నపుబట్టల నేయనగు ననియు, అంగోరాజంతువుల ఉన్ని మంచి నాణ్యమును, మెరుగును గల బట్ట నేయనగుననియు నందురు. కాని ఉన్ని గొఱ్ఱెబొచ్చుగ సర్వత్రా తనరెడిని.

ప్రపంచమందలి దేశములం దన్నిటిలో ఆస్ట్రేలియాయం దెక్కువ ఉన్ని లభించెడిని. అచట ఎక్కువ గొఱ్ఱెలు పెంచఁబడునట. దాని ఉన్ని సంవత్సరమునకు ఏబదిఏడు కోట్ల పౌనులట. దక్షిణఅమెరికా ఖండమంతయును నలుబది కోట్ల పౌనుల ఉన్నిం గల్గించునట. ఇంక వేఱ్ఱేఱు దేశములు, వేఱ్ఱేఱు విధములుగ ఉన్ని యగునట. ఈభేదము ఆయాదేశముల శీతోష్ణస్థితి ననుసరించియును, గాలి ననుసరించియునుండుననిగ పోల్చుచున్నారు. ఆస్ట్రేలియా గొఱ్ఱె ఉన్నికి చాల అనుకూలముగాన ఎక్కువ ఉన్నిని సిద్ధపర్చుటయే గాక, ఎక్కువ ప్రశస్తమైన ఉన్నిగ చెప్పఁబడుచున్నది. ఇందువలన అన్నిగొఱ్ఱెలకు నొకేరీతిని

ఉన్ని యుండునని తలంపరాదని తేలుచున్నది. మొత్తమున ప్రపంచ మంతటను, ఉన్నిబట్టలు గౌరవింపబడుచునే యున్నవి. గొఱ్ఱెలకు చర్మవ్యాధులు మెండుగ గల్గుచుండుంగాన వానిం దొలుత నౌషధములం గల్పిన యుదకము లోనికిం ద్రోసి జలకము లాడింతురు. పిమ్మట ఆరిం దాలగు కత్తిరింపుపనివాండ్లచే అంటకత్తిరింపింతురు. ఇంకను కొన్నిచోట్ల గొఱ్ఱెబొచ్చు కత్తిరించు యంత్రములు అమర్చబడినవి. ఈపని వేసవిప్రారంభమున జరుగుంగాన గొఱ్ఱెలు చలిచే బాధనందుట సంభవింపదు. మఱియు సంతోషముతో కత్తిరించుట కియ్యకొనుచుండుట గాంచిన వారలకు, గొఱ్ఱెలకు బొచ్చు బరువొదిలిపోయి చులకబడుట ఇష్టమేమోనని తోంచకపోదు. తిరుగ శీతకాలము వచ్చుసరికి బొచ్చు తిరుగ పెరిగి సిద్ధముగ నుండును. పాశ్చాత్యులు నేసిన ఉన్ని వస్త్రములందు రెండు భేదములు కలవు. ఊలెన్ బట్టయనియు (Woollen cloth), ఒరుస్టెడ్ బట్ట (Worsted cloth) అనియునై యున్నవి. ఇందు ఉలెన్‌బట్ట చిక్కనినేత, ఎక్కువ వెచ్చగ నుండును. రెండవ ఒరుస్టెడ్ బట్ట ఎక్కువ మెరుగు అందము గలది. సగటునగొఱ్ఱెకు ఎన్మిది పౌనుల ఉన్ని వచ్చునని యందురు.

**ఉన్ని పరిశ్రమ** — హిందూదేశపు శీతోష్ణపరిస్థితులనుబట్టి ఉన్నిపరిశ్రమ విశేషముగా నభివృద్ధింబొందుటకు అవకాశములేదు. అవసరమునులేదు. ఈదేశపరిస్థితులకు ప్రత్తి, పట్టుబట్టలే ఆచ్ఛాదనమున కనుకూలముగా నుండును. ఉన్నిదుస్తులు ధరింపవలసిన యవసరము ఉత్తరదేశములందును కొన్ని పర్వతప్రదేశములందేగాని తక్కినచోట్ల నంతవిశేషముగాలేదు; శీతకాలమునందు మాత్రము పలుచని యున్నిదుస్తుల నుపయోగింపవలసివచ్చును. పైకారణములనుబట్టి ఉన్నిపరిశ్రమ హిందూదేశమునందంతగా నభివృద్ధిపొందుట కవకాశము లేకపోయినది. ఇప్పటికి హిందూదేశమునందన్నిచోట్లను కలిపి తొమ్మిది యున్నిఫ్యాక్టరీలు మాత్రమే యున్నవి. వీనిలో 2 బొంబాయినగరమునను, 4 సంయుక్తరాష్ట్రములయందును, 3 పంజాబునందును గలవు. ఇవిగాక స్వదేశసంస్థానములయందు 5 ఉన్నిమిల్లు గలవు. వానిలో నొకటి బరోడాయందును, తక్కిన నాల్గును మైసూరు రాజ్యమునందును గలవు. ప్రభుత్వమువారి స్వంతము మూడు ఫ్యాక్టరీలున్నవి. వీనియందు బూర్నీసులు, రగ్గులు, షర్టింగులు, ఫ్లానలులు తయారుచేయఁబడుచున్నవి. సంయుక్తరాష్ట్రములలో నీపరిశ్రమకు ప్రధానస్థానము కాన్పూరు. బొంబాయి, బెంగుళూరు నగరములు కూడ కేంద్రస్థానములుగానే పరిగణింపఁబడుచున్నవి.

**ఉన్మత్తుఁడు** — తండ్రి మాల్యవంతుఁడు. పితామహుఁడు సుకేశుఁడు. రక్కసుఁడు.

**ఉన్మానము** — ఇది ద్రోణపరిమాణము. అనఁగా ముప్పదిరెండుశేరుల ప్రమాణము గల కొలత. (కొలశేరులు).

**ఉన్మాదము** (పిచ్చి) — ఆంగ. Insanity లేక Madness. దీనిని పిచ్చి యనియు, భ్రమయనియు, వెఱ్ఱియనియు కూడ నందురు.

**ఉపకారమునకుపోతే అపకారము వెంటబడినట్లు** — ఆంధ్రలోకోక్తి.

**ఉపకులగోత్రము** — అగస్త్య ఉప గణము చూడుఁడు.

**ఉపగవ గోత్రము** ఉపమన్యు గణము చూడుఁడు.

**ఉపచారములు** — చతుష్షష్ట్యుపచారములు. (దేవీపూజయందు ఉపచారములు ౬౪).

దేవతార్చనయందు సర్వసాధారణముగ షోడశోపచారము (౧౬) లొనర్పు పద్ధతి కలదు. అవి ౧. ఆవాహనము, ౨. ఆసనము, ౩. పాద్యము, ౪. అర్ఘ్యము, ౫. ఆచమనీయము, ౬. అభిషేచనము లేక స్నానము, ౭. వస్త్రము, ౮. యజ్ఞోపవీతము, ౯. గంధము, ౧౦. పుష్పము (పుష్పపూజ), ౧౧. ధూపము, ౧౨. దీపము (మంగళహారతి), ౧౩. నైవేద్యము, ౧౪. తాంబూల సమర్పణము, ౧౫. నమస్కారము, ౧౬. ఉద్వాసనము.

శైవధర్మమున శరీరస్థములగు ముప్పదియారు తత్త్వముల కార్యసమర్పణాత్మకముగ ముప్పదియారుపచారములు శివపూజయం దొనర్తురు. దేవీపూజ యొనర్చువారు చతుష్షష్ట్యుపచారము లొనర్తురు. అవి ౧. ధ్యానము, ౨. ఆవాహనము, ౩. సింహాసనము, ౪. అర్ఘ్యము, ౫. పాద్యము, ౬. ఆచమనీయము, ౭. మధుపర్కము, ౮. పునరాచమనీయము, ౯. ఆభరణారోపణము, ౧౦. అభ్యంగనవస్త్రపరిధానము, ౧౧. అభ్యంగనపీఠోపవేశనము, ౧౨. తైలాభ్యంజనము, ౧౩. ఉష్ణోదకస్నానము, ౧౪. పంచామృతస్నానము, ౧౫. ఉద్వర్తనము, ౧౬. దేవీసూక్తపఠనపూర్వక సకలతీర్థాభిషేచనము, ౧౭. ఆలేపన పీఠోపవేశనము, ౧౮. అరుణ దుకూల పరిమార్జనము, ౧౯. రక్తోత్తరీయము, ౨౦. అధోవస్త్రము, ౨౧. కంచుకధారణము, ౨౨. కేశధూపము, ౨౩. గంధానులేపనము, ౨౪. కాటుక, ౨౫. ఆభరణపీఠోపవేశనము, ౨౬. మణిమకుటము, ౨౭. చంద్రశకలము, ౨౮. సింధూరతిలకము, ౨౯. నాసాభరణము, ౩౦. పాళీయుగము, ౩౧. మణికుండలయుగము, ౩౨. తాటంకయుగళము, ౩౩. కనకచింతాకము, ౩౪. మంగళసూత్రము, ౩౫. గ్రైవేయము, ౩౬. తారావళి, ౩౭. ఏకావళి, ౩౮. కటిసూత్రము, ౩౯. కేయూరయుగళచతుష్టయము, ౪౦. వలయావళి, ౪౧. ఊర్మికావళి, ౪౨. సౌభాగ్యాభరణము, ౪౩. పాదకటకము, ౪౪. నూపురయుగళము, ౪౫. పాదాంగుళీయకము, ౪౬. కరాంగుళీయకము, ౪౭. ఒకచేతి పాశము, ౪౮. అంకుశము, ౪౯. పుండ్రేక్షుచాపము, ౫౦. (నాల్గవచేతికి) పుష్పబాణము, ౫౧. పాదుకలు, ౫౨. చక్రాధిరోహణము, ౫౩. తీర్థపూర్ణకలశము, ౫౪. గంధము, ౫౫. పుష్పపూజ, ౫౬. ధూపము, ౫౭. దీపము, ౫౮. నైవేద్యము, ౫౯. తాంబూలము, ౬౦. నీరాజనము, ౬౧. దర్పణదర్శనము, ౬౨. ఛత్రసేవ, ౬౩. చామరసేవ, ౬౪. తాళవృంత (విసనకఱ్ఱ) సేవ. ఇవి చతుష్షష్టి (౬౪) ఉపచారములు. ఈ చతుష్షష్ట్యుపచారములతో సంబంధము గల్గి, చతుష్షష్టికళ లుండుననియు, దేవిచతుష్షష్టికలామయి యనియు వివరింపఁబడినది.

**ఉపజీవ్యవిరోధస్యాయుక్తత్వ మితి న్యాయము** — దేనిపై నాధారపడి తానుండుటయో దానిపై విరోధభావము వహించుట యనర్హ మని భావము.

**ఉపత్వాయుని గోత్రము** — నిఘృవగణము చూడుఁడు.

**ఉపదంశము** — పురుషుల మర్మావయవ సంబంధ రోగమున కాయుర్వేద వైద్యశాస్త్రమున ఉపదంశరోగమని పేరు. మర్మావయవము లంపు పుండువలె నుండెడిని.

**ఉపదానవి** — వైశ్వానరుని కుమార్తె. భర్త హిరణ్యాక్షుఁడు. కుమారుఁడు శకుని యనువాఁడు. వైశ్వానరుఁ డాంగిరస సంతతివాఁడని కొన్నిచోట్లను, శాండిల్యవంశస్థుఁడగు విశ్వానరుని కొమారుఁడని కొన్నిచోట్లను చెప్పఁబడినది. వైశ్వానరుఁడగ్నిత్వము చేసినవాఁడు.

**ఉపదేవి** — ఈమె దేవకుని పుత్రిక యనియు, భర్తపేరు వసుదేవుఁడనియు, కల్పవృష్టి మొదలగువారు పది మంది కుమారులు గలరని యుం జెప్పఁబడినది. వసుదేవునికి మదిరయను వేఱు భార్యవలన నందుఁడు, ఉపనందుఁడు అను కుమారులు కలరు. ఇళయను భార్యయందు ఉరువల్కుఁడను సుతుఁడుగలఁడు.

**ఉపధానాసనము** — యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. కుడి కాలు, కుడి చేయి చాచుకొని ఎడమకాలిని మెడమీద కెక్కించుకొని, కుడిప్రక్కకొత్తిగిలి పరుండుట. శ్వాసగతి విపరీతస్థితిం జెందునని చెప్పఁబడినది.

**ఉపనది** — Tributary of a river (ఉపనది). కొన్ని నదులు సముద్రమువరకుంబోక మధ్యమార్గమున నడ్డమైన పెద్దనదియందు కలిసి పోవును. అట్లుకలిసిపోయిన నది పెద్దనదికి ఉప నది (Tributary) అనంబరగెడివి. (Rivers చూడుఁడు).

**ఉపనివేశదేశము లేక పరశుస్థానము** — ఈదేశమునకు పరశుస్థానమనియు, ప్రజలకు పరశులనియు తొల్లింటపేరుండేనట. వీరు కలహప్రియులు. యుద్ధసన్నద్ధులై యుండువారని పాణినివ్రాసెను. రాజధాని ఉపనివేశము. దీనికి క్షత్రియోపనివేశమనియు వాడుక యుండెను. గ్రీకులనాఁడు వారి వలన పాపి యనంబడి, ఆంగ్లుల నాఁటికి ఓపియన్ అనంబడెనట. ఈదేశమునఅలెగ్జాండరుఅలెగ్జాండ్రియా పురమునునిర్మించెనట. బౌద్ధగ్రంథమగు మహావంశము నదాని నలసంద (పురము) యని వాడియున్నారు. ఈపురమునసే మిళిందుఁడను నామాంతరముగల మేనందేర్ అనంబడిన ప్రసిద్ధుండగు బాక్ట్రియా దేశ భూపాలుఁడు జన్మించెనట. ఈదేశము భరత దేశమునకు తరమున చరికార్ కు తరదిశయందు పాఘ్మన్ పర్వతపఙ్క్తి కీశాన్యదిశగా నుండినట్లు తలంపబడుచున్నది. మత్స్యపురాణము ౧౧౩ యందునను, వాయుపురాణము ౨, ౩౭, ౨-౩౭ యందునను, దీనిప్రశంసలు కలవు. పాణిన్యాచార్యుఁడు ౫, ౩, ౧౧౭ యందు ప్రశంసించి యున్నాడు. పరశుస్థాన దేశపు ప్రజలును పరశులనంబడుచురు. తొల్లింట నీరెండును ఒకేదేశముగ నుండెనేమో.

**ఉపనివేశపురము** — ఉపనివేశ దేశము చూడుఁడు.

**ఉపనిషత్తులు** — ఉపనిషత్తులు వేదముల నందలి సారమని యందురు. ఉపనిషత్తులు వ్రాయఁబడిన వేదధర్మములు. ఎవ్వరెవ్వరి మతములకుం దగినయట్లు వారు తమ ఉపనిషత్తులను వ్రాసికొనిరి. ఉపనిషత్తులకు వేదాంతమని ప్రతీతి కలదు. వేదముల పర్యవసానముం దెల్పునవి గాన, వేదశిరమనియు నందురు. ఇందొక మతము వారి ఉపనిషత్తులను వేఱొకమతమువారంగీకరింపఁజాలరు.

ఋగ్వేదమునకుంజెంది ఇరువదినాల్గు ఉపనిషత్తులును, యజుర్వేదమునకుంజెంది నూట తొమ్మిది ఉపనిషత్తులును, సామవేదమునకుం జెంది వేయి ఉపనిషత్తులును, అథర్వణవేదమునకుంజెంది తొంబది ఉపనిషత్తులును మొత్తమున పండ్రెండువందల యిరువదిమూడుపనిషత్తులు కలవందురు. కాని యిప్పుడన్నియు గానరాకున్నవి.

ఇందు ౮౭౦ కర్మప్రతిపాదకములనియు, ౨౩౨ ఉపాసనకాండయనంబడి ధ్యేయబ్రహ్మప్రతిపాదకములనియు, ౧౦౮ జ్ఞానప్రతిపాదకములనియుఁ జెప్పఁబడినవి. తక్కినవియుం గొన్ని కలవు. ఇందు జ్ఞానప్రతిపాదకములగు అష్టోత్తరశతసంఖ్యాకములగు ఉపనిషత్తులే ప్రాముఖ్యము

లుగ వాడఁబడుచున్నవి. అందు దశోపనిషత్తులు అన్ని సిద్ధాంతములవారికిని ఉపచరించు సాముదాయకార్థముల గోచరించుంగాన, అందరు అంగీకరింతురు. వీట్లకే ద్వైతాద్వైతవిశిష్టాద్వైతాదిమతస్థులు ఉపనిషద్భాష్యములను వారి వారికి దగినట్లు వేర్వేరుగ రచించుకొనియున్నారు. మఱియును ౧. చిత్తి, ౨. శీక్ష, 3. భృగువల్లి, ౪. కఠవల్లి, ఉపనిషత్తులను అద్వైతమతస్థులు పవిత్రములుగ నెన్నుదురు.

పంచోపనిషత్తులు - ౧. నారాయణోపనిషత్తు, ౨. బ్రహ్మోపనిషత్తు, 3. తైత్తిరీయోపనిషత్తు, ౪. గార్గ్యోపనిషత్తు, ౫. వారాహోపనిషత్తు. ఈయైదుపనిషత్తులందు పరమేశ్వరుని రూపవర్ణన మొనర్పఁబడినది.

దశోపనిషత్తులు- ౧. ఈశావాస్యోపనిషత్తు, ౨. కేనోపనిషత్తు, 3. కఠవల్ల్యుపనిషత్తు, ౪. ప్రశ్నోపనిషత్తు, ౫. ముండకోపనిషత్తు, ౬. మాండూక్యోపనిషత్తు, ౭. తైత్తిరీయోపనిషత్తు, ౮. ఐతరేయోపనిషత్తు, ౯. ఛాందోగ్యోపనిషత్తు, ౧౦. బృహదారణ్యకోపనిషత్తు. కొందఱు ౯. శ్వేతాశ్వతర, ౧౦. కౌశీతకి ఉపనిషత్తులని యందురు.

అష్టోత్తరశతోపనిషత్తులు- ౧. వాజసనేయ సంహితోపనిషత్తు (లేక) ఈశావాస్యోపనిషత్తు- వాజసనేయ సంహిత, పూర్ణమద ఇతిశాంతిః; ౨. తలవకారోపనిషత్ (లేక) కేనోపనిషత్తు- సామవేదము, ఆప్యాయంత్వితిశాంతిః; 3. కఠోపనిషత్తు- కృష్ణయజుర్వేద, సహనావవత్వితిశాంతిః; ౪. ప్రశ్నోపనిషత్తు- అధర్వణవేద, భద్రంకర్ణేభిరితిశాంతిః; ౫. ముండకోపనిషత్తు- అధర్వణవేద, భద్రంకర్ణేభిరితిశాంతిః; ౬. మాండూక్యోపనిషత్తు- అధర్వణవేద, భద్రంకర్ణేభిరితిశాంతిః; ౭. తైత్తిరీయోపనిషత్తు- కృష్ణయజుర్వేద, సహనావవత్వితిశాంతిః; ౮. ఐతరేయోపనిషత్తు- ఋగ్వేదము, వాఙ్మేమనసీతిశాంతిః; ౯. ఛాందోగ్యోపనిషత్తు- సామవేదము, ఆప్యాయంత్వితిశాంతిః; ౧౦. బృహదారణ్యకోపనిషత్తు- కాణ్వశాఖ, పూర్ణమదఇతిశాంతిః; ౧౧. బ్రహ్మోపనిషత్తు- కృష్ణయజుర్వేద, సహనావవత్వితిశాంతిః; ౧౨. కైవల్యోపనిషత్తు- కృష్ణయజుర్వేద, సహనావవత్వితిశాంతిః; ౧3. జాబాలోపనిషత్తు- వాజసనేయి, పూర్ణమదఇతిశాంతిః; ౧౪. శ్వేతాశ్వతరోపనిషత్తు-కృష్ణయజుర్వేద, సహనావవత్వితిశాంతిః; ౧౫. హంసోపనిషత్తు- వాజసనేయి, పూర్ణమద ఇతిశాంతిః; ౧౬. అరుణికోపనిషత్తు- సామవేద, ఆప్యాయంత్వితిశాంతిః; ౧౭. గర్భోపనిషత్తు- కృష్ణయజుర్వేద, సహనావవత్వితిశాంతిః; ౧౮. నారాయణోపనిషత్తు- కృష్ణయజుర్వేద, సహనావవత్వితిశాంతిః; ౧౯. పరమహంసోపనిషత్తు- వాజసనేయి, పూర్ణమదఇతిశాంతిః; ౨౦. అమృతబిందూపనిషత్తు- కృష్ణయజుర్వేద, సహనావవత్వితిశాంతిః; ౨౧. అమృతనాదోపనిషత్తు- కృష్ణయజుర్వేద, సహనావవత్వితిశాంతిః; ౨౨. అధర్వశిరోపనిషత్తు- అధర్వణ, భద్రంకర్ణేభిరితిశాంతిః; ౨3. అధర్వశిఖోపనిషత్తు- అధర్వణ, భద్రంకర్ణేభిరితిశాంతిః; ౨౪. మైత్ర్యాయణ్యుపనిషత్తు- సామవేద, ఆప్యాయంత్వితిశాంతిః; ౨౫. కౌషీతకిబ్రాహ్మణోపనిషత్తు- ఋగ్వేద, వాఙ్మేమనసీతిశాంతిః; ౨౬. బృహజ్జాబాల్యోపనిషత్తు-అధర్వణ, భద్రంకర్ణేభిరితిశాంతిః; ౨౭. నృసింహతాపనీయోపనిషత్తు- అధర్వణ, భద్రంకర్ణేభిరితిశాంతిః; ౨౮. కాలాగ్నిరుద్రోపనిషత్తు- కృష్ణయజుర్వేద, సహనావవత్వితిశాంతిః; ౨౯. మైత్రేయ్యుపనిషత్తు- సామవేద, ఆప్యాయంత్వితిశాంతిః; 3౦. సుబాలోపనిషత్తు- వాజసనేయి, పూర్ణమదఇతిశాంతిః; 3౧. క్షురికోపనిషత్తు- కృష్ణయజుర్వేద, సహనావవత్వితిశాంతిః; 3౨. మంత్రి

కోపనిషత్తు- వాజసనేయి, పూర్ణమదఇతిశాంతిః ౩౩. సర్వసారోపనిషత్తు- కృష్ణయజుర్వేద సహనావవత్వితిశాంతిః; ౩౪. నిరాలంబోపనిషత్తు- వాజసనేయి, పూర్ణమదఇతిశాంతిః ౩౫. శుకరహస్యోపనిషత్తు- కృష్ణయజుర్వేద; సహనావవత్వితిశాంతిః; ౩౬. వజ్రసూచ్యుపనిషత్తు- సామవేద, ఆప్యాయంత్వితిశాంతిః; ౩౭. తేజోబిందూపనిషత్తు- కృష్ణయజుర్వేద, సహనావవత్వితిశాంతిః; ౩౮. నాదబిందూపనిషత్తు- ఋగ్వేద, వాఙ్మేమనసీతిశాంతిః; ౩౯. ధ్యానబిందూపనిషత్తు- కృష్ణయజుర్వేద, సహనావవత్వితిశాంతిః; ౪౦. బ్రహ్మవిద్యోపనిషత్తు- కృష్ణ యజుర్వేద, సహనావవత్వితిశాంతిః; ౪౧. యోగతత్త్వోపనిషత్తు- కృష్ణయజుర్వేద, సహనావవత్వితిశాంతిః; ౪౨. ఆత్మబోధోపనిషత్తు- ఋగ్వేద, వాఙ్మేమనసీతిశాంతిః; ౪౩. నారదపరివ్రాజకోపనిషత్తు- అధర్వణవేద, భద్రంకర్ణేభిరితిశాంతిః; ౪౪. త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్తు- వాజసనేయ, పూర్ణమదఇతిశాంతిః; ౪౫. సీతోపనిషత్తు-అధర్వణ, భద్రం కర్ణేభిరితిశాంతిః; ౪౬. యోగచూడామణ్యుపనిషత్తు- సామవేద, ఆప్యాయంత్వితిః; ౪౭. నిర్వాణోపనిషత్తు- ఋగ్వేద, వాఙ్మేమనసీతిః; ౪౮. మండలబ్రాహ్మణోపనిషత్తు- శుక్లయజుర్వేద, పూర్ణమదఇతిశాంతిః; ౪౯. దక్షిణామూర్త్యుపనిషత్తు- కృష్ణయజుర్వేద, సహనావవత్వితశాంతిః; ౫౦. శరభోపనిషత్తు- అధర్వణవేద, భద్రంకర్ణేభిరితిశాంతిః; ౫౧. స్కందోపనిషత్తు- కృష్ణయజుర్వేద, సహనావవత్వితిశాంతిః; ౫౨. త్రిపాద్విభూతిమహానారాయణోపనిషత్తు- అధర్వణ, భద్రంకర్ణేభిరితిశాంతిః; ౫౩. అద్వయతారకోపనిషత్తు- శుక్లయజుర్వేదము, పూర్ణమదఇతిశాంతిః; ౫౪. రామరహస్యోపనిషత్తు- అధర్వణ, భద్రంకర్ణేభిరితిశాంతిః; ౫౫. రామతాపనీయోపనిషత్తు- అధర్వణ. భద్రంకర్ణేభిరితిశాంతిః; ౫౬. వాసుదేవోపనిషత్తు, సామవేద, ఆప్యాయంత్వితిశాంతిః; ౫౭. ముద్గలోపనిషత్తు- ఋగ్వేద, వాఙ్మేమనసీతిశాంతిః; ౫౮. శాండిల్యోపనిషత్తు- అధర్వణవేద, భద్రంకర్ణేభిరితిశాంతిః; ౫౯. పైంగలోపనిషత్తు- శుక్లయజుర్వేద, పూర్ణమదఇతిశాంతిః; ౬౦. భిక్షుకోపనిషత్తు-శుక్లయజుర్వేద, పూర్ణమదఇతిశాంతిః; ౬౧. మహోపనిషత్తు- సామవేద, ఆప్యాయంత్వితిశాంతిః; ౬౨. శారీరకోపనిషత్తు- కృష్ణయజుర్వేద, సహనావవత్వితిశాంతిః; ౬౩. యోగశిఖోపనిషత్తు- కృష్ణయజుర్వేద, సహనావవత్వితిశాంతిః; ౬౪. తురీయాతీతావధూతోపనిషత్తు- శుక్లయజుర్వేద, పూర్ణమదఇతిః; ౬౫. సన్న్యాసోపనిషత్తు- సామవేదము, ఆప్యాయంత్వితిశాంతిః; ౬౬. పరమహంస పరివ్రాజకోపనిషత్తు- అధర్వణవేద, భద్రం కర్ణేభిరితిశాంతిః; ౬౭. అక్షమాలికోపనిషత్తు- ఋగ్వేదము, వాఙ్మేమనసీతిశాంతిః; ౬౮. అవ్యక్తోపనిషత్తు- సామవేదము, ఆప్యాయంత్వితిశాంతిః; ౬౯. ఏకాక్షరోపనిషత్తు- కృష్ణయజుర్వేదము, సహనావవత్వితిశాంతిః; ౭౦. అన్నపూర్ణోపనిషత్తు- అధర్వణవేద, భద్రంకర్ణేభిరితిశాంతిః; ౭౧. సూర్యోపనిషత్తు- అధర్వణవేద, భద్రం కర్ణేభిరితిశాంతిః; ౭౨. అక్ష్యుపనిషత్తు- కృష్ణయజుర్వేదము, సహనావవత్వితిశాంతిః; ౭౩. అధ్యాత్మోపనిషత్తు- వాజసనేయి, పూర్ణమదఇతిశాంతిః; ౭౪. కుండినోపనిషత్తు- సామవేద, ఆప్యాయం ; ౭౫. సావిత్ర్యుపనిషత్తు- సామవేద, ఆప్యాయంత్వితిశాంతిః;

౭౬. ఆత్మోపనిషత్తు- అధర్వణవేద, భద్రంకర్ణేభిరితిశాంతిః; ౭౭. పాశుపతబ్రహ్మోపనిషత్తు- అధర్వణవేద, భద్రంకర్ణేభిరితిశాంతిః; ౭౮. పరబ్రహ్మోపనిషత్తు- అధర్వణవేద, భద్రంకర్ణేభిరితిశాంతిః; ౭౯. అవధూతోపనిషత్తు-కృష్ణయజు,

సహనావవత్వితిశాంతిః; ౮౦. త్రిపురతాపిన్యుపనిషత్తు-అధర్వణ,భద్రంకర్ణేతిశాంతిః; ౮౧. దేవ్యుపనిషత్తు- అధర్వణ, భద్రంకర్ణేతిశాంతిః; ౮౨. త్రిపురోపనిషత్తు- ఋగ్వేదము, వాఙ్మేమనసీతిశాంతిః; ౮౩. కఠోపనిషత్తు- కృష్ణయజు, సహనావవత్వితి శాంతిః,౮౪. భావనోపనిషత్తు-అధర్వణ,భద్రంకర్ణేభిరితిశాంతిః; ౮౫. రుద్రహృదయోపనిషత్తు - కృష్ణయజు, సహనావవత్వితిశాంతిః; ౮౬. యోగకుండల్యుపనిషత్తు- కృష్ణయజు, సహనావవత్వితి శాంతిః; ౮౭. భస్మజాబాల్యోపనిషత్తు-అధర్వణ, భద్రంకర్ణేభిరితిశాంతిః; ౮౮. రుద్రాక్షజాబాలోపనిషత్తు - సామవేద, అప్యాయంత్వితిశాంతిః; ౮౯. గణపత్యుపనిషత్తు- అధర్వణ, భద్రంకర్ణేభిరితిశాంతి; ౯౦. దర్శనోపనిషత్తు- సామవేద, అప్యాయంత్వితిశాంతిః; ౯౧ తారసారోపనిషత్తు- శుక్లయజు,పూర్ణమద ఇతిశాంతిః; ౯౨. మహావాక్యోపనిషత్తు- అధర్వణ,భద్రంకర్ణేభిరితిశాంతిః; ౯౩. పంచబ్రహ్మోపనిషత్తు- కృష్ణయజుర్వేద, సహనావవత్వితిశాంతిః; ౯౪. ప్రాణాగ్నిహోత్రోపనిషత్తు- కృష్ణయజుర్వేద, సహనావవత్వితి శాంతిః; ౯౫. గోపాలతపనోపనిషత్ - అధర్వణ, భద్రంకర్ణేభిరితి శాంతిః; ౯౬. కృష్ణోపనిషత్తు- అధర్వణ, భద్రంకర్ణేభిరితిశాంతిః; ౯౭. యాజ్ఞవల్క్యోపనిషత్తు- శుక్లయజుర్వేద, పూర్ణమద ఇతిశాంతిః; ౯౮. వరాహోపనిషత్తు- కృష్ణయజుర్వేద,సహనావవత్వితిశాంతిః; ౯౯. శాట్యాయనీయోపనిషత్తు- శుక్లయజుర్వేద, పూర్ణమద ఇతిశాంతిః; ౧౦౦. హయగ్రీవోపనిషత్తు- అధర్వణవేద, భద్రంకర్ణేభిరితిశాంతిః; ౧౦౧. దత్తాత్రేయోపనిషత్తు- అధర్వణవేద, భద్రంకర్ణేభిరితి శాంతిః; ౧౦౨. గారుడోపనిషత్తు- అధర్వణ, భద్రంకర్ణేభిరితిశాంతిః; ౧౦౩. కలిసంతరణోపనిషత్తు-కృష్ణయజుర్వేద, సహనావవత్వితిశాంతిః; ౧౦౪. జాబాల్యుపనిషత్తు- సామవేదము, అప్యాయంత్వితిశాంతిః; ౧౦౫. సౌభాగ్యలక్ష్మ్యుపనిషత్తు- ఋగ్వేదము, వాఙ్మేమనసీతిశాంతిః; ౧౦౬. సరస్వతీరహస్యోపనిషత్తు- కృష్ణయజుర్వేద, సహనావవత్వితిశాంతిః; ౧౦౭. బహ్వృచోపనిషత్తు- ఋగ్వేదము, వాఙ్మేమనసీతిశాంతిః; ౧౦౮. ముక్తికోపనిషత్తు- శుక్లయజుర్వేదము, పూర్ణమదఇతిశాంతిః. ఈ అష్టోత్తరశతోపనిషత్తులు శ్రీరాముం డాంజనేయున కుపదేశించి తరింపఁజేసెను. అవి ఋగ్వేదమునుండి పదియును, శుక్లయజుర్వేదము నుండి పందొమ్మిదియును, కృష్ణ యజుర్వేదము నుండి ముప్పదిరెండును, సామవేదమునుండి పదునారును, అధర్వణవేదము నుండి ముప్పదియొకటియు మొత్తము నూట ఎన్మిదిగ నెఱుంగునది.

**ఉపన్యాసమున వినుఁడు వినుఁడు అనునది** — సభలయం దుపన్యాసములిచ్చు తరి, వినువారలలోఁగొందఱు "వినుఁడు, వినుఁడు" (Hear, Hear) అని అఱతురు. దీనికి శ్రద్ధగా వినుఁడు (Pay Attention) అర్థము స్ఫురించును. ఇది ఆంగ్లపార్లమెంటునందలి సాంప్రదాయము. తొలుత వినుఁడు (Hear) అని ఒక్కేసారి పల్కఁబడుచుండెననియు, పందొమ్మిదవ శతాబ్దకాలమునుండియు నామ్రేడితముగఁ (రెండు సారులు విధిగ) బల్కఁబడు (వినుఁడు, వినుఁడు; Hear, Hear) చున్నదనియుఁ దెలియుచున్నది. మఱియు నిక్కాలమున నిట్లు పల్కుటయం దుపన్యాసకుఁడు వల్కినరీతిని తనకును యంగీకారమేనని సూచనగలదని తలంపఁబడుచున్నది.

**ఉపపాండవులు** — ద్రౌపదీదేవికి పాండవుల వలనఁగల్గిన సంతానమైదుగురు పుత్రుల కుపపాండవులనిపేరు. యుధిష్ఠిరునివలన ప్రతివింధ్యుడును, భీమసేనునివలన శ్రుతసోముఁడును, అర్జునునివలన శ్రుతకీర్తియు, నకులుని వలన

శతానీకుఁడును, సహదేవునివలన శ్రుతసేనుఁడును కల్గిరి. భారతయుద్ధానంతరమున వీరందఱును రాత్రి నిద్రించుచుండ నశ్వత్థామ కృపకృతవర్మల సహాయ్యమునచంపివైచెను. ఈవృత్తాంతము భారతము సౌప్తికపర్వమునఁగలదు.

**ఉపపాతకములు ౹౹౹౹౹౹ లేదు** — మహాపాతకములు చూడుఁడు. పాతకములు చూడుఁడు

**ఉపపురాణములు ౧౮** — ౧. సనత్కుమారము, ౨. నారసింహము, 3. స్కాందము (ఇది సనత్కుమారీయస్కాందము), ౪. శివధర్మము (దీనికి నందికేశ్వరోపపురాణమనిపేరు), ౫. దౌర్వాసము, ౬. నారదీయము, ౭. కాపిలము, ౮. మానవము, ౯. ఔశనము, ౧౦. బ్రహ్మాండోపపురాణము, ౧౧. వారుణము, ౧౨. కాళీపురాణము, ౧3. వాశిష్టము (దీనినే మాహేశ్వరపురాణము, మాహేశ్వరము, మాహేశ్వరోపపురాణమనియు నందురు), ౧౪. సాంబపురాణము (దీనినే సూక్ష్మపురాణమనియు నందురు), ౧౫. పారాశర పురాణము, ౧౬. మారీచము, ౧౭. భార్గము, ౧౮. సౌరము లేక సూర్యపురాణము. మాహేశ్వరపురాణమును లైంగము లేక లింగపురాణమనుటయుం గలదు. (అష్టాదశపురాణములు, పురాణములు, పురాణలక్షణములు చూడుఁడు).

**ఉపప్లవ్యదేశము, మత్స్య లేక విరాటదేశము** — ఈ దేశమున కాదిపేరు ఉపప్లవ్యదేశము. పిదప మత్స్యదేశమనియు, విరట్రాజు పాలనమున విరాటదేశమనియుఁ బేర్లు వాడుకయయ్యెను. రాజధాని విరాట్పురము. ఇది ప్రస్తుతము రీవాసంస్థానమునకుఁజేరియున్నది. బెంగాల్నాగపూర్ రెయిల్వే బిలాసపూర్ కట్నీ బ్రాంచిపై పహాదోలు స్టేషనుకడనున్న సోహాగ్పూర్ పట్టణమున కు సమీపమునం బాడుపడి యున్నది. ఇట బాణుగంగయను పవిత్రసరస్సు తీర్థమును, పాండవులిట యజ్ఞాతవాస మొనర్చు తరి యాయుధాస్త్రములందాచిన శమీ (జమ్మి) వృక్షసముదాయమును, ద్రౌపదింగూర్చి చంపఁబడిన (విరాట్మహారాజు బావమరదియగు) కీచకుని దేవస్థానమును నేఁటికానవాళ్లుగ నిలచియున్నవి. ఈ సమీపముననే పాండవుల యుద్ధములలో మొదటి కలహము (గోగ్రహణము) జరగిన తావుం జూపుదురు.

ఈ దేశమునందలి క్షేత్రమగు నమరకంటకము గలదు. ఇది బెంగాల్నాగపూర్ రెయిల్వే బిలాసపూర్ కట్నీబ్రాంచిపైనున్న పెండ్రారోడ్డుస్టేషను నుండి పదునాల్గమైళ్లలోగల మేఖలపర్వతముపై నున్నది. తొల్లి అమరకంటకుఁడను రక్కసుని విష్ణుదేవుఁడు వధించిన తావు. ఇట కపిలర్షి యాశ్రమముకడ కపిలధార గలదు. అందుండి నర్మద, జోహిల, శోణభద్రయను మూడునదులు కలసి జన్మించిన పవిత్రతీర్థమును, మార్కండేయ క్షేత్రమును కలవు. ఈ ప్రాంతముననే గులేబకావలీభవనముండిన స్థలము కలదు. ఈదేశమున మేఖలపర్వతోపరిభాగమున వాశగుల్మమనిపేరు గల పవిత్రకుండముకలదు. ఇది నర్మదాజన్మస్థానమగుకపిలధారకుఁ దూర్పుగా నాల్గుమైళ్ల దూరముండును. ఇది తీర్థము. దీనింగూర్చిన ప్రశంస మహాభారతము వనపర్వమునఁ గానవచ్చుచున్నది. మఱియు స్కాందపురాణ రేవాఖండమునం దమరకంటక ప్రశంసకలదు. కపిలధారకడ కపిలర్షి యాశ్రమస్థలిని పిత్రర్చన లొనర్తురు.

**ఉపప్లావ్యము** భారతయుద్ధ కాలమునఁ బాండవు లేర్పఱుచుకొనిన నివాసస్థలము. ఇటనే కడపటి రాయబారములు నడిచెనట. ఇది ఉపప్లవ్యదేశముకాదు.

**ఉపప్లుతా** — ఆయుర్వేదవైద్యశాస్త్రమున స్త్రీల మర్మావయవ సంబంధరోగమునకు ఉపప్లుతరోగమని పేరు.

**ఉపమన్యు (ఉపము) కులగోత్రము** — ఆర్యవైశ్యుల (౧౦౨) గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు).ఉపమన్యు (ఉపమ) కులగోత్రము, త్ర్యార్షేయ (౭) గోత్రము, సంస్కృత గోత్రము, వామదేవస, బృహాదుక్థగణము, ఆపస్థంబసూత్రము, యజుశ్శాఖ, ప్రమాణ గ్రంథము మాత్స్యసూత్రము, కుంభేశుఁడు దేవత, భార్య కోనాంబ, మలయాద్రితపస్థానము, కోనసరస్సుతటాకము, జపములక్షు, దీపములు ౭౩, క్షేత్రసంఖ్య ౭౩, అన్నదానము, పిప్పలి వర్జనీయము.

**ఉపమన్యు గోత్రము** — ఉపమన్యు గణము చూడుఁడు.

**ఉపమన్యు గణము** — (వశిష్ఠసంతతి) ఇందు ౮౬ గోత్రములు కలవు.

బోధాయనసూత్రోక్త గోత్రములు ౨౩- ౧. అనుశుద్ధి, ౨. ఆలవాయన, ౩. ఉపమన్యు, ౪. ఉపగవ, ౫. ఔద్గాహాయని, ౬. కపికేశ, ౭. కాపినజల, ౮. కావాధి, ౯. కుండోదరాయణ, ౧౦. జయోలోక, ౧౧. జాలాగత, ౧౨. త్రైవర్ణ, ౧౩. పాపాగిరి, ౧౪. భాగవిత్తాయన, ౧౫. మహాకర్ణాయన, ౧౬. మాండలేఖి, ౧౭. లాక్ష్మణేయ, ౧౮. లాహవి, ౧౯. పలాయని, ౨౦. వాకాశ్వి, ౨౧. వాలశిఖ, ౨౨. శైలాలి, ౨౩. సురాక్షు.

కాత్యీయసూత్రోక్త గోత్రములు ౨౬- ౧. ఆప, ౨. ఔపలేఖి, ౩. ఔలపి, ౪. కశానేయ, ౫. కారకృత్, ౬. కారవ్య, ౭. గోఽధ, ౮. దశేరక, ౯. దావాల, ౧౦. దాసకాయన, ౧౧. రుహిత్స, ౧౨. పార్ణాగార, ౧౩. పాదకాయన, ౧౪. ప్రాలంబాయన, ౧౫. బ్రహ్మావలి, ౧౬. భాగహి, ౧౭. భాగురాయణ, ౧౮. మాయశరావి, ౧౯. వాహ్యావాక్య, ౨౦. శాండోదరి, ౨౧. శావార్య, ౨౨. శైలావి, ౨౩. సాఙ్ఖ్యాయన, ౨౪. సారాయణ, ౨౫. సాహ్యాపత్య, ౨౬. శిరి.

మాత్స్యసూత్రోక్త గోత్రములు ౨౦- ౧. ఉద్రాహ, ౨. ఉపలయ, ౩. కృష్ణ, ౪. కాణ్య, ౫. క్రోధిన, ౬. కోక్ష, ౭. కౌమార, ౮. తరోగణ, ౯. దాకాయన, ౧౦. బాలకి, ౧౧. మహాకణ్వ, ౧౨. మానేయ, ౧౩. రావణ, ౧౪. వలేబల, ౧౫. వాకి, ౧౬. శాఙ్కలీయ, ౧౭. శాకహాయ, ౧౮. శాకాయన, ౧౯. శ్యామి, ౨౦. సుహాక.

ఇతరగ్రంథోక్త గోత్రములు ౧౭- ౧. కరచక్రదామి, ౨. కాజపాయన, ౩. కారపులి, ౪. కౌలకి, ౫. గోపోదంతి, ౬. ధాతుహి, ౭. నాహులి, ౮. పాదకాయన ౯. పాధుశ్రవ, ౧౦. మారాయణ, ౧౧. ముంచికాయన, ౧౨. రాస్పేయ, ౧౩. రాక్ష, ౧౪. వాహులి, ౧౫. శాప్యాయన, ౧౬. స్కాంబాయన, ౧౭. హేమమణి.

ఈ ఉపమన్యు గణమునందలి గోత్రములు ౮౬ ప్రవర రూపములు ౩- ౧. వశిష్ఠ- ఇంద్రప్రమద, ఆభరద్వసు. ౨. వశిష్ఠ- ఆభరద్వసు, ఇంద్రప్రమద. ౩. ఆభరద్వసు- వశిష్ఠ, ఇంద్రప్రమద.

**ఉపమన్యు గోత్రము** — జాతుకర్ణ్య గణము చూడుఁడు.

**ఉపమన్యువు ఋషి** — ఈఋషి సత్తముఁడు గొప్పశివభక్తుఁడు. ప్రముఖులలోనెన్నఁబడిన వాఁడు. ఆయోధౌమ్యుఁడను నామాంతరము గల, ధౌమ్యుఁడీతని గురువని చెప్పఁబడినది.

ఆరుణి, వేదుఁడను వారలుగూడ ఆగురువునకే శిష్యులగుట, వారికినుపమన్యునకు సహాధ్యాయులనియుందురు. ఉపమన్యుఁడు మిగుల గురుభక్తుఁడట. అశ్వినీదేవతల వరము వలన ఉపమన్యునకు స్వర్ణదంతములు గల్గెననియు, సకల విద్యాపారంగతుఁడనియు మహాభారత ఆదిపర్వ, (పౌష్య) తృతీయాధ్యాయమునఁ జెప్పఁబడినది. ఈమహాత్ముఁడు మాహేశ్వర సూత్రములకు నందికేశ్వరకృత యుపోద్ఘాతమునకు వ్యాఖ్యను రచించినవాఁడు. (మాహేశ్వర సూత్రములు చూడుఁడు). ఈతనితండ్రిపేరు వ్యాఘ్రపాదర్షి యని తెలిసెడిని. ఆయనకు వ్యాఘ్రపాదములఁబోలిన పాదములుండెనందురు. ఈతఁడొక వ్యాకరణము వ్రాసెనట గాని యదికానరాకున్నది.

**ఉపమితి గోత్రము** — విష్ణువృద్ధ ఉపగణము చూడుఁడు.

**ఉపయన్నపయన్ధర్మో వికరోతిహి. ధర్మిణమితిన్యాయము** — గుణముగాని, లక్షణముగాని కన్పించుట లేక అదృశ్యమగుట వలన (కథ లేక చరిత్రయొక్క)స్థితి లక్షణములును మార్పుఁజెందుననుట కీన్యాయము వాడుదురు.

**ఉపయాజుఁడు** — గంగాకూలమున నివసించుచుండిన యొక వానప్రస్థు. ద్రుపద మహారాజుచేత యాజునునితోసహా యాగము చేయించినవాఁడని తెలియుచున్నది.

**ఉపరత్నములు** — గోమేధికము, గౌణ రత్నము, పద్మరాగము, వైడూర్యము, ప్రవాళము (పవడము), కాచము (గాజురాయి), స్ఫటికము, శుక్తి (ముత్యపుచిప్ప), శంఖము (శంఖముతోఁ జేయఁబడిన పూసలు, పలకలు మొదలగునవి యని భావము) ఈతొమ్మిదింటి నుపరత్నములని చెప్పుదురు.

**ఉపరసములు** — ఆయుర్వేద వైద్య శాస్త్రమున (గౌణరసీషు) హింగుళ, అభ్రక, తాళక, శిల, స్రోత్రాంజన, టంకణ, రాజావర్త, కాంతలోహ, స్ఫటిక, శంఖ, ఖటీ (నావసుద్ద), గైరిక, కాసీస, రసక (కపరితుత్థము), కపర్థ (గవ్వ), కంకుష్ఠ, సౌరాష్ట్ర ములను ఉపరసము లని చెప్పఁబడినది.

**ఉపరిచరవసువు** — అత్రి, చంద్ర, యదు, కురు సంతతి క్షత్రియుఁడు. తండ్రి, సుదనస్సు. కుమాళ్లు బృహద్రథుఁడు, కుసుంబుఁడు, మత్స్యుఁడు, ప్రత్యగ్రుఁడు, చేదిషుఁడు అనువారైదుగురు. సత్యవతియనుకుమార్తెయును గలదు. ఈమె యమునానదియందు శాపవశమై యున్న అద్రిక యను నప్సరకు జనించినది.

**ఉపరిశిష్టకులగోత్రము** — విపరిశిష్టకుల చూడుఁడు.

**ఉపలయగోత్రము** – ఉపమన్యు గణము చూడుఁడు.

**ఉపలావృతారణ్యము** – నవారణ్యములు చూడుఁడు.

**ఉపలోధ గోత్రము** – శండిలగణము చూడుఁడు.

**ఉపలోహములు** — స్వర్ణము, తారము (వెండి), రాగి, నాగము (తగరము), రసము (రసాంజనము), కాంతం(కాంతలోహము), తీక్షణం (తీక్ష్ణలోహము), ముండా (మాండూర లోహము) వీనికుపలోహములని ఆయుర్వేద వైద్యశాస్త్రమునఁబేరు.

**ఉపవాయువులు** – పంచవాయువులు చూడుఁడు.

**ఉపవాసము** — హిందువులకుఁ గొన్ని పవిత్రదినములు ఉపవాసదినములుగఁ జెప్పఁబడినవి. శైవులందు మహాశివరాత్రి, కార్తీక సోమవారములు, మాసశివరాత్రులు. అరుదుగఁ గొందఱి కన్నిసోమవారములు పవిత్రదినములుగ

నుపవాసములుగఁ జెప్పఁబడినవి. వీరి ఉపవాసము పగలంతయు నని భావము. సాయంకాలమున వీరు శివపూజయొనర్చి భుజింతురు. వైష్ణవ మతస్థు లేకాదశులు మొదలగు దినములందు పగలు రాత్రియుఁగూడ భోజనముజేయక యుపవసించి మరునాఁడుదయమున (ద్వాదశి) భోజనమొనర్తురు. మధ్వులు నట్లేచేతురు. ఇంక స్మార్తవులందివియు నవియుఁగూడ పాటించుట కలదు. శివసంబంధదినములందు శైవులవలెను, విష్ణుసంబంధ దినములను వైష్ణవులవలెను ఆచరింతురు. మహమ్మదీయులందు రమదాను మాసమున సూర్యోదయాత్పూర్వము భుజించి పగలంతయు అనఁగా సూర్యాస్తమయపర్యంత ముపవసించి పిదప భుజింతురు. ఇటుల వేర్వేఱు మతస్థులందు వేర్వేఱువిధముల నుపవాసము లాచరింపఁబడుచుండును. "ఉపస్సమీపేయోవాసో। జీవాత్మపరమాత్మనోః । ఉపవాసస్సవిజ్ఞేయః॥" అని చెప్పఁబడియుంట దైవసన్నిధిం గల్పించుకొని దైవచింతనతో నుపవాసమొనర్పవలెనని హిందువులపద్ధతియు, ఖురాన్వచనమున రోజావ్రతము నలుపుచు రమదాన్ మాసపు ఉపవాసములు నలుపవలెనని ఇస్లాంమతపద్ధతియు నెఱుంగఁదగినది.

**ఉపవాసాద్వరంభిక్షా** — ఉపవాసముండుటకన్న భిక్షాటనము మేలని యర్థము. మరికొన్ని సందర్భముల భిక్షాటనముకన్న ఉపవాసము మేలనియుం గూడఁ జెప్పఁబడినది. ఈన్యాయము స్పష్టోపయోగము కలదికాదు.

**ఉపవిందు గోత్రము** — ఔతథ్య ఉపగణము చూడుఁడు.

**ఉపవిషములు** — ఆయుర్వేద వైద్యశాస్త్రమున అతివస, జిల్లేడు, గన్నేరు (వేళ్లు), ఉమ్మెత్త, పొత్తిదుంప, కాడచెముడు, ఉపవిషము లందురు.

**ఉపశమానుస్మృతి** — దశబాద్ధాను స్మృతులు చూడుఁడు.

**ఉపసంజనిష్యమాణ నిమిత్తోఽప్యపవాదఉప సంజాతనిమిత్తముప్యుత్సర్గం బాధతేతిన్యాయము** — ఇది వ్యాకరణ న్యాయము. అపవాదులను చెప్పుకారణములు ప్రధానమై ఇదివఱకే యున్నవియై యుండుతఱి సాధారణ ధర్మముల నతిక్రమింపఁగలదు. ఇందువలన "దేవదత్త హంతృహత న్యాయము" అనఁగా దేవదత్తుని చంపినవాఁడు చచ్చెను. అనుతఱి ననిభావము.

**ఉపస్మృతులు** — ఇవి వేదాంగముల లోనివి. (వేదములు చూడుఁడు). ౧. కణ్వస్మృతి, ౨. కపిలస్మృతి, 3. లోహితస్మృతి, ౪. దేవలస్మృతి, ౫. కాత్యాయనస్మృతి, ౬. లోకాక్షిస్మృతి, ౭. బుధస్మృతి, ౮. శాతాతపస్మృతి, ౯. అత్రిస్మృతి, ౧౦. ప్రచేతస్మృతి, ౧౧. దక్షస్మృతి, ౧౨. విష్ణుస్మృతి, ౧3. వృద్ధవిష్ణుస్మృతి, ౧౪. వృద్ధమనుస్మృతి, ౧౫. ధౌమ్యస్మృతి, ౧౬. నారదస్మృతి, ౧౭. పౌలస్త్యస్మృతి, ౧౮. ఉత్తరాంగిరస్మృతి.

**ఉపహోలక** — కుంతలదేశముచూడుఁడు.

**ఉప్పరులు** — వీరింగూర్చి తెలుపుగ్రంథములు లేవు. వీరియం దనుశ్రుతమున వాడుకగ నున్న కథనముమేరకు సూర్యవంశపు రాజగు సగరచక్రవర్తికి రెండవభార్యవలనఁ గల్గి, కపిల మహర్షి శాపమున భస్మీభూతులైన అరువదియారువేలమంది పుత్రుల సంతతివారమని వీరనెదరు. వీరి పూర్వులగు సగరపుత్రు లరువదియారువేలమందియుఁ బాతాళలోకముదనుకఁ ద్రవ్వినది సముద్రమై సాగరమనుపేరం బరగుచున్నదనెదరు.

**ఉప్పికూరచెట్టు** — లా. Anona reticulata లేక Monetia barlerioides. సం. గ్రీష్మజా, లవణా. నల్లఉప్పి, తెల్లఉప్పి అని ఉప్పి ద్వివిధము. లేత ఉప్పికూర త్రిదోషము లను హరించి కండ్లకుఁ జలువనిచ్చును. రెంటి గుణము లించుమించు సమానములే. మఱియు తెల్లఉప్పి వేరుగాని, ఆకుగాని, రసకషాయములు గాని ఉష్ణముజేసి వాతము హరించుననియు, సూతికావాతము నడంచుననియు, ఉబ్బుజాడ్యము, ఉబ్బసము, దగ్గు, వాతకాసరోగము, క్షయరోగము నివారించుననియుం జెప్పఁబడినది.

**ఉప్పు అధికము తినువాఁడే నీ రెక్కువ త్రాగువాఁడు**—ఆంధ్రలోకోక్తి.

**ఉప్పుతోఁగలసిమంచుగడ్డ అతిశీతల మగుట** — లవణమునకు నీటి నాకర్షించి తానును కరగి కలసిపోవునట్టి గుణముకలదు. కాన, గాలితగిలిన యుప్పు గాలినుండి నీటినాకర్షించుకొని చెమ్మగిలుం గాని యారి పొడిగా నుండఁజాలదు. వేడిగల యెండయుదిడిన పరిస్థితులు వేఱుగాన పొడిగానుండెడిని.

ఉదకమునకు మూఁడురూపములు కలవు. ఘనీభవించిన (Solid) రూపము మంచు. ద్రవించిన (Liquid) రూపము ఉదకము. వాయు (Gas) రూపము గాలియందుండు నీటి యావిరి మొదలగునవి. ఈమూఁడును ఉదక రూపములే. ద్రవరూపమునను్న యుదకముతోఁగాని, గాలియందు వాయురూపమున నున్న యుదకమగు నావిరితోఁగాని ఉప్పుకలియుటతోఁ దాగరగి దానిఁజేరుచో దానింగూడ తనరూపము నకుఁదెచ్చుకొనునట్టుల మంచుతో గలియుతరి తా నందుఁగరగి, దానింగరగించును. కరగుటకు కొంత శక్తి (Energy) కావలయును. ఈశక్తియే వేడిమి యుండును. అది చుట్టుపట్లనుండు Atmosphere నుండి వేడిరూపమున రావల యును. మంచు అట నుండుకతన చుట్టుపట్ల వాతావరణమున వేడియుండనేరదు. కాన ఉప్పు నందున్న యీమాత్రపు వెచ్చఁదనమునే యుప యోగపర్చుకొనుచుఁ గరగిపోవును. ఇట్లనుట వలన తనయందలి వెచ్చదనముం గోల్పోయి మంచువలె తానును శీతల మగునని భావము. ఉప్పుతోఁగలసిన మంచు, ఉప్పుతోఁగలియని మంచుకన్న నెక్కుడు శీతలమై యుండును. ఈ సంగతి థెర్మామీటర్ నుండి తెలియనగును.

**ఉప్పుపైపన్ను చరిత్ర**—భరతదేశమునం దాదికాలముననుండియు నీపన్ను విధింపఁబడు చుండినటులఁ దెలియఁగలదు. ... ని జన్మ మునకుఁబూర్వము సాళ్వభూపతి వైష్ణవమను నొక క్రతువాచరింపఁదలంచి వ్యయమునకై తన రాజ్యమగు మార్తికావతమున లవణ కర మును కొమ్మని యుత్తరువిచ్చెననియు, ప్రజ లాయునవై రియగు వసుదేవునిచేఁ బ్రోత్సహింపఁ బడి పన్నియకనిరాకరించిరనియుఁ జెప్పఁబడినది. మార్తికావతమున కాపురముండిరిన యాదవు లిట్లుచేసిరని యూహింపనగును. పిదప మఱి కొంతకాలము గడచినపైని శ్రీకృష్ణుఁడు సాళ్వుని సోదరుఁడగు శిశుపాలుని నిహతుంజేయుటయు గూడ సంభవించెను. ఇందువలన ప్రాతపగలు నూతనములుగ బలపడియుండనోపు. పిదప మఱి యొకతరి సాళ్వభూనాథుఁడు ఆ వైష్ణవక్రతు వొనర్పఁదలఁచితిరుగనాయుప్పుపన్ను దాదీసికొన మొదలిడెనట. దానినెఱింగిన శ్రీకృష్ణుఁడును యాదవుల నాపన్నుంజెల్లింపనక్కరలేదని ప్రోత్స హించి క్రతువునకైన ప్రయత్నములు యుద్ధ ప్రయత్నములుగ మారునట్లుఁజేసెనట. ఈకారణ మునసనే వైష్ణవక్రతువునాపి మార్తికావత నృపా లుఁడగు సాళ్వుఁడు ద్వారకపైఁ దొమ్మిదిసారులు

దండయాత్రలొనర్చి ముట్టడించుచు తుదకా సంగరముననే శ్రీకృష్ణునిచే నిహతుండాయెనని చెప్పంబడినది. భారతదేశార్థిక చరిత్రలో ఉప్పుపై విధించిన ఎక్సైజుపన్ను విషయము మొదటినుండియు వింతగనున్నది. ఉప్పునుండి ఆదాయము బ్రిటిషు పాలనయందే కాక తత్పూర్వముకూడఁ బ్రభుత్వమునకు వచ్చెడిది. భారతదేశమునందు ఉప్పు తయారు చేయుటకు నాలుగు ముఖ్యసాధనములు కలవు. పంజాబులో నున్న కోహాటుగనులలోఁ గల రాతిఉప్పు నుండియు, రాజపుత్రస్థానముననున్న సాంబరు సరస్సులోని ఉప్పునీటినుండియు, కచ్చిదేశములో నున్న ఉప్పునీటినుండియు, బొంబాయి మద్రాసు రాష్ట్రములలో సముద్రతీరముల సముద్రోదకమును సూర్యాగ్నిచే నెండించియు నుప్పును తయారుచేయుదురు. భారతదేశమునం దుత్పత్తి యగుచున్న ఉప్పులో సగము ప్రభుత్వశాఖల వలనను, తక్కిన సగము ప్రభుత్వముచే లైసెన్సు లొసఁగఁబడిన సంస్థలచేతను తయారుచేయఁబడు చున్నది. బ్రిటిషుపాలనము వచ్చినప్పటినుండియు ననేక సమయముల ననేకవిధముల నుప్పుపై విధించిన పన్నుమొత్తము మార్చఁబడినటు లీ క్రింది యంకెలవలనఁ దెలియనగును.

౧౮౮౮-౧౯౦౩ సంవత్సరములలో ౮౨ పౌనులు బరువుగలిగిన మణుగు ఉప్పుపై పన్ను రు ౨-౮-౦ ఉండెడిది. అది ౧౯౦౩ సం॥లో ౨-౦-౦, ౧౯౦౫ సం॥లో ౧-౮-౦, ౧౯౦౭ సం॥లో ౧-౦-౦, ౧౯౧౬ సం॥లో ౧-౪-౦, ౧౯౨౩ సం॥లో ౨-౮-౦, ౧౯౨౪ సం॥లో ౧-౪-౦, ౧౯౩౧ (సెప్టెంబరు) లో ౧-౯-౦. ఈవిధమున ఉప్పుపన్ను మాటిమాటికి మారినది. నిత్యమును నిఖిలప్రజల కత్యావసరమగు నీఉప్పుపై పన్ను చాల తక్కువగానుండుట సమంజసమని తోఁపకపోదు.

**ఉపాంగములు** — భరత (నాట్య) శాస్త్రమున ౧. నేత్రములు, ౨. కనుబొమలు, ౩. నాసికము, ౪. అధరము, ౫. చెక్కిళ్లు, ౬. గడ్డము, ఉపాంగములని చెప్పంబడినవి. (హస్తాభినయము, భరతశాస్త్రము, షడంగములు, ప్రత్యంగములు చూడుఁడు).

**ఉపాంగరాగములు** — మేళకర్తా రాగములు సంపూర్ణములనియు, వానినుండి జనించినవి జన్యరాగములనియు నందురు. సంగీత శాస్త్రమున మేళకర్తారాగములు, జన్యరాగములుగూర్చి వ్రాయఁబడినది (చూడుడు). ఉపాంగ రాగముల జనకరాగములనియు నందురు. జన్య రాగములు ౧. ఉపాంగరాగములు, ౨. భాషాంగరాగములు అని ద్వివిధము. ఉపాంగ రాగములు తా నేమేళకర్తారాగమునుండి జనించిన జన్యరాగమో, ఆ మేళకర్తారాగమందలి స్వరములలోని స్వరములనే గల్గియుండును గాని, అన్యస్వరములను గల్గియుండని రాగములు, సంగీతశాస్త్రమున ఉపాంగరాగము లనఁబడును. (భాషాంగరాగములు చూడుఁడు). ఇటులనే ధీరశంకరాభరణజన్యమగు ఆరభి జన్యరాగము. అందు ధీరశంకరాభరణ స్వరముల కన్యస్వరములు గానరావు. మఱియు హనుమతోడి, జన్యమగు ధన్యాసిజన్యరాగము, అందు హనుమతోడిస్వరములకు అన్యస్వరములు గానరావు. కాన నీ జన్యరాగములు రెండును ఉపాంగరాగములని యెఱుంగునది.

**ఉపాయగోత్రము** జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.

**ఉపాయములు** — రాజనీతి, లోకనీతి వీనియం దుపాయములు నాల్గువిధములు. ౧. సామము- మైత్రివలన నితరులను స్వాధీనుల జేసికొని కార్యములుజరపుకొనుట; ౨. దానము-

ఎదుటివారికిఁ గావలసిన ధనాదుల నొసఁగియు, వారికి వలయు సహకారాదులొనర్చియు, స్వాధీనులుగఁ జేసికొని కార్యములు జరపుకొనుట; ౩. భేదము- ఎదుటివారి వర్గమునుండి చీల దీసియు, అన్యులకువారితో వైరముంగల్పించియు వారిని స్వాధీనులుగఁజేసికొని కార్యములు జరపుకొనుట; ౪. దండము- ఎదుటివారిని బాధించియు వెరపించియు, శిక్షించియు, అడచివేసియు, స్వాధీనపర్చుకొని లేక దూరము తొలఁగునట్లొనర్చియు కార్యములు జరపుకొనుట. ఈనాల్గింటిని తంత్రములనియు నందురు.

సప్తవిధోపాయములు - పైనాలుగును, ౫. మాయ (చేయుట), ౬. ఉపేక్ష (చేసినట్లు నటించి కార్యమునతాత్తుగా జరపుట), ౭. ఇంద్ర జాలము (మహామాయనడిపి మోసగించి కార్యము నెరవేర్చుకొనుట).

**ఉపాయము తెలియగనివారిని ఊరి లోనుండి పంపివేయుట (శేయము** - ఆంధ్రలోకోక్తి.

**ఉపాయేనహియుచ్ఛక్యం నతచ్ఛక్యం పరాక్రమైః** — ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. ఉపాయముచేత చేయవలసినది బలముతో జేయ వీలుండకపోవునని భావము.

**ఉపాస్యదేవతలు** — కూర్మపురాణమున నృపులకు విష్ణుదేవుఁడు పురంధరుడును, దేవతలకువిష్ణువును, దానవులకుత్రిశూలపాణియు గంధర్వులకు సోముఁడును, యక్షులకు సోముఁడును, విద్యాధరులకు వాగ్దేవి (సరస్వతి)యు, సాధ్యులకు శ్రీహరియు, రాక్షసులకు శంకరుఁ (రుద్రు) డును, కిన్నరులకు శక్తి (పార్వతి) యు, ఋషులకు బ్రహ్మయు, మనువులకు మాదేవి, విష్ణువు, సూర్యులును, గ్రహములకు విధాతయు, బ్రహ్మచారులకు బ్రహ్మయు, వైఖానసుల కంబికయు, యతులకు మహేశ్వరుఁడును, భూతములకు రుద్రుఁడును, కూష్మాండులకు వినాయకుఁడనియు నుపాసితులుగఁ జెప్పఁబడినది.

**ఉపేంద్రద్వాదశి** — భాద్రపదశుద్ధ ద్వాదశి- దీని నామలక ద్వాదశియనియు, కల్కి ద్వాదశియనియు, శక్ర (ఇంద్ర) ద్వాదశి యనియుఁ గూడ నందురు. ఇక నీదినమున శ్రవణ నక్షత్రముకూడ సంభవించునేని శ్రవణద్వాదశి యనంబరగి, కడు పవిత్రవ్రతముగ నెంచఁబడు పర్వదినమగును. ఇందు ఉపేంద్ర (వామన) పూజలొనర్తురు. (పండుగలు చూడుఁడు).

**ఉపేంద్రుఁడు - వామనుఁడు** — కశ్యప ప్రజాపతియు, ఉతని భార్య అదితియు విష్ణుదేవుఁడు తమకుఁ బుత్రుఁడై జనించుటకుఁ దపమొనర్చి కనిన కొమారుఁడు. బలిచక్రవర్తి కొఱ కవతరించిన విష్ణ్వవతారమగు వామనుఁడు. వామనావతార స్థలము ఇప్పటి బీహారులోని వాక్సారపురము. వాక్సార (ఇప్పటి బక్సార్) పురము చూడుఁడు. వ్యాఘ్రపురము చూడుఁడు.

**ఉపేంద్రవ్యూహము** — రామానుజీయవైష్ణవ, చైతన్య వైష్ణవ మతధర్మము లందు తదేకాత్మ రూప మహావిష్ణువు. అందు ద్వితీయచతుర్వ్యూహములలో నొకటియనియు, సంకర్షణ వ్యూహము లెదింటిలో నొక యుప వ్యూహమనియు, విలాసమూర్తి యనియు వరుసగ



శంఖ, గద, చక్ర, పద్మము లాయుధములనియుఁ జెప్పఁబడినది. (విష్ణు దేవాలయ విగ్రహములు చూడుఁడు).

**ఉపేక్ష్యయానము** —రాజనీతియందుఁ జెప్పఁబడిన పంచయానములలో నొకటి. షడ్గుణములు లేక షడ్గుణైశ్వర్యములు చూడుఁడు.

**ఉబ్బసము** — (Asthma) ఇది శ్వాస రోగములలో నొకటి. ఇం దనేకరోగములు భేదములుగ వెలువడును.

**ఉబేర్రిమేయి** — వాణిజ్యసంబంధ పరభాషాపదము. Uberrimae. ఒక కంట్రాక్టు పార్టీలలోగల యన్యోన్యమగు తలంపు. అట్టి అన్యోన్యనమ్మకమునకు Uberrimae Fedei అనిపేరు.

**ఉభయతఃపాశారజ్జున్యాయము** — రెండువైపులను కట్టఁబడినత్రాడని యర్థము. ఇటునటు కూడ కదలలేని స్థితిందెల్పుటకీన్యాయము వర్తించును.

**ఉభయభ్రష్టు ఉపరిసన్న్యాసి** — అన్నివిధములఁ జెడిపోయెనని భావము. ఆంధ్రలోకోక్తి.

**ఉభయవక్రరాగములు**— వక్రరాగములు చూడుఁడు.

**ఉభయవేదాంతములు** — ఇది సంస్కృత భాషలోని వేదములును, ద్రవిడభాషలోని వేదాంతములును కలసి ఉభయవేదాంతము లనియెదరు. ఋగ్యజుస్సామాధర్వణములను సంస్కృత వేదములకు వలెనె ద్రవిడవేదములను కూడ పాటించు శ్రీరామానుజీయ మతస్థుల నుభయవేదాంత ప్రవర్తకులనియెదరు.

**ఉభయశక్తిమూల** - లక్షణచూడుఁడు.

**ఉభయాభావే విశిష్టాభావః**—విశేషము, విశిష్టము కూడ లేకపోతే కలయిక యనునది యుండదు. రెండును లేకపోయినచోఁ గలయిక యుండదని భావము.

**ఉమరావతి పట్టణము (అమరావతి)**- వర్హాడు. ఇప్పటి బీరారు దేశమున నమరావతియనుపురము కలదు. ఇది మహారాష్ట్ర సీమగాఁ జెప్పనొప్పును. దీని నిజమైనపేరు ఉమ్రావతియనియు, మహారాష్ట్రులట్లె వాడుచుందురు. ఆంగ్లమున వ్రాయుతరి నమరావతియని యొకఁడు తప్పువ్రాయుటయు, పేరు తప్పురూపమున చాల దగ్గాగానుండుటయు, అన్నిటికన్న ప్రధానముగ ప్రభుత్వపుఁ గాగితములందట్లు తప్పురూపమున వ్రాయంబడుటయు నేఁటికి నాంగ్లమున నాపేరట్లే నిలచినదందురు. గుంటూరుమండలమున కృష్ణాతీరమునందొక అమరావతి కలదు. అది ధాన్యకటకము. (అమరావతి స్థూపము చూడుఁడు).

**ఉమాండి గోత్రము** — హారిత ఉపగణము చూడుఁడు.

**ఉమామహేశ్వరవ్రత పౌర్ణమి** — భాద్రపదశుద్ధ పౌర్ణమి, వ్రతదినము. (పండుగలు చూడుఁడు).

**ఉమావనము** ఇది బాణాసురుని రాజధాని. బదరీకేదారపాదమందున్న ఉషావనతప్రాంతారణ్యము. (శోణితపురము చూడుఁడు).

**ఉమ్మడిగొడ్డు పుచ్చి చచ్చినట్లు** — సంరక్షించువారు లేక నని భావము. ఆంధ్రలోకో

**ఉమ్మెత్త (ఉమ్మత్త) చెట్టు** — ఉమ్మెత్తలు తెల్లఉమ్మెత్తఅనియు, నల్ల ఉమ్మెత్తయనియు, పచ్చ ఉమ్మెత్తయనియు త్రివిధములు. ఇందు తెల్లఉమ్మెత్త గుణముకన్న, పచ్చ ఉమ్మెత్తయు, నంతకన్న నల్లఉమ్మెత్తయు బలముగఁ బనిచేయునని చెప్పఁబడినది. మఱియు నిందు నల్లఉమ్మెత్త పూలు శివార్చనకు యోగ్యము లందురు. గ. తెల్లఉమ్మెత్త, లా. Daturalba

ఆంగ్ల. Thorn-apple white. సం. ఉన్మత్త, దుత్తూర, వెగటుగనుండి కాకఁజేసి మత్తుం గల్గించును. కుష్టురోగము, సర్వవ్రణములు, దద్దురు, ఉసిరికలు మొదలగు కురుపులు మాన్పును. ఆకుల పసరుకాని, కాయలుగాని, కాయలలోని విత్తులుగాని మితముగ లోనికిచ్చిన, మత్తును గల్గించి ఎక్కువ దినిన మతి భ్రమ గల్గించునని చెప్పంబడినది. మఱియు పూటకు మూఁడు గింజలకు మించక లోనికిచ్చిన జ్వరము నివృత్తి యగునందురు. ఆకుల కాముదము రాచి వెచ్చజేసి పైనకట్టిన వాపులు, వాతపు నొప్పులు మేహవాతపునొప్పులు తగ్గును. మఱియు వ్రణములు, కురుపులు మానుననియు లేక చితుకుననియు చెప్పుదురు. ఉమ్మెత్త సమూలముగ నెండించి ముక్కలుగఁ జేసి, కాల్చి పొగపీల్చిన నుబ్బసపుదగ్గు శాంతించునందురు.

౨. పచ్చని పువ్వులంబూచు నుమ్మెత్త- ఇది తెల్పునందు పసుపుపచ్చరంగు కల్పినటుల రంగు పూవులంబూచెడి ఉమ్మెత్త. తెల్ల యుమ్మెత్తను బోలిన గుణములనే గల్గియుండును. కాని దాని కన్న నెక్కుడుబలముగఁ బనిజేయును. దీనిని లాటిన్ భాషయందు Datura metel అనియు ఆంగ్లమున Thorn-apple yellow అనియు నందురు.

3. నల్ల ఉమ్మెత్త. లా. Datura fastuosa ఆంగ్ల. Thorn-apple purple అనియుం బేర్లు. సం. కృష్ణదత్తూర, త్రిపుష్టి, కృష్ణపుష్టిక, అని పేరు. నల్లఉమ్మెత్త వెగటుగనుండి విషపదార్థముగఁజెప్పఁబడినది. ఐన నతిమితముగ వాడినతరి కఫము, కాస, క్రిమి, కుష్టు, తలనొప్పి, పిచ్చి, మూర్ఛ, వాతరోగము, విషదోషము, శ్వాసరోగముల నివారించునని చెప్పఁబడినది. నల్ల ఉమ్మెత్త ఆకులరసము పైనిపూసిన శరీరమందలి రసదోషము తగ్గుననియు, గజ్జి, చిడుము, తామర, సర్పి, దద్రు మొదలగు చర్మరోగముల నివారించెడిని. దీనిని సమూలముగఁగాని, ఆకులుగాని నీడను ఎండించి ముక్కలుగఁజేసి కాల్చి పొగ పీల్చిన మేఘరంజిదగ్గులు ఉబ్బసము, క్షయదగ్గులు, ఒగరుపుదగ్గు శమించునని చెప్పఁబడినది. ఆకునందు గేదెపేడకల్పి యుడికించి కట్టిన సెగగడ్డలు, గండమాలలు, సెలలవ్రణములు, మూలశంకరోగము హరించును. ఆకుల కాముదము చరిమి వెచ్చజేసి కట్టిన చనుకుపురు బాధ, కీళ్ళ నొప్పులు శమించును. నల్ల ఉమ్మెత్త విత్తులు గ్రహణి జబ్బులు కట్టుననియు, తైలమున వండిన, నరములకు బలహీనమైన శరీరావయవములకు ధృడత్వమొసంగి ఉద్ధృతము నిచ్చుననియు, పుప్పిపంటి బాధ మానుననియు, ఘోరమగు తలనొప్పి బాధ నివారణ మగుననియు, వెఱ్ఱికుక్క-బాధ నివర్తియై విషదోషము హరించుననియుఁ జెప్పుదురు. అన్ని ఉమ్మెత్తలకు నిమ్మపండ్ల రసము, నేరేడు చెక్క రసము, పుల్లపావిలాకు రసము, తామరాకు రసము, తామరవిత్తుల చూర్ణము, పచ్చిబియ్యపు కడుగు, ఆవుపాలు (శర్కరఁ గలపి) పైడిపత్తిపూవుల రసము, ఉప్పు విరుగుడులుగ జెప్పఁబడినవి.



**ఉమ్రా లేక సుబ్రహ్మశాఖయులు** — ప్రమారశాఖ క్షత్రియులు చూడుఁడు.

**ఉరగపురము** (ఉరయూర్) — దీనికి భుజంగనగరము, నాగపురము అనియు వాడుకలుండెను. చోళదేశపు ఉచ్ఛకాలమున దాని ప్రధాననగరమై యుండెను. తిరుచినాపల్లి ప్రాంతమున నిప్పుడు వురయూర్ అని పిలువఁబడుచున్నది. (చోళదేశము చూడుఁడు.)

**ఉరగ (సర్ప) శాస్త్రము** — ఉరగములు నోట విషమున్న జంతువులు. పాములంబిండి గరళము తీసి వైద్యులు మందులయం దుపయోగించుచుందురు. సర్ప విష వైద్యము ఆయుర్వేదమున వివరింపఁబడినది. ఈ యురగశాస్త్రమున పాదములంగూర్చిన ఇతరసంగతులు వివరింపఁబడినవి. ఈశాస్త్రము ఋషిప్రోక్తమే. తన కుడివైపున సర్పమగుపడినను, ఆసర్పము చుట్టుకొనియున్నను, తల నెత్తిచూచినను, పచ్చని చెట్టుపై కెక్కినను మేలు కలుగుననియు, ప్రయాణ మగుతరి పామును జూచి యన్యులెవ్వరేని "పాము పాము" అనియరచినను, ఆ పాముపడగ విప్పియుండగ తాఁజూచినను, ప్రయాణము సౌఖ్యముగ జరగుననియు, ఆపాము తనవైపు చూచినచో మార్గగమనము కష్టముగ నుండుననియు, తానొక యూరంగాని, యింటఁగాని ప్రవేసించుతరి పాము కూత వినుట శ్రేయోదాయకమనియు, తా నింటినుండిగాని, ఊరునుండిగాని బయలు వెడలి బయటికేగుతరి పాముకూత వినుట యమంగళప్రదమనియు నా పయనము మానుట శ్రేయమనియుం జెప్పఁబడినది. ఇంకను కొందఱు సర్పశాస్త్రవేత్తలు ప్రవేశించుతరి పాముకూత కుడివైపున శుభమనియు, ఎడమవైపున నశుభమనియుఁ జెప్పిరి. ఒక పాము వేఱొక పామును మ్రింగుట చూచుట యమంగళకరమనియు, పాము ప్రవేశించుట జూచుట శుభప్రదము కాదనియు, పాము బైటికి వెడలుచుండుట గూడ జూచుటయల్లె యక్షేమకరమనియుం గూడ మతాంతరమున కలదు.

రెండుపాముల కలహము జూచిన అద్భుతములు విననగుననియు, పాము పారిపోవుచుండగా జూచుట నష్టకరమనియు,చచ్చినపామునుజూచుట మృతవార్తాశ్రవణమనియు, ఆడుపాము మొగపాము కలయికం జూచుట శుభము చేకూరుటకు ముందు జరుగు పనియనియు, అది శుభసూచకమనియు పెక్కండ్రు ఋషులు వచించిరి. ఒక చెట్టునుండి పాము దిగుటను భూపతులు చూచిన వారికిఁబ్రబలమగు నష్టము సంప్రాప్తమగుననియుఁ జెట్టెక్కుతరి చూచుట శ్రేయోదాయకమనియుఁ జెప్పఁబడినది. ఇది సంసారులకునుగూడ కొద్దిగనో, గొప్పగనో ఫలమిచ్చునని మతాంతరము గలదు. ఇంకను కొందఱు ఋషులు, పాము ఇంటిలోనికిం జొరపడుట గాంచిన ధనపతిదరిద్రుఁడగుననియు, దరిద్రుఁడు ధనపతియగుననియుం జెప్పిరి. ఇంకను పుట్టపైకి పామెక్కుచుండుట చూచుట కీర్తిఫలమే చెప్పబడినది.

తన కెడమవైపున పాముం జూచి నడచిన యెడల తానేగు కార్యము చెడుననియు, పా మరచుచు పోయనచో తానేగు కార్యము పాడగుననియు, పాము పొరలుచుండ దాని కడుపు కనపడిన కార్యనాశనమనియు, ప్రయాణములం దివి సంభమగునేని యంతటితో వెనుకకు మఱలుట యె శ్రేయమనియు నురగశాస్త్రవిశారదులగుఋషులు వచించియున్నారు. మార్గ మేగునపుడు దారిలోఁ బాము కనఁబడి బెదరి పారిపోక నిలచియుండిన సకలశ్రేయములు కల్గుననియు, కుడివైపునుండి సర్పము వచ్చిన తాఁదలంచిన తలంపులు నెరవేఱుననియు, పడగ నాడించిన సంపత్కరమనియు, తనను చూచి పాము పడగ విప్పి ఆడిన ఘనజీవనము, శుభము, ధనలాభము తప్పక కల్గుననియు ఋషులు నుడివియున్నారు.

యజమాని చేనువద్దకుఁగాని, తోటవద్దకుఁగాని యేగుతరి నట పాము పడగ విప్పి యాడునేని, ఆఫలితము మిక్కుటమై పండుననియు, అదివఱకే అట నాడుచుండిన పాము తానట కేగగనె తన్నుం జూచి పారిపోయినచో, ఆపంట తాఁ దినుటకు ప్రాప్తముండదనియు, పాము పడగ విప్పి యాడినఫలమున పంట పండదనుకొనిన

పొలములు సైతము అపరిమితముగఁ బండుననియు, నురగశాస్త్రవిశారదులగు ఋషులు అనుభవము వలన చెప్పియున్నారు.

**ఉరయూర్**— ఉరగపురము చూడుఁడు.

**ఉర్గళిత్రి గోత్రము** — వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.

**ఉర్జగుండదేశము** — ఉర్జగుండులను ప్రజలదేశము. కాశ్మీరమున కృష్ణగంగానది లోవలోఁ బైభాగమున నుండెనని పోల్చఁబడినది. వీరు దరదులకు సమీపస్థులు. వీరికి గురిజను రాజధాని యుండెను. దీని ప్రశంస మత్స్య పురాణము ౧౨౦ యందుకలదు.

**ఉర్దరి గోత్రము** — కుశికగణము చూడుఁడు.

**ఉరిమిడిచెట్టు** లా. Capparis religiosa. సం. అశ్మరిఘ్న, తిక్తశాక, వరుణ సర్వసాధారణముగ ఉడుముడిచెట్టు, ఉరుముడి చెట్టు అని పెక్కండ్రు నాడుచుందురు. ఇది వైద్యులుపయోగించునది. దీని యాకులరసము లేక కషాయము వెగటుగల్గి వేడిఁజేయును. ఆకలినిఁ గల్గించి పైత్యము జేయును. మూత్రావయవమందు గల్గినరోగమును నివారించి మల మూత్రముల వెడలించును. నాభియందుత్పన్నమగు విద్రధియను పేరుగల వ్రణమును మాన్పును. ఆహికజ్వరములు, దోషజ్వరముల నివారించును. ఉదావర్తశూల, గుదరోగములు, గుల్మరోగములు, పైత్యరోగములు, జిహ్వాదోషము, అజీర్తి, మేధోరోగముల నడంచును. చెవిలోని కురుపులు దీనిపసరుబోసిన మానును. ఆకులను గుదస్థానమున లేక పొక్కులు, కురుపులకు పైనికట్టిన మానును. కూరగవండి తినిన నీగుణములు జేయునందురు. అది దేహపుష్టినిచ్చును. ఆకులు వేరు నూరి పట్టువేసిన నది ఆవాల పట్టువలె వేడిచేసి నొప్పులమాన్పును. ఆపట్టుఎక్కువ కాలముంచిన పొక్కులుపొక్కు నంతటి వేడిం జేయును. ఆకుల కాముదము రాసి వెచ్చజేసి కట్టిన వాపులు, నొంటలు నివృత్తియగును. మఱియు నాకుల రసము లోనికిచ్చినను మహావాతపునొప్పులు తగ్గునని కొందఱనెదరు. ఎండిన యాకులపొగ పీల్చి ముక్కుగుండా వదలుచుండిన ముక్కుయెముకయందు జనించు పుప్పి పుండ్లు మానును. దీనిమ్రానుచెక్క కషాయము కడుములను మెత్తబరచును. లోని కిచ్చిన నిద్ర దెచ్చును. జ్వరము హరించి బలమిచ్చుననియు, చర్మవ్యాధులు, మూత్రకృచ్ఛ్రము, వమనములు, అజీర్తి కట్టుననియుం జెప్పఁబడినది.

**ఉరిమ్, తుమ్మిమ్**— బైబిలుయొక్క యేదోయొకపుస్తక మొకరాతిపెట్టెయందొకరికిం దొరకెననియు, నాపుస్తకముం జనువ ఉరిమ్, తుమ్మిమ్ అను క్రిష్టల్‌రాతిపొర రేకులు రెండుండుఁ దొరకెనని కొందఱనిరి. మరికొందఱు దైవసంకల్పము నెఱుంగ నివి Oracles అనియు కొందఱనిరి. ఆదికాలపు హిబ్రూజాతివారి ప్రథమమతగురుప్రవక్త ఈరెండుపవిత్రపదార్థములను తనహృదయమునందే ధరించియుండువాఁడని తెలిసెడిని. వానిని చేతంబట్టుకొని సోదిచెప్పు వారు భవిష్యద్విషయములను ప్రవచించుచుండు వారట.

హారమ్సువర్త సైక్లోపేడియా దీనిని నిరసించి యివి నమ్మఁదగినవి కావనుచున్నది.

**ఉరిసిపాలచెట్టు**-లా. Cissus acida. దీనింగూర్చి యంతగాఁ దెలియదు. వైద్యులు దీనిదుంపను ఆయుర్వేదవైద్యమున నుపయోగించుచున్నారు. ఉరిసిపాలదుంపను శర్కరతోఁ గల్పి నూరి లోనికిచ్చిన మూత్రశంకవ్యాధి నివృత్తి యగుననియు, పలుచగ బిళ్లలుగాఁ దరిగి అడ్డగ్ర

యను సుఖరోగమున పైనవేసి కట్టిన నివారణ మగుననియుం జెప్పుదురు.

**ఉరుకు ఉరుకు మనేవారేగాని ఉరికేవారుండరు**—పనిఁజేయుటకన్న కబుర్లు చెప్పుట తేలికయని భావము. (ఆంధ్రలోకోక్తి).

**ఉరుగ్వే దేశము** (Urugway Republic) — దక్షిణ అమెరికా ఖండమున లాప్లాటా దేశభాగమగు ప్రజాపరిపాలన దేశము. ఇది దక్షిణముగానున్నది. ౭౨,౦౦౦ చతురపు మైళ్ల వైశాల్యము గలది. (లాప్లాటా దేశము చూడుఁడు, దక్షిణ అమెరికా చూడుఁడు). మోంటివిడో ప్రభుత్వ కార్యస్థానమున్న పురము. ఇది లాప్లాటానదీతీరము. వర్తకస్థలము.

**ఉఱుము మెఱుపులకు ముందు గాలి వేడియగుట** — భూమింజుట్టి గాలి యున్నదనియు, అది వెక్కుపొరలుగ నుండు ననియు నెల్లరెఱింగినదే. భూమిసమీపమున నుండు క్రిందివరుసలు వేడిగను, ఆకాశమువైపు పైకివెళ్లినకొలఁది చల్లగ నీపొరలుండును. వేడిగాలి తేలికయగుట నాకాశముపైకిఁ దేలిపోవు చుండుటయు, ప్రక్కలనుండియు, పైనుండియుఁ జల్లనిగాలివచ్చి ఎగిరి, తేలిపోయిన గాలియుండిన స్థానము లాక్రమించుచుంటయు(వాయుచలనము) నెప్పుడు జరగుచునే యుండును. చల్లని గాలి భూసమీపమునకుం జేరి సకాలమున వేడియై అదియును అట్లే పైకితేలిపోవుచుండ చల్లని గాలి తిరుగ జేరుచుండును. ఇది వాయుచలన విధానము. మేఘములుదట్టమై మెఱుపుల ఉఱుముల తరుణమున విద్యుత్ప్రభావము ఆకాశమునప్రబలి వ్యాపించి గాలిని విద్యుచ్ఛక్తిమయ మొనర్చును. ఈమార్పునందు భూమినుండి పైకేగుచుండిన వేడిగాలి చొరలేక నిలచిపోవును. భూమిపైకి మామ్మూలుమేరకు చల్లనిగాలి ప్రవేశించుటకు వీలుకాకుండును. దానినిమనము వేడిగానున్నదని పల్కుదుము. ఉక్కగా నున్నదనియు, గాలి లేదనియు (Close) తలంతుము.

**ఉఱుము** — వర్షాకాలమరుదెంచ నాకసమున మేఘములు దట్టమై కూడియుండుతరి విద్యుత్తు (Electricity) బలపడి మేఘముల గుండా పరుగిడనారంభించును. ఒకమేఘము నుండి వేఱొకమేఘమునకుఁ బర్విడుతరి సమతలముగనుండిన చక్కగ నడచుంగాని, ఒకమేఘము నుండి జారి పల్లముగనున్న వేఱొకమేఘముపైఁ బడుతరిగాని, కేవలము క్రిందికిజారి (భూమియొక్క ఆకర్షణశక్తికిలోనై) భూమిపైఁ బడుతరిగాని గాలిపైఁబడుతరి నావిద్యుత్తును (శక్తిని) గాలి యించుక ఎదిరించి నిల్వఁజాలకపోవును. అట్టి విద్యుద్వాయువులు రెంటికింగల్గిన ప్రతిరోధము వేడినుద్భవింపఁజేయును. వేడివలన నచటిగాలి వికసించి విస్తరించుటతో నస్వాభావికమగు చలన నిరోధములుగల్గి పెద్దధ్వనియగును. ఆ ధ్వని తరంగములు మహావాయువుగుండా మనకుఁ జేరుటకు స్వల్పమైనను కొంతకాలము పట్టును. దానిని ఉఱుమనుచున్నాము. విద్యుత్ మన కగుపడుట కతిస్వల్పకాలమే చాలుంగాన ముందుగ నగుపడుచుండును. ఆయగుపడుదానిని మెఱపనుచున్నాము. మెఱయుట యన ప్రకాశించుట యని యర్థము. ముందు మెఱపుకన్పించి పిదప ఉఱుమువిన్పించుట సహజము. ఉఱుముటయు, మెఱయుటయు నొకేతరి గల్గినను మన కడకు చేరుటకు ఉఱుమున కించుక యాలస్యమగుటకు వేఱుకారణము లేదు. కొండలు పొరవాటున తలంచునటుల మేఘము లొండొంటితో రాసికొనుటవలన నెంతమాత్రమును కాదు. జలమగు విద్యుత్తు భూమిపైఁబడుతరి కొంతవఱకు నాశన మొనర్చును. దాని కతిసమీపమునందుండిన ప్రాణులు మృతినొందుటయు, వృక్ష

ముల్పైఁబడిన నవి చచ్చుటయు సంభవించును. అతరి దానిని పిడుగందురు. కొందరజ్ఞతచే పిడుగును ఇంద్రుని రథపుశిలయో, మేకో యని తలంచిరి. తొల్లింటి రోమనులు జ్యూపిటరను దేవత పిడుగు, ఉఱుము, మెఱపుల కధినాథుడనిరి.

**ఉరుశ్రవుఁడు** — నరిష్యంతుని వంశస్థుఁడు. తండ్రి పేరు సత్యశ్రవుఁడు. సత్యశ్రవ ఋషి ఋగ్వేదాధ్యాపకుఁడని తెలియుచున్నది. మఱియు నరిష్యంతుని సంతతియందే వీతిహోత్రుఁడను వాని పుత్రునకును ఉరుశ్రవుండని పేరు కలదు.

**ఉరూఢ గోత్రము** - భరద్వాజఉప గణము చూడుఁడు.

**ఉర్మియాసరస్సు** — పారశీకదేశము చూడుఁడు.

**ఉర్ పట్టణమునందలి చంద్రుని దేవస్థానము** ఉర్ పట్టణము ఛాల్డియా దేశములో నుండిన పురము. (ఛాల్డియనులు, ఛాల్డియాదేశము, ఛాల్డియారాజ్యము చూడుఁడు). ఇచట చంద్రున కర్పింపఁబడిన దేవాలయము కలదు. దానినిప్పు డచటివారు జగ్రాత్ అను చున్నారు. అది క్రీస్తు మునుపు మూడువేల సంవత్సరములనాఁటి పనిగ పరిశీలకులు పోల్చిరి. ఇత్రావు నొకతరి దేవుని స్నేహితుఁడైన అబ్రహాముప్రవక్త దర్శించెనని యచటివారనెదరు. ఈపరిసరములఁ ద్రవ్వంబడిన తావులందు బయల్పడిన గోరీలలో మానవశరీరచిహ్నములే గాక, ని ముల కవసరమగునవియు, తెలియని వియు నగు ననేకవస్తువులుకూడ దొరకియున్నవి. వీరిమతమేమో అప్పటివారికి పునర్జన్మములందు నమ్మక ముండెనో లేదో, చంద్రు నేల వీరు పూజించిరో పరిశీలన జరుగఁదగినది. అబ్రహాము దేవుని చెలికాడని బైబిలునందు చెప్పంబడినది. ఈతావు మెసపొటేమియాదేశమున ఇరాక్రాయి నంటి యున్నది.

**ఉలవలు (ఉలవ) చెట్టు** — లా. Dolichos. unichos లేక, Dolichos biflorus, ఆంగ్ల. Horse-gram- సం. కులత్థిక తామ్రబీజ. అరవమున కొళ్లు.

సర్వసాధారణమున తెల్లఉలవలను ఉలవలని వాడుదురు. ఇవిగాక ఎఱ్ఱఉలవలు, నల్లఉలవలు, అడవిఉలవలు అని మఱిమూడుభేదములునుకలవు. ఉలవలు సామాన్యముగ నొకవిధమగు గుణమే గల్గియుండునుగాని, నల్లఉలవలు ఎక్కువబలముగ పనిచేయుననియు, అడవిఉలవలందు వేఱుగుణములు కలవనియు గనిపెట్టఁబడినది. ఉలవలను కషాయముగ నొనర్చియు, చూర్ణము (పిండి) గ జేసియు, ఉలవపప్పు, ఉలవకట్టు, ఉలవగంజి మొదలగు రూపములుగ నొనర్చియు వండియు వైద్యులు వాడుచుందురు. వెగటుగ నుండి వేడి చేయును. ఇంచుక పైత్యముగూడ చేయును. శరీరము స్థూలమగుట నివారించును. వీర్యనషము గల్గించును. రాతిని బద్దలుజేయు శక్తిగలదు.

ఉలవలయం దీక్రిందిగుణములు కలవని చెప్పఁబడినది. అనగా నీరోగములను హరించునని భావము. ఉదరరోగములు, ఊపిరిగొట్టునొప్పి, ఎక్కిళ్లు, కఫరోగములు, కుసుమ, గుదరోగములు, గుల్మరోగము, తూని, ప్రతూని, అనులోమము మొదలగు సర్వవాతములు, నేత్రరోగములు, పీనస, స్త్రీల బహిష్ఠర క్తస్రవదోషములు, మధుమేహము, మలబద్ధము, మూత్రకృచ్ఛము, మూత్రబద్ధము మొదలగు మూత్రరోగములు, మూలవ్యాధి, రాజయక్ష్మ, శ్వాసకాసలు, శూలలు నివారించును.

అడవి ఉలవలకు లాటిన్ భాషయందు Dolichos uniflorus అనియు, ఆంగ్లమున Wild horse gram అనియు సర్వసాధారణముగ కలకొటిగింజ లని వాడుక పేరును కలదు.

ఇవి మలమూత్రబద్ధము నివారించి ఎక్కిళ్ళు, కఫ రోగములు, పైత్యదోషము, నేత్రరోగములు నివారించుననియు మేధస్సునందలి మొలకల రోగము నివారించుననియు, గింజలగంధము కండ్ల కలక, ఎఱుపులు, పొరలు నివారించుననియు, ఇంకను కండ్లపొరలుగూడ నయమగుననియుం జెప్పఁబడినది. ఇది చేయు దోషములకు విరుగుడులు- కలినీళ్లు, తేనె, నూనె, నెయ్యి అని చెప్పఁబడినది.

**ఉలవలవ్యవసాయము** — వర్షములు లేకున్నను మంచునంబఁ బెరిగి పండుపంట. ఇది పశు, పక్ష్యాదుల యాహారముగ నుపయోగించు పప్పుజాతి పంట. ఇది నల్లరేగటలందు, గరప భూములందుకూడ ఫలించు తేలిక పంట. దీనిని పూతయదనున భూమిలోనికిం దున్ని వైచిన భూమి సారవంతమగునని అనుభవజ్ఞులగు రైతులనుచుందురు. యకరమున కిరువది పౌనుల విత్తులంజల్లుదురు. ఇది వైమె లేక నాల్గు నెలలకు పండి కోతకువచ్చును. యకరమున కారుటన్నుల పంటపండునని చెప్పఁబడినది. ఉలవకు భూమిని ఎక్కువగ మందలనాపి మరమ్మతు చేయనక్కర లేదందురు. ఉలవచెట్టు సాంగముగ పశువుల యాహారమగును. ఉలవల నుడకబెట్టక నానించి పశువుల కాహారమిడుట మంచికాదని పరిశీలకులనుచుందురు.

**ఉల్కలు** — ఏరోలైట్సు చూడుఁడు.

**ఉల్కాపాతము**— (Shooting Star) సూర్యుఁడు మొదలగు నాకాశజ్యోతుల నాశ్రయించుకొని భూమివలె వానిచుట్టు తిరుగునట్టి యసంఖ్యాకములగు భూములవంటివి, చిన్న చిన్నవి అనేకవేల కోట్లాకసమునఁ దిరుగుచుండుననియు, అందు కొన్ని కొన్నిటన్నుల బరువుండనోపుననెమోయనియు, తక్కినవి పెక్కులు కొన్ని గ్రెయినుల బరువుండుననియు ఖగోళశాస్త్రవేత్తలు కన్పెట్టిరి. బరువుతక్కువయగుట యాకర్షణ విధియుంకు స్థిమితము జాలక ఒండొకటి రాసికొనుచుఁ దిరుగురీతినిఁ చలించుచుండు కతన నేదేని యితర గ్రహముల ఆకర్షణ లోనికిఁ జేరెనేని దారితప్పి దానిపై కేగును. పటిమగోల్పోయి బరుగున బడుట వేగమున మహావాయు మండలియందలి ప్రాణవాయువు (ఆక్సిజెన్) ఉదజని (హైడ్రోజన్) మొదలగు గాలులుప్రజ్వలింప మండుచు బూడిదయగుచు నాయాకర్షించు గ్రహముపైఁబడును. అట్లే భూమిపైఁగూడ పడుట మనమప్పుడప్పుడు జూతుము. దానికి ఉల్కాపాతమని (Shooting Star) పేరు. నక్షత్రము రాలినదని యందురు. కాలి బూడిదకాకుండ మిగిలిపోయి భూమిపైఁ బడినముక్కకు మీటియోరైట్ (Meteorite) అనిపేరిడి యున్నారు. ఉల్కలను ఏరోలైట్సు (Aerolites) అనియు నందురు. జర్మను భాష నుండి యీపదము కల్గినది. Aer అన గాలికిని Lithos రాతికిని అర్థము. ఇవి తరచుగ భూమిని సమీపించు కతన భూమింజుట్టియున్న వాయుమండలియందు జేరికొనుచు, కాలి భగ్నమగుచునే యుండునని ఆంగ్లపండితులు కనిపెట్టిరి.

**ఉల్కాయని గోత్రము** — నిధృవగణము చూడుఁడు.

**ఉల్ముకుఁడు** — తండ్రి చక్షుర్మనువు. తల్లి నడ్వలాదేవి. ఈతఁడు కనిష్ఠపుత్రుఁడు. భార్య పేరు పుష్కరిణి. అంగుఁడు, సుమనసుఁడు, ఖ్యాతి, క్రతువు, ఆంగిరసుఁడు, గయుఁడు నను నార్గురు పుత్రులుకలరు.

**ఉలూకుడు** — శకుని చూడుఁడు.

**ఉలూఖరేఖ** — పురుషసాముద్రికము చూడుఁడు, స్త్రీసాముద్రికము చూడుఁడు.

**ఉలూతబభ్రు గోత్రము** — కుశిక గణము చూడుఁడు.

**ఉలూపి లేక ఉలూచి** — తండ్రి వాసుకి. నాగకన్యక. అర్జునునివలన ఇలావంతునిఁ గనెను.

**ఉల్లి** ఉల్లి నీరుల్లి యనియు, తెల్లఉల్లి యనియు, అడవిఉల్లియనియుం ద్రివిధములు. ౧. నీరుల్లి (నీటిఉల్లి) దీనిని సర్వసాధారణముగ ఎఱ్ఱఉల్లి అనియునందురు. లా. Allium cepa. ఆంగ్ల. Onion. సం. పలాండు, ముఖదూషణ, సుకంద యని పేర్లుకలవు. ఇది సర్వసాధారణ ముగ నెఱ్ఱనిరంగు (Scarlet) గ నుండుంగాన నెఱ్ఱవుల్లి యనెదరుగాని దీనియందు కేవలము తెల్లరంగుగల ఉల్లిపాయలు ఒకజాతియు, పసుపు పచ్చరంగుగల ఉల్లిపాయలజాతి యొకటియు కూడ గలవు. ఇంకను, ఆంధ్రదేశమునం దెఱుఁగనగు చిన్నజాతి ఎఱ్ఱఉల్లియు, విదేశములనుండి తెప్పించి సారవంతమగు భూములలో మంచిపరిస్థితులందుఁ బెంచఁబడిన పెద్దజాతి ఎఱ్ఱ (లేక నీరుల్లియు) వుల్లియు స్పష్టమగు రెండు భేదజాతులుగఁ గాన నయ్యెడిని. ఇట్టి పెద్దజాతివగు నీరుల్లిపాయల యందునను ఎఱ్ఱని రంగుగలవియు, తెల్లనిరంగు గలవియు, పచ్చనిరంగు గలవియు మూఁడుగ భేద జాతులును కలవు. నీరుల్లి చిన్నమొక్కగ తన యాకులనడుమనుండి యొక గొట్టమువంటి కాడ పొడుగుగనిలచి దానితలను గుత్తివలెఁబూచి కాచినచిన్నగింజలను నాటుటవలనను, మఱికొం దఱు సన్నపు చిన్నచిన్న ఉల్లిపాయలం బాతి మొలపించుటవలనను పైరుచేయఁబడునది. దీనిని భోజనపదార్థముగ పెక్కండ్రు వాడుచున్నారు. దీనియందౌషధోపయోగము గూడ కలదు. మఱియు నీరుల్లి కొన్ని దుర్గుణములు గూడ గల్గించునని చెప్పఁబడినది.

నీరుల్లిపాయలరసము- పైత్యశాంతియు, మేహ శాంతియుఁ గల్గించుననియు, మూత్రములోని సుద్దను హరించుననియు, రక్తనాళములం బరిశో లించుననియు, ఇంద్రియములకు చురుకుదనముం బుట్టించుననియు, ఒంటికిపూసినచో ఓడవాండ్ర రోగము (Scurvy) నివారణమగుననియు, పురు గులు కుట్టినచోట రుద్దిన మంట శమించు ననియు, ముక్కులోపిండిన మూర్ఛనుండి తెలివి వచ్చుననియు, వడకొట్టినవారికి శరీరమునరాసిన శాంతికల్గుననియు, ఇంచుక కండ్లకిడిన రేజీకటి, కండ్లకలక, ముక్కులోనిడిన నాసరోగములు తగ్గుననియుఁ జెప్పఁబడినది. మఱియు నజీర్తి, కడుపుబ్బు, కర్ణరోగము, గర్భవాతములు, గ్రహ ణులు, జ్వరములు, మూలశంఖురోగము, రక్త మూత్ర, రక్తాతిసారములు, శ్లేష్మరోగముల నడఁచుననియుం జెప్పఁబడినది.

నీరుల్లిపాయ విరేచనము వెడలించి, దేహ పుష్టియు, వీర్యపుష్టియు గల్గించెడిని. కుట్టినచోట రుద్దినచో పాము, తేలు, జెఱ్ఱికాటుల విషములే గాక వెఱ్ఱికుక్క విషముగూడ శమించునందురు. ఉల్లివిత్తనములు నూరినముద్ద కండ్లకిడిన కను రెప్పలందలి పాండిమ నివర్తించును. ఉల్లిపాయల రసము దంతరోగములనాపును. తిమ్మెరపైరుద్దిన శమింపఁజేయును. మఱియు నీరుల్లియందు బుద్ధి మాంద్యము, అధికముగదినిన అజీర్తి, పరాకు, పార్శ్వపునొప్పి, శరీరమున క్రిములుకల్గించు దుర్గు ణములు కలవని చెప్పఁబడినది. నీరుల్లియందలి దోషములకు ఉప్పు (నీళ్ల) తోఁ గడుగుటయు, పులుసులో నుడుకుట, నేతిలో వేయించుట పరిహారములని చెప్పఁబడినది.

౨. వెల్లుల్లి. లా. Allium sativum. ఆంగ్ల. Garlic. సం. మహౌషధ, రసోనా, లశున, వెల్లుల్లిని తెల్లఉల్లి యని యందురు. మిగుల వేడిచేయును. విరేచనము గావించును. శరీర

ప్రకృతిని మార్చును. సర్వవాతములను హరించును. అన్ని వాతనొప్పుల నివారించును. దేహమును పచ్చ బారజేయు జ్వరమును హరించును. వీర్యము తగ్గించును. స్త్రీలకు ఋతురక్తమును శుభ్రపఱచును. కాలు సేతులు వణకురోగము నివారించును. మూత్రపుసంచిలో జనించు శిలలను హరించును. సర్పవృశ్చిక విషయములనే గాక వెఱ్ఱికుక్కల విషము విరుచునని చెప్పఁబడినది. మఱియు వెల్లుల్లి తరుచు తినుచుండు వారికి తలవెండ్రుకలు నెరయక నల్లఁబడునని యందురు. వెల్లుల్లి నూరి కట్టుటవలన గోరుచుట్టు, కణుపుశ్లేష్మ, మశమశూచలు, గడ్డలు, కంతులు కూడ నివారణమగునని చెప్పఁబడినది. ఇంకను సర్పవిషము హరించుట యుండిది మణి వంటిదనియు, పాము కరచినచోట కోసి యంటించిన విషముం బీల్చునియు జెప్పుదురు. గుద స్థానమునందలి దద్రు దీనిరసమున నివారణ మగునట. బహుమూత్రరోగము కూడ శాంతించునట. ఇందు ఒంటిరేక వెల్లుల్లిపాయ లని కొన్ని యుండెడివి. అవి పాముం జంపగలవని చెప్పబడినది. పాము లా వాసనకడకుం జేరక మఱలి పర్విడును. పార్శ్వపు తలనొప్పులు నివారణ మగును. అధికముగఁ దినిన నపుంసకత్వము గల్గించి, తలనొప్పిగూడ బుట్టించును. కాళ్లు చేతులందు మంటల గల్గించును. రక్తప్రవాహమునకు త్వరితగతిం గలుగఁజేయును.

వెల్లుల్లి కల్గించు దుర్గుణములకు నేయి, పాలు, పులుసు, బాదముపిక్కలలోని నూనె, దానిమ్మకాయల రసము, ఉప్పుతో నీరున ఉడికించుట పరిహారములని చెప్పఁబడినదట. వెల్లుల్లియాకుల కూర పైత్యము, కాక జేసి శూలల నడఁచుననియు, విరేచనబద్ధము గల్గించుననియు చెప్పుదురు.

3. అడవిఉల్లి గడ్డలం గరుగఁజేయును. నూరి తలకు వ్రాసిన పేలం జంపును. తనకు మర్దన చేసిన మూర్ఛ, బెంగ నివారించి ధైర్యమును గల్గించును. మూత్రమును వెడలించును. అధికముగ వాడిన వాంతులు, వికారముల బుట్టించును. మఱియు నిది గుఱ్ఱముల మూత్రబద్ధమును నివారించునందురు. గుఱ్ఱముల జ్వరమును నివారించు నట.

**ల్లి ఉంటే మల్లీ వంటలక్కే** — ఆంధ్రలోకోక్తి.

**ఉల్లేజి** — వాణిజ్యసంబంధపరిభాషాపదము. Ullage- దీనికి waste అనియు, కారిపోవుటయనియు నర్థములుకలవు.

**ఉవ్వచెట్టు** – లా. Dillenia speciosa. దీనికాయ జిగురుగల్గి పుల్లగ నుండును. పైత్యశ్లేష్మములను హరించి నోటిని శుభ్రపఱచును. ఇంచుక గురుత్వముగ నుండి విరేచనబద్ధము చలువయుఁ జేయును. పండు వీర్యవృద్ధి గల్గించుననియుం జెప్పఁబడినది.

**ఉశంకు** — అత్రి, చంద్ర, యాదవక్షత్రియుఁడు. తండ్రి అహి. కుమారుఁడు చిత్రరథుఁడు. ఉశంకునకు భీరుశంకుఁడనియుఁ బేరు కలదు.

**ఉశనస్సు** — అత్రి, చంద్ర, యాదవ, హేహయ (తాళజంఘ) వంశక్షత్రియుఁడు. వృష్ణికుమారుఁడు. సుతునిపేరు రెండవమాహిష్మంతుఁడు (చేదిదేశాధీశుఁడు).

**ఉశనుఁడు** — ఈతనికే శుక్రుఁడను (మారు) పేరవాడు "ఉశన" నామముతోఁ గొన్ని నామములును, శుక్రనామముతోఁ గొన్నియధర్వసూక్తములుం గలవు. శుక్రునకు "ఉశన" నామము నిఘంటువులందుఁ గలదు. శుక్రనామముతోఁ నొక నీతిశాస్త్రమును (శుక్రనీతి), ఉశననామముతో నొక స్మృతియు (ఔశనస్మృతియు) ప్రసిద్ధములై యున్నవి. శుక్రునకు భార్గవనామము ప్రసిద్ధమై యుండుటయు, భార్గవపురాణ

మను నొక పురాణముకూడ నుండుటయుం దలంచిచూడ, శుక్రుండే భార్గవపురాణకర్త యని కూడఁ దలంప వీలగుచున్నది.

**ఉశినార** — (పర్వతపఙ్క్తి) గంగానది ఏపర్వతములగుండా చొచ్చుకొని యివ్వలి సమతలప్రదేశమున కేతెంచునో ఆ సపాదలక్ష (శివాలిక్) పర్వతములభాగమునకు పేరు. హరిద్వారముకడ నున్నవి. దీనిప్రశంస కథాసరిత్సాగరమున గలదు.

**ఉశీనరదేశము** — ఉశీనరమహారాజు పాలనమునుండి పేరందిన దేశము. ఇంకను మహామనుఁడు, శిబిచక్రవర్తి ఈదేశము నేలిరని చెప్పఁబడినది.

**ఉశీనర మహారాజు** — అణువంశయుఁడు. తండ్రి మహామనుఁడు. కుమారుఁడు శిబిమహారాజు. ఈతనినుండియే యీతఁడేలిన దేశమునకు ఉశీనరదేశమని పేరయ్యెను. తితిక్షువు సోదరుఁడు. (యయాతిమహారాజు చూడుఁడు, ఉశీనరదేశము చూడుఁడు).

పురూరవచక్రవర్తి కుమారుఁడు ఆయువు. అతని సుతుఁడు నహుషుఁడు. అతని సుతుఁడు యయాతి. అతని సుతుఁడు అణువు. అణువునకు సభానలుఁడు, సభానలునకు గాలానలుఁడు, అతనికి సృంజయుఁడు, సృంజయునకు రంజయుఁడు, అతనికి జనమేజయుఁడు, జనమేజయునకు మహాకాలుఁడు, అతనికి మహామనుఁడు, అతనికి ఉశీనరుఁడును జన్మించిరి. ఇది వీరివంశక్రమము. ఇతని కుమారుఁడు శిబిచక్రవర్తి గొప్పయాగము లొనర్చిన వాఁడు. ఇంకను ప్రహ్లాదుని కుమారునకు శిబియని పేరు. శిబిచక్రవర్తికుమాళ్లు ౧. వృషదర్భుఁడు, ౨. సువీరుఁడు, (ఈతని దేశమునకు సౌవీరదేశమని పేరు కల్గెను,) ౩. కేకయుఁడు (ఈతనిదేశమునకు కేకయదేశమని పేరు కల్గెను), ౪. మద్రుఁడు (ఈతనిదేశమున కీతని నుండియే మద్రదేశమని పేరుకల్గెను). ఈతని సుతులు- శిబిచక్రవర్తి, నృగుఁడు, నవుఁడు, క్రిమిసువ్రతుఁడను వారలు.

**ఉశీరకులగోత్రము** — ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు). ఉశీరకుల (ఉశిరికుల) గోత్రము, ఏకార్షేయగోత్రము (౩౪), సంస్కృతగోత్రము, దేవవల్క్యాస, దేవవల్క్యగణము, హరివక్త్రర్షి, ఆపస్థంబ సూత్రము, యజుశ్శాఖ, ప్రమాణ గ్రంథము ఆద్యప్రవరఖండ. సమానగోత్రము హరివక్త్రస. భీమేశుఁడు దేవత. భార్య భ్రమరాంబ. సింహాచలము తపస్థానము. భ్రమరసరస్సు తటాకము. జపములక్ష. దీపములు ౩౫. సంఖ్య ౭౧. స్వర్ణము దానము. ఉసిరిక వర్జనీయము.

**శేనస్సు** — తండ్రి వేదశిరుఁడు.

**ఉష్ట్ర కంటకభక్షణ న్యాయము** — లొట్టిపిట్టను పూలతోటలోనికిఁ దోలినను, పండ్లతోటలోనికిఁ దోలినను, అది తిను ముండ్లనే వెదకుకొనునుగాని, తన కుపచరింపని యన్యములగు మంచిపదార్థములను, గొప్పవస్తువులను కాంక్షింపదు. అధములు గొప్పవాటిని గాంక్షింపరనుట కీన్యాయమును వాడుచుందురు.

**ఉష్ట్ర లగుడ న్యాయము** — లొట్టిపిట్టను లొంగదీయ కట్టె నుపయోగింపుమని భావము.

**ఉషాదేవి** — బాణాసురుని కుమార్తె. ఈతఁడు హిమాలయములపై నిప్పటి గఢ్వాలు సంస్థానరాజ్యమున బదరీకేదారమార్గమునం గల ఉఖీ (ఉషా) మఠమునకుం గతిపయదూరమున నుండెడు శోణితపురము రాజధానిగ రాజ్యమేలిన వాఁడు. ఉఖీమఠము గట్టించిన దీయుషాదేవియే

యందురు. ఈమె అనిరుద్ధుని భార్యయయ్యెను. అనిరుద్ధుఁడు శ్రీకృష్ణునిపౌత్రుఁడు. (బాణాసురుఁడు చూడుడు).

**ఉష్ట్రాసనము** — యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన ఆసనములలో నొకటి. బోరగిల పరుండి కాళ్లనుమడిచి పాదములను పిరుదుల కానించి చేతులతో నాపాదములం బట్టుకొని ముఖము కొంచెము పైకెత్తియుంచుట ఉష్ట్రాసన మనఁబడును. ఇందువలన గమనశక్తి వృద్ధియగుటయు, ఆకలిదప్పులను సహించుశక్తి గల్గుటయు సంభవించునని చెప్పఁబడినది

**ఉష్ట్రాక్ష గోత్రము** — జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.

**ఉష్ణోదకము** — సర్వసాధారణముగ వేడినీళ్ల కుష్ణోదక మనెదరు. ఆయుర్వేదవైద్య శాస్త్రమున నాల్గువంతులలో మూఁడువంతుల నీరు రావిరియై యెగిరిపోయి నాల్గవవంతు నీరు నిలచునటుల గాచినఁ వేడినీళ్ళని చెప్పఁబడినది.

**ఉష్ణోదకము యొక్క రుచి** — దాహోదకమునందు గాలి కరఁగిపోయియుండును గాననే, అది Sparkle of nice drinking గా నుండుటయు, రుచిగానుండుటయు గల్గుచున్నది. ఇట్టిజలము లధికమగు లోతులేని నదీప్రవాహము నందుండునని కనుగొనఁబడినది. ఇట్టి దాహోదకము నేకారణముచేతనైన కాచితిమేని దాని నుండి వెడలు ఆవిరితో దానియందుఁ గరఁగియున్న గాలియంతయు వెడలిపోవును. కాన నాయుదకము రుచికరమైయుండదు. అట్టితరి దానియందలి బేక్టెరియా మైక్రోబ్సు చచ్చియుండును. దానిని చక్కగ వడకట్టి తిరుగ రెండు పాత్రములలో నొకటినుండి వేఱొకదానికి యెత్తుగా తిరగబోయుదుమేని గాలిగుండా అది పడుతరి కొంతగాలిని తిరుగ లోనికిం జేర్చుకొని Sparkle of nice drinking గా నై తిరుగ రుచికరమయ్యెడిని. తేయాకు కషాయముగాని కాఫీకషాయముగాని ఇట్లు తిరుగబోయుటవలన నధికరుచికర మగుట కిదియె కారణమని కనిపెట్టఁబడినది.

**ఉసిరిక చెట్టు** — లాటిన్ పదము Phyllanthus emblica. ఆంగ్ల పదము Myrabolan tree. సంస్కృతమున, అమృతఫల, ఆమలకీ ధాత్రి యని పేర్లు. ఉసిరిక. తులసీబిల్వము, వావిల, ఉత్తరేణి, కపిత్థము, శమీ, ఆమలకము, ధూర్వము నను సప్తబిల్వములలో నొకటియై పత్రిపూజ కర్హమైనది. ఇది సర్వసాధారణముగ ఉసిరిక యని వాడఁబడు పెద్ద ఉసిరిక, లేక ఆమలకమైయున్నది. కానిఉసిరికలందు పెద్దఉసిరిక యనియు, రసఉసిరికయనియు, నేల ఉసిరికయనియు, మూఁడుభేదములుగఁ జెప్పుదురు. అందు నేలఉసిరిక యనంబడునది కేవలము వైద్యోపయోగకరమగు చిన్న జాతిమొక్కయే గాని, కాయ లుపయోగించునది కానేరదు.

౧. పెద్దఉసిరిక లేక ఆమలకము. దీని కాయల నెక్కువగ భోజనార్థ ముపయోగించుచున్నారు. వైద్యోపయోగమును మిగులగలదు. పెద్దఉసిరికకాయలు, లేక కాయలందలి రసము లేక కషాయము త్రిదోషముల నడఁచును. తృష్ణ భ్రమ నివారించి నేత్రములకుఁ జలువఁ జేయును. శరీరమునకుఁ బటుత్వము నిచ్చును. చర్మరోగముల నడంచును. విరేచనముజేసి, వీర్యమునకుఁ బుష్టిఁ నొసంగును. మేహశాంతి యొనర్చును. కఫము, మూలవ్యాధి, పురాణరక్తగ్రహణి నివారించును. ఉసిరికకాయలు ఎండబెట్టిన వరుగు ఇంచుక విరేచనబద్ధమొనర్చి పురాణరక్తగ్రహణిని నివారించును.

ఉసిరిగచెక్కరసము, లేక ఆకురసము, లేక కషాయము, చలువజేసి త్రిదోషముల హరించును. జ్వరము, అతిసారము, నీళ్లవిరేచనములు,

విదాహదోషము, సెగరోగదోషముల నడంచి కుళ్లిన వ్రణములను మాన్పును. ఉసిరికను పచ్చడి చేయుదురు. వడియములుగఁ జేసి యొండించి వాడుదురు. ఇవి పాతవియగుతరి పథ్యము.

౨. రసఉసిరిక- చలువఁజేసి పలలమేహము మొదలు సర్వమేహముల నడంచి వీర్యవృద్ధి నొసంగును. ఇంచుక శ్లేష్మవృద్ధియుం జేయు నందురు.

3. నేలఉసిరిక- ఇది చిన్నమొక్క. వైద్యోపయోగమున కనుకూలించునదియే గాని, ఊర గాయలకు పనికిరాదు. భోజనోపయోగము లేశమైనను లేదు. లా. Phyllanthus niruri సం. భూమ్యామలకీ, తమాలికా, వితున్నకా అని పేర్లు కలవు. వాతపైత్యముల ఉద్రేకమునడంచి మేహశాంతి కల్గించును. మలమూత్రముల వెడలించును. తామరలు, ఉబ్బులు, గ్రహణి, పాండువు, సెగదోషముల నివారించును. వ్రణ ములు మాన్పును. స్త్రీల రక్తస్రావమును కట్టును. గజ్జి, పల్లికలు, పొక్కులు, నోటిపూత, తామర నివారించును. వీర్యవృద్ధిం గల్గించును. ఉసిరికకు విరుగుడులు- ఆవాలు, బాదము, పొగడపండ్లు, తేనె యని చెప్పఁబడినది.

## ఉసురు (ప్రాణము) నిలిస్తే ఉప్పు అమ్ముకొన్నియైనను జీవింపవచ్చును-

ఆంధ్రలోకో బ్రతికిఉంటే బలుసాకేరుకొని తినవచ్చునను సామెతయు నిట్టిదియే

**ఉస్తిచెట్టు** లా. Solanum trilobatum. దీనిని ఉచ్చింత చెట్టనియు నందురు. ఇది కాశీఉస్తియనియు, ముళ్లఉస్తి యనియు, ద్వివిధము. ఇందు కాశీఉస్తి చెట్టునకు ముళ్లుం డవు. రెంటికి నీగుణగణములు సమానమైనను కాశీఉస్తి శ్రేష్ఠమనఁబడుచున్నది. ఉస్తికాయలను నెండించిచేసిన ఉస్తివరుగు కూరగనుపయోగింపఁ బడుచున్నది. ఉస్తివేరు, ఆకులు, పూవులు, కాయలు చేదుగనుండి త్రిదోషహరములనియు, దీనికషాయము నిర్వేగుణములగల్గి వేడిచేసి జఠర దీప్తినిచ్చి బలముగల్గించుననియు, మూలవ్యాధి, శ్వాసకాసలు, చర్మరోగములు, ఎక్కిళ్లు, దుర దలు, క్రిములు నడంచి విరేచనము జేయు నందురు. అధికమైన విదాహము, గుండెభారము గల్గును. దీనికి తేనెకల్పిన జలము విరుగుడని చెప్పఁబడినది.

ఉస్తిజాతియందు జిడ్డుఉస్తియని వేఱొకటి కలదు. ఇది వంగ చెట్టు పోలికనుండి అధిక ముగ ముండ్లుగల్గి పసుపుపచ్చగ ఉస్తికాయలం బోలిన కాయలంగాచెడిని. ఇవి విరేచనకారి. శ్లేష్మము హరించును. పసిబాలుర దగ్గునకు, అగ్నిమాంద్యమునకును నేతియందు మరగించి పట్టుదురట.

## ఉస్మాన్ లేక ఉత్మాన్ (Ottoman) రాజవంశము

— ఈఉస్మాన్ మహనీయుఁడు క్రీ. వె. ౧౨౫౯-౧౩౨౬ కాలమువాఁడు. ఈరాజవంశమునకు మూలపురుషుఁడు. జన్మ స్థానము బిథైనియా యనియు, తన స్వజనసంఘ మునకు ౧౨౮౮ లో నాయకత్వమునకు వచ్చె ననియు, క్రమమున చుట్టుపట్లనున్న తురుష్క (Turkish) సంఘమును, తార్తారులను జయించి వశపర్చుకొని ౧౨౯౯ లో సుల్తానను బిరుదము వహించి ఉస్మానాలీ లేక ఉస్మాన్ రాజవంశ మును స్థాపించినవాఁడు. రానురానిదియే ఉత్మా నుగమారి ఐరోపాదేశములవారిచే Ottoman అని పిలువంబడుచున్నది. ఆంగ్లమున నీవంశము వారిచే పాలింపంబడిన టర్కీ-ప్రభుత్వ సామ్రాజ్య మును Ottoman Empire అనియనిరి. ఈ సామ్రాజ్యమొకప్పుడు విస్తీర్ణమునందును, వైభవ మునందు నుచ్చదశయందుండి, యూరపుఖండము

నంగూడ వ్యాపించినది. కాని పాలకుల యశక్తతచే బందొమ్మిదవ శతాబ్దాంతమునకు జీర్ణదశ నందెను.

**ఉహానగోత్రము** శండిల గణము చూడుఁడు.

**ఉక్షాయునగోత్రము**—వాధ్ర్యశ్వ లేక మిత్రయుపగణము చూడుఁడు.

**ఊడికూర చెట్టు**— దీని ఆకురసము గ్రహణి, గుల్మము, విద్రధి, కఫముల నడంచుననియు, నగ్నిదీప్తి నిచ్చుననియుఁ జెప్పఁబడినది. వేడిచేయును.

**ఊడగచెట్టు** — లా. Alangium decapetalum. ఆంగ్ల. Sage-leaved Alangium Hexapetalum. సం. అంకోల, దీర్ఘమూలక, నికోచక. ఊడుగ ఎఱ్ఱని, తెల్లని, నల్లని రంగుల పూవులుపూయును. అందెఱ్ఱని పూవులంబూయునది బల్మముగ పనిచేయునందురు. ఊడుగ వేరుచెక్క సర్పవిషముల నడంచునని చెప్పఁబడినది. వేడిచేసి రక్తాతిసారము, కుష్ఠు, వ్రణములు, సవాయి మొదలగు చర్మరోగములు, జ్వరములు, ఉబ్బురోగము, వెఱ్ఱికుక్క వెఱ్ఱి నక్కకాటు విషములు, మేహవాతపునొప్పులు, మూలవ్యాధుల నడంచునని చెప్పఁబడినది. అధిక మైన వమనముగల్గును. దీనిని వమనముచేయింప వలసినతరిఁ బాలతోఁగల్పి లోనికిత్తురు. ఊడుగకు శరక్కాయచూర్ణము, సజ్జాక్షారము, తేనె విరుగుడులని చెప్పఁబడినది.

**ఊడుగవిత్తువంటివాఁడు**—అనఁగా తుదకు తన స్వస్థలమునకు లేక తన స్వంత మనుష్యులం జేరుకొనువానింగూర్చిన వాడుకలోకోక్తి. (ఆంధ్రలోకోక్తి).

**ఊదకూటి బలము, ఉద్యోగ బలము అట్టేకాలము నిలచునవి కావు** — ఆంధ్రలోకోక్తి.

**ఊపిరి** (Breathing) - ఉఛ్వాసరూపకమై లోనికుంబీల్చు గాలియు, నిశ్వాసరూపకమై పైకి వదలుగాలియు (కలిసి) ఊపిరియనఁబడుట నెల్లరెఱింగినదే. ఇది నాశికారంధ్రములనుండిగాని, నోటినుండిగాని సరాసరి ఊపిరితిత్తుల (Lungs) కడకుం జేరుచున్నదని యనుకొనరాదు. నిజమున నీయూపిరిగాలి నాళముల యడుగుభాగమునకుం గూడ జేరజాలనంతటి బలహీనముగ విశ్రాంతి కాలములం దూపిరియాడుచుండెడిని. శ్రమపడి పనిపాటులొనర్చునపుడును, భోజనానంతరమున కొంచముకాలమును, అందుముఖ్యముగ శర్కర, నెయ్యి మొదలగు బలవత్పదార్థములం గల్గిన భోజనముకుంబిదపను (ఏలనన, నిట్టి పదార్థము త్వరితముగ దహనమై Carbon Dioxide గా మారును) మనుష్యులు బలముగను లోతుకుంజను నటుల నూపిరిదీయుట గల్గుచుండును. వేడికల్గియుండు తావులను, చలిప్రదేశములను, బలముగ నుఛ్వాసము, నిశ్వాసముగల్గుట సంభవించుచుండును. వృద్ధులు, బలహీనులు, బలహీనముగ నూపిరిఁదీయుచుందురు. అదేపనిగశ్రమపడుచుండు పక్షిజాతులు, పాటంబాడుచుండువారు, ప్రసంగించుచుండువారును బలముగ నూపిరిఁ దీయు.

చుందురు. ఊపిరిఁ దీయుతరి నుచ్ఛ్వాసమున లోనికింబీల్చినగాలియందలి ప్రాణవాయువు (ఆక్సిజెను గాలి) లోనదహింపఁబడుచు పరిశుభ్రస్థితిం గల్పించుచు ఏర్పడిన బొగ్గుపులుసు (కార్బొండై యాక్సైడు) గాలి పైకినిశ్వాసరూపమున వెడలుచుండెను. లోన నగు సర్దుబాటువ్యాపకమున కాంగ్లమున Diffusion అనియెదరు.

**ఊపిరిగొట్టు నొప్పి (హిద్మ)** — ఆంగ. Stitching pain లేక Catching pain. ఊపిరిఁ దీయుచు శ్వాసము విడుచుతరి గుండెలలో నెముకలనడుమను, ప్రక్కయెముకల నడుమను కల్గెడి నొప్పి. ఒకప్పుడు పోట్లుపొడిచినట్లు బాధించునది.

**ఊపిరి బిగబడితే ఉదరము నిండునా ?** — ఆంధ్రలోకోక్తి.

**ఊరంతా బంధువర్గ మేకాని ఉట్టి కట్టుకొన తావిచ్చినవారు కారు** ఆంధ్రలోకోక్తి.

**ఊరందరిదీ ఒకదారి ఓర్వలేనివాని దొకదారి** — ఆంధ్రలోకోక్తి.

**ఊర బిచ్చుకపై చంద్రాయుధ ప్రయోగమా?** — ఆంధ్రలోకోక్తి.

• **ఊర్కసు గోత్రము**—కపి ఉపగణము చూడుఁడు.

**ఊర్ధ్వధనుష్పాసనము** — యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలోనొకటి. అరచేతులను, పాదముల అరికాళ్లను భూమి నానించి వెల్లకిల మొగ్గవైచినటుల శరీరమును వెనుకకు వంచి, నడుము పైకెత్తియుంచుట. ఇందువలన అపానవాయువు నశించుటయు నిద్రాలస్యము లడఁగిపోవుననియు చెప్పఁబడినది.

**ఊర్ధ్వపద్మాసనము** యోగశాస్త్రమున చెప్పఁబడిన యాసనములలో నొకటి. అర్ధపద్మాస నాసీనుఁడై (అర్ధ పద్మాసనము చూడుఁడు), శిరస్సు భూమికానించి రెండు అరచేతులు నేలమోపి శరీరమునంతయు పైకి లేవదీసియుంచుట ఊర్ధ్వపద్మాసన మనంబడును. దీని నాచరించునపుడు వణకరాదు. దీని యభ్యాసమున ప్రాణవాయువు అధోగతియు, అపానవాయువు ఊర్ధ్వగతియుం గలవిగ నగునని చెప్పఁబడినది.

**ఊర్ధ్వముఖ నక్షత్రములు** — జ్యోతిషశాస్త్రమున ౧. రోహిణి, ౨. ఆర్ద్ర, 3. పుష్యమి, ౪. ఉత్తర, ౫. ఉత్తరాషాఢ, ౬. శ్రవణం, ౭. ధనిష్ఠ, ౮. శతభిషం, ౯. ఉత్తరాభాద్రలకు ఊర్ధ్వముఖ నక్షత్రములనిపేరు. ధ్వజస్తంభ, ద్వారబంధ, గజశాల, అశ్వశాల, పందిరి, వనము, పట్టాభిషేక ప్రారంభములకు అర్హములని చెప్పఁబడినది. (అధోముఖ నక్షత్రములు, తిర్యఙ్ముఖ నక్షత్రములు చూడుఁడు).

**ఊర్ధ్వరేఖలు**— పురుషసాముద్రికము, చూడుఁడు. స్త్రీసాముద్రికము చూడుఁడు.

**ఊర్ధ్వశైవము** ఇది చతుర్దశ శైవ భేద మతములలో నొకటి (చూడుఁడు). ఈ మతమున త్రిపదార్థములు, మలత్రయము, శివసమవాది మతమునందువలెనే యుండును. పతియగు శివుఁడు తత్త్వాతీతుఁడనియు, పశువు (ప్రాణి) శివునిఁజేరుటకు భూతి, రుద్రాక్ష, జటా, యజ్ఞోపవీతధారియై శివార్చనయు, పంచాక్షరీస్మరణము నొనర్చుచుండవలెననియు, సన్న్యాసము గైకొనినను, సంసారమునందున్నను, ఒకటే యనియును, శివునిఁజేరుటయె ముక్తియనియు నందురు.

**ఊర్ధ్వసంయుక్త పాదాసనము**— యోగశాస్త్రమున జెప్పఁబడిన ఆసనములలో నొకటి. తలక్రిందుగాను, కాళ్లు పైకివచ్చునటుల

వృషాసనము వైచి (వృషాసనము చూడుఁడు) కాళ్లను గుదద్వారముకడకు మడిచి యట రెండరికాళ్లను జోడించుట. ఇందువలన కుండలినీప్రభోదము గల్గునని చెప్పఁబడినది.

— నరనారాయణులను మునులు బదరికాశ్రమమున తపమొనర్చుతరి గంధర్వాది దేవతావనిత లటకు విహరించుచు నేతెంచి వారిం గాంచి గేలిసేయఁగడంగి వారి తపోభంగ మొనర్ప హావ భావ విలాసాది చేష్టలచే తను ప్రౌఢిమ ప్రదర్శింప, వారిర్వురు చలింపక నారాయణముని తనయూరువుం గోకికొన నందుండి యూర్వశి జనించెననియు, యామె సౌందర్యమున కచ్చెరువంది యావనితలిట తను యాటలు సాగవని విన్నబోయియుఁ జేయునదిలేక నాయూర్వశీవనితం దమ కగ్రగణ్యగ నొనర్చుకొని జనిరనియు భాగవతమునఁ జెప్పఁబడినది. ఒకతరి నర్జునుఁడు కాలకేయ, నివాతకవచుల నంత మొందింప స్వర్గమునకుం గొనిపోఁబడెనట. అట నాతని నూర్వశి వలచి కామించెనట. నాతఁడామెను నిరాకరింప నామె నీవు షండుఁడవు గమ్మని శపించెనట. అద్దానినింద్రుఁడెఱింగి పాండవాజ్ఞాతవాసకాలమున నీషండత్వ మతనిం జెందుటకును పిదప విముక్తి యగునట్లును సవరించెను.

**ఊర్జాయనగోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**ఊరిలో కుంటడము అడవిలో పరుగెత్తడము** — ఆంధ్రలోకోక్తి.

**ఊరిలోనికి రావద్దంటే గుజ్జాన్నెక్కడకట్టుట అనియడిగినాఁడట** - ఆంధ్రలోకోక్తి.

**ఊరిలో పెండ్లి ఊరి కుక్కల కడాపడి** — ఆంధ్రలోకోక్తి.

**ఊరు ఉస్తికాయంతగాని, సిద్ధాంతములు, వచనములు తాటికాయలంత** — ఆంధ్రలోకోక్తి.

**ఊరికంతా ఒకర్తే భోగంది ఎవరికది ఉంపుడుకత్తెయగును?** — ఆంధ్రలోకోక్తి.

**ఊర్మైపై ఊరంత చందాపడినా కరణముపై కానైనా పడదు** — అనగా కరణము అందరివద్దా దండుతాడు కాని తానివ్వడని భావము. ఆంధ్రలోకో

**ఊరిబిడ్డలను రాజుకొడితే రాజుబిడ్డలను దేవుఁడు కొట్టును** — ఆంధ్రలోకోక్తి.

**ఊర్మిళాదేవి** — జనకమహారాజున (విదేహదేశాధీశుఁడు) కీమె ఔరసపుత్రిక. సీతాదేవికిసోదరియు, తోటికోడలు నగును. శ్రీరామసోదరుఁ డగు లక్ష్మణుని భార్య. శ్రీరాముఁడరణ్యవాసమున కేగుతరి, ఊర్మిళాదేవి భర్తయగు లక్ష్మణుఁడు వెంటం జన వాగు తిరుగ నయోధ్య కరుదెంచుదనుక, నీమె యితర వ్యాపారములం బాటింపక నిద్రించుచుండెననియు, నక్కాలమున లక్ష్మణుఁడు నిద్ర నెఱుంగకుండె ననియు జెప్పఁబడినది. మఱియు నిటుల లక్ష్మణుఁడు నిదుర మానియుంట, నాతనిచే నింద్రజిత్తు మరణింపఁ గారణమాయెననియుం గూడ చెప్పఁబడినది. (ఇంద్రజిత్తు చూడుఁడు). యముని భార్యలలో నొక ఊర్మిళాదేవియుం గలదు.

**ఊరు పొమ్మంటే కాడు రమ్మంటుంది** — (కాడు = శ్మశానము) ఆంధ్రలోకోక్తి.

**ఊరువిడచి పొరుగూరికిపోయినా కర్మము గాళ్లంజుట్టుకుని వచ్చును గాని వదలదు** — ఆంధ్రలోకోక్తి.

**ఊర్ములు ఆరు** షడూర్ములు చూడుడు.

**ఊలజీ** (Oology) — పక్షుల గూడ్లయొక్కయు, పక్షుల గ్రుడ్లయొక్కయు పరిశోధక విధానము.

**ఊషరవృష్టిన్యాయము** — చవిటి పఱ్ఱ (భూప్రదేశము) పై వర్షించుటయని యర్థము. నిరర్థకము. ఉపయోగించుకొనవీలులేని ఉపకారమని భావము.

**ఊషరక్షేత్ర బీజన్యాయము** — దీనిని ఊషరవాపితబీజన్యాయమనియు నందురు. నిష్ఫలప్రదమగు నూషరక్షేత్రమున (గొడ్డుభూమియందు) నాటినవిత్తనములని భావము. ఊషరవృష్టి (ఎడారిలోకురిసిన వర్షము) న్యాయమును ఇట్టిభావమునే (నిరుపయోగములని) తెల్పును.

**ఊహ** — ఊహ తలంపునకు తర్వాతకల్గునవస్థ. ఇది మేదస్సు (మెదడు లేక బుద్ధి) యం దుద్భవించునది. దీని నాంగ్లమున Brain అనెదరు గాన పాశ్చాత్యులు మేదస్సును, త్రాగుడభ్యాసమున జెరుపరాదనియు, నిద్రమాని మెదడును బలహీనపర్చరాదనియు, అధికముగఁ దిని దానిని మొద్దుచేయరాదనియు సామెతగ వల్కుదురు. శరీరస్థములగు జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాదు లన్నియు మెదడుకు లోఁబడినవి. ఊహలకు యోచనలకు మెదడు జన్మస్థానము.తలంచునదేదియో, జ్ఞప్తియుంచుకొనునదేదియో సరిగా ప్రాశ్చాత్యవిద్వాంసులుగుర్తింపకున్నను, ఏదియో యొకటి కలదనుచుందురు. తలంపునుండి యూహావృద్ధియగుటగా నెన్నుదురు. మేదస్సు యొక్క పరిశుభ్రత, బలములనుండి యూహా లుండెడిని. ఆలోచన రెంటి సముదాయము. ఒకదాని యొక్కయు, తత్సంబంధస్థితినిం గూర్చి యూహించినది యాలోచనము. నిద్రయం దీయూహాలు పలువిధములుగ నుండును. గాఢనిద్రయం దే యూహాలు లేక మెదడు విశ్రాంతి నందియుండును పూర్తిగనుండని కలతనిద్రయందు కొంతవఱకూహాలు కల్గుచు బర్వెడుచుండుంగాన నాయూహాలు స్వప్నములందలివిగ నుపయోగించును.

సంగీతపు పనిముట్లను రేపినప్పుడే తప్ప తక్కిన కాలముల కలుగనటుల, మెదడు గాఢనిద్రయందు విశ్రాంతి గొనుచుండును. మెదడునకు విశ్రాంతియు, బలము గల్గుచుండుటయు నత్యవసరములు గాన మానవశరీరమునందు, మెదడు చెడకుండ చూచుకొనుచుండుట ఊహాలు గల్గుచుండుట కత్యవసరములు. దక్షిణదేశములం దగస్త్యసాంప్రదాయ వైద్యమున కొన్ని గ్రంథములు రచించిన ఊహాముని యొక వైద్యశాస్త్రవేత్త. (అగస్త్యసాంప్రదాయ వైద్యము చూడుఁడు).

**ఊహ ఉద్యోగానికి వ్రాతవాకిళ్ళూ ద్వారానికి, (గహచారం గాడిదలను కాయడానికిఉండి లాగుతున్నట్లు** — ఆంధ్రలోకోక్తి.

**ఊహాపోహన్యాయము** — ఊహ యనిన, ఒకదానియం దడగియుండి పైకి తెలియఁబడనిదానిని ఊహించుట. ఊహ లేనిదానిని ఉన్నదేమోనని అపోహ పడుట అపోహ. దూరాలోచనమని భావము.

**ఊహాముని** — కొన్ని యాయుర్వేద వైద్య గ్రంథములను రచించిన వాఁడు. అగస్త్యసాంప్రదాయ వైద్యవిధానవేత్త. (అగస్త్యసాంప్రదాయ వైద్యము చూడుఁడు).

**ఊళ్లేలే కుమారునివద్దకన్న ఉపాదానంచేసుకునే భర్తవద్దనే స్త్రీలస్వం సాగడము** — ఆంధ్ర లోకోక్తి.

**ఋక్శాఖ విశ్వబ్రాహ్మణులు-** వీరు విశ్వకర్మసంతతిలోని సానగర్షి సంతతివారని చెప్పఁబడినది. ఋక్శాఖవారి మతధర్మగ్రంథమునకు సానగసూత్రమని పేరు. వీరియందు బ్రాహ్మణవర్ణమనియు, లోహకారవర్ణమనియు రెండువర్ణములు చెప్పఁబడినవి. (విశ్వబ్రాహ్మణులు చూడుఁడు).

బ్రాహ్మణ విశ్వబ్రాహ్మణులు- పర్యాయవృత్తి వారనియు, వీరిది కాళీపీఠమనియు, శివసంతతి యనియు నందురు. వీరియందొక్క సమంత గణమును, అందైదుగోత్రములును కలవు.

లోహకారవర్ణపు విశ్వబ్రాహ్మణులు- ఆదివృత్తి వారనియు, వీరిది ఆదిశక్తిపీఠమనియు, మనుసంతతి యనియు నందురు. ఈమనువే మనుస్మృతిని రచించెననియు, నాతఁడే తిథికధిపతియనియు వీరనెదరు. వీరియందు సానగగణము, మన్యు గణము, వనజగణము, సత్యకగణము నని నాల్గు గణములును, అందిరువది గోత్రములును కలవని చెప్పఁబడినది.

**ఋగ్దాహ సన్నిపాతము** — సన్నిపాతదోషము చూడుఁడు.

**ఋగ్వేదము** — దీనిని వ్యాసుఁడు తన శిష్యుఁడగు పైలునకొసంగెను. ఆతఁడు తనకుఁ బిదప శిష్యులగు భాష్కలునకును, ఇంద్రప్రమితికి నొసంగి వ్యాఖ్యలంగల్గించెను. ఇందు భాష్కలుఁడు తనశిష్యులగు బోధ, మాఠర, యాజ్ఞవల్క్య, పరాశరర్షులకిచ్చి వ్యాఖ్యప్రాయించెను. రెండవయాతఁడగు నింద్రప్రమితి తన పుత్త్రుఁడగు మాండూకేయునకును, ఆతఁడు వేదమిత్త్రుఁడను నామాంతరముగల శాకల్యర్షికిని, శాకపూర్ణి ఋషికిని, భాష్కలర్షికిని యొసంగెను. వారును అట్లే వ్యాఖ్యలను సాగించిరి. ఇందు శాకల్యుఁడు, ముద్గల, గోముఖ, వాచ్య, శాలీయ, శారీరర్షులకును; శాకపూర్ణి, క్రౌంచ, వైతాళిక, బలాకర్షులకును; భాష్కలుఁడు, కాలాయన, గార్గ్య, కథాజిపులను ఋషులకును ఉపదేశించి నియమింప వారు వ్యాఖ్యలను సాగించిరి. ఇంతటితో వ్యాఖ్యలు ముగిసెనని తోఁచెడిని. వీరందఱు వేదవ్యాసమహర్షి శిష్యప్రశిష్యులని యనవలసియున్నది.

ఇట్టి ఋగ్వేదమునందలి మంత్రభాగమున శాకలులు, భాష్కలులు, ఆశ్వలాయనులు, సాంఖ్యాయనులు, మాండూకాయనులు అను నైదు శాఖలుగలవు. బ్రాహ్మణము, ఐతరేయ బ్రాహ్మణమనియు, సాంఖ్యాయనబ్రాహ్మణమనియు ద్వివిధములుగ నున్నది. ఋగ్వేదమునుండి యుపనిషత్తులు ఇరువదినాల్గు కల్గినవి.

ఋగ్వేదమున ౧౦ మండలములును, ౧౦౬౨ పనసలును, ౧౦౫౦౦ ఋక్కులును, ౨౦౦౬ వర్గలును, ౪౩౨౦౦౦ పదములును గాననగుచున్నవి. మఱియు నియ్యది ౮ అష్టకములుగను, ౬౪ అధ్యాయములుగను, ౨౦౦౬ వర్గలు లేక ౧౦ మండలములుగను, ౧౦౦౭ సూక్తములుగను విభజింపఁబడియుంట కాననగును. ఆశ్వలాయన సాంఖ్యాయనసూత్రములీ వేదసంబంధములే. ఋగ్వేదమున కత్రిగోత్రము, సోముఁడు దైవతము, గాయత్రి ఛందము, శ్వేతవర్ణము, పద్మనేత్రములు నని చెప్పఁబడినది.

**ఋచేయువు-** పూరువంశక్షత్రియుఁడు. తండ్రి పేరు రౌద్రాశ్వుఁడు. కుమారుని పేరతిసారుఁడు. (ప్రాచిన్వానుఁడు చూడుఁడు).

**ఋజుమార్గేణ సిధ్యతోఽర్థస్య వక్రేణసాధనాయోగరితి న్యాయము** తిన్ననిమార్గము (దగ్గిరమార్గము) న సాధింపఁగల కార్యమును వక్రమార్గము (దూరమార్గము) న

సాధింపఁబ్రయత్నించుట కర్థము. గోరుతోఁజీరఁగల్గునది గొడ్డలితోఁజీరుట యనుసామెత కట్టి యర్థమేకలదు.

**ఋణప్రణకలంకానాప్ం కాలే లోపో భవిష్యతి** — ఋణము, పుండు, అపయశములు కాలక్రమమున క్షీణించిపోవునని భావము. ఇది సంస్కృత భాషయందలి లోకోక్తి.

**ఋణశేషము, ప్రణశేషము, అరిశేషము (శత్రుశేషము) అగ్నిశేషము నుంచుట అపాయకరము** — ఆంధ్ర లోకోక్తి.

**ఋణి గోత్రము** — విష్ణువృద్ధ ఉపగణము చూడుఁడు.

**ఋతుంజయుఁడు** — ఋతుంజయ కృతమగు గ్రంథమేదియుఁ గానరాదు. ఇతని చరిత్ర సవిస్తరముగఁ దెలియరాకున్నను, విష్ణుపురాణములో ఋతుంజయ నామస్థానమున సంజయుఁడు అను నామము బేర్కొనఁబడియెను. సంజయకృత గ్రంథములేవియుఁ గానరాకున్నవి.

**ఋతుధాముఁడు** — యదువంశ క్షత్రియుఁడు. తండ్రిపేరు ఆనకుఁడు. పెదతండ్రి వసుదేవుఁడు.

**ఋతుధ్వజుఁడు (ప్రతర్దనుఁడు)** - కాశ్యుని వంశస్థుఁడు. ఈతనికి ప్రతర్దనుఁడను పేరుకలదు. శత్రజిత్ అనియు నందురు. తండ్రి పేరు దివోదాసుఁడు. కాశీ పట్టణవాసి.

**ఋతుపర్ణమహారాజు** — ఈతనికి రాజర్షియని కీర్తినామము కలదు. తండ్రిపేరు అయుతాయువు. అయుతాయువునకు భంగాసురుఁడనియుఁ బేరుకలదు. పితామహుఁడు సింధుద్వీపుఁడు. ఋతుపర్ణుని కుమారునిపేరు సర్వకాముఁడు. ఋతుపర్ణుఁడు నలచక్రవర్తియొక్క యాపదలకాలమున నాయనకు అక్షహృదయమను మంత్రవిద్య నొసంగి, ఆయనవలన అశ్వహృదయమను మంత్రవిద్యఁ గైకొనెను.

**ఋతుమహారాజు** — విదేహదేశాధిపుఁడు. విజయమహారాజ పుత్త్రుఁడు; సుదేవుని పౌత్త్రుఁడు.

**ఋతువులు ౬** — ౧. వసంతఋతువు, చైత్ర వైశాఖమాసములు, ౨. గ్రీష్మఋతువు, జ్యేష్ఠ ఆషాఢమాసములు, 3. వర్షఋతువు, శ్రావణ భాద్రపద మాసములు, ౪. శరదృతువు, ఆశ్వీజ కార్తిక మాసములు, ౫. హేమంత ఋతువు,మార్గశిర పుష్య మాసములు, ౬. శిశిర ఋతువు, మాఘ ఫాల్గుణ మాసములు.

**ఋద్ధిచెట్టు** — దీనిని ఋద్ధియనియు, వృద్ధియనియుఁ గూడ నందురు. సంస్కృతమున సర్వజనక్రియ యని పేరు. దీనివేరు రసము, చూర్ణము, కషాయము చలువఁజేసి కఫవాతము, జ్వరము, తాపము, రక్తపైత్యము, వమనముల నడంచి, ధాతుపుష్టి యొనర్చునని వైద్యులనియెదరు.

**ఋషభ గోత్రము** — జమదగ్నివత్స ఉపగణము, ముద్గల ఉపగణము చూడుఁడు.

**ఋషభనాథుఁడు** — ఆదినాథుఁడు, జైనతీర్థకరులలో నొకడు. (తీర్థకరులు చూడుఁడు). ౧. ఋషభనాథతీర్థకరులు- వీరి నాదినాథులనియు నందురు. వీరి చిహ్నము వృషభము (ఎద్దు). ఇక్ష్వాకువంశ క్షత్రియులు. తండ్రి పేరు నాభిమహారాజు, తల్లిపేరు మరుదేవి, జన్మస్థాన మయోధ్యానగరము. వీరు నిర్వాణమందిన స్థలము కైలాసపర్వతము. ౫౦౦ ధనస్సుల పొడవు గలవారనియు (ధనస్సు ప్రమాణము మూడున్నరమూరల), సువర్ణచ్ఛాయ శరీరులనియు, ఎనుబదినాలుగులక్షల యాయువనియు, గణధర్

౪౮ అనియు, అంతరాళము (కాలాంతరము) ౫౦ లక్షలకోట్ల సాగర్ (సం. 3 నె. ౮) అనియు, సగరచక్రవర్తి వీరి సంతతివారనియు జైనగ్రంథములందుఁ జెప్పఁబడినది. మఱియు జైనగ్రంథములందు, నాభిమహారాజు విధాతయనియు, వారు ఉత్సర్పిణి (క్రమక్రమముగ రానురాను అభివృద్ధినందెడి కాలము, ఇది గత కాలముగను, ఇప్పు డవసర్పిణియనంబడిన క్షీణకాలమనియు జైనగ్రంథములందుఁ జెప్పఁబడినది) కాలమువారనియు, వీరి కాలమున జైనవిజ్ఞాన మధికమయ్యెననియుఁ దెలియుచున్నది.

**ఋషభపర్వతము (వరాహపర్వతము)** — మలయపర్వతము యొక్క ఉత్తరభాగమగు పళనికొండలు; దక్షిణదేశము. దీనియందే ప్రసిద్ధమగు సుబ్రహ్మణ్యక్షేత్రము కలదు. ప్రశంస మహాభారతము వనపర్వమున గలదు. ఇందిది పాండ్యదేశమున గలదని చెప్పఁబడినది. కాని యట దానిని వరాహపర్వతమని వాడుచున్నారు.

**ఋషభ (వృక్ష)ము** — ఇది ఓషధియగు మూలిక. సంస్కృతమున, దీనికి ఇంద్రాక్షు, విషాణి, వృషభ యని పేర్లుకలవు. ఇంచుక శ్లేష్మము, వీర్యవృద్ధిని గల్గించి, జ్వరము, తాపము, యక్ష్మ, రక్తపైత్యము, వాతదోషముల నడంచునని యందురు.

**ఋషభుఁడు** — బ్రహ్మమానసపుత్రులలో నొక ఋషభుఁడు గలఁడు. నాభిమహారాజుకుమారుఁ డొక ఋషభమహారాజు కలఁడు. ఈతని తల్లిపేరు మేరుదేవి. జ్యేష్ఠపుత్రుఁడు భరతుఁడు. పితామహుఁడు అగ్నీధ్రమహారాజు. అగ్నీధ్రుని తండ్రి స్వాయంభువమనువు.

ఇంద్రునకు శచీదేవియందుఁ గల్గిన రెండవ కుమారునకు ఋషభుఁ డని పేరు. ఈతఁడు జయంతునికిం గనిష్ఠ సోదరుఁడు. మఱియు బుధునికిని ఋషభుఁ డని పేరుకలదు. ఋషభుఁడను దానవుఁ డొకఁడు గలఁడు. సుగ్రీవుని సైన్యమునందలి యొక వానరుఁ డీపేరుగలవాఁ డుండెను. ఇంకను ఉపరిచరవసుసంతతియందొక ఋషభుఁ డను నామముగలవాఁ డుండెను.

**ఋషికుండము** ఋష్యశృంగాశ్రమము చూడుఁడు.

**ఋషికుల్యానది** — మహేంద్రపర్వతశాఖయగు ఋక్ష లేక ఋషిపర్వతమున జనించి, దక్షిణముగా బ్రవహించుచు గంజాముమండలమునందలి గంజాముపట్టణము ప్రక్కగఁ నడచి, యటకుం గతిపయదూరముననే బంగాళాఖాతము (తూర్పుసముద్రము) న సంగమించు నది. కుల్య యనిన కాల్వయని యర్థము. దీనికి ఋషీక యనియుం బేరు కలదు. దీనిం గూర్చిన ప్రశంస బ్రహ్మాండ పురాణము పూర్వ. ౪౮ యందు కలదు.

**ఋషిపంచమి** — భాద్రపదశుద్ధ పంచమి. ఈ వ్రతదినమున సప్తమహర్షులం బూజింతురు. (పండుగలు, పర్వదినములు, వ్రతదినములు చూడుఁడు).

**ఋషులు** — మహర్షులు, ఋషులు చూడుఁడు).

**ఋషులు ఏడువిధములు** — (సప్తవిధఋషులు)-౧. మహర్షులు-వ్యాసాదులు, ౨. పరమర్షులు - భేలాదులు, 3. దేవర్షులు - కణ్వాదులు, ౪. బ్రహ్మర్షులు - వశిష్ఠాదులు, ౫. శ్రుతర్షులు - శుశ్రుతాదులు, ౬. రాజర్షులు - ఋతుపర్ణాదులు, ౭. కాండర్షులు - జైమిన్యాదులు, (మహర్షులు, ఋషులు చూడుఁడు).

**ఋష్యశృంగాశ్రమము** — ఇప్పటి బంగాళాదేశములోని భాగల్పూరునకుఁ బశ్చిమ

ముగా ౨౫ మైళ్లదూరమున ఋషికుండమను తావున కలదు. ఇచట నేకకుండములందు నీటి యూటలుకలవు. అందు మొదటిది, కడనున్న కుండములుచల్లని నీరును, మధ్య నైదుకుండములందు వేడినీటి యూటలుం గలవు. అన్నియు జలబుద్బుదములనీరు నొకకుండమునకుం గలసి చేరెడిని. దానికి ఋషికుండమని పేరు. ఆనీరు దానియుత్తరదిశను బయటికివెల్వడి చిన్నప్రవాహమై అభినదియను పేరంబరగుచు గంగానదియందు సంగమించెడిని. అభినది పొడవైదు మైళ్లుండును. ఋషికుండమున కుత్తరముగ విభాండకర్షియు, ఋష్యశృంగుఁడును కూర్చుండిన పలకరాళ్లు కలవు. దీని ప్రశంస మహాభారతము వనపర్వమునందు గాననయ్యెడిని. (అంగదేశము చూడుఁడు). మఱియు మైసూరు రాజ్యములోని శృంగగిరి (శృంగేరి) కూడ తొల్లి ఋష్యశృంగాశ్రమమే యనుచున్నారు.

**ఋష్యశృంగర్షి** — తండ్రి విభాండకర్షి. అంగదేశమున నీతని యాశ్రమము గాననగుచున్నది. బ్రహ్మచారియై తండ్రి శుశ్రూష చేయుట, తపము తప్ప వేఱులోకవాసనల నెఱుంగక కాలముగడపుచుండు నీతని నంగరాజగు రోమపాదమహీపాలుఁడు తనదేశమునం దక్కాలమున వ్యాపించి ప్రజలంబాధించుచుండిన యనావృష్టియు,క్షామమును నివారింప వింతమార్గమున నీతనిరావించెనట. వర్షములుకురిసి క్షామనివారణమటతోడనే తన పెంపుడుకుమార్తె (దశరథమహారాజు ఔరస పుత్రిక) శాంతాదేవినిచ్చి పరిణయమొనర్చెనట. (అంగదేశము చూడుఁడు). ఋష్యశృంగుఁడు దశరథునిచే పుత్రకామేష్టి చేయించెనని చెప్పఁబడినది.

**ఋష్యాయణగోత్రము** — ముద్గల ఉపగణము చూడుఁడు.

**ఋక్షగోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**ఋక్షుఁడు** — అత్రి, చంద్ర, పూరువు సంతతి క్షత్రియుఁడు. తండ్రి అజమీఢుఁడు. సోదరులు బృహదిషుఁడు. నీలుఁడు కుమారుఁడు. సంవరణుఁడు పౌత్రుఁడు. ప్రసిద్ధిగల కురుమహారాజు (తండ్రికి మాఁడవసుతుఁడు). మఱియు నీపూరువుసంతతివాఁడగు పురుజుని కుమారుఁడు (భర్మాశ్వుని తండ్రి) ఋక్షుఁడను పేరుకలవాఁడే. ఇఁకను కురునిసంతతిలో దేవాతిథి కుమారుఁడును ఋక్షుఁడే.

**ఎంగిలిచేతి మెతుకులు కాకికి విదల్చేవాఁడుకాఁడు** — అనగా పరోపకారికాఁడనియు, లోభియనియు భావము. ఆంధ్రలోకోక్తి.

**ఎంగ్రేవింగు కళ (Engraving)** — గట్టిప్రదేశమున చిత్రరూపములు, ఆకారములు, లతలు మొదలగునవి చెక్కిముద్రించు కళ. దీనిని చీనావారు చిరకాలముక్రిందనే యెఱింగియుండిరని చెప్పఁబడినది. క్రీ. పూ. ౧౦౦౦ సంll నాఁడే వారొకవిధమున దీనిని చేయుచుండిరి. క్రీ. వె. ౧౫ వ శతాబ్దమున ఐరోపావారెఱింగిరని కొందఱనెదరు. పారిస్ కాపురస్థుఁడగు బౌర్డియర్ (Bourdier) అను పనివాఁడద్దములపై ఎంగ్రేవింగు చేయుటయందు క్రీ. వె. ౧౭౯౯ లో పేరందియుండెనని తెలియుచున్నది. ౧౮౨౩ వ సంవత్సరమున క్రీస్తుప్రభుని బాలవిగ్రహముతో

క్రిస్టఫరు సెయింటు (St. Christopher) విగ్రహ మొక కట్టపై జెక్కబడినది దొరకి నదట.

**ఎంగ్రేవిస్ట్రీ** (Engravistry) — లోహము, శిల, కట్టలపై రూపములను చెక్కి గాని, మఱియొకవిధానమునఁ జెక్కఁబడినట్లు లేక పరస్థలములు మార్పుఁజెందునట్లు చేసిగాని చిత్రించు కళ. ఇది సర్వసాధారణముగ ముద్రణ మునకుంబనికివచ్చును లేక యట్లేనిలచి తెలియ నగుచుండెడిని.

**ఎంగ్రోస్** — దీనిని (Monopaly) మొనాపలీ యనియు నందురు. వాణిజ్య సంబంధ పరిభాషాపదము. Engross- ఇది పురాతనపు వర్తకపదము. ఒకరే తప్ప ఇతరులెవరు నొకపనిఁ జేయకుండునటుల (కొంతప్రదేశమున) నధికార మిచ్చు వ్యాపార సందర్భము Monopoly.

**ఎంచబోతే మంచముంతాకంతలే**-ఆంధ్రలోకోక్తి.

**ఎంజనీరింగుకల** (Engineering) - ఈవిద్య కర్థములేని యీపే రేల నాంగ్లమున బెట్టఁబడెనో దురూహ్యముగ నున్నది. ఎంజిన్ అనిన యంత్రమున కర్థము. ఆంధ్రదేశమున శిల్పమునకుఁ బ్రత్యామ్నాయముగ నున్న శాస్త్రమని కొందఱును, కాదని కొందఱు నభిప్రాయపడు చుందురు. బహుశః వాస్తుశాస్త్రమునకు బహులుగ నున్న పాశ్చాత్య కళ యని చెప్పుట కే యభ్యంతరము నుండదు.

పాశ్చాత్యదేశములం దాదికాలమున నీ ఎంజినీరింగువిద్య ఇటలీదేశమునఁ బ్రారంభమైన దందురు. క్రీ. పె. పదునేడవ శతాబ్దారంభకాలమున నీవిద్యయందు నిపుణులను కొందఱి నాయత్తపఱచి, వారిలో బుద్ధిశాలురకడ నితరులకు నేర్పించి, తొలుత నదులపై వంతెనలను నిర్మింపఁజేసియు, ఇండ్లు మొదలగు కట్టడములం గట్టించియు, నేర్పరులగువారిని కుదర్చి యొక సంఘముగఁ జేసిరట. పిదప బాటలువేయుట, రేవులను నౌకాశ్రయప్రదేశములకు వలయు గోడల్కు దిమ్మలుగట్టుట మొదలగుపనులు వీరిచేఁ జేయించుచుండిరి. ఇది సివిల్ ఎంజనీరింగు (Civil Engineering) ప్రారంభమని చెప్పఁబడినది.

ఇట్టి సివిల్ఎంజనీరింగు కెట్లెనను చిరకాలము గట్టిపనిగా నిలచియుంటకు కొంతనిదానము ఆలస్యము నగుట యత్యవసరము. యుద్ధరంగమున కాల్వలు (trenches) త్రవ్వి వానియందు దాగియుండి శత్రువులపై గుండ్లను వదలుటకు వీలగునట్లు గోతులు, కాల్వలు త్రవ్వుటయు, తాత్కాలికనివాసములు నిర్మించుకొనుటయు, సైన్యములు దాటినడచుతఱి తాత్కాలికపువంతెనలు నిర్మించుకొనుచు, బాటలం జేసికొనుచు చేయు నేర్పాట్లు మొదలగు నవసరకార్యములకు మిలిటరీ ఎంజనీరింగని నైసర్గికముగ పేరులు కల్గియుండ నోపు. ఇది మిలిటరీఎంజనీరింగు (Military Engineering) శాఖ.

కాలముగడచి ఆవిరిశక్తిచే నడచిపనిచేయు యంత్రవితతి బయలువెడలి యభివృద్ధి నందుచున్న కొలఁదియు, మెకానికల్ ఎంజనీరిం (Machanical Engineering) గేర్పడియెను. ఇంక విద్యుచ్ఛక్తిపరిపాటై మానవోపయోగమున కనుకూలింపఁజేయుటందెలిసినకొలదియు, వేఱుశాఖగ నెలక్ట్రికల్ ఎంజనీరింగు (Electrical Engineering) ఏర్పడియెను. అట్లె మోటారుయంత్రములు పరిపాటైనకొలది మోటారుఎంజనీరింగును, ఏరోప్లేనులు పరిపాటైనకొలది ఏరోఎంజనీరింగును (Aero-Engineering) శాఖలుగ నేర్పడియెను. ఇంకను ఇనుపదారిబాట నిర్మాణ విధానములకు రెయిల్వేఎంజనీరింగని కొందఱు

వాడుచున్నారు. బాణసంచాయందునను, బాణసంచాలో చిత్రవిచిత్రనిర్మాణమునకును, ఫైరు వర్క్సు ఎంజనీరింగను (Fire-works Engineering) పేరు వినఁబడుచున్నది. సముద్రమున నడచు నోడలనిర్మాణవిధానమునకు వలసినపేరు నేవల్ ఎంజనీరింగని చెప్పఁబడుచున్నది.

**ఎంటొమొలజీ** (Entamology) — క్రిమికీటకములం గూర్చినచరిత్ర. ఇది జూఆలోజీలోని వెన్నెముకలులేని జంతువుల సంబంధమగు (Invertebrate or Lower order) కళ. ఇందు Segmented Group అనఁబడు తెగకుం జెందిన నాల్గు Groups లోని ఒక గ్రూపునకుం జెందినకళ. ౧. Crustecea- వెన్నుపై పెంకు చిప్పలున్న పీతలు మొదలగువానిం గూర్చినకళ. ౨. Arachnida- తేళ్లు, సాలిపురుగులు మొదలగువానిం గూర్చిన కళ. 3. Myriopoda- విస్తారముగా కాళ్లు (సంఖ్య) గల రోకలిబండలు జెర్రెలు మొదలగు జాతుల గ్రూపుకుం జెందిన కళ. ౪. Insecta- క్రిమికీటకాదుల Group నకుం జెందినవానినిగూర్చిన కళ. దీనికే ఏంటమొలోజీ యని పేరు. ఇది వ్యవసాయమునకు సంబంధించినదిగఁ జెప్పియున్నారు. ఈజాతి పురుగులను వ్యవసాయ శాస్త్రజ్ఞులు ఉపయోగముం బట్టియు, అవిగల్గించు నష్టములంబట్టియు, వాని తాటస్థ్యస్థితిని బట్టియు త్రివిధముగ విభజించియున్నారుకాని, అది శాస్త్రీయ విభజనము (Scientific Classification) కాకుండుకతన ఎంటమొలజీ శాస్త్రజ్ఞులు ఈ త్రివిధవిభజనము బాటింపక తమశాస్త్రమున వానికింగల రెక్కలం బట్టి దశవిధములుగ విభజించి యున్నారు. కొందఱు కీటక సంఘమునకు ఆర్థ్రోపోడ్ (Arthropode) అని పేరిడిరి.

ఈకీటకముల కారుకాళ్లుండును. శరీరము భాగభాగములుగ (Segmented) కలుపఁబడియుండును. ఆరుకాళ్లు గలవిగాన హెక్సాపోడ్సు (Hexopodes) అనియు పేరందినవి. ప్రతిపురుగునకు రెండుజతల రెక్కలుండును. (Head) తల, (Thorax) గుండెకాయ, (Abdomen) పొత్తికడుపు అను మూడుభాగములు వేఱ్వేఱుగ శరీరమునం దమరి కలుపఁబడి యుండెడిని. కాళ్లును ముక్కలుముక్కలుగనేయుండి కలుపఁబడి గుండెకాయప్రాంతమున నమర్పఁబడి యుండెడిని. కొన్నిమాత్రముదక్క (అనఁగా చీమలు, నల్లులు, పేలు మొదలగునవి) తక్కిన కీటకజాతులన్నియు నెగురఁగల్గి రెక్కలను ధరించియుండును.

చీమలందు పనిచేయు చీమలనియు, మొగచీమలనియు, ఆడుచీమలనియు, మూఁడు విధములు కలవు. అందు పనిచేయుచీమలకు రెక్కలుండవు. తక్కినరెంటికి రెక్కలు గల్గుటయు, రాలిపోవుటయు సంభవించుచుండును. నల్లులు, పేలు మొదలగువానికి రెక్కలుప్రారంభమైయెగుర నవసరములేకనే తిండిలభించుచుండుకతన రెక్కలెదుగక మొండుబారియుండునని కనిపెట్టఁబడినది.

కీటకములన్నియు గ్రుడ్లను విస్తారముగ బెట్టుచు తమజాతి నభివృద్ధిపర్చును. కీటకములందు ముప్పాతికభాగము గుడ్లుపెట్టుటతో తల్లిచనిపోవుట సంభవించును. కొన్ని మగకీటకములు సంగమముతోనే మృతినందెడిని. ఎట్లైనను కీటకములు అల్పాయుష్యములని చెప్పఁబడినవి. గుడ్ల నాహారముగ నుపయోగించుజాతి, ఆకులపైననె పెట్టుంగాన తల్లిజాగ్రత అక్కరలేకుండగనే అవి జీవముగల్గినతోడనే తమయాహారముగ నాయాకునే యుపయోగపర్చుకొని పెరుగుచు పెద్దవియగును. కీటకముల రక్తమెఱ్ఱగ నుండదు. కీటకములు మనుష్యులవలె నూపిరితిత్తుల (Lungs) తో నూపిరి దీయుటయుండదు. ఏలనన వానికి Lungs ఉండవు. అవి గొట్టముల

ద్వారా శరీరభాగముల కూపిరి గాలిం బీల్చిపంపి రక్తమును శుభ్రపర్చుకొను చుండును. ప్రపంచమున నితరప్రాణులకన్నను నివి నూటికి డెబ్బది యెమగ నెక్కువ సంఖ్యాకములై యున్నవని పరిశీలనలవలన తేలి యున్నది.

కీటకజాతులను Complete metamorphosis అనియు, Incomplete metamorphosis అనియు ద్వివిధములుగఁ గనిపెట్టి యున్నారు. Complete metamorphosis జాతికి నాల్గుఅవస్థలు జీవితమునందు గల్గి యుండును. ౧. అండావస్థ (గ్రుడ్డునందుండుట), ౨. Larva or Caterpillar అవస్థ (పొడుగగు పురుగైయుండు అవస్థ), 3. Pupa or Cucoon or Resting stage అనఁగా కోషాణవుకాయంబోలు అల్లుకొనిన కాయమునుండి ఆహారపాన మలమూత్రవిసర్జనాదులను మాని విశ్రాంతిఁగొనుచు బ్రతికియుండు నవస్థ. ఇందే శరీరావయవముల మార్పులు గల్గును. (సిరికల్చరు చూడుఁడు). ౪.Adult or Butterfly Stage (రెక్కలు గల కీటకమై ఎగురఁగల్గియుండు అవస్థ). ఇఁక Incomplete metamorphosis గ్రూపునందు కీటకములకు విశ్రాంత్యవస్థ (Resting stage) ఉండక మూడవస్థలుమాత్రమే యుండెడిని. వీనియందు రెండవఅవస్థయగు పొడుగుగా పురుగుగ నుండు నవస్థకు Nymph stage అని పేరు. ఈ Nymph అవస్థయందుఁ గీటకము చిన్నదిగా నుండుటయు, మూడవ దశ Adult stage యందు పెరిగి, పెద్దదిగానుంటయుం దప్ప భేదముండదు. ఈ Incomplete metamorphosis గ్రూపునందుఁ దల్లికీటకము గ్రుడ్డం బెట్టుటతోడనే చనిపోవుట తరుచుగా సంభవింపదుగాన తల్లికీటకమును, పిల్లకీటకమును ఒకసారిగ పెద్దచిన్నలుగా చూడనగును.

క్రిమికీటకజాతులకు తమదేహచ్ఛాయమూలమున నాకులందు డాగుకొని యున్నట్లే తెలియంబడక, తమ నైసర్గికవైరులనుండి తప్పించుకొను శక్తి కలదు. ఈశక్తికి Mimicry అని ఆంగ్లమునఁ బేరు. కీటకజాతులకు తలపై రెండును, శరీరమునందితరభాగముల మఱికొన్నియు గుండ్రని నేత్రములుండుంగాన, నన్ని దిక్కులం జరగుచుండు సంగతులం జూడఁగల్గునని తలంపంబడుచున్నది. తలపైనుండునేత్రములు పెద్దవి. నేత్రములకు రెప్పలుండవు. ఈశాస్త్రమునకుఁ గొందఱు విద్వాంసులు Insectology అని వాడుచుండుటయుం గలదు. వీనియందు పదిజాతులు విభజించియున్నారు. అవి రెక్కలంబట్టి చేయఁబడిన విభజనయై యున్నది.

౧. Orthoptera- దళసరియగు రెక్కలు గలజాతి (Membraned winged creatures). జట్టమిడుత (Locust), గొల్లభామ పురుగు, బొద్దింక (Cocroach) మొదలగునవి ఈజాతి కుదాహరణము. ౨. Neuroptera- రెక్కలందు నరములుగలజాతి (Nerved winged creatures). తూనీగ. (Dragon fly)దీని కుదాహరణము. 3. Lepidopterous- రంగులు, మచ్చలుగల పెద్దరెక్కలుగల కీటకములు (Colour - spotted and big - winged creatures). వీనియం దింకను రెండు భేదములు కలవు. పగలుసంచరించు సీతాకోకచిలుకజాతియు రాత్రులంసంచరించు పట్టుపురుగులు మొదలగు moths జాతికీటకములు వీని కుదాహరణములు. ౪. Hemiptera- సగము రెక్కలు గలవి (Half - winged creatures) నల్లులు, పేలు మొదలగునవి వీనికుదాహరణములు. ౫. Diptera- రెండు రెక్కలు గలవి. (రెక్కలు కీటకములకు నిజమున నాలుగుండినను వీనికి రెండే కన్పించుచుండును. తక్కిన రెండుRudimentary

స్థితియందు పెరుగ మొండిబారిపోవును). ఈగలు (Fly), జోరీగలు (Gadfly) దీనికి ఉదాహరణములు. ౯. Colioptera- చిన్న రెక్కలుగలవి(Small-winged creatures) పెంకిపురుగులు, లద్దెపురుగు లేక పేడపురుగులు, కొబ్బరిపురుగులు (Rhinoserous Beetle) దీనికుదాహరణములు. ౭. Thysonoptera- ఇందు మూడుమార్పులేయుండును. చిన్న రెక్కలు కడలను కుచ్చులు గలవి వీని కుండెడిని. ౮. Hymonoptera- రెక్కలు ప్రత్యేకముగ విప్పియున్నట్లే సదాఅమరియుండును. తేనెటీగలు, కందిరీగలు, రెక్కలచీమలు వీనికుదాహరణములు. ౯. Mecoptera- రెక్కలు పొడుగువిగనుండు జంతువులు. దీనికి Scorpion fly ఉదాహరణ మని చెప్పఁబడినది. ౧౦. Isoptera- పని చేయు చెదపురుగు (చీమ) లకు రెక్కలుండవు. ఇందుగల ఆడజాతి, మొగజాతి పురుగులకు మాత్రమే రెక్కలు కలుగును. ఇది చెదపురుగుల లోని జాతిభేదము.

ఇటీవల పరిశీలకులు Segmented Group నకుం జెందిన తెగయందు నాల్గుగ్రూపులే కాద నియు, ఐదవగ్రూపు Onychophora యనం బడునది కలదనియుఁ జెప్పుచున్నారు. ఇదియు నిటీవలనే కనిపెట్టంబడినదనుచుందురు.

**ఎ ్** — (వాణిజ్యసంబంధ పరిభాషా పదము). Entry — కష్టమ్సుకచేరీ లెక్కలలో (పన్ను విధింపఁబడదగిన వైనను, అక్కరలేని వైనను) ఎగుమతి దిగుమతి సామానులను నమోదు చేసికొనుటకుం బేరు. సర్వసాధారణ ముగ దేనినైనను లెక్కలలో నమోదుచేసి కొనుటకు ఎంట్రీ అనుచున్నారు. కష్టమ్సు కచేరీలెక్కలలో నమోదుచేసికొని సరకును Bonded ware house నందు నిల్వచేసి వాడుకనిమిత్తముపయోగించుకొనుటకుఁ గొం పోవు వఱకును పన్ను వసూలుచేయనక్కరలేని. సరకులనమోదు చేసికొనుటకు Entry for ware-housing అని యందురు.

**ఎండార్సీ** — (వాణిజ్యసంబంధ పరిభాషా పదము). Endorsee: — హుండీలు మొదలగు వానిని ఎవ్వరిపేరున Endorse చేసి యిచ్చెదరో ఆఎండార్సు పొందినవాఁడు. ఎండార్సుచేయుచు వ్రాసిన వ్రాతకు ఎండార్సుమెంటు (Endorsement) అనియు నందురు. ఒకపోలిసీని ఇట్లు Endorse చేసినచో దానినిEndorsed policy అనియెదరు.

**ఎండితే వస్తువు తగ్గితే తగ్గను గాని సంఖ్యతరుగునా?**– ఆంధ్రలోకోక్తి.

**ఎండురోగము** — కార్శ్యరోగము చూడుఁడు.

**ఎండోమెంటు** – (వాణిజ్యసంబంధ పరి భాషాపదము). ఎండోమెంటు (Endowment-) అనిన ఈవి (ఇచ్చివేయబడినది) అనియర్థము. Endowment policy యన కొన్ని లెక్క వాయిదాలుగా కొంతసొమ్ము ఒకభీమాకంపెనీ యందుచెల్లించి ఊరుకొను భీమా.

**ఎంతచెట్టున కంతగాలి** — ఆంధ్ర లోకోక్తి.

**ఎంత పెంద్రాళేలేచినా తుమ్మల గుంటవద్దనే తెల్లవారినట్లు** — ఆంధ్రలోకో

**ఎందుకేడుస్తావురా అబ్బాయీ అంటే ఎల్లుండి మావాళ్లు కొడతా రేమో అన్నాడఁట** - ఆంధ్రలోకోక్తి.

**ఎంపైర్ డే** (Empire Day)— మే నెల 24 తేది బ్రిటీషు సామ్రాజ్యోత్సవదినము. ఇది ఎవరి పరిపాలనమున బ్రిటీషురాజ్యపాలనము సామ్రాజ్యమయ్యెనో అట్టి విక్టోరియాచక్రవర్తిని గారి జన్మదినము. క్రీ. వె. ౧౯౦౦ ప్రారంభము.

**ఎంబార్గో** — (వాణిజ్యసంబంధ పరిభాషాపదము) — Embargo- యుద్ధకాలములందు ఓడను రేవునుండి వెడలనీయక నిరోధించుచు ప్రభుత్వమువారొసంగెడి యుత్తరువు.

**ఎంబోలిజమ్** (Embolism) — ఏ యోచన కైనను కాదని అడ్డువాదముచేయుట అడ్డుపెట్టుట కాదనుటయె లక్షణముగా నున్న కళ.

**ఎంబ్యులెన్సుశకటము**-(Ambulance) జబ్బుపడినవారిని, గాయములు తగిలినవారిని వైద్యసహాయ స్థలములకు (ఆస్పత్రులకు) గొంపోవు శకటము. ఇవి సైన్యములు యుద్ధమున కేగుతరి వెంటపోవును. వైద్యశాలలందుండును.

**ఎంబ్రియోలోజీ**—(Embryology) ఉత్పత్తిమొదలు పెరిగి పెద్దవగువఱకు విత్తుల యొక్కయు, పురుగులయొక్కయు పోషణ లేక అభివృద్ధులంగూర్చి (Fertilisation) న కళ. అనగా Vegetable and Animal kingdom యొక్క Fertilisation అని భావము.

**ఎంబ్రాయిడరీ ఇంకు పరిశ్రమ** — (Embroidery ink). వర్తక పరిభాష యందు దీనిపేరిట్లున్నను, సర్వసాధారణముగ వాడుకయందు Stencil-ink అనియు వాడుట కలదు. దీనినిఉంచెతో Stencil నందలఁదిన రంధ్రములగుండా యవ్వలితావున కంటుటయుం దితర సిరాలవలె హద్దులనుమీరిచెదరి ప్రాకక సరిగాఅక్షర స్థలములందే నిలచును. నగిషీరూపములను స్టెన్సిలు ద్వారా వ్రాసి చిత్రించుతరి నీసిరాస్పష్టముగ నారూపములనే జూపుంగాని కొంచెము చెదరి యలుకుకుపోయి చిత్రరూపములను లతలు మొదలగువానిం బాగుచేయఁదగిన దీనికి ఎంబ్రాయిడరీ సిరా యని తొలుత పేరిడంబడెనట. షెల్లాక్ (Shellac) ౨ ఔన్సులు, పటిక (Borax) ౨ ఔన్సులు, నీరు (Water) ౨౯ ఔన్సులు, జిగురు (Gum Arabic) ౨ ఔన్సులు.

తొలుత షెల్లాక్ (Shellac) ను, పటిక (Borax) ను కొంచెము నీటియందు గుండ చేసివైచి పిదప Gum Arabic చేర్చి యానీటిని నిప్పులపైనిడి, అన్నియుం గరఁగి కలిసిపోవునట్లు ఉడికించవలెను. దానిందించి చల్లారనిచ్చి మిగిలిన నీటింజేర్చవలయును. పిదప ఎఱుపు (Venetian Red), నలుపు (Lamp black) లేక నీలి (Prussian Blue) మొదలగు రంగులను కల్పుకొందురు. ఇవి Distemper colours. ఇట్లే Aniline colours ను dextrin mucilage తో నూరి కల్పి వాడుదురు.

**ఎంబ్లెమెటోలోజీ**— (Emblematology). చిహ్నముల (Emblems) ఉత్పత్తి, చరిత్ర, మార్పులు మొదలగువానిం గూర్చినకళ.

**ఎకరము** (Acre) — జర్మను భాషా పదమగు ఎగ్రాస్ (Agros) పొలమునుండి కల్గిన పదము. భూమికొలతయందు ౪,౮౪౦ చతురపు గజముల ప్రదేశమున కాంగ్లమున ఏకర్ అని పేరు. దానిని తెలుఁగున ఎకరము లేక యకరము అని వాఁడుచున్నారు. ఇది ౪ రూడులు(Roods) ఐర్లాండు దేశమునను, స్కాట్లాండు, ఇంగ్లాండు దేశములందునను Statute Acre అనఁబడు పెద్దకొలత ఎకరము వాడుకయందున్నది. అది పెద్దది. ఒకనాగలితో (పరువోసి) దున్నగల భాగా ఎకరమని తొలుత నేర్పాటాయెనని చెప్పఁబడినది. భూమిని ఎకరములుగ కొలచుచున్నారు.

తొల్లింటికాలమున నాగలితో నొకసారి దున్నఁ గల భూమి నొకకొలతగాఁ గొలచుచుండిరట. ఇది సర్వదేశములందు వాడుకగనే యుండెనని తెలియుచున్నది. భరతదేశమునం దుత్తరసీమ లందు బీఘాలను కొలత వాడుకయందున్నది. అగ్రహారములిచ్చుతరి నొక్కొక్కరికిచ్చిన భూమికి వృత్తి యనిపేరుండెను. ఆయా భూసారముల ననుసరించి వేర్వేఱుతావుల నొక్కొక్కవృత్తికి కొన్నియకరములని లెక్కయుండెను.

మనదేశమునందలి ఎకరమున ౪,౮౪౦ చౌకపు గజములుండెను. ఇవి నూరుసెంట్లుగా విభజింపఁ బడుచుండునవి. తొలుత ౨౨ గజముల కొల పరిమాణముతో కొలుచుచుండిరి. ఇటుల నొక చౌకము ఒక చౌకపుచైను అనుచుండిరి. ఇట్టి చౌకపుచైనులు పది యగుతరి నొక ఎకరమగు చుండెను. కాలానుగుణముగ ఎకరమును నాల్గు (Rood) రూడులుగను, రూడును నలువది (Perches) పెర్చెస్ గను భాగించిరి. ఇట్టి పెర్చియందు ముప్పదింబాతిక చౌకపు గజము లుండును. ఇది ఇంగ్లీషుఎకరము. ఎకరములు వేర్వేఱుదేశములందు వేర్వేఱుకొలతలుగ నుంట వానినిట వివరించుట సమంజసము.

| | | | |
|---|---|---|---|
| ఇంగ్లీషు | ఎకరము | | 1.00 |
| స్కాట్లండు | | ,, | 1.27 |
| ఐర్లండు | | ,, | 1.63 |
| అమెరికా సం. రా. | | ,, | 1.00 |
| హాలండుదేశపు | | | 2.10 |
| హానోవరు | | ,, | 0.64 |
| బాడెన్ దేశపుమోర్గన్ (Morgen) | | ,, | 0.80 |
| హాంబర్గు (జర్మనీ) | | ,, | 2.38 |
| పోలాండు (Poland) | | ,, | 1.38 |
| ప్రష్యా (జర్మనీ) చిన్నమోర్గన్ | | ,, | 0.63 |
| ,, పెద్దమోర్గన్ | | ,, | 1.40 |
| శాక్సోనీ (జర్మనీ). మోర్గన్ | | ,, | 1.36 |
| ఊర్టెంబర్గు (జర్మనీ) మోర్గన్ | ఎకరము | | 2.40 |
| బెల్జియమ్ హెక్టారు (Hectare) | | | 2.47 |
| ఫ్రాంసు హెక్టారు | | | 2.47 |
| ఆస్ట్రియా జోచ్ (Joch) | | | 1.42 |
| ఫ్రాన్సుదేశపు ఆర్పెంటు (Arpent) | | | 0.99 |
| నేపిల్సు మొగ్గియా (Moggia) | | | 0.83 |
| పోర్చుగల్ దేశపు గెయిరా (Geira) | | ,, | 1.43 |
| రష్యాదేశపు డిక్లేటినా (Declatina) | | ,, | 2.70 |
| సార్డినియాదేశపుగ్లోర్నాటి (Glornate) | | ,, | 0.93 |
| స్పానియాదేశపు ఫెంగాడా(Fenegada) | | ,, | 1.06 |
| స్వీడన్ దేశపు టన్నిలాండు (Tunneland) | | | 1.13 |
| స్విజర్లాండు ఫాక్సు (Faux) | | ,, | 1.62 |
| జెనీవాప్రాంతపు ఆర్పెంటు (Arpent) | | ,, | 1.27 |
| టస్కానీ సక్కాటా (Saccata) | | ,, | 1.27 |
| రోమనుల జుగేరం (Jugerum)(Anc't) | | | 0.66 |
| గ్రీకుల ప్లేత్రోన్ (Plethron) (Anc't) | | ,, | 0.23 |

**ఎకనామిక్సు** (Economics) — ఆర్థిక సూత్రములు, ఎకానమీ, అర్థశాస్త్రము చూడుఁడు.

**ఎకాడమీ** (Acadamy) — ఈ "ఎకాడమీ" అను శబ్దమునకు సంస్కృతమున "విద్వత్పరిషత్తు" అననగును. ప్రాచీనకాలమున అటికాదేశవీరుఁడగు "ఎకాడిమస్" అనువాని నామగౌరవముగ నిది స్థాపింపఁబడెను. తత్వ జ్ఞాన భౌతికశాస్త్రాది సమస్త విజ్ఞానాభివృద్ధుల నిమిత్తము, ఆయాశాస్త్రపరిశోధనలకై పాశ్చాత్య దేశములందు పండితులచే నేర్పాటుకావింపఁ బడిన విద్వజ్జనసంఘము లీపేరనే ప్రఖ్యాతము లయ్యెను. ప్రాచీనకాలమున భారతదేశమున [illegible] లు సమితి, సదస్సు, పరిషత్తు అను పే[illegible] పాశ్చాత్యదేశముల మొదటి ఎకాడమీలో ప్రధానుఁడుగా పనిచేసిన మహాపండితుఁడు. సోక్రటీస్ శిష్యుఁడగు

ప్లేటోనామక తత్వవేత్త. ఈ పండితశిఖామణి ౫౦ సంవత్సరములకాలము తత్త్వోపదేశికుఁడై యుండెను. ఈ మొదటి ఎకాడమీ ఏథెన్సు నగరమందలిది. "పై లం" అను ద్వారమునుండి దక్షిణ పశ్చిమముగా నొక మైలుదూరమున "సెఫెనస్" అను నదియొడ్డున నున్నది. ఇది తొల్లి యొక పెద్ద తోటగానుండి, కాలక్రమమున సుందరారామముగ మారినది. ఇందు తత్వజ్ఞాన వేత్తలు పెక్కండ్రు సేరి, భగవద్విషయములు చర్చించుచుండిరి.

ఇట్లే మన భరతఖండమునఁగూడ ఎకాడమీలు పెక్కు లుండియుండెడివి. అందు బదరిక మొదటిది. ఈ బదరికకే బదరీనాథ్ అను మఱియొక పేరుకలదు. హరిద్వారమున కొక నెలప్రయాణములో, శ్రీనగరమునకు ౫౫ మైళ్ల దూరమున నున్న హిమవన్నగ శిఖరములలో నొకటియే యీబదరిక. ఈ తావుననే నరనారాయణులు తపముచేసియుండిరని మనము పురాణముల వినుచుందుము. ఇందే యాదినుండియు మహర్షులు వాసముసేయుచుండి, పరమేశ్వర ధ్యానమున నిమగ్నులై యున్న సమయాన దమకు స్ఫురించిన విజ్ఞాన మెల్లలోకములకు వెదజల్లిన తావిదియే. వ్యాసమహర్షి కీతావు మిక్కిలి ప్రియమైనదనియు, తానిచ్చటనున్న కాలముననే మనకిపుడు కానవచ్చుచున్న ౧౮ పురాణములను ౧౮ ఉపపురాణములను రచియించినట్లు తెలియుచున్నది. అట్టి పురాణములు, రాజసపురాణములనియు, సాత్వికపురాణము లనియు, తామస పురాణములనియు త్రివిధములుగా విభాగీకరణ మొనర్పవచ్చును. (పురాణములు, పురాణ లక్షణములు చూడుఁడు).

ఎవరెవరి కేయేసందేహములు దోచినను పెక్కండ్రు మహర్షులతోఁగూడి యుండిన యట్టి పరిషత్తులలో సంప్రదించుకొనిన గాని అట్టి విషయములు విశుద్ధములు కావనియు, పవిత్రత నొందజాలవనియు, అప్పటివారి కట్టుబాటులు పరమాత్మను గూర్చిన విజ్ఞానము నందగోరిన పెక్కండ్రు సన్యాసులిప్పటికిని బదరికకుపోయి, అటనే నివాస మేర్పరచుకొని, భగవద్విషయమైక చింతనము చేయుచుందురు. రెండవ మహావిద్యాపీఠము లేక విద్వజ్జన పరిషత్తుండిన తావు నైమిశారణ్యము. ఈ 'నైమిశము' గూడ హిమాలయ ప్రాంతముననే యున్నది. ఇందనేక మహర్షులు నివసించుచుందురు. ఇట్టి ఋషి సంఘములకు వృద్ధుఁడును, బ్రహ్మతత్వవేత్తయు నగువాఁడు కులపతిగా నుండెను. అట్టికులపతి యాదేశముల మన్నించి, యాతని నుపాసించుచు నాతనివలననే విద్యాబుద్ధుల గరచుచుండిరి. జగత్కళ్యాణము కొఱకును, తన్మూలమున స్వశ్రేయము నిమిత్తమును కులపతియాధిపత్యముక్రింద నీమహర్షులాంగిరస క్రతువు, సాకమేధము, పంచశారదీయము, విశ్వజిత్తు, పౌండరీకము, భర్తృద్వాదశాహము ననువానినే గాక, సంవత్సరసత్రము, మహావ్రతము, రాత్రిసత్రము, శతరాత్రము, స్తోమము, ద్వాదశ సంవత్సరక్రతువు, సహస్ర సంవత్సరక్రతువు ననువివిధములగు దీర్ఘక్రతువు లొనర్చుచు, విరామకాలములందు ధర్మార్థ నిరూపణములొనర్చుచు లోకకళ్యాణ ప్రదమగు ప్రయత్నములఁ బ్రవర్తించుచుండిరి. ఇవియన్నియు పరిషన్మహిమలే. ఇట్టి పరిషత్తులలో కొన్నియిట పేర్కొనుట సమంజసమని తోచెడిని. ౧. బదరిక, ౨. నైమిశము, 3. తక్షశిల, ౪. కాశ్మీరము, ౫. కాశీ, ౬. నాలందా, ౭. తామ్రలిప్తి, ౮. సుధాన్యకటకము, ౯. వేంగి, ౧౦. విక్రమశిల, ౧౧. ఉద్దండపురము, ౧౨. నవద్వీపము, ౧3 రాజమహేంద్ర పురము, ౧౪. మిథిల ౧౫. వేదారణ్యము.

.౧. బదరిక:-ఈబదరికాశ్రమమునకే అద్వైత మతసిద్ధాంతస్థాపకులగు శ్రీశంకర భగవత్పాదు లెనిమిదవ శతాబ్దమున నేగి నరనారాయ ణాలయము గట్టించిరని తెలియుచున్నది. పద నొకండవ శతాబ్దమున శ్రీరామానుజాచార్యుల వారీబదరిక కేతెంచి తమస్థాపించిన విశిష్టాద్వైత మతసిద్ధాంతమునకుఁ దగిన గౌరవమును సంపా దించిరి. ఇట్లే పదమూడవ శతాబ్దమున మధ్వా చార్యులవారును యిచ్చటికేతెంచి తన రచించిన గీతాభాష్యమును వ్యాసునకు స్వయముగఁ జదివి వినిపించినట్లు ద్వైతభాష్యమున వ్రాయఁబడి యున్నది.

౨. నైమిశము:- ఇదియును హిమాలయ ప్రాంతముననున్నది. భిన్న భిన్నాశ్రమముల నున్న ఋషులందఱును దాముతిరిగిన దేశాలకథలను, తీర్థస్థలముల చరిత్రములు సీతాపునకుఁజేరి ఇట నున్న మహార్షులకు నివేదించి తద్విశేషముల నెఱుంగుచుండిరి. అప్పటి కులపతియగు శౌనక మహర్షి ఆజ్ఞలచొప్పున ఉగ్రశ్రవసుఁడను సూతుఁడు, రోమహర్షణియొక్క పురాణములకు కథకుఁడు.

తక్షశిల:- ఇది రావల్పిండికి సమీపమున నున్నది. ఈవిద్వజ్జన పరిషత్తు శ్రీమద్రామా యణ, మహాభారత కాలములనుండియు లేక తత్పూర్వ మెంతోకాలమునుండియు బ్రసిద్ధిఁజెంది యున్నట్లు మనకు నిదర్శనములు కలవు. ఈ విద్వత్సభ లేక విద్వత్పరిషత్తు సోదరుండగు భరతుని పుత్రుండగు తక్షకుఁడు కట్టించెననియు, సింధు వితస్తా నదులమధ్యనుండె ననియు మహాభారతమున వాకొనఁబడియెను.

బుద్ధునకు వైద్యము చేసిన జీవకుఁడీ విద్యాపీఠముననే యాత్రేయ ఋషియొద్ద విద్య నేర్చెను. ఆత్రేయమతానుయాయి యగు చరకుఁ డిచ్చటనే కాయచికిత్సా ప్రధానమైన యష్టాంగవైద్యకో విషయములను బోధించెను. చంద్రగుప్తుని మహామంత్రియు, అర్థశాస్త్ర మను మహాశాస్త్ర నిర్మాతయు నగు చాణక్యుఁ డీవిశ్వవిద్యాలయమునఁ జదువుకొనిన వాఁడే. స్ట్రాబో, ప్లినీ, టోలమీ, డయోనిసియసు, నను నిటలీదేశపు పూర్వచరిత్రకారులందఱును ఈనగర మాహాత్మ్యతదశ గూర్చి వ్రాసియేయున్నారు. అలెగ్జాండరుకుఁ బూర్వము పాణిని ఈ విద్యాపీఠము నుండియే హాలాపురమున తన రచించిన వ్యాకరణశాస్త్రము నీ విద్యాపీఠము కడఁ జదివి వినిపించి తదామోదము పొందెను.

ఈ తక్షశిలా విద్వత్పరిషత్కాలముననే, విశ్వ విద్యాలయ స్థాపనమును, విద్వత్పరిషత్తునకును, విశ్వవిద్యాలయమునకును గల భేదము సూచిం పఁబడుటయు, ఇవి భిన్నభిన్న సంస్థలని యేర్పడు టయు, నీసంస్థలొనర్పవలసిన కార్యములు ప్రత్యే కముగ నిర్వచింపఁబడుటయు జరగినది.

ఇంగ్లాండు దేశముననేమి, తక్కిన పాశ్చాత్య దేశములయందేమి ౧౫౮౨-౧౬౧౨ వఱకును విద్వత్పరిషత్తులకును, విశ్వవిద్యాలయములకును (అనగా Acadamies and Universities కు) గలభేదమును, తద్విశిష్టతయునిర్వచింపఁబడక అభే దముగను, అవ్యక్తముగను, తారుమారుగను ఉండెడిది. ౧౭౦౧ లో రాయల్ బ్రిటిష్ ఎకాడమీ ఒకటి తత్కార్యక్రమము సంపూర్ణ ముగ విభాగకరణములతో స్థాపింపఁబడినది. (విశ్వవిద్యాలయములు చూడుఁడు) ప్రాచీన విద్యాపీఠములలోఁ దక్షశిల కాశ్మీరము మొదలు రాజమహేంద్రవరము వఱకును గల పరిషత్తులును, విద్వత్పరిషత్తు,విశ్వవిద్యాలయము, నను భేదము గమనించియే స్థాపింపఁబడి ప్రత్యేక సంస్థలుగానే పనిచేయుచుండెను.

**ఎకానమీ** (Economy) — ఏకార్య మును నిర్వహించుటయందైనను అందుకగు వ్యయమును వీలగునంతవరకుఁ దగ్గించి యాకార్య నిర్వహణమువలన యాదాయ మెక్కువయగు

నట్లుచేయుట లేక అకార్యము వీలగునంత చవకగ పరిపూర్తిచేయబడుట ఇందునుగూర్చిన కళ. ఎకానమిక్సు చూడుఁడు.

**ఎకార్టే** (Ecarte) – పేకాటలలో నొక యాట.

**ఎకాలొజీ** (Ecology)—Oecology చూడుడు. ఇది Botany, Zoology and Geography ల సంబంధముకలది. వృక్షములు-జంతువులు మొదలగువానికి సమీపముననుండు నితరములగు వృక్ష-జంతువులవలన నెట్టిసంగతులు సంభవించుచున్నవో తమవలన నవి యెట్టిఫలితము లనుభవించునో ఆ అన్యోన్య సంబంధ ఫలితములు (Neighbourhood) యోచించుకళ.

**ఎకిన్కాకస్ పురుగు** (Echnococcus worm) — ఇది సూక్ష్మజీవుల (Worms) జాతికిఁజెందిన పురుగులనుండి కల్గు అంటువ్యాధి బద్దెపురుగువంటిదే. (బద్దెపురుగు చూడుఁడు). కొందఱాజాతిలోనిదేనందురు. ఇది చాల చిన్న జాతిపురుగు. బాగుగ పెరిగినచో పావు అంగుళము పొడవున నాల్గు తునుకలు కలసిన శరీరము గల్గి మనుష్యులు, కుక్కలు, గుంటనక్కలు మొదలగువాని శరీరము లాశ్రమస్థానములుగా గల్గి కడుపులోని కార్జమున నివాసమేర్పర్చుకొనియుండును. ఇంకను గొడ్లయొక్కయు గొఱ్ఱెలయొక్కయు శరీరములందు కూడ నిటీవల నుండుట గన్పడినది. తక్కిన స్థితిగతులన్నియు బద్దెపురుగులవంటివే యనియు, ఊరకుక్కలం జంపించు పద్ధతి యీ పురుగులవలన గల్గు రోగముల నాపుటకేననియుఁ జెప్పఁబడినది (అంటువ్యాధులు, సూక్ష్మజీవులు చూడుఁడు).

**ఎకువడోర్** (Ecuador)—దక్షిణ అమెరికా ఖండమునందలి ప్రజాప్రభుత్వ దేశము. ఒక లక్షాపదునెన్మిదివేల ఆరువందల ఇరువదియైదు చతురపుమైళ్లు వైశాల్యమనియు, పదునారులక్షల జనసంఖ్య యనియుఁ జెప్పఁబడినది.

**ఎకౌంటబిల్ రసీట్** — వాణిజ్య పరిభాషాపదము. Accountable Receipt. జమాకర్చులు చెప్పవలసిన రసీదు. సొమ్ముగాని, సరకులుగాని తాను పుచ్చుకొనినటుల నొప్పుకొనుచు, వానిజమాకర్చు తానిచ్చుటకేర్పాటుతో నొసంగిన యొప్పుదలపత్రము. ఉదా- ఒక రైతు తనపొలము పంట నొకపట్టణవాసి యగు ఖాయిదావర్తకుని కడంజేర్చి, వానిధర రాఁబాఁచి యమ్మమని యప్పగింప నిచ్చిన రసీదును ఒక కంట్రాక్టరు పని తావుననున్న తనయుద్యోగి కచటి వ్యయకార్యములకుఁగా నొసంగియుండిన రసీదును, ఇట్టివని యెఱుంగునది. అట్టివారు జమాకర్చులు చెప్పవలసి యుండును.

**ఎకౌసిమీటర్** (Acousimeter) — జర్మనుభాషాపదమగు Akouein అన వినుటకర్థము. Metron అన కొలతకర్థము. వినుట-శ్రోత్రేంద్రియ జ్ఞానమున వినఁబడు చైతన్యస్థితిని కొలచి పరిమాణములం దెల్పుయంత్రము.

**ఎకౌంటు (లెక్కలు)** — లెక్కలన జరిగినస్థితిగతులను వరుసగ నొకరికొకరు బాకీయున్న మొత్తముల నెఱింగి వివరించుటకైన యంకెల సముదాయము. ఇవి అంకెలతోను, లేక విశేషములయిన యక్షరములతోను మొత్తముల వ్రాయుదురు. వర్తకవ్యవహార సంబంధములగు కార్యములనెల్ల మఱపురాకుండ నివి జ్ఞాపకము చేయుచుండుటయును, బాకీ సాకీలను నిర్ధారణపఱచి ముందుస్థితికి మార్గదర్శకములుగ నుండును. లెక్కలనేక విధములుగను, అనేకపద్ధతులపైని వ్రాయబడవచ్చును. దీని ప్రాముఖ్యత వేఱ్వేఱు సంస్థలతో లావాదేవి లధికములై నతరిగాననగుచుండును. ఆంగ్లవర్తకు లీలెక్కలు

వ్రాయుటయందు సింగిల్ ఎంట్రీ (Sing entry) అనియు, డబుల్ ఎంట్రీ (Double entry) యనియు రెండు విధానముల నేర్పరచు కొనియున్నారు. ఇందు తొలుత సింగిల్ ఎంట్రీ లెక్కలను వ్రాసికొని పిదప చేయవలసిన పనిని తోడనే యందే చేసికొనుటకు డబుల్ ఎంట్రీ యని పేరు. ఈవిధానము లెక్కలందు సంభవించు పొరపాట్లను వెంటవెంటనే చూపుచు సహాయ పడుచుండును గాన డబుల్ ఎంట్రీ లెక్కలు నిర్దుష్టములై యుండెడిని. వీనికి ఆంధ్రమున చిఠా ఆవర్జాలనియు, రోజుముఫర్జులనియు వాడుట కలదు. ఈ రెండువిధముల లెక్కలు లాభనష్టములను సరిచూచుకొనుట కుపయోగించెడిని. వ్యాపారమునందలి కార్యముల కాంగ్లమున ట్రాన్సేక్షను (Transactions) అని వాడుచున్నారు. చెల్లించబడిన సొమ్మునకు (Payment) అనిపేరు. ఇది చిఠాపుస్తకమునందు జమ వ్రాసియు, ఇతరులకొసంగబడిన, లేక పంపబడిన సరకునకుగాని, మూల్యమునకుంగాని విలువగట్టి ఖర్చువ్రాసెదరు. ఒకరితోడి వ్యాపారము సింగిల్ ఎంట్రీగను, ఒకరితోనొక రన్యోన్యము కొనుగోలులు పలువిధములుగ నడపికొనుచుండుట డబుల్ ఎంట్రీగను లెక్కలం దనుకూలించెడిని. క్రీ. వె. పదునేనవ శతాబ్దకాలమున ఇటలీదేశము లోని లొంబార్డిసీమ యందలి వర్తకు లీడబుల్ ఎంట్రీని ప్రారంభించిరని తెలియుచున్నది.

వ్యవహారసంబంధపు లెక్కల నాయత్తపర్చుట యందీక్రింది సంగతులు ముఖ్యముగ గమనించ వలసియుండును.

ఒక వాణిజ్య సంస్థగాని (Trading company), పరిశ్రమ సంస్థగాని, సబరులు చేయు ఓడల వ్యాపారము గాని, ముద్రణ వ్యాపారము (Printing press) గాని, సమస్తవ్యాపారముల నడపుట కేర్పడు ప్ర. సంస్థయందు మూలధనమనియు (Capital), రాబడులనియు (Income), సాదరులనియు (Expenditure) మూడు భేదములు గల ద్రవ్యములుండుననియు నెఱుంగదగును. అందు మూలధనము (Capital) ఆ సంస్థను ఏర్పర్చుటకు వలసిన ద్రవ్యము. పిదప దానిచే పనింజేయించుటకుఁ గొన్ని అనురికలింకను వలసియుండును. ఇవి ఓడలను నడుపుట కర్మాగారముల పనిచేయునటుల నడుపు యంత్రముల నడపుట కగు ద్రవ్యములు, అందలి వారి జీతములు, పన్నులు, సుంకములు, మరమ్మత్తులు, చమురులు (Oils) మొదలగు వాటికగు యావత్తు వ్యయమునకు Working capital అనియు, Running capital అనియు నందురు. ఇవి లేనిది ఆ సంస్థ నిర్మాణమున లోపములేని ద్రవ్యము పనిఁజేయజాలకుండెడిని. ఈ రెండు నిధులకు పెట్టుబడులనియు నందురు. వీటిపై వడ్డీలను లాభమునుండి మినహాయించుటయుంగలదు. పిదప నట్టి సంస్థల పనులనుండి వచ్చు రాబడులు అనగా ఓడలకేవులు, ఓడలందుఁ దీసికొనిపోబడు సరుకుల రుసుములు మొదలుగాగల రాబడులు Revenues అనంబడును. ఇవియే యీ సంస్థలు గడించు న్నాదాయములు. లెక్కలను వ్రాయుట యందు ఆదాయపురాబడినుండి తొలుత Capital పై నగు వడ్డీయును, పిదప Working capital గా వ్యయపర్చబడిన మూల్యమును తీసివైచి శేషించిన ద్రవ్యమును Earnings అనియెదరు. (అనఁగా గడించిన ద్రవ్యమని యర్థము). పిదప గమనింపఁదగిన ముఖ్యాంశ మొకటిగలదు. ఇట్టి సంస్థలు, కర్మాగారములు, ఓడలు, ముద్రణయంత్రములు మొదలగునవి యన్నియు పనిచేసినకొలది అరగిపోవుచుండును. గాన కొంతకాలమునకు హీనతంజెంది పని నిలచి

పోవలసివచ్చును. అత్తరిమూలధనము (Capital) నిరర్థకమై భగ్నమగును. కాన అట్టిసంస్థ చిర కాలము పనిచేయవలయుననిన అరుగుదలద్రవ్య నిధి నేర్పర్చవలసి యుండును. దీనికాంగ్లమున Depreciation fund అనిపేరు. ఒక కర్మా గారముగాని, సబురులోనర్చు ఓడగాని, యంత్ర శాలగాని పది సంవత్సరములు పనిఁజేసిన యరిగి పోవునని తలంపంబడినచో Capital ద్రవ్యము నందలి ఇరువదియవభాగము నేఁటేట Depreciation మూల్యముగ Earnings నుండి మినహా యించుచు, దానిని వేఱుగ నిల్వయుంచవలసి యుండును. ఇది యేఁటేట నధికముగ జరుగుచు కర్మాగారాదు లరిగిపోవుచున్నకొలది నధిక మగుచు, నీపరిమితకాలము కడకు పూర్తియగు Capital మొత్తమంత మూల్యమగును. Earningsనుండి ఈడిప్రీషియేషన్ తీసివేయగా మిగిలిన సొమ్మునకు లాభమనియు (Profit) తగిలిన సొమ్మునకు నష్టమనియు నాంగ్లభాష యందు పేరులు. లెక్కలువ్రాయుతరి నీవిధులం బాటించుట యవసరమని ఎఱుంగవలెను. ఇట్టి విధులు వేర్వేఱు సంస్థలకు వేర్వేఱుగ పెక్కులై యుండెడిని. వాని నన్నిటిని వివరించుట విజ్ఞాన గ్రంథమున వీలుండదు. కాన వాని నెఱుంగుట సమంజసమని చూపుటతో నీసంగతి ముగింపఁబడ వలసి యుండును.

ఇంక నీ సందర్భమున నిట్టిలెక్కల నమూనా లసంఖ్యాకములుగ నుండుననియు వానినెల్ల నొక్కచోఁ జేర్పవలెననిన పెద్దదియగు ప్రత్యేక గ్రంథమగుననియుఁ దెల్పుచు వదలుట సమంజ సము. లెక్కలను జాగ్రతగ వ్రాయుటయందలి లోపమున ననేక వర్తకసంస్థలు దివాలాతీసిన వనియు వాని దుస్థితికి నష్టములు కారణములు గావనియు దెల్పు నొక లోకోక్తి ఆంగ్లమునందు కలదు. మఱియు నీ లెక్కలు Statistics సంబంధమనియెఱుంగునది. (స్టాటిస్టిక్సుచూడుఁడు).

**ఎక్కౌంటెంటు**- ఎకౌంట్సు చూడుఁడు.

**ఎక్కడ పశువు పొర్లినా మన మందలో ఈనితే వెయ్యి మనదే— ఎక్కడ పశువు మేసినా మనపెరట్లో వేసిన పేడ మనదే** — ఆంధ్రలోకోక్తి.

**ఎక్కడనైనా బావగాని, వంగ పెరటివద్ద కాదు** — (అనగా డబ్బువద్ద బంధుత్వము పాటింపని కఠినుఁడని భావము) ఆంధ్రలోకోక్తి.

**ఎక్కాబండి** — ఇది ఉత్తర హిందూస్థానమున వాడుకయందున్న ఒకపాటిబండి. ఒక్క గుఱ్ఱముచే లాగఁబడును.

**ఎక్కితే గుఱ్ఱపురౌతు - దిగితే కాలిబంటు** — (అనగా అన్నిపనులకు బనికి వచ్చు వాఁడని భావము) ఆంధ్రలోకోక్తి.

**ఎక్కిన వానికి (మావటీడునకు) ఏనుఁగే లోకువ** — ఆంధ్రలోకోక్తి.

**ఎక్కువుంటే (బండి) ఎద్దుకు కోపము - దిగువుంటే ఎక్కబోయిన వానికి కోపము** — ఆంధ్రలోకోక్తి.

**ఎక్జిక్యూషన్** — (వాణిజ్య సంబంధ పరిభాషాపదము). Execution. అమలుజరపుట యని యర్థము. తీర్పుమేరకు అప్పులవాని బాకీ తీర్మానమును, బాకీఉన్నవారి ఆస్తులను స్వాధీన పర్చుకొని వేలమువేసి అమ్మి బాకీతీర్చు న్యాయ స్థానమునందలి పని, లేక తీర్పుమేరకు ఉరిశిక్ష విధింపఁబడిన నేరస్థుని ఉరిదీయుట మొదలగు అమలుజరపు కార్యములు. ఇంకను శాసనముల నమలుజరపు ఉద్యోగములకు Executive Departments అనెదరు.

**ఎక్లిప్టిక్** (Ecliptic)— (భూచలనము చూడుఁడు). భూమధ్యరేఖ కుత్తరదక్షిణములం దిరువదిమూడున్నర డిగ్రీల దూరములందు మొదలుకొని భూమధ్యరేఖయు, ఏక్సిస్ రేఖయుకలియు సంధిగుండా కడవలకు రెండురేఖలు భావింతుమేని వానికెక్లిప్టిక్ (Ecliptic) రేఖలని పేరు. ఇవి ఉత్తరాయణ దక్షిణాయనముల హద్దులం దెల్పును. (ఎస్ట్రోనమీ చూడుఁడు, గ్రహములు చూడుఁడు).

**ఎక్విడక్టు** (Aqueduct) — అక్విడక్టు చూడుఁడు.

**ఎక్వేరియుమ్** (Aquarium) — నీటి యందే వసించు జంతువులు, మొక్కలు మొదలగువానిం బరిశీలించుటకు భూమిపై నేర్పరుపఁబడిన పంజరస్థానము. ఇది చేపలు మొదలగు జలచరములనుంచి వానిస్థితిగతుల నెఱుంగుటకు పరిశీలనలు సల్పుచుండుతావు. ఇట్టి జలాశయములం జూచుచుంట కద్దములతికించిన కట్టడములు కలవు.

**ఎక్సాల్**— (వాణిజ్యసంబంధ పరిభాషా పదము). Ex-All. తక్కిన లాభములు మొదలగునవి మినహాయించగా అసలుది అని యర్థము. Ex-all Share అన వాటాపైపద్దు ఆదాయము గాని, వడ్డీగాని కాకుండ అసలువాటా(మూలము) అనియర్థము. ఇది Stock Exchange పదము.

**ఎక్సాలోనైట్** — ఇది సెల్యూలోయిడ్ (Celuloid)కు ప్రతినామము. (సెల్యూలోయిడ్ చూడుఁడు).

## ఎక్సు అక్షరమునకుం జెందిన ఒక్రైస్తవనామములు-పురుషులవి-

Xavier- అరేబియాదేశపుపదము, Bright అని యర్థము. St. Xavier బోధకుని పేరు సుప్రసిద్ధము.

Xerxes- పరిషియాదేశపు పదము, Venerable అని యర్థము. ఈపేరు పరిషియా చక్రవర్తుల కుండెను.

## "ఎక్సు" అక్షరమునకుం జెందిన ఒక్రైస్తవస్త్రీలనామములు

Xantheppe గ్రీకుపదము. పసుపుపచ్చరంగు గుఱ్ఱమనియర్థము. ఇది ఏథెన్సునగరమున గొప్ప తత్వశాస్త్రవిదుఁడని పేరందియుండిన సోక్రటీసు పండితుని భార్య పేరై యుండి ప్రచారమందెనందురు. Xenia గ్రీకుపదము - అతిథి సత్కారమని యర్థము.

**ఎక్సుడ్రాయింగ్**- (వాణిజ్య సంబంధ పరిభాషాపదము) Ex-drawing. వడ్డీ, డివిడెండు, బోనస్సు, వడ్డీ, డ్రాయింగు లాభములు మొదలగు నాదాయములతో నిమిత్తములేకుండా అప్పుపత్రముల కొనుగోలు వ్యాపారము.

**ఎక్సున్యూ**—(వాణిజ్య సంబంధ పరిభాషా పదము.) Ex-New. క్రొత్తవాటాలు issue చేయుతరి పాతవాటాల యజమానులకు ముందివ్వవలయునన్న పద్ధతిని, ఇందు కలుపుకొనకుండానని యర్థము.

**ఎక్సేంజి** - (వాణిజ్య సంబంధ పరిభాషా పదము.) Exchange. మార్పు, మార్చుకొనుట. ఒకటియిచ్చి మఱియొకటి గైకొనుట. ఇంకను వర్తకులుకూడి కొనుగోలువ్యాపారములం జరుపుకొనుట చక్కపెట్టుకొనుటకు ఏర్పరచుకొనిన గృహమునకును Exchange అనెదరు.

**ఎక్సుపార్టి** (Exparte) — (వాణిజ్య సంబంధ పరిభాషాపదము). తాను జోక్యము కల్గించుకొనక విముఖతతో నుండుట కర్థము.

**ఎక్సు - మేరో - మోటు** (Ex-mero Motu)— (వాణిజ్యసంబంధ పరిభాషాపదము) ఒకనియొక్క స్వకార్యము లేక ఒకడు తానై చేసికొనినపని. స్వకీయమైన కృత్యమని యర్థము.

**ఎక్సురే** (X-Ray) — వీనిని ఐరోపా దేశములందు రోంట్జెను కిరణము (Rontgen Rays) లనుచున్నారు. ఆంగ్లేయులు తమ భాష యందు ఎక్సురే అనియెదరు. ప్రొఫెసరు విల్లెమ్ గోనార్డు రోంట్జెను (Professor Wilhelm Konard Rontgen) అను గొప్ప పరిశీలకుఁడు క్రీ. శ. ౧౮౯౫ వ సంవత్సరమున High Votlage Electric Light యొక్క కిరణములందలి చొచ్చుకొనిపోవు శక్తిని పరిశీలించుచు నీకిరణములం గనిపెట్టుటంజేసి వానిని ఐరోపాదేశస్థులు రోంట్జెన్ రే అని వాడఁదొడఁగిరట. దానికి ఆంగ్లప్రతినామమే X-Ray అని యున్నది. మామూలు వెలుతురును పోనీయక ఆటంకపఱ్చెడి కొన్ని వస్తువులగుండా కూడఁ జొచ్చుకొనిపోవు శక్తి ఎక్సురేయందుఁ గలదట. శరీరముగుండా చూచినతరి 'లోనగల పుండ్లు, ఎముకలనీడలు, లోనగల ఇతర విశేషములు, లోపములు మొదలగునవి దృగ్గోచరములగుట వలన నాంగ్లవైద్యులు దీనిని వాడుచున్నారు. ఈవెలుతురు ఫొటోగ్రాఫులందలి రంగు మాపి పాడుచేయును. కొన్ని Chemicals పై మార్పులంగల్గించునట్లొనర్చును. శరీరముగుండా X-Ray వెలుతురు జొప్పించినకతన కన్పించు లోనిసంగతుల విశేషములయొక్కయు, లోపముల యొక్కయు దృశ్యమును ఫొటోగ్రాఫు తీయ వచ్చును. అనగా అంతకుఁదగిన వెలుఁగుఁగల్గి యుండునని భావము. లోహములలో నున్న దోషపదార్థముల నిట్లు దీనితోఁ బరిశీలించి తెలిసి కొందురట.

**ఎక్సుషిప్సు**— Exship (వాణిజ్య సంబంధ పరిభాషాపదము). Ex-Ship- ఓడపైనున్న సరకులను కొనుటకు, అమ్ముటకు వాడఁబడు పదము. దానికి తగులు కర్చులు కొనువారే భరించుట యాచారమై యున్నది. ఇటులనే Ex-warehuse అనగా వేరుహౌసులో నున్న సామానులను అమ్ముటకు, కొనుటకు వాడఁబడు పదము. తగులుకర్చులు కొనువారే భరింపవలసి యుండును.

**ఎక్సెలెన్సీ బిరుదము** (Excellency)- గౌరవసూచక బిరుదము. ఆంగ్ల సామ్రాజ్య ప్రభుత్వమున పరిపాలకోద్యోగులకు మంత్రులకు వాడఁబడుచున్న బిరుదము. భరతదేశమున రాజప్రతినిధికిని, రాష్ట్రపాలకులగు గవర్నర్లకుఁ గూడ నీగౌరవపదము నుపయోగింతురు.

**ఎక్సైజుడ్యూటీస్**— (వాణిజ్య సంబంధ పరిభాషాపదము). Excise duties- స్వదేశమున నుత్పత్తియై స్వదేశస్థుల ఉపయోగమునకు వినియోగించు పదార్థములపై విధింపబడు పన్నులకు పేరు. ఉప్పు, కల్లు, సారాయము, మున్నగు వానిపై విధించిన పన్నులు ఎక్సైజు పన్నులే.

**ఎక్సటెన్సోమీటర్** (Extensometer) లోహములను తీగెల వలెగాని రేకుల వలెగాని సాగదీయుటకు ముందాయా పరిమాణములతో సాగదీసిన నెంతెంత పరిమాణముల సాగగలవో లెక్కించినట్లు తెలుపగల యొక పరికరము.

**ఎగదీస్తే బ్రహ్మహత్య దిగదీస్తే గోహత్య** — అనగా ముందునకు వెనుకకుం గూడపోలేనివిషమ సందర్భమని భావములోకోక్తి.

**ఎగురువాతము** (కంపవాతము.) - దీని నొక యాంగ్ల వైద్య వేత్త (Wind born disease attended with shivering limbs or body) మలినమగు గాలుల వలనఁ గలిగి శరీరావయవములకు వణకుఁబుట్టించు రోగముగ వివరించి యున్నాఁడు. శరీరావయవము లలోఁ గొన్నిగాని, అన్నియుగాని ఎగురుచుండెడి వాతరోగము. కంపవాతమనియుదీనికిఁబేరు. వణకు

చుండుట కొట్టుకొనుచుండుటయుంగూడ రోగ లక్షణములగును.

## ఎగ్రికల్చర్ (కర్షకపరిశ్రమము)

ఒక చక్కని పద్ధతిమేరకు మనుష్యులయొక్కయు, పశుగణముల యొక్కయు నాహారాదులకు సస్యములను సేద్యమొనర్చి పెంచుశాస్త్రమున కాంగ్లమున Agriculture అనిపేరు. ప్రపంచ కర్మలలోనిది ప్రాతిపదికయని చెప్పవచ్చును. ఇది పెక్కుమార్పులనంది యున్నది. ఇంకను మార్పుల నందగలదు. పచ్చికమేత, పాడిసంస్థ, ఫలవృక్ష దోహదవిధానము, తోటలదోహదము, కోళ్లం బెంచు దోహదము మొదలగునవన్నియు వ్యవసాయమునకుం జెందినవియె యని యాంగ్లవ్యవసాయ శాస్త్రవిదు లేర్పఱచియున్నారు. పచ్చిక బయళ్లు నాయత్తపఱచి, అందుc బశువులం బెంచుచు వాటినభివృద్ధికిందెచ్చు కళకు Animal husbandry యనియు, Stock rearing అనియును, సస్యములం బెంచుటకు పొలములందు సేద్యమొనర్చు కళకు Arable farming అనియు, పై రెంటింగల్పిన కృషికి Mixed farming అనియు, ఫలవృక్ష దోహద కృషికి Horticulture అనియు, కోళ్లను, ఇతరపక్షులంబెంచు కృషికి Poultry అనియు, కూరగాయలంబండించు కృషికి Garden cultivation అనియు, లేక Vegetable gardening అనియు, మేకలు, గొఱ్ఱెలు మొదలగు జంతుజాలమునుపెంచి ఉన్ని మొదలగు పదార్థములను సేకరించు కృషికి Animal husbandry యనియు, Sheep farming అనియు, పట్టుపురుగులం బెంచు కృషికి Sericulture అనియు, తేనెటీగలంబెంచి తేనెగైకొను కృషికి Bee farming అనియు, మొక్కలంజేసి నాటించి పెంచు కృషికి Nursery farming అనియు వివిధ శాఖాకళలకు వివిధసాంకేతిక నామములం గుదిర్చి వాడుచున్నారు.



పరిణామములు, అభివృద్ధి, మార్పులు— ప్రతి దేశమునను సేద్య మనేకమార్పులం జెందుచు పెక్కు పరిణామములం జెందుచునేయున్నది. మాంసాహారములపై నాధారపడు ప్రజ లసంఖ్యాకములుగ నభివృద్ధినంది మాంసాదులు ప్రియములగుట భరింపఁజాలక శాకాహారులుగ నుండవలసివచ్చుట వ్యవసాయాది కృషు లనేక విధముల నభివృద్ధిc జెందక తప్పనిదిగ నగుచుంటయే దీనికి కారణము. అందు యభివృద్ధి జనసంఖ్యలకుం దగిన ట్లింకను అతిశయస్థితియందు లేదని పెక్కండ్రు తలంచుచున్నారు. దీనికిందోడు అభినవ పద్ధతుల వ్యవసాయాధిక్యత అధికద్రవ్యముంబోగుచేయ నొత్తిడిం గల్గించుచున్నది.

వ్యవసాయమునకుం బ్రధానపరికరమనందగిన నాగలి ఇప్పటి అభివృద్ధుల నందుటయే దీనికొక సాదృశ్యము. సేద్యకృషి మానవజీవితమునకు రక్షణయని చెప్పవలయును. అట్టికృషి విద్యాహీనుల చేతంబడుట కొంతయభివృద్ధికి భంగముగ నున్నను అభివృద్ధిం జెందుచుంట మానలేదు.

పాశ్చాత్యసేద్యవిధానము నెఱుంగ వలెనని నేడు ప్రధానాంశములను పూర్తిగనో, యవసరమగునంతదనుకనో ఎఱుంగనిదే సేద్యమొనర్ప నసర్హమని తలంపఁబడుచున్నది. అవి ౧. వృక్షశాస్త్రము (Botany), ౨. ఫంగసు మొదలగువ్యాధులంగూర్చిన కళ (Mycology), 3. జంతుశాస్త్రము (Zoology), ఇందలిభాగమే యగు ౪. క్రిమికీటకములం గూర్చిన కళ (Entamology), ౫. పశువైద్య శాస్త్రము (Veternary), ౬. భూరసాయన శాస్త్రము (Soil Chemistry), ౭. భౌతికశాస్త్రము (Physics), ౮. భూమియందలి లోహాపాషా

ణాదులంగూర్చిన కళ (Geology) యు నై యున్నవి. ఇంకను కొందఱు ఎంజినీరింగు (మెకానికల్ అండు సివిల్) కళయు, Bacteriology కళల విజ్ఞానములుకూడ వ్యవసాయకళ కవసరములని నిర్ధారణ లొనర్చు చున్నారు. ఇంక వ్యవసాయక్రియాభ్యాసస్థానమును (Farm) గూర్చి తెల్పుట సమంజసము. ఈ ఫారములందు ముఖ్యములగునవి నాల్గుగలవు.

౧. ఎక్స్పెరిమెంటల్ ఫారమ్స్ (Experimental Farms)- ఇవి మచ్చునకు వేర్వేఱు వ్యవసాయములఁ జేయుచు నెటులకిట్టునో పరిశీలించి లెక్కలందెల్పునవి. ఇందువలన నెట్టి భూములు ఎట్టిపరిస్థితులు ఏయేపంటల కనుకూలములో, ఎట్టివి నిష్ప్రయోజనకరములో తెలియ నయ్యెడిని.

౨. డిమాన్స్ట్రేషనుఫారమ్స్ (Demonstration Farms)- ఇవి సేద్యగాండ్రకు సేద్యము యొక్క పరిస్థితులను విధివిధానములను కల్గు ఫలితములను సుబోధకముగను అనుభవ పూర్వకముగను తెల్పి అనుభవ జ్ఞానముంగల్గించు సాధనములుగనుంట వీనినుండి ఆర్థికముగులాభముండదు; ఐనను దీనిం గాంచుచుండు సేద్యగాండ్రకు విజ్ఞానప్రదమై చక్కని యభివృద్ధిఁ గల్గించుఁగాన నుపయోగకరములని చెప్పకతప్పదు. దీనిని నడపుట యందు Experimental Farm నందు వలెనే వ్యయాధిక్యమును తక్కువ లాభమును గల్గును.

3. కమ్మర్షియల్ ఫారమ్ (Commercial Farm). — ఇది సర్వసాధారణముగ సేద్యగాండ్రంద ఱొనర్చు వ్యవసాయము. ఆర్థికమగు లాభమే యిందుప్రధానము. పెట్టిబడిమూల్యము తక్కువగను చేయుపరిశ్రమలుతోడుగను కావలి మొదలగు జాగ్రతలు రక్షణముగనుకలిగి పండిన పంటలను అధికమూల్యమునకమ్మి లాభమునందుటయె యిందు జరుగుచుండును. ఇది విస్తారపు పరిమితింగల్గినకొలది ఎక్కువపంటలంబండి అధిక లాభము వచ్చును గాన దీనికి భూమియు, జలము మొదలగు సహాయములును అధికముగ నుండ వలసివచ్చును.

౪. రీసెర్చి ఫారమ్ (Research Farm)- ఇది కేవల పరిశీలనలకై నడపు సంస్థ. ఎక్కువ మూల్యమును వ్యయపఱచుచు వ్యవసాయాదికముల నడపుచు పరిశోధనల నొనర్చుచు కనుఁగొనిన ఫలితములను సేద్యగాండ్రకెఱుఁగఁజేయుచుండుటకైన యేర్పాటుగాన నార్థికముగ నిది లాభించునదికాదు. కాని సగటున వ్యవసాయమునకు విజ్ఞానప్రదమైయుండెడిని. దీని నుపయోగించుట వలన సేద్యగాండ్రు విజ్ఞానవంతులగుట కుపయోగించుటయెగాక శాస్త్రాభివృద్ధికింగూడ నుపయోగించుచుండుటచే నెక్కువమూల్యము నీసంస్థలపై నుపయోగించుచున్నారు.

ఇటీవల Mixed Farms అని కొన్ని సంస్థలు వాడుకలోనికి వచ్చియున్నవి. ఇవి సేద్యముతో ఆవులు, ఎడ్లను పెంచుటగాని లేక ఆయాదేశ విధానములుగ పోతులను, గేదెలను పెంచుటగాని, గుఱ్ఱములను పెంచుటగాని మొదలగునవిగ నుండును. ఇక్కాలమున నవీనపద్ధతులమేరకు Tractors నుపయోగించుచు, పశువులచే దున్నించు పద్ధతిని వదలివేయుచున్నారు. ఇప్పటి పరికరములన్నిటిని సాముదాయికముగ Labour saving implements with motive power అని వాడెదరు.

వ్యవసాయములన్నింటికి- ౧. మూలధనము (Capital), ౨. అర్హతగల భూమి, 3. ఆర్గనైజేషన్ (Organisation), ౪. మంచి పనితనముగల కార్మికులు (Efficient Labour) నని నాలుగంశములుగఁ జెప్పఁబడినవి. అందు

మూలధనమనిన- వ్యవసాయమునకగు పెట్టుబడి వ్యయములు. అర్హతగల భూమియనిన- నేయే పంటల కేయేభూములర్హములో యట్టి భూము లందా వ్యవసాయములే చేయవలయును. లేకున్న నాకృషియు, సేద్యమును నిష్ప్రయోజనములుగ నై నష్టమార్థికముగఁ గల్గెడిని. అర్గనై జేషననిన- దుబారావ్యయములు రానీక, అవసరమగు కార్యములను మాననీక, ఎరువులు, నీరు, కలుపు తీత మొదలగుపనులు సకాలములందుఁ జక్కఁగ జరగుచుండునటులఁ జేసికొను నేర్పాటులు. అవి యన్నియు సరియగురీతినిఁ దప్పక జరగుచున్నవో లేదో యని పరిశీలించుకొనుచుండు తనిఖీ. పంట లను భద్రపఱచు తావులు, ధర లనుకూలింపఁ జూచుకొని చేయువిక్రయాదులు నైయుండును.

ఇంకఁ గడదియగు Efficient Labour- స్వతస్సిద్ధమగు పరిస్థితు లనుకూలించునే గాని, కుదురుట యసంభవము. ఫారమునందు పని చేయు పనివాండ్రు నేర్పరులుగాకుండిన దుబారా సిద్ధమగుచునేయుండును. అతరి వారికిం బని నేర్పుట యసంభవము. చేతగాని వాండ్రచేఁ బనింజేయించుటయన దీనికింకను లోపని వ్రాయుట కన్న చేయుపనియుండును.

ఈసందర్భమున వేఱొకసంగతియుఁ గూడ వివరింపఁదగినది కలదు. ఐరోపాసీమలం దుదక స్వాస్థ్యమునకంత ప్రాముఖ్యత యొసంగఁబడలేదు. ఏలనన నవి శీతలప్రదేశములగుటఁ గొంతవఱ కుదకముయొక్క ప్రాముఖ్యతను ఎండలాక్రమించి యుండు నాదేశమున వ్యవసాయపుఁ బరిస్థితులం గన్నులారఁ జూచినవారలకుం దెలియగలవు. భరతదేశమం దట్లుగాక, వ్యవసాయక్రియ కుదక స్వాస్థ్య మెక్కుడవప్రాముఖ్యత నీయఁదగినది. కాన నాయాచోటుల పరిస్థితులకు వీలగురీతిని పంటలకుందగిన నీటివసతు లేర్పాటుచేసికొనఁ దగును. కేవలము వీలుగానితావులందు, ఆతావుల కనుకూలములగుపంటలనే ప్రయత్నింపవలయును.

వ్యవసాయ సస్యములు- ఆంగ్ల వ్యవసాయ శాస్త్రవిశారదులచేఁ ద్రివిధభేదములు గలవిగ విభజింపఁబడియున్నవి. ఉదకపరిస్థితు లనుకూ లించుతావులందు ధాన్యము, చెఱకు, మొదలగు బల్లపువ్యవసాయములును, ఉదకస్వాస్థ్యములేని తావులందుఁ బ్రత్తి, పొగాకు, పెసలు, కందులు, మినుములు మొదలగు కాయధాన్యములు, జొన్నలు, రాగులు మొదలగు మెట్టపంటలును, కొంతదనుక నుదకస్వాస్థ్యముండి పల్లపుపంటలకు నీరుచాలని తావులందు అనఁటి, బంగాళాదుంప, గోధుమ, మొక్క (మక్కా) జొన్న, కూర గాయలు మొదలగు (Garden Cultivation) నవి అర్హవ్యవసాయములని చెప్పఁబడినవి. భూములను రేగటిభూములనియు, బంకమట్టి భూములనియు, ఇసుకకొండిభూములనియు త్రివిధ ములుగఁ జెప్పఁబడినవి. ఇంక వీని మిశ్రమములం గల్గిన భూములుకూడ ననేకరకములుగఁ జెప్పఁ బడి యనేకపంటలకు వేర్వేఱులక్షణములు గల భూములర్హములని వివరింపఁబడినవి. ఇవి నల్ల రేవడిభూములు, బంకమట్టి, ఇసుకలను సమ భాగములుగఁ గల్గిన భూములను Loamy Lands అనియు, చవిటిభూములను Alkaline Lands (Saline Lands) అనియు, సున్నపు లేక సుద్దను తనయందుగల భూములను Marly Soils అనియు Calcarious Soils అనియు, ఇనుముతోఁ గలసిన భూములను Ferringuous Soils అనియు, కంకరభూము లను Gravelly Soils అనియు, ఆకులు మొదలగు జీర్ణపదార్థములు (Decomposed organic matters) కల భూములకు Peaty Soils (Humus)అనియు, ఒండుమట్టి నేలలను Silt Deposited or Alluvial Soils అనియు

నీరింకని గట్టిభూములను Impervious Soils అనియు, నీరుపీల్చుకొను గుల్లనేలలకు Pervious Soils అను నిట్టిసాంకేతికనామములుండి వాని కను కూలించు వ్యవసాయములను వివరించియున్నారు. దీనికి Physical లేక Machanical analysis అనియెదరు.

ఇంక భూములం దడఁగియున్న Nitrogenous salts, Phosphatic salts, Potassium salts ననుసరించి ఆయా ప్రదేశముల భూముల కాయాసంబంధనామములే సాంకేతికము లయ్యెను. వీనిలోని వస్తువుల ననుసరించు నర్హమగు వ్యవసాయములు సస్యములు కూడ వివరింపఁ బడి నవి. దీనికి Chemical analysis అనియెదరు.

ఇంక వ్యవసాయభాగములను (Allied subjects) గూర్చి ఇంచుక వివరించుట సమంజసము.

— Botany-ఇది వృక్షములయొక్క అంకురము, జీవచరిత్ర, దేహపరిస్థితులు, పెరుగువిధానము, మృతులం గూర్చి తెల్పు కళ. ఇందు అనేక జాతులు కలవు.

Mycology - ఇది వృక్షముల తెగుళ్లం గూర్చి, అనగా ఫంగస్సు, కాటుక తెగుళ్లు, మొద లగు రోగములం గూర్చిన కళ.

Zoology - జంతువుల గూర్చిన శాస్త్రము. ఇందు వేర్వేఱు జాతుల జంతువుల పుట్టుకలు, పెరుగుటలు, జీవచరిత్రలు, శరీర నిర్మాణ విధానములు, రోగములు, చావులంగూర్చి వివరించు శాస్త్రము.

Entamology- క్రిమికీటకాదుల వృద్ధి, బ్రతుకు విధానములు, నశించు మార్గములు, తినుయాహారములు, మొదలగువానిని వివరించు శాస్త్రము. ఇది Zoology లోని యొక భాగ ముగ నెన్నబడుచున్న కళ.

Veternary- మనుష్యులుగాక తక్కిన సర్వజీవజంతువులకుంగల్గు రోగముల వైద్య విధానము.

Soil Chemistry- ఇది భూరసాయన శాస్త్రము. భూమియందు మిళితమైయున్న లవణముల పరిశీలన కళ. ఇది ముఖ్యముగ ఎరువు లతో సంబంధముకలది.

Agricultural physics- ఇది భౌతిక శాస్త్రము. భూమియొక్క భౌతికసంబంధముతో భూమియందు చేయఁబడు వ్యవసాయములకుం గల్గు లాభనష్టములను భౌతిక సంబంధముల నెట్లుప యోగించు నటులఁ జేయనగునో వానిందెల్పు కళ.

Geology- భూమియందున్న ఖనిజపదార్థ ములు, రాళ్లు, వానిజాతులు ఉపరిభాగసంబంధ మున్నంత వరకుంగల వస్తువులంగూర్చిన కళ.

Civil Engineering- కాలవలు, నీటి పారుదలలు, వ్యవసాయ గృహానిర్మాణములు మొదలగు వానిందెల్పు కళ.

Mechanical Engineering ట్రాక్టరులు, ఇనుపనాగళ్లు, నీళ్లపంపులు మొదలగు వానికి Engine లను నడపుటకు వలయు విజ్ఞానముందెలుపు కళ.

Bacteriology- భూమియందే యుండు Bacteria (Micro organism) ను గూర్చి తెలుపు కళ.

**ఎగ్రిప్పా (అగ్రిప్పా)** — Agrippa. లాటినుపేరు. Born with the feet foremost అని యర్థము. పురుషనామము. రోమనుల యందీ పేరెక్కువ ప్రచారమునం దున్నది. (క్రైస్తవనామములు చూడుఁడు.)

**ఎటన్పాఠశాల** (Eton School) — ఇది యొక సుప్రసిద్ధాంగ్ల పాఠశాల. లండను నగరమునకుఁ గతిపయదూరమున థేమ్సునది

తీరమునందు ఎటన్ కడనున్నది. ఇందలి విద్యార్థులలో పెక్కండ్రు గొప్పవారగుట దీనిప్రసిద్ధి అధికమయ్యెను. దీనిని ఆంగ్లదేశపు భూపాలుండగు ఆరవ హెన్రీ స్థాపించెను. మరియు నాతండే కేంబ్రిడ్జి పురమున King's College కూడ స్థాపించెనట. ఈ భూపాలుండు చెరయందుంచబడి గతించినవాఁడట.

**ఎటర్నీ** (అటర్నీ పవర్) — వాణిజ్య సంబంధ పరిభాషాపదము. అటర్నీ చూడుఁడు.

**ఎటాచిమెంటు లేక జప్తు** — వాణిజ్య సంబంధ పరిభాషా పదము. జప్తు (Attachment) ఒకనియాస్తి యాదాయములను వేఱొకరి బాకీతీర్మానార్థ మాంక్షచేసి స్వాధీనము తప్పించి నిల్వయుంచుట.

**ఎటావాజిల్లా** — ఎటావాపురము ప్రధానస్థానము. (ఆగ్రా ప్రోవిన్సు చూడుఁడు).

**ఎటావిజం** (Atavism) — ఇప్పటి కాలపు జంతువులు, మనుష్యులు మొదలగు వానిస్థితి పద్ధతులను తొల్లింటి స్థితితోఁబోల్చి, కలభేదముల నెఱుంగు పరిజ్ఞాన కళ.

**ఎటిమోలజీ** (Etymology) — అక్షరములను కూర్చి శబ్దములు (మాటలు) గ నొనర్చుటకు వలయు లక్షణము. వాని అర్థభేదములు విచారించు కళ.

**ఎటియోలజీ** (Aetiology) — శరీరములకు సంభవించు వ్యాధుల మూలకారణములను దెలుపుశాస్త్రము.

**ఎటువంటి భక్తికటువంటి ప్రత్యక్షమే ఫలము** — ఆంధ్రలోకోక్తి.

**ఎటెస్టేషన్** — వాణిజ్యసంబంధ పరిభాషాపదము. Attestation- తన యెదుట నొక (దస్తావేజు) కాగితమునందు వ్రాసినవారు సంతకముచేసినట్లు ఒకసాక్షి తానందువ్రాసి సంతకముచేయుట.

**ఎట్మోస్ఫియర్** — మహావాయువాతావరణము చూడుఁడు.

**ఎట్మోస్ఫియరిక్ ఇంటరు ఫియరెన్సు** — రేడియోవైర్లెస్ చూడుఁడు.

**ఎట్మోస్ఫియరిక్ రిఫ్రాక్షన్సు** (Atmospheric Refractions) — వాతావరణవక్రతలు చూడుఁడు.

**ఎట్రోఫీ** (Atrophy) **జనరల్**- బయాలోజీ (Biology) విధానమున నొక జంతువుయొక్కగాని, ఒక వృక్షముయొక్కగాని, జీవితమునఁ గొంతకాలమునకది తగ్గిపోవుట లేక ఫలము తగ్గుట సంభవించును. దానింగూర్చిన విజ్ఞానశాస్త్రమునకు ఎట్రోఫీ యనిపేరు ఇది జనరల్ ఎట్రోఫీ యనియు, లోకల్ ఎట్రోఫీ యనియు ద్వివిధము. ఆహారలోపముగాని, రోగముగాని జనరల్ ఎట్రోఫీ యనఁబడును. శరీరభాగములలో కొన్నిగాని, ఒకటిగాని అట్లగుట లోకల్ ఎట్రోఫీ యనఁబడును.

**ఎట్రోఫీ లోకల్** (Atrophy) — శరీరముగాని, మనస్సుగాని కాలవశమునఁ గొన్నాళ్లకుఁ బటిమచెడి, పాటికిచెడిపోవును. దానింగూర్చిన కళ.

**ఎడారి (డెజర్టు)** — Desert. నిరుపయోగమై, చెట్లు చేమలు లేక వదిలివేయఁబడిన (నిరాకరించబడిన) భూమికి ఎడారి (Desert) అని పేరు. ప్రపంచమందలి షహారా మొదలగు గొప్పగొప్ప ఎడారులన్నియు నిసుకమయములుగనుండుట సామాన్యమె. ఇవినిర్జల ప్రదేశములు. ఎడారులందచ్చటచ్చట నీటివసతిగల ప్రదేశములుండును. వానిని ఒయాసిస్సు లని యందురు.

ఈప్రదేశములందు ఖర్జూరపుచెట్లను పెంచుదురు. (Land portions చూడుడు.)

**ఎడిటోరియల్పాలిసీ** — పత్రికా విద్యాభ్యాసము చూడుడు.

**ఎడీమోనిజం** (Eudemonism) - యూడిమోనిజమ్ చూడుడు.

**ఎడెన్ (Eden) తోట** — బైబిలు మొదటి గ్రంథమున Yahweh Elohim ఒక తోటను నాటెననియు నది పాలస్తీనాదేశమునకుఁ దూర్పునియు నందురు. అంచు స్వర్గమనియర్థము కలదట. అందే ఆదాముహవ్వలు వసించి సంతానముం గనిరట. ఇప్పుడు దానిని ఎరిడు అనఁబడు తావున బాబిలోనియా దేవతయగు ఇయాయొక్క పవిత్రోద్యానవనముగ పోల్చుచున్నారు. దానిం దడపుచుండినది పరిశియన్ గల్ఫు అనియు, దాని నాల్గుశాఖలు టైగ్రిస్‌నది, యూఫ్రటీసునది, ఖోస్పీస్, పల్లకోపాస్ అని తలంచుచున్నారు.

**ఎడెస్సాదేశము** — అల్జీరా దేశము చూడుఁడు.

**ఎడ్జూడికేషన్ ఆర్డరు** — (వాణిజ్య పరిభాషాపదము). Adjudication Order. ఒకఆసామీ దివాలా అయినట్లు ప్రకటించుచు నతని ఆస్తిని అప్పుల తీర్మానమునిమిత్త మొక ట్రస్టీకి స్వాధీనపర్చునట్లు న్యాయస్థానమువారి ఉత్తరవు.

**ఎడ్మిరల్** (Admiral) — అరబ్బీభాషా పదమగు అమీర్-అల్-బహర్ పదమునుండి గల్గిన పదము. సముద్రమున ఆజ్ఞనిచ్చువాఁడని యర్థము. నావికోద్యోగులలో నున్నతోద్యోగి. మఱియు నీయుద్యోగిని ఫ్లాగ్ ఆఫీసరు (Flag Officer) అనియు ననుటకలదు.

**ఎడ్రసోగ్రాఫీ** (Addressography) - పేరులను, పైవిలాసము (Address) ను ముద్రించుటకుగాని, రబ్బరు రేకులపైనిన్ని, కొన్ని లోహములరేకులపైనిన్ని వానిం జెక్కి చిత్రింప సిద్ధపఱచిన రేకులను (Plates) ఎడ్రసోగ్రాఫీ అనియెదరు. వానిని పనిముట్లతో (పరస్థలముఖం దీసివైసి) చెక్కుటగాని, Nitric Acid పోసి పరస్థలములం గొంతవఱకుఁ గొరికించివైచిగాని రచింతురు. ఈ విద్యకు, అనఁగా రచించు విధానమునకు Addressography అనిపేరు.

**ఎడ్వర్టైజుమెంటు విద్య** — ఇది ఆంగ్లదేశపు కళయని చెప్పఁదగును. పిదప ప్రాత్యాశ్చ దేశములం దలుముకొని భరతదేశమునకు వ్యాపించినది. దీనికిం దొల్లింటి కాలము మొదలు క్రీ. పె. ౧౬౩౦ వఱకు ఎడ్వర్టైజుమెంటు శబ్దమునకర్థము. జాగ్రతంచెల్పుటయని యుండి పిదప ప్రకటనయనెడు వర్తమానార్థమునకు దారితీసినట్లు కనఁబడుచున్నది. ఇంక నచిరకాలముననే ప్రోత్సహించుట లేక ఉద్బోధించుట ఆకర్షించుటల కర్థముగ మారునని తోపక పోదు. పాశ్చాత్యసీమలందాదిని గురుతులు బొమ్మలుగా తా మమ్ము వస్తువులం దెలుపుట కెడ్వర్టైజుమెంటని గ్రహించుచుండిరట. ఆపిని రెయిల్వేబండ్లు పోవునట్టియు చేరునట్టియు కాలములను బహిరంగపరచుట, అందుకు నిర్ణీతమూల్యములం దెల్పుట మొదలగు ప్రకటన పత్రములు, కరపత్రములు, ఎడ్వర్టైజుమెంటులోనివిగనే యుండెను. చాటించుటయు, దండోరామూలమున వెల్లడించుటయు ఎడ్వర్టైజుమెంటులోనివిగనే యుండెను. కాలములుమారి నేటికి క్రొత్తమార్పునందినది. అమ్ము వస్తువుల గుణముల నతిశయించి చెల్పుటయు, వాని యుపయోగములను వివరించుటయు, కొనువారిమనస్సుల నీవస్తువులంగూర్చివివరించు మాటలచే నాకర్షింపఁ జేయునటుల నేర్పరులగు ఆరిందాలు, దీనిని వెల్లడించు చతురత నొక కళగా

(విద్యగా) వాడుకకుఁ దెచ్చిరి. వెనుకటి కాలపు వర్తకమునకు ఇప్పటికాలపు వర్తకము నకు విధానమొక్కటియె యైయున్నను, ఒకరిపై నొక్కరు పోటీలంగల్గిన ఇక్కాలమున నేర్పరితన మవసరమగుట ఎడ్వరుటైజుమెంట్ల యందిక్కా లపు చతురత, వాగ్గంభీరము, నేర్పు అత్యావశ్య కములై మార్గము లనేకములుగ నేర్పడి ఇదియొక విద్యగా నేర్పడి యున్నది.

ఆదికాలమున సంగడులందునను, కరపత్రము లను పంచిపెట్టుటమూలమునను, చేయఁబడుచుం డిన ఎడ్వరుటైజుమెంట్లు ఇక్కాలమున దేశావసర ములగు వార్తాపత్రికలందునను, రెయిల్వేప్లాటు ఫారములపైనను, స్టీమరులు, వీధిట్రాముకారు పైనిన్ని, బండ్లగూడులపైనిన్ని, వీధిగోడలపైని కూడ ఎడ్వరుటైజుపత్రములు యధిష్ఠించియుండుట కాననగును. మార్గస్థుల దృష్టుల నాకర్షించు టకు జక్కనిబొమ్మలు, అందవికారపు వస్తువులు మొదలగు విపరీతదృశ్యముల నమర్చి వానికడ నీఎడ్వరుటైజుమెంట్లంజేర్చుట మనదేశమున సర్వ సాధారణమే. వస్తువుల చౌకధరలం గూర్చియు ప్రాశస్త్యముంగూర్చియు బాలురచేనఱపించుటయు నిక్కాలమున నెడ్వరుటైజుచేయుటయందే చేరి యున్నది. ఎంతదూరమునందున్నను జనసమ్మ ర్దముగల్గు తావులందు ఎడ్వరుటైజుమెంటు సిద్ధమ గుచునేయుండును. ఇక్కాలమున నిది ముఖ్యముగ వార్తాపత్రికల మూలమునను, బహిరంగ ప్రక టనల మూలమునను, పుస్తకములు కరపత్రముల మూలమునను, యోగ్యతాపత్రముల మూలము నను నడచుచున్నది. ఇక్కాలపు ఎడ్వరుటైజు మెంట్లు బహిరంగలేఖలుగనున్నవి. కాని వర్తక సంబంధపు బహిరంగ లేఖలని చెప్పఁదగును. ఒరుల మనంబుల నాకర్షించుచో తమరమ్ము వస్తువుల గుణగణములను నచ్చఁజేయుట ప్రధా నోపయోగమై యున్నది. ఈలక్ష్యమును జయ ప్రదముగ నెరవేర్చుటకు చక్కగా పరిశీలింపఁబడి అనుభవ పూర్వకముగ వాడంబడిన ఎత్తులను, సాధనములను ప్రయోగించుచున్నారు. వర్తక వ్యాపార రహస్యలక్షణములను బాగుగ నెఱిఁగిన వారి ఎడ్వరుటైజుమెంట్లు రచించుటయం దగ్రస్థా నము నాక్రమించెదరు.

అర్థమగుభాష, వ్రాతయందలి మెళుకువలు, క్లుప్తముగాఁ జనువందగియుండుట, పదగుంభన, వివరణ చాతుర్యము, మర్యాదం గల్గియుండుట, అనుమానము, సంశయము, కల్గకుండునటుల జాగ్రతంగొనుట, ఆకర్షణ మార్గములు, అమ్మక మునకు సుళువగు తావులందు ప్రాతినిధ్యపు యేర్పా టులు, నమ్మకము ఇవి యిక్కాలమున ఎడ్వరు టైజుమెంటునం దవసరములుగఁ గమనింపఁదగి యున్నవి.

**ఎడ్వాన్సు బిల్ ఆఫ్ గుడ్సు** — (వాణిజ్యపరిభాషాపదము) Adventure Bill of Goods. ఒకరికిగాను సరకులను తనపేర రవాణా చేయవలసివచ్చుతరి నట్లుచేయుచో నాసరకులు తనవికావనియు, ఫలానావారివనియు, అవి తెచ్చెడి లాభముగాని, నష్టముగాని వారివేకాని తనకునిమిత్తము లేకుండ, ఒక్కవాని విలువకే తాను బాధ్యతహక్కులం గల్గియున్నాడనియు, ఓడ అధికార్లకు వ్రాసియిచ్చుపత్రము.

**ఎడ్వైస్** — (వాణిజ్యపరిభాషాపదము)- Advice. ఇచట నీశబ్దార్థము భోగట్టాయిచ్చుట యని యగును. Advice Despatch of Goods అన సరకులు రవాణాచేయఁబడినటుల భోగట్టా యిచ్చుట. Advice Despatch of Bill of Exchange అన హుండీని అమ్మినటుల భోగట్టాయిచ్చుట, ఏపనినైన చేసినతోడనే ఆపని చేయబడినట్లు భోగట్టావ్రాయుట వర్తక

వ్యాపారమున చాల ముఖ్యకార్యము. ఇది జరగనియెడల చాలనష్టకష్టములు సంభవించెడిని.

**ఎత్తైన పర్వత శిఖరములు** — ప్రపంచమందలి పర్వతశిఖరములఎత్తు చూడుడు.

**ఎత్నోగ్రాఫీ** (Ethnography) — వివిధజాతుల మనుష్యులు, వారి లక్షణములు, అభ్యాసములంగూర్చిన కళ.

**ఎత్నోలోజీ** (Ethnology) — ఈ పాశ్చాత్యవిజ్ఞానకళ మనుష్యులందలి తెగలం గూర్చి తెల్పునది. ఫ్రెంచిభాషా పదమగు Ethnographie యనుపదమునుండి జనించినది. సృష్ట్యాదిని మనుష్యులు పురుషజాతి స్త్రీజాతిగ నేర్పర్చి పరమేశ్వరుడు వారి సంగమమువలన సంతానాభివృద్ధి నేర్పఱచి మనుష్యులను ప్రపంచ మున స్థిరనివాసులుగ నేర్పఱిచెను. ఇది దైవికము.

ఇటుల నాదియందేగలిగిన స్త్రీపురుషులు ఆది యందే వేర్వేఱు భేదములతో సృజింపఁబడిరని కొందఱును, పిదప దేశభేదములు వేర్వేఱు శీతోష్ణస్థితులు, జీవనదుర్భరత్వములు మొదలగు వారి పరిస్థితులనుండి భేదాకారములు, గుణలక్షణములు కల్గియుండునని కొందఱు నభిప్రాయభేద ములం గల్గియున్నారు.

ఎట్లైనను పరిశీలనలవలన భేదములుగల తెగ లలో నుండి యన్యోన్య స్త్రీపురుష సంగమములు సంతానము అభివృద్ధిగను, బలకరముగను కొన సాగుచుండునని తేలుచుంట ఒకే తెగనుండి (అనగా భేదములేని) వివాహ సంబంధములు తగవనియు, అట్టివి బల, గుణ, లక్షణాదులు గల సంతానప్రదములు కావనియు త్వరలో ఆ సంతతి యంతరించుననియు తలంపఁబడుచున్నది.

తెగ ఒకటేమైనను అన్యసంబంధజనిత భేద లక్షణములుగల స్త్రీపురుషసంగమములు సంతాన ఫలప్రదములని కనిపెట్టంబడినది. ఈసందర్భ మున భరతదేశపు యార్యుల సుప్రసిద్ధాచార మగు గోత్రప్రవర సంబంధములేని వివాహసం బంధ నిబంధనయును, మాతులసుతోద్వాహ శ్రేష్ఠతయును, భరతదేశమునందనాదిగ నున్న సదాచారధర్మ మచ్చెరువుఁ గొల్పకపోదు.

ఈ సందర్భముననే మెండాలీజమ్‌సిద్ధాంతముం గూర్చి ఇంచుక వివరించుట సమంజసము. దీనిం గనిపెట్టినవాఁడు Rev. Gregor Mendel. ఈయన ఆస్ట్రియాదేశమున మొరావియా సీమ యందు బ్రూన్ పట్టణమున నబ్బాటు (Abbot) బోధకుఁడై క్రి. శ. ౧౮౨౨-౧౮౮౪ నడుమ జీవించియుండెను. అచటి మోనాస్ట్రీతోటయందు పరిశీలన లొనర్చుచు ఎన్ని మార్పులం గల్గించి ఎన్ని అంట్లు కట్టిచూచినను పొడుగు బఠాణీ జాతినుండి పొడుగుబఠానీజాతియే సంతానము కల్గుచుండునని కనిపెట్టెను. ౧౯౦౦ నుండి సుప్రసిద్ధములై Theory of Descent (సంతాన సిద్ధాంతమనియు, Law of Heridity)యనియు పేరిడంబడియున్నది.

దీనింగూర్చిన తరువాతి పరిశీలనలందు ఈ ధర్మము చెట్లయందేగాక జంతువులందు, మను ష్యులందు కూడ వర్తించునని తేలి, ఆ సిద్ధాంత మునకు Mendel and Suffixism అనిపేరిడి యున్నారు. ఈ సందర్భమున భరతదేశపు ఆర్యులు ఆచరణయందుంచిన "బీజము ప్రధానము గాని క్షేత్రము ప్రధానముగాదు" అనుధర్మము భరతదేశపు పూర్వుల విజ్ఞానముందెలుపకపోదు.

ఇటీవలి పరిశీలకులు శాస్త్రదృష్ట్యాగాకున్నను సదుపాయముకొఱకు మనుష్యులను తెల్లవా రనియు, నల్లవారనియు, పచ్చవారనియు వారి శరీరచ్ఛాయలంబట్టి మూఁడు తెగలుగ భాగించి యున్నారు. వారిలో కొంద ఱీవిభాగమును

Primary division అనియు, మఱికొందఱు ఆదియందే ఇటుల నుండినందున కల్గినవిభాగముగ నెంచుదురు. ఇటుల రంగులనుండి చేసినవిభాగమునకు Japheth Shem Ham Division అని కొందఱు పేరిడిరి. సుప్రసిద్ధ పరిశీలకుండగు Prof. E. G. Conklin మహాశయుఁడు చేసిన పరిశీలనలు, గ్రహించిన సంగతులు చిరస్మరణీయములు. భేదజాతి లక్షణములు, ఆకారములు వీని సంపుటీకరణసంజాత సంతానము, వాని ధర్మములు, గుణభేద వివరణముల నీయనచక్కఁగ బరిశీలించి విమర్శించి తెల్పియున్నాఁడు.

తెల్లజాతి- ఈతెగవారిని Caucasian race అనియు, White race అనియు నందురు. నిడుపైన తిన్నని వెండ్రుకలు, వెనుకకుదగ్గియుండు దవడఎముకలు, సన్నపు పెద్దముక్కులు, చిన్నవియగు పలువరుసలు, విశాలఫాలభాగములు వీరి లక్షణములుగ జెప్పఁబడినవి. ఐరోపాఖండము ఉత్తరదేశముల తెల్లరంగువారు, దక్షిణదేశములందుండు ఇంచుక నల్లరంగువారు, ఆల్ప్సు పర్వత సీమలవారు, మధ్యధరాసముద్ర ప్రాంతవాసులు ఇందు చేరియుందురని చెప్పఁబడినది. వీరి మిశ్రసంతానము లించుక నల్లరంగు గైకొనినను సగటున Scientifical గా తారతమ్యము లెక్కువ లేనివారై యున్నారు. ఇంచుక భేదముతో బ్రిటీషువారి సమీప లక్షణలయుతులగు పారశీకులును, లోకవిదితులును అసాధువులునగు అరబ్బులును, మానవిద్యాభ్యాసముచే నిగూఢాంతఃకరణ యుతులగు చీనావారును ఈతెగకుం జెందినవారేనని తలంపఁబడుచున్నారు.

నల్లతెగవారు- వీరిని Negroids అనియు కూడ నందురు. నల్లరంగులుగల శరీరచ్ఛాయలు, ఉంగరములుతిరుగు తుప్పవెండ్రుకల్లు, వెడలుపుగనుండు చితుకముక్కులు, దళసరి పెదవులు, విశాలనేత్రములు, పెద్దవిగనుండు నోటిపండ్లు, సన్నపు నుదురులుగల పొడవగు శిరస్సులు (Dolicho cephaly) వీరికి లక్షణములని చెప్పఁబడినది. వీరియందు పెక్కుతెగలు కలవు. ఆఫ్రికాఖండపు నీగ్రోజాతులు, దక్షిణాఫ్రికా Bushmen జాతులు, పెక్కులుగనున్న Pigmy తెగలు మెలనీషియన్జాతులు తుప్పతలలులేని ఆస్ట్రేలియా ఖండపు నల్లజాతులు ఈతెగకుం జెందినవారేనని చెప్పఁబడినది.

పచ్చవారు- వీరిని Mongolian races అనియు, Yellow race అనియు నందురు. పసుపుపచ్చని లేక Brown రంగుశరీరచ్ఛాయ, నలుపురంగు తిన్ననివెండ్రుకలు, విశాలముఖములు, చిన్నముక్కులు, విశాలములగుదవడలు, వెడలుపు తక్కువయగు వల్లముగనుండు నేత్రములు, సమపరిమాణముగల పలువరుసలు, పెక్కురకములగు తలలు వీరి లక్షణములుగఁ జెప్పఁబడినది. ఇందు చీనాజాతులు, జపానుదేశపు జాతులు, టిబెట్టుదేశస్థులు, న్యూజీలండు ద్వీపపు మావోరీ జాతులు, Brown Polynesian జాతులు, ఎస్కిమో జాతివారు, Red Indian జాతులు చేరియుందురని చెప్పఁబడినది. ఇకను చీనావా రిందులోనివారు కారనియు, తెల్లజాతి తెగలోనివారనియు తలంచువారు కొందఱుకలరు. కొందఱు శాస్త్రవేత్తలగు పరిశీలకులు ఫిన్లాండు దేశస్థులు, లప్పూజాతి (Lapps)వారు, హంగేరీ దేశపు మాగ్యారులు, టర్కీదేశపు తురుష్కులు నీపచ్చతెగవారే నందురు.

**ఎథిక్సు** (Ethics) - Moral conduct, duty లం గూర్చిన కళ. ఇది మన స్తత్వముపై నాధారపడియుండును. స్థితిగతుల ననుసరించి సన్మార్గ దుర్మార్గముల (Right and wrong, and natural obligations) నెఱుంగు ధర్మముం గూర్చినది.

**ఎథిక్స డిడక్టివ్ లిటరేచర్** (Ethics Deductive Literature)-హితోప దేశము చూడుఁడు.

**ఎథిమెరియిజమ్** (Euhemerism)-గ్రీసు, రోమను దేశములందు దేవతలుగ నెన్నఁబడినవారు. తొల్లింటి యొక కాలమున జీవించి యుండిన మనుష్యులేననియు, వారు రాజులుగ దేశపాలన మొనర్చినవారుగనో లేక జాతీయతాభిమానపూర్ణులగుమహాపరాక్రమశాలురుగనో ఉండియుండినవారుగాని, దేవతలు కారనియు కాలానుగతముగ అట్టినమ్మకము ప్రబలి అటు తలంపఁబడుచున్నారని తలంచునట్టి నమ్మకము.

**ఎథీజమ్** (Atheism) — దేవుఁడు లేడను మతముం గూర్చిన నమ్మకము. ఇది త్రివిధభేదములు కలది. ౧. దేవుఁడు లేడను సిద్ధాంతము. ౨. దేవుఁడు ఉన్నాడనుటకు నిదర్శనములు లేవనలేక దేవుఁడు లేడనుటకు బాధకము లేమియు లేవనుసిద్ధాంతము. 3. దేవుఁడుండుటకు హేతువులగు తత్సంబంధజ్ఞానము అసత్యమనియు, ఉండవీలుకలది కాదనియు సిద్ధాంతము.

**ఎథోలొజీ** (Ethology)-Character. యోగ్యమైన లేక అయోగ్యమైన మనస్సు యొక్క వృత్తినిశ్చలత, అట్టివి యెటులనేర్పాటగునది వీనింగూర్చి విచారించు కళ.

**ఎథ్నోలొజీ** (Ethnology) — మానవుల,మానవజాతుల పూర్వవిధానము. ప్రపంచమునందు వేఱ్ఱేఱుభాగములకు వారెట్లెట్లు చేరినది, శరీరావయవ భేదములు వేఱ్ఱేఱు జాతుల మనుష్యులందెట్లుండునది వివరించు కళ.

**ఎథ్నోసైకాలజీ** (Ethno-psychology) వివిధజాతుల మనుష్యుల మనస్సు లక్షణములు, మనోవృత్తులం గూర్చియు, తలంపుల విధానమునం గూర్చియు తర్కించుశాస్త్రము.

**ఎదుట అనినది మాట, ఎదాన పెట్టినదివాత** — మొఖముచాటున అనిన నిందావాక్యములు విలువలేనివని భావము. ఆంధ్రలోకోక్తి.

**ఎదుగుట** (To Grow) ఎదుగుట ఒకనియొక్క పొడవు (Height)తో సంబంధము కలది. శరీరమందలి ఎముకలందు అవి ఎదుగగల పరిమితి ఏర్పాటుకలదని కనిపెట్టఁబడినది. అనఁగా ఎముకంబట్టి స్కెలిటన్ (Skeleton) పరిమాణము గుణించి చెప్పందగును. స్కెలిటన్ పరిమాణమే ఒకరు ఎదుగగల శరీరపు ఎత్తు అని భావము. బాల్యమున ఎముకలందు గట్టిలేక మెత్తనివై యుండును. అవి రానురాను ఎదుగుటతోపాటు వలముగూడ నగును. గట్టిపడుచునుండును. ఇట్లగుచుండుట ఇరువదియొకటవ సంవత్సరము ముగియువఱకు సరియనియు, పూర్తియగుననియు కనిపెట్టఁబడినది. పిదప శరీరము వలమైననగుంగాని పొడవుఎదుగుట సంభవింపదు. అరుదుగ నొక్కొక్కనియందేదో యొక రోగముండి యీపరిమితిందాటి ఇంకను ఎదుగుట సంభవించునని శరీరశాస్త్ర పరిశోధకులు ఇంకను తలంచుచున్నారు. ఇంకను పోలిక యనునది కొంతవఱకెదుగుటతో సంబంధముకలది. తల్లిదండ్రుల పోలికవలెగాక ఒకప్పుడెప్పుడో చనిపోయి జ్ఞాపకమేయుండని పూర్వుల పోలికలలో కొన్నిటింగల్గి కొందఱుందురు. ఈ పోలిక తల్లిదండ్రుల సోదరులంబోలి కొన్నియుండును. ఇవి ఒకవిధముగ నిర్ధారణగల్గియుండవు. కాని పోలికమాత్రము కొంతవఱకు తప్పదనియే కానగును. సోదరులలో కొందఱు పొట్టిగను, కొందఱు పొడుగుగనుకూడ నుండుట నిదర్శనమే.

**ఎదుటివారిపొయ్యిమండుటచూచి తనపొయ్యిలో నీళ్లు పోసుకున్నట్లు** ఓర్వలేనితనమునకు చెప్పు సామెత. లోకోక్తి.

**ఎద్దీనినదంటే దూడనుకట్టివేయు మన్నారట** — ఇద్దరు తెలివిలేనివారని భావము. ఆంధ్రలోకోక్తి.

**ఎద్దు ఎండకులాగితే ఎనుపోతు నీడకులాగుతుంది** — ఆంధ్రలోకోక్తి.

**ఎద్దు కటుకులరుచి యేమి తెలుసును?** — ఆంధ్రలోకోక్తి.

**ఎద్దు తన్ననని గుఱ్ఱము కాళ్ల వెనుకదాగినట్లు** — గుఱ్ఱపుతాపు ఎద్దు తాపుకన్న చాలా అపాయము. ఆంధ్రలోకోక్తి.

**ఎద్దును అడిగి గంతగట్టుదురా?** - గంత అనఁగా తెలుఁగులగానుగకు ఎద్దు వూయఁ బడుతరి ఒడలు తిరుగకుండ కండకుఁగట్టు అడ్డు. ఆంధ్రలోకో

**ఎద్దునాల్కచెట్టు** - లా. Cacalia kleinia. ఆంగ్ల. Elephant scaber. సం. గోజిహ్వా, దర్వికా, వాతోహా అనిపేర్లుకలవు. మఱికొందఱు దీనిని గేదెనాలుకచెట్టనియు ననుట కలదు. గబ్బువాసనగల్గియుండును. దీని ఆకు గుండెదడ నడఁచును. వాతములు, మేహావాత ముల నడంచును. కుష్ఠురోగమును నివారించు నని చెప్పఁబడినది. దీని కషాయము గాని చూర్ణముగాని ఎక్కువపనిచేయునందురు. ఆకుల రసమును పనిచేయును.

దీని హిందీ లేక ఉరుదుపేరు యిజ్బాన్ లేక గాజుబాన్. శరీరేంద్రియములకన్నిటికిఁ బలము గల్గించును. ఊపిరిగొట్టునొప్పి నడఁచును. అశ్మరీరోగమడంచును. దీనిని కషాయముగగూడ వాడుదురు.దీనికి శ్రీగంధమువిరుగుడనిచెప్పఁబడినది

**ఎద్దుపుండు కాకికి నొప్పియా?** - ఒకరిబాధ వేఱొకరిని బాధింపదని భావము. ఆంధ్రలోకోక్తి.

**ఎద్దువలెతిని మొద్దువలె నిద్రించుట** — ఆంధ్రలోకోక్తి.

**ఎనాటమీ** (Anatomy) — ఫ్రెంచి మాటయగు Anatomie నుండి కల్గిన పదము. మానవశరీరములగాని, జంతుశరీరములంగాని బరి శీలించి, అందలి వివరములనువేర్వేఱుగ నెఱుంగ జేయు కళ. ఎముకలు, నరములు, కీలులు, మొదలగు, శరీరభాగము లేయేపనులం జేయ నేర్పడినవో యెఱుంగఁజేయు శాస్త్రము. ఇందు రోగములవలన శరీరమునంగలుగు మార్పులం గూర్చిదెల్పు భాగము Morbid Anatomy అను పేరంబరగెడిని. ఇంకను మానవ శరీర మందలి భాగముల నితరజంతుశరీరభాగములతో పోల్చి పరిశీలించుచు కళభేదముల నెఱుంగజేయు భాగమునకు Comparative Anatomy అనియుం బేరుగలదు. తొలుదొలుత అరబ్బీ గ్రీకు, రోమను దేశస్థు లీశాస్త్రము నెఱింగి వివ రించినవారుగాన, నేఁటికిని ఈ శాస్త్రమందరబ్బీ గ్రీకు, రోమనుభాషాపదము లెక్కువగఁ గాన నయ్యెడిని.

**ఎనార్కిజమ్** Anarchism) — దేశమునందొక ప్రభుత్వము బలముగనుండెనేని తమతమ స్వేచ్ఛావృత్తిని ఇతరుల బాధించి కసి దీర్చుకొనుట, ధనాశ, అధికారత్వపు కోర్కెలు మొదలగునవి తీర్చుకొనవీలుండదు. కాన ప్రభుత్వముం గూలదోసి న్యాయబద్ధ మగు నిర్బంధమును తొలగించుటకు ప్రయ త్నించి సాగించుకొనగల్గుట Anarchism అనెదరు. దీని కరాజకమని బేరుకలదు. దాని మార్గమును వివరించుకళ. ఇందు తిరుగుబాటు, అపాయములు ప్రధానములు. దీని గ్రంథము లున్నట్టుగానరావు గాని అప్పటప్పట పలుదేశ ముల నరాజకత్వము గాననయ్యెడిని.

**ఎనాలొజీ** (Analogy) — రెండు (వేఱ్వేఱు) వస్తువులందుగల సమానధర్మ లక్షణములను వివరించు విద్యంగూర్చిన కళ. అనగా నొకేగుణములు అన్నిగాని, కొన్నిగాని రెండు వస్తువులయందుండుట నెఱుంగు నేర్పును గూర్చి దెల్పు శాస్త్రము.

**ఎన్‌స్టైన్ సిద్ధాంతము** — దీనిని Einstein Theory యనియు, Theory of Relativity అనియు నందురు. Albert Einstein విజ్ఞాని జర్మనుదేశస్థుడు; ఆదేశమునందే క్రీ. వె. ౧౮౭౮ లో జన్మించినవాఁడు. తన పదునెన్మిదవ సంవత్సరమునుండియు ఈపరిశీలనలను మొదలిడి తన ప్రథమ గ్రంథముగు Special Theory of Relativity అను గ్రంథమును ప్రకటించెను.

ఐనను ఈమహానీయుని సిద్ధాంతమునకుఁదగిన గ్రంథములు చాలవు. అంతకుమున్నే యున్న న్యూటన్సిద్ధాంతమును యూక్లిడ్ పండిత విరచిత జ్యామెట్రీ శాస్త్రమును ఎఱుంగని వారికిది కొంత చీకాకుగ నుండకపోదు. (న్యూటన్సిద్ధాంతము, జియోమిట్రీ శాస్త్రము చూడుఁడు).

ఇది న్యూటన్సిద్ధాంతము నెదుర్చునది. న్యూటను జయోమిట్రీ శాస్త్రమును తన సిద్ధాంతము కవసరమగునంతవఱకు గౌరవించెను. ఎన్‌స్టైను పండితుడట్లొనర్చలేదు. ఇంకను యూక్లిడు పండితుని Straight lines తన సిద్ధాంతమునగాని, న్యూటను సిద్ధాంతమునగాని వర్తింప జేయుట యసంభవమనెను. ఇది జామిట్రీ నెదుర్కుటయె యని పెక్కండ్రు పొరబడి యనెదరుగాని అది సరిగాదు. దానినీతఁడు గైకొనలేదనుటయే సమంజసము.

Relativity యన వీడరాని యన్యోన్య సంబంధముండుటం దెల్పును. ఇందు న్యూటన్సిద్ధాంతమునందువలెనే వస్తువు (Matter), కాలము (Time), దూరము (Space or Distance) అని త్రిపదార్థములుచెప్పంబడినవి. ఇందు కాలము దూరము ననునవి వస్తువునకు స్వాభావ్యములగు స్వధర్మములై దానిని వీడక యుండునవే కాని ప్రత్యేకములైనవికావని చెప్పంబడినది. ఉభయ సిద్ధాంతములందు మూడుపదార్థముల యైక్యతయె నైసర్గికముగ నున్నదనియు శాస్త్రిదృష్ట్యా మూడుగ పరిశీలనలకొరకు విడదీయంబడినవే గాని వేఱ్వేఱుగాదనియు చెప్పంబడినది. ఈయన్యోన్య సంబంధము అన్యోన్యాధారమని తేలుచున్నది. దీనికె Relativity యని పేరు.

కదలికయు (Motion) దిక్కును(Direction) వీడని సంబంధము కలవనియు, కదలికయంతయు రిలేటివ్ అనియు కదలిక కాస్పదమగు దూరమును కదలికయు తావునందే యుండునవి గాన, నామూడును రిలేటివ్ అనియు దూరము నెఱుగుటకు కొలకఱ్ఱలు, కొలగొలుసులు మొదలగునవి సాధనములనియు ఈ సిద్ధాంతమునందు చెప్పంబడినది.

కాలము ఒకకార్యమునందగు పరిమితియనియు దీని ఘటికాయంత్రములు, గడియారములు, ఇతరములగు నానవాళ్ల సహాయముచే నెఱుంగుచున్నాము. కాలము, దూరము అన్యోన్య సంబంధములు గలవిగాన స్వతంత్రస్థితికలవి కానేరవు, ఇవి దీనింగమనించువారి స్థితిగతులుతారతమ్యము. నుండి హెచ్చు తక్కువలుగ బయల్పడుచుండునని చెప్పంబడినది.

ఇంక కాలమును, దూరమును దేనియొక్క స్వత్వములై లక్షణములుగ దనరుచుండునో అట్టి వస్తువు ( Matter) దాని పరిమాణముం బట్టి తెలియందగినది. ఆ పరిమాణము చూచువారి స్థితి ననుసరించి బయల్పడుచుండును. అనగా నది

దగ్గరనుండి చూచువారికి పెద్దదిగను, దూరము నుండి చూచువారికి కొంతచిన్నదిగను గాన వచ్చును. కేవలము ఎక్కువదూరము నుండియు చ్వాటుననుండియు చూచిన బయల్పడక యుండుట మొదలగున వని భావము.

వస్తువులయొక్క పరిమాణమన దానిపొడవు, వెడలుపు, ఎత్తు నైయున్నవి. ఈవస్తువుయొక్క పరిమాణముల నుండియే అది తెలియంబడు చుండుటగా చెప్పంబడినది. ఇంకను వస్తువు ఆక్ర మించగల ప్రదేశము, దానిగమన, వేగపు పరిమితిం బట్టి యుండునని చెప్పంబడినది. ఆ పరిమితి కాంగ్లమున Velocity యని పేరు. ఈవెలోసిటీ నెఱుఁగుట కనిపెట్టుచుండువారి స్థితి ననుసరించి యుండునను రహస్యధర్మమును ఎనిస్టైను పరిశీల కుఁడు తాఁగన్గొంటిననినుడివియున్నాఁడు. మఱియు నామహానీయుఁడు వస్తువు, కాలము, దూరము నను మూడుపదార్థముల యన్యోన్య సంబంధము వీడజాలదనియును దానికే Relativity యని పేరనియు దెల్పియున్నాఁడు.

ఈసిద్ధాంతమున వస్తువు గమనించుటయన త్రిప దార్థములుకూడ నున్నతావునుండి స్థలమును మార్చుటయేననియు, మఱియు నీమార్పు కాలము పైనను, దూరముపైనను జరుగు మార్పేయని నిర్వచింపంబడినది. న్యూటన్సిద్ధాంతమున వివరింపంబడిన గ్రావిటేషన్ ఒకశక్తి (Force) అనియు చెట్టునుండి పండు నేలంబడుటకుఁ గారణము భూమి దాని నాకర్షించుటయే యనియు (Attractive force) చెప్పంబడిన దాని నెను ర్చుచు ఇనిస్టైన్ను సిద్ధాంతము గ్రావిటేషనని చెప్పఁ బడినది శక్తి కాదనియు, అది స్వధర్మమే [illegible] స్వామ్యమనియు పండు నేలంబడుట భూ[illegible] యొక్క ఆకర్షణవలనఁ గాదనియు, వస్తువు కదలిక కొఱకు దూరము (అనగా ప్రదేశము) వంగియె యుండుననియు ఆవంగియుండుట దాని స్వతస్సిద్ధ ధర్మమనియు వస్తువుయొక్క సన్నిధి జగత్తునందు కాల దూరముల (తావు) పైగల్గు వంపేననియు ఈవంపు Concave glass యొక్క వెలుపలి భాగపు వంపువలెనుండుట Straight line కాద నియు, వెలుతురుకూడ దూరమునుండి మనకడ కేతెంచుటయందిటులనే వంగి కదలుచు వచ్చు ననియు, చూచువారికి వంకరలేనటుల గన్పించు ప్రతి కదలిక (Motion) కూడ నిటులనే వంపుగ నుండుననియు ఇది కాలము, దూరము, వస్తువుల కూడికకుంగల్గు స్థలము మార్పే గమనమనియు చెప్పంబడినది. కాని ఇందీవంపు గల్గుటకు కారణము చక్కగ వివరింపంబడలేదు.

భూమి సూర్యునింజుట్టితిరుగుతరి Elliptical మార్గమున (అనఁగా Oval) గమనించుచుంట ఒక Force వలన ఆకర్షింపంబడికాదనియు, పెద్దవస్తువు (Matter) అగు సూర్యుని వలన నటుల నడచునటుల కలతపర్చఁబడి(Disturbed) యామార్గముగ నటుల గమనించుచుండుననియు, ఇందే యాకర్షణశక్తియు, నిటుల నడపుచుండ లేదనియు నీసిద్ధాంతమతము. మఱియు నెంత వస్తువు (Matter) ఉండునో అంతకుం దగిన వంపు గల్గుచుండునని చెప్పంబడినది.

ఈసిద్ధాంతమున శాస్త్రదృష్ట్యా దూరమునకు వస్తువుయొక్క పరిమాణపుకొలతకు వ్యత్యాసము లేదనియు, ఇవి దూరమునందలి కొలతలే యనియు చెప్పఁబడినది. ముందు, వెనుక, ఎగువ, దిగువ, ఈవైపు, ఆవైపు, ఎత్తు (క్రింద) నవంబడు నవి. దూరముయొక్క కాలములతో కూడిన భేదములేననియు, రెండువస్తువు లొకటికొకటి దూరముగను, దగ్గఱగనుండుట కాలదూరముల నిరూపణమేననియు చెప్పంబడినది.

సూర్యగ్రహణ కాలమున చీకటియందు సూర్యునికవ్వలనున్న నక్షత్రపువెల్గు సూర్యునిం

జుట్టి వంకరతిరిగి వచ్చినదేయనియు, దానింజూచి తిన్నగ నేతెంచినదని తలంతురనియు ఎనిస్టైను పండితుఁడనెను. ఈయన నక్షత్రదర్శన స్థానములం గూర్చి తెల్పినలెక్క సరిపోవుచున్నదనుచున్నారు.

సూర్యునింజుట్టి భూమితిరుగు వెలాసిటీ గంటకు 6,7000 మైళ్లు. ఈత్వరితగమనము ననుకరించవలెనన్న గడియారము రోజునకు $\frac{1}{2300}$ భాగపు సెకండుకాలముం గోల్పోవుచుండుననియు, ఈ దూరముం గొలుచుచో అడుగుబద్ద (Foot rule) అంగుళమునందు $\frac{1}{17000000}$ భాగముం గోల్పోవుచుండుననియు కనిపెట్టంబడినది. ఇట్లగుచో వెలుఁగు ప్రయాణమొనర్చు వెలాసిటీ వేగము ననుకరించు గడియారము రోజునందు పండ్రెండుగంటల కాలమును, అడుగుబద్ద ఆరంగుళముల పరిమితిని గోల్పోవుచుండును. కాననే వెలుఁగుయొక్క వెలాసిటీ Theoretical Obsolute Limit (హద్దు) అని పేరిడంబడినది. అనఁగా నింతకన్న నెక్కువ త్వరితగమనము దుస్సాధ్యమని భావము.

ఈవిషయమెటులఁ జెప్పఁబడినను ఒక సెకండు కాలము గంటయం దరువదియవ భాగమేననియు, అడుగుబద్ద పండ్రెండంగుళముల పరిమితి కలదియే ననియు నెఱింగినవారు కాలము, దూరము, సర్వత్రా ఒకేరీతిని గన్పించునవి కావనియు, ఆయాదేశస్థుల సంబంధములుగదనరుచు గన్పించు ననియు మనసునందుంచుకొనవలసి యుండును. ఇందింకను చిత్రమేమన, వస్తువునువీడక దానితో నరుగుచు నట్లు గన్పించుచుండుట విపరీతమని తోపక పోదు.

ధ్వని ప్రయాణమొనర్చు వెలాసిటీకన్న నధిక వేగముగ ప్రయాణమొనర్చువారా ధ్వనిజనించు తావునుండి దానిని వినజాలరు. దీనికింగారణ మాధ్వని వారికన్న తక్కువవేగముతో జనుచు, వెనుకఁబడుటయే. ఇటులనే వెలుఁగు ప్రయాణమొనర్చు వెలాసిటీకన్న నధికవేగముగ నరుగు ఏవస్తువునైనను ఎన్ని దూరదర్శన యంత్రములతో చూచినను చూడఁజాలరు.

వెలోసిటీ సందర్భమున Michelson Morley Experiment అనంబడు పరిశీలన, సుప్రసిద్ధమైనది కలదు. ఒక ఇనుపదారి, బండ్ల వరుసను (Train) ఒక పక్షి ఎగురుచు నొకకడ నుండి రెండవకడకు దాటుటను తలంతుముగాక. రెండునుఒకేదెసకు నొకేవెలాసిటీతోపరుగిడుచో నెప్పటికి దాటఁజాలకుండును. బండ్ల వరుసకన్న పక్షి యధికమగు వెలాసిటీతో పరుగిడుచో దాటిపోవుటకుం గొంతకాలము పట్టును. బండ్ల వరుస కెదురుగ నాపక్షి యట్లె ఎగురుతరి నంతకన్న త్వరితముగనే దానిం దాటగల్గును. బండ్ల వరుస నిలచియుండ పక్షిదానిం దాటుటకు ఎదురొక్కని దాటుటకన్న ఇంచుక యాలస్యముగను అనుకరించుచు దాటుటకన్న ఇంచుకవేగముగను కాలముపట్టును. ఇటులనె వెలుతురును, ధ్వనియుం గూడ లెక్కింపబడవలసి యుండును. ఇది నిస్సంశయమగు సత్యమైనను వేఱ్వేఱు తావులనుండియు, వేఱ్వేఱు దూరములనుండియు వేఱ్వేఱు విధములుగఁ గన్పట్టుట తప్పనిదని ఈ సిద్ధాంతము తెల్పెడిని. వెల్సు (H. G. Wells) గారను నొకగ్రంథకర్త ఈ ఎనిస్టైను సిద్ధాంతము లేని యాదికాలముననే Time Machine అను కథనమును వ్రాసి యందీసిద్ధాంత విషయములం జర్చించి యున్నాడు. ఇది చాల యాదికాలము నాటి సంగతియై యున్నది. ఎనిస్టైను సిద్ధాంతమున [illegible]క్రొత్తసంగతి కలదు. వస్తువు గమనించుతరి [illegible]టి వెలోసిటీ ననుసరించి దాని బరువు పెరుగుచుండునని చెప్పఁబడినది. ఒక పౌను బరువుగల వస్తువు గంటకు ౬౭,౦౦౦ మైళ్ల

వెలాసిటీతోఁ బర్వెడుచుండుతరి పౌనునందు ౨౦,౦౦,౦౦,౦౦౦ భాగము బరువధిక మగునట. ఇట్లగునేని సెకెండునకు ౧,౬౧,౦౦౦ మైళ్ళ చొప్పున పర్వెడుచో బరువు రెట్టింపగును. ఇటు లనే Negative pole of Electric circuit అగు Cathode Rays నందునను రేడియం వలన తరుమఁబడిన కొన్ని త్రసరేణువ్రులును ఇట్లే యగుచుండు నంచురు. న్యూటన్సిద్ధాంతమున Straight lines గా వివరింపఁబడినవి, ఎనిస్టైను సిద్ధాంతమున నెచురొ్ూ-నంబడి అవి కాంకేవ్ర్గ్గాసు ఉపరిభాగము వంటి వంకరగల గీతలని చెప్పఁ బడినవి. మఱియు భూమి గుండ్రముగ బంతివలె నుండుం గాన దాన్నిపైఁ గీయంబడిన ఏగీతలైనను వంగియుండకతప్పదు గాన ఎనిస్టైను విధానమున Straight linesగా కొనంబడ లేవు. ఇదియూక్లిడు పండిత విరచిత జామిట్రీశాస్త్రము నెచుర్చుటగా పెక్కండ్రు తలంతురు గాని నిజమున నిది ఎదు ర్చుట కానేరదు. దానింగ్గ కొన లేదనవలసి యుండును.

ఎనిస్టైను సిద్ధాంత మెఱింగించు భవిష్య దృశ్యములం బరిశీలింప నింగ్లాండు దేశమునుండి పంపఁబడిన సుప్రసిద్ధ పండితులు పరిశీలించి, సూర్యగ్రహణకాలమున తీసిన ఛాయాపటముం గూర్చి యెల్ల రెఱింగినదే. ఆ పరిశీలనలు ఎనిస్టైను సిద్ధాంతమునే గౌరవించెనని చెప్పఁబడినది.

ఈ సిద్ధాంతమునందలి నిజము ప్రత్యక్షముగా ఐహిక సంబంధమునుగాని, పదార్థసంబంధముగాని ఉండనేరదనియు, అది ప్రపంచమునందలి వస్తు ప్రదేశకాలముల సంపుటీకరణ సంబంధముగ నుండునదేయనియు, ఇందు ఇంకను పరిశీలింప జగత్తునందేదియో యొక వ్యక్తిత్వముకలదనియు, దానింగూర్చి సంపూర్తిగ నెఱుంగుట దుస్సాధ్య మైయుండుననియు చెప్పఁబడియున్నది.

**ఎనీరోయిడ్ బారో మీటర్** — సెంటుగోథర్డు టన్నెలు చూడుఁడు.

**ఎనెమో మీటర్** (Anemometer)- వీచుచుండు గాలియొక్క బలమునుగాని, వీచు కదలికె (Speed) గాని తెలుపు పరికరము.

**ఎనోమెలెస్టిక్ సంవత్సరము** (Anomalistic Year)- Sun's revolution relative to the apse line. ఇందు సూర్యుడు 360° + 11°.25 తిరుగు నని చెప్పంబడినది. ఎస్ట్రో నమీ సంబంధము.

**ఎన్నికలు** (Elections) — రాజకీయ ములందుగాని, వ్యాపారములందుగాని, దేవా లయ, సత్ర, పుస్తకభాండాగారాది సంస్థల పరి పాలనలకుగాని, తమ ప్రతినిధుల నెన్నుకొనుటకు ఎలక్షన్ అనిపేరు. ఇది వేఱ్వేఱు దేశములందు వేఱ్వేఱు విధములుగ నడచెడిని. కాని అన్నిటి యందు నెన్నుకొనువాడుసమ్మతి(Vote)నిచ్చుట, పిదప వాటిని సరిగానున్నటుల పరిశీలన లెక్క పెట్టుట ఎన్నికలందు ప్రధానములు. కొన్ని సభ లందు తమ ఎన్నికలం దెల్పుటకు సభ్యులు చేతులం బైకెత్తుట మూలముననే జరగెడ్డిని. ఎన్నుకొనువారింగూర్చి తొలుత నిజస్థితి పరిశీ లింప వలసియుండును.

**ఎన్నెమ్మ** — ఈమె విప్రాంగన. కర్మవశ మున నొక మాలనికి వివాహము చేయఁబడి వాని వలన నేడ్వుర పుత్రులంగని జీవములను భరింపఁ జాలక యగ్నింబడి బలవంతముగఁ బ్రాణములను బాసి, మాలలచే సుంకలమ్మ యను దేవతగఁ గొని యాడఁబడుచుఁ నన్యజాతులవారిచే "ఎన్నెమ్మ" అని వాడబడుచున్నది. సుంకలమ్మ అనునది యీామె జీవించియున్నప్పటిపేరు. శిశుపీడాపరిహా రార్థము పురిటిండ్లలో నీమె చరిత్రమును చెప్పు చుందురు.

ఎన్నోవ్రణములం గోసితిని గాని నాకురువు( గోసినప్పటిబాధ ఎవ్వరికి గలుగలేదని డాక్టరుగారుఅన్నారట- ఆంధ్రలోకో

## ఎన్ అక్షరమునకుం జెందిన క్రైస్తవ పురుష నామములు —

Naaman- హీబ్రూపదము, Pleasant అనియర్థము.

Nahum- హీబ్రూపదము, Comforter అని యర్థము. ఈతేడు జ్ఞాని.

Napier- నవీనపదము.

Napoleon- Napoleone- గ్రీకుపదము, ఫ్రెంచి చక్రవర్తిపేరు.

Narcessus- గ్రీకుపదము, Daffodil అని యర్థము.

Nathan- హీబ్రూపదము, Gift అని యర్థము.

Nathaniel- Nathanial- Nathanael- హీబ్రూపదము, Gift of God అనియర్థము.

Navarino- నవీనపదము.

Neal- ఐరిషుపదము, Chief అని యర్థము.

Ned- (see Edward.)

Nehemiah- హీబ్రూపదము, God of Comforts అని యర్థము.

Neill, Neil- కెల్టిక్కుపదము, Champion అనియర్థము.

Nelson- నవీనపదము, Lord Nelson పేరు.

Nero- లాటిన్‌పదము, Strong అని యర్థము. రోమనుచక్రవర్తి పేరు.

Nesbit- Nesbitt, Neville- నవీనపదములు.

Nicholas-Nicolas-Nikola- Nicomedi-Nicodemus- గ్రీకుపదములు, ప్రజా జయ మనియర్థము. దీనింగల్గినముద్దుపేరులు Nick, Nickel, Nicol అని. ఇది చక్రవర్తులు వహించినపేరు. సెయింటునికలాస్ ఋషి పేరు.

Niel- గ్రీకుపదము, Same as Nicholas, Iceland భాగరూపము; Nijal ఒక ఋషి పేరు.

Nigel - స్కాచినామము Black అనియర్థము.

Ninian - స్కాచినామము సెయింటునినియన్ ఋషి పేరు.

Noah - హీబ్రూపదము, rest అని యర్థము. మహాత్ముని పేరు.

Noel - లాటిన్పదము క్రిష్టమసు పేరు.

Norman, Normane - ట్యూటోనిక్కుపదము, Northman అని యర్థము.

Norris, Nowell - నవీనపదములు.

## ఎన్ అక్షరమునకుం జెందిన క్రైస్తవస్త్రీల నామములు —

Nada, Naida, Nadine- రుష్యన్పదము. ఆశయని యర్థము.

Nancy, Nanelle, Nanetti, Nancie, Ninette- హీబ్రూపదము, కటాక్షమని యర్థము. దీనంగల్గినముద్దుపేరులు Nan, Nani, Nanny, Nance, Nina, Netta.

Nanna- ట్యూటోనిక్కుపదము, నిర్భయమని యర్థము.

Naomi- హీబ్రూపదము. మనోహరరూపమని యర్థము.

Natalia, Natalie, Natale, Natalita, Natica- రష్యనుపదములు, క్రిష్టమసుబాల యని యర్థము.

Nea- ఐరిషుపదము, Neal యొక్క స్త్రీవాచక పదమని తలంపబడుచున్నది. అర్థము Neal అనిన పాలించు సామంతప్రభువు.

Neda-రష్యను పదము, ఆదివారమని యర్థము.

Nelly- గ్రీకుపదము, వెలుతురనియర్థము.

Neredah-Nerissa- నవీన కల్పితపదము.

Nessie - ఉత్పత్తి తెలియదు. పరిశుద్ధత యని యర్థము.

Netta, Netto- హిబ్రూపదజన్యము, కటాక్షమని యర్థము.

Nicolina-Nicolette -గ్రీకుపదము, జయశీలురాలని యర్థము. Nicholas యొక్క స్త్రీవాచక పదములు.

Nina- హిబ్రూపదము, కటాక్షమని యర్థము.

Nira- నవీనకల్పితపదము.

Nita- హిబ్రూపదము, కటాక్ష మర్థము. కొందఱీపదము Ninetta యొక్క రూపాంతరమని తలంచుచున్నారు.

Neolle- లాటిన్పదము, క్రిష్టమస్సని యర్థము. Noel యొక్క స్త్రీవాచకపదము.

Nora, Norah, Noreen- లాటిన్పదములు, గౌరవనీయమైన యనియర్థము. Honora వంటిపదమె. ఐర్లండునందెక్కువ వ్యాపకమందియున్నది.

Norma- ట్యూటానిక్కుపదము. నియోర్డు సంబంధపదము. Norman యొక్క స్త్రీ వాచకపదము.

**ఎన్. బి. గురుతు** — ఆంగ్లమున N. B. గురుతు తిరిగి వ్రాయబడుటం దెలుపు తాజాకలము అనుటవంటిది. ఇది Note Bene అను లాటిన్ భాషాపదము. దీనికి Mark well అని యర్థము.

**ఎన్ఫేస్డు పేపర్** (వాణిజ్యసంబంధ పరిభాషాపదము) Enfaced Paper - కొంతకాల మీదేశమున ప్రచారము నందుండిన రూపాయి నోటు.

**ఎపిక్యూరియనిజం** (Epicureanism)—తత్వశాస్త్రము 3 భాగములనియు, ౧. Canonics అనగా తర్కము (Logic) ఇది Theory of knowledge, ౨. Physics and 3. Ethics అనియుం ద్వివిధము. ఈవిధానమున The basis of knowledge is evidence of sensual perception అనియు, Epicurus follows the Cyrenaics in Ethics అనియు, Pleasure (the only happiness) is the aim of life అనియు చెప్పఁబడిన సిద్ధాంతము.

**ఎపిగ్రాఫీ** (Epigraphy) — శిలాశాసనములు, రేకులశాసనములఁ జదివి వివరించు శాస్త్రము. జ్ఞాపకచిహ్నములంగూర్చి వివరించు కళ.

**ఎపిడిమియోలొజీ** (Epidemiology) — అంటువ్యాధులకు Epidemic Diseases అని పేరు. ఆవ్యాధుల ఉత్పత్తి లక్షణము, వైద్యము, పరిహారము, నివృత్తి మొదలగు సంగతులందెలుపు కళ.

**ఎపిఫెనీ** (Epiphany)— జనవరి ౬ వ తేదీని క్రైస్తవ దేవస్థానములందు జరుపఁబడు పర్వదినము. ప్రార్థన పుస్తకమునకు Epiphany లేక Manifestation of Christ to the Gentiles అని పేరుకలదు.

**ఎపిస్కోపల్** (Episcopol) — ఎపిస్కోపల్ అన ఏక్రైస్తవ చర్చిపరిపాలన మాచర్చి బిషప్పె నెఱపునదియని యర్థము. అనఁగా యితర మిషన్ సొసయిటీల సంబంధము లేనిదని భావము.

**ఎపిస్టమోలొజీ** (Epistemology)- జ్ఞానమును కూర్చు విద్యలనుగూర్చిన కళ.

**ఎపొథియోసిస్** (Apotheosis) — ఫ్రెంచి మాటయగు Apotheose యొక్క వికారరూపము. మానవునకు దైవలక్షణము లనారోపించు విధానధర్మముల దెలుపుకళ.

**ఎ**

**ఎప్పటివేనా ?**

ఆంధ్రలోకోక్తి

**ఎప్రెంటిస్** (Apprentice) — వాణిజ్యసంబంధ పరిభాషాపదము. ఒకరినుండి పని నేర్చుకొనుట, ఒకరియొద్ద తరిఫీయతు అని యర్థము. ఇది పద్ధతులమేర కాలోచించితిమేని పనినేర్పువారికి నేర్చుకొనువానికి పనినేర్పుటయు దానికిఁ బ్రతిఫలము వారివలనఁ దాము చేయించుకొనుపనియునై యుండునట్టి యొక యేర్పాటు. ఇది కంట్రాక్టుగా పత్రములు స్టాంపుపై నైరోపాదేశములందు వ్రాసికొనుటగూడఁగలదనివిందుము. మఱియు నట్టితరి దీనిని రద్దుచేయుట కైదుమార్గములు కలవు. తొలుత నేర్పరుచుకొనిన కాలము ముగియుట, పార్టీలలో నెవ్వరైనను మరణించుట, నేర్పువారు దివాలాతీయుట, ఉభయపార్టీల అంగీకారమును, మఱియు నిట్టి కంట్రాక్టుకు ఏడు సంవత్సరముల పైబడిన వయస్సు పనినేర్చుకొనువానికవసరమట.

**ఎప్రెయిజర్** (Appraiser)— వాణిజ్య సంబంధ పరిభాషాపదము. సరకుల విలువయందు భేదాభిప్రాయముగల్గి తకరరు సంభవించుతరి వానిసరియైన విలువలంగట్టు మధ్యవర్తి Appraising అన సరియగు విలువగట్టుటయని యర్థము. మ్యూనిసిపాలిటీలయందు ఇండ్ల పన్నుల విధించుట సరిచేయుటకొఱకు ఇండ్ల విలువలంగట్టుటను To appraise అనెదరు.

**ఎఫిజీ** (Effigy)— సమాధులపై ఫలకములపైఁగల వివరణము లేక చనిపోయినవారి పోల్కి. ఇంకను సమాధులపైఁగల వ్రాతలకు ఎపిటాఫ్ (Epitaph) అనియు నందురు.

**ఎఫిమీజం** (Euphemism) — సరిగా నొక యభిప్రాయము (నొకఉపన్యాసమునందు)ను చెప్పుటకు వలసిన మాటలకన్న వేఱుమాటల నెక్కువ అందముగనో, రుచిగనో లేక కాలానుగుణ్యముగనో ఉండుటకు కుదిర్చి చెప్పు కళ.

**ఎఫిలియన్** (Aphelion)- మోషన్సు ఆఫ్ ది ఎర్తు చూడుఁడు.

**ఎఫెండిబిరుదము** — ఇది టర్కీదేశపు బిరుదము. గౌరవసూచకము.

**ఎఫెక్టివ్ రేంజి** (Effective range)- సర్వీస్ రేంజి, ఎఫెక్టివ్ రేంజి, చూడుఁడు.

**ఎఫెమిస్ట్రీ** (Ephemistry)- Neuroptere order కుంజెందిన జంతువులు Insects గూర్చినకళ. ఇవి Larval Condition లో రెండుమొదలు మూఁడుసంవత్సరముల దనుక జీవించెడిని. పెరిగి పూర్ణస్థితి కల్గగనె అవి ఒక వేసవి రాత్రియందు గుంపులు గుంపులుగ బయలువెడలు జంతువులు. అవి తిండి తినకనే వ్యాపించి మరణించును. ఈ జంతువులకు Ephemeridae అని పేరు. వీనింగూర్చిన శాస్త్రము Ephemistry అని వాడఁబడును.

**ఎపేక్టు** (Epact) — ఆంగ్ల జ్యోతిషశాస్త్రపు లెక్కమేరకు చంద్రమాన సంవత్సరపు దినములకన్న సౌరమాన వత్సరపు దినములు ఎన్ని అతిశయించునో ఆసంఖ్యకు పేరు. ఇంకను చాంద్రమాన మాసపు దినములకన్న కేలెండరు నెల (Calendar Month) దినములు ఎన్ని అతిశయించునో ఆసంఖ్యకును ఎపేక్టు అని పేరు. సాధారణముగ సంవత్సరమందలి తేఁడా పదునొకండు దినము లుండెడిని. జనవరి యొకటవ దినమున నమావాస్య సంభవించిన ఎపేక్టు సున్న వచ్చును. దానిని Zero అనియెదరు. ఇటుల చాంద్రమాన వత్సరములు పందొమ్మిదగువఱకు ఒక Cycle అనెదరు. అనఁగా ౧౧ దినములకన్న నెక్కుడగుచు పందొమ్మిది సంవత్సరములకు సరిపోయి తిరుగ నావరుసనే మరల ౧౯ సంవత్సరములవఱకు నెక్కువ యగుచుండును. ఇత్తరి చంద్రునికాలము ౩౦ దినములకన్న నెట్టితరిని

అధికముగాదని మనసు నందుంచుకొనవలెను. కాన
౨౨+౧౧=33 అగును. అందు 3౦ తీసి వేసిన మూడు మిగులును. క్రీ. వె. ౧౯౦౧ ఎపాక్టు ౧౦ - ౧౯౨౦ ఎపాక్టు ౧౦ - ౧౯3౨ ఎపాక్టు ౨౨ అగును.

**ఎఫ్రైట్మెంటు** — (వాణిజ్యపరిభాషా పదము) Affreightment- రైల్వేయందుగాని స్టీమరునందుగాని సరకులం దీసుకుపోవుటకగు మూల్యము. దీనికి Freight అనియునందురు.

**ఎఫ్లుయెంటు ట్రిబ్యూటరీ** — Affluent Tributary. ఒకనదిలో కలియు వేఱొక్కనది. దీనికి ఉపనది యనెదరు. (నదులు, ఉపనది చూడుఁడు.)

## ఎఫ్ అక్షరముకుంజెందిన క్రైస్తవపురుష నామములు —

Fabian, Fabius- లాటిను నామము, Bean (బఠాణి) Grower అని యర్థము.

Fairfield, Falconer(ఉచ్చారణFawkaner
Falkland (ఉచ్చారణ, Fawkland)
Faushawe - నవీన కల్పిత నామములు.

Fanchon- ట్యూటానిక్కునామము, స్వతంత్రురాలని యర్థము, స్త్రీ నామము.

Farquhar - స్కాచి నామము, Manly అని యర్థము.

Farrer- నవీన కల్పితము.

Felix - లాటిను నామము, happy అని యర్థము.

Fenton - నవీన కల్పితము.

Ferdinand, Ferrand - ట్యూటానిక్కు నామము. ఇది Valorous అని యర్థముగల నామము. పెక్కండ్రు స్పానియా, జర్మను, ఆస్ట్రియా భూపాలు రీనామము వహించిరి. దీనినుండి గల్గిన ముద్దుపేరు Ferdy అనునది.

Fergus, Feargus - కెల్టిక్కు నామము. ఐర్లండు దేశమున నెక్కువ ప్రచారము కలది. Man of Strength అని యర్థము.

Ferrers - నవీన కల్పితనామము, Valarous అని యర్థము.

Ferrand - ట్యూటానిక్కు నామము. Valarous అనియర్థము.

Festus- లాటిను నామము, Joyful అని యర్థము.

Fingal, Fingall - కెల్టిక్కు నామము, ఐర్లండునందెక్కువ ప్రచారముకలది. White stranger అని యర్థము.

Fionn- కెల్టిక్కునామము, ఐర్లండునందెక్కువ ప్రచారముకలది. White అని యర్థము.

Fitzalan- నవీనకల్పితము.

Fitz- కెల్టిక్కునామము, Son అని యర్థము.

Fitzgerald- నవీన Celtic నామము, Son of Cerald అని యర్థము.

Fitzroy- నవీనము, Son of Roy అని యర్థము.

Fitzwarrine- నవీనము, Warrine's son అని యర్థము.

Flavian, Flavius- లాటిను నామము, Yellow అని యర్థము.

Fleetwood, Forbes- నవీనకల్పితములు.
Fortescue (ఉచ్చారణ Fortiskew)
Foster- నవీన కల్పిత నామములు.

Francis- ట్యూటానిక్కు నామము, ఒక ఆస్ట్రోహంగేరిచక్రవర్తి పేరు. అచటను ఆంగ్లసీమలందునను ఎక్కువ వ్యాపకము గాంచియున్నది. స్వేచ్ఛయని యర్థము. దీనినుండి కల్గిన ముద్దుపేరు Frank.

Franklin, Francklyn- నవీనకల్పితము, Frank యొక్క పరిణామము.

**Frederic, Frederick-** ట్యూటోనిక్కు నామము, Peace ruler అని యర్థము. జర్మనుచక్రవర్తి పేరు.

**Freeman-** నవీనకల్పిత నామము.

**Frewen-** ట్యూటోనిక్కు నామము Free friend అని యర్థము.

**Fridtjof-** ట్యూటోనిక్కు నామము. ఒక గొప్ప వాని పేరని యందురు.

**Fulbert-** ట్యూటోనిక్కు నామము. Ought resolution అని యర్థము.

**Fullarton, Fulton-** నవీనకల్పిత పదము.

## ఎఫ్ అక్షరమునకుం జెందిన క్రైస్తవ స్త్రీల నామములు

**Faith-** లాటిన్పదము, నమ్మకమని యర్థము.

**Fanny-** ట్యూటోనిక్కు పదము, స్వతంత్రమైన అని యర్థము. Frances పదమునుండి కల్గిన ముద్దు పేరు.

**Faustine-Faustina-** లాటిన్పదము, అదృష్టశాలియని యర్థము.

**Fedor-Feodor-Feodora-** రష్యను పదము, దైవప్రసాదమని యర్థము.

**Felicia-Felicie-** లాటిన్పదము, సౌఖ్యమని యర్థము. రష్యాదేశమని కొందఱనెదరు.

**Fenella-** కెల్టిక్కు పదము, తెల్లని భుజములు గల యనియర్థము.

**Ferdinanda-Ferdinandine-** ట్యూటోనిక్కు పదము, Ferdinand యొక్క స్త్రీ వాచక పదము.

**Fidelia-** లాటిన్పదము, నమ్మకమని యర్థము.

**Filomena-** ఇటాలియన్పదము, వెలుతురు యొక్క కుమార్తెయని యర్థము.

**Flavia-** లాటిన్పదము, పసుపుపచ్చయని యర్థము. Flavius యొక్క స్త్రీవాచక పదము.

**Flora-Flore-Floria-** లాటిన్పదములు, పుష్పములని యర్థము. ఇది ఒక రోమక దేశమునందలి దేవత పేరులు.

**Florence- Florentine- Florentia- Florette- Florinda-** లాటిన్పదములు, అభివృద్ధియని యర్థము. దీనినుండికల్గిన ముద్దుపేర్లు Florie - Florry - Flossie-

**Florence - Nightingale-** క్రీమియన్ యుద్ధమున పేరందిన నాతి. ఈమె ఫ్లారెన్సు (ఇటలీ) పురవాసిని. ఆమెపేరుగ గొందఱు తలంచుచున్నారు.

**Fortune-** ఆంగ్లపదము.

**Frances, Francisca, Francesca, Franziska-** ట్యూటోనిక్కు పదములు, స్వాతంత్ర్యమని యర్థము. దీనియందు గల్గిన ముద్దుపేరులు Fanny అని కొందఱనెదరు. ఇది Francis యొక్క స్త్రీవాచకపదమని కొందఱి యభిప్రాయము.

**Frederica, Freda-** ట్యూటోనిక్కు పదములు, నెమ్మదియైన రాజ్యపాలనమొనర్చు ప్రభ్వి యని యర్థము. Frederick యొక్క స్త్రీవాచకపదము. దీనినుండి గల్గిన ముద్దు పేరు Freddy.

**Frida, Frieda-** ఇది ఫ్రెడరికా యొక్క రూపాంతరమని కొందఱును, Elfrida యొక్క రూపాంతరమని కొందఱును తలంచుచున్నారు.

**Frideswide, Fredeswyde-** ట్యూటోనిక్కు పదములు, శుక్రవారమున జన్మించిన

**ఎబెట్మెంటు** (Abbetment) వంతెనలు చూడుము.

**ఎబెల్** (ఆబెల్) (Abel)—హీబ్రూపేరు దర్పము, డాంభికముయని అర్థము. పురుష

నామము. యూదుల తొలి సృష్టివారగు ఆదం ఈవుల కుమారునిపేరు ఆబెల్ అనియు కొంద ఱనెదరు. (క్రైస్తవనామములు చూడుఁడు).

**ఎబోనైటు లేక వాల్కనైటు**— (Ebonite or Volcanite) రబ్బరుతో మూఁడ వవంతు గంధకముంజేర్చి ఫారెన్హీటు థెర్మోమీటరు ౩౦౦ డిగ్రీల వేడియందు కొంతకాలము వేడిచేసి గట్టిపరచిన నెబోనై టనఁబడును. ఇది కొమ్ము, దంతము, మొదలగు వానివలెపనినిచ్చు గాన వాటివలె వాడుదురు.

**ఎబౌపార్** (Above Par) — వర్తక పరిభాషాపదము. నిర్ణీతమగు ధరకన్న నెక్కువ అనఁగా నూరు రూకలు విలువగల గవర్నమెంటు పత్రము నూటికన్న నెక్కువగా నమ్ముడుపోయి నను, ఒకవర్తకసంఘమున నూరు రూప్యముల (మూలధనమందలి) వాటా నూటికన్న నిరువది రూప్యము లెక్కుడుగ నమ్ముడుపోయినను,ఎబౌ పార్ అనిమెదరు. పార్ అన దానివిలువ ఎంతో అంతయని ఎఱుంగునది.

**ఎబౌ ప్రూఫ్** — అండరు ప్రూఫ చూడుఁడు.

**ఎమజానునది మైడల్బోరు**

(ఎమజాను మహానది చూడుఁడు) ఈనది అట్లాంటిక్కు మహాసముద్రమున సంగమించు తావున నదియొక్క ఉత్తరతీరము నంటియొక మైడల్బోరు సుప్రసిద్ధమైనది కలదు. సముద్రపు పోటున నదీజలములు పదిఅడుగులఎత్తున నది కెదురుగా కొంతదూరము దనుక ఎగువకు నెట్టంబడుట ఉత్తర తీరము నీటియందు మున్గు చుంట సంభవించెడిని. ఇటులఎగువకు నెట్టంబడుట గంటకు పదిమొదలు పదునేనుమైళ్లు వేగమని లెక్కింపఁబడియున్నది.

**ఎమజాన్ మహానది** — దక్షిణ అమెరికాలో నున్నది. ప్రపంచమునందు పెద్ద నదిగ పేరందినది. ఇంచుమించు నాల్గువేలమైళ్ల పొడవు. ఆండీసు పర్వతోపరిభాగ శీతభూమిం జన్మించి గొప్పగొప్ప Rapids, Cataracts గ దొరులుచు ప్రవహించి రెండువేల అడుగులలోతు నూరడుగుల వెడలుపు గల పర్వతపు కోతలోవ (Canon) గుండా నడచి బయలుప్రదేశములకుం జేరి ప్రవహించుచు ఒక మైలు మొదలు ఆరు మైళ్ల వఱకు వెడలుపుగలిగి అట్లాంటిక్కు మహా సముద్రముయొక్క దక్షిణభాగమున సంగమిం చును. దీనిముఖద్వారము ౧౭౦ మైళ్ల ప్రదేశ మని చెప్పంబడినది. ఇందు లెక్కలేని యుప నదులు చేరుకొనును. ఇంచుమించు నది పొడవు నను మహారణ్యము జన్మించి బలిసి యున్నది. నవంబరు మొదలు జూను నెలవఱకు దీని వెల్లువ కాలమట. అప్పుడు మామూలుకన్న నేబది యడుగుల ఎత్తున నీరధికమగునట. ముఖద్వార మునుండి రెండువేల మూఁడువందల మైళ్లదూరము దనుక పెద్ద సముద్రపు స్టీమరులు నడచునట. దీని ముఖద్వారమున డెల్టా లంకలు లేవు, కాని కొన్ని ఇసుకగట్టులు, కొన్ని ద్వీపములు ఏర్పడి యున్నవి. దీనికి గినియా తీరమని పేరు కలదు. (ఎమజానునది మైడల్బోరు చూడుఁడు).

**ఎమిథీస్టు** (Amethyst) — ఇది Precious stone అని చెప్పఁబడినది. ఇది ఊదా రంగు నేత్రముంబోలియుండునని చెప్పఁబడినది. దీనియందు పోల్పందగిన రంగుపదార్థము కలసి యుంట ఇట్లగుపడును. ఇం దపరిశుభ్రత చాలా తక్కువగానుండి పరిశీలనకుఁ దొరకకుండెడిని. ఇందుగల ధాతువ (Purple tint), ఇందుగల Manganese నుండి కల్గినదనియు, Chrysoprase నందుగల Nickel ఆకుపచ్చరంగు

కల్గించుచున్నదనియు, పరిశీలనలవలన తెలియుచున్నది. ఎమితీస్టును Cat's eye అనియు నందురు. (రత్నము, రత్నములు చూడుడు).

**ఎమీలియాప్రోవిన్స** — ఇటలీ దేశమునందలి యొక ప్రోవిన్సు (ఇటలీదేశము చూడుడు)

**ఎమ్మేటర్** (Ammeter)- విద్యుచ్ఛక్తి- Electricity current యొక్క బలమును కొలచు పరికరము.

## ఎమ్ - అక్షరమునకుం జెందిన క్రైస్తవ పురుష నామములు —

Macaire - ఐరిషు పదము, happy అని యర్థము.

Macaulay - (ఉచ్చారణ, Mac-aulay) నవీనపదము.

Macbeth - స్కాచిపదము, ప్రాణి పుత్రుడని యర్థము.

Madoc - వెల్షుపదము, Beneficent అని యర్థము.

Mael - ఐరిషు పదము, శిష్యుడని యర్థము. (ఉచ్చారణ Mail)

Maga - హిబ్రూపదము, చేదని యర్థము.

Magan - ట్యూటోనిక్కు పదము, బలశాలి యని యర్థము.

Magnus - లాటిన్పదము, గొప్పకర్థము.

Magwire - (ఉచ్చారణ Magwire) నవీన ఐరిషు పదము.

Mahon - ఐరిషుపదము, ఎలుగుబంటి కర్థము.

Malachi - హిబ్రూపదము, Angel of God అని యర్థము.

Malcolm -స్కాచిపదము, St. Columbus's Disciple అని యర్థము. ఈతడు స్కాట్లాండు దేశపు ఋషి.

Malise - స్కాచిపదము, యేసు శిష్యుడని యర్థము.

Manasseh - హిబ్రూపదము, మరచిపోవుట కర్థము.

Manfred - ట్యూటోనిక్కు పదము, Peaceful and Mighty అని యర్థము.

Manley, Mansfield - నవీన పదములు.

Manuel, Manoel - హిబ్రూపదము, God with us - అని యర్థము.

Marcellus, Marcel, Martia, Marcian, Marcius, Marcus, Marius, Mario- లాటిన్పదములు. రోమనుల యుద్ధదేవతయు, రక్షకుడును అగు Mars (గ్రహము) పేరు.

March- కెల్టిక్కుపదము, గమనమునకర్థము.

Mark- లాటిన్పదము, (Marcellus అర్థమే). Mars సంబంధము.

Marion, Marius-(Marcillus చూడుడు).

Marmaduke- కెల్టిక్కుపదము, సముద్రము నాజ్ఞాపించువాడని యర్థము.

Marriott- నవీనపదము.

Marten, Martin, Martyn, Martinus, Martius- లాటినుపదములు, Mars సంబంధమనియర్థము. (Marcellus చూడుడు).

Marvin- నవీనపదము.

Matthew, Matthia, Mattheas- హిబ్రూ పదము. God's Gift అని యర్థము. St. Matthews పేరు.

Maur- లాటిన్పదము, Dark అని యర్థము. St. Maur పేరు.

Maurice, Mauritius, Maurus- లాటిను పదములు, నల్లశరీరమని యర్థము.

Maximilian, Maximus- లాటిన్పదము, గొప్పకర్థము. దీనినుండి కల్గిన ముద్దుపేరు Max.

Maxwell- నవీనపదము.

Maynard- ట్యూటోనిక్కు పదము, Firm and Mighty అని యర్థము.

Mayne- ట్యూటోనిక్కు పదము, Mighty అని యర్థము.

Meara- ఐరిషుపదము, Merry అనియర్థము.

Melfort, Melville- నవీన పదములు.

Meredith, Meredyth - కెల్టిక్కు పదము సముద్ర రక్షకుఁడని యర్థము.

Merewine- ట్యూటోనిక్కు పదము, Famous friend అని యర్థము.

Meriton- నవీనపదము.

Merrick, Meyrick- ట్యూటోనిక్కు పదము. Ruler who works అని యర్థము.

Merriman, Merry- నవీన పదము.

Mervyn- కెల్టిక్కు పదము, Sea hill అని యర్థము.

Meryon, Metford- నవీనపదములు.

Michael, Micah, Miguel- హీబ్రూ పదములు, St. Michael ఋషి పేరు. దీనింగల్గిన ముద్దుపేరులు Mike, Micky, Micaiah.

Mildmay - (ఉచ్చారణ Myld-may అని) నవీనపదము.

Miles, Myles, Milan, Milo - గ్రీకుపదములు, Crusher warrior అని యర్థము.

Milton - నవీనపదము, ఒక ఆంగ్లకవీశ్వరుని పేరు.

Modestus- లాటిన్ పదము, Modest అని యర్థము.

Molyneux (ఉచ్చారణ Mo-lneux),

Moneckton (ఉచ్చారణ Munkton అని)

Montague, Montagu (ఉచ్చారణ Montagu అని)- నవీనపదములు.

Moore- స్కాచిపదము, ఐరిషుభాషారూపము. Mor అని గొప్ప కర్థము.

Moreton, Morton - నవీనపదము.

Morgan - వెల్షు పదము, Dweller by sea అని యర్థము.

Morris - Moris- Moritez-లాటిన్పదము, Dark-skinned అని యర్థము.

Morough - ఐరిషు పదము, Sea protector అని యర్థము.

Morven- కెల్టిక్కు పదము, Man of the sea.

Morvren - కెల్టిక్కు పదము, Same as Mervyn.

Moses- హీబ్రూపదము, నీటినుండి తీయబడిన వాఁడని యర్థము. దీనింగల్గిన ముద్దుపేరులు Mose, Mosey, Moses. The law giver పేరు.

Mowbray- నవీనపదము.

Mungo- స్కాచిపదము, Lovable అని యర్థము. St. Mango Patron (saint of Glasgow) పేరు.

Munro - నవీన స్కాచిపదము.

Murdoch - స్కాచిపదము, సముద్రరక్షకుఁడని యర్థము.

Murphy- Murtagh- Mortough- Murtough- ఐరిషుపదములు, Sea warrior అని యర్థము.

Murray- నవీనపదము.

## ఎమ్ అక్షరమునకుం జెందిన క్రైస్తవ స్త్రీలనామములు —

Mab- ఐరిషు పదము.

Mabel, Mabell, Mabelle- లాటిన్పదములు, అనురాగాస్పదమైన యనియర్థము. దీనంగల్గిన ముద్దుపేరు Mab.

Madeline, Madelina, Madaleine, Madalena, Maddalene, Maddalena, Madeleine, Maddalene, Magdalen,

Magdalene, Magdaleine, Magdalina, Manda, Mandelina, Magda, Madoline- హిబ్రూపదములు. Magadala సంబంధమని యర్థము. Magadala అను భక్తురాలిపేర్లు. ఈమె Jesus Christ నకు శిష్యురాలు.

Madge- గ్రీకుపదము, ముత్యమని యర్థము.

Maisie, Maizie, Maie- గ్రీకుపదము, చేదు అని యర్థము. ఇది స్కాట్లండు దేశమున నెక్కువ వ్యాపకమందియున్న పేరు.

Maletta- ట్యూటోనిక్కుపదము, పని యని యర్థము.

Malvina, Malvine- కెల్టిక్కుపదము, సన్నిధి నుండు పడుచని యర్థము.

Manda- హిబ్రూపదము, ఒక భక్తురాలిపేరు.

Manna- లాటిన్పదము, మహాకటాక్షమని యర్థము.

Marcella, Marcelli, Marcia, Martine- లాటిన్పదములు, Mars సంబంధి యని యర్థము. Mars రోమనుల యుద్ధదేవత. ఇది Marcellus యొక్క స్త్రీవాచక రూపము.

Margaret, Margaretta, Margarette, Margarethe, Margarida, Margarita, Margarite, Margarith, Margarete, Marguerite, Margrete, Margit, Margot, Margery, Marget, Marjory, Marjorie, Madge, Marjarita- గ్రీకుపదరూపములు, ముత్యమని యర్థము. దీనినుండి కలిగిన ముద్దుపేరులు Mag, Maggie, Mai, May, Maisie, Mysie, Magge, Meg, Meggy, Meta, Mete, Peg, Peggy, Rita, Margie, Gritty. ఈపేరు ఒక ఋషికిని, పెక్కండ్రు రాణులకు నుంట బహువ్యాపకము గాంచినది.

Maria, Marie, Marian, Marianna, Mariana, Mariane, Marietta, Mariette, Mariel, Maryann- హిబ్రూపదము, చేదని యర్థము.

Marina- లాటిన్పదము, సముద్రసంబంధమని యర్థము.

Marion, Mariota - హిబ్రూపదము, చేదని యర్థము.

Marjory - గ్రీకుపదము, ముత్యమని యర్థము

Martha, Marthe, Marta, Marthon - హిబ్రూపదము, చేదని యర్థము, యువతియని యర్థము కూడ కలదందురు. ఈ పేరుగల యువతి లాజరస్ చెల్లెలు, యేసుక్రీస్తుకు శిష్యురాలు, బేతని కాపురస్థురాలు. దీనినుండి కల్గిన ముద్దు పేర్లు Mat - Matty, Pat - Patty.

Mary, Marta, Maiore- హిబ్రూపదములు. మహాన్నత్యమనియు, చేదనియు నర్థములు. దీనంగల్గిన ముద్దు పేరులు May, Moll, Molly, Mamie, Polly. యేసుక్రీస్తు తల్లి పేరు Mary. దీనికి హిబ్రూ ప్రతినామము Mirian.

Mat - హిబ్రూపదము, ప్రభువొసంగిన బహుమానమని యర్థము.

Matilda, Matilde, Mathilda, Mathilde - ట్యూటోనిక్కు పదములు, సంగర మందలి పడుచుయని యర్థము. దీనియందు గల్గినముద్దుపేరులు Tilly, Matty, Tilda, Mat, Maude. Matilda ఇంగ్లాండు దేశ మేలిన ఒకటవ హెన్రీరాజు భార్యయగు రాణి రెండవ హెన్రీ రాజమాత.

Maud, Maude, Maudi - ట్యూటోనిక్కు పదము.

Maxine- లాటిన్పదము, ఔన్నత్యమని యర్థము Maximus యొక్క స్త్రీవాచక పదము.

May, Maie - గ్రీకు, హిబ్రూపదముల సంబంధము. నిత్యమగు ముత్యమనియర్థము.

Mahetable - హీబ్రూపదము, దైవఫలమందిన యని యర్థము.

Malania, Melanie - గ్రీకుపదము, నల్లనిదని యర్థము.

Melissa, Melita - లాటిన్పదము. తేనెటీగ యని యర్థము.

Menie - స్కాచిపదము, చేదని యర్థము.

Mercedes, Mercede - లాటిన్పదములు. అనుగ్రహమందిన యని యర్థము.

Mercy, Meresia - నవీనాంగ్లకల్పితపదములు

Meta - గ్రీక్కుపదము, ముత్యమని యర్థము.

Michaela, Michaella, Michaeline - హీబ్రూపదము, దైవసమానయని యర్థము. Machael యొక్క స్త్రీవాచక పదము.

Mildred, Mildrid - ట్యూటానిక్కు పదములు. మందలించునది అని యర్థము. ఇందు గల్గిన ముద్దుపేరు Millie.

Milicent, Melicent, Millicent-ట్యూటానిక్కు పదములు, కార్యబలమని యర్థము, ఇందలి ముద్దుపేరు Milly.

Minella, Minette - ట్యూటానిక్కుపదములు, నిశ్చితముయొక్క శిరోవేష్ఠమని యర్థము.

Minervina - లాటిన్పదము, రోమనుల బుద్ధి విశేషమునకు దేవతపేరు.

Minnie, Minna, Mina, Minne-ట్యూటానిక్కుపదము, అనురాగయుతమగు స్మారకమని యర్థము.

Minnehaha - అమెరికాపదము, నవ్వులనీళ్లని యర్థము. ఇది రెడ్డిండియన్నామమని తలంపఁబడుచున్నది.

Miriam - హీబ్రూపదము, మహోన్నత్యమైన (Mary) అని యర్థము.

Mittie - నవీనకల్పిపదము, Martha యొక్క వికారరూపము.

Modestine, Modesty - లాటిన్పదము.

Modwenna, Morwenna - వెల్షు పదము.

Moina - స్కాచిపదము, మెత్తని యనియర్థము.

Molly - (Mary యొక్క రూపాంతరము) హీబ్రూపదము, మహోన్నతమయిన యని యర్థము.

Mona, Monica - లాటిన్పదము, సలహానిచ్చునదని యర్థము.

Mopsa - దీనింగూర్చి ఏమియుందెలియదు.

Moreen - ఐరిషుపదము.

Morgana - వెల్షుపదము, సముద్రతీరవాసిని యని యర్థము. Morgan యొక్క స్త్రీవాచక పదము.

Morny - స్కాచిపదము, పరిపూర్ణానురాగ మనుభవించుచున్న అని యర్థము.

Mosina - హీబ్రూపదము, Moses యొక్క స్త్రీవాచకరూపము. నీటినుండి తీయబడిన యర్థమని కొందఱనెదరుగాని సరియగు యర్థముగానరాదు.

Moyra - నవీన కల్పిత పదము.

Muriel - గ్రీకుపదము.

Myra - ఆంగ్లపదము, నవీనకల్పితము.

Myrtle - నవీనకల్పితాంగ్ల పదము, పూలభాషలో అనురాగ మర్థము.

**ఎయిత్రియోస్కోపు** (Aethrioscope)— చలనమువలనను, ఆకాశపరిస్థితులు మారుటవలనను గల్గుచుండు శీతోష్ణపరిస్థితుల హెచ్చుతగ్గులను వివరించి తెల్పు యంత్రము.

**ఎయిడోగ్రాఫీ** (Eidography)-పటములు ప్లానులును అంతేగనో లేక చిన్నవిగనో లేక పెద్దవిగనో సిసలుగ (To the correct scale)

ప్రాయుపనిముట్టు లేకసాధనమునకు Eidograph అనిపేరు. దానితో బనిచేయు నేర్పుంగూర్చినకళ.

**ఎయిరోనాటిక్సు** (Aeronautics)— ఆకాశమున గాలియందు తేలుచు నేగుటంగూర్చిన కళకు ఎయిరోనాటిక్సు అనిపేరు. ఇది రెండు భాగములుగఁ జెప్పఁబడినది. ౧. బెలూను (Balloons) అనియు, ౨. బలువగు యంత్ర విమానములు (Heavier than air, Machines) అనియు నైయున్నవి. నిజము పరిశీలించిన నీవాయు విమానోద్యమము క్రీ. శ. ౧౭౮౩ వ సంవత్సరమున మాంట్‌గోల్ఫియర్స్ (Mont-Golfiers) అనువారి ప్రయత్నములనుండి ప్రారంభమైనదని చెప్పనగును. వీరు వేడివాయువును బెలూన్ తిత్తియందునింపి పైకివదలుట అందు బరువునకుగాను జంతువులం బంపుట మొదలగు పనులతోఁ బరిశీలనచేసిరి. పిదప నూరడుగుల త్రాటిని బెలూనునకుం గట్టి అందు పైలటు డిరోజియర్ (Pilatre de Rozier)అను నాయన తానేఎక్కి నూరడుగులఎత్తున కేగెనట. పిదప పైలటు డిరోజియర్ అను నాయనయు మార్క్విస్ డిఆర్లాండెస్ (Marquis d' Arlandes) అనువారును మొదట ఏత్రాటినిర్బంధము లేక బెలూనుపై నేగినవారని చెప్పఁబడినది. తరువాత నిరువురు ఫ్రెంచివారు హైడ్రోజన్ వాయువు నుపయోగించిన బెలూనునం దాకాశమున కేగిరనియు, అదియె ఇక్కాలమున వాడుక యందున్న స్ఫెరికల్ బెలూన్ (Spherical balloon) నకు పునాదిగ పరిగణించెననియు ననుచున్నారు.

పిదప నాంగ్లదేశమున క్రీ. శ. ౧౮౫౨ లో గిఫర్డు అనఁబడిన మహనీయుఁడొక గొప్ప బెలూనును పొగచుట్టయాకారమున రచించెనట. ఇది Navigable balloon అనియు, Airship అనియు ప్రజలచే పిలువంబడుచుండెనని చెప్పఁబడినది. దీనియందొక చిన్న ఆవిరియంత్రము (Steam Engine) అమర్పంబడి దానిబలముచే నడుపంబడెనట. ఆకాలముననే పరాసుదేశమున Depuy de Lome అనుయంత్రశాస్త్రవేత్తయు జర్మనుదేశమున హేన్లీను (Haenlein) అను యంత్రశాస్త్రవేత్తయు గొప్పగొప్ప పరిశీలనలను సల్పుచు వేర్వేఱు విధములఁ జేయుచుండిరట. వీటియందావిరి యంత్రములు, గ్యాసు ఇంజనులు, చేతిబలముచే త్రిప్పఁబడు యంత్రము కూడ వాడుచుండిరట.

ఈ పరిశీలన ప్రయత్నములిటుల ౧౮౮౩ కడ వఱకుం జరగి, ౧౮౮౪ లో రెనార్డు, క్రేబా (Renard and Kreba) యనువారు కలసి, ఎలక్ట్రిసిటీవలన నడపఁబడు విమానమును (Dirigeble airship) రచించిరి. ఇది కొంత వఱకు మాత్రమునుఁగాక యూహాలతిశయించి కడకు ౧౮౯౩ లో ష్వార్ట్సు (Schwarts) అను యాంత్రవేత్త అల్యూమినియము రూపమున నొక విమానము (Aeroplane) ను చేసి నడిపించి చూపెను. అదియే ఇప్పటి ఏరోప్లేనుల కాదియయ్యెనట. ౧౮౯౯ లో జెప్లినులు చేయఁబడియెనట.

ఇంక (Heavier than air, flying machines) గాలికన్న బరువై యెగుర గల విమానములను ఏరోప్లేను (Aeroplanes) లనెదరు. ఇందనేక రకములు గలవు. దీనినొక సుప్రసిద్ధపండితుఁడు "Virtually this is a power-driven Kite, capable of lateral and longitudinal control" అని వివరించి యున్నాఁడు. ఇవి Glider improvement అనిమెదరు. వీనిందొలుత చేసినవారు అమెరికా దేశస్థులగు Messrs. Wright Bros. అను వారని చెప్పఁబడినది.

వీనియందు Single set of planes కల వానిని Monoplane లనియు, Two sets of

Planes కలవానిని Biplane లనియు, Three sets of Planes కలవానిని Triplane లనియు నందురు. అనగా మోనోప్లెన్‌యందుOne tier of wings ఉండుటయు, బైప్లేన్‌యందు Two tiers of wings ఉండుటయు, ట్రైప్లేన్‌యందు Three tiers of wings ఉండుటయు నని భావము. కొన్ని మోనోప్లేనులు లోహముతోనే చేయఁబడినవి కలవు.

నేలనుండి బయలుదేరు తరినిగాని, ఆకసమునుండి నేలకుం దిగునప్పుడుగాని తాము దొరలుచు తిరుగుటవలన చాలా సుళువుగల్గించు చక్రములను క్రింది భాగమున గల ఏరోప్లేనులకు Land Aeroplane అనిపేరు. ఇట్టి చక్రములకు బదులుగ Floats అమర్పఁబడి వానితో సముద్రమునందిగి తేలు దానికి సిప్లేను (Sea-plane) అని పేరు.

ఇంకను ఈ ఏరోప్లేనులందు పడవను బోలిన శరీరాకారముంగల్గి నీటం దేలుచుకూడ ఆకాశమునందువలెనే పోగలుగునది యొకటికలదు. దానికి Flying boat అని పేరు. నీటియందుఁ దేలి పరుగిడునదియు, ఆకసమున గాలిలో నెగురగల్గినదియునగు ఏరోప్లేనును Amphebian aero-plane అనియెదరు. తనరెక్కలకు ముందరగా Airscrew గల దానిని Tractor aero-plane అనుపేరం బిలుచుచున్నారు. వెనుకగా Airscrew కలదానిని Pusher aeroplane అనియెదరు. తొలుత ఏరోప్లేన్‌పై ప్రయాణమును జయప్రదముగ నొనర్చినవాఁడు క్లిమెంట్ ఆడర్ (Clement Adar) అనుపేరుగల ఫ్రెంచి దేశస్థుఁడని చెప్పుదురు. ఈయన క్రీ. వె. ౧౮౯౦ అక్టోబరు ౧౧ వ తేదీని నూటఏబది అడుగుల యెత్తున కెగిరినవాఁడట. దీని రెక్కలు గద్దరెక్కలంబోలి యుండెనట. ఇది ఆవిరి యంత్రముమూలమున నెగిరింపఁబడినదట. తిన్నని రెక్కలతో పెట్రోలు మోటారు ఇంజనువలన నెగిరించి నడుపఁబడిన మొదటి ఏరోప్లేన్ ప్రయాణము ౧౯౦3 డిశంబరులో జరుపఁబడెనని తెలియుచున్నది. ౧౯౧౪-౧౮ ఐరోపామహాసంగ్రామమున వీని ఉపయోగము చక్కఁగఁదెలిసి యుద్ధానంతరము వీనిని అభివృద్ధి పరచిరి. (ఏరోప్లేన్ చూడుఁడు.)

**ఎయిర్గన్** (Air gun) — గాలి తుపాకీ చూడుఁడు.

**ఎయిర్‌ఫోర్సు క్రాసు** (Air Force Cross) — ఈ బిరుదము విక్టోరియాక్రాసుం బోలినది. ఎయిరుఫోర్సునందు పెద్ద ఆఫీసరులకు వారంటుకు ఆఫీసర్సుకు, ధైర్యసాహసకార్యము లొనర్చినందుల కీయఁబడు బహుమానము. ఎయిర్‌ఫోర్సమెడల్ బహుమానముసయితమట్టిదియేకాని, అంతకన్న నించుక తక్కువయని తలఁపఁబడుచున్నది. R. A. F. ఉద్యోగులు, N. C. O. ఉద్యోగులు వీని నాశించుచుందురని తెలిసెడిని.

**ఎయిర్‌ప్రెషర్ (వాతావరణపు ఒత్తిడి)** భూమికడ వాతావరణపు ఒ_ (Air pressure) ఒక చౌకపు అంగుళముకొలత ప్రమాణమునకు పదునేను పౌనులుండునని కన్గొనబడినది. ఇది పాదరసపు భారమితి ( Mercury Barometer) పై ముప్పదియంగుళములుగనయ్యెడిని. ఇది ప్రతి ౧౦౦౦ అడుగులు ఎత్తునకు ఒక అంగుళము ప్రాప్తికి తగ్గిపోవునని అంచనా వేయుచుందురు గాని ఇందు కొంత తేడా కలదు. ఏలనన ఎత్తు అధికమైన కొలఁదియు బరువు తగ్గిపోవుచునేయుండుట సుప్రసిద్ధమే. సముద్రపు నీటిమట్టమున (చూడుఁడు) ముప్పదియంగుళములు గనుండు ఒత్తిడి ఒకమైలు ఎత్తుకడ ఇరువది యై

దంగుళములును, ఆరుమైళ్ల ఎత్తున ఏడుమ్ముప్పాతిక అంగుళములును ఉండుననుట ఇటీవల కనిపెట్టం బడెను.

ఇందింకను గమనింప వలసిన సంగతి వేఱొకటి గలదు. (Warm air is lighter than Cold air. Damp air is lighter than dry air. Cold and dry air pressure approaches maximum; and warm and damp air pressure approaches minimum) వేడిగాలి చల్లనిగాలి కన్న తేలిక. తడిగాలి పొడిగాలికన్న తేలిక. చల్లనిగాలి పొడిగాలుల ఒత్తిడి అత్యధికము. వేడి, తడిగాలుల ఒత్తిడి అత్యల్పముగ నుండును. అను మూడు సూత్రములను మరువరాదు.

గాలులు వీచుట ఎయిర్ ప్రెషరు భేదము నుండియె కలుగుచుండును గాన ఎల్లప్పుడు హైప్రెషర్ (శీతల) ప్రదేశమునుండి లో ప్రెషరు (వేడి) ప్రదేశములకు వీచుచుండుననియు(దీనికి Inword అనిపేరు) మనసునందుంచుకొనవలసి యుండును. ఇందులకు వ్యతిరేకమైనది Outword అన బరగెడిని. మరియును తక్కువ ఒత్తిడి ( Low pressure ) అనుటను, గాలియొక్క పలుచదనముగ (Thinness of the air) కొందఱనెదరు. అనగా ఇందు ఆక్సిజెనుగాలి చాలా తక్కువయుంట ఊపిరి సరిగా ఆడక అటనుండుటయె గొప్ప ఆయాస మయ్యెడిని. ఇటీవల ఆక్సిజెన్ గాలిని అట్టితావులకుం గొంపోవు నుపాయములను నేర్చిరని వినుచున్నారము.

**ఎరల్ బిరుదము** (Earl) — ఇది బ్రిటిషు పీరేజి బిరుదము. బిరుదములలో మూడవ తరగతి. ఫ్రెంచిదేశమున నిట్టి సమానబిరుదము కామ్టే (Comte), జర్మనుదేశమున గ్రాఫ్ (Graf). ఎరల్ల భార్యలను కౌంటెస్ (Countess) లనియు, వారిపుత్రులను ఆనరబిల్ (Honourable) అనియు నందురు.

**ఎరాండి (ఉరి లేక ఓర్) నది** — ఇది నర్మదానదియందు సంగమించెడి ఉపనది. బరోడా సంస్థానరాజ్యమున నున్నది. దీని ప్రశంస పద్మపురాణము స్వర్గ ఆది ౯ యందు కలదు. ఈనదితీరమందేగల కర్ణాళీక్షేత్రము, అటనేగల కర్ణాళీనదీ సంగమమును పవిత్రస్థానములు.

**ఎరియానో పాలి లిపి** – ఇరాన్పాలీ లిపి చూడుడు.

**ఎరుక పిడికెడు ధనమువంటిది** – ఆంధ్రలోకోక్తి.

**ఎరుకలమ్మ దేవత** — విశాఖపట్టణ మండలమునందు శృంగవరపుకోటకడ యరణ్యప్రాంతమున నీమె దేవాలయము కలదు. తొలుత నొక దాసరికి వరపుత్రికగ జన్మించి, ఒక కులజునకుఁ బరిణయమొనర్పఁబడి మహాపతివ్రతగ జీవనము జరపుచుండెను. త్రికాలవేత్తయై ఈమె తన భర్త వేఁటకరుగఁబోవ, వలదనివారించ, ఆతఁడు వినక నేగి పులివాతంబడ నాతనిశరీరము దహనపర్చుకతన తానును సహగమన మొనర్చి పేరఁటాలుదేవతగఁ బూజింపఁబడుచున్నది. ఆ ప్రాంతముల నీమె దేవస్థానము సుప్రసిద్ధము.

**ఎరువునగలు బరువుకుచేటు** — ఆంధ్రలోకోక్తి.

**ఎరేటెడ్ వాటర్సు** (Aerated Waters) — ఇక్కాలమున నాంధ్రదేశమున వీనినెఱుఁగని వారుండరు కాని, స్థూలదృష్టిచే యోచించిన నాపేరు ఖనిజ (Mineral Waters తో) సంబంధము కలదేమో నని స్ఫురింపకపోదు. నిజమారయ నేసంబంధము లేదని తెలియగలదు. లెమనేడు, కోలా, జంజి రేటు మొదలగువాని పేరులనుండియే ఈసంగతి స్పష్టమగును.

ఏరేటెడ్ వాటర్సు బొగ్గుపులుసు గాలి, ప్రాణవాయువులతోఁగలుపఁబడినవి. "Charged with carbonic acid gas (carbon dioxide) in excess or occasionally oxygen" అని నిర్వచింపఁబడియున్నవి క్రీ. వె. ౧౭౯౭ ప్రాంతముల నివి Natural mineral waters కు ప్రోల్కిృతకములు (Imitation) గా చేయంబడుచుండినవి గాని ఇప్పుడు స్వతంత్ర ప్రత్యేకతలనంది వ్యాపించినవి.

ఏరేటెడ్ వాటర్సుగా వీని ఇంగ్లాండుదేశపు సీమలందు క్రీ. వె. ౧౯ శతాబ్దపు ప్రారంభకాలము నుండియు చేయుచుండుట తెలియుచున్నది. ఇవి క్రీ. వె. ౧౮౩౩ సంవత్సరమున చేయంబడిన ౬౮౯౧ నంబరు పేటెంటునుండి తెలియనగును. దానింగూర్చి ఇటులవివరింపఁబడియుంట నిందల్లే వివరించుట సమంజసము.

The essential apparatus consists of a carbonic acid gas generator, a gas-holder, a saturator, and a bottler. The carbonic acid gas is made by the action of sulphuric acid on whiting (calcium carbonate or sodium bicarbonate), the advantage of using the sodium salt being that the by-product sodium sulphate, is useful. In smaller installations and soda fountains, liquid carbonic acid gas, prepared by the complete combustion of coke, is employed.

When the gas is generated it is passed into the gas-holder and the pressure applied which is required in the subsequent operations. The saturator contains the water which is to be saturated with the gas. It is fitted with an agitator or mixer to ensure that the water shall take up the maximum amount of gas. In practice four volumes of gas per volume of water is the amount allowed. If plain water is used in the saturator the product is simply aerated water, but for other varieties the different salts are first dissolved in the water.

ఇంకఁ దక్కిన సోడావాటరునందు సోడియమ్ బైకార్బనేటు ౧౦ గ్రయినులును, లీతియావాటరునందు ౧౦ గ్రయినులు లీతియమ్ కార్బనేటును, పొటేషు వాటరునందు ౩౭ గ్రయినుల పొటాషియమ్ బైకార్బనేటును, సెల్జరు వాటరునందు క్లోరైడు బైకార్బనేటు, సల్ఫేటు అండు ఫోస్ఫేటాఫ్ సోడియమ్‌లు కల్పిన మిక్చరును గేలనుకుఁ జేర్చుదురు. జింజరేటు, లెమనేడ్ మొదలగువానికి సాదా ఏరేటెడ్ వాటరు కావలసియుండెడిని. సిరప్ (పానకము) ముందుచేసి అందు రుచియు, వాసనయు గల్గింతురు. దానిని సీసాలలోగాని సైఫనులలోగానినింపి, బోటలింగు మెషినున కెక్కించుతరి Plain aerated water చేర్చి మెషిను నుపయోగించెదరు. కార్కుతో బిగించుటగాని పేటంటు గాజువుండ బిగిగాని సైఫన్సుమూతంగాని ననుసరించి తక్కిన పరియేషన్ పనియుండును. తరుచుగ ఏరేటెడ్ వాటరునకు నూతినీరే ఉపయోగించుచున్నారు.

**ఎర్తుక్వేక్** — భూకంపము చూడుఁడు.

**ఎర్నెస్టుమనీ** (Earnest money) — ఏదేని యొక వ్యాపారసంబంధ (మూలధన) మున తాను భాగస్థుఁడగుటకు కొన్ని వాటాలం గొనదలంచి తనకందుగల నమ్మకము (Good faith) ను దెల్పుటకు ముందుగా చెల్లించు ధనభాగమునకు పేరు.

**ఎర్బియుమ్** (Erbium) — లోహము. ఆంగ్లరసాయనవేత్తలు దీనిని Oxide of erbia earth అనియందురు. దీని Atomic weight 167.7 అనియు, Atomic number 68 అనియు, Specific gravity 4.77 అనియు

చెప్పఁబడినది. క్రీ. శ. ౧౮౪౩ లో కనిపెట్టఁబడినది.

**ఎఱ్ఱనకవి** (ఎఱ్ఱయామాత్యకవి) — ఆంధ్ర కవి. నియోగిబ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రము శ్రీవత్సగోత్రము. ఆరాధ్యుండగు విద్యాచలానందస్వామి (యోగి) శిష్యుఁడు. తండ్రిపేరు కూచన. ఎఱ్ఱన అష్టభాషాకవిమిత్రుఁడు. తల్లిపేరు ముత్తమాంబ. రచించినవి కొక్కోకమనఁబడుచున్న కళాశాస్త్రము (రతిశాస్త్రము). ఇది వైశ్యదత్తుఁడు రచించిన సంస్కృత కొక్కోకమునుండి ఆంధ్రీకరింపఁబడినది. దీనిని కుంటముక్కల భైరవమంత్రి సుతుండగు మల్లనమంత్రికిఁ గృతియిచ్చెను ఈ కవి క్రి. శ. ౧౫౬౦-౭౦ ప్రాంతపువాఁడని తలంపఁబడుచున్నాఁడు. ఇంకను పురాణసారమను పద్యకావ్యము రచించి కుంటముక్కల మల్లనమంత్రి (కొక్కోకకృతిభర్త) అన్నకుమారుండగు పినభైరవమంత్రికిం గృతినిచ్చెను. ఇతఁడు కొండపల్లి దుర్గమును పాలించుపాలకుఁడుగా నుండినట్లు తెలియుచున్నది. మరియు కొక్కోక కళాశాస్త్రమునందిన మల్లనామాత్యుఁడు వినుగొండదుర్గ పాలకుఁడుగా నుండువాఁడట.

**ఎఱ్ఱను ఎరబెట్టి చేపంబట్టినట్లు** — ఆంధ్రలోకోక్తి.

**ఎఱ్ఱర్సు అండ్ ఒమిషన్సు ఎక్సెప్టెడ్** —(వాణిజ్యసంబంధ పరిభాషాపదము). Errors and Omissions Excepted. దీనికి గుర్తుగ E. & O. E. అనుచుందురు. ఇట్లు ఒక లెక్క లేక దస్తావేజు అడుగుభాగమున వ్రాయఁబడుటవలన పిదప నెప్పుడైనను తప్పులు, పొరపాటులు కనిపెట్టఁబడెనేని సవరణ చేయఁబడవచ్చునని యర్థము.

**ఎఱ్ఱవుల్లి** ఉల్లి చూడుఁడు.

**ఎఱ్ఱాప్రెగ్గడ**—భారతకవులలో కడపటివాఁడు. భారతకవులగు నన్నయు, తిక్కన, ఎఱ్ఱాప్రెగ్గడలను కవిత్రయమనుచున్నారు. ఆంధ్రకవులయందుఁ బూర్వకవులలో నెన్నుకొనఁబడినవాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. ఇంటిపేరు చదలవాడవారు. కాపురము నెల్లూరుమండలములోని కందుకూరి తాలూకాకుం జెందిన గుడ్లూరు. ఆపస్తంబ సూత్రుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. తిక్కనసోమయాజికింబిదప నేబదిసంవత్సరముల నాఁటివాఁడని రా. బ. కందుకూరి వీరేశలింగం పంతులుగారభిప్రాయపడియున్నారు. రచించినవి భారతమందలి అరణ్యపర్వశేషము, నృసింహపురాణము, హరివంశము. ఎఱ్ఱాప్రెగ్గడకు ప్రబంధపరమేశ్వరుఁడనియు, శివభక్తుఁడౌట శంభుదాసుఁడనియు బిరుదములు కలవు. నృసింహపురాణము నహోబల లక్ష్మీనృసింహపురాణమనియునందురు. ఎఱ్ఱాప్రెగ్గడ అద్దంకి రాజధానిగ రాజ్యమేలిన అనవేమారెడ్డి నృపాలుని యాస్థానకవి యనియు, అద్దంకియందే కాపురముండినవాఁడనియు, తొలుత వేమారెడ్డి తమ్ముఁడగు మల్లారెడ్డికడనుండి పిదప వేమారెడ్డికడ నుండనారంభించెనని గురజాడ శ్రీరామమూర్తి పంతులువారు అభిప్రాయపడియున్నారు.

**ఎఱ్ఱాప్రెగ్గడ వంశావళి** ఆపస్తంబసూత్రము. శ్రీవత్సగోత్రము.

మారనమంత్రి
|
ఎఱ్ఱాప్రెగ్గడ

వీరరాజు

ఆదెయామాత్యుఁడు

కసువనమంత్రి వీరన్న సింగరాజు

సింగన్న (భాగవత షష్ఠస్కంధ గ్రంథకర్త) తెలగయ మంత్రి

**ఎఱ్ఱావడచెట్టు** — ఇది వైద్యోపయోగకరము. ఆయుర్వేద వైద్యులు దీనివేరును, ఆకురసమును, సమూలకషాయమును, చూర్ణమును గూడ నుపయోగింతురు. అరుచి, ఉబ్బురోగము, ఊపిరిగొట్టునొప్పి, ఎలుక కరచిన విష దోషములు, కాస జ్వరములు, పాండురోగములు, వమనములు, శ్వాస, శోష, సర్పవిషము నేగాక, సమస్త విషదోషములను హరించునని చెప్పఁబడినది.

**ఎలకూచి బాలసరస్వతి కవి** — ఆంధ్రకవులలో మధ్యకవులందు పరిగణింపఁబడిన వాఁడు, గొప్పవిద్వాంసుఁడు. మహామహోపాధ్యాయ బిరుదముగల వాఁడు. అతనికాలమున చాలాప్రసిద్ధికెక్కినవాఁడు. రచించినవి- రంగకౌముదియను పేరుగల నాటకము, చంద్రికాపరిణయము, మనుప్రబంధము, భాషావివరణము (లక్షణగ్రంథము), ఆంధ్రశబ్ద చింతామణి (వ్యాఖ్యసహా), రాఘవ యాదవ పాండవీయమను త్ర్యర్థికావ్యము మొదలగు నింకకొన్ని గలవందురు.

చంద్రికాపరిణయము పత్తిర్యాల జమీందారులగు జూపల్లి వెంకటాద్రికిం గృతియిచ్చెను. ఈ పత్తిర్యాల ఇప్పుడు పరిటాల యనంబడుచు బెజవాడ కిరువదిమైళ్ల దూరముననున్నది. వెంకటాద్రి తండ్రి లింగన్న. చంద్రిక కాశీరాజు కుమార్తెయనియు, ఈమెను భీముఁడు పరిణయమాడెననియు చెప్పఁబడినది. ఆంధ్రశబ్దచింతామణిని నన్నయ రచించినటులను, దానిని సారంగధరునకాతఁడు పాఠముఁజెప్పి చదివించినటులను, దాని నింకెవ్వ రెఱుఁగనటులను, పైనుండిన ప్రతిని భీమకవి గోదావరిలో కల్పివేసినటులను, పిదప, ఎలకూచి బాలసరస్వతికి సిద్ధుఁడైన సారంగధరుఁడు చెప్పినటులను నాతనివలన నెఱిఁగిన ఆంధ్రశబ్దచింతామణి సూత్రములకు బాలసరస్వతి మహామహోపాధ్యాయుఁడు వ్యాఖ్యరచించినట్టును ఒక ప్రవాదముకలదు. బహుశః దీనినే కాకునూరి అప్పకవి తన అప్పకవీయమున వివరించెను. కాని ఇటీవలి పరిశీలనలు ఆంధ్రశబ్దచింతామణి సూత్రములు గూడ బాలసరస్వతియె రచించి ఏలనో నన్నయభట్టు పేరిడెనని తేలుచున్నది. ఇట్లొనర్చుటకుం గారణమింకను దురూహ్యమని మాయభిప్రాయము.

**ఎలక్ట్రికల్ ఇంటర్ఫియరెన్సు** (Electrical interference) — రేడియో వైర్లెస్ సంబంధమున వాడఁబడు పదము. ఇది మనుష్యకల్పితమైన చికాకు. రేడియోవైర్లెస్ సెట్టును స్థాపించియున్న తావులందు ఎలక్ట్రిసిటీ దీపములకుఁగాని, విసనకఱ్ఱలకుంగాని, వంటలకుఁగాని, యంత్రములను నడపుటకుంగాని ఉపయోగించుకొను నేర్పాటులుండి వాటిని పనిచేయించుచున్నచో రేడియోయొక్క లౌడుస్పీకరు (Loud speaker) పరికరమునందు తరుచుగ లేనిపోని అనవసరపు ధ్వనులు కల్గుచు మాటలు, పాటలు విన్పించుటయందుఁ జికాకులం గల్గించుచుండును. ఇవి పట్టణములందగునేని ఇరుగు పొరుగు ఇండ్లయందలివిగూడ ఇట్టి Electrical interference కలుగఁజేయగలవని అనుభవము వల్లనే తెలియుచున్నది. దీనికిం గారణము రేడియో సెట్టుయొక్క పరిసరములందు ఎలక్ట్రిక్కు కర్రెంటు ఉండుటయేయని పరిశీలనలవలన తేలియున్నది. దీనిం జక్కచేసుకొనుచుండవలసి వచ్చుచుండును.

**ఎలక్ట్రిసిటీ** (Electricity) - ఎలక్ట్రిసిటీని విద్యుచ్ఛక్తి యనెదరుగాని అంతకన్న ఎలక్ట్రిసిటీ యనుటయె సమంజసము. ఈఎలక్ట్రిసిటీ మహాశక్తి సర్వత్రా వ్యాపించియున్న పదార్థము. భూమింజుట్టి వాయుమండలమున్నట్టే ఎలక్ట్రిసిటీయును వ్యాపించి యున్నది. దీనింగూర్చి, అన్ని

వస్తువులకు రాపిడివలన ఎలక్ట్రిసిటీ కలుగును. All materials can acquire Electricity by friction అని చెప్పఁబడినది.

ఇటుల జగమంతయు సర్వత్ర వ్యాపించియున్న ఎలెక్ట్రిసిటీ శక్తింగూర్చి తెలుపుట దుస్తరము. నిష్ప్రయోజనము. తెలిసినను ఎవ్వరికీ ఉపయోగ ముండదు. కాన మనుష్యుల కీమహాశక్తి ఎంతవర కుపయోగించునో అంతదనుక ఎన్ని ఎన్ని విధముల వివరించినను సమంజసములే యగుగాక! మున్ముందు దీనిని మానవులెఱింగిన విధముయొక్క చారిత్రమెరుంగఁదగును.

నల చక్రవర్తి (నిషధ) కాలమున ఆయన నివాస ప్రాసాదమున విద్యుద్దీప కళికలు వెల్గించుచుండెనని జెప్పఁబడి యుంటను సావకాశమున యోచింతురుగాక. క్రీ. వె. ౧౫౪౦ - ౧౬౦౩ కాలము వాఁడగు విలియం గిల్బర్టు (William Gilbert) పండితుఁడు దీని నెఱింగిన మొదటి విద్వాంసుఁడని చెప్పఁబడిన వాఁడు. క్రీ. వె. ౧౭౪౫ లో క్యూనకస్ (Cunacus) పండితుఁడు Leyden Jar అను పరికరమును కనిపెట్టి Electricity జ్ఞానమును అభివృద్ధి పరచెను. క్రీ. వె. ౧౯ వ శతాబ్దకాలమున ప్రారంభ సంవత్సరములందు వోల్టా (Volta) యను వాని పరిశీలనలు దీనిని మానవోపయోగమున స్థిరపర్చెను. ౧౮౩౪లో ఫేరడే (Faraday) విద్యుద్వేత్త Electrolysis విధానముల నేర్పర్చఁగలెను. (Laws of electrolysis). ౧౮౧౯ లో Ocrsted అను వారి పరిశీలన ఫలిత జ్ఞానములు Magnetic field నుగూర్చి వెల్లడించెను. ౧౮౨౦-౧౮౩౦ సంవత్సర కాలమున ఓమ్ (Ohm) మహనీయుని పరిశీలనలు ఆయన రచించిన గ్రంథము ఎలక్ట్రిసిటీని మానవోపయోగ విధానమునకు మరల్చి స్వాధీనములోనికిం దెచ్చి చూపెను. ఈయన ముఖ్యముగ ప్రతిఘటనము (Resistance) ను గూర్చి కన్గొనినవాఁడు.

Faraday పరిశీలకుఁడు Electromagnetic induction ను గూర్చి కన్పెట్టిన వాఁడు. ఈ మహనీయుని పరిశీలనను వెంబడించుచు మాక్స్వెల్ (Clark Maxwell) పండితుఁడు తన పరిశీలనల నంచుచేర్చి ౧౮౭౩ లో ఎలక్ట్రిసిటీని గూర్చిన తన సుప్రసిద్ధ గ్రంథమును రచించి Electricity and Magnetism లం గూర్చి లోకము నచ్చెరువంద జేసెను. ౧౮౮౮ లో Hertz అనుపేరుగల మహాత్ముఁడు సామకాశము లందంతటను విద్యుద్వ్యాపకమును కన్గొని వెల్గు సహాయముతో ఇప్పుడు Photo electricity అనంబడుచున్న విద్య వీలగునని సూచించెను.

వర్తమానవింశతి శతాబ్దమున ఎలక్ట్రిసిటీ మహాశక్తింగూర్చి వ్రాయఁబడిన గ్రంథములలో సర్, థాంప్సను మహాశయుని Electric Discharge through gases తొలుతప్పోన దగిన సుప్రసిద్ధ గ్రంథము. పిదప రూథర్ ఫర్డు పండితునియొక్కయు, సాడీ పండితుని యొక్కయు Radio active materials పై వ్రాయుంబడిన గ్రంథములు గొప్పవిజ్ఞాన ప్రదములని చెప్పఁదగియున్నవి. X-ray spectra of elements ను పరిశీలించి విభజించి Atomic weights ను కన్గొన వీలుకలిగెనట. ఇందువలననే అదివరకెఱుంగని మరికొన్ని Elements కన్గొన వీలయ్యెనట. మఱియుఁ బ్రాముఖ్యతలేనివిగఁ దలంపఁబడిన కొన్ని Elements గల్గినవేయనియుం దెలిసెనట. ఈసందర్భమున నింకొకసంగతి వివరింపఁదగినది కలదు. క్రీ. వె. ౧౭౫౨ వ సంవత్సరముననే బెంజమిన్ ఫ్రాంక్లిన్ (Benjamin Franklin) అను పరిశీలకుఁడగు మహనీయుఁడు మెఱుపునందలి Electric spark ను Electricity ని మనమెరిఁగినరీతిని దానియుందలి

Electric spark ను ఒకేజాతివని కన్గొనెనని చెప్పఁబడినది. మఱియు నామహానీయుఁడే భూమియొక్క ఉపరిభాగమునకు, వాయువునకు నడుమను Potential difference లు కల వనియు, (ఈసందర్భమున) అవి భూమియొక్క Altitude తో మార్పుచెందుననియు కూడ కన్పెట్టెనని చెప్పఁబడినది. Electricty విద్య యొుక్క ఈభాగమునకు తరువాతివారు Atmospheric electricity అని పేరిడి యున్నారు.

క్రీ. శె. ౧౮౧౯ లో Hans Christian Oersted అను డెన్మార్కు దేశపు పరిశీలకుఁడు Electric Telegraph వీలగునని కనిపెట్టిచూపె నట. ఆయన పరిశీలనలను వెంబడిన ఇతరులు దానినిస్పష్టపర్చిరి. కాని ౧౮౩౫ లో శామ్యూల్ మార్స్ (Samuel Morse)అను మహానీయుఁడు Long and Short pulses of current నుప యోగించి నడిపించెను.

ఇంక ఎలక్ట్రిసిటీ లక్షణములను విచారిం తము. ఇది ప్రవహించుచుండు లక్షణము గలది. ఎలక్ట్రోన్సు (Electrons)అనఁబడు పుద్గలములు లేక పరమాణువులచేఁ జేయఁబడినది కాని దీని ప్రవాహమన పుద్గల ప్రవాహము లేక పుద్గల ముల మార్పుని తెలుఁగునది. ఒక విద్వాంసుఁడు Electron is the atom of Electricity అని నుడివియున్నాఁడు. ఇది యొుకవిధమున శక్తియొ గాని వస్తువుకానేరదు. మఱియును Electricity is not in itself a source of power but a product of mechanical or chemical energy అనిరి. Mechanical energy గాని Chemical energy గాని heat energy గాని డైనామొగుండా నడుపుటవలన నదియె ఎలక్ట్రిక్కు ఎనర్జియయ్యెడిని. ఈ Energy చేత నిక్కాలమున లెక్కలేని కార్యములంజేయ నుప యోగించుచున్నారు. ఎంతదూరమైనను దీని నతి

త్వరితముగనడపి యటపనులం జేయఁగల్గుట దీని యందలి యతిశయమని చెప్పఁదగినది. ఒక సుప్ర సిద్ధవిద్యుద్విద్యావిశారదుఁడు విద్యుత్తనోకశక్తిగా (The physicial force called Electricity is one form of energy) నుడివి యున్నాఁడు. Electricity ఇట్టిదని వివరించుట దుస్తరము. It is an effect rather than a flow అని యందురు. అదిచేయు పనులనుండి దాని నెఱుఁగఁదగినది. కాని మఱియొుక విధముగా దానిం జూడశక్యముగాదు.

ఎలక్ట్రిసిటీ లేక ఎలక్ట్రికు ఎనర్జిని కల్గించు తావునకు Generator అని పేరు. ఇది Line యొక్క ఒక కడనుండును. ఇటనుండి వేఱొక తావునకు దీనిని ప్రవహింపఁ జేయవలెనన్న Generator కడ ఎక్కువ Pressure ఉండ వలెను. ఎప్పుడును ప్రవహించుతఱి Electrical energy ఎక్కువ Pressure నుండి తక్కువ Pressure గలతావునకుం బ్రవహించును. అట్లు ప్రవహించు ప్రవాహమునకు Electric current అని పేరు. ఎలక్ట్రిక్కు కరెంటు వెండి, రాగి, ఉక్కు, ఇనుము, తగరము, సీసము, జర్మనుసిల్వరు, ఇత్తడి, ప్లాటినము లోహముల తీగెలగుండా చక్కగా ప్రవహించును. తరచుగ రాగి తీగెలు వాడుచున్నారు. వీనికి Conductors అని పేరు. కొన్ని పదార్థములగుండా Electric current ప్రవహించక నిలచి పోవును. పలకరాళ్లు, అద్దము, పట్టు, కాగితము, రబ్బరు, ఎండిపోయినకట్ట, కొమ్ము, ఎబనైటు, షెల్లాకు, అభ్రకము (Mica) మొదలగున వన్నియు Non-conductor లు. వానిని పరిభాషయందు Insulators అనియెదరు. Electric current ప్రవాహమును Amperes గా లెక్కింతురు. Current ను గల్గించు జనరేటరు

వద్దగాని, నిల్వయుంచిన Battery వద్దగాని ఉండుPressure of current ను Volts గా లెక్కింతురు.

Conductor తీగె వలమునుబట్టి దానిగుండా Current ప్రవహించుచుండును. తీగె సన్నమైన కొలది Current ప్రవహించుట తగ్గును. ఈ తగ్గుటను Resistance అనెదరు. ఈరెసిస్టెన్సును ఓమ్సు (Ohms) గా కొలచి లెక్కించెదరు. Electric current ను తమగుండా లోహము లన్నియు, ఉదకము Carbon కూడా ప్రవహింప జేయును. ఇవి యన్నియు Conductor లు.

ఇటుల కండక్టరు తీగెలగుండా ఒకదెసకుపోవు Current ను Positive current అనియు వేరొకతీగెనుండి దీనికెదురుగవచ్చు కర్రెంటును Negative current అనియు ననుచున్నారు. పొసటివ్ నెగటివ్ రెండు ప్రవాహములు కలసిన దానినొక సర్క్యూట్ (Circuit) అనియెదరు. ఏపనికైన నుపయోగించుటకు ఆయత్తపర్చబడు Electric energy యందు Current ఇటుల Circuit పూర్తిగ నుండి తీరవలయును. అనగా Positive current, Negative current కూడా నుండి తీరవలసినదే. ఇదియే విద్యుచ్ఛక్తి యనంబడుచున్న ఎలక్ట్రిసిటీ నుపయోగించుటకు విధానము. దీనిచే ననేక కార్యము లొనర్ప నుప యోగించుకొను చున్నారు. ఇంక దీనిం గూర్చి తెలియదగిన విషయములలో ముఖ్యము లీక్రింద వివరింపc బడును.

Induction- ఇది యొక ఉత్పాతము. ఒక సర్క్యూటు నందు ఎలక్ట్రిసిటీ ప్రత్యేకముగ వేఱొక సర్క్యూటుగా ప్రవహించుట.

Electric Battery - కొన్ని Voltaic cells గాని, Storage cells గాని, కొన్ని Leyden Jars గాని ఒకటి కొకటి కలుపc బడినవి ఎలక్ట్రిక్కు బేటరీయనంబడును.

Electric column- ఇది Particular Form of votic pile.

Charge of an accumalator- అనగా Storage cells మొదలగు Electric battery ని Accumulator అనియు దానియందు Electric energy current ను ఉంచి అంను నిల్వచేయు ప్రయత్నము నకు Charge అనియునందురు.

Electric line or conductor line- ఏకండక్టరు తీగెలగుండా ఎలక్ట్రికు ఎనర్జిని నడపెదరో ఆతీగెలకు Coils అనియు, లైను అనియు పేరులు.

Electric condenser- ఎలక్ట్రిక్కు స్పార్కు కల్గించవలసిన యదనున కర్రెంటు అధికమై స్పార్కు తగినంతవఱకు రాక పెద్దదిగవచ్చుచో దానిం దగ్గించి వలసినంత చిన్నస్పార్కే వచ్చు నట్లు చేయుటకైన యంత్రసాధనము.

Electric light- ఎలక్ట్రిక్కు కర్రెంటు యొక్క Passage వల్ల కలిగిన వెలుతురునకు Electric Light అనియెదరు. ఈసాధ నమువలన ఇండ్లయందు, వీధులయందు కూడ Electric lights నిర్మించి వెలుగిచ్చునటు చేయుచున్నారు.

Loose contact- కలియదగిన తావుల తీగెల్లు కలియక ఇంచుక జరగుటకు లూజుకాంటాక్టు అనెదరు. ఇందువల్ల తీగెలు మొదలగునవి చెడును.

Electric discharge - దీనిని Release అనియు Escape అనియు ద్వివిధములుగc జెప్పుచున్నారు. ఒకచోట నిల్వచేయc బడిన Electric energy గాని ఒక Conductor line గుండా నడచు Current గాని ఫకార ణము చేతనైనను తప్పించుకొనుటకుగాని, కారిపోవుటకుగాని Discharge అనెదరు.

ఇట్టి Discharge లకు తరుచుగా High pressure కారణమై యుండెడిని.

Electric power - ఎలక్ట్రికల్ ఎనర్జీవలన ఇతర యంత్రములు (మోటారులు, అచ్చు యంత్రములు మొదలగునవి) నడుపఁబడి పని చేయుచుండుతరి వాని Energy electric power అనంబడు చుండును.

Electro motive power - దీనిని ఎలక్ట్రో మోటివ్ ఫోర్సు అనియెదరు. దీనిం గూర్చి Pressure అనిచెప్పఁబడినది. Conductor lines గుండా Electric current ను ప్రవహింపఁజేయు Pressure ను Motive power అనియెదరు.

Electro metallurgy - వాని వాని Ores నుండి లోహపదార్థమును వెడలించుట, లోహములును పరిశుభ్రపర్చుట, Electro plating చేయుట, Electric furnace, Electric welding వీనిం జేయించుటకు Current ను ఉపయోగించుట కీపేరుకలదు. ఇది త్రివిధములుగ నుండునని చెప్పుచున్నారు.

Electrode - ఎలక్ట్రిక్కు సెల్సుయొక్క కొనలకు పేరు.

Electro Dynamics- Electricity in motion నుంగూర్చిన విధులు, విధానములం గూర్చి తెల్పు కళ.

Electrolysis — ఎలక్ట్రిక్కు కరెంటు వలన గల్గింపఁబడిన Decomposition. ఇది liquids కువర్తించెడిని. అనగా Decompose అగునటు చేయుటకైన Electric current నకు యీపేరు వాడు చున్నారు.

Electron- Atom of Electricity అని భావము. క్రీ. శె. ౧౮౯౧ సంవత్సరమున Johnstone Stoney అను శాస్త్రవేత్త ఈపేరిడెనట. అంతకన్న చిన్నదిగా నుండ వీలుకాని పరమాణువుగ నుండి Transfer చేయు (అనగా కరెంటు నడుమ) సావకాశ మిచ్చెడి Electric current నందలిభాగము.

Cut out — జనరేటరు ఎల్లపుడు హైప్రెషరు నందునను, బేటరీ లేక ఎక్యూమలేటరు ఏప్పుడూ లోప్రషరునందునను, ఉండినగాని Current జనరేటరునుండి బేటరీలోనికి పోదు. ఒక్కొక్కతఱి బేటరీ High Pressure అయినచో బేటరీనుండియె కరెంటు జనరేటరులోనికి తిరుగపోవును. అట్లుపోకుండ సంబాధముకు ఆటంకము గల్పించుటకైన యీపరికరమునకు Cut out అని పేరు.

Switch - ఇదియు ఒకమోస్తరు Cut out. కరెంటు ప్రవహించకుండా ఆపు ఏర్పాటు. ఇది చాలా చిన్నది.

Fuse-ఇదిసన్నని తగరపుతీగెలతోగానిసీసపుతీగెలతోగాని చేయఁబడియుండు పరికరము. ఒకతావునకుదీనిగుండాCurrentపోవునట్లుద్వారమున దీనినమర్చియుంచెదరు. Current నకు వ్యత్యాసపుస్థితిగతులు సంభవించినతరి ఇది కాలిపోయి లోనికి ఆ కరెంటు పోకుండ నాపును. కాని లోని తీగెలు, దీపములు మొదలగునవి చెడవు.

**ఎలక్ట్రోకల్చర్** — ఇది విద్యుచ్ఛక్తిం బ్రసరింపఁజేసి అభివృద్ధి నందించుట, రోగములను నివారించుటయై యున్నది. విద్యుచ్ఛక్తివలన మనస్సంబంధరోగములం గూర్చిన వైద్యవిధానమును కొన్ని వత్సరములుగ మనము విను చున్నారము గాని ఇది యట్టిదేయైనను విధానమున వేఱుగనున్నది. దీనిం గనిపెట్టినవారు డాక్టరు నెహ్రూ పండితుఁడు. ఈ బుద్ధిశాలి, I. C. S. పరీక్షయందుత్తీర్ణులై ఆగ్రా, అయోధ్య

సంయుక్తరాష్ట్రములలోని మెయిన్పురిజిల్లా కలెక్టరుగ నున్నవారు. ఆయన దీనిని "Science of capturing and harnessing Cosmo-radio-magnetic energy and applying it towards the solution of problems" అని వివరించియున్నారు. దీనింగూర్చిన పరిశీలన లా మహనీయుఁడు పెక్కు లొనరించెనట. ఈవిధానము చెట్లకు, జంతువులకు మానవ శరీరములకుఁ గూడ నుపయోగించునని కనిపెట్టంబడినది. దీనిగూర్చిన పరిశీలన లింకనూ జరగుచునే యున్నను, మెయిన్పురి పండ్లసేద్యపు సంఘమువారి రికార్డునందలి రిపోర్టులు మొదలగు కాగితములనుండి ఇది సాధ్యమేకాని వేరు కాదని స్పష్టము కాగలదు.

దీని నిజతత్వమును పరిశీలకు లిట్లు వివరించుచున్నారు. జీవించియున్న కాలమున వృక్షముల యొక్కయు, మృగముల యొక్కయు, పక్షుల యొక్కయు, మనుష్యుల యొక్కయు శరీరములందు Life cells ఉండునని ఎల్లతెరింగినదే. వానియందు గల శక్తికి Cellular activity అని శాస్త్రవిదులు పేరిడియున్నారు. అట్టి సెల్యులర్ ఏక్టివిటీ ఎచటనుండునో అచటనే ఎలక్ట్రికల్ ఏక్టివిటీకూడ నుండితీరునని, ఇప్పుడు సిద్ధాంతము చేయఁబడినది. ఇందింకను వేఱొక రహస్యము కలదు. సెల్సు యొనరించెడి కార్యములం బ్రోత్సహించి బలపర్చునట్టి గాని, తగ్గించి పాడుచేయునట్టి గాని, కారణముగనున్న శక్తి, ఎలక్ట్రికల్ ప్రవాహముంగూడ ప్రోత్సహించి బలపర్చుటకుంగాని తగ్గించి పాడుచేయునట్లుగ గాని యుండునని కన్గొనం బడినది. శరీరమందలి ఏసెల్నందైనను (ఆ శరీరము జీవించియుండుతరి) అట్టి శక్తి నేవిధానముచేతనైనను ప్రోత్సహించి (Stimulate) బలపర్చితిమేని అందున్న ఎలక్ట్రికల్ ఎనర్జీయును దానితోఁబాటు బలపడి ఆసెల్ ఏ అవయవమునందుండునో ఆ అవయవమునకు బలమొసంగెడిని. ఇది ఈ ఎలక్ట్రోకల్చరు విధానమునకు నిజతత్వ సిద్ధాంత రహస్యముగాఁ దనరెడిని.

వినూఁచ్చ ఇట్టిపనుల కుపయోగించునని ఇదివరకే లోకమెఱిగియున్నను భరతదేశపు బీద పరిస్థితులందు రైతు చౌకగ సంపాదించుకొనఁగల యంత్రసహాయముతో విద్యాపరిజ్ఞానము, నేర్పు నెఱుంగని ప్రజలు చులకనగ ఎలక్ట్రోకల్చరు నుపయోగించుకొనుట బయల్పడజేసిన నెహ్రూ పండితుఁడు మెప్పున కర్హుఁడు. పాశ్చాత్యవిధాన విద్యుద్దర్శవిధుల జనరేటర్సు, డైనామోలు, ఇన్సులేటర్సు అధికమూల్యముంబెట్టి కొననక్కరలేదనియు, కడుబీదయగువాఁడుసంపాదించుకొని ప్రజ్ఞలేని మందబుద్ధినైత ముపయోగించుకొనఁదగినరీతిని నెహ్రూపండితుఁడు చూపియున్నాఁడు.

ఏ ప్రాతదైనను ఒకమోటారుకారు మేగ్నెటో యొకటియు, కొన్ని ఇండియా రబ్బరుముక్కలు (ఇవి తీసివేసిన మోటారుచక్రముల ట్యూబ్సు నుండి కోసికొనినవి చాలును), ఏ ప్రాతదైనను వైర్నెట్టింగు ముక్కలు, గాజుపూసలు, సన్నపు ఇనుపతీగెలుండిన నీ విధానమునకుఁ జాలును. నాల్గుమొద లారంగుళముల వెడలుపున వేళ్లు కంటునటుల చెట్టుమొదట వైర్నెట్టింగు చుట్టుం జుట్టిన నదియే Inflow of radio magnetic energy గల్గించు Electric field గ నేర్పడునని యు, అనగా This will attract and capture the energy wich the tree will absorb to be utilized to stimulate and sustain its growth, by passing on to every tissue to produce energy to make the tree productive అనిభావము. దీనికిం దోడుగ వేరుసంగతి కలదు.

బొంబాయి నగర నివాసియగు అగస్కార్ పండితుఁడు నీటిని ఎలక్ట్రిఫై చేయుటంగనిపెట్టినవాఁడుగాన అట్టి నీటికి నెప్రహూపండితుఁడు అగాస్కార్సై జుడ్వాటరు అని పేరిడియున్నాఁడు. నెప్రహూపండితుఁడు ఎలక్ట్రిఫైడ్ నీటిని చెట్లకుంబోయుట వలనను, పశువులు పక్షులు మొదలగువానికిం ద్రాగించుటవలనను చెట్లు రోగములంబాసి చక్కఁగ వర్ధిల్లుటయేగాక విరివిగఁబూచి కాచునని నెప్రహూపండితుఁడు కనిపెట్టెను. ఇంకను పశుపక్ష్యాది శరీరములందలి రోగబాధానివృత్తులం గల్గించి, వాని శరీరపు సెల్సు, టిష్యూలు బలపడి యభివృద్ధినందుననియు కన్గొనియున్నాఁడు. ఇంక మానవశరీరమునందలి టిష్యూలు చెడుచుండుట బాధల కాస్పదమై రోగకారణ మగుననియు, గాజుపూసలను, రబ్బరుముక్కలను ఇనుపతీగెలతో గ్రుచ్చి మేనం ధరించుటవలన నట్టిఫలితమేగల్గించుననియు నుడివియున్నాఁడు.

నీటిని ఎలక్ట్రిఫై చేయుటయన ఒకకుండజాడీలో నీటింబోసి ఇన్సుల్యేటరు తీగనొకకొన నీటియందుండజేసి రెండవకొనను మేగ్నెటోకంటించి కఱ్ఱపిడితో కొన్నిసార్లు త్రిప్పిన నెలక్ట్రిక్కు స్పార్కు లానీటం బ్రవేశించునదియె విధానము. ఒక్కస్పార్కైనం జాలుననియు, ఆ స్పార్కే నీటిగుణమునుమార్చగలదనియు నెప్రహూపండితుఁడనియున్నాఁడు. ఇంక నీ స్పార్కులచే నూతులు కాల్వలందు ప్రవహించు జలములుకూడ నెలక్ట్రిఫై చేయ వీలుండునని ఆయన యూహించుచున్నారట.

ధాన్యాదులు పొలములందు విత్తనములుగ జల్లుతరి నొక గంటకాలమగాస్కార్ జుడు (ఎలక్ట్రిఫైడ్) నీటియందుంచి జల్లిన నెక్కుడు ఫలము గల్గునని కనిపెట్టంబడినదందురు. అత్తరిని ఇండియా రబ్బరుతో చేయంబడిన చేతి Gloves తొడుగుకొనవలయునని యందురు.

ఇట్టిపరిశీలనలను పశ్చిమోత్తర సరిహద్దు పరగణాలందు, ఎగ్రికల్చరు, హార్టికల్చరు, ఇండస్ట్రీస్, డైరక్టరు ఉద్యోగమందున్న Col. Noel గారిట్టి నెప్రహూపండిత విధానమునసే సల్పి నీటియందలి నిజమారసి రని తెలియుచున్నది. పాడిపశువుల కట్టినీటిం ద్రావించుట వలనను, అవితిను యాహారము నానీటందడిపి యుంచుటవలనను, పాతికరెట్లు పాడి యధికమై పశువులు బలపడుననియు, చిరకాలము జీవించుననియు, ఎక్కువ పనిచేయుననియు, రోగములకు లొంగక నిలచుననియు చెప్పుదురు. అట్టి పశువుల పాడినుండివచ్చు వెన్నయు, నేయియు అధిక పరిమళము గల్గియుండునని యనుచున్నారు. ఇట్టినీటితో తానొక కుష్ఠురోగి రోగముం గుదిర్చి బాగుచేయగల్గితినని ఫ్రెంచిదేశస్థుఁడగు డా. లేఖోస్కీ వైద్యశిఖామణి ఇటీవల తెల్పియున్నాఁడు. ఆయన అట్టినీటియందు Germicidal properties ఉండునని యనెనట.

**ఎలక్ట్రో డైనామోమీటర్** (Electro dynamometer) ఎలక్ట్రిసిటీ కరెంటుయొక్క బలముంబరీక్షించుట కైన పరికరము.

**ఎలక్ట్రోప్లేటింగు** — భరతదేశపు ఆదికాలపు అపరంజిపూత, రజితపుపూతలకు ఇక్కాలపు నవనాగరికపుకళ. ఒకలోహముపై ఇంకొకలోహపు పూతను Electro chemical action వలన ఎక్కించుటయని భావము. ఇందువలన లోపలి లోహము రక్షణనందుటయు, పైపూతపూసిన లోహమువలెనే వస్తువంతయు నగుపడుటయు ఫలితములుగఁ జెప్పఁబడినది. ఒకలోహముపై యింకొక లోహమును పైపూయుటయని భావము.

**ఎలెక్ట్రోలొజీ** (Electrology)- విద్యుచ్ఛక్తిసంపూర్ణ లక్షణధర్మములం గూర్చిన కళ.

**ఎలారిక్** (Alaric) — ట్యూటానిక్కు పేరు. ఇటలీని జయించి చక్కగా పాలించిన సైనిక భూపాలుడగు Alaric I పేరు. Noble Ruler అని యర్థమిచ్చు పేరు. పురుషనామము. (క్రైస్తవ నామములు చూడుడు).

**ఎలిమెంటు**(Element) -భూతపదార్థము పృథివ్యప్తేజోవాయు రాకాశముల నైదింటిని పంచభూతము లనుచున్నారు. వీని కాంగ్లమున Elements అనెదరు కాని అది సరియగు భావము దెల్పు అర్థము కానేరదు. ఎన్నివిధముల పరిశీలన లొనర్చినను చెడక (Decompose కాక) నిలచుదానిని Element అని చెప్పుదురు. "A simple part of a complex whole" అని యొక సుప్రసిద్ధపరిశీలకుడును, "A component of fundamental part" అని యొక సుప్రసిద్ధ పరిశీలకుడును దీనిని వివరించిరి. రసాయన శాస్త్రవేత్తలు దీనిని "A substance which cannot be decomposed by an analysis" అని దీనిని వివరించియున్నారు. "Chemical elements are the fundamental or basic substances which could not be further split up or decomposed" అని దీని నాంగ్లరసాయన శాస్త్రజ్ఞు లనెదరు.

క్రీ. వె. ౧౭౪౩-౧౭౯౪ కాలమున జీవించిన లెవాయిజర్ (Lavoisier) విద్వాంసుడు ఆకాలమునకు తెలిసినన్ని Elements ఇరువదిమూడుగా వివరించెను. తర్వాత పరిశీలనలు ఇంకను కనుగొనిరి. ఇక్కాలమునకు Elements అని చెప్పబడదగినవి తొంబదిగా తెలియుచున్నవి. ఇనుము, జింకు, తగరము మొదలగునవి ప్రత్యేకముగ దొరకెడిని. మరికొన్ని అనేకరకములు కలసియుండి దొరకును. వానిని Compounds అనెదరు. Elements ను Elementary Substances యనుటయుం గలదు. ఇందు బంగారము, పాదరసము, ఆక్సిజెన్ లున్నట్లు Solids, Liquids, Gases కూడ నుండును.

**ఎలిమెంట్సు** (Elements) — రాబర్టుబోయల్ అను రసావాద శాస్త్రవిదుడు రసవాదశాస్త్రము నుద్ధరించినవాడు. ఈ మహనీయుడు ఈశాస్త్రమున ఎలిమెంట్సు అను పదమును A substance which so far had not been split up into any other substance అని నిర్వచించియున్నాడు. తరువాత వేఱొక రసాయన విద్యావేత్త Metal is a substance which cannot be decomposed at will అని నిర్వచించియున్నాడు. ఆంగ్లరసవాద విద్యయందు వివరింపబడినమేరకు ఎలిమెంట్సు ఐదువిధములుగ విభజింపబడినవి. ౧. మెటలిక్ ఎలిమెంట్సు - ఇవి బంగారు, వెండి, రాగి, ఇనుము, తగరము మొదలగునవి. ఇవి గట్టిగనుండునవి (Solids). వీనికి లోహములనియు, పేరుగలదు. ఇవి అయా లోహపు రంగు, కాంతింగూడ గల్గియుండి వేడిని ఎలక్ట్రిసిటీని తమగుండా ఇటునటు ప్రసరింపజేయునవి "these possess certain definite chemical properties" అని చెప్పబడినది. ౨. మెటలిక్ ఎలిమెంట్సు వలె Certain definite chemical properties కల్గియుండని ఎలిమెంట్సును నాన్మెటలిక్ ఎలిమెంట్సని పేరిడి యున్నారు. (Non-metalic elements). 3. ఆర్సెనిక్కు (Arsenic), టెల్లూరియమ్ (Tellurium) మొదలగు కొన్ని ఎలిమెంట్సు ఉభయలక్షణములం గల్గియున్నవి. ౪. హైడ్రోజెన్, ఆక్సిజెన్, నైట్రోజెన్, క్లోరెన్ మొదలగు కొన్ని ఎలిమెంట్సు గాలి రూపములు (Gases). ౫. పాదరసము, బ్రోమైన్ (Bromine) అను రెండు ఎలిమెంట్సును ద్రవరూపకములు. ఆంగ్లరసవాద శాస్త్రము మేరకు ఎలిమెంట్సు తొంబది లెక్కింపబడినవి. అందు ఎనుబదినాల్గు ముఖ్యములనియు, ఆరు శాస్త్రదృష్ట్యా తప్ప పరిగణింపబడదగినవి కావనియుం జెప్పబడినది.

| ఎలిమెంటు పేరు. | | కెమికల్సింబల్ గుర్తు | ఆటామిక్కు వెయిటు తూనిక | సంఖ్య Atomic No. | వివరణము |
|---|---|---|---|---|---|
| ఆంధ్ర | ఆంగ్ల | | | | |
| అల్యూమినియమ్ | Aluminium | Al | 26.97 | 13 | మెటలిక్ ఎలిమెంటు |
| ఏంటిమొనీ | Antimony | Sb | 121.77 | 51 | |
| ఆర్గాన్ | Argon | As | 39.91 | 18 | |
| ఆర్సెనిక్ | Arsenic | Ba | 74.96 | 33 | ఉభయలక్షణోపేతము |
| బేరియమ్ | Barium | A | 137.37 | 56 | |
| బెరిలియామ్ | Beryliam | Be | 9.02 | 4 | |
| బిస్మత్ | Bismuth | Bi | 209 | 83 | |
| బోరన్ | Boron | B | 10.82 | 5 | |
| బ్రోమైన్ | Bromine | Br | 79.92 | 35 | |
| కేడ్మియమ్ | Cadmium | Cd | 112.41 | 48 | |
| కేస్నియమ్ | Caesium | Cs | 132.81 | 55 | |
| కేల్సియమ్ | Calcium | Ca | 40.07 | 20 | |
| కార్బన్ | Carbon | C | 12 | 6 | |
| కేరియమ్ | Cerium | Ce | 140.25 | 58 | |
| క్లోరిన్ | Chlorine | Cl | 35.46 | 17 | |
| క్రోమియమ్ | Cromium | Cr | 52.01 | 24 | |
| కోబాల్టు | Cobalt | Co | 58.94 | 27 | |
| కొలంబియం | Columbium | Ch | 93.1 | 41 | |
| రాగి | Copper | Cu | 63.57 | 29 | |
| డైస్ప్రోసియమ్ | Dysprosium | Dy | 162.52 | 66 | |
| ఎర్బియమ్ | Erbium | E | 167.7 | 68 | |
| యూరోపియమ్ | Europium | Eu | 152 | 63 | |
| ఫ్లోరియమ్ | Fluorium | F | 19 | 9 | |
| గడోలినియమ్ | Gadolinium | Gd | 157.26 | 64 | |
| గల్లియమ్ | Gallium | Ga | 69.72 | 31 | |
| జర్మేనియమ్ | Germanium | Ge | 72,6 | 32 | |
| బంగారము | Gold | Au | 197.2 | 79 | |
| హాఫ్నియమ్ | Haffnium | Hi | 180 | 72 | |
| హెల్లమ్ | Hellum | He | 4 | 2 | |
| హోల్మియుం | Holmium | Ho | 163.4 | 67 | |
| హైడ్రోజన్ | Hydrogen | H | 1.008 | 1 | వాయురూపము |
| ఇండియమ్ | Indium | In | 114.8 | 49 | |
| అయోడిన్ | Iodine | I | 126.93 | 53 | |
| ఇరిడియమ్ | Iridium | Ir | 193.1 | 77 | |
| ఇనుము | Iron | Fo | 55.84 | 26 | |

| ఎలిమెంటు పేరు. ఆంధ్ర | ఆంగ్ల | కెమికల్సింబల్ గుర్తు | ఆటోమిక్కు వెయిటు తూనిక | సంఖ్య Atomic No. | వివరణము |
|---|---|---|---|---|---|
| క్రిప్టన్ | Crypton | Kr | 89.92 | 36 | |
| లాంతానమ్ | Lanthanum | La | 138.9 | 57 | |
| లెడ్ | Lead | Pb | 207.2 | 82 | |
| లిథియమ్ | Lithium | Li | 6.94 | 3 | |
| లిటీసియం | Letceium | Lu | 175 | 71 | |
| మేగ్నీషియమ్ | Magnesium | Mg | 24.32 | 12 | |
| మేంగనీస్ | Manganese | Mn | 54.93 | 25 | |
| పాదరసము | Mercury | Hg | 200.61 | 80 | |
| మోలీబ్డినమ్ | Molybdenm | Mo | 96 | 42 | |
| నియోడైమియమ్ | Neodymium | Nd | 144.27 | 60 | |
| నియోన్ | Neon | No | 20.2 | 10 | |
| నికెల్ | Nickel | Ni | 58.69 | 28 | |
| నైట్రోజిన్ | Nitrogen | N | 14.008 | 7 | వాయురూపము |
| ఓస్మియమ్ | Osmium | Os | 190.8 | 76 | |
| ఆక్సిజెన్ | Oxygen | O | 16 | 8 | |
| పల్లాడియమ్ | Palladium | Pd | 106.7 | 46 | |
| ఫోస్ఫరస్ | Phosphorus | P | 31.027 | 15 | |
| ప్లాటినమ్ | Platinum | Pt | 195.23 | 78 | |
| పొటాషియం | Potassium | K | 39.1 | 19 | |
| ప్రెస్కాడైమియమ్ | Prascodymium | Pr | 140.92 | 59 | |
| రేడియమ్ | Radium | Ra | 225.95 | 88 | |
| రేడన్ | Rudon | Ru | 222 | 86 | |
| రోడియమ్ | Rhodium | Rh | 102.91 | 45 | |
| రుబిడియం | Rubidium | Rb | 85.44 | 37 | |
| రుథినియమ్ | Ruthenium | Ru | 101.7 | 44 | |
| సమేరియమ్ | Samarium | Sa | 150.43 | 62 | |
| స్కాండియమ్ | Scandium | Sc | 45.1 | 21 | |
| సిలేనియమ్ | Selenium | Se | 79.2 | 34 | |
| సిలికన్ | Silicon | Si | 28.06 | 14 | |
| రజితము | Silver | Ag | 107.88 | 47 | |
| సోడియమ్ | Sodium | Na | 23 | 11 | |
| స్ట్రోన్టియమ్ | Strontium | Sr | 87.63 | 38 | |
| గంధకము | Sulphur | S | 32.064 | 16 | |
| తంతాలమ్ | Tantalum | Ta | 181.5 | 73 | |
| టెల్లూరియమ్ | Tellurium | Te | 127.5 | 52 | |

| ఎలిమెంటు పేరు. | | కెమికల్సింబల్ గుర్తు | ఆటామిక్కు వెయిటు తూనిక | సంఖ్య Atomic No. | వివరణము |
|---|---|---|---|---|---|
| ఆంధ్ర | ఆంగ్ల | | | | |
| టెర్బియమ్ | Terbium | Tb | 159.2 | 65 | |
| థాలియమ్ | Thallium | Ti | 204.39 | 81 | |
| థోరియమ్ | Thorium | Th | 232.15 | 90 | |
| థూలియమ్ | Thulium | Tm | 169.4 | 69 | |
| టిన్ తగరము | Tin | Sn | 118.7 | 50 | |
| టిటానియమ్ | Titanium | Ti | 48.1 | 22 | |
| టంగ్స్టన్ | Tungsten | W | 184 | 74 | |
| ఉరేనియమ్ | Uranium | U | 238.17 | 92 | |
| వనాడియమ్ | Vanadium | V | 50.96 | 23 | |
| క్సెనన్ | Xenon | X | 130.2 | 54 | |
| యెట్టర్బియమ్ | Ytterbium | Yb | 172.6 | 70 | |
| యెట్రియమ్ | Yttrium | Yt | 88.9 | 39 | |
| జింకు | Zinc | Zn | 65.38 | 30 | |
| జిర్కోనియమ్ | Zirconium | Zr | 91 | 40 | |

**ఎలిసీ ప్రాసాదము** — (Elysee in Paris) — ఇది ప్రపంచమునందలి సుప్రసిద్ధ భవనములలో నొకటి. ఇప్పుడు ఫ్రెంచిదేశపు ప్రజాప్రభుత్వపు అగ్రాసనాధిపతిగారి యుద్యోగ కాలమున ఆయనకు పారిస్‌నగరమందలి నివాస భవనముగ నున్నది. దీనిం జుట్టియున్న ఉద్యానవన ప్రధానద్వారము నంటిన చక్కని మార్గమునకును ఇదేపేరున Champs de Elysees అనియెదరు. మోలెట్ (Molet) అనువారిచే కట ్టంబడి Count of Evreux గారి యాస్తిగ నుండి, Madame de Pompadour గారి వశమందుండెను. వీరియెడల చక్రవర్తి (౧౫ వ లూయీసార్వభౌముడు) కి చాల మోదమని యెదరు. క్రీ. శ. ౧౭౮౯ విప్లవమునకుంబిదప ప్రభుత్వముకుం జేరిపోయెను.

Tuileries రాజభవనములోనికి తానరుగక మున్ను నెపోలియన్ చక్రవర్తి ఇందు నివసించె ననియు, మఱియు నాయన రెండవసారి కిరీటమును వదలుకొనిన పత్రమున (క్రీ. శ. ౧౮౧౫) నీభవనమునందే సంతకముచేసెననియు పిదప విప్లవము దనుక నీ భవనము ప్రభుత్వమువారి అతిథిగృహముగ వాడంబడుచుండెననియుం జెప్పంబడినది.

**ఎలుకచెవికూర చెట్టు** — లా. Salvinia, Cucullata. సం. అఘుకర్ణి, ద్రవంతి, పత్రశ్రేణి. ఇది వైద్యోపయుక్తమగునది. దీని యాకులందు మల, మూత్రములు వెడలకుండ బద్ధమొనర్చు దోషముకలదు. దీనిసమూల రసము లేక సమూలమునూరిన ముద్ద ఉదరరోగములు, ఎలుకకాటు విషము, కఫదోషము, కడుపుబ్బరము, క్రిమిరోగము, జ్వరములు, ప్రమేహదోషములు, పాండురోగము, పైత్యరోగములు, బహుమూత్రము, బహూదరరోగము, భగంధరము, రసదోషములు, వాతదోషములు, శూలలు, సుఖవ్యాధులు (సెగరోగములు

మొదలగునవి), నివారించునటియు, చలువజేయు నటియుం జెపఁబడినది.

**ఎలుకపడ్చునని పిల్లికికనికరమా?**- ఆంధ్రలోకోక్తి.

**ఎలుకలవిూది క్రోధమున ఇంటికి చిచ్చుపెట్టుకొందురా?**- (చిచ్చు=అగ్ని) ఆంధ్రలోకోక్తి.

**ఎలుగుబంటి జాతులు** — భరత దేశపు టడవులందు నల్ల ఎలుగు గొడ్లు సర్వసాధారణముగ నుండును. ఐరోపాఖండపు ఉత్తర దిశను అరణ్యములందు



తఱచుగ Brown, black, grisly రంగుల ఎలుగుబంట్లు కలవు. వానికి శాఖాహారమే తరుచుగ లభించుచుండును. అచటివారు ఇవి చేపలను, పులుగులను కూడ తినునందురు. భరతదేశపు నల్లజాతి చీమల బీళ్ళి నమలి మ్రింగుట సుప్రసిద్ధమే. ఐరోపాజాతులు శీతకాల మంతయు నిద్రించుచునే యుండుననెదరు.

**ఎలుగుబంటికి తంటసము** — ఆంధ్ర లోకోక్తి.

**ఎల్యూవియమ్** — ఏటి ఒండుమట్టి చూడుఁడు.

**ఎలోంజి** (Allonge) — (వాణిజ్య పరిభాషాపదము). హుండీలు మొదలగువాటికి సంతకములు వ్రాతలతో నిండిపోయినతరి వేఱొక కాగితపుముక్కను తక్కిన సంతకములు వ్రాతల నిమిత్తము అతుకుదురు.

**ఎల్టిమీటర్** (Altimeter)— భూమిపై నొక రేఖయు, దాని యొకకొననుండి సూర్యుని వైపు పైకినొకరేఖయుగీచి మూలను (Angle) ఏర్పఱచినదానిం గొలుచునది.

**ఎల్లప్ప(శెట్టిగారిలెక్క ఏకలెక్క)**- ఆంధ్రలోకోక్తి.

**ఎల్లిప్సి** (Ellipse) — కోలగ (Oval) నున్న గోళము. భూచలనము చూడుఁడు.

**ఎలోట్మెంటు** (Allotment) — వాణిజ్యసంబంధ పరిభాషాపదము. ఒక కంపెనీ యందలి వాటాలను ప్రత్యేకించి ఒకరికిగాను ఏర్పఱచుట.

**ఎల్ అక్షరమునకుం జెందిన క్రైస్తవ పురుష నామములు** —

Laban- హీబ్రూపదము, White అని యర్థము. రిబకాసోదరునిపేరు.

Lachlan, Lauchlan- కెల్టిక్కు నామము, War-like అని యర్థము.

Lacon- (ఉచ్చారణ Laykon) — రష్యా పర్యాయపదము, Laco (నవీన). Ruling with force అనియర్థము.

Ladislas, Ladislaus- రష్యాపదము, Famous ruler అని యర్థము.

Lambert- ట్యూటోనిక్కుపదము, Country's brightest అని యర్థము.

Lancelot, Launcelot- ట్యూటోనిక్కుపదము, (ఉచ్చారణ Lance-lot అని). సేవకుఁడని యర్థము.

Laugton- నవీనము.

Laodamas- గ్రీకుపదము, People's tamer అని యర్థము.

Latimer- నవీనపదము, St. Latimer చాల భక్తుఁడట.

Lavoslav- రష్యను పదము, Lion glory అని యర్థము.

Lawley- నవీనపదము.

Lawrence, Laurence, Laurens, Laurentius- లాటిన్పద రూపములు, Laurel crowned అని యర్థము. దీని ముద్దుపేరులు Larry, Laurie, Larkin. St. Laurence మహాత్మునిపేరు.

Lazarus, Lazar, Lazare- హిబ్రూ పదము, God will assist అని యర్థము.

Leander, Leandre- గ్రీకుపదము, సింహ బలుండనియో, నరసింహుండనియో యర్థము.

Lebbeus- హిబ్రూపదము, సాగరమునకర్థము.

Leger- ట్యూటోనిక్కుపదము, People's spear అని యర్థము.

Leicester- నవీనము.

Leif- వెల్షు పదము.

Leigh- (ఉచ్చా lie); Leighton (ఉచ్చా Layton) నవీన పదములు.

Leith- నవీన పదము.

Lemuel- హిబ్రూ పదము, Unto God అని యర్థము.

Lennox- నవీన పదము.

Leo, Leon, Leone- గ్రీకు పదము, సింహ మునకర్థము. పదముగ్గురు పోపుగురుస్వాము లకు, ఆర్గురు రోమకచక్రవర్తుల కీపేరుండెను.

Leofric- ట్యూటోనిక్కు నామము, Beloved rule అని యర్థము.

Leofwini - ట్యూటోనిక్కు నామము, Beloved friend అని యర్థము.

Leonard, Leonhard, Leonarde, Leunard- ట్యూటోనిక్కు పదములు, Strong as a lion అని యర్థమిచ్చునవి. ఇందలి ముద్దుపేర్లు Leo, Leon, Leonidas.

Leontius - గ్రీకు పదము, Sparta King యొక్కపేరు. సింహాబలుండనియర్థము.

Leopold- ట్యూటోనిక్కు పదము, People's prince అని యర్థము.

Leslie, Lesley- నవీన పదము.

Levi- హిబ్రూపదము, Joining అని యర్థము.

Lew - గ్రీకుపదము, సింహమర్థము.

Lewis, Lewin - ట్యూటోనిక్కు పదములు, Famous warrior అని యర్థము. దీని నుండి కల్గిన ముద్దు పేర్లు Lew, Lewie అనినైె యున్నవి.

Lindley, Lindsay - స్కాచి పేరు, నవీన పదములు.

Lionel, Lyonel, Lyon - లాటిను నామ ములు, Young lion అని యర్థము.

Llewelyn, Llywelyn, Llewellyn కెల్టిక్కుపదము, Lightning అనియర్థము. దీని ఉచ్చారణ Lewellin.

Lloyd - కెల్టిక్కుపేరు, Grey అని యర్థము.

Lockhart - నవీన పదము.

Lorenzo, Lorenz - లాటిన్పదము (Lawrence చూడుడు).

Lot - హిబ్రూ పదము, Wrapped up అని యర్థము.

Lothaire, Lothairo, Luther - ట్యూటో నిక్కుపదము, Warrior అని యర్థము.

Louis, Luis, Ludovic, Lodovic — ట్యూటోనిక్కు పదము, Holy protector అని యర్థము.

Lovell - నవీన కల్పిత పదము.

Lucas, Lucanus, Lucianus, Lucian, Lucien, Lucius - లాటిన్పదములు, Light dawn అని యర్థము. Similar to Luke.

Lucifer, Luciferus -- లాటిన్పదములు, వెలుగుం దెచ్చువాండని యర్థము.

Lucretius - లాటిను పదము, Gain అని యర్థము.

Ludovic- Louis చూడుఁడు.

Luke - లాటిన్పదము, St. Luke ఋషి పేరు. Light అని యర్థము.

Lumley - నవీన పదము.

Lupus - లాటిన్పదము, Woulf అనియర్థము.

Luther - ట్యూటానిక్కు పదము (Lothaire చూడుఁడు) Warrior అని యర్థము.

Lutley, Lyall - నవీన పదము.

Lycurgus - గ్రీకుపదము, తోడేళ్లను తరుము వాఁడని యర్థము.

Lyndon, Lyulph - నవీన పదములు.

## ఎల్ అక్షరమునకుం జెందిన క్రైస్తవ స్త్రీల నామములు —

Lambertine- ట్యూటానిక్కు పదము, దేశ మందలి ప్రకాశమానమని యర్థము. Lambert యొక్క స్త్రీవాచకపదము.

Laura, Laure, Laurentia, Lauretta, Laurette, Laurenza, Laurinda- లాటిన్పదములు.

La valette- నవీనకల్పితపదము.

Lavinia- లాటిన్పదము.

Leah- హిబ్రూపదము, Jacob యొక్క భార్యపేరు. అలసట యని యర్థము.

Leeta- నవీనకల్పితపదము.

Leila, Leilah, Leilia, Lelie- లాటిన్పద ములు, ఇందు Leilah అనునది ఐరిషు పదమని తోఁచెడిని.

Lena, Lenore, Leonora, Leonore, Leonor, Lenia- గ్రీకుపదములు, వెలుతు రని యర్థము. ఇవియును Eleanor, వంటి పదములే. దీనంగల్గిన ముద్దుపేరు Nora.

Lene- హిబ్రూపదము, Magdalen వంటి పదమే. తత్సంబంధమే.

Leonardine, Leonhardine- ట్యూటానిక్కుపదము, సింహామువంటి బలమని యర్థము. దీనినుండి కల్గిన ముద్దుపేరు Lenny (Leonard పదసంబంధ స్త్రీ వాచకపదము).

Leontie, Leontine-గ్రీకుపదము. సింహాముం బోలెడి అని యర్థము. Leonidas యొక్క స్త్రీవాచకపదము.

Leopoldine, Leopoldina- ట్యూటానిక్కు పదములు. ప్రజాపాలన యని యర్థము. Leopold యొక్క స్త్రీవాచకపదము.

Letitia, Laetitia, Lettice-లాటిన్పదము, సంతోష మర్థము. దీనినుండి కల్గిన ముద్దు పేరు Letty.

Leucha- Lezayre- నవీనకల్పిత పదములు.

Lidwina- రష్యన్పదము.

Lillian, Lilian, Lilias - లాటిన్పదములు, చెంగల్వపూవని యర్థము దీనంగల్గిన ముద్దుపేరులుLily, Lilly, Lilley, Lila.

Lilla, Lilah- హిబ్రూపదములు, దేవుని ప్రమాణమని యర్థము. (Lilah అనునది ఐర్లాండు దేశమునందలి రూపము).

Lina, Line- ట్యూటానిక్కు పదము, మాన వత్వమని యర్థము.

Linda- ట్యూటానిక్కు పదము, నాగమని యర్థము.

Lorinda- లాటిన్పదము. దీనినుండి కల్గిన ముద్దుపేరు Lorrie.

Lotta- ట్యూటానిక్కు పదము, మానవత్వ మని యర్థము. దీనియొక్క స్పానియా భాషారూపము Lola. దీనంగల్గిన ముద్దు పేర్లు Lottie, Lo.

Louisa, Louise, Lois, Loiz, Lovisa, Loys, Luis, Luisa, Luese, Luiza- ట్యూటానిక్కు పదములు, పవిత్రమగు రక్షకురాలని యర్థము. వీనియందుఁ గల్గిన ముద్దుపేరులు Lou, Louie. ఇది Louis యొక్క స్త్రీవాచకపదము.

Love- ట్యూటానిక్కు పదము, మక్కువ యని యర్థము.

Lucretia, Lucrece- లాటిన్పదము, లాభమని యర్థము.

Lucy, Lucie, Lucia, Luciana, Lucienne, Lucile, Lucilla, Lucinda, Lucya, Lucidora, Lucinia, Lucetta, Lucette- లాటిన్పదములు, ప్రశస్తమగు ఆరంభమని యర్థము.

Ludomilla- రష్యనుపదము, ప్రజానురాగమని యర్థము.

Luella, Lulu, Lula- నవీనకల్పితపదములు.

Lunette, Luned- వెల్షుపదములు, చక్కగా రూపమందిన యని యర్థము.

Lychorida- దీనింగూర్చి ఏమియుం దెలియదు.

Lydia, Lidia, Lidiana- గ్రీకుపదములు, Lydia అనునది యొక్క పట్టణమందు సంగీతము, నాగరికత సుప్రసిద్ధములు. ఇంకను అపోసలు పౌలు క్రైస్తవ మతమునకుం జేర్చిన యొక భక్తురాలిపేరు.

Lyona, Lyonella, Lyonessa, Lyonetta-లాటిన్పదములు, Lionel (సింహము) అను పదమునకు స్త్రీవాచకపదము.

**ఎవరబ్బసొమ్మని వెక్కి వెక్కి ఏడ్చుట?** ఆంధ్రలోకో

**ఎవరిపైబట్ట వారికి బరువా?** ఆంధ్రలోకోక్తి.

**ఎవరిప్రాణము వారికిప్రియము-** ఆంధ్రలోకో

**ఎవరివెట్టి వారికానందము** — ఆంధ్రలోకోక్తి.

**ఎవాపరేటెడ్ మిల్కు** (Evaporated milk) — Condensed milk చూడుఁడు.

**ఎవార్డు** — (వాణిజ్యసంబంధ పరిభాషా పదము). Award - మధ్యవర్తియొక్క తీర్మానము. ఇది Arbitration తీర్మానమని యర్థము. తొల్లింటి యేర్పాటు లేకుండిన నిది మూడుమాసములలో పూర్తికావలయును.

**ఎవేంజెలికేలిజమ్ మతము** (Evangelicalism)— బైబిలునందేమిచెప్పఁబడినదో వాటియందపనమ్మకమనునది, సంశయమనునది మాని త్రికరణ శుద్ధిగా నమ్మియుండు మతము. దానింగూర్చిన నమ్మకము.

**ఎశ్చ్యుఅరీ** (Estuary)— నది సముద్రమునంగలియు తావున భూమిబలమైనది కాకున్నచో ప్రక్కలను విస్తారముగా కోసివేసి చాలవెడల్పుగనై యుండును. దానికి Estuary అనిపేరు. సాధారణముగ దీనినే స్కాట్లాండు దేశమున Frith లేక Firth అనియెదరు. (నదులు చూడుఁడు).

**ఎస్యూరెన్సు** (Assurance) — మనుష్యుల జీవితములపై చేయఁబడునది ఎస్యూరెన్సు. ఎవ్వరి జీవితము ఎస్యూరు చేయఁబడినదో అతఁడు జీవించియున్న కాలమున కొన్ని లెక్కవాయిదాలవఱకో లేక కొన్ని సంవత్సరములవఱకో లేక అతని జీవితకాల మంతయునో వాయిదాలమేరకు కట్టబడిన మూల్య మాసంస్థసంఘమువారికి చెల్లించుచుండుటయు, దాని ఫలితముగ కొంతకాలమునకో లేక ఎస్యూరు చేయఁబడినవారి మరణాంతరమాతని వారసులకో నిర్ణీతధనము ఎస్యూరు చేసిన సంస్థసంఘమువా రిచ్చుట కేర్పాటై

యుండును. ఈపద్ధతి సంస్థలు నిర్ణీతధన మెప్పటికైనను ఇచ్చి తీరవలసియుండును. కాని ఇన్సూర్యరు నందువలె అపాయము లేకుండిన అంతయు లాభమే అని తీసికొన వీలుండదు. ఏలనన ఎప్పటికైనను ఎస్యూరు చేయబడిన జీవితము, మృతిపాలుగాకతప్పదు.(ఇన్స్యూరెన్సుచూడుఁడు)

**ఎస్కలేటర్** (Escalator) — దీనిని Moving Stair- Case అనియు నందురు. ఇది క్రొత్తగాఁ గనిపెట్టఁబడినది. ఇది మెట్లగుత్తము. ఇది ఎల్లప్పుడు తిరుగుచుండు నదియే గాన దీని పై కెక్కి నిలచుండిన నెత్తునకుం జేర నగును. మినిటుకాలమునకు నలువదియడుగుల చొప్పున కదలుచుంట దీనిపై నెక్కుట సులభముగనే యుండును. మఱియుఁ బట్టుకొనుటకు Side hand-rail కూడ గల్గియుండుంగాన దీనిపై నుండి మీది కెక్కుట సుకరముగనేయుండును. Electric lift కన్న నిది చౌకగ నడపగల్గుదురట. మఱియు నిది తక్కువవ్యయమున నెల్లకాలమొకేరీతిని తిరుగుచుంట నెక్కువ యుపయోగమైనది. దీని నమెరికాదేశస్థులు మొదట నిర్మించిరి. ఇప్పుడు లండనునగరమున భూమట్టమునకుఁ గ్రిందుగ త్రవ్వఁబడి నిర్మింపఁబడిన ఇనుపబాటలవారు తమస్టేషనులకడ నుపయోగించుచున్నారు. లండను ఇనుపబాటలువాడుచున్న ఎస్కలేటరులు గంటకు పదునొకండువేల మనుష్యులను దాటించుచున్నవిగ చెప్పుచున్నారు.

**ఎస్కాటోలొజీ** (Eschatology) థియాలజీ లోనిది. ప్రపంచము అంతమై లయముంజెందు స్థితింగూర్చి యోచించుకళ.

**ఎస్టాపల్ లేక ఎస్టోపల్** — (వాణిజ్యసంబంధ పరిభాషాపదము) Estoppel- ఒకపనియందలి పరిహారముం గోల్పోవుటకు పేరు. తొల్లియొనర్చిన యొకపనివలన ఒక పనియందలి పరిహారము గోల్పోవుట. ఇది వ్రాతమూలకముగ గూడ జరుపఁబడనగును.

**ఎస్కిమోజాతి** (Eskemo) లాప్లాండర్సు- ఉత్తరధృవప్రదేశసీమలందు వసించు జాతి మనుష్యులు, అనాగరికపు జాతులలోనివా రందురు. పశ్చిమగోళార్ధమునను, తూర్పుగోళార్ధమునందలి దేశభాగములందునను వీరు వసించుచుందురు.



వీరి కనేక నామములు కలవు. ఎచ్చటనున్నను లక్షణము లేకరీతిని గానవచ్చుచుండును. వీరి తొల్లింటిపేరు Innuit అనియెదరు. అనగా మనుష్యులని యర్థమట. నార్వే, స్వీడన్, ఫిన్లాండు, రష్యా దేశభాగములగు ఉత్తర ధృవ సీమలకు లాప్లాండనియు (Lapland) అందు వసించు నీ జాతివారికి లాప్లాండర్సు లేక లాప్పు (Laplanders or Laps) అనియుఁబేర్లు కలవు. వీరు వసించు దేశభాగము లన్నియుం గల్సి నలుబదివేల చతురపుమైళ్లుండుననియు, అనాగరకపు జాతుల కింతప్రదేశముండినది వీరికే ననియుం జెప్పుదురు. వీరిని ఫిన్లాండు దేశస్థులు "లప్పు" లని పిలచెదరు. లప్పు లనిన కడభూమి నివాసులని యర్థమట. వీరికి భవిష్యజ్ఞానము కలదని వారేయనెదరు. వీరు ప్రశ్నల కుత్తరువులు చెప్పుదురట. నార్వేదేశమున వీరిని లాప్లాండర్సు అనియు, వీరిదేశమును లాప్లాండనియు నను చున్నారు.

లాప్పు పొట్టివారు. వలముగల శరీరము గలవారు. బలాఢ్యులు. పరిశుభ్రత చాల తక్కువ. వీరికడ ఎస్కిమోజాతి కుక్కలును, రెయిన్‌డీరు మృగములును ఉండును. అవి వీరి బండ్లను లాగును. లాప్పులందు కొండ లాపులనియు, సముద్రలాపులనియు, నదిలాపులనియు మూడు తెగలు కలవు. కొండలాపులు అరణ్యసంచారులు, తక్కినవారు చేపలవాండ్రు, సీలు (జలచరము)లం బట్టు వేటకాండ్రు. అమెరికా దేశపు వారికి ఎస్కిమోలని పేరు.

**ఎస్టిమేటు** — (వాణిజ్యసంబంధ పరిభాషాపదము). Estimate- అంచనా లెక్క. ప్రారంభించకమునుపు దానికెంత యగునని అంచనావేయుట.

**ఎసెటిసిజమ్** (Asceticism) —



దీనికి వేత్వేఱు కాలములలో వేత్వే అర్థములు వర్తించినవి. తొల్లింటి యాది కాలముల గ్రీసు దేశమున వ్యాయామమున కన్వయించెను. పిమ్మట తనవాంఛలనడంచు నభ్యాసవిధానముగ నయ్యెను. పిదప క్రైస్తవ మతధర్మమునకు వర్తించెను. తర్వాతికాలములఆత్మవధ, ఆత్మపీడ మొదలగు దుష్కార్యములకునర్థమయ్యెను. రానురాను నరబలుల విధానమనంబడెను. ఈమధ్యకాలములందు ఆశ్రమవాస జీవనధర్మము, ఉపవాస, యాత్ర, తపస్సులకన్వయించెను. ఇప్పటికి చాల నిర్బాధకరరూపమున నున్నది.

**ఎసెట్సు** — (వాణిజ్యసంబంధ పరిభాషాపదము). Assets- నిల్వఆస్తి యని యర్థము లేక, ఐవజు అనియర్థము. వర్తకసంఘ భాగస్వాముల ఉపయోగమునకుగాని, అప్పులవాండ్ర బాకీతీర్మానములకుం గాని ఉపయోగింపం దగిన ఐవజులు.

**ఎసెన్షన్ ద్వీపము** — ఆఫ్రికాఖండమునకుం జెందిన పండ్రెండుద్వీపములుచూడుఁడు.

**ఎసేసిన్** (Assasin) — దీనికి చంపువాఁడని యర్థము. తొల్లికాలమున డెమకస్కస్ పురము, అంటియోబి పురముల నడుమదేశభూములందు వసించుచు దుర్మార్గులను చేరఁదీసి మార్గస్థులపైఁబడి దోచుకొనుట, హత్యలొనర్చుట జరపునాయకుఁడు. వారినందటి నీపేరున వాడుచుండినను, అందు ప్రధానియగువానిపేరు; నరహత్యలొనర్చు సుప్రసిద్ధమాయెను.

**ఎస్టేటు** — (వాణిజ్యసంబంధ పరిభాషాపదము). Estate- ఆస్తి యని యర్థము. ఆస్తి యొక్క విలువంబట్టి విధింపఁబడు పన్నులకు ఎస్టేటుడ్యూటీ (Estate Duty) అనిపేరు.

**ఎస్ట్రోనొమీ** Astronomy) — నభోంతరాళమునందుఁ దిరుగుచుండు గోళములం గూర్చిన శాస్త్రమును ప్రాశ్చాత్యులు ఎస్ట్రోనమీ యని పేరిడియున్నారు. ఈగోళములు జగత్తంతటను విరజల్లఁబడినట్లుండెడిని. ఇవి నక్షత్రములనంబడుచు నాకాశమంతటను కన్పించుచుండును. తొల్లింటికాలమున ఛాల్డియనులు, ఈజిప్టుదేశస్థులు ఎస్ట్రోనొమీ పరిశీలన లొనర్చిన విజ్ఞానులు. అది క్రీస్తునుపు ౨౨౩౮ వ సంవత్సరమని చెప్పఁబడినది. నక్షత్రములనుండియె కాలము నెఱుంగు విజ్ఞానము వారికుండెడిది. వారినాఁటి Constellations నేఁటికిని అట్లే యున్నవి. అభివృద్ధినందియున్న ఇక్కాలపు ఎస్ట్రోనొమీ మూఁడుభాగములుగ నున్నది.

౧. Descriptive astronomy — ఇది యాదికాలము నాఁటినుండియుఁగలదని తెలిసెడిని. ఇందు నభోంతరాళ గోళముల కదలికలు, వాని సంచారములు, తావులు, దూరములు, పరిమాణములు, కొలతలు వివరింపఁబడియుండును.

౨. Gravitational astronomy - ఇది Sir Isaac Newton గారి క్రీ. వె. పదునేడవ శతాబ్దకాలమునాఁటి పరిశీలనల విజ్ఞానముగా నెన్నంబడుచున్నది. ఇందు గోళముల శరీర పరిమాణములు, ఇవి తిరుగుటకు కారణములు, Dynamics రహస్యములు వివరింపఁబడినవి.

3. Physical astronomy - ఇది కేవలము క్రీ. వె. ౧౯-౨౦ శతాబ్దములందు జరిగిన ఆధునిక పరిశీలకులవలన గల్గింపఁబడిన విజ్ఞానము. ఇందు Physical Conditions, Nature, Chemical Constitution, Temperatures మొదలగునవి కలవు.

ఎస్ట్రోనోమీ శాస్త్ర పరిశీలనలందు సూర్యుని కన్న గొప్పగోళములుకూడ కలవనియు, Fixed Stars అనంబడుచున్న గోళములలో కొన్ని సూర్యులేయనియు, Solar System వంటివనేకములు కలవనియు, ఇప్పటి సోలారు సిస్టమనంబడున దంతయుంగలసి సెకెండు కాలమునందు పంౙ్రెండు మైళ్ల చొప్పున Lyra Constellation వైపు నడచుచున్న దనియు, దానియందు ప్రధాన నక్షత్రము వేగా (Vega) యనియు, నిక్కాలమున నెఱింగియున్నాము. ఒకే నక్షత్రముగ నగుపడు Double Stars, Triple Stars, Multiple stars కన్గొనఁబడినవి. Star Clusters (Nebulae) అనగా A luminous Cloudy patch of Stars కన్గొనం బడినవి. Dark stars కన్గొనఁబడి అవికొన్ని గోళములకు భూమికి నడుమగా పోవుచుంటయు కన్గొనం బడినది. ఇవి యన్నియు నాధునిక పరిశీలనల ఫలితములు.

ఎస్ట్రోనోమీ శాస్త్రపరిశీలనలు సల్పినవారిలో చరిత్రకుం దెలిసిన మొదటిపండితుఁడు కోపెర్నికస్ (Copernicus) అనంబడునాయన. క్రీ. వె. ౧౫౦౦ సంవత్సరమునాఁటివాఁడని చెప్పంబడినది. పరిశీలనాపరికరములగు ఇక్కాలపు దుర్భిణులకు Transit instruments అనిపేరు. ఇంగ్లాండు దేశములోని గ్రీనిచ్, ఫ్రెంచి దేశములోని పారిస్ మొదలగు తావులందు గొప్పగొప్ప నక్షత్రశాలలు పరిశీలనస్థానములై పనిచేయుచున్నవి.

సూర్యుఁడు, చంద్రుఁడు, భూమి మొదలగు గోళములంగూర్చిన విజ్ఞానమే ఎస్ట్రోనమీశాస్త్రమని మున్ను తెలుపంబడినను, దీనిం దెలియుటకు గణితశాస్త్ర వేత్తయు, భూగోళశాస్త్ర (Geography) విజ్ఞానియు నై యుండనివారల ఎస్ట్రోనమీ అలవడదు. పిదప భూమితిరుగుట, అందువలన గల్గెడి దివారాత్రములు, సీజన్సు, వాతావరణ వక్రతలు (Atmospheric refractions), Phases of the moon, Time and its divisions, Zodical light, Twilight, తోకచుక్కలు (Comets), Fixed stars, Galaxy లేక Milky way Solar system, భూవలయ రేఖలు(Horizons) దివారాత్రములు, Planets భేదములు, Meridians, భూమధ్యరేఖ (Equator), (Poles) ధృవప్రదేశములు, ధృవనక్షత్రములు, Declinations, Constellations, సంక్రమణ ప్రవేశములు మొదలగునవన్నియు నెఱుఁగవలసి యుండును. వీనిం గూర్చి వేఱ్వేఱు తావులందు వివరింపంబడినది చూడుఁడు.

గోళముల గమనములం గూర్చి Bode's Law యనంబడువిధానమును, Kepler's three laws of Planetary motions అను విధానమును, Newton's Laws of Motion అనంబడు ప్రధాన ముఖ్యవిధానమును చక్కగ నెఱింగి యుండవలసి యుండును. సూర్య చంద్ర గ్రహణములం గూడ నెఱింగియుండుట శ్రేయము. చాల సహకారిగ నుండెడిని.

భూమి-ఇది సూర్యునివలె స్వప్రకాశముకలది కాదు. దీనిని శాస్త్రమున Opaque body అని యనియున్నారు. అందఱు భ్రమించుచున్నటుల భూమి కేవలమూ గుండ్రని యాకారము కలది కాదనియు, ఉత్తర దక్షిణ ధృవప్రదేశములకడ కొంతవఱకు Plane వలె నణుమఁబడినటుల సమతలప్రదేశములం గల్గి తక్కిన దేహమంతయుఁ

గుండ్రని యాకారముతో నున్నదనియు నీ శాస్త్రమునందు చెప్పంబడినది. భూపరిమాణము నెఱుంగుటకు దాని Magnitude, దాని చుట్టు కొలత (Circumference) యు, వ్యాసము కొలతయు నెఱింగిన వృత్తమందున్న ౩౬౦ డిగ్రీల భాగ సంఖ్యచే వృత్తపరిమాణముం గుణించిన యావత్పరిమాణము రాగలదు.

చంద్రగోళము:- ఎస్ట్రానొమీ శాస్త్రమున చంద్రుఁడు భూమినాశ్రయించి దానింబట్టి తిరుగుచుండు గోళముగ చెప్పఁబడినది. చంద్రబింబము నందగుపడు మచ్చలు, దానియందలి యున్నత ప్రదేశముల నడుమనున్నవి, పల్లపులోయలు, పర్వతాగ్రములునని తలంపఁబడుచున్నవి. వాటి క్రిందిభాగములు మరుగుపడి యుండునందురు. Dr. Herschel పరిశీలకుఁడు అందలియొక పర్వత శిఖరమును (St. Catharine Mount) మైక్రోమీటరను యంత్రపరికర సాహాయ్యమున కొలచి దానియెత్తు మూడుంబాతిక మైళ్లనియు, చంద్రుని డయామీటరు రమారమి రెండువేల మైళ్లుండుననియు తెలిపియున్నాఁడు. ఒక అగ్నిపర్వతము నాల్గుమైళ్ల యెత్తుకలది కలదని వివరించెను. చంద్రుని శరీరమున భూమియందలి సముద్రములం బోలిన యుదకసముదాయము లున్నటుల తెలియరాదు. ఏలనన చంద్రునియందు దళసరి వాతావరణమును, మేఘములును ఉండినటుల కనంబడుటలేదు. ఉండిన నిజరూపదర్శనము దుర్లభమై యుండెడిది. భూమింజుట్టి తిరుగుటయందు చంద్రుఁడు తనకుతానై గిరగిరతిరుగుచు కూడనుండునని స్ఫురించెడిని. కాని భూమిపైకగుపడుట సర్వకాలములం దొకేముఖమైయుంట ఆతిరుగుటయం దేదిచిత్ర విధానము కలదో తెలియకున్నది. కొందఱు పరిశీలకులు చంద్రుఁడు తిరుగుట కిరువది యేడున్నర దినములు పట్టునను



చున్నారు. చంద్రమాసమున దిన౨౯- గంట౧౨-మి ౪౪ కాలముండునని లెక్కింపఁబడినది. ముప్పది దినములలోను గల యీ లోపము భూమి సూర్యునింజుట్టి తిరుగుటయందు చంద్రున కెదురుతిరుగుటయందు కల్గిన లోపమనియు, అనగా కాలము తగ్గిపోయినదనియుఁ జెప్పఁబడినది. చంద్రుఁడు పడమరనుండి తూర్పునకుఁ దిరుగు గోళమని పోల్చియున్నారు.

సూర్యుని వెలుతురును చంద్రుడు రాత్రులందు భూమిపై ప్రతిఫలింపంజేయుచు, వెన్నెలలు గాయులటులనే, భూమియు సూర్యకిరణములను చంద్రునిపై ప్రతిఫలింపఁ జేసియుండవలయునని స్ఫురింపకపోదు. చంద్రుఁడు భూమినుండి ౨,౪౦,౦౦౦ మైళ్ల దూరమున నుండునని చెప్పఁబడినది. పౌర్ణము లెల్లప్పుడును చంద్రసూర్యులకు నడుమ భూమి వచ్చుతరిని, అమావాస్య లెల్లప్పుడు సూర్యునకు భూమికి నడుమ చంద్రుడు వచ్చుతరినిఁ గల్గుచుండును. సూర్యునకు వలెనే చంద్రునకును, ఇంచుక కుడి ఎడమ ప్రక్కలుగ నడచు నేర్పాటు కలదు. అటుల జరగక నడుమగ గమనించుతరి, గ్రహణములు సంభవించుచుండెడిని, చంద్రుఁడు భూమిచే మాత్రము గాక, సూర్యునిచేఁగూడ నాకర్షింపం బడుట భూమితో పాటుగ, సూర్యుని చుట్టును గూడ నీడ్వం బడుచుంట సహజము. కృష్ణపక్షమున చంద్రుఁడు వెలుతురుం గోల్పోవుచు తగ్గిపోవుచుంటను Retardation అనియు, Waning moon అనియు ననెదరు. (చంద్రగోళము చూడుఁడు). సూర్యగోళము చుట్టి తిరుగుచుండు నుపగోళములకు, సూర్యుఁడు వెలుతురు, వెచ్చదనములం గల్గించుటకు నాధారమై యున్నాఁడు. సూర్యుని శరీరము జ్వాలల మయమని యనుటకన్న దాని నిజతత్వ మిది యని

తెల్పుట కెవ్వరికిని తగు నిదర్శనములు లభింప కున్నవి. సుప్రసిద్ధ ఫ్రెంచిదేశపు ఎస్ట్రానొమీ శాస్త్రవిదుఁడగు Laplace పండితుఁడు, మంటల క్రిందఁగా సూర్యుని శరీరమున మార్పులు గల్గు చుండుననియు, ఈ సూర్యుఁడు ఒకేతావున నిలచియుండ లేదనియు, తనకు తానై గిర గిర తిరుగుచుండునని, ఒకేసారి తిరుగుట కిరువదియైదు దినముల పది గంటల కాలము పట్టుననియు, సూర్యశరీర మగ్నిపిండమనియు నభిప్రాయపడెను. పెక్కం డితరపరిశీలకులు, సూర్యశరీరము నల్లని గట్టిపదార్థమనియు, దానిజుట్టి ప్రకాశమానమగు మేఘసముదాయముం బోలిన జ్వాలావరణ మొకటి దట్టమైనది కలదనియు, మధ్య మధ్య నప్పు టప్పుట వెలితియగుచుండ, నల్లనిప్రదేశములు మచ్చలుగఁ గన్పట్టుచుండుననియు నభిప్రాయ పడుచున్నారు. దేనికిని నిదర్శనములులేక అన్ని అభిప్రాయములు సంశయగ్రస్తములుగ నుంట యందఱు అంగీకరించినదే.

సూర్యశరీరమం దగుపడుచుండు నీ నల్ల మచ్చలు కదలుచుండునటులను, మారుచుండు నటులను గన్పట్టెడిని. పదునాలుగు దినముల దనుకఁ గదలుచుండునవి యనియు, వాటి సంఖ్య ప్రదేశము పరిమాణమును మార్పునందుచుండు ననియు, ఒక్కొక్కతరి సంవత్సరములో లేకుండి పిదపఁ గన్పించుచుండుననియు,కొన్ని యనుదినము గన్పించుచు, కొన్నిచిన్నవి కలసిపోయి పెద్దవిగ నగుటయు, పెద్దవి భిన్నములై చిన్నవిగ నేర్పడు టయుంగూడ కలదని పరిశీలనలనుండి తేలు చున్నది. స్థూలదృష్ట్యా సూర్యుఁడు భూమింజుట్టి తిరుగుచున్నటుల గోచరించుచున్నను, నిజమున భూమియే సూర్యునిఁజుట్టి తిరుగుచున్నదని యీశాస్త్రమునందు చెప్పంబడినది. ఆతిరుగు నటుల గన్పించుమార్గమునకు Ecliptic అని పేరిడంబడినది. అది Heavenly Equator వెనుకకు వంగుచుండునని చెప్పంబడినది.

ఒకరితలపైఁ దిన్నగా నాకసమున సూర్య గోళముండుకాలమున కాంగ్లమున Midday యనియు, ఈశాస్త్రమున Noon అనియు పేర్లు. దానినే Zenith అనియెదరు. భరతదేశపు జ్యోతిషశాస్త్రమునందట్టి కాలమున కపరాహ్ణ మని పేరు. సూర్యుఁడు కొంచె మెక్కు వతక్కు వగా భూమధ్యరేఖకుంబైగా Summer solstice, Autumnal equinox, Winter solstice, Vernal equinox అనంబడు తావులగుండా తిరుగుమార్గముగఁ గన్పట్టునని చెప్పంబడినది. (సూర్యబింబము చూడుఁడు, తక్కినవి వానివాని తావులందు వేర్వేఱు చోటులఁ గననగును. చూడుఁడు).

## ఎస్ట్రానొమీశాస్త్ర చరిత్ర

- ఖాల్డి యనులు ఆదిని క్రీ. పు. ౨౨౩౮ సంవత్సర ప్రాంతములందు ఎస్ట్రానొమీ పరిశీలనలు సల్పిన వారని చెప్పంబడినది. ఈజిప్టు దేశస్థులు, గ్రీకులు తరువాత పరిశీలనలు నెరపినవారు. వారినాఁటి వ్యవసాయములు, దేవాలయ నిర్మాణములు, మార్గ గమనములు ఈశాస్త్రము నతిక్రమించు నవి గాకుండెను. ఈజిప్టులోని లక్సారు దేవాల యము, బ్రిటిషు దీవులందున్న స్టోనుహెంజి దేవాలయము ఎస్ట్రానొమీ శాస్త్రము మేరకు నిర్మింపంబడినవే యని యందురు. నభోంతరాళ గోళములగుండా అవి యన్నియు నాకాశమున తిరుగుమార్గము లక్కాలపు గ్రీకులకు తెలిసి యుండెను.

అక్కాలమున గ్రీకు తత్వశాస్త్ర విదుఁడని పేరందియుండిన అరిస్టాటిలు పండితుఁడు గొప్ప పలుకుబడి గల్గినవాడును, ఎస్ట్రానొమీ శాస్త్ర మును నిరాకరించువాడుగనుంట, ఈశాస్త్రాభి

వృద్ధికి బాధ కల్గుచుండెను. గ్రీకు ఎస్ట్రానమర్సు అలెగ్జాండ్రియా యందు వసించు చుండిరి. అరబ్బులు ఈశాస్త్రమును పీలగునంతదనుక సంగ్రహించుచుండిరట. రోమనుల కప్పు డీశాస్త్రముం గూర్చి తెలియనే తెలియకుండెను.

మహమ్మదీయులు స్పానియాదేశమాక్రమించుదనుక నీశాస్త్రము తల యెత్తనేలేదు. అట నిది మహమ్మదీయ శాస్త్రముగఁ దలంపంబడి క్రైస్తవుల నిరసనకు పాల్పడెను. క్రీ. వె. ౧౫-౧౬ శతాబ్దములలో విద్యలు తలయెత్తి అభివృద్ధినందనారంభించెను. అత్తరి నీఎస్ట్రానొమిశాస్త్రము ఐరోపావారిలో కొందఱిచే నామోదింపంబడినను చాలాభాగము నశించియుంటయు, అరిస్టోటిలుగారి తత్వమునకు వ్యతిరేకమై యుంటయు, మహమ్మదీయశాస్త్రమని అపయశముగఁ జూడంబడుచుంటయు నంతగా వ్యాపించలేదు.

ఆమోదించినవారియందగ్రగణ్యుఁడుటికోబ్రేహి (Tycho Brahe) యనుపేరుగల డెన్మార్కు దేశపు శ్రీమంతుఁడు. ఆయన చాల ముక్కోపియు, నెవ్వరిని సరకుజేయనివాఁడు నగు మూర్ఖుఁడని పేరందియుండెను. డెన్మార్కు, స్వీడను దేశముల నడుమగా ఎలిసినోర్ పరిసరముల, సౌండునందొక ద్వీపమున నొక పరిశీలనాలయము (Observatory) ను నిర్మించి అందర్వ పరికరముల నమర్చి ఇరువది వత్సరములు పరిశీలన లొనర్చెను. నేటికిని ఆ పరిశీలనల కాగితములు కోపనుహేగను నగరపు రాయల్ లైబ్రరీయం దుంచబడియున్నవి. నక్షత్రముల కేటలాగులు, వాటిస్థానములం గూర్చియు, చంద్రునింగూర్చియు, తోకచుక్కలంగూర్చియు పరిశీలనలందు వివరింపంబడినవి. అవి చాల నిష్కర్షగ నుండునందురు. అక్కాలమున దుర్భిణి యంత్రములు లేవు.

టికోబ్రాహిగారు ప్రభుత్వవిరోధియై ఆయన యాస్తు లాక్రమింపంబడి ప్రేగుపురమున ప్రవాసమునందుంపంబడి, ఆపరిశీలనాలయము కెప్లరు పరిశీలకునకు వశపర్చంబడెను. ఆయన తర్వాతి పరిశీలనలను సల్పి పనులను సాగించిరని చెప్పంబడినది. (కెప్లర్సులాస్ ఆఫ్ ప్లానెటరీమోషన్సు చూడుఁడు).

కెప్లరుగారు క్రీ. వె. ౧౬౦౮ లో చనిపోయిన యదనున హాలండుదేశమున Galileo పరిశీలకుఁడు Telescope (దుర్భిణి) యంత్రము రచించి దానిమూలమున జూపిటరుగోళమునాశ్రయించియుండు నాల్గు ఉపగోళములను (దాని చంద్రులను) కన్గొనియెను. ఆయనయు తన యభిప్రాయములను ప్రకటించినందులకు బాధలనందుచునే కష్టముల పాల్పడియెను. పిదప జర్మను దేశపు ఎస్ట్రానమర్ Simon Marius గారు ఇతర ఉపగోళములం గన్గొనెను. వాని గమనములను పథకరూపమున వ్రాసెను. దుర్భిణి యంత్రముగుండా పరిశీలనలు జరిగి, చంద్రుని యందు పర్వతములు కలవనియు, సూర్యుని యందు నల్లమచ్చలు (Sun spots) కలవనియు, ప్లానెట్సు భూమింబోలిన గోళములేననియు, మిల్కీవే (Milky Way or Galaxy) యనంబడు వెలుతురునందు కొన్ని మీటియార్సు మొదలగు విశేషములు కలవనియు క్రొత్త విజ్ఞానము బయల్పడియెను.

పిదపం గొంతకాలమునకు Sir William Herschel పండితుఁడు బయలువెడలి విశేష విజ్ఞానమును బయలుదేరతీసెను. ఆయనయే Star clusters nebulae కన్గొని ఆకాశమును Pole to Pole survey చేసినవాఁడని చెప్పంబడినది. పిదప నాయనసుతుండగు Sir John గారును పరిశీలనలను సాగించినవారే.

ఈశాస్త్రము క్రీ. వె. ౧౯ శతాబ్దమున గొప్ప యభివృద్ధిగాంచినది. జర్మనుదేశమున Bessel పండితుఁడును, ఇంగ్లాండు దేశమున Airy పండితుఁడును పరిశీలనాలయము (Observatory) ల నెలకొల్పి పరిశీలనల సల్పుచుండిరి. ఇంగ్లాండునందు Adams పండితుఁడును, ఫ్రాంసుదేశమున Leverrier పండితుఁడును నెప్ట్యూను గోళములం గన్గొనిరి. ఐర్లాండుదేశమున Lord Rosse పండితుఁడు సుప్రసిద్ధమగు "ఆరడుగుల యద్దమును" జేసెను. శతాబ్దమధ్యకాలమున Kerchoff పండితుఁడు Spectrum analysis విధానమును గనిపెట్టుటయు, Huggins పరిశీలకుఁడు ఆవిధానమును నక్షత్రముల కనువర్తింపఁజేయుటయు సంభవించెను.

స్పెక్ట్రోస్కోపు పరిశీలన, ఎస్ట్రోనామీశాస్త్ర పరిశీలనల కెక్కువసహాయకారి యయ్యెననియు, ఇంకను ఫోటోగ్రాఫీని దీనికింగలిపి ఆకాశగోళములకు ఛాయాపటములందీయుచు చేసినపరిశీలనలిప్పటిస్థితికిం దెచ్చినవనియుం జెప్పవలయును. కొన్ని నక్షత్రములు సూర్యునివంటి స్వప్రకాశవంతములైన సూర్యులేయనియు, నెబ్యూలై Shining gasses గల Clouds నందున్న meteors అనియు, దానినుండి కొన్ని కిరణములు భూమికింజేరజాలకున్నవనియు, భూమియొక్క ఉపరిభాగమున దొరకుచున్నటుల కొన్ని మెఱయు ఆవిరిపదార్థము లాకసమునందును కలవనియు తెలియనయ్యెను. Ramsay పరిశీలకుఁడు Helium కన్గొనుటతో చాల వింతలు బయల్పడెను. వీనికిందో డిక్కాలమున పరిశీలనలు కంటితోగాక ఫోటోలు తీయంబడుచు నాఛాయాపటముల మూలముననే చేయుచున్నారు..

ఎస్ట్రోనామికల్గడియారములు ప్రత్యేకముగ ఒక మెరిడియనునుండి మెరిడియనుకు సూర్యుఁడు చేయు సైడీరియల్ కాలములందెల్పుటకు చేయంబడుచు నక్షత్ర (పరిశీలన) శాలలందు నిక్కాలమున వాడంబడుచున్నవి. ఇవి గంటకు పదునేను డిగ్రీల గమనముమేరకు చేయంబడుచున్నవి.

**ఎస్ట్రీటు** (Estreat)— వాణిజ్యసంబంధ పరిభాషాపదము. జరిమానాలు మినహాలం గూర్చి వ్రాసికొనిన పత్రము (Bond). దాని మేరకు జరిమానాలు మినహాలు విధించుటకు గూడ నీపేరే వర్తించెడిని.

**ఎసొటెరిజమ్** (Esoterism)— కొన్ని సిద్ధాంతములను, రహస్యములను బయల్పెట్టక మరుగుపర్చి తాను నిష్కల్మషముగ అంతయు మాట్లాడునట్లునటించుచు ఉపన్యాసాదులయందు వేఱుమాటలను జాగ్రతగ వాడుట లేక వినువారియందుకొందఱికర్థము గాకపోవునట్లును, అనుమానము కల్గకుండునట్లును జాగ్రతగా మాటలాడుట గూర్చిన కళ.

**ఎస్తీశియో మీటరు** (Aesthesiometer) — శరీరమందలి చైతన్యమును, స్పర్శనుండి కలిగెడి చైతన్యచలనమును వివరించు యంత్రము.

**ఎసైన్ లేక ఎసైనీ** వాణిజ్యసంబంధ పరిభాషాపదము. Assign - ఒకరి ఆస్తి, ఐవజు లేక వర్తకపు సరకులు మొదలగు వానిని ఇంకొకరి కిచ్చివేయుటయని యర్థము. అట్లివరికిత్తురో వారికి Assignee అని పేరు. ఇచ్చివేసినవారికి Assigner అనిపేరు. వ్రాసియిచ్చిన Deed (పత్రము) కు Assignment deed అనిపేరు.

**ఎస్టోపల్** — ఎస్టాపల్ చూడుఁడు.

**ఎస్ట్రోయిడ్సు** (Astroids)- అల్ప గోళములు. (సోలార్ సిస్టమ్ చూడుఁడు).

**ఏసోసియేటెడ్ ప్రెస్** — న్యూస్ ఏజన్సీలు చూడుఁడు.

**ఎస్తోనియా** (Esthonia)- ఐరోపాఖండ ఉత్తరపు ఫిన్లాండు కడనున్న స్వతంత్ర సంస్థానము. పదునెన్మిదివేల అయిదువందల చతురపు మైళ్లు వైశాల్యమనియు, పదునొకండు లక్షల పదునారు వేల ఐదువందల జనసంఖ్య యనియుం జెప్పఁబడినది.

## ఏ అక్షరమునకుం జెందిన క్రైస్తవ పురుష నామములు. —

**Aaron** - హిబ్రూపేరు. యూదుల మొదటి ప్రధానగురుని పేరు. పురుషనామము.

**Abel** - హిబ్రూపేరు. దర్పము, దాంభికము.

**Abelard** - ఆంగ్లో శాక్సనుపదము, **Noble firmness** అని అర్థము.

**Abiathar** - హిబ్రూపేరు. యూదుల గురువులలో నొకని పేరు. సమృద్ధికి జనకుఁడని యర్థము.

**Abihu** - హిబ్రూపేరు. **Aaron** కుమారుని పేరు. ఈతఁడు దేవునియాజ్ఞను తిరస్కరించి యగ్నిచే కాల్పఁబడిన వాఁడు. నాతండ్రి యని శబ్దార్థము.

**Abijah** - హిబ్రూపేరు. యూదులకు రాజుగా నుండెను. నాతండ్రియె దేవుఁడు (ప్రభువు) అని యర్థము.

**Abiram** - హిబ్రూపేరు. ఔన్నత్యమునకు తండ్రియని యర్థము.

**Abner** - హిబ్రూపేరు. వెలుతురునకు తండ్రి యని యర్థము.

**Abraham** లేక **Abram** - హిబ్రూపేరు. జనసంఘమునకు జనకుఁడని యర్థము. మహామ్మదీయులయందీపేరు ఇబ్రహీంఅని రూపించును. యూదులలోనీపేరు విస్తారము వాడఁబడుచున్నది.

**Absalom** -హిబ్రూపేరు. శాంతికి తండ్రియని యర్థము. యూదులరాజగు దావీదు (David) కుమారుని పేరు.

**Achille**- లేక **Achilles** అనియు నందురు. గ్రీకుపేరు, గ్రీకులలో తొల్లింట గొప్పశూరుఁడగు సైన్యాధిపతి పేరు.

**Adalbert**, లేక **Adelbert**, లేక **Azalbert**- ట్యూటోనిక్కు పేరు, జర్మను భూపాలురలో నొకనిపేరు. **Nobly bright** అని యర్థము గల నామము.

**Adalhard**- ట్యూటోనిక్కు పేరు, **Nobly stern** అని యర్థము.

**Adalrik**- ట్యూటోనిక్కు పేరు, **Noble king** అని యర్థము.

**Adam**- హిబ్రూపేరు, మొదటిమనుష్యునిపేరు. ఇతఁడు సృష్టియందాదిపురుషుఁడనియు, ౯౩౦ సంవత్సరములు జీవించెననియు చెప్పఁబడినది. మనుష్యుఁడనియో, భూమియనియో యర్థమిచ్చుపేరు.

**Adelfrid**- ట్యూటోనిక్కు నామము, **Noble peace** అని యర్థము.

**Adelhat**- ట్యూటోనిక్కు నామము, **Nobly firm** అని యర్థము.

Adelwin- ట్యూటోనిక్కునామము, Noble friend అని యర్థము.

Adolphus, లేక Adolf, లేక Adolfine, లేక Udolphus- అని రూపములు కలవు. ట్యూటోనిక్కునామము, Noble wolf అని యర్థము.

Aelfwine - ట్యూటోనిక్కు నామము, Elf (darling) అని యర్థము.

Aeneas లేక Eneas- గ్రీకుపేరు. Commanded అని యర్థము.

Aga లేక Agar- ట్యూటోనిక్కుపేరు, Love (మక్కువ) అని యర్థము.

Agrippa- లాటిన్పేరు. Born with the feet foremost అనియర్థము. రోమనుల యం దీపే రెక్కువ ప్రచారమునందున్నది.

Aidan- కెల్టిక్కు పేరు, అగ్నియని యర్థము. (భయంకరుడని యర్థము.)

Ailwyn- Alywin చూడుడు.

Ajax- గ్రీకుపేరు, గ్రీసుదేశమున పెక్కండ్రు శూరులు సైనికుల కీపేరుండెను. ధైర్యవంతుఁ డనియర్థము. Eagle కును అర్థముకలదు.

Alain, Alane, Alan, Allan- కెల్టిక్కు పేరు, Harmony యని యర్థము. స్కాట్లాండుదేశమున నీ నామ మెక్కువ ప్రచారమున గలదు.

Alaric- ట్యూటోనిక్కుపేరు, ఇటలీని జయించి చక్కగా పాలించిన సైనిక భూపాలుఁడగు Alaric I పేరు. Noble ruler అని యర్థమిచ్చు పేరు.

Alastair, Alaster- గ్రీకుపేరు. మనుష్యులకు సహాయ మొసర్చువాఁడని యర్థము.

Alban, Albany- లాటిన్ పేరు, తెల్లనియని యరము.

Alberic- ట్యూటోనిక్కుపేరు Elf king అని యర్థము.

Albert, Aldebert- ట్యూటోనిక్కు పేరు, Nobly bright అని యర్థము. Bert, Berty, Aby అనునవి ముద్దుపేర్లు.

Alexander, Alexius, Alexis, Alexia- గ్రీకు పేర్లు. Alexander the Great (King of Masidonia) యొక్క పేరు, Helper of men అని యర్థము. ఈపేరు రష్యాదేశమునం దెక్కువ ప్రచారమునం దున్నది. Aleck, Alick, Eck, Sandy, Sawnie అనునది దీని ముద్దుపేర్లు. ఇందు Sandy, Sawnie అను రెండును స్కాట్లండు దేశమున విస్తార ప్రచార మందియున్నవి.

Alfred, Elfred- ట్యూటోనిక్కుపేరు, Elf Council అని యర్థము. ఇంగ్లాండుదేశ మేలిన Alfred the Great పేరు. Alf అనునది ముద్దుపేరు.

Algar- ట్యూటోనిక్కుపేరు, Hall spear అని యర్థము. (సావిడిలోని బల్లెము).

Algernon- ఫ్రెంచిపేరు, మీసములు గల వాఁడని యర్థము. Algy అనున దిందలి ముద్దుపేరు.

Alick- స్కాట్లండుపేరు, అలగ్జాండరుచూడుడు.

Alison- స్కాట్లండుపేరు, పవిత్రమగు వాడుక యని యర్థము.

Allan- కెల్టిక్కుపేరు, Alain చూడుడు.

Alliston- నవీనముగ బయలుదేరిన పేరు, Alison యొక్క రూపాంతరము.

Almeric-ట్యూటోనిక్కు పేరు, Work ruler అని యర్థము.

Almroth- నవీనముగ బయలుదేరిన పేరు.

Alois, Aloysius, Aloys- ట్యూటోనిక్కు పేరు, యుద్ధప్రసిద్ధమని యర్థము.

Alpheus- హిబ్రూపేరు, Apostle James తండ్రిపేరు. మార్పు అని యర్థము.

Alphonse, Alphonsus- ట్యూటోనిక్కు పేరు, యుద్ధాతురత యని యర్థము.

Alric- ట్యూటోనిక్కు పేరు, Hall ruler అని యర్థము.

Alured-ట్యూటోనిక్కుపేరు, Elf of peace అని యర్థము.

Alwynne, Alyn, Alwine- ట్యూటోనిక్కు పేరు, Elf friend అని యర్థము.

Amadeus- గ్రీకుపేరు, Love God అని యర్థము.

Amalbert- ట్యూటోనిక్కుపేరు, Work Bright అని యర్థము.

Amaziah- హిబ్రూపేరు, Strength of Jehovah అని యర్థము.

Ambrose, Ambroise- గ్రీకుపేరు, Immortal అని యర్థము.

Amherst- నవీనకల్పితనామము.

Amos- హిబ్రూపేరు, భారవాహకుఁడని యర్థము.

Amyas, Amyot, Amyand- ట్యూటోనిక్కుపేరు. Love God అని యర్థము.

Anchitel- నవీనకల్పిత నామము.

Andrew, Andrea- గ్రీకుపేరు, మనుష్యున కర్థము. Andy ఇందలి ముద్దుపేరు. St. Andrews స్కాట్లాండుదేశపు రక్షకుడన్నంబడిన యతి. హిబ్రూపేరు ఆంద్రేయ యనంబడు యతి.

Angus- కెల్టిక్కుపేరు, Excellent virtue. స్కాట్లాండుదేశమున వ్యాప్తినందుగలదు.

Annesley- నవీననామము.

Anselm, Anshelm- ట్యూటోనిక్కుపేరు, ౧౧౦౯ వ సంవత్సరమున చనిపోయిన St. Anselm అను ఇటాలియను దేశస్థుని పేరు. ఈతఁడు Arch - Bishop of Canterbury ఆయెను.

Anstey, Anstys- ఆంగ్లనామము, Resurrection అని యర్థము.

Anthony, Anton, Antonio, Antony- లాటిన్ పేరు, Inestimable అమూల్యము అని యర్థము. ఇందలి ముద్దుపేరు Tony అనునది.

Apollos- గ్రీకుపేరు, గ్రీసుదేశపు తొల్లింటి సూర్యదేవతపేరు.

Aquila - లాటిన్పేరు, Eagle అర్థము.

Arbuthnot - నవీన కల్పిత నామము.

Archibald- Archer - ట్యూటోనిక్కుపేరు, Holy Prince అని యర్థము. ఇందలి ముద్దుపేర్లు Archi, Archy అనునవి.

Arend - ట్యూటోనిక్కు నామము, Eagle power అని యర్థము.

Aristides - గ్రీకు నామము, Son of the best అని యర్థము.

Armesby - నవీన కల్పిత నామము.

Armine, Armyn, Arminius - ట్యూటోనిక్కు నామము, బహిరంగార్థము.

Armstrong - నవీన నామము.

Arnold - ట్యూటోనిక్కు నామము, Eagle strength అని యర్థము.

Arnolf - ట్యూటోనిక్కునామము, Strong as a wolf అని యర్థము.

Arthgal - కెల్టిక్కుపేరు, High Courage అని యర్థము.

Arthur, Artha - కెల్టిక్కుపేరు, High, Noble అని యర్థము.

Asa - హిబ్రూపేరు, వైద్యుఁడని యర్థము.

Asaph- హిబ్రూపేరు, కలియువాఁడని యర్థము.

Ashburton - నవీననామము, Ashby - నవీననామము, Assheton - నవీననామము, Aston - నవీననామము, Ashton అనియు ననుట కలదు.

Athanasius - గ్రీకునామము, అమృతుఁడు అని యర్థము.

Athelstan- ట్యూటానిక్కు పేరు, Noble stone అని యర్థము. శాక్సను రాజులలో నొకనిపేరు. ఇతఁడు Alfred the great మనుమఁడు (ప్రసిద్ధుఁడు).

Athelwold - ట్యూటానిక్కు పేరు, Noble power అని యర్థము.

Atholl, Athile- నవీననామము.

Attila, Attile- లాటిన్పేరు, తండ్రివంటి' అని యర్థము. ట్యూటానిక్కు పదము, Scourge of God అని యర్థము.

Auberon- నవీనకల్పిత నామము.

Aubrey- ట్యూటానిక్కు పదము, Elf ruler అని యర్థము.

Aubyn - నవీనకల్పిత నామము.

Augustus, August, Auguste, Augustin, Augustine, Augustyn, Austin- లాటిన్పదములు, Exalted Majestic అని యర్థము. Gus, Gussie అనునవి ఇందలి ముద్దుపేర్లు.

Aurelius- లాటిన్పేరు. ఒకరోమను చక్రవర్తి పేరు. బంగారపు అనియర్థము.

Ava - ఐరిషునామము, ఇందలిముద్దుపేరు Ahva.

Aylwin, Aylwyn, Ailwyn- ట్యూటానిక్కు నామము. Formidable friend అని యర్థము.

Ayscough- నవీననామము.

Ayshford- నవీననామము.

## ఏ అక్షరమునకుం జెందిన క్రైస్తవ స్త్రీల నామములు —

Abigail- హిబ్రూపదము, Exaltation అని యర్థము. (స్త్రీనామము).

Ada, Adah- హిబ్రూపదము, Rich Gift అని యర్థము.

Adamina- హిబ్రూ పదము, భూమి యని యర్థము. Adam కు స్త్రీవాచకపదము.

Adelaide, Adela, Adele, Adelaida, Adelais, Adelayda, Adelicia, Adelia- ట్యూటానిక్కు పదము, Noble Birth అని యర్థము. ముద్దుపేర్లు Addy, Addie అని.

Adelar- ట్యూటానిక్కు పదము, Noble Eagle అనియర్థము.

Adelberta- ట్యూటానిక్కుపదము, Nobly Bright అని యర్థము.

Adeline, Adelina, Adaline, Adine, Adelinde, Adelie- ట్యూటానిక్కు పదములు, Noble manner అని యర్థము.

Adeltrude- ట్యూటానిక్కుపదము, Noble maid అని యర్థము.

Adolphine, Adolfine- ట్యూటానిక్కు పదము, Noble wolf అని యర్థము.

Adoncia- లాటిన్పదము, మాధుర్యమని యర్థము.

Adosinda- ట్యూటానిక్కు పదము, Fierce strength అనియర్థము.

Adrienne, Adriana- Adriane- లాటిన్ పదములు. Adrin చూడుఁడు.

Affrica- కెల్టిక్కుపదము, Pleasant అని యర్థము.

Agatha, Agata, Agafia- గ్రీకు పదము, Good kind అని యర్థము.

Agnes, Agnesca, Agnese, Agnessa, Agneta, Agnete, Agnyta, Agnies- గ్రీకుపదము, Pure, Chaste అని యర్థము. దీని ముద్దుపేరులు Aggie, Aggy.

Aileen, Eileen- ఐరిషుపదము, వెలుతురని యర్థము (Same as Helen).

Ailie- స్కాచిపదము Holy Fame అని యర్థము. Alison యొక్క స్త్రీవాచక పదము.

Aine- కెల్టిక్కుపదము, సంతసమని యర్థము.

Aire- నవీనకల్పితాంగ్లపదము.

Alberia, Albiria- లాటిన్పదము, తెలుపని యర్థము.

Alberta, Albertha, Albertine-ట్యూటోనిక్కు పదము. Nobly Bright అని యర్థము. Albert యొక్క స్త్రీవాచకములు.

Albina, Albinia- లాటిన్పదము. తెలుపని యర్థము.

Albreda- ట్యూటోనిక్కు పదము, Nobly bright అని యర్థము.

Aletha, Alethea, Alatea- గ్రీకుపదము, సత్యమని యర్థము.

Alexandra, Alexa, Alexandria, Alexandrina, Allesandra- గ్రీకుపదము, Alexiander యొక్క స్త్రీవాచకపదము, Helper of men అని యర్థము.

Alfreda- ట్యూటోనిక్కు. Elf council అని యర్థము. Alfred యొక్క స్త్రీవాచకము.

Alice, Alicia, Aline, Alys - ట్యూటోనిక్కు పదము Of Noble birth అని యర్థము. ముద్దుపేరులు Allie, Ally, Elsie అనునవి.

Alida- ట్యూటోనిక్కుపదము, Noble అని అర్థము.

Alix- ట్యూటోనిక్కు పదము, Noble manner అని యర్థము.

Alkelda - సాక్సను పేరు.

Alma, Almina - లాటిన్పదము, Good అని యర్థము.

Aloisia - ట్యూటోనిక్కుపదము, Famous war.

Amabel, Aimable, Amable - లాటిన్పదము, Jovable అని యర్థము. ఈపేరును Mable గా వాడుచుందురట.

Amala - ఇటాలియను పేరు, work అని యర్థము.

Amalberta- ట్యూటోనిక్కుపదము, Work bright అని యర్థము.

Amalina - ట్యూటోనిక్కు పదము, Work serpant అని యర్థము.

Amaltrude- ట్యూటోనిక్కుపదము, Work maiden అని యర్థము.

Amanda, Amand in - లాటిన్పదము Worthy to be loved అని యర్థము.

Amelia, Amelie, Amalie, Amalia - ట్యూటోనిక్కు పదములు, Energetic అని యర్థము.

Amy, Ame, Amye, Aimee, Aymee, Amina, Amica, Amicia, Amicie- లాటిన్పదము, Beloved అని యర్థము.

Anastasia - గ్రీకు పదము, Anastasius యొక్క స్త్రీ వాచకపదము, St. Anastasius ఋషి యొక్క పేరు. ౧౫ ఏప్రిఏల్ ఆయన దినము.

Anatolia - గ్రీకుపదము, Eastern అని యర్థము.

Andalusia - నవీనము, కొంచెముగా ప్రచారమునందున్న పేరు.

Andromache - పురాతన పదము, సంగర మని యర్థము.

Angelica, Angelina, Angela, Angele, Angelena - జర్మను పదము, Lovely Angel అని యర్థము.

Ankaret- కెల్టిక్కు-పదము, సిగ్గుపడని యని యర్థము.

Ann, Anna, Anne, Ane, Annie, Annapple, Annette, Annetta, Aneta, Anita, Anah, Annice, Annis- హిబ్రూపదము, Grace sweet అనియర్థము. దీని ముద్దుపేరులు Nan, Nina, Nancy Nanny, Hannah అనునవి. Grace అని యర్థము.

Annabel, Annabella- ఇది Anna, Bella అనుపదములు కల్పిచేయుబడిన పదము, Anna అన Grace అనియు, Bella అన Fair అనియు నర్థములు.

Antoinette, Antonetta, Antonia, Antonie, Antoinetta, Antonina, Antonica- లాటిన్పదము. Inestimable అని యర్థము. దీనం గల్గిన ముద్దుపేరు Netty, ఇది ఫ్రెంచిదేశమున వాడుక విస్తారముగ నున్నది.

Apollonia- గ్రీకుపదము, Apollo శబ్దమునకు స్త్రీవాచకపదము.

Arabella- లాటిన్పదము, Fair shrine అని యర్థము. దీనినుండి గల్గిన ముద్దుపేరులు Belle, Bella అనునవి.

Ardyn- కెల్టిక్కు-పదము, High అనియర్థము.

Areta- గ్రీకుపదము, Virtuons rule అని యర్థము.

Arethusa- గ్రీకుపదము, Virtuous అని యర్థము (ఉచ్చారణ Arrythusa).

Ariana- గ్రీకుపదసంబంధము, Ariadne వంటిది.

Armyne- ట్యూటోనిక్కు-పదము, Public అని యర్థము.

Arnoldine- ట్యూటోనిక్కు-పదము, Eagle power అనియర్థము. Arnold స్త్రీపదము.

Artemise, Artemisia- గ్రీకు పదము, Apollo (గ్రీకుదైవము) యొక్క కవల సోదరి పేరు.

Arthurine- కెల్టిక్కు-పదము, High అని యర్థము. Arthur యొక్క స్త్రీవాచక పదము.

Audrey, Audry- ట్యూటోనిక్కు- పదము, Noble Threatener అని యర్థము.

Augusta, Augusteen, Augustina- లాటిన్పదము, Exalted అని యర్థము. Augustus యొక్క స్త్రీవాచకపదము. ఈపేరు చక్రవర్తులకును, కాంటర్బరీ మొదటి ఆర్చిబిషప్పునకు నుండెను. దీనినుండి గల్గిన ముద్దుపేరు Gussie అనునది.

Aurelia, Aurea, Aurelle, Aurelie- లాటిన్పదము, Golden అని యర్థము. Aurelius యొక్క స్త్రీవాచకపదము.

Aurora, Aurore- లాటిన్పదము, Roman Goddess of Dawn యొక్క పేరు.

Aveline- హిబ్రూపదము, Pleasant అని యర్థము.

Avice, Avicia, Avis- ట్యూటోనిక్కు- పదము, War refuge అని యర్థము.

Azalea- Temperance అని యర్థము. ఒక పుష్పమర్థము.

**ఏంగిల్సు** (కోణములు) Angles — రెండు రేఖలు కలియు తావున మూల పర్పడును. ఈమూలలు ౧. సమకోణము (Right angle).

తొంబది డిగ్రీలుగల సమకోణము.

౨. గురుకోణములు (Obtuse angles).

తొంబదికన్న నెక్కువ డిగ్రీలుగల గురుకోణము.

౩. లఘుకోణములు (Acute angles). అని త్రివిధము.

తొంబది డిగ్రీలకన్న తక్కువ డిగ్రీలుకల లఘుకోణము.

ఈ ఏంగిల్సు డిగ్రీలుగా విభజింపఁబడినవి. ఒక సమకోణము నందు తొంబది డిగ్రీలు చెప్పబడినవి. నాల్గు సమకోణములు కలసిన పరిపూర్తిగ సరిపోవును గాన $4 \times 90 = 360$ డిగ్రీలు ఒక వృత్తమని యందురు (Circle). అట్లు రెండు రేఖలు కలసిన కోణమునకు మూలముగానున్న కలయికస్థానము నకు వెర్టెక్సు (Vertex) అని పేరు. వెర్టెక్సునకు కోణమువైపున గాక, వెలుపలి వైపునకు రిఫ్లెక్సు (Reflex) లేక Re-entrant అని పేరు.

వెర్టెక్సు ఏంగిల్

రెండు రేఖలు కలియు ప్రదేశము నకు వర్టెక్సు (Vertex) అని పేరు.

## ఏంగ్యోస్పెర్మిస్ట్రీ (Angeospermistry)

కొన్ని చెట్ల విత్తనములు. తొడుగు లేక సంచులలో జుట్టఁబడి యుండును. ఇందువలన నాబీజము రక్షితమై త్వరితముగఁ జెడిపోదు. అట్టిచెట్లకు Angeosperms అనిపేరు. ఇవి వానింగూర్చిన శాస్త్రము.

## ఏంట్వర్పు పురము (Antwerp)—

బెల్జియం దేశమునందు షెల్టు నదీతీరమందున్న పట్టణము. ఆదికాలమున నిది యొకరాక్షస నివాసమై యుండెననియు, ఆనదియం దేతెంచిన ప్రతియోడ కప్పము కడనుండియు నాతఁడు కప్పముంగొనును, ఈయనివారి చేతిందెగనరికి ఏటిలోఁబారవేయుచుండు వాఁడనియు, వానిని బ్రాబో యను బుద్ధిశాలి హతమొనర్చెననియు బలమగుప్రతీతి కలదు. డచ్చిభాషయందు వెర్పన్ (Werpen) అన పారవేయుటయని యర్థము. అచటి గ్రామమునకు Hand werpen (చేతిం బారవేయుట) యని పేరయ్యెనట. అదినానాఁటికి మారి ఏంట్వర్పు అయ్యెనట. ఆరాక్షసునింజంపిన బ్రాబోయొక్క విగ్రహము ఏంట్వర్పునందు కలదు. ఈపురమున ప్రసిద్ధమగు నొకదుర్గముకలదు. ౧౯౧౪-౧౮ సంవత్సరములలో జరిగిన ప్రపంచ యుద్ధమున నీదుర్గము జర్మనీసైనికులచే నాశన మొనర్పఁబడినది.

## ఏంటిట్రేడువిండ్సు (Anti-Trade Winds)—

భూమధ్యరేఖవైపున కీశాన్యదిశనుండియు, నైరుతిదిశనుండియు వీచుగాలులకు ట్రేడు విండ్సనిపేరు (చూడుఁడు). అవి భూమధ్యరేఖ స్థానమునకుం దగిలి యాకాశమున కెగసి తిరుగ తాము వచ్చినదెసకే మఱలి పైభాగమునందు వెనుకకు వీచును. ఈ సంగతి ఆ తావులందు క్రిందిగాలి ఒకదెసకు వీచుచుంటయు, ఆ తావునందే ఆకాశమునందలి మేఘము దానికెదురుగా పర్వెడుచుంటయు గాననగుచుండును.

ఈ ఏంటిట్రేడు విండ్సు గాలులు భూమధ్య రేఖనుండి నలువది డిగ్రీల దూరప్రదేశములందు ఆయాదిక్కుల భూమట్టము లేక సముద్రపునీటి మట్టములకుందిగి అటులనే వీవనారంభించును. అటుల నేలకుందిగిన తావులకు (౪౦ డిగ్రీల దూరప్రదేశము) అట్లాంటిక్కు మహాసముద్ర మున Horse Latitudes అని యందురు. మఱియు నట్టిప్రదేశములు కర్కాటక మకర

రేఖల (ట్రోపిక్ ఆఫ్ కేన్సరు, ట్రోపిక్ ఆఫ్ కేప్రికారను) లనడుము నుండెడిని. (ట్రేడ్విండ్సు చూడుఁడు).

**ఏంటిసైక్లైను** — సిన్క్లైను, ఏంటిక్లైను చూడుఁడు.

**ఏంటిడేట్** - వాణిజ్యసంబంధ పరిభాషా పదము. Antedate. ఏరోజున కాగితముర్వాయ బడినదో దానిపై నాతేదీ వ్రాయుట సహజపద్ధతి. అట్లుకాక వేఱుకారణమున నంతకు పూర్వపు వేఱుతేది వేయవలసి వచ్చినచో దానిని లిఖించుటకు Antedate అనెదరు.

**ఏంటినోమియనిజమ్** (Antinomianism) — క్రైస్తవ మతమునందు, ప్రభుఁడగు ఏసుక్రీస్తు వలన శరణ్యముపొంది, ఆయనయందు నమ్మకము గల్గియుండుట వలననే రక్షణ గలుగుచుండగా నింక దేవుని నియమము (Law) యందు విధి కల్గియుండుట యనవసరమను సిద్ధాంతము.

**ఏంటిపతీ** (Antipathy)- ఫ్రెంచిమాటయగు Antipathie నుండి కల్గినవికారరూపము. జర్మను భాషయందు Anti = వ్యతిరేకపు, Pathos = తలంపు లేక అసూయత. కొన్ని జాతుల జంతువు లొకటి కొకటి జాతివిరోధము లగునట. నైసర్గికముగ మానవులందు గూడ కొన్ని లక్షణముల మధ్య విరోధభావము లక్షణమైయుండును. దానికి ఏంటిపతీ (Antipathy) అనిపేరు.

**ఏంటిపోడ్సు** (Antipodes) — (లాటిన్భాషయందు Ante=అవ్వలి,Podes = పాదములు). భూమియొక్క ఒక భాగమందలి యొకతావునకు అవ్వలనుండు (రెండవ) భాగమున తిన్నగానుండుతావు. దానికిదియు, దీని కదియు ఏంటిపోడ్సు అనఁబడును. అనఁగా నాయాతావుల నిలువఁబడియుండువారల కొకరి పాదములు వేఱొకరి కవ్వలిదిశ నుండునని భావము.

**ఏంటిమనీ** (Antimony) — దీనిని Tartar Emetic అనియు నందురు. తొల్లి వె. పదునారవ శతాబ్దమున నుండిన బేసిల్ వెలెంటైన్ (Basil Valentine) అను నొక రసాయనశాస్త్రవేత్త (Alchemist) ఒక క్రైస్తవసన్యాసి మఠమొక సన్యాసికి నప్రయత్న పూర్వకముగ నీయౌషధము నొసంగి గుణము గాంచ నాశ్చర్యముగ దీని గుణమెఱింగెనట. నాఁడాదిగ తలవనితలంపుగ నప్రయత్నపూర్వకముగఁ జేసిన యొకపనివలన బాధనివారణకల్గు దానికీపేరు ప్రసంగములందు సామెతగా వాడుచున్నారు.

**ఏంటిసైక్లోన్** (Ante-Cyclone)— సైక్లోన్ (Cyclone) చూడుఁడు.

**ఏంథ్రొపాలోజీ** (Anthropology)- ఫ్రెంచిమాటయగు Anthropologie యొక్క వికారరూపము. Anthropos= మనుష్యుఁడు. logy=కళ. జర్మనురూపము. మానవునకు పూర్వపురూపము, ఉత్పత్తి, మార్పులు, అభివృద్ధి క్షీణతలు మొదలగు స్థితుల వివరించు కళ.

**ఏంథోలొజీ** (Anthology)— (ఫ్రెంచిమాట Anthologie యొక్క వికారము). Anthos = పూవు, Logia = కూర్పఁబడినది. పూవులవలె కూర్పఁబడినవని యర్థము. చక్కని కవిత్వనిచయమని తాత్పర్యము. దీనిం గూర్చిన శాస్త్రము. ఈకళ మృదుమధురకవిత్వముం గూర్చినదిగాని ఛందస్సు (Prosody) మాత్రము గాదు.

**ఏకచక్రపురము** మహాభారతము, ఆదిపర్వమున ఏకచక్రము బకాసురునిదిగ, చెప్పఁ

బడినది. ఇచటనుండువారలను ఒక్కరొక్కరి నా బకాసురుఁడు భక్షించువాఁడట. క॥ బకుడేకచక్ర పురమున। బ్రకటితముగ నొక్కనొకని భక్షించు తరి। న్నొక్కరైననూరువిడువరు। సుకరమె?యాజన్మ భూమి సుఖమెట్టిదియో।। అని లోకోక్తిగా వాడుచున్నారు. పాండవులు లాక్షాగృహ దహన మున చావుందప్పించుకొని వెడలి కుంతీదేవితో గూడ బ్రాహ్మణ వేషధారులై కొంతకాలమిట వసించుతరి బకాసురుఁడు భీమునిచేఁ జంపఁబడియె నని చెప్పఁబడినది. ఎటావాపురమునకు నైఋతి దిశగా పదునారు మైళ్లదూరముననున్న చక్ర ర్నగర్ అను గ్రామము ఏకచక్రపురమని ఫర్రార్ (Dr. Fuhrer) పండితుఁడు పోల్చెను. ఇదియె పెక్కండ్ర యభిప్రాయమై యున్నది.

**ఏకచక్రుఁడు** — దానవుఁడు - తండ్రి కస్యపమహర్షి. తల్లి దనువు; దక్షప్రజాపతి కుమార్తె.

**ఏకత గోత్రము**— విష్ణువృద్ధ ఉపగణము చూడుఁడు.

**ఏకతాళము**— ఇందైదు జాతులుకలవు. జాతి (లయ) ప్రాణము చూడుఁడు. తాళములు చూడుఁడు.



**ఏకత్రింశ న్మహర్షులు** - మహర్షులు చూడుఁడు.

**ఏకదేశ వికృత మనన్యవ దితి న్యాయము** — ఒక దాని నొక భాగమున మార్పు గల్గించితిమేని, అంతటితో నది మారి వేఱొకటిగ నైన నదివీలుకాదని భావము.

**ఏకపాద వృక్షాసనము** — యోగ శాస్త్రమునఁ జెప్పఁబడిన ఆసనములలో నొకటి. వృక్షాసనము నందువలెనె రెండు అఱచేతులు భూమికానించి అఱచేతులమీద శిరస్సు నానించి శరీరమును ఆకాశమువంక పైకి నిలువంబెట్టి ఒక కాలును పైకి నిలువంబెట్టి రెండవ పాదమును గజ్జయందుంచునట్లు ముడచుట ఏకపాద వృక్షా సన మనంబడును.

**ఏక మనుసంధిత్సతో అపరం ప్రత్యవతేతి న్యాయము** - ఒకవస్తువుకై వెతకికొను (ప్రయత్నించు) చు వేఱొక వస్తువును బారవై చుకొనుట (గోల్పోవుట)కీ న్యాయమును వాడుచుందురు.

**ఏకలవ్యుఁడు** — బోయకులజుఁడు. ధను ర్విద్యాభ్యాసమునకై ద్రోణాచార్యుల కడకేగి యర్థింప నాతఁ డుపదేశింప నిరాకరించు కతన, మట్టితోద్రోణాచార్యునిఁబోలిన యొకవిగ్రహముం జేసి, దానిం బూజించుచు గురువుగ భావించి, దానికడ తానే విలువిద్యాభ్యాస మొనర్చి విలు విద్యాపారంగతుడైన వాఁడు. భారతయుద్ధమునకు ముందే శ్రీకృష్ణునిచే నిహతుఁడైన వాఁడు.

**ఏకలుఁడు** - తండ్రిపేరు దేవశ్రవసుఁడు. పెద్దతండ్రి వసుదేవుఁడు. యదువంశ క్షత్రియుఁడు. ఈతఁడు నిషాదులచేఁజంపఁబడెనని చెప్పఁబడినది.

**ఏకవింశతి మహాదోషములు** — (ముహూర్త దోషములు) జ్యోతిశ్శాస్త్రమున ముహూర్తభాగమునందు వివాహాది శుభకార్య ముల ముహూర్తములకుండరాని ఇరువదియొక మహాదోషములు.

౧. పంచాంగశుద్ధిదోషము- తిథివారనక్షత్ర యోగకరణము లర్హములైనవి గాకపోవుట కీదోషము చెప్పఁబడెను.

౨. సంక్రాంత్యహస్సుదోషము- సూర్యసంక్ర మణప్రవేశమునకు పూర్వాపరములయందు పదు నారు ఘటికల పదునేను విఘటికలు శుభకార్య ముల కనర్హకాలము (దినకృత్సంక్రాంతి).

౩. పాపషడ్వర్గ దోషము - (షడ్వర్గ చూడుఁడు). శుభకార్య ముహూర్తములు షడ్వర్గలలోని భాగములలో దేనియందుపడునో, ఆ తావు శుభగ్రహాధిపతిదై శుభస్థానమై యుండవలయునని భావము. ఈ సందర్భమున రవి, కుజ, రాహు, శని, కేతువులు పాప (క్రూర) గ్రహములనియు; చంద్ర, గురు, బుధ, శుక్రులు సౌమ్య (శుభ) గ్రహములనియు నెఱుంగునది.

౪. కునవాంశదోషము- (షడ్వర్గ, వర్గోత్తమాంశ, పుష్కరాంశ చూడుఁడు). నవాంశ దోషయుక్తము కారాదు.

౫. అష్టమకుజదోషము - దీనిని కుజాష్టమ దోషమనియు నందురు. శుభకార్యలగ్నమున కష్టమస్థానమున కుజుడుండరాదని, ఉండినకీడనియు భావము.

౬. భృగుషట్కదోషము - శుభకార్యలగ్నమున కారవస్థానమున శుక్రుఁడుండరాదనియు, ఉండిన కీడనియుఁ జెప్పఁబడినది.

౭. కర్తరిదోషము - ఒక పాపగ్రహము లగ్నమునకు పండ్రెండవస్థానమున వక్రింపక యుండుటయు, రెండవపాపగ్రహము లగ్నమునకు రెండవస్థానమున వక్రించియుండుటయు సంభవించి, ఆ రెండు క్రూరగ్రహముల నడుమను లగ్నముండుట కర్తరిదోషమనియు, ఇది మృత్యుప్రదమనియుఁ జెప్పంబడినది. మఱియు రెండు క్రూరగ్రహములనడుమ చంద్రుఁడుండెనేని యది కర్తరీదోషమందురు.

౮. లగ్నాష్టమి లేక అష్టమలగ్నదోషము - జన్మలగ్నమునకుఁ గాని, చంద్రలగ్నమునకుఁ (చంద్రుడుండుస్థానము) గాని, ఎనిమిదవస్థానము శుభకార్య ముహూర్తలగ్నము కారాదు. ఇందెన్ని శుభలక్షణము లమరినను దోషమని చెప్పఁబడినది. లగ్నాధిపతి లగ్నమందుండిన మృత్యుప్రదమగునంతటి దోషమనియుఁ జెప్పఁబడినది.

౯. అష్టమచంద్రదోషము- దీనినిచంద్రాష్టమ దోషమనియు నందురు. చంద్రుఁడు జన్మరాశి ఎనిమిదవరాసిం బొందిన నిత్యదరిద్రప్రదమనియు, జన్మద్వాదశరాశియు, స్వజన్మలగ్నమును అశుభకరమనియుఁ జెప్పంబడినది.

౧౦. షడష్ట రిఃఫ చంద్రదోషము - చంద్రుఁడు వివాహాది శుభకార్య ముహూర్తములందు ఆరవ యింట, ఎనిమిదవయింట, పండ్రెండవయింట నుండరాదు. అదిమృత్యుప్రదమని చెప్పఁబడినది.

౧౧. చంద్రసగ్రహదోషము - చంద్రుఁడు ఏ గ్రహముతోను కూడియుండు లగ్నము తగదు. అది శుభగ్రహ యుక్తమైనను దోషమేయని చెప్పఁబడినది.

౧౨. వారజనిత దుర్ముహూర్త దోషము- రెండుఘటికల కొకముహూర్తము చొప్పున ౧. రుద్రము, ౨. ఉరగము, ౩. మిత్రము, ౪. పిత్రియము, ౫. వసువు, ౬. వారము, ౭. విశ్వదేవము, ౮. విధి, ౯. బ్రహ్మ, ౧౦. ఇంద్రము, ౧౧. ఇంద్రాగ్ని, ౧౨. దైత్యము, ౧౩. వరుణము, ౧౪. అర్యమము, ౧౫. భగముహూర్తము, ౧౬. ఈశ్వరము, ౧౭. అజచరణము, ౧౮. అహిర్బుధ్న్యము, ౧౯. పూషము, ౨౦ అసత్యము, ౨౧. అంతకము, ౨౨. వహ్ని, ౨౩. ధాత, ౨౪. శశి, ౨౫. ఆదిత్యము, ౨౬. జీవము, ౨౭. అచ్యుతము ౨౮. అర్కము, ౨౯. త్వష్ట, ౩౦. సమీరణము.

ఇందు రుద్ర, ఉరగ, పిత్రియ, ఇంద్రాగ్ని, దైత్య, భగముహూర్త, ఈశ్వర, అజచరణ, యమ, అగ్ని ముహూర్తములు దుర్ముహూర్తములు; తక్కినవి శ్రేయస్కరము లగు సుముహూర్తములు. మఱియు నాదివారమున అర్యమముహూర్తమును, సోమవారమున బ్రహ్మ, దైత్య ముహూర్తములును, మంగళవారమున

పిత్రియ, వహ్ని ముహూర్తములును, బుధవారమున విధి యనంబడు ముహూర్తమును, గురువారమున దెతేం. వార ముహూర్తములును, శుక్రవారమున బ్రహ్మ, పిత్రియ ముహూర్తములును, శనివారమున రుద్ర, ఉరగ ముహూర్తములును కేవల దోషకరములని చెప్పంబడినది.

౧౩. ఖర్జూరస్థ. నవమాంఘ్రిభము- దీనిని సర్వసాధారణముగ ఖర్జూరిక సమాంఘ్రి దోషమనుచున్నారు. ఖర్జూరపత్రముం బోలిన చక్రమువ్రాసి తెలియఁదగినది. కాలామృతముం జూడవలెను.

౧౪. గ్రహణదోషము- సూర్యచంద్ర గ్రహణములు సంభవించినతరి గ్రస్తోదయమైనను, గ్రస్త సమయ మైనను, అర్ధ గ్రహణములు పూర్వపరముల మూడేసిదినములును, పూర్ణ గ్రహణముల పూర్వపరముల నేడేసిదినములును శుభకార్యములు తగవు. ఇంకను అర్ధగ్రహణ నక్షత్రము పిదప మూడునెలలదనుకను, పూర్ణ గ్రహణనక్షత్రముపిదప నారుమాసములదనుకను శుభకార్యముల కనర్హమని చెప్పఁబడినది.

౧౫. ఉత్పాతభ దోషము- భూకంపము, ధూమకేతుదర్శనము, సూర్యచంద్ర గ్రహణములు ఫని భావము. ఇవి పూర్వ పరముల నేడేసి దినములును శుభకార్యముల కనర్హములుగ నొనర్చెడినని చెప్పఁబడినది.

౧౬. క్రూరయుక్తధిష్ణ్యదోషము- పాపగ్రహములున్న నక్షత్రమునకు జ్వలితమనియు, దాని వెన్కనున్న నక్షత్రమునకు భస్మమనియు, దానికి ముందుగనున్న నక్షత్రమునకు ధూమితమనియుం బేర్లు. ఇవి మృత్యుప్రదములనియు, శుభకార్యములకుం దగనివనియు చెప్పఁబడినవి.

౧౭. పాపగ్రహవిద్ధము; లేక అశుభవిద్ధ దోషము- దీనిని పంచశిలాకచక్రము రచించి తెలియవలయును.

౧౮. విషయుతలగ్న దోషము, లేక విషనాడీ దోషము- నక్షత్ర త్యాజ్యఘటికలచే విషయుతమైనరాసులందు శుభకార్యము లొనర్పరాదని (లగ్నమునకు వర్జము తగిలినచో) చెప్పఁబడినది.

౧౯. లగ్నాంతదోషము- ముహూర్తలగ్నము గాని, దాని నవాంశగాని క్రూరగ్రహాయుతమును క్రూరగ్రహములచే చూడఁబడినదియు కారాదని చెప్పఁబడినది.

౨౦. గండాంత దోషము- ఆశ్లేష జ్యేష్ఠ రేవతీ నక్షత్రములందలి కడపటినాల్గు విఘడియలును; అశ్వని, మఖ మూలనక్షత్రము నందలి ప్రారంభము లందలి నాల్గు ఘడియలును నక్షత్రగండాంతము లనఁబడును. కర్కటక, వృశ్చిక మీనరాసులందలి కడపటి యరఘడియలును, మేష, సింహ, దనస్సు రాసుల ప్రారంభము లందలి అరగడియలును రాశిగండాంత కాలము లనఁబడును.

నంద తిథుల ప్రారంభపు రెండు ఘటికల, పదిహేను విఘటికల కాలములును, పూర్ణతిథుల కడపటి రెండు ఘటికల కాలమును తిథిగండాంత కాలములనఁబడును. ఈ గండాంత కాలములందు శుభకార్యములు తగవని చెప్పఁబడినది.

౨౧. వ్యతీపాత వైధృతి దోషము- ఇవి శుభకార్యములకు కేవలము అనర్హములని చెప్పఁబడినది. దోషములు చూడుఁడు.

**ఏకవింశద్యవతారములు** - ౧. బ్రహ్మ, ౨. యజ్ఞవరాహ, ౩. నారద, ౪. నరనారాయణ, ౫. కపిల, ౬. దత్తాత్రేయ, ౭. సుయజ్ఞ, ౮. ఋషభ, ౯. పృధుచక్రవర్తి, ౧౦. మత్స్య, ౧౧. కూర్మ, ౧౨. ధన్వంతరి, ౧౩. మోహిని, ౧౪. నృసింహ, ౧౫. వామన, ౧౬. పరశురామ, ౧౭. వ్యాస, ౧౮. శ్రీరామ, ౧౯. బలరామ, ౨౦. శ్రీకృష్ణ, ౨౧. బౌద్ధావతారములు విష్ణుదేవుని ఏకవింశద్యవతారములని చెప్పంబడినది.

**ఏకవింశన్మహాదీక్షలు** - మహాదీక్షలు చూడుఁడు.

**ఏకవృత్తగతఫలద్వయన్యాయము**- ఒక తొడిమయందే రెండు పండ్లుండుట కర్థము. ఒక ప్రయత్నముతో రెండు ఫలితముల నందుటకు గాని, రెండర్థము లిచ్చునటుల నొకమాటను ప్రయోగించుటకుఁగాని, ఈన్యాయమును వాడు చుందురు. కొంచ మెచ్చు తక్కువగ "ఏక క్రియాద్వ్యర్థకరీ బభూవ" అను అర్థమీయ నీ న్యాయము నుపయోగించు చున్నారు.

**ఏకశిలానగరము**- దీనికి ఓరుగల్లు (ఒకే కొండ) అనియుం బేరుండెనట. ఒరుగల్లు ఓరుగల్లు గను ఇప్పుడు వరంగల్‌గను మారి నైజాం రాజ్య మున నొక శుభ ప్రధాన నగరమై వర్తకస్థానమై యున్న పురము. ఈమధ్యకాలమున ఏకశిలానగ రము కడప మండలములోని ఒంటిమిట్ట యనఁ బడు పురమనియు, ఆకొండపైనున్న శ్రీరామా లయము నందే భాగవతము రచించిన బమ్మెర పోతరాజు దానికృతి నర్పించిన భక్తుఁడనియు, ఆతఁడు ఒంటిమిట్టనివాసియె యనియు, కొందఱు తలఁచుచుండిరి; కాని, యది సరికాదనియు, దేవా లయము నవీనప్రతిష్ఠితమనియు, ఇప్పటి వరంగల్లు ఏకశిలానగరమనియు, పోల్పఁబడినది.

ఇట శంభులింగస్వామి ఆలయము వరంగల్లు కోటలోనున్నది. పురముంజుట్టి రెండు, మూడు కోటలుండిన యానవాళ్లు కలవు. గొప్ప గొప్ప కందకములు కలవు. ఓరుగల్లు తొల్లింట తెలం గానా యనఁబడిన త్రిలింగ దేశమున ప్రధాన నగరమై, ప్రతాపరుద్ర మహారాజు మొదలగు కాకతీయవంశ నృపతులకు రాజధానియై యుం డినది. ఇట నప్రతిష్ఠతమగు బ్రహ్మదేవుని యాల యము కలదు. ఇచటికి కతిపయ దూరము నహే అన్మమకొండపురము కలదు. అది యిక్కాల మున హనుమకొండగ మారియున్నది. అందు గొప్ప శివలింగమును, దేవస్థానమును పాడై వద లివేయఁబడియున్నవి. ఈప్రాంతమున నేగల బమ్మెర బమ్మెర పోతరాజుకవికి జన్మభూమి.

వేఱ్వేఱు కాలములం దీపురమునకొ లేక వేఱు పట్టణభాగములకో (సరిగా తెలియదు) వరంగల్లు, ఓరుగల్లు, చోడగంగపురము, అనుమ కొండపట్టణము, కోరుంకోలపురము, అక్షలింగ నగరము, వేనాకటకములను పేర్లుండెనట. (తెలం గానదేశము చూడుఁడు).

**ఏకసంబంధిదర్శనే ఽ న్యసంబంధిస్మరణ మితిన్యాయము** — ఒక దానిం జూచిన తత్సంబంధమగునది వేఱొకటి జ్ఞాపకము నకు వచ్చునని భావము. దీనిని ఏకసంబంధిజ్ఞాన న్యాయమనియు నందురు.

**ఏకాకినీప్రతిజ్ఞాహి ప్రతిజ్ఞాతం నసాధయేదితి న్యాయము** — ఒట్టి ఒప్పుదల. ఒప్పుకొనినసంగతికి ఋజువుపఱ్చఁబడిన స్థితిం గల్పింపనేరదని భావము. ఇతర పరిస్థితులు కూడ ఋజువుకావలయునని దీని తాత్పర్యము.

**ఏకాదశపితృలు** – పితరులు చూడుఁడు.

**ఏకాదశ వైరాగ్యములు** – వైరాగ్యములు చూడుఁడు.

**ఏకాదశి తిథి** - ప్రతి మాసమునను ఉభయ పక్షములందలి పదునొకండవ దినము నేకాదశి తిథి యందురు. దీనిని ద్వైతులు హరి వాసరమని చెప్పుకొనెదరు. సర్వసాధారణముగ నేకాదశి తిథులన్నియు పర్వములుగ నెంచఁ బడుచు విష్ణుభక్తికల వారిచే నుపవసింపఁబడు చున్నవి. రామానుజీయ శ్రీవైష్ణవులును ద్వైతు లగు మధ్వవైష్ణవులును మతావేశపరత్వమున ఏకా దశియందుపవసించుటయె ప్రధానముగ నెంచి, పితృ కార్యములను సైతమునిలపి మఱునాఁడు

జరిపించెదరు. ఈ ౨౪ వేఱ్వేఱు నామములచేఁ దనరు వేఱ్వేఱు మాసములందలి ఏకాదశులం గూర్చి ఆయా తావులందుఁ గాననగును. (పండుగలు చూడుఁడు).

**ఏకాదశులు —**

౧. ఆషాఢ శు ౧౧ ప్రథమైకాదశి, శయనైకాదశి (విష్ణుదేవుని నిద్ర ప్రారంభము).
౨. ఆషాఢ బ ౧౧ చాతుర్మాస్య ఏకాదశి.
3. శ్రావణ శు ౧౧ ,,
౪. శ్రావణ బ ౧౧ ,,
౫. భాద్రపద శు ౧౧ ,,
౬. భాద్రపద బ ౧౧ ,,
౭. ఆశ్వీజ శు ౧౧ ,,
౮. ఆశ్వీజ బ ౧౧ ,,
౯. కార్తీక శు ౧౧ ,, కడపటి ఏకాదశి, ఉద్ధానైకాదశి(విష్ణుమూర్తి నిద్ర లేచును).
౧౦. కార్తీక బ ౧౧ చాతుర్మాస్య ఏకాదశి.
౧౧. పుష్య శు ౧౧ వైకుంఠైకాదశి, ముక్కోటి ఏకాదశి. శ్రీరంగమున వైకుంఠద్వారము తెఱతురు. వైకుంఠమున ద్వారము లన్నియుం దెఱతురట. ముక్కోటిదేవతలు శ్రీరంగమున కేగుదురని చెప్పఁబడినది.

**ఏకామసిద్ధిం పరిహారతో ద్వితీయాపధ్యతేతిన్యాయము** — హేత్వాభాసము మిథ్యయునగు నొక భ్రమను వదలుసరికి వేఱొకభ్రమ సిద్ధమైనటుల నని భావము. ఒక భ్రమనుండి తెల్విగొని, వేఱొకభ్రమలోఁ దగుల్గొనుట కీన్యాయము వర్తించును.

**ఏకామ్రకాననము లేక వనము-** ఇది ఉత్కళదేశమునందలి భువనేశ్వరారణ్యము. దీనిగుండా గంధవతీనది ప్రవహించెడిని. బ్రహ్మపురాణము ౪౦ యందు దీని ప్రశంస కలదు. భువనేశ్వరము, ఉత్కళదేశము చూడుఁడు.



**ఏకాలుజారినా శరీరమునకేబాధ-** ఆంధ్రలోకోక్తి.

**ఏకోహిదోషోగుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః** — గుణములు అధికముగా నున్నప్పుడు ఒకదోషము పాటింపఁబడఁ జనదు. చంద్రునియందనేక గుణము లుండియు నొక మచ్చయుండిన లెక్కఁజేయరు. ఇది అలంకారశాస్త్ర సంబంధమగు సంస్కృత లోకోక్తి.

**ఏక్చుఅరీ** — (వాణిజ్య పరిభాషాపదము) Actuary- ఇన్సూరెన్సు, ఎస్యూరెన్సు, బ్యాంకివ్యాపారము, ట్రస్టు మున్నగువానిం జక్కఁగ నెఱిఁగినవాని పేరు.

**ఏక్టాఫ్‌గాడ్** — వాణిజ్య పరిభాషాపదము. Act of God- ఇట్టిఆపద సంభవించునని ఎవ్వరికిం దెలియరాని, ఓడబద్దలై నష్టమువచ్చుట, తుపాను, భూకంపము మొదలగువాటివలన గల్గిన నష్టమును Act of God అనియెదరు. అట్టి నష్టములంగూర్చి మొదట సమాఖ్యనుండు ఏర్పాటు చేయఁబడకపోయినచో Act of God పద్ధతిక్రింద నన్యథా జరగవలసియుండును.

**ఏక్టినోమీటర్** (Actino meter)- సూర్యకిరణములందలి Chemical properties ను, ఉష్ణశక్తిని (Direct heating power) కొలచు యంత్రము. దీనిని క్రీ. శ. ౧౮౨౫ వ సంవత్సరమున సర్ జాన్ హెర్స్చెల్ (Sir John Herschel) అను పరిశీలకుఁడు కనిపెట్టెనట. దీనితో Actinograph అను యంత్రమును గూడ వాడుచున్నారు. అది Variations in power of Solar rays తెలుపును.

**ఏక్టినోలైట్** (Actinolite) — ఇది యొక జాతిరాయి. దీనిని Lithos stone అనియు ననుటకలదు. దీనిని ఆంగ్లరసాయనవేత్తలు

Natural silicate of calcium, magnesium and iron అని యందురు. ఇందు అల్యూమినా యుండదనియు పోల్చఁబడినది. ఆకుపచ్చ రంగుగనుండి Monoclinic amphiboles తెగ రాయిగఁ జెప్పఁబడినది.

**ఏక్టివ్ బాండు** — (వాణిజ్యపరిభాషా పదము) — Active Bond- పత్రము పుట్టిన (Issue) తేది మొదలు ఒక నిష్కర్షయగు వడ్డీతో తీర్మానము (అంతయు నొకేసారిగ) కాగల అప్పు పత్రములు. ఇందు ప్రోమిసరీనోట్లు (Pronotes) కూడ చేరును.

**ఏక్సిస్** (Axis) — జ్యామిత్రీ శాస్త్రమున ఏదేని యొకరూపమును సరియైన ఒకేపోలిక గల్గునటుల రెండుగ భాగించెడిగీతకు ఏక్సిస్ అని పేరు.

ఉదాహరణము:-




**Axis**- భూమి తనకుతానై గిరగిరఁదిరుగుచు సూర్యునిఁజుట్టి వచ్చుచుండును. తనకుదాగిరగిర దిరుగుతరి వంకరలుగాఁ దిరుగక భూమిగుండా ఉత్తరదక్షిణముల కొకరేఖను భావింతుమేని ఆరేఖనుపీడక దానినంటియె బొంగరమువలె తిరుగు విధానముగలది. భూమిగుండా ఉత్తర దక్షిణములకు భావింపఁబడిన ఆరేఖకు ఏక్సిస్ అనిపేరు. దాని యొక్క ఉత్తరపుకొనకు ఉత్తర ధృవమనియు (North Pole), దక్షిణపుకొనకు దక్షిణధృవమనియు (South Pole) పేర్లు. ఇవి సాధారణముగ భూమియొక్క ఉత్తర, దక్షిణ ప్రదేశముల కడభాగములని గ్రహింపఁబడుచుండును. ఈధృవములకు తిన్నగా నొక నక్షత్రముండును. అది తిరుగక సూర్యునివలె స్థిరముగ నిలచియుంటయు, ధృవములు దానివైపె సరిగా నుంటయు నానక్షత్రమునకు Pole Star (ధృవ నక్షత్రము) అనియెదరు.

**ఏక్సెప్టెన్సు**- (వాణిజ్యపరిభాషాపదము). Acceptance. అంగీకరించుట యని యర్థము. చూడఁగనే సొమ్ము చెల్లించు హుండీ ఎవరిపైఁ గలదో ఆతనికి దానిం జూపగనె దాని నంగీకరించినట్లు సంతకముచేసి, ఏ బాంకినుండి ఆసొమ్ము చెల్లింపఁ బడునో ఆబాంకిపేరును వివరించును. ఇకను వాయిదా హుండి అయినచో, దానిం జూచి అంగీకరించినటుల సంతక మొనరించును. ఇట్టివానికి ఏక్సెప్టెన్సు అనెదరు. ఇది మూడు లేక నాలుగు తెఱంగులుగ నున్నది.

౧. Acceptance General - జనరల్ ఎక్సెప్టెన్సు. తొలుత హుండీపై నిర్ణీతమగు షరతులమేర కంగీకరించుట.

౨. Acceptance Special - హుండీ మొత్తముయొక్క కొంతభాగమునే ఈయ నంగీకరించి తక్కినదాని నీయ నిరాకరించుచు, కారణములను వివరించుట లేక హుండీలో వివరింపఁబడిన కారణముల నిరాకరించియు వేఱు కారణములను వివరించి అందు కొఱకుగాను తానంగీకరించిన మొత్తము నీయ నంగీకరించుట. దీనినే Acceptance qualified అనియు ననెదరు.

3. Acceptance of Honour - హుండీ ఎవ్వరిపైకి వచ్చినదో అతడు చెల్లింపఁజాలకుండిన తరి నతని పేరుప్రతిష్ఠలుపాడై హీనత గలుగకుండు నటుల మఱియొక రా హుండీ చెల్లింప సమకట్టి నంగీకరించుట.

౪. Acceptance of Surity - దీనిని సర్వసాధారణముగ నందఱును 'Accommodation Bill' అనెదరు.

. ఎవ్వరిపై హుండీవ్రాయబడవలయునో అతఁడు తగు ధనవంతుఁ డను పేరు ప్రతిష్ఠలు చాలక, దానిం గొన వర్తకులు వెరచినచో నా హుండీ నొక ప్రసిద్ధుఁ డగు పెద్ద వర్తకునిపైకివ్రాసి యాత నిచే సంగీకరింపఁజేసి, అసలు మనుష్యుఁడు (చెల్లించవలసినవాడు) చెల్లించునటుల, పంపబడు నట్లు ఏర్పాటుచేయును. ఈహుండీనే Bill of Accommodation అనియెదరు. ఇట్లంగీక రించెడి మధ్యవర్తియగు పెద్ద వర్తకుఁడు తాను హామీనిచ్చినవాఁ డగుచున్నాఁడని ఎఱుఁగునది.

**ఏగనీ కాలమ్** (Agony Column) – ప్రసిద్ధవార్తాపత్రికలందుఁదప్పిపోయినవారింగూర్చి విలపించుచు భోగట్టాచేయు సంగతులు ముద్రింపఁ బడుచుండు తావున కీపేరు వాడుచుందురు. ఈ వాడుక వార్తాపత్రికలందు సుప్రసిద్ధము.

**ఏగాలికా తెరచాపపడవయందెత్త గలవాఁడే** - (అనగా గడుసువాడని భావము) ఆంధ్ర లోకో॰

**ఏగ్నోస్టిసిజమ్** (Agnosticism)-తనకు (అనగా మానవ శరీరమునకు) స్పష్టముగఁ గాన రానివన్నియు కల్లలేగాని నిజమని నమ్మని సిద్ధాం తము. ఈకళను క్రీ. వె. ౧౮౭౫ హక్స్లీ పండి తుఁడు కనిపెట్టి స్థాపించెను. ఇదియె ఆయనమతము నైయుండెను. ఈమత ధర్మమునదేవుఁడు కలఁడని గాని లేఁడనిగాని స్పష్టముగ ననవీలు లేదట.

**ఏచ్చూరిసింగనమంత్రి** — ఆంధ్రకవు లలో మధ్యకవిగఁ బరిగణింప బడిన వాఁడు. భాగవతములోని షష్ఠస్కంధమును తెనుగుపద్య ములుగ రచించెనట. ఈతఁడు ఎఱ్ఱాప్రగ్గడవంశపు జ్ఞాతియేమోనని సంశయము కలదు. భాగవత రచన కాలమందేయుండిన వాఁడుగ ఁదోచును గాని నిదర్శనములు లేవు.

**ఏజ్ ఆఫ్ మూన్** (Age of Moon)- అమావాస్యనుండి గడచిన దినముల చంద్రుని Age అనంబడునని ఖగోళ (ఎస్ట్రానొమీ) శాస్త్ర మున చెప్పంబడినది. సూర్యునుండి ౩౬౦ డిగ్రీలు $29\frac{1}{2}$ రోజులలో నడచుఁగాన దినమునకు $12\frac{1}{5}$ డిగ్రీలగును అనగా గంటకు 30' ($\frac{1}{2}$ డిగ్రీ) మినిట్లయ్యెడిని.

**ఏటిఒండుమట్టి** (Alluvium) — నదులు పర్వతములనుండి తమ జలప్రవాహము నందుఁ గరఁగించుచు సముద్రతీరములకుఁ దెచ్చెడి ఒండ్రుమట్టికి నాంగ్లభాషయందు అల్యూవియమ్ (Alluvium) అని యందురు. నదుల మధ్య భాగములందు వడి యధికముగను, ప్రక్కలందుఁ దక్కువగ నుండునుగాన నట నీఒండుమట్టి క్రిందికి దిగి, అటనుండి గడ్డి మొక్కలు మొదలగు వాటికిం జిక్కుకొనుచు పొరలు పొరలుగ నేర్పడ మొదలిడును. వరదలు ఎత్తగు ప్రదేశములందు గూడ నీఒండుమట్టి పొరలం జేర్పఁజాలును. ఇట్లేర్పడిన ప్రదేశములకు లంకభూములందురు. ఇంకను కొంత ఒండుమట్టి ప్రవాహముతోఁ గొట్టుకొనిపోయి నదీముఖద్వారమున సముద్రపు పోటుపాటులవలన ప్రక్కలకు నెట్టంబడుచు గొప్ప గొప్ప లంకభూములను విరివిగఁబెంచును. గంగానది, బ్రహ్మపుత్రానది మొదలుగాఁ గల గొప్ప నదీముఖద్వారములం దేర్పడిన గొప్పలంక ప్రదేశములకు, ద్వీపముల (Delta lands and islands) కిదియె కారణము. నదుల వెల్లువ జలముల ఒండుచే మెరకలయి ఫలవంతములుగ నేర్పడిన పల్లపు భూములను River valleys అని వాడుచున్నారు. పొలములకుఁ గాల్వల గుండా కొంపోయిన జలముల గుండా వరదల కాలమునం జేరిన ఒండుమట్టిపొరలా పొలముల నధిక సారవంతములుగఁ జేయుచుండుట నెల్లతెలిసినదే.

**ఏటికవ్వలి ముత్యాలు తాటికాయ లంతేసి** — నమ్మరాని డంబపుమాటలగూర్చి దీనిని వాడుదురు. ఆంధ్రలోకోక్తి.

**ఏడమ్ అండ్ ఈవ్** (Adam and Eve )- ఆదము, ఈవు లాదిమ దంపతులుగ క్రైస్తవ, మహమ్మదీయ గ్రంథములందుఁ జెప్పఁబడినది. మహమ్మదీయు లీయనను మొదటి ప్రవక్తగఁజెప్పిరి. రెండవవారగు క్రైస్తలీవు దంపతులాదిని సృష్టింపఁబడి ఈడెన్ తోటయం దుంచఁబడిరనియు, వారిసంతతివారే నరులనియుననెదరు.

బైబిలు మొదటి నిబంధన, జెనిసిస్ ప్రథమాధ్యాయమున సృష్ట్యాది యారవ దివసమున దేవుఁడు తన యాకారముననే మనుజుని సృజించెననియు స్త్రీనికూడ నట్లె సృజించెననియు రెండవ యాధ్యాయమున భూమియందలి బుగ్గితో మనుష్యులను రచించి నాసికరంధ్రముల గుండా ప్రాణములూని కూద వారు జీవించిరనియుఁ జెప్పంబడినది. ఇందువలన దేవుఁడు వీరికి నిమిత్తకారణమని తేలుచున్నది. ఏది ఎట్లైనను ఆదము ముందు సృజింపఁబడిన తర్వాత ఈవు సృజింపఁబడినదట. ఆయాదిమ దంపతులు ఈడెన్ తోటయందుంచఁ బడిరట. వారు దేవునిచే వలదని వారింపబడియు వినక జ్ఞానవృక్షము (Tree of Knowledge) పండ్లనుదిన దేవుఁడు కుపితుఁడై వారినాతోటనుండి వెడలనంపెను. దీనిపై ననేక విమర్శనలు బయలుదేరినవిగాని వానిని వదలి యవ్వలి కథనముకుంజనెదము. ఆదము మహాత్ముఁడెట్లొ ఈవు నెడబాసి భార్యావియోగ దుఃఖాక్రాంత చేతస్కుఁడై తిరిగి తిరిగి, భరత భూమియొక్క దక్షిణసీమల నడచి అటనుండి శ్రీరామసేతువుగుండా సింహళ ద్వీపమునకరుగ నామహాత్ముండియె యామార్గమునందలి సముద్రపు టిసుకగట్టు ఆదమ్ము బ్రిడ్జిగా పేరంద నోపును.

సింహళమున శ్రీపాదగిరిగా నీకాలమున పేరందిన పర్వతశిఖరమున నొక శిలపై నొంటికాలున నిలువఁబడి ధ్యాననిష్ఠాగరిష్ఠుఁడై కొంత కాలముండెననియు, నాతనినుండి యాశిఖరమునకు ఏడము శిఖరము (Adam's Peak) అని పేరయ్యెనందురు. పిదప యెహోవా కృపచే ఆదమ్ మహాత్ముఁడటనుండి వెనుకకు మఱలి అరేబియాదేశపు మక్కానగరమున కవ్వలనున్న అరఫాత్ పర్వతమున తన ఇల్లాలగు ఈవుంగలసి యామెంగైకొనిచనెనట. వారికుమాళ్లగు ఆబెల్ కాబెలు లన్యోన్యముకలహించి మృతినంది రామేశ్వరము రెయిల్వేస్టేషను కెదుట నొక తాటితోటలో సమాధిచేయఁబడిరట. వారి పొడవగు గోరీల నటంజూపుచున్నారు. ఈవు సమాధి పాలస్థాన (Palestine) దేశమునందుఁ జూపుచున్నారు.

**ఏడమ్ముపీక్ - శ్రీపాదశిఖరము** (Adam's Peak) — బౌద్ధగ్రంథములందు సామంతకూటశిఖరమని చెప్పఁబడినది. సింహళద్వీపమునందున్న పర్వతశిఖరము దీని శిఖరమున నొక చిన్న యింటియందొక మనుష్యపాదమును బోలిన యానవాలు రాతియందు చెక్కఁబడినది. అది బౌద్ధుల స్వాధీనమందున్నది. కొలంబో పట్టణమునుండి ౮౮ మైళ్ల దూరము.

ఇది ఆదమ్‌తపం బొనర్చుతరి, ఏకపాదముపై నిలువఁబడిన యానవాలని మహమ్మదీయులును, బుద్ధభగవానుని పాదమని బౌద్ధులును, తమ ప్రవక్తపాదమని క్రైస్తవులును చెప్పుచు నిటకు త్రిమతస్థులును యాత్రసల్పి పూజించుచున్నారు. పాదము పొడవు ఐదడుగులును, వెడల్పు రెండున్నర అడుగులును కలదు. దీనిని శ్రీపాదశిఖరమనియు ననుట కలదు.

ఇటనుండి చూడఁదగిన వింతదృశ్య మొకటి కలదు. ఆకాశమున మేఘములు లేనిదినమున

సూర్యోదయకాలమునందు ఈ పర్వతచ్ఛాయ పశ్చిమదిశగా మంచుపై రెండుసార్లు దూరమునఁ గానవచ్చి, మాయమగును. అనగా ఎండ కిరణములు ప్రసరించుదనుక నీపర్వత పశ్చిమభాగమున మంచు దట్టమైయుండి, సూర్యకిరణప్రసారముతో నంతమగుట నామంచుపై నీ నీడ యాని ఆనవాలుగఁ గన్పట్టునని యెఱుంగునది.

**ఏడమ్ముబ్రిడ్జి** (శ్రీరామసేతువు) — తొల్లింటికాలమున సింహళద్వీపమునుండి భరతదేశమునకు సముద్రమున నేర్పడియుండిన ఇసుకగట్టు. శ్రీరాముఁడు నిర్మించిన సేతువుగ నిది రామాయణమునఁ జెప్పఁబడినది. సింహళద్వీపము నందలి మన్నారుద్వీపముకడ (తలమన్నారు నుండి పశ్చిమోత్తరముగా) రామేశ్వరదీపపు తూర్పుకడవఱకుం గలదు. ఇప్పుడు శిథిలమైనను, లోఁగల రాళ్లిప్పుడప్పుడు పైకిఁ గన్పట్టుచుండెడిని.

**ఏడవశతాబ్దమున భరతదేశము నందుండిన సంస్థానములు** — హ్యూయనత్సాంగు వీటిని డెబ్బదిగను, తాను దర్శించినట్లును వివరించెఁగాని, అందు ముఖ్యమైనవిగ ముప్పది యేడింటిని మాత్రము పేర్కొని యున్నాఁడు. ఇచట ఏడవ శతాబ్దమున, హ్యూయనత్సాంగు వివరించుటంజేసి క్రీ. వె. తేలుచున్నది. అవి ౧. స్థానేశ్వరము, ౨. విరాట, ౩. శృఘన, ౪. మదవార్, ౫. బ్రహ్మపురము, . గోవిశాన. ౭. అహిచ్ఛత్ర, ౮. పిలోశన. ౯. సంకిస, ౧౦. మధుర (ఉత్తర మధుర), ౧౧. కనూజి, ౧౨. అయుటో, ౧౩. హాయముఖ, ౧౪. ప్రయాగ, ౧౫. కౌశాంబి, ౧౬. కుశాపురము, ౧౭. వైశాఖ, ౧౮. శ్రవస్తి, ౧౯. కపిల. ౨౦. కుసినగర, ౨౧. వారణాశి, ౨౨. యోధప త్రిపుర, ౨౩. వైశాల, ౨౪. వ్రిజి, ౨౫. నేపాల, ౨౬. మగధ, ౨౭. హిరణ్యపర్వత, ౨౮. చంప, ౨౯. కాంజ్గోలు, ౩౦. పౌండ్రవర్ధన, ౩౧. జార్ఘూశ్రీ, ౩౨. మహేశ్వరపురము, ౩౩. ఉజ్జయని, ౩౪. మాల్వ, ౩౫. ఖేడ ఖైరా, ౩౬. ఆనందపుర, ౩౭. వడాడి (ఎడార్).

**ఏడవ సంఖ్య**— క్రైస్తవ మతధర్మమున ఏడు మిగుల పవిత్రమగు సంఖ్య. ఏడవదినము అనగా ౧. సోమ, ౨. మంగళ, ౩. బుధ, ౪. గురు, ౫. శుక్ర, ౬. శనివారములు గడచిన పైని ఏడవదియగు అదివారము విశ్రాంతి దినము. (Sabbath). ఇది దైవారాధన దినము. దీనిని సంపూర్ణ దినమని వాడుదురు (Perfect day). ఒకనియొక్క ఏడవ సంవత్సరమున ఏడవనెల యందేడవదినము బహు పవిత్రమతము. ఏడు అదృష్టకరమగు సంఖ్య. అట్లే ఏడవకుమారుఁడగువాని ఏడవకుమారుఁడై జన్మించుట గొప్ప యదృష్టము. ఆతనికి దివ్యదృష్టియు, గొప్ప రోగములను బాపు సామర్థ్యమును గలుగునందురు. అట్టివాఁడు సంభవించునెడ తొల్లింటివారు తమరోగములను గుదర్చుమనియు, తమ భవిష్యత్తు నుడువుమనియు ప్రార్థించుచు తండోపతండములుగ నాతనికడ కేగుచుండెడి వారట. ఇక్కాలమున నట్టిజన్మము గలవాఁడుండుటయెఱుగరు. ఉండిన వైద్యుఁడై, జ్యోతిష వేత్తయై యుండునేమో చూడవలసి యుండును.

**ఏడాకుల పొన్నచెట్టు** అశోక వృక్షము చూడుఁడు.

**ఏడిస్తే వెలక్కాయచిప్ప చేతికిచ్చి ఊరుకుంటే ఊడలాక్కునే ఆవేక్ష** ఆంధ్రలోకోక్తి.

**ఏడుగురు క్రైస్తవర్షులు** — గ్రీసుదేశపువారు. ౧. ఏథెన్సునందుండిన సోలన్ (Solon). ఈ మహాత్ముని సిద్ధాంతము "నిన్ను

నీవే తెలిసికొనుము" అనియుండెనట. ౨. షిల్లో (Chillo of Sparta) - ఈ మహాత్ముండు "ఆశయమును సాధింపుము" అనిచెప్పెను 3. థేల్సు (Thales of Mileton) — గొప్ప రేఖాగణిత శాస్త్రజ్ఞుండుగను జ్యోతిష వేత్తగను పన్నెకెక్కెను. ౪. బయస్ (Bias of Priene) ఈయన సూక్తి "మనుజులలోం జాలమంది చెడ్డవారు". ౫. క్లియోబ్యులస్ (Cleobulos of Lindos) "గొప్పవారెందునను తీవ్రముగ పోరు." అని చెప్పెనట ౬. పిటాకస్ (Pittacose of Mitylene) ఈయన సిద్ధాంతము "Sieze time by the forelock" అని యుండెనట. ౭. పెరియాండర్ (Periander of Corinth). ఈ మహాత్ముని సిద్ధాంతము "పరిశ్రమ కసాధ్యముగునది లేదు" అనియుండెనట.

వీరేడుగురు ధీశాలురుగ పరిగణింపంబడుచుందురు. వీరు క్రీ. పూ. ఆరవశతాబ్దమువారనియు, సాక్రటీసు (Socrates), అరిస్టాటెలు (Aristotle) అనువారికి పూర్వులు. ఇందు థేల్సు రేఖాగణిత శాస్త్రజ్ఞుండు, ఖగోళశాస్త్రవేత్త (Geometrician and Astronomer) అనియు Meletus నివాసియనియు, సోలన్ ఏథెన్సునగరమున ధర్మశాస్త్రగ్రంథము రచించెననియు, పిటాకస్ క్రూరుండనియు చెప్పంబడినవారు.

## ఏడుస్తూ వ్యవసాయం ప్రారంభిస్తే కాడీ మోకులు దొంగలెత్తుక పోయినారట — ఆంధ్రలోకోక్తి.

**ఏడూకము** — లోపల కొయ్య, లేక కఱ్ఱపెట్టి కట్టినగోడకు ఏడూకమని పేరు. "ఏడూక మంతర్న్యస్త కీకసం" అని అమరుండు నిర్వచించియేయున్నాండు. మఱియు 'కీకస' శబ్దమునకు 'కొయ్య' యని కూడ యర్థముకలదు. ఏడూకమనంగా బౌద్ధమతస్థులెవరుచనిపోయినను, వారియస్థికలను పాతిపెట్టిదానిపైంగట్టినస్థూపము అని యర్థము. ఈస్థూపమునకు పాలీభాషలో దాగోబా యనిపేరు. ఈదాగోబాలు అనంగా స్థూపము లీభరతఖండమునం గలవని మహాభారతమున నుండుటచేత బౌద్ధమత విజృంభణానంతరమే, మన మహాభారతమున గొన్నిభాగములు విరచింపంబడి యుండనోపునని పండిత సీతానాథ తత్వభూషణరాయువంటి మహాపండిత విమర్శక మహాశయుండే వ్రాయుటకు కారణమయ్యెను. ఏడూకమంతర్న్యస్తకీకసం అను అమరవచనమునకు సార్థకత ఈస్థూపముల గాన వచ్చుటచేతను, స్థూపములు పెక్కు లీ భరత ఖండమున నుండుటచేతను, బౌద్ధమతస్థుల యస్థికల పూడ్చిపెట్టి, ఆపై స్థూపములంగట్టు నాచారమట్లుండుటచేతను, మహాభారతగ్రంథ రచనాకాలమునకే యింతవంత జేకూరగతంబైనది. కాని బౌద్ధమతధర్మములు భారతీయ సాంప్రదాయ యుక్తములగుటచేత బౌద్ధకాల ప్రారంభమునకుం బూర్వమే యేడూక శబ్దము, లేక తచ్చిహ్నము లుండియుండవచ్చునేమో యనినైనను పండిత సీతానాథ తత్వభూషణరాయుగారు శంకింపనైన నొల్లరైరి. ఇంకెంతదూరము మీయేడూకశబ్దముకు బర్వెడియుండునో ఒకింతంబరికించి చూచెదము గాక. క్షాత్రయుగమున, గృహనిర్మాణ మొనర్చునప్పుడు, గుంజలపై బొంగువెసుళ్లనువేసి, వానిని మట్టితోంగప్పి గోడలను కట్టుచుండు నాచారముకలదు.

మయునిచేనిర్మింపంబడి ధర్మజున కొసంగబడిన మయసభయే గోడలంబెట్టి గృహనిర్మాణ మొనర్చుటకు భరతఖండమున బ్రథమోదాహరణము. మహాభారతమున మయసభా వర్ణనము పఠించినచో గోడలు వర్ణించుటయే గానవచ్చుచుండును.

అనంతరం మొకింత కాలమునకు ద్యూతమునకని దవ్వులనున్న పాండవులం దెప్పించుటకు ధృతరాష్ట్రుడు అద్భుత సభానిర్మాణము గావించెను. ఈ కృత్రిమ ద్యూత సభ నిర్మించినపుడు అందు స్తంభములే కాని గోడలు లేవు. ఆకాలమున గృహకుడ్యములైనను నడుమ నడుమ స్తంభములు నిలువంబెట్టుచు గోడలు కట్టు నాచారముండి యుండవచ్చును. అందువలననే 'ఏడూకమంతర్న్యస్తకీకసం' అను నమరవాక్యము సముచితమైనది. మహాభారత రచనా కాలమునకు ధర్మజుని సభయొక్క నమూనా ననుసరించి, దేశమంతయు కొయ్యలను నడుమనుంచినగోడలచేతనే రాజమందిరములును ధనికుల మందిరములును కట్టబడుచుండుట జూచి యాకవి దేవగృహములం బూజింపక యేడూకములనే గౌరవించు చుండెనని వ్రాయుటకుం గతంబైనది. ఇప్పటికాలమున పాశ్చాత్యవాస్తు విధానముచే గట్టబడిన మండువా లేని గృహములు (బంగాళాలు) ఎటుల భారతీయ వాస్తు శాస్త్రవిరుద్ధములో నాడటుల 'అంతర్న్యస్తకీకసములు' గల గృహము లార్య వాస్తు శాస్త్ర గర్హితములు. నేటికిని పూర్వాచారపరులలోం గొందఱుబంగాళా పంపిణీగల యిండ్లను నిందించుట చూచుచునే యున్నాము. అట్లే నాంటివా 'రేడూకముల' నిందించు చుండిరి. అంతర్న్యస్తకీకస భిత్తులపై గట్టిన గృహములు దత్తమండ లాంధ్రులకును, నైజాం రాజ్యవాసులకును క్రొత్తలుకావు. బౌద్ధమత విజృంభణ కాలమునందుఎముకలపైం గట్టిన గోడల యందును, అందుపై నిర్మించిన గృహములయందును, గౌరవము అత్యధికమను మాట సత్యమే కాని, ఏడూకము మాత్రము మయునిచే నిర్మింపబడిన మయసభయందే ప్రప్రథమ మని చెప్పక తప్పదు.

**ఏదుపంది (ముండ్లపంది)** — దీనిశరీరమందు ముండ్లనుబోలిన రోమసముదాయ ముండునుగాన దీనిని ముండ్లపందియనుట వాడుకయయ్యెను. దీని రోమములనందగు ముండ్లు ఒక అంగుళము లేక ముప్పాతికఅంగుళము చుట్టు కొలతంగల్గి ఆరుమొదలు తొమ్మిదివఱకు అంగుళముల పొడవుంగల్గి కొనలందు వాడి తేరి యుండును. ఈ ముండ్లు తఱుచుగ ముడుచుకొని యుండుతరి నేదుపందిసామాన్యపు పందివలెనేగానగుంగాని కోపముగల్గి ఆ ముండ్లన్నియు విప్పినతరి నిక్కంబొడుచుకొని పెద్ద ముండ్లగుత్తివలెనే గాన్పించును. ముండ్లపైం దెల్లనివియు నల్లనివియు మచ్చలుండును. ఆ ముండ్లతో నలంకారయుతమగు పెట్టెలం జేయుదురు. వానింజీరి పెట్టెలపై నంటించి యలంకరించుటయుం గలదు.

ఏదుపంది యడుగు లించుమించు పసిబాలుర యడుగులంబోలి యుండును. దీనికి సాటివైరులపైం గోపము గల్గిన వెఱపించుటకు తోక ఝాడించి యందలిముండ్లను గలగలలాడించుచు బెదరించును. మనుష్యుల నెదుర్కొనుతరి ముండ్లనువిప్పి రెండుకాళ్ల మధ్యకుం జొచ్చుకొని వచ్చి, వానిని నేలంబడంజేసి పైబడి ముండ్లను గ్రుచ్చి బాధించును. వీటియందు పెద్దజాతివియు, మధ్యరకపుజాతివియు, చిన్న జాతివియునని మూడు జాతులు కలవు. మనదేశమునందున్న ఊరపందులు ఈ ఏదుపందిజాతినుండి క్షీణమై ఏర్పడినవియేయని కొందఱు పరిశీలకులు తలంచుచున్నారు. అమెరికాదేశమునందుం గల యేదుపందిజాతి ముండ్లు పొట్టివిగనుండును. ఇవిచెట్లెక్కంగలవట. అందొకజాతి తఱుచుగ చెట్లపైననే గానంబడునట. ఇవి చెట్లయాకులం దినును. వీటిని చెట్లపందులను పేరున వాడుచుందురట. ఏదుపందులు వర్షములధికమైనతరి తమ కన్నములందుండజాలమి సంభవించునేని పెద్దపెద్దపాముల పుట్టలంజొచ్చి వానిని వెడలగొట్టి తాను సుఖముగ నందు వసించునని ప్రతీతికలదు.

**ఏదుపందివర్షాలకు పాములపుట్టలో దూరినట్లు** — ఏదుపందిముండ్లకు వెరచిపాములే పుట్టవిడచి పారిపోవును. ఆంధ్ర లోకో క్తి.

**ఏనిబిసెంట్** (Annie Besant) — డాక్టరు ఏనిబిసెంటు (Mrs. Besant) అమ్మగారు దివ్యజ్ఞానసమాజమతము (Theosophy)ను భరతదేశమున వ్యాపింపఁజేసిన ముఖ్యురాలు. విలియమ్ పేజ్‌వుడ్ (William Pagewood) అను వారి కుమార్తె. క్రీ. శ. ౧౮౪౭ అక్టోబరు ౧ తేదిని జన్మించెను. ౧౮౬౭ లో ఫ్రాంకు బీసెంట్ (Rev. Frank Besant) అను వారికి వివాహము చేయఁబడియెను. ఈయన లింకన్ షైరునందు వికార్‌గా నుండినవాఁడు. ఈయన ఆకాలమున సుప్రసిద్ధుండగు సర్ వాల్టరుబిసెంటు అనువారి సోదరుఁడు.

ఏనిబిసంటమ్మగారు ౧౮౭౪లో National Secular Society యందు చేరెను. ప్రసిద్ధుండగు ఛార్లెస్ బ్రాడ్లాఫ్ అను రాజకీయవేత్త కడ రాజకీయపరిజ్ఞానమున కృషిసల్పెను. కొంతకాలమీమె సామ్యవాద (Socialist) సిద్ధాంతములం జదువుచుండెనట. క్రీ. శ. ౧౮౮౭ నుండి బ్లావట్స్కీసతి (Madame Blavatsky) గారి సాహచర్యమున దివ్యజ్ఞాన సమాజమతము స్వీకరించి ఆమతవ్యాపకమునకై కృషిసల్పుచుండెను అనేకచోట్ల నాశ్రమము లేర్పఱచెను. బనారసునందొక కాలేజీ ఏర్పరిచెను. ౧౯౦౭ సంవత్సరమునుండి ఆసమాజమున కగ్రాసనాధిపతి యయ్యెను. ఈమహాత్మురాలు భరతదేశమున గొప్ప పేరుగాంచి చెన్నపురి అడ్యారునందు తన ప్రధానాశ్రమము నేర్పఱచుకొని నివసించుచు గొప్ప రాజకీయదేశసేవ నొనర్చి భరతదేశపు కష్టకాలములందుప్రజాపక్షమునవిలచిప్రభుత్వము వారిని ఖండించుచు న్యూ ఇండియా పత్రికను చాలకాలము నడపి కడకు ౧౯౧౭ నందు కొంతకాలము ప్రభుత్వమువారి నిర్బంధమున నుండి, ౧౯౧౮ లో దేశీయమహాజనసభాధిపత్యము వహించెను. ఈమహాదేవి ౧౯33 యందు పరమేశ్వరసన్నిధికిం జేరెను.

**ఏనిమల్ ఆయిల్స్** (Animal Oils)- వీటినింకను Animal fats అనియు నందురు. తిమింగిలము క్రొవ్వు, ఎద్దుక్రొవ్వు, పులిక్రొవ్వు, పందిక్రొవ్వు మొదలగువాటి కీపేరు కలదు. వెజిటెబిల్ ఆయిల్సు, మినరల్ ఆయిల్సు చూడుఁడు.

**ఏనిమల్ హస్బెండ్రీ** (Animal Husbandry)— ఎగ్రికల్చర్ (కర్షకపరిశ్రమ) చూడుఁడు.

**ఏనిమిజమ్** (Animism)- ప్రాణములు, ప్రాణులు వీని పూర్వోత్తర ధర్మములు, స్థితి, లక్షణాదులం గూర్చిన జ్ఞానము.

**ఏనిమోగ్రాఫీ** (Animography)— గ్రీకుపదజన్యము. తనంతటతాను కాగితముపై గాలివీచుచుండు దిక్కును, వీచుచున్న గాలియొక్క బలమును గుర్తించుపరికరము. ఈవిద్యావిధానము (లేక కళ) నకు ఏనిమోగ్రఫీ యని పేరు.

**ఏనుఁగుబాదము**— బాదముచూడుఁడు.

**ఏనుఁగకు కాలువిరగడందోమకు రెక్క విరగడం వాటివట్టి కొక్కలాటివే** — ఆంధ్రలోకోక్తి.

**ఏనుఁగకు వెలగకాయలు గొంతుక పడతవా ?** ఆంధ్రలోకోక్తి.

**ఏనుఁగకొక సీమ, గుఱ్ఱానికొక గ్రామము, బఱ్ఱెకొకబానిస ఉంటేనే గాని జరగవు** - ఆంధ్రలోకోక్తి.

**ఏనుఁగ దాహమునకు చూరు నీళ్లేపాత్రివి?**—ఆంధ్రలోకో

**ఏనుఁగను జూచి కుక్కలు మొరిగినట్లు** — ఆంధ్రలోకోక్తి.

**ఏనుఁగు అనంతకవి** — ఆంధ్ర కవులందు నాధునికులలో బరిగణింపఁబడినవాఁడు. ఏనుఁగులక్ష్మణ కవి కీతఁడు జ్యేష్ఠసోదరుఁడు. (ఏనుఁగులక్ష్మణకవిఁ జూడుఁడు) రచించినది-గౌరీపరిణయమను ప్రబంధము.

**ఏనుఁగు కాలాకు చెట్టు** — లా. Elephantopus scaber. ఇది వైద్యోపయోగ మగునది. దీని ఆకులు నూరిన ముద్దను పైనవేసి కట్టిన గాయములు మానుననియు, సమూల కషాయము మూత్రకృచ్ఛ్రమును, మూత్రబద్ధ మును నివారించుననియుం జెప్పఁబడినది

**ఏనుఁగు చెవి చేమ (బఁలాకాని) చెట్టు** - లా. Arum macrorhizon అరవ మున వెర్రుంగు అని పేర్లుకలవు. దీని యాకుల పోలిక చేమ ఆకులం బోలియుంటయు, ఏనుఁగు చెవులంబోలి పెద్దవిగనుంటయు, సంస్కృతమున దీనికి హస్తికర్ణియని పేరుంటయు, దీనికి పెక్కండ్రు ఏనుఁగుచెవి చేమచెట్టని పేరిడిరి గాబోలును. దీని నలంకారార్థము తోటలలో వేతురు. కొంత వైద్యోపయోగమును కలదు. ఏడడుగుల ఎత్తు నకుంగూడ పెరిగి, పెద్దఆకులను విప్పి, తెల్లని పూవులను నెత్తిపై బూచి రమ్యమై గాన్పించు చుండెడిని. దీని దుంపను కొందఱు కరవు దినము లందు తినిరని చెప్పఁబడినది. దుంపలను నూనె యందు మరగించి తలకుమర్దనచేయుటవలన వరుస జ్వరములు హరించుననియు,ఆకులకు ఆముదము రాసి వెచ్చజేసి ప్రసవించు స్త్రీల పొత్తికడుపు నకుంగట్టిన (రెండు గంటలకన్న నధికముంచరాదు) మైలరక్తము చక్కగ వెడలుననియుం జెప్పఁ బడినది. బఁలక్కసిచెట్టు అనునది పచ్చపూవులు ముండ్లు ఆకులుంగల్గి ఏటేట మొలచు వేరుచెట్టు. దీనితో నేసంబంధమును కలదికాదు.

**ఏనుఁగు దంతము** — దీని నాంగ్ల మున Ivory అనుచున్నారు. ఆంగ్లవిద్యా వ్యామోహకాలమున ఐవరీ యనుటయె ఎక్కువ వాడుకయందున్నది. కాని ఐవరీ పదము ఏనుఁగు దంతములకే గాక ఏనుఁగు ఎముకలకును, ఇంక ననేకజంతువుల దంతములకు, ఎముకలకుంగూడ వాడుచున్నారు. హిప్పోపోటమస్, నర్వహాల్, వాల్రస్ మొదలగు గట్టి, తెలుపులంగల్గి నునుపు మెరుపువచ్చు నన్ని ఎముకలు ఐవరిగా నగుచు న్నవి. ఏనుఁగుదంతము శ్రేష్ఠముగా పనినిచ్చును. చక్కని మెరుఁగు గల్గియుండును. పాతబడిన పసుపురంగు ధాతువును వహించును. ఏనుఁగు దంతమున కనేకరంగులు, కెమికలుగా వేయు దురు. కాని పాతవి పచ్చబడిన ఏనుఁగు దంతమును తెలబడునట్టు చేయుట దుస్సరము.

**ఏనుఁగు బలము ఎలుక కెట్లు తెలియును?** — ఆంధ్రలోకోక్తి.

**ఏనుఁగుబీర** — ఇది వైద్యోపయోగ కరమగు పాదు. దీని వేరురసము లేక ఆకుల రసము ఇంచుక జిగటగనుండి కడుపుబ్బరమడంచి వ్రణములను ఆరజేసి వాతహరమై యుండును. మఱియు వీర్యవృద్ధి నొసంగును.

**ఏనుఁగు లక్ష్మణకవి** — ఆంధ్ర కవులలో నాధునికునిగఁ బరిగణింపఁబడినవాఁడు. ఆర్వేలనియోగి. ఆపస్తంబసూత్రము. వాధూ లసగోత్రము. తండ్రిపేరు తిమ్మకవి. తాతపేరు లక్ష్మణకవి. మాతామహునిపేరు మాచిరాజు నృసింహము. తల్లిపేరు పేరమాంబ. అన్నపేరనంత కవి. తమ్మునిపేరు వీరభద్రరాజు. వీరింటిపేరు పైడిపాటివారు. వీరిపూర్వులలో నొకఁడగు

నలపాలామాత్యుఁడు పెద్దాపుర సంస్థానాధీశులచే నేనుఁగును బహుమతిగా నందుటం జేసి, తదాదిగ నేనుఁగువారని వీరికి బిరుదనామము కల్గెను. రచించినవి రామేశ్వరమాహాత్మ్యము, గంగామాహాత్మ్యము, సుభాషితరత్నావళి, విశ్వేశ్వరోదాహరణము, గీర్వాణసూర్యశతకము, రామవిలాసము మొదలగు గ్రంథములనేకములు కలవు. గొప్ప కవి. వైభవోపేతుఁడు.

**ఏపాటుతప్పినా సాపాటుతప్పదు**- పాటు= పని, సాపాటు (అరవభాషయందు) నరు భోజనమని యర్థము. (ఆంధ్రలోకోక్తి).

**ఏపిచెట్టు** (గుగ్గిలపు చెట్టు) — లా. Shorca robusta. ఆంగ్ల. Sal tree. సం. సాల, సర్జ, కలలజోద్భవ యనియు, పెక్కండ్రచే గుగ్గిలపుమ్రానియు పేరందిన కలపవృక్షము. దీనిమ్రానికలప దూలములు, వాసములు, పలకలు (బల్లలు) మొదలగు పెక్కు ఉపయోగములు కలది. గుగ్గిలపుకలప టేకుకన్న నించుక నాణ్యము వన్నెలందు తగ్గియు, మిగుల బలముగునదిగ పేరందినది. గుగ్గిలపుచిగుళ్లు లేక గుగ్గిలపుటాకుల రసము ఇంచుక వెగటుగనుండును. ఆమ్లపైత్యరోగము, కఫము, క్రిమి, కుష్ఠురోగము, దురదలు, రక్తపైత్యము, నడంచునని చెప్పఁబడినది.

**ఏప్రన్** (Apron) — Irrigation (పంటకాల్వల) Engineering నందుఁ జెప్పబడిన యొక నిర్మాణము. (ఇర్రిగేషన్ చూడుఁడు). ఆనకట్లు, డ్రాపులు మొదలగువానికి వెలుపలి (దిగువ) భాగములందు నీరు మొరకనుండి పల్లమునకుఁ బడుచుండును. అట్లు పడుతరి నాప్రదేశమున గొలికి కోరివేసినచో నాకట్టడమున కపాయము గలుగనోపుగాన నాపైపున రాళ్లను సున్నముతో నంటించుచు నేటవాలుగ జలప్రవాహము పల్లమునకు క్రిందికిం దొరలునటుల Masonary ఏటవాలును కొంతదూరముదనుక నిర్మించుదురు. అట్టిదానికి ఏప్రన్ అనిపేరు. అపాయమెక్కువగ లేని కొన్ని తావులందు సున్నమక్కరలేకయే రాతిపేర్పు చాలునని కూడఁ జెప్పఁబడినది. ఇంకను ఇట్టి ఏప్రనులు నీటిపారుదల బలము నెదిరించు ఆనకట్టునకు దన్నుగఁ గూడ నుండెడిని.

**ఏప్లెట్సు** (Epaulets)-పాశ్చాత్యదేశములందు ప్రభువులకు సైనికోద్యోగులకును గొప్ప యధికారులకు చొక్కాలుపై భుజములకుఁ బైగా వీటినిధరింపఁజేతురు. ఇవి సైనికచిహ్నము. రణవీరులు ధరించునదియుగా నున్నది. ఇవి భరతదేశపు భుజకీర్తులం బోలినవికావు. భుజకీర్తులు ప్రభుత్వలాంఛనములు.

**ఏప్థోలొమీ** (Aptholomy) నేత్రములు, వానినిర్మాణము, అవిచేయుపనులు వానిబాధలు మున్నగువానిని గురించిన కళ.

**ఏఁబదిరెండు మహాశక్తిపీఠములు** — మహాశక్తి పీఠములు చూడుఁడు.

**ఏమీలేని విస్తరి ఎగిరిపడును విస్తరి అణగియే యుండును** (అనగా లేనివానికి త్రుళ్లిపాటధికము. కలవారు ఓర్పుఁగలిగి యుందురని భావము) ఆంధ్రలోకోక్తి. ఓటికుండలకు చప్పుడెక్కువ యనెడిసామెతయునిట్టిదే.

**ఏరండబీజన్యాయము** - ఆముదపు గింజ పైకి శుభ్రముగాఁ గన్పించినను లోన జిడ్డు గల్గియుండును. దీనికి వేషధారి యని భావము.

**ఏరియల్ స్టేషను** (Aerial station-Wireless)- అనగా తీగెలు లేని టెలిగ్రాపు

స్టేషనని భావము. ఇట్టివి Wireless telephone స్టేషనులుంగలవు. రెండుస్టేషనులనడుమ గాలియందలి Electric waves నుండి ధ్వనుల ఘూాలమున వార్తలంగొనుటయందిచ్చుట యిచటి పని. ఈ Broadcasting work నకు పోస్టు మాస్టరుజనరల్ లైసెన్సులిచ్చుట ౧౦౦ అడుగులని తెలియుచున్నది. (రేడియో చూడుఁడు).

**ఏరియాలజీ** ( Aerology)—మార్సు నక్షత్రము గూర్చియు దాని శరీర నిర్మాణము వైఖరి మొదలగు విషయములం దెల్పు కల.

**ఏరియోగ్రాఫీ**( Aerography) — జర్మను Ares = Mars, Graphein = వ్రాయుట. మార్సు నక్షత్రముంగూర్చిన జ్ఞానము. Mars కు (Planet) Ares అని జర్మను రూపము.

**ఏరియోమీటర్** (Eriometer) — అతిసన్నపు దారములను పరిశీలించి కొలచి లెక్కించుటకైన పరికరము. మఱియు ద్రవరూప పదార్థములను పరిశీలించి వాని Specific gravity ని కొలచు పరికరమునకును ఏరియోమీటరని పేరుకలదు.

**ఏరుదాటి తెప్పతగలవేయుడము**- కృతఘ్నతం దెల్పుసామెత. (ఆంధ్రలోకోక్తి).

**ఏరెన్ని వంకరలుగ నడచినా సముద్రమునకే దారి** — ఆంధ్రలోకోక్తి.

**ఏరోక్లినోస్కోపు** (Aeroclinoscope)— బెరోమీటరు (Barometric) యొక్క ఒత్తిడి మేరకు గాలియొక్క గమనాగమనముల దిశలను దెలుపుట లేక చూపుట మొదలగు పనులంజేయగల యంత్రము.

**ఏరోడైనమిక్సు** (Aerodynamics)- ఏయిర్ క్రాఫ్ట్ (Air craft) గూర్చిన విషయములం దెల్పు శాస్త్రము. ఇందు కదలుచుండుతరి వాతావరణముయొక్కయుఇతరగాలులయొక్కయు పరిస్థితులు Clastic fluids యొక్క శక్తులం బరిశీలించి గణితశాస్త్రముమేరకు వాటి శక్తులం బరిశీలించుట, గాలియందు చరించుచుండు వస్తువులపై వాతావరణ మెంతబరువు మోపునో ఆవిధి విధానములు కదలుచున్న వస్తువుల భారమును వాతావరణమెటులఎంతవఱకుభరించుచు వహింపగలదో ఆ వివరణములును ఉండును. (ఏరోనాటిక్సు చూడుఁడు. ఏరోప్లేను చూడుఁడు).

**ఏరోడ్రోమ్** (Aerodrome) — వాయువిమానములు (Air craft) దిగుటకును, బయలుదేరుటకును, ఏర్పఱ్చబడిన ప్రదేశము. వాయువిమానము లాగెడితావని భావము. ఇందు వాయువిమానము దిగు ప్రదేశము (అనగా దిగుటకు, బయలుదేరుటకు అర్హమగు రీతిని బాగుచేయఁబడిన తావు), ప్రేలాడదీయుట కేర్పాటులు గల ప్రదేశము, మరమ్మతులం జేయు ప్రదేశము కర్మాగారము (Work shop), వీని సంబంధ వస్తువులను నిల్వయుంచు గృహము మొదలగువియు, పెట్రోలు గైకొను స్తంభమును ఉండును. ఒక్కొకచోట కస్టమ్సు ఆఫీసుకూడ నుండి సరకులపై డ్యూటీలు వసూలుచేయు [illegible] లుండెడివి. రాత్రులందు విద్యుద్దీపములు ఈ ప్రదేశముం జూపుచుండును. (ఏరోప్లేను, ఏరోనాటిక్సు చూడుఁడు).

**ఏరోప్లేనులు** (వాయు విమానములు)- జగత్తునందు నీట నీదగల జలచరములం దొకశక్తియు, ఆకాశమున నెగురుపక్షులందు వేఱొకశక్తియు పరమేశ్వరుఁడు సహజముగ నొసంగియున్నాఁడను నది యెల్లరెఱింగినదే. ఇట్లే మానవులందు నిర్ణీతశక్తి భూమిపై నడచుటయగును. ఐనను మానవాధిక్యత ఇతరసాధనము

ళను, అభ్యాసాదులను ఊతగాఁగొని జలచరముల వలె నీట నీదుశక్తి నాదినుండియు గల్గియె యుండు నట్లొనర్చినది. ఇది అభ్యాసపూర్వకము. ఈ పని ఇంతటితో నాగక అన్యోపసాధనములగు పడవల మూలమున నీటిపైఁ దేలుచు గమన మొనర్పఁజేసినది. నానాఁటికది యభివృద్ధినందుచు కళయై గొప్ప గొప్ప పొగయోడలలోఁ గడు దూరయాత్రలు గూడఁ జేయ సులభసాధ్యముగ నేర్పడినది.

ఇంక గాలియందెగురుటను గూర్చి విచారింతము గాక! మనకుఁ జక్కఁగాఁ దెలియక పురాణ ద్యోతకములుగ నున్న కుబేర పుష్పకాది గగన సంచారవిమానములను, నారదాదిఋషుల గగన సంచారములను వదలి సర్వసామాన్య మనుష్య మాత్రుల కలవడఁదగిన యంత్రసాధన మూలక ములగు నిక్కాలపు కళలంగూర్చి విచారింతము. ఈతవలె శరీర సాధన మాత్రమున, గాలియం దెగురగల శక్తి యీవఱకెవ్వరికి నిక్కాలమున యలవడలేదు. ఇంక యంత్రసాధనములగు నేరో ప్లేన్సు (Aeroplanes), బెలూన్సు (Balloons) మొదలగు వాటిమూలమున నెగురవీలుగల్గుటయె గాక, దూరస్థలములకుం గూడ పోవీలగుచున్నది. దీనిచరిత్ర వింతఁగొల్పక పోదు.

గాలియందెగురు యంత్రసాధనములం గని పెట్టుటకు మనుష్యులుచేయు ప్రయత్నములందు వందలకొలది సంవత్సరములు గడచెను. చేసిన ప్రయత్నము లనేకులు చేయుచుండిరి. వానిని పదిభేదములు గలవిగ పరిశీలకులు లెక్కించు చున్నారు. వేర్వేఱు తావులందు వేర్వేఱు పద్ధతుల ప్రయత్నములు నడచినవని చెప్పఁబడి నది. కొందఱు గాలికన్న తేలికగల Gases చే నింపఁబడిన బెలూనులంగూర్చి పరిశీలనలు ప్రయ త్నములొనర్చిరి. మఱికొందఱు గాలికన్న బరువుగ నున్నను యంత్రమూలకసాధనములను ప్రయత్నిం చిరి. గాలికన్న బరువుగలవైనను, ఆయంత్రము లను కదలికచేతను, గాలియందుఁగల ప్రతిఘటన శక్తి (Resistance) చేతను గాలియందుఁ దేలు నట్లు చేయఁ బ్రయత్నించిరి.

పక్షులాకసమున గాలియందుఁ దేలి యెగుర గల్గుటకు ద్వివిధమైన నేర్పుకలదు. రెక్కలతోఁ గొట్టుకొనుట అనగా రెక్కలను క్రిందికి పైకి ఆడించుచుంట యొకటియు, పైకుబుకుటకు ప్రయత్న మొకటియు రెండు సాధనములచే పక్షి గాలియందు తేలుట సంభవించుచుండును. మొట్టమొదటి ప్రయత్నములు పక్షులు రెక్క లాడించు పద్ధతివంటి పద్ధతినే యంత్రము లమర్పఁ బడెను. కాని, అది అంతగా జయప్రదము కాదయ్యెను. తర్వాత చేయఁబడిన ప్రయత్నము ముందునకు లంఘించుటయై కొంతవఱకు పనిఁ జేయఁ గల్గెను.

ఇరువదియవ శతాబ్దారంభకాలమున Otto Lilienthal అను పేరుఁగల జర్మను నగర నివాసి యొకఁడు పెక్కుప్రయత్నముల నొన ర్చెను. అవి Gliding లేక Soaring విధాన ములు. ఇందు పెద్దరెక్కలుపయోగింపఁబడినవి. ఏఁబదియడుగుల ఎత్తగు ప్రదేశమున బయలు వెడలి ఎగిరి క్రిందికిం దిగుటకు నైయున్నది. కాని ఆయన ఇట్టి ప్రయత్నములలో నొకదానియందే బలాత్కార మరణమునందెను. పిదప అమెరికా సంయుక్తరాష్ట్రములలోని వాషింగ్టను నగరవాసి యగు ప్రొఫెసరు లాంగ్లే (Prof. Langley) మఱికొన్ని ప్రయత్నములం జరపి పరిశీలించెను. ఆప్రయత్నములు ఈ యాంత్రికకళాభివృద్ధికి మిగుల సాహాయ్యపడెను. ఆయన చిన్నచిన్న ఆట వస్తువులంబోలిన మచ్చుయంత్రములం జేసి నిలచి యున్న వాతావరణపు గాలియందెగిరించెను. క్రీ. శ. ౧౯౦౦ నను, తరువాతి సంవత్సరము లందును రైటు సోదరులు (Wright Brothers

ఓవిల్లీ, విల్బమ్ (Messrs. Oville and Wilbum) అనువారును ఓహియో పురమున చాల ప్రయత్నములొనర్చియు, పరిశీలించియు Gliding నందు కృతార్థతంగాంచిరి. ౧౯౦౨ లో వారు ౩౦౦ గజములు గ్లైడు చేయఁగల్గిరి. ౧౯౦౩ లో వారి మెషీనునందొక ఎంజిను (Engine) నమర్చి మొదటి ప్రయాణమును (Flight) నిరపాయముగ సాగించిరి. ౧౯౦౫ లో నిరువదినాలు మైళ్లు ఎగిరి గమనించి నిరపాయముగ దిగుట జరిగినది. గాలికన్న బరువుగల యంత్రముల (Heavier than air Machines) యొక్క ప్రారంభదశ. పిదప నాంగ్లదేశమునుండి ఫ్రాన్సు దేశమునకు ౧౯౦౮ లో విల్బరు (Wilbur) తన మెషీనుంగొంపోయి ఏరోప్లేనుయొక్క పనియు, విలువయుఁ బ్రదర్శించెను. అందుఁ గొందఱు మనుష్యులం గొంపోయియు నాల్గువందల అడుగుల ఎత్తున పయనమొనర్చుచు రెండుగంటలకన్న నధికకాలము వాయుపథమునం దెగురుట నచటివారికిం జూపఁగల్గెను.

ఆకాలమునుండియు నేరోప్లేనుల యభివృద్ధి యతిశయించుచునేయున్నది. మధ్యమధ్య నాగకనీకేవిగి నేగుటయందును, వేగమునందును, ఎత్తునకేగుటయందును, మహావాయు పథమునం దెక్కువ కాలముండుటయందును, బరువు మోయుటయందును, క్షేమాధిక్యతం బెంపొందించుచుండుటయందును ఆశ్చర్యకరమగు నభివృద్ధుల నందుచున్నది

| సం. | దూరము. | పేరు. | వివరము. |
|---|---|---|---|
| 1905 | 25 మైళ్లు | Wright Bros. | అమెరికా. |
| 1909 | ఇంగ్లీషు ఛానల్ | Louis Bleriot. | ఫ్రాన్సునుండి ఇంగ్లాండు. |

| సం. | దూరము. | పేరు. | వివరము. |
|---|---|---|---|
| 1919 | 1960 మైళ్లు | H. Cock Brown. | అట్లాంటికు సముద్రము |
| 1934 | 12000 మైళ్లు | Scott & Black. | ఇంగ్లాండునుండి ఆస్ట్రేలియా. |

ఇందు గడపటి ప్రయాణము కడుసుప్రసిద్ధము. ఇది మిల్డెనుహాల్ నుండి మెల్బోర్న్ వఱకు జరిగినది. వీటిమధ్యనున్న దూరము ౧౨౦౦౦ మైళ్లు. డెబ్బదిగంటల ఏబదితొమ్మిదిమినిట్ల ఏబది సెకండ్ల కాలము పట్టెను. అనగా కొంచ మించు మించు గంటకు ౧౬౯ మైళ్ల చొప్పున ప్రయాణము నడచి యుండును. ఇంక త్వరితముంగూర్చి విచారింతుముగాక.

| సం. | వేగము. | పేరు. | తావు |
|---|---|---|---|
| ౧౯౦౯ | ౪౭ మై. | Mr. G. H. Curtiss. | Rheims. |
| ౧౯౧౬ | ౧౩౭ మై. | Mr. Carlston | అమెరికా |
| ౧౯౨౪ | ౨౭౮.౫ మై. | Mr. Bonnett | ఫ్రాన్సు. |
| ౧౯౩౪ | ౩౦౬.౨ మై. | Mr. Dougles Davis. | |

ఇందు కడపటి ప్రయాణమున మినిటునం దైదు మైళ్ల వంతున ప్రయాణ మొనర్చినటులందేలుచున్నది. ఇటీవల ఇంగ్లాండు నుండి ఇండియా దేశమునకు ఇంచు మించు ఒకరోజులో చేరినట్లు వినుచున్నారము.

మహావాయుపథమునందు ఏరోప్లేను ఎక్కువ కాలముండగల్గుట యందునను, ఎక్కువ అభివృద్ధి గల్గినదని చెప్పవచ్చును. దీని ప్రధానరహస్యము ఒక ప్లేనునుండి వేఱొక ప్లేను ఆకాశమున నెగురుచుండుతరిని గ్యాసోలై ను (పెట్రోలు) ను గొట్టములగుండా తీసికొని నింపుకొనుట యందే మిడి అట్టియేర్పాట్లపై నాధారపడియుండును. ఇట్లు తీసుకొనుట భూమికిదిగకుండనె జరుగునని ఎఱుంగవలయును. ఇంక నీఏరోప్లేను లెగురు ఎత్తును

గూర్చి విచారింతము. ఎత్తునకెగురుట యందునను అధికముగనే అభివృద్ధిగాంచినదని చెప్పవలసి యున్నది. క్రీ. శ. ౧౯౦౪ లో ౪౦౦ అడుగుల ఎత్తునకుమాత్రమే యెగురగల్గిన ఈయంత్రములు ౧౯౧౯ లో ౨౪,౯౦౦ అడుగుల ఎత్తువరకు గాలియందెగురుచు తేలఁగల్గెను. పిదప ౧౯౨౩ వ సంవత్సరమున ౩౬,౫౬౫ అడుగుల వరకు ఎత్తునకెగుర గల్గుటయు, ౧౯౩౪ వ సంవత్సరమున ఏబదివేల అడుగుల ఎత్తునకెక్కఁ గలుగుట నిందలి యభివృద్ధి వెల్లడికాఁగలదు. ఇఁకఁగడపటి దగు బరువుమోయుటను గూర్చి విచారింతము. ఆదియందొక్క పైలటు మాత్రము ఎక్కిన ఏరోప్లేనులు ఇప్పుడు ఏబదిమందికన్న నధికముగ ప్రయాణీకులం గొంపోవ గల్గియుంటయు, దానిస్వంతభారమునకు లెక్కసేయక ఐదు టన్నుల నధికభారముగ సరకులను గొంపోవుచుంటయు వినుచున్నారము.

ఇంక ఏరోప్లేను నిర్మాణముంగూర్చి విచారింతము. వెడలుపు తక్కువగను, పొడవెక్కువగను నిర్మించుచుందురు. ఇంకను ముందువైపు గల రెండుకోణములు సమకోణములుగ నుండవలయుననియు, పడవలవలె ముందుభాగము ఇంచుక వంగియుండిన ప్లేనులు చక్కగపనిచేయు నని అనుభవజ్ఞులగు పరిశీలకులు తెల్పుచున్నారు. కల్తీయును, ఎల్యూమినియముయొక్క కలుపుడు లోహమగు డ్యూరాల్యూమిన్ (Duralumin) లోహమును ఏరోప్లేనులు చేయుటయందుపయోగింపఁబడుచున్నది. డ్యూరాల్యూమిన్ లోహము కడు చులకనై అల్యూమినియముకన్న నెక్కువ గట్టిగ నుండునుగాన దీనికిఁ జక్కగనమరియున్నది.

ఏరోప్లేనులందు గాసోలైను ఎంజినులు అమర్పంబడుచున్నవి. ఏలనన నవి తేలికగను ఎక్కువ బలమిచ్చునవిగను ఉండును. ఎగురుచుండు తరి పెద్ద బలముగు గాలులు వీఁచిన వాని నెదుర్కొనుచు నిలువవలయునుగాన ఎక్కువ శక్తి (Horse Power) గల ఎంజినులనే ఏరోప్లేనులందుపయోగించవలసి యున్నది. గ్రద్ద యెగురు తరి ముందునకు ఉబుకునటుల ఏరోప్లేనునందు ముందున కుబుకు శక్తిగలుగునటుల ఒక Propeller ఉపయోగించుచున్నారు. ఇది Electric fan నందువలె గిరగిర తిరుగుచుండు రెక్కలంగల్గియుండును. ఈరెక్కలు (Blades) సర్వసాధారణముగ రెండేయుండి అయిదు మొదలు పదివఱకు డయామీటరు (Diameter) కొలతం గల్గి యుండెడివి. ఒక్కొక ప్లేనునందొక్క బ్లేడుకూడ నుండుటకలదు. ఇవి ఏరోప్లేనుయొక్క ముందుభాగముననే అమర్పఁబడునుగాన వీనిని Propellers అనుటకన్న Tractors అనుట సమంజసముగ నుండెడివి.

ఎగురుచుండుతరి నొక్కొకమారు గొప్పగాలుల నెదుర్కొనవలసి యుండును. తఱచుగ శీఘ్రగమనమున గాలి ఎదురుగ వీచునది బలముగ నుండును. కాన నీబాధ నుపశమింపఁజేయుటకు ప్లేనులను (Plane) ఏరోప్లేనున కిరుపక్కములం నమర్చుచున్నారు. ప్లేను పక్షి రెక్కలవలె గానంబడుచు నట్లే ఉపయోగించును. ఇవి కాకి రెక్కలవలె కొట్టుకొనునవికాక గ్రద్దరెక్కలవలె స్థైర్యముంగల్గి ఇరుదెసల నిలచియుండి ఎంతవడి గాలినైనను, ఎంతసుడిగాలినైనను ఏరోప్లేనును ఇటునటు తొణకనీయక స్థిరముగనుండి పరుగిడు నట్లుచేయును.

ఇరుదెసలందు నొక్కొక ప్లేనుంగల్గిన ఏరోప్లేనునకు మోనోప్లేన్ (Monoplane) నియు, ఒకటిపై నొకటిగ నిరుదెసల రెండేసి ప్లేనులంగల్గిన ఏరోప్లేనులను బైప్లేను (Biplane) లనియు, అట్లే మూడేసి ప్లేనులంగల్గిన వానిని

ట్రైప్లేను (Triplane) లనియు నందురు. ఇవి Horizontal గా నమర్పంబడును. అనఁగా తూర్పుపడమరలకు ఏరోప్లేను నడచుతరి ఉత్తర దక్షిణములకు పొడవుగావ్యాపించి గ్రద్దరెక్కలం బోలియుండునట్లమర్పంబడును. ఇంకను కొన్నిటి యందు ఏరోప్లేను తోకకడ చిన్న రెక్కలు రెండ మర్పంబడియుండెడిని. ఇవి బైప్లేనులందు చాల ముఖ్యమని తెలియుచున్నది. ఇవి పైకెత్తుటకు గాని, క్రిందికి దిగవేయునటులగాని అమర్పంబడి గాలిపాటుయొక్క అవసరము వెంబడి వీలుగా నుపయోగింపంబడుచుండునని చెప్పఁబడినది. ఇంక నిట్టి శరీరాంగములనుగల్గిన వాయువిమానము లెట్లు పనిఁజేయునో యోచింతము.

ఇంక నీ పైసంగతులవలన వాయువిమానములు గాలికన్న తేలికమైనవి, గాలికన్న బరువైనవి యని రెండు భేదములుగఁ దేలినవి. గాలికన్నఁ దేలికయగు బెలూనులందు గాలికన్న తేలికయగు వాయువులు ఉండుటంజేసి యవిగాలి యందుఁదేలుచున్నవి. వాటినట్లువదలి, గాలికన్న బరువగుఏరోప్లేనులంగూర్చి యోచింతము. ఏరోప్లేనులన్నియు Heavier than air machines అనఁబడుచున్నవి. ఇవి గాలియందుఁదేలియుండు పద్ధతియే వేఱు. గ్రద్ద గాలిలో నెగురుచుండు ధర్మముంబోలిన రహస్యమే ఏరోప్లేను గాలియందుఁ దేలుటకుం గారణమైయున్నది. ముందునకు బుకుటకు ప్రోపెల్లరు పనిచేయుచుండ, దానిని క్రిందఁబడకుండ నుంచుశక్తి లోనిగ్యాసోలెను యంత్రసాహాయ్యమున ఇతరపరికరములు గల్గించుచున్నవి. ఇరుదెసలందు రెక్కలవలె నమర్పంబడిన ప్లేనులు స్థైర్యమునొసఁగుచున్నవి.

ముందునకుఁబోనిచ్చుచుండుటకుగాని, ప్రక్కలకుం ద్రిప్పుటకుగాని స్టీరింగు (Steering) అనియెదరు. వానిని ద్రిప్పుసాధనములకు చుక్కానులకు రడ్డర్సు (Rudders) అనియెదరు. ఏరోప్లేనునందు రడ్డరులు రెండుజతలుండును. ఒకజత ఇరు ప్రక్కలకు మరలించుటకును, వేఱొకజత పైకి క్రిందికి ఎత్తిదించుటకును ఉపయోగించును. రెండు జతలును లీవరుకంట్రోలుం గల్గి నడుపువారికడనే అమర్పంబడియుండును.

ఏరోప్లేను కదలినపిదప నీయంత్రభాగములెట్లుపనియొనర్చుచునడపు విధానము వివరింపఁబడినదిగాని, మొట్టమొదట యంత్రముంగదుపుట ఇంతవఱకు వివరింపఁబడలేదు. ప్రారంభించుటయన కొంతశక్తిం బ్రయోగించుటయు నగును. తొలుత రైటు సోదరులు(Wright Brothers) మెషినులకు త్రాటింగట్టి లాగించుటవలన కదలుటను ప్రారంభింపఁజేయుచుండిరట. తొలుత కదలుటకు Gliding అనుపేరు ప్రసిద్ధమైనది. అప్పటి ఏరోప్లేనులు ఒక బాటపైనుండి త్రాటిచే లాగఁబడి గాలిలోనికి విసరబడునట్లగుచుండినవి. ఇక్కాలపు ఏరోప్లేనులు చక్రములం గల్గిన ఇరుసులపైనమర్పంబడి చక్రములు దొరలుటతోనిది Gliding జరగెడిని. తోడనే ప్రొపెల్లరులు అందుకొని ముందుకు దుముకఁజేయును. ఈ కదలిక కిక్కాలమున Taxing అని పేరిడియున్నారు.

ఇంక తక్కిన డేష్‌బోర్డు (Dash board) సర్వసాధారణముగ ఆటోమోబైల్ బండ్లలోని డేష్‌బోర్డువలెనే యుండునుగాని, కొంతవఱకు ఎక్కువ చిక్కుగానుండును. ఇందు పదికన్న నెక్కువగ నడపవలసిన పరిస్థితి ఉపకరణములు అమర్పఁబడియుండును. ఒకతావునఁగల యున్న తత్వ (Altitude) మును, గమనమునందలి వేగము (Speed), గమనించు దిశయు (Direction), ఏలెక్కమేరకు ఎక్కుచున్నదో దాని వివరము (Rate of climbing), ఉష్ణమాప

కము (Thermometers) లు, ప్రమరుగేజి (Pressure gauge), పెట్రోలుగేజి (Petrol gauge), దిక్కులంజూపు యంత్రము (Compass) మొదలగునవి ఈ డాష్బోర్డు నందమర్పం బడియుండును. వీటిని సరిగా కంట్రోలుచేయుచు ప్లానును చూచుకొనుచు నడపుచుండవలయును.

మఱియు నిటీవల Earth Induction Compass అనఁబడు నొక యంత్ర పరికరము కనుగొనఁబడి డాష్బోర్డు కడనే యమర్పఁ బడు చున్నది. ఇందు పొగ మంచు (Fog), మంచు (Snow), వర్షము, వడగండ్లవాన (Hail) లందు నడపు పైలటునకు తన మార్గమును వీడి తప్పు దారులం ద్రిప్పకుండ నిజపరిస్థితులం దెల్పుచు దిశలు, ఎత్తు మొదలగు వాటిని యథాస్థితిగా నిలుపతోడ్పడుచు నపాయమునకు లోనుగాకుండఁ జేయును.

ఇంక నీ ఏరోప్లేనులం దమర్పఁబడఁ దగిన వేఱొక పరికరము కలదు. అది Condense Actometer, దీనిని గూర్చి వివరించుట సమంజసము. ఇందు ఏరోప్లేనెంత ఎత్తున ఎగురుచున్న దియు, ఏదేని వస్తువునుండి ఎంతదూరముగా నడచుచున్నదియు, తెలియును. కొండలు, రాళ్లు, భూమి, నదులు, వృక్షములు మొదలగు వాని దూరము, సమీపస్థితి, సరిగా నిందు ద్యోతక మగుచుండు కతన, అనేక అపాయముల నుండి పైలటు (డ్రైవరు) తప్పించుకొనుచు నేగఁగల్గును.

మోనోప్లేను లతి త్వరితముగ నేగునుగాని బరువు అధికముగ మోయఁజాలవు. మఱియు వీనికి స్థైర్యము బలము కూడ చాలనిది. బైప్లేనులు వాటికంటె కొంత త్వరితము తగ్గినవైనను ఎక్కువ భారము మోయగల్గి క్షేమకరములై యుండును. ట్రైప్లేనులు అధిక క్షేమకరములు, సౌఖ్యకరములు నని చెప్పఁబడునవి.

**ఏరోమీటర్** (Aerometer) వాయువు మొదలగు గాలుల (Gases) ను కొలుచునది.

**ఏరోలైట్సు-ఉల్కలు** (Aerolites)– జర్మనుభాషయం Aer= గాలి, Lithos=రాయి. ఉల్కలు లేక ఉల్కాపాతము. భూమి మొదలగు పెద్దపెద్ద గోళములవలెనే సూర్యునిఁజుట్టి యసంఖ్యాకములగు చిన్నచిన్నగోళములు తిరుగు చుండును. అవి తఱచుగ పెద్దవగు నితరగోళముల యాకర్షణలోనికిఁ జేరుకొనుచు వానిపైఁబడు చుండును. అట్లే భూమిఁజుట్టుకొను వాతావరణములోనికిఁ గూడ కొన్నితగులుకాని భూమిచే నాకర్షింపఁబడి త్వరితపు వేడికి కొంతగాని అంతయుఁగాని కాలి బూడిదయైపోవును. కొంత కాలిపోక భూమిపైఁబడునేని దానికి ఏరోలైటు (Aerolite) అనియు, మీటియర్ (Meteor) అనియు నందురు. మండుచు భూమిపైఁబడుచుండు తరి నది విద్యుద్దీపమువలె కాంతితోఁ బడును. దానిని నక్షత్రము వ్రాలుచున్నదని (Shooting Star) యును, ఉల్కాపాత మనియు నందురు.

**ఏరోస్ నక్షత్రము** (Eros)– భూమికిం గడుసమీపముననున్న చిన్న నక్షత్రము. క్రీ. శ. ౧౮౯౮ లోఁ గనుఁగొనఁబడినది.

**ఏలకీలత** (ఏలకుల లత) — ఏలకులు దేశప్రసిద్ధమైనవి. తాంబూలమునందునను,కొన్ని పిండివంట లందునను, క్షీరాన్నము నందునను పరిమళమునకై ఏలకిగింజలపొడిం జేర్చెదరు. తొల్లింటికవులు ఏలకితీగెలని పూఁదోటల వర్ణన మునను డివిరి. తీగెఏలకచెట్టు ఇప్పుడంతగ నెచ్చటను గానరాదు.

ఏలకులచెట్టు- పెద్దఏలక యనియు, చిన్నఏలక యనియు రెండుజాతులుగ నున్నది. పెద్దఏలక గింజలు గోగుగింజలంత పెద్దవిగ నుండెడిని.

అవి పరిమళమున చిన్న ఏలకిగింజలకుతగ్గియుండును. చిన్న ఏలకులగూర్చి అందజెప్పెంగినదే. మళయాళ దేశపు సముద్రతీరప్రాంతముల నీ ఏలకులపంట అధికముగ నుండెడిని.

పెద్దఏలకులు- లా. Alpina cardamomum అనియును, చిన్నఏలకులకు Eleotari cardamomum అనియును పేర్లు కలవు. ఆంగ్ల. Cardamom అని సర్వసాధారణముగ ననియె దరు. అందు పెద్దజాతికి Large అనియు, చిన్న జాతికి Small అనియు చేర్చి వాడుదురు. సంస్కృతమున రెంటికిని సాముదాయికముగ ఏలా యనియు, గంధాలీగర్భ యనియు, హిమా యనియుఁ బేర్లున్నను, హిమా యనునది చిన్న ఏలకులకే గ్రంథములందు వాడియున్నారు.

ఏలకులు కొద్దిగ కారము, చేదు, వగరు రుచులనుగల్గి పరిమళముచే పూరితమై చలువఁ జేసి మనోల్లాసముంగల్గించుచు, మేహాపైత్యముల నడంచి, జీర్ణమొనర్చి, బలకరమై వీర్యమున కుద్రేకముంగల్గించును. ఇంచుక మలబద్ధముం గూడ జేయును. మూత్రము వెడలించును.

ఏలకులు అరుచి, కాకలు, కఫము, గర్భ వాతము, చర్ది, జ్వరదోషము, దురదలు, నేత్ర రోగములు, ప్రదరమను యోని (కుసుమ) రోగము, ప్రమేహము, పైత్యపుఎక్కిళ్లు, పొత్తి కడుపునందలి దోషములు, మూలవ్యాధి, మేహ శూల, రక్తపైత్యము, రక్తాతిసారము, వమనము, వాతదోషము, విదాహము మొదలగు దోషములు, విషవ్రణములు, మూత్రకృచ్ఛము, శ్వాసకాసలు, శిరోరోగములు, శూలలు, నడం చునవిగ జెప్పఁబడినవి.

ఏలకులు గల్గించు గుణదోషములకు విరుగుడులు- పటికపంచదార, బాదముజిగురని చెప్పఁబడినవి. వైద్యగుణములందుసహా పెద్దఏలకుల కన్న చిన్నఏలకులు బలముగ పనిజేయుననియు, ఏలకగింజలయందు వీర్యముయొక్క ఉధృతముం దగ్గించు గుణము కలదనియు కొందఱు బుధు లభిప్రాయపడియున్నారు.

**ఏలడంకష్టంగాని ఎత్తుకుతినడం కష్టమైన పనిగాదు** — ఆంధ్రలోకోక్తి.

**ఏలడానికి ఊళ్లుండవేమోగాని ఎత్తుకుతినడానికుండకపోవు** – ఆంధ్ర లోకోక్తి.

**ఏలము** ఆక్షన్ చూడుఁడు.

**ఏలిక పాములు (నెమిడిక పాములు)**(Round worms)- ఇవిసూక్ష్మ జీవుల (Worms) జాతికిఁజెందిన పురుగులనుండి కల్గు అంటువ్యాధిగ్రుడ్లనుండి జనించును. అంగుళముల్లోని ఆరవ వంతు చుట్టుకొలతఁగల్గి బాగుగా నెదిగినచో నడుగు పొడవుం గల్గియుం డును. మనుష్యగర్భమున, ప్రేగులనడుమ జనిం చును. తీపిపదార్థములం దినుటవలనగల్గునందురు. గ్రుడ్లు, పాములు, మలముతో బయటికివచ్చి తిరుగ సంపర్కదోషమున లోన జేరునందురు. ఈ రోగము వలన అజీర్తి, సన్నిపాతజ్వరము, కడుపునొప్పి గల్గుచుండును. ఆంగ్ల వైద్యులు సాంటొనైను లోనికిచ్చి వీనింజంపి విరేచనమున బయటికి వెడలఁజేయుదురు. దీనిని పాముల మం దనియు నందురు. (అంటువ్యాధులు, సూక్ష్మ జీవులు చూడుఁడు.)

**ఏలిస్ద్వీపములు**(Ellice Islands)- పసిఫిక్కు మహాసముద్రములోని పగడపు చర్యవలన నేర్పడిన ద్వీపములు. ౧౪ చతురపు మైళ్ల వైశాల్యము. బ్రిటీషువారు వీనిని క్రీ. వె. ౧౮౯౨ లో నాక్రమించిరి.

**ఏలేశ్వరోపాధ్యాయుఁడు** - శ్రీశైల మునకుఁ బశ్చిమమున నున్న ఏలేశ్వర మనాతని

జన్మస్థానము. గొప్పపండితుఁడనియు, సంస్కృత కవి యనియుఁ దెలియుచున్నది. పేరు తెలియదు. వచ్చిన పెక్కండ్రకు విద్య చెప్పుచుండు వాఁడు గావున ఉపాధ్యాయుఁడని వాడుకగల్గి ఏలేశ్వ రోపాధ్యాయుండనిపేరు నేఁటికిని నిలచియున్నది. గౌతమ స్మృతికి దర్పణమను వ్యాఖ్యాన మొన ర్చిన వాఁడు. ఆంధ్రదేశ భూగోళ శాస్త్రము రచించెనట.

ఆంధ్రులలో వెలనాటి, కాసరనాటి, మురికి నాటి, వేగినాటి మొదలగు శాఖలేర్పడి విభాగములగుట కీతఁడే ప్రధాన కారకుండని ప్రతీతి కలదు. ఈతఁ డాంధ్రుఁడు.

## ఏవరేజి లేక దామాషాయి —

(Average) వాణిజ్యసంబంధ పరిభాషాపదము. దామాషాయి సగటు అని యర్థము. ఇది General Average అనియు, Particular Average అనియుం ద్వివిధము. జెనరల్ ఏవరేజి అన్నిటి మొత్తమును వాని సంఖ్యచే భాగింప నేర్పడినదియు, పర్టిక్యులర్ ఏవ రేజి కొంత భాగమునకై నదియు నై యున్నది. వర్తక నష్టముం జెందిన వారు కొన్ని సరకుల నెగుమతి చేయుచు దాని మోతచార్జీల నెవ్వరి వాటా వారు చెల్లించుదుమని వ్రాసి యిచ్చిన ఒప్పుదల పత్రమునకు Average bond అని పేరు. ఒక పత్రమునందు కొన్ని హాంశములకు మాత్రమే Average చెల్లునని వ్రాసి కొనిన విధికి Average clause అనిపేరు. లాభ నష్ట ముల తకరరులను పరిశీలించి చేయ వలసిన వాట్లకు ఏవరేజి కుదిర్చి చెప్పు లెక్కల పరిశీలన నిపుణునకు Average Stater లేక Average Adjuster అని పేరు.

**ఏష్యాటిక్కు టర్కీ** — ఆసియాఖండ మునఁబశ్చిమ దిశగానున్న దేశము. ఇందు ఏష్యా మైనరు (చిన్న ఆసియా), సిరియా (పాలస్తినా దేశము), తొల్లింటి ఆర్మీనియాదేశములోనుండి కలుపుకొనినభాగదేశము (ఆర్మీనియాచూడుఁడు), కురుదుస్థానము, ఆల్జజీరాదేశము, మెసపొటేమియా, ఛాల్డియా (లేక ఇరాకదాబిదేశము), అరబిస్థాన్, (లేక టర్కీవారి అరేబియా), చేరియున్నవి. ఇవి (ఐరోపాఖండములోని) టర్కీదేశమునకుం జెందిన దేశములు. ఇవి యన్నియుం గలసియే తొల్లింట టర్కీసామ్రాజ్యమై యుండెను. ఇప్పుడు టర్కీ రిపబ్లికునకుం జెందిన దేశములై యున్నవి. సగటున ఏష్యాటిక్కుటర్కీ అంత యుం గల్పుకొనిన దేశమునందు వాయవ్యదిశ యందు పీఠభూములును, అందు పర్వతములును నైరుతిదిశయందు సారవంతమైన భూములును కొన్ని ఇసుకబయళ్లును కలవని చెప్పవలసి యుండును.

వైశాల్యము ౭,౦౦,౦౦౦ చతురపుమైళ్లుండు నని అంచనా వేయఁబడినది. ఇందు తురుష్కులు (టర్కీ దేశస్థులు), అరబ్బులు, గ్రీకులు, ఆర్మీని యనులు, టర్కోమెన్ జాతివారు, కురుదులు, సిరియనులు, యూదులు ప్రజలుగ వసించు చున్నారు. డ్రూసీలను క్రైస్తవులు కొలదిగ గలరు. దేశము విలాయతులనఁబడు భాగముల క్రింద విభజింపఁబడి, ఒక్కొక్కటి వేలి (లేక పాషా) చేతఁ బాలింపఁబడుచున్నది. టైగ్రిసునది యూఫ్రటీసునది ప్రవహించుచు దేశమును స స్యానుకూలముగ నొనర్చుచుండ, తొల్లింట నీ ప్రాంతసీమలందే బేబిలోనియా అస్సీరియారాజ్య ములును, బైబిలుసంబంధమగు పాలస్తినాదేశ మును, ఉండినవి. ఇది గ్రీకులనాగరికతకు స్థానమైయుండినది. హోమరుపండితుఁడు మొద లగు కొందఱు గ్రీకులందలి గొప్పవా రాశియా మైనరు నందే జన్మించిరి. ఆయా దేశములు మారుఁడు

**ఏష్యాటిక్కు రష్యా**—అనగా ఆసియా ఖండమునందలి రష్యారాజ్య భాగమని యర్థము. (రష్యాదేశము చూడుఁడు). రష్యా ఐరోపాలోనున్నది. ఏష్యాటికు రష్యాయందు సైబీరియాదేశము, కాకాసియనుప్రావిన్సు (ట్రాన్సు కాకాసియనుప్రావిన్సు) లేక తుర్కు స్థానము నందలి రష్యావారిభాగరాజ్యమును చేరియున్నవి. (వాటిని వేఱ్ఱ్వేఱు తావులందు చూడుఁడు). వైశాల్యము ౬౫ లక్షల చతురపుమైళ్లనియు జనాభా చాల తక్కువయనియు నందురు.

**ఏష్యామైనరు (చిన్నఆసియా)** — ఇది యొకద్వీపకల్పము. మధ్యధరాసముద్రము బ్లాక్సీలనడుమ నున్నది. మధ్యభాగమున పీఠభూములు, వాటిం జుట్టిన పర్వతములు కలవు. కజిలిర్మాకునది పెద్దనదియని చెప్పవలయును. కజిలిర్మాకనిన ఎఱ్ఱనినది యనియర్థము. తొల్లింట దీనికి హాల్యాసునదియని పేరుండెను. పిదపఁ జెప్పఁదగినది సెకేరియానది రెండును బ్లాక్సీలోఁ గలియునదులు. ఇంకను మేయాండరునది, హార్మసునది, సరబత్నది, ఆర్కిపిలెగో సముద్రమునంగలియునదులు. దేశమున శీతోష్ణములు అనుకూలముగ సౌఖ్యతరములై యుండును.

పీఠభూముల ఉపరిభాగము చదునుగ నుండి, అందు వృక్షములు అనునవియేలేక పచ్చికబయళ్లప్రదేశములుగ తమ మందలతోఁ దిరుగుచుండు టర్కోమానులకు పశుగ్రాసము నిచ్చుచున్నవి. కాని అందు బ్లాక్సీపై పేటవాలు గల ఉత్తరపు ప్రదేశమంతయు మహారణ్యమయమై ప్రజలచే వృక్షసముద్రమని చెప్పంబడుచున్నది. అంగోరా ప్రాంతములందు శాలువలు నేయుటకుం బనికివచ్చు పట్టువంటి పొడుగైన బొచ్చుగల మేకలు విస్తారము కలవు. వీని నంగోరామేక లనెదరు. దేశమున వర్తకము ఐరోపా ప్రజల యధీనమై యున్నది. వారిని స్వదేశస్థులు ఫ్రాంకులనెదరు. దేశమున ఇనుపబాటల అనుకూలత బాగుగనేయున్నది.

ప్రజలందు పాలకులగు ముఖ్యులు టర్కీవారు. వారు సున్నీ తెగమహమ్మదీయులు. స్వల్పసంఖ్యాకులుగ నున్నారు. గ్రీకులు, ఆర్మీనియనులు, క్రైస్తవులు, గ్రీకుచర్చి, ఆర్మీనియనుచర్చివారు. యూదులు యూధ (జెహోవా) మతస్థులు, దేశప్రజలు. వీరధిక సంఖ్యాకులుగ నున్నారు. కొంచెముమంది పర్షియను మహమ్మదీయులు కలరుగాని వారు షియామహమ్మదీయులౌట టర్కుల యసూయతకుఁ బాత్రులు. వీరు వర్తకపు పనులకు వచ్చియున్నవారు.

దేశము పరిపాలనకు అనటోలియాయనియు (పశ్చిమము), మధ్యభాగమున కరమేనియా యనియు, ఈశాన్యదిశగా రూమ్ అనియు (లేక శివాస్) మూఁడు భాగములుగ నున్నది. కరమేనియాయందున్న అంగోరా టర్కీరాజ్యమునకంతకును ఇటీవల ప్రజాప్రభుత్వమునకు ప్రధాన ప్రభుత్వకార్యస్థానముఁగ జేయంబడియెను. సినోపుపురము, ట్రెబిజోండుపురము బ్లాక్సీయందలి రేవు పట్టణములు. తొల్లింట ఇకోనియమ్మనఁబడుచుండిన కొనియాపురము అంగోరాకు దక్షిణముగ నున్నది. కిజిలిర్మాకునది జన్మస్థానము దరినేయున్న శైవాస్పురము రూముదేశమున ప్రధానస్థలము.

సైడ్నస్పైనున్న టార్సస్పురము అపొస్తలు పౌలుగారి జన్మస్థానమని పేరందినతావు. ఇచటి కీశాన్యదిశగా టారస్పర్వతములు దాటుటకు సుప్రసిద్ధమగు సిలిషియన్గేట్సు కొండలోవ మార్గము కలదు. పశ్చిమముననున్న స్మిర్నాపురము చాల పెద్దదియు, గొప్ప వర్తకస్థలముగనై యున్నది. ఎండించఁబడిన పండ్లు, పట్టు, అంగోరామేక ఉన్ని, మూలికలు వర్తకము

విశేషముగాఁ గలదు. ఇటనుండి లోనికి ఇనుప బాట వేయఁబడినది. ఇస్తంబూల్నగరపు బోస్ఫరసుయొక్క ఆసియా తీరముననున్న స్కుటారీపురము (ఇస్తంబూల్నగరపు తూర్పుపరిసరమై యున్నది). ఇస్తంబూలునకు దక్షిణముగా నున్న బ్రూసాపురము క్రీ. శ. ౧౩౨౬ మొదలు ౧౩౬౬ వరకు ఓటోమాను సామ్రాజ్యమునకు రాజధానిగ నుండినది. అనటోలియా యందు ప్రధానపురము శకేరియానది తీరమున నున్న కుటేయాపురము. కచ్చేరీలున్నతావు.

సైప్రసుద్వీపము, రోడ్సుద్వీపము, సామోస్ పములు, స్కియోద్వీపము (తొల్లింటికియోస్ ద్వీపము), మైటిల్నీద్వీపము (లేక లెస్బోస్ ద్వీపము) ఆర్కిపిలెగోయందు ముఖ్యద్వీపము లీదేశమునకుఁ జెందియున్నవి. (సైప్రసుద్వీపము బ్రిటిషువారిది).

**ఏసిటిక్ ఏసిడ్** (Acetic acid) — ఇది అనేక చెట్లనుండిన రసమునందు దొరకు పులుపు. స్వతంత్రముగ దొరకుటయును గలదు. తఱచుగ పొటాషియముతోఁ గాని, కేల్సియము తోఁగాని కలసి దొరకుచుండును. వినిగర్ నందు 3 Percent మొదలు ౧౦ Percent వఱకుఁ గల్గియుండును. దీనిని కఱ్ఱ Destructive distillation వల్ల తీయుచున్నారని తెలిసెడిని. దీనిం గాచిన Acetic ether అగునని చెప్పఁబడినది.

**ఏసిడ్** (Acid) — (ఆమ్లము) లాటిన్ భాషాపదమగు Acidus నుండిగల్గిన పదము. సాధారణముగా పులుపునకర్థము చెప్పుదురు. కాని Chemical acids అన Hydrogen salts అయి యుండును. ఏసిడ్‌లు అనేకములు కలవు.

**ఏసిడ్కలర్సు (రంగులు)**— రంగులు చూడుఁడు.

**ఏస్బెస్టోస్** (Asbestos)— ఇది కాలని పదార్థము. నారనుబోలియుండునది. Serpentine రాళ్లతోడను, Magnesia కల యితరజాతి రాళ్లతోడను గలసి భూగర్భమున దొరకును. ఆంగ్ల రసాయనవేత్తలు దీనిని Amphiboles తెగకుఁజెందినవిగఁ జెప్పుదురు. మఱియు వారు "Its value lies in its high melting point, and low conductivity of heat" అనియెదరు. నారవలెనున్న దీనిని బట్టవలెఁజేసి నేసి పెంకులుగఁజేసి, అగ్నిప్రమాదము తఱుచుగ గల్గు యంత్రశాలలపై కప్పుటయు Corrosive acids వడకట్టుట, యంత్రశాలలు అగ్నికొలుములు మొదలగు అపాయకర ప్రదేశముల పనిఁజేయువారలకు చేతితొడుగులు, కాలి తొడుగులు, దుస్తులు మొదలగునవి చేయుట మొదలగుపనుల కుపయోగించుచున్నారు. ఇది అగ్నివలన దహింపఁబడక, ఎదిరించి అగ్నియాఁకు నిర్లక్ష్యముగనిలచును. ఇక్కాలమున అమెరికా సంయుక్తరాష్ట్రములందు, కెనడాయందు, రష్యాయందు, దక్షిణాఫ్రికాయందు దొరకుచున్నది.

**ఏస్బెస్టోస్ సిమెంటు పరిశ్రమ** (Asbestos Cement Plates) — ఏస్బెస్టోస్ సిమెంటు ప్లేటులు అను మాటవల్లనే వీనిలో ఏస్బెస్టోస్ (Asbestos) అనఁబడు నారతాయియును, (Cement) సిమెంటుయు నుండునని తెలియుచున్నది. కట్టడపు పరిభాష యందు వీనికి టెర్నోలిట్, ఆస్బెలిత్, యూరాలిట్, ఇటెర్నిట్, ఫల్గరిట్, కోరానిట్ మొదలగు పేళ్లచే నిది వ్యవహరింపఁబడుచున్నది. మొట్టమొదట ఇండ్లకప్పులు నేయుటకు ఏస్బెస్టోస్ పెంకులు మాత్రమే తయారుచేయఁబడి వాడుకలోనుండెడివి. ఇటీవల నిందులో ననేక రకములు తయారుచేయఁబడుచున్నవి. ఇవి మిక్కిలి

తేలికగానుండును. అగ్నివలన కాలవు. జలము వలన కరుగవు. పొగమంచునకు లొంగవు. మేకులు కొట్టుటకుగాని, మెఱుగుపెట్టుటకుగాని, రంపముతో కోయుటకుగాని పనికివచ్చును. ఏస్బెస్టోస్‌ను సిమెంటుతో మిళితముచేయుట వలన నిట్టిశక్తి వీనికికలిగినది.

ప్రస్తుత ఏస్‌బెస్టోస్ సిమెంటుతో దృఢమైన పైపుగొట్టములు కూడ చేయఁబడుచున్నవి. గదుల నడుమనడుమ గోడలు గూడ తయారు చేయఁబడుచున్నవి. ఇది కారుగేటెడ్ ఇనుము (Corrugated Iron) నకు ప్రత్యామ్నా వాడుక చేయఁబడుచున్నది. ఏస్‌బెస్టోస్ సిమెంటు వస్తువులను తయారుచేయు మార్గమతిసులభ మైనది. సిమ్మెంటు ఫ్యాక్టరీలయందు ఎంతకావలసి యున్నను క్రయమునకు సిద్ధముగానే దొరకును. ఇంక నాస్బెస్టోసును మన పనికుపయోగించుటకు ముందు చిన్నచిన్న శిథిలములుగా పొడిచేయ వలసియుండును. ఈశిథిలముచేయుపని మొదటి పొరలను విడదీయుటకు ఒక Edge Runner Set లో దానిని పెట్టవలయును. తరువాత పెద్ద సన్నికంటినిపోలు Bast stone పై గ్రానైట్ పొత్తరములతో ముక్కలు చేయ వలెను. నిర్మించుటకు నిశ్చయించిన వస్తుస్వభా వము ననుసరించి పదిమొదలు నలువది నిమిష ముల వరకు శిథిలముచేయు నీపని యాచరింపఁ బడును.

ఈపనియైన యనంతరము మృదంగాకారము గలిగి యొకదానిలో నొకటి యిమిడియుండు ననేకములగు డ్రమ్ములతో నమర్పఁబడియున్న Disintegrator అను యంత్రములోనికి దీనిని చేర్పవలయును. అక్కడ పొరలను వేఱుచేసి మెఱుగుబెట్టుపని సున్నితముగా జరుపఁబడును. వేఱుచేయఁబడిన ఏస్బెస్టోసు (నారరాతి) పొరలు శిథిలములైన పిమ్మట సిమెంటుతోఁగలిపి వలసి నంత నీరుచేర్చి Pulp Engine లో పెట్టి ద్రవ రూపమైన దానిగా మార్చుదురు. ఆపల్పునకు ఏరంగు కావలసినయెడల ఆరంగు నందులోఁ గలుపుదురు. ఈయంత్రమునుండి దీని Agitating Drum Mixer అనఁబడు నుపయంత్రము లలో ప్రవహింపఁజేయుదురు. పైనుదహరించిన యుపయంత్ర గర్భితమగు నీప్రధాన యంత్రమే ఏస్బెస్టోస్ సిమెంటు ఫ్యాక్టొరీకి గుండెకాయ యని చెప్పనొప్పును. దానిపనిమీదనే అక్కడ చేయఁబడు వస్తువుల నాణ్యముమాత్రమే గాక ప్లాంటుయొక్క ప్రధానకార్య ప్రదర్శనమంతయు నాధారపడియుండును. ఈయంత్రమునకు తంత్రి భాగము (Wire part) వెట్ ప్రెస్ (Wet press) భాగము అను రెండు సెక్షనులుండును. తంత్రిభాగమునందు పలువిధములగు జల్లెడ లమర్పఁబడి యుండును. ఆజల్లెడలన్నియు ద్రావకపు పల్పు ముంపఁబడుటకు మరల మీఁది కెత్తఁబడుటకును అవకాశముకలిగియుండును. అవి యెత్తఁబడినపుడల్ల ఆద్రావకమునందలి పలుచని పొరయొకటి వచ్చి, అక్కడ నమర్పఁబడిన విస్తృత మైన రోమపు నాడా (Felt Band) మీఁద పడుచుండును. ఆనాడా రోమముతోఁచేయఁబడిన దగుటచే నీటిని పీల్చివేయును. మిగిలిన స్థూల పదార్థము పొరలుపొరలుగ నేర్పడి కావలసిన దళసరికి వచ్చుచుండును. కావలసిన దళమునకు వచ్చినతరువాత నొక Cylindrical Raw Plate సహాయమున మనకుఁగావలసిన పరిమాణముల మేరకుఁ గోయఁబడును. అంచులు కూడ సరిగా కత్తిరింపఁబడును. తయారుచేయఁబడిన చిన్న ప్లేటు లను సమమట్టముగల కుప్పలుగావేసి హైడ్రాలిక్ ప్రెస్‌మీఁదఁ నడిపించి లోననుండునీరు నార్చి వేయుదురు. తయారైన పలకలను నిలువచేయు గదులలోనికి గొంపోయి ౧౨, ౧౮ గంటలకాల మచ్చట నుంచుదురు. Pressing వలన పలకల

యంచులు సరిగా నుండక మోటుగా నుండుటచే తిరిగి వానియంచులు దిద్దితీర్చుట యవసరము. ఈపని చేతితోఁగాని ప్రెస్సులవల్లగాని చేయఁ బడవచ్చును. ఇరువది యెనిమిది దినములు స్టోరు రూములోనుంచి రవానాచేయుటకు సిద్ధపరతురు. Asbestos cement ఆరినకొలఁదిని గట్టిపడు చుండును.

**ఏస్టెరోయిడ్సు** (Asteroids)- జర్మను భాషయందు Aster = నక్షత్రము, Star-eidos = రూపము. సూర్యునివంటి ప్రధాన గోళముం జుట్టి తిరుగుచు దానినుండి వేడి, వెలుతురులం గ్రహించుచుండు భూమివంటి ఆశ్రిత గోళములను Planets అనెదరు. జర్మన్ భాషయందు Planetesయన తిరుగునది యనియర్థము. సూర్యుని జుట్టి తిరుగు Planets లో ముఖ్యమగునవి Jupitor, Saturn, Earth, Mars, Venus, Mercury అనంబడునవి.

ఇవిగాక ఇంకను చిన్నవి యగు కొన్ని గోళములు సూర్యునిం జుట్టియె తిరుగు చుండినవి Asteroids అనంబడును. గ్రహములు యందు Mercury, Venus అను వాటికిందప్ప దక్కిన గోళములకు తమ్ముం జుట్టి తిరుగుచుండు ఆశ్రిత గోళములు కొన్ని కలవు. (ఉదా. భూమికి చంద్రుడు). వానికి Satellites (ఆశ్రిత గోళములు) అనిపేరు. లాటినుభాషయందు Satelles =ఆశ్రితులు అనియర్థము.

**ఎస్ట్రో ఫోటో మీటర్** (Astro photo meter) - నక్షత్రములనుండి భూమిపై మనకుప్రసరించు వెలుఁగు కొలచునట్టి పరికరము.

**ఎస్ట్రోయిడిస్ట్రీ** (Asteroidstry) — క్రీ. శ. ౧౮౦౧ సం॥ Piazzi అను నాతఁడు Asteroids ఉన్నట్లుకనిపెట్టెను. ఇక్కాలమున ౫౦౦ లెక్క తేలియున్నవి. Photographలంచేసి వీటిం గనెదరు. వీట్లయందు కడు చిన్నవిగ మైళ్ల వ్యాసమును మాత్రము గల్గియుండు నంతటి చిన్నవట. ఇవి ముఖ్యముగ Mars, Jupitor ల నడుమ నుండెడిని. ఇవి యాది నుండి ప్రత్యేకములుగ నుండినవో, లేక పెద్దగోళముల నుండి వీడి రాలి యిట్లయ్యెనో, లేక పెద్ద గోళములు భిన్నములయి క్షీణించి యింతగా నిలిచి యున్నవో పరిశీలనల వలన ఇంకను తేలకున్నది.

**ఎస్ట్రొలేట్రీ** (Astrolatry) - నక్షత్రములం బూజించు మత విజ్ఞానము.

## ఐ అక్షరమునకుం జెందిన క్రైస్తవ పురుష నామములు —

Iago- హిబ్రూపదము, Supplanter అని యర్థము.

Ian, Iain- స్కాచిపదము, (Same as John) Lord's Grace అని యర్థము.

Ichabod- హిబ్రూపదము, Departed glory అని యర్థము.

Ignatius, Ignace, Inigo- లాటినుపదము, Fiery అని యర్థము. St. Ignatius ఋషిపేరు.

Ilaria, Ilario- లాటినుపదము, Cheerful అని యర్థము.

Immanuel- హిబ్రూపదము, God with us అని యర్థము. ఇటలీదేశపు రాజులపేరు.

Ingram- ట్యూటోనిక్కు నామము, Ing's raven అని యర్థము.

Inigo- (see Ignatius).

Innocent- లాటిన్నామము, Harmless అనియర్థము.

Ira- హిబ్రూపదము, Watcher అనియర్థము.

Irvin, Irwin, Irving- కెల్టిక్కు పదము.

Isaac, Izaac- హిబ్రూపదము, Laughter అని యర్థము. దీనినుండి కల్గిన ముద్దుపేరు I-key. అబ్రహాం, సారా కుమారుఁడగు Isac మహాత్ముని పేరు.

Isaiah- హిబ్రూపదము, Salvation of Lord అని యర్థము.

Isherwood - నవీన కల్పితపదము

Isidor- గ్రీకు పదము, Strong gift అని యర్థము.

Israel- హిబ్రూపదము, Who has seen God అని యర్థము.

Ivan- హిబ్రూపదము, Grace of God అని యర్థము. ఇది John కు రష్యా ప్రతిరూపము.

Ivo, Ives- ట్యూటోనిక్కు పదము, Archer అని యర్థము.

Ivor-ట్యూటోనిక్కు పదము, Bow bearer అని యర్థము.

Iwan- Ivan యొక్క రూపాంతరము, నవీనకల్పితపదము.

## ఐ అక్షరమునకుం జెందిన క్రైస్తవ స్త్రీల నామములు —

Ianthe - కొందఱు Ian యొక్క స్త్రీవాచక పదమని తలంచుచున్నారు. Ian అన దైవ కటాక్ష మని యర్థము.

Ida, Idina - కెల్టిక్కు పదము, సుఖమని యర్థము.

Ide, Idette - ట్యూటోనిక్కు పదము, సమృద్ధి యని యర్థము.

Idonea - ట్యూటోనిక్కు పదము, ఎప్పుడూ పని చేయుచుండునది యని యర్థము.

Ierne - ఐరిషు పదము.

Imogen, Imogene - ఆంగ్లోశాక్సనుపదము.

Ina - గ్రీకు పదము. పరిశుద్ధ మని యర్థము. Agnes యొక్క మారురూపము. Inas, Ines, Inez అను నవి స్పానియా భాషా రూపక స్త్రీ వాచక పదములు.

Ingunna - ట్యూటోనిక్కు పదము. Ing సంబంధమగు పడుచు అని యర్థము.

Inna, Ino, Ione - నవీన కల్పిత పదములు

Irene, Eirene - గ్రీకుపదము, శాంతి యని యర్థము. ఏథెన్సు (గ్రీసుదేశము) లోని ఒక తలిదండ్రులు లేని బీదబాలిక, రూపవతి, గుణవంతురాలు. ఈమెను నాల్గవ లియో చక్రవర్తి పరిణయమయ్యెను. ఆమె పేరని తలంపఁ బడుచున్నది. పరిణయము ౭౬౯. ఈమె ౮౦౩ లో చనిపోయెను.

Iris, Iras - గ్రీకు పదములు, గ్రీసుదేశపు దేవత పేరు.

Isa, Iza - ట్యూటోనిక్కు పదము, ఇనుము (లోహము) ని యర్థము.

Isabel, Isabella, Isabelle, Isobl, Isabeau, Isabelita, Izabella - హిబ్రూ పదములు, దైవప్రమాణమని యర్థము. దీని నుండి గల్గిన ముద్దు పేరులు. Isa, Bel, Bella, Tib, Tibble. (Isabella అను పేరు స్పానియాదేశపు రాణి పేరు. ఈమె Ferdinand రాజుగారి పత్ని).

Isadore, Isidore, Isadora, Isidor - గ్రీకు పదములు, బలమగు ఈవి లేక బహుమానమని యర్థము.

Ivanna - హిబ్రూపదము, దేవుని కటాక్షమని యర్థము. John యొక్క రష్యాభాషా రూపపదమగు Ivan యొక్క స్త్రీ వాచకపదము

Ivy, Ivie - ఉత్పత్తి అర్థములు, తెలియవు. పూలభాషయందు మైత్రి యని యర్థము.

Ivory - ఐరిషుపదము, ఏనుగు దంతమును బోలిన తెలుపని యర్థము.

**ఇంద్రాలి గోత్రము** — గర్గఉపగణము చూడుడు.

**ఐ. ఓ. యూ.** (I. O. U.) — వాణిజ్య సంబంధ పరిభాషాపదము. I. O. U. ఇది I owe you (నేను నీకు బాకీ యున్నాను) అనుదానికి గుర్తు. దీనికి స్టాంపు మొదలగునవి లేవు. ఐనను ప్రోనోటువలె వ్యాజ్యమున కర్హమగును. మొత్తము, వడ్డీ, తప్పీల్లు; తీర్మాన విధానము, సంతకము ఇం దవసరములు.

**ఐకనోగ్రాఫీ** (Ikonography) — పటములందు దైవలక్షణములుసహా దేవతారూపములను చిత్రింపఁబడెనేని, ఆపటమునకు Ikon అని పేరు. అట్టి విద్యకు లేక శాస్త్రముకు Ikonography అనియెదరు.

**ఐకమత్యమానందమునకు దగ్గిర మార్గము** — ఆంధ్రలోకోక్తి.

**ఐక్యవాదిశైవము** — ఇది చతుర్దశ శైవ, భేద మతములలో నొకటి (చూడుడు.) ఈమతమునందు శివసమవాది శైవమునందువలెనే మలత్రయము, పదార్థత్రయము వివరింపఁబడినవి. (శివసమవాదిశైవము చూడుడు.) మఱియు నీమతమునందు మాయయనునదియు, కర్మయనునదియు నధికముగఁ జెప్పఁబడినది. విశేషదీక్షను గురునివలనఁగై కొని శివార్చన మొనరించుచుండిన అధ్వ (మార్గము) శుద్ధిగల్గి నిర్వాణము సిద్ధించును. అనఁగా కర్మనిగ్రహమును (ముక్తి) పొందనగునందురు.

**ఐగుప్తు దేశము** (Egypt) — దీనిని పిరమిడ్సుగలప్రదేశము (Land of Pyramids) అనియు, Land of Pharos అనియు, నైలు లేండ్ (నీలానదీభూమి) అనియు వాడుచుండుట కలదు. ఇది ఆఫ్రికా ఖండములోని దేశము.

**ఐటికిగోత్రము** — ఔతథ్యఉపగణము చూడుడు.

**ఐడియోగ్రాఫీ** (Idiography) — సంతకము, ట్రేడుమార్కు, లాంఛనము (Coat of Arms) మొదలగు గుప్తచిహ్నములను Idiograph అనియెదరు. దీని గురుతు అని యర్థము. వీట్ల లక్షణధర్మములు మొదలగు సర్వస్థితులంగూర్చిన కళ.

**ఐడియలిజము** (Idealism) — "Objects are not there till they are thought". "ఒకపదార్థమునుగూర్చిన జ్ఞానము బయల్పడకపూర్వ మాపదార్థమే లేదు" అను నమ్మకము లేక సిద్ధాంతము.

**ఐతాయువు** మగధబ్రాహ్మణ ధనంతతి క్షత్రియుఁడు, తండ్రి శృతశ్రవుఁడు, పితామహుఁడు మార్జాలి, పుత్రుఁడు నిరమిత్రుఁడు.

**ఐతికాయనగోత్రము** జమదగ్ని వత్సఉపగణము, కపి ఉపగణము చూడుడు.

**ఐతిశాయన గోత్రము** — జమదగ్ని వత్స ఉపగణము, నిధ్రువ ఉపగణము, వీతహవ్య లేక యాస్కగణము చూడుడు.

**ఐదువ** — ౧. మాంగళ సూత్రము, ౨. పసుపు, 3. కుంకుమ, ౪. గాజులు,